# సూత్రానుక్రమణికా.



# బ్రహ్మసూత్రార్థచంద్రిక

## తృతీయాధ్యాయము, ప్రథమపాదము.

మత్వా య మీశాన మభిన్న మాత్మనో
సంపూజ్య చోపాశ్య విరక్తమానసః,
యజ్ఞాదిభి శ్శాంతిముఖై శ్చ సాధనై
ర్విముచ్యతే తం పర మానతోఽస్మి.

## అధ్యాయావతారిక

ప్రథమాధ్యాయమునఁ జేయఁబడిన వేదాంతసమన్వయము ద్వితీయాధ్యాయమునందలివిచారముచే బాగుగ స్థిరపరుపఁ బడెను. నిర్దోషము గావింపఁబడెను. దాని నాశ్రయించి యీయధ్యాయమున మోక్షసాధనములు విచారింపఁ బడును. సిద్ధాంతము స్థిరపడినపిదపఁ గాని యీవిచారము సంభవింపదు గావునఁ బూర్వాధ్యాయమునకును దీనికినిఁ గల సంబంధము హేతుహేతుమద్భావసంబంధము. మఱియు ద్వితీయాధ్యాయాంతమున నింద్రియములు ప్రాణములు మొదలగునవి జీవునకు సాధనము లనియుఁ బరమేశ్వరునుండి జనించు ననియు నిర్ణయింపఁబడెను. దాని నాశ్రయించి యీయధ్యాయమున జీవునిసంసారగతియు నాతని యవస్థాభేదములును త* త్త్వంపదార్థములును ఉపాసనాభేదాభేదములును సమానప్రకరణమునందు ఒకశ్రుతియందు జెప్పఁబడియున్న గుణముల మఱియొకశ్రుతియందలి యుపాసనాప్రకరణమున నుపసంహారము చేయవచ్చునా? (ఉపసంహారము చేయుట యనఁగా నొకస్థలమునందలిగుణముల

---

* త్వంపదార్థములు. (మా. అ-౨ పా-౩. సూ-౪౨.)

మఱియొకస్థలమునకు దెచ్చికొనుట) లేదా? యనువిషయంబును బ్రహ్మ జ్ఞానమువలన మోక్షము గలుగు ననుటయు దాని కుపాయములును ఆ యుపాయములు సాధించుటవలన ముక్తియే కలుగు నని నిర్ణయించుటయు సందర్భానుసారముగ మఱికొన్ని విషయములును విచారింపఁబడును.

## పాదావతారిక

అందు ముఖ్యముగ నీపాదమున జీవుఁడు పరలోకమునుగూర్చి పోవుటయు స్వర్గనరకముల ననుభవించుటయు మఱలమఱల దుఃఖప్రాయ మగునీలోకమున జనించుటయు మరణమునొందుటయు నిరూపింపఁబడును. ఈనిరూపణవలన సంసారము దుఃఖమయ మనియు ధనాదిరూపము లగు సౌఖ్యములు కొంతవఱకు కానఁబడినను అవియు శాశ్వతములు కాక పోవుటచే దుఃఖకరములే యనియుఁ బరలోకసుఖములు గూడ నిట్టివే యనియు నీకారణమువలన సంసారముపై నభిలాష యుంచుటయే తగని పని యనియు దేనియందు నాదరము లేక యేది వచ్చిన దాని నసక్తచిత్తముతో ననుభవించుచు శాశ్వత మగుమోక్షసుఖమునకై ప్రయత్నించుటయే యావశ్యక మనియుఁ దేలును. ఈకారణమువలన నీపాదమునందలి యన్ని యధికరణములకును "వైరాగ్యము జనింప నక్కఱ లేదు" అనునది పూర్వపక్షఫలము. "వైరాగ్యము ముఖ్యముగ జనింపవలయును. సంసారము నిర్వివాదముగ దుఃఖమయమే" అనునది సిద్ధాంతఫలము. పూర్వపక్షస్వరూపాదు లెచ్చటి వచ్చటనే నిరూపింపఁబడును.

## అధికరణావతారిక

ఈపాదము నందలిసర్వాధికరణములయందును *పంచాగ్నివిద్య నాధారముఁ జేసికొని జీవునిపరలోకగమనాగమనములు విమర్శింపఁబడును.

---

* పంచాగ్నివిద్య

ఈపంచాగ్నివిద్యయందు మృతినొందినపిదప ప్రాణులకు గలుగుగమనాగమనములు వివరింపఁబడి యున్నవి. బ్రహ్మవిద్యోపాసకులును కర్మాచరణపరాయణులును పాపాత్ములు నని ప్రాణులు మూఁడువిధములుగ విభాగింపఁబడి యున్నారు. ఇందు మొదటితెగవారిమార్గము దేవయాన మనియు రెండవతెగవారిమార్గము పితృయాన

పుణ్యాత్ములయొక్కయుఁ బాపాత్ములయొక్కయు గమనాగమనములు విమర్శింపఁ బడును. జీవుఁడు ప్రాణములతోను ఇంద్రియములతోను మనస్సు

---

మనియుఁ జెప్పఁబడును. మూఁడవ తెగవారిమార్గమునకు నామధేయమే లేదు అది మిగులనీచ మగుటచే శ్రుతియందు దూరక చూపఁబడెను.

ఒకసమయమున గౌతమగోత్రుఁ డగు శ్వేతకేతుఁ డనునొకమునికుమారుఁడు పాంచాలరాజగు ప్రవాహణుఁ డనువానిసభకుఁ బోయెను. ఆరాజును యీబాలుని చూచి 'నీవు యేవిద్యను నేర్చితివి' అని ప్రశ్నించెను. 'నే నన్నిఁటి నెఱుఁగుదును.' అని దాని కాబాలుఁ డుత్తర మిచ్చెను. అప్పుడారాజు . ఈక్రిందివిధమున వాని నైదువిషయములనుగూర్చి ప్రశ్నించెను.

(1) ప్రాణులు మృతినొందినపిదప నెచ్చటికిఁ బోవుదురు ? (2) ఏవిధముగ మరలి వత్తురు? (3) దేవయానపితృయానమార్గము లెచ్చట నేకీభవించును ? (4) ఇందఱుజీవులు పోవుచున్నను ఆస్థల మెట్లు యిఱుకు గాకయుండును ? (5) జలములు మొదలగుభూతములు ఐదవయాహుతియందు నెట్లు పురుషనామమును దాల్చును ?

ఈవిధమున నారాజు ప్రశ్నింపఁగా నామునికుమారుఁడు యిందొక ప్రశ్నమున కైనను సమాధానము చెప్పలేకపోయెను. ఈకారణమున సిగ్గుపడి యాతఁడు తన తండ్రియొద్దకుఁబోయి యీపరాభవమును చెప్పుకొనియెను. "ఓతండ్రీ నాకేమియుఁ జెప్పకయే సర్వమును చెప్పితినంటివి. ప్రవాహణుఁడు నన్నైదుప్రశ్నము లడుగ నందొక్కదానికైనను సమాధానముఁ జెప్పలేకపోయితిని." అని దీనభావముతోఁ బ్రార్థించెను. ఇప్పుడు తండ్రి యిట్లనియె. "ఓపుత్రా ! నాకు తెలిసినంతవరకు నీవిషయమునఁ దోఁచలేదు ప్రవాహణుఁ డడిగిన ప్రశ్నములకు నుత్తరములు నాకుఁగూడఁ దెలియవు. కావున నాయందు దోషమేమియుఁ లేదు."

అని యిట్లు చెప్పి పిదప నాతండ్రియు ఆనూతనవిద్యను గ్రహించుటకై పుత్రసహితముగ నాప్రభువుకడకుఁ బోయెను. ఆతఁడును వచ్చినమునుల గౌరవించి పూజించి యాదినము విశ్రాంతిసుఖము నొందినపిదప మరునాఁడు సగౌరవముగ వారి మనోరథమును తెలిసికొనఁగోరి యిట్లనియె. "ఓమునులారా ! మీయభీష్టమును దెల్పుఁడు, నాకు సాధ్యమగుదాని నెద్దానినైనను సమకూర్చెదను." అనిన నమ్మునియును తాను విద్యార్థియై వచ్చుటను దెల్పెను. ఇప్పుడు ప్రవాహణుఁ డిట్లనియె.

"ఓబ్రాహ్మణోత్తమా ! మీకు మే ముపదేశింపఁగలయంతవారము కాము. మీ విద్యలో సహస్రాంశమైనను గలవారము కాము. ఐనను ప్రస్తుతము మీ రర్థించువిద్య యిప్పటికి బ్రాహ్మణజాతిలోనికి రాలేదు. క్షత్రియులే పరస్పర ముపదేశించుకొనుచుం

తోను గూడి అనాది యగునవిద్యవలన వచ్చినధర్మాధర్మసంస్కారముల నాశ్రయించి పూర్వదేహమును విడిచి కర్మానుగుణ మగునుత్తరదేహ

---

డిరి. కావున నే నెట్టివాఁడ నైనను యీవిద్య నుపదేశింపవలసినవాఁడ నగుచున్నాను కావున నాగ్రహ ముంచక నన్ను దయాదృష్టితోఁ జూడవలయును. కొంతకాల మిచ్చటనే నివసించుచుండిన నాయవకాశము కొలఁది విద్యనుబోధించెదను." అనిన సమ్మతించి యాముని యచ్చటనే నివసించెను ప్రవాహనుఁడును అవకాశము ననుసరించి యీక్రింది విధముగ విద్యను బోధింప నారంభించెను.

ఇది యుపాసన. పూర్వ మీమాంసాదిశాస్త్రములయందు అగ్నిహోత్రమునందు హోమములఁ జేయుటవలన నాహోమద్రవ్యములు సూక్ష్మరూపములై యపూర్వ మను పేర పురుషు నాశ్రయించి వానినిర్గమనకాలమున వానినాశ్రయించియే చనుచు పరలోకభోగములను ఉత్తరజన్మములను కూడ కలిగించుచుండు నని సిద్ధాంతము చేయఁబడి యున్నది. ఈయపూర్వనిర్గమనలే నైదువిధములుగ విభాగింపఁబడి నైదాహుతులుగ నీవిద్యయందు వర్ణింపఁబడును. ద్యులోకము మొదలగుకొన్నిపదార్థములు యీయాహుతులకు నాధారభూతము లగునగ్నులుగ వర్ణింపఁబడును. ఆపదార్థముల నగ్నిరూపములతో నుపాసనఁ జేయవలయు ననుట యిందలిసిద్ధాంతము. ఆయగ్నులమూలమున తనకు గమనాగమనములు కలుగు నని నిశ్చయించుకొని సంసారహేతువు లగు నాగమనాగమనముల బొత్తుగనే లేకుండఁగ నైనను ఉన్నను దేవయానమార్గమున పునరావృత్తిరహిత మగు బ్రహ్మలోకప్రాప్తి గలుగునటుల నైనను ప్రయత్నింపవలయు ననుట దీనికి ముఖ్యతాత్పర్యము.

అయిదగ్నులను గూర్చి చెప్పునది యగుటచే నీవిద్యకు పంచాగ్నివిద్య యని పేరు. ద్యులోకము (స్వర్గలోకము) మేఘుఁడు భూమి పురుషుఁడు స్త్రీ యను నివి యైదును పంచాగ్నులు. వీనిని అగ్నిరూపముతో నుపాసింపవలయును. జలాధిభూతములు ఈయగ్నులయందే వేల్వఁబడుచు వచ్చి యైదవయాహుతియందు (అనఁగా స్త్రీరూప మగునగ్నియందు రేతోరూపమున హోమము చేయఁబడినపిదప) పురుషరూపము దాల్చును. ఎట్లనిన: వేదానుసారి యగు ప్రతివాఁడును కర్మాచరణమువలన ప్రయోజనము గల దని నిశ్చయించు ప్రతిపురుషుఁడును సాయంప్రాతఃకాలములయందు క్షీరఘృతాదిరూపము లగుపాంచభౌతికపదార్థముల నగ్నిహోత్రమునందు హోమము గావించుచున్నాఁడు. అట్టు హోమముచేయఁబడుచున్న యాపదార్థములు అపూర్వరూపములై పురుషు నాశ్రయించియేయుండి మరణానంతరమున నాజీవు నావరించుకొని మొట్టమొదట నాకాశమునకుఁ బోవును. అచ్చటినుండి స్వర్గలోకమునకుఁ బోవును. ఈవిషయమే ద్యులోక మగ్నియనియు నం దీజలాదులు యింద్రియాదిదేవతలచే హోమముఁ

మును జెందు నని స్పష్టముగ శ్రుతివలనను అనుభవమువలనను గూడ తెలియవచ్చుచున్నది. "అథైన మేతే ప్రాణా అభిసమాయాంతి ......

---

గావింపఁబడు ననియుఁ జెప్పఁబడును. మఱియు ద్యులోకమునకు అగ్నిరూపము కల్పింపఁబడియుండుటచే దానికి సమిధలు జ్వాల పొగ బొగ్గులు మిణుఁగుఱులు అనునవియన్నియుఁ గల్పింపఁబడియెను.

ఈద్యులోకము సూర్యునిచే ప్రకాశింపఁజేయఁబడును. కావున దీనికి సూర్యుఁడే సమిధలు. సమిధలనుండి పొగవచ్చునట్లు సూర్యునుండి కిరణములు వచ్చును గావున నాకిరణములే ధూమములు. అగ్ని నార్చినపిదప బొగ్గులు గానవచ్చునట్లు సూర్యుఁడు అస్తమించినపిదపఁ గానవచ్చువాఁడగుటచే చంద్రుఁడు నిప్పుతోఁగూడిన బొగ్గు. చంద్రుని వంటియాకారమే కలవై మిణుఁగుఱులవలె చెదరి యుండినవి కావున నక్షత్రములే మిణుఁగుఱులు. ప్రకాశరూపమై యుండినది కావున పగలే జ్వాల. ఈవిధముగ సర్వావయవములతోఁ గూడ ద్యులోకము నగ్నిగా భావించి దానిని మరణానంతరమున దనకుఁ బ్రథమస్థానముగ నుపాసింపవలయును. మఱియుఁ నీద్యులోకమునకుఁ జేరినజలాదిపదార్థములు చంద్రరూపముతోఁ బరిణమించును. అందున్నజీవులును చంద్రులై యాలోకము నందున్నసుఖముల ననుభవింతురు.

మేఘము రెండవయగ్ని. చంద్రరూపమును జెందియున్నజలము ఆలోకమున భోగము ముగియఁగానే మరల సూక్ష్మరూపములై భూలోకమునకు వచ్చుటయే యాకాశవాయ్వాదులగుండ మేఘమునందుఁజేరి చేరును. ఇదియే మేఘమునందు దేవతలచేఁ జేయఁబడునాహుతి. ఈమేఘాగ్నికి వాయువు సమిధలు, గాలివలననే కదా మేఘము వర్షించును! జలాధారమగు పొగ లేక యావిరి దానికి పొగ. అది పొగవంటిదికదా! మెఱుపు జ్వాలవంటిదగుటచే దానికి జ్వాల, పిడుగులు నిప్పుకణికలు. అవి కఠినములై యుండుటయే గాక మంటనుండి బొగ్గులు జనించునట్లు మెఱుపునుండి జనించును. క్షణక్షణమునకు వచ్చుచుండినవి కావున ఉఱుములే యామేఘాగ్నికి మిణుఁగుఱులు. ఇట్లు సావయవముగ నీ రెండవయగ్ని నుపాసింపవలయును. ఈయగ్నియం దాహుతియైనపిదప నాజలాదులు వర్షరూపముతో భూమికి వచ్చును.

భూమి మూఁడవయగ్ని. మేఘమును పొందినజలాదిపదార్థములును వానిచే నావరింపఁబడియున్న జీవులును వర్షమార్గమున భూమికి వత్తురు. ఇదియే యింద్రియాదిదేవతలచే భూరూప మగుమతృతీయాగ్నినిఁ జేయఁబడు నాహుతి. ఈభూరూపాగ్నికి సంవత్సరము సమిధలు. ఒక్కసంవత్సరము నిండునప్పటికిగాని భూమి ఫలముల నొసంగదు కదా! ఆకాశము సామాన్యదృష్టికి భూమినుండి వచ్చినట్లు కానఁబడును కావున నది దానికి పొగ. జ్వాలకు నగ్నితో సమాన మగువర్ణమే యుండవలయు ననుట నియమము

అన్య న్నవతరం కళ్యాణతరం రూపం కురుతే" = "జీవుఁడు ఒకశరీరము

కావున నీభూమికి నల్లనివర్ణముతో నుండురాత్రియే జ్వాల. జ్వాల ఆరిపోయినపిదప స్పష్టములై కానవచ్చు బొగ్గులవలె రాత్రి గడచినపిదప స్పష్టములై కానవచ్చును గావున దిక్కులు బొగ్గులు. చిన్నవియగుటచే నాగ్నేయము మొదలగుమూలలు మిడుఁగుఱులు ఇట్లుసావయవముగ నీమూఁడవయగ్ని నుపాసింపవలయును. వర్షమూలమున నిందు జేరిన జలాధిభూతములును వానిచే నావరింపఁబడిన జీవులును భూమిపై నున్నవృక్షాదుల నాశ్రయింతురు.

పురుషుఁడే నాల్గవయగ్ని. ఓషధులు ధాన్యములు ఆజీవులు జలాధిభూతసహితులై వర్షముతో గలసివచ్చి యాశ్రయింతు రని చెప్పియుంటిమి కదా! వానిని పురుషులు ఆహారరూపముతో భక్షింతురు. ఇదియే నాల్గవయగ్నియందలి యాహుతి. వాగింద్రియముచే సర్వవిషయములఁ బ్రకటించు పురుషుఁ డశుద్ధుఁ డగును. కావున వాగింద్రియమే యీయగ్నికి సమిధలు. పొగవలె నాసికాదిద్వారములనుండి నిర్గమించును కావున ప్రాణము ధూమము. కాంతి కలవి యగుటచే నేత్రములు నిప్పుకణికలు. దూరదూరముగ నుండునవి యగుటచే చెవులే మిడుఁగుఱులు. ఎఱ్ఱనిదగుటచే నాలుకయే జ్వాల. ఇట్లు సర్వావయవయుక్తముగ నీనాల్గవయగ్ని నుపాసింపవలయును. ఆహారరూపముతో నీయగ్నియం దాహుతి చేయఁబడిన యాజలాదులు రేతోరూపముగఁ బరిణమించును. ఆభూతములచే నావరింపఁబడినజీవులును ఆరేతస్సు నాశ్రయింతురు.

స్త్రీ యైదవయగ్ని. పురుషునిమూలమున నిందు రేతస్సు ప్రవేశించును. ఇదియే యిందలియాహుతి. ఈయగ్నికి పుత్రజన్మాదిసాధన మగు నుపస్థేంద్రియమే సమిధలు. రోమములు ధూమము. యోనియే జ్వాల. సంయోగవిధానములే బొగ్గులు. అప్పటి యానందలేశములే మిడుఁగుఱులు. ఇట్లు సావయవముగ నీయగ్ని నుపాసింపవలయును. రేతోరూపమున నున్నజలాధిభూతము నీయగ్నియందు హోమము గావింపఁబడి తత్తజ్జాతికి ననుగుణమగుదేహముగ బరిణమించును. వానిచే నావరింపఁబడియున్నజీవులను యాదేహము నభిమానించి సంసారమధ్యమున సుఖదుఃఖసముద్రమునఁ దేలియాడును.

ఓమహాముని ! ఈవిధముగ మొట్టమొదట స్వస్వరూపముతో ద్యులోకము నందును అచ్చట చంద్రరూపమునొంది యారూపముతో మేఘునియందును యచ్చట వర్షరూపము నొంది యారూపముతో భూమియందును అచ్చట నాహారరూపముఁ జెంది యారూపముతోఁ బురుషునియందును వేల్వఁబడినజలాదులు అచ్చట రేతోరూపమును జెంది స్త్రీగర్భమును ప్రవేశింపఁగనే పురుషరూపమును జెందుచున్నవి. ఇదియే యైదవయాహుతియందు జలాదులకుఁ గలుగు పురుషాకారప్రకారము హోమ

నుండి నిర్గమించునప్పుడు ప్రాణము లాతనితోఁ గూడ నిర్గమించును... పరలోకానుభవ మైనపిదప నాజీవుఁడు క్రొత్తది యైనట్టియు మనోహర

ద్రవ్యము లన్నియు సామాన్యముగ ద్రవరూపములే యగుటచే జలభూతముమాత్రమే విద్యోపదేష్టలు ప్రధానముగఁ జెప్పుదురు.

ఈ పంచాహుతి నిరూపణముచే సామాన్యములగు గమనాగమనము లెఱింగింపఁ బడినవి. వీనివిశేషముల నాకర్ణింపుఁడు. ఏమహాత్ములు వైరాగ్యసంపన్నులై పరమేశ్వరు నుపాసింతురో అట్టివారు మరణానంతరమున దేవయానమార్గము నాశ్రయించి బ్రహ్మలోకమునకుఁ బోవుదురు. శరీరమునుండి నిర్గమింపఁగానే వారిని తేజోభిమానదేవత తనలోకమునకుఁ గొనిపోవును. లేక సూర్యకిరణములే యాజీవుల నచ్చటికిఁ జేర్చును. అచ్చటినుండి యా తేజోభిమానదేవత పగటి నభిమానించు దేవతయొక్క లోకమునకుఁ జేర్చును. ఆదేవతయు (పగటి నభిమానించు దేవతయు) శుక్లపక్షాభిమానిదేవతయొక్క లోకమునకుఁ జేర్చును. ఆదేవతయు నుత్తరాయణాభిమానిదేవతయొక్క లోకమునకుఁ జేర్చును. అదియు సంవత్సరాభిమానిదేవతయొక్క లోకమునకుఁ జేర్చును. ఆదేవతయు సూర్యలోకమునకుఁ జేర్చును. ఇంతవరకు ద్యులోకాగ్నియందలి ప్రథమాహుతి వర్ణింపఁ బడియెను. ఆసూర్యుఁడును తననుండి చంద్రలోకమునకుఁ జేర్చును. ఇదియే ప్రథమాహుతివలన గలిగినఫలము. భూలోకమున మరల జన్మింపవలసినవారలు మాత్రమే యాలోకమునుండి మేఘమును జేరుదురు కాని పునరావృత్తి లేనివార లట్లు దిగరు. కావున నీబ్రహ్మోపాసకు లాచంద్రునిచే మెఱుపునభిమానించు దేవతయొక్క లోకమునకుఁ గొనిపోఁబడుదురు. వా రచ్చటనే యుండఁగా బ్రహ్మలోకమునుండి యొక దేవపురుషుఁ డేతెంచి వానిని ఆలోకమునకుఁ గొనిపోవును. వారును అచ్చటిసుఖముల ననుభవించుచుఁ బరమేశ్వరోపాసన నాచరింపుచు మహాత్ముల సహవాసమువలన దివ్యజ్ఞానసంపన్నులై కల్పాంతమువరకునుండి యప్పుడు ఆచతుర్ముఖునితోఁగూడ ముక్తినొందుదురు; మఱలసంసారము నొందరు. ఇదియే దేవయానమార్గము. ఇదియే యుత్తరమార్గము. ఈమార్గమున బ్రహ్మోపాసకు లగువారు మాత్రమే ప్రయాణముఁ జేయుదురు.

ఇట్లుగాక యజ్ఞాదికర్మల నాచరింతురేని యట్టివారలు పితృయానమార్గమున పరలోకమునకుఁబోయి యందలిసుఖముల ననుభవించి మరల భూలోకమునకు వత్తురు. శరీరమునుండి నిర్గమింపగానే వారు మొట్టమొదట ధూమాభిమాని దేవత కడకుఁ బోవుదురు. ఆదేవత రాత్ర్యభిమానిదేవతకడకుఁ జేర్చును. అది కృష్ణపక్షాభిమానిదేవతయొక్క లోకమును బొందించును. దానిసహాయముచే నచ్చట నుండి దక్షిణాయనాభిదేవతయొక్క లోకమును జెందుదురు. దేవయానమార్గస్థులకు

మైనట్టియు నగుమఱియొకరూపమును ఏర్పరచుకొనును" అని బహు

---

వలె వీరికి సంవత్సరాభిమానిదేవతాలోకప్రాప్తి లేదు. వీరు ఆదక్షిణాయనదేవతాలోకము నుండి పితృలోకమునకును అచ్చటనుండి యాకాశమునకును బోవుదురు. ఇంతవరకు ద్యులోకాగ్నియందలియాహుతి చెప్పఁబడెను. ఇట్లాకాశమునకుఁ జేరినపిదప చంద్రలోకమునకుఁ బోవుదురు; వీరి నావరించి వచ్చుచున్నజలాదులాలోకమున భోగార్థమై వీరి కొక దేహమును కల్పించి యిచ్చును. అభూతములే చంద్రరూపముగాఁ బరిణమించు నని యిదివరకే వివరించియున్నాము. ఇదియే పితృయానమార్గము. దక్షిణమార్గము దీనియందు బ్రయాణమునాచరించువారు పునర్జన్మము నొందుదురు. యజ్ఞాది పుణ్యకర్తలు మాత్రమే యీమార్గమునఁ బ్రయాణము చేయుదురు. ఈరెండు మార్గములును చంద్రలోకమునందు మాత్రమేకీభవించును. పాపాత్ము లీరెండుమార్గములలో జేనినిఁగూడ నాశ్రయింపరు. బ్రహ్మజ్ఞానులసంఖ్యయు కర్మనిష్ఠగలవారి సంఖ్యయుఁ మిగుల నల్పముగనే యుండును గావున నెందఱుజీవులు పోయినను ఆచంద్రలోకము ఇరుకు కానేరదు. పాపాత్ముల గమనాగమనములకు నీరెంటికంటె భిన్నమగు మఱియొక త్రోవ కలదు. వారు యమలోకమునకుఁబోయి యచ్చట దుష్కర్మలకు తగినశిక్ష ననుభవించి మరల భూలోకమున శునకాది క్షుద్రజంతువులుగానో పురుగులుగానో జనింతురు. "పుట్టుము చావుము" అను నివియే వారిగమనాగమనములు.

ఇప్పటికి నారోహప్రకారమంతయు వివరింపఁబడెను. ఇక నవరోహప్రకారము నాకర్ణింపుఁడు. బ్రహ్మజ్ఞానసమన్వితు లగువారికిని మిగులఁ బాపాత్ము లగువారికిని సక్రమమగు నవరోహము లేదు. జ్ఞానులు పునరావృత్తి నొందరు; పాపాత్ములకు నది యున్నను నియమము లేదు. ఈకారణమువలన యజ్ఞాదికర్తలనుగూర్చి మాత్రమే యవరోహముఁ జెప్పవలసియున్నది.

ఐహికఫలము నొసంగునవి యనియు నాముష్మికఫలము నొసంగునవి యనియుఁ గర్మలు రెండువిధములై యుండును. ప్రతివాఁడును ఈద్వివిధకర్మలనుగూడ నాచరించును. అందు ఆముష్మికఫలములఁ జంద్రలోకమునందును ఐహికఫలముల భూలోకమునందు ననుభవించును. ద్యులోకాగ్నియందు హోమము గావింపఁబడిన జలాదులు చంద్రలోకమునఁ బరిణామమును జెందు నని యిదివరకే చెప్పియున్నాము కదా! అట్లు పరిణామమునొందినజలముల నభిమానించుచు నందలిజీవుఁడు కర్మసామర్థ్య ముండునంతవరకు నచ్చటిసుఖముల ననుభవించుచుండును. ఇట్లు అనుభవమువలన పరలోకఫలము నొసంగవలసినకర్మ క్షీణింపఁగానే యప్పటిదుఃఖమువలన నాదేహము (జలాదులచే సుఖభోగార్థము చంద్రలోకమునఁ గల్పింపఁబడినదేహము) కూడ క్షీణించును.

వాక్యములచే నీవిషయమును శ్రుతి ప్రకటించుచున్నది. ప్రతిపురుషుఁడును ధర్మాధర్మకార్యముల నాచరించుచుండుటను ప్రత్యక్షముగఁ జూచు

---

అప్పుడు ఐహికఫలముల నొసంగవలసిన కర్మ లింకను మిగిలియే యుండుటచే వాని కొఱకై యాజీవుఁడు భూలోకమునకు డిగ్గ నారంభించును.

అట్లు చంద్రలోకదేహము నశించి జలాదిభూతములు మరల సూక్ష్మరూపము నొందఁగానే వానితోఁ జేరినజీవుఁడును మొట్టమొదట నాకాశమునకు దిగివచ్చును. అచ్చట నాకాశసమానరూపముతో, గొంతకాలముండి వాయువుచే నిటునటు గదలింపఁబడుచు వాయుసమానుఁ డగును. పిదపపొగతో తుల్యుండగును. తర్వాత మేఘమండలములకు డిగ్గి యచ్చట కొంతకాలమువరకు జలాధారమై యుండి పిదప మేఘసమానరూపమునే పొందును. అచ్చటనుండి వర్షమూలమున భూమి నాశ్రయించును. ఇంతవరకు నాయాస్థానములయందు విశేషకాలము నిలువవలసినపని యుండదు. మేఘరూప మగు రెండవయగ్నియందును పృథివీరూప మగుమూఁడవయగ్నియందును జరుగు నని చెప్పఁబడిన రెండాహుతులును శీఘ్రముగనే యగును. ఇఁకపైననే యాలస్యము. వర్షధారలమూలమున భూమి నాశ్రయించి జీవుఁడు ఆవర్షధార దేనిపైఁ బడునో దానిని మాత్రమే యాశ్రయించెను. ఇఁక జూడుడు ఆహారపదార్థము నాశ్రయించుట యనునదియే మొట్టమొదట జీవునకు నెంతకష్టము! వర్షధార నదీమధ్యమునఁ బడవచ్చును. అప్పుడు ఈజీవుఁడు నచ్చటనే పడెనేని యానదీద్వారముగ సముద్రమును బ్రవేశింపవలసినవాఁడగును. సూర్యకిరణములచే నందలిజలములు పీల్పఁబడినప్పుడు దానితోఁగూడ మఱల మేఘమండలమునకే బోవలసినవాఁడగును. మఱియు నావర్షధార యేరాతిపై నైనను బడెనేనియు ఆజలముతోపాటు జీవుఁడును నదిలోనికిగాని మఱియొకస్థలమునకుఁగాని బోవలసినవాఁడగును; సూర్యకిరణముల మూలమున నాకాశమునకైనను పోవలసినవాఁడగును. ఇట్లుగాక నాజలధార యేదియో యొకవృక్షముపైఁ బడుట సంభవించినను అది యాహారమున కుపయోగింపనివృక్ష మైనచో ప్రయోజన ముండదు. ఉపయోగించువృక్షమేయైనను ఉత్తరజన్మప్రాప్తి యవశ్యముగఁ గలుగు ననుటకు వీలు లేదు. ఆయాహారపదార్థమును భుజించినవాఁడు పురుషుఁడు కావలయును. యౌవనవంతుఁడు కావలయును. శరీరదార్ఢ్యముకలవాఁడు కావలయును, శుక్లదోషాదులు లేనివాఁడును కావలయును. ఆతనిభార్యయు గర్భధారణసమర్థ కావలయును. ఇన్నియు నున్నను దేశకాలాదు లనుకూలములుగ నుండవలయును. ఇట్లగుటచే నాహారపదార్థములతో సంబంధము కలిగినపిదప జీవునకు నుత్తరజన్మప్రాప్తికి బహుకాలము పట్టును దైవయోగమువలన నెట్టకేలకు ఆహారరూపముతో నాల్గవయగ్ని యగుపురుషునియందు ప్రవేశించి రేతోరూపముతోఁ బరిణామమును బొందిన

చున్నాము; కావున వానికి ఫలము లవశ్యముగ నుండవలసివచ్చుటచే గూడ ననుభవానుసారముగ జీవునకు దేహాంతరసద్భావము కల్పింపవలసివచ్చుచున్నది. ఈపాదమునందలి సర్వాధికరణములకు నిదియే విషయము.

---

## తదంతర ప్రతిపత్త్యధికరణము. ౧.

విషయము, సంగతి:—అందు మొదటియధికరణమున "జీవుఁడు ఒకదేహమును విడిచి పరలోకాదులకు బోవునప్పుడు ప్రాణేంద్రియాదులతోఁబాటు వానికి నాధారములగు పంచీకృతభూతములయొక్క సూక్ష్మాంశములనుఁగూడ గైకొని పోవును" అను విషయభాగము నిరూపింపఁబడును. ఇది ప్రథమాధికరణము కావున దీనికి సంగతియక్కఱలేదు. ఇట్లు కాకున్నను పూర్వాధ్యాయాంతమున త్రివృత్కరణప్రస్తావము వచ్చుటచే దాని నాశ్రయించి యిందు ఆశ్రయాశ్రయిభావసంగతిచే త్రివృత్కృతభూతములఁ గూర్చినవిచార మాచరింపఁబడుచున్నది యని యైనను చెప్పవచ్చును.

సందేహము, పూర్వపక్షము:—ఈజీవుఁడు శరీరమునుండి నిర్గమించునప్పుడు పంచీకృతభూతములయొక్క సూక్ష్మాంశములఁ గైకొని

---

భూతముల నాశ్రయించి యాపురుషునిమూలమున నైదవయగ్నియగు స్త్రీయందుఁ బ్రవేశించి తొమ్మిదిమాసములకుఁగాని పదిమాసములకుఁగాని పిదప జన్మించును. ఇదియే యవరోహప్రకారము.

ఈవిధముగా బ్రహ్మజ్ఞానితప్ప తక్కినవారలు పుణ్యము నొనర్చినను పాపము నొనర్చినను ఏతమువలె క్రిందికిని మీఁదికిని బోవుచు వచ్చుచుందురు. ఏకర్మ నాచరించినను వచ్చుశాశ్వతఫల మెద్దియుం లేదు. ఇహపరలోకఫలములురెండును క్షణికములే కావున వీరియందలి యభిమానము వదలి శాశ్వతబ్రహ్మయోగప్రాప్తి కలుగుటకుఁ దగినయుపాయము నాలోచింపవలయును; బ్రహ్మము నుపాసింపవలయును.

ఇట్లు పాంచాలరాజు ప్రవాహణుఁడు సర్వము నుపదేశింపఁగా మిగుల సంతసించి యమ్మునియు నాతనిపుత్త్రుఁడును నిజనివాసములకుఁ జనిరి. ఈవిద్యయందు వర్ణింపఁబడిన దేవయాన పితృయానములకే క్రమముగ అర్చిరాదిమార్గ మనియుం ధూమాదిమార్గ మనియుఁ బేర్లు.

పోవునా? లేక ప్రాణాదులను మాత్రమే గైకొని పోవునా? భూతాంశములఁ గైకొనిపోవు ననుటకుఁ బ్రమాణ మేదియు లేదు. ప్రాణాదులఁ గైకొని పోవు ననువిషయమువలె నీవిషయము శ్రుతియందు లేదు. "న ఏతా స్తేజోమాత్రాః సమభ్యాదధానః." "ఆ జీవుఁడు ఈతేజోమాత్రలను గైకొని" అనువాక్యమునందు తేజోమాత్ర శబ్దములచే నింద్రియములు మాత్రమే చెప్పఁబడెను. కాని భూతములు కావు. ఈ విషయము *వాక్యశేషమువలన స్పష్టమగుచున్నది. అందు నేత్రాది ప్రస్తావముమాత్రమే కలదు. కాని భూతప్రస్తావము లేదు. "భూతములను గైకొని పోవకున్న దేహాంతరమును నిర్మించుటకు వీలు లేదు. కావున జీవునకు సహాయములై భూతము లున్నవి యని సిద్ధాంతముఁ జేయవచ్చును" అనిన నదియు యుక్తము కాదు. పంచీకృతభూతము లన్నిచోట్లను గలవు. ఎచ్చట శరీరమును పుట్టింపఁదలంచిన నచ్చట నెల్ల నిరభ్యంతరముగఁ బుట్టింపవచ్చును. ఇట్లగుటచే "జీవుఁడు దేహము విడుచునప్పుడు భూతాంశములనుఁ గూడఁ గొనిపోవును." అని సిద్ధాంతముఁ జేయుటకు నెంత ప్రయాసపడినను ప్రయోజనము లేదు.

## అ_౩. పా_౧. సూ_౧.

అవ. "ఏశ్రుతివాక్యము ప్రాణాదులనిర్గమనమునుగూర్చి యుపదేశించునో అదియే వానికి నాధారము లగుభూతములయొక్క నిర్గమనమును గూర్చియు నుపదేశించును." అను విషయము నెఱుంగ లేక పైన వర్ణించినవిధముగఁ జేయఁబడిన పూర్వపక్షమును నిరాకరించుచున్నాఁడు.—

## ౨౯౩. తదంతర ప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యామ్. ౩. ౧. ౧.

తాత్పర్యము. ఇట్లు చెప్పుట యుక్తియుక్తము కాదు. శ్రుతియందు చూపఁబడియున్న ప్రశ్నోత్తరముల నాశ్రయించి చూచిన "జీవుఁడు భూతములతోఁ గూడియే దేహమునుండి నిర్గమించు నని తేలుచున్నది.

* వాక్యవిశేషము (అ-౧. పా-౪. సూ-౨౬. పే-౨౩౩. చూ.)

ప్రవాహణుఁ డనురాజు తనసభకు వచ్చిన శ్వేతకేతుఁ డనుఋషి కుమారునిఁ జూచి "వేత్థ యథా పంచమ్యా మాహుతా వాపః పురుష వచసో భవంతి" "ఓ శ్వేతకేతుఁడా! జలము ఐదవయాహుతియందు పురుషుఁ డగుట యెట్లో నీకుఁ దెలియునా?" అని ప్రశ్న చేసెను. దీనికి సమాధానమును చెప్పుటకు నాశ్వేతకేతునికిఁ గాని యాతనిగురు వగు గౌతమునికిఁ గాని సామర్థ్యము లేకుండెను. తరువాత నాగౌతమునిచేతనే ప్రార్థితుఁ డై యాప్రవాహణుండు తన ప్రశ్నమునకు సమాధానముగ పంచాగ్నివిద్య నంతయు నుపదేశించి కట్టకడపట "ఇతి తు పంచమ్యా మాహుతా వాపః పురుషవచసో భవంతి" "పైన వర్ణించినవిధముగ స్త్రీరూప మగునైదవయగ్నియందు రేతోరూప మగుహవిస్సును ఆహుతి చేసిన నప్పుడు జలము పురుషరూప మగును" అని చెప్పెను. ఈ రెంటిని విమర్శించిన జీవనిర్గమనకాలమునందును పునర్జన్మకాలమునందునుఁ గూడ పంచీకృతభూతములు ఆతనితోఁ గూడనే యున్నవి యని స్పష్టమగు చున్నది.

ఇట్లు శ్రుతి శరీరనిర్గమనమును నిర్ణయించుటవలన దీనికి విరోధ ముగా స్వప్రజ్ఞల నాధారముచేసికొని చేయఁబడినకల్పనలన్నియు యుక్తి యుక్తములు కావు. అహంకారము సర్వవ్యాపకము. కావున దానినుండి జనించిన యింద్రియములును జీవులును గూడ సర్వవ్యాపకులే యనియు పురాకృతకర్మవశమున నొకదేహమునకున్న యింద్రియ వృత్తి తొలఁగి మఱియొకదేహమున నభివ్యక్తి నొందుచుండు ననియు జీవుఁ డచ్చట కూడ నున్నాఁడు కావున అచ్చటివృత్తివలన కలుగు సుఖదుఃఖములఁ దనవిగానే భావించుచుండు ననియు ఇదియే పునర్జన్మ ప్రకార మనియు సాంఖ్యులు చెప్పుదురు. ఆత్మమాత్రమే మఱియొక స్థలమునకుఁ బోవు ననియు దేహేంద్రియాదు లన్నియు నెప్పటికప్పుడు క్రొత్తగ జనించు ననియు బౌద్ధులు చెప్పుదురు. మన స్సొక్కటి మాత్రమే ఒకశరీరమునుండి మఱియొకశరీరమునకుఁ బోవుచుండు ననియు నాత్మ సర్వవ్యాపకుఁ డనియు ఆకాశమువలన ప్రతిశరీరమునందును గమనాగమనములతోఁ బని లేకయే యుండు ననియు మనశ్చలనమే పునర్జన్మ మనియు వైశేషికులు చెప్పుదురు. ఒకచిలుక ఒకవృక్షమునుండి మఱియొకవృక్షమునకు నెగయునట్లు జీవుఁడు ఒకశరీరమునుండి మఱియొక

శరీరమునకుఁ బోవుననియు భోగసాధనము లగునింద్రియములు ఎచ్చటి వచ్చటనే యుండుననియు జైనులు చెప్పుదురు. జీవునకు పునర్జన్మము లేద నియు ఎచ్చటివాఁ డచ్చటనే భస్మ మగు ననియు నాస్తికులు చెప్పుదురు. ఇవి యన్నియు శ్రుతివిరుద్ధము లగుటచే సమ్మతములు కావు. వీరి సిద్ధాంతము లన్నియు ద్వితీయాధ్యాయ ద్వితీయపాదమున సయుక్తికముగ ఖండింపఁబడి కూడ నున్నవి. కావున జీవుఁడు ప్రాణములతోను ఇంద్రియములతోను మనస్సుతోను పంచీకృతములై ఈప్రాణాదులకు నాధారములై యున్నభూతములతోను (ఇదియే సూక్ష్మశరీరము) కూడి శరీరము నుండి నిర్గమించును. కర్మానుగుణముగ వచ్చిన రెండవశరీరమును ప్రవేశించును. ఇదియే సిద్ధాంతము. కొన్నిశ్రుతులయందు "జీవుఁడు గడ్డియందలి పురుగువలె ఒకదేహమును ఆశ్రయించియే పూర్వదేహమును విడుచును." అని చెప్పఁబడియున్నది. దానికిఁ గూడ "పూర్వశరీరము నుండి నిర్గమింపఁబోవునప్పుడు జీవునకు నుత్తరశరీరమునుగూర్చిన భావన కలుగును." అనుటయే యర్థము కాని జీవుఁడు స్థూలశరీరమునుండియే మఱియొకస్థూలశరీరము నాక్రమించు నని యర్థము కాదు. ఇది ప్రత్యక్షాది సర్వప్రమాణములకును విరుద్ధము కదా! కావున జీవునకు నిర్గమన కాలమున పంచీకృతభూతసహాయము కలదు.

---

## అ_౩. పా_౧. సూ_౨.

అవ. "ఈసిద్ధాంతము యుక్తము కాదు. పైనుదహరింపఁబడిన ప్రశ్నోత్తరములయందు కేవల జలవిషయమై మాత్రమే చెప్పఁబడి యున్నది. కాని యితరభూతములను గూర్చి లేదు. దీనిని చూచిన నొకవేళ జీవుఁడు జలసహితుఁడై శరీరమునుండి శరీరాంతరమునకుఁ బోవును; అని యేర్పడిన నేర్పడవచ్చును గాని "తేజోజలపృథువులతో లేక పంచభూతములతోఁ గూడి శరీరమునుండి నిర్గమించును" అనువిషయ మెట్లు సిద్ధాంత మగును? వాస్తవస్థితిలో నెంతమాత్రము ("జీవుఁడు జలసహితుఁడై దేహమునుండి నిర్గమించును." అనునంతమాత్రము) కూడ సిద్ధాంత మగుటకే వీలులేదు. ఆశ్రుతులయందు (ప్రశ్నోత్తరశ్రుతులయందు) "జలము అయిదవయాహుతియందుఁ బురుషరూపమును జెందును. అని

మాత్రమే చెప్పఁబడి యున్నది. కాని నిర్గమనమునుగూర్చి చెప్పఁబడియే యుండలేదు కదా!" అనిన సమాధానమును చెప్పుచున్నాఁడు.—

---

## ౨౬౪. త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్. ౩. ౧. ౨.

తాత్పర్యము. ఇట్టిసంశయముతోఁ బనిలేదు. తేజోజలపృథువులు మూఁడును త్రివృత్కరణము చేయఁబడినవని శ్రుతియందు నిర్ణయింపఁ బడియేయున్నది. ఇట్లగుటచే ప్రతిభూతంబును భూతత్రయమయమై యున్నది. ఈకారణమువలన నొక్కభూతమును ప్రస్తావించినను సర్వభూతములఁ జెప్పినట్లే యగును. మఱియు దేహమునందు అన్నము పచన మగుట మొదలగునగ్ని కార్యములును చెమ్మట చలువ మొదలగుజలకార్యములునువాసన మొదలగుపృథ్వీకార్యములును గానవచ్చుచున్నవి గదా! ఇట్టి యీదేహమును కేవల జలభూతము మాత్రమే యెట్లు జనింపఁ జేయఁ గలుగును. ఇంతమాత్రమే కాదు. ఉచ్ఛ్వాసనిశ్వాసములు మొదలగు వాయుకార్యములును మాంసాదిసర్వపదార్థములకు నవకాశ మొసంగుట మొదలగునాకాశ కార్యములును గూడ దేహమునఁ గానవచ్చుచున్నవి; కావున దేహము పంచభూతమయముకాని భూతత్రయమయము కాదు; అనియెదవేమొ యెప్పటికిని దోషములేదు. త్రివృత్కరణశ్రుతినలన పంచీకరణము సంగ్రహించినట్లే త్ర్యాత్మకపదమువలన పంచాత్మకత్వమును గ్రహింపవచ్చును. ఇట్లు కాకున్నను వాతపిత్తశ్లేష్మములు మూఁడే శరీర ధారణమును చేయుచున్నవి యనుట లోకప్రసిద్ధము కావున నిట్లును దేహమునకు త్ర్యాయాత్మకత్వము సిద్ధించును. ఆవాతపిత్తశ్లేష్మములయందును శ్లేష్మముమాత్రమే జలరూపము కాని తక్కినవి కావు గావున కేవలజలము శరీరమును జనింపఁ జేయలే దనుట స్పష్టము. ఈకారణములవలన జల గ్రహణముచేఁ దక్కినభూతములును గూడ గ్రహించినట్లే యగును.

"ఇట్లైన జలనామమును మాత్రమే గ్రహించుట యేల? మఱి యొకభూతనామమును గ్రహించియుండరాదా" అనియెదవేమొ వినుము. సామాన్యముగ దేహమునందు సర్వభూతకార్యములకంటె జలకార్యము మెండుగ గలదు. రసము (ఇది అన్నరసశేషము) రక్తము మొదలగునవి యన్నియు ద్రవరూపములే కదా! ఈకారణమువలన శ్రుతి జలమును

పేర్కొనెను. కాని "జలము మాత్రమే శరీరమును నిర్మించును" అను నుద్దేశమున కాదు. "పృథివీభాగము కూడ నధికముగానే యున్నది కదా!" అనియెదవేమొ దీనివలన దోష మేమియు రాదు. తక్కిన భూతములకంటె జల మధిక మనుటలో సంశయము లేదు కదా! ఇదియునుగాక శరీరనిర్మాణమునకు ముఖ్యసాధనము లగుశుక్లశోణితములుకూడ ద్రవరూపములే యగుటచేత నైనను జలభూతము తక్కినవానికంటె నధికము కావచ్చును. ఇదియును గాక శరీరనిర్మాణమునకు కర్మయే నిమిత్తకారణము. ఆకర్మలను యజ్ఞాదులే యనవలయును. ప్రస్తుత పంచాగ్నివిద్యయందు అట్టి కర్మలవలననే పురుషుఁడు ద్యులోకాదిమూలమున పునర్జన్మము నొందునని చెప్పఁబడియున్నది. ఆయజ్ఞాదులును అగ్నిహోత్రసాధ్యములు అగ్నిహోత్రమునందు చేయఁబడు హోమములచే నిర్వహింపఁదగినవి. ఆహోమములును పాలు నెయ్యి సోమరసము (సోమమను పేరుగల తీగెయొక్కరసము) మొదలగు ద్రవద్రవ్యములతో సాధింపఁదగినవి. ఈవిధముగ నుత్తరదేహమునకు నిమిత్తకారణము లగుకర్మలకుఁ గూడ భూతాంతరములకంటె నధికముగ జలమే సాధన మగుటచేతఁ గూడ నది జలము సర్వభూతములకంటె నధికము. ఈకారణమువలన శ్రుతి జలమునుమాత్రమే ప్రధానముగఁ జెప్పెను. కావున నెట్లు చూచినను "జీవుఁడు సర్వభూతసహితుఁడై నిర్గమించును." అనుటలో సంశయము లేదు.

"అగుఁగాక ఇప్పటికి దేలినసిద్ధాంత మేది కలదో జీవుఁడు నిర్గమించునప్పుడు వానికి భూతములతో సంబంధము కలదో లేదో (యింతవఱకు స్థిరము కాలేదు. పునర్జన్మము నొందినప్పుడు భూతములతో నాతనికి సంబంధము కల దనుటలో నెప్పుడును వివాదమే లేదు కదా." అనియెదవేమొ వినుము. శ్రుతిసందర్భమువలననే యావిషయము [నిర్గమనసమయమునందును జీవునకు (పంచ)భూతములతో సంబంధము కల దను విషయము] కూడ స్పష్టమగుచున్నది. ఎట్లనిన: యజ్ఞాదికర్మలను చేసినవారియొక్క పరలోకగమనమును చెప్పునప్పుడు "ఆకాశాచ్చంద్రమస మేష సోమోరాట్"="యజ్ఞాదికర్తలు ఆకాశమునుండి చంద్రునిఁ జేరి చంద్రరూపము లగుదురు" అను వాక్యము కలదు. ప్రస్తుత పంచాగ్నివిద్యయందును "శ్రద్ధాం జుహ్వతి తస్యా ఆహుతేః ఏష సోమో రాజా సంభవతి."= "దేవతలు (ఇంద్రియాభిమానదేవతలు) శ్రద్ధారూప మగుజలాదులను

ద్యులోకాగ్నియందు హోమముఁ జేయుదురు. ఆహోమమువలన చంద్రుఁడు జనించును. (అనఁగా హోమముఁ జేయఁబడిన జలాదులు చంద్రరూపమును దాల్చు ననుట.)" అని సమానార్థమును చెప్పువాక్యమే కలదు. ఈ రెంటిపోలికను బట్టిచూచిన జీవుఁడు జలాధిభూతములతోఁ గూడియే నిర్గమించుచున్నాఁ డనియు అట్లు నిర్గమించిన జీవుఁడే చంద్రుఁ డగు ననియుఁ దేలుచున్నది. "జలాదులు స్వతంత్రముగనే చంద్రరూపమును జెందవచ్చును. జీవుఁడును వానితో సంబంధపడకయే చంద్రుఁడు కావచ్చును. ఇంతమాత్రమువలన జీవునకును జలాదులకును సంబంధము కల్పింపవలయునా?" అనియెదవేమొ వినుము. శ్రుతివాక్యములు రెండును సమానములై యున్నప్పుడు వానియర్థమును సమానముగఁ జెప్పక విపరీతముగఁ గల్పించుట దోషము. సమానముగఁ జెప్పవలయు ననిన జీవునిఁగూర్చి చెప్పఁబడిన విషయంబును జలాదులనుగూర్చి చెప్పఁబడిన విషయంబు నొక్కటిగనే సమన్వయింపవలయును; జలము నెట్లు రెండవయాహుతియందు చంద్రరూపము నొందుచున్నవో జీవుఁడు నట్లే చంద్రరూపము నొందుచున్నాఁ డనవలయును. స్వాభావికముగ జీవునికి నాహుతి సంభవింపదు కావున జలాదులు మాత్రమే హోమముఁ జేయఁబడుననియు జీవుఁడు వానితోఁ గూడ నొకస్థానమునుండి మఱియొక స్థానమునకుఁ బోవుచు మాత్రమే యుండు ననియు నిర్ణయింపవలయును. కావున నెట్లును జీవుఁడు జలాదిభూతములతోఁ గూడియే యొకదేహము నుండి మఱియొకదేహమునకుఁ బోవును.

## అ_3. పా_౧. సూ_3.

అవతారిక:—ఈవిషయమును స్థాపించుటకై మఱియొక హేతువును చూపుచున్నాఁడు.—

## ౨౬౫. ప్రాణగతేశ్చ. 3. ౧. 3.

తాత్పర్యము:—మఱియు శ్రుతియందు "తముత్క్రామంతం ప్రాణో నూత్క్రామత ప్రాణ మనోత్క్రామంతం సర్వే ప్రాణా అనుత్క్రామంతి." "జీవుఁడు వెడలిపోవునప్పుడు ముఖ్యప్రాణము వెడలును. దానితోఁగూడ నింద్రియము లన్నియు వెడలిపోవును" అనుమొదలగువాక్యములయందు

ముఖ్యప్రాణమునకు గమనము చెప్పఁబడియున్నది. అది యాశ్రయ మెద్దియు లేకుండ స్వతంత్రించి నిర్గమింపనేరదు. బ్రతికియున్నప్పుడు దేహమును విడిచి స్వతంత్రముగ నుండుట యెుకప్పుడుకాని కానవచ్చుట లేదు కదా! ఈకారణమువలన వెడలిపోవునప్పుడును దాని కాశ్రయ మగుపదార్థ మేదియో యుండితీరవలయును.ఇంద్రియములే దాని కాశ్రయము లనుట యుక్తము కా దని యిదివరకే నిరూపింపఁబడియున్నది. ఈకారణము వలన సర్వేంద్రియమయమై భూతములచే నేర్పరుపఁబడిన సూక్ష్మశరీర మే దాని కాశ్రయ మనవలయును. ఈకారణమువలనఁగూడ జీవుఁడు భూత సహితుఁ డయ్యే నిర్గమించు ననుట సిద్ధాంతము.

## అ. ౩. పా. ౧. సూ. ౪.

అవ. ప్రాణనిర్గమనవిషయమును ఆక్షేపసమాధానములచే స్థిర పఱుచుచున్నాఁడు.

## ౨౯౬. అగ్న్యాదిగతిశ్రుతే రితిచేన్న భాక్తత్వాత్. ౩. ౧. ౪.

తాత్పర్యము, పూర్వపక్షము:—ఇట్లు కాదు. ప్రాణములు జీవుని తోఁగూడ నిర్గమింపవు. శ్రుతియందు మరణమునుగూర్చి చెప్పునప్పుడు "అగ్నిం వా గప్యేతి వాతం ప్రాణః" "మృతిఁ జెందిన పురుషునియొక్క వాగింద్రియము తన కధిదేవత యగునగ్నియందుఁ జేరును. ప్రాణము తన కధిదేవత యగు వాయువునందుఁ జేరును" అని జెప్పఁబడి యున్నది. ఈకారణమువలన పైసూత్రమునఁ జేయఁబడిన సిద్ధాంతము యుక్త మైనది కాదు. ప్రాణము నిర్గమించుచుండినం గదా దాని యాశ్రయ మును గూర్చిన విచారము.

సిద్ధాంతము :—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. అనేకస్థల ములయందు ప్రాణనిష్క్రాంతి స్పష్టముగ జెప్పఁబడియున్నది యనువిష యమును నిరూపించి యున్నాను. కేవలజీవుఁడు నిష్క్రమించు నను వాదము కూడ యుక్తిశూన్య మని నిరూపించియున్నాము. ప్రాణములు లేకున్న నన్నిశరీరములయందు సుఖదుఃఖభోగములు కలుగుటకు వీలు

లేదనుట సర్వజనప్రత్యక్షమే. ఇట్లగుటచే ప్రాణనిర్గమన మావశ్య మంగీకరింపఁబడవలసినదియే. ఎప్పటికప్పుడు ప్రతిశరీరమునందును ప్రాణములు క్రొత్తక్రొత్తగా సృజింపఁబడుచుండు ననుట విరుద్ధ మనియు నిదివరకే నిరూపింపఁబడియున్నది. ఇఁక "అగ్నిం వా గ ప్యేతి" అను మొదలగు శ్రుతికి నర్థ మేమి యనిన "బ్రతికియున్న కాలమునందు వాగింద్రియమును తనకార్యమునందు ప్రవర్తింపఁజేయుచున్న యగ్నిదేవత మరణకాలమున నాయధికారమును వదలుకొను ననుటయే; వాక్కు నిశ్చేష్ట మగు ననుటయే. ఈవిషయము ఆశ్రుతియందే పూర్వాపరసందర్భముల విచారించిన స్పష్ట మగును. అందు "ఓషధీ ర్లోమాని వనస్పతీ న్కేశాః" "శరీరముపైనున్న వెండ్రుకలు మరణకాలమున నోషధులను (చిన్న వృక్షములను) జెందును; శిరస్సుపైనుండు వెండ్రుకలు మహావృక్షములఁ జేరును" అని కూడ చెప్పఁబడి యున్నది. ఇది యెందైన ప్రత్యక్షముగ నున్నదా? మరణము నొందినప్పుడు శరీరమునందలి వెండ్రుకలును తల వెండ్రుకలు నెరసిపోవుచున్నవా? ఈకారణమువలన నేకవాక్యమునందే యున్న వగుటచే వాగాదీంద్రియములు కూడ వీనివలెనే వెండ్రుకలవలెనే యెచ్చటికినిఁ బోవ వని నిర్ణయింపవలసి యున్నది; అధిదేవతలతో నైక్యమును జెందుట నిరాకరింపఁబడిన పిదప నితరశ్రుతుల ననుసరించి జీవునితోఁ గూడ నిర్గమనమును గల్పింపవచ్చును. నిర్ణయింపవచ్చును. వెండ్రుకలకు నట్టినిర్గమన మెందును జెప్పబడి యుండలేదు కావున దోష మేమియు రాదు. కావున నెట్లును ప్రాణమునకుఁ దనయాశ్రయముతోఁ గూడ నిర్గమనము కలదు.

## అ-3. పా-౧. సూ-౫.

అవ. ఇట్లు ప్రాణనిర్గమనమును నిర్ణయించి మొట్టమొదట నుదాహరింపఁబడిన ప్రశ్నోత్తరములలోఁ గానవచ్చు విరోధమును పరిహరించుచున్నాఁడు.

### సూ 5. ప్రథమే౽శ్రవణా దితి చేన్న తా ఏవ హ్యుపపత్తేః. 3. ౧. ౫.

తాత్పర్యము, పూర్వపక్షము:—ప్రాణనిర్గమన ముండిన నుండును

గాక మొట్టమొదట చూపఁబడిన ప్రశ్నోత్తరములే యుక్తములు కావు. ఉత్తరమునందు "పంచమ్యా మాహుతా వాపః పురుషవచసో భవంతి" అని యైదవయాహుతియందు జలము పురుషుఁ డగు నని నిర్ధారణ చేయఁ బడియున్నది కాని యది యుక్తము కాదు. ఈ పంచాగ్నివిద్యయందు ద్యులోకము మేఘము భూమి పురుషుఁడు స్త్రీ అను నైదుపదార్థములును అగ్నిహోత్రములుగ వర్ణింపఁబడి యందు ప్రత్యేకముగ హోమములు చెప్పఁబడి యున్నవి. రెండవయాహుతి మొదలు గల హోమద్రవ్యము లన్నియు జలరూపములే యగుట నిస్సంశయమే కాని మొట్టమొదటి యాహుతియందుమాత్ర మది లేదు. "తస్మి న్నేతస్మి న్నగ్నౌ దేవాః శ్రద్ధాం జుహ్వతి" "ఈద్యులోకాగ్నియందు దేవతలు శ్రద్ధను హోమము చేయుదురు" అని మాత్రమే మొదటియాహుతినిఁ గూర్చి చెప్పఁబడెను; అందు బుద్ధివృత్తిభేద మగు శ్రద్ధయే హోమద్రవ్యముగ నభివర్ణింపఁబడెను. దీని నాశ్రయించి తక్కిన నాల్గాహుతులయందు నున్నవానినిఁ గూర్చి కూడ ప్రత్యేకముగనే (జలభిన్నము లనియే) చెప్పుట యుక్తియుక్తము. ఇట్లుండ "ఐదవయాహుతియందు జలము పురుషుఁ డగును" అనుట యెట్లు సిద్ధాంత మగును?

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ద్యులోకాగ్ని యందలి యాహుతినిఁ జెప్పునప్పుడు కూడ శ్రద్ధాశబ్దముచే జలములే చెప్పఁబడి యున్నవి యనవలయును. అట్లు కాకున్న ప్రశ్నోత్తరములు సరిపడకపోవును. ప్రశ్న జలమునుగూర్చియే యున్నది; ఉత్తరమునందును ఉపసంహార మట్లే గానవచ్చుచున్నది. అట్లే యుండవలయు ననుటయు నావశ్యకమే కదా! ఒకదాని నడిగిన మఱియొకదానిని చెప్పుటయెంతైనఁ గలదా? కావున నావశ్యకముగ శ్రద్ధాశబ్దముచే జలములే చెప్పఁబడి యుండవలయును. మఱియు రెండవయాహుతిమొదలుగ నన్ని యాహుతులయందును వర్ణింపఁబడిన పదార్థములు జలమయములే యగుటయు నంతంతకు స్థూలరూపము లగుటయు స్పష్టముగఁ దెలియ వచ్చుచున్నది. దీనిం బట్టి చూచినను మొదటియాహుతియందును అతి సూక్ష్మాకారముతో నున్న జలములే చెప్పఁబడి యుండవలయు నని తోఁచుచున్నది. తృతీయాహుతికి హోమద్రవ్యమగు వర్షమునకు ద్యులో

యాహుతిహోమద్రవ్య మగుచంద్రుఁ డెట్లు కారణమో అట్లే యా చంద్రునకుఁ గూడ ప్రథమాహుతి హోమద్రవ్య మగు శ్రద్ధ కారణము కావలసియున్నది; చంద్రుఁడు జలాత్మకుఁడు కావున ఆతనికి నాజలములే కారణములు కావలయును కాని మనోవృత్తి జీవవృత్తి మొదలగునవి కాఁజాలవు. (శ్రద్ధ మనోవృత్తి యని కొందఱిమతము, జీవవృత్తి యని మఱికొందఱి మతము) ఇది యనుభవసిద్ధ మగువిషయము. ఈకారణము వలనఁ గూడ శ్రద్ధాశబ్దముచే జలమే చెప్పఁబడి యుండవలయును. మఱియు నాశ్రద్ధ మనోవృత్తి యైనను జీవవృత్తియైనను స్వతంత్రముగ జీవాదులనుండి వేఱు చేసి హోమముఁ జేయుటకు సాధ్యమగునదియును కాదు. కావున శ్రద్ధాశబ్దము జలమును చెప్పునదియే. వేదమునందు మఱియొకస్థలమున "శ్రద్ధా వా ఆపః" "శ్రద్ధ యనఁగా జలము" అని ప్రత్యక్షముగనే శ్రద్ధాశబ్దము జలవాచకముగఁ బ్రయోగింపఁబడి యున్నది. మఱియు ఆ జలము ప్రథమాహుతియందు అతిసూక్ష్మములై చిత్తవృత్తివలె నగోచరములై యుండును కావున శ్రద్ధాశబ్దవాచ్యము లగుచున్నవి. సింహమువంటి పరాక్రమము గలపురుషుని "వీఁడు సింహము" అని వ్యవహరించుట లోకమునఁ గలదు కదా! ఇదియునుఁగాక శ్రద్ధాపూర్వకముగ నాచరింపఁదగిన హోమక్రియకు సాధన మగుటచేఁ గూడ నాజలమునకు శ్రద్ధాశబ్దవాచ్యత్వము రావచ్చును. "గ్రామములు వడకుచున్నవి కలవరపడుచున్నవి" అను మొదలగు వ్యవహారములయందు అచేతనము లగు గ్రామములకు కలవరపాటు లేదు గావున సంబంధముచే నాగ్రామములయందుఁ గల మనుష్యులనే గ్రామశబ్దముచే చెప్పుచున్నట్లు ఇచ్చటను కేవలశ్రద్ధ హోమసాధనము కాకపోయినను తత్సంబంధముచే హోమసాధన మగుజలమునే యాశబ్దముతోఁ జెప్పియున్నారు. ఇది యంతయు కాకున్నను "ఆపో హాస్మై శ్రద్ధాం సంనమంతే పుణ్యాయ కర్మణి" "యజమానునకు పవిత్ర మగు కర్మను ముగించుటకై జలమే శ్రద్ధ నొసంగును" అని జలమువలననే శ్రద్ధయుత్పత్తి యగు నని చెప్పఁబడి యున్నది. ఈ కారణమువలనఁ గూడ జలమునందు శ్రద్ధాశబ్దము ప్రయోగింపఁబడవచ్చును. కావున నిర్వివాదముగ నీప్రశ్నోత్తరములు జలాదివిషయకములే.

## అ-౩. పా-౧. సూ-౬.

అవ. "ఇప్పటికిని 'జీవుఁడు జలాదులతోఁ గూడియే' అను విషయము స్థిరపడలేదు" అను సంశయము నాకై స్థాన ములచే నిరాకరించుచున్నాఁడు.

## ౨౬౭. అశ్రుతత్వాదితి చేన్నేష్టాదికారిణాం ప్రతీతేః. ౩. ౧. ౬.

తాత్పర్యము. పూర్వపక్షము:—ఇప్పటికిని "జీవునకు భూతసంబంధము కలదు" అను విషయము స్థిరపడలేదు. ప్రశ్నోత్తరములను విమర్శించిన జలముమాత్ర మైదవయాహుతియందు పురుషుఁడగు ననుట సిద్ధాంత మగును కాని యాజలములతోఁ గూడ జీవుఁడును ఐదాహుతుల యందు ననువర్తించు ననువిషయము సిద్ధాంతము కానేరదు. కావున శ్రుతియందు ప్రత్యక్షముగ లేకపోవుటచే జలాదిసహితజీవనిర్గమనము సిద్ధాంతము కానేరదు.

సిద్ధాంతము:—యజ్ఞాదుల నొనర్చినవారినిఁ గూర్చి చెప్పునప్పుడు శ్రుతియందు "ఆకాశా చంద్రమసం ఏష సోమో రాట్" అని చెప్పఁబడి యున్నది. ఇది ఛాందోగ్యశ్రుతి బృహదారణ్యకోపనిషత్తునందును దీనికి సమాన మగు ప్రకరణమునందే "దేవాః శ్రద్ధాం జుహ్వతి తస్యా ఆహుతే రేష సోమో రాజా సంభవతి" అని చెప్పఁబడి యున్నది. యజ్ఞాదికర్తలనుఁగూర్చి విచారించిన వారికి జలమయము లగు నగ్నిహోత్రసాధనములు (హోమద్రవ్యములు) పెక్కులు గలవు. హోమానంతరమున నవి యన్నియు * అపూర్వరూపముతో సూక్ష్ములై వారి నాశ్రయించియే యుండును. మరణానంతరమున పితృయజ్ఞమునందు

* అపూర్వ మనునది పూర్వమీమాంస శాస్త్రమునందు వర్ణింపఁబడియున్నది ఈలోకమున నాచరింపఁబడిన యజ్ఞాదికర్మలు యెప్పటికప్పుడే నశించిపోవుచున్నవి; కావున నవి మరణానంతరమున గలుగఁబోవు స్వర్గఫలముల గలిగించు ననుట విరుద్ధ మగుటచే నీశంటికిని (కర్మకును ఫలమునకును సంధియందు అపూర్వ మనునది కల్పింపఁబడెను. అది కర్మవలన జనించి ఫలము గలుగువరకు సూక్ష్మరూపముతో పురుషు నాశ్రయించియే యుండును.

యావాహుతిహోమద్రవ్య మగుచంద్రుఁ డెట్లు కారణమో అట్లే యా చంద్రునకుఁ గూడ ప్రథమాహుతి హోమద్రవ్య మగు శ్రద్ధ కారణము కావలసియున్నది; చంద్రుఁడు జలాత్మకుఁడు కావున ఆతనికి నాజలములే కారణములు కావలయును కాని మనోవృత్తి జీవవృత్తి మొదలగునవి కాఁజాలవు. (శ్రద్ధ మనోవృత్తి యని కొందఱిమతము, జీవవృత్తి యని మఱికొందఱి మతము) ఇది యనుభవసిద్ధ మగువిషయము. ఈకారణము వలనఁ గూడ శ్రద్ధాశబ్దముచే జలమే చెప్పఁబడి యుండవలయును. మఱియు నాశ్రద్ధ మనోవృత్తియైనను జీవవృత్తియైనను స్వతంత్రముగ జీవాదులనుండి వేఱు చేసి హోమముఁ జేయుటకు సాధ్యమగునదియును కాదు. కావున శ్రద్ధాశబ్దము జలమును చెప్పునదియే. వేదమునందు మఱియొకస్థలమున "శ్రద్ధా వా ఆపః" "శ్రద్ధ యనఁగా జలము" అని ప్రత్యక్షముగనే శ్రద్ధాశబ్దము జలవాచకముగఁ బ్రయోగింపఁబడి యున్నది. మఱియు ఆ జలము ప్రథమాహుతియందు అతిసూక్ష్మములై చిత్తవృత్తివలె నగోచరములై యుండును కావున శ్రద్ధాశబ్దవాచ్యము లగుచున్నవి. సింహామువంటి పరాక్రమము గలపురుషుని "వీఁడు సింహాము" అని వ్యవహరించుట లోకమునఁ గలదు కదా! ఇదియునుఁగాక శ్రద్ధాపూర్వకముగ నాచరింపఁదగిన హోమక్రియకు సాధన మగుటచేఁ గూడ నాజలమునకు శ్రద్ధాశబ్దవాచ్యత్వము రావచ్చును. "గ్రామములు వడకుచున్నవి కలవరపడుచున్నవి" అను మొదలగు వ్యవహారములయందు అచేతనము లగు గ్రామములకు కలవరపాటు లేదు గావున సంబంధముచే నాగ్రామములయందుఁ గల మనుష్యులనే గ్రామశబ్దముచే చెప్పుచున్నట్లు ఇచ్చటను కేవలశ్రద్ధ హోమసాధనము కాకపోయినను తత్సంబంధముచే హోమసాధన మగుజలమునే యాశబ్దముతోఁ జెప్పియున్నారు. ఇది యంతయు కాకున్నను "ఆపో హాస్మై శ్రద్ధాం సంనమంతే పుణ్యాయ కర్మణి" "యజమానునకు పవిత్ర మగు కర్మను ముగించుటకై జలమే శ్రద్ధ నొసంగును" అని జలమువలననే శ్రద్ధయుత్పత్తి యగు నని చెప్పఁబడి యున్నది. ఈ కారణమువలనఁ గూడ జలమునందు శ్రద్ధాశబ్దము ప్రయోగింపఁబడవచ్చును. కావున నిర్వివాదముగ నీప్రశ్నోత్తరములు జలాదివిషయకములే.

## అ_౩. పా_౧. సూ_౬.

అవ. "ఇప్పటికిని 'జీవుఁడు జలాదులతోఁ గూడియే నిర్గమించును' అను విషయము స్థిరపడలేదు" అను సంశయము నాక్షేపసమాధాన ములచే నిరాకరించుచున్నాఁడు.

## ౨౬౭. అశ్రుతత్వా దితి చే న్నేష్టాదికారిణాం ప్రతీతేః. ౩. ౧. ౬.

తాత్పర్యము. పూర్వపక్షము:—ఇప్పటికిని "జీవునకు భూతసంబంధము కలదు" అను విషయము స్థిరపడలేదు. ప్రశ్నోత్తరములను విమర్శించిన జలముమాత్ర మైదవయాహుతియందు పురుషుఁ డగు ననుట సిద్ధాంత మగును కాని యాజలములతోఁ గూడ జీవుఁడును ఐదాహుతుల యందు ననువర్తించు ననువిషయము సిద్ధాంతము కానేరదు. కావున శ్రుతియందు ప్రత్యక్షముగ లేకపోవుటచే జలాదిసహితజీవనిర్గమనము సిద్ధాంతము కానేరదు.

సిద్ధాంతము:—యజ్ఞాదుల నొనర్చినవారినిఁ గూర్చి చెప్పునప్పుడు శ్రుతియందు "ఆకాశా చంద్రమసం ఏష సోమో రాట్" అని చెప్పఁబడి యున్నది. ఇది ఛాందోగ్యశ్రుతి బృహదారణ్యకోపనిషత్తునందును దీనికి సమాన మగు ప్రకరణమునందే "దేవాః శ్రద్ధాం జుహ్వతి తస్యా ఆహుతే రేష సోమో రాజా సంభవతి" అని చెప్పఁబడి యున్నది. యజ్ఞాదికర్తలనుఁగూర్చి విచారించిన వారికి జలమయము లగు నగ్నిహోత్రసాధనములు (హోమద్రవ్యములు) పెక్కులు గలవు. హోమానంతరమున నవి యన్నియు * అపూర్వరూపముతో సూక్ష్ములై వారి నాశ్రయించియే యుండును. మరణానంతరమున పిత్రృయజ్ఞమునందు

* అపూర్వ మనునది పూర్వమీమాంస శాస్త్రమునందు వర్ణింపఁబడియున్నది ఈలోకమున నాచరింపఁబడిన యజ్ఞాదికర్మలు యెప్పటివప్పుడే నశించిపోవుచున్నవి: కావున నవి మరణానంతరమున గలుగఁబోవు స్వర్గఫలముల గలిగించు ననుట విరుద్ధ మగుటచే నీరెంటికిని (కర్మకును ఫలమునకును సంధియందు) అపూర్వ మనునది కల్పింపఁబడెను. అది కర్మవలన జనించి ఫలము గలుగువరకు సూక్ష్మరూపముతో పురుషు నాశ్రయించియే యుండును.

"అసౌ స్వర్గాయ లోకాయ స్వాహా" "ఈజీవుఁడు స్వర్గలోకమునకుఁ బోవలయును" అని ఋత్విక్కులు హోమము నాచరింతురు. అప్పుడు కాలానుసారముగ నాజలాదిహోమద్రవ్యములు ఆజీవుల బరివేష్టించియే స్వర్గమునకుఁ గొనిపోవును. ఇదియే ద్యులోకమునందు గలుగు నని చెప్పఁబడినయాహుతి. ఈవిషయమే మఱియొకస్థలమునఁగూడ వర్ణింపఁ బడెను. దీనిని పట్టిచూచిన అగ్నిహోత్రములయందు సాయంప్రాతఃకాల దర్శపూర్ణమాసాదులలో నగ్నియందు దావాహుతి గావింపఁబడి యపూర్వ రూపము నొందియున్న జలాదులతోఁ గూడియే జీవుఁడు పరలోకగమనము నాచరించు నని తెలుచున్నది. కావున నెట్లును మాసిద్ధాంతమునకు భంగము లేదు.

N. B. ఈసూత్రమునందు వ్యాఖ్యానము చేయఁబడియున్నయాక్షేపసమాధానములు ప్రస్తావానుసారముగ రెండవసూత్రమునందే వివరింపఁబడెను. దానినిఁగూడ నిచ్చట ననుసంధానము చేయుఁనది.

## అ_౩. పా_౧. సూ_౭.

అవ. "ఇది యేమి? యజ్ఞాదికర్మల నాచరించినవారికి సుఖానుభోగ మెక్కడిది? 'ఏష సోమో రాజా త ద్దేవానా మన్నం తం దేవా భక్షయంతి' 'ఈచంద్రుఁడు దేవతలకన్నము. వానిని దేవతలు భక్షింతురు' అని ఛాందోగ్యోపనిషత్తునందును 'తే చంద్రం ప్రాప్యాన్నం భవంతి తాం స్తత్ర దేవా యథా సోమం రాజాన మాప్యాయ స్వాపక్షీయ స్వే త్యేవ మేనాం స్తత్ర భక్షయంతి' యజ్ఞాదికర్తలు చంద్రలోకమునకుఁ జని దేవతలకు నన్న మగుదురు. అచ్చట నాదేవతలు 'మాకు నాహ్లాదమును కలిగింపుము క్షీణించి పొమ్ము' అనుచుఁ జంద్రుని భక్షించినట్లు వారిని భక్షింతురు" అని బృహదారణ్యకోపనిషత్తునందును చెప్పఁబడియున్నది. ఇట్లుండ వారికి సుఖ మెక్కడిది? "పులిబోనులో చిక్కినవానికి సుఖము కలదా" అనిన సమాధానమును చెప్పుచున్నాఁడు.

## ౨౯౯. భాక్తం వానాత్మవిత్త్వాత్తథా హి దర్శయతి. ౩. ౧. ౭.

తాత్పర్యము. ఇట్లు సంశయింపఁ బనిలేదు. యజ్ఞాదికర్తల నన్న

ముగఁ జెప్పుట యౌపచారికము కావలయునుగాని ముఖ్యమగుటకు వీలు లేదు. "అది ముఖ్యమే" యని పట్టు పట్టిన "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" "జ్యోతిష్టోమయాగము చేసిన స్వర్గప్రాప్తి కలుగును. కావున స్వర్గార్థి యగువాఁడు దాని నాచరింపవలయును" అను మొదలగు విధి వాక్యములు నిరర్థకము లగును. స్వర్గమునకుఁ జేరఁగానే యజ్ఞాదికర్తల దేవతలు భక్ష్యభోజ్యాదులవలె నమలి మ్రింగుదురేని దానికై బహు ప్రయాససాధ్యము లగుయజ్ఞాదుల పురుషుఁ డేల యాచరించును? అప్పుడు స్వర్గమునకంటె భూలోకమే సుఖదాయక మగును కదా! కావున నిర్వివాదముగ నచ్చటి యన్నశబ్దము ఔపచారికమైనదియే కావలయును. లోకమునందును కేవల మాహారపదార్థములయందే కాక యేవిధముగానైనను అనుభవింపఁబడు పదార్థములయం దెల్ల నన్నశబ్దము ప్రయోగింపఁబడుచునే యున్నది. ఈకారణమువలన పురుషునకు భార్యాపుత్రభృత్యాదులవలె నీయజ్ఞాదికర్తలు *స్వతస్సిద్ధు లగు దేవతలకు ననుభవసాధనము లగుదు రనియు, ఆస్వతస్సిద్ధదేవతలు వీరివలన భోగముల ననుభవించుట యేది కలదో అదియే శ్రుతియందు భక్షణశబ్దముచే నౌపచారికముగఁ జెప్పఁబడె ననియు నిర్ణయింపవలసియున్నది. రాజసేవకులకుఁ గూడ సామాన్యజనులకంటె నధికభోగము కలుగునట్లు ఈయజ్ఞాదికర్తలకును భూలోకవాసులకంటె నధికభోగము కలుగవచ్చును. కావున అన్నశబ్దంబును భక్షణశబ్దంబునుకూడ నౌపచారికములే; ఇది యంతయు గాక "స హ వై దేవా అశ్నంతి న పిబం త్యేత దేవామృతం దృష్ట్వా తృప్యంతి" "దేవతలు అమృతమును చూచిమాత్రమే తృప్తి నొందుదురు

---

* స్వతస్సిద్ధులు:—దేవతలు స్వతస్సిద్ధులనియు కర్మదేవతలనియు రెండు తెగలుగ నున్నారు. స్వతస్సిద్ధు లనఁగా పూర్వకల్పాంతమునఁ జేయఁబడిన పుణ్యకర్మప్రభావము వలన నీకల్పమునందు దేవతలుగానే జనించినవారు. కర్మదేవత లనఁగా మనుష్యలోకమున జన్మించి సుకృతకర్మల నాచరించి యాకర్మలప్రభావమువలన భోగార్థమై దేవదేహములుదాల్చి దేవలోకమునకుఁ బోయినవారు. స్థూలదేహములేకున్న నెచ్చటనైనను సుఖదుఃఖానుభవము లేదు కావున నీమనుష్యరూపమున సుఖదుఃఖానుభవములకు నీలోకమునకుఁ దగిన స్థూలశరీర మెట్లు కలదో అట్లే యితరలోకములయందును ఆయాలోకములకు దగినస్థూలశరీరములు కలవని తెలిసికొనవలయును.

కాని భక్ష్యభోజ్యాదులవలె నమలి మ్రింగరు. జలాదులనువలెఁ బానముఁ జేయరు" అని దేవతలకు భక్షణమే లేదని నిషేధింపఁ బడియున్నది. ఇట్లగుటచే దేవతలనుఁ గూర్చి చెప్పఁబడియున్న భక్షణము ఔపచారికమే? ఈకారణమువలన యజ్ఞాదికర్తలకుఁ జెప్పఁబడియున్న యన్నభావంబును ఔపచారికమే.

ఈవిషయమున నించుకంతయును సంశయము నొంద నక్కఱ లేదు. ఆయజ్ఞాదికర్తలు ఆత్మవేత్తలు కాకపోవుటచే భేదాభిమానము కలవార లగుటచే దేవతలకు ననుభవయోగ్యు లగుదురు. "అథ యోఽన్యాం దేవతా ముపాస్తేఽన్యోఽసావన్యోఽహ మస్మీతి న స వేద యథా పశు రేవం స దేవానాం" "ఏపురుషుఁడు తాను వేఱు విష్ణురుద్రాది దేవతలు వేరు అను నభిప్రాయముతో ఉపాసన నాచరించునో అట్టివాఁడు మూఢుఁడు. మనుష్యులకుఁ బశువులు మొదలగునవి యెట్లను భవసాధనములై యున్నవో అట్లే యాయుపాసకుఁడును దేవతలకు ననుభవసాధన మగును" అని శ్రుతి ఈవిషయమును స్పష్టముగఁ జెప్పుచున్నది. బ్రతికియున్నప్పుడు దేవతలకుఁ బ్రీతికరము లనునేక కార్యముల నాచరించి వారిని తృప్తినొందింపఁ బ్రయత్నించుటను ప్రత్యక్షముగనే చూచుచున్నాము. పరలోకమునందును ఇట్లే వీరు (యజ్ఞాదికర్తలు) దేవతలకు సేవకులై వారొసంగినఫలముల ననుభవించుచు వారికి నుపకారముఁ జేయుచుందు రనియే తోఁచుచున్నది. కావున "యోఽన్యాం" అను మొదలగుశ్రుతి నాశ్రయించి చూచిన నీయజ్ఞాదికర్తలు దేవసేవకులై వారికి నుపకారము సేయుచు నుందురనియు నిదియే యన్నభక్షణశబ్దప్రయోగములకు నభిప్రాయ మనియు నాత్మజ్ఞానము లేకుండుటయే దీనికిఁ గారణ మనియు సిద్ధమైనది.

మఱియొకవిధముగాఁ జూచిన నిట్లే యగును. ప్రస్తుతశ్రుతులు పంచాగ్నివిద్యలోనివి. *సందర్భమునుబట్టి ఆపంచాగ్నివిద్య నుఆత్మవిద్య

---

* సందర్భము=ప్రకరణము (చూడు. ౯ 3) ఈఛాందోగ్యోపనిషత్తున మొదటి నుండియు సగుణబ్రహ్మవిద్యలు క్రమముక్తియుఁ జెప్పఁబడుచు వచ్చెను; వారిగతియుఁ వర్ణింపఁబడెను; వారికి వైరాగ్యమును కలిగించుటకై యీపంచాగ్నివిద్యయందు కర్మఠులు పాపాత్ములు నగువారిగతియు విచారింపఁబడును. కావున ముక్త్యర్థ యగుటచే నిదియు బ్రహ్మవిద్యయే.

యనుచున్నారు. దానిని తెలిసినవాఁ డాత్మవేత్త; తెలియనివాఁ డనాత్మవేత్త. ఇట్టియనాత్మవేత్తలు దేవతలచే భక్షింపఁబడుదు రని శ్రుతియందు చెప్పఁబడి యున్నది; కావున నిది (ఈవేదవాక్యము) *అర్థవాదరూపమే కాని ముఖ్యము కాదు. శ్రుతియందు "స సోమలోకే విభూతి మనుభూయ పునరావర్తతే, అథ యే శతం పితౄణాం జితలోకానా మానందాః స ఏకః కర్మదేవానా మానందో యే కర్మణా దేవత్వ మభిసంపద్యంతే" "ఆయజ్ఞాదికర్త చంద్రలోకమునకు జని యచ్చట సౌఖ్యముల ననుభవించి మఱల భూలోకమునకు వచ్చును. చంద్రలోకమును సాధించినపితరులకు కలుగు నానందములు నూఱు అయినచో కర్మదేవతల యానందమునకు సరి యగును. కర్మదేవత లనఁగా కర్మప్రభావమువలన దేవత్వమును బొందినవారు." అని ప్రత్యక్షముగనే యజ్ఞాదికర్తలకు స్వర్గభోగంబును దేవతలకు సేవకులై యుండుటయు నను విషయమును స్పష్టము చేయఁబడియున్నవి. ఈకారణమువలన నిర్వివాదముగ జీవుఁడు సుఖభోగార్థమై జలాదులతోఁ గూడియే పరలోకమునకు నిర్గమించు ననవలయును. ఈవిషయమున సంశయ మింతయు లేదు.

---

## ౨. కృతాత్యయాధికరణము.

విషయము:—ఈ యధికరణమునందు జీవుల పునరాగమనమును గూర్చి విచారింపఁబడును.

సందేహము:—"పరలోకమునుండి భూలోకమునకు వచ్చు జీవులకు కర్మతో సంబంధము కలదా ? లేదా ?" అను సంశయము నివారింపఁబడును.

సంగతి:—"పై యధికరణమున 'ఐదవయాహుతియందు జలములు పురుషరూపము నొందును' అనుశ్రుతి నాధారముఁ జేసికొని 'నిర్గమన కాలమునందుఁ గూడ నాతనికి జలాదిభూతములతో సంబంధ ముండవలయును' అని నిర్ణయింపఁబడెను. కాని యది యుక్తము కాదు.

---

* అర్థవాదము (అ-౧. పా-౧. సూ-౪. పే-౪౬. చూ).

'యావ *త్సంపాత ముషిత్వా' 'కర్మయుండునంతవరకు పరలోకమునుండి' అను మొదలగు శ్రుతివాక్యములచే 'స్వర్గమునుండి దిగి వచ్చునప్పుడు కర్మ లేదు' అని చెప్పఁబడి యున్నది. ఈకారణమువలన నాతనికి జలాది భూతసంబంధము కూడ లేదు. ఆజలాదులు కర్మకు సంబంధించినవియే కదా కావునఁ బూర్వాధికరణసిద్ధాంతము నిలువదు" అను నాక్షేపమునకు సమాధానముగ నాక్షేపసంగతితో నీయధికరణ మారంభింపఁబడెను

పూర్వపక్షము:—స్వర్గలోకమునుండి భూలోకమునకు వచ్చువారికి కర్మయెట్లు ఉన్నది యనుటకు వీలు లేదు. 'యావత్సంపాత ముషిత్వా, తేషాం యదా తత్పర్యవైతి' (తేషాం అను శ్రుతికి అర్థము.) అట్లు చంద్రలోకమునకుఁ బోయినవారలకు పుణ్యకర్మ ఎప్పుడు నశించునో అప్పుడు పునర్జన్మము కలుగును' అని శ్రుతియందు స్పష్టముగ జెప్పఁబడి యున్నది. కర్మను సంపూర్ణముగ ననుభవించినపిదపఁ గాని ఆజీవులు చంద్రలోకమునుండి కదలరు. "ఇట్లు కాదు. 'ఎంతవరకు స్వర్గలోకమున ననుభవింపవలయునో యంతవరకు మాత్రమే సంపూర్ణముగ ననుభవింతురు' అని యాశ్రుతివాక్యములకు నభిప్రాయమును కల్పింపవచ్చును" అనియెదవేమొ అదియు యుక్తము కాదు. 'ప్రాప్యాంతం కర్మణ స్తస్య యత్కించేహ కరో త్యయం తస్మా ల్లోకా త్పున రైత్యస్మై లోకాయ కర్మణే' 'పురుషుఁడు ఈజన్మమున నేయేకర్మల నాచరించెనో వాని నంతయును పరలోకమున ననుభవించిన పిదప మఱల కర్మ నాచరించుటకై భూలోకమునకు వచ్చును' అని శ్రుతియందు స్పష్టముగఁ జెప్పఁబడి యుండ నట్టికల్పనకు నవకాశ మెందుండి వచ్చును ?

మఱియు యుక్తి నాశ్రయించి చూచినను ఇట్లే తేలుచున్నది. కర్మలు శరీరత్యాగానంతరమున పరలోకగమనము కలిగినప్పుడు కాని ఫలోన్ముఖములు కావు. ఒకశరీరమున నున్నప్పుడు ఆశరీరమును నిర్మించిన ప్రారబ్ధకర్మలు ఫలము నిచ్చుచుండుటచే తక్కినవి యిచ్చుటకు వీలుండదు. ఇప్పుడు చూడుఁడు. పరలోకమునకు పోయినప్పుడు ఏయేకర్మలు ఫలోన్ముఖములు కాక యున్నవో అవి యన్నియు ఫలము నొసంగితీర

---

* సంపాత మనఁగా నిచ్చట కర్మ యని యర్థము. ఆపదమునకు పడుట యనునది రూఢార్థము. "జీవులు ఈకర్మచే ఫలభోగార్థమై భూలోకమునుండి లోకాంతరమునఁ బడుదురు." అనుటచే గర్మకీపేరు కలిగెను.

వలయు ననుటలో సంశయ మేమి? కారణము సమానమైయుండ కార్యములకు మాత్రము భేదము కలుగు ననుట యెట్లు? పరలోకగమనము జరిగినపిదప కర్మలుమాత్రము కొన్ని ఫలాభిముఖము లగుచు మరికొన్ని కా వనుట యేటియుక్తి? దీప ముండిన దానిసమీపమున నున్నపదార్థములలోఁ గొన్నిమాత్రమే ప్రకాశించు ననియు మఱికొన్ని ప్రకాశించు ననియుఁ జెప్పుటకు వీలు కలదా! కావున దీప ముండిన దీపము నొద్ద నున్నపదార్థము లన్నియు సమానముగనే ప్రకాశించునట్లు పరలోకగమనము కలుగఁగానే సర్వకర్మలును ఫలము నొసంగు ననవలయు. ఇట్లు విమర్శించిన యుక్తివలనను శ్రుతివలనను 'చంద్రలోకమునుండి దిగునప్పుడు జీవులకు కర్మశేషమే లేదు' అను విషయము సిద్ధాంతమగుచున్నది.

'ఇప్పటికిని విరోధము లేదు. కర్మ లేకున్న పునర్జన్మమే యుండదు; కావునఁ దదర్థమై ఫలమును సంపూర్ణముగ నిచ్చినను (కర్మ) మిగిలియే యుండును' అనిన నదియు యుక్తము కాదు. ఏకర్మయును ఫలము నొసంగినపిదప నుండదు. ఇది లోకానుభవసిద్ధము. ఈకారణమువలన ఫలానుభవము ముగిసినపిదపఁ గర్మయే లేదు.'

## అ-౩. పా-౧. సూ-౮.

అవ. అను నీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

# ౩౦౦. కృతాత్యయేఽనుశయవాన్ దృష్టస్మృతిభ్యాం యథేత మనేవం చ. ౩.౧.౮.

తాత్పర్యము. ఈ సంశయము యుక్త మైనది కాదు. జీవులు స్వర్గాదిభోగముల నొందించుకర్మలు ఫలభోగమువలన క్షీణింపఁగానే యనుశయముతోఁగూడియే మరల భూలోకమునకు వత్తురు. స్వర్గాది లోకముల పొందించుపుణ్యకర్మలు మొట్టమొదట నాయజ్ఞాదికర్త లగు జీవులకు పరలోకవాసయోగ్యములైన జలమయదేహములఁ గల్పించును. వారును ఆదేహములతోఁ జంద్రమండలమున నివసించుచు నందలిదివ్యభోగముల ననుభవింతురు. అట్టియనుభవమువలనఁ గొంతకాలమునకు

నాపుణ్యకర్మ క్షీణించును. ఆదుఃఖమువలన ఆజలమయదేహంబును నశించి పోవును. సూర్యుని వేడిమికి మంచుబిందువులు ఆరిపోవునట్లు అగ్ని హోత్రునియొక్క వేడిమికి నెయ్యి కరిగిపోవునట్లు సుఖభోగనాశము వలనఁ గలుగుశోకాగ్నిచే నాజలమయశరీరము నశించిపోవును. ఇట్లు నశింపఁగా నాజీవు లాలోకమునుండి బయలుదేరి కొంతవఱకు *ధూమాది మార్గమునే యాశ్రయించి కొంతవఱకు నితరమార్గము నాశ్రయించియు భూలోకమునకు వత్తురు. అనుశయముతోఁ గూడియే వత్తురు.

ఈవిషయము శ్రుతులయందును బ్రత్యక్షానుభవమునందును స్మృతులయందునుఁ గూడ విశద మయ్యే యున్నది. "త ద్య ఇహ రమణీయచరణా అభ్యాశో హ య త్తే రమణీయాం యోని మాపద్యే రన్బ్రాహ్మణయోనిం వా క్షత్రియయోనింవా వైశ్యయోనిం వా థ య ఇహ కపూయచరణా అభ్యాశో హ య త్తే కపూయాం యోని మాపద్యేరన్ శ్వయోనిం వా సూకరయోనిం వా చండాలయోనిం వా" "ఏపురుషులు ప్రకృతజన్మమునందు పుణ్యకర్మల నాచరింతురో వా రాకర్మల స్వభావమువలన శ్రేష్ఠ మగుపునర్జన్మము నెత్తుదురు. బ్రాహ్మణుఁడుగాఁగాని క్షత్రియుఁడు గా గాని వైశ్యుఁడు గాఁ గాని జనింతురు. ఎవ్వరు దుష్కర్మల నాచరింతురో వారు దుష్టజన్మముల నెత్తుదురు. కుక్కగాఁగాని వరాహముగాఁ గాని చండాలుఁడుగా గాని జన్మింతురు" అను మొదలగు వాక్యములచే శ్రుతి యీవిషయమును బోధించుచున్నది; "ఇహలోకమునందు బ్రాహ్మణాదిజన్మములు వచ్చుటకు గారణమై కర్మశేషము కలదు" అను విషయము స్పష్టము చేయుచున్నది. లోకానుభవము ననుసరించి చూచినను ఇట్లే కానవచ్చుచున్నది. లోకమునఁ బ్రతిప్రాణియుఁ బుట్టినది మొదలు హీనాధికభావములతో (నొకరికంటె నొకరు తక్కువగను యెక్కువగను) సుఖదుఃఖముల ననుభవించుచుండు ననువిషయమును ప్రత్యక్షముగాఁ జూచుచున్నాము. ఇట్టిభేదములకు నవశ్యముగ నేదియో యొకకారణ ముండవలయును. అదియే యనుశయము కావచ్చును కదా! మఱియు స్మృతియందును "వర్ణా ఆశ్రమా శ్చ స్వకర్మ నిష్ఠాః ప్రేత్య కర్మఫల మనుభూయ తతః శేషేణవిశిష్టదేశజాతికులరూపాయుః శ్రుతవృత్తవిత్తసుఖమేధసో జన్మ ప్రతిపద్యంతే" "వర్ణాశ్రమధర్మముల బాగుగ

* ధూమాదిమార్గము (అ-౩. పా-౧. పే-౧౦. చూ).

జరిపినవారు చంద్రలోకమున సకలసుఖముల ననుభవించి తరువాత కర్మ శేషముతో భూలోకమునకు వత్తురు; మంచిస్థలమునందు శ్రేష్ఠమగు జాతిలో నుత్తమ మగుకులముతో చక్కనిస్వభావంబును విద్యయుఁగలిగి ధనవంతులై సుఖవంతులై రూపవంతులై బుద్ధిమంతులై జన్మింతురు. బహుకాలము దీర్ఘాయుష్మంతులై జీవింతురు." అని "జీవునకు అను శయము కలదు" అనువిషయమును స్పష్టము చేయుచున్నది. కావున నెట్లును జీవులకు ననుశయముండియే తీరవలయును.

ఇఁక ననుశయస్వరూపమును వివరించెద నాకర్ణింపుము. ఆవిషయ మునఁ గొంద ఱిట్లు చెప్పుదురు.

ఏకర్మలు స్వర్గఫలము నొసంగెనో ఆకర్మలలోనే కొంత ఫలము నొసంగకుండ శేషించియుండును; కుండలో పోయఁబడియున్న తైలము వంచివేయఁబడునప్పుడు సంపూర్ణముగఁ బోవక కొంత శేషించియేయుండు నట్లు స్వర్గభవము నొసంగు కర్మలును సంపూర్ణముగ ఫలముల నొసంగక కొన్ని మిగిలియేయుండును. ఇదియే యనుశయ మనఁబడును; ఇదియే యితరజన్మములకు కారణ మగును. "ఇట్లు కాదు జీవుఁడు తన (పుణ్య) కర్మఫలము నంతయు ననుభవింపవలయు ననియే కదా చంద్రమండలము నకుఁ బోయెను" అనియెద వేమొ వినుము. అది నిశ్చయమే కాని కర్మలు పొత్తుగ క్షీణించువఱకు నాలోకమున జీవుఁ డుండనేరఁడు. కొంత శేష ముండఁగనే యాలోకమునుండి మఱలి రావలయును. రాజసేవార్థమై సర్వ సాధనములఁ గైకొని చనిన పురుషుఁడు అవియన్నియు క్షీణించిపోవునంత వఱకు నచ్చట నుండఁగలుగునా? పాదుకలు ఛత్రము అత్యల్ప మగు ధనము ఆహారపదార్థములు మొదలగునవి యింకను శేషించియే యున్నను వానిని మార్గవ్యయములకై యేర్పఱచుకొని స్వగృహమునకు మఱలి రావలసినదికదా! ఇట్లే జీవుఁడును మూఁడుభాగముల కధికముగఁ గర్మఫల మును స్వర్గమున ననుభవించి కొంత కొంత యుండఁగనే మరలి రావల యును. కావున స్వర్గఫలము నొసంగిన కర్మలలోని యవశిష్టభాగమే యనుశయము.

ఈపక్షము యుక్తము కాదు. స్వర్గఫలము కలుగుటకై చేయఁ బడిన కర్మయే పునర్జన్మమును కలిగించుటకై మిగిలియుండు ననుట యెట్లును సంభవింపదు. అది స్వర్గమును కలిగించుట కయ్యే కదా చేయఁ

బడెను; అట్టిది స్వర్గమును కలిగింపక నితరమును కలిగించు ననుట యెట్లు? "స్వర్గ మనఁగా నత్యంతానందము. లేక స్వర్గమునం దనుభవింపఁ పడుఫల మత్యంతానందము. అట్టియానందమును స్వర్గలోకమున నున్నను లేకున్నను కూడ ననుభవించుటకు వీలు కలదు. ఇట్లుండ స్వర్గఫలము నొసంగవలసినకర్మ యైనను జీవుని భూలోకమునకుఁ దేవ చ్చును; పరమానందము నొసంగవచ్చును" అనియెదవేమొ అప్పుడు దుష్కర్మ యనునదియే యుండఁగూడదు. శ్రుతియందుమాత్రము "రమ ణీయచరణాః కపూయచరణాః" అని శుభాశుభానుశయముల విభాగించి చూపుచున్నది. ఈశ్రుతికి పైసిద్ధాంతము విరుద్ధ మగును. స్వర్గము నొసంగు కర్మ యెప్పటికిని శుభముగనే యుండును కాని యశుభ ముగ నుండదు కదా! "నరకాదులయం దనుభవింపఁబడిన పాపకర్మయుఁ గొంత యిట్లే శేషించి యుండును; ఈకారణమువలన సుఖదుఃఖాదిఫల ములు కలుగవచ్చును" అనియెదవేమొ అప్పుడు "స్వర్గాది సాధన మగు కర్మకాక, తక్కినదియు పునర్జన్మకారణ మగుచున్నది" యని తేలును. దీని ననుసరించి అపుణ్యకర్మయు స్వర్గాదిసాధన మగుకర్మయుఁ గాదు అని కూడ సంశయింపవలసి యున్నది. స్వర్గాదిసాధన మగునదియే యైనచో నది స్వర్గలోకభోగ్య మగుపరమానందము నొసంగునది యగు టచే దానిఫలమును దుఃఖబహుళ మగుభూలోకమున నెట్లొసఁగఁ గలు గును. అట్టియానందము భూలోకమున, లే దనియే కదా సుఖార్థులు వేదానుసారముగ యజ్ఞాదుల నాచరించుట! ఒకానొకస్థలమున నైనను అట్టిసుఖము కలుగు నేని దానిని పురుషప్రయత్నములోనే సాధింపఁ బ్రయత్నింపవచ్చును కదా! అప్పుడు వేదమునకును యజ్ఞాదులను గూర్చి చెప్పవలసినపని యుండదు. ఈకారణమువలన చంద్రలోకమునుండి దిగి వచ్చువారికిఁ గలసంశయము స్వర్గసాధనకర్మశేషము కా దనియే నిర్ణ యింపవలసి యున్నది. ఇంత యేల? కర్మలును కర్మవిధానములును కర్మ లతో స్వర్గనరకాదులకును పురుషునకును గలసంబంధములును కర్మ ఫలములును మఱియుఁ గర్మను గూర్చిన సకలవిషయమును కేవల వేదము చేత మాత్రమే గ్రహింపఁబడవలసియున్నవి కాని మఱియొకదానిచేఁ గాదు. ఇట్లు కేవల వేదమునే యాధారముగఁ జేసికొని కర్మ నంగీకరించు మనము ఈవిషయమున బ్రజ్ఞ నుపయోగించుటకే మొట్టమొదట నవ

కాశము లేదు. ఏమి యుపయోగించినను వేదార్థనిర్ణయవిషయమున నుప
యోగింపవలసినదియే కాని స్వతంత్రకల్పనావిషయమునఁ గాదు. ఫలముల
నొసంగిన పిదపఁ గర్మలునశించుననుట లోకవేద ప్రసిద్ధమగుటచే స్వర్గఫలము
నిచ్చినపిదప నాకర్మ లుండవనుటయే సిద్ధాంతము. నూనెకుండ మొదలగు
వానియందు జూపఁబడినవిషయములు ప్రత్యక్షసిద్ధములగుటచే నిరాకరణ
యోగ్యములుకావు గాని స్వర్గఫలసాధనశేషమునుగూర్చి చెప్పఁబడిన
విషయము మాత్ర మట్టిది కాదు; అది ప్రత్యక్షముగ లేదు గదా!
కల్పించుటకును శక్యము కాదు. శ్రుతివిరోధ మొకవైపున నుండ నను
భవవిరోధము కూడ నిదివఱకు చూపఁబడెను; సర్వభోగ్యమగునానందము
భూలోకమున నెందును లేదు; కావున సర్వసాధన కర్మశేషము పునర్జన్మ
మును గలిగించు ననుటకు వీలు లేదు" అని చెప్పఁబడెను. కావున నెట్లు
చూచినను స్వర్గసాధనకర్మకును పునర్జన్మసాధన మగుననుశయమునకును
నిర్వివాదముగ భేదము కలదు; ప్రతిజీవుఁడును పరలోకసుఖదుఃఖములను
కలిగించునట్టియు నైహిక సుఖదుఃఖములను కలిగించునట్టియు కర్మల నాచ
రించు ననియు ఒకకర్మఫలము నొసంగునప్పుడు రెండవది యూరకుండు
ననియు మరణానంతరమున నాముష్మికసుఖదుఃఖముల ననుభవించి యాక
ర్మలు క్షీణించినపిదప నైహికఫలముల నొసంగఁ గలకర్మతోఁగూడ నిహ
లోకమునకు వచ్చు ననియు ఆకర్మలే (ఐహికఫలముల నొసంగుకర్మలే)
యైహికదేహమును కల్పించునవి యగుటచే ననుశయ శబ్దవాక్యము
లనియు అవియే జీవునితో నవరోహకాలమునందుఁ గూడియుండు ననియు
సిద్ధాంతము చేయవలయును.

"ప్రాప్యాంతం కర్మణ తస్యయత్కించేహ కరోత్యయం" అను మొద
లగు వాక్యములయందు 'యత్కించ' అని సర్వకర్మలను సామాన్యముగఁ
బరామర్శించుటవలన స్వర్గమునుండిదిగివచ్చువారికి కర్మలేయుండవు, అను
తలంపును పైనిరూపణవలన నిరాధారమయ్యెను. స్వర్గనరకాద్యాముష్మిక
ఫలములనొసఁగుకర్మకును ఇహలోకఫలము నొసంగు ననుశయమునకును
భేదము కలదని స్పష్టముగఁ జూపియున్నాము. మఱియు నీకారణమువల
ననే "పరలోకగమనము (మరణము) కర్మల ఫలోన్ముఖములు కావించును
గావున నప్పుడు కొన్ని కర్మలుమాత్రమే ఫలోన్ముఖములగుననియు కొన్ని
కావనియుఁజెప్పుట యయుక్తము" అనిచేయఁబడిన పూర్వపక్షముకూడ

నిర్మాలమైనవి. ఏ కర్మలు పరలోకమున ఫలము నొసంగవలయునో అవి మాత్రమే మరణముచే నభివ్యక్తము లగును కాని తక్కినవి కావు. "యత్కించ" అనుసర్వకర్మపరామర్శయు నిట్టిదియే. "పురుషుఁడు పరలోకమున ననుభవింపఁ దగినకర్మల వేనివేని నాచరించునో అవియెల్ల ముగిసిన పిదప" అని మాత్రమే యాపరామర్శకు నర్థముఁ జెప్పవలయును. "యావత్సంపాత ముషిత్వా" అను నుపక్రమమునకుఁ గూడ నిట్లే యర్థమును నిర్ణయింపవలయును. "ఇట్లుచెప్పనేటికిమీరు 'రమణీయచరణాః' అనుమొదలగు నుపసంహారము నాశ్రయించి యుపక్రమమును సంకోచించుచున్నారు; మేము ఉపక్రమము నాశ్రయించి యుపసంహారమునకు *యౌగికార్థమును గల్పించుచున్నాము. దోషమున రెండును సమానములే" అనియెదవేమొ వినుము. "రమణీయచరణాః." అను మొదలగు శ్రుతికి రూఢ్యర్థమును చెప్పుటకు వీలు కల దని బహుయుక్తులతో నిరూపించియే యున్నాము; ప్రత్యక్షానుభవమును కూడ దృష్టాంతముగఁ జూపి యున్నాము. ఇట్లు స్థిరపడని ముఖ్యార్థమును పరిత్యజించి గౌణార్థము నంగీకరించుట మీయందే దోషము కాని మాయందు లేదు. "యావత్సంపాతము" అను శ్రుతిని మేము క్రొత్తగా సంకోచించుట లేదు. అది స్వయముగనే సంకోచమును జెందియున్నది. "యావత్సంపాతం" అను పదమునకు "సర్వకర్మలు ముగియునంతవఱకు" అని కదా యర్థముఁజెప్పవలయును! యీయర్థమును చెప్పుటకు వీలు లేదు. సర్వకర్మలని సామాన్యముగఁ జెప్పినచో "సర్వజీవులు నొనర్చినకర్మలు" అని యర్థము కావలసి వచ్చును. అందఱును చంద్రలోకభోగము ననుభవించువరకుఁ బ్రతి జీవుఁడు నచ్చటనే యుండు ననుటనిరుద్ధము కదా కావున సర్వకర్మపదము యొక్క యర్థమును సామాన్యముగనే కొంత సంకోచింపవలయును. "ఒక్కజీవుఁ డాచరించినకర్మ లన్నియు" అని యర్థమును కల్పింపవలయును. ఇంతవరకు మీకును సమ్మతమే దీనిపై మేము బహుప్రమాణసిద్ధమగునుపసంహారమున కనుగుణముగ మఱికొంత సంకోచించి "పరలోకమున ననుభవించుటకై జీవుఁ డాచరించినకర్మలన్నియు" అని యర్థమును చెప్పితిమి; ఇతరశ్రుతులతోను ప్రత్యక్షాదులతోను గలవిరోధమును పరిహరించితిమి. ఇందు దోషమేమి? ఆయర్థమునందు (జీవుఁడు చేసినసర్వ

---

* యౌగికార్థము (అ-౧. పా-౪. సూ-౧. పే-౧౬౮. చూ).

కర్మలును పరలోకమున నశించు ననునర్థము(నందు) దోషము కల దనుట యిదివరకే నిరూపింపఁబడెను కదా. "సర్వకర్మలును నశించినఁ బునర్జన్మమునకే కారణముండదు" అనువిషయము నిర్ణయింపఁబడెను కదా. కావున పూర్వపక్షమునఁ జూపఁబడియున్న యుక్తులన్నియు నిర్మూలములే.

మఱియు "మరణకాలమున గర్మంబు ఫలోన్ముఖము లగుటకు గారణ మేమి? మరణకాలమున కాశక్తి యెక్కడిది?" అను విషయమును గూర్చి కొంత విచారింపవలసియున్నది. ఇహలోకమునఁ బ్రస్తుత జన్మమునందు ఫలము నొసంగుచున్నకర్మలు తక్కినవానిని నిరోధించుటచే నవి (తక్కినవి) తమతమఫలంబుల నొసంగ లేకున్నవనియు; మరణ సమయమునకు నీప్రారబ్ధకర్మఫలము ముగియుటచే ప్రారబ్ధనిరోధము పోవును కావున తక్కినకర్మలన్నియు ఫలోన్ముఖము లగు ననియు నిదియే మరణకాలమునకుఁ గల దని చెప్పఁబడినసామర్థ్య మనియు సిద్ధాంతముఁ జేయఁబూనినచో నది మామతమునకే యనుకూల మగును. అప్పుడు ఈ సామర్థ్యమును మరణకాలమునకుఁ గల్పింపవలసిన పని లేదు. "బలవంత మగుకర్మ బలహీన మగుదానిని తిరస్కరించు ననినఁ జాలును. లోకమునందును సుఖదుఃఖములు ఒకటిపోయినవెనుక మఱియొకటిగ వచ్చుచున్నవి కాని యన్నియు నొక్కమాఱె వచ్చుట లేదు కదా! ఇట్లే మరణకాలమునందును విరుద్ధఫలము లగుకర్మ లన్నియు నొక్కమాఱె ఫలోన్ముఖములు కాఁజాల వనియు బలవంతమగు నేదియో యొక కర్మసమూహము (స్వర్గాదులయందు ఫలముల నొసంగఁ గల కర్మసమూహము) మాత్రమే యభివ్యక్త మగు ననియు స్పష్టముగఁ జెప్పవచ్చును. ఇట్లు కా దనిన విరుద్ధము లగు రెండుకర్మ లొక్కమా ఱొక్కజన్మమునందే ఫలము నొసంగఁ గలుగుట యెట్లు? సూకరజన్మము నెత్తించి యందలిదుఃఖముల ననుభవింపఁజేయవలసినకర్మ చంద్రలోకమున నెట్లు ఫలము నొసంగును? "ఫలము నొసంగ కున్నను అభివ్యక్తిమాత్రము చెందును" అనియెద వేమొ. అభివ్యక్తి యనఁగా ఫలోన్ముఖత్వమే కావున నభివ్యక్తి నొందినకర్మ ఫలము నొసఁగకుండుటకు వీలులేదు. ప్రతికర్మకును ప్రత్యేకఫలములు నిర్ణయింపఁబడియున్నవి; కావున నొకదానితో నొకటి కలసి మిశ్రఫలముల నిచ్చు ననుటకును వీలు లేదు. మరణకాలమున కొన్నికర్మలుమాత్రమే అభివ్యక్తములై తక్కినవి నశించిపోవు ననుట

కును వీలులేదు. అప్పుడు 'ప్రతికర్మకును అవశ్యముగ ఫలము కలదు' అను సిద్ధాంతమునకు విరోధము వచ్చును. ఈసిద్ధాంతము లోకవేదసిద్ధమైనది. కావున నెట్లును బలవంత మగుదానిచే బలహీన మగుకర్మ నిరోధింపఁ బడుచుండు ననుటయే సిద్ధాంతము. స్మృతియందును "కదాచి త్సుకృతం కర్మ కూటస్థ మిహ తిష్ఠతి, మజ్జమానస్య సంసారే యావ ద్దుఃఖా ద్విముచ్యతే" "పురుషుఁడు సంసారమున మునిఁగి పురాకృతపాపమువలన దుఃఖముల ననుభవించునప్పుడు అదివఱకు చేయఁబడినపుణ్యకర్మ యెంతకాలమైనను ఫలోన్ముఖము కాక ఊరక యుండును" అని పైవిషయముచే నిర్ణయింపఁబడి యున్నది.

ఇదియునుఁగాక మరణానంతరమున సర్వకర్మలును ఫలోన్ముఖములగు నేని యప్పుడు రెండవజన్మమే సంభవింపదు. స్వర్గమునందు గాని నరకమునందు గాని నివసించుజీవులకు కర్మాధికారము లేదు; వెనుకటికర్మయు సంపూర్ణముగ నశించును. ఇట్లుండ వారలకు ధర్మాధర్మము లెటనుండి కలుగును. తత్ఫలముల ననుభవించుట యెచ్చటనుండి వచ్చును? జ్ఞానము లేకపోవుటచే వారికి ముక్తి కలుగు ననుటకును వీలు లేదు. ఆహా యెట్టి కష్టదశ సంప్రాప్త మయ్యెను ? సంసారంబును లేదు ముక్తియును లేదు కదా! ఈకారణమువలన "మరణకాలము సర్వకర్మల నభివ్యక్తములఁ గావించును అని కల్పించుట యుక్తిశూన్యము. శాస్త్రమునందు బ్రహ్మహత్యాదు లగుకొన్నికర్మలు అనేకజన్మములవఱకుఁ దమదుఃఖఫలము నిచ్చుచునే యుండు నని చెప్పఁబడి యున్నది. పైనఁ జూపినవిధముగఁ బునర్జన్మమే లేకపోయినచో దీనికి విరోధము వచ్చును. "ఒకకర్మకు ననేక ఫలము లుండుట విరుద్ధము" అనియెదవేమొ. కర్మలయొక్క స్వరూపస్వభావాదుల నెఱుంగుటకు వేద మొక్కటియే తప్ప మఱియొక సాధనము లేదు. కావున సర్వమును వేదానుసారముగ నంగీకరింపవలయునే కాని యీవిషయమున స్వప్రజ్ఞ నుపయోగించుటకు వీలు లేదు కావున "మరణకాలము సర్వకర్మల నభివ్యక్తములఁజేయును" అనుకల్పన యుక్తియుక్తముకాదు. మఱియు సర్వకర్మల నభివ్యక్తములఁజేయు ననిన కృషిఫలోన్ముఖ మగుటకుఁ గూడ మరణకాలమే కారణముకావలసివచ్చును. ఇది సంభవింపదుగదా! కావున నెట్లును ఈకల్పనము నిలువదు. కర్మలు రెండు విధము లనఁగ కొన్ని యిహలోకమునందును మరికొన్ని పరలోకము

నందును ఫలము నొసంగు ననుటయు ప్రతికర్మయు తనఫలము టకు ననుకూల మగు దేహమును కల్పించు ననుటయు మాత్రమే స్వీకృతము.

దీపదృష్టాంతంబును దీనిని సాధించునది కాదు. కర్మలయందు కొన్ని బలవంతములును మరికొన్ని బలహీనములును కలవు. పదార్థముల యం దట్లు లేవుకదా! మఱియు పదార్థములయందును సన్ననివి బలహీనము లనియు స్థూలములైనవి బలవంతము లనియు భావింపనుగూడ వచ్చును. దీపము కూడ స్థూలపదార్థములఁ బ్రకాశింపఁ జేసినంతస్పష్టముగ సూక్ష్మములఁ బ్రకాశింపఁ జేయనేర దనుట యనుభవసిద్ధము. ఇట్లే మరణకాలము కూడ బలవంతమగుకర్మను అభివ్యక్తముఁ జేసి బలహీన మగుదాని నట్లు చేయ దనుటయే సిద్ధాంత మగును. ఆహా! మీరు చూపిన దృష్టాంతము కూడ మీకే విరుద్ధ మయ్యెను. కావున నెట్లు చూచినను మరణకాలము కర్మల నభివ్యక్తములఁ జేయనేరదు. "యావత్సంపాతం యత్కించ" అను మొదలగు పరామర్శలును సర్వకర్మవిషయములు కావు. జీవుఁడు ఆముష్మికఫలముల నొసంగుకర్మలు పరలోకమున క్షీణింపఁగానే యైహికఫలముల నొసంగు కర్మలతోఁ గూడియే భూలోకమునకు వచ్చును. ఆకర్మలే (ఐహికఫలముల నిచ్చుకర్మలే) యనుశయము.

## అ-౩. పా-౧. సూ-౯.

అవతారిక:—"ఈసిద్ధాంతము యుక్తమైనది కాదు, అనుశయము కలదు; అని నిరూపించుటకు 'రమణీయచరణాః' అను శ్రుతి నుదాహరించి యున్నారు. ఆశ్రుతియందు అనుశయప్రస్తావమే లేదు. చరణశబ్దమునకు నాచారము సచ్చరిత్ర సత్స్వభావము అనునవియే యర్థములు కాని అనుశయము కాదు. శ్రుతియందును మఱియొకస్థలమున 'యథాకారీ యథాచారీ' 'యేవిధముగఁ గర్మల నాచరించిన నట్టిస్వభావమును కలిగియున్న' అని చరకర్మలకు పరస్పరభేదము చెప్పఁబడి యున్నది. 'యా న్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని నో ఇతరాణి యా న్యస్మాకగ్ం సుచరితాని తాని త్వ యోపాస్యాని' 'కర్మలలో నుత్తమములగునవి యేవి కలవో వానినే సేవింపవలయును కాని అన్నిటిని కాదు. మా యాచారములలో నెయ్యవి యుత్తమములో వానిని మాత్రమే సీ

కును వీలులేదు. అప్పుడు 'ప్రతికర్మకును అవశ్యముగ ఫలము కలదు' అను సిద్ధాంతమునకు విరోధము వచ్చును. ఈసిద్ధాంతము లోకవేదసిద్ధ మైనది. కావున నెట్లును బలవంత మగుదానిచే బలహీన మగుకర్మ నిరోధింపఁబడుచుండు ననుటయే సిద్ధాంతము. స్మృతియందును "కదాచి త్సుకృతం కర్మ కూటస్థ మిహ తిష్ఠతి, మజ్జమానస్య సంసారే యావ ద్దుఃఖా ద్విము చ్యతే" "పురుషుఁడు సంసారమున మునిఁగి పురాకృతపాపమువలన దుఃఖముల ననుభవించునప్పుడు అదివఱకు చేయఁబడినపుణ్యకర్మ యెంతకాలమైనను ఫలోన్ముఖము కాక ఊరక యుండును" అని పైవిషయముచే నిర్ణయింపఁబడి యున్నది.

ఇదియునుఁగాక మరణానంతరమున సర్వకర్మలును ఫలోన్ముఖములగు నేని యప్పుడు రెండవజన్మమే సంభవింపదు. స్వర్గమునందు గాని నరకమునందు గాని నివసించుజీవులకు కర్మాధికారము లేదు; వెనుకటికర్మయు సంపూర్ణముగ నశించును. ఇట్లుండ వారలకు ధర్మాధర్మము లెటనుండి కలుగును. తత్ఫలముల ననుభవించుట యెచ్చటనుండి వచ్చును? జ్ఞానము లేకపోవుటచే వారికి ముక్తి కలుగు ననుటకును వీలు లేదు. ఆహా యెట్టి కష్టదశ సంప్రాప్త మయ్యెను ? సంసారంబును లేదు ముక్తియును లేదు కదా! ఈకారణమువలన "మరణకాలము సర్వకర్మల నభివ్యక్తములఁ గావించును అని కల్పించుట యుక్తిశూన్యము. శాస్త్రమునందు బ్రహ్మహత్యాదు లగుకొన్నికర్మలు అనేకజన్మములవఱకుఁ దమదుఃఖఫలము నిచ్చుచునే యుండు నని చెప్పఁబడి యున్నది. పైనఁ జూపినవిధముగఁ బునర్జన్మమే లేకపోయినచో దీనికి విరోధము వచ్చును. "ఒకకర్మకు ననేక ఫలము లుండుట విరుద్ధము" అనియెదవేమొ. కర్మలయొక్క స్వరూప స్వభావాదుల నెఱుంగుటకు వేద మొక్కటియే తప్ప మఱియొక సాధనము లేదు. కావున సర్వమును వేదానుసారముగ నంగీకరింపవలయునే కాని యీవిషయమున స్వప్రజ్ఞ నుపయోగించుటకు వీలు లేదు కావున "మరణకాలము సర్వకర్మల నభివ్యక్తములఁజేయును" అనుకల్పన యుక్తి యుక్తముకాదు. మఱియు సర్వకర్మల నభివ్యక్తములఁజేయు ననిన కృషి ఫలోన్ముఖ మగుటకుఁ గూడ మరణకాలమే కారణముకావలసివచ్చును. ఇది సంభవింపదుగదా! కావున నెట్లును ఈకల్పనము నిలువదు. కర్మలు రెండు విధము లనఁగా కొన్ని యిహలోకమునందును మరికొన్ని పరలోకము

నందును ఫలము నొసంగు ననుటయు ప్రతికర్మయు తనఫలము నొసంగుటకు ననుకూల మగు దేహమును కల్పించు ననుటయు మాత్రమే సిద్ధాంతము.

దీపదృష్టాంతంబును దీనిని సాధించునదికాదు. కర్మలయందు కొన్ని బలవంతములును మరికొన్ని బలహీనములును కలవు. పదార్థములయం దట్లు లేవుకదా! మఱియు పదార్థములయందును సన్ననివి బలహీనము లనియు స్థూలములైనవి బలవంతము లనియు భావింపనుగూడ వచ్చును. దీపము కూడ స్థూలపదార్థములఁ బ్రకాశింపఁ జేసినంతస్పష్టముగ సూక్ష్మములఁ బ్రకాశింపఁ జేయనేర దనుట యనుభవసిద్ధము. ఇట్లే మరణకాలము కూడ బలవంతమగుకర్మను అభివ్యక్తముఁ జేసి బలహీనమగుదాని నట్లు చేయ దనుటయే సిద్ధాంత మగును. ఆహా! మీరు చూపిన దృష్టాంతము కూడ మీకే విరుద్ధ మయ్యెను. కావున నెట్లు చూచినను మరణకాలము కర్మల నభివ్యక్తములఁ జేయనేరదు. "యావత్సంపాతం యత్కించ" అను మొదలగు పరామర్శలును సర్వకర్మవిషయములు కావు. జీవుఁడు ఆముష్మికఫలముల నొసంగుకర్మలు పరలోకమున క్షీణింపఁగానే యైహికఫలముల నొసంగు కర్మలతోఁ గూడియే భూలోకమునకు వచ్చును. ఆకర్మలే (ఐహికఫలముల నిచ్చుకర్మలే) యనుశయము.

## అ-౩. పా-౧. సూ-౯.

అవతారిక:—"ఈసిద్ధాంతము యుక్తమైనది కాదు, అనుశయము కలదు; అని నిరూపించుటకు 'రమణీయచరణాః' అనుశ్రుతి నుదాహరించి యున్నారు. ఆశ్రుతియందు అనుశయప్రస్తావమే లేదు. చరణశబ్దమునకు నాచారము సచ్చరిత్ర సత్స్వభావము అనునవియే యర్థములు కాని అనుశయము కాదు. శ్రుతియందును మఱియొకస్థలమున 'యథాకారీ యథాచారీ' 'యేవిధముగఁ గర్మల నాచరించిన నట్టిస్వభావమును కలిగియున్న' అని చరకర్మలకు పరస్పరభేదము చెప్పఁబడి యున్నది. 'యా న్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని నో ఇతరాణి యా న్యస్మాకగ్ం సుచరితాని తాని త్వ యోపాస్యాని' 'కర్మలలో నుత్తమములగునవి యేవి కలవో వానినే సేవింపవలయును కాని అన్నిటిని కాదు, మా యాచారములలో నెయ్యవి యుత్తమములో వానిని మాత్రమే నీ

వవలంబింపుము; అనియుఁ గర్మకును చరణమునకును వేదము కల దని చెప్పఁబడి యున్నది. "అక్రోధ స్సర్వభూతేషు కర్మణా మనసా గిరా, అనుగ్రహశ్చ జ్ఞానంచ శీల మేత త్ప్రకీర్తితం" సర్వభూతములయందును *త్రికరణశుద్ధిగఁ గ్రోధము లేకుండుటయు దయ యుండుటయు చక్కని జ్ఞానంబును శీల మనఁబడును; అని కర్మకంటె భిన్నముగ శీలమునకు లక్షణము స్మృతులయందుఁ జెప్పఁబడి యున్నది. కావున సర్వవిధముల చరణానుశయము లొక్కటి కానేరవు. 'ఇట్లైన రెండవజన్మమే లేకపోవును కదా;' అనియెదవేమొ. చరణమే జన్మకారణము కావచ్చును. మఱియు సర్వకర్మలును బరలోకమునందే యనుభవింపఁబడినను పుత్రులు భార్య మొదలగువారు చేసినకర్మలైనను ఉత్తరజన్మమునకుఁ గారణములు కావచ్చును. 'పత త్యర్ధశరీరేణ యస్య భార్యా సురాం పిబేత్' 'ఎవ్వని భార్య మద్యపానము నాచరించునో వాఁడు అర్ధభాగమునఁ బతితుఁ డగును.' అనుమొదలగుస్మృతులు పరకర్మలవలనఁ గూడ తత్సంబంధు లగు వారికి నిష్టానిష్టఫలములు గలుగు నని చెప్పుచున్నవి. కావున ననుశయము కల దనుటయే మొట్టమొదట సిద్ధింపదు" అనిన కార్ష్ణాజిని యను మహామునిమతము ననుసరించి యుత్తరము చెప్పుచున్నాఁడు.

## 3౦౧. చరణాదితి చేన్నతదుపలక్షణార్థేతి కార్ష్ణాజినిః. 3. ౧. ౯.

తాత్పర్యము. "చరణానుశయశబ్దార్థములకు భేద ముండుటచేఁ జలనశ్రుతి యనుశయమును బోధించునది కాఁ జాలదు" అనుట యుక్తము కాదు. ఆచారము లేకున్న నేకర్మయుఁ బ్రవర్తింపదు. కావున నిచ్చట చరణశబ్దము అనుశయరూపమగు కర్మను బోధించును. ఇది దాని †ఉపలక్షణము. పై సూత్రవ్యాఖ్యానమునఁ జూపబడినయుక్తు లన్నియు నీయర్థమునకు ననుకూలము లగుచున్నవి. "కావున మాసిద్ధాంతమునకు నింతమాత్ర

* త్రికరణము లనఁగా మనస్సు, వాక్కు, పని.

† ఉపలక్షణము అనఁగా నొకదానిని చెప్పిన దానికిసంబంధించిన వాని నన్నిఁటిని తాత్పర్యానుసారముగ గ్రహించుట.

మున భంగము లేదు" అని కార్ష్ణాజిని మహాముని తలంచుచున్నాఁడు. కావున మామతమునకు నెట్లును హాని లేదు.

## అ_౩. పా_౧. సూ_౧౦

అవతారిక:—"సరియే. చరణశబ్దమునకు నాచారము ముఖ్యార్థమై యుండ గౌణార్థము నేల చెప్పవలయును? ఆచారమే జన్మసాధనము కావచ్చు ననియు నిదివఱకే చెప్పియున్నాము" అనిన నీపూర్వపక్షమునకు సమాధానము చెప్పుచు కార్ష్ణాజిని మతము స్థిరము చేయుచున్నాఁడు.

## ౩౦_౨. ఆనర్థక్యమితి చేన్న తదపేక్షత్వాత్.

### ౩. ౧. ౧౦.

తాత్పర్యము. అట్లు గౌణార్థమును చెప్పుటవలన దోషము లేదు "ఆచారహీనం న పునంతి వేదాః" "ఆచారము లేనివానిని వేదసాధ్యములగుకర్మలు పవిత్రునిచేయనేరవు" అను మొదలగు స్మృతుల ననుసరించి చూచిన సర్వకర్మలకును నాచార మత్యంతావశ్యక మని తెలియుచున్నది. ఈకారణమునలన నచ్చట నాచారవాచకశబ్దమే ప్రయోగింపఁబడి యున్నను యుక్త్యాదుల ననుసరించి అనుశయరూప మగు కర్మను గ్రహింపవచ్చును. "ఆచారమునకు ఫల మేదియు లేకపోయిన నది. నిరర్థకమే యగును కదా" అనియెదవేమొ యట్లు కాదు. శ్రుతిస్మృతులయందు స్వతంత్రముగ ఫలము నిచ్చుసామర్థ్యము కర్మకుఁ గలదు కాని యాచారమునకు లే దనుట స్పష్టముగఁ దెలియవచ్చుచున్నది. కావున కల్పన ఫలము నొసంగునప్పుడు ఆచారము దానినే కొంత యభివృద్ధిచేసినఁ జేయును గాని స్వంతముగ క్రొత్తఫల మియ్యదు. మఱియు **బాగుగ** విచారించిన నాచారమునకు పారిశుద్ధ్యమునకంటె భిన్న మగు ఫలము కూడ నుండవలసినపని లేదు. కావున నెట్లును చరణశబ్దముచే ననుశయరూప మగుకర్మయే వర్ణింపఁబడెను. కర్మ జన్మకారణ మనుట నిర్వివాదముగ సిద్ధించుచుండ స్వాతంత్ర్యము లేనియాచారమున కట్టిసామర్థ్యమును కల్పించుట యుక్తియుక్తము కాదు. పాదములతో

నడువఁ గలిగియుండ నెవ్వఁడైన మోకాళ్లతో పరువులిడఁ బ్రయత్నిం
చునా? ఇట్లగుటచేఁ గార్ష్ణాజినిమతము స్థిర మయినది.

## అ-3. పా-౧. సూ-౧౧.

అవతారిక:—ఇట్లు చరణశబ్దమునకు నాచారమనునర్థమునంగీకరించి కార్ష్ణాజినిమతానుసారముగ సిద్ధాంతముఁ జేసి యిపుడు బాదరిమతోపన్యాసవ్యాజమున స్వమతముతో సిద్ధాంతము చేయుచున్నాఁడు.

## 303. సుకృతదుష్కృతే ఏవేతి తు బాదరిః.

### 3. ౧. ౧౧.

తాత్పర్యము. మఱియు బాదరిమతము ననుసరించి చూచిన నీ విషయము మఱింతస్పష్టముగ నున్నది. "చరణశబ్దము ప్రత్యక్షముగఁ గర్మనే చెప్పును" అని యాయన వక్కాణించుచున్నాఁడు. బాగుగ ననుభవము విచారించి చూచిన లోకమున యజ్ఞాదులఁ జేయువానినిఁ గూర్చి "వీఁడు ధర్మము నాచరించుచున్నాఁడు" అని యాచారశబ్దమునుఁ బ్రయోగించుట యనుభవములో నున్నది. ఇట్లే వేదము కూడ ప్రయోగించియుండు ననిన దోష మేమి? "య ఏవ లౌకికాః శబ్దాః త ఏవ వైదికాః (చూ ౧. ౪. ౧.)" అను మొదలగువాక్యములయందు లౌకికవైదికశబ్దముల కభేదము చెప్పఁబడియున్నది. మఱియు నాచారము కూడ ధర్మభేదమే కాని భిన్నము కాదు. భేదమును చెప్పుట *బ్రాహ్మణపరివ్రాజకన్యాయముచేత ననియెఱుంగునది. కావున నెట్లును చరణశబ్దము పుణ్యపాపములనే చెప్పును; అనుశయంబును సిద్ధించెను. ఆయనుశయముతోఁగూడియే జీవులు భూలోకమునకు వత్తురు. సంబంధులు పాప

* బ్రాహ్మణపరివ్రాజకన్యాయ మనఁగా సామాన్యముగ నొకజాతిని గ్రహించియు నేదియో యొకవిశేషము నాశ్రయించి యందలియొకభాగము ప్రత్యేకముగ గ్రహించుట. "వీరు బ్రాహ్మణులు" అని చెప్పిన నాలుగాశ్రమములయందును గల బ్రాహ్మణులందఱును సామాన్యముగ గ్రహింపఁబడినను ఆశ్రమభేదమునుబట్టి 'వీఁడు పరివ్రాజకుఁడు బ్రహ్మచారి గృహస్థుఁడు" అని చెప్పుట. దీనికే గోబలీవర్దన్యాయ మనియు పేరు కలదు.

కర్మల నాచరించినను అధికారి యగువానికి వారిని (సంబంధులను) శిక్షింప నుండుటవలన కలిగినదోష మొకయించుక వానికర్మకుఁదోడ్పడవచ్చును; కాని సంపూర్ణముగ మఱియొకనికర్మ మఱియొకనికి జన్మమును కలిగించు ననుట యేటి యుక్తి. ఒకనికర్మతో మఱియొకనికి సంబంధ మెట్లు కలుగును? కలుగ కున్న వానికి నది ఫలము నెట్లొసంగును. మరణకాలము మొదలగునవి యేవి యైనను వానికి నభివ్యక్తి నెట్లుకలిగించును. ఇట్లు సర్వమును విరుద్ధమే యగుటచే స్మృత్యభిప్రాయము కూడ నట్టిది కాదనవలయును. పుణ్యకర్మల నాచరించినవారికిఁ గూడ నిట్లు శాశ్వత సుఖము లే దనుట స్థిర మగుచుండ స్వర్గసుఖము నభిమానించుటకంటె వెఱ్ఱితన మేది కలదు ?

---

# 3. అనిష్టాదికార్యధికరణము.

విషయము.—ఈయధికరణమున పాపాత్ముల గమనాగమనములు విచారింపఁబడును.

సంగతి:—"పూర్వాధికరణమున 'యావత్సంపాతం యత్కించ' అను శ్రుతులయర్థము సంకోచించి వ్యాఖ్యానమును చేసితిరిగాని యిచ్చట నట్లు చేయుటకు వీలులేదు. 'యే వై కే చాస్మాల్లోకా త్ప్రయంతి చంద్రమసమేవ తే సర్వే గచ్ఛంతి' 'ఈలోకమునుండి యెవ్వరెవ్వరు మరణము నొందుదురో వారందఱును చంద్రలోకమునకుం బోవుదురు' అని సామాన్యముగ నందఱకును చంద్రలోకగమనమును చెప్పుచున్న శ్రుతిని సంకోచించుటకు వీలులేదు. "అని పై యధికరణముపై ప్రత్యుదాహరణసంగతితో వచ్చునాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడుచున్నది.

సందేహము.—యజ్ఞాదికర్తలకు చంద్రలోకప్రాప్తియు సుఖభోగంబును గలుగునని పైయధికరణమున వివరించి యున్నారు. పాపాత్ములస్థితి యెట్లు? వారికిని చంద్రలోకగమన మున్నదా? లేదా? ఒకశ్రుతి. ("యే వై కే" అను కౌసీతకీబ్రాహ్మణశ్రుతి) చెప్పుచున్నది. "జాయస్వమ్రియస్వేత్యేత తృతీయం స్థానం" "పుట్టుము చావుము అనునిదియే పాపా

త్ములు పోవు మూఁడవ మార్గము" అను మొదలగు శ్రుతులు మఱియొక విధముగ జెప్పుచున్నట్టు కనఁబడుచున్నది. ఇం దేది ప్రమాణము ?

## అ-౩. పా-౧. సూ-౧౨.

అవతారిక:—అను నీసంశయంబును నివారించువాఁడై మొట్ట మొదట పూర్వపక్షము ననువాదము చేయుచున్నాఁడు.

## ౩౦౪. అనిష్టాదికారిణామపిచ శ్రుతమ్. ౩. ౧. ౧౨.

తాత్పర్యము:—బాగుగ విచారించి చూచిన యజ్ఞాదికర్తలు మాత్రమే చంద్రలోకమునకు పోవుదు రనుటయు తక్కినవారు పోవరను టయు సిద్ధాంతము కాదు. పాపాత్ములు కూడ చంద్రలోకమునకు పోదు రనువిషయము శ్రుతిన్యాయసిద్ధముగ నున్నది. "ఏ వై కే ఽస్మా ల్లోకా ప్రయంతి చంద్రమస మేవ తే సర్వే గచ్ఛంతి" అని శ్రుతియందు సర్వసాధారణముగ నందఱకును చంద్రలోకగమనము చెప్పఁబడియున్నది. జన్మ మెత్తుటకు ఐదాహుతులు కావలయునని సర్వసాధారణముగఁ జెప్పఁ బడి యున్నది కదా. ఇది చంద్రమండలప్రాప్తి లేకున్న నెట్లు కుదురును ? ద్యులోకాగ్నియందు హోమము చేయఁబడినజలముయొక్క ప్రథమపరి ణామము చంద్రుఁడే కదా. కావున నందఱకును చంద్రలోకప్రాప్తి యుండియే తీరవలయును. *దేవయాన పితృయానములనుగూర్చి మాత్రమే ప్రశ్నో త్తరములు కలవు; గాని మఱియొకదానినిఁగూర్చి లేవు. ఈకారణము వలన "జాయస్వ మ్రియస్వే త్రేత తృతీయం స్థానం" అను శ్రుతివాక్య మునకు మార్గపరముగా నర్థము చెప్పుటకు వీలు లేదు. స్థానశబ్దార్థంబు నట్టిది కాదు కదా. "న కతరేణ" "పాపాత్ములు ఈ దేవయాన పితృయాన ములలో నేమార్గమును అనుసరించువారు కారు" అను శ్రుతి యొక్కటి మూఁడవమార్గమును సూచించునదిగాఁ గానవచ్చినను దానియర్థ మట్లు తేలదు. మొట్టమొదట ప్రవాహణుఁడు శ్వేతకేతుని "ఆచంద్రలోక మెట్లు విశాలముగ నుండునో (అనఁగా: ఇట్లందఱుజీవులు పోయి చేరుచున్నను ఆచంద్రలోక మెట్లు యిఱుకు గాకయుండునో) అది నీకు తెలియునా?" యని ప్రశ్నించెను. "పాపాత్ము లగువారు ఈ దేవయాన పితృయాన

* దేవయాన పితృయానములు. (అ-౩. పే-౨. చూ.)

ములలో నడువరు. శీఘ్రముగ యమలోకమునకుఁజని యచ్చట దుఃఖము ననుభవించి భూమియందు పశుపక్ష్యాదియోనులలో జనింతురు" అని స్వయముగనే సమాధానము చెప్పెను. దీనిని విచారించి చూచిన "పాపాత్ములు చంద్రలోకమునకు పోరు" అని యర్థ మేర్పడదు. "పితృయానమున నడువరు" అనియు నర్థ మేర్పడదు. "పితృయానమున చంద్రలోకమునకు బోయినను అచ్చట నిలువరు. అచ్చట సుఖముల ననుభవింపరు" అని మాత్రమే యర్థ మేర్పడును. కావున "న కతరేణ" అనువాక్యము పాపాత్ములను నిందించునదియే కాని పితృయానమార్గమును నిషేధించునది కాదు. దేవయానమార్గము బ్రహ్మవిదోపాసకులకు మాత్రమే సంబంధించినది కావున నందు పరుల కెవ్వరికిని గమనము బొత్తుగనే సంభవింపదు కదా.

## అ_3. పా_౧. సూ_౧౩.

అవతారిక:—ఈపూర్వపక్షము ఖండింపుచున్నాఁడు.

## ౩౦౫. సంయమనే త్వనుభూ యేతరేషా మారోహావరోహౌ తద్గతి దర్శనాత్. ౩. ౧. ౧౩.

తాత్పర్యము:—ఇట్లుచెప్పుట యుక్తి యుక్తము కాదు. చంద్రమండలమునకు భోగార్థమై తప్ప మఱియొకవిధముగా బోవుదురనుటయె యయుక్తము. ఒకవృక్షము నెక్కువాఁడు అందలిఫలపుష్పాదుల గ్రహించుటకై మాత్రమే యెక్కును గాని నిష్కారణముగ నెక్కఁడు కదా! యిట్లుండ "పాపాత్ములు అధోలోకమునకు వచ్చుటకై మాత్రమే చంద్రమండలమునకుఁ బోవుదు" రనుట యేటియుక్తి? ఎవ్వఁడైనను పడవలయు ననుతలంపుచే మాత్రమే వృక్షముపై నెక్కునా? ఈకారణమువలన భోగానుభవము లేకపోవుటవలనఁ బాపాత్ములకు జంద్రమండలమునకుఁ బోవలసినపనియే లేదు. మఱియు శ్రుతియందు మూఁడవమార్గము చెప్పఁబడియుండలే దనుటయు సిద్ధాంతము కాదు. పాపాత్ములుకూడ పితృయానము ననుసరించి చంద్రలోకమునకుఁ బోవుదురేని వా రాలోకమున చిరకాల ముండినను ఉండకపోయినను లోకము మాత్రము ఇలు

కగు ననుటలో సంశయము లేదు. పితృయానమార్గము ననుసరించిన యజ్ఞాదికర్తలు అచ్చటనుండి దిగినపిదప భూలోకమున బ్రాహ్మణాద్యుత్తమ జన్మముల నెత్తుదురు. ఆమార్గ ముత్తమజన్మములను పొందించునదియే కాని యధమజన్మములను పొందించునది కాదు. పాపాత్ములుకూడా నా మార్గమునే యనుసరించిపోయిన నుత్తమజన్మముల నొందవలసినవారే యగుదురు. ఇది విరుద్ధము కదా! ఈకారణమువలన మూఁడవమార్గ మవశ్యకముగఁ జెప్పఁబడియే యుండవలయును. ప్రశ్నోత్తరములు లేకు న్నను "చంద్రలోకము ఇఱుకు కానేరదు." అనువిషయమును బోధిం చుటకే పాపాత్ములకు మార్గాంతరము చెప్పి తీరవలయును. లేకున్న చంద్రలోకము ఇఱుకు కాక తప్పదు కదా! మఱియు "పునర్జన్మమునకు నాహుతు లైదు కావలయును." అనువిషయము సామాన్యముగఁ జెప్పఁ బడెనేకాని ప్రతివారిజన్మమునకు నట్లే యుండవలయు నని కాదు. కావున నెట్లును పాపాత్ములు చంద్రలోకమునకు బోవరు. పితృయానమును నించుక రైనను త్రొక్కరు.

వారు యమలోకమునకుఁ జని యచ్చట పాపఫలము ననుభవించి పిదప తిర్యగ్యోనులయందు జనింతురు. ఇవియే వారిగత్యాగతులు. ఈ విషయము శ్రుతియందు బాగుగ బోధింపఁబడి యున్నది. "న సాంపరాయః ప్రతిభాతి బాలం ప్రమాద్యంతం విత్తమోహేన మూఢం అయం లోకో నాస్తి పర యితి మానీ పునఃపున ర్వశ మాపద్యతే మే"="మూ ఢుఁడును ధనమదముచే మూఢుఁడై ప్రమాదమును జెందుచు నుండు పురుషునకు పూర్వాపరములు తెలియవు. ధర్మమార్గము తోఁపదు. ఈ లోకమే కాని పరలోక మనునదియే లే దని వారికి నొక్కదురభిమానము కలుగును; దీనివలన వారు ధర్మము నాచరింపరు. ఆచరింప కుండుటచే మాటిమాటికి నాకు వశగతు లగుచుందురు." అను యమవాక్య మీ విషయమును నిరూపించుచు శ్రుతియందు కలదు. ఇట్లగుటచే నిర్వివాద ముగ పాపులు చంద్రలోకమునకుఁ బోవరు; అట్లు పోవుట మిగుల విరుద్ధ మనుట యనుభవపూర్వకము లగుయుక్తులచే సిద్ధాంత మయ్యెను కావున "య యేవై కే" అను కౌశీతకి బ్రాహ్మణశ్రుతి ధర్మాత్ములనుగూర్చి చెప్పు నదియే యని సిద్ధాంతముఁ జేయవలసి యున్నది.

## అ_3. పా_౧. సూ_౧౪.

## ౩౦౬. స్మరంతి చ. ౩. ౧. ౧౪.

తాత్పర్యము.—మఱియు మనువు మొదలగువారు తమతమస్మృతులయందు నాచికేతోపాఖ్యానము మొదలగువానిని వర్ణించునప్పుడు యమలోకమున పాపాత్ము లనుభవించుబాధలనెల్ల వివరించి చెప్పియున్నారు? పాపకర్మఫలముల నెల్లఁ జూపియున్నారు.

## అ_3. పా_౧. సూ_౧౫.

## ౩౦౭. అపి చ సప్త. ౩. ౧. ౧౫.

తాత్పర్యము.—మఱియు స్మృతులయందును పురాణములయందును పాపఫలభోగార్థమై యేడునరకములు కల వనియు చెప్పఁబడియున్నది.

## అ_3. పా_౧. సూ_౧౬.

అవతారిక:—"ఈవిషయము విరుద్ధము. స్మృతులయందు రౌరవాదినరకములకు చిత్రగుప్తాదులే యధికారు లని చెప్పఁబడి యున్నదికాని యముఁడు కాఁడు. ఇట్లుండ 'యముఁడు పాపాత్ముల బాధించును' అను విషయ మెట్లు యుక్తియుక్త మగును?" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౩౦౮. తత్రాపి చ తద్వ్యాపారా దవిరోధః.

## ౩. ౧. ౧౬.

తాత్పర్యము:—ఇట్లు కాదు. నరకములకన్నింటికిని యముఁడే అధికారి. యమునియాజ్ఞవలననే సర్వమును జరుగును. ఆచిత్రగుప్తాదులును యమునిచే నియమింపఁబడినవారే యని స్మృతిపురాణాదులయం దున్నది.

## అ_3. పా_౧. సూ_౧౭.

అవతారిక:—పాపులు చంద్రమండలమునకుఁ బోవ రనువిషయమున శ్రుతిప్రమాణము జూపుచున్నాఁడు.

# 3౦౯. విద్యాకర్మణో రితితు ప్రకృతత్వాత్.

## 3. ౧. ౧౭.

తాత్పర్యము:—*పంచాగ్నివిద్యయందు "వేత్థ యథాసౌ లోకో నసంపూర్యతే" "ఓశ్వేతకేతుఁడా ఇందలిజీవులు పోవుచున్నను ఈచంద్రలోక మేల యిటుకు కాదో దాని నెఱుంగుదువా?" అను ప్రశ్నమునకు నుత్తరముగ "అథైతయో పథో ర్న కతరేణ చ న తా నీమాని క్షుద్రాణ్యసకృ దావర్తీని భూతాని భవంతి జాయస్వ మ్రియ స్వే త్యేత త్తృతీయం స్థానం తే నాసౌ లోకో న సంపూర్యతే" "మాటిమాటికి జన్మమరణముల నొందుచు తిరుగుచున్న యీక్షుద్రజీవులు పైఁజెప్పిన విద్యాకర్మలయొక్క మార్గములలో దేనినిఁగూడ ననుసరింపను. దీనికి 'పుట్టుము చావుము' అని మూఁడవమార్గము కలదు. ఇట్లు కేవలము యజ్ఞాదిపుణ్యకర్మకర్తలే తప్ప మఱి యెవ్వరును పోకుండుటచే చంద్రలోకము ఇటుకు కాదు." అనువాక్యము చెప్పఁబడి యున్నది. దీనియర్థమును బాగుగ విమర్శించిన "పితయోః" అనుపదముచే జ్ఞానకర్మలు రెండును చెప్పఁబడినట్లు తెలుచున్నవి. ఈసందర్భమున నవియే కదా యారంభింపఁబడి యున్నవి' దీనికి పూర్వవాక్యమున "త ద్య యిద్ధం విదుః" "ఇట్లు ఎవ్వరు పరమేశ్వరుని తెలిసికొనుచున్నారో" అనియు "ఇష్టాపూర్తేదత్తం" "అగ్నిహోత్రముతటాకాదులు దానము" అనియు జ్ఞానకర్మలే ప్రస్తావింపఁబడి యున్నవి కదా! కావున బ్రహ్మవిద్యాభ్యాసము నాచరించువారు దేవయానము నాశ్రయించి పోవుదు రనియు కర్మనిష్ఠులు పితృయానము నాశ్రయింతు రనియు ఏమియు నాచరింపక పాపాత్ములై యుండువారు ఏమార్గము నవలంబింపక మాటిమాటికిఁబుట్టుచుఁ జచ్చుచుందురనియుసిద్ధాంతమగుచున్నది. స్థానశబ్దమునకు మార్గ మనునది యర్థము కాకపోయినను ఇచ్చట నాయర్థము చెప్పక తీరదు. క్రమముగ సంఖ్య ప్రయోగింపఁబడియుండ కొన్నిమాత్ర మందు సమానజాతి కలవి యై మఱికొన్ని భిన్నజాతి గలవియై యుండు ననుట యెట్లు? "అచ్చట నిరువురు బ్రాహ్మణులు కలరు. కొంతసేపటికి మూఁడవవాఁడును వచ్చెను" అనిన మూఁడవవాఁడును బ్రాహ్మణుఁడే

* పంచాగ్నివిద్య. (అ-3. పా-౧. పేజీ-౬. చూ.)

యనువిషయమును క్రొత్తగాఁ జెప్పవలయునా? ఈకారణమువలన స్థాన
మని చెప్పఁబడిన మూఁడవపదార్థముకూడ మార్గమే? పాపాత్ములకు
నెట్లును చంద్రలోకప్రాప్తి లేదు.

“పాపాత్ములును చంద్రలోకమునకుఁ జని యట నిలువక తత్క్షణమే
పునర్జన్మము నొందుదురు.” అనుటయు “పితృయానమార్గముననే ప్రయా
ణముచేయుదురు” అనుటయు నిదివరకే నిరాకరింపఁబడెను. “ఊరక
చంద్రలోకమునకుఁ బోయినను ఆలోకము పరిపూర్ణమే యగును”
అనియు నిరూపింపఁబడెను. తత్క్షణమే దిగివచ్చువార లగుటచే చంద్రలో
కము పరిపూర్ణము కావలసినపని లేదని సాధించినను అది శ్రుతిసమ్మతము
కాదు కావున నంగీకరింపఁ దగదు. చంద్రలోకమునకుఁ బోకున్నను,
పోయియు తత్క్షణమే దిగినను ఆలోకము పూర్తి కాదనుట నిశ్చయమేయై
నను శ్రుతి మాత్రము “పాపాత్ములు జననమరణరూప మగుతృతీయస్థాన
మునే చెందుదురుగాని చంద్రలోకమును జెందరు” అని చెప్పుచున్నది.
కావున దీనినే యంగీకరించి తీరవలయును. “యే వై కే” అనుశ్రుతికి చెప్ప
వలసినయర్థమునుఁ గూడ నిదివరకే (సూ. 3. ౧. ౧3.) నిరూపించి
యున్నాము. కావున నెట్లును పాపాత్ములకు పితృయానగమనము చంద్ర
లోకప్రాప్తి లేదు.

## అ_3. పా_౧. సూ_౧౮.

అవతారిక:—“శరీరము సంభవించుటకు నైదాహుతులు కావల
యునని ఆహుతిసంఖ్య నియమింపఁబడి యున్నది కదా! చంద్రుఁడు లేకున్న
నది యెట్లు పరిపూర్ణ మగును. శ్రుతిసిద్ధ మగుటచే నిందు మార్పును కలి
గించుటకు వీలు లేదు. ఇదివర కొకమాఱు ‘సామాన్యముగ మంత్రమే
యాహుతిసంఖ్య చెప్పఁబడెను. కాని ముఖ్యముగఁ గాదు.’ అని చెప్పి
యున్నారు. అదియు సరిపడదు.” అను విషయమును గూర్చి విచారించు
చున్నాఁడు.

## 3౧౦. న తృతీయే తథోపలబ్ధేః. 3. ౧. ౧౮.

తాత్పర్యము:—పంచాగ్నివిద్యయందు శరీరప్రాప్తికి ఐదాహు
తులు చెప్పఁబడియున్నను అది తృతీయమార్గమునందు చెప్పఁబడి యుండ

లేదు. "జాయస్వ మ్రియస్వ" అని కేవల జననమరణములుమాత్రమే యామార్గమునందు వర్ణింపఁబడెను. మఱియు "ఐదవయాహుతియందు జలము పురుషుఁ డగును" అనువాక్యమునకు "ఐదాహుతులు లేకున్న జలములు పురుషుఁడు కావు" అనునర్థము రాదు. అప్పుడు ఒక్కవాక్యమునకే విధినిషేధరూపములగు రెండర్థము లేర్పడును. ఇది దోషము కదా. కావున నావాక్యమువలన "జలము దేహరూపము చెందుటకు ఐదాహుతులే యుండి తీరవలయును." అని యర్థ మేర్పడదు. అదియే నిషేధరూపముగ ("ఐదాహుతులు లేకున్న జలములు పురుషరూపములు కావు." అని) ఉండినచో అప్పుడు మాత్రమే యట్టినియమ మేర్పడును. మఱియు "పురుషవచసః" అనుటచే మనుష్యశరీరమునకు మాత్రమే యైదాహుతులు కావలసినట్లు తెలుచున్నది. ఎవ్వరు చంద్రమండలాది పుణ్యలోకములకుఁ జని సుఖము ననుభవించి మఱల మనుష్యజన్మముల నెత్తుటకై భూలోకమునకు వత్తురో వారికిమాత్రమే యైదాహుతులు కావలయును. సర్వభూతసమన్విత మగుజలము ఐదాహుతులలోఁ గాని వారికి శరీరాంతరమును మర్త్యలోకమునఁ గల్పింపనేరదు. పాపాత్ములకు మాత్ర మట్లు కాక తత్క్షణమే తిర్యగ్జంతుదేహములు మొదలగువానిని గల్పింపఁగలవు. కావున నెట్లును పాపులకు చంద్రలోకప్రాప్తి లేదు.

## అ-3. పా-౧. సూ-౧౯.

అవతారిక:—"ఆహుతినియమమును ముఖ్యముగఁ బరిగణింపఁబని లేదు." అనువిషయమును స్మృతిప్రమాణముచే లోకానుభవముచేతను నిరూపించుచున్నాఁడు.

## ౩౧౭. స్మర్యతేఽపి చ లోకే. ౩. ౧. ౧౯.

తాత్పర్యము.—ఈవిషయము భారతాదులయందు సుప్రసిద్ధమై యున్నది. ద్యులోకము మేఘము పురుషుఁడు స్త్రీ అను నైదగ్నులయందు హోమము చేయఁబడెనుకదా. జలములు పురుషరూపమును దాల్చునని చెప్పఁబడియున్నది. ద్రోణాచార్యులు స్త్రీగర్భమునుండి జనించినవాఁడు కాఁడు. ఆయనశరీర ముత్పత్తి యగుటకు స్త్రీరూప మగుపంచమాగ్నియందు చేయఁబడినయాహుతి లేదు. ధృష్టద్యుమ్నునకును ద్రౌప

దికిని తల్లిదండ్రు లిరువురును లేరు కావున పురుషరూప మగునాల్గవయగ్ని యందు జరుపఁబడవలసిన యాహుతియు లేదు. సీతాదేవియొక్క జనన మును గూర్చి విచారించినను ఇట్లే పురుషస్త్రీరూపచతుర్థపంచమాగ్నుల యందు వేల్వఁదగిన రెండాహుతులును లేవు. ఇంత యేల? లోకమునం దును పురుషజంతుసంబంధము లేకయే రేతఃపతనముతో నిమిత్తము లేకయే మేఘముతో గలుగుసంబంధమువలన అందలిజలమును పానముచేయుట చేతనే స్వాతికొంగలు గర్భమును దాల్చునట సుప్రసిద్ధమై యున్నది. ఇప్పుడును పురుషరూప మగుచతుర్థాగ్నియందు వేల్వఁదగిన నాల్గవ యాహుతియు దానివలన గలుగు రేతోరూపపరిణామంబును లేదు కదా! కావున నీవర్ణింపఁబడిన స్థలములయందు ఆహుతిసంఖ్యానియమ మెట్లాదరింప నవసరము లేదో అట్లే పాపాత్ములవిషయమునఁ గూడ నాద రింప నవసరము లేదు.

## అ-౩. పా-౧. సూ-౨౦.

## ౩౧౨. దర్శనాచ్చ. ౩. ౧. ౨౦.

తాత్పర్యము:—మఱియు నీవిషయము ప్రత్యక్షానుభవసిద్ధము కూడ నయ్యేయున్నది. *జరాయుజములు *అండజములు *స్వేదజములు *ఉద్భిజ్జములు అని నాల్గువిధము లగుభూతములు కలవుకదా! ఇందు స్వేద జములయొక్కయు ఉద్భిజ్జములయొక్కయు నుత్పత్తికి పురుషస్త్రీసంబంధ ముతోఁ బని లే దనుట స్పష్టమే కదా! ఇప్పుడు రెండాహుతులు తగ్గి పోయినవి. ఇట్లే పాపాత్ములదేహములయుత్పత్తియుఁ గలుగవచ్చును.

## అ-౩. పా-౧. సూ-౨౧.

అవతారిక:—“తేషాం ఖ ల్వేషాం భూతానాం త్రీ ణ్యేవ బీజాని భవంతి అండజం జీవజ ముద్భిజ్జం” “జరాయుజమనియు అండజ మనియు ఉద్భిజ్జ మనియు నీమూఁడే భూతములకు జన్మకారణములు’ అని ఛాందో గ్యోపనిషత్తునందు చెప్పఁబడియుండ మీరు క్రొత్తగా స్వేదజ మను నాల్గవదాని నెక్కడనుండి తెచ్చిపెట్టితిరి?” అనిన సమాధానము చెప్పు చున్నాఁడు.

* చతుర్విధభూతములు (అ-౨. పా-౧. పేజీ-౫౩౮, చూ)

## ౩౧౩. తృతీయశబ్దావరోధః సంశోకజస్య.

### ౩. ౧. ౨౧.

తాత్పర్యము:—ఈ ఛాందోగ్యశ్రుతికిని మాసిద్ధాంతమునకును విరోధము లేదు. ఉద్భిజ్జ మనఁగా పగులఁగొట్టుకొని వెలుపలకు వచ్చునది గావున నాపదముచేతనే శ్రుతియందు స్వేదజము కూడఁ జెప్పఁబడె నని తెలిసికొనవలయును. వృక్షములు భూమిని పగులఁగొట్టుకొని వచ్చునవి; పేను మొదలగు స్వేదజములు చెమటరూపముతో నున్న జలమును పగులఁ గొట్టుకొని వచ్చునవి. ఈకారణమువలననే రెంటిను ఒకపదమునందే సంగ్రహించి చెప్పఁబడెను. భేద మన్ననో వృక్షములు స్థావరము లగుట చేతను పేలు మొదలగునవి జంగమము లగుటచేతను చెప్పఁబడె నని తెలిసికొనవలయును.

---

## ౪. సాభావ్యాపత్యధికరణము

విషయము:—ఇదివఱకు "యజ్ఞాదికర్తలు చంద్రలోకమునకుఁ బోయి మఱల భూలోకమునకు వత్తురు" అని చెప్పఁ బడెను. వారు వచ్చు మార్గముఁ గూర్చినసంశయము ఇందు నివర్తింపఁబడును. "అథైత మే వాధ్వానం పున ర్నివర్తంతే యథైత మాకాశ మాకాశా ద్వాయుం వాయు ర్భూత్వా ధూమో భవతి ధూమో భూత్వా ఽభ్రం భవ త్యభ్రం భూత్వా మేఘో భవతి మేఘో భూత్వా ప్రవర్షతి" "ఇట్లు చంద్రలోకమును జెందినపిదప నచ్చటియనుభవము ముగియఁగానే చాల వఱకు వచ్చినమార్గము ననుసరించియే యీ క్రిందఁ జెప్పఁబోవువిధముగ భూలోకమునకు వత్తురు. ఆచంద్రమండలమునుండి యాకాశమునకును ఆకాశమునుండి వాయుసమీపమునకును వత్తురు. వాయురూపమును జెంది పొగ యగుదురు. పిదప జలమాత్రమున కాధారభూతమగుపదార్థ మగుదురు. తరువాత మేఘమై వర్షింతురు. ఆవర్షముగుండ భూమినిఁ జేరుదురు." అని శ్రుతియందు అవరోహమార్గము (దిగివచ్చునట్టిత్రోవ) వర్ణింపఁబడియున్నది.

సందేహము:—ఇందు "వాయురూపమును జెంది పొగ యగుదురు." అను మొదలగు వాక్యభాగముల విమర్శించి చూచిన నవరోహ మార్గమున నున్న జీవులు వాయ్వాదిరూపపరిణామమును జెందుచున్నారని తోఁచుచున్నది. "ఆకాశమును జెంది" అనుటచే నట్టిపరిణామము లేదనియు తేలుచున్నది. ఇందు నిశ్చితాంశ మెద్ది?

సంగతి:—"పూర్వాధికరణమున 'సంఖ్యలు ప్రస్తావింపఁబడి నప్పుడు వానివిషయములు సామాన్యముగ సజాతీయములే కావలయును' అను నియమము నాశ్రయించి స్థానశబ్దమునకు మార్గ మని యర్థము చెప్పితిరి. ఇచ్చట మాత్ర మట్లు వీలు కాదు. ఇది శ్రుతి కావున నున్నయర్థము నున్నట్లే చెప్పవలయును" అని ప్రత్యుదాహరణసంగతితో నీక్రిందివిధముగ పూర్వపక్షము వచ్చును.

పూర్వపక్షము:—అవరోహ శ్రుతినిఁబట్టి విచారించిన "వాయుర్భూత్వా" అను మొదలగు వాక్యభాగములయందు జీవులకు వాయ్వాదిరూపప్రాప్తి స్పష్టముగఁ జెప్పఁబడియున్నట్లు తెలియనచ్చుచున్నది. " 'ఆకాశ మాకాశా ద్వాయుం' అనుస్థలమున నట్లు తోఁచుట లేదుకదా" అనియెదవేమొ. అదియు యుక్తముకాదు, ఎక్కువసంఖ్యగల స్థలములయందు తేలుచున్న విషయమునే యిచ్చటను నిర్ణయింపవలయును. ఇదియే కదా యుక్త మగుపని. "ఒకపదార్థము మఱియొకపదార్థ మెట్లగును? ఎన్నియుక్తులను జెప్పినను ఘటము పటము కానేరదు కదా" అనియెదవేమొ వినుము. ఇట్టిదృష్టాంతములును పెక్కులు కలవు. శిలాదుఁ డను వానిపుత్త్రుఁడు మొట్టమొదట మనుష్యుఁడే యయ్యును తపఃప్రభావము వలన శంకరుని యనుగ్రహమును సంపాదించి నందికేశ్వర దేహమును పొందెను. నహుషుఁడు దేవదేహమున నుండియు అగస్త్యశాపముచే సర్పరూపముగఁ బరిణమించెను. ఈవిషయములు పురాణప్రసిద్ధములు కదా! ఇట్లే అవరోహమును జెందుచున్న జీవులును ఆకాశాదిరూపముల నొందుదురు. ఇట్లు కాకున్న శ్రుతికి గౌణార్థమును జెప్పవలసివచ్చును. గౌణార్థమునందు లక్షణ కలదు. శ్రుతిలక్షణలకు విరోధము వచ్చినప్పుడు 'దేనిని నిర్ణయింపవలయును' అనుసంశయము కలిగినప్పుడు బలవంత మగుటచే శ్రుతినే నిర్ణయించుట యుక్తము కదా!

# అ-3. పా-౧. సూ-౨౨.

అవతారిక.—అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## 3౧౪. సాభావ్యాపత్తిరుపపత్తేః. 3. ౧. ౨౨.

తాత్పర్యము.—ఇట్లు కాదు. అవరోహమార్గమున నున్న జీవులు ఆకాశాదులతో సమాను లగుదురేకాని యాయారూపములతోఁ బరిణమింపరు. శ్రుతికిఁ గూడ నిదియే యభిప్రాయము. "వాయు ర్భూత్వా" అను మొదలగు వాక్యభాగములకు గూడ నిదియే యభిప్రాయము. శ్రుత్యర్థము యుక్తులకు సరిపడిన లక్షణావృత్తి నంగీకరించుట దోషమే కాని యట్లు సరిపడకున్న నది (లక్షణావృత్త్యంగీకారము) దోషము కాదు.

ఇట్లు (జీవులు ఆకాశాదిసమానరూపు లగుదురు అని) చెప్పకున్న నన్నియు యుక్తివిరుద్ధములే యగును. ఒకపదార్థము ఒకేసమయమున మఱియొకటిగా మారుట సంభవింపదు. మనుష్యదేహము దేవదేహముగను దేవదేహము సర్పదేహముగను మారుటలో కాలభేదము కలదు; కావున విరోధ మేమియు లేదు. ఇచ్చట నది యెట్లు సరిపడును? జీవులును ఆకాశదేహంబు నొక్కసమయముననే యున్నది కదా! మఱియు ఆకాశరూపమును జెందినజీవుఁడు మఱల వాయ్వాదిమార్గమునఁ గ్రిందికి వచ్చు ననుటకే వీలు లేదు. ఆకాశము ప్రళయకాలమువరకు నశించునదియు మార్పునొందునదియుఁ గాదు కదా! కావున నిర్వివాదముగ "జీవులు ఆకాశాదులతో సామ్యమును జెందుదురు" అనియే సిద్ధాంతము చేయవలయును. "చంద్రమండలమున గలభోగముల ననుభవింపఁజేయుటకై ద్యులోకాగ్నియందు హోమముచేయఁబడియున్న జలాదిభూతములారంభించిన దేహము భోగానంతరమున నశించి సూక్ష్మరూపమై యాకాశతుల్య మగును. ఆదేహమే యుపాధిగా గలవా రగుటచే జీవులు నట్లే యగుదురు. ఇట్లే వాయ్వాదులతోఁగూడ సమాను లగుదురు. సూక్ష్మరూపమున నాకాశమున నున్నప్పుడు వాయువుచే నిటునటు చలింపఁజేయఁబడుచుండి కొంతకాలమునకు ధూమసమానత్వమును జెంది జలాధారభూతులై మేఘమునుండి వర్షరూపమున భూమికి వత్తురు" అని మాత్రమే స్థాపింపవలయును. ఆకాశము సర్వవ్యాపక మగుటచే నీజీవులకు

దానితో సంయోగసంబంధము కలదనుటకు వీలులేదు. అప్పుడు కల్పాంతమువరకు వారికి నాసంబంధమునుండి వియోగము కలుగుటకు వీలులేదు. ఎచ్చటికి పోయినను ఆకాశ ముండనే యున్నది కదా! ఈకారణమువలన ప్రతిజన్మమునందును జీవుఁ డాకాశమునే యాశ్రయించి యుండవలసినవాఁడగును. ఇది సంభవింపదు కదా! కావున జీవునకు నవశ్యముగా నాకాశాది సాదృశ్యమే చెప్పవలయును. ఇట్లు బహుయుక్తులకు విరుద్ధమగుటచే శ్రుతిని పరిత్యజించి లక్షణమే గ్రహింపవలయును.

---

## ౫. నాతిచిరాధికరణము

విషయము, సంగతి, సందేహము:— పై యధికరణమున "జీవులాకాశాదిసాదృశ్యము ల నొందుచు భూమికి వత్తురు" అని నిర్ణయింపఁబడెను. ఇప్పుడు దాని నాశ్రయించి తత్తదవస్థలకుఁ గలకాలభేదము నిర్ణయింపఁబడును. "ఆజీవులు ఆకాశాదిరూపములతో నల్పకాలమే యుందురా? అధికకాల ముందురా?" యనుసంశయము నివారింపఁబడును.

పూర్వపక్షము:—విచారించిన యిచ్చట కాలమును నియమించు శాస్త్రమేదియు గానరాలేదు. కావున సంశయముతీరుట కేయుపాయము లేదు. మార్పు కలుగవలయుననినఁ గాల మధికముగఁగావలసియుండుటయు కర్మయు బరిపాకము నొందవలసియుండుటయు నావశ్యకము కావున"జీవులు ఆకాశాదిసదృశులై బహుకాల ముందురు." అనియే సిద్ధాంతముచేయుట యుక్తియుక్తముగ నున్నది. "అతో వై *దుర్నిష్ప్రపతరం' 'జీవులు ఇచ్చటనుండి యావలకుఁ బోవుట మిగులకష్టసాధ్యము దుఃఖకరము' అని భూమినిఁ జేరినపిదప ధాన్యసాదృశ్యమును జెందినపిదప జీవులకు గలుగుస్థితినిఁగూర్చి శ్రుతి చెప్పుచున్నది. దీనివలన ధాన్యసాదృశ్యప్రాప్తికిఁ బూర్వము సర్వమునుసుఖకరమే (అనఁగా: అల్పకాలముననే రెండవమార్పు కలుగుచుండును.) అని తెలుచున్నది కదా" అనియెదవేమొ వినుము. శ్రుతియందు

---

* దుర్నిష్ప్రపతరం అనుపదము వ్యాకరణశుద్ధముకాదు. దుర్నిష్ప్రపతతరం అని యుండవలయును. అప్పుడుగాని "అతిక్రమించుటకు కష్టమైనది" అనునర్థము రాదు, అయినను వేదమునందు ఛకతకారము లోపించె నని తెలుసుకొనవలయును.

ధాన్యసాదృశ్యము కలిగినపిదప జీవునకు నటనుండి నిర్గమించుట మిగుల దుఃఖమును కలిగించు నని చెప్పఁబడి యున్నది కాని ఆలస్యము (సమయ మధికముగ నుండు నని) చెప్పఁబడి యుండలేదు.

## అ-3. పా-౧. సూ-౨3.

అవతారిక :—అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## 3౧౫. నాతిచిరేణ విశేషాత్. 3. ౧. ౨3.

తాత్పర్యము:—ఇట్లు కాదు. జీవులు ఆకాశాదిసమానులై యల్ప కాలము మాత్రమే యుందురు; వర్షధారామూలమున భూమినిఁ జేరు దురు. శ్రుతియందు ధాన్యభావమును పొందినపిదప మాత్రము విశే షము తెలియవచ్చుచున్నది. "అతో వై దుర్నిష్ప్రపతరం" అని యావలి ప్రయాణమును దుఃఖకరమునుగా చెప్పుచున్నది; "జీవులు ధాన్యరూ పము జెందినపిదప నెంతయో కష్టములతోఁ గాని పురుషుని ప్రవేశిం పరు" అనుచున్నది. దీనికే సంతకుబూర్వమున జరిగినప్రయాణ మంత యును సుఖముగనే జరిగె ననియే కదా చెప్పవలసియుండును. "ఈవిద్వాం సునకు నీసభయందు బహుమానము దొరకెను." అనిన "తక్కినసభల యందు లేదు." అనియే కదా యర్థ మేర్పడును. స్థూలశరీరము లేకపోవు టచే నీసుఖదుఃఖములు మన మనుభవించుచున్న సుఖదుఃఖములు కానేరవు. ఈకారణమువలన నాపదములచే కాలమునే గ్రహింపనలయును. విశేష కాల ముండవలసివచ్చుట దుఃఖము; శీఘ్రకాలములోనే యావలికిపోవుట సుఖము. కావున నెట్లును "జీవులు ఆకాశాదిసమానులై యల్పకాలమే యుందురు" అనుటయే సిద్ధాంతము.

---

## ౬. అన్యాధిష్ఠితాధికరణము

విషయము:—ఈయధికరణమునందు వర్షధారలగుండ జీవులు భూమికిఁ జేరినపిదప గలుగువిషయమునుగూర్చి విచారింపఁబడును. శ్రుతి యందు "త ఇహ వ్రీహియవా ఓషధివనస్పతయ స్తిలమాషా ఇతి జా యంతే" "కర్మశేషముతోఁ గూడిన యాజీవులు భూమినిఁ జేరినపిదప

గోధుమలు యవలు మొదలగు *శూకధాన్యములుగాను ఓషధులు మహావృక్షములుగాను నువ్వు మినుము మొదలగు †శింబిధాన్యములుగాను జనింతురు." అని చెప్పఁబడియున్నది. ఈశ్రుత్యర్థ మిచ్చట విచారింపఁబడును.

సందేహము:—పై శ్రుతియందు "జాయతే" అనుపదముచే నుత్పత్తి చెప్పఁబడి యున్నది. పూర్వోక్తసందర్భమును విమర్శించిన జీవుల యుత్పత్తికి వారికర్మశేషమే కారణ మని చెప్పఁబడియున్నది. ఈరెండు సందర్భములకును పరస్పరవిరోధము కలదా? లేదా? కల దనిన వేద మప్రమాణ మగును; లే దనిన దానిని స్థిరపఱచుట యెట్లు?

సంగతి:—"పూర్వాధికరణమున స్థూలశరీరము లే దనుకారణముచే సుఖదుఃఖశబ్దములకు కాలాల్పత్వాధికత్వపరముగ నర్థము చెప్పఁబడెను. కాని యిచ్చటమాత్రము జాయతే యనుపదమునకు నర్థమును మార్చుటకు వీలు లేదు" అని ప్రత్యుదాహరణసందర్భముతో నీసందేహముపై నీక్రిందిపూర్వపక్షము వచ్చును.

పూర్వపక్షము:—పై శ్రుతి ననుసరించి చూచిన కర్మశేషముచే భూలోకమునకు వచ్చినజీవులు వ్రీహ్యాదిజన్మముల నెత్తి యందలిసుఖదుఃఖముల ననుభవింతు రనియే తేలుచున్నదిగాని మఱియొకవిధముగ తేలుట లేదు. "జాయతే" అనుపదమునకు జన్మ మెత్తుటయే కదా ముఖ్యార్థము. ఈముఖ్యార్థమును నిరర్థకముగ బాధింప నేల?

"ఇట్లు కాదు. శ్రుతియందు దేహప్రాప్తికి 'రమణీయచరణాః కపూయచరణాః' అని కర్మభేదము చెప్పఁబడియున్నది. ఇట్లు ఈవ్రీహ్యాది ప్రాప్తివిషయమునఁ జెప్పఁబడి యుండలేదు. ఈకారణమువలన జీవులకు నీవ్రీహ్యాదిజన్మ కలుగ దనియు ఇతరజీవులచే నాశ్రయింపఁబడిన యావ్రీహ్యాదులతో వీరు ఊరక సంయోగసంబంధమును మాత్రమే జెందుదు రనియు సిద్ధాంతముఁ జేయవలసియున్నది." అనియెదవేమో. అదియుక్తము కాదు. ప్రస్తుతము మనము యజ్ఞాదికర్తలనుఁగూర్చి విచారించుచున్నాము. వారినిఁగూర్చి యజ్ఞాదికర్మలు చెప్పఁబడియే యున్నవి. ఆకర్మలు

---

* శూకధాన్యము లనఁగా పొట్టుగల వడ్లు మొదలగుధాన్యములు.

† శింబిధాన్యము లనఁగా కాయధాన్యములు.

పుణ్యకర్మలే యైనను వానివలన సుఖభోగములే కలుగుచున్నను అందు పశుహింసాదులుకూడ కొన్ని కలవు గావున నవి యశుభ ఫలముల నొసంగ వచ్చును; జీవునకు స్థావరజన్మములఁ గలిగింపవచ్చును.

ఇట్లు కాదు. 'న హింస్యాత్సర్వభూతాని' 'సమస్తభూతములను హింసింపఁ గూడదు' అను శ్రుతి కదా. 'హింస యనర్థదాయకము' అను విషయమును బోధించుచున్నది; ఇది సామాన్యశాస్త్రము దీనికి విశేష శాస్త్రమువలన బాధ కలదు. 'అగ్నీషోమీయం పశుమాలభేత' 'అగ్నికొఱకును సోమునికొఱకును నైన యజ్ఞమునందు పశువును హింసింపవల యును' అనునది విశేషశాస్త్రము. ఇది ప్రత్యేకముగ నొక్కవిషయము నైకొని చెప్పునది యగుటచే బలవంత మగును; సామాన్యశాస్త్రము సర్వ సాధారణముగఁ జెప్పునది కావున దీనికంటె బలహీనము. ఇట్లగుటచే యజ్ఞమునందుఁ జేయఁబడు హింసవలన మాత్రము దోషము కలుగ దనియు యితరహింసలవలన దోష ముక్కదనియు సిద్ధాంత మగును. ఇట్లగుటచే యజ్ఞమునందలి హింసవలన జీవులకు స్థావరజన్మము రానక్కఱ లేదు" అనియెదవేమొ యీపక్షము యుక్తము కాదు.

బలవంత మైనంతమాత్రమున నేపదార్థంబును అన్యపదార్థమును బాధింపదు. రెంటికిని విరోధ ముండవలయును. పై జూపఁబడిన విశేష శాస్త్రములకు నట్టివిరోధ మేదియు లేదు. రెంటికిని విషయ మొక్కటియే యైయుండి యొకటి యొకవిధముగాను మఱియొకటి మఱియొకవిధము గాను దానినిగూర్చి చెప్పుచుండిన నప్పుడు గాని (రెండు) శాస్త్రములకుఁ బరస్పరవిరోధము కలుగదు; అప్పుడు గాని బలాబలవిచారమువలన*బాధ్య బాధకనిర్ణయము చేయవలసినపని యుండదు. ప్రస్తుత మట్లు లేదు. సామాన్యశాస్త్రము "హింస యుక్తమైనది కాదు" అను విషయమును మాత్రమే బోధించుచున్నది; విశేషశాస్త్రము "యజ్ఞమునందు పశు హింస నాచరింపవలయును" అనువిషయమును తెలియఁ జేయుచున్నది. ఇట్లు శాస్త్రద్వయమునకును విషయములు భిన్నములై యుండ పరస్పర విరోధ మేల కలుగును? హింస దోషయుక్తమైనదియే యైనను విధ్యను సారముగ యజ్ఞమునఁనాచరింపఁబడవచ్చును; చంద్రలోకమున యజ్ఞఫలము

* బాధ్యబాధకనిర్ణయము=వీఁడు బాధింపఁబడువాఁడు వీఁడు బాధించువాఁడు అనునిర్ణయము.

ననుభవించినపిదప హింసాజన్య మగు పాపఫలమును జన్మాంతరమున జీవుఁ డనుభవింపవచ్చును. కావున "జాయతే" అనుపదమ్మునియొక్క ముఖ్యార్థము నాశ్రయించి "జీవుఁడు వ్రీహ్యాదిజన్మముల నెత్తి యందలి సుఖదుఃఖముల ననుభవించుటయే కాని మఱియొకవిధముగ వానితో సంబంధముఁ జెందఁడు" అని మాత్రమే సిద్ధాంతముఁ జేయవలసియున్నది.

## అ_౩. పా_౧. సూ_౨౪.

అవతారిక:—అనిన నీపూర్వపక్షము ఖండించుచున్నాఁడు.

# ౩౧౬. అన్యాధిష్ఠితేషు పూర్వవ దభిలాపాత్.

## ౩. ౧. ౨౪.

తాత్పర్యము:—ఇట్లు సంశయింప నక్కఱలేదు. కర్మశేషమువలన చంద్రలోకమునుండి దిగివచ్చువారలు వ్రీహ్యాదిస్థావరజన్మముల నెత్తుదురనుటకు వీలు లేదు. శ్రుతియందు ఆకాశాదులనుగూర్చి చెప్పఁబడినట్లే వ్రీహ్యాదులనుగూర్చి కూడఁ జెప్పఁబడియున్నది. ఆకాశాదిసాదృశ్యమును జెందునప్పుడు వాయ్వాదులతో సంబంధము జెందునప్పుడు ఎట్లు కర్మవ్యాపారము (పూర్వజన్మకర్మలవలన సాధింపఁదగిన కార్యము) చెప్పఁబడ లేదో అట్లే వ్రీహ్యాదులనుగూర్చి చెప్పునప్పుడును కర్మవ్యాపారము జెప్పఁబడ లేదు. పూర్వాధికరణమునందును బహుయుక్తులచే "జీవులకు ఆకాశాదులతో కేవలసంబంధముమాత్రమే కలదు" అనువిషయమును సిద్ధాంతము చేసి యున్నాము. అట్లే యిచ్చట గూడ శ్రుతి ననుసరించి "జీవులకు వ్రీహ్యాదులతో సంబంధము మాత్రమే కలదు కాని సుఖదుఃఖసంసర్గ లేదు" అనియే సిద్ధాంతము చేయవలసి యున్నది. చంద్రలోకమునుండి దిగివచ్చుజీవు లెప్పటికిని స్థావరజన్మముల నెత్తరు. అందలి సుఖదుఃఖముల ననుభవింపరు. ఆజన్మము నెత్తుటకు తగినజీవులు కొంత తాజన్మముల నెత్తి యావ్రీహ్యాదిదేహముల నభిమానించుచు నందలిసుఖదుఃఖములఁ దమవిగానే భావింపుచు నుందురు. వీరును చంద్రలోకమునుండి వచ్చుజీవులును కార్యార్థమై ఆవ్రీహ్యాదులతో నభిమానరహితముగ సంబంధపడియుందురు.

ఇంతియే కాని వారికి నావ్రీహ్యాదిదేహములపై నభిమాన మింత యును లేదు. అట్లే యుండినయెడల నావ్రీహ్యాదులఁ గోయునప్పుడును దంచునప్పుడును వండి తినునప్పుడును ఈజీవు లందుండక పోవలసినవార లగుదురు. లోకమున నేజీవునకు నేదేహముపై నభిమానము కలుగునో ఆజీవు డాదేహము ఛేదింపఁబడినప్పు డందుండి వెడలిపోవు ననుట సుప్ర సిద్ధము. కంఠము త్రుంచిన నేదేహమునందును జీవుఁడు నిలుచుట లే దనుట సర్వానుభవసిద్ధము. వ్రీహ్యాదులయందును కోతకు మునుపు పచ్చని వన్నెలో నుండుటయు మృదువులై యుండుటయుఁ గోసినపిదప కఠిన ములై తేజోహీనములై పోవుటయు ననునవి ప్రత్యక్షములయ్యే యున్నవి. కావున చంద్రలోకమునుండి వచ్చినజీవులై వ్రీహ్యాదిదేహముల నభిమా నించువార లగుదురేని యెప్పుడు ఆధాన్యములను భుజించుకాలమునకు నందుండుటకు వీలు లేదు. ఉండకున్న రేతస్సునందు చేరుటకుఁ గాని తన్మూల మున స్త్రీరూప మగుపంచమాగ్నియందు హోమముఁ జేయఁబడి స్థూల శరీరయుక్తులై నిర్గమించుటకుఁ గాని వీలు లేదు. ఇఁక నావ్రీహ్యాదిదేహ ములయం దాత్మాభిమానము లేనివారే యగుదురేని యప్పుడు వానికి వ్రీహ్యాదులకు నెట్టిమార్పులు కలిగినను వాని నాశ్రయించియే యుండ వచ్చును. శ్రుతియందును యేయేశరీరములయందు నీజీవులకు (చంద్ర లోకాగతు లగుజీవులకు) సుఖదుఃఖభోగములుకలవో అచ్చటచ్చట "రమ ణీయచరణాః" అను మొదలగువాక్యములచేఁ గర్మవ్యాపారమును (పూర్వజన్మకర్మము చేయఁదలసినపనిని) స్పష్టముగఁ బరామర్శించుచునే యున్నది. కావున వ్రీహ్యాదులవిషయమున నట్టిపరామర్శ లేకపోవుటచే నిర్వివాదముగ జీవులకు నందు సుఖదుఃఖానుభవము లేదు. "జాయతే" అనుపదమునకు ముఖ్యార్థము చెప్పుటకు వీలులేదు. మఱియు వ్రీహ్యాది దేహములు సుఖాద్యనుభవస్థానములును కానేరవు. అవి దుఃఖప్రాయము లగుజన్మ లగుటచే పాపాత్ములకు నొకవేళ ననుభవయోగ్యము లైనను చంద్రమండలమునుండి వచ్చువారికిమాత్ర మనుభవయోగ్యములు కాఁజాలవు. కావున నెట్లును చంద్రలోకమునుండి వచ్చువారలకు వ్రీహ్యాదులతో సంబంధము మాత్రమేయుండును కాని (యందలి) సుఖదుఃఖానుభవ ముండదు.

మఱియును యజ్ఞాదికర్తలకుఁగూడ హింసాదిరూప మగుపాపకర్మ కాదనియు దానివలన వారును స్థావరజన్మముల నెత్తవచ్చు ననియుఁ జెప్పుటయు యుక్తియుక్తము కాదు. "నహింస్యాత్" అను సామాన్యశాస్త్రమునకంటె "అగ్నీషోమీయం" అను విశేషశాస్త్రము బలవంత మనియు నీవిశేషశాస్త్రముచే సామాన్యశాస్త్రము బాధింపఁబడు ననియు నిదివరకే చెప్పియున్నాము. ఈవిషయమునఁ బూర్వపక్షులు చేసియున్న వాదము చెందదు. కేవలము బలవంత మనుకారణముచేతనే అగ్నీషోమీయశ్రుతి "న హింస్యాత్" అనుశ్రుతిని బాధించునని మేము చెప్పలేదు. ఆశ్రుతులకు రెంటికిని విరోధము లేకున్నను కొంచెమైనను సంబంధముకూడ లేదు. పూర్వపక్షులు చెప్పినట్లు రెండుశాస్త్రములకును విషయ మొక్కటియైననే కదా విరోధముకాని సంబంధముకాని కలుగుట. ప్రస్తుతస్థితియందన్ననో "న హింస్యాత్" అనుశాస్త్రమును సామాన్యముగ హింసను నిషేధింపుచున్నది కాని యజ్ఞార్థహింసను నిషేధించుట లేదు. నిషేధింపవలసినవిషయము దేనికి సంబంధించియుండునో నిషేధముకూడ దానికే సంబంధించి యుండు ననుట నియమము. ఇచ్చట "న హింస్యాత్" అనుస్వరమున నిషేధ్యముగ జెప్పఁబడినహింస యజ్ఞార్థము కాదు; ఈనిషేధశ్రుతి యజ్ఞప్రకరణమున లేదు. కావున విచారించిన నీశ్రుతి కామక్రోధాదిదోషములలో పురుషుఁడొనర్చుహింసను మాత్రమే నిషేధించుచున్నది యనవలయును. "ఇట్లు చెప్పనేల? ఒక్కనిషేధమే సామాన్యముగ నన్నిటిని నిషేధింపవచ్చును." అనిన నట్లును చెప్పుటకు వీలు లేదు. అప్పుడు వాక్యభేదము (ఒకవాక్యమే రెండగుట) వచ్చును. ఆశ్రుతికి పురుషకృతము లగుహింసల నిషేధించునప్పుడు స్వాతంత్ర్యము కలదు. ఈయజ్ఞమునందలి హింసను నిషేధించునప్పుడు అట్టిస్వాతంత్ర్యము లేదు. యజ్ఞము ఏసందర్భమునఁ జెప్పఁబడియున్నదో యీనిషేధవాక్యముకూడ నచ్చటనే చెప్పఁబడి యుండిననేకాని యట్టిసామర్థ్యము రాదు కదా! ఈవిరుద్ధధర్మములు రెండు నొక్కస్థలమున నుండుట యెట్లు? ఈకారణమువలన యజ్ఞార్థమగుహింస సామాన్యశాస్త్రముచే నిషేధింపఁబడదు. నిషేధింపఁబడకపోవుటచే నది దోషంబును గాదు. ఈశాస్త్రములకు రెంటికిని విషయములు భిన్నము లని యిదివరకే

నిరూపించితిమి కదా! కావున నెట్లును యజ్ఞమువలన దుఃఖఫలము కలుగదు. యజ్ఞాదికర్తలు స్త్రీహ్యాదిజన్మముల నెత్తరు.

## ౩౧౭. అశుద్ధమితి చేన్న శబ్దాత్. ౩. ౧. ౨౫.

తాత్పర్యము.—మఱియు "ఇది ధర్మము ఇది యధర్మము" అను విషయమును తెలిసికొనుటకు కేవలశాస్త్రము మాత్రమే యాధారముగ నున్నది. ఒకానొక దేశకాలములయందు ఒకానొక కారణమువలన నాచరింపఁబడి ధర్మమైనపని మఱియొకకాలమున గారణాంతరమున నధర్మము కూడ నగును. ఇట్లే యొకకాలమున నధర్మమైనదియును మఱియొక కాలమున ధర్మమగును. సర్వకాలములయందును పరమధర్మమని ప్రశంసింపఁబడుచున్న *సత్యము గూడ నొకానొకసమయమున నధర్మమై పాపమును గలిగించును. అసత్యముకూడ బుణ్యమును సంపాదించును. కావున నీ మర్మములను గ్రహించుటకు శాస్త్రములకంటె నితరాధార మెద్దియును లేదు. ఇట్లుండ వేదమునందు ధర్మమని బహువిధముల బ్రశంసింపఁబడి యున్నయజ్ఞము అధర్మమగుట యెట్లు? అందు హింస యుండును గాక అదియు వేదవిహితమగుటచేఁ దత్తద్దేశకాలాను

---

* సత్యవాద్యుపాఖ్యానము:—

ఒక బ్రాహ్మణుఁడు సర్వకాలములయందును సత్యమునే భాషింపవలయునని పట్టుపట్టి సత్యవాది యని పేరుపెట్టుకొని యొకవనమున తపము నాచరించుచుండెను సర్వవిషయములును యథార్థములుగనే వచించుచుండెను. ఒక్కనాఁడు ఒక్కబ్రాహ్మణునితఱుముచు కొందఱుచోరులు బహుదూరమునుండివచ్చుచుండిరి. వారిచే తఱుమఁబడుచున్న యాబ్రాహ్మణుఁడు ప్రాణరక్షణమునకై యతివేగముగ బరుగిడి ఆదొంగలకు గానరాకుండ నీసత్యవాదియొక్క యాశ్రమమున డాగెను. దీనినంతయు ఆసత్యవాది చూచుచునే యుండెను. తర్వాత కొంతసేపటికి అడుగుల గురుతులవలన నాదొంగలును ఆయాశ్రమమునకువచ్చి "ఒకబ్రాహ్మణుఁడు పరుగులిడుచు నీవైపునకు వచ్చెను. అతఁడెందుబోయెనో నీవెఱుఁగుదువా?" యని సత్యవాదినడిగిరి. అతఁడును ధర్మసూక్ష్మము నెఱుంగనివాఁడగుటచే సత్యముదప్పుట యుక్తముగాదని యావృత్తాంతమునంతయును నున్నదున్నట్లు చెప్పెను. తత్క్షణమే చోరులాశ్రమములోనికి ప్రవేశించి నాబ్రాహ్మణుని పట్టి ధనాశచే వధించిరి. ఆదోషము సత్యవాది నాశ్రయించెను. కావున నొకప్పుడు ధర్మముగనుండునదియే మఱియొకప్పు డధర్మమగును.

సారమున ధర్మము కావచ్చును. "న హింస్యాత్" అను శ్రుతియందుఁ జెప్పఁబడి యున్న నిషేధ మీయజ్ఞార్థహింసను బాధింపనేల యని యిది వరకే నిరూపించి యున్నాము. కావున నెట్లును యజ్ఞాదికర్తలు స్థావర దుఃఖముల ననుభవింపరు. మఱియు కుక్క మొదలగుజన్మములు వచ్చు నట్లు స్థావరజన్మములు వచ్చు ననుటకు వీలు లేదు. ఆజన్మములనుగూర్చి చెప్పునప్పుడు "కపూయచరణాః" అని శ్రుతి కర్మభేదమును ప్రస్తావించు చున్నది. ఇచ్చట (వ్రీహ్యాదిజన్మమును గూర్చి చెప్పునప్పుడు) నట్లు లేదు కదా! ఈ కారణమువలన యజ్ఞాదికర్తలకు స్థావరజన్మము లేదు. "జాయతే" అనుపదము శ్రుతియం దీకారణమువలననే ముఖ్యార్థముతోఁ బ్రయోగింపఁబడలేదు.

## ౩౧౮. రేతః సిగ్యోగోఽథ. ౩. ౧. ౨౬.

తాత్పర్యము.—ఇదియునుఁగాక వ్రీహ్యాదిప్రాప్తికిఁ బిదప "యో యో హ్యన్నమత్తి, యో రేత స్సించతి త ద్భూయ ఏవభవతి"—"చంద్ర లోకమునుండి వచ్చిన జీవులచే నాక్రమింపఁబడి యున్న యాహారపదార్థ ముల భుజించి వానివలన నేర్పడిన రేతస్సును స్త్రీరూపాగ్నియందు హోమమును గావింపఁగనే యప్పు డాజీవుఁడు స్థూలదేహ యుక్తుఁడై జనించును" అని శ్రుతియందు చెప్పఁబడి యున్నది. దీనియర్థమును విమర్శించిన చంద్రమండలమునుండి వచ్చుజీవులకు రేతస్సేకము నాచ రించుపురుషునితోఁ గేవలసంబంధము కలదు కాని తద్రూపప్రాప్తి లేద నుట స్పష్టమగుచున్నది. రేతస్సేకము చాలకాలమునుండి జనించి పరిపూర్ణ యౌవనవంతుఁడై యున్నవానికిఁ గాని సాధ్యమగునది కాదుగదా! ఇట్లుండ నాహారపదార్థముల నాశ్రయించి జఠరమును ప్రవేశించినంతమా త్రమున జీవునకు (చంద్రలోకమునుండి వచ్చుజీవునకు) నాసామర్థ్య మెట్లు సంభవించును? ఈకారణమువలన పురుషునితో నాజీవునకు సంబంధము మాత్రమే కల దని సిద్ధాంత మగుచున్నది. ఇట్లు వ్రీహ్యాదులకుఁ బూర్వ మున వర్ణింపఁబడిన యాకాశాదులతో నుత్తరమున వర్ణింపఁబడిన పురుషునితోనుగూడ చంద్రలోకమునుండి వచ్చుజీవులకు సంబంధము మాత్రమే కల దనుట శ్రుతిసిద్ధాంతమై యుండ నట్టనడుమ వ్రీహ్యాదుల విషయమున మాత్రము భిన్నసిద్ధాంత మెట్లు వచ్చును?

# ౩౧౮. యోనేః శరీరం. ౩. ౧. ౨౭.

తాత్పర్యము.—మఱియుఁ బురుషుఁడు స్త్రీయందు రేతస్సేకమును చేసినపిదప నాజీవులు కర్మానుసారముగ శరీరధారు లగుదురు. "రమణీయచరణాః" అను శ్రుతి యీవిషయమును బోధించుచున్నది. దీనినిఁబట్టి చూచినను ఆజీవునకు మార్గమధ్యమున దేహప్రాప్తి లేదని స్పష్టమగుచున్నది. ఈకారణమువలన నెప్పటికిని జీవులకు చంద్రలోకమునుండి వచ్చువారికి స్థావరజన్మము లేదు.

ఇట్లు సంసారమునుగూర్చి విచారించిన పుట్టుటయు చచ్చుటయు మాత్రమే యందు కలవు. కావునను ఇహపరలోకసుఖములలో నేవియు శాశ్వతముగా నిలుచునవి కాకపోవుటచేతను పాపాత్ములస్థితినిగూర్చి విచారించిన నది మిగుల దుస్సహమై యుండుటచేతను ప్రతిపురుషుఁడును ఎంత ప్రయాసపడి సత్కర్మల నాచరించినను శాశ్వతసుఖము నొందలేక పోవుట చేతను పాపకర్మసంబంధ మనునది లేకుండ నుండుట యసాధ్య మగుట చేతను వివేకి యగువాఁడు ఇహపరలోకములయందు విరక్తినిఁ బూనుట కర్తవ్యము. "తస్మా జ్జుగుప్సేత్"="ఇట్టిసంసారము నిస్సార మగుటచే వైరాగ్యముఁ బూనవలయును." అని పంచాగ్నివిద్యానిరూపణానంతరమున శ్రుతియందే స్పష్టముగ నీవిషయము చెప్పఁబడి యున్నది. ఇట్లు విరక్తుఁడై మోక్షోపాయమును విమర్శింపవలయును. సర్వమును భ్రాంతి కల్పితమే యగుటచే నజ్ఞానము శాస్త్రాభ్యాసాదులవలన తొలంగెనేని యుత్తరక్షణమున నీసంసార మదృశ్య మగును.

బ్రహ్మసూత్రార్థచంద్రికయందు తృతీయాధ్యాయమున ప్రథమపాదము.





# బ్రహ్మసూత్రార్థచంద్రిక

## తృతీయాధ్యాయము - ద్వితీయపాదము

## ద్వితీయ పాదావతారిక

పూర్వపాదమునఁ బంచాగ్నివిద్య నుదాహరించి తద్విచారముచేఁ జీవులగమనాగమనములు నిరూపింపఁబడెను. బ్రహ్మోపాసకులు దేవయాన మార్గము ననుసరించి పునరావృత్తిరహిత మగు బ్రహ్మలోకమును జెందుదు రనియుఁ దక్కినవార లందఱును నెంతటిపుణ్యకర్మల' నాచరించినను అత్యల్పకాలము స్వర్గఫలముల ననుభవించి మఱల దుఃఖబహుళ మగు నీప్రపంచమునకు రావలసినవారే యనియుఁ బాపాత్ములనుగూర్చి తలంచి నంతనే మనసు కళుక్కు మను ననియు నిరూపింపఁబడెను. ఈనిరూ పణవలనఁ బ్రతిపురుషుఁడును కర్మఫలములయం దపేక్షను వదలి దృఢ వైరాగ్యము నవలంబించి బ్రహ్మజ్ఞానమునకైనను తుదకు బ్రహ్మవిద్యో పాసనకైనను ప్రయత్నింపవలయు ననుట సిద్ధాంత మగుచున్నది.

ఇట్లు నిర్ణయింపఁబడిన యధికారికి నాత్మజ్ఞానము కలుగుటకై యీ పాదమునఁ దత్త్వంపదార్థవిచారము గావింపఁబడును. అందు మొట్ట మొదట నాఱు అధికరణములవఱకు త్వంపదార్థము విచారింపఁబడును. ఇదివఱకు ద్వితీయాధ్యాయ తృతీయపాదముననుఁ బ్రథమాధ్యాయ చతుర్థపాదమునను సామాన్యముగ జీవబ్రహ్మైక్యము వివరింపఁబడెను. అయినను జీవపరమేశ్వరులకు ననేకవిరుద్ధధర్మములు కల వనుశంక నివ ర్తించుట యసాధ్యము కావున మఱియొకమాఱు ఆవిషయము తదేక వృత్తితో నిరూపింపఁ బడుచున్నది- జీవుఁడు సంసారి యని తలంపఁబడు

చుండుటచే నాభ్రాంతిని తొలఁగించుటకై మొట్టమొదట ప్రయత్నించుట యావశ్యకముగదా! ఈ భ్రాంతియే కదా సర్వదుఃఖకారణము కావున నారంభమున త్వంపదార్థవిచారము నాచరించుటయే కర్తవ్యము. నాలు గధికరణములు గలసినపిదప బౌద్ధాంతమువఱకు తత్పదార్థము విచారింపఁ బడును.

---

## అధికరణావతారిక

ఈపాదమునందలి యధికరణములలో నేదియో యొకవిధముగ జీవ బ్రహ్మైక్యమే యాక్షేపించి సిద్ధాంతము చేయఁబడుచుండును. పూర్వ పాదమున గత్యాగతి నిరూపణముచే జాగ్రదవస్థ యంతయు వర్ణింపఁ బడెను. ఈపాదమున నాలుగధికరణములవఱకు స్వప్నసుషుప్తి మూర్ఛా వస్థలు వర్ణింపఁబడును. పరమేశ్వరుఁడు దేనితోను సంబంధపడువాఁడు కాఁడు గావున నాయనతో నభిన్నుఁ డగుజీవుఁడు గూడ నట్టివాఁడే కావలయునుకదా! ఈకారణమువలన నాతనికి జాగ్రదాద్యవస్థాసంబంధము లేదని నిరూపింపఁ బడును. ఘటాకాశమువలె నుపాధిచేత మాత్రమే పరమేశ్వరునికంటె భిన్నుఁడై యున్నాఁడు. కావున జీవునకును దేనితోను సంబంధము లేదనువిషయము సామాన్యముగ నిదివఱకే నిరూపింపఁ బడెను. పంచాగ్నివిద్యను వివరించుటచే "ఆహుతిరూపము లగుపరిణా మము లన్నియు జలాధిభూతములకే గాని జీవులకు కాదు; సుఖదుఃఖా ద్యనుభవంబును మనస్సునకే కాని జీవునకుఁ గాదు" అని నిరూపింపఁబడి నట్టైనది కదా! "స్వప్నాద్యవస్థలయందును జీవుఁడు సాక్షిమాత్రుఁడే" యనువిషయ మీపాదమున సిద్ధాంతము చేయఁబడును; విచారించినఁ బరమేశ్వర జీవరూపము లొక్కటియే యగు నని నిరూపింపఁబడును.

---

## ౧. సంధ్యాధికరణమ్.

విషయము:—సంధ్య మనఁగా స్వప్నావస్థ. ఇది ఇహపరలోక ముల సంధియం దున్నది కావున నీపేరుతో వ్యవహరింపఁబడుచున్నది. ఈలోకమున నున్నపదార్థముల నింద్రియవృత్తులచే గ్రహించుటకు వీలగు

నవస్థ యగుటచే జాగ్రదవస్థ ఇహలోకము. వస్తుసాక్షాత్కార మున్నను యింద్రియవ్యాపారము లేదు కావున స్వప్నావస్థ జాగ్రత్త కానేరదు; ఇహ లోకంబును గా నేరదు. సర్వేంద్రియములును లయము నొంది కారణ మాత్రావశిష్టము లై యుండుటచేతను జాగ్రదవస్థయందు మఱల నందుం డియే యభివ్యక్తి నొందుచుండుటచేతను సుషుప్త్యవస్థ పరలోక మనఁ బడును. పరలోకముగూడ సర్వవిలయస్థాన మనియు సర్వోత్పత్తికారణ మనియు స్పష్టముగఁ దెలియుచున్నది కదా! ఈకారణమువలన స్వప్నా వస్థ పరలోకముకూడఁ గానేరదు; అందును ఇంద్రియములు లేకున్నను చిత్తముగామకదా! కావున నీస్వప్నము రెండులోకములకును నడుమ నున్నదియే. ఇట్టి యీస్వప్నమునుగూర్చి యీయధికరణమున విచారింపఁ బడును. కేవల స్వప్నమునుగూర్చియే కాదు బహువిధములగు భ్రాంతి జ్ఞానములను గూర్చికూడ విచారింపఁబడును.

సందేహము:—"న తత్ర రథా న రథయోగా న పంథానో భవం త్యథ రథా న్రథయోగా న్పథః సృజతే:" "ఆస్వప్నావస్థయందు రథ ములు గాని మార్గములు గాని వీనికి రెంటికిని గలసంబంధము కాని లేక రథములకుఁ గట్టఁబడుగుఱ్ఱములు మొదలగునవి కాని లేవు. అయినను ఈజీవుఁడు లేక బ్రహ్మము ఆరథాదుల సృజించును; అని స్వప్నావస్థను గూర్చి శ్రుతి చెప్పుచున్నది. ఈచెప్పఁబడిన పదార్థములు సత్యములు కావా? జాగ్రదవస్థయందలి పదార్థములవలె బ్రహ్మజ్ఞానము కలుగునంత వఱకు సత్యరూపములై యుండునవియా? కావా?" అనుసంశయ మిందు ఆక్షేపసమాధానములచే నివారింపఁ బడును. ఇది గుఱుతు. ఈయధికర ణమునందలి సిద్ధాంతముచే సర్వభ్రాంతిజ్ఞానముల విషయమునుకూడ నిర్ణయింపవలయును.

సంగతి:—"పూర్వవాదమున జాగ్రదవస్థ నిరూపింపఁబడినను జీవుఁడు పరమార్థస్థితిలో నాయవస్థతో సంబంధింప దని సూచింపఁబడినను అది సిద్ధాంతము కానేరదు; అంతమాత్రమున జీవుఁడు పరమేశ్వరునివలె స్వ ప్రకాశస్వరూపుఁడును గా నేరఁడు. జాగ్రదవస్థయందు పదార్థములు చూడఁ బడునవి; జీవుఁడు చూచువాఁడు. స్వప్నావస్థయం దన్ననో జీవుఁడు స్వయముగనే యందలిపదార్థముల సృజించుచున్నాఁడు చూచువానికిఁ జూడఁబడువానితో సంబంధములే దని సాధించినను సృష్టికర్తకు సృజింపఁ

బడువానితో సంబంధము లేదని సాధించుటకు వీలు లేదు. ఇట్లు ఒక స్థలమున జీవునకుఁ బదార్థసంబంధము స్థిర మగునేని అన్ని స్థలములయం దును స్థిర మగును. మఱియు జాగ్రదవస్థయందే జీవునకు స్వప్రకాశత్వము సిద్ధించుట లేదు. అప్పుడు సూర్యాదిప్రకాశసహాయము కలదు కదా! దీనిని బట్టియు 'జీవుఁడు ఎప్పటికిని స్వప్రకాశస్వరూపుఁడు కాఁడు.' అనియే సిద్ధాంతము చేయవలసి యున్నది." అని యాక్షేపసంగతితో వచ్చినపూర్వపక్షము సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడెను.

## అ-3. పా-౨. సూ-౧.

అవతారిక:—పైఁజూపినసంశయమును నిరాకరించుటకై మొట్ట మొదట పూర్వపక్షము ననువాదము చేయుచున్నాఁడు.

## 3౨౦. సంధ్యే సృష్టి రాహ హి. 3. ౨. ౧.

తాత్పర్యము:—స్వప్నావస్థయందు అనుభవింపఁబడుచున్న సృష్టియు సత్యమే కావలయును. దాని నసత్య మనుటకు నాధార మేదియు లేదు. జాగ్రదవస్థయందు గల పదార్థము లన్నియు సత్యము లనుట యుభయ వాదులకును సమ్మతమే కదా! వీనివలెనే జ్ఞానగోచరము లగుపదా ర్థము లన్నియు సత్యములే యై తీరవలయును. భ్రాంతి యనునదియే లోకమున లేదు. రజ్జుసర్పభ్రాంతిని గైకొనియే విచారింతము. అప్పుడు నేత్రమునకు సర్పము మాత్రమే కానవచ్చుచున్నది గాని రజ్జువు కాదు కదా! ఇఁక దానిని భ్రాంతి యని చెప్పఁ దలఁచినచో నప్పుడు రజ్జు రూప మగు నధిష్ఠానము నొకదానిని కల్పింపవలసి వచ్చును. సర్పము ప్రత్యక్ష మగుచుండ స్వబుద్ధిచే దాని కొకయధిష్ఠానమును గల్పించుట కంటె వెఱ్ఱితన మిఁక నేది కలదు? "రజ్జుజ్ఞానము సర్పజ్ఞానమును బాధించు చున్నది కదా! (అనఁగా త్రాడని తెలియఁగనే సర్పబుద్ధిని విడుచును కదా.)" అనియెదవేమొ సత్యమే. ఇంతమాత్రమున రజ్జుజ్ఞానము సర్ప జ్ఞానమును బాధించు ననుట యెట్లు సిద్ధించును? రెండుజ్ఞానములకును విషయ మొక్కపదార్థమే యై యున్న నప్పుడుకదా వానికి పరస్పరవిరో ధము వచ్చును; అప్పుడు కదా బలాబలనిర్ణయముచే బాధ్యబాధక భావమును నిరూపింపవచ్చును. ప్రస్తుతమున మాత్ర మట్లు లేదు. ఒక

జ్ఞానమునకు త్రాడు విషయము, మఱియొకదానికి సర్పము విషయము. ఇట్లుండ నొకదాని నొక్కటియేల బాధించుకొనును? పురుషుఁడుమాత్రము సర్పబుద్ధిని విడుచుటకు గారణాంతరము లెన్నియేని యుండవచ్చును.

లోకమున సమానరూపము లగుపదార్థములే కాలభేదమువలన భిన్నములుగఁ గానవచ్చుచున్నవి. సమానరూపమే గ్రైయుండియు నొకప్పుడు పాలుగాను మఱియొకప్పుడు పెరుగుగాను గానవచ్చుచున్నవి. కార్యకారణము లగుటచే పెరుగుపాలకు పరస్పరభేదము లేదు అనివారనుట యిదివఱకే సిద్ధాంత మై యున్నది. ఇట్లే ఒక్కపదార్థమే కాలభేదమువలన రజ్జువుగాను సర్పమునుగానుగూడ కానరావచ్చును. ఈకారణమువలన పురుషుఁడు రజ్జుజ్ఞానము కలిగినప్పుడు సర్పబుద్ధిని విడువవచ్చును; సర్పజ్ఞానము కలిగినప్పుడు రజ్జుబుద్ధినిఁగూడ విడువవచ్చును. ఇందు విరోధమేమి? మఱియు నొక్కపదార్థమునకే యనేకస్వభావము లుండు ననియు చూచువానికి గలసాధనసంపద ననుసరించి యొక్కొక్కమా ఱొక్కొక్కరూపము మాత్రమే కానవచ్చుచుండు ననియుఁ గూడ జెప్పవచ్చును. సూర్యరశ్మి యధికముగ నున్నసమయమునందు ముత్యపుచిప్పయే దానికిఁగల రజతరూపమును గానఁబఱచును; ఆసూర్యరశ్మియే యల్పముగ నున్నప్పుడు తనకుఁగల ముత్యపుచిప్పయొక్కరూపమును చూపును. ఇట్లే త్రాడుకూడ నంధకారావృత మగుకంటికి తనకుఁ గల సర్పరూపమును జూపును దీపప్రకాశముచే సహాయము చేయఁబడినకంటికి రజ్జుస్వరూపమును జూపును. ఇంతియే కాని భ్రాంతి యనునదియే లోకమున లేదు.

ఇట్లే ప్రస్తుతస్వప్నసృష్టివిషయములుకూడ నిర్ణయింపవలయును. నిద్ర లేనప్పుడు స్వప్నపదార్థము లుండియుఁగానరావు. నేత్రముల నెప్పుడు నిదుర యావరించునో యప్పుడుమాత్రమే కానవచ్చును. ఇంతమాత్రమున నవి యసత్యము లేల కావలయును? కాశీపట్టణమునం దున్నవానికి గానరాకపోయినంతమాత్రమున నయోధ్య యసత్యము కావలయునా? తగినసామగ్రిని సంపాదించి ప్రయత్నించిన నాయయోధ్య వానికిఁగూడ గానవచ్చునుకదా! వాహనములపైఁగాని నడచిగాని యచ్చటికి (యయోధ్యకుఁ) బోయిన నైనను యోగశక్తిచే దూరదృష్టి నభ్యసించి గ్రైనను అయోధ్య కాశీలోనున్నవానికిఁ గూడఁ గానవచ్చు ననుటకు సంశయము లేదు కదా! కావునఁ బ్రతిపదార్థంబును కాలభేదమువలన కాని సామగ్రి

భేదమువలనకాని తనయం దున్నవివిధరూపములఁ జూపు నంతియేకాని ఉన్నదిలేనట్లును లేని దున్నట్లును గానవచ్చు ననుట మాత్రము యుక్తి యుక్తము కాదు. కావున స్వప్న ప్రపంచముకూడ జాగ్రత్ప్రపంచమువలె సత్యమైనదియే.

"అథరథా రథయోగా న్పథ స్సృజతే" అను మొదలగు శ్రుతులును ఈవిషయమునే వర్ణించుచున్నవి. " 'న తత్ర రథాః' అని శ్రుతి రథాద్యభావమును చెప్పుచున్నది. ఈకారణమువలన 'సృజతే' అను క్రియను *గౌణముగ నన్వయింపవలయును." అనియెదవేమొ. అది యుక్తము కాదు. పైఁ జూపినయుక్తుల నాశ్రయించి చూచిన "సృజతే" యను శ్రుతియే బలవంత మని నిశ్చయ మగుచున్నది. అనేకశ్రుతులును దీనికి ననుకూలము లై యున్నవి. కావున "న తత్ర యథాః" అను మొదలగు వాక్యభాగములనే గౌణములనుగాఁ జెప్పవలయును. "ఆ స్వప్నావస్థ యందు జాగ్రత్కాలమున దృష్టిగోచరములు కాఁదగినరథాదులు లేవు." అని మాత్రమే వానికి నర్థము నిర్ణయింపవలయును. కావున నెట్లు చూచి నను స్వప్నావస్థయందలి పదార్థములు సత్యములే.

## అ-3. పా-౨. సూ-౨.

అవతారిక:—" 'సృజేత' అను శ్రుతికి ననేక శ్రుతు లనుకూలము లుగ నున్నవి." యని యిదివఱకుఁ జెప్పఁబడెను. అంతకుముందు ఆ శ్రుతులు సంధర్భసహితములుగ నీక్రింద చూపఁబడుచున్నవి.

## 3-౨౧. నిర్మాతారం చైకే పుత్రాదయశ్చ.

### 3. ౨. ౨.

తాత్పర్యము.—ఇంతమాత్రమే కాదు. అనేకశ్రుతు లనేకవిధ ములుగ నీస్వప్నసత్యత్వమును బోధించుచున్నవి. కొన్నిశాఖలయందు "య ఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః" "పుత్రమిత్రాదిరూపములగు ననేకకామ్యపదార్థముల నిర్మించుచు సర్వేం ద్రియములును నిదురించు చున్నను ఆత్మ మేల్కొని యుండును." అని

* గౌణము. (అ-౧. పా-౪. సూ-౨. పే-౯౩౪ చూ.)

స్వప్నకల్పితపదార్థము లాత్మచే సృజింపఁ బడినవిగాఁ జెప్పఁబడియున్నవి. "'శతాయుషః పుత్రపౌత్రా న్వృణీష్వ' నూరుసంవత్సరములు పరిపూర్ణాయుస్సు గలకొడుకులను మనుమలను గోరికొనుము." అని యారంభించి యనేకవిషయములు చెప్పఁబడినపిదప ప్రకరణారంభమున "అన్యత్ర ధర్మాత్ అన్యత్రాధర్మాత్" "ధర్మాధర్మములకంటె నతీతుఁడైన" అని పరమేశ్వరవిషయక మగు ప్రశ్న వర్ణింపఁబడి యున్నది. ఈసందర్భములను విచారించి చూచినఁ బుత్రాదిప్రస్తావముచేఁ గామశబ్దము పుత్రాదివాచకమేయనియు, ప్రశ్నింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడే కావున స్వప్నావస్థయందు వానిని నిర్మించువాఁడు పరమేశ్వరుఁడే యనియు స్పష్టమగుచున్నది. వాక్యశేషమునందును "త దేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృత ముచ్యతే" "అదియే శుభ్రమైనది అదియే బ్రహ్మము అదియే మోక్షము" అని పరమేశ్వరుఁడే పరామర్శింపఁబడియున్నాఁడు కావున స్వప్నసృష్టియు పరమేశ్వర నిర్మితమే; ఆకాశాదులవలె సత్యమే. పరమేశ్వరునిచే నిర్మింపఁబడిన దెద్దియు నసత్యమైనది లేదు కదా! కావున స్వప్నపదార్థములుకూడ పరమేశ్వరసృష్టములే యగుటచే సత్యములే. ఇట్లుగాక స్వప్నపదార్థకర్త జీవుఁడే యనినను జీవబ్రహ్మలకు నభేదమే యగుటచే నిప్పటివాదమునకు భంగము రాదు. మఱియు పరమేశ్వరనిర్మితమగుటచే జాగ్రత్సృష్టివలె స్వప్నసృష్టియు సత్యమే కావలయు నని యిదివఱకే చెప్పితిమి. ఇంతమాత్రమే కాక శ్రుతియు "అథో ఖల్వాహు ర్జాగరితదేశ ఏ వా స్యైష ఇతి యాని హ్యేవ జాగ్ర త్పశ్యతి తాని సుప్తః" "ఈఆత్మకు నీస్వప్నముకూడ జాగ్రదవస్థవంటిదే. జాగ్రదవస్థయందేయేపదార్థముల ననుభవించునో స్వప్నావస్థయందు వానినే యనుభవించును" అను మొదలగువాక్యములచే స్వప్నజాగ్రదవస్థలకు సమానస్థితిని వర్ణించుచున్నది. ఈకారణమువలన స్వప్నజాగ్రతలు సంపూర్ణముగ సమానములే యని తేలుచున్నది. కావున నిర్వివాదముగ సృష్టి సత్యమైనదియే పైన నుదహరింపఁబడిన శ్రుతులన్నియు "సృజతే" యనుశ్రుతికి ననుకూలము లగుటచే నదియే ప్రమాణభూత మైనది.

## అ_౩. పా_౨. సూ_౩.

అవతారిక:—పై పూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

# 3-2-2. మాయామాత్రం తు కార్త్స్న్యేనా నభివ్యక్తస్వరూపత్వాత్. 3. 2. 3.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. స్వప్నావస్థయం దలి పదార్థములు సత్యములు కానేరవు. అవియన్నియు నున్నట్లు మాత్రమే కానవచ్చునవి కాని వాస్తవస్థితిలో నుండునవి కావు. వాని యందు సత్యపదార్థమునకు నుండవలసినధర్మము లన్నియు లేవు. సత్యము లగుపదార్థములు దేశకాలభేదము లేక అనఁగా పట్టణము పట్టణముగను గ్రామము గ్రామముగను అరణ్య మరణ్యముగను పగలు పగలును రాత్రి రాత్రిగ నున్నదున్నట్లు గానఁబడుచుండును. ఎప్పటికి నట్లే కానఁ బడుచు మఱియొకజ్ఞానముచే బాధింపఁబడకుండును. సర్వకాలముల యందును అవి గానవచ్చుటకు చక్కని కారణము లుండును. ఈస్వప్న పదార్థములు గానవచ్చునప్పుడు వానియం దీధర్మము లుండవు.

మొట్టమొదట స్వప్రకారమునందు గానవచ్చురథాదులకు తగిన స్థలము లేదు. అత్యల్పపరిణామము గలిగి అన్నివైపులను మూయఁబడి యున్న దేహమునందు రథము లెట్లుండఁగలవు? స్వప్నము దేహమునందే కదా కలుగుచున్నది! "ఇట్లు కాదు. నిద్రాసమయమున జీవుఁడు శరీరము నుండి వెలుపలికిఁబోయి సంచరించి యచ్చటిరథాదులను దాల్చి మరల వచ్చును. 'బహిష్కులాయా దమృతశ్చరిత్వా' 'ఈదేహమును విడిచి జీవుఁ డిటునటు సంచరించి" అని యీవిషయమును శ్రుతియుఁ జెప్పు చున్నది. ఇప్పుడు రథాదులకు నుచితదేశ ముండవచ్చును కదా!" అని యెద వేమొ అది యుక్తము కాదు. ఈశ్రుతి యౌపచారిక మనియే చెప్పవలయును. ఆస్వప్న ప్రకారమున జీవుఁ డీదేహమున నున్నను లేని వాఁడే. అప్పు డీదేహముతో నేకార్యమునుగూడ నాచరింపఁడు కదా. నిష్ప్రయోజనమగుటచే నీదేహ మప్పుడు లేనియట్టిదే యగును; ఆతఁడును దీనిని విడిచినట్టివాఁడే యగును. ఈ యభిప్రాయముతోనే పైశ్రుతి యట్లు చెప్పెను కాని యన్యము కాదు. వాస్తవముగ జీవుఁడు దేహమును విడిచి పోయినఁ బ్రాణాదు లన్నియు వాని ననుసరింపవలసినవే కదా! ఇది ప్రత్యక్షవిరుద్ధము. నిదురించువాని నెవ్వఁడును మృతునిగ భావించుట

లేదు కదా కావున నెట్లును శ్రుతి యౌపచారికమే; రథాదులకు నుచిత దేశ మెట్లును సంభవింపదు.

మఱియు నిదురించువానికి స్వప్నమొక్కక్షణమాత్ర ముండును. ఇంతలో వాడనేకయోజనములదూరము నడచి మరలవచ్చునని కల్పించుటకు నెట్లు వీలు కలుగును? ఒకవేళ నట్లు కల్పించుటకుఁ జూడ సాహసించినను లోకానుభవవిరోధము తప్పదు. అనేకులు స్వప్నములందు దూరదేశములకు మాత్రమే జని తిరిగి రాకమునుపే తమపడకలపై మేల్కాంచు చున్నారు. "నేను కలలో కాశికిఁ బోయితిని. అచ్చట గంగాస్నానముఁ జేయఁబోవు చుండఁగా మెలకువ వచ్చినది." అని చెప్పువారి నెందఱిఁ జూచియుందుము. మఱియు జీవుఁడీస్థూలదేహముతోఁగూడ బ్రయాణమైనట్లే కలగాంచును. అదియే సత్యమైనచో కాశీప్రయాణము కలలో వచ్చినయెడల వానిదేహము పడకపై నుండ కూడదు. ఇది యనుభవవిరుద్ధము కదా! మఱియు కలలో నొకస్థలమున నొకవిధముగఁ జూడఁబడిన పదార్థములు జాగ్రదవస్థలో మఱియొకస్థలమున మఱియొకవిధముగ నుండుటయుఁ గలదు; బొత్తుగనే లేకుండుటయుఁ గలదు. కావున నెట్లును స్వప్నమున జీవుఁడు దేహమును విడిచిపోవుటకు వీలు లేదు. "స యత్రైత త్స్వప్న్య యా చరతి" "ఆజీవుఁడు స్వప్నానుభవమునకై సిద్ధపడి" అని యారంభించి "స్వే శరీరే యథాకామం పరివర్తతే"="తనశరీరమునందే స్వేచ్ఛగా సంచరించును." అని స్పష్టముగనే "స్వప్నము శరీరమునకు లోపలనే కలుగును." అని శ్రుతిచెప్పుచున్నది. కావున "బహిష్కులాయాత్" అను శ్రుతి గౌణియే. దానికి పైనచూపినవిధముగ నితరశ్రుతుల తోను యుక్తులతోను విరోధము కలదుకదా, కావున నెట్లు నిర్ణయింపఁ బోయినను స్వప్నమునందలి పదార్థములకుఁ దగిన స్థలము సంభవింపదు. ఆధారము లేకున్న నాధేయ మెట్లు సత్యరూప మగును? ఈకారణము వలన స్వప్నమున ననుభవింపఁ బడిన గమనాగమనము లసత్యములే యని తేలుచున్నది.

ఇట్లే స్వప్నమునందలి పదార్థములకు నుచితకాలము కూడ లేదు. కలగాంచునప్పుడు రేయిని పగలుగాను పగటిని రేయిగాను భావించుట యనుభవములో నున్నది. మఱియు కల వచ్చునది యత్యల్పకాలమే యైనను అందనేక సహస్రసంవత్సరము లనుభవింపవలసిన సుఖదుఃఖముల

ననుభవించుచున్నాము. ఇది యంతయు స్వభావవిరుద్ధము కదా ! కావున నీకారణమువలనకూడ స్వప్నమునందలి పదార్థములు సత్యములు కానేరవు.

ఇదియును గాక స్వప్నమునందు పదార్థనిర్మాణమునకుఁ గాని తదనుభవమునకుఁగాని తగినసాధనములు లేవు. ఆసమయమున నింద్రియము లన్నియు స్వకార్యములయందు లీనము లయ్యెను కదా! అచ్చట రథాదుల నిక దేనితోఁ జూచును. దేనితో నిర్మించును? అప్పుడు కాష్ఠాదులును ఉలి మొదలగుసాధనములును లేవుగదా! కావున నాపదార్థములు సంకల్ప మయములే యనియు జాగ్రత్పదార్థములవలె సత్యములు కావనియుఁ జెప్ప తీరవలయును.

ఇది యంతయునుగాక స్వప్నమునందలి పదార్థములు జాగ్రదవస్థయందుఁ గానరావు. స్వప్నమునందైనను సమానస్థితితో నుండవు. ఒకప్పుడు రథ మని నిర్ణయింపఁబడినపదార్థ ముత్తరక్షణముననే మనుష్యుఁడుగ మారును. అదియు నొక్కనిమేషమునకు వృక్షముగ మారిపోవును. ఇట్లు క్షణక్షణమునకు మారుటచేతను యథార్థజ్ఞానముచే బాధింపఁబడుటచేతను కూడ స్వప్నమునందలిపదార్థములు అసత్యములే.

"రజ్జుసర్పాదిభ్రాంతులయందు సర్పజ్ఞాన మున్నసమయమున రజ్జుజ్ఞానము కాని యది యున్నసమయమున సర్పజ్ఞానము కాని లేకపోవుటచే నారెంటికిని పరస్పరవిరోధము లే దనియు నీకారణమువలన నొకదాని నొకటి బాధింప దనియు నిట్లే జాగ్రత్ జ్ఞానమువలన స్వప్నజ్ఞానమునకు బాధ లే దనియు చెప్పితిమి కదా" అనియెద వేమొ వినుము. త్రాడు సర్పముగఁ బ్రత్యక్షప్రమాణముచే గ్రహింపఁబడినప్పుడు ఆప్రత్యక్షము దీర్ఘకాలమువఱకు నుండదు కాని మఱియొకవిశేషము కలదు. "ఇది సర్పము" అనుప్రత్యక్షజ్ఞానము కలిగినవెంటనే "ఈసర్పము కూడ తక్కినసర్పములవలె సత్యము" అని యనుమాన ముదయించును. ఎవ్వఁడే పదార్థమును గ్రహించినను "ఇది సత్యము" అని మాత్రమే కదా గ్రహించును. ఈకారణమువలన పైఁజెప్పినయనుమానము నాశ్రయించి జనించినప్రత్యక్షము చిరకాలమువఱకు (అనఁగా రజ్జుజ్ఞానము కలుగునంతవఱకు) నుండును. ఇట్లుండుటచే రజ్జుసర్పజ్ఞానములు రెండు నొకపదార్థమునుగూర్చినవియే కావున వానికిఁ బరస్పరవిరోధము కలదు. అందును

ఉత్తరజ్ఞానము పూర్వజ్ఞానముల బాధించును. సంభవింపనిదానిని నిషేధించుట కలుగదు గావున పరస్పరవిరోధము గలసమానపదార్థవిషయక జ్ఞానములలో మొట్టమొదట జనించినది సంభవ మనియు (సంభవ మనఁగా నిరూపణము) రెండవమారు జనించినది దానివిశేష మనియు నిర్ణయింపఁబడును. "రజతం గృహ్యమాణం హి చిరస్థాయీతి గృహ్యతే, భవిష్యచ్ఛుక్తికాజ్ఞానకాలం వ్యాప్నోతి తేన తత్, ఆగామిత్వాదబాధిత్వా పరం పూర్వం హి జాయతే, పూర్వం పునరబాధిత్వా పరం నోత్పద్యతే క్వచిత్" "వెండి గ్రహింపఁబడునప్పుడు సత్యమనియే గ్రహింపఁబడును. ఈకారణమువలన 'ఈముత్యపుచిప్ప' అను యథార్థజ్ఞానము కలుగు సమయమునందు కూడ నారజతజ్ఞాన ముండును. శుక్తిజ్ఞానము భవిష్యత్ కాలమున రాఁబోవునది కావున దానిని మొట్టమొదట జనించిన రజతజ్ఞానము బాధింపనేరదు. సుషుప్తిజ్ఞాన మన్ననో వెనుక జనించునది కావున మొట్టమొదటినుండియు నున్నరజతజ్ఞానమును బాధించియే తీరును" అని యీవిషయమును మహాత్ములే దృఢము గావించియున్నారు. కావున స్వప్నమునందు గానవచ్చినపదార్థములు అచ్చటనే మార్పుల నొందినచో పరస్పరజ్ఞానబాధితము లగు ననుటలో సంశయము లేదు. అట్టిబాధ లేకున్నను ఎప్పటికప్పుడు నిత్యము లనియే తలంపఁబడును కావున జాగ్రదవస్థవఱకు ప్రత్యక్ష మనువర్తించుచుండుటచే జాగ్రద్జ్ఞానము వలన నని (స్వప్నపదార్థములు) బాధింపఁబడును. జాగ్రదవస్థయందుఁ గానరాకుండుటచే నసత్యము లని నిర్ణయింపఁబడును.

"కాలభేదమువలనఁ గాని సామగ్రీభేదమువలనఁ గాని అనేకరూపభేదములు ఒక్కదానియందే గానఁబడును" అనుటకు వీలు లేదు. పాలు పెరుగుగా పరిణమించునుగాన నచ్చట విపరీత మేదియు లేదు. పరిణమింపక ముందు పాలును పిదప పెరుగును ప్రత్యేకముగఁ గానరావచ్చును. కార్యకారణములు పరమార్థస్థితిలో నభిన్నములే కాని వానికి ననిర్వచనీయభేదము కలదని సిద్ధాంతము చేసియున్నాము! త్రాడు పాముగఁగానవచ్చుటయు ముత్యపుచిప్ప వెండిగాఁ గానవచ్చుటయు నిట్టిది కాదు. అచ్చట స్వరూపపరిణామము లేదుకదా! ఇక నొక్కపదార్థమే రజ్జుసర్పరూపములతోను శుక్తిరజతరూపములతోను ఉండుననియు కొంతకాలము ఒక్కొక్కరూపముతో నుండుననియుఁ జెప్పవలసివచ్చును. ఇదియు విరుద్ధమే. ఒక వెండి

పాత్ర నూఱుసంవత్సరము లున్నను ముత్యపుచిప్పతో చేయఁబడిన పాత్ర యగుట లేదు. చక్కనిదృష్టి గలయొకఁడు వెండిని చూచుచుండ నట్టివాఁడే మఱియొక్కఁడు దానిని ముత్యపుచిప్పనుగా జూచుట లేదు. మఱియు ననుభవమునుబట్టివిచారించిన పాలును పెరుగుగా గ్రహించుజ్ఞానమునకును ముత్యపుచిప్పను వెండిగా గ్రహించుజ్ఞానమునకును భేద మనంతముగ గలదు. మొట్టమొదటిది కార్యకారణసంబంధమగుజ్ఞానము రెండవది యట్టిదికాదు. ముఖ్యముగా రెండవదానియందు గలజ్ఞానములు పరస్పరము బాధింపఁబడు ననియు నిదివఱకే నిరూపించితిమి. శుక్తిజ్ఞానము రజతజ్ఞానమును బాధించు నని నిర్ణయించితిమి కదా! ఈకారణములవలన వస్తువులు కాలభేదమువలన భిన్నరూపములతోఁగానఁబడు ననుట చెల్లదు. ఇఁక సాధనభేదమువలన భిన్నరూపములతో గానవచ్చు నని చెప్పిన నప్పటికిని పదార్థమునకు ననేకరూపము లుండవలసివచ్చును కదా! మీమతమున భ్రాంతి యనునది లేకపోవుటచే నారెండులోపములును వాస్తవములే కావలయును. దృష్టియందుమాత్రమే సాధనభేదమువలన సామర్థ్యభేదము కలదుగాని పదార్థమునందు లేదు కదా! ఇది సంభవింపదు. అప్పుడు ఎండమావులు నీరుగాఁ గొందఱిచేఁ దలంపఁబడుచుండుటవలన నొక్కపదార్థమునందే ఎండమావులరూపంబును జలరూపంబును కూడ నుండవలసి వచ్చును. అప్పుడు ఒక్కపదార్థమే దప్పి నార్చుట పదార్థరూపములను ప్రకాశింపఁజేయుట యను రెండుకార్యములనుఁ గూడ జేయవలసియుండును. ఇది ప్రత్యక్షవిరుద్ధము. ఎండమావులఁ బానముచేసి యెవ్వఁడైన దప్పి తీర్చుకొనెనా? "తీర్చుకొనకపోనిమ్ము;ఇంతమాత్రమువలన ఎండమావులు జలము లేల కాకపోవలయును?" అనియెద వేమొ వినుము. దప్పితీర్చునదియే జలమనుట లోకప్రసిద్ధి. ఇట్లుండ దప్పితీర్పనివి జలము లెట్లగును? "ప్రత్యక్షముగ జలములై కానవచ్చుచున్నవికదా" అనియెదవేమొ వినుము. ఇట్లుపట్టుపట్టినను భ్రాంతి లేదనుటకు వీలు కలుగదు; చెప్పెదము. ఎండమావులయందు కానవచ్చునీరు చూచువానికి దప్పికతీర్పఁగలది యని తోఁచునా? తీర్పలేనిది యని తోఁచునా? మీమతము ననుసరించి చూచిన దప్పిక తీర్పఁగలవియు తీర్పలేనివియు నని రెండువిధము లగుజలము లుండవలయును కదా! ప్రత్యక్షానుభవము నాశ్రయించి చూచిన ఎండమావులలోనిజలములు దాహము నార్చునవి కావని సిద్ధాంత మగుచున్నది.

ఈకారణమువలన పైఁజూపినపక్షములలో రెండవదాని నాశ్రయించి "ఎండమావులలోనినీరు దాహము నార్పనేర దనుయథార్థవిషయమే పురుషునకు బుద్ధిగోచర మగును" అనియే చెప్పవలయును. ఇట్లయిన నప్పుడెంతదప్పిక గలవాఁడైనను ఎండమావుల జలమునుఁగూర్చి పరుగిడుట యయుక్త మగును. ఇట్టిస్థితి లోకమునందే యుండకుండవలసి వచ్చును. ఈయనుభవము సమకూర్చుటకై ఇఁక నేమి చెప్పవలయును ? "ఎండమావులనీరు వాస్తవస్థితిలో శక్తి లేని దైనను దానియందు శక్తి యున్నదియని భావించి యట్లు పరుగిడుచున్నాఁడు." అని చెప్పవలయును. ఆహా, యిప్పుడు మాకును మీకును మార్పేమి కలిగెను. "పురుషుఁడు తెలిసికొనలేక ఎండమావులనే నీటినిఁగా గ్రహించుచున్నాఁడు" అని మేము చెప్పుచున్నాము. "ఎండమావులలోనినీరు పరమార్థమే యైనను దానికి దప్పిక నార్చు శక్తి లేదు. దీనిని తెలిసికొనలేక నట్టిశక్తి యున్నట్లు భావించి పురుషుఁడు దానికడకు పరుగిడుచున్నాఁడు." అని నీవు చెప్పుచున్నావు. లోకానుభవానుసారముగ లఘు వగుమాపక్షము నంగీకరింపక నిష్ప్రయోజనముగా క్రొత్తకల్పన నేల చేయవలయును? ఈకారణముల వలన నొక్కపదార్థమునకే యనేకరూపము లుండు ననుటయు కాలభేదము వలనఁగాని దృష్టిభేదమువలనఁగాని ఒక్కొక్కమాఱు ఒక్కొక్కరూపము గానఁబడు ననుటయు యుక్తియుక్తము కాదు. కావున భ్రాంతివశమున నున్నది లేనట్లును లేని దున్నట్లునుఁగూడఁ గానవచ్చును. స్వప్నపదార్థము లిట్టివే? బొత్తుగ లేకుండియే యున్నట్లు గానవచ్చుచున్నవి. "న తత్ర రథా న రథయోగా న పంథానో భవంతి" అనుశ్రుతి స్వప్నపదార్థములయభావమును స్వయముగనే చెప్పుచున్నది. పైఁజూపిన ప్రమాణములవలన నీశ్రుతి యౌపచారికము కానేరదు. సృష్టిశ్రుతియే గౌణి కాని ప్రస్తుత నిషేధశ్రుతిమాత్రము కాదు. కావున స్వప్నపదార్థములన్నియు మాయామాత్రములే కాని వాస్తవములు కావు.

## అ_౩. పా_౨. సూ_౪.

అవతారిక:—"ఇట్లయిన స్వప్నమునందు సత్యత్వ మించుకయైనను లేదా ? అనేకస్థలములయందు స్వప్నమునకును జాగ్రదవస్థకును గూడ సంబంధము గానవచ్చుచున్నది. ఒకపురుషుఁడు తెల్లనివస్త్రము

లను గంధమాల్యాదులను ధరించి ప్రియవ్రతునిఁ గానవచ్చి "ప్రియవ్రత! నీకు నేఁటి కైదవదినమునఁ బ్రభువు భూదానముఁ జేయును" అని చెప్పె ననియు నావాక్యము సత్యమే యయ్యె ననియుఁ జెప్పఁబడి యున్నది. ఇట్లు సామాన్యపురుషుఁడు చెప్పినవాక్యమే సత్యమగుచుండ నిఁక స్వప్నాధ్యాయాదుల ననుసరించి సిద్ధాంతము చేయఁబడిన బ్రాహ్మణాదులు చెప్పినవాక్యములు సత్యము లనుటలో సంశయ మేమి యుండును? ఈ కారణమువలన సత్యము లగుపదార్థములతో సంబంధము కలవి కావున స్వప్నపదార్థములును సత్యములే" అనిన సమాధానముఁ జెప్పుచున్నాఁడు.

## 3-౨3. సూచకశ్చ హి శ్రుతే రాచక్షతే చ తద్విదః. 3. ౨. ౪.

తాత్పర్యము.—సత్యమే జాగ్రదవస్థయందలి పదార్థములతో స్వప్నపదార్థములకు లేక జ్ఞానములకు సంబంధము కలదు. కాని అది యేసంబంధము? సూచ్యసూచకభావసంబంధము. స్వప్నజ్ఞానము జాగ్రదనుభవముల సూచించును. ఇంతకంటె రెంటికి నధిక మగుసంబంధము లేదు. ఈవిషయము వేదమునందు స్పష్టముగఁ జెప్పఁబడియే యున్నది. "యదా కర్మసు కామ్యేషు స్త్రియం స్వప్నేషు పశ్యతి సమృద్ధిం తత్ర జానీయాత్" "ఏదియో యొకకర్మ నాచరించునప్పుడు స్వప్నమునందు స్త్రీనిఁ జూచె నేని యాకర్మ సమృద్ధి నొందు నని తెలిసికొనవలయును" అను మొదలగువాక్యము లిందుకు ప్రమాణములు. స్వప్నశాస్త్రవేత్తలును "స్వప్నమునందు గజాదుల నెక్కిన శుభము; గాడిదె మొదలగువాని నెక్కిన నశుభము" అని చెప్పుచున్నారు. కావున స్వప్నజ్ఞానము జాగ్రదనుభవముల సూచించునే కాని మఱి యేమియు లేదు.

"అగునుఁ గాక యెట్టిసంబంధ మున్నను స్వప్నముకూడ జాగ్రత్తువలె సత్యమే కావలయును. అట్లు కాకున్న సత్యవిషయముల సూచింపఁ గలుగుట యెట్లు" అనియెదవేని వినుము. సూచించినంతమాత్రమున పదార్థములు సత్యములు కావలసినపని లేదు. వానికి బాధ కల దని యిదివఱకే చెప్పి యున్నాము. స్వప్నమునందు గానవచ్చు పదార్థములకు తగిన దేశకాలాదులు లేకపోవుటచే నసత్యము లని నిరూపించియున్నాము.

"పదార్థము లసత్యము లైనను తద్విషయ మగుజ్ఞానము మాత్రము సత్యము కావచ్చును కదా!" అనియెదవేమో. అదియు యుక్తము కాదు. శుద్ధజ్ఞానము సత్యమే కాని మఱియొకవిషయము నాశ్రయించినప్పుడు మాత్రము ఆపదార్థముయొక్క సత్యత్వాసత్యత్వముల ననుసరించియే యాజ్ఞానమునకుఁ గూడ సత్యత్వాసత్యత్వములు వచ్చును. ఎండమావుల యందు నీటినిఁ జూచిన నప్పటిజ్ఞానమును భ్రాంతిజ్ఞానమును గాను యథార్థ జ్ఞానముచే నశించునది కావున ననిత్యజ్ఞానమునుగాను చెప్పుదురు కదా! ఈయనుభవమువలన స్వప్నపదార్థము లసత్యము లగుటచే జ్ఞానముకూడ నసత్యమే యని చెప్పఁబడుచున్నది. విచారించిన జ్ఞానముమాత్రము వ్యవహారములో సత్యమే పైఁజూపిన యనుభవమునకు "స్వప్నజ్ఞానమునకు జాగ్రద్జ్ఞానమునకువలె పారమార్థికసత్యత్వము లేదు." అని మాత్రమే యర్థముకాని "ఆజ్ఞానము బొత్తుగనే సత్యము కాదు." అని యర్థము కాదు. వాస్తవస్థితిలో జాగ్రద్జ్ఞానముకూడఁ బారమార్థికసత్యము లేకున్నను ఆజ్ఞానమునకు బ్రహ్మస్వరూపపరిజ్ఞానసమయమువఱకు బాధ లేదు కావున నిట్లు చెప్పఁబడెను. స్వప్న మేనమున కాదినముననే బాధింపఁ బడునది కదా! మఱియుఁ బ్రతివాఁడును "నేను కలగంటిని" అని స్వప్న జ్ఞానమును సత్యముగానే తలంచుచున్నాఁడు; యుక్తిచే నసత్యముగ నిరూపింపఁబడుచుఁ గూడ నున్నది. ఈకారణమువలన స్వప్నపదార్థము లసత్యము లైనను జ్ఞానముమాత్రము వ్యావహారికసత్యము కావచ్చు నని తెలుచున్నది. అనుభవమును బట్టిచూచినను నిదురయందు స్త్రీరూపము గానవచ్చినచో తత్ జ్ఞానమువలన కలిగినరేతస్థలనాదులు మాత్రముజాగ్రదవస్థయందుఁ గూడ గానవచ్చు చున్నవి గాని యప్పుడు స్త్రీచే నాచరింపఁబడిన దంతనఖక్షతాదులు మాత్రము గానవచ్చుట లేదు. దీనికిఁ గారణ మేమి? స్వప్నజ్ఞానము వ్యావహారికసత్య మగుటచే దానివలనఁ గలిగినకార్యములు కూడ సత్యము లైనవి; స్త్రీమాత్ర మసత్యరూపిణి యగుటచే దత్కార్యములు కూడ నసత్యములే యైనవి. ఇట్లగుటచేత జాగ్రదవస్థయందలి సత్యానుభవములను సూచించినను స్వప్నపదార్థములు సత్యములు కానేరవు. ప్రియవ్రతునివృత్తాంతము కాకతాళీయముగా సంభవించినదియే యని చెప్పవలయును. స్వప్నమున వచ్చినపురుషుఁడు సత్యరూపుఁడై వానివాక్యము కూడ సత్యమై జాగ్రదనుభవము

కలుగలే దనవలయును. లేకున్న బహుయుక్తులకు విరోధము వచ్చును, "స్వప్నాధ్యాయమున బ్రాహ్మణాదులు చెప్పినవాక్యములు సత్యము లగు నని కలదు కదా! ఇట్లు చెప్పిన నది మాత్ర మెట్లు యుక్తియుక్త మగును." అనియెదవేమొ. అది సామాన్యబ్రాహ్మణులను గూర్చి చెప్పఁబడినవిష యము కాదు. మంత్రోపాసనాదులఁ జేయువారలకు నాదేవతలు స్వప్న మునఁ బ్రత్యక్షములై వరముల నొసఁగుట కలదు. అవి దేవతాప్రభా వమువలనఁ గలిగినవి యగుటచే సత్యములే యగును. కావున నెట్లును స్వప్నమునందలి పదార్థములు సత్యములు కావు; కావలసినపనియు లేదు.

ఈకారణములవలన "పథః సృజతే" అనుసృష్టి శ్రుతికి గౌణ ముగా మాత్రమే వ్యాఖ్యానముఁ జేయవలయును. లోకమున "నాఁగలి సర్వలోకమును పోషించును" అను మొదలగువాక్యములయందు నాఁగలి మొదలగునవి ధాన్యములను ఫలింపఁజేయుటకు సాధనము లగుటచే (నవి) లోకరక్షణక్రియకుఁ గర్తలుగా వర్ణింపఁబడుచున్నవి. ఇట్లే జీవుఁడును రథాదిదర్శనమువలన కలుగుహర్షశోకములకు నాశ్రయుఁ డగుటచేతను తన్నిమిత్తము లగుపుణ్యాపాపములకుఁ గర్త యగుటచేతను రథాదిసృష్టికిఁ గూడఁ గర్తగాఁ జెప్పఁబడెనుగాని వాస్తవస్వభావముఁబట్టి కాదు. చిత్తము నందలి సంస్కారభేదమువలన లేనిపదార్థము లున్నట్లు గానవచ్చు టయేగాని వాస్తవస్థితిలో స్వప్నమున సృష్టియే లేదు. మఱియు జాగ్రద వస్థయందు విషయేంద్రియ సంబంధంబును సూర్యాదిప్రకాశములు నుండు టచే "జీవుఁడు స్వయముగనే సర్వమును గ్రహింపఁగలుగుచున్నాఁడా? లేక పరసహాయమువలననే గ్రహింపఁగలుగుచున్నాఁడా?" అనుసంశ యము రాఁగా దానిని నిర్ణయించుటకై స్వప్నావస్థ శ్రుతియందు వర్ణింపఁ బడి యున్నది. అప్పుడు పదార్థము లున్నను ఇంద్రియములుకాని సూర్యాదిప్రకాశములుకాని లేకుండుటవలనను జీవుఁడు మాత్రము పదార్థములఁ జూచుచుండుటవలనను "ఈజీవుఁడు ఇతరసహాయముతోఁ బని లేకయే సర్వవిషయముల గ్రహింపఁగలఁడు." అనువిషయము సిద్ధాం తము చేయ నుద్దేశింపఁబడినది. స్వప్నమునందును పదార్థములు సత్య ములే యగునేని యీయుద్దేశ మెట్లు కుదురును? స్వప్నమునందు విష యేంద్రియసంయోగంబును సూర్యాదిప్రకాశంబును గూడ గానవచ్చు చునే యున్నవి కదా! ఈకారణమువలనఁగూడ స్వప్నములయందలి

పదార్థము లుత్పన్నము లగునను శ్రుతి గౌణి యనియు పదార్థాభావము చెప్పు శ్రుతి ముఖ్యమనియు నిర్ధారణ చేయవలసి యున్నది. ఈనిరూపణము వలననే "కామం కామం పురుషో నిర్మిమాణః" అను శ్రుతికూడ గౌణి యనియే సిద్ధాంత మైనది.

ఆ శ్రుతియందు బ్రహ్మమే స్వప్నపదార్థకర్త యని చెప్పఁబడి యుండుటచేతను జీవబ్రహ్మములకును అభేదమే యగుటచేతను బ్రహ్మసృష్టి పరమార్థమే యగుటచేతను స్వప్నపదార్థములుకూడ పరమార్థములే కావలయు నని చెప్పితిమి కదా" అనియెదవేమొ వినుము. "స్వయం విహత్య స్వయం నిర్మాయ" "ఈజీవుఁడు స్వయముగనే సామగ్రులను గూర్చి స్వయముగనే స్వప్నపదార్థములను నిర్మించును." అని మఱియొక శ్రుతియందు స్పష్టముగ స్వప్నసృష్టి జీవకర్తృక మని చెప్పఁబడి యున్నది. ప్రస్తుతశ్రుతియందును "య ఏష" అని సర్వలోకప్రసిద్ధుఁ డగుపురుషునే వర్ణించుటచే జీవుఁడు వర్ణింపఁబడె ననుట స్పష్ట మగుచున్నది. ఈశ్వరుఁడు జీవునివలె ప్రసిద్ధుఁడు కాఁడు కదా కావున నీ శ్రుతియందును స్వప్నసృష్టికర్త జీవుఁ డనియే చెప్పఁబడి యున్నది. "ఇట్లయిన వాక్యశేషమునందును ఆరంభమునందును గలపరమేశ్వరప్రస్తావములు విరుద్ధములగును కదా!" అనియెదవేమొ. శ్రుతికి జీవబ్రహ్మైక్యము నుపదేశించుటయే తాత్పర్యము కావున మొట్టమొదట జీవుని పరామర్శించి వాక్యశేషమున నాతనికే బ్రహ్మరూపమును చెప్పి యున్నది. కావున నింత మాత్రమువలన బ్రహ్మప్రకరణమునకు వచ్చుహాని యేదియు లేదు.మఱియు పరమేశ్వరుఁడు సర్వకర్త సర్వభోక్త యగుటచే నాయనకు స్వప్నమునందును వ్యాపార ముండకపోదు. మేమును అట్టివ్యాపారము లే దనుటలేదు. ఆకాశాదులవలె స్వప్నపదార్థములు సత్యములు కా వనువిషయమును మాత్ర మే చెప్పుచున్నాము. పరమేశ్వరకార్యము లగునాకాశాదులకు కూడ పరిపూర్ణసత్యత్వము లే దని యిదివఱకే (౨. ౧. ౧౪.) నిరూపించి యున్నాము కదా. కావున పరమేశ్వరకార్యమైనను నిత్యముగా నుండవల సినపని లేదు. ఇఁక జీవకార్యమే యైన నేమిచెప్పవలయును? వియదాదులు సంసారనిద్రతొలఁగిపోయి యాత్మజ్ఞాన మనుమెలఁకువ గలుగునంతవఱకుఁ గానవచ్చుచుండును; స్వప్నపదార్థములు రజస్తమోవికార మగునిద్ర తొలఁగిపోయి సత్వగుణవికాస మనుమెలఁకువ వచ్చునంతవఱకుఁ గాన

వచ్చు చుండును. ఈ రెంటికి నింతియే భేదము. ఈ భేదముచుఁ బట్టియే "స్వప్న ప్రపంచము మాయామాత్రము" అని విశేషముగఁ జెప్పఁబడెను. ఆకాశాదులు నిత్యము లనుటయు గృహాదు లనిత్యములనుటయు ఘటాదు లంతకంటె ననిత్యము లనుటయు రజ్జుసర్పాదులు సంపూర్ణముగ నే లే వనుటయు నిట్టికాలభేదము నాశ్రయించియే కదా యేది యధికకాల ముండునో యది *నిత్య మనియు సత్య మనియు జెప్పఁబడును ; అల్పకాల ముండు నది యనిత్య మనియు నసత్య మనియుఁ బేర్కొనఁబడును. కావున నెట్లును స్వప్నపదార్థములు వాస్తవములు కానేరవు.

## అ 3. పా ౨. సూ ౫.

అవతారిక:—"ఇప్పటికిని స్వప్నపదార్థములు అసత్యము లనుట సిద్ధాంతము కాలేదు. జీవుఁడు పరమేశ్వరునియొక్క యంశము. అగ్నికిని మిణుఁగురులకును ఎట్టిసంబంధము కలదో జీవేశ్వరులకు నట్టిసంబంధమే కలదు. ఈశ్వరునకువలెనే జీవునకును జ్ఞానైశ్వర్యములు మొదలగునవి కలవు. ఇట్లగుటచే జీవుఁడుకూడ స్వప్నమునందు సంకల్పమయముగ సృష్టి నాచరింపవచ్చును కదా" అనిన సమాధానమును చెప్పుచున్నాఁడు.

## 3 ౨ ౫. పరాభిధ్యానా త్తు తిరోహితం తతో హ్యస్య బంధవిపర్యయౌ. 3. ౨. ౫.

తాత్పర్యము:—సత్యమే జీవుఁడు పరమేశ్వరునకు నంశభూతుఁ డనుట యిదివఱకే (ద్వితీయాధ్యాయ తృతీయపాదాంతమున) సయుక్తికముగ నిరూపింపఁబడెను. అయినను వారలకు కల్పితభేదము కలదు కదా! సర్వవ్యవహారములును శాస్త్రములును విధినిషేధములును తుదకు నాత్మావలోకనము గావింపవలయు నని చెప్పువేదాంతశాస్త్రంబును కూడ నీభేదము నాశ్రయించియే కదా ప్రవర్తించుచున్నవి. (చూ. శాస్త్రావతారిక పుట 3—౧౯.) కావున నీశ్వరధర్మములు జీవునకు నుండియుఁ బ్రయోజనము లేదు. లోకానుభవము ననుసరించిన జీవేశ్వరులకు ధర్మముల

* నిత్య మనఁగా నెల్లప్పుడు నుండునది. సత్య మనఁగా పరమార్థమైనది.

యందుఁ గలభేదము ప్రత్యక్షముగనే కానవచ్చుచున్నది. శ్రుతియందును "పరమేశ్వరధర్మము లవిద్యచే జీవునియందు అంతర్థానముఁ జెందింపఁబడి యున్నవి" యని చెప్పఁబడి యున్నది. ఈవిషయమునుగూర్చి యిదివఱకే పలుమాఱు చర్చించి యున్నాము. ఇట్లగుటచే సంసారమున నుండునంత వఱకు నాతనికి స్వేచ్ఛాప్రవృత్తి కలుగదు ; సంకల్పముచే పదార్థనిర్మాణము జరుగదు. ఈకారణమువలన స్వప్నప్రపంచ మెవ్వనిచేతను సృష్టింపఁబడ లేదు. జీవుఁ డసమర్థుఁడు; పరమేశ్వరుఁడు సృష్టికర్త యైనను పదార్థములు నాశరహితములై యుండవలయు నను నియమము లేదు. ఈకారణమువలన "ఏది దీర్ఘకాలము నిలుచును ? ఏది నిలువదు" అనువిషయము విచారణార్హ మగును కావున నప్పుడు పైన నిరూపింపఁబడియున్న యుక్తుల ననుభవముల నాశ్రయించి "స్వప్నపదార్థములు అల్పకాల ముండునవి" యనియు "జాగ్రత్పదార్థములు చిరకాల ముండునవి" యనియు మాత్రమే సిద్ధాంత మగును.

మఱియు నాజీవులు పరమేశ్వరు నుపాసించి తదనుగ్రహమువలన నవిద్యాంధకారమును ధ్వంసము గావించిన నప్పుడుమాత్రమే వారికి అపరిమితజ్ఞానైశ్వర్యయుక్త మగుస్వస్వరూపము ప్రకాశించును. తిమిరవ్యాధిచే నాక్రమింపఁబడిన నేత్రములు గలవా రనేకులు ఔషధబలము వలనను పరమేశ్వరానుగ్రహమువలనను తమదృష్టిని చక్కఁజేసికొన ప్రయత్నించిన నందు చక్కనిసామగ్రి పరిపూర్ణముగ దొరకిన యొకానొకనికి మాత్రమే దృష్టి నిర్మల మగునట్లు సాధకులలో పరిపూర్ణచిత్తశుద్ధ్యాదులు గలయొకానొకనికిమాత్రమే యట్టిస్వస్వరూపజ్ఞానము కలుగును ; సర్వజనులకును స్వభావముగఁ గలుగదు. అట్లు కలిగిననేకదా కలగాంచు ప్రతిజీవుఁడును తనసంకల్పముచే స్వప్నపదార్థముల నిర్మింపఁగలుగుట. కావున నెట్లును జీవసృష్టి లేదు. ఈవిషయము శ్రుతిచేతనే చెప్పఁబడుచున్నది. జీవుని బంధమోక్షములు పరమేశ్వరాధీనము లగునవియే యని నిరూపింపఁబడుచున్నది. పరమేశ్వరు నెఱుంగకుండునంతవఱకు బంధంబును ఎఱింగినపిదప మోక్షంబును కలుగు నని నిర్ణయింపఁబడి యున్నది. "జ్ఞాత్వా దేవం సర్వపాశాపహానిః క్షీణైః క్లేశై ర్జన్మమృత్యు ప్రహాణిః త స్యాభిధ్యానా తృతీయం దేహభేదే విశ్వైశ్వర్యం కేవల ఆప్తకామః" "అపరమేశ్వరు నెఱింగిన సంసారబంధమునకు పాశము లగు

రాగద్వేషాదులు తొలఁగిపోవును. అవితొలఁగిన జన్మమరణము లుండవు. స్వతస్సిద్ధ మగుపరమేశ్వరరూపము గోచర మగును. మఱియు నాయన నుపాసించిన శరీరపరిత్యాగము కాఁగానే బంధమోక్షములకు భిన్న మగు మూఁడవయవస్థను (క్రమముక్తిని - ఇది దుఃఖము లేకుండుటచే బంధమును కాదు; భేదదృష్టి తొలఁగకుండుటచే మోక్షమును కాదు.) సర్వలోకేశ్వరత్వమును పరిపూర్ణకాముఁడై పొందును" అను మొదలగు శ్రుతు లీవిషయమున ప్రమాణములు. ఇట్లగుటచే నెట్లు చూచినను అవిద్యాంధకారావృతు లగుజీవులకు సృష్టిసామర్థ్యము లేదు; స్వప్నము నందలి ప్రపంచము సత్యముకాదు.

## అ_3. పా_౨. సూ_౬.

అవతారిక:—"ఇది, యేమి జీవుఁడు పరమేశ్వరునియంశమే యగుచుండియు నేల జ్ఞానైశ్వర్యప్రకాశము లేనివాఁడు కావలయును? అగ్నియొక్క యంశమైన మిణుఁగుఱులకు ఉష్ణప్రకాశశక్తులు అణఁగిపోవుచున్నవా?" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## 3_౨౫. దేహయోగాద్వా సోఽపి. 3. ౨. ౬.

తాత్పర్యము.—పైసిద్ధాంతమునుగూర్చి యించుకయైనను సంశయింపవలసినపని లేదు. జీవునకు దేహము మనోబుద్ధులు ఇంద్రియములు శబ్దాదివిషయములు వానిని గ్రహించుచు సుఖముగ భావింపుచు క్షణక్షణమునకును పరుఁగులిడు చిత్తవృత్తులు మొదలగువానితో సంబంధము కలిగి యవిద్యావశమున వానికార్యము లన్నియును స్వకార్యములుగనే భావింపఁబడుచుండుటవలన స్వాభావికము లగుజ్ఞానైశ్వర్యము లంతర్ధానము నొందినవి. ఈవిషయమున లోకమునందును ఉపమానము లనేకములు గలవు. అగ్నికి దాహప్రకాశశక్తులు స్వాభావికములే యైనను బూడిదచే కప్పఁబడియున్నప్పుడవి యంతర్ధానము నొందుచున్నవి. అరణులయందు (అరణి యనఁగా నగ్నిని మథించు కాష్ఠము) ఉన్నప్పుడు నట్లే యున్నవి. ఈవిధముగనే ఉపాధిసంయోగమువలన శక్తు లంతర్ధానము నొందవచ్చును. కావున దేహాదిసంబంధమే ఈజీవుని స్వాతంత్ర్యభంగమునకు గారణము. అవి యొనర్చుకార్యముల తానే యొనర్చుచున్నట్లు

తలంచుచు వాని సుఖదుఃఖములు తానే యనుభవించుచున్నట్లు భావించుచు బద్ధుఁడై యున్నాఁడు.

ఇంతమాత్రమువలన జీవుని నీశ్వరభిన్నునిఁగా భావింపవలసినపని లేదు. "అనేన జీవే నాత్మ నానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి. తత్త్వమసి." అను మొదలగు నభేదవిధులచేతను "మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" అను మొదలగు భేదనిందావాక్యముల చేతను శ్రుతి జీవబ్రహ్మైక్యమును ప్రతిపాదించుచున్నది. కావున నుపాధికృతభేదమువలన జీవుఁడు స్వప్నప్రపంచమును స్వయముగ సృజించుసామర్థ్యము కలవాఁడు కానేరఁడు. మఱియు స్వయముగనే సృజించునేని తనకు నిష్టము కానిదానిని సృజింపఁగూడదు. ఎవ్వఁడును తనకు నిష్టముగాని దానిని తలంపఁడు కదా! స్వప్నావస్థయందు దన్ననో భయంకరము లగు పదార్థములఁ గాంచి కలువరించి జాగ్రదవస్థ వచ్చినపిదపఁగూడ వణఁకుచుండువా రనేకులు గలరు. ఈయనుభవము జీవుఁడే స్వతంత్రముగ స్వప్నపదార్థముల సృజించు ననిన విరోధము వచ్చును కదా! కావున నెట్లును స్వప్నప్రపంచసృష్టి జీవకల్పితము కానేరదు.

మఱియు స్వప్నజాగ్రదవస్థలకు పోలిక చెప్పఁబడియున్న దనియు ఆకారణమువలన స్వప్నావస్థకూడ సత్యమే కావలయు ననియు రెండవ సూత్రమున చెప్పియున్నారు. ఆశ్రుతియు స్వప్నావస్థ నిత్య మనుటలోఁ బ్రమాణము కానేరదు. శ్రుతివిరోధ మట్లుండ జీవుఁడు స్వప్రకాశుఁ డను విషయమును నిరూపించుటకై చేయఁబడినస్వప్నోపన్యాసము నిరర్థక మగును. స్వప్నమును జాగ్రదవస్థవంటిదే యైన జీవస్వప్రకాశత్వమును నిరూపించు విషయమున సంశయ మట్లే యుండును కదా కావున నాశ్రుతి కూడా గౌణియే యై తీరవలయును. స్వప్నము జాగ్రదవస్థయందలి సంస్కారములవలన కలుగునది కావునను చూచువానికి జాగ్రదవస్థవలెనే తోఁచునది కావునను శ్రుతియందు వానికి పోల్కి చెప్పఁబడెను కావున నెట్లును స్వప్నపదార్థములు సత్యములు కానేరవు. ఇట్లు సూర్యప్రకాశాదు లేమియు లేకున్నను పదార్థముల గాంచుచున్నాఁడు గావున జీవుఁడు సర్వసాక్షి; ఆతని ప్రకాశింపఁ జేయువాఁడు మఱియొక్కఁడు గానరా లేదు కావున స్వప్రకాశుఁడు. స్వప్నావస్థయందువలెనే జాగ్రదవస్థయందును సర్వపదార్థము లున్నను జీవుఁడు సర్వసాక్షియే; స్వప్రకాశస్వరూపుఁడే

సూర్యాదిప్రకాశములచేఁ బదార్థముల గ్రహింపవలసినయ ప్రకాశుఁడు గాఁడు. సర్వము నున్నను జీవుఁడు మాత్రము తనప్రకాశముచేత స్వతంత్రముగనే విషయగ్రహణమును చేయుచున్నాఁడు. సూర్యాదులే సహాయభూతు లని తలంచుట భ్రాంతి.

---

## ౨. తదభావాధికరణము.

విషయము, సంగతులు, సందేహము:—పూర్వాధికరణమున స్వప్నావస్థనుగూర్చి విచారింపఁబడి "స్వప్నావస్థయందు అన్యసహాయము లేకయే విషయముల గ్రహించువాఁ డగుటచే జీవుఁడు స్వప్రకాశరూపుఁడే" అని సిద్ధాంతము చేయఁబడెను. దాని ననుసరించి *యానంతర్యరూపసంగతిచే నీయధికరణమున సుషుప్త్యవస్థనుగూర్చి విచారింపఁబడును. శ్రుతులయందు ఆయవస్థనుఁగూర్చి పరస్పరవిరుద్ధముగఁ జెప్పఁబడియున్నది. కొన్ని శ్రుతులయందు "తదా నాడీషు సుప్తో భవతి"="ఆసుషుప్తికాలమున జీవుఁడు నాడులయందు నిదురించును" అని యొకస్థలమునను "తాభిః ప్రత్యవసృప్య పురీతతి శేతే"="ఆనాడులగుండా పోయి హృదయకమలమధ్యమున జీవుఁడు సుషుప్తికాలమున శయనించుచున్నాఁడు" అని మఱియొకస్థలమునందును "తాసు తదా భవతి యదా సుప్తః స్వప్నం న కంచన పశ్య త్య థాస్మి న్ప్రాణ ఏ వైకధా భవతి"="ఏసమయమున జీవుఁడు కలలను గాంచక సుషుప్తి నొందునో యప్పుడు నాడులయందే నిలుచును. తత్కాలమునఁ బ్రాణమును (పరమేశ్వరునియందు) నేకీభవించును." అని వేఱొకస్థలమునందును "య ఏ షోఽ న్తర్హృదయ ఆకాశ స్తస్మిన్ ఛేతే"="హృదయకమలమధ్యమున నాకాశ మేది కలదో అందే యీజీవుఁడు పరుండును" అని యొకచోటను "సతా సోమ్య తదా సంపన్నో భవతి స్వ మపీతో భవతి"="ఓశాంతుఁడా! ఆసుషుప్తిసమయమున జీవుఁడు పరమేశ్వరునితో నేకీభవించును, ఆత్మరూపము చెందును" అని మఱియొకచోటను "ప్రాజ్ఞే నాత్మనా సంపరిష్వక్తో న వాహ్యం కించన వేద నాంతరం"="సుషుప్తిసమయమున సర్వజ్ఞుఁడగు బ్రహ్మముచే నాలిం

---

* ఆనంతర్యరూపసంగతి యనఁగా ప్రస్తావము. లేక, స్ఫురణలక్షణసంగతి. (అ-౧. పా-3. సూ-౧౧. పే-౮౩౪. చూ.)

గితుఁడై యాజీవుఁడు బాహ్యాంతరముల నెఱుంగక నానందపరిపూర్ణుఁడై యుండును." అని వేఱొకచోటను చెప్పఁబడి యున్నది. ఈస్థానము లన్నియు ప్రత్యేకముగనే సుషుప్తిస్థానము లగునా? లేక పరస్పరసంబంధమువలన ప్రధాన మగుస్థాన మొక్కటియే యగునా? అనుసంశయ మిందు నివారింపఁబడును.

నాడులుగాని హృదయముగాని సుషుప్తిస్థానము లగునేని యొకానొకప్పుడు పరమేశ్వరుఁడుకూడ నట్టివాఁడే యైనను ప్రయోజన ముండదు. విపరీతజ్ఞానము నశించినను జీవునకు పరమేశ్వరైక్యము సంభవింపదు. సుషుప్త్యవస్థయందు అంతఃకరణోపాధి నశించినను బ్రహ్మప్రాప్తి నియతముగాఁ గలుగుట లేదనియే కదా సిద్ధాంత మగును. ఈసిద్ధాంతమువలన "అవిద్యానాశము కలిగినపిదపఁ గూడ బ్రహ్మైక్యమునకు మఱియొక కారణము నంగీకరింపవలసివచ్చును. జ్ఞానభిన్న మగుసాధనము కర్మయే కావున నదియే మోక్షసాధనము కావలసివచ్చును. అప్పుడు "జ్ఞానా దేవ తు కైవల్యం"="జ్ఞానమువలన మాత్రమే మోక్షము కలుగును." అను శ్రుతికి నీసిద్ధాంతము విరుద్ధ మగును. కావున "పరమేశ్వరుఁ డొక్కఁడే సుషుప్తిస్థానము. నాడులును హృదయకమలము స్థానభేదములు. మేడపై పడకటింటియందు రాముఁడు పుష్పశయ్యపైఁ బరుండి యున్నాఁ డనునప్పుడు పుష్పశయ్య మాత్రమే ప్రధానస్థాన మైనను మేడయు శయనగృహంబును గూడ నెట్లు శయనస్థానము లగుచున్నవో అట్లే నాడీహృదయకమలంబును శయనస్థానము లగుచున్నవి" అనిమాత్రమే నిర్ణయింపవలయును. అప్పుడు జీవబ్రహ్మైక్యమునకును నాయైక్యము జ్ఞానముచేత మాత్రమే కలుగు ననుటకును విరోధ ముండదు. అంతఃకరణోపాధి లీన మగుటచే నప్పుడు జీవునకు బ్రహ్మైక్యము కలుగు ననియు నావిద్య సంపూర్ణముగా నశింపలేదు కావున జాగ్రత్స్వప్నరూప మగు పునరుత్థానము కూడ కలుగు ననియు నిర్ణయింపవచ్చును. కావున నీసుషుప్తివిచార మావశ్యకమని తెలిసికొనవలయును.

పూర్వపక్షము:—పైశ్రుతులయందు నాడులు హృదయకమలము పరమేశ్వరుఁడు అనుమూఁడును సుషుప్తిస్థానములుగఁ జెప్పఁబడి యున్నవి. ఏకకార్యమునకు సాధనములుగా (మూఁడు) అనేక పదార్థములు చెప్పఁ బడెనేని యేమి? స్వతంత్రముగనే యొకప్పు డొక్కటియు

మఱియొకప్పుడు మఱొక్కటియు పురుషసంకల్పాధీనముగ సాధనము లగు చుండుట లోకానుభవసిద్ధము. రాజనివాసమునకై యనేకగృహములు కల వనిన నం దారాజు స్వేచ్ఛానుసారముగ నొకప్పు డొకదానియందును మఱి యొకప్పుడు మఱియొకదానియందును నివసించుచు విహరించు ననియే కదా యర్థము? ఇట్లే జీవుఁడును ఒకప్పుడు నాడులయందును మఱియొక ప్పుడు హృదయకమలమునందును వేఱొకప్పుడు పరమేశ్వరునియందును సుషుప్తినిఁ జెందవచ్చును. ఆధారవాచక మగుసప్తమీవిభక్తిని ప్రయో గించుటచేతను ప్రత్యక్షముగఁ గూడ "అన్యత్రాయతన మలబ్ధ్వా" "మఱి యొకస్థలమున నాధారమును గానక" అని యాయతనశబ్దమును బ్రయో గించుటచేతను శ్రుతి యీవిషయమునే స్పష్టము చేయుచున్నది. "సదా సోమ్య తదా సంపన్నో భవతి" అనుశ్రుతియందు సప్తమీవిభక్తి లేకు న్నను "సతి సంపద్య నవిన్న న విదుః" "జీవుఁడు పరమేశ్వరునియందు జేరియు నావృత్తాంతమును తెలిసికొనవలయును" అని వాక్యశేషము నందు సప్తమీవిభక్తి యుండుటచే దానిని యచ్చట నన్వయించు కొనవల యును. మఱియు నాడులయందైనను హృదయకమలమునందైనను ఆత్మయందైనను జరుగుకార్య మొక్కటియే. అందు కలుగునవస్థలకు నించుక యైనను భేదము లేదు. పదార్థములకుఁ గలనామరూపములను బ్రత్యేకముగ గ్రహించుజ్ఞానము లేకపోవుటయే గదా సుషుప్తి! అది పైమూఁడు స్థానములయందును నేకరూపమయియే సంభవించుచున్నది. ఇది లోకానుభవము. సుషుప్త్యవస్థయందు జీవుఁ డెం దుండినను నవస్థా స్వరూపముమాత్ర మందఱియెడ నేకరూపమయియే యున్నది కదా. కావున నీమూఁడుస్థానములును స్వతంత్రములే కాని పరస్పరసంబంధము కలవి కావు.

"'తాభిః ప్రత్యవసృప్య పురీతతి శేతే...' 'తాసు తదా భవతి యదా సుప్తః స్వప్నం నకంచన పశ్యత్యథాస్మి న్ప్రాణ ఏవైకధా భవతి' అనువాక్యములయందు నాడీహృదయకమలములకును నాడీపరమేశ్వరు లకును సంబంధ మున్నట్లు చెప్పఁబడి యున్నది కదా! పైసిద్ధాంత మెట్లు నిలుచును" అనియెదవేమొ విను. ఇంతమాత్రమువలన నానాడ్యాదులకుఁ గలప్రత్యేకస్వాతంత్ర్యమునకు భంగము గలుగదు. అవి యెప్పటికిని స్వతంత్రముగ వర్ణింపఁబడినవే యయినను పైనుదహరింపఁబడిన వాక్య

ములయందు మాత్ర మొక్కవిశేషము గలదు. ఆజీవుఁడు నాడులయం దొకప్పుడును హృదయకమలమున మఱియొకప్పుడును బరమేశ్వరుని యందు వేఱొకప్పుడును సుషుప్తి నొందునట్లే నాడులమూలమున హృదయకమలమున మాత్రమే యొకప్పుడును పరమేశ్వరునియందు మాత్రమే మఱియొకప్పుడును సుషుప్తి నొందు ననుట యావాక్యములకు నర్థము. ఈకారణమువలన పైసిద్ధాంతములకు భంగ మింతయైనను రాదు; జ్ఞానము వలన ముక్తి దొరకు ననుట యుక్తియుక్తము కాదు.

## అ-౩. పా-౨. సూ-౭.

అవతారిక:—ఈవిధముగ సుషుప్త్యవస్థనుగూర్చి చెప్పుచున్న శ్రుతులపై చేయఁబడిన యాక్షేపమునకు సమాధానమును జెప్పుచున్నాఁడు.

# ౩-౯౬. తదభావో నాడీషు తచ్ఛ్రుతే రాత్మని చ. ౩. ౨. ౭.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. సుషుప్త్యవస్థ నాడులు హృదయకమలము పరమాత్మ యను నీమూఁడుస్థానముల యందును గలసియే కలుగును. జీవుఁడు నాడీమార్గములఁ బ్రసరించి హృదయకమలమును జేరి యందు దహరాకాశరూపముతో నున్నపరమేశ్వరునితో నేకీభవించి నిదురించును. ఇంతియే కాని యొకప్పుడు నాడుల యందును మఱియొకప్పుడు హృదయకమలమునందును మఱియొకప్పుడు పరమాత్మయందు నని కాలభేదముతోఁ బ్రత్యేకస్థానములయందు సుషుప్తినిఁ జెందఁడు. శ్రుతియందు నాడ్యాదు లన్నియును సుషుప్తి స్థానము లనియే చెప్పఁబడి యున్నవికదా! ఆశ్రుతులకును బ్రత్యేకవిధి యందే (నాడులయందుఁగాని హృదయకమలమునందుఁగాని ఆత్మయందుఁ గాని సుషుప్తినొందు నని వికల్పమును విధించుటయందే) యభిప్రాయ మనుటకు వీలు లేదు. అప్పుడు ప్రతిపక్షమునకును నొకపక్షమున బాధ కలుగును. వికల్పమునకు "జీవుఁడు నాడులు మొదలగువాని యందు సుషుప్తిఁ జెందినఁ జెందును లేకున్న లేకుండును" అనియేకదా యర్థము! ఇప్పుడు రెండుపక్షము లేర్పడెను కదా! ఇట్లగు

టచే నాడులవిషయమున "సుషుప్తి నొందఁడు" అనుపక్షము నంగీకరించి హృదయకమలపక్షమున "సుషుప్తి నొందును" అనుపక్షము నంగీకరించిన నాడీశ్రుతికి బాధ వచ్చును. ఇట్లే హృదయకమలవిషయమున నభావ పక్షము నంగీకరించిన నితరశ్రుతులచే హృదయకమలశ్రుతికి బాధ వచ్చును; పరమాత్మశ్రుతికిఁ గూడ నిట్లే బాధ వచ్చును.

ఈకారణమువలననే గత్యంతరము లేని యొకానొకస్థలమునందు మాత్రమే కాని సర్వస్థలములయందును వికల్పమును సిద్ధాంతీకరింపరు. వేదమునందు యజ్ఞమును గూర్చి చెప్పునప్పుడు పురోడాశనిర్మాణవిషయమున (పురోడాశ మనఁగా హోమమునందు వాడఁబడు పిండి) గోధుమల నుపయోగింపవలయు ననియు యవల నుపయోగింపవలయు ననియు రెండు శ్రుతివాక్యములు కలవు. వానియభిప్రాయమును విచారించునప్పుడు వికల్పమనియే నిర్ణయింపఁబడియున్నది. అచ్చట నీనిర్ణయమునకుఁ జక్కని హేతువులు కలవు. పిండిచేయుటకుఁ గావలసినది ధాన్యమే యగుటచే నావిషయమున గోధుమ లైనను యవ లైనను బనికివచ్చును. మఱియు నది కర్మను గూర్చి చెప్పు ప్రకరణముగావున నందలివాక్యము లెట్లున్నవట్లే యన్వయింపఁబడవలయును గాని మఱియొకవిధముగ నన్వయింపఁబడుటకు వీలు లేదు. "గోధుమలను యవలను గూర్చి పిండిని గల్పించును"అని సముచ్చయార్థమును గల్పించుటకు నవకాశము లేదు. అట్లుజేసిన ప్రత్యేకపదార్థములను విధించు రెండువాక్యములును నప్రమాణములే కావలయును కదా! ఈకారణములవలన నాశ్రుతులకు నచ్చట వికల్పము చెప్పఁబడియున్నది. ప్రస్తుతశ్రుతులతాత్పర్యము నిట్లు నిర్ణయించుటకుఁ దగినహేతువు లెవ్వియును లేవు. సముచ్చయార్థమును జెప్పకుండిన పైశ్రుతు లన్నియు నప్రమాణములే కావలసివచ్చు నని యిదివఱకే నిరూపించి యున్నారము.

"ఇట్లు చెప్పనేల? ఈనాడ్యాదు లన్నియు నొక్కకార్యము నాచరించునవియే. జీవుఁడు సుషుప్తియందు వీనిలో లీనుఁ డగును కదా!"అనియొద వేమో వినుము. అట్టికార్యము నాచరించుటకు వీనికి సామర్థ్యంత్ర్యము కలదో లేదో యిప్పటికిని నిశ్చయము కాలేదు. ఒక్కవిభక్తితో చెప్పఁబడియున్నంత మాత్రమున నన్నియు నొక్కకార్యమునే యాచరించు ననుట సిద్ధాంతము కానేరదు. అట్లాచరింపనివానియందును నేకవిభక్తి ప్రయోగము కలదు. "ఆపురుషుఁడు మేడపై శయనగృహమునందు

మంచముపైఁ బరుండి యున్నాఁడు." అను మొదలగు వాక్యములయందు ముఖ్యాధారము మంచమే యైనను మేడ మొదలగువానియందుఁగూడ సముచ్చయార్థమున సప్తమి ప్రయోగింపఁబడెను కదా! కావున నేకవిభక్తి ప్రయోగమాత్రమున వికల్పపక్షము నిలువనేరదు. నాడులయందును హృదయకమలమునందును పరమేశ్వరునియందును గూడ జీవుఁడు సుషుప్తిని జెందు నని సముచ్చయము మాత్రమే సిద్ధాంతము చేయఁబడవలసి యున్నది. "తాను తదా భవతి" అను మొదలగు శ్రుతివాక్యములందుఁ బ్రత్యక్షముగనే నాడీపరమాత్మలకుఁ గల సముచ్చయము ప్రకటింపఁబడి యున్నది. " 'ఆసు తదా నాడీషు సృప్తో భవతి.' అను వాక్యమునందుఁ బ్రత్యేకముగ నాడులనుగూర్చి మాత్రమే చెప్పఁబడి యున్నది కదా!" అనియెద వేమో. అంతమాత్రమున నీసిద్ధాంతమునకు హాని రాదు. నాడీమార్గమునఁ బరబ్రహ్మమును జెందినను జీవుఁడు నాడులయందుఁ బ్రయాణము జేసినవాఁడే యగును కదా! గంగనుండి సముద్రమును జేరఁబోయినవాఁడు గంగపైఁ బ్రయాణము చేసినవాఁడే యగును కదా! కావున నెట్లును నీసముచ్చయ సిద్ధాంతమునకు విరోధము లేదు. ఈశ్రుతియందు "నాడులయందు జీవుఁడు ప్రయాణముచేయును" అని మాత్రమే చెప్పఁబడి యున్నది కాని "బ్రహ్మమును జేరఁడు" అని చెప్పఁబడి యుండలేదు కదా!

మఱియు కేవలనాడులనుగూర్చి చెప్పినవాక్యము స్తోత్రార్థమైనది. ఆప్రకరణమునందు సూర్యరశ్మిలమూలమునను *బ్రహ్మనాడి మొదలగు నాడులమూలమునను బ్రహ్మలోకప్రాప్తి వర్ణింపఁబడి యున్నది. ఆనాడు

---

* బ్రహ్మనాడి యనఁగా హృదయస్థానమున నుండి జీవునకు బ్రహ్మలోకప్రాప్తి సాధన మగునాడి. హృదయస్థానమున నూటనొక్కనాడులు గలవు. అందొకబ్రహ్మనాడి యొక్కటియే శిరమునకుఁ జక్కఁగాఁ బోవును. "శతం చైకా చ హృదయస్య నాడ్య స్తాసాం మూర్ధాన మభినిస్సృతైకా తయోర్ధ్వ మాయ న్నమృతత్వ మేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి" = "హృదయమున నూటనొక్కనాడులు గలవు. అందొక్కటి (బ్రహ్మనాడి) మాత్రమే శిరస్సును జేరెను. ఆనాడి నాశ్రయించి విర్గమించినవాఁడు పునరావృత్తిరహిత మగుబ్రహ్మలోకముఁ జెందును. తక్కిననాడుల గుండా దేహమును విడిచినవాఁడు కర్మానుగుణముగ జన్మముల నెత్తును" అది యీనాడినిఁగూర్చి శ్రుతులయందు చెప్పఁబడెను.

లను నుతించుటకై "ఈనాడులమూలమున జీవుఁడు సుషుప్త్యవస్థయందుఁ బ్రయాణము చేయును" అని మొదటఁ జెప్పి వెంటనే "ఆయన కప్పుడు సుఖదుఃఖభోగములకుఁ గారణము లగుపుణ్యపాపము లేవియు నుండవు" అని చెప్పుచున్నది; అప్పుడు జీవునియింద్రియములు తేజస్సుచే నాక్రమింపఁ బడును. కావున నాతనికి బాహ్యపదార్థగ్రహణము లేదనియు నీకారణమువలననే సుఖదుఃఖములు కాని వానికి సంబంధించిన పుణ్యపాపములు కాని లేవనియుఁ గూడ జెప్పుచున్నది. ఇచ్చట తేజశ్శబ్దమునకు పిత్తరసమని యర్థమైనను బరమేశ్వరుఁ డని యర్థమైనను విరోధము రాదు. సుషుప్త్యవస్థయందుఁ *పిత్తవేగముచే సర్వేంద్రియములును శక్తిహీనము లగు ననుట సుప్రసిద్ధము; పరమేశ్వరునిఁ బ్రాపించినఁ బుణ్యపాపాదు లంట వనుటయు సర్వలోకప్రసిద్ధమే. "బ్రహ్మైవ తేజః" = "పరమేశ్వరుఁడే తేజస్సు" అని పరమేశ్వరునియందు శ్రుత్యంతరమునఁ దేజశ్శబ్దము ప్రత్యక్షముగనే ప్రయోగింపఁబడి యున్నది. ఇట్లగుటచే నీశ్రుతి స్వతంత్రవిషయమును జెప్పునదియే కాఁజాలదు. చెప్పఁబడినదికూడ బ్రహ్మవిషయమే యనియు నిరూపింపఁబడెను. నాడులయందుఁ బ్రయాణముచేయువాఁడు బ్రహ్మప్రాప్తివలనఁ బుణ్యపాపస్పర్శము నొందఁ డనిన ప్రస్తుతసిద్ధాంతము స్థిరపడుటకు నింతకంటెఁ బ్రబలప్రమాణ మేది కావలయును? "అపహతపాప్మా హ్యేష †బ్రహ్మలోకః" = "ఈ బ్రహ్మము సర్వపాపనిర్ముక్తమైనది."

---

* పిత్తవేగముచే నిదురయందు ఇంద్రియములు బలహీనము లగును. నిదుర యనునది విశ్రాంతికై యేర్పడిన దనువిషయ మందఱకును దెలియును. ఇంద్రియములకు శ్రమగలిగినప్పుడే విశ్రాంతి కావలయు ననుటయు సర్వజన విదితమే. కార్యవేగమువలన శ్రమగలిగినప్పుడు ఔష్ణ్యము జనించును దానివలన పిత్తదోష మభివృద్ధి నొందును. ఆపిత్తము శాంతిఁ జెందుటకై నిదురింతురు. ఆనిదురవలన నంతమున నాపిత్తదోష మడంగి ధాతువులు (వాతపిత్త శ్లేష్మములు) సమము లగును. కావున నిదుర ముగియునంతవఱకు ఆపిత్తదోషము నాడులయందే వ్యాపించి యుండునుగావున నప్పుడింద్రియము లెవ్వియు పని చేయనేరవు. ఇదియే స్వప్నావస్థయందుఁ గలుగు నింద్రియదౌర్బల్యము.

† లోక మనఁగా ప్రస్తుతస్థితియందు చూడఁబడునది విచారింపఁబడునది యని మాత్రమే యర్థముచెప్పవలయును. అప్పుడు "బ్రహ్మయే లోకము = బ్రహ్మలోకము" అని యర్థ మేర్పడును. "సర్వజనులచేతను విచారింపఁబడఁదగిన పొందఁబడఁదగిన

అని శ్రుతియందు స్పష్టముగనే నిరూపింపఁబడి యున్నది కదా! కావున కేవల నాడులనుగూర్చి చెప్పు శ్రుతియు నన్యస్థలములయందు సుషుప్తిస్థాన ముగఁ జెప్పఁబడియున్న పరమేశ్వరుని నిషేధింపదు. ఇట్లు నిషేధింపకున్న నీశ్రుతికూడ మార్గప్రతిపాదనపరముగ (సుషుప్తికాలమున పరమేశ్వరు కడకుఁ బోవుమార్గమును దెల్పుచున్నది యని) నర్థము చెప్పవచ్చును.

మఱియు హృదయకమలమునుగూర్చి చెప్పుచున్న శ్రుతియు నిట్టి మాసిద్ధాంతమునకు భంగమును గలిగింపదు. హృదయాకాశమునుగూర్చి చెప్పుటకు నారంభించి యాయాకాశమునందే జీవులకు సుషుప్తిని చెప్పి పిదప హృదయకమలమునందు సుషుప్తి నొందు నని చెప్పుచున్నది. హృదయ కమల మనఁగా లోపల నున్న యాకాశమునకు నావరణ మనుటలో సంశయము లేదు. ఇట్లగుటచే హృదయాకాశమునందు సుషుప్తినిఁ జెందు ననినను హృదయకమలమునందు సుషుప్తినిఁ జెందు ననినను నొక్కటియే. ప్రాకారముచే నావరింపఁబడిన పట్టణమున నున్నవానినిఁ గూర్చి "వాఁడా కోటలో నుండును ; ఆకోటలోనిపట్టణములో నుండును" అని యెట్లయినను చెప్పవచ్చును గదా! కావున నీరెండుశ్రుతులకు నర్థ మొక్కటియే యైనది. "దహర ఉత్తరేభ్యః. ౧. ౩. ౧౪." అనుస్థలమున హృదయకమలమునందలి యాకాశము పరమేశ్వరుఁడే యని తెలిసికొని యున్నాము కదా! ఈకారణమువలన హృదయకమలమునుగూర్చి చెప్పు శ్రుతి పరమేశ్వరునిఁగూర్చి చెప్పునదియే యైనది. "తాభిః ప్రత్యవసృప్య పురీతతి శేతే" అను శ్రుతి నాడులకును హృదయకమలమునకును గూడ సంబంధమును చెప్పుచున్నది. నాడులకును పరమేశ్వరునకును సంబంధము చెప్పునదియే యగుచున్నది. ఇఁక "సతా సోమ్య తదా సంపన్నో భవతి" అను శ్రుతియందు ప్రసిద్ధబ్రహ్మవాచక మగుసచ్ఛబ్దమే యున్నది కావున దానినిఁగూర్చి యింతగ విచారింపవలసినపనిలేదు. కావున నెట్లు చూచినను నాడులును హృదయకమలంబును నప్రధానములు. పరబ్రహ్మమే ప్రధాన మనుసుషుప్తిస్థానము.

---

బ్రహ్మము" అని తాత్పర్య మేర్పడును. ఇట్లుగాక నాపదమునకు చతుర్ముఖలోకము అని యర్థము చెప్పినచో యుక్తియుక్తము కానేరదు. సుషుప్తికాలమున ప్రతిపురుషుఁడును బ్రహ్మలోకమునకు పోఁగలఁడనుట సంభవింపదు కదా!

మఱియు నిప్పటికిఁ జేయఁబడినవాదమంతయు బ్రహ్మాభిన్నము లగునాడులును హృదయకమలంబును జీవునకు నాధారము లగు ననియు జీవుఁడు వానియందు నిలిచియుండు ననియు నంగీకరించి చేయఁబడెను. కాని వాస్తవస్థితిలో నదియే సంభవింపదు. జీవుఁడు బ్రహ్మాభిన్నుఁ డగుటచే నాయనకు నాడ్యాదు లాధారము లగుటకు వీలు లేదు. పరమేశ్వరుఁడైనను గల్పితభేదము నాశ్రయించి యాధారముగఁ జెప్పఁబడవలసిన వాఁడే కాని వాస్తవస్థితిలో (నాధారము) కానేరఁడు. ఇట్లుండ నానాడ్యాదులను సుషుప్తిస్థానములనుగాఁ జెప్పుటకు నెట్లు వీలు కలుగును. అవి జీవునియుపాధు లగునింద్రియాదులకు మాత్రమే యాధారము లగును. బ్రహ్మము సుషుప్తిస్థాన మని చెప్పునప్పుడును వేదము జీవబ్రహ్మాభేదము నుద్దేశించి చెప్పలేదు. జీవుఁడు జాగ్రదాద్యవస్థలయందుఁగాని మఱియొకప్పుడు గాని బ్రహ్మాభిన్నుఁడై యుండి సుషుప్తియం దాయనతో నైక్యమగునని చెప్పలేదు. ఉపాధివశమునఁ బూర్వావస్థలయందు భిన్నునివలెఁ దోఁచుచుండి యాయంతఃకరణము లయింపఁగానే బ్రహ్మరూపుఁ డగుచున్నాఁ డని బ్రహ్మమే యగుచున్నాఁ డనిమాత్రము చెప్పినది. ఇట్లుండ నాడ్యాదులు సుషుప్త్యాధారము లగు ననుట యెట్లు? వికల్పము సంభవించుట యెట్లు?

మఱియు జీవున కొకప్పుడు బ్రహ్మప్రాప్తి లేకపోవు ననుటయు నొకప్పుడు కలుగు ననుటయు సంభవింపదు కదా! ఇట్లుండ సర్వకాలములయందును స్వస్వరూపముతో నుండువాఁడు సుషుప్త్యవస్థయం దొకప్పుడు బ్రహ్మరూపముతో నుండి మఱియొకప్పుడు లేకుండు ననుట యెట్లు సంభవించును? జాగ్రత్స్వప్నావస్థలయందును నుపాధివశమునఁ దద్భిన్నుఁడుగా నున్నట్లు గానవచ్చుటయే కాని యది వాస్తవస్థితి కాదు కదా. కావున జీవుఁడు బ్రహ్మమును విడుచు ననుటయే యెప్పటికిని సంభవింపదు. అగ్ని యుష్ణత్వమునుగాని జలము రసమునుగాని యెన్నటికైనను విడుచునా? కావున సర్వవిధముల నిచ్చట వికల్పమే సంభవింపదు. జాగ్రత్స్వప్నావస్థలయందు లోకులు గ్రహించుచున్న భేదము నాశ్రయించి "సుషుప్త్యవస్థయందు బ్రహ్మప్రాప్తి కలుగును" అని చెప్పుటయే కాని యవి లేకుండిన జీవబ్రహ్మలను వేఱు చేయుటకే యవకాశము లేదు కదా!

ఇదియంతయుఁ గాక మీపక్షము నంగీకరించి సుషుప్తిస్థానములు మూఁడనియు నన్నియు జీవునకు నాధారములే యనియుఁ గాలాంతరముల యందు జీవుఁడు స్థానాంతరముల నొందుచుండు ననియు నంగీకరించినను గొంచెము విచారించిన మీసిద్ధాంతము నిలువదు. సుషుప్తి యనఁగాఁ బదార్థముల నామరూపముల గ్రహించు విశేషజ్ఞానము లేకుండుటయే కదా! ఇది యెన్ని స్థానములయందును గలుగుటకు వీలు లేదు. బ్రహ్మప్రాప్తి కలిగినప్పుడు మాత్రము "యత్ర త్వస్య సర్వమాత్మై వాభూత్తత్కేన కంపశ్యేత్" అను మొదలగు శ్రుతివాక్యముల ననుసరించి సర్వవిశేష విజ్ఞానాభావమును జెప్పవచ్చును. ఇతరస్థలములయం దట్లు చెప్పుటకు వీలు లేదు. ఉపాధిరహితుఁ డైనప్పుడు కాని పరమేశ్వరుని జెందఁడు; పరమేశ్వరునిఁ జెందకుండుసమయములయం దుపాధి విడువదు కదా! ఇట్లుండ నాడులయందుఁగాని హృదయకమలమునందుఁగాని యున్నప్పుడు కలుగునవస్థ విచారింపఁబోయిన సుషుప్తియే కానేరదు. అప్పు డాయన యుపాధిసహితుఁ డయి యుండును. ఉపాధియున్న భేద ముండును; భేద మున్న "యత్ర హి ద్వైత మివ భవతి త దితర ఇతరం పశ్యతి" అను మొదలగు శ్రుతుల నాశ్రయించి చూచిన విశేషవిజ్ఞానముకూడ నుండును. ఈకారణమువలన మీరు చెప్పినవాని నన్నిటి నట్లే యంగీక రించినను మీసిద్ధాంతము నిలువదు.

"ఇట్లు కాదు. పురుషుఁడు బహుదూరమున నున్నపదార్థమును జూడనేరఁడు కదా! ఇట్లే జీవుఁడును బదార్థములఁ జూడలేకపోవచ్చును" అనిన నదియు సంభవింపదు. జీవుఁడు ప్రత్యేకముగ నుపాధిసంబంధ ముతోఁ బనిలేకయే పరిచ్ఛిన్నుఁడై యుండునేని యప్పుడు మాత్రమే తనకు దూరస్థిత మగుదానిఁ దెలిసికొనలేక పోవచ్చును. అట్టిది లేదు. జీవు నకు నుపాధిభిన్న మగుపరిచ్ఛేదకారణ మెద్దియు లేదు. మఱియు నెట్లయి నను దూరదేశమున నున్నదానినిఁ గాని మఱికొన్ని విశేషకారణముల వలన మఱికొన్నింటినిఁగాని చూడలేకపోయినంతమాత్రమున సర్వపదార్థ ములను జూడలేనివాఁడు కానేరఁడు. మేరుపర్వతమును జూడలేనంత మాత్రమున స్వగృహమును గూడఁ జూడలేఁడా? కావున నుపాధివిల యము కలిగినప్పుడు మాత్రమే విశేషవిజ్ఞానాభావము చేకూఱును. అది బ్రహ్మప్రాప్తివలన మాత్రమే కలుగును గావున బ్రహ్మమే సుషుప్తిస్థానము.

నాడులు గాని హృదయకమలము గాని యీ బ్రహ్మముతో సమానములు కానేరవు. పరంపరగా నవియు సుషుప్త్యాధారములే యైనను ఈషన్మాత్రమునఁ గూడ బ్రహ్మమును బోలనేరవు. వీనిని దెలిసికొనుట వలనఁ గలుగు ప్రయోజన మెద్దియు లేదు. ఇది ఫలవంత మగు నేవిధికిని యంగము కాదు. కావున బ్రహ్మవిద్యార్థులు వీనిని గ్రహింపవలసినపనియే లేదు. ఇవి కేవలము *గుణభూతములే. బ్రహ్మమే ప్రధానము. అట్లే యై తీరవలయును. ఆయనను సుషుప్తిస్థానముగ నెఱుంగుటచే బహుప్రయోజనములు కలవు. జీవుఁడు పరమేశ్వరరూపుఁడే యనుటయు నుపాధి రహితుఁడైనచోఁ దత్క్షణమే పరమేశ్వరునియం దేకీభవించు ననుటయు సుషుప్త్యవస్థయందు జాగ్రత్స్వప్నవ్యవహారము నడంగునట్లే మోక్షావస్థయందు సర్వవ్యవహారములు నడంగు ననుటయు నుపాధి భ్రాంతి కల్పితమే యగుటచే నజ్ఞాననాశమున కుత్తరక్షణమే ముక్తి యనుటయు సిద్ధాంత మగును. కావున నెట్లు చూచినను బరబ్రహ్మమే సుషుప్తిస్థానము.

## అ-3. పా-2. సూ-౮.

అవతారిక:—ఇట్లు సర్వవిషయములను నిర్ణయించి యీ క్రింది సూత్రముచేఁ బ్రబోధమును వర్ణించుచుఁ బై సిద్ధాంతమునే మఱియొక యుక్తిచే నిరూపించుచున్నాఁడు.

## 3-2-8. అతః ప్రబోధోఽస్మాత్. 3. 2. ౮.

తాత్పర్యము:—మఱియు శ్రుతులయందు మెలఁకువవచ్చినవానినిఁ గూర్చి విచారించునప్పుడు "'కుత ఏత దాగాత్' ఈజీవుఁ డెచ్చటనుండి వచ్చెను" అను ప్రశ్నమునకు "య థాగ్నేః క్షుద్రా విస్ఫులింగా ఏవ మేవైతస్మా దాత్మనః సర్వే ప్రాణాః వ్యుచ్చరంతి" "అగ్నినుండి చిన్న చిన్న మిడుఁగుఱు లెగయు నట్లీపరమేశ్వరునుండియే జీవులంతయు నెగయుదురు" అని సమాధానము చెప్పఁబడియున్నది. జీవులకు నాత్మనుండి నిర్గమము స్వాభావిక మని యుద్దేశింపఁబడినది. దీనికిఁ గూడ నాత్మ సుషుప్తిస్థాన

---

* గుణభూతము = అప్రధానము. కొంచెముపోలిక నాశ్రయించి "ఈ బ్రహ్మచారి అగ్నిహోత్రుఁడు" అను మొదలగువాక్యములయందువలె సంపూర్ణముగఁ బోల్చి చెప్పుట. (గౌణము. ఉ-పే. చూ.)

మగుటయే కారణము. కాకున్నచో నొకప్పుడు "జీవుఁడు నాడులనుండి వెలుపలికి వచ్చును" అనియు మఱియొకప్పుడు "జీవుఁడు హృదయకమలమునుండి వెలుపలికి వచ్చును" అనియు మాత్రమే చెప్పఁబడి యుండవలయును గదా! కావున మెలఁకువనుగూర్చి చెప్పుశ్రుతుల నాశ్రయించి చూచినను నీవిషయమే సిద్ధాంత మగును. జీవుఁడు సుషుప్త్యవస్థయందుపాధిలయ మగుటచేఁ బరమేశ్వరునియం దేకీభవించును సంపూర్ణముగ నవిద్య నశింపలేదు. కావున మఱల జాగ్రదవస్థ నొందును. తత్త్వజ్ఞానమువలన నాయవిద్యనశించెనేని స్వస్వరూపముతో నిలుచును. ఇదియే ముక్తి. ఇది కర్మసాధ్యము కాదు.

---

# 3. కర్మానుస్మృత్యధికరణము

విషయము, సందేహము:—ఈయధికరణమునందు జాగ్రదవస్థకు మరల వచ్చువాని స్వరూపమునుగూర్చి విచారింపఁబడును. "సుషుప్త్యవస్థ నేజీవుఁడు చెందునో యాతఁడే మరల జాగ్రదవస్థకు వచ్చునా ? లేక నియమములేకుండ నెవ్వఁడో మఱియొకఁడు వచ్చునా?" యను *విశయము నివర్తింపఁ జేయఁబడును. "జీవబ్రహ్మములకు నభేదమును జెప్పువారు కావునఁ గల్పితభేదము నంగీకరించినను జీవుఁడు స్వప్నపదార్థములవంటివాఁడే యగుటచే శూన్యరూపుఁడే కావలసివచ్చును. కావున వానికి మెలఁకువయే సంభవింపకపోవుటచేత నద్వైతులమతమున నీయధికరణమే యుండఁగూడదు. వారిమతము ననుసరించిన సుషుప్తియే ముక్తి కావలయును గదా!" అను భాస్కరాచార్యులమతము నిరాకరింపఁబడును. "అజ్ఞాన మనునది పారమార్థికస్థితిలో సత్యము కాకున్నను వ్యావహారికస్థితియందు సత్యమే. అది మూఁడవస్థలయందును జీవు నాశ్రయించియే యుండును. సుషుప్త్యవస్థయందు నంతఃకరణము మాత్రమే నశించును గాని యవిద్య యట్లు కాదు. ఆయంతఃకరణమే జీవున కుపాధి కావున నది లయమొందఁగానే యుపాధిరహితునివలె నాతఁడు పరమేశ్వరునియం దేకీభావము నొందును. అవిద్యానాశము కలుగలేదు

---

* విశయము = సంశయము.

కావున మరల జాగ్రదవస్థకు వచ్చును. మహాకాశములకంటె భిన్నము కాకుండియు ఘటాకాశ మెట్లు తద్భిన్నముగా గమనాగమనముల నాచరించునో యట్లే జీవుఁడును నంతఃకరణోపాధివలన గమనాగమనముల నాచరించును. సంస్కారవశమున నాయంతఃకరణ మెప్పుడు లీనమగునో యప్పుడు (సుషుప్త్యవస్థయందుఁ) దాను స్వయముగ లీనమైనట్లును, ఎప్పుడు మరల వ్యవహారాభిముఖ మగునో యప్పుడు (జాగ్రదవస్థయందు) వ్యవహారాభిముఖుఁ డైనట్లును దలంపఁబడు చుండును." అనువిషయము సిద్ధాంతము చేయఁబడును.

సంగతి:—పూర్వాధికరణమున జీవునకు సంపూర్ణ మగుపరమేశ్వరైక్యము చెప్పఁబడి యున్నది. ఈయధికరణమున మెలఁకువను గూర్చి విచారించుటచే నాజీవపరమేశ్వరులకుఁగల కల్పితభేదము వర్ణింపఁబడును. కావున నీ రెంటికిని (రెండధికరణములకుఁ గలసంబంధ మీకారణమువలన నాశ్రయాశ్రయిభావసంబంధ మగును. మఱియుఁ బూర్వాధికరణాంతమున "జీవుఁడు పరమేశ్వరు నుండియే నిర్గమించె నని చెప్పఁబడి యుండుటచే నాతనికి (జీవునకు) నాపరమేశ్వరుఁడే సుషుప్తిస్థాన మని నిరూపింపఁబడినట్లైనవి" అని సిద్ధాంతము చేయఁబడెను. అది యుక్తము కాదనియు జీవున కేది సుషుప్తిస్థాన మైనను బరమేశ్వరునుండి యెప్పటికప్పుడు క్రొత్త జీవులు జనించి జాగ్రదవస్థయందుఁ బ్రవర్తించుచుండవచ్చు ననియు నీకారణమువలనఁ బూర్వాధికరణమునఁ జూపఁబడినదోషము లన్నియు నట్లే యుండు ననియు నాక్షేపము వచ్చును. కావున నీరెండధికరణములకును గలసంబంధ మాక్షేపసంబంధముకూడ నగును. ఈసంగతితోఁ బూర్వపక్షముకూడ నిట్లు వచ్చును.

పూర్వపక్షము:—సుషుప్తి నొందినజీవుఁడే మరల మేల్కాంచు ననుటకు వీలు లేదు. ఆ రెండవస్థలయందును జీవులు పరస్పరభిన్నులయ్యే యుండవలయును. సముద్రమునందు వైవఁబడిన జలబిందువు సముద్రమే యైనపిదప మరల నెత్తఁబడినప్పు డదియే వచ్చు ననుట సందేహాస్పదమగున ట్లుపాధిలయముచేఁ బరమేశ్వరునియందు లీనమై పరమేశ్వరుఁడే యైనపిదప నాజీవుఁడే మరల జాగ్రదవస్థకు వచ్చు ననుట సంశయాస్పదము. కావున నేజీవుఁడు పూర్వదినమున సుషుప్తినిఁ జెందెనో వాఁడుమాత్రమే మఱునాఁడు మెలఁకువ నొందు ననుట యుక్తియుక్తము కాదు,

## అ-3. పా-2. సూ-౯.

అవతారిక:—అను నీయాక్షేపమును నిరాకరించుచున్నాఁడు.

## 3-2-౯. స ఏవ తు కర్మానుస్మృతిశబ్దవిధిభ్యః.

3. 2. ౯.

తాత్పర్యము.—ఇట్లు చెప్పుట సరికాదు. పూర్వదినమున సుషుప్తి నొందినజీవుఁడే నియమముగఁ బరదినమున మెలఁకువ నొందును. ప్రతి పురుషుఁడును బూర్వదినమునఁ గొఱఁతగఁ జేయఁబడియున్నకర్మను బర దినమున నాచరించుచున్నాఁడు గదా! నిన్నటి జీవునకంటె నేఁటిజీవుఁడు భిన్నుఁడయ్యెనేని దాని నెట్లాచరింపఁగలఁడు? ఒక్కఁడు చేసి కొఱఁతఁ బెట్టి యున్నకర్మను మఱియొక్కఁ డాకస్మికముగ (అనఁగాఁ జేయుచున్న ప్పుడు చూడకయుఁ బరులనుండి యైన నావిషయమును గ్రహింపకయు) ముగించు ననుట యనుభవవిరుద్ధము. అప్పుడు ప్రతివానికిని లోకమునందలి సర్వజనులును జేయుచున్న కార్యము లన్నియుఁ దెలిసియుండవలసి వచ్చును. ఇది విరుద్ధము కదా! కావున నీకారణమువలన రెండుదినముల యందు నొక్కజీవుఁడే యుండవలయు నని తోఁచుచున్నది. మఱియుఁ బ్రతివాఁడును పూర్వదినమునఁ జూచినపదార్థము మఱునాఁడు "నేను దీనిని నిన్న చూచితిని" అని స్మరించుచున్నాఁడు. "నేను నిన్నటివాఁడనే" అని తెలిసికొనుచున్నాఁడు. ఇదియు నిదురించువాఁడొకఁడును మేల్కొను వాఁడు మఱియొకఁడును నైన సంభవింపదు. "పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి బుద్ధాంతాయైవ......సర్వాః ప్రజా అహరహ ర్గచ్ఛన్త్య ఏతం బ్రహ్మలోకం న విందంతి"="సుషుప్తి ముగిసినపిదపఁ బ్రతి జీవుఁడును నియమముగ వానివానిశరీరములయందే మెలఁకువ నొందును. పులిగా నున్నజీవుఁడు మెలఁకువ వచ్చినప్పుడును బులియే యగును. అంచఱుజీవులును సుషుప్త్యవస్థయందుఁ బరమేశ్వరునిఁ జెందియు నావిష యము నవిద్యాశేషమువలనఁ దెలిసికొనలేరు." అను మొదలగు శ్రుతి వాక్యములును నీవిషయమునే నిరూపించుచున్నవి. ఇదియంతయుఁ గాక సుషుప్త్యవస్థ నొందినజీవునకుఁ బునరుత్థానము లేకుండునేని వానినిఁగూర్చి

వేదము హితాహితముల విధించుటవలనఁ గూడఁ బ్రయోజన ముండదు. ప్రతివాఁడును నిదురింపఁగానే ముక్తుఁ డగుచుండును గదా! కావున నెట్లును సుషుప్తిజాగ్రదవస్థలయం దుండుజీవులు పరస్పరభిన్నులు కారు. యజ్ఞాదికర్మలకుఁగాని యుపాసనలకుఁ గాని చిరకాలమునకు ఫలము కలుగును. ఒక్కదినమునకే ముక్తినిఁ జెందువానినిఁ గూర్చియే యట్టివాని నుపదేశించుటవలనఁ బ్రయోజనము లేదు కదా!

మఱియు నొకజీవుఁడు సుషుప్తినొందిన మఱియొకజీవుఁడు మేల్కొంచ వచ్చు నంటిరి కదా! ఆజీవు (మేల్కొంచుజీవు)ఁ డెవ్వఁడు? బద్ధుఁడా? లేక ముక్తుఁడా? మొదటిపక్షము నాశ్రయించిన "మఱియొకశరీరమున నిదురించి యున్నజీవుఁడు ప్రకృతిశరీరమున మేల్కొనును" అనవలయును; అప్పు డాశరీరమునందు (మేల్కొనినజీవుఁడు వచ్చినశరీరమునందు) వ్యవహారము లేకపోవలసి వచ్చును. ఈదోషము పోవుటకై యొకశరీరమున నిదురించుజీవుడు మఱియొకశరీరమున మేల్కొనును ననియు నాశరీరమున నిదురించువాఁడు మొదటిశరీరమున మేల్కొనుననియు జెప్పినను బ్రయోజన ముండదు. దీనివలన లాభ మేమి? నిదురించు ప్రతివానికిని మెలకువ కలదు. ఇంతమాత్రమునకు "ఏశరీరమున నిదురించువాఁ డాశరీరమున మేల్కొనఁడు" అని చెప్పి మీరు సాధించిన యధికలాభ మేమి? సుషుప్తి నొందిన వానికిఁ బునరుత్థానము లే దని సాధించినచోఁ గొంతలాభమును సంపాదించినవార లగుదురు. అప్పుడు మోక్షము సాధనములతోఁ బని లేకయే స్వతస్సిద్ధ మగును గదా! కావున నెట్లు చెప్పినను మొదటిపక్షము (బద్ధుఁడే మెలఁకువ నొందు ననుపక్షము) నాశ్రయించిన మీకుఁ బ్రయోజనము లేదు. ఇఁక రెండవపక్షము నాశ్రయించినను బహుదోషములు వచ్చును. ముక్తులకు సంసారప్రాప్తి కలుగుటకే వీలు లేదు. ఏపదార్థమైనను నశించిన మరల రావచ్చును గాని యజ్ఞానము మాత్ర మట్లు రాదు. ఈకారణమువలన నాయజ్ఞానము పోయినవానికి నజ్ఞానకార్య మగు బంధ మెప్పటికిని గలుగుటకు వీలు లేదు. కావున మఱియొకజీవుఁడు మఱియొకశరీరమున మెలఁకువ నొందు ననుట యెట్లును యుక్తియుక్తము కాదు. ఈకారణమువలననే పునరుత్థానముఁ జెందువాఁడు పరమేశ్వరుఁ డనుటయు సంభవింపదు. ఆయన నిత్యముక్తుఁడు కదా! మఱియు నేదినమున కాదినము క్రొత్తక్రొత్తజీవులు జాగ్రదవస్థకు వచ్చుచుండు రేని

వారందఱును దామాచరింపని కర్మలకే ఫలముల ననుభవింపవలసినవార లగుదురు; ఆచరింపఁబడిన కర్మల ఫలముల ననుభవింపక పోవలసినవార లగుదురు. ఇదియు విరుద్ధమే కదా! కావున నెట్లు చూచినను సుషుప్తి జాగ్రతలయందలి జీవులు భిన్నులు కారు.

మఱియు "సముద్రమధ్యమున వైవఁబడిన జలబిందువును మరల నెత్తుటకు వీలు లేనట్లు పరమేశ్వరునియం దేకీభవించినజీవుని మరల వేఱు చేయుటకు వీలులేదు" అనుపూర్వపక్షమునుగూర్చి కొంత విచారింతము. అచ్చట జలబిందువును వేఱుచేయుటకుఁ దగినకారణ మెద్దియు లేదు. కాని యిచ్చటమాత్రము కలదు. జీవుఁ డవిద్యచే నావరింపఁబడినవాఁడు; ఈశ్వరుఁడు నిర్మలుఁడు. జీవుఁడు భేదాభిమానముచేఁ గర్మల నాచరించు వాఁడు; ఈశ్వరుఁ డద్వితీయుఁడు. ఈకారణములనుబట్టి జీవేశ్వరులను వేఱు చేయవచ్చును. మూఢుఁ డట్లు చేయలేకపోయినను వివేకవంతుఁడు చేయవచ్చును. పాలు నీరు కలసినప్పుడు మనము (మనుష్యులు) వేఱు చేయలేకున్నను హంస లట్లు చేయును గదా ? కావున జీవుఁడు జలబిందువు వంటివాఁడు కా నక్కఱ లేదు.

మఱియు జీవుఁ డనఁగాఁ బరమేశ్వరభిన్న మగుక్రొత్తపదార్థము కాదు. మహాకాశమునకు ఘటాకాశమువలెఁ బరమేశ్వరునకు నంశభూతుఁడే. ఘటాకాశ మేరీతిగా నుపాధిసంబంధముచే మహాకాశమునుండి వేఱు పఱచుటకు వీ లగుచున్నదో యట్లే జీవుఁడును నవిద్యోపాధిచేఁ బరమే శ్వరునుండి వేఱుపఱచుటకు వీ లగుచున్నాఁడు. ఘట మున్నంతవఱకు నాఘటాకాశ మేకముగనే వ్యవహరింపఁబడున ట్లుపాధి యున్నంతవఱకు జీవుఁడును నేకరూపముగనే వ్యవహరింపఁబడుచున్నాఁడు. ఒక్కయుపాధి యందుఁ గలసుఖదుఃఖముల ననుభవించుచుండునంతవఱకు "ఈజీవుఁ డొక్కఁడే" యని వ్యవహారము ప్రవర్తించుచున్నది. మఱియొకయుపాధికిఁ బోయినప్పుడు "వీఁడు మఱియొక్కఁడు" అనువ్యవహారము జరగుచున్నది. వాస్తవస్థితిలో జీవునకు సుషుప్తిగాని మెలఁకువగాని లేదు. ఇవి యుపాధి యగునంతఃకరణమునకు సంబంధించినవియే. ఆయంతఃకరణము తనవ్యాపార ముల మాని సర్వేంద్రియముల నుపసంహరించి స్వకారణమున విశ్రాంతికై లీనమైనప్పుడు సుషుప్తిసంస్కారవశమున మరల వ్యవహారాభిముఖ మగు టయే మెలఁకువ. ఇ ట్లయినను నంతఃకరణధర్మముల జీవునియం దారోపించి

సుషుప్తిప్రబోధముల జీవుని వానినిఁగాఁ జెప్పుచున్నారు. కావున నుపధులుమాత్రమే భిన్నములు కాని జీవునికి భేదమే లేదు. ఇట్లుండ మెలఁకువ నొందుటకు మాత్రము క్రొత్త జీవుఁ డెటనుండి వచ్చును కావున నెట్లును మీవాదము నిలువదు; పూర్వాధికరణమునఁ జూపఁబడిన దోషములు రావు. ఇట్లు నిరూపించుటచే జాగ్రదాద్యవస్థలయందు జీవుఁడు సాక్షి యని తేలినది; సాక్షికిని వానిచే జూడఁబడుపదార్థములకును సంబంధ ముండుటకు వీలులేదు కావున నాతఁడు ప్రపంచమునకంటె భిన్నుఁ డని సిద్ధాంతమైనది.

---

## ౪. ముగ్ధేఽర్ధసంపత్త్యధికరణము.

విషయము, సంగతులు:—అవస్థాప్రస్తావమువలనఁ బ్రాస్తావికసంగతిచే నీయధికరణమున మూర్ఛావస్థాస్వరూపములు విమర్శింపఁబడును.

సందేహము, పూర్వపక్షములు:—లోకమున జాగ్రత్స్వప్నసుషుప్తులును మరణంబు నను నాల్గవస్థలు మాత్రమే ప్రసిద్ధములై యున్నవి. వేదమునందు నట్లే చెప్పఁబడియున్నవి. కావున మూర్ఛ యనునదియు వీనిలోనే చేరవలయును. అందును *విశేషజ్ఞానములు లేకపోవుటచే సుషుప్త్యవస్థయందే యంతర్భావము నొందును. ఈ కారణమువలనఁ మూర్ఛను గూర్చి ప్రత్యేకముగ విచారింపవలసినపని లేదు. సుషుప్త్యవస్థయందు లేని వణఁకు మొదలగునవి మూర్ఛయందుఁ గలవు కదా! యనిమెదవేమో యట్లయినను విరోధము లేదు. నిదురనుండి మేల్కాంచినవారిలోఁ గొందఱు "నాశరీరము తేలికగా నున్నది, నేను బాగుగ నిదురించితిని" అని చెప్పుచున్నారు. మఱికొందఱు "నాకు రాత్రి నిదుర బాగుగ నుండలేదు. నాశరీరమంతయు భారముగ నున్నది" యని మఱికొందఱు చెప్పుచున్నారు. ఇట్లయినను నాసుషుప్త్యవస్థకు భేదము రానట్లు వణఁకు మొదలగునవి యున్నను మూర్ఛయు సుషుప్త్యవస్థకంటె భిన్నము కాదు. అవయవములకు భారమును జులకఁదనమును గలిగించు సుషుప్త్యవస్థలవలెనే

---

* విశేషజ్ఞానము లనఁగా నామరూపాధిసహితముగఁ బదార్థములను ప్రత్యేకముగ గ్రహించగలజ్ఞానములు.

వణఁకును గలిగించు సుషుప్తికూడ నొక్కటి యుండవచ్చును గదా!.
కావున నీయధికరణమే యనవసరము.

---

## అ-౩. పా-౨. సూ-౧౦.

అవతారిక:—అనుపూర్వపక్షము ఖండించుచున్నాఁడు.

---

## ౩౨౯. ముగ్ధేఽర్ధసంపత్తిః పరిశేషాత్. ౩. ౨. ౧౦.

తాత్పర్యము:—ఇట్లు చెప్పఁగూడదు. మూర్ఛకును సుషుప్తికిని భేదము కలదు. విశేషజ్ఞానము లేకపోవుటచే రెండును సమానము లేయైనను నభిన్నములు మాత్రము కానేరవు. విశేషజ్ఞానములు సమానములుగ నున్నంతమాత్రమున స్వప్నజాగ్రదవస్థ లేకమగుచున్నవా? సుషుప్త్యవస్థ శ్రమవలనఁ గలుగును; మూర్ఛావస్థ దెబ్బ మొదలగువానివలనఁ గలుగును. సుషుప్త్యవస్థయందు విశ్రాంతికై బ్రహ్మప్రాప్తి కలుగుచున్నది; మూర్ఛయందుఁ గలుగు బ్రహ్మప్రాప్తి మరణమును కలిగించుటకై యేర్పడుచున్నది. మూర్ఛనొందినవారిలోఁ బ్రతుకువార లనేకు లున్నను మృతినొందువారలలో మాత్రము మూర్ఛనొందనివారలు లేకుండుటచే నిట్లు చెప్పఁబడె నని తెలిసికొనవలయును. మఱియు సుషుప్త్యవస్థయందు ముఖము ప్రసన్నమై కన్నులు మూతపడి యుచ్ఛ్వాసనిశ్వాసములు సమానకాలములుగ వచ్చుచు శరీరమునందు వణఁకు మొదలగునవి లేక యుండును; మూర్ఛావస్థయందన్ననో ముఖము వికారమై కన్నులు తెరువఁబడి యుచ్ఛ్వాసమారుత మొకప్పుడు సమానముగను మఱియొకప్పుడు దీర్ఘకాలమునకును వచ్చుచు శరీరమునందు వణఁకు గలిగి యుండును. ఇట్లు కారణములు, ఫలములు, లక్షణములును బరస్పర విభిన్నములై యుండ నీరెండవస్థలు నొక్కటి యగుట యెట్లు? నిదురించినవానిని జేతితోఁ దట్టి మాత్రమే లేపవచ్చును; మూర్ఛిల్లినవానికి బెత్తములతో బాదిననైనను మెలఁకువరాదు. లోకమునందును "వీఁడు మూర్ఛిల్లెను. వీఁడు నిదురించెను" అని వ్యవహారభేదము కలదు. ఇదియు నాయవస్థలు భిన్నములైననేకాని సంభవింపదుకదా! కావున నెట్లును నీమూర్ఛ సుషుప్తిలోఁ జేరదు. ఒకసుషుప్త్యవస్థయందే శరీరలాఘవమును గౌరవమును గలిగించు

నవాంతర భేదము లున్నను (వానికి) నిమిత్తలక్షణాదు లొక్కరీతిగనే యుండుటచే వానికి పరస్పర భేదము కలుగదు.

ఈమూర్ఛ జాగ్రదాద్యవస్థలయం దేకీభవింప దనుట మీకును సమ్మతమే. "ఇప్పు డీయవస్థ జాగ్రదవస్థలోఁ జేరు ననియెదము. ఏదియో యొకవిషయమునందు దృఢ మగుసంకల్పము కలవాఁ డితరవిషయముల నెఱుంగక యుండునట్లే మూర్ఛావస్థఁ జెందినవాఁడును నన్యవిషయముల నెఱుంగకున్నాఁడు. కావున నీరెండవస్థలు నొక్కటియే కావచ్చును." అనియెదవా యేమి? ఇట్లు ప్రతిజ్ఞనువిడిచి జయేచ్ఛచే మతాంతరము నాశ్రయించినను మీపక్షము నిలువదు. మీరు చెప్పిన యేకాగ్రస్థితికిని మూర్ఛకును ననంతముగ భేదము కలదు. జాగ్రదవస్థలో నున్నవాఁడు ధనుర్విద్య నభ్యసించుట మొదలగువానియందుఁ జిత్తము ప్రవేశించి యుండుటచే నితరపదార్థముల నెఱ్ఱెఱుంగలే కున్నాఁడో యట్లే మూర్ఛితుఁడును దెబ్బ మొదలగువానివలనఁగలిగిన మూర్ఛాహేతు వైన మహా దుఃఖము ననుభవించుచు నందు వ్యాపించినచిత్తముఁ గలిగి యుండుటచే నన్యము నెఱుంగలే కుండు ననుటకు వీలు లేదు. జాగ్రదవస్థయం దున్న వానికి జ్ఞానమును గలదు; మూర్ఛితునకు లేదు. దీనికి దృష్టాంతము: ఏకాగ్రస్థితిని విడిచినపురుషుఁడు "నే నింతవఱకు ధనుర్విద్యాభ్యాసము నందే పూన్కిగలవాఁడ నగుటచే నన్యము నెఱుంగ కుంటిని" అని చెప్పును; మూర్ఛనుండి మేల్కాంచినవాఁడు "నే నింతవఱకు నంధకార మునఁ బడియుంటిని" అని చెప్పును. మఱియు నెంతయేకాగ్రస్థితి యున్నను జాగ్రదవస్థయందు దేహము కూర్చుండియే యుండును; అప్పుడు మన స్సొక్కపదార్థమునే ధ్యానించుచున్నను వ్యవహారాభి ముఖమై యుండుటచే శరీరమును నిలువఁబెట్టును. మూర్ఛావస్థయం దున్నచో యది క్రిందఁ బడిపోవును; అప్పుడు మనస్సు లీనమై పోవుటచే శరీరమును ధరింపఁజాలదు. ఇట్లు భేద మనంతముగఁ గలదు. కావున నేకాగ్రస్థితియు మూర్ఛయు నొక్కటి కావు.

ఇఁక స్వప్నమరణావస్థలు రెండు మాత్రమే కలవు. వానియందును నీమూర్ఛ యంతర్భావము నొందు ననునాశ లేదు. స్వప్నపదార్థములఁ గాంచవలయు నని నను దన్నుఁ దాను దెలిసికొనవలయును గావున చిత్త

ముండవలయును. కావున నవి రెండును లేకపోవుటచే నిది స్వప్నావస్థ కానేరదు. ప్రాణంబును నావిరియు (అనఁగా నుష్ణస్పర్శ) నుండుటచే మరణావస్థయుఁ గానేరదు. మృతిఁజెందినవానికి నీరెండు నుండవు. ఎవ్వఁడైనను మూర్ఛిల్లినప్పుడు "ఇది మరణమా ? మూర్ఛయా ?" యని సంశయము కలిగినవారు వేఁడిమి కలదా ? లేదా ? యని తెలిసికొనుటకై హృదయమును స్పృశించుచున్నారు; ప్రాణస్థితి నెఱుంగుటకై నాసికాద్వారముల నంటుచున్నారు. అచ్చట వాయుసంచారము గానవచ్చెనేని "యిది మూర్ఛయే" యని నిశ్చయించి మెలఁకువ వచ్చుటకై యౌషధముల నుపయోగించుచున్నారు; లేకున్న "వీఁడు మృతి నొందెను" అని యుత్తర సంస్కారములఁ జేయుచున్నారు. కావున నిది మరణావస్థయందును జేరదనుటకు వీలు లేదు. ఇట్లు జాగ్రత్స్వప్నసుషుప్తిమరణములకంటె భిన్నమగుటచే నీమూర్ఛావస్థ యైదవదియే.

దీనికి నర్థసంపత్తి (కొంచెమించుమించుగఁ బరమేశ్వరునియందు లయము నొందుట) యని పేరు. " ఇట్లేల చెప్పవలయు ? ఈయవస్థయందును బరిపూర్ణ బ్రహ్మప్రాప్తియే కలుగవచ్చును. అర్థభాగము మాత్రమే కలుగు ననుట సంభవింపదు. సుషుప్త్యవస్థయం దెట్టి బ్రహ్మప్రాప్తి కలుగునో యిచ్చటఁగూడ నట్టిదే కలుగవలయును. సుషుప్త్యవస్థను గూర్చి 'సతా సౌమ్య తదా సంపన్నో భవతి .......న సుకృతం న దుష్కృతం' 'సుషుప్తికాలమున జీవుఁడు పరమేశ్వరునియం దైక్యము నొందును... ....ఆకాలమునఁ బుణ్యపాపములు వానికి నుండవు' అని శ్రుతి చెప్పుచున్నది. ఇట్టిస్థితి మూర్ఛావస్థయందును కలదు; అప్పుడును పుణ్యపాప సంబంధ మింతయును లేదు కదా!" అనియెదవేమో సత్యమే, ఆమూర్ఛావస్థయందును నంతఃకరణము నశించును కావున నుపాధి లేకపోవుటచే జీవుఁడు మూర్ఛావస్థయందు బ్రహ్మమునఁ గలయవచ్చును. ఈవిషయమున (ఉపాధి లీన మగు ననువిషయమున) నీయవస్థకు సుషుప్తితోఁ బోలిక గలదని యిదివఱకే చెప్పి యున్నాము. ఇఁక నర్థసంపత్తిశబ్దమునకు నర్థ మేమనిన వినుము. సుషుప్త్యవస్థయందువలెనే మూర్ఛయందును జీవునకుఁ బరబ్రహ్మముతో నైక్యము సంభవించినను నితరవిషయములయం దీమూర్ఛ సుషుప్తికంటె భిన్నము కదా ! ఈకారణమువలన మాత్రమే యిది

యర్ధసంపత్తి యని చెప్పఁబడును. సంపత్తి యనఁగా బ్రహ్మప్రాప్తి యనియే యర్థ మైనను దానికి సుషుప్తి యనియే యిచ్చట నర్థము చెప్పవలయును. అర్ధసంపత్తి యనఁగా సగముసుషుప్తి యని యర్థము కావునఁ బైఁ జేయఁ బడినయాక్షేపము మామతమునకు భంగమును గలిగింపనేరదు.

మఱియు "ఐదవయవస్థ యెచ్చటను బ్రసిద్ధముగ లేదు" అనుటయు యుక్తము కాదు. అది (ప్రతిదినమునందును బ్రతిజంతువునకును నియతముగ వచ్చునది కాకపోవుటచేఁ బ్రసిద్ధముగ లేదు. అట్లయినను లోకమునందును నాయుర్వేదమునందును నీయవస్థయుఁ బ్రసిద్ధమయి యున్నది. కావున మాపక్షమున నేదోషంబును లేదు. మఱియు దీనిని సగముసుషుప్తి యనుటచే నొకవిధముగ సుషుప్త్యవస్థయం దేకీభవింపఁజేసియే దీనిని గణింతురు. కావున నవస్థ లైదు. మూర్ఛ భిన్న మైనను బరస్పరభిన్నములగుపృథివ్యాదులు ద్రవ్యసామాన్యమున నేకీభవించినట్లును, భిన్నములగువ్యక్తులు జాతియందుఁ జేరినట్లును సుషుప్తియందుఁ జేరును. కావున నిందు దోషము లేదు.

ఇట్లు మూర్ఛ యనునవస్థ యొక్కటి యధికముగ నుండుటచే ముముక్షు వగువాఁడు జాగ్రదాదిభ్రాంతిపరిత్యాగమునకై ప్రయత్నించినట్లే మూర్ఛాపరిత్యాగమునకై కూడ ప్రయత్నింపవలయును. సర్వావస్థలును మనస్థితిభేదములచే వచ్చునవియే కావున వానికి జీవునితో సంబంధ ముండదు. అంతఃకరణ మింద్రియముల మూలమున బాహ్యపదార్థముల గ్రహించుట జాగ్రదవస్థ. స్వతంత్రముగనే కల్పితపదార్థముల గ్రహించుట స్వప్నావస్థ. తనకారణమునందు లీన మగుట సుషుప్త్యవస్థ. అట్లు లీనమైనను గమనోన్ముఖ (దేహాంతరగమనోన్ముఖ) మగుట మూర్ఛావస్థ. ఈదేహమును విడిచి మఱియొకదేహము నాశ్రయించుట మరణావస్థ. ఇట్లు అన్నియవస్థలును అంతఃకరణసంచారభేదముల వలన వచ్చినవియే యగుటచే నంతఃకరణసాక్షి యగుజీవునితో సంబంధింపవు. జీవుఁడు స్వప్రకాశుఁడు ; ఉపాధివశమున మాత్రమే యాయా యవస్థల నొందుచున్నట్లు గానవచ్చుచున్నాఁడు. కావున నీతఁడు పరమేశ్వరుఁ డగుటకు సంశయము లేదు.

# ౫. ఉభయలింగాధికరణము.

విషయము, సంగతులు:—ఈవిధముగ పైనాలుగధికరణముల యందును జీవస్వరూపమును విమర్శించి యాతనిస్వప్రకాశత్వమును సాక్షిత్వమును బోధించి యింకమీఁదఁ బాదాంతమువఱకు బ్రహ్మైక్యమును బోధించుటకై ప్రస్తావసంగతితోఁ బ్రహ్మస్వరూపము విచారింపఁబడును. "పరమేశ్వరుఁడు పరమార్థస్థితిలో నిర్విశేషుఁడు" అని ప్రస్తుతాధికరణమున నిరూపింపఁబడును.

"ఈయధికరణమునఁ బరబ్రహ్మమునకుఁ గలయేకస్వరూపము మాత్రమే విచారించి నిర్ణయింపఁ బడును గాని భేదము నిషేధింపఁబడదు. పరమేశ్వరునకు భేదాభేదరూపములు రెండును పరమార్థములే. అందు భేదమును విడిచి యభేదరూపమును మాత్రమే గ్రహింపవలయు నని యిందు బోధింపఁబడును." అని కొందఱు చెప్పుదురు. ఇది యుక్తము కాదు. రెండురూపములు గలపదార్థము నొకరూపమును మాత్రమే కల దానినిఁగా గ్రహించుట భ్రాంతి యనుటలో సంశయ మేమి? రూపము రుచి మొదలగునన్ని గుణములతోఁ గూడియున్న పదార్థము నొకగుణము మాత్రమే కలదానినిఁగా భావించువానిని వెఱ్ఱివానినిఁగా గణించుటలో సంశయము కలదా? మఱియు భేదమును విడిచి యభేదమును గ్రహింప వలయు ననుటయు సంభవింపదు. అప్పుడు పరమేశ్వరజ్ఞానముచే భేదము గ్రహింపఁబడకపోవుటవలన సర్వవిజ్ఞానప్రతిజ్ఞకు విరోధము వచ్చును; అప్పుడు భేద మనునది బ్రహ్మభిన్నమై యుండును కదా! ఇదియును గాక భేదమును విడిచిన దాని నుపాసన చేయవలయు ననుటయు సంభవింపదు కదా! అప్పుడు భిన్నాభిన్నరూప మగుబ్రహ్మమునందు చేయఁబడినసమన్వయము నిష్ప్రయోజక మగును. అభేదరూపముతో నున్నపరమేశ్వరుఁడు మాత్రమే తెలిసికొనఁబడవలసినవాఁ డగునేని శ్రుతివాక్యము లాయనను గూర్చి మాత్రమే చెప్పి యూరకుండవలసి వచ్చును కదా! ఈకారణము వలన భిన్నరూప మగుపరమేశ్వరునిఁగూర్చి చెప్పు వేదవాక్యము లన్నియు నిరర్థకములే యగును. భేదజ్ఞానమే భేదోపాసన యగుటచే తజ్జ్ఞానముతోఁ బని లేకున్నఁ దదుపాసనతోఁ బని లేదని మఱియొక మాఱు చెప్ప నక్కఱలేదు. ఈరీతిగాఁ బైవారియభిప్రాయము ననుసరించి చూచిన

వేదమునందుఁ గొంతభాగ మప్రమాణము కావలసి వచ్చును. అది వారికిఁ గూడ నిష్టము కాదు. కావున భేదాభేదములు రెండును దెలిసికొనవలసి నవియే. భేద ముపాధికల్పిత మని వేదమునందే చెప్పఁబడియుండుటచే నభేదమును పారమార్థిక మని మాత్రమే నిర్ణయింపవలయును. భేదము పరమేశ్వరునకు స్వాభావికము కా దనియే నిశ్చయము చేసికొనవలయును. ఈవిషయమే యీయధికరణమున నిరూపింపఁబడును. "తదనన్యత్వ మారంభణశబ్దాదిభ్యః ౨-౧-౧౪" అనుస్థలమునఁ బరమేశ్వరునిపార మార్థికరూపము నిర్ణయింపఁబడియే యున్నను భేదశ్రుతు లనేకము లుండుటవలన *స్థూణానిఖననన్యాయముచే మరల నిరూపింపఁబడుచున్నది.

సందేహము, పూర్వపక్షము:— వేదమునందు "సర్వకర్మా సర్వ కామః ౧-౨-౧-౨" అని పరమేశ్వరునకు ననేకగుణములు చెప్పఁ బడి యున్నవి; "అస్థూల మనణు" అను మొదలగువాక్యములచే సర్వగుణా భావంబును చెప్పఁబడియున్నది. ఇం దేది ప్రమాణము? వేదవాక్యములలో నొక్కటియు నప్రమాణము కాఁగూడదుకదా! గుణభావాభావములు పరస్పరవిరుద్ధము లగుటచే వీనిని దెల్పువాక్యముల సమన్వయించుట యెట్లు? వేదప్రామాణ్యబలముచే నీరెంటినిఁ గూడ గ్రహింపవలయునా? ఒక్కదానిని మాత్రమా? అందును సగుణత్వమునా? లేక నిర్గుణత్వమునా? రెండుపక్షములను గూడ సముదాయముగ గ్రహింపవలయు ననుటయే యీపక్షము లన్నింటిలో యుక్తియుక్తముగ నున్నది. అప్పుడు శ్రుతిప్రా మాణ్యమునకు భంగము రాదు. యుక్తికిని విరోధము లేదు. ఆ రెంటిలో నొకటి స్వాభావికముగాను మఱియొక్కటి మఱియొకదానిసంయోగాదుల వలనను గలుగవచ్చును. పరసంయోగమువలనఁ గలిగినది యసత్యము కూడఁ గా నక్కఱ లేదు. తిమిరాదిరోగములవలన నేత్రాదీంద్రియములకు గలిగినదోషము లసత్యము లగుట లేదు. వానినుండి చంద్రద్వయ దర్శ నము మొదలగుకార్యము లుత్పన్నము లగుచున్నవి కదా! అసత్యపదార్థ ములు కార్యముల నాచరింపఁజాలునా? ఎండమావులనీరు దాహ మార్ప గలదా! "ఇంద్రియములకు వ్యాధ్యాదులవలనఁ గలుగుదోషములు సత్య ములే యైనను స్ఫటికాదులకు దాసానిపువ్వు మొదలగువానిసంబంధము

* (అ-౨. పా-౧. సూ-3౪. పేజీ-౬౫౦. చూ.)

వలనఁ గలుగు యెఱుపు మొదలగునవి సత్యములు కావుకదా! బ్రహ్మమునకుఁ గల వని చెప్పఁబడినగుణములు కూడ నిట్టివే కావచ్చునని యెదవేమొ అట్లు చెప్పుటకు వీలులేదు. లోకమునఁ గొన్ని యట్టివికూడ నున్నను బరమేశ్వరునిగుణములు మాత్ర మట్టివి కానేరవు. అవి పరమ ప్రమాణభూత మగువేదముచేఁ జెప్పఁబడినవి కదా! వేద మట్లసత్యములగువాని నేల చెప్పును? ఈకారణమువలనఁ బరమేశ్వరునకు సగుణనిర్గుణత్వరూపము లగురెండుధర్మములును గల వనుటయే యుక్తము.

## అ_౩. పా_౨. సూ_౧౧.

అవతారిక : — అని యిట్లు వచ్చిన పూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౩౩౦. న స్థానతోఽపి పరస్యోభయలింగం సర్వత్ర హి. ౩. ౨. ౧౧.

తాత్పర్యము : — ఇట్లు భావింపఁగూడదు. పరమేశ్వరునకు సగుణత్వంబును నిర్గుణత్వంబును గూడఁ గలదనుట యుక్తియుక్తము కానేరదు. ఏపదార్థమైనను స్వాభావికముగ రెండువిరుద్ధగుణములు కలిగి యుండు ననుట లోకానుభవమునకు విరుద్ధము కదా! ఇఁక నొకగుణము స్వాభావికముగాను రెండవది యుపాధిసంబంధమువలనను వచ్చి యుండవచ్చుననుటయు యుక్తము కాదు. ఉపాధిసంబంధమువలన వచ్చినవి సత్యము లగుట నిశ్చయము కాదు. వ్యాధ్యాదులవలన కలిగిన లోపములు మొదలగునవి కొన్ని సత్యములేయైనను స్ఫటికము మొదలగు రత్నములయందు దాసానిపువ్వు మొదలగువాని సంయోగమువలనఁ గలిగిన యెఱుపు మొదలగునవి సత్యములు కావు కదా! పరమేశ్వరుని విషయ మీరెండవజాతిలో చేరు ననికూడఁ జెప్పవచ్చును. ఇందు విరోధ మేమి? ఉపాధు లన్నియు నవిద్యవలన వచ్చినవియేకదా! మఱియు నా యుపాధికృతభేదము పారమార్థికమగు నేని పరమేశ్వరునకుఁ బరిణామము కలుగవలసివచ్చును. ఇది పూర్వమునసే నిషేధింపఁబడును కావున బాగుగ విచారించినఁ బరమేశ్వరుఁడు కేవలము సగుణుఁడే యైనను గావలయును;

నిర్గుణుఁడే యైనను గావలయును. ఉభయరూపుఁడు మాత్రముకానేరఁడు. అనేకశ్రుతులయందు ఇట్లు చెప్పనేల? సర్వశ్రుతులయందును "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం" అని పరమేశ్వరుఁడు నిర్గుణుఁ డనియే చెప్పఁబడియున్నది. ఈకారణమువలనఁ బరమేశ్వరుఁ డుభయరూపుఁడు కాఁడు. నిర్విశేషుఁడే; నిర్గుణుఁడే.

## అ-3. పా-౨. సూ-౧౨

అవతారిక:—ఇట్లు సిద్ధాంతము చేయఁబడినవిషయము మరల నాక్షేపసమాధానములచే స్థిరపఱచుచున్నాఁడు.

## 33౧. న భేదా దితి చే న్న ప్రత్యేక మతద్వచనాత్. 3. ౨. ౧౨.

తాత్పర్యము, పూర్వపక్షము:—ఈసిద్ధాంతము సరియైనది కాదు. బ్రహ్మము నిర్గుణమే యనుట చెల్లదు. కొన్నిశ్రుతులయందు నిర్గుణత్వమే బోధింపఁబడి యున్నను అనేకశ్రుతులయం దాకారభేదములు బోధింపఁబడియున్నవి. కొన్నిస్థలములయందు బ్రహ్మమునకు నాల్గుపాదములు కల వనియు మఱికొన్నిస్థలములయందు పదునాఱుభాగములు కల వనియు వేఱొక కొన్నిస్థలములయందుఁ ద్రిలోకములును ఆబ్రహ్మమునకు స్వరూపమే (దేహమే) యనియుఁ జెప్పఁబడియున్నది. ఈవాక్యముల నన్నిటి నప్రమాణములు గావించుట యుక్త మగునా? వేదమునం దొకవాక్య మైనను నిరర్థక మగుట సమ్మతము కాదు కదా! కావున పరమేశ్వరునకు సగుణరూపము కూడ నొక్కటి కల దనియే యంగీకరించి తీరవలయును. "స్వభావముగాఁగాని యుపాధివలనఁగాని పరమేశ్వరునకు రూపద్వయము కలుగ దని చెప్పితిమి కదా! అట్లు కలుగుట విరుద్ధము కూడ నగును కదా" అనియెదవేమొ అది యుక్తము కాదు. వ్యాధ్యాదులచేఁ గలిగిన యింద్రియలోపాదులు సత్యములే యగుచున్నవి కదా! పరమేశ్వరరూపములుగూడ నీజాతిలోనే చేరు నని నిర్ణయింపవచ్చును. అట్లు నిర్ణయింపకున్న నాకారభేదముల నుపదేశించుశ్రుతు లన్నియు నిరర్థకములే కావలసివచ్చును. అభేదశ్రుతులకును విరోధము లేకుండుటయే

యభేదము నంగీకరింపవలయును. ఈకారణమువలన సగుణత్వనిర్గుణత్వములు రెండు నంగీకరింపఁబడవలసినవియే.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పఁగూడదు. ప్రతివిద్యయందును ఉపాసనార్థమై పరమేశ్వరునకు నాకారభేదములు జెప్పఁబడియున్న వనుట సత్యమే కాని యాయాకారములు స్వాభావికము లనుటకుఁ బ్రమాణమేదియు లేదు. ఆవిద్యాప్రస్తావములయందే "య శ్చాయ మస్యాం పృథివ్యాం తేజోమయోఽమృతమయః పురుషో య శ్చాయ మధ్యాత్మం శారీర స్తేజోమయోఽమృతమయః పురుషోఽయ మేవ స యోఽయ మాత్మా" "తేజోరూపుఁడును ఆనందరూపుఁడు నగునేపురుషుఁడు భూమ్యాద్యుపాధులయందు కలఁడో, తేజోరూపుఁడు నానందరూపుఁడు నగునట్టి యేపురుషుఁడు జీవరూపమున దేహముననున్నాఁడో వారిరువురు నొక్కటియే. ఆత్మయే పృథివ్యాదులయందుఁ దత్తదాకారములతో నున్నాఁడు" అని యేకరూపము చెప్పఁబడి యున్నది. దీని నాశ్రయించి చూచిన నాకారభేదము లుపాసనార్థమై యజ్ఞానుల ననుగ్రహించుటకుఁగాఁ జెప్పఁబడిన వనియే తేలుచున్నది. కాని పారమార్థికము లనునభిప్రాయముతోఁ జెప్పఁబడినవిగాఁ దేలుట లేదు. కావున వేదమునకు నప్రామాణ్యము కలుగదు. వ్యాధ్యాదరూపము లగునుపాధులచేఁ గలిగిన రూపభేదములు మొదలగునవి సత్యములే యైనను పైఁజూపినశ్రుతివలనఁ బరమేశ్వరరూపములు మాత్ర మట్టివి కా వనుటలోనే శ్రుతికిఁ దాత్పర్యము కల దని తోఁచుచున్నది. కావున నెట్లును బరమేశ్వరునకు భిన్నరూపము లేదు. ఆయన నిర్గుణుఁడే.

## ౩౩౨. అపి చైవ మేకే. ౩. ౨. ౧౩.

తాత్పర్యము:—మఱియు నీవిషయము కొన్ని శాఖలయందు స్పష్టముగనే ప్రకటింపఁబడి యున్నది. వేదము భేదము నుపాసనార్థము మాత్రమే చెప్పుచున్నదిగాని పారమార్థిక మనునుద్దేశముతో కాదనియు నభేదమే పారమార్థిక మనుటయే దానికిఁ (వేదమునకు) దాత్పర్య మనియు నిర్ణయింపఁబడినది. "మన సై వేద మా ప్తవ్యం నేహ నా నా స్తి కించన, మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నా నేవ పశ్యతి" "ఈపరమేశ్వరరూపమును మనస్సుతోనే పొందవలయును. ఈప్రపంచమున రెండవ

పదార్థ మనునదియే లేదు. ఎవ్వఁ డట్లు తలంచునో వాఁడు మరణము నుండి మరణమును జెందును. (అనఁగా సంసారసముద్రమున మునుఁగు చుండును)" అను మొదలగువాక్యములయందు భేదదృష్టిని నిందించి యభేదజ్ఞానమును బ్రశంసించుటయే యీవిషయమును నిర్ధారణ చేయు చున్నది. "భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మ మేతత్" "అనుభవించువాఁడు అనుభవింపఁబడునది ప్రేరే పించువాఁడు అనునీమూఁడువిధములగు ప్రపంచంబును బరమేశ్వరుఁడే యని తెలిసికొనవలయును." అని సర్వమును బ్రహ్మమాత్రముగఁ దెల్పు వాక్యములును నీవిషయమునఁ బ్రమాణములే కావున నెట్లు చూచినను వేదమునకు భేదమునందుఁ దాత్పర్యము లే దని తేలుచున్నది.

## అ-౩. పా-౨. సూ-౧౪.

అవతారిక:—"ఇట్లు పట్టుపట్ట నేల ? పరమేశ్వరునకు నాకారమును చెప్పు శ్రుతులును, ఆకారము లే దని చెప్పుశ్రుతులును సమానముగనే యున్నవి కదా! బ్రహ్మము నిరాకార మని మాత్రమే సిద్ధాంతముచేయుట యేల?" అనిన సమాధానముఁ జెప్పుచున్నాఁడు.

## ౩౩౩. అరూపవ దేవ హి తత్ప్రధానత్వాత్.

## ౩. ౨. ౧౪.

తాత్పర్యము:—శ్రుతులు రెండువిధములుగాఁగూడ నున్నప్పటి కిని పరమేశ్వరుఁడు నిరాకారుఁ డనుటయే సిద్ధాంతము చేయఁదగిన విషయము. ఏల యనిన "అస్థూల మనణు" అను మొదలగు నభేదశ్రుతు లకు బ్రహ్మరూపనిర్ధారణకంటె నితర మగుప్రయోజన మెద్దియు లేదు. భేదశ్రుతుల కన్ననో, ఉపాసనవిధియే ప్రయోజనము కావచ్చును. పరమే శ్వరునకు వాస్తవరూపము లేకున్నను, ఉపాసనార్థమై యవి (శ్రుతులు) రూపమును గల్పింపవచ్చును కదా! విష్ణువుగాని రుద్రుఁడుగాని (ప్రత్యక్ష ముగ భక్తులకడకు రాకున్నను వారికి ప్రత్యామ్నాయముగసాలగ్రామము లింగము ననువానినిఁ గల్పించుశాస్త్ర మెంతయో కలదు కదా! కావున భేదశ్రుతులకు నుపాసనలను విధించుటయే ప్రయోజనముకాని రూప మును బ్రతిపాదించుట కా దని తేలుచున్నది. ఈకారణమువలనఁ దదేక

ప్రయోజనము (బ్రహ్మస్వరూపమును జెప్పుట మాత్రమే ప్రయోజన ముగాఁ గలవి) ల (య)గు నభేదశ్రుతులకంటె నవి (భేదశ్రుతులు) బలహీనము లగును. విరోధము లేనప్పుడు వానియర్థమును గూడ గ్రహించినను గ్రహింపవచ్చును కాని పరస్పరవిరోధము కలిగినప్పు డట్లు చేయుటకు వీలు లేదు. అప్పు డభేదశ్రుతులు నిరర్థకములై పోవలసి వచ్చును. భేదశ్రుతులకు భేదప్రతిపాదనమునందుఁ దాత్పర్యము లే దనినను, ఉపాసనావిధిరూప మగు ప్రయోజనము కలదు గావున నవి నిరర్థకములు కా నక్కఱ లేదు! భేదము లోకప్రసిద్ధము కూడ నగుటచే దాని నాశ్రుతు లను వాదము చేసి యుండినను చేసి యుండవచ్చును. హీనస్థితియం దున్న వారి నుద్ధరించుటకు నిదియేకదా మార్గము! మొట్టమొదట వా రవలంబించి యున్న మార్గమునాశ్రయించి క్రమక్రమముగఁ జిత్తమును బరిశోధింపుచు నుత్తమగతికిఁ గొనిపోవుటయే కదా యుపదేశకులలక్షణము? మఱియు లోకప్రసిద్ధము గానియపూర్వవిషయమును బోధించుటయే కదా శాస్త్రమునకుఁ గర్తవ్యము? ఇట్టిది (లోకప్రసిద్ధముకాని యపూర్వవిషయము) యభేదమే కాని భేదము కా దనుట సుప్రసిద్ధముకదా! కావున నభేదశ్రుతులే ప్రధానము. వానియర్థమే శ్రుతులకుఁ దాత్పర్యము. భేదశ్రుతు లనువాదమాత్రములు.

## అ_౩. పా_౨. సూ_౧౫.

అవతారిక:—"ఇట్లైన భేదశ్రుతులు నిరర్థకములే కావలయును. భేదము లోకప్రసిద్ధ మైనను ఉపాసనార్థముగ శ్రుతులచే ననువాదింపఁబడినను, బరమార్థము మాత్రము కాదు కదా! పరమార్థము కానివిషయమును జెప్పునది ప్రమాణ మగుట యెట్లు?" అనిన సమాధానముఁ జెప్పుచున్నాఁడు.

## ౩౩౪. ప్రకాశవచ్చావైయర్థ్యాత్. ౩. ౨. ౧౫.

తాత్పర్యము:—ఇట్లు సంశయింప నక్కఱ లేదు. పరమేశ్వరునకుఁ గల వని శ్రుతులచేఁ జెప్పఁబడి లోకమునందును బ్రసిద్ధములై యున్న యాకారములు పరమార్థసత్యములు కాకున్నను వ్యవహారమునందు సత్యములే. ఎండగాని వెన్నెలగాని యాకాశమంతయు మేఘరూపముతో వ్యాపించి యున్నను బరమార్థస్థితిలో నాకారభేదములు లేని దయి

యున్నను గవాక్షములు మొదలగు నుపాధులవశమున వర్తులముగా (గాని వక్రముగా) గాని యేర్పడినప్పుడు యారూపములతోఁ గానవచ్చు నట్లు పరమేశ్వరుఁడును సర్వవ్యాపకుఁ డయ్యు నిరాకారుఁడయ్యు బృథివ్యాదిసంబంధముచే నాయారూపములతోఁ గానవచ్చుచున్నాఁడు. "వెన్నెలకు నిది స్వాభావిక రూపము కాదు" అని తెలియఁబడినను గవాక్షాదు లుండునంతవఱకు నావర్తులత్వాది రూపములు నశింపనట్లు "పరమేశ్వరునకు నీపృథివ్యాదిరూపములు లేవు." అని తెలియఁబడినను సర్వప్రపంచము నశించునంత వఱకు నీరూపములు పోవు. అవిద్యానాశమువలననే సర్వము నివృత్తి యగు నని యున్నను "కారణ నాశానంతరమున గూడఁ గార్యము లొక్కక్షణ ముండును" అనున్యాయము ననుసరించి యవిద్య పోయినను దత్కార్యము లగు దేహాదు లుండునుగావున తన్నాశము గలుగునంతవఱకు నీరూపములు నశింప వని తెలుసుకొనవలయును.

ఇదియే వ్యావహారిక సత్యత్వము. అజ్ఞానము నశింపకపూర్వము పురుషుఁ డీరూపములఁ బారమార్థికములనుగ భావించుచుండును; నశించిన పిదప "ఈరూపము లూరక తోఁచునవియే కాని యథార్థములు కా వని గ్రహించును. ఒక్కపరమేశ్వరరూపములయందే కాదు. లోకమునందలి సర్వపదార్థములయందును గల సత్యత్వముకూడ నిట్టిదియే. నిత్యసిద్ధుఁడును సర్వసాక్షియు నగుపరమేశ్వరుఁ డొక్కఁడే పారమార్థిక సత్యస్వరూపుఁడు.

అది యట్లుండె. లోకవేదవ్యవహారము లన్నియు నీవ్యావహారిక సత్యత్వము నాశ్రయించియే ప్రవర్తించుచున్నవి యని యిదివఱకే శాస్త్రావతారికయందుఁ జెప్పి యున్నాము కదా! ఈకారణమువలన నుపాసనార్థమై భేదశ్రుతు లీవ్యావహారిక భేదము ననువాదము చేయవచ్చును. పారమార్థికస్థితిని జెప్పుట యనిన నది సాధ్యమే కాదు. చెప్పుట యనిన చెప్పువాఁడును వినువాఁడును జెప్పఁబడినదియు నను మూఁడుపదార్థములుండినఁగాని సంభవింపదు; పరమార్థస్థితి యనిన నద్వితీయబ్రహ్మమే యై యుండ మూఁడుపదార్థము లెటనుండి వచ్చును? ఈకారణమువలన నభేదమును జెప్పుశ్రుతులు కూడ బాగుగ విమర్శించిన గురుశిష్యాదులకుఁ గలవ్యావహారిక భేదము నాశ్రయించి ప్రవర్తించునవియే. ఇట్లుండ నింత మాత్రమున భేదశ్రుతు లేల యప్రమాణములు కావలయును? ప్రమాణభూత మగుటచే వేదమునందలి యొకయక్షరమైన నిరర్థక మగుటకు వీలు

లేదు కదా ! ఈకారణమువలన నుపాసనార్థమై భేదశ్రుతు లజ్ఞానులచేఁ బరమార్థసత్యముగఁ దలంపఁబడుచున్న భేదము నట్లే యనువాదముచేయు ననియు, నభేదశ్రుతులు వానియథార్థస్థితిని బోధించి యజ్ఞానము నడంచు ననియు తెలిసికొనవలయును. ఇట్లగుటచే మోక్షసాధనమును దెల్పుటవలన భేదశ్రుతులును దత్స్వరూపమును దెల్పుటవలన నభేదశ్రుతులును గూడఁ బ్రమాణములే. అందుఁ దదేకప్రయోజనము లగుటచే నభేద శ్రుతులు బలవంతము లనియు నన్యప్రయోజనము (ఉపాసనావిధియే చిత్తశుద్ధియే ప్రధానముగఁ గలవి) ల (య)గుటచే భేదశ్రుతుల లప్రధా నము లనియుఁ దెలిసికొనవలయును.

"ఇప్పటికిని మీసిద్ధాంతము నిలువదు. ఉపాధివలనఁ గలిగిన రూపముకూడ సత్య మనియే కదా కడకు మీరు చెప్పినవిషయము" అని యెదవేమో యట్లు కాదు. ఆయుపాధులును వానితోఁ బరమేశ్వరునకుఁ గలసంబంధము నాసంబంధమువలనఁ గలిగినరూపభేదంబులు ననునవి యన్నియు మాయామాత్రములే యని పలుమారు చెప్పి యున్నాము. ప్రస్తుత సూత్రమునందును "సర్వంబును వ్యావహారికసత్యమే" యని నిరూపించియున్నాము. ఉపాధివశమునఁ గలిగిన రూపభేదాదులు వస్తువు నకు స్వాభావికములు కానేర వనియు నిరూపించి యున్నాము. కావున నింతమాత్రమువలనఁ బరమేశ్వరునకు సగుణ నిర్గుణత్వ రూపవిరుద్ధధర్మము లుండవలయు ననుట యుక్తియుక్తము కానేరదు.

## ౩౩౫. ఆహ చ తన్మాత్రమ్. ౩. ౨. ౧౬.

తాత్పర్యము:—మఱియు స్పష్టముగనే పరమేశ్వరునకు జ్ఞానభిన్న మగురూప మేదియు లే దని శ్రుతి సదృష్టాంతముగఁ జెప్పుచున్నది. "స యథా సైంధవఘనో<sup></sup>నన్తరో<sup></sup>బాహ్యః కృత్స్నో రసఘన ఏ వైవం వా అరే<sup></sup>యమాత్మానన్తరో<sup></sup>బాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ" "ఓమైత్రేయీ ! ఉప్పుకల్లు లోపలను వెలుపలనుగూడ నితరపదా ర్థము లేక లవణరసము మాత్రమే యెట్లుయున్నదో, యట్లే యీపర మేశ్వరుఁడును బరిపూర్ణజ్ఞానమే యై యున్నాఁడు; లోపలఁగాని, వెలు పలఁగాని లేశ మైనను మఱియొకపదార్థము లేదు" అనువాక్యమే యీ విషయమునకు జాలినంతప్రమాణము. కావునఁ బరమేశ్వరుఁడు నిర్గుణుఁడే;

భేద శ్రుతులు ఆయనను గ్రహించుటకై సులభముగ నుండునట్లు పృథివ్యాద్యుపాధివశమున నాయనకు గలిగినరూపభేదముల నుపాసనార్థము బోధించుచున్నది.

## ౩౩౬. దర్శయతి చాథో అపి స్మర్యతే.

### ౩. ౨. ౧౭.

తాత్పర్యము:—పైసూత్రమున విధిపూర్వకముగఁ బరమేశ్వర రూపమును జెప్పుశ్రుతి యుదహరింపఁబడెను. ఇంతమాత్రమేగాక నిషేధ పూర్వకముగఁ గూడ శ్రుతులయం దీవిషయము బోధింపఁబడియున్నది. "పరమేశ్వరుఁడు నిరాకారుఁడు" అనువిషయము ప్రతిపాదింపఁబడినది. "అథాత ఆదేశో నేతి నేతి" "'ఈపదార్థము కాదు. ఈపదార్థము కాదు' అని యన్నింటిని నిషేధింపఁగాఁ నిషేధింపఁగాఁగడకుఁ బరమేశ్వరుఁడు మిగులును" అని బృహదారణ్యకమునందు "అన్యో దేవ తద్విదితా దథో అవిదితా దధి" "ఆపరబ్రహ్మము బుద్ధిగోచరము లగువానికంటెను, కానివానికంటెనుఁ గూడ భిన్నుఁడు" అని కేనోపనిషత్తునందును వర్ణింపఁబడి యున్నది. తైత్తిరీయోపనిషత్తునందును "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" "వాక్కుగాని మనస్సుగాని యేస్థలమునకుఁ బోవదో యదియే బ్రహ్మము" అని చెప్పఁబడి యున్నది. మఱియొకస్థలమున బాష్కలి యనువాఁడు బాధ్యుఁ డనువానినిఁ బరమేశ్వర విషయమునఁ బ్రశ్నించె ననియు దానికి నాతఁడు ప్రత్యుత్తరమునీక మౌనము బూనె ననియు నాబాష్కలి మరలమరలఁ బ్రశ్నింపఁగా "నేను బరమేశ్వరుని బోధింపితినిఁ గాని నీ వెఱుంగ లేకున్నావు. పరమేశ్వరుఁడు నిర్గుణుఁడు. ఆయనను గూర్చి చెప్పవలసినది యేమియు లేదు." అని యాతఁడు (బాధ్యుఁడు) ప్రత్యుత్తర మిచ్చె ననియుఁ జెప్పఁబడి యున్నది. స్మృతులయందు నిట్లే నిషేధపూర్వకముగఁ బరమేశ్వర రూపము బోధింపఁబడియున్నది. "జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వామృత మశ్నుతే, అనాదిమత్పరం బ్రహ్మ న స త నాసదుచ్యతే" "ఓయర్జునా యేబ్రహ్మమును దెలిసికొనవలయునో దానిస్వరూపమును జెప్పెదను వినుము. అది యనాది ఇంద్రియగోచరము కాకపోవుటచేఁ

గల దని కాని లే దని కాని దానినిగూర్చి చెప్పుటకు వీలు లేదు." అని శ్రీకృష్ణుఁడు చెప్పియున్నాఁడు. మఱియు విశ్వరూపమును దాల్చిన నారాయణుఁడు నారదునిఁ గూర్చి చెప్పినవాక్య మిట్లు స్మృతులయందుఁ గలదు. "మాయా హ్యేషా మయా సృష్టా య న్మాం పశ్యసి నారద, సర్వభూతగుణై ర్యుక్తం నైవం మాం జ్ఞాతు మర్హసి" "ఓనారదా ప్రస్తుతము పృథివ్యాదిసర్వభూతగుణములతోఁ గూడియున్నట్లు నేను కానవచ్చుచున్నానుగదా; ఇది యంతయు నామాయ. నాయథార్థస్వరూప మిట్టిది యని భ్రాంతినొందకుము." ఈవాక్యము స్పష్టముగనే పరమేశ్వరునియాకారము నిషేధించుచున్నది కదా. కావున సర్వమును విమర్శించిన నేయే యాకారము మనోవాక్కులకు గోచర మగుచున్నదో యదియంతయుఁ బరమేశ్వరరూపము కా దని తెలుచున్నది. ఇట్టిది యగుటచేతను శ్రుతియు విధిపూర్వకముగ నిరూపించుటకు వీలు లేక నిషేధపూర్వకముగ నీబ్రహ్మరూపము నుపదేశించె నని నిర్ణయింపవలసి యున్నది. విధిపూర్వకముగ నుపదేశించువాక్యములు కూడఁ గొన్ని యున్నట్లు కానఁబడినను, అవి చేయునది సూక్ష్మోపాధ్యుపదేశమే కాని స్వస్వరూపకథనము కానేరదు. "విజ్ఞానఘన ఏవ" అనుశ్రుతియు లౌకికజ్ఞానమును దృష్టాంతముగఁ గైకొని దానిచేఁ బరమేశ్వరరూపము నించుక యూహించునట్లుమాత్రమే చేయుచున్నది గాని ప్రత్యక్షరూపమును జెప్పుట లేదు. ఈకారణమువలనఁ బరమేశ్వరుఁడు నిర్గుణుఁడే.

## ౩౩౨. అత ఏవ చోపమా సూర్యకాదివత్.

### ౩. ౨. ౧౮.

తాత్పర్యము:—ఇట్లు పరమేశ్వరుఁడు నిర్వికారుఁడు మనోవాక్కులకు నగోచరుఁడు నిషేధపూర్వకముగ మాత్రమే యుపదేశింపఁ దగినవాఁడు నగుటచేత మోక్షశాస్త్రములయం దాయనకుఁ గలయౌపాధికరూపభేదములను నిరూపించుటకై జలమునందలి సూర్యప్రతిబింబము మొదలగు దృష్టాంతములు పరిగ్రహింపఁబడి యున్నవి. సూర్యుఁ డొక్కఁడే యైనను జలములయందు ప్రతిబింబించి యనేకవిధములుగఁ దోఁచునట్లు పరమేశ్వరుఁడును నవిద్యాదులయందుఁ బ్రతిబింబించి యనేకవిధములుగఁ దోఁచుచున్నాఁ డని నిరూపింపఁబడి యున్నది. "యథా హ్యయం

జ్యోతి రాత్మా వివస్వా నపో భిన్నా బహుధైకోఽనుగచ్ఛన్, ఉపాధినా క్రియతే భేదరూపో దేవః క్షేత్రే ష్వేవ మజోఽయ మాత్మా ఏకఏవహి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః, ఏకధా బహుధా చైవ దృశ్యతే జల చంద్రవత్” “సూర్యుఁ డొక్కఁడే యయ్యు ననేకస్థల భేదములయందుఁ గలజలములలోఁ బ్రతిబింబించి యెట్లు బహురూపములు గలవాఁడుగాఁ దోఁచుచున్నాఁడో యట్లే పరమేశ్వరుఁడును నుపాధులవలన దేహముల యం దనేకరూపములు గలవాఁడుగాఁ దోఁచుచున్నాఁడు. సర్వేశ్వరుఁ డొక్కఁడే ప్రతిభూతములయందును వ్యాపించి యాయాయుపాధిభేదము లచే జలములయందు ప్రతిబింబించినచంద్రునివలె నొక్కఁడుగాను, ననేకులు గాను గానఁబడుచున్నాఁడు.” అను మొదలగువాక్యము లీవిషయమునఁ బ్రమాణములు. ఈదృష్టాంతరములను బట్టి చూచినఁ బరమేశ్వరునకు రూపభేదము బొత్తుగనే లే దనియు, సర్వము నవిద్యాకల్పితమే యనియుఁ దోఁచుచున్నది.

## అ-3. పా-౨. సూ-౧౯.

అవతారిక:—ఈయుపమానముపైఁ బూర్వపక్షము చేయు చున్నాఁడు.

# ౩౩౨. అంబువదగ్రహణాత్తు న తథాత్వమ్.

## 3. ౨. ౧౯.

తాత్పర్యము:—ఈదృష్టాంతము యుక్తమైనది కాదు. సూర్యాదు లాకారము గలపదార్థములు; పరిచ్ఛిన్నపదార్థములు. జలము మొదలగునవి వారికంటె భిన్నములై దూరదేశమున నున్నవి. ఈకారణమువలన సూర్యా దులు జలాదులయందుఁ బ్రతిబింబింపవచ్చును. ప్రకృతవిషయము మాత్ర మట్టిది కాదు. ఇచ్చట సూర్యాదులవలె నాకారవంత మైనట్టియుఁ బరిచ్ఛి న్నమైనట్టియుఁ బదార్థమెద్దియు లేదు. పరమేశ్వరుఁడు నిరాకారుఁడు; సర్వ వ్యాపకుఁడు. మఱియు జలమువలెఁ దద్భిన్నమై దూరస్థమై యుండుపదార్థం బును లేదు. ఆపరమేశ్వరుఁడు లేనిస్థలంబును, ఆయనకంటె భిన్నమైన పదార్థంబును గూడ లేదు కదా! కావున నీదృష్టాంతము సరిపడదు.

## అ_౩. పా_౨. సూ_౨౦.

అవతారిక :— ఈపూర్వపక్షమునకు సమాధానముఁ జెప్పు చున్నాఁడు.

## ౩౩౯. వృద్ధిహ్రాసభాక్త్వ మంతర్భావా దుభయ సామంజస్యా దేవమ్. ౩. ౨. ౨౦.

తాత్పర్యము:—పూర్వపక్షులచేఁ జూపఁబడిన దోష మున్నను ఈదృష్టాంతము మాత్రము యుక్తమైనదియే. ఏయంశమును బోధించుటకై యిది చెప్పఁబడెనో యాయంశము నిది చక్కఁగనే బోధించుచున్నది. దృష్టాంతదార్ష్టాంతికములకు సంపూర్ణ మగుపోలిక నెందును గలుగ దని యిదివఱకే పలుమాఱు నిరూపించియున్నాము. సంపూర్ణమగు పోలికయే యుండునెడల వానికి దృష్టాంతదార్ష్టాంతికభావ మెట్లు కలుగును? "ముఖము ముఖమువలె నున్నది; చంద్రుఁడు చంద్రునివలె నున్నాఁడు" అనినఁ బ్రయోజన మేమి? ఒకపదార్థమునందుఁ గలయొకానొకధర్మమును బోధించుటకే కదా దృష్టాంతమును జూపుట; దార్ష్టాంతికపదార్థమునందు నాధర్మము సందిగ్ధమై యుండిన దానిని స్పష్టము చేయుటకే కదా దృష్టాంతమును జూపుట. దృష్టాంతదార్ష్టాంతికములు రెండును గోరఁచిన యట్లు సమానముగ నుండునేని యది యెట్లు సంభవించును. దార్ష్టాంతికము నందువలెనే తాను వివరింపనెంచినధర్మము దృష్టాంతమునందుఁ గూడ సందిగ్ధముగనే యుండవలయును గదా! కావున దృష్టాంతదార్ష్టాంతిక ములకు నెప్పటికి నేదియోయొకభేద ముండితీరును. మఱియు నీదృష్టాంతము మాచే స్వయముగఁ గల్పింపఁబడినది కాదు. వేదమునందే చెప్పఁబడినది. మేము దానియభిప్రాయమును మాత్రమే వివరింపు చున్నాము. ఇట్లుండ వేదార్థనిర్ణయకర్తల మగుమాపైఁ బైపూర్వపక్ష మెట్లు చేయుటకు వీ లగును? ఈకారణమువలనఁ బైపూర్వపక్షము యుక్తము కాదు.

ఇఁక నీదృష్టాంతము నుపయోగించుటయందు వేదమునకుఁ గల యభిప్రాయమును వినుము. ఈదృష్టాంతముచే బోధింపఁ దలఁచినధర్మము నాకర్ణింపుము. "సూర్యుఁడు పరమార్థస్థితిలో నేవికారమును జెందకున్నను ప్రతిబింబాధార మగుజల మభివృద్ధి నొందెనేని యభివృద్ధి నొందును. క్షీణించెనేని క్షీణించును. నశించెనేని నశించును. చలించెనేని చలించును. అనఁగా నుపాధి యగుజలములకుఁ గల ధర్మములు స్వయముగనే కలిగి యున్నట్లజ్ఞానులచే భావింపఁబడును. ఇట్లే నిర్వికారుఁ డయ్యును పరమేశ్వరుఁడు దేహాద్యభివృద్ధివలన నభివృద్ధి నొందును. క్షీణతవలన క్షీణించును. నాశమువలన నశించును. గమనాదులవలన గమనాగమనముల నాచరించును. అనఁగా నజ్ఞానులచే నట్లు భావింపఁబడును. కావున నీశ్వరునకు సూర్యునకువలెనే పరమార్థస్థితిలో నేవికారములును లేవు" అని మాత్రమే శ్రుతి యీదృష్టాంతమువలన బోధించుచున్నది. ఈకారణమువలన పై దృష్టాంతము యుక్తమైనదియే. ఇతరవిషయములయందుఁ బోలిక లేకున్నను ప్రస్తుతము వర్ణింపఁబడినవిషయమునందు మాత్రము కలదు కదా! కావున నెట్లును బరమేశ్వరుని నిరాకారత్వమునకు భంగము లేదు.

## ౩౪౦. దర్శనాచ్చ. ౩. ౨. ౨౧.

తాత్పర్యము:—ఇంత యేల? శ్రుతియందు "పరమేశ్వరుఁడు దేహాదిరూపప్రపంచమునందుఁ బ్రవేశించి యున్నాఁడు" అను విషయము స్పష్టముగఁ జెప్పఁబడి యున్నది. "పురశ్చక్రే ద్విపదః పురశ్చక్రే చతుష్పదః పురః స పక్షీ భూత్వా పురః పురుష ఆవిశత్ .........అనేన జీవే నాత్మ నానుప్రవిశ్య" "ఆపరమేశ్వరుఁడే మొట్టమొదట రెండుకాళ్ల జంతువుల దేహములను ప్రవేశించెను. నాలుగుకాళ్ల జంతువుల దేహములను గూడ ప్రవేశించెను. పక్షిదేహములను మనుష్యదేహములను గూడఁ బ్రవేశించెను...నేను జీవస్వరూపముతో సర్వప్రపంచమును బ్రవేశించి నామరూపములఁ బ్రకటించెదను; అని యాపరమేశ్వరుఁడు తలంచెను" అను మొదలగువాక్యము లీవిషయమును బోధించుచున్నవి. ఈవాక్యముల యర్థమును విమర్శించిన, వాస్తవస్థితిలోఁ బరమేశ్వరునకు స్వరూపభేద మెద్దియు లేదనియు దేహములయందుఁ బ్రవేశించుటయే భేదవ్యవహారమునకుఁ గారణ మనియు దేహధర్మము లాత్మకే కలవని తలంపఁబడు

చుండుట వట్టిభ్రాంతియే యనియుఁ దేలుచున్నది. ఇట్లగుటచే "అత ఏవ చోపమా సూర్యకాదివత్. 3. ౨. ౧౮." అను సూత్రమునఁ జెప్పఁబడినయర్థ మెంతయు యుక్తియుక్తము. ఇట్లగుటచేఁ బూర్వాపరముల విమర్శించినఁ బరమేశ్వరుఁడు నిర్గుణుఁడే యనియు సగుణత్వమును జెప్పు వాక్యము లుపాసనామాత్రపరములే యనియు సిద్ధాంత మగుచున్నది.

విశేషాంతము:—మఱికొంద ఱీయధికరణమును రెండుగా విభాగించి యున్నారు. "పరమేశ్వరుఁడు నిరాకారుఁడా? సాకారుఁడా?" అను సంశయమును నిరాకరించునవి యని "నస్థానతోఽపి. 3. ౨. ౧౧." అనుసూత్రము మొదలు నాలుగుసూత్రములకు ('అరూపదేవ. 3. ౨. ౧౪.' అనుసూత్రమువఱకుఁ గలసూత్రములకు) వ్యాఖ్యానముచేసి యున్నారు. ఈవ్యాఖ్యానమునకును మనవ్యాఖ్యానమునకును భేద మేమియు లేదు.

తర్వాత "ప్రకాశవచ్చ. 3. ౨. ౧౫" అనుసూత్రము మొదలు కడవఱకు రెండవయధికరణముగా వర్ణింతురు. "పరమేశ్వరుఁడు సద్రూపుఁడా? జ్ఞానరూపుఁడా? లేక, యుభయరూపుఁడా?" అనుసంశయ మీ యధికరణముచే నిరాకరింపఁబడు ననుచున్నారు. వీరిమతమున "ప్రకాశవచ్చ" అనుసూత్రము పూర్వపక్షసూత్రము. "శ్రుతులయందుఁ బరమేశ్వరునకు జ్ఞానస్వరూపము కల దని చెప్పఁబడి యున్నట్లే సత్తాస్వరూపము కూడఁ గల దని చెప్పఁబడి యున్నది. కావున శ్రుతిప్రామాణ్యమువలన నాయనకు రెండురూపములును గల వనవలయును" అనుట యాసూత్రమునకు నర్థము. "ఆహ చ తన్మాత్రమ్. 3. ౨. ౧౬." అనునది సిద్ధాంతసూత్రము "శ్రుతియందుఁ బరమేశ్వరునకు జ్ఞానస్వరూపమే చెప్పఁబడి యున్నది. వాస్తవస్థితిలో జ్ఞానమునకును వీనికిని భేదము లేదు. కావున జ్ఞానమాత్రస్వరూపుఁడే యైనను బరమేశ్వరుఁడు సత్తాస్వరూపుఁడు కూడ నగును. ఇట్లగుటచే నాయనకు రూపభేదము కూడఁ గలుగదు" అనునది దాని కర్థము. తక్కినసూత్రము లన్నియు నీసిద్ధాంతమును దృఢము చేయునవి. వానివ్యాఖ్యానము మనవ్యాఖ్యానము వంటిదే.

ఈవిషయమును గూర్చి కొంత విచారింపవలసియున్నది ఈ రెండవ యధికరణ ముండుట యెట్లును సంభవింపదు. మొట్టమొదటి యధికరణము ననే "పరమేశ్వరుఁడు నిర్విశేషుఁడు (నామరూపాదు లేవియు లేని

వాఁడు)" అని సిద్ధాంత మైనపిదప "బ్రహ్మసద్రూపుఁడా? కాఁడా?" అను మొదలగు సంశయములు కలుగుటకే వీలు లేదు. ఎట్లనిన :

పరమేశ్వరునకు గుణము లెవ్వియు లేవనియు సర్వాత్మకుఁడనియు మొదటి యధికరణమునందే సిద్ధాంతము చేయఁబడెను. ఇఁక నీభేదసంశయము పుట్టుటకుఁ గారణ మేమి? మఱియు శ్రుతులయందు "విజ్ఞానఘన ఏవ" అను మొదలగు వాక్యములచే "పరమేశ్వరుఁడు జ్ఞానమాత్రస్వరూపుఁడు" అని చెప్పఁబడియుండుటచే "పరమేశ్వరునకు సద్రూపము మాత్రమే యుండవలయును" అని భావించుటకు నవకాశము లేదు. జీవుఁడు జ్ఞానస్వరూపుఁ డనుట ప్రత్యక్షసిద్ధము; ఈపరమేశ్వరుఁ డాతనికి నాత్మభూతుఁడుగా నుపదేశింపఁబడి యున్నాఁడు కదా! ఆయన చేతనుఁడు కాకుండిన నిది యెట్లు సంభవించును? ఈకారణమువలన పరమేశ్వరుఁడు కేవల సద్రూపుఁడు" అని సంశయము కలుగుటకే వీలు లేదు. ఇట్లే "పరమేశ్వరుఁడు కేవలజ్ఞానస్వరూపుఁడు" అను నభిప్రాయము కూడఁ గలుగుటకు వీలు లేదు. "అస్తీత్యేవోపలబ్ధవ్యః" "పరమేశ్వరుఁడు సద్రూపుఁ డనియే తెలిసికొనవలయును" అను మొదలగు శ్రుతులు స్పష్టముగనే సద్రూపమును బోధించుచున్నవి. మఱియు సత్తతో సంబంధము లేక కేవలజ్ఞానము నిలుకడ చెందుట యెట్లు? ఇదియును గాక "పరమేశ్వరుఁడు రెండుధర్మములును గలవాఁడు" అనుసంశయమునకుఁ గూడ నవకాశము లేదు. "పరమేశ్వరునకు రెండుధర్మములు లేవు" అనువిషయము మొదటియధికరణమునందే సిద్ధాంతము చేయఁబడియున్నది కదా! ఈకారణములవలన రెండవయధికరణమునకుఁ బూర్వపక్షము కుదురదు.

ఇట్లే సిద్ధాంతము కూడ కుదురదు. ఆపూర్వపక్షమునకు సమాధానము నేమని చెప్పెదరు? "పరమేశ్వరుఁడు కేవల సద్రూపుఁడు" అనియా? "కేవల జ్ఞానరూపుఁడు" అనియా? లేక "సత్తాజ్ఞానములకు భేదము లేదు కావున నేకస్వరూపుఁడే" యనియా? ఇందు మొదటి రెండు పక్షములలో దేని నంగీకరించినను పూర్వాధికరణసిద్ధాంతమునకు విరోధము వచ్చును. కేవలసత్తారూపము మాత్రమే యున్న జ్ఞానరూపము తద్భిన్నమగును; జ్ఞానరూపమే యున్న, సత్తారూపము కూడ నట్లే యగును. బ్రహ్మభిన్న మగుపదార్థ మేదియు నుండఁగూడదు కదా! "శ్రుతియందే యట్లు చెప్పఁబడెను; కావున విరోధము లేదు" అని యెదవేమో. లోకానుభవవిరుద్ధ

మగువిషయమును శ్రుతి చెప్పు ననుటయే సంభవింపదు. ఒక్కపదార్థము నకు రెండుస్వభావము లుండుట విరుద్ధముకదా! ఇంక నీదోషముపోవుటకై రెండవపక్షము నాశ్రయించిన నప్పుడు పూర్వపక్షమే యుండుటకు వీలు లేదు. పరమేశ్వరుఁ డేకరూపుఁ డనువిషయము పూర్వాధికరణముననే నిర్ధారణ చేయఁబడి యున్నది కదా! కావున నెట్లును నీరెండవయధి కరణము నిలువదు. "ఇట్లనినఁ 'ప్రకాశవచ్చ' అను మొదలగు సూత్రములు బాగుగ నన్వయింపవు" అనియెదవేమో, యాసంశయమును వ్యాఖ్యానపూర్వకముగనే నివారించి యున్నాము. కావున నెట్లును రెండవయధికరణము సిద్ధింపదు. ఇదియునుఁగాక మొదటియధికరణ మున సాకారనిరాకార బ్రహ్మములను గూర్చి చెప్పు వేదవాక్యములు విచారింపఁబడెను; నిరాకారబ్రహ్మమును గూర్చి చెప్పునవియే యందుఁ బ్రధానములుగఁ బరిగ్రహింపఁబడెను. శ్రుతివాక్యములలో నేదియు నప్రామాణిక మగుటకు వీలులేదు. కావున సాకార శ్రుతులకుఁ గూడ నేదియో యొకయర్థమును గల్పించుట విధి. "ప్రకాశవచ్చ" అను మొదలగు సూత్రములును మఱియొక యధికరణముగ గ్రహించినచో నప్పుడీవిష యమును నిరూపించుటకు నవకాశ ముండదు. ఈవిషయము సూత్ర వ్యాఖ్యానమును విమర్శించినఁ దెలును. ఇది దోషము కదా! ఈకార ణమువలనఁగూడ రెండవయధికరణము నారంభించుట యుక్తియుక్తము కాదు. ఈసూత్రమునకు ద్వితీయాధికరణము నారంభించి చెప్పఁబడిన యర్థమునకంటె మేము చెప్పినయర్థమే మిగుల నుచితముగ నున్నది.

"ఇట్లు కాదు. సాకారశ్రుతులనుగూర్చి ప్రత్యేకముగఁ జెప్పవల సినపని లేదు. అవియు మొట్టమొదటఁ బ్రపంచమును చెప్పినను దన్నాశ పూర్వకముగ నిరాకార బ్రహ్మమునే బోధించును" అనియెదవేమో, యిదియు నంతయుక్తముగ లేదు. *పరవిద్యయు నపరవిద్యయు నని విద్యలు రెండువిధములు. పరవిద్య పరమేశ్వరుని మాత్రమే బోధించును. †అపరవిద్య కర్మోపాసనాదుల బోధించును. ప్రస్తావవశమున నీరెండువిద్యల యందుఁ గూడఁ బ్రపంచములు (భౌతికపదార్థములు) చెప్పఁబడియే యున్నవి. అందుఁ బరవిద్యయందు గలశ్రుతులు భౌతిక పదార్థ విలయ

* పరవిద్య యనఁగా పరమేశ్వరస్వరూపము మాత్రమే తెలుపువాక్యములు

† అపరవిద్య యనఁగా తక్కినశాస్త్రము లన్నియును.

ముచే బ్రహ్మము నెఱుంగవలయు నని చెప్పుచున్న వనుటలో సంశయము లేదు. నడుమనడుమ సందర్భానుసారముగ నెన్నివిషయములఁ జెప్పినను నాద్యంతములయందు బ్రహ్మప్రతిపాదకము లగువాక్యము లుండును; ఆ ప్రకరణమంతయుఁ దదర్థముగనే ప్రవర్తించుచున్నది యనుట స్పష్ట మగును. "యుక్తా హ్యస్య హరయః శతా దశేత్యయం శతా దశేత్య యం వై హరయో౽యం వై దశ చ సహస్రాణి బహూని చానంతాని చ." "జీవరూపమును పొందిన యీపరమేశ్వరునకు నింద్రియము లనుపది గుఱ్ఱములు కలవు. అవియే వానివృత్తిభేదములచే శతసహస్రాదిసంఖ్యలు గలవిగా నేర్పడి యనేకము లగును." అని బ్రహ్మాభిన్నముగ నింద్రియరూప ప్రపంచమును జెప్పుశ్రుతియొక్కటి పరవిద్యయందుఁ గలదు. విద్యాంత మున "త దేత ద్బ్రహ్మా పూర్వ మనపర మనంతర మబాహ్యం" "ఇది యంతయుఁ బరబ్రహ్మమే. ఆయనకు ముందుఁగాని వెనుకఁగాని లోపలఁ గాని వెలుపలఁగాని లేదు" అని యుపసంహార ముండుటచే నడుమ నున్న ప్రపంచశ్రుతికిఁ బ్రపంచ లయసమయమునఁ గలుగుపరమేశ్వరైక్యమే (పరమేశ్వరునకుఁ గల దని నిర్ణయింపఁబడు నేకత్వమే) యభిప్రాయ మనుట సిద్ధాంత మగును. ఉపాసనార్థమై "మనోమయః ప్రాణశరీరో భారూపః (ఛా. ౧. ౨. ౧.)" అని యాకారభేదములను జెప్పుశ్రుతులకుఁ గూడ నిదియే యభిప్రాయ మనుటకు నెట్లు వీలు కలుగును? ఆ ప్రకరణము పర విద్యాప్రకరణము; "స క్రతుం కుర్వీత" "వాఁడుపాసన చేయవలయును" అని యందలియుపసంహార ముపాసనా మాత్రవిషయమే యయియున్నది.

మఱియు నుపాసనావాక్యములనుగూర్చి శ్రుతి "ఇచ్చట చెప్పఁ బడినగుణము లన్నియు నుపాసనకొఱకే చెప్పఁబడినవి" అని స్పష్టముగఁ జెప్పుచుండ నిరర్థకముగ లక్షణావృత్తి నాశ్రయించి వానికి నన్యార్థమును (నాశానంతరమునఁ గలుగు పరమేశ్వరైక్యమును గూర్చి చెప్పునవి యను నర్థమును) కల్పించుట యెట్లు యుక్త మగును? ఇదియును గాక పరాపర విద్యలయందు గలసగుణవాక్యము లన్నియు నిట్టివే యైనచో "అరూపవ దేవ హి తత్ప్రధానత్వాత్. 3. ౨. ౧౪." అనుసూత్రమునందు నిరూ పింపఁబడినవిషయము నిరర్థకము కావలసి వచ్చును. ఆసూత్రమునందు నిర్గుణబ్రహ్మమును గూర్చి మాత్రమే తదేకప్రయోజనములై చెప్పుచుండు టచే నిర్గుణవాక్యములు ప్రధానము లనియు నుపాసననుగూర్చి మాత్రమే

చెప్పునవి యగుటచేత సగుణశ్రుతు లప్రధానము లనియు సిద్ధాంతము చేయఁబడియున్నది కదా ! సర్వవాక్యములును దదేకప్రయోజనముగాఁ బరమేశ్వరునిఁ గూర్చియే (పరమేశ్వరునియథార్థస్వరూపమును గూర్చియే) చెప్పునని యైన నీసిద్ధాంతమునకు విరోధము వచ్చును. ప్రపంచమును గూర్చి చెప్పువాక్యములు కూడ నుపాసనాపరము లయ్యుఁ గాకుండియుఁ గూడ ప్రపంచలయాభిప్రాయముతోఁ బరమేశ్వరయథార్థరూపమును జెప్పునవియే యగునేని "కొన్ని ప్రధానములు మఱికొన్ని యప్రధానములు" అనుటకే వీ లుండదు కదా! ప్రధానాప్రధానవిభాగమును చేయుటకు రెండుతెగలలోఁ జేరినవాక్యములును బరస్పరవిరుద్ధార్థమును జెప్పుచుండ వలయును; ఈకారణముచేత నీపరస్పరవిరోధము కలిగియుండవలయును. అందుఁ గొన్ని ప్రధానవిషయమునందే (అవి తక్కినవానికి విరోధముగాఁ జెప్పుచున్నవిషయమునందే) కాక మఱియొకవిషయమునందుఁ గూడఁ దాత్పర్యమును గలిగి యుండవలయును. అప్పుడు బలాబలవిచారము చేసి కొన్నిటిని ప్రధానములనుగాను మఱికొన్నింటి నప్రధానములను గాను కల్పింపవచ్చును. ఇట్లు లేకున్న నావిభాగమునకే యవకాశము లేదు కదా ! ప్రస్తుతము సగుణనిర్గుణశ్రుతు లిట్లే యొకబ్రహ్మమునుగూర్చి పరస్పరవిరుద్ధముగఁ జెప్పుచున్నవి; అందు సగుణశ్రుతులు కేవలబ్రహ్మ రూపమునే కాక తదుపాసనను గూడ మనశ్శుద్ధికై చెప్పుచున్నవి. నిర్గుణశ్రుతు లట్లు మఱియొకయర్థమును జెప్పుట లేదు. కావున నవి తక్కినవానికంటె బలవంతము లనియుఁ బ్రధానము లనియు సిద్ధాంతము చేయఁబడి యున్నది. ఈకారణమువలన నవశ్యముగ సగుణశ్రుతులకు నుపాసనయందే తాత్పర్య ముండి తీరవలయును; పరవిద్యయందుఁ గల కొన్నిశ్రుతు లిట్టివి కాకపోయినను నపరవిద్యయం దున్న శ్రుతు లవశ్యముగ నిట్టివే కావలయును. ఇదియునుగాక నిర్గుణవాక్యములకు బ్రహ్మస్వరూపజ్ఞానమే ఫలము; ఉపాసనలను జెప్పుసగుణవాక్యములకుఁ బాపక్షయముఁగాని ఐశ్వర్యప్రాప్తిగాని క్రమముక్తిగాని ఫలములు. వేదమున స్వయముగనే యీవిషయ ముపదేశింపఁబడి యున్నది. ఇట్లు ఫలములు భిన్నములై యుండ వాక్యములుమాత్ర మేక మగుట యెట్లు? ఈకారణమువలన సగుణనిర్గుణవాక్యములు ప్రత్యేకవిషయములను జెప్పునవియే కావలయును; అప్పుడుమాత్రమే సగుణవాక్యములకు నన్య

విషయమునఁ దాత్పర్యముండుటచే దుర్బలత్వంబును నట్లు లేకపోవుటచే నిర్గుణవాక్యములకు ప్రబలత్వంబును గలుగును.

ఇంతమాత్రమే కాదు. ఈసగుణనిర్గుణవాక్యము లేకవాక్యములని కల్పించుటకు వీలు కూడ లేదు. కొన్నిటికి బ్రహ్మస్వరూపప్రతిపాదనము విషయము; మఱికొన్నిటికి నుపాసనావిధి విషయము కదా! "ఈ విషయము నెవ్వ రంగీకరించిరి? అన్ని వాక్యములును నొక్కవిషయమునందే జీవునిఁ బ్రేరేపించుచున్నవి; పరబ్రహ్మస్వరూపము తెలిసికొనవలయు నని నిరూపించుచున్నవి." అనియెదవేమో యది యుక్తము కాదు. పరమేశ్వరస్వరూపమును గూర్చి ప్రత్యక్షముగ జెప్పునిర్గుణవాక్యము లెవ్వనిఁగాని యేవిషయమునందుఁ గాని ప్రేరేపించుట లేదు. అవి వస్తుస్వరూపమునుఁ గూర్చి మాత్రమే చెప్పు ననియు నందుఁ బ్రేరణ యనునదియే లే దనియు "తత్తు సమన్వయాత్. 1. 1. 4" అనునధికరణమున విశేషించి బోధించి యున్నాము.

మీయభిప్రాయమునే యంగీకరించి చూతము. సర్వవాక్యములయందును బ్రేరణ కల దని చెప్పితిరి గదా? దానికి విషయ మెయ్యది? పురుషుఁడు యేదియో యొకకార్యమును గూర్చియె కదా ప్రేరేపింపఁబడవలయును. బ్రహ్మస్వరూపము కార్యము కానేరదు. అం దెవ్వండుగాని చేయవలసినపని యేది కలదు? "బ్రహ్మస్వరూపము స్వయముగఁ గార్యము కాకున్నను దానినిఁ దెలిసికొనుటకై చేయవలసినకార్య మొకటి కలదు. అదియే ప్రపంచనాశము. భేదరూప మగు నీ ప్రపంచము లయము నొందిననే కాని పరమేశ్వరతత్త్వము బయలు పడ దనుట నిస్సంశయము. ఈకారణమువలన స్వర్గార్థు లగువారినిఁ గూర్చి యజ్ఞాదివిధుల నెట్లు బోధించుచున్నదో యట్లే మోక్షార్థినిఁ గూర్చియు శ్రుతి ప్రపంచలయవిధి నుపదేశింపవచ్చును. రాత్రియందుఁ బదార్థములను స్పష్టముగఁ దెలిసికొనఁ గోరువాఁడు అవశ్యముగఁ జీఁకటి నెట్లు శమింపఁజేయవలయునో యట్లే పరమేశ్వరస్వరూపము నెఱుంగఁ గోరువారు జ్ఞానోత్పత్తికి (అభేదజ్ఞానోత్పత్తికి) విరుద్ధ మగు భేదప్రపంచమును నాశము చేయవలయును. ప్రపంచ మనునది వాస్తవస్థితిలోఁ బరమేశ్వరుఁడే; ఆపరమేశ్వరుఁడు మనకుఁ బ్రపంచరూపముతోనే తోఁచుచున్నాఁడు. ఈకారణమువలనఁ బ్రపంచము నశించిన నమ్మహాత్ముని యథార్థ

స్వరూపము తేటపడును. ఆయనకు నీప్రపంచము పరమార్థరూపము కాదు కదా! ఈకారణమువలన వేదవాక్యము లవశ్యముగ "నీవు ప్రపంచమును నశింపఁజేయవలయును" అని ప్రేరేపింపవచ్చు ననుట నిర్వివాదము; అని యెదవేమో వినుము.

ఇచ్చట నొక ప్రశ్నమునకు నవకాశము కలదు. ప్రపంచలయము చేయవలయు నంటిరిగదా! ఆలయ మెట్టిది? నిప్పుచే నేతినిఁ గరఁగించు నట్లు దండాదులచే ఘటాదులను పగులఁగొట్టునట్లు నీదేహాదులను బృథివ్యాదులనుఁ గూడ ధ్వంసము చేయుటయా? లేక రజ్జుసర్పమును రజ్జుజ్ఞానముచే బాధించునట్లు పరమేశ్వరస్వరూపజ్ఞానముచేఁ బ్రపంచమును బాధించుటయా? ఇందు మొదటిపక్షము నాశ్రయించిన నది యొకపక్షమున నెవ్వరికిని సాధ్య మగుపని కాదు. రెండవపక్షమున ముక్తుఁ డొక్కఁడు సర్వమును ధ్వంసముఁ జేసిన వెనుకటివారు చేయవలసిన పనియే యుండదు. అప్పుడు వేదము చేయువిధియే నిరర్థక మగునుగదా! ఇదియును గాక నప్పుడు భూమ్యాదుల ధ్వంసము చేయుటకే తగినసాధనముల సంపాదించుకొనుమని మాత్రమే విధింపఁబడి యుండవలయును గాని బ్రహ్మస్వరూపమును గూర్చి చెప్పఁబడి యుండ నక్కఱ లేదు. భ్రాంతిచేఁ గల్పింపఁబడినపదార్థమైనచో నది వస్తుయథార్థజ్ఞానమువలన నశించును గాని వాస్తవపదార్థ మట్లు నశింపదు కదా! ఇఁక రెండవపక్షము నాశ్రయించిన మాసిద్ధాంతమే నిలుచును. అప్పుడు విధియే యుండవలసినపని లేదు. ఎట్లనిన:—

ప్రపంచ మేకరూపుఁ డగుపరమేశ్వరునియందే భ్రాంతిచేఁ గల్పింపఁబడినది. ఈకారణమువలన రజ్జుసర్పభ్రాంతి గలవానికి రజ్జుస్వరూప వివేచనమును గావించిన నెట్లు సర్పము నశించునో యట్లే బ్రహ్మస్వరూపవివేచనము వలనఁ బ్రపంచము నశించును. ఇట్లగుటచే శ్రుతికిఁ బరమేశ్వరాకారమును గూర్చి చెప్పుట మాత్రమే యావశ్యకము గాని విధినిషేధములు కావు. "తత్త్వమసి నేహ నానాస్తి కించన" అని భేదనిషేధపూర్వకముగ నద్వితీయబ్రహ్మమును బోధించిన నప్పుడు తజ్జ్ఞానమువలన నజ్ఞానము నశించును. అజ్ఞానము నశించిన దానిచేఁ గలిగిన ప్రపంచారోపము తొలఁగును. ప్రపంచలయమే కదా కావలసినపని! ఇట్లుండ నిఁక విధి యేల? స్వరూపప్రకాశము చేయకున్న "పరమేశ్వరుని తెలిసికొనవలయును,

ప్రపంచమును నశింపఁ జేయవలయును" అని వేయుమాఱులు విధించినను ప్రయోజనము లేదు కదా! స్వరూపప్రకాశనంబును విధి కానేరదు కదా! "ఇట్లు కాకున్నను మఱియొక విధముగా నిచ్చట విధి కలదు. పరమేశ్వరస్వరూపమును దెల్పినపిదపనే 'యీాయనను దెలిసికొనవలయును' అని జ్ఞానవిషయముగాను 'నీజ్ఞానముచేఁ బ్రపంచమును ధ్వంసము చేయవలయును' అనియును శ్రుతి విధింపవచ్చును గదా!" అనియెదవేమో, యిదియు క్తముకాదు. రజ్జుసర్పభ్రాంతికలవానిని గూర్చి కేవల రజ్జుస్వరూపమును ప్రకటించినంతనే వానికి రజ్జు యథార్థరూపజ్ఞానంబును (సర్పభ్రాంతి) నాశంబును గలిగినట్లు, ప్రపంచభ్రాంతి గలవానికిఁ గూడఁ బరమేశ్వర స్వరూప నిరూపణమాత్రముననే తత్త్వజ్ఞానంబును ప్రపంచనాశంబును గలుగును. ఇట్లగుటచే నీవిషయములయందు విధి ప్రత్యేకముగ నుండ వలసినపనిలేదు. ఒకమారు చేసినదానినే మఱియొకమారు చేయుదురా? మఱియు జ్ఞానవిషయమునఁ గూడ విధి కావలయు ననినఁ గర్మవిధులు చెప్పు స్థలమునఁగూడ మఱియొకవిధి కావలసివచ్చును. "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అను మొదలగు వాక్యములయందు విధియున్నను నావాక్యములకుఁ దమ తాత్పర్యము నొసంగుటయందే సామర్థ్యము కలదు గాని ఇతరవిషయములందు లేదని నిర్ణయింపవచ్చును గదా! ఈకారణమువలన బ్రహ్మజ్ఞానమునకు దత్స్వరూపనిరూపణమే యావశ్యకముగాని విధి కాదు. పదార్థస్వరూపమును వివరించినపిదప "ఈపదార్థము నీస్వరూపముతోఁ దెలిసికొనవలయును" అని ప్రత్యేకముగా విధింపనేటికి? స్వరూపమును బ్రకటించుట జ్ఞానార్థమే కదా! ప్రస్తుత సందర్భమునందును నిట్లే విధి యక్కఱ లేదు. ఆరంభమునందే "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" "ప్రతివాఁడును సంపూర్ణముగఁ దాత్పర్యజ్ఞానము కలుగునంతవఱకుఁ దదను సారముగఁ బ్రవర్తించి ఫలమునుఁ గాంచునంతవఱకు వేదాధ్యయనము నాచరింపవలయును" అనువిధివాక్యము వేదమునందుఁగలదు. దీనితాత్పర్యమును విచారించిన, ఏస్థలమున నేది చెప్పఁబడియుండునో, దాని నట్లే గ్రహించి తదనుసారముగ బ్రవర్తించి ఫలమును గాంచవలయు నని తేలును. కావున జ్ఞానవిషయమై ప్రత్యేకవిధి యుండనక్కఱలేదు. ఇట్లగుటచేతనే 'శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః' అను మొదలగువాక్యములు విధి వాక్యములవలె నున్నను బ్రహ్మజ్ఞానమునుగూర్చి సామాన్యముగాఁ దెల్పు

నవియేకాని ఏవిషయమునుగాని విధించునవి కానేరవు. కావున నెట్లును బరమేశ్వరవిషయమున విధియే లేదు.

ఇదియునుగాక బ్రహ్మజ్ఞానవిషయమున విధి యుండునేని దానికి విధేయుఁడే (ఎవ్వనిఁ గూర్చి విధింపవలయునో వాఁడే) యుండఁడు. ఎట్లనిన:—ఏవిధు లుపదేశింపఁబడినను జీవునిగూర్చియే యుపదేశింపఁబడు ననుట నిర్వివాదాంశము. యజ్ఞాదికర్మలను గూర్చి యుపదేశింపఁబడుకాలమునఁ బ్రపంచమంతయు సత్యమే యయి యున్నది (అనఁగాఁ దత్త్వజ్ఞానము తత్ప్రకాశము లేదు కావున సత్యమనియే భావింపఁబడుచున్నది). ఈకారణమువలన నప్పుడు జీవునిఁగూర్చి సర్వము నుపదేశింపవచ్చును; వానికిఁగల భేదభ్రాంతి ననుసరించి కర్త్రాదుల విధింపవచ్చును. ప్రస్తుతమున మాత్ర మట్లు కాదు. జీవుని కేవలప్రపంచరూపునిఁగఁ గాని కేవలబ్రహ్మరూపునిఁగఁ గాని యవిద్యచే బ్రహ్మమునందే భిన్నరూపముతోఁ గల్పింపఁబడినవానిఁగఁగాని గ్రహించినను వానినిఁగూర్చి విధిసంభవింపదు. ఈప్రపంచము భ్రాంతికల్పితమే యగుటచేతను, దీని యథార్థస్వరూపము పరమేశ్వరుఁడే యగుటచేతను శ్రుతియు నాపరమేశ్వరుని స్వరూపమునే ప్రకటించుచుండుటచేతను నీసమయమున ప్రపంచము బాధింపఁబడుటచే సత్యముకానేరదు; జీవుఁడును పరమేశ్వరునికంటె భిన్నుఁడగునేని ప్రపంచమునఁ జేరినవాఁడే యగునుకావున నాతఁడును నప్పుడు లేనివాఁడే యగును. ఇట్టిశూన్యరూపునకు విధి నిషేధము లుండుట యెట్లు? ఇఁకఁ గేవలపరమేశ్వరరూపునిఁగ గ్రహించిన నపుడు బొత్తుగనే విధినిషేధములతో సంబంధముండుటకు వీలు లేదు. శుద్ధబ్రహ్మము విధినిషేధములలో దేనికిని గోచరుఁడు కాఁడుగదా! ఇట్లుగాక యవిద్యాకల్పితునిఁగా గ్రహించినను నా జీవుని నేకార్యమునందును బ్రవర్తింపఁజేయుటకు వీలు లేదు. పరమేశ్వరస్వరూప నిరూపణముతోడనే భ్రాంతి తొలఁగిపోయెను కదా! భ్రాంతి పోయిన జీవుఁ డెట నుండఁ గలఁడు? కారణములేక కార్యముండునా? కావున విచారించి చూచినచో బ్రహ్మజ్ఞానవిధికి విధేయుఁడే యుండఁడు. ఈకారణమువలనఁ బరమేశ్వరవిషయమును విధిలేదు.

ఇఁదియునుఁగాక జ్ఞానము స్వయముగ జనించునదియె కాని విధిచేఁ గలిగింపఁబడునది కాదు. "చూడుము; వినుము" అను మొదలగు వ్యవహారములయందు "ఈవైపునకు మనసును త్రిప్పుము" అని మాత్రమే బోధింపఁ

బడుచున్నది. కాని "జ్ఞానముం జేయుము." అని కాదు. ప్రత్యక్షముగఁ బదార్థములఁ జూచుచున్నను నిద్రాదివశగతులు కాక మేలఁకువతోనే యున్నను బదార్థస్వరూపజ్ఞాన మొకప్పుడు గలుగును; మఱియొకప్పుడు కలుగక యుండును. ఇది లోకానుభవసిద్ధము. విధిచేతనే జ్ఞానము జనించునది యగునేని ఈభేద ముండఁగూడదుగదా! కావున నేశాస్త్రముగాని జ్ఞానమునకు సహాయముగ నెప్పటికిని విషయస్వరూపమును మాత్రమే నిరూపింపవలయును గాని మఱియేకార్యమునుఁ జేయ నక్కఱ లేదు. విషయస్వరూపము (జ్ఞానమునకు గోచరము కావలసినపదార్థముయొక్క స్వరూపము) నిరూపింపఁబడఁగానే ప్రమాణానుసారముగ (అనఁగా నెదుట నున్నపదార్థమునుగూర్చి ప్రత్యక్షప్రమాణము నాశ్రయించియు, గుఱుతులచే నూహింపఁబడవలసినదానినిఁ గూర్చి యనుమానప్రమాణము నాశ్రయించియుఁ బోలికచే గ్రహింపఁబడవలసినపదార్థమును గూర్చి యుపమానప్రమాణము నాశ్రయించియు వేదాదివాక్యములనుబట్టి మాత్రమే గ్రహింపఁబడవలసినవానినిగూర్చి శబ్దప్రమాణము నాశ్రయించియు) జ్ఞాన ముదయించును; స్వయముగనే యుదయించును. "ఈజ్ఞానోదయము విధివలననే గలిగె నని యేల తలంపరాదు" అనియెదవేమో, వినుము. ఆవిషయమును నిర్ణయించుట కెట్టును వీలు లేదు. విధివలననే జ్ఞానము జనించునేని యొకసమయమున నొకపదార్థమునుగూర్చి మఱియొకవిధముగఁ గూడ (జ్ఞానము) జనింపవలసియుండును. పదార్థస్వరూపమునకు ననురూపముగనే లోకమున జ్ఞానము జనించుచున్నది. స్తంభస్వరూపము ప్రకటింపఁబడినపిదప నేపురుషుఁడును దానిని ఘటమునుగ గ్రహింపఁడు."కొన్నిస్థలములయందు 'ప్రాణమును బరమేశ్వరునిఁగా భావింపుము. లేక, తెలిసికొనుము.' అనుమొదలగువిధులుఁ గలవు. వాని ననుసరించి యుపాసకులును నావిధుల నాశ్రయించి ప్రాణమును పరమేశ్వరునిఁగా భావించుచున్నారు కదా!" అనియెదవేమొ వినుము. మీరు వర్ణించినది జ్ఞానము కాదు. అది ధ్యాన మనెడుమానసక్రియ. ఒక పదార్థమును మఱియొకదానినిగా భావింపవచ్చును గాని తెలిసికొనుటకు వీలు లేదు.ప్రాణస్వరూపమును లక్షణములను స్పష్టముగ నెఱింగినవాఁ డేదియో యొకపోలిక నాశ్రయించి దానిని బ్రహ్మమునుగా భావింపవచ్చును గాని (ధ్యానింపవచ్చును గాని) సంపూర్ణముగఁ బరమేశ్వరుఁడే యని

గ్రహించుటెట్లు? అపరమేశ్వరునకు ప్రాణలక్షణములకంటె విరుద్ధములగులక్షణములు కలవు కదా! ఈ కారణమువలన విధిచే నుదయించునది జ్ఞానము కానేరదు. ఇంతమాత్రమే కాక కొన్ని కొన్ని సమయములయందు ముత్యపుఁజిప్పను చూచుచుండియు వెండి యని తలంచుచుండుట యనుభవములో నున్నది. ఇదియు భ్రాంతి యగునుగాని జ్ఞానము కానేరదు. కావున నెట్లు చూచినను జ్ఞానమనునది స్వయముగ జనింపవలసినదియే కాని విధులచేతఁ గలుగఁజేయఁబడునది కాదు; నిషేధములచేతఁ దొలఁగింపఁబడునదియుఁ గాదు.

జ్ఞానమనఁగఁ బదార్థమును ప్రమాణానుసారముగ దానియథార్థస్వరూపముతో గ్రహించుచిత్తవృత్తియే కాని మఱియొక్కటి కాదు. మఱియు కర్మవలె పురుషున కధీన మయినది కాదు. పురుషుఁడు కర్మను యథేచ్ఛముగ నాచరించును. లేకున్న నాచరింపకుండును. ఒకవిధముగ నాచరింపుమనిన మఱియొకవిధముగ నైన నాచరింపవచ్చును. జ్ఞానమును మాత్ర మిట్లు చేయనేరఁడు కదా! ఈకారణమువలన జ్ఞానము వస్తువునకు స్వాధీన మయినదియే కాని పురుషునకుఁ గాదు. ఇట్టిదానినిగూర్చివిధియేమి చేయఁగలదు?

మఱియొకవిశేషము. జ్ఞానమునకుఁ గూడ విధి కావలసి యుండునేని వేదాంతశాస్త్రమునకు నదియే ముఖ్యతాత్పర్యము కావలసి వచ్చును. సర్వశాస్త్రమును విమర్శించి మీరే "పరమేశ్వరుఁడు విధికి స్వాధీనుఁడు కాఁడు; అపరమేశ్వరునకును జీవునకును భేదము లేదు" అని యంగీకరించియున్నారు కదా! దానికివిరోధము వచ్చును. ఒక్క వేదాంతశాస్త్రమే విధినిషేధములకు నతీతుఁ డగుపరమేశ్వరునకును జీవునకును నభేదము చెప్పి మరల బ్రహ్మజ్ఞానమునందు దాజీవునే నియోగించునేని పరస్పర విరుద్ధార్థమును జెప్పునది యగును; ఒక్కదానికే రెండు తాత్పర్యములు వచ్చిన ట్లగును.ఇది విరుద్ధముకదా! ఇంతమాత్రమే కాదు; శాస్త్రము కర్మనువలె జ్ఞానమును విధించునేని కర్మకువలెనే దానికిని సాధనసహాయ ముండవలసి వచ్చును; కర్మఫలమువలెనే దానిఫలము కూడ నుండవలసి వచ్చును. కర్మఫల మదృష్ట మైనట్లే జ్ఞానఫల మగు మోక్షము కూడ నదృష్టముకావలసివచ్చును? అనిత్యమును దారతమ్యములతోఁ గూడినదియు సూక్ష్మశరీరముతోఁ గూడినదే యనుభవింపఁబడ

వలసినదియు నైనట్లే మోక్షము కూడఁ గావలసివచ్చును. అప్పు డది ముక్తియే కానేరదు కదా ! ఈకారణమువలన బ్రహ్మజ్ఞానమును గూర్చి చెప్పు వాక్యములు తత్స్వరూపమును గూర్చి మాత్రమే చెప్పునవి యగును గాని విధిని గూర్చి కాదు. ఈకారణములవలన "సగుణనిర్గుణ వాక్యములు రెండు నొక్కవిధినిఁ గూర్చియే చెప్పునవి యగుటచేత నేక వాక్యములు" అనుపక్షము యుక్తము కాదు.

ఇట్లు కాక "వేదాంతవాక్యములయందు విధి కలదు" అని యంగీక రించినను సగుణనిర్గుణవాక్యములలో నుండువిధు లొక్కటి కానేరవు. కర్మకాండమునం దనేకకర్మలు ప్రత్యేకముగఁ జెప్పఁబడి యున్నను నచ్చట నధికారి యొక్కఁడే యగుటచే విధియు నొక్కటియే యగును. ఇచ్చట నట్లు లేదు. సగుణవాక్యములు ప్రపంచమును గూర్చి చెప్పును; నిర్గుణ వాక్యములు ఏకస్వరూపమును గూర్చి బోధించును. ఈ రెండు నొక్కనికే బోధింపఁబడె ననుట యెట్లు సంభవించును ? మఱియు కర్మకాండము నందలివాక్యములు పరస్పర ముపకారము చేసికొనుచుండును గాని ప్రస్తుత సందర్భము లట్లును జేసికొనవు. ఇవి రెండును పరస్పరవిరుద్ధములు కదా! కావున నెట్లును నీవాదము యుక్తియుక్తము కానేరదు. మాపక్షమే యుక్త మైనది. నిర్గుణవాక్యములు బ్రహ్మస్వరూపమును గూర్చి మాత్రమే చెప్పు ననియు సగుణవాక్యము లుపాసనల బోధించు ననియు నీకా రణమువలనఁ దదేకప్రయోజనము లగునిర్గుణవాక్యములు బలాధికము లనియుఁ బ్రధానము లనియు మాత్రమే చెప్పవలయును.

---

## ౬. ప్రకృతైతావత్త్వాధికరణము

విషయము:—"ద్వే వావ బ్రహ్మణో రూపే మూర్తం చైవా మూర్తం చ" "*మూర్తమనియు †నమూర్త మనియు ‡పరమేశ్వరునకు

---

* మూర్తమనఁగా నాకారముగలది కఠినమైనది. అగ్నిజలపృథివీభూతములు.

† మూర్తమునకు భిన్నమైన స్వభావములు గలది.

‡ పరమేశ్వరునకు మూర్తరూప మనియు అమూర్తరూప మనియు రెండురూప ములు కలవు. సర్వప్రపంచమును పరమేశ్వరుఁడే గావున మనకుఁ బ్రత్యక్షముగఁ

రెండురూపములు గలవు" అని యారంభించి పృథివీజలతేజస్సులను మూర్తరూపమునుగాను ఆకాశవాయువుల నమూర్తరూపమునుగాను చెప్పి వానినిగూర్చిన సర్వవిషయములను వివరించి పిదప "అథాత ఆదేశో నేతినేతి" "ఈవిధముగ నీమూర్తామూర్తరూపములు రెండును పరమేశ్వరునియం దారోపింపఁబడి యుండుటచే వానిని బుద్ధిచే నిషేధింపఁగా మిగిలినవాఁడే పరమాత్ముఁ డని యుపదేశింపవలసి యున్నది" అని బృహదారణ్యకోపనిషత్తునందు జెప్పఁబడియున్నది. ఈనిషేధము యొక్కయర్థ మీయధికరణమున విచారించి నిర్ణయింపఁబడును.

సందేహము:—"పై వాక్యమునందు నిషేధింపఁబడిన దెద్ది ? పరమేశ్వరుఁడా ? లేక నాయనకుఁ గల వని చెప్పఁబడినరూపములా ? లేక అన్నియునా ? మఱియు నీనిషేధమునందు మిగుల్పఁబడిన దెద్ది ? రూపములా ? లేక బ్రహ్మమా?" అనుసంశయము నివారింపఁబడును.

సంగతి:—పై యధికరణమునందు "పరమేశ్వరుఁడు నిర్విశేషుఁడు" అనువిషయము నిర్ణయింపఁబడెను. పై వాక్యమునందుఁ జూపఁబడిన సంశయమునవలన "వేదము బ్రహ్మమును కూడ నిషేధించుచునేయున్నది. ఈకారణమువలన పరమేశ్వరునిఁ గూర్చి ప్రస్తావింపవలసినపనియే లేదు" అని యాక్షేపసంగతితో దానిపై పూర్వపక్షము వచ్చెను. అది యీయధికరణమున నిరాకరింపఁబడుచున్నది. బ్రహ్మమే లే దనుట పూర్వపక్షమునకును కల దనుట సిద్ధాంతమునకును ఫలములు.

పూర్వపక్షము:—పై యుపనిషత్తునందు మొట్టమొదట రెండురూపములును ఆరూపములు గలపరమేశ్వరుఁడును ప్రస్తావింపఁబడి యున్నారు. పిదప నిషేధము చేయఁబడి యున్నది. ఇప్పుడు ఆనిషేధ మొక్కపదార్థమును మాత్రమే నిషేధించు నని నిరూపించుటకు తగిన సాధనము లేదు. రెండుపదార్థములను గూర్చి చెప్పినప్రకరణమునందు నిషేధము కానవచ్చినప్పుడు అది యొక్కవిషయమును గూర్చినది మాత్రమే యై యుండు ననుట యెట్లు సిద్ధాంత మగును ? మఱియు పరమేశ్వరుఁడు సామాన్యరూపుఁడు ; మూర్తామూర్తరూపములు తద్విశేష

గానవచ్చు నగ్న్యాదిభూతముల నాశ్రయించియు కానరాని యాకాశవాయువుల నాశ్రయించియు నిట్లు కల్పింపఁబడెను. పృథివ్యాదులయం దున్నబ్రహ్మము నేత్రాది గోచరునిఁగాను భావించుచున్నా మనుట.

ములు. ఇ ట్లుండ నొకవేళ నీనిషేధము కేవలరూపములనే నిషేధించినను పరమేశ్వరునిఁగూడ నిషేధించినదియే యగును. విశేషములు లేని సామాన్యముండదు కదా! కావున నెట్లును ఈనిషేధము రెంటినిఁ గూడ నిషేధించు ననియే చెప్పవలయును.

వేదాంతవాక్యములయం దొకవేళ పరమేశ్వరునిఁగూర్చి విశేషముగఁ జెప్పఁబడి యున్నను అది యంతయు మూర్తామూర్తరూపసహితుఁడగువానిని గూర్చి మాత్రమే యై యున్నది. కాని నిర్విశేషునిఁ గూర్చి కా దనవలయును. విశేషములు లేకున్న సామాన్య ముండ దని యిదివఱకే చెప్పి యున్నాము కదా! "అ స్తీత్యే వోపలబ్ధవ్యః (చూః 3. ౨. ౨౧.)" అను మొదలగువాక్యములు బ్రహ్మమును సద్రూపమునుగాఁ జెప్పుచున్నను అవి యుపాసనాపరము లనియే సిద్ధాంతము చేయవలయును. పైఁ జెప్పినయుక్తి ననుసరించి చూచిన పరమేశ్వరుఁడు సద్రూపుఁడు కానేరఁడు కదా! కొన్నికొన్ని స్థలములయందు "పరమేశ్వరుఁడు లేఁ డని తలంచువాఁడు లేనివాఁడే యగును" అను మొదలగు నిందావాక్యము లున్నను అవి యుపాసనావిధిని నుతించునవియే కావచ్చును. కావున నెట్లు చూచినను పై నిషేధము ప్రపంచబ్రహ్మముల రెంటిని నిషేధించు ననియే తోఁచుచున్నది. వాక్యమునందును నిషేధములు రెండు కలవు కదా!

ఇట్లు గాకున్నను పై నిషేధము ప్రపంచమును మాత్రమే నిషేధించు ననిన విరోధము కూడవచ్చును. ప్రపంచము ప్రత్యక్షాదిప్రమాణములకు గోచరమై యున్నది; బ్రహ్మ మట్లు లేదు. ఆయన మనస్సునకు గాని వాక్కునకు గాని గోచరుఁడు కాకున్నాఁడు కదా! ఈకారణము వలన నిషేధించుటచే నాయనయే నిషేధింపఁబడును కాని స్వరూపాదులు కావు. మఱియు రూపములు గుణములు అవి యొకని నాశ్రయింపక యుండనేరవు? స్వతంత్రముగ నిషేధింపఁబడనేరవు. ఇ ట్లుండ పై నిషేధము కేవలరూపములను నిషేధించు ననుట యెట్లు? ప్రపంచనిషేధము ప్రత్యక్షాదిసర్వప్రమాణములకును విరుద్ధము కావున నయుక్తము పరమేశ్వరనిషేధము మాత్ర మట్టిది కా దని నిరూపించితిమి కదా! కావున శ్రుతులే పరమేశ్వరుని నిషేధింపుచున్నవి; వేదాంతదర్శనమునకు ఇట్లు చెప్ప నేల ఆస్తికదర్శనముల కన్నిటికిని ఇప్పుడు మూలోచ్ఛేదము కలిగినది.

## అ_౩. పా_౨. సూ_౨౨.

అవతారిక:—అనిన నీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

# ౩౪౧. ప్రకృతైతావత్త్వం హి ప్రతిషేధతి తతో బ్రవీతి. ౩. ౨. ౨౨.

తాత్పర్యము :— ఇట్లు చెప్పఁగూడదు. పై నుదహరింపఁబడిన శ్రుతి ప్రకరణమున వర్ణింపఁబడియున్న పరిచ్ఛేదమును మాత్రమే నిషేధించుచున్నది; పరమేశ్వరుని మిగుల్చుచున్నది. నిషేధ మనఁగా నేదియో యొకపదార్థమును నిలిపి తక్కినవానిని మాత్రము నిరాకరించుటయే కదా! ఏపదార్థమును కూడ ప్రధానముగఁ గైకొనకుండిన నిషేధమునకు ఫల మేమి? ఈనిషేధముచే నెవ్వ రే విశేషమును గ్రహింపగలుగుదురు. సర్వమును నిషిద్ధమే యైన నీక శాస్త్రమునకుఁ బ్రయోజనమేమి; ఈ కారణమువలన నేదియో యొకపదార్థమును ప్రధానముగాఁ గైకొనియే నిషేధము ప్రవర్తింపవలయును. ప్రకృతమున నాయుపనిషత్తునందు ప్రకరణారంభమునుండియు పరమేశ్వరునియొక్క మూర్తామూర్తరూపములు మాత్రమే సవిస్తరముగఁ బ్రకటింపఁబడి యున్నవి; పరమేశ్వరుఁడు మాత్ర మట్లుకాక షష్ఠీవిభక్తిచే గ్రహింపఁబడి కేవలసంబంధముతో మాత్రమే ప్రత్యేకముగ వర్ణింపఁబడి యున్నాఁడు. "ఈమూర్తామూర్త రూపము లాపరమేశ్వరునకు సంబంధించినవి" యనిమాత్రమే నిరూపణము కలదు. అందు పరమేశ్వరుఁడు ప్రధానుఁడు కాఁడు కదా! ఈకారణము వలన "నేతి" అను నిషేధశ్రుతియందుఁ గలయితిశబ్దము ప్రధానము లగురూపములను మాత్రమే గ్రహించు నని చెప్పవలయును. ఇదియును గాక పరమేశ్వరునకు మాయామయము లగుమూర్తామూర్తరూపములు వర్ణింపఁబడినపిదప "ఆతని పరమార్థస్వరూప మేది" యని విచారము కలుగఁగా దానిని నిర్ణయించుటకై యీనిషేధశ్రుతి ప్రవర్తించెను. "అథాత ఆదేశో భవతి" "ఇక నీవిషయమున నుపదేశము నిట్లు గావింప వలయును" అని యుపక్రమించి నిషేధమును గావించెను. ఇప్పుడు విచారింపుఁడు; ఈనిషేధము దేనిని గూర్చి యుండవలయును? పరమేశ్వర రూపమును వర్ణించుటకై ప్రవర్తించినశ్రుతి యాయననే నిషేధించునా?

ఈకారణమువలన నైనిషేధము రూపమాత్రపరమే యని నిర్ణయింపవలసి యున్నది. "తదనన్యత్వ మారంభణశబ్దాదిభ్యః. 2. 1. 14." అను మొదలగు స్థలములయందు పరమేశ్వరుఁడు సర్వకల్పనాధార మనియు ప్రపంచము * వాచారంభణమాత్ర మనియు నిర్ణయించి యున్నాము. కావున ప్రపంచమును నిషేధించిన నిషేధింపవచ్చును గాని సర్వాధార మగుపరమేశ్వరుని నిషేధించుటకు వీలులేదుకదా!

"శాస్త్రము ఈరూపములను స్వయముగనే చెప్పి మఱల నేల నిషేధించును? 'ప్రక్షాళనాద్ధి పంకస్య దూరా దస్పర్శనం వరం' 'బురదను త్రొక్కి కడుగుకొనుటకంటె మొట్టమొదటనే తాకకుండుట మేలు' అను న్యాయము ననుసరించి మొట్టమొదటనే యూరకుండుట యుక్తము కదా! ప్రతిపాదించుట యేల? మఱల నిషేధించుట యేల?" అనియెదవేమొ. ఇట్లు సంశయింపవలసినపనిలేదు. ఈరూపములను వేదము పరమేశ్వరునకు విధించుట లేదు. ఇవి లోకప్రసిద్ధము లయ్యేయున్నవి. లోకమునఁ గాన వచ్చుపంచభూతములు అవిద్యచేఁబరమేశ్వరునియందుఁగల్పింపఁబడినవియని యిదివఱకే నిరూపించియున్నాముకదా! కావున నీశ్రుతి యాలోకప్రసిద్ధ రూపముల నిషేధించుటకయ్యే యనువాదము చేయుచున్నది. ఇట్లగుటచే మీసంశయమునకు నవకాశము లేదు. శ్రుతి నిర్వివాదముగఁ బరమేశ్వర స్వరూపమును రూపనిషేధపూర్వకముగ ప్రతిపాదింపవచ్చును. మఱియు నిచ్చట రెండునిషేధములు కలవు. ఈరెండును మూర్తామూర్తరూపముల రెంటిని క్రమముగ నిషేధించును. ఒక్కటి యీరెండురూపములను నిషేధించిన రెండవది వానివలన జనించు సంస్కారములనైనను నిషేధించును. ఇట్లు కాకున్నను చేయఁబడిన యొక్కనిషేధమే దృఢ మగుటకై రెండుమారులు చేయఁబడియు నుండవచ్చును. ఒక్కమారు సామాన్య ముగ నిషేధించిన "ఇది బ్రహ్మము కాకుండిన నీక నేది బ్రహ్మము" యను సంశయము జనించును. దానిని నివారించుటకై యిట్లు రెండుమారులు ప్రయోగింపఁబడియుండవచ్చును. అట్లుచేసిన "లోకమున నేయేపదార్థము గానవచ్చుచున్నదో అది యంతయు బ్రహ్మము కాదు" అని తేలుటచే సంశయమేమియు నుండదు. ప్రతివాఁడును నామరూపాత్మక మగు ప్రపంచ

* వాచారంభణ మనఁగా వాక్కుచేఁ జెప్పఁబడుటకు మాత్రమే వీలైనస్థితి. నామమాత్ర మనుట.

మును విడిచి తదాధార మగుబ్రహ్మమును గ్రహించును. ఈకారణమువలన "ఈరెండునిషేధములలో నొక్కటి రూపాదులను నిషేధించును. మఱి యొక్కటి బ్రహ్మమును నిషేధించును" అని చేసిన పూర్వపక్షము యుక్తి యుక్తము కాదు.

మఱియు వేద మీవిషయమునే ప్రత్యక్షముగఁ గూడ బోధించు నది. "అథాత ఆదేశో నేతి న హ్యేతస్మా దితి నే నేతి త్యన్య త్పర మస్తి" "ఇట్లు రూపములను ప్రకటించినపిదప నేమియు లే దని మాత్రమే యుప దేశింపవలసియున్నది. ఇది కాదు ఇది కాదు. అని మాత్రమే తెలుప వలసి యున్నది. ఈపరమేశ్వరునికంటె నితరమైనది లేదు కావున నిట్లు చెప్ప వలసి వచ్చినది. ఆపరమేశ్వరుఁ డొక్కఁడు మాత్రమే ప్రపంచాతీతుఁడై యున్నాఁడు." అనువాక్య మీవిషయమును స్పష్టము చేయుచున్నది. ఇంత మాత్రమేకాక తదనంతరవాక్యమునందును "సత్యస్య సత్యం" ఆబ్రహ్మము సత్యమునకు సత్యము (అనఁగా స్థూలశరీరమునకంటె చిరకాల ముండు నది యగుటచే సూక్ష్మశరీరము సత్యము; శాశ్వత మగుటచే బ్రహ్మ మంత కంటెను సత్యము)" అని చెప్పఁబడియున్నది. పైనిషేధవాక్యము బ్రహ్మ మునుకూడ నిషేధించి యుండునేని ఈవాక్య మెవ్వనిఁగూర్చి చెప్పును? ఈకారణమువలన నిర్వివాదముగ నీనిషేధవాక్యము రూపములను మాత్రమే నిషేధించునుగాని యుభయమును (బ్రహ్మరూపములను రెంటిని) గాని కేవలబ్రహ్మమును గాని నిషేధింపదు.

శ్రుతి రూపములను వానితోఁ గూడినపరమేశ్వరునిఁ గూడ నిషే ధించునేని యప్పుడు నిరాటంకముగా శూన్యవాదము వచ్చును. అప్పుడు ఏదియు నుండదు కదా! ఏదియైన నొకదానిఁ బ్రధానముగఁ గైకొనినఁ గాని తక్కినదానిని నిషేధించుటకు వీలు లేదు. రజ్జుసర్పభ్రాంతి గలవానినిఁ గూర్చి ప్రవర్తించునర్పనిషేధవాక్యము రజ్జువు నాధారముగఁ గైకొని మాత్రమే ప్రవర్తింపుచున్నది కదా! మఱియు సర్వమును నిషేధించు టయే శ్రుతికి నభిప్రాయ మగునేని యప్పుడు ఆనిషేధమున కే యర్థ ముండదు. అన్నియు నిషేధార్హము లగునవియే యైన నేదియు మిగుల్ప బడకున్న సర్వము నసత్యమే కావలసి వచ్చును. ఇది సర్వవాదు లకును సమ్మతము కాదు. ఇక నిందు దేనినైన నొకదానిని సత్యముగ గ్రహింత మనిన నది వేదమునఁ గాన రా లేదు. కావున సర్వంబును

సత్యమే యని తీరవలయును. ఇట్లయిన నిషేధమే మొట్టమొదట సంభవింపదు. ఈకారణమువలన "శ్రుతి సర్వమును నిషేధించును" అనుట యుక్తి శూన్యము.

"రూపములు విశేషము లగుటచేతను పరమేశ్వరుఁడు సామాన్యమగుటచేతను విశేషనిషేధముచే నయత్నముగనే సామాన్యనిషేధము వచ్చు నని చెప్పితిమి కదా" అనియెదవేమొ అది యుక్తము కాదు. ఇచ్చట సామాన్య విశేషభావము లేదు. ఆచెప్పఁబడినవి పరమేశ్వరుని రూపములు గాని పరమేశ్వరభేదములు కావు. ఒక్క పరమేశ్వరునియందే అజ్ఞానులచే మూర్తామూర్తము లగుభూతములు ఆరోపింపఁబడియున్నవి కాని ఆపరమేశ్వరుఁడే ద్వివిధముగ లేఁడు. పృథివీజలతేజోభూతములు గానవచ్చుచుండుటచే కఠినములై స్పృశించుటకు ననువై యుండుటచే మూర్తము లనియు ఆకాశవాయువు లట్లు లేకుండుటచే నమూర్తము లనియు జెప్పఁబడును. పరమేశ్వరుఁడు సర్వోపాధులయందు నుండు వాఁడు గావున " ఇది యుపాధి ఇది యుపాధిరహితబ్రహ్మరూపము" అని తెలిసికొనలేక జనులు ఆయాభూతములనే పరమేశ్వరుఁడుగ భ్రాంతి నొందుచున్నారు. ఇవియే మూర్తామూర్తరూపములు పరమేశ్వరునకుఁ గలిగినవిధము. ఇట్లగుటచే వీనిని శ్రుతి యనువాదము మాత్రమే చేయును గాని విధింపదు. వీనినిషేధమువలనఁ బరమేశ్వరునకు నిషేధంబును సంభవింపదు. ఉపాధుల నిషేధించిన నందలిపదార్థములకు నిషేధ మెట్లు కలుగును? ఘటాద్యుపాధులు భగ్నములైన నందలియాకాశప్రతిబింబాదులు కూడ భగ్నము లగుచున్నవా? ఈకారణమువలన నుపాధులకును వానిచే నావరింపంబడినవానికిని సామాన్యవిశేషభావ ముండకపోవుటచే నుపాధినిషేధమువలన నుపహితనిషేధము (ఉపాధిచే నావరింపంబడినవానినిషేధము) కలుగదు. జాతి యనునది సామాన్యము; అందలివ్యక్తులు విశేషములు కదా! ఇచ్చట పరమేశ్వరుఁడు జాతి కాదు; ఆయన కుపాధు లగుపంచభూతములు వ్యక్తులును కావు. ఏజాతియందైనను వ్యక్తులకును జాతికిని పరస్పరవైధర్మ్యము (సమానధర్మము లేకపోవుట) ఉండ దనుట లోకానుభవసిద్ధము కదా! ఇచ్చట చూడుఁడు. పరమేశ్వరుఁడు చేతనుఁడు; పృథివ్యాదు లచేతనములు. ఇట్లుండ వీనికి సామాన్యవిశేషభావ మెట్లు

వచ్చును? ఈకారణమువలన పృథివ్యాదులు నిషేధింపఁబడినను పరమేశ్వరుఁడు నిషేధింపఁబడ నక్కఱ లేదు.

ఇక కేవల బ్రహ్మమే నిషేధింపఁబడు ననుట బొత్తుగనే సంభవింపదు. ఏదియైనను నిషేధింపఁబడవలయు ననిన మొట్టమొదట నేదియో యొక ప్రమాణముచే స్థాపింపఁబడి యుండవలయును. ఈప్రపంచ మవిద్యాకల్పిత మగుటచే స్వభావసిద్ధమయ్యే యున్నది; భ్రాంతి యనాది యగుటచే ననాదియే యై యున్నది. ప్రతివానికిని అనుభవములో నున్నది. దీనిని శ్రుతినిషేధించు ననుటలో నాక్షేప ముండదు. పరమేశ్వరుఁ డన్ననో యితర ప్రమాణములచే స్థాపింపఁబడువాఁడు కాఁడు. వేదముచేత మాత్రమె వర్ణింపఁబడువాఁడు. ఇక నాయనను నిషేధింపవలయు ననిన నాయనను ప్రతిపాదించిన వేదములే నిషేధింపవలయును. ఇది విరుద్ధము కదా! "ఈపరమేశ్వరవిషయమున విధినిషేధములు రెండు నుండ వచ్చును" అనియెదవేమొ యది సంభవింపదు. కర్మయందు వికల్పము కలుగవచ్చును కాని పదార్థమునందు వికల్పము కలుగదు. అందును ఈ బ్రహ్మము నిత్యసిద్ధుఁడు కదా! మఱియు నీయన యవాఙ్మానసగోచరుఁడు. ఇట్టివాఁడు మొట్టమొదట మనస్సునకే గోచరుఁడు కాఁడనిన నాయనను నిషేధించుట యెట్లు? కావున నవిద్యాసిద్ధ మగు ప్రపంచమునే యను వాదము చేసి శ్రుతి నిషేధించుచున్నది యని తీరవలయును.

మఱియు నీప్రకరణమునందు "బ్రహ్మ తే బ్రవాణి" "పరమేశ్వరుని నీకు తెల్పెదను" అని యుపక్రమము కలదు. దానికిఁ గూడ బ్రహ్మ నిషేధకథనము విరుద్ధ మగును. "అస న్నేవ స భవతి" అను మొదలగు నిందావాక్యములకుఁ గూడ విరుద్ధ మగును. ఇంత యేల? సమన్వయాధ్యాయమునందు సర్వవేదాంతవాక్యములును బ్రహ్మపరములే యని సిద్ధాంతము చేయఁబడెను; దానికంతకును (అనఁగా వేదాంతవాక్యములకు నన్నిటికిని) విరోధము వచ్చును. "ఇది యేల? వేదాంతవాక్యముల యందుఁ బరమేశ్వరుఁడు అవాఙ్మానసగోచరుఁడుగాఁ బ్రతిపాదింపఁబడెను కదా! ఇట్టివానిని నిషేధించినమాత్రమేమి? ఈయన యున్నను లేనట్టివాఁడే కదా!" అనియెదవేమో అదియు క్తము కాదు. వేదము మహాప్రయత్నముతో పరమేశ్వరుని ప్రతిపాదించుచున్నది; అది నిషేధార్థమయ్యే ఇంతశ్రమ పడుచున్నది యనుట యుక్తియుక్తము కాదు. దానికి

నీశ్రమవలనఁ బ్రయోజనములేదు కదా! అట్లు నిషేధించుటకును వీలు లేదని యిదివఱకే నిరూపించి యున్నాము. ఈకారణమువలన "పరమేశ్వరుఁడు అవాఙ్మానసగోచరుఁడు" అనుట "పరమేశ్వరుఁడు శూన్యరూపుఁడు" అను నభిప్రాయముతోఁ గాదు; అది యుపదేశించు విధమే. గోవులు మొదలగు సామాన్యవిషయములవలె నాపరమేశ్వరుని నిరూపించుటకు ప్రత్యక్షచిహ్నములు లేవుకదా! కావున నవాఙ్మానసగోచరుఁ డనఁగా సామాన్యపదార్థములవలె వాఙ్మనస్సులకు గోచరుఁడు కాఁడని యర్థమే కాన సంపూర్ణముగ నెవ్వనికిని ఎట్లును తెలియరా దని యర్థము కాదు. "విషయములలోఁ జేరక సాక్షీభూతమై నిర్వికారమై నిత్యశుద్ధబుద్ధస్వరూపమై యుండుపదార్థమే పరబ్రహ్మము; గుణములు లేని దగుటచే వాక్కుచే వచించుటకు గాని మనస్సుతో నూహించుటకుఁ గాని శక్యము కానిపదార్థమే బ్రహ్మము." అని మాత్రమే శ్రుతికి తాత్పర్యమును నిర్ణయింపవలసి యున్నది. కావున నెట్లును వేదము పరమేశ్వరుని నిషేధించుట లేదు; ఉపాధిభూతము లగుపృథివ్యాదులనుమాత్రమే నిషేధించుచున్నది.

## అ-3. పా-౨. సూ-౨3.

అవతారిక:—"ఇట్లయిన నాపరమేశ్వరుఁ డేల గానరాఁడు?" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## 3౪౨. తదవ్యక్తమాహహి. 3. ౨. ౨3.

తాత్పర్యము:—ఆపరమేశ్వరుఁడు ఇంద్రియములకు గోచరుఁడగువాఁడు కాఁడు. శబ్దస్పర్శాదులుగాని అనుమానహేతువు లగులింగాదులు కాని యాయనకు లేవని యిదివఱకే నిరూపించియున్నాము. కావున నాయన యింద్రియాదిగోచరుఁడు కానేరఁడు. ఈవిషయము శ్రుతిస్మృతులయందు పలుమారు బోధింపఁబడి యున్నది. "నచక్షుషా గృహ్యతే నాపివాచా" "ఆపరమేశ్వరుఁడు నేత్రముచేతఁగాని వాగింద్రియముచేతఁగాని గ్రహింపఁబడువాఁడు కాఁడు" అను మొదలగు శ్రుతివాక్యములను "అవ్యక్తోయ మచింత్యోయం" "ఈపరమేశ్వరుఁడు ఇంద్రియములకు గోచరుఁ డగువాఁడు కాఁడు; మనస్సుచే ధ్యానింపఁబడుటకు శక్యమైనవాఁడు కాఁడు" అను మొదలగుస్మృతివాక్యములును ఈవిషయము బోధించుచున్నవి.

## అ_౩. పా_౨. సూ_౨౪.

అవతారిక:—"ఇట్లయిన నెవ్వరికిని గోచరము కానిపదార్థము కలదో? లేదో? నిశ్చయ మెట్లు?" అనిన సమాధానముచెప్పుచున్నాఁడు.

# ౩౪౩. అపిచ సంరాధనే ప్రత్యక్షాను మానాభ్యామ్. ౩. ౨. ౨౪.

తాత్పర్యము:—మఱియు యోగులగువారు ధ్యానకాలమునఁ బరమేశ్వరుని యథావర్ణితస్వరూపముతో (అనఁగా సకలప్రపంచాతీతునిఁగాను, ఇంద్రియాదుల కగోచరునిఁగాను) గాంతురు. ఈవిషయము కూడ శ్రుతిస్మృతులయందే ప్రత్యక్షముగాఁ జెప్పఁబడి యున్నది. "పరాంచి ఖాని వ్యతృణ స్స్వయంభూ స్తస్మా పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్, కశ్చి ద్ధీరః ప్రత్యగాత్మా నైచ్ఛ దావృత్తచక్షు రమృతత్వ మిచ్ఛన్" "పరమేశ్వరుఁడు ఇంద్రియములను బాహ్యపదార్థముల జూచువానిఁగా నిర్మించెను. ఒకానొకమహాత్ముఁడు జ్ఞానసంపన్నుఁడై ఇంద్రియముల జనించి మోక్షేచ్ఛచే బ్రయత్నించుచు ధ్యానించునేని పరమేశ్వరునిఁ జూచును" అనుమొదలగు శ్రుతివాక్యములును "యం వినిద్రాజితశ్వాసాః సంతుష్టాః సంయతేంద్రియాః, జ్యోతిః పశ్యంతి యుంజానా స్తస్మై యోగాత్మనే నమః" "మనస్సును జయించి వాయువును నిరోధించి సంతోషము గలవారై యింద్రియముల నిరోధించి యుండు యోగులు ఏ పరంజ్యోతిస్వరూపమును గాంతురో ఆయోగాత్మకు నమస్కారము" అను మొదలగు స్మృతివాక్యములును ఈవిషయమును నిరూపించుచున్నవి. ఈకారణమువలన సామాన్యులకుఁ గానరాకున్నను ఆపరమేశ్వరస్వరూపము అభావరూపము కానేరదు.

## అ_౩. పా_౨. సూ_౨౫.

అవతారిక:—"ఇట్లయిన మఱియొకవిరోధము వచ్చును. జీవుఁడు ధ్యానము నాచరించువాఁడు; పరమేశ్వరుఁడు ధ్యానింపఁబడువాఁడు. ఇట్లగుటచే వీరికిఁ గల దని చెప్పఁబడినయభేదము లేకపోవలసి వచ్చును" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ३४४. ప్రకాశాదివచ్చావైశేష్యం ప్రకాశశ్చ కర్మణ్యభ్యాసాత్. 3. 2. 25.

తాత్పర్యము:—ఈయభేదవిషయమునుగూర్చి యిదివఱకే పలుమాఱు చర్చింపఁబడి యున్నది. వేదమునందును "తత్త్వమసి" యని పలుమాఱు బహుదృష్టాంతముల నొసంగి నిర్ణయింపఁబడియున్నది. కాంతి యాకాశము సూర్యబింబము మొదలగునవి యెప్పటికి నేకరూపములయ్యే యున్ననుఁ ఉపాధివశమున నానాభేదములతోఁ గానవచ్చునట్లు పరమేశ్వరుఁడును ధ్యాతా ధ్యేయము(ధ్యానించువాఁడు ధ్యానింపఁబడునది) మొదలగు భేదములతోఁ గానవచ్చుచున్నాఁడు. వ్రేళ్లు మొదలగునవి వంకరగా బెట్టుట మొదలగు కారణములతో కాంతి భిన్నముగఁగానవచ్చునట్లు ఆకాశము ఘటాద్యుపాధులయందుఁ బ్రవేశించి ఘటాకాశాదిభేదములతో నున్నట్లు సూర్యుఁడు జలఘటములయందు ప్రతిబింబించి నానారూపముతో గానవచ్చునట్లు, పరమేశ్వరుఁడును అవిద్యోపాధిచే జీవేశ్వరభేదములతో గానవచ్చుచున్నాఁడు. కావున నిందు విరోధమేమియు లేదు. కల్పితభేదముతో జీవుఁడు ధ్యాతయు నీశ్వరుఁడు ధ్యేయుఁడును కావచ్చును. పారమార్థికస్థితిలో నేకరూపుఁడు కూడఁ గావచ్చును.

## ३४५. అతోఽనన్తేన తథా హి లింగమ్. 3. 2. 26.

తాత్పర్యము:—ఈవిధముగ నభేదము స్వాభావికంబును భేదము అవిద్యాకల్పితంబు నగుటచేఁ దత్త్వజ్ఞానమువలన నామవిద్య నశింపఁగానే స్వతస్సిద్ధ మగునైక్యమును జెందును. ఇదియే ముక్తి. "స యో హ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" "ఎవ్వఁడు పరబ్రహ్మమును తెలిసికొనునో వాఁడు బ్రహ్మమే యగును" అని శ్రుతి యీవిషయమును ప్రకటించుచున్నది. "బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" "స్వాభావికముగఁ బరమేశ్వరుఁడే యై యుండియు నింతకాలమువఱకు నజ్ఞానవశమున భిన్నునివలె తనను భావించుచుండుటచే జీవుఁడు జ్ఞానోదయము కాఁగానే పరమేశ్వరునితో నైక్యము నొందినట్లుభావించును. ఇప్పుడు కలిగినది యజ్ఞాన

నాశమే కాని పరమేశ్వరైక్యము కాదు." అని జీవుని స్వాభావికస్థితిని గూర్చియు మఱియొకశ్రుతి చెప్పుచున్నది. కావున నెట్లును పరమేశ్వరుఁడు నిర్గుణుఁడే జీవుఁడు తదభిన్నుఁడే. ఉపాధికల్పితభేదమువలన సర్వవ్యవహారములును జరుగుచున్నవి.

## అ-౩. పా-౨. సూ-౨౭.

అవతారిక:—ఈయభేదమును నిర్ణయించుటకై యీక్రింది రెండు సూత్రములచేఁ బరమతముల నుపన్యసించి ఖండించుచున్నాఁడు.

## ౩౪౬. ఉభయవ్యపదేశాత్త్వహికుండలవత్.

### ౩. ౨. ౨౭.

తాత్పర్యము:—మఱికొంద రీవిషయమున మఱియొకవిధముగా నభిప్రాయపడుచున్నారు. శ్రుతియందు భేదాభేదములు రెండును చెప్పఁబడి యున్నవి యనియు వేదోక్తమగువిషయములలో నొక్కదానిని మాత్రమే గ్రహించి రెండవదానిని విడుచుట యుక్తము కాదనియు నభిప్రాయపడుచున్నారు. భేదాభేదశ్రుతులకు ప్రత్యేకముగ విషయములఁ గల్పించి వానివిరోధమును బాపఁదలంచుచున్నారు. "ఒకసర్పము వాస్తవస్థితిలో నొక్కటియే యైనను 'ఇది పడగ. ఇది చుట్ట. ఇది దేహము.' అను మొదలగు భేదవ్యవహారము లవయవముల నాశ్రయించి యెట్లు ప్రవర్తించుచున్నవో అట్లే బ్రహ్మవిషయమై భేదాభేదవ్యవహారము లుండవచ్చును. స్వస్వరూపమును బట్టి యభేదవ్యవహారంబును అవయవభూత మగుప్రపంచమును బట్టి భేదవ్యవహారంబును కూడ కలుగవచ్చును." అనుచున్నారు. కేవలాభేదము సంగీకరించుట యుక్తము కాదనుచున్నారు.

## ౩౪౭. ప్రకాశాశ్రయవద్వా తేజస్త్వాత్.

### ౩. ౨. ౨౮.

తాత్పర్యము:—మఱికొందఱు ఈభేదాభేదములనుగూర్చి మఱియొకవిధముగ నభిప్రాయపడుచున్నారు. భేదాభేదముల సమన్వయించుటకు విషయభేదము మాత్రమే యుండవలయు నని నియమము లేదనియు,

పదార్థ మొక్కటియేయైనను దానియందు భేదాభేదవ్యవహార ముండ వచ్చుననియుఁ జెప్పుచున్నారు. సూర్యుఁడు సూర్యప్రకాశముననువానిని దృష్టాంతముగఁ జూపుచున్నారు. "తేజోరూపత్వముచే సూర్యుఁడును ప్రకాశంబు నొక్కటియే యైనను వానియందు భేదవ్యవహార మున్నట్లు పరమేశ్వరజీవులయందును భేదవ్యవహారముండవచ్చును. అభేదము కూడ నుండవచ్చును" అని సిద్ధాంతము చేయుచున్నారు.

## అ-౩. పా-౨. సూ-౨౮.

అవతారిక:—ఈవిధముగ పరమతముల నిరూపించి వానిని నిరాకరించుచున్నాఁడు.

## ౩౪౮. పూర్వవద్వా. ౩. ౨. ౨౮.

తా:—ఈ రెండుమతములును యుక్తము కానేరవు. ౨౫-వ సూత్రమున చేయఁబడిన సిద్ధాంతమే యుక్తియుక్తమైనది. జీవేశ్వరులు ఘటాకాశ మహాకాశములవలె నజ్ఞానోపాధిచే మాత్రమే భిన్నులైయున్నారు. ఇదియే జీవులకుఁగలబంధము. ఇది యజ్ఞానరూపమయ్యెనేని తత్త్వజ్ఞానముచే నశించునుగాని వాస్తవమైన నట్లు నశింపదుకదా! అప్పుడు మోక్షశాస్త్రమే నిరర్థకము కావలసివచ్చును. పైఁజూపిన మతములలో దీని నంగీకరించినను జీవుని సర్పకుండలములవలెఁ బరమేశ్వరుని యవస్థాభేద మనికాని, సూర్య ప్రకాశములవలె పరమేశ్వరునియంశ మని కాని యంగీకరించినను ఆతనికి బంధము పారమార్థికమే యగును. భేదముకూడ శ్రుతికి తాత్పర్యభూతమే యని కదా వారితాత్పర్యము! భేదమే బంధము కావున నది యెట్లు పారమార్థికము కాకపోవును. ఇప్పుడు ముక్తియే దొరకదనుట నిర్వివాదాంశము కదా! ఈకారణమువలన బంధ మజ్ఞానకల్పితమే యనవలయును; అప్పుడు ౨౫-వ సూత్రమునందలి సిద్ధాంతమే స్థిర మగును. మఱియు వేదము భేదాభేదముల రెంటిని ప్రధానములుగఁ జెప్పుట లేదు. దానికి నభేదమునందే తాత్పర్యము కలదు. దానిని నిరూపించుటకై మాత్రమే లోక ప్రసిద్ధమగు భేదము ననువాదము చేయుచున్నది. ఈవిషయము ఇదివఱకే బహువిధముల నిరూపింపఁబడియున్నది. ఈ కారణమువలన భేదాభేదములను రెంటిని ఎట్లయినను సమన్వయింప వలయు నను ప్రయత్న మక్కఱ లేదు. సమన్వయింపఁబూనినను అట్లు చేయుటకు వీలు లేదు. ఎట్లనిన:—

భేదాభేదములు పరస్పరవిరుద్ధము లనుట సర్వజనులకును విశదమే. వేయి యుక్తులను జెప్పినను ఇవి రెండును నొక్కస్థలము నాశ్రయింపనేరవు. ఎంతవాదించినను ఘటము పటము కానేరదు కదా! కావున వీనిని సమన్వయింపఁజూచుటయే ప్రమాదము. "వారు తగినయుక్తులఁ జూపియే యున్నారుకదా! లోకానుభవానుసారముగ సర్వమును చర్చించియే యున్నారు కదా" అనియెదవేమొ వినుము. మొట్టమొదట మతమున సర్పకుండలమువలె జీవపరమేశ్వరులకు భేదాభేదములు కలవని వర్ణింపఁబడెను కదా! ఇది యెట్లు యుక్తమగును? ఈసర్పకుండలములు రెండును ఒకపదార్థమునకంటె (సర్పరూపపదార్థమునకంటె) భిన్నములా? కావా? భిన్నములైనచో నవియే (ఆసర్పకుండలములే) భిన్నము లగును గాని దానివలన పదార్థమునకు భేదము రానేరదు. ఒకదానికిఁ గలభేదాభేదమువలన మఱియొకదానికి భేదాభేదములు కలుగుననుట విరుద్ధముకదా! విచారించిన నాభేదపక్షమున ("సర్పకుండలములు పదార్థమునకంటె భిన్నములు" అనుపక్షమున)"సర్పకుండలములు రెండును ఏదియో యొకసంబంధముచే నొకపదార్థము నాశ్రయించియున్నవి. (సర్పత్వకుండలత్వములు రెండును ఒకపదార్థము నాశ్రయించి యున్నవి)" అని మాత్రమే కదా చెప్పవలయును? ఇట్లు చెప్పిన వస్తుభూతమగుసర్పమునకు భేద మెట్లు కలుగును? ఇఁక నీభేదపక్షము(సర్పకుండలములు వస్తువునకంటె భిన్నములు కావనుపక్షము) నాశ్రయించిన విషయభేదమే కలుగు ననుటకు బొత్తుగనే వీలులేదు కదా!

ఇఁక రెండవవానిపక్షము నాశ్రయించి "విషయభేదము లేకున్నను సూర్యప్రకాశములకువలె నొకపదార్థమునందే భేదముకలుగవచ్చును.సర్వకాలమునందు నట్లే (భిన్నములుగనే) వ్యవహరింపఁబడుచున్నవి కావున నా సూర్యప్రకాశాదిపదార్థములవిషయములో భేదాభేదవ్యవహారము కలదనుటకు సంశయములేదు" అనిచెప్పినను ఈసిద్ధాంతము నిలువదు. స్వరూపస్వభావాదులయందు నిరుద్ధములైయున్నపదార్థములకే భేదము లేకపోవునేని యిఁక భేద మెచ్చట నుండఁగలదు? సూర్యునకును ప్రకాశమునకును ప్రత్యేకవ్యవహార ముండుటయె వానికిఁ గలవిరుద్ధధర్మములకు నిదర్శనము. ఇట్లుండ నిచ్చటనే భేదము లేకున్న నిఁక నెచ్చట నుండును?

భేదాభేదములకు విరోధ మనుటను మొట్టమొదటనే నిరూపించి యున్నాము. రెండును సమానముగ సర్వకాలములయందు ననుభవింపఁబడినంతమాత్రమున నేపదార్థములుగాని యభిన్నములు కానేరవు. జీవుఁడు దేహమునకంటె భిన్నుఁ డనుట సర్వవాదిసమ్మతము కదా! ఇది యిట్లు చెప్పిన విరుద్ధము కావలసి వచ్చును. జీవదేహములు రెండు ననాది నుండి సమానముగనే (కలసియే) యనుభవింపఁబడుచున్నవి కదా! కావున నెట్లు చూచినను భేదాభేదముల సమన్వయించుటకు వీలు లేదు. భేదమునే పరమార్థముగఁ గైకొనిన నభేదశ్రుతులు నిరర్థకములు కావలసి వచ్చును. కావున నట్లు చేయుటకును వీలు లేదు. అభేదమునే పరమార్థముగ నంగీకరించిన భేద మనువాదరూపము కావచ్చును. కావున సర్వవేదంబును సార్థక మగుటకు వీ లుండుటచే నట్లే యాచరింపవలయును. అవిద్యయే ఘటాకాశమహాకాశములకువలె జీవేశ్వరులకు భేదమును కల్పించినది యని మాత్రమే చెప్పవలయును. ౨౫-వ సూత్రమునందలి విషయమునే సిద్ధాంతము చేయవలయును. "త మేవ విదిత్వాతిమృత్యుమేతి నాన్యః పంథా విద్యతే உయనాయ" "ఆపర మేశ్వరస్వరూపము నెఱుంగుటచేతనే ముక్తికలుగును. కాని మఱియొకవిధముగఁ గలుగదు." అను మొదలగు వేదవాక్యములు జ్ఞానభిన్న మగుమోక్షసాధన మెద్దియు లేదని స్పష్టముగఁ జెప్పుచున్నవి; జ్ఞానముచే వాస్తవపదార్థములు నశింపవు గావున నేదియోయొకభ్రాంతియే బంధహేతు వగుచున్నది. అని నిర్ణయింపవలసి యున్నది. అదియే యవిద్య; దానివలననే బంధము. ఈ కారణమువలన జీవేశ్వరులకు వాస్తవభేదము కలుగదు.

## అ-3. పా-౨. సూ-30.

అవతారిక:—ఈసిద్ధాంతమును స్థాపించుటకై మఱియొకహేతువును జూపుచున్నాఁడు.

## ౩౪౮. ప్రతిషేధాచ్చ. 3. ౨. 30.

తాత్పర్యము:—ఇదియునుఁగాక జీవుఁడు చేతనుఁడు పరమేశ్వరుఁడు నట్టివాఁడే వీరికి భేదము వాస్తవమేయై యుండునేని శ్రుతి యిరువురిచేతనుల నంగీకరింపవలసి యుండును. ఇట్లు లేదు. "నా న్యోஉతో

ఽస్తి ద్రష్టా నాన్యోఽతోఽస్తి శ్రోతా" "ఈజీవునికంటె భిన్నుఁడగు ద్రష్టలేఁడు. శ్రోత లేఁడు." అని వేద మొక్కచేతనునిమాత్రమే యంగీకరించియున్నది. "నేతి నేతి" అని సర్వప్రపంచమును నిషేధించి యొక్కచేతనుని మాత్రమే గ్రహించి యున్నది. ఇంతమాత్రమే కాదు. "త దేత ద్బ్రహ్మా పూర్వ మనపర మనంతర మబాహ్యం" "ఈపరమేశ్వరునకు పూర్వభాగముగాని పరభాగముగాని లోపలగాని వెలుపలగాని లేదు." అను మొదలగువాక్యములచే "సర్వప్రపంచంబును బ్రహ్మాభిన్నమే యని చెప్పుచున్నది. ఇట్లుండ జీవేశ్వరభేద మెట్లు కలుగును? దాని ననుసరించి భేదాభేదముల సమన్వయింపఁ జూచుట యెట్లు సరిపడును. ఈకారణమువలన జీవ బ్రహ్మాభేదము కల్పిత మనుటకును,అవిద్యానాశముచే జీవుఁడు పరమేశ్వరుఁ డగు ననుటకును శ్రుతివాక్యములు పరమేశ్వరు నిషేధింప వనుటకును సంశయ మింత యైనను లేదు.

---

# ౭. పరాధికరణము

విషయము, సంగతి, సందేహము:—పై యధికరణమున "నేతి నేతి" యను వాక్యముయొక్క యర్థమును నిర్ణయించుటచేఁ బరమేశ్వరభిన్న మగుపదార్థము లే దని నిర్ణయింపఁబడెను. అదియే సిద్ధాంత మనుటకు వీలు లే దనియు కొన్నిశ్రుతులయందు పరమేశ్వరభిన్న మగుపదార్థము కల దని తెలియవచ్చుచున్నది యనియు దాని నాశ్రయించి పదార్థాంతరము నవశ్య మంగీకరింపవలయును అనియు నాక్షేపము వచ్చును. దానిని నివారించుచు పరమేశ్వరభిన్న మగుపదార్థము లే దని సిద్ధాంతము చేయఁబడును.

## అ_౩. పా_౨. సూ_౩౧.

అవతారిక:—ఈసిద్ధాంతమునకై మొట్టమొదటఁ బూర్వపక్షము ననువాదము చేయుచున్నాఁడు.

## ౩౫౦. పర మతః సేతూన్మానసంబంధ భేద వ్యపదేశేభ్యః. ౩. ౨. ౩౧.

తాత్పర్యము:—విచారించిచూచినచోఁ బరమేశ్వరభిన్న మగు పదార్థ మేదియో యొకటి యున్నట్లు తోఁచుచున్నది. వేదమునందు ఆ పరమేశ్వరుఁడు సేతువుగా వర్ణింపఁబడియున్నాఁడు. ఆయనకు పరిమాణ మును జీవాదిపదార్థములనుండి భేదమును సంబంధమును వర్ణింపఁబడి యున్నది. "అథ య ఆత్మా స సేతు ర్విధృతిః" "ఆత్మ యెవ్వఁడు కలఁడో వాఁడే సేతువు. సర్వమర్యాదల ధరించువాఁడు." అని వేదమునఁ గలదు. దీనిని పట్టి చూచిన నాయన సామాన్యసేతువువంటివాఁడే కావలసి వచ్చును. సేతు వనఁగా జలమును దాఁటుటకై నిర్మింపఁబడువం తెనకదా! లోకమున దానికంటె భిన్నము లగుపదార్థము లనేకము లుండవలయును. రెండుపార్శ్వములయందును తీరములు మొదలగునవి యుండవలయును. పరమేశ్వరుఁడు కూడ సేతువువంటివాఁ డైనచో నిట్లే నాయనకంటెను భిన్నము లగుపదార్థము లుండవలయును కదా! మఱియు "సేతుం తీర్త్వా" "ఆ బ్రహ్మరూప మగుసేతువును దాఁటి" అని మఱియొకస్థలమున స్పష్టముగఁ జెప్పఁబడి యున్నది. దీని నాశ్రయించి చూచిన పైవిషయ మును నిరూపించుటకు సంశయము లేదు. లోకమున వంతెనను దాఁటిన వాఁడు ఆవలిస్థలమును జేరునట్లు పరబ్రహ్మ మనువంతెనను దాఁటినవాఁడు కూడ మఱియొకస్థలమును జేరవలయు ననుట నిర్వివాదాంశము కదా!

ఇదియునుఁ గాక "త దేత ద్బ్రహ్మ చతుష్పా దష్టా శఫం షోడశకలం" "*ఈపరమేశ్వరుఁడు నాల్గుపాదములు † ఎనిమిదిగట్టెలు

---

* ఛాందోగ్యోపనిషత్తునందు షోడశకలావిద్యయందు పరమేశ్వరునకు నాల్గు పాదములు కలవని చెప్పఁబడియున్నది. ప్రకాశవంత మనియు అనంతవంత మనియు జ్యోతిష్మంత మనియు ఆయతనవంత మనియు వానికి గ్రమముగఁ బేర్లు. ఇందు కాంతి గలదానినిఁగా మొదటిపాదమును ఆద్యంతములు లేనిదానినిఁగా రెండవపాదమును తేజోరూప మైనదానినిఁగా మూఁడవపాదమును మనోరూపముగ నాల్గవపాదమును ధ్యానింపవలయును. అట్లు ధ్యానించిన కీర్తియు మితిలేనిసంపదయు తేజస్సును సుఖ నివాసంబును కలుగును. ఈ కారణములవలననే వానికి నాపేర్లుగూడఁ గలిగినవి.

† ఎనిమిది కట్టె లనఁగా పైపాదముల మొక్క యర్ధాంశములే. అవి భావనచే మాత్రమే కల్పింపఁబడినవి యని తెలుసుకొనవలయును.

*పదియాఱుభాగములు కలవాఁడు" అని పరిమాణము చెప్పఁబడియుండు టచే తద్భిన్న మగుపదార్థ మేదియో యొక్కటి యుండవలయు నని తోఁచుచున్నది. లోకమున నొకవస్తువునకు పరిమాణము నెఱింగించిన నంతకంటె నధికపరిమాణము గలిగినట్టి గాని యల్పపరిమాణము గల్గినట్టి గాని పదార్థము మఱియొకటి యుండు ననుట సుప్రసిద్ధము కదా! ఇది యర్థరూప్యము అనిన దానికంటె నధికపరిమాణము గలరూప్యంబును నల్పపరిమాణము గల కలాదులును (కల యనఁగా అణా) గలవు కదా! కావున నీకారణమువలనఁగూడ బ్రహ్మభిన్న మగుపదార్థ మొక్కటి యుండియే తీరవలయును.

మఱియు "సతా సోమ్య తదా సంపన్నో భవతి" అను మొదలగు వాక్యములయందు జీవబ్రహ్మములకు సంబంధము కల దని చెప్పఁబడి యున్నది. లోకమున మిత మగుపరిమాణము గలవానికి నట్టివానితోనే (మితము లగువానితోనే) సంబంధమున్నట్లు స్పష్టమగుచున్నది. మనుష్యు లకు పట్టణము మొదలగువానితో సంబంధము కలదు గాని అమితము లగునాకాశాదులతో సంబంధము లేదుకదా! ఇట్లే జీవునకును పరమేశ్వరు నితో సంబంధ ముండిన నాయనయు మిత మగువాఁడే కావలయును. జీవుఁ డట్టివాఁడనుట సుప్రసిద్ధము కదా! ఈకారణమువలన పరమేశ్వరు నకు నేదియో యొక ప్రమాణ మున్నది యనవలయును. అట్లనిన నంతకంటె భిన్నమగుపదార్థ ముండవలయు నని యిదివఱకే నిరూపించియున్నాము. అన్నియు మితము లగుపదార్థములే యని చెప్పుటయు యుక్తియుక్తము కాదు. సర్వప్రపంచమునకు నాధార మగుపదార్థ మొక్కటి యుండ

---

* మఱియు నీనాలుగుపాదములకును క్రమముగ నొక్కొక్కదానికి నాల్గేసి యవయవములు కలవు. ప్రకాశవంత మను మొదటిపాదమునకు పూర్వ దక్షిణపశ్చి మోత్తరము లగు నాలుగు దిశలును అవయవములు. అనంతవంత మను రెండవపాద మునకు భూమి యంతరిక్షము ద్యులోకము సముద్రము అనునవి యవయవములు. జ్యోతిష్మంత మనుమూఁడవపాదమునకు చంద్రసూర్యాగ్నులును మెఱుపు నవయవములు. ఆయతనవంత మను నాల్గవపాదమునకు నాసిక నేత్రము శ్రోత్రము వాక్కు అను నాల్గును అవయవములు. ఈవర్ణింపఁబడిన పదియాఱును కల లని చెప్పఁబడును.

కుండిన సరిపడదు. అట్టిపదార్థమును గూడ శ్రుతి యంగీకరించియేయున్నది. కావున నెట్లును బ్రహ్మాభిన్నమగుపదార్థము మఱియొక్కటి కలదు.

ఇంతమాత్రమే కాదు. వేదమునందు (పరమేశ్వరునియందు) భేదము మూఁడువిధములుగ జెప్పఁబడియున్నది. "అథ ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే" (ఛా. ౧. ౧. ౨౦.) అని పరమేశ్వరునకు సూర్యు నాధారముగ జెప్పి, "య ఏషోక్షిణి పురుషో దృశ్యతే" అని నేత్రముకూడ నాధారముగ జెప్పుచున్నది. ఈరెండును ఒక్కనికే నాధారము లనుట యంతగా యుక్తియుక్తముకాదు. ఆధారములు భిన్నములుగ నున్నప్పుడు ఆధేయము కూడ భిన్నములుగనే యుండవలయు ననుట సామాన్యము."తస్యైతస్య త దేవరూపం య దముష్య రూపం' 'ఆసూర్యమండలాంతర్వర్తికి నేరూపము కలదో యీయక్షిపురుషునకుఁ గూడ నదియే రూపము." అని శ్రుతియు ఒకనిరూపమును మఱియొకనియందు ఆరోపించుచున్నది. ఇదియు వా రిరువురకుఁ గలభేదమునే నిరూపించును గదా! ఇంతమాత్రమేగాక "యే చాముష్మా త్పరాఞ్చో లోకా స్తేషాం చేష్టే దేవకామానాం చ. యే చైతస్మా దర్వాఞ్చో లోకా స్తేషాం చేష్టే మనుష్యకామానాం చ" "ఆసూర్యమండలాంతర్వర్తి యూర్ధ్వలోకములకును దేవభోగ్యము లగుపదార్థములకు నధికారి; అక్షిపురుషుఁడు అధోలోకమునకును మనుష్యభోగ్యము లగుపదార్థములకును అధికారి" యని వా రిరువురకు నధికారభేదము కూడ జెప్పఁబడియున్నది. ఇట్లు స్థానభేదము రూపాదుల నారోపించుట యధికారభేదము అను నీమూఁడును పదార్థభేదమును తెల్పుచున్నవి. ఈకారణమువలన పరమేశ్వరభిన్నమగు వస్తు వొక్కటి కల దని యవశ్య మంగీకరించి తీరవలయును.

## అ_3. పా_౨. సూ_3౨.

అవతారిక:— ఈవిధముగ వచ్చిన పూర్వపక్షమును ఖండించి సిద్ధాంతము చేయుచున్నాఁడు.

## 3౫౧. సామాన్యాత్తు. 3. ౨. 3౨.

తాత్పర్యము:— ఈపూర్వపక్షము సరియైనది కాదు. పరమేశ్వరుని కంటె భిన్న మగువస్తువు కల దనుటకు ప్రమాణ మేదియు లేదు.

ఏయేపదార్థము జనించునో అదియంతయు పరమేశ్వరునుండియే జనించు ననుటయు కార్యకారణములకు భేదము లేదనుటయు బహుయుక్తులచే నిదివఱకే నిరూపింపఁబడి యున్నది కదా! ఇక పుట్టుక లేనిపదార్థమే యొక్కటి పరమేశ్వరునికంటె భిన్నమై యున్నది యనుటయు యుక్తము కాదు. "స దేవ సో మ్యేద మగ్ర ఆసీత్" అని శ్రుతియందు సృష్టికిఁ బూర్వమున పరమేశ్వరుఁ డొక్కఁడు మాత్రమే యున్నట్లు బోధింపఁ బడి యున్నది. ఒక్క కారణముగ (జగత్కారణ మగు బ్రహ్మము) నెఱింగినచో సర్వము నెఱుంగవచ్చు నని ప్రతిజ్ఞయుఁ జేయఁబడియున్నది. తద్భిన్న మగుస్వతంత్రపదార్థ మొక్కటి యుండునేని యీ ప్రతిజ్ఞకు హాని వచ్చును కదా! ఎన్నిపదార్థములు సృజింపఁబడినను అవియన్నియు కారణమునకంటె నభిన్నములే యగుటచేఁ బై ప్రతిజ్ఞకు హాని కలుగదు. కావున నెట్లు చూచినను పరమేశ్వరుఁ డొక్కఁడు మాత్రమే కలఁడు ; తద్భిన్న మగుపదార్థము లేదు.

"సేత్వాదిరూపములను జెప్పుటవలన నట్టిభేదము సూచింపఁబడు చున్నది యని చెప్పితిమి కదా!" అనియెదవేమొ వినుము. అన్నింటికంటె మొట్టమొదటఁ బరిగణింపఁబడినసేతుశ్రుతిచేత నీవిషయము సిద్ధాంతము చేయఁబడుటకు వీలులేదు. అది "పరమేశ్వరుఁడు సేతువువంటివాఁడు" అనిమాత్రమే చెప్పెను గాని "పరమేశ్వరునికంటె భిన్న మగుపదార్థము కలదు" అని చెప్పలేదు కదా! ఇట్టివిషయము నెట్లు కల్పింతురు. ప్రసిద్ధము గాని క్రొత్తవిషయమును కల్పించుట సాహసము కదా! మఱియు సేతుదృష్టాంతము చెప్పఁబడియుండుటచే "లౌకికసేతువునకువలె నీబ్రహ్మసేతువునకును బాహ్యపదార్థ మొక్కటియుండవలయును" అని స్థాపింపఁ జూచిన "లౌకికసేతువువలెనే యీబ్రహ్మసేతువు కూడ మట్టితోఁగాని కొయ్యతోఁగాని నిర్మింపఁబడియుండును" అనియు స్థాపింపఁజూచువార లగుదురు. ఇది సర్వశ్రుతిస్మృతివిరుద్ధము కదా! వాస్తవస్థితిలో నుపమానోపమేయములకు సర్వవిషయములయందును పోలిక యుండవలసిన పని లేదని పలుమారు నిరూపించి యున్నాము. ప్రస్తుతవిషయమునందును సాధారణధర్మము (ఉపమానోపమేయములయందు పోలికగా నుద్దేశింపఁబడిన ధర్మము) లేకపోలేదు. లౌకికసేతువు జలాదుల నెట్లు మితి మీరకుండ ధరించునో అట్లే యీపరమేశ్వరుఁడును పృథివ్యాదిభూత

ములను సర్వప్రపంచమును మితిమీరకుండ కాపాడుచుండును. దార
ములు తనకార్యమగువస్త్రమును తనస్వాధీనములో (అనఁగా తా మెంత
పరిమాణము కలవియై యున్నవో అంతపరిమాణము కలదానినిఁగా తమ
కేవర్ణము కలదో ఆవర్ణము కలదానినిఁగాఁ జేయుచు) నుంచుకొనునట్లు పర
మేశ్వరుఁడును ఈ ప్రపంచమును తనస్వాధీనములో నుంచుకొని
యున్నాఁడు. ఆయన యట్లు చేయకుండిన నీసముద్రము తరంగ పంక్తితో
భూమిని ముంచివైచి యుండును. బడబాగ్ని యు సర్వప్రపంచంబును భస్మీ
కరించియుండును. "భీషాస్మా ద్వాతః పవతే" "ఈపరమేశ్వరుని భయము
వలనఁగాలి కాలానుసారముగ వీచుచున్నది." అను మొదలగు శ్రుతి
వాక్యము లీవిషయమునే స్పష్టము చేయుచున్నవి. ఇట్లగుటచే సేతు
శ్రుతికి నింతమాత్రమే తాత్పర్యము. మనము దేనిని దేనితో నేయంశ
మున బోల్చెదమో ఆయొక్కయంశము మాత్రమే వానియందు సమాన
ముగ నుండవలయును. ప్రస్తుతశ్రుతివాక్యమునందును అది కలదు కదా
కావున మాసిద్ధాంతమున విరోధ మేదియు లేదు. "సేతువును తరించి"
అను శ్రుతియు "పరమేశ్వరు నతిక్రమించి" యనునర్థమును చెప్పునది
కానక్కఱలేదు. దానికి మఱియొకయన్వయము లేదనుటకును వీలు లేదు.
పైసిద్ధాంతము ననుసరించిన పరమేశ్వరు నతిక్రమించుట వీలు లే దనుట
స్పష్టమగుచున్నది కదా! ఈకారణమువలన నాతరతిశబ్దమునకు మఱియొక
యర్థమునే చెప్పి తీరవలయును. "వ్యాకరణం తీర్త్వా" "వ్యాకరణమును
దాఁటి" అను మొదలగుప్రయోగములయందు వ్యాకరణమును దాఁటు
టకు వీలు లేదు కావున "వ్యాకరణమును చదివి; వ్యాకరణమును చిత్త
మునపొంది" అని మాత్రమే యర్థము నిర్ణయింపఁబడుచున్నది. ఇట్లే
ప్రస్తుతవాక్యమునకును "పరమేశ్వరుని పొంది" అని మాత్రమే యర్థము
చెప్పవలసి యున్నది. కావున నెట్లు చూచినను సేతుశ్రుతివలన పరమేశ్వర
భిన్నమగుపదార్థము నిర్ణయింపఁబడదు.

## అ-3. పా-౨. సూ-33.

అవః—ఈవిధముగ సేతుశ్రుతిని సమన్వయించి ప్రమాణమును
చెప్పుశ్రుతిని సమన్వయించుచున్నాఁడు.

## ౩౫౨. బుద్ధ్యర్థః పాదవత్. ౩. ౨. ౩౩.

తాత్పర్యము:—మఱియు రెండవమాఱు గణింపఁబడినపరిమాణ శ్రుతియు మీసిద్ధాంతమును స్థాపింపనేరదు. అదియు పరమేశ్వరభిన్న మగువిషయాంతరమును బోధించుటకై ప్రవర్తింపలేదు. పురుషులు ఉత్తమ మధ్యమాధమభేదములు గలబుద్ధితో గూడియున్నవార లగు టచే నిర్వికారబ్రహ్మమునందు దృఢచిత్తత్వము కలవారు కానేర రని యాయనకు నొకవిధ మగు నాకారమును ఉపాసనార్థమై కల్పించుచు మాత్రమే యున్నది. ఇట్లు చేసిననే గాని మందమతులు కడతేరనేరరు కదా! ఈవిషయమున (అనఁగా నగమ్యము లగుపదార్థముల సుఖముగ గ్రహించుటకు ననుకూలముగ నుండునట్లు దానియం దాకారాదుల గల్పించు ననుటయందు) దృష్టాంతము లనేకములు కలవు. వేదమునందే "మనో బ్రహ్మే త్యుపాసీత" "మనస్సును పరబ్రహ్మమునుగా నుపాసింప వలయును" అని చిత్తోపాసనను విధించినస్థలమునందు ఆమనస్సునకు వాగాదిరూపము లగునాలుపాదములు కల వని వర్ణింపఁబడియున్నది. ఇంత మాత్రమున మనస్సునకు వాగాదులు పాదము లగునా? అమ్ముట కొనుట మొదలగునవి సుకరముగ జరుగుటకై రూప్యము మొదలగువాని యందు కల్పింపఁబడినపాదాదులు (పాద మనఁగా నాలవభాగము) వాస్తవ పాదాదు లగునా? అనఁగా రూప్యమునందలి నాల్గవవంతు దానికి పాద మగునా యనుట? ఇట్లే పరమేశ్వరునకు నుపాసనార్థమై కల్పింపఁబడిన పాదములు పరమార్థపాదములు కానేరవు; కాకున్న నాయనకు పరిచ్ఛేద మును కలిగింపనేరవు. పరిచ్ఛేదమును కలిగింపకున్న నన్యపదార్థమును సంపాదింపనేరవు.

## అ-౩. పా-౨. సూ-౩౪.

అవతారిక :— ఈక్రిందిసూత్రమునందు సంబంధభేదశ్రుతులు సమన్వయింపఁబడును.

## ౩౫౩. స్థానవిశేషాత్ప్రకాశాదివత్. ౩. ౨. ౩౪.

తాత్పర్యము :—పైనవర్ణించినవిధముగా సంబంధభేదశ్రుతులు కూడ మీసిద్ధాంతమునకు సహాయకారులు కానేరవు. వానియందు ఇరువు

రవశ్యముగ నుండవలయు ననునియమము గన్పట్టదు. ఉన్నవాఁ డొక్కఁడేయైనను ఉపాధి భేదము ననుసరించి యన్నియుఁ జెప్పఁబడవచ్చును. అందు "బుద్ధి యనునుపాధియం దుండుటచే జాగ్రత్స్వప్నావస్థలయందు జనించిన విశేషజ్ఞానములు నశించుటయే పరమేశ్వరప్రాప్తి" అని మాత్రమే సంబంధశ్రుతికి నర్థము వాస్తవస్థితిలో జీవేశ్వరులు పరస్పరభిన్నులు కారు కదా! ఇట్లే భేదశ్రుతికిని ఉపాసనార్థమై స్థానభేదముల చెప్పుటయందే తాత్పర్యము కలదు గాని పరమేశ్వర భేదము చెప్పుటయందు కాదు. ఈ కారణమువలన నీరెంటిలో భేదమును చెప్పు నని నిర్ణయించుటకు వీలు లేదు. సూర్యకిరణములు గవాక్షమార్గమున లోనికి ప్రవేశించినప్పుడు తక్కినకిరణములకంటె (వెలుపల నున్నకిరణములకంటె) భిన్నములుగ నుండి యాయుపాధి నశింపఁగానే స్వభావముగనే వానిలో (కిరణసమూహములో) నైక్యము నొందుచుండినను, "గవాక్షమునుండి వచ్చినకిరణములు సూర్యునితోఁ గలసెను" అని వ్యవహరింపఁబడుచున్నట్లు విశేష విజ్ఞాననాశమున జీవుఁడు పరమేశ్వరునితో స్వాభావికముగనే యైక్యము నొందినను, "జీవుఁడు పరమేశ్వరునితోఁ గలసెను" అని వ్యవహరింపఁబడవచ్చును. గవాక్షమునుండి లోనికి ప్రవేశించుటవలన నాకిరణములు బాహ్యకిరణములకంటె భిన్నములుగ వ్యవహరింపఁబడునట్లు స్థానభేదముచే నాదిత్యాక్షిపురుషులును భేదములో వ్యవహరింపఁబడవచ్చును. ఘటాకాశము మహాకాశమునకంటె స్వాభావికముగ నభిన్న మయ్యు భిన్నముగను ఘటనాశ సమయమున మహాకాశమును జెందినదిగాను వ్యవహరింపఁబడునట్లు ఆదిత్యాక్షిపురుషులును జీవేశ్వరులును వ్యవహరింపఁబడవచ్చును. ఇంతమాత్రమున పరమేశ్వరభిన్న మగుపదార్థ ముండవలయు ననుట సిద్ధాంతము కానేరదు.

## అ-౩. పా-౨. సూ-౩౫.

అవతారిక:—"ఇట్లు చెప్ప నేల? సంబంధభేదములు శ్రుతియందుఁ జెప్పఁబడియుండ వానికి ప్రసిద్ధార్థమును చెప్పక మఱియొకవిధముగ వ్యాఖ్యానమును చేయనేటికి?" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౩౫౪. ఉపపత్తేశ్చ. ౩. ౨. ౩౫.

తాత్పర్యము:—పూర్వోక్తసందర్భమును విమర్శించి చూచిన సంబంధభేదశ్రుతులకు పై సూత్రమున వివరింపఁబడినట్లు మాత్రమే యర్థము చెప్పవలయు నని తేలుచున్నది. సంబంధశ్రుతికిఁ బిదప "స్వమపీతో భవతి" "సుషుప్తికాలమున జీవుఁడు సస్వరూపమును జెందును." అని స్పష్టముగఁ జెప్పఁబడి యున్నది. దీనిని విమర్శించిన "సతా సోమ్య" అనుసంబంధ శ్రుతిచే స్వస్వరూపప్రాప్తిరూపసంబంధమే చెప్పఁబడె ననుట విశద మగుచున్నది. సస్వరూపము తనకంటె భిన్నము కాదు గావున నచ్చట మనుష్యుఁడు పట్టణము మొదలగువానికి గలసంబంధమువంటి సంబంధ ముండుటకు వీలు లేదు. ఏదియో యొకకారణమున నాస్వరూపము కొంతకాలము విశదము కాకయుండి మరల విశద మగుటయే యీసంబంధమున కర్థ మనవలసి మాత్రమే యున్నది. లేకున్న నచ్చట రెండుపదార్థములు లేవు కదా! సస్వరూపమునకును తనకును భేదము కల దని యెవ్వఁడైన నంగీకరించునా? పైన వర్ణించినవిధముగ భేదము లేనిస్థలమున భేదమును కల్పించినకారణ మవిద్యయే! భ్రాంతియే. "ఎంతభ్రాంతిగ్రైనను తమ్ముతాము మరతురా?" అనియెదవేమో. అజ్ఞానాధిక్యమువలన నట్లు మరచుటయు గలదు. పదుఁగురు కలసియుండి యొకసమయమున "ఎందఱు కలరో" అని లెక్కింపఁబడవలసివచ్చినప్పుడు అజ్ఞాని యగువాఁడు ప్రమాదముచేఁ దనను విడిచి తక్కినవారిని మాత్రమే లెక్కింపవచ్చును కదా! లోకమునందు నిట్టిన్యాయ మొక్కటి కలదు. ఒకగురువునకు పండ్రెండుగురు శిష్యులు కలరట! వారు స్నానార్థమై నదికి జనిస్నానానంతరమున దమలో నందఱును కలరో? లేక నెవ్వఁడైన నదీ ప్రవాహమునఁబడెనో?యని తమను లెక్కించుకొన నుపక్రమించిరట! ప్రతివాఁడును తనను విడిచి తక్కినవారినిమాత్రము లెక్కించి పండ్రెండవవాఁడు లేఁడని దుఃఖింపసాగెనట! పార్శ్వమున నున్నపురుషుఁ డీ చిత్రమును జూచి మరి యొకఁడు లెక్కించునప్పుడు పదునొకండుగురిని లెక్కించునంతవఱకు నూరకుండి తర్వాత "పండ్రెండు" అని చెప్పుచు తనచేతనున్నదండముతో నాలెక్కించువానిని దట్టి చూపెనట! అప్పుడు భ్రాంతిని వదలి యాతఁడు సస్వరూపము నెఱింగెనట. ఇట్లే ప్రకృతవిషయమున గూడ నవిద్య జీవునకు సస్వరూపాజ్ఞానము కలిగించెను; సుషుప్త్యవస్థయందు ఆయవిద్య నశింపకున్నను సంసారహేతువు లగుచిత్తేంద్రియాదులు నశించును గావున

నాజీవుఁడుజ్ఞానశూన్యుఁడయ్యు స్వస్వరూపస్థితిని జెందును. ఆజ్ఞానశూన్యుల వలననే పునరుద్ధానమును జెందును. ఇదియే పరబ్రహ్మముతో కలదనిచెప్పఁ బడిన సంబంధము. కావున పైసూత్రమునఁ జేయఁబడిన వ్యాఖ్యానము నందు దోషము లేదు. భేదశ్రుతి కూడ నీకారణములవలననే యౌపచారికముగ నన్వయింపఁబడవలయును; ముఖ్యభేదము సంభవింపదని యిదివఱకే నిరూపించి యున్నాముకదా! అనేకశ్రుతులు "ఏకమే వాద్వితీయం" అను మొదలగు ననేకశ్రుతులు పరమేశ్వరుఁ డొక్కఁడే యనువిషయమును స్పష్టము చేయుచున్నవి. కొన్ని శ్రుతులు పారమార్థిక భేదమును చెప్పునేని వీనికి విరుద్ధములై యప్రమాణము లగును. కావున మహాకాశము నొక్కదానినే యుపాధివశమున ఘటాకాశాది భేదములతో వ్యవహరించునట్లు పరమేశ్వరు నొక్కనినే సూర్య నేత్రాదిస్థానభేదముల వలన ఆదిత్యపురు షాక్షిపురుషాదినామములతో బిలుచుచున్నాము. ఈ కారణమువలన పైసూత్రమునందుఁ జేయఁబడిన వ్యాఖ్యానమునకు నెట్లును భంగము రాదు.

## అ-౩. పా-౨. సూ-౩౬.

అవ:—ఈవిధముగ పూర్వపక్షహేతువుల నన్నిటిని ఖండించి ప్రస్తుతము మఱియొకహేతువుచే స్వమతసిద్ధాంతమును స్థాపించుచున్నాఁడు.

## ౩౫౧. తథాన్యప్రతిషేధాత్. ౩. ౨. ౩౬.

తాత్పర్యము.—ఈవిధముగ పూర్వాపరముల విమర్శించిన పూర్వపక్షహేతువు లేవియు నిలువవు. మనసిద్ధాంతమే (పరమేశ్వరునికంటె భిన్నమగుపదార్థము లేదనుటయే) స్థిరమైనది. శ్రుతియు స్పష్టముగనే యీ విషయమును బోధించుచున్నది. "స ఏ వాధస్తాత్. అహ మేవాధస్తాత్. ఆత్మై వాధస్తాత్. సర్వం తం పరాదా ద్యోఽన్య త్రాత్మనః సర్వం వేద. బ్రహ్మై వేదం సర్వం. ఆత్మై వేదం సర్వం. నేహ నానాస్తి కించన. యస్మాత్పరం నాపర మస్తి కించిత్. తదేత ద్బ్రహ్మా పూర్వ మనపర మనంతర మబాహ్యం". "ఆపరమేశ్వరుఁడే క్రింద మీఁద నున్నాఁడు. నేనే క్రింద, మీఁద నున్నాను. ఆత్మయే క్రిందను మీఁద నున్నాఁడు. ఏపురుషుఁడు తనకంటె భిన్నముగ నొకపదార్థము కల దని తలంచునో

వానిని ఆపదార్థము ముక్తికి దూరస్థుని గావించును. ఈసమస్తప్రపంచము పరమేశ్వరుడే. ఈసర్వము నాత్మయే. ఈలోకమున భేద మనునదియే లేదు. ఏపరమేశ్వరునికంటె నల్పుఁడుగాని యధికుఁడుగాని లేఁడో ఈపరమేశ్వరునకు ముందుగాని వెనుకగాని లోపలగాని వెలుపలగాని లేదు." అని శ్రుతియం దీభేదప్రతిపాదకములును మఱియొకవిధముగ నన్వయించుటకు వీలు లేనివియును సమన్వయాధ్యాయమునందు శుద్ధ బ్రహ్మపరములుగాను అభేదపరములుగాను సయుక్తికముగ సమన్వయింపఁ బడినవియు నగు ననేకవాక్యములు కలవు. కావున నెట్లును పరమేశ్వరభిన్న మగుపదార్థ ముండుటకే వీలు లేదు.

## అ-3. పా ౨. సూ-3౭.

అవతారిక:—"అగునుగాక పై హేతువులవలన నొకవేళ పరమేశ్వరున కద్వితీయత్వము సంభవించినను సర్వవ్యాపకత్వము సంభవింపదు. సర్వపదార్థములును బ్రహ్మరూపములే యనుటయు సిద్ధాంతము కాదు." అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

# 3౫౬. అనేన సర్వగతత్వమాయామశబ్దాదిభ్యః.

### 3. ౨. 3౭.

తాత్పర్యము:—సర్వవ్యాపకత్వవిషయమున నించుక యైనను సంశయింపఁ బనిలేదు. సేతుశ్రుతి మొదలగువాని నౌపచారికముగ నన్వయించుటచేతను ఇతరపదార్థనిషేధమును జూపుటచేతను మాత్రమే యీ విషయము సిద్ధాంతమైనది. సేతుశ్రుతి మొదలగువానికి ముఖ్యార్థమునే చెప్పియుండినచో నానేత్యాదులవలెనే పరమేశ్వరుఁడును *పరిచ్ఛిన్నుఁడు కావలసివచ్చును. ఇతరపదార్థనిషేధము నంగీకరింపనిచో నిట్టి పదార్థము రెండవదికూడ నొకవేళ యుండునేమో యని సంశయము కలుగవచ్చును; కాని యిప్పు డట్టియవకాశ మేదియు లేదు. "యావ న్వా అయ మాకాశ స్తావా నేషోఽంతర్హృదయ ఆకాశః. ఆకాశవ త్సర్వగతశ్చ నిత్యః. జ్యాయాన్ దివః. జ్యాయా నాకాశాత్. నిత్యః సర్వగతః స్థాణు రచ

* పరిచ్ఛిన్నుఁడు (అ-౧ పా-౧. సూ-3౧. పేజీ-౧౫౭ చూ.)

లోఽయం సనాతనః." "ఈవెలుపల నుండునాకాశ మెంతప్రమాణము గలదియో యితరపదార్థములతో సంబంధింపకుండునదియో హృదయాకాశము కూడ నంతపరిమాణము కలదియే; ఇతరపదార్థములతో సంబంధింపనిదియే. ఆపరమేశ్వరుఁడు ఆకాశమువలె సర్వవ్యాపకుఁడు నాశరహితుఁడు. ఆపరమేశ్వరుఁడు ద్యులోకముకంటె గొప్పవాఁడు. ఆకాశమునకంటెపెద్దవాఁడు. ఓయర్జునా! యీపరమేశ్వరుఁడు శాశ్వతుఁడు. సర్వవ్యాపకుఁడు. స్థిరుఁడు. నిశ్చలుఁడు. ఆదిమధ్యాంతములు లేనివాఁడు." అని మొదలగు శ్రుతిస్మృతు లనేకము లీవిషయమును బోధించుచున్నవి. కావున పరమేశ్వరుఁడు సర్వవ్యాపకుఁ డనుటలో సంశయము లేదు. ఈ సర్వప్రపంచము ఆయననుండియే జనించెను. కావున సర్వపదార్థములును తద్రూపములే యగును. "అగునుగాక సర్వవ్యాపకుఁ డనిన నాయనకంటె భిన్నమై సర్వశబ్దవాచ్యమై పదార్థ మొక్కటి యుండవలయును. దాని నంగీకరించిన పరమేశ్వరుఁడు సద్వితీయుఁ డగును; అంగీకరింపకున్న సర్వవ్యాపకత్వము కలుగదు. ఇవి రెండును అనిష్టములే కదా!" అనియెదవేమో. ప్రపంచబ్రహ్మములకు ననిర్వచనీయభేదము కలదని యిదివరకే పలుమారు నిరూపించియే యున్నాము. ఆభేదము నాశ్రయించి సర్వవ్యాపకత్వంబును పారమార్థికస్థితి నాశ్రయించి యద్వితీయత్వంబునుగూడఁ గలుగవచ్చును. ఇందు విరోధ మేమియు లేదు. పరమేశ్వర భిన్న మగుపదార్థ మెద్దియు లేదు. దీనిచే జీవేశ్వరైక్యము దృఢపరుపఁబడినది.

---

## ౮. ఫలాధికరణము.

విషయము, సందేహము:—ఈశ్వరుఁడు స్వభావముగ నిర్విశేషుఁడే యైనను ఉపాధిసంబంధమువలన సర్వనియామకుఁడై అవిద్యావశమున భేదము నొందియున్న జీవులను నియమించుచున్నాఁడని యిదివఱకే నిరూపించి యున్నాము. జీవుఁడు ఆయనచే ప్రేరేపింపఁబడియే కర్మ నాచరించుచున్నాఁ డనియు నిర్ణయించి యున్నాము. లోకమున సుఖదుఃఖమిశ్రఫలముల స్వర్గనరక మనుష్యలోకములయందు సంసారవశగతులై జీవుఁ డనుభవించుచున్నాఁ డనుట సుప్రసిద్ధము కదా! ఈఫలములను

వీరిచే నాచరింపఁబడినకర్మయే యొసంగునా? లేక పరమేశ్వరుఁ డొసంగునా? అనువిషయ మిందు విచారింపఁబడును.

సంగతి:—పూర్వము రెండధికరణములయందును * తచ్ఛబ్దలక్ష్యార్థము విచారించి జీవబ్రహ్మైక్యము బోధింపఁబడెను. ఈయధికరణమున † తచ్ఛబ్దవాచ్యార్థము వర్ణింపఁబడును గావున నీయధికరణ మీపాదమున జేర్పఁబడెను. పరమేశ్వరునిఁ గూర్చిన విచారమే యిందును జేయఁబడు చుండుటచే నీయధికరణమునకుఁ బూర్వాధికరణముతోఁ గలసంబంధ మేకవిషయ సంబంధము.

## అ_3. పా_౨. సూ_3౮.

అవతారిక :— పైనఁ జూపిన విషయమును నిర్ణయించువాఁడై సూత్రకారుఁ డీయధికరణమును సిద్ధాంతముతో నుపక్రమించెను. ఈ క్రింది రెండుసూత్రములతో తనసిద్ధాంతమును తెలుపుచున్నాఁడు.

## 3౫౭. ఫల మత ఉపపత్తేః. 3. ౨. 3౮.

తాత్పర్యము:—జీవులొనర్చుకర్మలకు కలుగు ఫలము లన్నియు పరమేశ్వరునిమూలముననే కలుగుచున్నవి. కర్మానుగుణముగ ఫలము నొసంగువాఁడు పరమేశ్వరుఁడే. ఇదియే మిగుల యుక్తియుక్త మైన సిద్ధాంతము. కేవల కర్మయే ఫలము నొసంగు ననుట యెట్లును సమంజసము కానేరదు. అది యత్యల్పకాలములో నశించిపోవునది. సుఖదుఃఖాదిఫలము

---

* తచ్ఛబ్దలక్ష్యార్థ మనఁగా తత్త్వమసి యనుమహావాక్యమునందలి తచ్ఛబ్దముచే నూహింపవలసిన యర్థము శుద్ధబ్రహ్మము.

† తచ్ఛబ్దవాచ్యార్థ మనఁగా నాశబ్దముచేఁ జెప్పఁబడునర్థము. అనఁగా లక్షణావృత్తివలన (లక్షణావృత్తి చూ. ౪౭౧) గాక సామాన్యముగ శబ్దశ్రవణమాత్రము వలననే దోఁచునర్థము. సర్వభూతాత్మక మగుబ్రహ్మము సర్వజ్ఞత్వాది గుణములతోఁ గూడిన యీశ్వరుఁడు త్వంశబ్దమునకు నిట్లే సంసారి యగుజీవుఁడు వాచ్యార్థంబును స్వాభావికస్వరూపముతో నున్నజీవుఁడు లక్ష్యార్థంబు నగును. "తత్త్వమసి" అను మహావాక్యమునందు చెప్పఁబడిన యైక్యము వాచ్యార్థమునకు సంభవింపదు గావున లక్షణావృత్తి యాశ్రయింపఁబడెనని తెలిసికొనవలయును.

లన్ననో కాలాంతరమున ననుభవింపఁబడవలసినవి. అట్టి ఫలముల నీకర్మ యెట్లొసంగఁగలదు. లేనిదానినుండి కలిమి జనించునా? "ఇట్లు కాదు కర్మ యల్పకాలమునకే నశించినను దానిఫలము నొసంగియే నశింపవచ్చును. యజమానుండును తగినసమయము వచ్చినప్పుడు దాని ననుభవింప వచ్చును. అంతవఱకు నాఫలము కర్మాంతరముచే నాటంకపఱుపఁబడి కాని పృథివీమయము లగుశరీరములచే ననుభవింపఁబడుటకు వీలుగాని దగుటచే కాలమును ప్రతీక్షించును గాని యుండవచ్చును" అనియెద వేమొ వినుము. ఇది యుక్తియుక్త మగువాదము కాదు. యజమానులు "మేము స్వర్గఫలము ననుభవింపవలయును" అని మాత్రమే కోరుదురు. కాని "ఈకర్మవలన స్వర్గము జనింపవలయును" అని కోరరు. ఎవ్వరు దేనిని గోరుదురో యది వారికి వచ్చుటయే కదా ఫలసిద్ధి యనఁబడును? ఇచ్చట కర్మ యొసంగిన ఫలము పురుషునిచే ననుభవింపఁబడుట లేదు. ఇక నిది ఫల మెట్లగును? మఱియు అపరిమితసుఖము అపరిమితదుఃఖము అనువానికంటె భిన్నముగా స్వర్గనరకములకు స్వరూపమే లేదు. ఇట్లుండ నవి పరునిచే ననుభవింపఁబడకుండ కొంతకాలమువఱకు నూరక నిలిచి యుండు ననుట యెట్లు యుక్తియుక్త మగును. "ఇట్లు కాకున్న నపూర్వ మనునది కర్మవలన కలుగు ననియు అది కర్మ నశించినను ఫలకాలమువఱకు పురుషు నాశ్రయించియే యుండు ననియుఁ జెప్పవచ్చును కదా!" అనియెద వేమొ యదియు యుక్తము కాదు. అపూర్వ మచేతనము. దానికి తార తమ్యజ్ఞానాదులు కాని ఫలము నిచ్చుసామర్థ్యము కాని లేదు. కావున నప్పటికిని చేతనుని సహాయ ముండవలయు ననియే చెప్పవలయును. అ ట్లుండిన నాచేతనుఁడే ఫలదాత కావచ్చును కదా! మఱియు నాయపూ ర్వము కల దనుటకును తగినంత ప్రమాణము లేదు. వేదమున నట్లు చెప్పఁ బడలేదు; ప్రత్యక్షాదులవలన శోధింపఁబడలేదు. "*అర్థాపత్తిప్రమాణ ముచే దానిని కల్పించితిమి. కర్మకు చిరకాలమునకు గలుగఁబోవుఫలము నొసంగుసామర్థ్యము లేకుండుటచేతను మఱియొకఫలదాత లేకపోవుట చేతను అట్లు కల్పింపవలసి వచ్చినది" అనియెదవేమొ అదియు యుక్తము కాదు. ఈశ్వరుఁడు ఫలప్రదాత యనిన నిది కల్పింపఁబడవలసిన పనిలేదు

* అర్థాపత్తిప్రమాణము (అ-౧. పా-౧. సూ-3- పేజీ-3౯ చూ.)

కదా! కావున నెట్లును ఈశ్వరుఁడే ఫలప్రదాత యనిన యుక్తియుక్తముగ నుండును.

## ౩౭౮. శ్రుతత్వాచ్చ. ౩. ౨. ౩౯.

తాత్పర్యము:—కేవలము యుక్తి నాశ్రయించిమాత్రమే యీ సిద్ధాంతము చేయఁబడలేదు; శ్రుతియు నీసిద్ధాంతమునకు ననుకూలముగ నున్నది. "స వా ఏష మహా నజ ఆత్మాన్నాదో వసుదానః" "సర్వవ్యాపకుఁడును ఉత్పత్తివినాశశూన్యుఁడును అగునాత్మయే సర్వజంతువులకు నన్నము నొసంగువాఁడు; ధనము నిచ్చువాఁడు" అని శ్రుతియం దీవిషయము స్పష్టముగనే చెప్పఁబడి యున్నది.

## అ-౩. పా-౨. సూ-౪౦.

అవతారిక:—ఈవిధముగ రెండుసూత్రములచే స్వసిద్ధాంతమును జెప్పి యీసూత్రమున బూర్వపక్షము ననువాదము చేయుచున్నాఁడు.

## ౩౭౯. ధర్మం జైమిని రత ఏవ. ౩. ౨. ౪౦.

తాత్పర్యము:—జైమినిమహాముని యిట్లే శ్రుతియుక్తుల నాశ్రయించి కేవల కర్మయే ఫలప్రదాత యనుచున్నాఁడు. "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" 'స్వర్గము కోరువాఁడు జ్యోతిష్టోమయాగము నాచరింపవలయును' అను మొదలగుశ్రుతులయం దీవిషయము స్పష్టముగఁ జెప్పఁబడి యున్నది. ఈ శ్రుతియొక్క యర్థమును విచారించిన పురుషుఁడు యజ్ఞము నాచరింపవలయు (భావింపవలయు. యజ్ఞమనఁగా పూజ; అది దేవతాధ్యానాదిరూప మైనది కావున భావన యనఁబడును) ననియు దానిచే స్వర్గము కలుగు ననియు మాత్రమే చెప్పఁబడిన ట్లగును. కదా! ఇది విధివాక్యము. ఇందు యజ్ఞము విధింపఁబడెను. దీనికి ఫలముతో సంబంధము లేకుండిన ఫలము నిచ్చువాఁడు ప్రత్యేకముగ నుండినచో దీనిని చేయువారలే యుండరు కదా! వేదప్రామాణ్యము ననుసరించి యీవిషయము నంగీకరించిన నప్పుడు అల్పకాలముననే నశించు కర్మ కాలాంతరమున గలుగుఫలము నొసంగనేరదు. కావున కర్మఫలములకు నడుమ నొకయపూర్వము కల దని కల్పింపవలయును. దేవతయే

యట్టిది (ఫలదాత) కావచ్చు ననుటకు వీలు లేదు. అది( దేవత) యజ్ఞవిధికి బిదప 'ఈయజ్ఞము నెవ్వనిఁ గూర్చి యాచరింపవలయును' అని ప్రశ్న రాఁగా దానికి నుత్తరమై మాత్రమే వచ్చినది. కావున కర్మకు నంగ (అప్రధానము అవయవము) మగును కాని స్వప్రధానము (కర్మకంటె ముఖ్యమైనది) కానేరదు. పరమేశ్వరుఁడే యట్టివాఁ డగు ననినను ఆయన స్వతస్సిద్ధుఁ డగుటచే నిర్వికారుఁ డగుటచే విచిత్రఫలముల నొసంగనేరఁడు. కావున నెట్లును కర్మమే ఫలదాత" అని సిద్ధాంతము చేయుచున్నాఁడు.

వేదాంతపూర్వపక్షము :—ఈసిద్ధాంతము యుక్తియుక్తమైనది కాదు. "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అను మొదలగు శ్రుతుల యర్థమును బాగుగ విమర్శించిన కర్మలకును వానిఫలములకును సంబంధమున్నట్లు గానేరదు. ఎట్లనిన:—విధివాక్యములయందు క్రియాపదములచేఁ జెప్పఁబడిన పనియే భావన యని కొందఱిచేతను క్రియ యని కొందఱిచేతను చెప్పఁబడుచున్నది. ఇం దేపక్షము నాశ్రయించినను కర్మలకు ఫలములతో సంబంధము కల దనుట సిద్ధాంతము కానేరదు. మొదటిపక్షమున అచ్చటి క్రియాపదములే ఆయాగాదులను చెప్పునుగావున సాధింపఁదగిన వానినిగా నిరూపించునుకావున మఱియొకసాధ్యమును చెప్పనేరవు. చేయఁబడవలసినది యజ్ఞమే యనుటచే నదియు సాధ్యమే; దాని నాచరించుటచే పొందఁబడవలసినది యగుటచేత స్వర్గంబును సాధ్యమేకదా ! ఒక క్రియయే యీరెంటిని జెప్పు ననుట యెట్లు? కావున "ధాత్వర్థముచే జెప్పఁబడునది భావన; అదియే క్రియ" అను మొదటిపక్షము నాశ్రయించిన నెట్లును ప్రయోజనము లేదు. ఇక రెండవపక్షము నాశ్రయించి "క్రియయు భావనయు పరస్పరభిన్నములు. ధాతువుచే క్రియ చెప్పఁబడును. దానిపైనున్న *లిఙ్ప్రత్యయముచే భావన చెప్పఁబడును" అని చెప్పినను కర్మఫల సంబంధమును నిరూపించుటకు వీలులేదు. ఆభావనయు భావింపఁబడవలసిన విషయమును చెప్పునది యైనను ధాతువుచేఁ బ్రకటింపఁబడినవిషయమునే చెప్పవలయును గాని మఱియొకవిషయమును చెప్పుటకు వీలు లేదు. యాగాదికర్మలును ఆభావనయు నొక్కపదముచేతనే చెప్పఁబడి యున్నవి. కర్మస్వతంత్రముగ ధాతువుచేఁ జెప్పఁబడెను కాని స్వర్గము చెప్పఁబడ లేదు;

---

* లిఙ్ప్రత్యయ మనఁగా ధాతువుపై విధించుట మొదలగునర్థములు వచ్చునప్పుడుపయోగింపఁబడు ప్రత్యయము.

అది పురుషునకు విశేషణమై మాత్రమే యున్నది. కాని క్రియాపదముతో సంబంధింప లేదు. ఇట్లుండ నీభావన దాని నెట్లు గ్రహింపఁగలుగును? వాక్యము పఠింపఁగానే మొట్టమొదట కర్మ మాత్రమే సాధ్యముగ తోచునుగాని స్వర్గాదిఫలములు కావు కదా! ఇట్లుండ నది (భావన) మొట్టమొదట స్ఫురించినదానిని ఏల విడుచును? ఈకారణములవలన నే పక్షము నాశ్రయించినను కర్మఫలములకు సంబంధము కల దనుట సిద్ధాంతము కానేరదు. ఒక్కవాక్యమునందే స్వర్గాదిఫలములను గూర్చియు కర్మలనుగూర్చియుఁ గూడఁ జెప్పఁబడి యుండు ననుటకు మాత్ర మెట్లును వీలు లేదు. అప్పుడు వాక్యభేదము కలుగవలసి వచ్చును. క్రియాపదముచే నేది జెప్పఁబడునో అదియే ప్రధాన మగు ననుట సర్వానుభవసిద్ధము. ఒక్క పదము రెంటిని సమానముగఁ జెప్పఁగల దనుట యెట్లు సిద్ధించును?

"భావన స్వర్గాదులను చెప్పును" అని పట్టు పట్టినను ప్రయోజనము లేదు. ఇంతవఱకు శబ్దవిచారముచే మేము "కర్మఫలములకు సంబంధము కలుగదు" అనువిషయమును నిరూపించితిమి కాని వస్తుస్థితిని (భావన ఫలాదిస్వభావములను) పట్టిచూచినను ఇదియే సిద్ధాంత మగును. భావన పురుషప్రయత్నము; పురుషునిచే సంకల్పపూర్వకముగ నిర్వహింపఁబడ వలసినది. ఇట్టిది ధాత్వర్థమును విడిచి యెచ్చటనో యున్న దానిని గ్రహించు ననుట యెట్లు? యాగాదులు ఆచరింపఁబడినపిదపఁ గదా ఫలము కలుగ వలయును. ఆఫలమును భావన మొట్టమొదటనే యెట్లు భావింపఁగలదు? భావనాకాలమున నున్నది యాగమే కదా! మఱియు ధాత్వర్థముచేఁ జెప్పఁ బడకుండుటచే నది యెట్లును ప్రధానము కానేరదు. కావున నెట్లు చూచి నను ఫలములకును కర్మకును సంబంధమే లేదు.

"ఇట్లయిన నాశ్రుతియందుఁ గలస్వర్గపదమునకు బ్రయోజన మేమి? అది కర్మసాధ్యము కాకుండిన దానితోఁ గ్రియకు సంబంధ మెట్లు కలుగును?" అనియెద వేమొ వినుము. "భూతం భవ్య మోపదిశ్యతే" "గడచి పోయినవిషయము (అనఁగా బ్రకృతసంబంధము ననుసరించి (నిత్యశుద్ధ మగువిషయము.) వర్తమానవిషయమునకై (యాగాదులకై) యుపదే శింపఁబడును" అనున్యాయ మొక్కటి లోకమునఁ గలదు. స్వర్గమునకు సంతోషహేతువు గలుగుచందనాదులే స్వరూపములు కావున నది స్వతస్సిద్ధ మైనదియే. ఇట్లగుటచే యాగాదికర్మలు దానిని సాధించు ననవలసిన

పని లేదు. "యాగాదికర్మల నాచరింతురు; వానితో నేమియు సంబంధము లేకయే పరమేశ్వరేచ్ఛవలన వారికి స్వర్గము దొరకును" అనుట మాత్రమే సిద్ధాంతము. ఈకారణమువలన స్వర్గాదులు యాగాదులకు సాధనములవలె *గుణభూతములై మాత్రమే యున్నవి. ఇదియే వానికిఁ గలపరస్పర సంబంధము. స్వర్గము యాగఫల మనునియమము లేకున్నను ఈసంబంధ ముండవచ్చును కదా! "ద్రవ్యాణాం కర్మసంయోగే గుణత్వే నాభిసంబంధః" "స్వతస్సిద్ధము లగుపదార్థములకుఁ గర్మలతో సంయోగము కలిగినప్పుడు వానికి గుణరూపముతో మాత్రమే సంబంధము కలుగును" అను సూత్రముచే జైమినిమహామునియు నీవిషయమును నిరూపించి యున్నాఁడు.

ఈకారణమువలన నెట్లును కర్మఫలములకు పరస్పరసంబంధము లేదు. కర్మయు దుఃఖరూప మగుటచే దానిని బురుషుఁడు కోరఁడు; స్వర్గమును కోరినను అది పైనఁజెప్పినవిధముగ కర్మాచరణమువలన వచ్చునది కాదు. ఇట్లగుటచే నాయాగాదులు పురుషున కుపకారము చేయ నేరవు; చేయకుండిన పురుషులును దానిపై నధికారమును దాల్పనేరరు. ఇట్లున్న నిఁక కర్మకు నధికారి యెవ్వఁడు? అధికారి లేకపోవుటచే శాస్త్రమంతయు నిరర్థకము కావలసి వచ్చును. ఇట్లు బహుదోషదూషిత మగుటచే నీకర్మవిధిసిద్ధాంత మయుక్తము. సర్వశాస్త్రంబును ఆనందరూపుఁడగు బ్రహ్మమును గూర్చియే చెప్పు ననియు భేదప్రపంచమును నాశముచేసి దానిమూలమున పరమేశ్వరైక్యము ననుభవింపవలయు నని మాత్రమే సిద్ధాంతము చేయుచున్నది యనియుఁ నంగీకరించి తీరవలయును.

"ఇది యెట్లు జ్యోతిష్టోమాదివాక్యములయందు ఆకాశాదిధ్వంసమునుగూర్చిన ప్రస్తావమే కానరాలేదు కదా" యనియెదవేమొ వినుము. విచారించిచూచిన ప్రతివిధివాక్యమునందును [ఇట్లు చెప్పనేల] ప్రతిస్థలమునందును ఏదియో యొకభేదమును నిషేధించుటయే యుద్దేశింపఁబడినట్లు కానవచ్చుచున్నది. ప్రస్తుత జ్యోతిష్టోమవాక్యమునందు దేహాత్మభావనాశ ముద్దేశింపఁబడెను. సాధారణముగ విచారించిచూచిన నీవిధివలన దేహాదివ్యతిరిక్తుఁడును పరలోకఫలముల ననుభవించువాఁడు నగుజీవుఁడు వర్ణిం

* గుణభూతము=గౌణము (అ-౨. పా-౪. సూ-౨. పేజీ-౯౩౪ చూ.) అవయవము లేక అప్రధానము. ప్రత్యక్షముగ నవయవము కాకున్నను దానివంటిది.

పఁబడుచున్నట్లు తెలుచున్న దికదా! పైన వర్ణించినవిధముగ వానికిఁ గర్త్రాధి కారము గలుగ దనుటయు నిశ్చయమగుచున్నది గదా! ఇట్లుండ నీ వాక్యము కర్మవిధిపర మగుట యెట్లు? లేనియధికార మున్నట్లు గానవచ్చు చున్నది. అంతియకాని మఱియేమియు లేదు. ఇట్లగుచే నావాక్యము స్వర్గప్రాప్త్యుపాయమునుమాత్రమే బోధించునది యగునుగాని యాగా దులను విధించునది కానేరదు. అధికారి లేకున్న విధికిఁ బ్రయోజన మేమి? ఈకారణమువలన నీవాక్యమునకు విధియందు తాత్పర్యము లేదు; దేహ మునకంటె భిన్నుఁ డగుజీవుని బోధించును. కావున "నేను దేహము కాను; దేహమునకు గలుగుసుఖదుఃఖాదులు నావి కావు." అని ప్రతిపురుషుఁ డును తనలో నిశ్చయించుకొనవలయు ననుటయే దీనికి తాత్పర్య మగును. దీనిచే జ్యోతిష్టోమవాక్యము దేహాదిరూప మగు ప్రపంచముయొక్క నాశ మునుఁగూర్చిమాత్రమే చెప్పు ననుట సిద్ధాంత మయినది.

ఇట్లే "గోదోహనేన పశుకామస్య ప్రణయేత్" "పశువులను కోరువానిచేత గోదోహనయాగము చేయింపవలయును" అను మొదలగు విధివాక్యములును జీవభేదమును నిరాకరించుచున్నవి. ఆగోదోహనక్రతు సందర్భమున సామాన్యముగ విచారించిన దర్శపూర్ణమాసయాగాధి కారియే యధికారిగ నిర్ణయింపఁబడినట్లు తెలిసినది. ఇట్లగుటచే నధికారు లకుఁ బరస్పరభేదము లే దని సిద్ధాంత మైనది. అధికారులు జీవులే యగు టచే వారందఱు నొక్కటియే యని తెల్పఁబడినది. కావున నీశ్రుతి జీవ భేదనిరాకరణమునుఁగూర్చి మాత్రమే చెప్పుచున్నది యని స్పష్ట మగు చున్నది. కర్మకు నధికారియే లేఁ డని పూర్వముననే సిద్ధాంతము చేసి యున్నాము. నిషేధవాక్యములనుఁగూర్చి విచారింపవలసినపనియే లేదు. అవి "న కర్మణా న ప్రజయా. న కలంజం భక్షయేత్" "కర్మచేతఁగాని సంతానము చేతఁగాని మోక్షము కలుగదు; విషముచే పూయఁబడిన బాణ ముచే కొట్టఁబడినమృగముయొక్క మాంసము కలంజ మనఁబడును. దానిని భక్షింపరాదు" అను మొదలగువాక్యములు స్పష్టముగనే కర్మప్రవృత్తిని నిషేధించుచున్నవి. మఱియు విధివాక్యములు చేయునుపాయోపదేశము కూడా నేవాదిసాధారణోపాయముల నిషేధించుటకై మాత్రమే యని తెలిసికొనవలయును. ఈవిధముగ విచారించినచో వేదమంతయు ప్రపం చలయమునుఁ గూర్చియు పరమేశ్వరైక్యమునుఁ గూర్చియు మాత్రమే

చెప్పుచున్నది యని తేలును. కర్మఫలములకు సంబంధము బొత్తుగనే లేద నుట సిద్ధాంతము.

మఱియు కర్మఫలములకు సంబంధము కల దనిన శాస్త్రము శాస్త్రమే కాకపోవలసివచ్చును. కామక్రోధాదు లనర్థహేతువు లను టయు నొకదానివలన మఱియొకటి జనించుచుండు ననుటయు సర్వలోక ప్రసిద్ధము. శాస్త్రము ఆయాసుఖములను జూపి కర్మలను విధించునది యగునేని యప్పుడు కామాదుల నభివృద్ధిచేసినది యగును. పురుషునకు ననర్థమును సంపాదించినది యగును. అప్పు డది శాస్త్రమే కానేరదు కదా! శాస్త్రము హితము నుపదేశింపవలయు ననుట నియతము. ఇట్లు గాక పై నిరూపించిన యర్థము నంగీకరించినచో నప్పుడు రాగాదిదోషము లన్నియు నశించును. కావున (బ్రహ్మజ్ఞానము నుపదేశించినప్పుడు రాగాది దోషములు నశించును. కావున) శాస్త్రము శాస్త్రము కావచ్చును. ఇది హితోపదేశమే కదా! కావున కర్మఫలములకుఁ గలసంబంధము అప్రా మాణికమే కావున కేవలకర్మము ఫలదాత కానేరదు. అవిద్యాసహితుఁడై యాపరమేశ్వరుఁడే స్వతంత్రుఁడై నానావిధఫలముల నొసంగు ననవల యును. మఱియు యాగాదు లేదియో యొకదేవతనుగూర్చియే యాచ రింపఁబడును. కావున తత్తద్దేవతాస్వరూపముతో నున్నపరమేశ్వరుఁడే ఫలము నొసంగనచ్చును. ఒక్కపరమేశ్వరుఁడే యుపాధిభేదమువలన బహురూపములతో నున్నాఁ డనుటలో విరోధము లేదు కదా! ఈకార ణమువలన "తృప్త ఏ వైన మింద్రః ప్రజయా" "యాగముచే తృప్తి నొందిన యింద్రుఁడు యజమానుని సంతానముచే దృప్తి నొందించును." అను మొదలగు శ్రుతివాక్యముల ననుసరించి దేవతయే ఫలదాత యని నిర్ణయించుట యుక్తము. ఆదేవతకు బరమేశ్వరుఁడే స్వరూపము కావున బరమేశ్వరుఁడే ఫలదాత యని చెప్పవచ్చును. కావున నెట్లును పరమేశ్వ రుఁడే ఫలదాత, కర్మ కాదు.

"ఇట్లయిన విధులకు గతి యేమి" అనియెదవేమొ వినుము. విధి యనఁగా ప్రవర్తింపఁజేయునది. ప్రవర్తింపఁజేయఁగల ప్రతిదానికిని అధి కారి యుండవలయు ననునియమము లేదు. గాలి మొదలగునవి తనకు లోబడియున్న యేపదార్థమునైనను ప్రవర్తింపఁజేయును కదా! కావున

నెట్లును మాసిద్ధాంతమునకు భంగము కలుగదు. కర్మ స్వతంత్రముగా ఫలము నొసంగ నేరదు.

జైమినిసిద్ధాంతము : — ఇట్లు చెప్పుట యుక్తము కాదు. విధి యనునది యుపదేశము. ఉపదేశములకు పరహితమును (తనచేఁ బ్రేరేపింపబడుచున్నవాని శుభమును) సాధించుటయే ప్రయోజన మనుట సుప్రసిద్ధము. ఆజ్ఞ మొదలగునవి ప్రేరేపించువానికార్యములను సాధించుటలో ప్రవర్తించును; పరులను గూడ ప్రవర్తింపఁజేయును గాని యుపదేశ మట్లు చేయదు. ఎవ్వఁడైనను ఆజ్ఞ యొసంగిన దానిని స్వకార్యసిద్ధి కయ్యే యొసంగు ననుట నిర్వివాదాంశము. "నీవు వానిని గొనిరమ్ము" అనిన నది తనకార్యము కొఱకయ్యే యనుట నిర్వివాదము కదా! "ఆరోగ్యమును గోరువారు తాము భుజించినయన్నము బాగుగ జీర్ణమైన పిదపఁ గాని మఱల భుజింపరు. నీవును అట్లే చేయుము." అనిన నిందు ప్రేరేపించువానికి స్వప్రయోజన మేమి కలదు? ఇందు మొదటిది యాజ్ఞ; రెండవది యుపదేశము. ఇట్లగుటచే విధులన్నియు నవశ్యముగ పరహితమును బోధించునవి కావలయు. మఱియు ఆజ్ఞయనునది పురుషులయందుఁ గలుగవచ్చును గాని వేదమునందు గలుగదు. దానికి నెవ్వరివలనఁ గాని కావలసినకార్య మేమి కలదు? ఈకారణములవలన నిర్వివాదముగ విధులు కర్మ నుపదేశించినను స్వర్గాదిసాధ్యముల (ఫలముల) నవశ్యము బోధించుననియే యంగీకరింపవలయును. ఇట్లు బోధింపకున్నవాని నాచరించువాఁడే యుండఁడు. కావున విధులు గాలి మొదలగువానివలె పరుల నూరక ప్రేరేపించునవి (త్రోయునవి) మాత్రమే కావు; ఉపదేశించునవి కూడ నగును. ఇట్లగుటచే ప్రతి విధికిని అవశ్యముగ నధికారి కలఁడు; ఆయా యుపదేశముల ననుసరించి యాయాఫలముల నొందును. కర్మల నాచరింపక వచ్చునవి కాకపోవుటచే నీస్వర్గాదులు కర్మలచేతనే బుట్టింపఁబడవలయు ననుట నిర్వివాదమై యున్నది.

ఈమతముపై బూర్వమున మాచేఁ జేయఁబడియున్న యాక్షేపము లెవ్వియు యుక్తియుక్తములు గానేరవు. "క్రియయు భావనయు నొక్కటియా? లేక భిన్నములా" యని వికల్పము చేసికొని మీరు దోషముల చూపియున్నారు. అందు మొదటిపక్షము మాకు సమ్మతము కాకపోవుటచే దాని నాశ్రయించి చూపఁబడినదోషములు మామతములకు

తగులవు. విచారించిన రెండవపక్షము నాశ్రయించి చూపఁబడిన దోష ములును మాకు తగులనేరవు.

(1) భావన యాగాదులను మాత్రమే భావించు ననియు దానిఫల ములను భావింప దనియు నీకారణమువలన పురుషులకు యాగాదు లేవిధముగఁ గూడ నుపకారము చేయఁజాల వనియు దీనివలన నెవ్వఁడును కర్మానుష్ఠానార్థమై ప్రవర్తింపఁ డనియు కర్మకు నధికారియే లేఁ డనియుఁ దలంచి యున్నారు కదా! ఈతలంపు సరియైనది కాదు. విధివాక్యము లుపదేశము లనియు నాకారణమువలన పరప్రయోజనమే వానికి ఫల మనియుఁ బూర్వముననే సయుక్తికముగ నిరూపించి యున్నాము. ఈకారణమువలన భావన కర్మలనే భావించినను కేవలముగ వానిని మాత్రమే భావించి యూరకుండదు; ఫలములను కూడ భావించును. కర్తరిప్రయోగమునందు ద్వితీయాంతముతో వచ్చుకర్మ యప్రధాన మనియు కర్మణిప్రయోగమున ప్రథమాంతమై వచ్చునది ప్రధాన మనియు వ్యాకరణ సంప్రదాయము. ఇట్లగుటచే నాభావన కర్మను భావించినను ప్రధానమగు ఫలమును కూడ భావింపవచ్చును. యజేత యను మొదలగు నవి సకర్మకక్రియ లగుటచే వానికి కర్మలైనయాగాదులు ద్వితీయాంత ములే యనుట నిస్సంశయము. ఇట్లు కాకున్న దుఃఖ మగుటచే కర్మ నపే క్షించువాఁ డెవ్వఁడు నుండఁడు కావున నుపదేశము నిరర్థకము కావలసి వచ్చును. ఇది యెవ్వరికిని సమ్మతము కాదు కదా! అప్పుడు లోకోపకారక మని యంగీకరింపఁబడిన వేదము నిష్ప్రయోజకము కావలసివచ్చును.

(2) మఱియు నాభావనకు కర్మవిధియే సమీపమున నున్నది యనియు ఫల మట్లు లే దనియు నీ కారణములవలన భావన ఫలమును భావింపఁజాల దనియు భావించితిరి. ఇదియు యుక్తము కాదు. ప్రతి పురుషుఁడును "నీవు దీని నాచరింపుము" అని యుపదేశింపఁబడినపుడు "దీనివలన నా కేమి కలుగును?" అనియే విచారించు ననుట సర్వలోక ప్రసిద్ధము. ఈయనుభవము ననుసరించి చూచిన విధిని భావించుటకంటె ముందుగా ఫలమునే భావింతు రనుట స్పష్ట మగుచున్నది. ఇప్పుడు చూడుఁడు; భావనకు సమీపమున నేది కలదో? ఫలమో లేక యాగా దులో నిర్ణయింపుఁడు.

(3) ఇదియును గాక స్వర్గాదులు ద్రవ్యము లనియు కర్మకు సాధనభూతములై మాత్రమే యుండవలయు ననియు మఱియు నవి నామ వాచకముచేఁ జెప్పఁబడుటచేతను సుఖమే స్వర్గ మని లోకప్రసిద్ధి యుం డుటచేతను స్వతస్సిద్ధము లగు ననియు స్వతస్సిద్ధములు కార్యములచే సాధింపఁబడ వనియు జ్యోతిష్టోమాదివాక్యములయందు అవి పురుషునకు మాత్రమే విశేషణములుఁగ నున్నవి కావున క్రియాపదముతో సంబంధింప నేర వనియుఁ గూడ భావించియున్నారు. ఇదియు యుక్తము కానేరదు. సుఖమే స్వర్గ మనుప్రసిద్ధిని మీరు నంగీకరించి యున్నారు కదా! యీ ప్రసిద్ధివలననేయది మఱియొకదానికి సాధనము కానేరదు. విచారించినపురుష ప్రయత్నబలముచే సాధింపఁబడవలసిన యజ్ఞాదులే దానికి సాధనములు కావలసివచ్చును. "ఇట్లయిన వానికి నుత్పత్తియే లేకపోవలయును కదా" అనియెద వేమొ యది నిత్యమే యైనను తత్ప్రాప్తి యనిత్యము కా వచ్చును; కర్మవిధులును ఈయభిప్రాయముతోనే ప్రవర్తింపవచ్చును. మఱియు నవి (స్వర్గాదులు) కర్తకు మాత్రమే విశేషణము లైనను ఆకర్త క్రియాపదార్థ మగుభావనచే బరిగ్రహింపఁబడినవాఁడు కావున వానిమూలమున క్రియచేఁ బరిగ్రహింపఁబడును.

(4) సాధ్యము లగు రెండువిషయము లొక్కవాక్యమునందుఁ జెప్పఁ బడి యుండినచో వాక్యభేదము కలుగు నంటిరి కదా! ఇదియు చక్కని యభిప్రాయము కానేరదు. అప్పుడు ఆసాధ్యములకు రెంటికిని స్వభావ మొక్కటియే యై యుండవలయును; ప్రస్తుత మట్లు లేదు. పురుషుఁడు ఫలమును నిశ్చయించి దానికై ప్రవర్తించుచు తత్సాధనముగా గర్మను భావించుచున్నాఁడు. ఫలమును మాత్ర మట్లు కాక నన్నింటికంటె ముందు గనే స్వతంత్రముగా భావించుచున్నాఁడు. ఇట్లగుటచే భావన యొక్క టియే యైనను విషయస్వభావములు భిన్నములగుటచే వాక్యభేదము కలు గదు. సమానస్వభావము లగువిషయముల నాశ్రయించియే కదా వాక్య భేదము కలుగవలయును. కావున మీరు చెప్పినపూర్వపక్షము లేవియును యుక్తియుక్తములు కానేరవు. పైనవర్ణించినవిధముగ కర్మఫలములకు సంబంధముండుటచే నధికారి యవశ్యముగఁ గలఁడు. ఈనిరూపణమువలననే మొదటిపక్షము నాశ్రయించి (భావనాక్రియ లొక్కటి యనుపక్షము నాశ్రయించి) చూపఁబడినదోషములు కూడ పరిహరింపఁబడినవి.

"ఈదోషము లోకవేళ లేకపోయినను మఱియొకదోషము వచ్చును. యాగంబులును స్వర్గాదులునుగూడ భావనచే భావింపఁబడదగినవి యగునేని యప్పుడు స్వర్గాదులవలె యాగములుకూడ కేవలసాధ్యము లే కావలసివచ్చును; స్వర్గాదిసాధనములు కాకపోవలసివచ్చును. ఇది సంభవింపదు కదా ?" అనియెదవేమొ. ఇది యొకదోషము కాదు. సాధనములైనను భావనచే భావింపఁబడవచ్చును. లోకమునందు గండ్రగొడ్డలిమొదలగుసాధనములుకూడ కార్యముల నాచరించునప్పుడును, ఆచరింపఁబోవునప్పుడును భావింపఁబడుచునే యున్నవి కదా ! ఈయనుభవమునకు విరుద్ధముగ "సాధనముల నెవ్వరును భావింపరు" అని సాధింపఁ జూచిన నప్పుడు మూలోచ్ఛేదము కలుగును. అప్పుడు కర్మలే జరుగవుకదా! కావున మా మతముపై (జైమినిమతముపై) నీదోషము రాదు. మఱియు మీయభిప్రాయమే యంగీకరించి భావనకును ఫలమునకును వ్యవధానము కల దని యంగీకరించినను మామతమునకు హాని రాదు. ఫలము సర్వవ్యాపకమగుటచేతను దాని నుద్దేశించియే కర్మ యాచరింపఁబడుచుండుటచేతను అవశ్యముగ యాగాదిభావన ఫలము నాశ్రయించియే తీరవలయును కదా ! కావున యజ్ఞాదికర్మలయందు పురుషులకు నధికారము కల దనుట నిస్సంశయము.

మీపక్షము నాశ్రయించి యధికారము లేదని యంగీకరించిన మీకును బ్రయోజనము లేదు. దేహాత్మాభిమానమును అధికారిభేదమును మఱిదేనిని లయము నొందింపవలయు ననినను అధికారము మొట్టమొదట నుండవలయును కదా! ప్రయోజనము నెఱుంగక సామర్థ్యము లేక నుండువాఁ డేకార్యమును చేయఁగలఁడు? బ్రహ్మైక్యమునకై యత్నింపవలయు నన్ననో తత్ప్రయోజనము నెఱింగియే యుండవలయునుకదా ! మఱియు దేహాభిన్నుఁ డగుజీవుఁ డొక్కఁడు కలఁ డనువిషయము విధివాక్యముల వలన మీ కెట్లు తెలిసినది ? ఈవిధివాక్యము స్వర్గఫలమును గూర్చి చెప్పునది యగుటచేతను ఆస్వర్గము దేహమును విడిచినపిదప ననుభవింపఁబడవలసినది యగుటచేతను మాత్రమే కదా ! ఈదేహమునకంటె వేఱై జీవుఁ డుండవలయు నని కదా మీరు నిర్ణయించితిరి. యాగాదులయందు జీవునకు నధికారమే లేకున్న స్వర్గఫలభోగ మెక్కడిది? దాని ననుసరించి నిర్ణయింపఁబడిన దేహాత్మభేద మెక్కడిది? ఈకారణములవలన

మీారును ఇష్టము లేకపోయినను జీవునకు కర్త్రాధికారము నంగీకరింప వలయును. మఱియు స్పష్టముగ దెలియవచ్చుచున్న యర్థమును విడిచి క్లిష్టకల్పన నాచరించుటయు యుక్తము కాదు. పరబ్రహ్మవిషయమును చెప్పకుండినంతమాత్రమున శాస్త్రమునకు కలుగుహానియు లేదు. స్వర్గాది సుఖసాధనములఁ జెప్పినను శాస్త్రము శాస్త్రము కావచ్చును. కామ క్రోధాదుల నభివృద్ధిచేయు ననుట యొకదోషము కాదు. అవి స్వాభావి కములై లోకము నాక్రమించి యున్నవి. శాస్త్ర మనునది వారికిని హితము నుపదేశింపవలసినదియే. ఎవ్వనియధికారమునకు నేది యుచితమో దాని నుపదేశించుటచే సర్వజనహితకర మై వేద మొప్పుచున్నది. హితోపదే శము నాచరించుటయే కదా శాస్త్రమునకు లక్షణము. ఈకారణము వలన మామతమునకు నెట్లును హాని రాదు.

మఱియు దేవత లెట్లును ఫలప్రదాతలు కానేరరు. వారు ఆజ్య పురోడాశాదులవలె (నెయ్యి పిండి మొదలగు హోమద్రవ్యములవలె) యాగసాధనములలో జేరినవారేకాని స్వతంత్రులు కారు. యాగము నాచరించినవాఁడు మాత్రమే స్వర్గము నొందుటయు కేవల మగు నీశ్వరో పాసనవలన నట్టిఫలము లేకుండుటయు నీవిషయమున ప్రమాణము మంత్రార్థవాదాదులయందు దేవతల కిట్టిసామర్థ్యము కల దని చెప్పఁబడి యున్నది కాని యది ప్రత్యక్షప్రమాణమునకు విరుద్ధ మగుటచే నంగీ కారము కాదు. దేవతలు మనకు గానవచ్చుటలేదు. వారికి దేహాదు లున్నవి యనుటయు ప్రమాణసిద్ధము కాదు. దేహాదులు లేకుండిన వారికి ఫలముల నొసంగుసామర్థ్య ముండదు. ఇట్లున్న నిక వారినిఁగూర్చి ప్రస్తా వింప నేటికి? మఱియు కొన్నిస్థలములయందు మండూకాది క్షుద్రజంతువు లును వృక్షమునుకూడా హవిస్సును భుజించి తృప్తినొంది యజమాను నకు ఫలము నొసంగు నని చెప్పఁబడియున్నది. ఇది ప్రామాణిక మని యెవ్వ రును చెప్పసాహసింపరు కదా! ఇట్లే దేవవిషయ మగు శ్రుతి కూడా కర్మప్రశంసావిషయ మగు నర్థవాదమే యగును కాని ప్రామాణిక వాక్యము కానేరదు. కావునఁ గర్మయే ఫలదాత.

ఈవిధముగా ప్రతివిధికిని విషయ (అధికారిఫలములు) మవశ్య ముగ నుండవలసివచ్చుటచే నదియే కర్మఫలదాత యని సిద్ధాంతము చేయఁ బడెను; అయినను ఆకర్మ యల్పకాలమునకే నశించును గావున దానికిని

ఫలమునకును నడుమ నేదియో యొక యనుబంధ ముండి తీరవలయును. దానికే మామతమున నపూర్వ మని పేరు పెట్టితిమి. అది చేయఁబడిన యాగాదికర్మలయొక్క వ్యాపారభేదమే యగును. వ్యాపారము నాచరించువాఁడు లేకున్నను వ్యాపార ముండవచ్చు ననుటలో విరోధము లేదు. క్షీరపానము నాచరించుట యనుకర్మ యప్పుడే నశించిపోయినను దానివలనఁ గలిగినకార్యము ఫలము కలుగునంతవఱకు (శరీరమునకు పరిపూర్ణపుష్టి కలుగునంతవఱకు) ననువర్తించుచునే యుండునుకదా! ఇట్లే యపూర్వము కూడ ఫలకాలమువరకు నుండును. ఇట్లు కాకున్నను ఆయపూర్వము ఫలముయొక్క పూర్వావస్థయే యనియుఁ జెప్పవచ్చును. ఎట్లును అపూర్వ మూలమున కర్మయే శుభాశుభఫలముల నొసంగు ననవలయుఁగాని యీశ్వరుఁడు కాఁడు. ఆయన నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వభావుఁ డగుటచే నానావిచిత్రము లగునీఫలముల నొసంగఁడు. యీ ఫలముల నాయనయే యొసంగునేని స్వతంత్రముగ నొసంగునా? లేక కర్మసహితుఁడై యొసంగునా? మొదటిపక్షమున విషమత్వంబును దయాహీనత్వంబును కలుగును; రెండవపక్షము నాశ్రయించినను పుణ్యాత్ములపై ప్రీతియు పాపాత్ములపై ద్వేషంబును గలుగవలసివచ్చును. ఏదియైనను అనర్థమే. ఈకారణమువలన యాగాదులే ఫలదాతలు. ఇదియే యుక్తియుక్త మగుసిద్ధాంతము.

## అ-3. పా-౨. సూ-౪౧.

అవతారిక:—ఈవిధముగ పూర్వపక్షమును నిరూపించి సిద్ధాంతమును చేయుచున్నాఁడు.

## ३६०. పూర్వం తు బాదరాయణో హేతువ్యపదేశాత్. 3. ౨. ౪౧.

తాత్పర్యము:— వ్యాసమహామునియభిప్రాయముమాత్ర మిది కాదు. జైమినిముని యాశ్రయించినపక్షమును కేవల కర్మగాని యపూర్వముగాని ఫలము నొసంగు ననుపక్షము యుక్తియుక్త మైనది కా దని వారియభిప్రాయము. వా రిట్లు చెప్పుదురు:

విచారించిన నపూర్వ మనుదానిని కల్పించుటకే వీలు లేదు. దేనిని కల్పించినను ప్రత్యక్షము ననుసరించియే కల్పింపవలయును గాని తద్విరుద్ధముగి గల్పింపరాదు. శ్రుతియందు ప్రత్యక్షముగఁ జెప్పఁబడి యున్నదాని నెట్లయినను గ్రహింపవచ్చునుగాని స్వబుద్ధికల్పిత మగు దానినిమాత్ర (ప్రత్యక్షవిరుద్ధమైనదానిమాత్ర) మంగీకరించుటకు వీలు కాదు. కర్మయైనను దానివలన జనించు నపూర్వమైనను అచేతనములే యనుట నిస్సంశయము. లోకమున నచేతనములకు చేతనసహాయము లేకపోయిన ఫలము నొసంగుసామర్థ్యము ఏకార్యమునైన నాచరించు సామర్థ్యము లేదనుట స్పష్టము. కుమ్మరవానిసహాయము లేక మట్టి కుండ యగుట లేదు; తంతువాయునిసహాయము లేక దారములు వస్త్ర మగుట లేదు. ఈకారణమువలన నాకర్మాదులు గూడ చేతనసహాయము నపేక్షించుచునే యున్నవి యనవలయును. ఆతఁడే పరమేశ్వరుఁడు. "గాలి మెఱుపు మొదలగునవి పరసహాయము లేకయే ప్రవర్తించుచున్నవి కదా!" అనియెదవేమొ. అచ్చటగూడ నీవిషయము (పరమేశ్వరసహాయము కలదా? లేదా? యనువిషయము) విచారణీయమే యగుటచే నవి ప్రస్తుతవిషయమునకు దృష్టాంతరములు కానేరవు. "ఇట్లయిన నీవిషయమునుగూర్చి మీరు అధికముగఁ జెప్ప నక్కఱ లేదు. ఈవిషయమును క్రొత్తగా సాధించుటకును బ్రయత్నింప నక్కఱ లేదు. జీవుఁడు సర్వకర్మములకు నధిష్ఠాత యై యున్నాఁడు కదా" అనియెదవేమొ యది సరి కాదు. ఆజీవుఁడు కించిజ్జ్ఞుఁడగుటచే నాతనికి ఫలము కలుగునంతవఱకు కర్మవిషయ మగుపరిపూర్ణజ్ఞానము కలుగదు. కావున నాతఁడు ఫలము నొసంగనేరఁడు. కర్మతారతమ్యములును మనస్థైర్యాదులునుగూడ నెఱింగి గదా ఫలము నొసంగవలయును. అట్టి శక్తి జీవునికి లేదు. ఆతఁడు మఱియొకనిచే నొసంగఁబడిన ఫలముల ననుభవింపవలసినవాఁడేకాని స్వయముగ ఫలముల నొసంగువాఁడును కాఁడు. తనసేవకులు మొదలగువారికి నొకవేళ నట్టి ఫలముల నొసంగినను తనకుదానే యొసంగనేరఁడు కదా! కావున జీవభిన్నుఁడగుపరమేశ్వరుఁడే కర్మాపూర్వములకుఁ గూడ నధిష్ఠాత యగుచున్నాఁడనవలయును. ఇట్లుండ నాతనియనుగ్రహమే సర్వఫలదాత యగుచుండఁ గ్రొత్తగా నపూర్వమును కల్పింప నేటికి? కర్మఫలము

లకు నడుమ నవకాశ మధికముగ నున్నను ఈశ్వరుఁడు నిత్యుఁ డగుటచే నాయనయొక్క యనుగ్రహము యజ్ఞకాలము మొదలు ఫలకాలము వఱకు నుండవచ్చును కదా! కావున నపూర్వమును కల్పించుటయే మొట్టమొదట యుక్తము కాదు; కల్పించినను కేవలయజ్ఞమే ఫలదాత యనినను అవి యచేతనము లగుటచే బరమేశ్వరసహాయము లేక ఫలము నొసంగనేరవు. ఇంద్రాదిదేవతలును మనకుఁ గానరాకున్నను యోగులకుఁ గానవచ్చెద రనియు వారికి ఆకారాదులును యాగాదులచే తృప్తినొంది ఫలము నొసంగుసామర్థ్యంబును కల దనియు మంత్రార్థవాదాదులు ప్రమాణములే యనియు దేవతాధికరణమున (సూ. పు. ౧. ౩. ౨౬, ౨౭.) స్పష్టముగ నిర్ణయించియే యున్నాము. కావున నొక పరమేశ్వరుఁడే యింద్రాదిరూపములతో నాయాఫలముల నొసంగు ననుటయే సిద్ధాంతము. ప్రస్తుతకాలమున నశించుకర్మ దేహావసానానంతరమునఁ గలుగఁ బోవుఫలముల నొసంగు ననుట ప్రత్యక్షవిరుద్ధ మగు ననియే కదా మీరు (జైమినిమతస్థులు) అపూర్వమును కల్పించితిరి; ఇట్లే యిచ్చటకూడ అచేతనములకు స్వతంత్రవ్యాపారము కల దనుట ప్రత్యక్షవిరుద్ధ మగుటచే చేతనసహాయ మవశ్యముగాఁ గల దని కల్పింపవలయును. ఇందు విరోధ మేమి ?

శ్రుతిస్మృతులును ఈవిషయమును స్పష్టముగఁ జెప్పుచున్నవి. “ఏష హ్యేవ సాధుకర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతే ఏష ఉ ఏ వాసాధుకర్మ కారయతి తం య మధో నినీషతే” అను మొదలగుశ్రుతివాక్యములయందు పరమేశ్వరుఁడే కర్మలఁ జేయించువాఁడనియు ఫలముల నొసంగువాఁ డనియుఁ గూడఁ జెప్పఁబడి యున్నది. “యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి, తస్య తస్యాచలాం శ్రద్ధాం తా మేవ విదధా మ్యహం. న తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే, లభతే చ తతః కామా న్మయైవ విహితా న్హి తాన్” “ఏయేపురుషుఁడు ఏయేదేవతను శ్రద్ధతో పూజింపఁ దలంచునో వానివానికి ఆయాదేవతయందే స్థిరమైనశ్రద్ధను నేనే (కృష్ణుఁడనే) యొసంగుదును. ఆపురుషుఁడును అట్లు శ్రద్ధావంతుఁడై యాదేవతనే భక్తితోఁ బూజించును పూజానంతరమున నిష్టఫలములఁ బొందును.

ఆఫలములను కూడ నొసంగువాఁడను నేనే" అని స్పష్టముగనే భగవద్గీతలయం దీవిషయము బోధింపఁబడియున్నది. మఱియు సర్వశ్రుతులయందును సృష్టి పరమేశ్వరకర్తృకముగానే బోధింపఁబడియున్నది కదా! ఈ కారణమువలనఁ గూడ పరమేశ్వరుఁడే ఫలదాత యని స్పష్ట మగుచున్నది. ఆయన సృజించువాఁడైనప్పుడు కర్మానుగుణముగనే సృజింపవలయును కదా! లోకమున సర్వంబును కర్మాధీనమయ్యే ప్రవర్తించుచున్నది యనుటయు నిర్వివాదము. కర్మలకు ఫలము నొసంగుసామర్థ్యమీాయనకు లేకుండిన నిట్టిసృష్టి జరుగుట యెట్లు సంభవించును? కావున సృష్టినిఁగూర్చి చెప్పు శ్రుతు లన్నియు నీఫలదాతృత్వమును గూర్చి చెప్పునవియే యగును.

ఆపరమేశ్వరుఁడును స్వతంత్రముగ ఫలము నొసంగనేరఁడు. అట్లొసంగు ననిన దోషములు కూడ వచ్చును. ఆయన యప్పుడు విషముఁడును నిర్దయుండును కావలసి వచ్చును. కావున నాయనకుఁ గూడ ఫలముల నొసంగువిషయమునఁ గర్మాపేక్ష కావలయును. జీవు లొనరించిన కర్మల నాశ్రయించియే యాయన ఫలముల నొసంగును. ప్రభువగువాఁడు సద్గుణవంతుల పుణ్యకార్యపరుల గౌరవించి చోరాదుల శిక్షించునట్లు ఈపరమేశ్వరుఁడును పుణ్యాత్ములకు శుభఫలముల నొసంగి పాపాత్ములకు దుఃఖఫలముల నొసంగును. ఈఫలములకు వారికర్మలే కారణ మగుటచేఁ బరమేశ్వరునకు నిర్దయత్వాదులు కలుగవు. ఇట్లు కర్మలకు పరమేశ్వరసహాయంబును పరమేశ్వరునకు కర్మసహాయంబును గూడ గావలసియే యున్నను చేతనుఁ డగుటచే పరమేశ్వరుఁడే ప్రధానుఁడు. కావున నాయనయే ఫలదాత. పైనవర్ణించినవిధముగా గర్మలును కావలసినవియే కావునఁ దదనుష్ఠానము కూడ నిరర్థకము కానేరదు. వంటచేయునప్పుడు వంటవాఁడు లేకున్నను కట్టెలు లేకున్నను గూడ పాకము జరుగదు. చేతనుఁ డగుటచే వంటవాఁడే యందు ప్రధానభూతుఁడు. కట్టియలను సంపాదించుటయు నిరర్థకము కానేరదు. ప్రస్తుతవిషయమునఁ గూడ నిట్లే యూహించునది.

మఱియు యాగాదులు దేవపూజారూపము లైనవి కదా! అవి దేవతకు ననుగ్రహమును కలిగింపక ఫలముల నెట్లొసంగఁగలదు? ఒకఁడు

రాజసేవ చేయుటకు నారంభించిన రాజానుగ్రహము కలుగకుండ వానికి తత్ఫలము కలుగుచున్నదా? ఈకారణమువలన ఫలమునకు బరమేశ్వరానుగ్రహమే ప్రధాన మగుచున్నది; అనిష్టఫలములకును తన్నిగ్రహమే కారణమగుచున్నది. శుభాశుభకర్మలు పురుషునిచే నాచరింపఁబడి పరమేశ్వరుని యనుగ్రహాయత్తు నైనను నిగ్రహాయత్తు నైనను గావించుననియు యాయనుగ్రహనిగ్రహములవలననే యిష్టానిష్టఫలములు కలుగుననియు మాత్రమే సిద్ధాంతము చేయవలయును. ఇట్లగుటచే నపూర్వకల్పనతోనే పని లేదు.

బ్రహ్మసూత్రార్థచంద్రికయందు తృతీయాధ్యాయమున
ద్వితీయపాదము.



# బ్రహ్మసూత్రార్థచంద్రిక



## తృతీయాధ్యాయము - తృతీయపాదము

### పాదావతారిక

ద్వితీయపాదమునందు తత్త్వంపదార్థములు నిర్ణయింపఁబడినవి. తచ్ఛబ్దమునకు వాచ్యార్థ మగు సగుణబ్రహ్మంబును లక్ష్యార్థ మగునిర్గుణ బ్రహ్మంబును విమర్శింపఁబడెను. ఆసిద్ధాంతమును కారణముగఁ గొని యీపాదమునందు మహావాక్యార్థము సిద్ధాంతము చేయఁబడును. సర్వ వేదాంతవాక్యములయొక్క తాత్పర్యము స్థిరము చేయఁబడును. ప్రథ మాధ్యాయమునందే యీపని కొంతవఱకు చేయఁబడెను కాని యిచ్చట నది సంపూర్ణముగ ముగింపఁబడును. ఆయధ్యాయమున "ఇది సగుణ వాక్యము ఇది నిర్గుణవాక్యము" అని మాత్రమే వర్ణింపఁబడెను; ఇచ్చట భిన్నప్రకరణములయం దున్నయుపాసనలకు గలపరస్పరసంబంధము విచా రింపఁబడును. కావున నీరెండుపాదములకును గలసంబంధము కార్యకారణ భావసంబంధము.

సగుణోపాసనలును చిత్తమును నిర్మలము గావించి నిర్గుణబ్రహ్మ జ్ఞానమును జెందుసామర్థ్యము నొసంగునవి యగుటచే నిట్లు విచారింపఁ బడుచున్నవి. ఉపాసనలకు వేఱువేఱుప్రకరణములయం దున్నను భేదము లేదనియు ఒక్కనింగూర్చియే యవి చెప్పు ననియు సిద్ధాంతము చేయఁ బడును. ఈసిద్ధాంతమువలన భ్రాంతిచే సగుణబ్రహ్మయందుఁ గల వని తలంపఁబడుచున్న భేదము లన్నియు తొలఁగిపోయిన ట్లగును. ఇప్పుడు

తత్పదవాచ్యార్థ మేకరూప మగును. లక్ష్యార్థంబును దీని నాశ్రయించి యట్టిదియే యగును. దీనిచే మహావాక్యార్థము సిద్ధించును. ఇంతమాత్ర మేగాక కొన్నికొన్నివిశేషములఁ దెల్పుటకై భేదముకూడ (ఉపాసనా భేదము కూడ) నచ్చటచ్చట విచారింపఁబడును. నిర్గుణవిద్యలయందు మాత్ర మిట్టిభేదము లేకపోవుటచే నవి యన్నియు నొక్కటియే యనుట నిస్సంశయ మగుటచే వానినిఁగూర్చి యిందు విచారింపఁబడ లేదు.

పూర్వపక్షము:—ఈపాదముతో నుపయోగమే లేదు. ఇందు చేయఁ బడినవిచారమే యావశ్యకమైనది కాదు. పరమేశ్వరుఁడు సర్వవ్యాపకుఁ డనియు పూర్వాపరములు లేనివాఁ డనియు ఏకస్వరూపుఁ డనియు ఉపాధి భేదములతోఁగూడ సంబంధము లేనివాఁ డనియు నిదివఱకే నిర్ణయింపఁబడి యున్నది కదా! ఆయననుగూర్చి యెన్నిస్థలములయందు ప్రస్తావ మున్నను ఒకటేవిధముగ నుండవలయునుగాని మఱియొకవిధముగ నుండఁగూడదు. ఇట్లుండ నావిషయమున భేదాభేదవిచార మేటికి? పదార్థము లనేకములై యుండిన గదా తత్ప్రస్తావములును అనేకములు అనేకరూపములు కావల యును. కర్మకువలె వేదము బ్రహ్మమునకు బహురూపములఁ జెప్ప దలంచియుండ లేదు కదా! మఱియు విషయ మొకతీరున నుండిన జ్ఞానము మఱియొకతీరున నుండు ననుట యుక్తము కాదు. అప్పు డది భ్రాంతియే యగును కదా! ఇట్లు కాక “పరమేశ్వరుఁ డొక్కఁడే యైనను వేదమునందు ఆయననుఁగూర్చి జ్ఞానములు బహువిధములుగఁ జెప్పఁబడియున్నవి. అం దొక్కటిమాత్రమే ప్రధానము. తక్కినవి భ్రాంతిసిద్ధములు” అని చెప్పఁ బోయిన నదియును యుక్తము కాదు. అప్పుడు వేదమునం దెవ్వరికిని నమ్మక ముండదు కదా! కావున “పరమేశ్వరుని విషయమున వేదమునం దనేకవిధ ములుగఁ జెప్పఁబడియున్నది. వానికి పరస్పరభేదము కలదా? లేదా?” అని సందేహపడుటచే మొట్టమొదట వీలు లేదు; ఒకానొకఁడు మూర్ఖుఁడై యెట్లు సందేహపడినను “ప్రేరణ కలదు కావున నన్నియు నొక్కటియే” యని సిద్ధాంతము చేయుటకు వీలు లేదు. ఈసూత్రకర్తయే “తత్తు సమ న్వయాత్. ౧. ౧. ౪.” అనుసూత్రమున “వేదాంతవాక్యములు కర్మ వాక్యములవలె విధిరూపములు కావు. అవి వస్తుస్వరూపమును మాత్రమే బోధించునవి” అని సిద్ధాంతము చేసియున్నాఁడు. ఇట్లుండ నిప్పుడు మఱల దద్విరుద్ధముగా నెట్లు బ్రహ్మజ్ఞానభేదాభేదవిచారము నారంభించెను?

సగుణునిఁ గూర్చియే యీవిచారము జరుగు నందురేమో కాని యీతఁడు మాత్రము శుద్ధబ్రహ్మాభిన్నుఁడా?

సిద్ధాంతము:—ఇట్లు సంశయింప నక్కఱలేదు. ఈపాదమునందు శుద్ధబ్రహ్మమును గూర్చి విచారింపఁబడుట లేదు. పరమేశ్వరుఁడు సగుణ నిర్గుణరూపములతో రెండువిధములుగ నున్నాఁడని యిదివఱకే నిరూపించి యున్నాము. అందు నిర్గుణుండు నిత్యశుద్ధుఁడై ఉప్పుఱాయి లవణరసము మాత్రమే యైనట్లు జ్ఞానరసమాత్రుఁడే యై యున్నాఁడు; సగుణుఁడన్ననో ఉపాధికల్పితనానాభేదములతోఁ గూడి యున్నాఁడు. వాస్తవస్థితిలో సగుణనిర్గుణులకు భేదము లేకున్నను ఉపాధికల్పితభేదము కలదు; లోకానుభవగమ్య మగుటచే నది విచారణీయము కూడ నగును. ఇంతయే గాక ప్రాణాదులను పరబ్రహ్మరూపముతో నుపాసింపవలయు నని చెప్పు నుపాసనలుఁ గూడ ననేకములు గలవు. వానినిఁ గూర్చి కూడ విచార మారంభింపవలసినదియే కదా! ఆయుపాసనలును కర్మలవలెనే బహువిధములుగ జెప్పఁబడి యున్నవి. బహుఫలములను గూడ కలిగించు నవియై యున్నవి. కొన్నియుపాసనలు పాపమును నాశము చేయును; కొన్ని ఐశ్వర్యాదుల నొసంగును. మఱికొన్ని *క్రమముక్తి నొసంగును. ఇట్లగుటచే కర్మలకువలెనే వీనికిని పరస్పరభేదాదు లుండవచ్చును. కావున నీపాదమునందలి విచారము సార్థకమైనదియే. విషయభేదము లేదనియు ఉపాసనాప్రకరణము లన్నియు నొక్కదానినిమాత్రమే చెప్పు ననియు సిద్ధాంత మయ్యెనేని యప్పుడు మఱియొకమాఱు తత్త్వవాచ్యార్థ మేకరూప మనియు తదనుసారముగ లక్ష్యార్థము కూడ నేకరూపమే యనియుఁ దేలును. కావున నీపాద మత్యావశ్యకము.

## అధికరణావతారిక

ఈపాదమునందలి యన్ని యధికరణములకును ఉపాసనలకు గలయభేదమును స్థాపించుటయే సామాన్యమగు విషయము. ఉపాసనలు ప్రత్యేకస్థలములయం దున్నను వానియం దున్నవిషయముల నొకస్థలమునఁ

* క్రమముక్తి. (అ-౩. పా-౧ సూ-౧౨. పే-౪౦ చూ.)

జెప్పఁబడినవానిని మఱియొకస్థలమునకుఁ గూడ దెచ్చుకొనవలయు నను విషయమును నిరూపించుటయే ఇందలి సర్వాధికరణములయందును సామాన్యముగఁ జేయఁబడియున్న సిద్ధాంతము. ఉపాసనా ప్రకరణములు పరస్పరము భిన్నము లనుట పూర్వపక్షము; గా దనుట సిద్ధాంతపక్షము.

"లోకమునందు ఎచ్చటెచ్చట నామధేయములు భిన్నములుగ నుండునో అచ్చటచ్చట భేదము భావింపఁబడుచున్నది. ప్రస్తుత వేదాంతములయందును కాఠకము వాజసనేయము" అను మొదలగు నామభేదములు గానవచ్చుచున్నవి. మఱియు స్వరూపమునందును భేద ముండినపదార్థమునకు భేదము కలుగు ననుట సిద్ధాంతమే. ప్రస్తుతోపాసనలయం దట్టిభేదముకూడ కలదు. కొన్నిశాఖలవారు పంచాగ్నివిద్యయం దైదగ్నులను మాత్రమే చెప్పుచున్నారు. మఱికొంద రాఱగ్నులను వర్ణింపుచున్నారు. ప్రాణేంద్రియసంవాదాదులను చెప్పు నప్పుడు కొందఱు కొన్నియింద్రియములనుమాత్రమే చెప్పుచున్నారు. మఱి కొందఱు మఱికొన్నిటిని గూడఁ జెప్పుచున్నారు. ఇదియునుఁగాక కొన్ని కొన్ని ధర్మములు గూడ శాఖాభేదము వలన భిన్నములుగ నున్నవి. ఆథర్వణశాఖయందు *శిరోవ్రత మనునది యొక్కటి గలదు; తక్కినశాఖలయందు లేదు. ఇట్లు "నామమునందును రూపములయందును ధర్మమునందును గుణములను వర్ణించుట మొదలగువానియందును పరస్పర భేద ముండుటచే నుపాసనలు పరస్పరభిన్నములే" అనునది సర్వసామాన్యముగ పూర్వపక్షస్వరూపము. ఇతర విషయము లెచ్చటి కచ్చటనే తెల్పఁబడును.

---

## ౧. సర్వవేదాంతప్రత్యయాధికరణము.

విషయము:—అందు మొట్టమొదట నీయధికరణమున సామాన్యముగ "ఉపాసనలకు బరస్పరవిరోధము లేదు" అనువిషయము నిర్ణయింపఁబడును.

---

* శిరోవ్రత మనఁగా శిరస్సునందు అంగారపాత్రము నుంచుకొనుట. ఇట్లుంచ కొనియే యథర్వణవేదము అధ్యయనముఁ జేయవలయును.

సంగతి, సంశయము, పూర్వపక్షము:—ఇది మొదటి యధికరణము కావున దీనికి పాదమునకుఁ బూర్వపాదముతోఁ గల దని చెప్పఁబడినసంగతికంటె నితరసంగతి లేదు. సంశయ పూర్వపక్షములు పూర్వమునందే నిర్ణయింపఁబడినవి.

## అ_౩. పా_౩. సూ_౧.

అవతారిక:—అధికరణావతారికయందు నిరూపింపఁబడిన పూర్వపక్షమును సామాన్యముగ నీయధికరణమున నివారింపుచున్నాఁడు.

## ౩౬౧. సర్వవేదాంతప్రత్యయం చోదనాద్యవిశేషాత్. ౩. ౩. ౧.

తాత్పర్యము:—బాగుగ విచారించిన నీపూర్వపక్షము యుక్తియుక్తమైనది కాదు. ఉపాసనలు శాఖల ననుసరించి భేదింపవు. ఒక్కయుపాసనయే నాలుగైదుశాఖలయందు చెప్పఁబడిన నది యొక్కటియే యగును కాని భిన్నము కానేరదు. ఆయాయుపాసనలయందు విధింపఁబడిన పురుష ప్రయత్నంబును కలుగు నని చెప్పఁబడిన ఫలంబును ఉపాసింపఁదగినవారుగా నిర్దేశింపఁబడిన దేవతలును వ్యవహారార్థమై విధింపఁబడిన ప్రాణవిద్య మొదలగు నామధేయంబులును సర్వశాఖలలోను సమానముగనే యున్నవి కదా!

అగ్నిహోత్రాదులనుగూర్చి చెప్పుచు సర్వశాఖలయందును "హోమము చేయవలయును" అని యెట్లు పురుషప్రయత్న మేకరూపముగనే చెప్పఁబడుచున్నదో అట్లే "యోహ వై జ్యేష్ఠంచ శ్రేష్ఠంచ వేద" "ఎవ్వఁడు జ్యేష్ఠుఁడును శ్రేష్ఠుఁడు నగుప్రాణము నెఱుంగునో" అని వాజసనేయ (బృహదారణ్యకోపనిషత్తు) ఛందోగశాఖలయందు జ్ఞానరూప మగు పురుషప్రయత్నము సమానముగనే నిర్దేశింపఁబడెను. "జ్యేష్ఠ శ్చ శ్రేష్ఠ శ్చ స్వానాంభవతి" "ఇట్లు తెలిసికొనినవాఁడు స్వజనులలో జ్యేష్ఠుఁడును శ్రేష్ఠుఁడు నగును' అనిఫలము కూడ సమానముగానే వర్ణింపఁబడెను. ఏశాఖయందుఁ జెప్పఁబడియున్నను ఏకయాగమునకు దేవతా ద్రవ్యము లేకము లేదై యుండునట్లు ఈ రెండుశాఖలయందును (వాజసనేయ-ఛందోగశాఖల

యందును) సమానోపాసనలకు దేవతలు సమానములుగనే యున్నవి. ప్రాణోపాసనకు నేశాఖయం దైనను ప్రాణమే దేవత; పంచాగ్ని విద్యకు నగ్నులే దేవతలు; ఇఁక నామధేయములను గూర్చి విచారింపనే యక్కఱ లేదు. కాఠకశాఖ యనియు వాజసనేయశాఖ యనియు శాఖలకు నామభేద మున్నను విద్యలకుమాత్ర మది లేదు. ప్రాణవిద్య సర్వశాఖలయందును ప్రాణవిద్యయే. ఈకారణములవలన నెన్నిశాఖలయందుఁ జెప్పఁబడి యున్నను యేయుపాసన యాయుపాసనయే యగును కాని యన్యము కానేరదు.

## అ-3. పా-3. సూ-౨.

అవతారిక:—ఇట్లు సామాన్యముగఁ జెప్పి మఱికొన్ని పూర్వపక్ష విశేషముల ననువాదపూర్వకముగ ఖండించుచున్నాఁడు.

## ౩౯-౨. భేదాన్నేతి చేన్నైకస్యామపి. 3. 3. ౨.

తాత్ప. పూర్వ:—పైసూత్రమునఁ జేయఁబడినసిద్ధాంతము యుక్తియుక్తము కాదు. పురుషప్రయత్నంబును ఫలంబును నామధేయంబును మీ రన్నట్లు సర్వశాఖలయందు నొక్కటిగనే యున్నను కొన్నికొన్ని యుపాసనలయందు స్వరూపభేదము కలదు. పంచాగ్నివిద్యను వర్ణించు నప్పుడు బృహదారణ్యకోపనిషత్తునందు "త స్యాగ్ని రేవాగ్ని ర్భవతి" "ఈయాహుతికి ప్రత్యక్ష మగునగ్నిహోత్రమే యగ్ని యగును" అని ఆరవయగ్ని చెప్పఁబడి యున్నది; ఛాందోగ్యోపనిషత్తునందు అది లేదు. "ఇది పురుషప్రయత్నఫలనామములనుబట్టి చూచిన నొక్కటియే యగుటచే రూపమునం దొకస్థలమున నొక విశేషము గానవచ్చినను దానిని ఇతరస్థలమునకుఁ దెచ్చికొనవచ్చును" అనియెదవేమొ అదియు సరికాదు. ఇది పంచాగ్నివిద్య యగుటచే నారవయగ్ని యుండుటకు వీలు లేదు. ఇట్లుండ నీరెండు నేకవిద్య యగుట యెట్లు? మఱియు ప్రాణేంద్రియసంవాదమును చెప్పునప్పుడు కూడ నిట్టి రూపభేదమే గానవచ్చుచున్నది. ఛందోగశాఖయందు ఆసందర్భమున ముఖ్యప్రాణముగాక తక్కినవి నాల్గుమాత్రమే చెప్పఁబడియున్నవి. వాక్కు, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు అనునాల్గు మాత్రమే వర్ణింపఁబడి యున్నవి. అది యేసందర్భమున

వాజసనేయశాఖయందు "రేతో వై ప్రజాపతిః" "రేతస్సే ప్రజాపతి" అని ప్రజాపతిరూప మగునైదవపదార్థముకూడ ప్రస్తావింపఁబడియున్నది. ఇట్లుండ రెండుసందర్భములు నొక్కటి యగుట యెట్లు? ఈవిశేషముల వలన తెలియఁబడఁదగినవిషయములు పరస్పరభిన్నము లగును; దీనిచే విద్యలును భేదించును. ద్రవ్యములును (హోమద్రవ్యములును) దేవతలును భేదించిన యాగమునకు భేదము వచ్చుచున్నదికదా! కావున కొన్ని యుపాసనలు కాకున్న గొన్ని యైనను పరస్పరభిన్నములే యగును.

సిద్ధాంతము :— ఈపూర్వపక్షము యుక్తియుక్త మైనది కాదు. విద్య (ఉపాసన) యొక్కటియే యైనను అందిట్టిభేద ముండవచ్చును. ఒక్కవేళ నాఱవయగ్ని ఛందోగశాఖయందు ఉపసంహరించుకొనుటకు (విద్యాసందర్భమునఁ గూర్చికొనుటకు) వీలు కాకున్నను వాజసనేయశాఖ యందు కూడ నైదగ్నులును కలవు కదా! ఇప్పుడు ఐదగ్నులు మాత్రమే యుపాసనార్థమై విధింపఁబడుచున్నవి యనియు ఆఱవయగ్ని యనువాదము మాత్రమే చేయఁబడుచున్నది యనియుఁ జెప్పవచ్చును. అప్పుడు భేదము కలుగదు. కర్మకాండయందు అతిరాత్రయాగమును విధించునప్పుడు ఒక శాఖయందు "ఈయాగమున షోడశి యనుదానిని గ్రహింపవలయును" అనియు మఱియొకశాఖయందు "దానిని గ్రహింప నక్కఱ లేదు'. అనియుఁ జెప్పఁబడి యున్నది. ఇట్లున్నను ఆయాగము మాత్రము రెండుశాఖలయందును సమానముగనే (యేకముగనే) చెప్పఁబడె నని జైమినిమహాముని సిద్ధాంతము చేసి యున్నాఁడు. ఇట్లే యిచ్చటఁ గూడ సిద్ధాంతము చేయవచ్చును. ఈపంచాగ్నివిద్యయందు అగ్నిభిన్నము లగు పదార్థములే యైదును ఉపాసనార్థమై యగ్నులుగఁ గల్పించి కదా యుప దేశింపఁబడెను. ఆకల్పన నుపసంహరించుటకై వాజసనేయశాఖవారు లోక ప్రసిద్ధమగు నగ్నిని జెప్పుచున్నారుకాని మఱి యేమియు లేదు. ఇది యను వాదమాత్రమే యగును కాని విధి కానేరదు. ఇందపూర్వ మేమియు లేదు కదా! కావున నీపంచాగ్నివిద్య రెండుశాఖలయందు నొక్కటియే.

ఇదియును గాక నాయాఱవ యగ్నిని ఛందోగశాఖవారు కూడఁ జెప్పుచునే యున్నారు. "తం ప్రేతం దిష్ట మితోఽగ్నయ ఏవ హరంతి" "ఆపురుషుఁడు మృతిజెందఁగానే పరలోకమునకుఁ బోవ నుద్యమింపఁగానే

బంధువులు వానిని అగ్నికడకుఁ గొనిపోవుదురు" అని ప్రత్యక్షాగ్నిని ప్రస్తావించుచున్నారు. ఈకారణమువలనఁ గూడ నాపంచాగ్నివిద్యకు భేదము లేదు.

"వాజసనేయశాఖయందు ఆఱవయగ్ని యుపాసనార్థముగనే చెప్పఁబడెను. ఛందోగశాఖయం దట్లు లేదు." అని చెప్పినను పంచాగ్నివిద్య యొక్కటి యగుటకు విరోధము లేదు. వాజసనేయశాఖయందు చెప్పఁబడియున్న యాఱవ యగ్నిని ఛందోగశాఖలోనికిని దెచ్చికొనవచ్చును. "అప్పుడు పంచసంఖ్యకు విరోధము వచ్చును!" అనియెదవేమొ ఆసంశయముతోఁ బనిలేదు. అగ్నులను కల్పించి పిదప వానిని సుఖముగాఁ దెలిసికొనుటకై సంఖ్య జెప్పఁబడెను కాని "ఐదే యగ్నులు" అని యది (సంఖ్య) విధింపఁబడలేదు. కావున సంఖ్య ప్రధానము కాదు. ఈకల్పితాగ్నులైదును రెండుశాఖలయందు నొక్కతీరుగనే యున్నవి. కావున నాఱవయగ్నిని వికల్పముగనైన నంగీకరింపవచ్చును కదా! కావున నెట్లును పంచాగ్నివిద్య రెండుశాఖలయందు నొక్కటియే. ఇట్లే ప్రాణసంవాదము కూడ నొక్కటియే యగును. అందును వాజసనేయశాఖయందు ప్రజాపతి యను నైదవపదార్థము ప్రస్తావింపఁబడినను తక్కినవి రెండుశాఖలయందు నొక్కటియే కావున దానిని (ఆఱవపదార్థమును) కూడ వికల్పింపవచ్చును కదా! కావున నెట్లును శాఖాభేదమువలన విద్యాభేదము లేదు.

---

## అ-3. పా-3. సూ-3.

అవతారిక:—"అగుగాక. విద్యావిషయమున కొన్నికొన్ని శాఖలయందు కొన్నికొన్ని విధములుగ వ్రతములు చెప్పఁబడియున్నవి. యని యిదివఱకే చెప్పియున్నాము. అథర్వణవేదమునందు శిరోవ్రత మను నొకవ్రతము చెప్పఁబడియున్నది. ఇతరశాఖలయం దది లేదు. దీనివలన నైనను విద్యలు పరస్పరభిన్నములు కాక తప్పదు" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

---

# ౩౬౩. స్వాధ్యాయస్య తథాత్వేన హి సమాచారే ఽధికారాచ్చ సవవచ్చ తన్నియమః. ౩. ౩. ౩.

తాత్పర్యము:—ఇట్లు సంశయింప పనిలేదు. అథర్వణశాఖయందు (ముండకోపనిషత్తునందు) చెప్పఁబడినశిరోవ్రతము ఉపాసనలకు సంబంధించినది కాదు; వేదాధ్యయనమునకు సంబంధించినదియే. అథర్వణశాఖ నభ్యసించి యందలియుపాసనల నాచరింపదలంచువారు మొట్టమొదట శిరోవ్రతము నాచరింపవలయును. పిదపఁ గాని యందలియుపాసనలు పరిపూర్ణఫలము నొసంగవు. ఇతరశాఖవారికిమాత్ర మావ్రతముతోఁ బని లేదు. "నైత దచీర్ణవ్రతోఽధీతే" "ఈశిరోవ్రతము నాచరింపని వాఁడు వేదాధ్యయనమును చేయఁడు" అని వేదవ్రతములనుఁ గూర్చి చెప్పునప్పుడు ఆముండకోపనిషత్తునఁ జెప్పఁబడి యున్నది. ఈశ్రుతియందు ఏతచ్ఛబ్దముచే నుపనిషత్తులును "అధీయతే" యనుశబ్దముచే నధ్యయనంబును చెప్పఁబడి యుండుటచే నిస్సంశయముగ నీవిషయము (ఈవ్రతము ఉపనిషత్సహితము నథర్వణవేదాధ్యయనము నాచరించుటకే యుపయోగించును అనువిషయము) స్పష్ట మగుచున్నది.

"ఇట్లుకాదు. 'తేషామే వైతాం బ్రహ్మవిద్యాం వదేత శిరోవ్రతం విధివ ద్యైస్తు చీర్ణం' 'శిరోవ్రతము నెవ్వరు చేయుదురో వారికే యీ బ్రహ్మవిద్య నుపదేశింపవలయును' అని చెప్పఁబడియుండుటచే నీవ్రతము అథర్వణవేదాధ్యయనమునకు సంబంధించినదియే యైనను బ్రహ్మవిద్యలకు (ఉపాసనలకు) మాత్ర మన్నిటికిని సంబంధించినదిగాఁ దెలియవచ్చుచున్నది. ఇచ్చట సామాన్యముగ బ్రహ్మవిద్యాపదము ప్రయోగింపఁబడియుండుటచే నిది యాథర్వణికాబ్రహ్మవిద్యను గూర్చినదియే యని యెట్లునిర్ణయింపనగును?" అనియెదవేమొ వినుము. పైశ్రుతియందు "ఏతాం బ్రహ్మవిద్యాం" "ఈబ్రహ్మవిద్యను" అని ప్రస్తుతముండకోపనిషత్తునందు చెప్పఁబడినబ్రహ్మవిద్యయే పరామర్శింపఁబడెను. ఇట్లుండ నిఁక సంశయ మేల? నిశ్చయముగ నీబ్రహ్మవిద్యాపదము ఆథర్వణిక

బ్రహ్మవిద్యకు మాత్రమే సంబంధించినది ; కేవల బ్రహ్మవిద్యకే గాదు ఉపనిషత్సహిత వేదాధ్యయనమునకు సంబంధించినది. కర్మకాండమున దీనికి (శిరోవ్రతము అథర్వణశాఖాధ్యయనమునకే యని నిర్ణయించుటకు) దృష్టాంతము కూడఁ గలదు. ఒకస్థలమున సౌర్యము (సూర్యుని కై చేయఁబడునది) మొదలగు నేడుహోమములు చెప్పఁబడి యున్నవి. ఆహోమములకు మూఁడగ్నుల లెక్క లేదు. అవి యేకాగ్నియందే జరుపఁబడును. ఇట్లగుటచే వానిని యథర్వణశాఖవారికిమాత్రమే సంబంధించినవానినిఁగా జైమినిమహాముని నిర్ణయించియున్నాఁడు. ఋగ్యజుస్సామవేదములయందు ఏకాగ్ని లేదు; అది యథర్వణవేదమునందే కలదు. ఇట్లే యిచ్చటఁగూడఁ నితరవేదములయందు శిరోవ్రతప్రస్తావము లేకుండుటచే నది యథర్వణశాఖవారికి మాత్రమే సంబంధించినది యని స్థాపింపఁబడుచున్నది. అధ్యయనమునుగూర్చి చెప్పఁబడునప్పుడు ఇతరవేదములయందు విశేషమేమియు లేకుండుటచేతను ఒక్కయథర్వణవేదమునందు మాత్రమే యీవిశేషము గానవచ్చుటచేతను యిది యథర్వణవేదమువారికిమాత్రమే సంబంధించినది యని స్థాపింపఁబడును. ఈకారణమువలన "ఉపాసనలు సర్వవేదములయందు నేకరూపములే" యనుసిద్ధాంతమునకు భంగము లేదు.

## 3౬8. దర్శయతి చ. 3. 3. 4.

తాత్పర్యము:— మఱియు నీవిషయమును శ్రుతియే ప్రత్యక్షముగ బోధించుచున్నది. సర్వవేదములు నొక్కపదార్థమునే వివరించుచున్నవి యని తెల్పుచున్నది. ఒక్కపదార్థమునే యుపాసింపు మని సర్వవేదములు నేకవాక్యముగ దెల్పుచున్నవి యనియు బోధించుచున్నది. "సర్వే వేదా యత్పద మామనంతి. ఏతం హ్యేవ బహ్వృచా మహ త్యుక్థే మీమాంసంత ఏత మగ్నా వధ్వర్యవ ఏతం మహావ్రతే ఛందోగాః" "సర్వవేదములు నేస్థానమును ప్రశంసించుచున్నవో ఈపరమేశ్వరునే ఋక్శాఖవారు ఉగ్థ మనుశస్త్రముగ నుపాసింతురు. యజుశ్శాఖవారు అగ్నిగాను ఛందోగశాఖవారు (ఇది సామశాఖ) మహావ్రత మనుయాగముగాను ఉపాసింతురు." అని సగుణనిర్గుణవిద్యలయొక్క యేకత్వమును బోధించువాక్యము లనేకములు

గలవు. మఱియు "మహద్భయం వజ్ర ముద్యతం" "ఈపరమేశ్వరుఁడే భేదదృష్టి గలవారలకు భయహేతువై వజ్రాయుధమువలె నున్నాఁడు." అని కాఠకశాఖయందు జెప్పఁబడియున్నవిషయమే భేదదర్శనమును నిందించుటకై "యదా హ్యేవైష ఏతస్మిన్నుదర మంతరం కురుతే అథ తస్య భయం భవతి" "పురుషుఁడు ఈపరమేశ్వరునియందు ఎప్పుడు కొంచెమైనను భేదదృష్టి నుంచునో అప్పుడు భయము నొందును" అని తైత్తిరీయోపనిషత్తునందును అనువాదము చేయఁబడియున్నది. మఱియు బృహదారణ్యకోపనిషత్తునందు వైశ్వానరవిద్య కలదు. అందు ఆయనను ప్రాదేశమాత్ర పరిమాణము గలవానినిఁగాఁ గల్పించి యున్నారు; ఛాందోగ్యోపనిషత్తునందును ఆవిద్యను వర్ణించునప్పుడు కల్పనాప్రకారము నిరూపింపకయే "ఏతమేవం ప్రాదేశమాత్రం" అని పరామర్శింపఁబడియున్నది. ఇట్లే ఉద్గాదులును (ఉద్గ మనఁగా ఋగ్వేదప్రసిద్ధ మగుపూజార్హమైన యొకానొకశస్త్రము) ఉపాసనార్థమై సర్వవేదములలోనికిఁ (సర్వశాఖల లోనికి) దెచ్చికొనఁబడుచున్నవి. ఈకారణమువలన నల్పభేదములు గన్పట్టినను చాలభాగమువఱకు నొక్కటియే యగుటచే నుపాసనలు సర్వవేదాంతములయందు నొక్కటియే యగునని సిద్ధాంతము చేయవలసియున్నది.

"కాఠకశాఖ ఛందోగశాఖ వాజసనేయశాఖ యనుమొదలగు శాఖానామభేదములచే నుపాసనాభేదము కలుగఁగూడదా ?" అనుటయు యుక్తము కానేరదు. అవి యన్నియు పురుషులు కల్పించిన నామధేయములు. కఠుఁడు మొదలగుమునులు ఉపదేశించుటచే నాశాఖలకు నట్టినామధేయములు కలిగినవి. ఇంతమాత్రమున నుపాసన లేల భేదింపవలయును ? ఒక్కయుపాసననే యనేకులు తమశిష్యుల కుపదేశింపవచ్చును కదా ! మఱియు నేయుపాసననుబట్టిచూచినను అన్నిశాఖలయందు నాచార మొక్కటియే. ఆయుపాసనను ఒక్క రొకవిధముగాను మఱియొక్కరు మఱియొక విధముగాను ఆచరించుట లేదు. ఆగురువులును అట్లుపదేశించుట లేదు. మఱియు నాయుపాసనలు ఆగురువులును అట్లుపదేశించుట లేదు. మఱియు నాయుపాసనలు పూర్వకల్పసిద్ధ వేదానుసారముగ పరమేశ్వరస్మృతికి వచ్చినవియే కాని యాకశాద్ది మహర్షులచే కల్పింపఁబడినవి కావు కదా ! ఈకారణమువలన శాఖానామ

భేదములచే నుపాసనలకు భేదము కలుగ నక్కఱ లేదు. శాఖ లెన్ని యైనను ఉపాసన లొక్కటియే కావచ్చును. ఎన్ని శాఖలయందుఁ జెప్పఁ బడినను ప్రాణోపాసన ప్రాణోపాసనయే. వైశ్వానరోపాసన వైశ్వానరోపాసనయే. ఒక వేళ నొకశాఖయందు దేవతకు (ఉపాసనా దేవతకు) కొన్ని గుణములు మాత్రమే చెప్పఁబడి యున్నను మఱియొకశాఖయందు అధిక గుణములు చెప్పఁబడి యున్నను దేవతమాత్ర మొక్కటియే గావున ప్రతి స్థలమునందును సర్వగుణములు నుపసంహరింపఁబడవలసినదియే కాని యుపాసనలకు మాత్రము భేదము రాదు.

---

## ౨. ఉపసంహారాధికరణము.

విషయము, సంగతులు, సందేహము:—పైయధికరణమున "సర్వ శాఖలయందు నుపాసన లొక్కటియే" అనువిషయము సిద్ధాంతము చేయఁబడెను. దాని నాశ్రయించి యాశ్రయాశ్రయిభావసంగతితో తత్ఫల మిందు విమర్శింపఁబడును. "ఉపాసనల యైక్యమువలనఁ బ్రయోజన మేమి? ఒకశాఖయందు జెప్పఁబడియున్న గుణములు మఱియొకశాఖ లోనికిఁ దేఁబడునా? లేదా?" అనుసంశయము నివారింపఁబడును.

పూర్వపక్షము:—విచారించి చూచిన నీవిచారము నిష్ప్రయోజన మనియే తోఁచుచున్నది. ఒకస్థలమునందు చెప్పఁబడియున్న గుణముల మఱియొకస్థలమునకు దెచ్చికొనుటకు వీ లున్నను అట్లు తెచ్చికొనవలసినంత పని లేదు. ఎచ్చట జెప్పఁబడినగుణములతో నచ్చటనే కార్యనిర్వాహ మగును. "ఈదేవత నుపాసింపుము" అనిన వెంటనే "ఎట్లుపాసింపవల యును?" అని ప్రశ్న వచ్చును. దానికి నుత్తరముగా నచ్చటనే కొన్ని గుణ ములు చెప్పఁబడి యున్నవి కదా! ఇఁక నధికగుణములతోఁ బని యేమి? పని యుండిన నవి కూడ నచ్చటనే చెప్పఁబడి యుండవచ్చును కదా! "ఉపాసన లొక్కటియే కావున సర్వశాఖలయందుఁ జెప్పఁబడియున్న గుణములును ప్రత్యేకముగ నొక్కొక్కశాఖయందలి యుపాసనకును సంబంధించియుండ వలయు ననుట యుక్తియుక్తము కదా!" అనియెదవేమో యట్లు చెప్ప నక్కఱ లేదు. సర్వగుణములు నొక్కొక్కదానికి సంబంధించియే యున్నను

స్వశాఖయందు (ఉపాసన చెప్పఁబడియున్న శాఖయందు) చెప్పఁబడియున్న గుణములతోనే ధ్యానించువారికి నాయుపాస్యదేవత సర్వఫలముల నొసంగు ననవచ్చును. నిత్యనైమిత్తికాదికర్మలయం దనేకవిధులు విధింపఁ బడియున్నను శక్త్యనుసారముగఁ గొన్నిఁటిని మాత్రమే యవలంబించినను పూర్ణఫలము కలుగు నని పూర్వమీమాంసాశాస్త్రమున సిద్ధాంతము చేయఁబడి యున్నది కదా! "ఇట్లు కాదు. 'యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్' 'జీవ మున్నంతవఱకు సాయంప్రాతఃకాలములయందు అగ్నిహోత్రము నాచరింపవలయును.' అని వేదమునందు అగ్నిహోత్రాదులు సార్వకాలికములుగ విధింపఁబడి యుండుటచేతను, పురుషునకు సర్వకాలములయందును శక్తి యొక్కటీరున నుండకపోవుటచేతను, వార్ధక్యమునందు కర్మవిధుల నన్నిటి నవలంబించుసామర్థ్యము ఉండ దనుట నిస్సంశయమే యగుటచేతను 'కొన్నివిధులను మాత్రమే యవలంబించినను కర్మలు ఫలము నొసంగును' అని కల్పింపవలసివచ్చినది. ఇచ్చట నిట్లు కల్పించుటకుఁ గారణము లేదు కదా!" అనియెదవేమొ యట్లు కాదు. సర్వగుణములఁ బ్రతిశాఖలోనికిని తెచ్చికొనవలయు ననిన నాగుణములు కూడ నచ్చటచ్చటనే చెప్పఁబడియుండవచ్చును కదా! అట్లు చెప్పఁబడి యుండలేదు. కావున నిట్లు (ఎచ్చటి గుణములతో నచ్చటనే సంపూర్ణ ఫలము కలుగు నని) నిర్ణయింపవలసి వచ్చినది. కావున నీవిచారమువలనఁ (సర్వశాఖలయందు నుపాసన లొక్కటియే యనువిచారమువలనఁ) బ్రయోజనము లేదు.

## అ_౩. పా_౩. సూ_౫.

అవతారిక:—అనిన నీపూర్వపక్షమును ఖండించుచు పూర్వాధికరణసిద్ధాంతమునకుఁ గలఫలమును చెప్పుచున్నాఁడు.

## ౩౬౫. ఉపసంహారోఽర్థాభేదాద్విధిశేషవత్సమానే చ. ౩. ౩. ౫.

తా. పై యధికరణమునందు ఉపాసన లన్నిశాఖలయందు నేకరూపములే యని సిద్ధాంతము చేయఁబడియున్నది. ఈకారణమువలన

సమాన మగువిద్యయందు స్వశాఖయందలి గుణములనేకాక నన్యశాఖయందలిగుణములనుగూడ నుపసంహారము చేసికొనుట యుక్తము. దేవత రెండుస్థలములయందు నొక్కటియే; ఒకస్థలమున నల్పముగాను మఱియొక స్థలమున నధికముగాను గుణములు వర్ణింపఁబడియున్నను వానికిఁ బ్రయోజనభేదము మాత్రము లేదు. రెండుస్థలములయందును అవి (గుణములు) యేకవిద్యకు నేకదేవతకు మాత్రమే సంబంధించి యేకఫలమునకు సాధకములై యున్నవి కదా! ఇఁక వాని నితరస్థలములలోనికి నుపసంహరించుకొనవలయు ననిన నిందయుక్త మేది కలదు? ఉపాసనలు పరస్పరభిన్నములగునేని యప్పుడు వానికి సంబంధించినగుణములును భిన్నములే యగుటచే నుపసంహారమునకు రావు కాని యిప్పు డాదోషము లేదు కదా! కర్మకాండయందును అగ్నిహోత్రాదులకు ననేకశాఖలయం దనేకవిధములుగ గుణములు చెప్పఁబడియున్నను కర్మమాత్ర మొక్కటియే కావున గుణములన్నియుఁ బ్రతిశాఖలోనికి దెచ్చుకొనఁబడుచున్నవి. కావున నెట్లును ఒకస్థలమునందలి గుణముల మఱియొకస్థలమునకు దెచ్చికొనవలయు నను సిద్ధాంత మెంతయు యుక్తియుక్తము.

---

## 3. అన్యథాత్వాధికరణము.

విషయము, సంగతి, సందేహము : — బృహదారణ్యకోపనిషత్తునందు ప్రథమాధ్యాయమున మూఁడవ బ్రాహ్మణమునందు ఉద్గీథవిద్య వర్ణింపఁబడి యున్నది. జీవునకు సంతానరూపములై సాత్త్విక తామస చిత్తవృత్తులు జనించుచున్నవి కదా! ఇవి క్రమముగ దేవాసురశబ్దములతోఁ జెప్పఁబడియున్నవి. అజ్ఞాన మనాది యగుటచే అన్నయనియు జ్ఞానము నడుమ జనించునది యగుటచే తమ్ముఁ డనియు వర్ణింపఁబడినది. జ్ఞానమే సాత్త్వికవృత్తి గావున దేవతలు చిన్నవా రనియు అజ్ఞానము తామసవృత్తి కావున రాక్షసులు పెద్దవా రనియు వర్ణింపఁబడి యున్నది. ఒక్కసమయమున సాత్త్వికవృత్తులు జనించి తామసవృత్తుల నడఁచుటయు మఱియొక సమయమున తామసవృత్తు లభివృద్ధి నై సాత్త్వికవృత్తుల నడంచుటయు ప్రత్యక్షసిద్ధముకావున నిదియే దేవాసురయుద్ధముగా వర్ణింపఁబడియున్నది.

ఇట్లు దేవతలును రాక్షసులును పరస్పరము వైరమును బూని కలవరఁ బడుచున్న సమయమున నాదేవతలు జ్యోతిష్టోమయాగముచే రాక్షసుల పరాభవింపఁజూచిరట. ఉద్గీథ మనుసామవేదభాగమును జపించుటచే తమకు రాక్షసుల జయించుసామర్థ్యము కలుగు నని నిశ్చయించిరట. పిదప సామగానమునకై వాగాదీంద్రియముల నియోగింపఁగా నవి మొట్ట మొదట బాగుగనే గానము చేసినవట. వీరి ప్రయత్నమును రాక్షసు లెఱింగి యావాగాదుల బాధింపఁగా నవి యాగానమును పరిత్యజించి విపరీతముగాఁ బ్రవర్తింప నారంభించె నట. పిదప నాదేవతలు ముఖ్య ప్రాణము (ప్రాణవాయువు) నట్లే ప్రార్థింపఁగా నది గానము చేయుచు రాక్షసు లెంత ప్రయత్నించినను విడువలేదట. ఆరాక్షసులే పెద్దరాతికి వేగముతో తగిలిన మట్టిపెళ్లలవలె ధ్వంసము నొందిరట. ఈకారణము వలన నిశ్చలస్థితితో నాగానము నాశ్రయించిన ప్రాణమునే దేవత లుపాసన గావించిరట. ఈకథ యందు చెప్పఁబడినవాగాదులు తత్తదభిమాని దేవ తలే యని తెలుసుకొనవలయును. దేవతలు కాకుండిన సామగానము నొన ర్చుట సాధ్యము కాదు కదా! మఱియు ఛాందోగ్యోపనిషత్తునందును ఈకథయె మఱియొకవిధముగాఁ గలదు. దేవాసురులకు యుద్ధము కలిగి నప్పుడు వారు ఉద్గీథోపాసనచే రాక్షసుల జయింప నెంచి వాగాదులను క్రమముగ నుద్గీథరూపముతో నుపాసించి వానికి రాక్షసులవలన బాధ కలుగఁగా కట్టకడకు ప్రాణాభిమానిదేవత నుపాసించి రని చెప్పఁబడి యున్నది. ఈవిద్యలు రెండును భిన్నములా? యభిన్నములా? యను విషయ మిందు విచారింపఁబడును. మొట్టమొదటియధికరణమున నామ ధేయ మొక్కటిగా నుండుటవలనఁ గూడ విద్య లభిన్నము లగును." అని సిద్ధాంతము చేయఁబడియున్నది కావున నిచ్చటఁగూడ "ఉద్గీథవిద్య" యనునామధేయ మొక్కటియే యగుటచే వీనికిని (పైనఁజూపిన రెండు సందర్భములకును) భేదములేకపోవలయు నని దృష్టాంతసంగతిలో వచ్చు పూర్వపక్షము నిరాకరింపఁబడును. "ఈసందర్భములకు పరస్పరభేదము కలదు" అనువిషయము సిద్ధాంతము చేయఁబడును.

---

## అ_3. పా_3. సూ_౬.

అవతారిక:—ఈసిద్ధాంతమును స్థాపించుటకై మొట్టమొదటి సూత్రమున నాక్షేపసమాధానములతోఁ బూర్వపక్షమును స్థాపించుచున్నాఁడు.

## ३౬౬. అన్యథాత్వం శబ్దాదితి చేన్నా విశేషాత్. 3. 3. ౬.

తాత్పర్యము, వేదాంతిపూర్వపక్షము:—పైనఁజూపిన సందర్భములు రెండు నొక్కటియే యనుట యుక్తము కాదు. వానియందు భేదము గానవచ్చుచున్నది. బృహదారణ్యకోపనిషత్తునందు "త్వం న ఉద్గాయ" "ఓ ప్రాణాభిమానిదేవతా, నీవు మాకొఱకు సామగానమును గావింపుము" అని ప్రాణము సామగానకర్తగాఁ జెప్పఁబడి యున్నది. ఛాందోగ్యోపనిషత్తునం దన్ననో "త ముద్గీథ ముపాసాంచక్రిరే" "ఆదేవతలు ఆముఖ్యప్రాణమును ఉద్గీథరూపముతో నుపాసించిరి." అని ప్రాణముద్గీథరూపము కలదిగానే చెప్పఁబడి యున్నది. ఈరెంటికిని పరస్పర భేదము కలదు కదా! ఈకారణమువలన విద్య లొక్కటి కానేరవు.

పూర్వపక్షిచేఁ జేయఁబడిన సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట సరికాదు. ఇంతమాత్రమువలన నావిద్యలకుఁ గలిగినయైక్యమునకు భంగముకలుగనేరదు. ఈయొక్కవిషయమునందుమాత్రము తారతమ్య మున్నను అనేక విషయములు రెంటియందును సమానములుగనే యున్నవి. రెండుపనిషత్తులయందును దేవాసురయుద్ధమే యుపక్రమింపఁబడి యున్నది. వాగాదీంద్రియదేవతలే ప్రస్తాపింపఁబడి యున్నారు. ఆదేవతలకు తగినంతసామర్థ్యము లేకపోవుటచేతను రాక్షసులకు వారు లోఁబడుటచేతను వారిని విడిచి ప్రాణము నాశ్రయించి తత్సహాయముచే దేవతలు రాక్షసుల గెలిచిరనుటయు రెండుపనిషత్తులయందును సమానముగనే యున్నది. మఱియు సామగానకర్తగా ప్రాణమును నిర్దేశించిన బృహదారణ్యకోపనిషత్తునందు గూడ "ఏష ఉ వా ఉద్గీథః" "ఈప్రాణవాయువే యుద్గీథము" అని ప్రాణోద్గీథముల కభేదము కూడఁ జెప్పఁబడి యున్నది. ఇట్టి పరస్పరవిరోధ మున్నను ఆబృహదారణ్యకోపనిషత్తునందు జెప్పఁబడినవిద్య యొక్కటియే

యని నిర్వివాదముగ గ్రహించుచున్నారు కదా! ఇక ఛాందోగ్యము నందలివిద్యను దానితో నేకముగ గ్రహించుటకు సంశయ మేమి? ఛాందోగ్యోపనిషత్తునందు కల దని చెప్పఁబడినవిరోధము కూడ నిదియే కదా! కావున నెట్లును ఈవిద్యలు రెండు నొక్కటియే. ఛాందోగ్యోప నిషత్తునందు ప్రాణోద్గీథముల కభేదము చెప్పఁబడి యున్నను "ప్రాణ ముద్గానకర్తా (సామగానము నాచరించునది)" యని లక్షణావృత్తిచే నిర్ణయింపవచ్చును.

## అ-3. పా-3. సూ-8.

అవతారిక:—ఇట్లు వచ్చిన పూర్వపక్షమును సదృష్టాంతముగ ఖండించి పైఁజూపఁబడువిద్యలకు పరస్పరభేదము కల దని చెప్పుచున్నాఁడు.

## 368. న వా ప్రకరణభేదాత్పరోవరీయ స్త్వాదివత్. 3. 3. 8.

తాత్పర్యము:—పై పూర్వపక్షము యుక్త మైనది కాదు. ఈ విద్యలు అభిన్నములు కానేరవు. ఒకదానియందు జెప్పఁబడియున్న గుణ ములు రెండవదానికిఁ గలుగనేరవు. వీని యుపక్రమములు పరస్పరభిన్న ములై యున్నవి; ఉపాస్య దేవతలును భిన్ను లయ్యే యున్నారు. ఛాందో గ్యోపనిషత్తునందు ప్రకరణారంభమున "ఓ మిత్యేత దక్షర ముద్గీథ ముపా సీత" "సామవేదమునందు ఉద్గీథ మనునొకభాగము కలదు. ఆభాగమునకు నవయవ మగుప్రణవమునే యుపాసన చేయవలయును" అని యారంభించి "ఈయోంకారమే సర్వప్రపంచమునకును సారభూత మైనది." అని తద్వి శేషము నభివర్ణించి మఱల ద్వితీయఖండమునందు దానినే ప్రస్తావించి దేవా సురకథను జెప్పి కట్టకడకు "ప్రాణ ముద్గీథ ముపాసాంచక్రిరే" అని యా యోంకారమునందు ప్రాణదృష్టి నుండవలయు నని బోధింపఁబడి యున్నది. బృహదారణ్యకోపనిషత్తునం దన్ననో యుద్గీథమునుగూర్చియే చెప్పఁబడి యున్నను తదవయవ మగునోంకారమును గూర్చి మాత్రమే చెప్పఁబడె ననుటకు నాధారము లేదు; ఆయోంకారమునందు ప్రాణదృష్టి నుంప వలయు నని చెప్పఁబడినట్లు నిర్ణయించుటకును శక్యము కాదు. "ప్రాణము

సామగానకర్త" యనువిషయ మచ్చట నిర్ణయింపఁబడినట్లు స్పష్ట మగు చున్నది కదా! కావున నీవిద్యలకు నైక్యమును భావించుటకు నెట్లును వీలు లేదు. ఛాందోగ్యోపనిషత్తునందు ఉద్గీథావయవము మాత్రమే ప్రాణరూపముతో నుపాస్యము; బృహదారణ్యకోపనిషత్తునందు ఉద్గీథ కర్తయే ప్రాణరూపముతో నుపాస్యుఁడు. ఛాందోగ్యోపనిషత్తునందు అవ యవమునుఁగూర్చి మాత్రమే చెప్పఁబడియున్నది; బృహదారణ్యకోప నిషత్తునందు సామవేదభాగమును సర్వమును గ్రహించి చెప్పఁబడి యున్నది.

మఱియు ఛాందోగ్యోపనిషత్తునందు గల శ్రుతికి బృహదారణ్య కోపనిషత్తున కనుకూలముగ నర్థమును కల్పించిన నుపక్రమోపసంహారము లకు విరోధము వచ్చును. ఉపక్రమము ఓంకారోపాసనామాత్ర విషయమై యుండ నుపసంహారము సామగానకర్తృపరమై యుండుట యెట్లు సంభవించును? కల్పింపఁబడినయర్థమునకైనను చక్కనియవకాశము లేదు; నిరర్థకముగ *అభిధావృత్తిచే వచ్చుచున్నయర్థమును వదలి లక్షణావృత్తి నాశ్రయింపవలయును కదా! కావున నెట్లు చూచినను ఈరెండు విద్యలు నభిన్నములు కానేరవు. అర్థవాదరూపములై స్తోత్రాత్మకములై యున్నయనేకవిషయము లభిన్నములై యుండినను ముఖ్యములగు దేవతలు భిన్నులై యుండ విద్య లభిన్నము లగుట యెట్లు? "బృహదారణ్యకోపనిషత్తునందును ప్రాణోద్గీథముల కభేదము చెప్పఁబడి యున్నది కదా!" అనియెదవేమో. అచ్చట ప్రాణములకు సర్వవ్యాపకత్వమును బోధించుటకై యట్లు చెప్పఁబడెను. అచ్చట గూఢ నుద్గీథశబ్దము సమగ్రవేదభాగమును చెప్పునదియేకాని ఛాందోగ్యోప నిషత్తునందువలె ప్రణవమును మాత్రము చెప్పునది కాదు. కావున నీరెండువిద్యలకును నిర్వివాదముగ దారతమ్యము కలదు.

"ఇట్లయిన బృహదారణ్యకోపనిషత్తునందలివిద్యనే ఛాందోగ్యోప నిషత్తునకు ననుకూలముగ సమన్వయింపవచ్చును. ప్రాణ మచేతనము కావున దానికి సామగానము చేయుసామర్థ్యము లేదు; ఉద్గీథముకూడ నచే తనమే కావున ప్రాణ మొకవేళ తద్రూపముతో నుండిన నుండవచ్చును."

---

* అభిధావృత్తి యనఁగా శబ్దమునుండి స్వతంత్రముగా స్ఫురించునర్థమును తెలిసికొనుట. ఇట్లు తెలిసికొనుటకై ప్రయోగింపఁబడుపదము వాచక మనియు దాని వ్యాపార మభిధ యనియుఁ జెప్పఁబడును.

అనియెదవేమో అది యుక్తము కాదు. వాస్తవస్థితిలో నా ప్రాణమునకు స్వాభావికముగ నేరూపమును ఉండుటకు వీలు లేదు. అది యుద్గీథము గాఁగాని తత్కర్తగాఁగాని కూడ నుండదు. రెండురూపములును దానికి నుపాసనార్థమై కల్పింపఁబడినవియే. ఇట్లగుటచే నేది స్థైన నొక్కటియే యగును. మఱియు సామగానముచేయువారు ప్రాణశక్తితోనేయాగానము నాచరింపుచున్నారు. కావున ప్రాణమే గానకర్త యని యౌపచారికముగఁ జెప్పఁబడవచ్చును. ప్రాణము లేకున్న వాగింద్రియము గాని మఱి యేయింద్రియములు గాని ప్రవర్తింపవు కదా! "వాచా చ హ్యేవ స ప్రాణేన చోదగాయత్" "ఆయుద్గాత (సామగానముచేయువాఁడు) వాగింద్రియముతోను ప్రాణముతోను గానము చేసెను" అని శ్రుతియు నీవిషయమును (ప్రాణసహాయముచే సామగానము జరుగు ననువిషయమును) బోధింపుచున్నది. ఈకారణమువలన ప్రాణమును సామగానకర్తగాఁ జెప్పుట వలన విరోధము లేదు. కావున నెట్లు చూచినను ఈవిద్యలు రెండు నేకములు కావు.

ఈవిషయమున కర్మకాండయందు దృష్టాంతము కలదు. అమావాస్యయందుఁ జేయఁబడవలసినయిష్టిని చెప్పుసందర్భమునఁ బ్రమాదము వలనఁ గలిగినకాలాతిక్రమమునకు ప్రాయశ్చిత్తముగా నొకవిధి చెప్పఁబడియున్నది. "త్రేధా తండులాన్విభజేద్యే మధ్యమాః స్యుస్తానగ్నయే దాత్రే పురోడాశ మష్టాకపాలం కుర్యాత్" "బియ్యము మొదలగుహవిస్సును మూఁడుభాగములుగ విభజించి యందు మధ్యమ మైనభాగమును *పురోడాశముగఁ గల్పించి యెనిమిది మూకుళ్లయందునిచి యగ్నికినొసంగవలయును." అనువాక్యముచే నావిధి నిర్ణయింపఁబడి యున్నది. మఱియు పశుసంపద నపేక్షించువాఁడు చేయవలసిన విధినిఁ గూర్చి చెప్పునప్పుడును పైవాక్యమే యున్నది. ఇట్లు రెండుస్థలములయందు నొక్కవాక్యమే యున్నను వానివానియుపక్రమములు భిన్నము లగుటచే భిన్నముగనే సిద్ధాంతము చేయఁబడి యున్నది. ఒకయాగమునకు నవయవముగా నుండుటచే మొట్టమొదటిసందర్భమున నున్నవాక్యము ప్రత్యేకవిధిని తెలుపనేర దనియు స్వతంత్రముగ నున్నది యగుటచే రెండవసందర్భమున నావాక్యమే ప్రత్యేకవిధిని తెల్పు ననియును సిద్ధాంతము చేయఁ

* పురోడాశము = హోమముఁజేయుట కుపయోగింపఁబడు పిండి.

బడెను. అట్లే యిచ్చటఁగూడ వాక్యచ్ఛాయ యొక్కటిగనే యున్నను ఉపాస్యదేవతలకు భేదము కలదు. కావున విద్యాభేదము నిర్వివాదముగ గలదు.

మఱియు ఉపనిషత్తులయందు కూడ నిట్టి దృష్టాంతము కలదు. ఛాందోగ్యోపనిషత్తునందే యొకస్థలమున "ఆకాశో హ్యేవైభ్యో జ్యాయా నాకాశః పరాయణం, న ఏష పరోవరీయా నుద్గీథః స ఏషోఽనంతః" "ఆకాశమే సర్వభూతములకంటె పెద్దది. అదియే పరమగతి (మోక్షము) శ్రేష్ఠములకంటె శ్రేష్ఠము. అతీతులకంటె నతీతము. అదియే యుద్గీథము. అదియే ఆద్యంతములు లేనిది." అని పరోవరీయస్త్వాదిగుణములతో (పరోవరీయస్త్వ మనఁగా పరునికంటెఁ బరుఁడై శ్రేష్ఠునికంటె శ్రేష్ఠుఁడై యుండుట) బరమేశ్వరు నుద్గీథముగ (ఉద్గీథ మనునది సామవేదశాఖలలో నొక్కటి యని యిదివఱకే చెప్పి యున్నాము.) నుపాసింపవలయు నని చెప్పఁబడి యున్నది. ఇట్లే మఱియొక స్థలమున ఆదిత్యాక్షిపురుషుల నభివర్ణించి తత్స్వరూపముతోఁ బరమేశ్వరు నుద్గీథముగ నుపాసింపు మని చెప్పఁబడి యున్నది. ఈ రెండును ఉద్గీథోపాసనలే యైనను రెంటియందును పరమేశ్వరుఁడే యుద్గీథరూపముతో ధ్యానింపవలసినవాఁ డైనను (ఆవిద్యలయందు) రూపభేదములు వర్ణింపఁ బడి యుండుటచే విద్యలకు పరస్పర భేదము కలుగును. ఇది సిద్ధాంత మగు విషయము. ఇట్లే ప్రస్తుతసందర్భములకుఁ గూడ బరస్పరభేదము కల దనుటయే సిద్ధాంతము.

## ౩౬౮. సంజ్ఞాత శ్చే త్తదుక్త మస్తితు తదపి.

### ౩. ౩. ౮.

తాత్పర్యము, పూర్వపక్షము:—ఇట్లయినను రెంటికిని పే రొక్కటిగనే యున్నది. దేవాసురయుద్ధమును వర్ణించుట మొదలగు ధర్మములు గూడ చాలవఱకును సమానములుగనే యున్నవి. కావున నొకానొక విషయమున భేదమున్నను విద్య లభిన్నములే.

సిద్ధాంతము:—ఇట్లు కాదు నామము లనునవి పరులచే వ్యవహారార్థమై కల్పింపఁబడునవి. ఇతరవిచార మేదియు లేక కేవల మానామముల

నాశ్రయించియే భిన్నపదార్థములకు నభేదమును సాధింపఁబూనుట యెంత వెఱ్ఱితనము ? గుణాభేదమునుగూర్చియు మున్నే వివరించి యున్నాము. ఉపాసనలకు ప్రధానాంగ మగునుపాస్యదేవతయే భేదించి యుండ కేవలము బహిరంగము లగుకొన్నికొన్ని యర్థవాదములు సమానముగ నున్నంతమాత్రమున ప్రయోజనము లేదని నిర్ణయించి యున్నాము. భేదము కల దని నిర్ణయింపఁబడిన యుపాసనలకు గూడ నామధేయ మొక్కటిగా నుండుట గానవచ్చుచున్నది. పరోవరీయస్త్వాదిగుణములతోను ఆదిత్యాక్షిపురుషరూపములతోను పరమేశ్వరోపాసనను చెప్పు రెండు విద్యలకు నుద్గీథవిద్య లనియే నామధేయ మని యిదివఱకే చెప్పి యున్నాము. ఇంతమాత్రమేగాక నొక్కశాఖయందుఁ జెప్పఁబడిన విద్యలన్నియు నాశాఖయొక్క నామధేయముతోనే పిలువఁబడుచు నున్నవి. ఇట్లగుటచే నన్నిస్థలములయందును విచారమే యావశ్యకము కాని కేవలనామమాత్రమువలన ప్రయోజనము లేదు. విచారించి చేయఁబడిన నిర్ణయంబును నామధేయంబులును కూడఁ బరస్పరానుకూలము లగునేని యిప్పుడు విద్యలకుఁ గలుగుపరస్పరాభేదములకు నామధేయము కూడ నొకకారణమైన నగుఁగాక సంవర్గవిద్య మొదలగుస్థలములయం దిట్లే యున్నది. కావున నెట్లు చూచినను ప్రస్తుతవిద్యలకు నభేదము లేదు.

## ౮. వ్యాప్త్యధికరణము.

విషయము, సంగతులు:—"పూర్వాధికరణమున 'ఓమి త్యేతదక్షర ముద్గీథ ముపాసీత' 'ఉద్గీథ మనుసామవేదముయొక్క యవయవ మగునోంకారము నుపాసన చేయవలయును' అనువాక్యముయొక్క యర్థమును విచారింపకయే ఛాందోగ్యోపనిషత్తునందలి యుద్గీథవిద్య బృహదారణ్యకోపనిషత్తునందలి యుద్గీథవిద్యకంటె భిన్న మని సిద్ధాంతము చేయఁబడియున్నది. అది యుక్తము కాదు. ఆవాక్యమునకు నెట్లయిన నర్థమును చెప్పవచ్చును. ఇట్లయిన పూర్వసిద్ధాంతము నిలువదు." అని యాక్షేపసంగతితో వచ్చుపూర్వపక్ష మాయధికరణమున నిరాకరింపఁబడును; ఉద్గీథవిద్యోపక్రమవాక్యార్థము నిర్ణయింపఁబడును.

సంశయము, పూర్వపక్షము :—పై యుపక్రమవాక్యమునందు "అక్షరం ఉద్గీథం" అను రెండుపదములును ఏకవిభక్తిలో నున్నవి. ఇట్లుండుటవలన ననేకవిధములుగ నావాక్యము నన్వయించుటకు వీలగుచున్నది. లోకమున నధ్యాసమును గాని యపవాదమును గాని యభేదమును గాని విశేషణవిశేష్యభావమును గాని వర్ణించునప్పు డిట్టిప్రయోగము గానవచ్చుచున్నది. ప్రస్తుతవాక్యమున నిం దేయర్థ ముద్దేశింపఁబడెనో తెలియకున్నది. అధ్యాస మనఁగా నొక్కదానిని మఱియొక్కటిగా భావించుట. "నామ బ్రహ్మేత్యుపాసీత" "నామధేయమును పరబ్రహ్మమునుగా నుపాసింపవలయును." అను మొదలగు వాక్యములయం దీయర్థ ముద్దేశింపఁబడెను. ఈయుపాసనయందు నామధేయమునే బ్రహ్మమునుగా భావింతురు. ఈయధ్యాసమునందు ఒకపదార్థమును మఱియొకదానినిగా భావించినను ఉపాసనార్థమై యట్లు భావించుటయే గాని యాభావనవలన పదార్థజ్ఞానము నశింపదు. నామధేయమును బ్రహ్మమునుగా భావించినను "ఇది నామధేయము"అనుతలంపు ఆభావనవలన తొలంగదు కదా! ప్రతిమ మొదలగువానిని విష్ణ్వాదిరూపములతో భావించుటయు నధ్యాసమే. అప్పుడును విష్ణుభావన యున్నను ప్రతిమాశుద్ధి తొలంగదు కదా! ప్రస్తుత వాక్యమునందును ఈయధ్యాసమే యుద్దేశింపఁబడి యుండినయెడల ఓంకారమున నుద్గీథబుద్ధియో ఉద్గీథమున నోంకారబుద్ధియో యుంపవలయు నని నిర్ణయింపఁబడి యుండవలయును. అపవాద మనఁగాఁ గూడ నొకపదార్థమునందు మఱియొకపదార్థరూపమును భావించుటయే గాని యిం దాభావనచే మొట్టమొదట బూర్వపదార్థజ్ఞానము నశించును; పిదప యథార్థజ్ఞానము జనింపఁగానే యారోపితపదార్థభావన యడఁగును. ఇందు మొదటిదానికి (ఆరోపితపదార్థభావనచే యథార్థజ్ఞానము నశించుటకు) నారోప మనియు రెండవదానికి (విచారమువలనఁ గాని పరబోధవలనఁగాని యథార్థజ్ఞానము కలుగఁగానే యారోపితపదార్థ స్వరూపము నశించుటకు) నపవాద మనియు పేరు. ముత్యపుచిప్పను చూచినప్పుడు దానియందు భ్రాంతివలన రజతబుద్ధి యుదయింపఁగానే "ఇది ముత్యపుచిప్ప" యను యథార్థజ్ఞానము లేకపోవును; ఇదియే యారోపము. పిదప పరులయుపదేశమువలన "ఇది వెండి కాదు, ముత్యపుచిప్ప" అనుయథార్థజ్ఞానము కలుగఁగానే రజతభ్రాంతి తొలంగును; ఇది

యే యపవాదము. ఇట్టి యపవాదమే ప్రస్తుతవాక్యమున నుద్దేశింపఁబడి యుండు నేనియు నక్షరోద్గీథజ్ఞానములలో నేదియో యొక్కటి మాత్రమే ప్రధానము కావలసి వచ్చును. ఇక మూఁడవపక్ష మందఱకును తెలిసిన దియే. ఆపక్షము నాశ్రయించిన నోంకారోద్గీథములకు భేదమే కలుగదు. "అభేదమును చెప్పవలసినప్పుడు ఒక్కపదమునుమాత్రమే ప్రయోగించినఁ జాలును. అప్పుడు రెండుపదముల నేల బ్రయోగింపవలయును" అనియెద వేమొ అట్టిప్రయోగములు గూడ ననేకములు గలవు. వ్యాఖ్యానాదుల యందు అర్థమును విశదింపవలసివచ్చినప్పుడు సమానార్థ మగు రెండవపద మును ప్రయోగించుట సహజము. ఇతరస్థలములయందును విశేషాంశము లను తెలుపవలసివచ్చినప్పు డిట్టిప్రయోగములు తఱచుగా గానవచ్చుచునే యున్నవి. కావున నావాక్యముచే నీయర్థము కూడ నుద్దేశింపఁబడియే యుండవచ్చును. ఇక నాల్గవపక్షమును వివరింపవలసినయంశ మేదియు లేదు. విశేషణవిశేష్యములు రెండు నొక్కవిభక్తియందే యుండవలయు ననుట సర్వజనవిదిత మగువిషయముకదా! కావున నిదియు నావాక్యమునకు నుద్దే శము కావచ్చును. ఇట్లు నాలుగర్థములు సమానబలములై ప్రసక్తించు చుండ దేనిని నిర్ణయింపవలయును? ఎట్లు చేయుటకును సాధనములు లేవు. సర్వమును సంశయాస్పదముగనే యున్నది.

## అ_౩. పా_౩. సూ_౯.

అవతారిక:—అనిన నీయధికరణముచే నీసంశయమును నివారించు చున్నాఁడు.

## ౩౯౯. వ్యాప్తేశ్చ సమంజసమ్. ౩. ౩. ౯.

తాత్పర్యము:—ఇట్లు ఉపక్రమవాక్యార్థనిర్ణయమున సంశయింప వలసినపని లేదు. ఇచ్చట మొట్టమొదటిమూఁడుపక్షములలో దేని నంగీ కరించినను దోషము తప్పదు. నాల్గవపక్షమే శ్రుతికి నుద్దేశము. అక్ష రోద్గీథపదములకు విశేష్యవిశేషణభావమే శ్రుతిచే నుద్దేశింపఁబడెను. ఈయోంకారము వేదమున నన్నిస్థలములయందును గానవచ్చుచున్నది. కావున నుపాసనార్థమై గైకొనవలసిన యోంకార మేది యని సంశయము కలుగును; దానిని నిర్ణయించుటకై యుద్గీథపదము ప్రయోగింపఁబడెను.

"ఇచ్చట యుపాసనకై సామవేదమునందలి యుద్గీథ మను భాగమునకు నవయవ మగునోంకారమే యుపాసనార్థమై గ్రహింపఁబడవలయును" అని నిర్ణయింపఁబడెను.

ఇట్లు కాక మొట్టమొదటి దగునధ్యాసపక్షము నంగీకరించినచో పూర్వోత్తరవిరోధము వచ్చును. ఒకపదార్థమునందు మఱియొకపదార్థమును భావించుటయే కదా యధ్యాసము. అప్పుడు ఏపదార్థము మఱియొకపదార్థమునందు భావింపఁబడునో యాపదార్థమును దెల్పుశబ్దము లక్షణావృత్తిచే నన్వయింపఁబడవలసి వచ్చును. "ఈబ్రహ్మచారి సింహము వంటివాఁడు" అనునప్పుడు బ్రహ్మచారియందు సింహభావన యుపదేశింపఁబడెను. సింహపదంబును ప్రత్యక్షసింహమును జెప్పునదిగాఁ గాక గాంభీర్యాదిగుణముల మాత్రమే జెప్పునదిగా లక్షణావృత్తిచే నన్వయింపఁబడెను కదా! ఇట్లే ఓంకారమున నుద్గీథబుద్ధి యుపదేశింపఁబడినచో నుద్గీథశబ్దమునకుఁగాని యుద్గీథమున నోంకారబుద్ధి యుపదేశింపఁబడినచో నోంకారమునకుఁగాని లక్షణావృత్తి నంగీకరించి తీరవలయును. ఇంతమాత్రమే కాదు. అప్పుడే యుపాసనకు ప్రత్యేకఫలమును కల్పింపవలయును. "శ్రుతియందే ఉపాసనాంతమున ఫలము చెప్పఁబడెను కదా!" యనియెదవేమొ ఆఫలము ప్రాణదృష్టిచే జేయఁబడు నోంకారోపాసనకు ఫలమేకాని యుద్గీథదృష్టితో జేయఁబడునుపాసనకు ఫలము కాదు. ఓంకారదృష్టిచే నాచరింపఁబడు నుద్గీథోపాసనకు ఫలము కాదని మఱియొకమాఱు చెప్పవలయునా? ఈకారణమువలన నధ్యాసపక్షము నాశ్రయించుట యెట్లును యుక్తియుక్తము కానేరదు.

ఇట్లే అపవాదపక్షము నాశ్రయించినను ఫలమును క్రొత్తగా కల్పింపవలసినదియే. అదియు (ఆయపవాదంబును) కొంచె మించు మించు అధ్యాసముతో సాటి యైనదియే కదా! "ఇట్లు కాదు. అపవాదమున యథార్థజ్ఞానముచే మిథ్యాజ్ఞానము తొలంగును. అదియే దానికి ప్రయోజనము" అనియెదవేమొ: అదియుక్తము కాదు. మొట్టమొదట నిచ్చట మిథ్యాజ్ఞానమే లేదు. "ఉండవచ్చును" అనిన నది నశింపవలయును కదా! చూడుఁడు. ఇం దేజ్ఞాన మైనను నశించుటకు వీలు కలదా? ఓంకారస్వరూపజ్ఞాన ముద్గీథజ్ఞానముచేతను ఉద్గీథస్వరూపజ్ఞాన మోంకారజ్ఞానముచేతను నశించుటకు నెట్లును వీలు లేదు. అజ్ఞానములు రెండును యథార్థజ్ఞానములే

కదా! ఒకవేళ వానిని భ్రాంతిజ్ఞానము లని సాధించినను అవి నశించుట వలనఁ బురుషులకు బ్రయోజన ముండదు. ఈవాక్యంబును వస్తుస్వరూపమును గూర్చి చెప్పునది కాదు. కావున నెట్లును రెండవపక్షము నాశ్రయించుటయు యుక్తిశూన్యమే.

ఇక మూఁడవపక్షము నాశ్రయించి చూచిన నదియు యుక్తము కాదు. అప్పుడు "అక్షరం ఉద్గీతం" అను రెండుపదములను బ్రయోగించి యుండుట నిరర్థక మగును. ఒకపదముచేతనే సర్వార్థంబును సిద్ధ మగును కదా! "ఏదియో యొకవిశేషము నాశ్రయించి పదద్వయప్రయోగము చేయఁబడెను" అనుటయు సరికాదు. అట్టివిశేషమే మొట్టమొదట లేదు. ఆదరము మొదలగు నర్థములయందు పునరుక్తి గానవచ్చుచున్నది గాని యిచ్చట నట్టి వేవియును లేవు. బాగుగ విచారించిన నక్షరోద్గీథపదములకు సమానార్థము కూడ సంభవింపదు. * హోత † అధ్వర్యుఁడు అనువారు పఠించు ప్రణవమునకు నోంకార మనియే పేరు కలదు కాని యుద్గీథ మని లేదు; సామవేదములోని భాగ మగు నుద్గీథమునకును నిట్లే యోంకార మనుపేరు లేదు. ఇట్లుండ రెండు నభిన్నార్థము లగుట యెట్లు? కారణము వలన మూఁడవపక్షము బొత్తుగనే యుక్తము కాదు.

ఇట్లగుటచే నాల్గవపక్ష మగువిశేషణవిశేష్యభావమే యంగీకరింపఁబడెను. "ఓంకారము సర్వవేదవ్యాపక మగుటచే నం దేయోంకారము నుపాసింపవలయునో యని సంశయము రాగా దానిని నిర్ణయించుటకై యుద్గీథపదము ప్రయోగింపఁబడెను. ఉద్గీథ మనుపేరు గలసామవేదభాగమునకు నవయవ మగునోంకారమే యుపాసనార్హ మని నిర్ణయింపఁబడెను" అనువిషయము మాత్రమే సిద్ధాంతము చేయఁబడెను. "అధ్యాసపక్షమును లక్షణావృత్తి వచ్చు ననియే కదా యాక్షేపించితిరి. ఇచ్చటఁ గూడ లక్షణావృత్తి కలదు. ఉద్గీథపదము సామవేదభాగమునుగూర్చి చెప్పునది యగుటచే యవయవ మగునోంకారమును ప్రత్యక్షముగఁ జెప్పనేరదు. లక్షణావృత్తిచే మాత్రమే కదా చెప్పును" అనియెద వేమొ, సరియే. మాపక్షమున నున్నలక్షణ మిఁగుల సమీపమైనది. సముదాయవాచక మగుపదముచే నందలి యవయవము నూహింపుచున్నాము. ఇట్టి లక్షణ

---

* హోత=యజ్ఞమున ఋగ్వేదముఁ జెప్పుచు హోమముఁ జేయువాఁడు.

† అధ్వర్యుఁడు=యజ్ఞమున యజుర్వేదమును చెప్పువాఁడు.

సర్వసాధారణముగ నున్నది. లోకమున నొక గ్రామములో కొన్ని గృహ ములు దహింపఁబడినచో "ఊరు కాలుచున్నది" అని వ్యవహరించుట వాడుకలో నున్నది. (ఇట్టి వ్యవహారములు నాశ్రయించి చూచిన మాపక్షమునందలి లక్షణ మిగుల సమీపము.) అధ్యాసపక్షమున నన్నో యాలక్షణావృత్తి మిగుల దూరముగ నున్నది. అచ్చట నొకపదార్థముపై దానితో నించుక యైనను సంబంధము లేని మఱియొకపదార్థము నారో పింపవలయును కదా! కావున లక్షణావృత్తి యున్నను పైఁజూపినకారణ ములవలన మాపక్షమే బలవంతమైనది. కావున "ఉద్గీథావయవ మగు నోంకారము నుపాసన చేయవలయును" అనుటయే యుపక్రమవాక్య మునకు తాత్పర్యము.

## ౫. సర్వాభేదాధికరణము.

విషయము, సందేహము :— బృహదారణ్యఛాందోగ్యోపనిషత్తు లయం దున్న ప్రాణసంవాదములయందు వాక్చక్షుశ్శ్రోత్రమనోరేతస్సు లను క్రమముగ * వశిష్ఠప్రతిష్ఠసంపదాయతన ప్రజాతిరూపములనుగా

* వశిష్ఠప్రతిష్ఠసంపదాయతనప్రజాతులు:— వశిష్ఠ యనఁగా సుఖ మగు నివాసస్థానము కలది. ప్రతివాఁడును మాటలచే సుఖముగ నివసింపఁగలుగును కావున వాగింద్రియము వశిష్ఠ యని శ్రుతియందు చెప్పఁబడెను. సమవిషమస్థలముల బాగుగ నెఱిఁగి నిలుచుటకు దృష్టియే సాధనము కావున నేత్రేంద్రియము ప్రతిష్ఠ యని వర్ణింపఁబడెను. బాహ్యవిషయముల పరులయభిప్రాయముల నన్నింటిని గ్రహించుట కును తనయభిప్రాయము నెఱింగించి పరులచే నిష్టసిద్ధినిఁ బొందుటకును శ్రోత్రమే సాధనము కావున దానిని సంపచ్ఛబ్దముచే శ్రుతి వర్ణించుచున్నది. తాను తనయభిప్రా యముల వాగింద్రియముతోనే చెప్పినను పరుఁడు శ్రోత్రముఁతో వినియే కదా వానిని సమకూర్పఁ గలుగుట. కావున పరాభిప్రాయముల నెఱుంగవలసినప్పుడు తనకును స్వాభీష్టసిద్ధి నొందవలసినప్పుడు పరునకునుఁ గూడ శ్రోత్రమే సాధన మగుటచే శ్రుతి యట్లు వర్ణించినది. ఇట్లే మనస్సు సర్వేంద్రియవృత్తులకు సాధార మగుటచే నాయ తన మని వర్ణింపఁబడి యున్నది. సామాన్యముగ సర్వజంతువుల యుత్పత్తికి గారణ మగుటచే రేతస్సు ప్రజాతిశబ్దముతో నభివర్ణింపఁబడినది. ప్రకరణమధ్యమున సర్వా ధార మగుప్రాణమునం దవశిష్టత్వాదు లన్నియుం నారోపింపఁబడినవి.

వర్ణించి శ్రేష్ఠమని చెప్పఁబడిన ముఖ్యప్రాణములకుఁగూడ నీగుణము లున్నట్లు చెప్పఁబడి యున్నది. సర్వేంద్రియములకును ప్రాణమే యాధారము కావున నింద్రియములకుఁ గలవశిష్టత్వాదిగుణము లన్నియు ప్రాణమునకుఁ గూడ నున్నట్లు చెప్పఁబడెను. "య ద్వా వహం అహం వశిష్ఠాఽస్మి త్వం త ద్వశిష్ఠోఽసి" "నేను వశిష్ఠరూపముతో నున్నా నసుట యేది కలదో అది నీస్వరూపమే. వాస్తవస్థితిలో నీవే వశిష్ఠత్వగుణము గల వాఁడవు" అను మొదలగు నింద్రియవాక్యములయం దీవిషయము స్పష్ట మగుచున్నది. కౌషీతకీబ్రాహ్మణోపనిషత్తునందును ఈప్రాణసంవాదము కలదు. అందు ప్రాణమునకు జ్యేష్ఠత్వశ్రేష్ఠత్వగుణములు మాత్రమే చెప్పఁబడెను కాని వశిష్ఠత్వాదిగుణములు చెప్పఁబడ లేదు. మఱియొక శాఖయం దున్న యీవశిష్ఠత్వాదిగుణముల కౌషీతకీబ్రాహ్మణోపనిషత్తు నందలి కథలోనికిఁ దెచ్చికొనవలయునా ? లేదా ? యనుసంశయ మీా సందర్భములవలనఁ గలుగును. ఈసంశయ మీాయధికరణమున నివారింపఁ బడును.

సంగతి, పూర్వపక్షము:—పూర్వాధికరణమున నోంకారోపాస ననుగూర్చి విచారించినప్పుడు ఇతరశాఖలయందలి గుణముల దెచ్చికొన నక్కఱ లేదని సిద్ధాంతము చేయఁబడి యున్నది. దాని నాశ్రయించి ప్రస్తుతాధికరణమునఁ గూడ నెచ్చటిగుణము లచ్చటనే గ్రహింపవలయు నని సిద్ధాంతము చేయవలయు ననియు "అథో య ఏవం విద్వాన్ ప్రాణే నిఃశ్రేయసం విదిత్వా" "ఈవిధముగ నెవ్వఁడు తెలిసికొనునో వాఁడు 'ప్రాణము శ్రేష్ఠము' అని గ్రహించి" అను మొదలగు వాక్యభాగముల యందు "ఏవం=ఈ ప్రకారముగ" అని ప్రయోగింపఁబడి యుండుటచేతను ఆ యేవంశబ్దము సమీాపమున నున్నగుణములను మాత్రమే పరామర్శిం చునది యగుటచేతను ఎచ్చటిగుణము లచ్చట సరిపోవుననియును దృష్టాంతసంగతితోఁ బూర్వపక్షము రాఁగా నది యీాయధికరణమున నిరాకరింపఁ బడును.

## ౩౭౦. సర్వాభేదా దన్యత్రేమే. ౩. ౩. ౧౦.

తాత్పర్యము:—ఇట్లు కాదు. ఛాందోగ్యబృహదారణ్యకోపనిష త్తులయందు చెప్పఁబడిన వశిష్ఠత్వాదిగుణములు కౌషీతకీబ్రాహ్మణోప

నిషత్తునందలి ప్రాణసంవాదములోనికిఁ గూడ దెచ్చికొనవలసినవియే. ఏల యనిన విద్యయంతయు నన్ని యుపనిషత్తులయందు నొక్కటియే. ఛాందోగ్యబృహదారణ్యకోపనిషత్తులయం దేప్రాణసంవాదము వర్ణింపఁ బడెనో కౌషీతకీబ్రాహ్మణోపనిషత్తునందును ఆప్రాణసంవాదమే వర్ణింపఁ బడెను. అందు ప్రాణమునకు జ్యేష్ఠత్వశ్రేష్ఠత్వాదిగుణము లెట్లు వర్ణింపఁ బడెనో కౌషీతకీబ్రాహ్మణోపనిషత్తునందును అట్లే వర్ణింపఁబడెను. ఇంత యేల? ప్రాణమునకు వశిష్టత్వాదిగుణములు చెప్పఁబడలే దనువిషయము తప్ప తక్కినవి యన్నియు సర్వోపనిషత్తులయందును సమానముగనే యున్నవి. ఇట్లుండ నావిషయము నొకస్థలమునుండి మఱియొకస్థలము నకుఁ దెచ్చికొనవలయు ననిన విరోధ మేమి ?

"ఏవంశబ్దము తనసమీపమున నున్నదానిని మాత్రమే గ్రహించు నని చెప్పియుంటిని కదా !" అనియెదవేమో. ఇది యథార్థమే అయినను ఆయేవంశబ్దము తనసమీపమున నున్నపదములచే జెప్పఁబడినవానిని మాత్రమే కాక సందర్భానుసారముగ బుద్ధియందు నిలిచియున్నదానిని సహితము పరామర్శింపఁగలదు. ప్రస్తుతమునందును విద్య యంతయు నొక్కటియే గావున బ్రాణసంవాద మనఁగానే దానినిగూర్చి యేయే స్థలమున నేయేయంశములు చెప్పఁబడెనో అవియన్నియు స్మృతికివచ్చును గావున నీ యేవంశబ్దము వాని నన్నిటిని పరామర్శించును. అట్లు పరామర్శింప దని పట్టుపట్టినను మాసిద్ధాంతమునకు భంగము లేదు. ఒకవేళ కౌషీతకీబ్రాహ్మణోపనిషత్తునం దున్న యేవంశబ్ద మట్లుచేయకున్నను ఛాందోగ్యబృహదారణ్యకోపనిషత్తులయం దున్న యేవంశబ్దములు సర్వగుణములను బరామర్శించుచున్నవి కదా ! ఈకారణమువలనఁ బ్రాణసంవాద జ్ఞాన మనఁగా వశిష్టత్వాదిగుణసహిత సర్వగుణజ్ఞానమే యగును గావున నాగుణము లొక్కస్థలమునఁ జెప్పఁబడకున్నను అచ్చటికి తెచ్చికొనవలసినవియే యగును. గుణవంతుఁడు భిన్నుఁడు కాకపోయినప్పుడు గుణములకు మాత్రము భేద మెటనుండి వచ్చును? అభావ మెట్లు కలుగును? ఒకదేశమున శౌర్యధైర్యాదిగుణములతో ప్రసిద్ధి నొందియున్న పురుషుఁడు తనమాహాత్మ్యము నెఱుంగని యితరదేశమునకుఁ బోయినను ప్రసిద్ధిలేనివాఁడు మాత్రమే యగును కాని శౌర్యాదివర్జితుఁడు కాఁడు కదా ! ఇట్లే ఒకశాఖయందు ఒకపదార్థమునకు గుణము లధికములుగఁ

జెప్పఁబడి మఱియొకశాఖయం దడిగియే పదార్థమునకు సన్నిగుణములు చెప్పఁబడకున్నను ఆపదార్థ మప్రసిద్ధగుణము మాత్రమే యగును కాని గుణశూన్యము కానేరదు. పరిచయ మధికమగుకొలది ప్రదేశమునం దును మొట్టమొదట నప్రసిద్ధములుగ నున్నశౌర్యధైర్యాదులు క్రమ క్రమముగఁ బ్రసిద్ధినొందునట్లే ఆపదార్థముయొక్కగుణములును శాఖాం తరమునందుఁ బ్రసిద్ధములు కాకున్నను విచారణవశమున సుప్రసిద్ధము లగును. కావున నిర్వివాదముగ సమానవిద్యయందు గుణోపసంహారము (ఒకశాఖయందుఁ జెప్పఁబడియున్నవానిని మఱియొకశాఖలోనికిఁ దెచ్చి కొనుట) అవశ్యముగ నాచరింపఁబడవలసినదియే.

---

# ౬. ఆనందాద్యధికరణము.

విషయము:—ఇంతవఱకు గుణము లనఁగా పారమార్థికగుణములే యని వ్యాఖ్యానము చేయఁబడి యున్నది. ఇప్పటివఱకు ప్రాణాద్యుపాస నలే వర్ణింపఁబడి యున్నను వానికిఁ గూడ శ్రేష్ఠత్వాదిగుణములు కల్పిత ములే కాని పారమార్థికములు కావనుట స్పష్టమే యైయున్నను సామాన్యదృష్టికి నన్నియుఁ బారమార్థికములే యని తోఁచును. ఇట్లు తోఁచుటవలన పరమేశ్వరునివిషయమున కొంతసంశయము జనించును. ఆయనకుఁగూడ నుపాసనార్థమై సంయద్వామత్వము మొదలగు కొన్ని గుణములు చెప్పఁబడి యున్నవి; స్వరూపనిర్ణయమునకై ఆనందమయత్వాది గుణములును వర్ణింపఁబడి యున్నవి. ఇవియన్నియు పరమేశ్వరుని పారమార్థిక గుణములే యనియు నిట్లయిన నాయన నిర్విశేషుఁడు కానేరఁ డనియు సంశయము తోఁచును. ఈసంశయమును నివారించి స్వాభావికాస్వాభావికగుణముల విభాగించుటకై యీయధికరణమారం భింపఁబడుచున్నది.

సందేహము:—"పరమేశ్వరునకు ననేకస్థలములయం దానంద మయత్వాదిగుణములు వర్ణింపఁబడి యున్నవి. కొన్నిస్థలములయం దధి కముగాను మఱికొన్నిస్థలములయం దల్పముగాను వర్ణింపఁబడి యున్నవి. ఇచ్చట చేయవలసినకార్య మెద్ది? ఎచ్చట నెన్నిగుణములు వర్ణింపఁబడెనో

వానిని మాత్రమే గ్రహింపవలయునా ? లేక నన్నిస్థలములయందు నన్నిటిని గ్రహింపవలయునా ?" అనుసంశయ మిందు నిరాకరింపఁబడును.

సంగతి:—"పూర్వాధికరణమునఁ బ్రాణము సవిశేష మగుటచే దానిగుణము లొకస్థలమునుండి మఱియొకస్థలమునకుఁ దెచ్చికొనుట యుక్తమే కాని పరమేశ్వరుఁడు నిర్గుణుఁడగుటచే నీయుపసంహారము యుక్తము కాదు. స్వరూపప్రకాశనమునకై మాత్రమే యీగుణములు చెప్పఁబడెను కావున నిచ్చటి వచ్చటనే చాలు నని తోఁచుచున్నది." అని ప్రత్యుదాహరణసంగతితోఁ బూర్వపక్షము రాగా నది యిందు నిరాకరింపఁబడును.

పూర్వపక్షము:—ఆనందాదిగుణముల నన్నిటి నన్నిసందర్భముల యందు నుపసంహరించుకొనుటకు వీలు లేదు. సంయద్వామత్వాదిగుణములు సత్యకామత్వాదిగుణములతో నెట్లు కలిసికొనవో (యేకీభవింపవో) అట్లే ఆనందాదిగుణములును శాఖాంతరమునందుఁ జెప్పఁబడియున్న నిత్యత్వాదులతో సంబంధింపవు. సంబంధించు ననినచో సంయద్వామత్వాదులును సత్యకామత్వాదులతో సంబంధింపవలయును. గుణవంతుఁ డగు పరమేశ్వరుఁ డంతట నొక్కఁడుగనే యున్నాఁడు కదా ! ఈవిషయము (సంయద్వామత్వసత్యకామత్వాదులు పరస్పరము సంబంధించు ననువిషయము) మాత్రము మీకు సమ్మతము కాదు కదా ! ఇట్లుండ నానందాదులకు మాత్ర మితరశాఖయందుఁ జెప్పఁబడియున్న నిత్యత్వాదులతో సంబంధము కల దని యెట్లు సిద్ధాంతము చేయఁగలుగుదురు? చేయకున్న పరమేశ్వరస్వరూపమును సమగ్రముగ నెట్లు బోధింపఁగలుగుదురు ?

## అ-3. పా-3. సూ-౧౧.

అవతారిక:—అను నీపూర్వపక్షము ఖండించుచున్నాఁడు.

## ౩౭౧. ఆనందాదయః ప్రధానస్య.

### 3. 3. ౧౧.

తాత్పర్యము:—ఈపూర్వపక్షము యుక్తమైనది కాదు. విశేష్య మగు బ్రహ్మ మొక్కటియే కావున గుణములు భేదింపవు. ఆనందాది

గుణము లన్నియు నన్నిస్థలములయందు నుపసంహరించుకొనవలసినవియే. గుణవంతుఁ డొక్కఁడే యైయుండ గుణములకు భేదము కలుగదని పై యధికరణమునందే శౌర్యధైర్యాది దృష్టాంతములతోఁ జూపియున్నాము.

---

## అ-3. పా-3. సూ-౧౨.

అవతారిక:—ఇట్లయిన సంయద్వామత్వాదిగుణములును సర్వస్థలములయందు నుపసంహరించుకొనవలసినవియే యగును. తైత్తిరీయోపనిషత్తునందును ఆనందమయాత్ముని వర్ణించినప్పుడు "తస్య ప్రియమేవ శిరః" అని వర్ణింపఁబడియున్నది. ఆప్రియశిరస్త్వాదు లన్నియు నిట్లే యన్నిస్థలములయందు నుపసంహరించుకొనఁబడవలసినవి యగును. ఇది మీకు సమ్మతము కాదు కదా!" అనిన సమాధానముఁ జెప్పుచున్నాఁడు.

---

## 3౭౨. ప్రియశిరస్త్వాద్యప్రాప్తి రుపచయాపచయౌ హి భేదే. 3. 3. ౧౨.

తాత్పర్యము :— తైత్తిరీయోపనిషత్తునందుఁ జెప్పఁబడిన ప్రియశిరస్త్వాదులు మఱియొకస్థలమునను రానేరవు. ఆప్రియాదులు పరస్పరము న్యూనాధికభావములు గలవి. అనుభవించువారై యాశ్రయించియు వానికి వృద్ధిక్షయములు గలవు. న్యూనాధికభావంబును వృద్ధిక్షయంబులును భేద ముండిననేగాని కలుగనేరవు. పరమేశ్వరునియం దట్టిభేదము లేదు కదా! ఇక నీప్రియాదు లాయనకు నెట్లు సంబంధపడును? బాగుగ విచారించిన నివి పరమేశ్వరుని ధర్మములే కావు. "ఆనందమయో౽భ్యాసాత్. ౧. ౧. ౧౨." అను స్థలమున "ఈప్రియశిరస్త్వాదు లన్నియు నానందమయకోశ ధర్మములే కాని బ్రహ్మధర్మములు కావు." అను విషయమును సిద్ధాంతము చేసియున్నాము. ఆసిద్ధాంతమును పట్టిచూచిన మొట్టమొదట నీయాక్షేపమును (అవతారికయందుఁజూపఁబడిన యాక్షేపమును) చేయుటకే వీలు లేదు. మఱియు "ఇవి బ్రహ్మధర్మములే" యని పట్టుపట్టినను ప్రయోజనము లేదు. ఒకవేళ నవి యుపాసనార్థమై గాని

పరమేశ్వరుని గుఱుతించుటకై గాని చెప్పఁబడియే యున్నను అవి సర్వస్థలములలోనికిని రానేరవు; అప్పు డవి వస్తుస్వభావములు కానేరవు కదా! వస్తుస్వభావము లైనచో నెచ్చటెచ్చట నావస్తువు ప్రస్తావింపఁబడునో అచ్చటికి నెల్ల నాస్వభావములును రావలసి యుండును గాని పురుష ప్రయత్నసిద్ధము లగుకల్పితపదార్థము లట్లేల రావలయును? ఏయేసందర్భమున నెంతమాత్రము చెప్పఁబడియుండునో యచ్చటచ్చట నంతంత మాత్రమే యనువర్తించుచుండును. ఈకారణమువలన నాప్రియశిరస్త్వాదు లుపాసనార్థమై చెప్పఁబడినవేయైనను అన్నిస్థలములయందు నుపసంహరింపఁ బడవు. వాస్తవస్థితిలో వీనివిషయమున సంశయమే జనించుటకు వీలులేదు; సిద్ధాంతము చేయవలసినపనియు లేదు. అయినను సూత్రకర్త వీనిని బ్రహ్మధర్మములుగా నంగీకరించి యిట్లు సిద్ధాంతమును జేసియున్నాఁడు. కావున నీన్యాయమును సంయద్వామత్వాదిధర్మముల విషయములో సమన్వయించుకొనవలయును. అవి యుపాసనార్థమై నిర్దేశింపఁబడినవి యగుటచే బ్రహ్మధర్మము లని నిశ్చయింపఁబడి యున్నవి కదా! అవియు నుపాస్యదేవత యగుబ్రహ్మ మొక్కటియే యైనను ఆయాయుపక్రమముల ననుసరించి యుపాసనలు మాత్రము భిన్నము లగుటచే నొకస్థలమునుండి మఱియొకస్థలమునకు రానేరవు. ఉపాసనలు భిన్నము లైనప్పుడు అందలి ధర్మములును నియతముగా భిన్నములే యగు ననుట లోకప్రసిద్ధము. ఉపాస్యదేవత యొక్కటియే యైనను తదర్థము లగునుపాసనలనేకములుగ నుండవచ్చు ననుటయు లోకప్రసిద్ధమే. "ఆప్రభువునకు నిరువురు సేవకులు గలరు. అం దొక్కఁడు ఏకఛత్రమును ధరించియు మఱియొక్కఁడు చామరము ధరించియు నాతని సేవించును" అనిన నప్పుడు ఉపాసింపఁబడువాఁడు ప్రభువొక్కఁడేయైనను ఉపాసనలుమాత్రము భిన్నములుగ నున్నవి; ఉపాసనాధర్మము లగుచక్రవర్తిత్వప్రభుత్వాదులును ప్రత్యేకములుగనే యున్నవి కదా! సామాన్యప్రభువులకుఁ గూడ చామరము లుండవచ్చుననియు చక్రవర్తికిఁగాని యేకఛత్ర ముండదనియు సర్వజనవిదితము. "ఈరెండు నొక్కనియందుఁగూడ నుండవచ్చును గదా!" అనియెదవేమొ. "ఉపాస్యదేవత యొక్కఁడేయైనను అతనిధర్మములలో నొక్కొకదానినే ప్రత్యేకముగా గ్రహించి యనేకవిధములుగ నాతని నుపాసింపవచ్చును" అని యిదివఱకే నిరూపించియున్నాము. పురుషుఁ డొక్కఁడే

యైనను వానికిఁగలవిద్యాగుణమునుబట్టివిద్యార్థులును, దానగుణమునుబట్టి యాచకులును శౌర్యగుణమునుబట్టి శూరులును నిష్పక్షపాతగుణమును బట్టి న్యాయార్థులును సౌందర్యగుణమునుబట్టి కామినులును అనేకవిధములుగ నుపాసింపవచ్చు ననుటలో వివాద మేమి ? గుణములన్నియు నొక్కనియందే యున్నను అన్నియు నన్నియుపాసనలయందు నుపసంహరింపఁబడ వనుటలో సంశయ మేమి ? శూరులకు దానగుణముతోఁగాని యాచకులకు సౌందర్యగుణముతోఁ గాని యిట్లే విద్యార్థులు మొదలగు వారికి విద్యాదివ్యతిరిక్తము లగుగుణములతోఁ గాని ప్రయోజన మేమి కలదు? ప్రయోజన ముండిననే కదా అవి యితరస్థలములలోనికిఁ దెచ్చికొనఁబడును. ఇట్లే పరమేశ్వరోపాసనల విషయమును గూడ నిర్ణయించుకొనవలయును. సంయద్వామత్వాదులును సత్యకామత్వాదులును పరమేశ్వరుని గుణములే యైనను ఏయుపాసనలయందుఁ జెప్పఁబడిన నాయాస్థలములయందు మాత్రమే యుండునుగాని మఱియొకస్థలమునకు రావు. మఱియు నాయుపాసనలయందు కొన్నిచోట్ల స్వల్పముగాను మఱి కొన్నిచోట్ల నధికముగాను గుణములు చెప్పఁబడి యున్నవి. ఈన్యూనాధిక భావము భేద మున్నప్పుడు మాత్రమే సంభవించును. సగుణబ్రహ్మము నందు కల్పితభేదము కలదు కావున నందుమాత్రమే యీన్యూనాధిక భావము సంభవించును. నిర్గుణబ్రహ్మ మట్టిది కాకపోవుటచే వస్తుస్వభావములకు మాత్ర మెప్పటికిని హాని రాదు. కావున సగుణ బ్రహ్మవిషయములగు నుపాసనలయందు న్యూనాధికభావము కలుగవచ్చు ననుటలో సంశయము లేదు. ఈకారణమునుబట్టి విచారించినను ఉపాసనయందుఁజెప్పఁబడినగుణము లొకస్థలమునుండి మఱియొకస్థలమునకు రా నక్కఱ లేదు.

## ౩౨౩. ఇతరే త్వర్థసామాన్యాత్. ౩. ౩. ౧౩.

తాత్పర్యము:—పై సూత్రమునందలి విమర్శచే నుపాసనార్థమై చెప్పఁబడినగుణము లుపక్రమభేద మున్నప్పు డొకస్థలమునుండి మఱియొకస్థలమునకు రా నక్కఱ లేదని నిరూపింపఁబడెను. ఆనందాదిగుణములన్ననో వస్తుస్వభావమును దెల్పుటకై చెప్పఁబడునవి కాని యుపాసనార్థమై కల్పింపఁబడునవి కావు. ఇట్లగుటచే నవి మాత్రము వస్తుప్రస్తావము వచ్చినచోట నెల్ల నుపసంహారము చేసికొనఁదగి యున్నవి. పరమేశ్వరుని

పరమార్థస్వరూపమునందు భేదము లేదు కదా! కావున నధికరణారంభమున జేయఁబడినపూర్వపక్షమువలన నద్వైతసిద్ధాంతమునకు హాని లేదు.

---

## ౭. ఆధ్యానాధికరణము.

సంగతి, విషయసంశయములు:—కఠోపనిషత్తునందు "ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః, మనస స్తుపరా బుద్ధి ర్బుద్ధే రాత్మా మహాన్ పరః. మహతః పర మవ్యక్త మవ్యక్తా త్పురుషః పరః, పురుషా న్న పరం కించి త్సాకాష్ఠా సా పరా గతిః (మూ. ౧. ౪. ౧)" అను శ్రుతి కలదు. ఇందు యింద్రియాదులకంటె విషయాదు లధికము లని చెప్పి కట్టకడపట అన్నిటికంటె బరమేశ్వరుఁ డధికుఁ డనియు నంతకంటె నధికమగునది మఱియొక్కటి లే దనియుఁ జెప్పఁబడి యున్నది. "ఈశ్రుతి విషయాదులకు నింద్రియాదులకంటెఁ గలయాధిక్యమును గూడ బోధింప దలంచియున్నదా? లేక పరమేశ్వరునకుఁ గలసర్వాధిక్యమును మాత్రమే ప్రకటింపఁదలంచినదియా?" యనుసంశయ మిచ్చటఁ గలుగుచున్నది. ఇది యేకఫలత్వసంగతితో నీయధికరణమున నివారింపఁబడును. పూర్వాధికరణమున పరమేశ్వరస్వభావము లగునానందాదులు సర్వస్థలములయందు నుపసంహరింపఁబడవలయు నని సిద్ధాంతము చేయఁ బడి యున్నది. బ్రహ్మస్వభావములు కానివిషయములుకూడ కొన్నికొన్నిస్థలములయందు నిర్గుణబ్రహ్మ ప్రస్తావమున నుపసంహరించుకొనఁబడు ననువిషయ మిందు నిరూపింపఁబడుటచే నీరెండధికరణములకును ఫల మొక్కటియే. ఇదియే వీనికిఁ గల సంబంధము.

పూర్వపక్షము:—విచారించిచూచిన పైశ్రుతియందు ఒక్కపరమేశ్వరునిఁగూర్చి మాత్రమే చెప్పఁబడె ననుట యుక్తియుక్తముగ నుండ లేదు. విషయాదులకు నింద్రియాదులకంటెఁ గలుగునాధిక్యము ప్రత్యక్షముగనే చెప్పఁబడుచున్నది. కదా! "అట్లు చెప్పఁబడి యుండిన వాక్యభేదము కలుగవలసివచ్చును" అనియెదవేమొ. ఆశ్రుతియంతయు నేకవాక్యముగనే యుండవలయు నని నియమము కలదా యేమి? "ఇంద్రియేభ్యః పరా హ్యర్థాః" అని యొక్కొక్కదానియాధిక్యమును దెల్పునది

యొక్కొక్క భిన్న వాక్యము కావచ్చును. "ఇట్లు చెప్పిన ప్రయోజనము లేదు. ఇంద్రియాదుల నుపాసించిన పురుషార్థ మేదియు లేదు కదా!" యనియెదవేమొ యది సరి కాదు. "దశ మన్వంతరా ణీహ తిష్ఠం తీంద్రియ చింతకాః. భౌతికాస్తు శతం పూర్ణం సహస్రం త్వాభిమానికాః. బౌద్ధాదశ సహస్రాణి తిష్ఠంతి విగతజ్వరాః, పూర్ణం శతసహస్రం తు తిష్ఠం త్యవ్యక్తచింతకాః, పురుషం నిర్గుణం ప్రాప్య కాలసంఖ్యా న విద్యతే" "ఇంద్రియములను ధ్యానించువారు పరలోకమున పది మన్వంతరముల కాలము సుఖింతురు. ఇంద్రియవిషయము లగుసూక్ష్మభూతముల ధ్యానించువారు సంపూర్ణముగ నూఱుమన్వంతరముల కాలంబును అంతఃకరణమును ధ్యానించువారు వేయిమన్వంతరముల కాలంబును బుద్ధిని ధ్యానించువారు పదివేలమన్వంతరముల కాలంబును అవ్యక్తమును ధ్యానించువారు లక్షమన్వంతరముల కాలంబును సంపూర్ణసుఖము ననుభవింతురు. నిర్గుణ బ్రహ్మము నాశ్రయించినవారికి నీవిషయమున కాలనియమ మే లేదు." అని స్మృతియందుఁ బ్రత్యేకఫలములు చెప్పఁబడియే యున్నవి. కావున నాశ్రుతి యనేకవాక్యరూపమే యనేకవిషయప్రతిపాదకమే కాని యేకము కాదు.

## అ_౩. పా_౩. సూ_౧౪.

అవతారిక:—అనుసీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౩౭౪. ఆధ్యానాయ ప్రయోజనాభావాత్.

### ౩. ౩. ౧౪.

తాత్పర్యము:—ఈపూర్వపక్షము యుక్తమైనది కాదు. పై శ్రుతి పరమేశ్వర ప్రతిపాదనపర మగునేకవాక్య మే కాని భిన్న వాక్యములు కావు. ఏల యనిన పరమేశ్వరజ్ఞానమువలన మాత్రమే ప్రయోజనము గానవచ్చుచున్నది గాని విషయాదిజ్ఞానములవలన నట్టిప్రయోజనము గానవచ్చుట లేదుకదా! పరమేశ్వరునిస్వరూపము నెఱింగిన సర్వభ్రాంతియు నశించి పరమసుఖ మగుమోక్షము దొరకును గాని "ఇంద్రియములకంటె భూతములు శ్రేష్ఠములు" అని తెలిసికొనిన నేమిలాభము కలదు ? శ్రుతియు "నిచాయ్యతం మృత్యుముఖా త్ప్రముచ్యతే" "ఆపరమేశ్వరుని వెదకి తెలిసి

కొనిన సంసారబాధనుండి విముక్తుం డగును” అని పరమేశ్వరజ్ఞానము వలన కలుగు లాభమును ప్రత్యక్షముగనే వర్ణించి యున్నది. అర్థాదిజ్ఞాన ములవలన కలుగు ప్రయోజనము నట్లు వర్ణింపలేదు కదా! ఒకవేళ నట్టి స్మృతి గానవచ్చినను అదియు పరమేశ్వరజ్ఞానమువలన మాత్రమే యధిక ఫలము చెప్పఁబడియున్నది; మఱియు నింద్రియాదిజ్ఞానమువలన నల్ప ఫలము గలుగు ననుటకును “పరమేశ్వరుని యథార్థస్వరూపములు కాని పదార్థముల పరమేశ్వరుఁడుగా భావించుచున్నారు” అనుటయే కదా! కావున నెట్లును పరమేశ్వరజ్ఞానమే ప్రధానము.

మఱియు నా శ్రుతి పరములుగ వర్ణింపఁబడిన భూతాదుల నిషే ధించి “సా కాష్ఠా సా పరా గతిః” అని పరమేశ్వరునే ప్రధానునిగా వర్ణింపుచున్నది. ఉపాసనాపూర్వకముగ పరమేశ్వరుని పరాత్పరునిగాఁ గ్రహించుటకై మాత్రమే భూతాదులు ప్రస్తావింపఁబడిన వని తెల్పు చున్నది. కావున కేవలభూతాదిధ్యాన మీ శ్రుతికి విషయము కాదు. వాక్యభేదము కల దనిన ప్రయోజనము లేదు.

## అ_3. పా_3. సూ_౧౫.

అవతారిక:—ఈసిద్ధాంతమును మఱియొకకారణముచేఁ గూడ దృఢపరచుచున్నాఁడు.

## 325. ఆత్మశబ్దాచ్చ. 3. 3. ౧౫.

తాత్పర్యము:—ఇంతమాత్రమే కాదు. “ఏష సర్వేషు భూతేషు గూఢాత్మా న ప్రకాశతే, దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మ దర్శిభిః” “ఈపరాత్పరుఁ డగువాఁడే యాత్మ. ఈతఁడే సర్వజంతువులయం దును ప్రచ్ఛన్నుఁడై దాగియున్నాఁడు. బాగుగ విమర్శచేయఁగలపురుషులు మాత్రమే మిగుల సూక్ష్మమైనదియు ఉత్తమమైనదియు నగుబుద్ధితో నాయనను గాంచఁగలుగుదురు” అని యుత్తరవాక్యమునందే శ్రుతి యా పరాత్పరు నాత్మగా నభివర్ణించి యున్నది. భ్రాంతివలన మఱియొకవిధముగ దోఁచుచున్న యాత్మయొక్క స్వస్వరూపమును బోధించుటయే కదా శ్రుతికిఁ బ్రధానకార్యము. ఇ ట్లగుటచేఁ బూర్వవాక్యమునందు యింద్రి యాదులను మాత్రమే యుద్దేశించి బోధించె ననుట యుక్తియుక్తముగ

దోపలేదు. ఆత్మకుఁ గలసర్వాధిక్యమును బోధించుటకై యే వానిని ప్రస్తావించి యుండవచ్చును. ఆయింద్రియాదులు ప్రత్యక్షసిద్ధములు; ఆత్మ యట్టివాఁడు కాఁడు. శాస్త్రమునకును తెలియనివిషయము బోధించుటయే లక్షణ మని పలుమాఱు దెలిపియే యున్నాము కదా! కావున నాపూర్వవాక్య మవశ్యముగ పరమేశ్వరుని బోధించునదియే యని చెప్పి తీరవలసియున్నది. మఱియొకస్థలమునందు ప్రత్యక్షముగనే "పరమేశ్వరు నెఱుంగుట కష్టసాధ్యము" అని నిరూపించి "యచ్ఛే ద్వాఙ్మనసీ ప్రాజ్ఞ స్త ద్యచ్ఛే జ్జ్ఞాన ఆత్మని జ్ఞాన మాత్మని మహతి నియచ్ఛే త్త ద్యచ్ఛే చ్ఛాంత ఆత్మని" "మొట్టమొదట వాగాదిసర్వేంద్రియముల మనస్సునందు జేర్పవలయును. (సర్వమును మనోమాత్రముగా భావింపవలయు ననుట). ఆమనస్సును బుద్ధియందును ఆబుద్ధిని హిరణ్యగర్భునిబుద్ధియందును దానిని సర్వసంక్షోభరహితుఁ డగుపరమేశ్వరునియందును జెప్పవలయునుఁ (తత్తన్మాత్రములనుగా భావింపవలయు ననుట). ఇట్లు చేసిన నాపరమేశ్వరుఁడు గోచరుఁడగును." అని బాగుగ నుపాసనావిధానమును స్వయముగనే బోధించియున్నది. ఇట్లు బాగుగ నుత్తరసందర్భమును విమర్శించిన పరమేశ్వరుని విషయమునందు మాత్రమే శ్రుతికి దాత్పర్య మున్నట్లు స్పష్టమగుచున్నది.

పూర్వసందర్భమును విమర్శించినను యీవిషయమే స్పష్టమగుచున్నది. "సోఽధ్వనః పార మాప్నోతి త ద్విష్ణోః పరమం పదం" "ఎవ్వనికి చక్కని సారథి (బుద్ధి) కలఁడో వాఁడు సర్వవ్యాపకుఁ డగుపరమేశ్వరుని పరమపదమును సంసారరూపమార్గమునకు నంతమున నున్నదానిని జెందును." అనునది పూర్వవాక్యము. దీనివలన "సంసారమున కావల నొక్కయుత్తమస్థానము కల దని నిర్ణయమగుచున్నది కదా! ఆస్థానమునకు స్వరూప మేది" యను*నాకాంక్ష రాఁగా దానిని నివారించుటకై మాత్రమే "ఇంద్రియేభ్యః పరాహ్యర్థా" అను నుత్తరవాక్య మారంభమయ్యె ననుట యెంతయు యుక్తియుక్త మగును. అర్థాదులనుగూర్చి చెప్పిన యాధిక్యములు ప్రత్యక్షవిషయములఁగూర్చినవి యగుటచే ననువాదములు కావచ్చును; పరమేశ్వరుఁడు అప్రత్యక్షవిషయ మగుటచే నాయనను గూర్చి చెప్పినదియే ముఖ్యతాత్పర్యము కావచ్చును. మఱియొకవిధముగ

* ఆకాంక్ష (అ-౧. పా-౪. సూ-౩. పేజీ-451 చూ.)

జెప్పిన నీసందర్భములు బాగుగ సమన్వయింపవు. ఈకారణమువలన నెట్లును "ఇంద్రియేభ్యః" అను మొదలగు వాక్యము పరమేశ్వరస్వరూపప్రతిపాదన పరమే యని సిద్ధాంతము చేయవలసియున్నది.

---

# ౮. ఆత్మగృహీత్యధికరణము.

## ప్రథమవర్ణకము.

విషయము, సంశయము :— ఐతరేయోపనిషత్తునందు "ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీ న్నాన్య త్కించన మిష త్స ఈక్షత లోకా న్ను సృజా ఇతి. న ఇమాగ్ం ల్లోకా న సృజ తాంభో మరీచీ ర్మరీ మాపః" "సృష్టికిఁ బూర్వమున నాత్మ యొక్కటియే యుండెను. ఆయన లోకముల సృజింపవలయు నని సంకల్పించెను. స్వర్గము అంతరిక్షము భూలోకము పాతాళము అనువానిని సృజించెను." అను శ్రుతి కలదు. ఈ శ్రుతియందలి యాత్మశబ్దము పరమేశ్వరపరమా? లేక హిరణ్యగర్భపరమా? యను సంశయ మీయధికరణమున నివారింపఁబడును.

పూర్వపక్షము, సంగతి :— పై వాక్యమునందు పరమేశ్వరుఁడు చెప్పఁబడె ననుటకు వీలు లేదు. అచ్చట హిరణ్యగర్భుఁడే యవశ్యముగ ప్రస్తావింపఁబడి యుండవలయును. పూర్వోత్తరసందర్భముల విమర్శించి చూచిన నట్లే గానవచ్చుచున్నది. "అది యెట్లు? పై వాక్యమునందు సృష్టికి పూర్వమున నున్నవాఁ డొక్కయాత్మయే యని నిర్ధారణ చేయఁబడి యున్నది. ఆతఁడు సంకల్పపూర్వకముగ సృజించె ననియుఁ జెప్పఁబడి యున్నది. ఇతరశ్రుతుల ననుసరించిచూచిన సృష్టికిఁ బూర్వమున నున్న వాఁడు పరమేశ్వరుఁడే యనుటయు సంకల్పించి కార్యముల నాచరింపఁ గలవాఁడు చేతనుఁడే యనుటయు పరమేశ్వరునికంటె భిన్ను లగు చేతనులు లే రనుటయు స్పష్టమగుచున్నది. కావున పై శ్రుతియందు వర్ణింపఁ బడినవాఁడు పరమేశ్వరుఁడే యనుట స్పష్టమే యగుచున్నది." అనియెద వేమొ, యది యుక్తము కాదు. ఇచ్చట లోకసృష్టి చెప్పఁబడియున్నది కాని భూతసృష్టి కాదు. ఈవాక్యమువ పరమేశ్వరుఁడే యుద్దేశింపఁ బడెనేని మొట్టమొదట భూతసృష్టియే చెప్పఁబడియుండవలయును కదా! అట్లు చెప్పఁబడక భూతములచే నేర్పడిన లోకములనుగూర్చియే చెప్పఁ

బడి యుండుటవలన నిచ్చట ప్రస్తావింపఁబడినవాఁడు పరమేశ్వరుని సహాయమువలన (అనఁగా ఆయనచే నధిష్ఠింపఁ బడి యుండుటవలన) పరమేశ్వర కల్పితము లగుభూతముల గైకొని సృష్టి నాచరించు హిరణ్యగర్భుఁడే కావలయు నని తోఁచుచున్నది. లోకసృష్టినిగూర్చి శ్రుతిస్మృతులు కూడ నిట్లే చెప్పుచున్నవి. "ఆత్మైవేద మగ్ర ఆసీత్పురుష విధః...స వై శరీరీ ప్రథమః స వై పురుష ఉచ్యతే ఆదికర్తా స భూతానాం బ్రహ్మాగ్రే సమవర్తత" "సృష్టికిఁ బూర్వమున నున్నయాత్మ (హిరణ్యగర్భుఁడు) మనుష్యాకారుఁడై యుండెను. ఆహిరణ్యగర్భుఁడే శరీరధారులలో మొదటివాఁడు. ఆతనికే పురుషుఁ డని పేరు. ఆతఁడే సర్వజీవశరీరమునకును ప్రథమ సృష్టికర్త. ఆతఁడే సర్వభూతములకంటె మొట్టమొదట బుట్టినవాఁడు" అను శ్రుతిస్మృతు లీవిషయమునఁ బ్రమాణములు. మఱియు వీనిని విమర్శించిన నాత్మశబ్దమునకు హిరణ్యగర్భునియందును బ్రయోగము గలదనియు నాతఁడును లోకసృష్టికంటెఁ బూర్వముననుండు వాఁడే కావున "అగ్ర ఆసీత్" అని యౌపచారికముగ జెప్పఁబడవచ్చు ననియుఁగూడఁ దేలుచున్నది. ఆతఁడు చేతనుఁ డనుట నిర్వివాదాంశమే కావున సంకల్పముకూడ నిర్వివాదముగ నుండవచ్చును. వ్యవహారములన్నియును లోకమును విమర్శించిన దేహాదులు గలవారిచేత మాత్రమే జరుపఁబడుచున్నవి యని స్పష్ట మగుచుండుటచే సృష్టిసంకల్పము గూడ నట్టివారిచేతనే చేయఁబడవలయు ననియు నిర్ణయ మగుచున్నది.

మఱియు పూర్వప్రకరణము ననుసరించి చూచినను నిచ్చట ప్రస్తావింపఁబడినవాఁడు హిరణ్యగర్భుఁడే యని స్పష్టమగుచున్నది. "అథాతో రేతసః సృష్టిః ప్రజాపతే రేతో దేవాః" "ఇక రేతస్సువలనఁ గలుగు సృష్టిని వివరించెదను. దేవతలే చతుర్ముఖునియొక్క రేతస్సు" అని యారంభించి యాచతుర్ముఖునిచే నాచరింపఁబడిన విచిత్రసృష్టి పూర్వప్రకరణమున వర్ణింపఁబడియున్నది. ఈకారణములవలన నావాక్యమునందు ప్రస్తావింపఁబడినవాఁడు హిరణ్యగర్భుఁడే యని సిద్ధాంతము చేయవలసియున్నది. పూర్వాధికరణమునందును పూర్వోత్తరసందర్భముల నాశ్రయించియే కదా! "ఇంద్రియేభ్యః" అనుశ్రుతి యేకవాక్యముగ నిర్ణయించియున్నారు.

---

## అ-3. పా-3. సూ-౧౬.

అవతారిక:—ఆని యిట్లు దృష్టాంతసంగతిచే వచ్చిన పూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

# 3౭౬. ఆత్మగృహీతి రితరవ దుత్తరాత్.

## 3. 3. ౧౬.

తాత్పర్యము:—ఐతరేయశ్రుతి పరమాత్మపరమే కాని హిరణ్యగర్భపరము కానేరదు. ఇతరశ్రుతులయం దంతటను సృష్టిప్రకరణములయందు పరమేశ్వరుని గ్రహించినట్లే యిచ్చటను గ్రహింపవలయును; ఉత్తరసందర్భమును విమర్శించిన నందును సంకల్పపూర్వకసృష్టి చెప్పఁబడి యున్నది. ఇదియు పరమేశ్వరుని గ్రహించిననే గాని సరిపడదు. పరమేశ్వరభిన్నుఁ డగుచేతనుఁడే లోకమున లేఁ డనుటయు ఎవ్వఁ డేకార్యము నాచరించినను పరమేశ్వరసహాయముచేతనే (తనలోఁ బరమేశ్వరుఁడు ప్రవేశించియుండుటచేతనే) యాచరించుచున్నాఁ డనుటయు సర్వలోకప్రసిద్ధము కదా! ఈకారణమువలన హిరణ్యగర్భుఁడే ప్రస్తుతశ్రుతియందు వర్ణింపఁబడె నని గ్రహించినను పరమేశ్వరుఁడే గ్రహింపఁబడినట్లగును. పరమేశ్వరసహాయము లేక హిరణ్యగర్భుఁడును ప్రవర్తింపనేరఁడుకదా! కావున ఆత్మశబ్దము ప్రయోగింపఁబడినప్పుడు దాని కనేకార్థము లున్నను లోకులు ముఖ్యార్థ మగుజీవుని మాత్రమే గ్రహించునట్లు శ్రుతియందును ముఖ్యమగుపరమేశ్వరునే గ్రహించుట యుక్తము. "పురుషవిధః" అనుమొదలగువిశేషణము లుండినచో నప్పుడు మాత్రము గత్యంతరము లేకపోవుటచే నాయాత్మశబ్దము నన్యపరముగ సమన్వయింపవలయును గాని యిచ్చట న ట్లేల చేయవలయును? నిశ్చయముగ నిచ్చట జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

## అ-3. పా-3. సూ-౧౭.

అవతారిక:—"ఇది యెట్లు సిద్ధాంత మగును. పూర్వపక్షమునందు గలహేతువులకు ప్రతిఘాత మేమి?" యనిన చెప్పుచున్నాఁడు.

# ౩౭౭. అన్వయా దితి చే త్స్యా దవధారణాత్

## ౩. ౩. ౧౭.

తాత్పర్యము:—"పూర్వపక్షమున జూపఁబడిన హేతువులవలన నిచ్చటి యాత్మశబ్దము హిరణ్యగర్భపరముగా సమన్వయింపవలయును" అనుట యుక్తము కాదు. శ్రుతియందు "వా ఏవ" అని *యవధారణము చేయఁబడి యుండుటచే నందు ప్రస్తావింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడే కలఁడు" అనువిషయ మిట్లు చేసిననే కాని స్పష్టముగ శీఘ్రముగ గోచరము కాదు; అభేదజ్ఞానము రాదు. ఇచ్చట హిరణ్యగర్భునే గ్రహించినఁ బరమేశ్వరవిషయము పరంపరగా మాత్రమే గ్రహింపఁ బడవలసినది యగును కదా! "పరమేశ్వరునే చెప్పియుండిన నన్ని యుపనిషత్తుల యందువలెనే మహాభూతసృష్టియే చెప్పఁబడియుండవలయును కదా!" అనియెదవేమొ యదియు నంత యావశ్యకము కాదు. ఛాందోగ్యోపనిషత్తునందు "త త్తేజోఽసృజత" అని అగ్నిసృష్టియే యారంభమున జెప్పఁబడియుండిన నచ్చట తైత్తిరీయశ్రుతి ననుసరించి యాకాశవాయుసృష్టు లెట్లుపసంహరించుకొనఁబడినవో అట్లే యిచ్చటగూడ లోకసృష్టి చెప్పఁబడి యున్నను యితరశ్రుతుల ననుసరించి పంచభూతసృష్టి నుపసంహరించుకొనవలయును ; "పంచభూతముల సృజించినపిదపఁ బరమేశ్వరుఁడు లోకముల సృజించెను" అనియే తాత్పర్యమును నిర్ణయింపవలయును. కేవలలోకవ్యవహారాదులను మాత్రమే యనుసరించి వేదాభిప్రాయమును భిన్నము చేయుటకు బొత్తుగనే వీలులేదు." 'గా మానయత్' 'గోవును తెచ్చెను' అను మొదలగువాక్యములు వేదమునందే కలవు" అనియెదవేమొ యదియు సరికాదు. ఒకకథ నారంభించిన నం దెన్నిసందర్భముల నాశ్రయించినవిషయములో యుండును. అవి యన్నియు ముఖ్యతాత్పర్యముతో సంబంధము కలవి యయ్యేయుండవలయుననుట సంభవించునా? ప్రస్తుతవాక్యము పంచభూతపురుషసంవాదరూపమైయున్నది; పురుషుఁడు కల్పితభేదము గలవాఁ డగుటచే కలిగించుకొనఁబోవువాఁ డగుటచే నవిశేషుఁడే గావున వానినిగూర్చి యిట్టివ్యవహార ముండుటలో విరోధ

* అవధారణము = నిశ్చయము (చేయుపదము.)

మేమియు లేదు. ఇంతమాత్రమువలన దానితోఁ బరమేశ్వరునకుఁ గూడ సంబంధ ముండవలయునా ? ఈకారణమువలన నిచ్చట జెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

మఱియు అధ్యయనవిధివలన శ్రుతి పరమపురుషార్థసాధన మని నిర్ణయింపఁబడెను. ఈకారణమువలన నేవిధముగా నర్థముచెప్పిన పరమ పురుషార్థ హేతు వగునో ఆవిధముగనే సంభవము కలిగినచోట్లనెల్ల నర్థము చెప్పుట యుక్తియుక్తము. గతి లేని యొకానొకచోట మాత్రము భిన్న భిన్న ప్రకారములతో నర్థము చెప్పక తప్పదు; అచ్చటను తాత్పర్యమునకు విరోధము లేకుండునట్లుగనే యర్థము కల్పింపఁబడును. ఇట్లుండ విస్ప ష్టముగ జీవబ్రహ్మైక్యమునందుఁ దాత్పర్యమును దెల్పుచున్న యీశ్రుతి సందర్భమునకు మఱియొకవిధముగా నర్థము చెప్పఁబూనుట యెంత వెఱ్ఱి తనము. ఆశ్రుతి మొట్టమొదట "సృష్టికిఁ బూర్వము పరమేశ్వరుఁ డొ క్కఁడే యుండెను." అని చెప్పి యాయననుండి సృష్టిని ప్రతిపాదించి "ఏత మేవ సీమానం విదా ర్యైతయా ద్వారా ప్రాపద్యత" "ఈ బ్రహ్మరంధ్రమును పగులఁగొట్టి యాద్వారమునుండియే పరమేశ్వ రుఁడు జీవభావమున శరీరమును బ్రవేశించెను" అని జీవస్వరూపమును నిరూపించి మఱల నంతమున "స ఏత మేవ పురుషం బ్రహ్మ తత మప శ్యత్" "ఆజీవుఁడు స్వస్వరూపమును పరమేశ్వరమాత్రముగా గ్రహిం చెను" అని జీవబ్రహ్మైక్యమును బోధించెను ; "ఏష బ్రహ్మ" "ఈయా త్మయే బ్రహ్మ" అని యారంభించి ప్రాపంచికపదార్థముల నన్నింటిని జె ర్కొని "సర్వం తత్ప్రజ్ఞానేత్రం ప్రజ్ఞానే ప్రతిష్ఠితం ప్రజ్ఞానేత్రో లోకః ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ"="ఈసమస్తము జ్ఞానమాత్రమే, యిది యంతయు జ్ఞానమునందే నిలుపఁబడి యున్నది. జ్ఞానముచేతనే స్వకార్య ములయందు ప్రవర్తించుచున్నది. జ్ఞానమే సర్వాధారము. అదియే బ్రహ్మము." అని ప్రపంచబ్రహ్మములకుఁ గూడ నైక్యమును చెప్పి యుపసం హరించెను. ఇఁక సంశయ మేమి ? ఉపసంహారానుగుణముగ నుపక్రమ మునందును పరమేశ్వరుఁడే యుద్దేశింపఁబడి యుండవలయును కదా ! కావున నిర్వివాదముగ నిచ్చట ప్రస్తావింపఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

# ౮. ఆత్మగృహీత్యధికరణము.

ద్వితీయవర్ణకము.

విషయసంశయము :—బృహదారణ్యకోపనిషత్తున నొకస్థలము నందు "కతమ ఆత్మేతి యోఽయం విజ్ఞానమయః" "ఆత్మ యెవ్వఁడు? సర్వసాక్షి యగుజీవుఁడు" అని యారంభించి యాజీవునకు స్వాభావిక మైన నిర్వికారత్వమును బోధించి పరమేశ్వరైక్యమును సిద్ధాంతము చేసి "స వా యేష మహా నజ ఆత్మా జరః" "అజీవుఁడే జన్మమృత్యురహితుఁడగు పరమేశ్వరుఁడు" అని శ్రుతి యుపసంహరించుచున్నది. ఛాందోగ్యోపనిషత్తునందు "స ఆత్మా తత్త్వమసి" "ఆసత్పదార్థమే యాత్మ, అదియే నీవు" అని యుపసంహారము మాత్ర మిట్లే గానవచ్చుచున్నది గాని యుపక్రమమునందుమాత్రము ఆత్మశబ్దము లేదు. "స దేవ సో మ్యేద మగ్ర ఆసీత్" అని ఆత్మానాత్మునకు సమానవాచక మైనట్టియు ఉనికిని మాత్రమే బోధించునట్టియు సచ్ఛబ్దమే యందు గానవచ్చుచున్నది. ఇట్లుండుటచే నీ సందర్భములు రెండును పరస్పరభిన్నము లగునేమో యని శంక గలుగఁగా నది యీవర్ణకమున నిరాకరింపఁబడును.

పూర్వపక్షము, సంగతులు:—ప్రస్తుత సందర్భములను విమర్శించిన నవి రెండును పరస్పరభిన్నములే యని తేలుచున్నది. శ్రుతులు విషయమును పరస్పరభిన్నముగాఁ జెప్పియుండ వానియభిప్రాయ మొక్కటి యగుట యెట్లు? బృహదారణ్యకోపనిషత్తునందు ఆత్మశబ్దముతోనే ప్రకరణ మారంభింపఁబడెను కావున నచ్చట చేయఁబడినది యాత్మోపదేశమే కావచ్చునుగాని ఛాందోగ్యోపనిషత్తునందు మాత్ర మట్టియుపక్రమము లేదుకావున నది యాత్మోపదేశ మనుటకు వీలు లేదు. ఉపసంహారమున నొకవేళ నాత్మశబ్ద మున్న దనినను అది (ఉపసంహారము) యుపక్రమము ననుసరించియే యుండవలయును కావున నుపక్రమానుసారముగ నన్వయింపఁబడవలసినదే కాని ప్రత్యేకముగ నన్వయింపఁబడుటకు వీలు లేదు. ఉపక్రమమునందలి సచ్ఛబ్దమును సత్తాసామాన్యపరమునుగా (సత్తాసామాన్య మనఁగా నన్నిపదార్థములయందు నేకరూపముతో నున్న యునికియే) గ్రహించి దానికే బ్రహ్మత్వము కల దని నిశ్చయించి (కల్పించి

యనుట చైతన్యము కాని కేవల సత్త పరమేశ్వరుఁడు కాడు కదా !) జీవునకు దానితోనే యైక్యమును సిద్ధాంతము చేయవలయును. "ఒక్క పదార్థము నెఱింగినచో సర్వప్రపంచము నెఱుంగవచ్చు నను ప్రతిజ్ఞ నాశ్ర యించి చూచిన సచ్ఛబ్దవాక్యము బ్రహ్మ మనుటయే సిద్ధాంత మగును గదా !" అనియెదవేమో. సత్తయు సర్వవ్యాపినియే కావున దాని నెఱుం గుటచేతఁ గూడ సర్వము నెఱింగిన ట్లగును గదా ! ఈకారణమువలన నీసందర్భము ఎట్లును పరస్పరభిన్నములే. పూర్వోత్తరసందర్భముల విమర్శించిన "ఇంద్రియేభ్యః" అనువాక్య మేకవాక్యముగఁ గన్పట్టుచుండు టచే నచ్చట వాక్యభేదము లేదని పూర్వాధికరణమున సిద్ధాంతముచేసి యున్నాఁడు గాని యిచ్చట నట్లు చేయుటకు వీలు లేదు. ఇచ్చట ప్రకరణ భేదమువలన వాక్యభేదము ప్రత్యక్షముగనే గానవచ్చుచున్నది కదా !

అవతారిక :—అని యిట్లు ప్రత్యుదాహరణ సంగతితో వచ్చిన యాక్షేపమునకు సమాధానము చెప్పుచున్నాఁడు.

## ఆత్మగృహీతి రితరవ దుత్తరాత్.

తాత్పర్యము:—ఛాందోగ్యోపనిషత్తునందును బృహదారణ్యకోప నిషత్తునందువలెనే యాత్మనే గ్రహించితీరవలయును. అచ్చట నాత్మా నాత్మల బోధించి సచ్ఛబ్దమున్నను దానియర్థమును మాత్ర మాత్మపరము గానే నిర్ణయింపవలయును. ఉత్తరసందర్భ మట్లే యున్నది కదా !

అవతారిక:—"వాక్యమును సమన్వయింపఁబోయిన నట్టియర్థము రా దని చెప్పియుంటిమి కదా!" అనిన సమాధానమును చెప్పుచున్నాఁడు.

## అన్వయా దితి చే త్స్యాదవధారణాత్.

తాత్పర్యము:—పూర్వపక్షమునఁ జూపఁబడిన హేతువులు యుక్తి యుక్తములు కానేరవు. ఛాందోగ్యోపనిషత్తునందుఁ గల ప్రకరణము కూడ పరమాత్మపరమే యనుటకు గుఱుతు లనేకములు కలవు. మొట్ట మొదట "ఏనా శ్రుతం శ్రుతం భవత్య మతం మత మవిజ్ఞాతం" "ఏ పదార్థము నెఱింగిన వినఁబడనివస్తువు వినఁబడినది యగునో సంకల్పింపఁ బడనివస్తువు సంకల్పింపఁబడినది యగునో బుద్ధిగోచరము కానిది బుద్ధి

యగునో" అని సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ చేయఁబడి యున్నది. కారణకార్యములకు భేదము లేదు కావునఁ గారణము నొక్కదాని నెఱింగినఁ గార్యముల నన్నిటి నెఱుంగవచ్చుననుటయే యాప్రతిజ్ఞకు నభిప్రాయము. సచ్ఛబ్దముచే సత్తాసామాన్యము గ్రహింపఁబడినచో నది ప్రపంచకారణము కాదు కావున నొకపక్షమునఁ బ్రపంచవిజ్ఞానము కలుగనే కలుగదు; ఏదియో యొకవిధముగా దానియందుఁ గారణత్వమును సాధించినను అది సామాన్యరూపమే కావున సామాన్యజ్ఞానము మాత్రమే కలుగునుగాని విశేషజ్ఞానము కలుగదు. పరమేశ్వరునే యా సచ్ఛబ్దమునకు నర్థమునుగా గ్రహించినచో సామాన్యవిశేషజ్ఞానములు రెండును కలుగవచ్చును. ఆయన శుద్ధచైతన్యస్వరూపుఁడు కావున నశ్వరరూపముతో సామాన్యజ్ఞానంబును జీవరూపముతో విశేషజ్ఞానంబును కలుగవచ్చును. మఱియు సత్తాసామాన్యమనునది ద్రవ్యగుణకర్మలతో సంబంధించి యుండునదియే కాని వానికి స్వరూపము కాదు; పరమేశ్వరుఁడన్ననో సర్వపదార్థములకును స్వరూపమే. ఇప్పుడు చూడుఁడు! ఏపదార్థమును గ్రహించిన సర్వవిజ్ఞానము బాగుగ గలుగుటకు వీలు కలదో? ఈకారణమువలన సచ్ఛబ్దముచే బరమేశ్వరుఁడు చెప్పఁబడె ననుటయే యుక్తియుక్తము.

మఱియు సృష్టికిఁ బూర్వమున నొక్కసత్పదార్థమే యుండె నని మొట్టమొదటను, జీవుఁడు సుషుప్త్యవస్థయందు ఆసత్పదార్థమునే యందు నని ప్రకరణమధ్యమునందును, ఆసత్పదార్థమునకును జీవునకును భేదము లేదని యంతమునందును జెప్పఁబడియుండ సత్పదార్థ మాత్మ కా దనుట యెట్లు యుక్తియుక్త మగును? ఆసత్పద మనాత్మనే చెప్పునేని జీవుఁడు సుషుప్త్యవస్థయందు దానితో నేకీభవించుటకును సర్వకాలములయందు నైక్యము నొందుటకును వీలు లేదు కదా! జీవుఁ డాత్మ యగుటచే నాతనికి మనాత్మతో నభేదము సంభవింపదు.

ఇదియునుఁ గాక సత్తాసామాన్యమునకు బ్రహ్మత్వమును కల్పించి జీవునకు తత్ప్రాప్తిని చెప్పినచో నది సత్తాసామాన్యోపాసనయే యగును; కావున దానికి ప్రత్యేకఫలమును కల్పింపవలసివచ్చును. ఛాందోగ్యోపనిషత్తునం దిట్టికల్పన లేదు; నిర్విశేష మగు మోక్షఫలమే చెప్పఁబడి యున్నది. పైన నిరూపించిన కారణములను బట్టి చూచిన నట్లు ఫలభేదమును వర్ణించుటకుఁ గూడ వీలులేదు కదా! ఈకారణములవలన సుష

క్రమము ననుసరించి యుపసంహారమును మార్చుటకు వీలు లేదు. ఉప క్రమము సంశయాస్పదముగ నున్నది. అందు ఆత్మనుగూర్చి గాని యనాత్మను గూర్చి కాని స్పష్టముగ వివరింపఁబడి యుండలేదు. ఇట్లు సామాన్యముగ నున్నదానికి వాక్యశేషమున నున్నవిశేషముతో విరోధ మేల కలుగును ? సామాన్యమునకు విశేషసంబంధ మావశ్యకముగ నుండవలయును కదా! కావున నిచ్చట నుపసంహారము నాశ్రయించియే యుపక్రమమునకు నర్థము చెప్పి తీరవలయును.

ఇంత యేల? కేవల సచ్ఛబ్దార్థమును విమర్శించినను యాసిద్ధాంతమే స్థిర మగును. సత్పదమునకు సత్యమని యర్థము. పరమేశ్వరభిన్న మగు పదార్థము లే దనియు శ్రుతియందు చెప్పఁబడియున్నది. ఈసత్పదము ఆత్మభిన్న మగుదానిని చెప్పునేని యసత్యమునే చెప్పునది కావలసి వచ్చును. ఇది యతివిరుద్ధము. సత్యపదార్థవాచక మగుసచ్ఛబ్ద మసత్య పదార్థమును చెప్పు ననుట కంటె విరుద్ధము వేఱొక్కటి కలదా ? యీ కారణములవలన సచ్ఛబ్ద మాత్మనే చెప్పు ననవలయును. మఱి యెచ్చట నైనను యిట్టిసందర్భములు గానవచ్చినచో నచ్చట తాత్పర్యాంశమును బట్టి యిట్లే సిద్ధాంతము చేయవలయును. నిరూపణాప్రకారము భిన్నమైనను నిరూపింపఁదగినవిషయ మొక్కటియే యైనచో ప్రకరణ తాత్పర్యములకుఁ బరస్పర భేద ముండదు.

---

# ౯. కార్యాఖ్యానాధికరణము

విషయ సంశయములు:—ఛాందోగ్యోపనిషత్తునందు "తస్మాద్వా ఏత దశిష్యంతః పురస్తా చ్చోపరిష్టాచ్చాద్భిః పరిదధతి" జలము ప్రాణములకు వస్త్ర మగుటవలన భుజింపఁబోవువారు భోజనమునకుపూర్వమునందును తర్వాతను కూడ జలముచే ప్రాణమును కప్పుదురు" అని చెప్పఁబడి యున్నది. ఇట్లే బృహదారణ్యకోపనిషత్తునందును "త ద్విద్వాంసః శ్రోత్రియా అశిష్యంత ఆచామం త్యశి త్వాచామం త్యేత మేవ త దన మనగ్నం కుర్వంతో మన్యంతే. తస్మా దేవం విదశిష్యన్నాచామే దశిత్వాచామే దేత మేవ త దన మనగ్నం కురుతే" "జలములు ప్రాణమునకు

వస్త్రము లగుటవలన నీవిషయము నెఱింగినవిద్వాంసులు భోజనముచేయఁ బోవుచు నాచమనము చేయుదురు. భుజించినపిదపఁ గూడ నాచమనము చేయుదురు. ఇట్లు చేసి ప్రాణమునకు వస్త్రము నొసంగితి మని భావింతురు. ఈకారణమువలన ప్రస్తుతపురుషులునుభోజనమునకుఁ బూర్వమున నాచమనము చేయవలయును. భోజనానంతరమందును ఆచమనము చేయవలయును. ఇట్లు చేసిన ప్రాణమునకు వస్త్రదానము నొసంగినవారు లగుదురు" అని యున్నది. ఈవాక్యములను విమర్శించిన నాచమనంబును "జలము ప్రాణమునకు వస్త్రము" అని ధ్యానించుటయుఁగూడ విధింపఁబడినట్లు తోఁచుచున్నది. ఇందు రెండును విధింపఁబడెనో లేక నొక్కటిమాత్రమే విధింపఁబడెనో తెలియకున్నది. ఇతరస్థలములయందు గల ప్రాణవిద్యలలోనికి నీవిషయముల నుపసంహరించుకొనవలయునో లేదో నిర్ణయము కాకున్నది. ఈసంశయ మీయధికరణమున నివారింపఁబడును. "ఈవిషయముల నితర విద్యలలోనికి నుపసంహరించుకొనవలసినపనిలేదు." అని సిద్ధాంతము చేయఁబడును.

పూర్వపక్షము, సంగతులు:—విచారించినచో రెండును విధింపఁబడినట్లే సామాన్యదృష్టికి తోఁచుచున్నది. విశేషదృష్టిచే విమర్శించిన నాచమన మొక్కటిమాత్రమే విధింపఁబడినట్లు స్పష్ట మగుచున్నది. ఒక్కవాక్యము రెండువిషయముల విధించె ననిన నప్పుడు వాక్యభేదము కలుగవలసి వచ్చును. ఇది ప్రామాణ్యమును భగ్నము సేయును కదా! కావున నొక్కవిషయము మాత్రమే విధింపఁబడె నని యంగీకరింపవలయును. అది యాచమనమే. అదియు స్మృతులయందు చెప్పఁబడియే యున్నను ఈప్రాణవిద్యాంగముగా జెప్పఁబడ లేదు కావున నూతనముగ విధింపఁబడవచ్చును. జలమును ప్రాణవస్త్రమునుగా భావించుట యనునది యాచమనమునకు స్తోత్రము కావచ్చును. కావున బృహదారణ్యకోపనిషత్తునందు"అసిష్యంత ఆచామంత్యసి త్వాచామంతి" అని సందిగ్ధముగ (విధియో కాదో అను సంశయము కలుగునట్లుగాఁ) జేయఁబడియున్న యుపక్రమమును "అసిష్యం నాచామే దసిత్వాచాచామేత్" అను వాక్యశేషము నాశ్రయించి విధిపరముగ సమన్వయింపవలయును. పూర్వాధికరణమునందును "స దేవ సో మ్యేద మగ్ర

ఆసీత్” అను నుపక్రమము సందిగ్ధమైయుండఁగా దానిని “స ఆత్మా” అను వాక్యశేషము నాశ్రయించియే కదా బ్రహ్మపర మని నిర్ధారణ గావించితిరి.

## అ-3. పా-3. సూ-౧౮.

అవతారిక:—ఈవిధముగ దృష్టాంతసంగతితో వచ్చినపూర్వపక్షము ను ఖండించుచున్నాఁడు.

---

## 3౭౮. కార్యాఖ్యానా దపూర్వమ్ 3. 3. ౧౮.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట సరి కాదు. పైశ్రుతియందు కేవలాచమనము విధింపఁబడె ననుటకు వీలులేదు. ఆయాచమనము స్మృతుల యందు పవిత్రతకొఱకై సర్వకర్మాంగముగ మున్నే విధింపఁబడి యున్నది. ప్రస్తుతశ్రుతి దానినే ప్రాణవిద్యాసందర్భమున ననువాదముచేసె ననుటయే యుక్తియుక్తము. “ఇట్లే సిద్ధాంతము చేయవలయు నని నియమ మేమి? ప్రస్తుతశ్రుతి యాచమనస్మృతికి మూలము కావచ్చునుకదా! అప్పుడు ఇది విధియే యగును” అనుయెడ వేమొ, యట్లు కాదు; ప్రస్తుత శ్రుతికిని ఆచమనస్మృతికిని *మూలమూలీభావ ముండుటకు వీలు లేదు. ఈ రెంటికిని విషయములు భిన్నములు. స్మృతి సామాన్యముగ సర్వ పురుషులకును సర్వకర్మలకును ఆచమనమును విధించుచున్నది ; శ్రుతి యన్ననో ప్రాణవిద్యయందు పఠింపఁబడినది. కావునఁ బ్రాణోపాసనకు నవయవ మగునాచమనమును మాత్రమే చెప్పుచున్నది. ఇట్లుండ నీపరిచ్ఛిన్నశ్రుతి సర్వవ్యాపక మగువిధికి మూల మగుట యెట్లు? రెండును సమానవిషయమును బోధించిననేకదా వానికి మూలమూలీభావ మేర్పడును. ఈ కారణమువలన స్మృతిప్రసిద్ధ మగుసామాన్యవిధి యీశ్రుతిచే ననువాదము చేయఁబడుచున్నది యని మాత్రమే చెప్పవలయునుగాని మఱియొకవిధముగఁ జెప్పుటకు వీలులేదు. సామాన్యవిధి యొక్కటి యిది

---

* మూలమూలీభావ మనఁగా పరస్పరము బీజాంకురములవలె నుండుట. మూల మనఁగా ప్రమాణసిద్ధమై యేర్పడి యున్న యొకవిషయము. దాని నాధారము చేసి కొని వ్యాఖ్యానరూపముగ వచ్చినవిషయము మూలి. వీనిసంబంధమే మూలమూలీ భావసంబంధము.

వఱకే యుండుటచేతను ప్రస్తుతశ్రుతి దానికి మూలభూత మగుటకు వీలు లేకపోవుటచేతను ఆవిధియే యింకను ప్రత్యక్షముగ గుఱుతింపఁబడుట చేతను ఇచ్చట ననువాదమే కాని విధి లేదనుట తేలుచున్నది. "ఇట్లయినను ఈశ్రుతి ప్రాణవిద్యకై ప్రత్యేకాచమనమును విధింపవచ్చును"అనిన నదియు యుక్తము కాదు. పైఁజూపిన సామాన్యవిశేషభావము స్థిరమైయుండఁగా ప్రత్యేకవిధి సంభవింపదు; సంభవించినఁ బునరుక్తిదోషము వచ్చును. "ఇట్లు రా నక్కఱలేదు. 'నానృతం వదేత్' అని సామాన్యముగ నసత్య వాక్యము నిషేధింపఁబడినను యజ్ఞప్రస్తావమున మఱల నానిషేధము ప్రత్యేకముగ గానవచ్చుచున్నది. ఇట్లే యిచ్చటఁగూడ స్మృతిప్రసిద్ధి యున్నను ప్రాణవిద్యాంగమున నాచమనమును మఱల విధింపవచ్చును." అనియెదవేమొ, యట్లు కాదు. అసత్యవాక్యనిషేధము సామాన్యశ్రుతి యందు పురుషార్థమై మాత్రమే యాచరింపఁబడెను; యజ్ఞమును గూర్చి చెప్పువిశేషశ్రుతి యన్ననో దానిని యజ్ఞార్థముగఁ జెప్పుచున్నది. ఇట్లగు టచే నచ్చట పునరుక్తిదోషము లేదు. ప్రస్తుతవిషయమునం దన్ననో స్మృతియందే సర్వకర్మార్థముగ పరిశుద్ధికై యాచమనము విధింపఁబడెను. కర్మసంబంధము లేనప్పుడు కేవల పురుషునకు నసత్యవాక్యనిషేధముతో వలె నాచమనముతోఁ బ్రయోజనము లేదు కదా! ఇట్లు కర్మార్థమై జెప్పఁ బడినదానినే మఱల గర్మార్థమయ్యే విధించినఁ బునరుక్తిదోషము వచ్చు ననుటలో సంశయ మేమి? "శ్రుతియం దున్నదానిని మఱల విధించుటచే స్మృతివచనమునకే పునరుక్తిదోష మేల రాఁగూడదు?" అనియెదవేమో వినుము. స్మృతియందలి విధి సర్వవ్యాపకమైనది. కావున దానికి శ్రుతి యందలి విశేషవిధితో బౌనరుక్త్యము కలుగుటకు వీలులేదు. విశేషము సామాన్యమును నియమింపనేరదుకదా! కావున నెట్లును కేవలాచమనము శ్రుతియందు విధింపఁబడ లేదు.

"ఆచమనంబును ఆయుదకమును ప్రాణవస్త్రమునుగా భావించు టయు నను నీరెంటినిఁ గూడ నాశ్రుతి విధించెను." అను పక్షము కూడ యుక్తియుక్తము కాదు. అప్పుడు వాక్యభేదము కలుగు నని యిదివఱకే చెప్పియున్నాము. పైఁజెప్పినకారణములును ఈవిషయమునఁ దోడ్పడు చున్నవి. ఈకారణమువలన ప్రస్తుతశ్రుతియందు భోజనమునకంటె ముందును వెనుకను ఆచరింపఁబడవలయు నని స్మృతివాక్యముచే నిర్ధారణ

చేయఁబడియున్న యాచమనము ననువాదముచేసి "ఆయాచమనజలమును ప్రాణవస్త్రమునుగా ధ్యానింపవలయును" అని మాత్రమే విధింపఁబడె నని చెప్పవలసియున్నది.

మఱియు ప్రాణవస్త్రరూపముఁగ ధ్యానింపుమని చెప్పుట యాచమన మును స్తోత్రము చేయుటకని నిర్ణయించుటకు వీలులేదు. ఆచమనము విధి కాదని యిదివఱకే నిర్ణయించియున్నాము. విధినిమాత్రమే కాని స్తోత్రము చేయ రనుటయు సర్వజనవిదితమే. మఱియు విచారించిన నిచ్చట ప్రాణ వస్త్రత్వభావనయే విధింపఁబడినట్లు గానవచ్చుచున్నది. స్తోత్రమునకును దానిచే స్తుతింపఁబడవలసినదానికిని గలసంబంధము లోకమున ప్రసిద్ధ మయ్యేయున్నది. స్తోత్రమునకై యుపయోగింపఁబడువిషయము ప్రత్య క్షాదిప్రమాణసిద్ధమై యుండవలయును; స్తుతింపఁబడుపదార్థ మట్లు కాక వేదమాత్రగోచరమై యుండవలయును. ఇట్లుండిననే గాని స్తోత్రమువలనఁ బ్రయోజన ముండదు కదా! ఏపదార్థమునైనను దానియందలి యాధిక్య మును తెలుపుటకై మాత్రమే స్తోత్రము చేయుచున్నారనుట ప్రత్యక్ష సిద్ధము. సర్వప్రమాణసిద్ధ మగుపదార్థమే స్తుతింపఁబడు ననిన నీనియమ మెట్లు సరిపడును? స్తుతించుటకంటె ముందుగనే యాపదార్థమునందలి గుణదోషము లన్నియు విశదము లయ్యెను కదా! కావున నెట్లు చూచి నను ప్రాణవస్త్రత్వభావన యాచమనవిధికి స్తోత్రము కానేరదు. ఆచమన విధి సుప్రసిద్ధము; ప్రాణవస్త్రత్వభావన యప్రసిద్ధము.

"ఇట్లయిన నొక్కయాచమనమునకే రెండు ప్రయోజనములు అంగీకరింపఁబడిన ట్లగును; ఒక్కయాచమనమే పరిశుద్ధికొఱకును ప్రాణ మునకు వస్త్రముగా నుండుటకొఱకును గూడ నుపయోగించు నని యంగీకరింపఁబడిన ట్లగును. ఇది యుక్తము కాదు. ఒక్కకర్మకు నొక్క ఫలమే యుండుట యుక్తము గాని యనేకఫలము లుండుట యుక్తము కాదు కదా!" అనియెదవేమొ యట్లు కాదు. మేము ఆచమనంబును ప్రాణవస్త్రత్వభావనను గూడ ప్రత్యేకకర్మలనుగా నంగీకరించుచున్నాము. పరిశుద్ధికొఱకై పురుషునిచే నాచరింపఁబడునాచమన మొకకర్మ. ఆయాచ మనమునకై యుపయోగింపఁబడు జలమును ప్రాణవస్త్రముగా భావించుట మఱియొకకర్మ. ఇట్లంగీకరించినచో మీరు చూపినదోష మేదియు రాదు.

ఇదియునుగాక యుపనిషత్తునందు జలమునుగూర్చి చెప్పఁబడు టకు ముందు అన్నమునుగూర్చియు "య దిదం కించాశ్వభ్య ఆకృమిభ్య ఆకీటపతంగేభ్య స్త త్తేఽన్నం" "శునకములవఱకు పురుగులవఱకు కీటక ములు పక్షులు మొదలగువానివఱకు నేయేపదార్థములు కలవో అవి య న్నియు నీకు నాహారమే" అని ప్రాణముతో నింద్రియములు చెప్పినట్లు వర్ణింపఁబడి యున్నది. ఇది "వాటి నన్నిటిని భక్షింపవలయును" అను విధి కానేరదు. వేదమున నట్లు (భక్షింపవలయునని) ప్రత్యక్షముగఁ జెప్పఁ బడి యుండలేదు. విధిగా నన్వయింపవలయు ననిన క్రియను అధ్యాహా రము చేసికొనవలసివచ్చును. ఇట్లగుటచే నీవాక్యమునకు "సర్వపదార్థ ములను ప్రాణాహారములనుగా భావింపవలయును." అనుట మాత్రమే తాత్పర్య మని నిర్ణయింపవలసియున్నది. ఈభావనయు శ్రుతియందు బ్రత్యక్షముగ చెప్పఁబడకున్నను పూర్వోత్తరవాక్యములయందు "మ న్యంతే" అను మొదలగుపదము లుండుటచే నధ్యాహారాదులతోఁ బని లేకయే గ్రహింపఁబడవచ్చును. మఱియు సర్వపదార్థముల నాహారముగ నుపయోగించుట యశక్యముగదా! కావున బూర్వవాక్యమున నీవిధ ముగ భావన మాత్రమే యుపదేశింపఁబడి యుండుటచే జలవిషయమై చెప్పునుత్తరవాక్యములుగూడ భావనయే చెప్పఁబడె నని సిద్ధాంతము చేయవలసియున్నది. ఇచ్చట భావనావాచక మగు "మన్యంతే" యను క్రియ ప్రత్యక్షముగనే యున్నది; జలంబును ప్రత్యక్షముగ వస్త్రమగు టకు వీలు లేదు. ఇట్లగుటచే నీవాక్యమునకు ఆచమనవిధియందు తాత్ప ర్యము లేదనియు ప్రసిద్ధమగునాచమనమునే యనువాదముచేసి అం దుప యోగింపఁబడుజలమునందు ప్రాణవస్త్రత్వమును భావింపవలయు ననుట యందే తాత్పర్యము కల దనియు సిద్ధాంతము చేయవలసి యున్నది.

మఱియు ఛాందోగ్యబృహదారణ్యకోపనిషత్తులయందు రెంటి యందును "ఆచామంతి" అని వర్తమానక్రియయే యుపయోగింపఁబడి యున్నది. వర్తమానక్రియ విధిని స్థాపింపనేరదు. "'మన్యంతే' అను పదముకూడ వర్తమానమునందే యున్నది. అదిమాత్రము విధిని సూచిం చుట యెట్లు?" అనియెదవేమొ వినుము. రెండువాక్యములలో నేది యు విధిని సూచింపకున్న నిక నావిద్యయే ప్రయోజనకారి కానేరదు

కావున దేనినో యొకదానిని విధినిగా నిర్ణయించ తీరవలయును. అందు ఆచమనవాక్యమునే విధివాక్యమునుగా నిర్ణయించుటకు వీలు లేదనువిష యమును గూర్చి యిదివఱకే బహువిధములుగ నిరూపించి యున్నా ము. ఆయాచమనము అపూర్వము కాదనియు మఱియొకస్థలమునఁ బ్రసిద్ధమయ్యే యున్నది యనియు నిరూపించి యున్నాము. ఇట్లగుటచే దానిని చెప్పువాక్యమును విధివాక్యమునుగా నిర్ణయించుటకు వీలు లేదు. జలమును ప్రాణవస్త్రమునుగా భావింపవలయు ననుటమాత్రము క్రొత్తవిషయము కావున దానినిగూర్చి చెప్పువాక్యమే యవశ్యముగ విధివాక్యము కావలయును. " 'ఆసిష్య న్నాచామేత్' అని యాచమన వాక్యమునందు ప్రత్యక్షముగ విధివిభక్తి (లిఙ్ ప్రత్యయము) కలదు కదా !" అనియెదవేమో అంతమాత్రముననే దానిని విధి యని సమ ర్థించుటకు వీలులేదు. విధింపఁబడువిషయ మపూర్వము కావలయును. ఆచమన మట్టిది కాదనియు బహుయుక్తులతో నిదివఱకే ప్రతిపాదింపఁ బడెను కదా ! ఈవిధముగ నీశ్రుతియం దాచమనవిధి యుద్దేశింపఁబడక పోవుటచే కణ్వశాఖవారు వారియుపనిషత్తునందు "అనగ్నం కుర్వంతో మన్యంతే" అనునంతటితోనే ముగించుకొనుచున్నారు గాని "తస్మా దే వం విదధిష్య న్నాచామేత్" అని పఠించుటయే లేదు. మాధ్యందినశాఖ వారు (బృహదారణ్యకోపనిషత్తు రెండుశాఖలయందు కలదు. ఆశాఖలకు కణ్వశాఖయనియు మాధ్యందినశాఖ యనియుఁ బేర్లని తెలిసికొనవలయును) అట్లు పఠించినను వారికిఁగూడ పై నిర్ణయింపఁబడినదియే తాత్పర్య మనక తీరదు. పూర్వవాక్యమున విధింపఁబడియున్న ప్రాణవస్త్రత్వభావనము ఊరక యనువాదము చేయుటయే కాని యుత్తరవాక్యమున విశేషవిషయ మేదియు లేదు. "తస్మా దేవం విత్" అనువాక్యభాగమునకు "ఆ కార ణమువలన జలమును ప్రాణవస్త్రమునుగూడ భావింపవలయు నని యెఱిం గినవాఁడు" అని మాత్రమే యర్థమును చెప్పవలయును. ఆచమనము ననువాదముచేసి ప్రాణవస్త్రత్వభావనను మాత్రమే "ఏవం విత్" అను వాక్యభాగముచే నాశ్రుతి విధించుచున్నది యని నిర్ణయింపవలయును. ఇట్లేల చేయఁవలయును? కణ్వశాఖయందు ప్రాణవస్త్రత్వభావనయు మా ధ్యందినశాఖయం దాచమనంబును విధింపఁబడె ననరాదా" యనియెద వేమో, యది సంభవింపదు. రెండు స్థలములయందును ప్రకరణమంతయు

నొక్కటీరుగనే యున్నది. కదా! కావున నిచ్చట ప్రాణవస్త్రత్వభావన మాత్రమే విధింపఁబడె ననుటయే సిద్ధాంతము. ఈప్రాణవిద్యయం దెచ్చటను ఆచమనవిధి నుపసంహరించుకొనవలసినపని లేదు. మొట్ట మొదట నాచమనవిధియే లేదు కదా! సర్వకర్మాంగముగ స్మృతియందు విధింపఁబడినయాచమనమే యన్నిటితోను స్వాభావికముగనే సంబంధించును.

---

## ౧౦. సమానాధికరణము.

విషయ సంశయములు :— వాజసనేయశాఖయందు అగ్ని రహస్యమున శాండిల్యవిద్య యను నొకవిద్య గలదు. "స ఆత్మాన ముపాసీత మనోమయం ప్రాణశరీరం భా రూపం" "పురుషుఁడు మనోమయుం డును ప్రాణము శరీరముగఁ గలవాఁడును ప్రకాశరూపుఁడు నగునాత్మ నుపాసింపవలయును" అని యావిద్యయం దాత్మకు మనోమయ త్వాదిగుణములు చెప్పఁబడియున్నవి. బృహదారణ్యకోపనిషత్తునందును, "మనోమ యోఽయం పురుషో భాః సత్య స్తస్మి న్నంతర్హృదయే యథా వ్రీహి ర్వా యవో వా స ఏష సర్వ స్యేశానః సర్వ స్యాధిపతిః సర్వమిదం ప్రశాస్తి య దిదం కించ" "మనోమయుఁడును నిత్యుఁడును ప్రకాశరూపుఁడు నగునీపురుషుఁడు హృదయమధ్యమున వడ్లగింజవలెను యవవలెను సూక్ష్మరూపుఁడై యున్నాఁడు. ఆతఁడే సర్వమును నియమించు వాఁడు, సర్వమునకు నధిపతి, మనయెదుట నేదేది కలదో దాని నంతయు స్వకార్యములయందు ప్రవర్తింపఁజేయుచున్నాఁడు" అని శాండిల్య విద్యనే వర్ణించుచు నాత్మకు సర్వేశ్వరత్వాదిగుణములు అధికముగవర్ణింపఁ బడి యున్నవి. ఈరెం డుపాసనలు నభిన్నములా? లేక భిన్నములా? ఒకదానియందు చెప్పఁబడినగుణములఁ మఱియొకదానిలోనికిఁ దెచ్చికొన వలయునా? లేదా? అనుసంశయ మిందు నిరాకరింపఁబడును.

పూర్వపక్ష సంగతులు :—ఉపాసన యభిన్న మైననే కాని గుణోపసంహారము చేయఁబడదు కదా! ఇచ్చట నట్టియైక్యమును నిర్ణ యించుటకు వీలు లేదు. అప్పుడు పునరుక్తిదోషము వచ్చును. శాఖలు

రెండుగా నుండినచో నప్పుడు వాని నభ్యసించువారు వాని ననుసరించి యనుష్ఠించువారును భిన్నులుగా నుండుటచే వారికై బ్రత్యేకముగ నొక్కయుపాసనయే చెప్పఁబడి యుండవచ్చును; అం దొకచో నధిక గుణములు కలవేని మఱియొకస్థలమునకుఁ దెచ్చికొనవచ్చును. పునరుక్తి దోషంబును రాదు. ప్రస్తుతమున శాఖయొక్కటియే. కావున నాపునరుక్తి దోషమును నివారించుటకు నుపాయ మెద్దియు లేదుకదా! కావున నిచ్చటివిద్యలు పరస్పరభిన్నము లనియే చెప్పవలసి యున్నది.

"ఇట్లు కాదు. ఈయుపాసనలలో నొక్కటి విధింపఁబడెను. మఱి కొన్నిగుణముల నధికముగ విధించుటకై యదియే రెండవమాఱ ను వాదము చేయఁబడెను" అనిన నదియు యుక్తము కాదు. గుణములఁ జెప్ప కయే కేవలవిధి గానవచ్చెనేని యది గుణవిధానమునకై మఱల నను వదింపఁబడవచ్చును కాని యట్లు లేకున్న ననువదింపఁబడదు. కొన్నిస్థల ములయందు గుణసహితము లైనవిధులకుఁ గూడ ననువాదము కన్పట్టు చున్నది గాన నప్పుడు ఆరెంటికిని బరస్పర మంతర్భావ ముండవల యును. ఏవియో కొన్ని విశేషగుణములు దప్ప తక్కినవి భిన్నములుగ నుండఁగూడదు. ప్రస్తుతోపాసన లీరెండుతెగలలోను జేరలేదు. అగ్ని రహస్యమునందు చెప్పఁబడిన విద్యయందును బృహదారణ్యకోపనిషత్తు నందు చెప్పఁబడిన విద్యయందును గూడ గుణములు చెప్పఁబడియే యున్నవి. రెంటికిని పరస్పరాంతర్భావము కూడ లేదు. "కామరూపిణం"= "ఆత్మ కామరూపిణిఁగా నుపాసింపవలయును" అని కొన్నిగుణము లగ్ని రహస్యమునందును "సర్వ స్యేశానః" అనుమొదలగు గుణములు బృహ దారణ్యకమునందును జెప్పఁబడి యున్నవి. ఈగుణములకు బరస్పరసంబంధ మింత యైనను లేదు. ఇట్లగుటచే దేనికి నదిభిన్న మైనదియే కాని యన్యము కాదు. ఈకారణమువలన నివి ప్రత్యేకముగ విధింపఁబడినవి యనుటయే సిద్ధాంతము. తెలియనివిషయమును తెలుపుటయు ఒకకార్యమునందుఁ బ్రవర్తింపనివానిని ప్రవర్తింపఁ జేయుటయు నేది కలదో అదియే విధి. ఇచ్చట రెండుస్థలములయందును విధింపఁబడినగుణములు క్రొత్తవియే కావున పురుషుఁడు వానిని క్రొత్తగా గ్రహింపవలసినవాఁడే; క్రొత్త ప్రయత్నముతో భావింపవలసినవాఁడే. కావున విద్యలు పరస్పరభిన్నము లనుటలో సంశయము లేదు. ఒకదానియందలిగుణముల రెండవదానిలోనికి

నుపసంహరించుకొనవలయు ననుట యుక్తము కాదు. ఆచమనవిధి స్మృతి ప్రసిద్ధ మగుటచే దానిని శ్రుతి యనువాదము చేసె నని చెప్పి పూర్వాధికరణమున ప్రాణవస్త్రత్వభావనయే విధింపఁబడినట్లు సిద్ధాంతము చేసితిరి గాని యిచ్చటమాత్రము విధి యనియు యనువాద మనియు స్పష్టము కాకపోవుటచే రెంటినిఁ గూడ విధివాక్యములనుగానే యంగీకరించి తీరవలయును.

## అ_3. పా_3. సూ_౧౯.

అవతారిక:—అని యిట్లు ప్రత్యుదాహరణసంగతిచే వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## 3౭౯. సమాన ఏవం చాభేదాత్. 3. 3. ౧౯.

తాత్పర్యము:—ఇట్లు సంశయింపఁ బని లేదు. శాఖలు భిన్నములైనప్పుడు విద్య లనేకముగా నెట్లు గ్రహింతురో అట్లేయేకశాఖయందుఁ గూడ గ్రహించుటకు వీలు కలదు. "ఈవిద్యలు పరస్పరభిన్నములా? కావా?" అని నిర్ణయింపవలసివచ్చినప్పుడు "ఈవిద్యలయందు ఉపాస్యుఁడుగా చెప్పఁబడినదేవత యొక్కఁడా? ఇరువురా?" అని మాత్రమే విచారింపవలయును గాని "శాఖలు భిన్నములా? కావా?" యని కాదు. సర్వము నుపాస్యదేవత నాశ్రయించియే నిర్ణయింపఁబడవలసియుండును. ఉపాస్యదేవత యొక్కఁడైన విద్యలు నొక్కటియే యగును; కాకున్న భిన్నము లగును. ప్రస్తుతవిద్యలయందును మనోమయత్వాదిగుణములు గలపరమేశ్వరుఁ డొక్కఁడే యుపాస్యదేవతగా వర్ణింపఁబడె నని గుఱుతించుచున్నాము. ఉపాస్యదేవతయే యుపాసనకు రూపము. ఉపాస్యదేవత యభిన్నుఁ డగుటచే విద్యారూప మభిన్న మైనది. ఇట్లుండ నిట విద్యాభేదము కల దని యెట్లు నిర్ణయింపఁగలము? మఱియు విద్యలకు భేదము లేకున్న గుణములకు నుపసంహార మేల లేకపోవును?

"పునరుక్తిదోషము వచ్చుటచే విద్యలకు పరస్పరభేదము కల దని నిశ్చయించితిమి" అనిన నది యుక్తము కా దనియెదము. అట్లొకవిద్యనే రెండుమారులు చెప్పుటకు ప్రయోజనము కలదు. ఒకస్థలమున నుపాసన విధింపఁబడెను, రెండవస్థలమున కొన్నిగుణములు మాత్రము దెల్పఁ

బడెను. ఇట్లు చెప్పుటలో ననుపపత్తి యేమియు లేదు. "ఇట్లయిన నగ్నిరహస్యమునందు చెప్పఁబడినగుణములు మాత్రమే బృహదారణ్యకోపనిషత్తునందును జెప్పఁబడి యుండవలయును. 'సర్వస్యేశానః' అను మొదలగునవి మాత్రమే చెప్పఁబడియుండవలయును. 'మనోమయః' అను మొదలగునవి చెప్పఁబడి యుండఁగూడదు." అనియెదవేమొ; యిది యొకదోషముకాదు. ఆమనోమయత్వాదిగుణములు పఠింపఁబడియుండుటచేతనే కదా మనము "అగ్నిరహస్యమునందలి విద్యయే బృహదారణ్యకోపనిషత్తునందలివిద్య" యని గ్రహింపఁగలుగుచున్నాము. శాండిల్యవిద్య యగ్నిరహస్యమునందుఁజెప్పఁబడినది మిగుల దూరమున నున్నది. దానియందు వర్ణింపఁబడిన గుణములఁ బ్రస్తావించుటచే దాని నిచ్చట గుఱుతింపఁగలుగునట్లు చేసి కదా! శ్రుతి యధికగుణముల విధించుచున్నది. ఇట్లు చేయకుండిన "బృహదారణ్యకోపనిషత్తునందలి గుణములు అగ్నిరహస్యమునందలివిద్యకు సంబంధించినవియే" యని నిర్ణయించుటకు వీ లెట్లు కలుగును? మఱియు క్రొత్తవిషయముల బోధించుటయె వాక్యమునకు సార్థకత్వము. ఇట్లు సార్థక మగువాక్యమునఁ బూర్వసిద్ధము లగువిషయములు కూడ నుండెనేని యది (పూర్వసిద్ధవిషయములఁ జెప్పుట) *నిత్యానువాద మగును. ఇట్లయినను దోషము లేదు. నిత్యానువాదము లనేకము లనేకస్థలముల యందుఁ గానవచ్చుచున్నవి. ఇదియు పూర్వవిషయమును గుఱుతించుటకే సాధన మగును. కావున శాఖాభేదము లేకున్నను ఉపాసనలు మాత్ర మభిన్నములే యనుటయు నొకస్థలమున నున్నగుణముల మఱియొకస్థలమున నుపసంహరించుకొనవలయు ననుటయు సిద్ధాంతములు.

"అగుఁగాక. ఇం దేవిద్య ప్రధానము; ఏది యనువాదము" అనియెదవేమొ వినుము. అగ్నిరహస్యమునందలివిద్య విధివిహితము; ఉపనిషత్తులోనిది యనువాదము. లోకమున నధికసంఖ్యగల చతురంగబలమును జూచినప్పుడు "దీనియందు రాజు కలఁడు" అనియు నల్పసంఖ్య గలసైన్యమును జూచినప్పుడు "ఇది యాతనిసైన్యమే కాని యిందు రాజు లేఁడు" అనియు నిర్ణయింపఁబడినట్లు యిచ్చటను అధికగుణములు వర్ణిం

* అనువాద మనఁగా ప్రమాణాంతరములవలన సిద్ధించి యున్నవిషయమునే కార్యార్థమై మఱలఁ జెప్పుట. నిత్యపదార్థముల ననువాదము సేయుట నిత్యానువాదము. వ్యావహారికనిత్యముల ననువాదముఁ జేయుటయుం నిట్టిదియే యగును.

బడినస్థలమే విధి యనియు అల్పగుణములు జెప్పఁబడినస్థల మనువాద మనియు నిర్ణయింపఁబడెను. కావున బృహదారణ్యకోపనిషత్తునందలి గుణములను, అగ్నిరహస్యమునందలి విద్యలోనికి నుపసంహరించుకొన వలయును.

---

## ౧౧. సంబంధాధికరణము.

విషయసంశయములు:— బృహదారణ్యకోపనిషత్తునందు "సత్యం బ్రహ్మ" "హిరణ్యగర్భుఁడు సత్యము" అని యారంభించి "తద్యత్తత్సత్య మసౌ స ఆదిత్యో య ఏష ఏతస్మిన్ మండలే పురుషో యశ్చాయం దక్షిణేఽక్షన్పురుషః" "ఈహిరణ్యగర్భుఁడే సూర్యుఁడు సూర్యమండలాంతర వర్తియైయున్నవాఁడు. మనుష్యులయొక్క దక్షిణనేత్రమునందుఁ గూడ నిట్లే యున్నాఁడు" అని యాయనకు దేవసంబంధమైనట్టియు దేహసంబంధమైనట్టియు స్థానములు చెప్పఁబడియున్నవి; మఱియు "భూర్భువ స్సువః" అనువ్యాహృతులే యాయాదిత్యాక్షిపురుషులకు దేహము లని వర్ణింపఁ బడియున్నది. తరువాత "తస్యోపనిష దహ రితి. తస్యోపనిష దహ మితి" "ఆయాదిత్యపురుషునకు 'అహః' అనిపేరు; అక్షిపురుషునకు 'అహం' అని పేరు." అని వారిరువురకు నామభేదములు చెప్పఁబడెను. "ఈనామములు రెంటను ప్రత్యేకముగ గ్రహింపఁబడవలసినవేనా? లేక పరస్పర ముప సంహరించుకొనవలసినవియా?" యనుసంశయ మిచ్చటఁ గలదు. అది యిందు నిరాకరింపఁబడును.

### అ_౩. పా_౩. సూ_౨౦.

అవతారిక:— ఈసంశయమును నిరాకరించుటకై దృష్టాంతసంగతితో మొట్టమొదటఁ బూర్వపక్షము ననువాదము చేయుచున్నాఁడు.

### ౩౮౦. సంబంధా దేవ మన్యత్రాపి. ౩. ౩. ౨౦.

తాత్పర్యము :— పూర్వాధికరణమునందు, శాండిల్యవిద్యలు ప్రత్యేకముగనున్నను వానికి గుణోపసంహారము కలదని చెప్పఁబడెనుకదా! ఇట్లే పైనుదహరింపఁబడిన విద్యయందు గుణోపసంహారము కలదనియే

సిద్ధాంతము చేయఁబడవలయును. ఈవిద్యకు నుపక్రమ మొక్కటియే; ఉపసంహారంబు నొక్కటియే. ఒక్కస్థలముననే ఇవి రెండును చెప్పఁబడి యున్నవి. ఇట్లుండ వీనిలో గుణోపసంహార ముండుననిన సంశయ మేమి? ఇందు వర్ణింపఁబడిన పదార్థ మొక్కటియె స్థానములు భిన్నములుగా నున్నంతమాత్రమున వచ్చుహాని యేమి? గురుసేవాద్యాచారము లుపదేశించిన సది కేవల స్థానభేదమువలన భేదించునా? ఇట్లే వేదోపదేశంబును స్థానభేదమాత్రమువలన భేదింపనేరదు. కావున నీనామధేయములు రెండును ఇరువురకును సంబంధించు ననవలయును.

"ఇట్లు కాదు. 'తస్యోపనిష దహమితి; తస్యోపనిష దహరితి' అని అక్ష్యాదిత్యస్థానస్థితుల సర్వనామముచే బరామర్శించి నామధేయముల శ్రుతి విధించుచున్నది. ఇట్లగుటచే నానామములు పరస్పరము చేరవు. అనియెదవేమొ యట్లు కాదు. "తస్య" అను సర్వనామము ప్రస్తుత మగు ప్రధానవిషయమును మాత్రమే పరామర్శించునుగాని దానికి సంబంధించిన గుణాదులఁ బరామర్శింపదు. ఇచ్చట స్థానములు కావుకదా! కావున రెండు నామములును హిరణ్యగర్భునకే విధింపఁబడినట్లయినవి. ఈకారణమువలన నిస్సంశయముగ నీనామములు రెండును రెండు దేవతలకును సంబంధించును.

## అ-3. పా-3. సూ-౨౧.

అవతారిక:—ఇట్లు వచ్చిన పూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౩౨౧. న వా విశేషాత్. 3. 3. ౨౧.

తాత్పర్యము:—ఇట్లు చెప్పకూడదు. రెండునామములు నొక్కనికి సంబంధించునవికావు. శాండిల్యవిద్యలయందు ధర్మములు ప్రత్యక్షపదార్థముతోనే సంబంధము కలిగియున్నవి. రెండుస్థలములయందు నాపదార్థ మొక్కటియే కావున ధర్మములకు నచ్చట పరస్పరోపసంహారము కలిగినది. ఇచ్చటమాత్ర మట్లులేదు. ఉపక్రమాదు లొక్కటియేయైనను దేవతకూడ నొక్కఁడే యైనను స్థానభేదముల నాశ్రయించి నామభేదములు కల్పింపఁబడినవి. ఆదిత్యమండలాంతర్వర్తి యగుపురుషుని వర్ణించుట కుపక్రమించి 'తస్యోపనిష దహరితి' అని అహర్నామము విధింపఁబడినది; ఇట్లే యక్షి

పురుషు నుపక్రమించి "త స్యోపనిష దహమితి" అని యహం నామము విధింపఁబడినది. సర్వనామంబును సమీపమున నున్నవిషయమును పరామర్శించునది. "ప్రధానవిషయమును మాత్రమే పరామర్శించును కదా!" యనియెద వేమొ. ఇచ్చట నామవిధికి గారణమగుటచే హిరణ్యగర్భునికంటె ఆదిత్యమండలాదిస్థానమే ప్రధానము. ఇట్లుండ నీరెండునామములకు నైక్య మెట్లు కలుగును?

"దేవత యొక్కఁడే కదా! ఈవిద్యయందు ఒక్కహిరణ్యగర్భునకే స్థానభేదము వర్ణింపఁబడెను కాని మఱే యేమియు లేదు కదా!" అనియెద వేమొ సత్యమే. ఒక్కదేవతకే స్థానభేదముల నాశ్రయించి నామభేదములు చెప్పఁబడెను. ఈకారణమువలనఁగూడ నామములు రెండు నొక్కనికి సంబంధింపవని చెప్పవలసి యున్నది. ఆయాస్థానములయందున్నప్పుడు మాత్రమే యాయానామభేదములు కలుగునుగాని లేనప్పుడు లేదు కదా! "ఇట్టి దెందైనఁ గలదా" యనియెద వేమొ వినుము. ఈవిషయమున ననేకదృష్టాంతములు కలవు. ఒక్కపురుషుఁడే అవస్థాభేదములవలన ననేకనామములతో పిలువఁబడుట లోకమున నున్నది. సింహాసనముపై గూర్చుండి న్యాయాన్యాయముల విమర్శించునప్పు డాతనినే ప్రభువనుచున్నాము; కావ్యాదుల నాచరించునప్పుడుకవి యనుచున్నాము. మఱియు గురుస్వరూపము భిన్నము కాకున్నను అవస్థాభేదము నాశ్రయించి యుపదేశింపఁబడినసేవ యవస్థాంతరములతో సంబంధింపదు. "గురువు ఎచ్చటికైనను ప్రయాణ మయ్యెనేని యాయనతోఁ గూడ నీవును ప్రయాణము కమ్ము" అని విధింపఁబడినప్పు డాసేవ ప్రయాణమగుచున్నగురువుతోమాత్రమే సంబంధించును గాని గృహమునందున్న గురువుతో సంబంధింపదు. (అనఁగా గురువు ప్రయాణమగుచున్నప్పుడు మాత్రమే వచ్చును గాని గృహమున నున్నప్పుడు రాదు.) గ్రామమునందున్నను అరణ్యమున నున్నను సేవకు భేదము కలుగదు కదా యని యిది వఱకీదృష్టాంతమును మీ రాక్షేపించి యున్నారు కాని యది చెల్లదు. అరణ్యముగాని పట్టణములుగాని అవస్థాభేదమును కలిగింపఁజాలవు కదా! కావున నీనామధేయములు పరస్పరభిన్నములే.

## ౩౮౨. దర్శయతి చ. ౩. ౩. ౨౨

తాత్పర్యము:—మఱియు ప్రస్తుతసందర్భములవంటి సందర్భముల యందు గుణములను పరస్పరభిన్నములను గ్రహింపవలయు ననువిష యము శ్రుతిచేతనే ప్రత్యక్షముగఁ జెప్పఁబడియున్నది. ఛాందోగ్యోపని షత్తునం దక్ష్యాదిత్యపురుషునిఁగూర్చి చెప్పఁబడినసందర్భమును విమర్శిం చిన నీవిషయము తేలుచున్నది. అచ్చటఁగూడ "తస్యైతస్య త దేవ రూపం య దముష్య రూపం యా వముష్య గేష్ణౌ తౌ గేష్ణౌ యన్నామ తన్నామ" "ఈ యక్షిపురుషునకుఁ గూడ నాదిత్యపురుషునిరూపమే రూపము. ఆయన యవయవములే యవయవములు. ఆయన పేరే పేరు" అని యాదిత్యాక్షిపురుషులకు సమాననామరూపములే చెప్పఁబడి యున్నవి. ఇది *యతిదేశము. అక్షిపురుషునకు ప్రత్యేకస్వరూపాదులు జెప్పఁబడలేదు కదా! బాగుగ విచారించిన ఆదిత్యపురుషుఁడే యక్షి పురుషుఁ డైనచో నతిదేశముతోఁ బనిలేదు. అచ్చటిధర్మము లిచ్చట స్వాభావికముగానే యుపసంహరించుకొనంబడవచ్చును కదా! కావున నీయుపాసనలు రెండును భిన్నములే యని తేలుచున్నది. స్థానభేదమే దీనికిఁ గారణ మని యెర్పడుచున్నది. ఈకారణమువలన స్థానభేదముండు టచే ప్రస్తుతవిద్యలును పరస్పరభిన్నములే; నామధేయములును పరస్పర భిన్నములే.

## ౧౨. సంభృత్యధికరణము

విషయ సంశయములు:—"బ్రహ్మజ్యేష్ఠా వీర్యా సంభృతా ని బ్రహ్మాగ్రే జ్యేష్ఠం దివ మాతతాన బ్రహ్మ భూతానాం ప్రథమం తు జజ్ఞే తే నార్హతి బ్రహ్మణా స్పర్ధితుం కః" "ఈపంచభూతములు బ్రహ్మ శక్తిరూపములు వీనికి గేవలపరబ్రహ్మమే కారణము. వీని నాబ్రహ్మమే స్థిరపరచెను. ఆబ్రహ్మము మిగులశ్రేష్ఠము. ఇంద్రాదులు జనించుటకంటె బూర్వమే స్వర్గము నాక్రమించెను. సమస్తభూతములకంటె నాబ్రహ్మమే ముందు జనించెను. ఆబ్రహ్మము నతిక్రమింపగలవాఁ డెవ్వఁడు?" అని

* అతిదేశము (అ-౨. పా-౩. సూ-౮. పేజీ-826 చూ.)

ఛందోగశాఖయం దొకస్థలమునం జెప్పంబడి యున్నది
నందు శాండిల్యాదిబ్రహ్మవిద్య లనేకములు చెప్పంబడియు
హరించినశ్రుతియందు చెప్పంబడినభూతసంభృతి ద్యులోక
లగుగుణముల నావిద్యలలోనికి సంగ్రహించుకొనవలయునా? లేదా?
యనుసంశయ మీయధికరణమున నివారింపంబడును.

పూర్వపక్షము:—పైశ్రుతియందు చెప్పంబడినవి పరబ్రహ్మగుణ ములే కావునను ఆవిద్యలయందు చెప్పంబడినవాండును బ్రహ్మమే కావు నను ఈగుణముల నచ్చట నుపసంహరించుకొనవలయు ననుటయే యుక్తియుక్తము. ఆవిద్యలలో గొన్నిటియందు స్థానభేద మున్నను షోడ శకళవిద్య మొదలగుమఱికొన్నిటియం దాప్రస్తావమే లేదు; కలవాని యందుం గూడ "జ్యాయాన్ దివః" అనుమొదలగు నధిదైవికైశ్వర్య ములు వర్ణింపంబడియే యున్నవి. కావున నిచ్చట గుణోపసంహారము కల దనుటయే న్యాయము.

## అ_3. పా_3. సూ_23.

అవతారిక:—అనంనీపూర్వపక్షము నీసూత్రముచే నిరాకరించు చున్నాండు. ఇందు పూర్వాధికరణమునందు చూపంబడినన్యాయమే యాధారముగ గైకొనంబడునుగావున ప్రత్యేకసంగతి లేదు.

## 3౹3. సంభృతిద్యువ్యాప్త్యపి చాతః 3.3.23.

తాత్పర్యము:—ఇట్లు తలంప వలదు. విషయవాక్యమున నుదహ రింపంబడిన సంభృతిద్యులోకవ్యాప్తి అజత్వము మొదలగుగుణములు శాం డిల్యవిద్యాదులలో నుపసంహరించుకొనంబడవు. పూర్వాధికరణమునందుం జూపంబడినట్లే యిచ్చటను స్థానభేదమువలన విద్యాభేదము కలదు. శాండిల్యాది విద్యలయందు పరమేశ్వరునకు నుపాసనార్థమై స్థాన ములు చెప్పంబడి యున్నవి. విషయవాక్యమున నట్లు లేదు కదా! "ఏ షమ ఆత్మాఽంతర్హృదయే" "నాయాత్మ హృదయమధ్యమున నున్న జ్యోతి యే" అని శాండిల్యవిద్యయందును 'దహరం పుండరీకం వేశ్మ దహ రోఽ స్మిన్నంతరాకాశః" అతిసూక్ష్మమగుహృదయకమలము కలదు. దానిలోపల

* అధిదైవికము=దేవతలలోనివిభాగము.

## ౩౮౨. దర్శయతి చ. ౩. ౩. ౨౨

తాత్పర్యము:—మఱియు ప్రస్తుతసందర్భములవంటి సందర్భములయందు గుణములను పరస్పరభిన్నములను గ్రహింపవలయు ననువిషయము శ్రుతిచేతనే ప్రత్యక్షముగఁ జెప్పఁబడియున్నది. ఛాందోగ్యోపనిషత్తునం దక్ష్యాదిత్యపురుషునిఁగూర్చి చెప్పఁబడినసందర్భమును విమర్శించిన నీవిషయము తేలుచున్నది. అచ్చటఁగూడ "తస్యైతస్య త దేవ రూపం య దముష్య రూపం యా వముష్య గేష్ణౌ తౌ గేష్ణౌ యన్నామ తన్నామ" "ఈ యక్షిపురుషునకుఁ గూడ నాదిత్యపురుషునిరూపమే రూపము. ఆయన యవయవములే యవయవములు. ఆయన పేరే పేరు" అని యాదిత్యాక్షిపురుషులకు సమాననామరూపములే చెప్పఁబడియున్నవి. ఇది *యతిదేశము. అక్షిపురుషునకు ప్రత్యేకస్వరూపాదులు జెప్పఁబడలేదు కదా! బాగుగ విచారించిన ఆదిత్యపురుషుఁడే యక్షిపురుషుఁ డైనచో నతిదేశముతోఁ బనిలేదు. అచ్చటిధర్మము లిచ్చట స్వాభావికముగానే యుపసంహరించుకొనంబడవచ్చును కదా! కావున నీయుపాసనలు రెండును భిన్నములే యని తేలుచున్నది. స్థానభేదమే దీనికిఁ గారణ మని యేర్పడుచున్నది. ఈకారణమువలన స్థానభేదముండుటచే ప్రస్తుతవిద్యలును పరస్పరభిన్నములే; నామధేయములును పరస్పరభిన్నములే.

## ౧౨. సంభృత్యధికరణము

విషయ సంశయములు:—"బ్రహ్మజ్యేష్ఠా వీర్యా సంభృతాని బ్రహ్మాగ్రే జ్యేష్ఠం దివ మాతతాన బ్రహ్మ భూతానాం ప్రథమం తు జజ్ఞే తే నార్హతి బ్రహ్మణా స్పర్ధితుం కః" "ఈపంచభూతములు బ్రహ్మశక్తిరూపములు వీనికి గేవలపరబ్రహ్మమే కారణము. వీని నాబ్రహ్మమే స్థిరపరచెను. ఆబ్రహ్మము విగులశ్రేష్ఠము. ఇంద్రాదులు జనించుటకంటె బూర్వమే స్వర్గము నాక్రమించెను. సమస్తభూతములకంటె నాబ్రహ్మమే ముందు జనించెను. ఆబ్రహ్మము నతిక్రమింపగలవాఁ డెవ్వఁడు?" అని

---

* అతిదేశము (అ-౨. పా-౩. సూ-౮. పేజీ-826 చూ.)

ఛందోగశాఖయం దొకస్థలమునఁ జెప్పఁబడి యున్నది. ఆయుపనిషత్తు నందు శాండిల్యాదిబ్రహ్మవిద్య లనేకములు చెప్పఁబడియున్నవి. పైనుద హరించినశ్రుతియందు చెప్పఁబడినభూతసంభృతి ద్యులోకవ్యాప్తి మొద లగుగుణముల నావిద్యలలోనికి సంగ్రహించుకొనవలయునా? లేదా? యనుసంశయ మీయధికరణమున నివారింపఁబడును.

పూర్వపక్షము:—పైశ్రుతియందు చెప్పఁబడినవి పరబ్రహ్మగుణ ములే కావునను ఆవిద్యలయందు చెప్పఁబడినవాఁడును బ్రహ్మమే కావు నను ఈగుణముల నచ్చట నుపసంహరించుకొనవలయు ననుటయే యుక్తియుక్తము. ఆవిద్యలలో గొన్నిటియందు స్థానభేద మున్నను షోడ శకళవిద్య మొదలగుమఱికొన్నిటియం దాప్రస్తావమే లేదు; కలవాని యందుఁ గూడ "జ్యాయాన్ దివః" అనుమొదలగు నధిదైవికైశ్వర్య ములు వర్ణింపఁబడియే యున్నవి. కావున నిచ్చట గుణోపసంహారము కల దనుటయే న్యాయము.

## అ-3. పా-3. సూ-23.

అవతారిక:—అనఁతీపూర్వపక్షము నీసూత్రముచే నిరాకరించు చున్నాఁడు. ఇందు పూర్వాధికరణమునందు చూపఁబడినన్యాయమే యాధారముగ గైకొనఁబడునుగావున ప్రత్యేకసంగతి లేదు.

## 308. సంభృతిద్యువ్యాప్త్యపి చాతః 3.3.23.

తాత్పర్యము:—ఇట్లు తలంప వలదు. విషయవాక్యమున నుదహ రింపఁబడిన సంభృతిద్యులోకవ్యాప్తి అజత్వము మొదలగుగుణములు శాం డిల్యవిద్యాదులలో నుపసంహరించుకొనఁబడవు. పూర్వాధికరణమునందుఁ జూపఁబడినట్లే యిచ్చటను స్థానభేదమువలన విద్యాభేదము కలదు. శాండిల్యాది విద్యలయందు పరమేశ్వరునకు నుపాసనార్థమై స్థాన ములు చెప్పఁబడి యున్నవి. విషయవాక్యమున నట్లు లేదు కదా! "ఏ షమ ఆత్మాఽంతర్హృదయే" "నాయాత్మహృదయమధ్యమున నున్న జ్యోతి యే" అని శాండిల్యవిద్యయందును 'దహరం పుండరీకం వేశ్మ దహ రోఽ స్మిన్నంతరాకాశః" అతిసూక్ష్మమగుహృదయకమలము కలదు. దానిలోపల

* అధిదైవికము=దేవతలలోనివిభాగము.

నతిసూక్ష్మమగునాకాశంబునుకలదు' అనిదహరవిద్యయందునుస్థానము చెప్ప
బడియే యున్నది. "య ఏషోఽక్షిణి పురుషోదృశ్యతే" "ఈకంటియం దే
పురుషుఁడు కలఁడో" అని యుపకోసలవిద్యయందును స్థానవిశేషము చెప్పఁ
బడి యున్నది. ఇట్లు సామాన్యముగ నేవిద్యయందుఁ జూడఁబోయినను
ఉపాసనను చెప్పునప్పుడు పరమేశ్వరునకు శరీరసంబంధ మగుస్థానమేదియో
యొక్కటి చెప్పఁబడుచునే యున్నది. పై వాక్యమునందు మాత్ర మట్లు
కాక నధిదైవికము లగువిభూతులుమాత్రమే వర్ణింపఁబడి యున్నవి.
ఇట్లున్న నీరెంటికి నైక్యము కుదురుట యెట్లు? ఈకారణమువలన స్థాన
భేదము నాశ్రయించి పైయధికరణమున విద్యాభేద మెట్లు స్థిరపరుపఁ
బడెనో అట్లే యీయధికరణమునందును స్థిరపరుపఁబడవలయును. ఇట్ల
యిన గుణోపసంహారము కలుగదు.

"ఇది యేల? శాండిల్యాదివిద్యలయందును అధిదైవికవిభూతులు
వర్ణింపఁబడియే యున్నవి. 'జ్యాయాన్ దివః' అని శాండిల్యవిద్యయందును
'యావాన్వా అయ మాకాశ స్తా వా నే షోఽన్తర్హృదయ ఆకాశః
(సూ. ౧. 3. ౧౪. ౫.)' అని దహరవిద్యయందును శరీరదేశవర్తికి సం
బంధింపనిగుణములువర్ణింపఁబడినవి. మఱియు స్థానమును ప్రస్తావింపనివిద్య
లుకూడ ననేకములు కలవు. ఇట్లుండ నాగుణములకు నుపసంహార మేల
కలుగరాదు?" అనియెదవేమొ ఇది సత్యమే ఇట్లయినను సంభృతి మొద
లగుగుణముల నితరవిద్యలయం దుపసంహరించుకొనుటకు వీలులేదు. అట్లు
లేకుండఁజేయుటకు తగినహేతువులు కలవు. ఒకవిద్యయందు చెప్పఁబడియు
న్నగుణముల మఱియొకవిద్యలోనికి నుపసంహారము చేసికొనవలయు ననిన
నప్పుడు రెంటియందును సమానగుణములుకొన్ని పఠింపఁబడియుండవలయు
ను. అట్లు లేకున్న "ఈవిద్యకును సంబంధము కలదు" అనువిషయ మెట్లు
తెలిసికొనుటకు వీలుపడును ? ఈవిషయము నిదివఱకే పలుమాఱు ప్రక
టించి యున్నాము. ప్రస్తుతవిషయమును విమర్శించిన నట్టి దేదియును
లేదు. శాండిల్యాది విద్యలయందలిగుణములు అల్పముగ నైనను "బ్రహ్మ
జ్యేష్ఠా" అను మొదలగు ప్రస్తుతసందర్భమున పఠింపఁబడి యుండలేదు.
విద్యలును బహుదూరమున నున్నవి. గుణములు సమానముగఁ జెప్పఁబడి
యున్నచో దూరస్థితి యేమియుఁ జేయనేరదు కాని యిప్పు డదియు నొక
కారణముగ రావలసి వచ్చినది. ఈశాండిల్యాదివిద్యలయందును ఒకవేళ

నొకానొకయాథిదైవికగుణము వర్ణింపఁబడి యున్నను అంతమాత్రమున నట్టిగుణముల నన్నిటిని దెచ్చికొనుటకు వీలు లేదు. ఈగుణమునకును ప్రస్తుతవిషయవాక్యమున నున్నగుణమునకును భేదము నిస్సంశయముగ గలదు కదా! ఇఁక నేమి యనిన నెచ్చటిగుణముల నచ్చటనే గ్రహించి యుపాసనలను గావింపవలయు ననుటయే సిద్ధాంతము. "అన్నింటి యందును వర్ణింపఁబడినవాఁడు పరమేశ్వరుఁ డొక్కఁడేకదా! ఆకారణము వలన నైనను గుణోపసంహారము నాచరింపవచ్చును" అనియొక వేమొ యది సంభవింపదు. అప్పుడు అన్నివిద్యలు నొక్కటియే కావలసి వచ్చును. ఇది సంభవింపదు కదా! కావున ప్రస్తుతవిషయమున గుణోప సంహారము లేదు.

---

# ౧౩. పురుషాద్యధికరణము.

విషయ సంశయములు :— సామవేదమునందు తండిశాఖవారు పైంగిశాఖవారు నను రెండుతెగలవారు గలరు. వీరికి ఛాందోగ్యమే యుపనిషత్తు. ఆయుపనిషత్తునందు తృతీయప్రపాఠకమున పదియారవఖండ మందు పురుషుని యజ్ఞముగఁ గల్పించి యొకవిద్య చెప్పఁబడియున్నది. ఆవిద్యయందు పురుషునియాయుష్యమును మూఁడుభాగములుగ విభ జించి వానిని ప్రాతర్మధ్యాహ్నసాయంసవనములనుగా వర్ణించి యున్నారు. ఆఁకలి దప్పి మొదలగునవి యజ్ఞదీక్షగా నభివర్ణింపఁబడియున్నది. మఱియు మంత్రజపము ఆశీర్వాదము మొదలగునవి యనేకములు తత్తదనుకూల ములుగా వర్ణింపఁబడి యున్నవి. తైత్తిరీయశాఖవారును ఇట్లే యొకా నొక పురుషయజ్ఞమును కల్పించుచున్నారు. "తస్యైవం విదుషో యజ్ఞ స్యాత్మా యజమానః శ్రద్ధా పత్నీ" (ఈశ్రుతియొక్కయర్థము అధికరణ వ్యాఖ్యానముచేతనే తెలుపఁడఁగలదు) అని వారు దానికి కొన్నియవయవ ములఁ జెప్పియున్నారు. ఈవిద్యలు రెండు నొక్కటియా? కావా? వీని యందు పరస్పరగుణోపసంహారము కలదా? లేదా? అనువిషయ మిందు విచారింపఁబడును.

పూర్వపక్షసంగతులు:— పైనఁ జూపిన రెండుస్థలములయందును చెప్పఁబడినది పురుషవిద్యయే. రెంటికిని నామధేయ మొక్కటియే. "విదుషో యజ్ఞస్య" అనువాక్యమునకు "విద్వాంసుఁ డనుయజ్ఞమునకు" అని యర్థము వచ్చుటకు వీలు లేదనియు, అట్లు రాకున్న ఛాందోగ్యోప నిషత్తునందు చెప్పినవిద్యకును తైత్తిరీయోపనిషత్తునందు చెప్పినవిద్యకును భేదము కలుగు ననియు ఛాందోగ్యోపనిషత్తునందు పురుషుఁడే యజ్ఞముగాఁ గల్పింపఁబడె ననియు తైత్తిరీయోపనిషత్తునందు అట్లు గాక విద్వాంసునకు సంబంధించిన యజ్ఞమును గూర్చి మాత్రమే చెప్పఁ బడె ననియు నీకారణమువలన రెండును పరస్పరభిన్నములే యనియు వాదించుట యుక్తియుక్తము కాదు. యజ్ఞస్వరూపమే యజమానుఁడు కావచ్చును. యజమానుఁడు చేతనుఁడుగా నుండవలయును కావున విద్వాంసుఁడే యజ్ఞముగాఁ జెప్పఁబడవచ్చును. ఈకారణమువలన రెండువిద్యలయందును పురుషుఁడే యజ్ఞముగా గల్పింపఁబడెను. ఇదియునుఁగాక రెండుస్థలములయందును ఆపురుషయజ్ఞమునకు మరణమే యవభృథస్నానముగా వర్ణింపఁబడియున్నది. కావున రెండువిద్యలు నొక్కటియే యని తెలిసికొనుటకు వీలు కలుగుచున్నది. పూర్వాధి కరణమున *అసాధారణకారణ మేదియు లేకుండుటచే రెండువిద్యలకును భేదమును నిర్ణయించుటకు వీలు కలిగినది కాని యిచ్చట పైఁజూపిన కారణములవలన నట్టివీలు దొరకలేదు కదా! రెంటియందును సమాన ధర్మము లనేకములు గానవచ్చుచునే యున్నవి. కావున ఛాందోగ్యోప నిషత్తునందుఁగల యధికగుణము లన్నియు తైత్తిరీయములోనికిఁ దెచ్చి కొనవలసినవియే.

---

## అ-3. పా-3. సూ-౨౪.

అవతారిక:—అని యిట్లు ప్రత్యుదాహరణసంగతితో వచ్చిన పూర్వపక్షమును నిరాకరించుచున్నాఁడు.

---

* అసాధారణకారణము. (అ-౨. పా-౧. సూ-3౪. పేజీ-652 చూ.)

# ౩౭౪. పురుషవిద్యాయా మివ చేతరేషా మనామ్నానాత్. ౩. ౩. ౨౪.

తాత్పర్యము:—ఈపూర్వపక్షము యుక్తము కాదు. ఛాందోగ్యోపనిషత్తునందు చెప్పఁబడియున్న పురుషవిద్యకును తైత్తిరీయోపనిషత్తునందలి పురుషవిద్యకును సంబంధములేదు. అదియే యిది యనుటకు తగిన గుఱుతులు లేవు. తైత్తిరీయోపనిషత్తునందలి పురుషవిద్యలో పత్నీ యూపము వేదిక మొదలగు ననేకయజ్ఞాంగములు కల్పింపఁబడి యున్నవి. ఛాందోగ్యోపనిషత్తునందు అట్లు లేదు. మఱియు తైత్తిరీయోపనిషత్తునందు ప్రాతర్మధ్యాహ్నసాయంకాలములే సవనములుగఁ గల్పింపఁబడి యున్నవి; ఛాందోగ్యోపనిషత్తునందు పురుషయజ్ఞోపాసకునకు నూటపదియాఱు సంవత్సరము లాయుువు గలుగు నని చెప్పి యాయాయువును మూఁడుభాగములుగ విభాగించి జననకాలము మొదలు ఇరువదినాలుగు సంవత్సరములవఱకు ప్రాతస్సవన మనియు తరువాత నలుబదినాల్గుసంవత్సరములవఱకు (అనఁగా అరువదియెనిమిదవసంవత్సరమువఱకు) మాధ్యాహ్నసవన మనియుఁ బిమ్మట నలుబదియెనిమిదిసంవత్సరములవఱకు(అనఁగా నూటపదియాఱవసంవత్సరమువఱకు) సాయంసవనమనియు వర్ణింపఁబడియున్నది. ఇట్లు విశేషభేద ముండుటచే నొకానొకవిషయము సమానముగ నున్నంత మాత్రమున రెండువిద్యల కభేదమును జెప్పుట సంభవింపదు.

మఱియు ఛాందోగ్యోపనిషత్తునందు పురుషుఁడే యజ్ఞముగా జెప్పఁబడియున్నాఁడు; తైత్తిరీయోపనిషత్తున నట్లు లేదు. "ఏవం విదుషో యజ్ఞస్య" అనువాక్యమునకు "బ్రహ్మజ్ఞానియే యజ్ఞమై యున్నాఁడు" అని యర్థము చెప్పుటకుఁగాని "ఆత్మా యజమానః" అనుభాగములకు "యజ్ఞస్వరూపుఁడే యజమానుఁడు" అని యర్థము చెప్పుటకుఁ గాని యవకాశము లేదు. యజ్ఞస్వరూపము యజమానుఁ డగుటకు వీలులేదు. యజ్ఞ మచేతనము; యజమానుఁడు చేతనుఁడు. విద్వాంసుఁడు ప్రత్యేకముగా నుండునేని యప్పు డాతనియాత్మ చేతనుఁ డగుటచే యజమానుఁడు కావచ్చును. ఈకారణమువలన "విదుషో యజ్ఞస్య" అను భాగమునకు

"విద్వాంసునకు సంబంధించిన యజ్ఞమునకు అనియే యర్థము. ఇట్లు చెప్పిన వాక్యమునకు ముఖ్యార్థము వచ్చును. ముఖ్యార్థము సంభవించుచుండ గౌణార్థము నంగీకరింపఁగూడదు గదా! కావున ఛాందోగ్యోపనిషత్తు నందలి పురుషవిద్యకును దీనికిని ప్రధానాంశమునందే భేదము కలదు. యజమానునకు మాత్రమే కాక విద్వాంసునకుఁ గూడ ముఖ్య మగుయజ్ఞ రూపత్వము సంభవింప దనుట నిర్వివాదాంశము కదా!

ఇదియునుఁగాక "తస్యైవం విదుషో యజ్ఞస్య" "ఈవిధముగ పరమార్థమును తెలిసికొనినజ్ఞాని చేయుయజ్ఞమునకు" అని శ్రుతియం దీయజ్ఞ మదివఱకే సిద్ధమైయున్నట్లు చెప్పఁబడి యున్నది కాని క్రొత్తఁగా విధింపఁ బడలేదు. ఇట్లగుటచే 'విద్వాంసుఁడు యజ్ఞము. ఆయజ్ఞస్వరూపమే యజ మానుఁడు' అని యిట్లు క్రొత్తగాఁ విధించుచున్నట్లు వాక్యము నన్వయించి నచో వాక్యభేదము కలుగును. పురుషుని యవయవము లగుశ్రద్ధాదులును పత్ని మొదలగు రూపములతో గల్పించిరి కావున పురుషునిఁ గూడ యజ్ఞముగఁ గల్పించినా రనియే సిద్ధాంతము చేయవలయు నని కేశవుఁ డను వ్యాఖ్యాత యంగీకరించినపక్షము పైనిరూపణచేతనే యుక్తి శూన్యము. ఇచ్చట యజ్ఞ మనువాదము చేయఁబడి మాత్రమే యున్నది కాని విధింపఁ బడియుండలేదు. అనువాదము చేసినపిదప పురుషావయవముల యజ్ఞాంగ ములనుగాఁ గల్పించిన నప్పుడు వాక్యభేదము కలుగదు కాని అదియే విధి యైనచో మొట్టమొదటనుండియు ప్రత్యేకవాక్యమే కావలసి వచ్చుటచే వాక్యభేదము కలుగక తీరదు.

ఇదియునుఁగాక తైత్తిరీయోపనిషత్తునందు మొట్టమొదట సన్యాస సహితముగ నాత్మవిద్య బోధింపఁబడియున్నది. పిదప "తస్యైవం విదుషో యజ్ఞస్య" "ఈఆత్మవిద్య నెఱింగినమహాత్మునియజ్ఞమునకు" అని యజ్ఞాను వాదము చేయఁబడియున్నది. "బ్రహ్మణో మహిమాన మాప్నోతి" "పరమేశ్వరుని మాహాత్మ్యమును జెందును." అని యాత్మవిద్యకును ఈ యజ్ఞమునకునుఁ గూడ ఫల మొక్కటియే చెప్పఁబడియున్నది. ఇట్లగుటచే నీయజ్ఞము ఆత్మవిద్యాంగమునున్నది యని సిద్ధాంతము చేయవలయును. ఛాందోగ్యోపనిషత్తునందలి పురుషవిద్య యట్టిది కాదు. దానికి నూట పదియాఱుసంవత్సరములు జీవించుటయే ఫలముగాని మఱియొక్కటి కాదు; అది మఱియొకదానికి నంగముగఁగూడఁ జెప్పఁబడి యుండలేదు.

ఈవిధముగ నొక్కటి పరతంత్రంబు నై యుండ వీనికి నైక్య మెట్లు సంభవించును ? ఈకారణమువలన ఛాందోగ్యోపనిషత్తునందలి పురుషవిద్య యందుఁ జెప్పఁబడినధర్మముల తైత్తిరీయోపనిషత్తునందలి పురుషవిద్య లోనికిఁ దెచ్చికొన నక్కఱ లేదు.

---

# ౧౮. వేధాద్యధికరణము.

విషయ సంశయములు:—అథర్వణశాఖవారు ఉపనిషత్తు నారంభించునప్పుడు "సర్వం ప్రవిధ్య హృదయం ప్రవిధ్య" "ఓ దేవతా నాశత్రువుయొక్క సర్వాంగములను ఛేదింపుము హృదయమును ఛేదింపుము" అను మొదలగుమంత్రమును పఠింతురు. ఛాందోగ్యోపనిషత్తునందు తాండిశాఖవారు "దేవ సవితః ప్రసువ యజ్ఞం" "సర్వసృష్టికర్త వగునో స్వప్రకాశస్వరూపుఁడా లేక సూర్యదేవా యజ్ఞమును నాకొసంగుము" అనుమంత్రమును పఠించుచున్నారు. కఠశాఖవారును తైత్తిరీయశాఖవారును "శం నో మిత్రః శం వరుణః" "మనకు వరుణుఁడును మిత్రుఁడును శుభము నొసంగును గాక" అను మొదలగుమంత్రమును పఠించుచున్నాఁడు. వాజసనేయశాఖవారు తమయుపనిషత్తునందు ఆరంభమున ప్రవర్గ్యబ్రాహ్మణమును పఠించుచున్నారు. కౌషీతకీశాఖవారు జ్యోతిష్టోమబ్రాహ్మణమును పఠించుచున్నారు. ఇవియన్నియు ఆయాయుపనిషత్తుల యందు చెప్పఁబడియున్న బ్రహ్మవిద్యలలో నుపసంహరించుకొనఁబడునా? లేదా? యనుసంశయ మిందు నివారింపఁబడును.

పూర్వపక్ష సంగతులు:—మాకుఁజూడ వీని నన్నింటిని విద్యలలో నుపసంహరించుకొనవలయుననియే తోఁచుచున్నది. ఇవి విద్యలకు సమీపమునఁ బఠింపఁబడియున్నవికదా! "ఫలవత్సన్నిధా వఫలం తదంగం" "ఫలవంతము లగువిషయములకు సమీపమున ఫలములేని విషయ మొక్కటి చెప్పఁబడి యుండునేని యది ఫలవద్విషయమునకు నవయవము మాత్రమే యగును" అనున్యాయము నిచ్చట నాశ్రయించుట కవకాశము కలదు. విద్యలు పూర్ణఫలవంతములే కదా !

"ఇట్లు చెప్పుటకు వీలులేదు. రెండువిషయములకు బరస్పరసంబంధము కలదా? లేదా? యని విచారింపఁబోయిన నప్పుడు శ్రుతిలింగాదు

లలో నేవిద్యైన కొన్ని యనుకూలములుగా నుండి తీరవలయును. ఇచ్చట నట్టివేవియు లేవు. ఉపనిషదారంభమంత్రములయందు ప్రత్యక్షముగ విద్యాప్రస్తావము లేదు; 'ఇది విద్యలకు సంబంధించినది' యని తెలియఁ జేయుగుఱుతులును లేవు. ఇవియు విద్యలు నేకవాక్యగతములు కాని యేకప్రకరణగతములు కాని కావు. పాఠక్రమముగాని పేరు గాని వీనికి సంబంధమును కల్పించునవిగా లేవు. ఉపనిషదాది మంత్రములకు శాండిల్యవిద్యాదినామములు లేవు కదా! 'ఇట్లయినను రెంటికిని సాన్నిధ్యము కలదు కదా! యనియెదవేమొ యంతమాత్రము చాలదు. సామాన్యసంబంధ మేదియు లేకుండిన నూరక సన్నిధానము మాత్ర ముండుటవలన ప్రయోజన ముండదు. అంతమాత్రమే చాలునని పట్టుపట్టిన నన్నియు నేకమే కావలసివచ్చును. ఇది సంభవింపదుకదా! మఱియు విద్యలవర్ణించినచోట వానికిఁగావలసిన సర్వవిషయములును వర్ణింపఁబడియే యున్నవి. అచ్చటనైనను కొఱత యుండినచో నప్పుడు వానికి నీమంత్రాదులతో నావశ్యకము కలుగును; ఇట్లు కలిగిన నితరసంబంధ మేమియు లేకున్నను ఈమంత్రాదుల విద్య లాకర్షించుకొనవచ్చును. అప్పుడు విద్యలకు మంత్రాదులను గూర్చినయాకాంక్ష గలదు కదా! ప్రస్తుత మేదియు లేదు. ఇట్లగుటచే కేవలసన్నిధివలనఁ బ్రయోజన మేమియు లేదు." అనియెదవేమొ ఇది యొకదోషము కాదు. ఎట్లనిన:—

వేదమునందు మొట్టమొదటనే అధ్యయనవిధి యుపదేశింపఁబడి యున్నది. దాని నాశ్రయించి చూచిన వేదమునందలియొక్కయక్షరమైనను నిరర్థకము కాఁగూడదు. సర్వవాక్యములును స్వతంత్రముగఁ గాని యితరము లగువిద్యాదులమూలమునఁ గాని పురుషార్థహేతువులు కావలయు. ఇట్లగుటచే అన్నిటికిని పురుషార్థముతో నాకాంక్ష గలదు. "రక్తః పటో భవతి" "ఎఱ్ఱనిగుడ్డ నేయఁబడుచున్నది." అనుస్థలమునందు "గుడ్డ నేయఁబడుచున్నది." అనునింతమాత్రముతోనే యాకాంక్ష శాంతించి సంపూర్ణవాక్య మేర్పడినను 'ఎఱ్ఱని' అనుపదముతోఁగూడ నావాక్యమునకు సంబంధము కలుగుచున్నట్లు ఇచ్చటఁ గూడ నేవిద్యకావిద్య పరిపూర్ణముగనే చెప్పఁబడి యుండుటచే దానికి నుపనిషదారంభమంత్రాదులతో నాకాంక్ష లేకపోయినను ఏదియో యొకవిధముగ సంబంధము

మాత్రము కలుగవచ్చును. ఇట్లు సామాన్యసంబంధము కలిగినపిదప సాన్నిధ్యమే విశేషసంబంధమును కలిగించును. అప్పుడు "ఫలవత్సన్నిధావఫలం తదంగం" అను న్యాయము ననుసరించి విద్యను ప్రధానముగాను ఉపనిషదారంభమంత్రాదుల దానియంగములనుగాను సిద్ధాంతము చేయవచ్చును. ప్రవర్గ్యవిద్య మొదలగునవి కొన్ని స్వతంత్రముగనే ఫలవంతములై యున్నను ఇచ్చట వానిఫలములు ప్రత్యేకములుగ కలుగనేరవు. వానికి స్వర్గఫలము కల దనువిషయము కల్పింపఁబడుచు మాత్రమే యున్నది కాని శ్రుతిచేఁ బ్రత్యక్షముగఁ జెప్పఁబడి యుండలేదు. ఈకారణమువలన బ్రత్యక్షశ్రుతిచే నిర్ణయింపఁబడిన ఫలములు కలవిద్యాదులతో సంబంధము కలిగినప్పుడు వీనికి ఫలకల్పనతో నావశ్యక ముండదు. కావున నెట్లు చూచినను మాపక్షమున దోషము లేదు.

మఱియు నీయుపనిషదారంభమంత్రములకును విద్యలతో సంబంధమును కల్పింపఁజాలు శ్రుతిలింగాదు లన్నియుఁ గూడ గలవు. సాన్నిధ్యసంబంధమునుబట్టి యన్నింటి నూహింపవచ్చును. విద్యలకును ఉపనిషదారంభమంత్రములకును పరస్పరాకాంక్ష కల దనఁవిషయ మింతవఱకే వివరింపఁబడి యున్నది. ఇచ్చట విద్యలు సమగ్రముగానే చెప్పఁబడి యున్నవని కదా మీరు చెప్పుదురు. అట్లున్నవానికిఁ గూడ నాకాంక్ష గలుగవచ్చు నని రక్తపటన్యాయమును చూపియున్నాము. ఒకదానితో సంబంధింపవలసినపదార్థమైనను ఆకాంక్షలేక సంబంధింపదు గావునను "రక్తపటో భవతి" అను మొదలగు స్థలములయందు పరిపూర్ణవాక్యములతో ఆకాంక్ష లేనివాక్యములతోఁ గూడ రక్తాదిపదములు సంబంధించినవి కావునను "పరిపూర్ణవాక్యములకుఁ గూడ నొకొ్కకప్పు డాకాంక్ష జనించును" అనుట యచ్చటనే సిద్ధాంత మైనది. ఇట్లు విద్యలకు నాకాంక్ష కలుగుటకు వీ లుండుటచే నేదియో యొకవిధముగ నీయుపనిషదారంభమంత్రములు వానితో సంబంధింపఁగలవు. పరస్పరాకాంక్షయుండుటయే ప్రకరణము కావున నీరెండు (యుపనిషదారంభమంత్రములును విద్యలును) నేకప్రకరణగతము లైనవి. ఈవిధముగఁ బ్రకరణమొక్కటి యయ్యెనేని రెండు నేకవిషయమును చెప్పునవియే యగుటచే

*వాక్యైకవాక్యము లగును. మఱియు విద్యకు నేదియో యొకయుపకారము చేయనేరకున్న నీసంబంధమునకు ప్రయోజనము లేకుండుటచే నా యారంభమంత్రములు తమకు నుపకార సామర్థ్యమునుగూడఁ గల్పించు కొనును. ఇదియే లింగము. ఇదియునుగాక సామర్థ్య మెంత యున్నను వేదముచే విద్యాంగముగఁ బ్రత్యక్షముగఁ జెప్పఁబడకుండినఁ బ్రయోజనములేదు కావున †నర్థాపత్తిప్రమాణముచే శ్రుతినిఁ గూడ గల్పింప వచ్చును. ఇట్లు శ్రుతిలింగ ప్రకరణవాక్యము లుండుటచే నిర్వివాదముగ వీనికి బరస్పరసంబంధముండవచ్చును. ఈవిధముగ సన్నిధిబలముచే నుపనిషదారంభమంత్రమునకు విద్యలతో సంబంధము కలుగుచుండ దానిని రానికరించుట యెట్లు?

"సరియే మంత్రములకును ప్రవర్గ్యాదికర్మలకును విద్యోపకార సామర్థ్య ముండునేని యప్పుడు మీరు చేసినసిద్ధాంతము యుక్త మగును. ఇచ్చటమాత్ర మట్లు లేదు. ఒకకర్మ విధింపఁబడినపిదప దానిని చేయవలసిన మార్గమును బోధించునప్పుడు మాత్రమే 'మంత్రములు దీనికి నుపకారము చేయుచున్నవి'యని చెప్పఁబడును. మంత్రాదులస్వభావమును తదర్థ నిర్ణయ ప్రకారమును వర్ణించు పూర్వమీమాంసాశాస్త్రమున నిట్లు సిద్ధాంతము చేయఁబడి యున్నది. ప్రస్తుతమున నీయుపనిషదారంభమంత్రములు విద్యావిధిని వివరించునవి కావుకదా! ఇట్లుండ వీనికిఁ బరస్పర సంబంధ మెట్లు కలుగును? మఱియు ప్రవర్గ్యబ్రాహ్మణాదులు స్వతంత్ర ఫలములు కాకపోయినను జ్యోతిష్టోమాది కర్మలయందుఁ జెప్పఁబడియున్నవి యగుటచే స్వర్గఫలముల నొసంగును. ఇట్టివి యిచ్చట విద్యాశేషములుగఁ జెప్పఁబడె ననుటయు నెట్లు యుక్తియుక్తమగును?', అనియెదవేమో యిదియు దోషము కాదు. ఎట్లనిన:—

ఈమంత్రములయందు "హృదయం ప్రవిద్య" అని హృదయాది స్థానములు పేర్కొనఁబడి యున్నవి; విద్యలయందును హృదయాదు లుపాసనాస్థానములుగఁ జెప్పఁబడి యున్నవి. ఈసంబంధమును బట్టి యేదియో

---

* వాక్యైకవాక్యము లనఁగా నొకవాక్యమునఁ జెప్పఁబడియున్న కర్తృకర్మాదులకు సంబంధించిన విషయముల వివరింపుచు వాక్యార్థము పోషించు వాక్య సమూహము.

† అర్థాపత్తిప్రమాణము. (అ-౧. పా-౧. సూ-3. పేజీ-39 చూ.)

యొకవిధముగ నీమంత్రమునకు విద్యోపకారకత్వము మఱియు నుపాసనలయందును మంత్రములయుపయో చున్నది. "భూః ప్రపద్యేఽమునాఽమునాఽమునా" " భూదేవతను సేవించెదను. (ఇచ్చట అమునా అను పేరు తృతీయాంతముగ నిలుపవలయును. ఆదరాతిశయమున నొక్క పేరే ముమ్మాఱు గ్రహింపఁబడె నని తెలిసికొనవలయును)" అను మొదలగు మంత్రములు ఛాందోగ్యోపనిషత్తునందు పెక్కులు గలవు. కావునవిద్యా మంత్రమునకు సంబంధము కలదనుటలో సంశయము లేదు. ఇక ప్రవర్గ్యాది బ్రాహ్మణములను గూర్చి విచారించిన నవి యితరకర్మలయందును విధింపఁ బడియున్నను విద్యలయందు మరల నుపయోగించుకొనఁబడవచ్చును. బ్రహ్మవర్చస్సును గోరువాఁడు బృహస్పతి సవనము నాచరింపవలయును. అని వేదమున నొక్కస్థలమున ప్రత్యేకముగ విధింపఁబడినకర్మ వాజపేయాంగముగ మఱల విధింపఁబడియున్నది యనుట గర్మకాండమున బ్రసిద్ధము. ఇట్లగుటచే సర్వవిధముల విద్యలకును నుపనిషదారంభమంత్రములకును సంబంధము కల దనుటయే సిద్ధాంతము. ఈకారణమువలనఁ బూర్వాధికరణమునందు బ్రహ్మవిద్యాసన్నిధానమువలన తైత్తిరీయోపనిషత్తు నందలి పురుషవిద్య యెట్లు బ్రహ్మవిద్యాశేషముగ నిర్ణయింపఁబడెనో అట్లే విద్యాసాన్నిధ్యమువలన నుపనిషదారంభ మంత్రములునుఁ గూడ విద్యాశేషములుగా నిర్ణయింపఁబడవలయును.

## అ_౩. పా_౩. సూ_౨౫.

అవతారిక:—అని యిట్లు దృష్టాంతసంగతితో వచ్చినపూర్వపక్షము ఖండింపుచున్నాఁడు.

## ౩౮౫. వేధాద్యర్థభేదాత్. ౩. ౩. ౨౫.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఉపనిషదారంభమంత్రములు విద్యలలో నుపసంహరించుకొనఁబడు ననుట యుక్తియుక్తము కానేరదు. విచారించిన విద్యలయందును ఆరంభమంత్రాదులయందును గలయర్థభేదమును స్పష్టమగుచునే యున్నది. "హృదయం ప్రవిధ్య" అనుమంత్రము ఆభిచారికవిషయమున నుపయోగింపఁబడునవి.

*వాక్యైకవాక్యము లగును. మఱియు విద్యకు నేదియో యొకయుప కారము చేయనేరకున్న నీసంబంధమునకు ప్రయోజనము లేకుండుటచే నా యారంభమంత్రములు తమకు నుపకార సామర్థ్యమునుగూడఁ గల్పించు కొనును. ఇదియే లింగము. ఇదియునుగాక సామర్థ్య మెంత యున్నను వేదముచే విద్యాంగముగఁ బ్రత్యక్షముగఁ జెప్పఁబడకుండినఁ బ్రయోజ నములేదు కావున †నర్థాపత్తిప్రమాణముచే శ్రుతినిఁ గూడ గల్పింప వచ్చును. ఇట్లు శ్రుతిలింగ ప్రకరణవాక్యము లుండుటచే నిర్వివాదముగ వీనికి బరస్పరసంబంధముండవచ్చును. ఈవిధముగ సన్నిధిబలముచే నుపని షదారంభమంత్రమునకు విద్యలతో సంబంధము కలుగుచుండ దానిని రానికరించుట యెట్లు?

“సరియే మంత్రములకును ప్రవర్గ్యాదికర్మలకును విద్యోపకార సామర్థ్య ముండునేని యప్పుడు మీరు చేసినసిద్ధాంతము యుక్త మగును. ఇచ్చటమాత్ర మట్లు లేదు. ఒకకర్మ విధింపఁబడినపిదప దానిని చేయవల సిన మార్గమును బోధించునప్పుడు మాత్రమే ‘మంత్రములు దీనికి నుప కారము చేయుచున్నవి’యని చెప్పఁబడును. మంత్రాదులస్వభావమును తదర్థ నిర్ణయ ప్రకారమును వర్ణించు పూర్వమీమాంసాశాస్త్రమున నిట్లు సిద్ధాంతము చేయఁబడి యున్నది. ప్రస్తుతమున నీయుపనిషదారంభమంత్ర ములు విద్యావిధిని వివరించునవి కావుకదా! ఇట్లుండ వీనికిఁ బరస్పర సంబంధ మెట్లు కలుగును? మఱియు ప్రవర్గ్యబ్రాహ్మణాదులు స్వతంత్ర ఫలములు కాకపోయినను జ్యోతిష్టోమాది కర్మలయందుఁ జెప్పఁబడియున్నవి యగుటచే స్వర్గఫలముల నొసంగును. ఇట్టివి యిచ్చట విద్యాశేషములుగఁ జెప్పఁబడె ననుటయు నెట్లు యుక్తియుక్తమగును?’, అనియెదవేమో యిదియు దోషము కాదు. ఎట్లనిన:—

ఈమంత్రములయందు “హృదయం ప్రవిధ్య” అని హృదయాది స్థానములు పేర్కొనఁబడి యున్నవి; విద్యలయందును హృదయాదు లుపా సనాస్థానములుగఁ జెప్పఁబడి యున్నవి. ఈసంబంధమును బట్టి యేదియో

* వాక్యైకవాక్యము లనఁగా నొకవాక్యమునఁ జెప్పఁబడియున్న కర్తృకర్మా దులకు సంబంధించిన విషయముల వివరింపుచు వాక్యార్థము పోషించు వాక్య సమూహము.

† అర్థాపత్తిప్రమాణము. (అ-1. పా-1. సూ-3. పేజీ-39 చూ.)

యొకవిధముగ నీమంత్రమునకు విద్యోపకారకత్వమును కల్పింపవచ్చును. మఱియు నుపాసనలయందును మంత్రములయుపయోగము గానవచ్చు చున్నది. "భూః ప్రపద్యేఽమునాఽమునాఽమునా" "ఈపుత్రు నితోఁగూడ భూదేవతను సేవించెదను. (ఇచ్చట అమునా అనుస్థలమునఁ బుత్రుని పేరు తృతీయాంతముగ నిలుపవలయును. ఆదరాతిశయమున నొక్కపేరే మున్మాఱు గ్రహింపఁబడె నని తెలిసికొనవలయును)" అను మొదలగు మంత్రములు ఛాందోగ్యోపనిషత్తునందు పెక్కులు గలవు. కావునవిద్యా మంత్రమునకు సంబంధము కలదనుటలో సంశయము లేదు. ఇక ప్రవర్గ్యాది బ్రాహ్మణములను గూర్చి విచారించిన నవి యితరకర్మలయందును విధింపఁ బడియున్నను విద్యలయందు మరల నుపయోగించుకొనఁబడవచ్చును. బ్రహ్మవర్చస్సును గోరువాఁడు బృహస్పతి సవనమూ నాచరింపవలయును. అని వేదమున నొక్కస్థలమున బ్రత్యేకముగ విధింపఁబడినకర్మ వాజపేయాంగముగ మఱల విధింపఁబడియున్నది యనుట గర్మకాండమున బ్రసిద్ధము. ఇట్లగుటచే సర్వవిధముల విద్యలకును నుపనిషదారంభమంత్రములకును సంబంధము కల దనుటయే సిద్ధాంతము. ఈకారణమువలనఁ బూర్వాధికరణమునందు బ్రహ్మవిద్యాసన్నిధానమువలన తైత్తిరీయోపనిషత్తు నందలి పురుషవిద్య యెట్లు బ్రహ్మవిద్యాశేషముగ నిర్ణయింపఁబడెనో అట్లే విద్యాసాన్నిధ్యమువలన నుపనిషదారంభ మంత్రములునుఁ గూడ విద్యాశేషములుగా నిర్ణయింపఁబడవలయును.

## అ-౩. పా-౩. సూ-౨౫.

అవతారిక:—అని యిట్లు దృష్టాంతసంగతితో వచ్చినపూర్వపక్షము ఖండింపుచున్నాఁడు.

## ౩౮౫. వేధాద్యర్థభేదాత్. ౩. ౩. ౨౫.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఉపనిషదారంభమంత్రములు విద్యలలో నుపసంహరించుకొనఁబడు ననుట యుక్తి యుక్తము కానేరదు. విచారించిన విద్యలయందును ఆరంభమంత్రాదుల యందును గలయర్థభేదమును స్పష్ట మగుచునే యున్నది. "హృదయం ప్రవిధ్య" అనుమంత్రము ఆభిచారికవిషయమున నుపయోగింపఁబడునది.

ధానికి "శత్రుహృదయమును ఛేదించి యని యర్థము. ఈయర్థమునకు బ్రహ్మవిద్యతో సంబంధ మేది యుండఁగలదు? "ఉపాసనలయందుఁగూడ స్థానవిర్ణయార్థమై హృదయపద ముపయోగింపఁబడె నని చెప్పితిమి కదా!" అనియెదవేమో యంతమాత్రమున బ్రయోజన మేమి? ఒకవేళ నామంత్రమునందు హృదయవేధ జెప్పఁబడక కేవలహృదయశబ్దమే ప్రస్తావింపఁబడియుండునేని యప్పుడు యేదియోయొకవిధముగ విద్యలతో సంబంధము కల్పించినను కల్పింపవచ్చును గాని యిచ్చట నట్లును లేదు. మఱియు నొక్కహృదయవేధయే గాదు. "ధమనీ రవిధ్య" "నరములను త్రెంచి" అని కూడ నామంత్రమునఁ జెప్పఁబడి యున్నది. దీనికి విద్యలతో సంబంధము గలదేని యిదియంతయు సంబంధింపవలయును కదా! ఇది సంభవించునా? ఈకారణమువలన నెంతశ్రమపడి పరస్పర సంబంధమును సాధించినను ప్రయోజనము లేదు. దీనియందలి యర్థమును విమర్శించిన నాభిచారికవిధులతో సంబంధము కల దని నిర్ణయించుటకు తగినగుఱుతులు గానవచ్చుచున్నవి. ప్రకరణమును విచారించి చూచినను ఆభిచారికప్రకరణమునందే యుండవలసిన మంత్రముగఁ గానవచ్చుచున్నది. ఇట్లుండ నీరెంటికంటె సన్నిధి బలవంత మగునా? పూర్వమీమాంసాశాస్త్రమునందు శ్రుతిలింగసూత్రమున నీవిషయము విశదీకరింపఁబడి యున్నది. ఇట్లగుటచే నీమంత్రమునకును విద్యలకును సంబంధము లేదు.

ఇదేవిధముగ "దేవ సవితః ప్రసువ యజ్ఞం" అనుమంత్రమునందును "యజ్ఞమును కల్పింపుము" అను గుఱు తుండుటచే నది యజ్ఞమునకు సంబంధించినదియే యని తేలుచున్నది. తక్కినమంత్రములును కొన్ని గుఱుతు లాశ్రయించియు మఱికొన్ని ప్రకరణాదుల నాశ్రయించియు వేఱువేఱుసందర్భములతోనే సంబంధించునట్లు తేలుచున్నది. అన్నిటికంటె బలహీనమగుటచే కేవలసన్నిధి వాని నేమియు చేయనేరదు. కావున నెట్లును మంత్రమునకు విద్యలతో సంబంధము లేదు; సంబంధముండుటయు యుక్తము కాదు.

ఇఁక ప్రవర్గ్యాదికర్మల నాశ్రయించి చూచిన నదియు నంతయే. ఆకర్మలు మఱియొకస్థలమున సంపూర్ణఫలముతో విధింపఁబడియున్నవి యనుటను విారే యంగీకరించి యున్నారు కదా! అట్టిది బ్రహ్మవిద్య

లతోఁ గూడ సంబంధించుననుట యెట్లు? బృహస్పతి సవనవిషయ మన్ననో అది వేఱు. "వాజపేయేనేష్ట్వా బృహస్పతి సవేన యజేత" "వాజపేయ యాగమును చేసి పిదప బృహస్పతి సవనమును గావింపవలయును" అని శ్రుతిచేతనే యావిషయము స్పష్టముగ నచ్చట జెప్పఁబడి యున్నది. ఇచ్చట నట్లులేదుకదా! మఱియొకవిశేషము ఈప్రవర్గ్యము ఒక్కటియే; వేదమున నొక్కమాఱే విధింపఁబడినది. ఇతరస్థలములయందు ప్రబల ప్రమాణములచే జ్యోతిష్టోమాదికర్మాంగముగ విధింపఁబడి యున్నప్పుడు బలహీన మగుసాన్నిధ్య ప్రమాణముచేతఁగూడ మఱియొకస్థలమున నుప యోగింపఁబడు ననుట యెట్లు? ప్రమాణములలో రెండును సమాన సామర్థ్యములు కలవియయ్యే యుండునేని యప్పుడుమాత్ర మట్లే (ప్రతి ప్రమాణము స్వతంత్రముగనే వినియోగింపవచ్చుననియే) సిద్ధాంతము చేయవచ్చునుగాని యిచ్చట నట్లు లేదు. శ్రుతిలింగాదులు బలవంతములు; సన్నిధి బలహీనములు. ఇప్పు డట్టి నిర్ణయమునకు నవకాశ మెక్కడిది? ఈకారణమువలన ప్రస్తుతము విచారింపఁబడినవానివంటి జాతికల మంత్రా దుల స్థలములలో కేవలసన్నిధినిఁబట్టి పరస్పరసంబంధమును నిర్ణయించుట యుక్తము కాదని తెలిసికొనవలయును. "ఇట్లైన బ్రహ్మవిద్యాసాన్నిధ్య మున నీమంత్రాదుల నేల పఠింపవలయును?" అనియెదవేమో యీసర్వ బ్రహ్మవిద్యలును అభిచారికాది మంత్రములును అరణ్యమున నుపదేశింపఁ బడవలసినవి యగుటచే నన్నియు నొక్కస్థలమున జెప్పఁబడినవి యని తెలిసికొనవలయును.

---

## ౧౫. హాన్యధికరణము.

### ప్రథమవర్ణకము.

విషయ సంశయములు:—"అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం చంద్ర ఇవ రాహోర్ముఖా త్ప్రముచ్య ధూత్వా శరీర మకృతం కృతాత్మా బ్రహ్మలోక మభిసంభవామి" "గుఱ్ఱము తనవెంట్రుకలను మట్టితోఁ గూడ విదలించి యెట్లు నిర్మల మగునో అట్లే నేనును పుణ్యపాపముల విదలించి స్వచ్ఛుఁడనై రాహు ముఖమునుండి వెడలిన చంద్రునివలె ప్రకాశ

మానుఁడనై ప్రవాహనిత్య మగునీశరీరమును వదలి బ్రహ్మైకత్వజ్ఞానము కలవాఁడనై పరబ్రహ్మమును చెందుదును" అని ఛాందోగ్యోపనిషత్తునందును, "తథా విద్వా న్నామరూపా ద్విముక్తః పరాత్పరం పురుష ముపైతి దివ్యం" "విద్వాంసుఁడును అట్లే నామరూపములు లేనివాఁడై పరాత్పరుండును శ్రేష్ఠుఁడు నగుపురుషుని జెందును" అని ముండకోపనిషత్తునందును "తస్య పుత్రా దాయ ముపయంతి సుహృదః సాధుకృత్యాం ద్విషంతః పాపకృత్యాం" "ఆబ్రహ్మజ్ఞాని మృతిజెందిన నాతనిపుత్రులు ఆతనికిం గలధనమును గ్రహింతురు. మిత్రులగువారు ఆతని పుణ్యమును తీసికొందురు. శత్రువులు పాపమును గైకొందురు" అని శాట్యాయన శాఖయందును "త త్సుకృతదుష్కృతే విధూనుతే తస్య ప్రియా జ్ఞాతీయః సుకృత ముపయం త్యప్రియా దుష్కృతం" "బ్రహ్మజ్ఞానికి పుణ్యపాపము లుండవు. ఆతని ప్రియు లాతని పుణ్యమును పంచికొందురు. ఆతని ద్వేషించువారు పాపమును పంచికొందురు" అని కౌషీతకీబ్రాహ్మణోపనిషత్తునందును పుణ్యపాపత్యాగమునుం గూర్చియు పరులు దానిని గ్రహించుటనుఁ గూర్చియు వర్ణింపఁబడియున్నది. కొన్నిఁటియం దీరెంటిను వర్ణింపఁబడియేయున్నది. అచ్చట విచారణీయాంశ మెద్దియు లేదు. మఱికొన్నిఁటియందుఁ బరులచే "పాపపుణ్యములు గ్రహింపఁబడును" అను విషయము మాత్రమే చెప్పఁబడియున్నది. ఇచ్చటను విచారణీయాంశము లేదు. ఒకఁడు విడువకున్న నాపదార్థమును మఱియొక్కఁడు గ్రహింపనేరఁడు కదా! కావున త్యాగమునుగూర్చి మాత్రమే చెప్పియున్న చాంధోగ్య ముండక శ్రుతులలోనికి నితరస్థలములయందు చెప్పఁబడిన విభాగము (పుణ్యపాపములను మిత్రశత్రువులు పంచికొందు రనుటను) సంగ్రహింప వలయునా? అక్కఱలేదా? అనువిషయ మిందు విచారింపఁబడును. వాస్తవస్థితిలో నీసందర్భములు విద్యల స్తుతించుటకై వేదమున జెప్పఁబడియున్నవి; ఆస్తుతిని నిర్వహించుటకయ్యే యిందు విచారింపఁబడుచున్నవి. ఎట్లయినను ఇదియు గుణోపసంహారమే కావున నీపాదము నందుఁ జేర్పఁబడెను.

పూర్వపక్షసంగతులు :— విచారించి చూచిన కేవల త్యాగము చెప్పఁబడినచోట విభాగము గ్రహింపఁబడ నక్కఱలేదని తేలును. ఆఛాందోగ్యముండకోపనిషత్తులయందుఁ విభాగమును గూర్చి ప్రత్యక్షముగ

చెప్పఁబడియుండ లేదు. ఉపాసన లభిన్నము లగుటచే నొకస్థలమున నున్న గుణములు మఱియొకస్థలమునకు దెచ్చికొనవచ్చు ననిన నదియు సంభవింపదు. ఉపాసన లేకములు కావు. కౌషీతకీబ్రాహ్మణోపనిషత్తునందు చెప్పఁబడినది సగుణోపాసన; తక్కినచోట్ల చెప్పఁబడినవి నిర్గుణోపాసనలు. విభాగము చెప్పఁబడియున్నచోట త్యాగము గ్రహింపఁబడినట్లే త్యాగము చెప్పఁబడినచోట నుపాసన కూడ గ్రహింపఁబడవలయును కదా యనిన నదియు సరిపడదు. "వాఁడు గ్రహించెను" అనునప్పుడు పరుఁడు విడువకున్న వాఁడు గ్రహింపనేరఁడు కావున దానిని నిర్ణయింపవచ్చును గాని "వాఁడు విడిచెను" అనునప్పు డట్టినిర్ణయమునకు నవకాశ మెక్కడిది? వాఁడు విడిచిన నితరుఁడు దానిని గ్రహించినను గ్రహింపవచ్చును; లేకున్నను లేకపోవచ్చును. నియమ మేమియు లేదు కదా! కావున పూర్వాధికరణమునందు మంత్రాదులు విద్యాసన్నిధానమునఁ బఠింపఁబడినను సామర్థ్యము లేకపోవుటచే నెట్లు విద్యలలోనికి నుపసంహరింపఁబడ లేదో అట్లే యిచ్చటఁగూడ కౌషీతకీబ్రాహ్మణోపనిషత్తునందుఁ ద్యాగసమీపమున విభాగముకూడ పఠింపఁబడియే యున్నను ఆత్యాగమునకు పైనఁజెప్పినరీతిగా విభాగమును గ్రహించుసామర్థ్యము లేకపోవుటచే ఛాందోగ్యాద్యుపనిషత్తులయందు దానిని (విభాగమును) ఉపసంహరింపఁగూడ దనియే సిద్ధాంతము చేయవలయును.

## అ_3. పా_3. సూ_౨౬.

అవతారిక:—అని యిట్లు దృష్టాంతసంగతిచే వచ్చినపూర్వపక్షము ఖండించుచున్నాఁడు.

## ౩౮౫. హానౌ తూపాయనశబ్దశేషత్వాత్కుశాచ్ఛందఃస్తుత్యుపగానవత్తదుక్తమ్. 3. 3. ౨౬.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తియుక్తము గాదు. కేవల త్యాగము మాత్రమే యున్నస్థలమునందుఁ గూడ విభాగము నవశ్యముఁగ నుపసంహరించుకొని తీరవలయును. ఏలయనిన కౌషీతకీబ్రాహ్మణోపనిషత్తునందు త్యాగానంతరమున తచ్ఛేషముగ విభాగము చెప్పఁబడి యున్నది

కదా! దీనివలన "పుణ్యపాపములు విడువఁబడఁగానే యితరులచే నవశ్య ముగ గ్రహింపఁబడు నని తెలుచున్నది. లోకమునందును ఒకరు విడిచిన పదార్థమును మఱియొకరు గ్రహింతు రనుట నియమము. సూర్యునివిడిచి వెలికి ప్రసరించుచున్న ఉష్ణమును భూజలాదులు గ్రహించుచున్నవి. పుష్పమును విడిచి యీవలకు వచ్చు గంధ పరమాణ్వాదులను వాయ్వాదులు గ్రహించుచున్నవి. ప్రాయశ్చిత్తాదులచే స్వరూపనాశములు చెందు పాపాదుల విషయమునందు తప్పఁ దక్కినవిషయములం దిది నిత్యసిద్ధమగు ప్రపంచనియమము. ప్రపంచమునందలిపదార్థము లొక్కస్థలమునఁ గాకున్న మఱియొకస్థలమున నొక్కరూపమునఁ గాకున్న మఱియొక్కరూపమున నుండవలయు ననుటయే స్వతస్సిద్ధ మగునియమము. ఈపుణ్యపాప ములును అశ్వరోమాదులవలె బ్రహ్మవేత్తచే విడువఁబడెనేకాని స్వరూప నాశమును చెందలేదు కదా! ఇట్టివి నిరాధారములై యుండుట సంభ వింపదు గావున నవశ్యముగ విభాగ ముండి తీరవలయును. "విడుచువాఁ డొక్కఁడు గ్రహించువాఁడు మఱియొక్కఁడు గదా!" అనియొదవేమో యది నియతి యగుటచే నీయాక్షేపమునకు నవకాశము లేదు. వాస్తవ స్థితిలో నీవిషయము పరమార్థానిరూపణకై చెప్పఁబడినది గూడ కాదు. విద్యాప్రభావమును స్తోత్రము చేయుటకై మాత్రమే చెప్పఁబడినది. ఇట్లగుటచే నీయాక్షేపమునకు నవకాశమే లేదు. కావున నిర్వివాదముగఁ గేవల త్యాగము వర్ణింపఁబడినస్థలమునఁ గూడ విభాగము నుపసంహరించు కొనవలయును.

పై నిరూపణవలన "త్యాగమునుగూర్చి చెప్పఁబడినస్థలములయం దెల్ల విభాగమునుగూర్చి చెప్పఁబడి యుండకపోవుటచేతను ఒకరొక్క పదార్థమును విడిచిన మఱియొక్కఁడు దానిని గ్రహింపవలయు ననుట నియమము కాకపోవుటచేతను త్యాగస్థలములయందు విభాగము నుప సంహరించుకొన నక్కఱలేదు" అను రెండుపక్షములును ఖండింపఁబడినవి. "కౌషీతకీబ్రాహ్మణోపనిషత్తునం దున్నది సగుణవిద్య యగుటచేత నందు చెప్పఁబడినవిభాగము తక్కినయుపనిషత్తులయం దున్న నిర్గుణవిద్యలలోనికి నుపసంహరించుకొనఁబడఁగూడదు" అనునొక్కయాక్షేపణమాత్ర మిఁక మిగిలి యున్నది. విచారించిన నిదియు పైసిద్ధాంతమునకు భంగము కలి గింపఁజాలదు. అచ్చట జెప్పఁబడియున్నది విధిగాని యది మఱియొకస్థల

మునకు నుపసంహరించుకొనఁబడవలసి యుండునేని యిప్పుడు మీరు చెప్పిన దోషము వచ్చునుగాని యిప్పుడు రానేరదు. ఈత్యాగవిభాగములు విద్యను స్తుతించుటకై మాత్రమే చెప్పఁబడి యున్నవి కాని విధింపఁబడి యుండలేదు. "ఈయుపాసన మహాప్రభావము గలది. దీని నాచరించి రేని సంసారకారణము లగుపుణ్యపాపము లీతని విడిచిపోవును; మిత్ర శత్రువులచేఁ గ్రమముగ గ్రహింపఁబడును. కావున నుపాసకుని ద్వేషించుట యుక్తము కాదు." అని యాశ్రుతి (త్యాగవిభాగములఁ జెప్పుశ్రుతి) యుపాసనలను వినుతించుచున్నది. ఇట్లగుటచే నొకవిద్యాస్తుతియందు త్యాగము మాత్రమే వర్ణింపఁబడియున్నను ఆ*యర్థవాదముయొక్క తాత్పర్యమును (స్తోత్రమును) అధికము చేయుటకై విభాగమునుగూర్చి చెప్పు నర్థవాదవాక్యమును గూడ నుపసంహరించుకొనవలసి యుండును. విభాగములేని త్యాగ ముండనేర దని యిదివఱకే నిరూపించియున్నాము. త్యాగమునుగూర్చి వర్ణించుశ్రుతియందును అశ్వరోమరాహుముఖ దృష్టాంతములచేతను మిధూనన ప్రమోచనశబ్దములచేతను, "ఇచ్చట చెప్పఁబడినది త్యాగమే కాని నాశము కాదు." అని నిరూపింపఁబడియే యున్నది. విదలింపఁబడినవెండ్రుకలు గుఱ్ఱమునుమాత్రమే విడిచిపోవును గాని స్వరూపాభావమును జెందవు; చంద్రుఁడు వెలికి వచ్చినప్పుడు రాహుముఖ మావలకుఁ బోవునే కాని నశింపదు గదా! కావున త్యాగ మున్నచోట విభాగ మావశ్యకముగనుండును; త్యాగమును గూర్చి చెప్పునర్థవాదమునకు ప్రక్కనే విభాగమును గూర్చి చెప్పునర్థవాదము కూడ నుండి తీరవలయును. దీనికి విద్య నధికముగ నుతించుటయే ప్రయోజన మని యిదివఱకే నిరూపించియున్నాము.

ఇట్లు ఒకయర్థవాదమునకు మఱియొకయర్థవాదముతో సంబంధముండు ననువిషయము కర్మకాండమునందును ప్రసిద్ధమై యున్నది. ఒకస్థలమున "ఏకవింశో వా ఇతో౽సా వాదిత్యః" "ఈసూర్యుఁడు యిరువది యొకటవవాఁడు" అను నర్థవాదము కలదు. మఱియొకస్థలమున "ద్వాదశ మాసాః పంచ ర్తవ స్త్రయ ఇమే లోకా అసా వాదిత్య ఏకవింశః" "మాసములు పండ్రెండు ఋతువు లైదు (ఇచ్చట హేమంత శిశిరఋతువులఁగాని వర్షాశరదృతువులఁ గాని యేకఋతువుగ గ్రహించి

* అర్థవాదము. (అ-౧. పా-౧. సూ-౪. పేజీ-46 చూ.)

రని తెలిసికొనవలయును) లోకములు మూఁడు నీ యిరువదింటికిని మీఁద నీసూర్యుఁడు ఇరువది యొకటవవాఁడు" అని సంఖ్యానిర్ణయము చేయఁబడి యున్నది. ఇదియు నర్థవాదమే. దీని నుపసంహరించుకొనకున్న మొదటఁ జూపినయర్థవాదమునకు నంతగాఁ బ్రయోజన ముండదు కదా! మఱియు "త్రిష్టుభా భవతః సేంద్రియత్వాయ" "త్రిష్టుప్ఛందము నుపాసించువాఁడు యింద్రియపటుత్వము కలవాఁడగును" అనునర్థవాదమునకు త్రిష్టుప్స్వరూపమును జెప్పు "ఇంద్రియం వై త్రిష్టుప్" "ఇంద్రియమే త్రిష్టుప్ఛందము" అనువాక్యము (అర్థవాదవాక్యము) తోఁ బని కలదు. కావున నొకయర్థవాదము మఱియొక యర్థవాదము నపేక్షించు ననుటలో సంశయము లేదు కావున నిచ్చట త్యాగవిషయక మగునర్థవాదము విభాగవిషయక మగు నర్థవాదము నపేక్షింపవచ్చును. ఇదియును గాక "ఒకరిసుకృత దుష్కృతములు మఱియొక్కనితో సంబంధించు ననుట యెట్లు?" అనునాక్షేపము గూడ మాసిద్ధాంతముపై రాదు. ఇది యర్థవాద మని ముందే వివరించియున్నాము. మఱియు నొకని కర్మలతో మఱియొకనికి ప్రత్యక్షసంబంధము లేకున్నను తత్ఫలములతో మాత్రము సంబంధ ముండవచ్చును. పుత్రుఁడు శ్రాద్ధము నాచరించిన జనకుఁడు తృప్తి నొందుచున్నాఁడు. శిష్యుఁడు పాపము నాచరించిన గురువు తత్ఫలమును బొందుచున్నాఁడు. భార్య దుష్టరాలైన నాపాపము భర్తకు వచ్చుచున్నది. అయినను ఇంతదూరము విమర్శింప నక్కఱలేదు. సర్వము నర్థవాదమే కావున సంబంధమున్నను లేకున్నను గూడ నొక్కటియే యగును కదా! సూత్రకారుఁడును "ఉపాయనశబ్దశేషాత్"అని ఉపాయనపదముమాత్రమే గ్రహించి విధిని గ్రహింపకపోవుటవలన ("ఉపాయ నార్థశేషాత్" అని చెప్పకపోవుటవలన) "ఇది యర్థవాదమేకాని విధికాదు" అని నిర్ణయింపఁబడినట్లైనది.ఆకౌషీతకీబ్రాహ్మణ శ్రుతియందు 'ఉపయంతి' అని యుపాయనపదమే యున్నది; సూత్రకారుండును ఆపదమునే గ్రహించి యున్నాఁడు. ఆయనకు "స్తోత్రార్థమైనమాత్రమే యీయుపాయనము(సుకృతదుష్కృతవిభాగము) త్యాగసమీపమున నుపసంహరింపఁబడును" అనునభిప్రాయము లేకపోవునేని యప్పుడు ఉపాయన పదార్థము మాత్రమే గ్రహించి యుండును; నిరర్థకముగ "ఉపాయనశబ్ద" అను పెద్దపదమును ప్రయోగించి "అల్పాక్షరం" "సాధ్యమైనంతవఱకు

సూత్రమున నక్షరములు కొలఁదిగ నుండవలయును” అనున్యాయమునకు విరుద్ధముగ సూత్రమును పెంచి యుండఁడు. కావున నిది యర్థవాదమే. ఈపాదమున మొట్టమొదటినుండియు విద్యాగుణోపసంహారమును గూర్చి చెప్పఁబడుచుండెను గావున ప్రసంగవశమున నీవిధముగ స్తుతిగుణోప సంహారము విచారింపఁబడినది. ఇదియు గుణోపసంహారమే కావున నీయధి కరణ మీపాదమునఁ జేర్పఁబడెను. ఉపాసకుని ద్వేషింపరాదనుటయే యీవిచారమునకు ఫలము. కావున నెట్లు చూచినను స్తోత్రార్థమె యాగము మాత్రమే చెప్పఁబడిన స్థలమునందుకూడ పుణ్యపాపవిభాగ ముపసంహరింపఁబడవలయు ననుట సిద్ధాంతమైనది.

ఈవిషయమున కుశలను గూర్చియు ఆచ్ఛందములను గూర్చియు (ఛందమే యాచ్ఛందము) స్తోత్రములను గూర్చియు నుపగానమును గూర్చియు (ఉపగానమనఁగా సామగానము) చెప్పియున్న శ్రుతుల నుదాహర ణార్థముగ సూత్రకారులు గ్రహించియున్నారు. వేదమున నొకశాఖ యందు“కుశా వానస్పత్యాః స్థతా మూపాత”“వృక్షసంబంధము లైనకుశలు (సమిధ లనుట)” అని కుశలనుగూర్చి సామాన్యముగఁ జెప్పఁబడి యున్నది. “ఈ కుశ లేవృక్షమునకు సంబంధించినవి ?” అని సంశయము రాగా దానిని నివారించుటకై మఱియొకశాఖయందు “ఔదుంబరాః కుశాః” “అత్తిచెట్టునకు సంబంధించినవి కుశలు” అని చెప్పఁబడియున్న విశేష వచనము గ్రహింపఁబడి యున్నది; అచ్చట చెప్పఁబడియున్న కుశలు అత్తిచెట్టుకు సంబంధించినవియే యని నిర్ణయింపఁబడినవి. మఱియొక స్థలమున ఛందప్రస్తావము సామాన్యముగఁ జేయఁబడి “యిచ్చట మొదట దేవచ్ఛందము నుపయోగింపవలయునా ? లేక నశురచ్ఛందముల నుపయోగింపవలయునా ?” అని సంశయమును గలిగించుచుండగా మఱియొకశాఖయం దున్న “దేవచ్ఛందాంసి పూర్వాణి” “దేవచ్ఛంద ములే మొట్టమొదట నుపయోగింపవలసినవి” అను విశేషవాక్యము నాశ్రయించి “యిచ్చట దేవచ్ఛందములు ఉపయోగింపఁబడవలయును” అని నిర్ణయింపఁబడెను. మఱియు షోడశీస్తోత్రమును చెప్పుసంవర్భమున ఆషోడశీస్తోత్రము నుపయోగింపవలసినకాల మేదియో నిర్ణయము కాకుండగ “సమయాధ్యుషితే సూర్యే” “సూర్యుఁడు కాలము లేక సమీపము నాశ్రయించియుండఁగా (అనఁగా సాయంకాలమున)” అని

శాఖాంతరమునందుఁ గల శ్రుతియందు చెప్పఁబడినవిశేషము గ్రహింపఁబడి యున్నది. సామగానమును గూర్చియు నొకస్థలమున "ఋత్విజ ఉపగాయంతిః" = ఋత్విక్కులు సామగానము నాచరింతురు" అని సామాన్యముగఁ జెప్పఁబడి యుండఁగా నిర్ణయమునకై అనఁగా (ఋత్విక్కులలో నెవ్వఁడు సామగానము నాచరించునో ఆవిషయమును నిర్ణయించుటకై) "అధ్వర్యు రుపగాయతి" "అధ్వర్యుఁడు సామగానము నాచరింపఁడు" అని శాఖాంతరమునందు గలవిశేష మాశ్రయింపఁబడెను. ఇట్లే ప్రస్తుతమునందును కేవల త్యాగము చెప్పఁబడినచోట విభాగము కూడ స్తుత్యర్థమై గ్రహింపఁబడవలయును. పై దృష్టాంతములయందు యెట్లు శ్రుత్యంతరములయందలి విశేషములు గ్రహింపఁబడెనో అట్లే యిచ్చటను గ్రహింపఁబడవలయును. ఇట్లు కాక నన్నివాక్యములను స్వతంత్రములనుగాఁ గల్పించిన నప్పుడు ప్రతిస్థలమునందును ప్రతివిషయమునందును వికల్పము రావలసివచ్చును. ఇది యన్యాయము గదా! కావున ఒకస్థలమున నున్నవిశేషముల మఱియొకస్థలమునకుఁ దెచ్చికొనుటయే యావశ్యకము. తగినంతవీలు కలిగినప్పుడు * అష్టదోషదుష్ట మగువికల్పమును నిరర్థకముగ నాశ్రయింపనేటికి? శాస్త్రమునందు సమానబలములై విధినిషేధములు ప్రవర్తించినప్పుడే కాని వికల్పము రాదని పూర్వ

---

* వికల్పమునందలి అష్టదోషములు:— వికల్ప మనఁగా రెండుపదార్థములను అనియతముగా అనఁగా ఒకదానిని విడిచి మఱియొకదానిని పరిగ్రహించుట. ఇట్లుచేసిన నొక్కొక్కపదార్థమునకు నాల్గుదోషములవంతున నెనిమిదిదోషములు వచ్చును.

ఉదాహరణము = వేదమున నొక్కస్థలమున "గోధుమలతో లేక వడ్లతో హోమము చేయవలయును" అనియు "యవలతో హోమముఁ జేయవలయును" అనియుఁ జెప్పఁబడి యున్నది. అచ్చట (గత్యంతరము లేకపోవుటచే వికల్ప మాశ్రయింపఁబడెను; గోధుములతోగాని యవలతోగాని హోమము నాచరింపవచ్చు నని సిద్ధాంతముఁ జేయఁబడెను. ఇచ్చట యెనిమిదిదోషములు కలవు. మొట్టమొదట ప్రతిపదార్థమునందును రెండేసిపక్షము లీవికల్పమువలన నేర్పడుచున్నవి. "గోధుములతో హోమము నాచరింపవచ్చును; ఆచరింపకుండవచ్చును" అని గోధుములయందును, "యవలచే హోమముల నాచరింపవచ్చును; ఆచరింపకుండవచ్చును" అని యవలపక్షమునందును గూడ పక్షద్వయ మేర్పడును. ఇందును ఒక్కొక్కపక్షము నాశ్రయించుటవలన రెండుదోషములు వచ్చును. ఎట్లనిన:—

ర్వమీమాంసశాస్త్రమునందు చెప్పఁబడి యున్నది. కావున నెట్లును త్యాగ సమీపమున విభాగముకూడ గ్రహింపఁబడవలసినదియే.

---

# హాన్యధికరణము.

## ద్వితీయవర్ణకము

విషయ సంశయములు:— పైయుదహరింపఁబడిన శ్రుతులయందే విధూయఅనుశబ్దము కలదుకదా! ఆశబ్దమునకు "పుణ్యపాపములవిడిచి" యనిమాత్రమే యర్థము; లేక యితర మగునర్థ మేదియైనఁ గలదా? అనుసంశయ మిందు నిరాకరింపఁబడును.

పూర్వపక్ష సంగతులు:—విచారించిన విధూయ యనుశబ్దము నకు విడిచి యనునర్థమును చెప్పుటకు వీలు లేదు. "ధూఞ్ కంపనే" 'ధూఞ్ ధాతువునకు కదలించుట యని యర్థము.' అని వ్యాకరణమునసున్నది

---

"గోధుమలచే హోమము నాచరింపవచ్చును" అనుపక్షము నవలంబించిన నప్పుడు యవహోమమునుగూర్చి చెప్పుశాస్త్రమునందలి ప్రామాణ్యమును పరిత్యజింప వలయును. ఇదియొకదోషము. లేనియప్రామాణ్యమును అంగీకరింపవలయును. ఇది రెండవదోషము. "గోధుమలతో హోమము నాచరింపకుండవచ్చును" అనుపక్షము నాశ్రయించినచో నప్పుడు యవహోమము నంగీకరించిన ట్లగును కావున దానినిఁగూర్చి చెప్పుశాస్త్రమునం దిదివఱకు నిషేధింపఁబడిన ప్రామాణ్యమును మఱల గ్రహింపవల యును. ఇది మూఁడవదోషము. స్వీకరింపఁబడిన యప్రామాణ్యమును మఱల బరిత్య జింపవలయును. ఇది నాల్గవదోషము. ఇట్లు వ్రీహిహోమమునుఁగూర్చి చూపఁబడిన రెండుపక్షముల నాశ్రయించినచో యవశాస్త్రమునకు నాల్గుదోషములు వచ్చుచున్నవి. ఇట్లే యవపక్షము నాశ్రయించి చూచినను వ్రీహిశాస్త్రమునకు నాల్గుదోషములు వచ్చును. రెండుపదార్థములు లేకున్న వికల్ప ముండదు కావున వికల్పమున కెనిమిది దోషము లని చెప్పఁబడెను. "రామునిఁగాని కృష్ణునిఁగాని తోడ్కొనిరమ్ము" అను మొదలగు లౌకికవాక్యములందు నిట్లే యూహింపవలయును. వ్రీహియవాదివాక్యముల యందు శ్రుతిప్రామాణ్యాప్రామాణ్యములును, లౌకికవాక్యములందు పురుషవాక్య ప్రామాణ్యాప్రామాణ్యములును వచ్చునని తెలిసికొనవలయును.

కావునను "దోధూయంతే ధ్వజాగ్రాణి" "కేతనపుకొనలు కదలుచున్నవి." అను మొదలగు ప్రయోగములవలనను ఆపదమునకు కదలుట యని మాత్రమే యర్థ మగుచున్నది. కావున "పుణ్యపాపములు కదలుచున్నవి" యని మాత్రమే యర్థము చెప్పవలయును కాని మఱియొక్కటి కాదు. "పుణ్యపాపములకు రూపము లేదు కావున కదలుట సంభవింపదుకదా!" యనియెదవేమో యీదోషము మీమతమునందును కలదు. స్వరూప హీనములగుటచే నవి యొకస్థలమునుండి వెడలిపోయి మఱియొకస్థలమున సంచరించు ననుటయు సంభవింపదు కదా! ఈకారణమువలన విధూనశబ్దమును విభాగంబును గూడ వర్ణింపఁబడియున్న కౌషీతకీబ్రాహ్మణాదిశ్రుతుల యందు మాత్ర మొకవేళ విధూననపదమునకు త్యాగమనే యర్థముగాఁ జెప్పినను కేవలవిధూననము మాత్రమే యున్నచోట నాయర్థమును చెప్పఁ గూడదు. అచ్చట "కదలుట" యనుదానిని మాత్రమే యర్థముగ గ్రహించి లక్షణావృత్తి నాశ్రయింపవలయును. "బ్రహ్మజ్ఞానముయొక్క పుణ్యపాపములు కొంతకాలము తమఫలముల నొసంగవు' అనిమాత్రమే యర్థము చెప్పవలయును. మఱియొకవిధముగఁ జెప్పిన గౌరవము వచ్చును. కావున నెట్లును విధూననశబ్దము నాశ్రయించి యన్నియెడల విభాగమును గ్రహించుటకు వీలు లేదు. పూర్వాధికరణమున నర్థభేదము కలది యగుటచే హృదయశబ్దము నాశ్రయించి యుపనిషదారంభమంత్రమునకును విద్యలకును సంబంధమును నిర్ణయించుటకు వీలు లేదని చెప్పియుంటిరి కదా!

అవతారిక:—అని యిట్లు దృష్టాంతసంగతితో వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## హానౌతూపాయనశబ్దశేషత్వాత్కుశాచ్ఛందస్తుత్యుపగానవత్తదుక్తమ్.

తాత్పర్యము:—ఇట్లు చెప్పఁగూడదు. ఎచ్చటను విధూననశబ్దమునకు విడచుట యనియే యర్థము చెప్పవలయును. ఏల యనఁగా:—కౌషీతకీబ్రాహ్మణోపనిషత్తునందు విభాగముకూడ జెప్పఁబడి యున్నది. ఒకఁడు

* గౌరవము. (అ-౧. పా-3. సూ-౨౧. పేజీ 317 చూ.)

విడువనిది రెండవవాఁడు దానిని స్వీకరించుటకు వీలులేదు కదా! స్వీకరించుట యనునది స్తోత్రార్థమే యైనను తత్ప్రస్తావమువలన స్తోత్రార్థముగ నైనఁ బరిత్యాగమే గ్రహింపఁబడుట యుక్తముగ నుండును. ఒకస్థలమున త్యాగమున నన్వయించువిధూనవశబ్దము మఱియొకస్థలమున నన్వయింపక పోవు ననుట యెట్లు? కుశాదిదృష్టాంతములయందు చూపఁబడినట్లు అర్థసంశయము కలిగినప్పుడు ఇతరశ్రుతియందు దోచువిశేషముల నాశ్రయించి తన్నిర్ణయము చేయఁబడవలయును గదా? ఒకవేళ మీరు చెప్పు నర్థమునం దైనను లక్షణ లేకపోవునేని యిప్పుడు మాపక్షమును విడిచిన విడువవచ్చును గాని యట్లును లేదు. మీరును ఆపదమునకు లాక్షణికార్థమునే చెప్పుచున్నారు. పుణ్యపాపములు పదార్థములు (రూపాదులు గలపదార్థములు) కాకపోవుటచే ధ్వజాగ్రాదులవలెఁ జలింపనేరవు కదా! "మాకల్పనయందు లాఘవము కలదుకదా" యనియెదవేమొ ప్రమాణ సిద్ధమై వచ్చునేని గౌరవముకూడ నంగీకార్యమే. ఇదియునుగాక "విధూయ" అనుపదమునకు "రాల్చుచున్నది" అనునర్థమునఁ గూడ లోకమునఁ బ్రయోగము గానవచ్చుచున్నది. ఇదియంతయును గాక ధాతువులకు ననేకార్థములు గలవనియు ధాతుపాఠమునఁ జూపఁబడిన యర్థములు ఉపలక్షణమాత్రములే (అనఁగా నొక్క క్రియ యర్థముగా జెప్పఁబడియుండినచో తత్సజాతీయము లగుక్రియల నన్నిటినిఁ గ్రహింపవలయు ననునుద్దేశముతోఁ జెప్పఁబడినవే) యనియు గణకారుఁడు (వ్యాకరణములోని గణములను గణించినవాఁడు) అంగీకరించియున్నాఁడు కావున నొకపక్షమున "విధూయ" యనుపదమునకే "పరిత్యజించి" యను నర్థము కూడ ముఖ్యముగానే రావచ్చును. వికల్పము సంభవింప దని పూర్వమీమాంసాశాస్త్రసిద్ధాంతముచే మున్నే నిరూపించియున్నాము. కావున విధూయపదమునకుఁ బరిత్యాగమే యర్థము.

---

## ౧౬. సాంపరాయాధికరణమ్.

విషయసంశయములు :— కౌషీతకిబ్రాహ్మణోపనిషత్తున పర్యంకవిద్యయందు ఉపాసకునిగతినిఁగూర్చి చెప్పునప్పుడు "స ఏతం దేవయానం

పంథాన మాసా ద్యాగ్నిలోక మాగచ్ఛతి" "ఆయుపాసకుఁడు దేవయాన మార్గము నాశ్రయించి యగ్నిలోకమునకుఁ బోవును." అని యారంభించి యంతమున "స ఆగచ్ఛతి విరజాం నదీం తాం మన సైవాత్యేతి తత్సుకృత దుష్కృతే విధూనుతే" "ఆతఁడు విరజానదినిఁ జేరును. సంకల్పమాత్రమున దానిని తరించును. పుణ్యపాపముల విడుచును." అని చెప్పఁబడియున్నది. ఇచ్చట నుపాసకునిపుణ్యపాపములు బ్రహ్మలోకమార్గమధ్యమున నశించిపోవునట్లు తోఁచుచున్నది. యథార్థస్థితి యిదియేనా? లేక మరియొక్కటియా? యనుసంశయ మీయధికరణమున విచారింపఁబడును.

పూర్వపక్ష సంగతులు:—కౌషీతకీబ్రాహ్మణశ్రుతిని విమర్శించిన "పుణ్యపాపనాశము మార్గమధ్యమున నే కలుగును అని తోఁచుచున్నది." తాండిశాఖయందును శాట్యాయనశాఖయందును "విద్యాసిద్ధి కలుగఁగనే (మృతిచెందుటకంటె) ముందే పుణ్యపాపనాశము కలుగును." అని చెప్పఁబడి యున్నది. కౌషీతకీబ్రాహ్మణోపనిషత్తునందు విరజానదీ తరణము చెప్పఁబడినపిదప "తత్సుకృతదుష్కృతే విధూనుతే" "ఆకారణము వలనఁ బుణ్యపాపములు విడిచిపోవును" అని చెప్పఁబడి యుండుటచే "విరజానదిని దాఁటుటయే పుణ్యపాపనాశమునకు హేతువు" అనువిషయము స్పష్ట మగుచున్నది; కావున ప్రత్యక్షశ్రుతిబలమువలన తాండిశాఖ మొదలగువానియందు చెప్పఁబడియున్న విషయమును పైనిర్ణయమునకు ననుగుణముగ సమన్వయింపవలయును. ఇట్లైనఁ బ్రభావ మంతయు విరజానదీతరణమునకు సంబంధించినదియే యగుటచే విద్య నిష్ప్రయోజనమే యగును. పూర్వాధికరణమున "విద్యకు పుణ్యపాపనివారణసామర్థ్యము కలదు." అనువిషయము నంగీకరించి పూర్వపక్షము జేసితిమి. విచారించిన నావిషయము నంగీకరించుటకే మొట్టమొదట వీలులేదు.

---

## అ-3. పా-3. సూ-౨౭.

అవతారిక:—అని యిట్లు ఆక్షేపసంగతితో వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

# ౩౮౭. సాంపరాయే కర్తవ్యాభావా త్తథా హ్యన్యే. ౩. ౩. ౨౭.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తియుక్తము కాదు. పుణ్య పాపములు మరణసమయమునందే యుపాసకుని విడిచిపోవును గాని మార్గ మధ్యమునం దిరజానదీతరణమునందు నుండవు. అట్లుండవలసినపని యేమి? ఉపాసన నాచరించి సత్ప్రభావమువలన బ్రహ్మలోకమునకు పోవువానికి నడుమ కొంతకాలమునందు సుకృతదుష్కృతములు చేయునుపకారాపకారములకు నవకాశ మెక్కడిది? పుణ్యపాపరూపదోషము లున్నవానికి నుత్తర మార్గము నడచుభాగ్యమైనను లేదు కదా! కార్య మేదియైన నున్నచో దానికై పుణ్యపాపసద్భావమును కల్పింపవచ్చునుగాని లేకున్న దానికి నవకాశ మెక్కడిది? మఱియు విద్యనొసంగుఫలమునకును పుణ్యపాపము లొసంగు ఫలమునకును తారతమ్య మధికముగఁ గల దనుట స్పష్టమే. కేవలతారతమ్యమే కాదు విరోధముకూడ కాదు. విద్యయొసఁగుఫలము శాశ్వతము; కర్మలిచ్చుఫలములు క్షయవంతములు. ఇట్లుండ విద్య ఫలము నొసఁగుటకు నారంభించినపిదప నడుమ దద్విరుద్ధము లగుకర్మఫలములుకూడ కలుగుచుండు ననుట యేటిమాట? “ఈకారణమువలన విద్యవలనఁ గర్మలు నశించును”అనియే సిద్ధాంతము చేయవలసి యున్నది. ఆవిద్యయును ఫలోన్ముఖము కాకుండిన నిట్లు చేయనేరదు కావున “విద్య యేదినమున ఫలము నొసఁగనుపక్రమించెనో యప్పుడే పుణ్యపాపములు నశింపవలయును” అని సిద్ధాంతము చేయవలయును. “అశ్వ ఇవరోమాణి విధూయ” అనితాండి శాఖయందును ‘తస్యపుత్రా దాయ ముపయంతి’ అని శాట్యాయనశాఖయందును ఈవిషయము స్పష్టముగనే చెప్పఁబడి యున్నది. కావున కేవల పాఠక్రమము నాశ్రయించుటను మాని యర్థక్రమమునే యాశ్రయింప వలయును.

“ఇట్లు కాదు. కేవల పాఠక్రమముమాత్రమే కాక తచ్ఛబ్దము కూడ పై విషయమునే (పూర్వపక్షమునే) స్పష్టము చేయుచున్నది యని చెప్పితిమి కదా!’’ అనియెదవేమో యదియు యుక్తము కాదు. బుద్ధియందు స్ఫురించుచున్నదానిని కూడ తచ్ఛబ్దము పరామర్శింపఁగలదు.

"కేవలము సమీపమున నున్న విషయము మాత్రమే పరామర్శించు"నని చెప్ప నక్కఱ లేదు. ఇట్లగుటచే బుద్ధియందు స్ఫురించుచున్న విద్యయు ప్రత్యక్షముగ సమీపమున వర్ణింపఁబడినవిరజానదీతరణంబును తచ్ఛబ్దము నకు (అనఁగా: తచ్ఛబ్దముచేఁ బరామర్శింపఁబడుటకు సమానములుగనే యున్నవి. ఇఁక పాఠక్రమంబును అర్థక్రమంబును మాత్రమే మిగిలియుం డును. అప్పుడు బలవంతముగావున నర్థక్రమమే గ్రహింపఁబడవలయును కదా! ఇట్లు గాక మఱియొకవిధముగా సిద్ధాంతము చేయఁబూనిన 'అశ్వ ఇవ' అను మొదలగు శ్రుతులకు కౌషీతకీబ్రాహ్మణసందర్భమునకును విరోధము వచ్చును. దానిని మఱియొకవిధముగ సమన్వయింపవచ్చుననియు "ముందే పుణ్యపాపములు నశించును." అనుటకు 'బ్రహ్మప్రాప్తికి ముందే' యని యర్థము చెప్పవచ్చుననియు యిదివఱకే నిరూపించితిమి. ఈయర్థము నాక్షేపించుటకు నాధారమెద్దియు లేదు. 'ఆశ్రుతియందు పుణ్యపాప వినాశకాల నిర్ణయము చేయఁబడి యుండలేదు కదా! బ్రతికియున్నప్పు డని కాని మృతిజెందినపిదప నని కాని చెప్పఁబడి యుండలేదు కదా!' అని యెదవేమో యది యుక్తము కాదు. అట్టినిర్ణయము లేకున్నను "మరణ కాలమునకంటె ముందే పుణ్యపాపక్షయము కలుగును" అని సిద్ధాంతము చేయవచ్చును. "అశ్వ ఇవ" అను శ్రుతియందు పుణ్యపాపత్యాగవిషయ మున నుపాసనాప్రభావసంపన్నుఁ డగుపురుషునకు స్వాతంత్ర్యము జెప్పఁ బడియున్నది. "విరజానదీతరణమువలనఁ బుణ్యపాపములు నశించును" అని సిద్ధాంతము చేయఁబూనిన నిది నశించును. ఈకారణములవలనఁ బుణ్య పాపములు మరణమునకంటెఁ బూర్వమే విద్యాప్రభావమువలన నశించు ననుటయే సిద్ధాంతము;విద్యకుఁ బ్రయోజనము కలుగుననుటయేనిర్ణయము.

## అ-3. పా-3. సూ-౨౮.

అవతారిక:—'ఇట్లుచెప్ప నేల ? విద్యకు బ్రహ్మలోకప్రాపణము ఎట్లు ఫలమో అట్లే మార్గమధ్యమునఁ బుణ్యపాపముల నశింపఁజేయుట గూడ ఫలము కావచ్చును కదా!' అనిన సమాధానముఁ జెప్పుచున్నాఁడు.

## 3౨౮. ఛందత ఉభయావిరోధాత్. 3. 3. ౨౮.

తాత్పర్యము:—ఈవిధముగ నంగీకరించినను ప్రయోజనము లేదు.

మార్గమధ్యమును పుణ్యపాపనాశ మెట్లును సంభవింపదు. మృతిచెందిన పిదపఁగాని బ్రహ్మలోకమునకుఁ బోవఁడనుటయు; మరణానంతరమున నేకార్యము నాచరించుటకుఁ గాని సామర్థ్యము లేదనుటయు; కారణము కలిగిన తత్క్షణమే కార్యము జనించు ననుట నియమము కావున విద్యానుష్ఠానము ముగిసినతోడనే పుణ్యపాపనాశము కలుగవలయు ననుటయు సర్వజనవిదితము లగునంశములే. ఇట్లుండ మరణానంతరమున విద్యానుష్ఠానము గలుగకున్నఁ బుణ్యపాపనాశము మాత్ర మెట్లు కలుగును? బొత్తుగనే కలుగనేర దనవలయును.

"జీవించియున్నప్పుడు విద్యానుష్ఠానంబును బ్రహ్మలోకమార్గమధ్యమున పుణ్యపాపనాశంబును కలుగఁగూడదా" అనుటయు యుక్తము కాదు. కారణము వెంటనే కార్యము జనించు నని మున్నే చెప్పియున్నాము. "కేవల పదార్థములు కొంతకాల మట్లే యుండఁగూడదా" అనియెద వేమో. కార్యోన్ముఖత్వము కలిగిననేగాని యేపదార్థమునకును కారణత్వము రా దనుట సర్వశాస్త్రసమ్మతము. ఇట్లుండ గార్యకారణములకు వ్యవధాన మెక్కడిది? ఈకారణమువలన బ్రతికియున్నప్పుడే పురుషుఁ డుపాసనల నాచరించు ననియు తత్క్షణమే పుణ్యపాపము నశించు ననియుఁ జెప్పవలయును. బ్రహ్మలోకప్రాప్తికి మరణముతో నావశ్యకత కలదుగాని బుణ్యపాపనాశమునకు లేదు. ప్రారబ్ధకర్మము తనఫలము నొసంగుటకై దేహమును కల్పించి దానియంతమువఱకు ననువర్తించుచుండును; ఉత్తర జన్మములకు గారణములై ఫలోన్ముఖములు కాకుండిన సంచితాగామి కర్మలన్నియు నశించును. ఇందు విరోధ మేమి? దీనికి దేహత్యాగముతో నావశ్యకత లేదుకదా! కావున మరణమునకంటెఁ బూర్వమునందే పుణ్యపాపవినాశము కలుగు నని యంగీకరించితీరవలయును.

విశేషాంశము:—"జీవుఁడు బ్రహ్మలోకమునకుఁ బోవుటకు మఱియొకమార్గము కూడ నేల యుండకూడదు? విరజానదీతీరమువఱకు పుణ్యపాపములతోఁ బని యేల యుండకూడదు?" అని యాక్షేపము చేసికొని దానికి సమాధానముగ నీయిరువదియొనిమిదవ సూత్రమును మఱి కొందఱు వ్యాఖ్యానము చేసిరి. "మరణానంతరమునఁ గలుగు విషయములు ప్రత్యక్షగోచరములు కాకపోవుటచే నవి కేవలవేదము నాశ్రయిం

చియే నిర్ణయింపఁబడవలయును కాని స్వాతంత్ర్యపు టూహాలచే నిర్ణయింపఁ బడుటకు వీలులేదు. వేదమును యుక్తులు బాధింపనేరవు. శ్రుతిస్మృతులు రెండును ఏకవాక్యముతో నీవిషయమునే బోధించుచున్నవి. మహాత్ము లందఱు నిట్లే స్మరించుచున్నారు. కావున నీసిద్ధాంతమే యుక్తము" అని సూత్రతాత్పర్యమును వర్ణించిరి. మార్గము నంగీకరించి దానిపై విషయ విమర్శమును గావించు నీయధికరణమున మార్గమును గూర్చిన వివాదము చర్చింపఁబడుట యయుక్తము కావున నీపక్షము శంకరసమ్మతము కాదు.

---

## ౧౭. గతేరర్థవత్త్వాధికరణము.

విషయసంశయములు:—సగుణవిద్యలయందు పుణ్యపాపపరిత్యాగ సమీపమున దేవయానమును చెప్పఁబడియున్నది; నిర్గుణవిద్యాస్థలముల యం దట్లు లేదు. ఈవిషయమునుగూర్చి యిందు విచారింపఁబడును. దేవయానము అన్నిస్థలములయందు నుపసంహరించుకొనఁబడవలయునా? లేదా? యనువిషయము నివారింపఁబడును.

పూర్వపక్షసంగతులు:—పూర్వాధికరణమునందు కేవలప్రస్తావము వలన వచ్చిన విషయము మాత్రమే పరిష్కరింపఁబడినది గావున దానిపై నాక్షేప మేమియు లేదు; ఏమి చేయుటకును వీలులేదు. అయినను తత్పూర్వాధికరణసిద్ధాంతము నాశ్రయించి చూచిన నొక్కవిధముగా పైవిషయమునందు నిర్ణయమేర్పడుచున్నది. ఆయధికరణమున పుణ్యపాప త్యాగసమీపమున నొక్కస్థలమున వర్ణింపఁబడియున్నది యను కారణ ముచే విభాగము సర్వస్థలములలోనికి నుపసంహరించుకొనఁబడవలసి నదియే యని సిద్ధాంతము చేసియున్నారు. ప్రస్తుతవిషయమును గూడ నిట్లే పరిష్కరింపవచ్చును. పుణ్యపాపత్యాగసమీపమున నొక్కస్థలమున వర్ణింపఁబడినది యగుటచే దేవయానమార్గము కూడ సర్వస్థలములలోనికి నుపసంహరించుకొనఁబడవలసినదియే యని నిరూపింపవచ్చును. "నిరంజనః **పరమం సామ్య ముపైతి"** "జ్ఞాని సర్వసంబంధవర్జితుఁడై సంపూర్ణసామ్యము

నొందును" అను వాక్యమునకుఁగూడ నీసిద్ధాంతమువలన విరోధము రాదు; బ్రహ్మలోకమును చెందినవాఁడుగూడ సర్వసంబంధవర్జితుఁడే. పరబ్రహ్మముతో లేక చతుర్ముఖునితో సంపూర్ణసామ్యము నొందినవాఁడే.

## అ_3. పా_3. సూ_౨౯.

అవతారిక:—అని యిట్లు (దృష్టాంతసంగతితో వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

---

# ౩౬౯. గతే రర్థవత్త్వ ముభయ థాఽన్యథా హి విరోధః. 3. 3. ౨౯.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట సరి కాదు. ఈ దేవయానమార్గము రెండువిధములుగ (అనఁగా కొన్నిస్థలములయందు సార్థక మనియు మఱి కొన్నిస్థలములయందు నిరర్థక మనియు) గ్రహింపఁబడిననే కాని సార్థకము కానేరదు. విద్యలు సగుణవిద్య లనియు నిర్గుణవిద్య లనియు రెండువిధములుగ నున్నవి కదా! ఇందు నిర్గుణవిద్యయందు గతితోఁ బని యేమియు లేదనుట యుక్తముగా నుండును. ఇట్లు విభాగము నంగీకరింపకపోయినశ్రుతియందే పరస్పరవిరోధమువచ్చును. నిర్గుణవిద్యావిషయమును చెప్పునొక శ్రుతి "పుణ్యపాపే విధూయ నిరంజన. పరమం సామ్య ముపైతి" అను నొక శ్రుతినిర్గుణవిద్యోపాసకుఁడుసర్వసంగరహితుఁ డగు ననియుఁ బరబ్రహ్మముతో నైక్యమును చెందు ననియుఁ జెప్పుచున్నది. ఈయుపాసనయందుఁ గూడ గతి యుండునేని యప్పు డిట్లుచెప్పుట సంభవింపదు. సర్వసంగరహితుఁ డెటకుఁ బోఁగలఁడు? సర్వవ్యాపక మగుపరబ్రహ్మముతో నైక్యము నొందుటకు నెటకుఁ బోవలయును? ఈకారణమువలన నిట్టియుపాసకులకు గతి యక్కఱ లే దని నిర్ణయింపవలసియున్నది.

---

## అ_3. పా_3. సూ_3౦.

అవతారిక:— "ఇట్లు నియమము లేకుండ కొన్నిచోట్ల నొకవిధముగాను మఱికొన్నిచోట్ల మఱియొకవిధముగాను సిద్ధాంతము చేయుట

యుక్త మగునా?" అనిన దానిని నిరూపించుటకై హేతువు నుపన్యసించు చున్నాడు.

## ౩౦. ఉపపన్నస్తల్లక్షణార్థోపలబ్ధే ర్లోకవత్. 3. 3. 30.

తాత్పర్యము:—ఈసిద్ధాంతమునందు దోష మేమియు లేదు. అచ్చటివిషయము లట్లే యున్నవి. కొన్ని విషయములు గమనమును కోరునవి గాను మఱికొన్ని యట్లు కోరనివి గాను ఉన్నవి. పర్యంకవిద్యాది సగుణవిద్యలకు మంచముపై నెక్కుట అచ్చట నున్న చతుర్ముఖునితో మాటలాడుట లోకోత్తరము లగుసుగంధాదుల ననుభవించుట మొదలగునవి ఫలములు. ఈఫలములు గమన ముండిననే కాని సంభవించునవి కావు కదా! బ్రహ్మలోకమునకు పోయిననేగాని బ్రహ్మతో (సగుణబ్రహ్మతో చతుర్ముఖునితో) మాటలాడుటకు వీలు లేదనుటలో వివాద మేమి? ఈకారణమువలన సగుణవిద్యలకు గతి కావలయును. ఇక నిర్గుణవిద్యలనుగూర్చి విచారించిన వానికిఁ బరమేశ్వరైక్యమే ఫలము. దీనికి గమనముతోఁ బని లేదు. పరమేశ్వరుఁడు సర్వవ్యాపకుఁ డనియు జీవుఁడు ఆయనకంటె నభిన్నుఁడే యనియు అజ్ఞానవశమున రజ్జువునందుఁ గలుగు సర్పభ్రాంతివలెఁ బరమేశ్వరునందు జీవభ్రాంతి కలిగె ననియుఁ జెప్పఁబడి యున్నది. భ్రాంతి జ్ఞానముచే నశించు ననుటయు నిర్వివాదాంశమే; భ్రాంతి నశింపఁగానే స్వతస్సిద్ధ మగుజీవబ్రహ్మైక్యము ప్రకట మగు ననుటయు యుక్తిసిద్ధమే. ఇఁక నిచ్చట గతితోఁ బని యేమి? ప్రమాదవశమున నొకవిధముగా గ్రహింపఁబడి యున్నదానిని మఱియొకవిధముగా (యథార్థస్వరూపముతోఁ) దెలిసికొనవలయు ననిన నెటకుఁ బోవలయును? గ్రామాంతరమునకుఁ బోవలయు ననిన మార్గము కావలయును గాని ఆరోగ్యమును సంపాదింపవలయు ననిన నక్కఱ లేదు కదా! కావున నీసిద్ధాంతమున లోప మేమియు లేదు. ఈవిషయమును చతుర్థాధ్యాయమున నింతకంటె విశేషముగ యుక్తియుక్తముగ నిరూపింపఁబోయెదము.

విశేషాంశము:—మఱికొందఱీయధికరణమును మఱియొకవిధముగ వ్యాఖ్యానము చేసి యున్నారు. "హాన్యధికరణమున పుణ్యపాప

ములు రెండును నశించు నని చెప్పితిరి కదా! పుణ్యము కూడ నశించిన నుపాసకుఁడు పరలోకమునకుఁ బోవనేటికి?" అని యాక్షేపించిదానికి సమాధానముగ నీయధికరణము నవతరించుచున్నారు. "ఇట్లు కాదు. పాప పుణ్యములు రెండును క్షీణము లైననే కాని గతికి సార్థకత్వము కలుగదు. పుణ్యము శేషించియుండిన బ్రహ్మలోక ప్రాప్తినకు బునర్జన్మము కలుగవలసి వచ్చును. ఇది శ్రుతికి విరుద్ధము" అని మొదటిసూత్రమునకును, "పుణ్య పాపము లుండుటవలన గావలసినపని యేదియు లేకపోవుటచే (అనఁగా పుణ్యమువలన బ్రహ్మలోకసుఖ మధిక మగుటయుఁ బాపమువలన క్షీణించుటయు లేకపోవుటచే) నవి నశించుటయే యుక్తము. లోకము నందును నిరర్థకము లుపేక్షింపఁబడుచున్నవి కదా!" అని రెండవసూత్రము నకు నర్థము చెప్పుచున్నారు.

ఈపక్షము యుక్తియుక్తము కాదు. పూర్వగ్రంథమును విమర్శించి చూచిన మొట్టమొదట నీసంశయము కలుగుటకే వీలు లేదు. దేవయాన గమనము విద్యకు సంబంధించినదియేకాని కర్మకు సంబంధించినది కాదు కదా! ఇట్లుండ కర్మకు సంబంధించినసంశయ మెట్లు కలుగును? ఈకార ణమువలన మొట్టమొదటిపక్షమే యుత్తమము.

---

## ౧౮. అనియమాధికరణము.

సంగతి, విషయ సంశయములు:—"పూర్వాధికరణమునందు సగుణ విద్యలయందు మాత్రమే దేవయానాదిమార్గములతో నావశ్యకము కలదు. కావున నామార్గములు ఆవిద్యలతో మాత్రమే సంబంధించు ననియు నిర్గుణోపాసనాఫల మగుబ్రహ్మైక్యమునకు గతితో నావశ్యకత లేదు కావున నావిద్యలతో దేవయానాదులకు సంబంధములే దనియు సిద్ధాంతము చేసియున్నారు. విమర్శించి చూచిన సగుణవిద్యలకుఁ గూడ నన్నింటికిని యీమార్గములతో సంబంధ మున్నట్లు తోచుట లేదు. పర్యం కవిద్య ఉపకోసలవిద్య పంచాగ్నివిద్య దహరవిద్య అను మొదలగుకొన్నిటి యందు మాత్రమే దేవయానపితృయానమార్గములు వర్ణింపఁబడియున్నవి. మధువిద్య శాండిల్యవిద్య షోడశకలవిద్య వైశ్వానరవిద్య అను మొదల కొన్నిటియం దట్లు వర్ణింపఁబడియుండ లేదు. ఇచ్చట నిర్ణయ మె

ఒకస్థలమునఁ జెప్పఁబడియున్నగతిని సర్వస్థలములలోనికి నుపసంహారించుకొనవలయునా? యక్క-అ లేదా? పూర్వాధికరణసిద్ధాంతము నాశ్రయించి చూచిన నాయుపసంహారముతోఁ బని లే దనియే తోఁచుచున్నది" అను నీసంశయ మీయధికరణమున విచారింపఁబడును.

పూర్వపక్షము:—విచారించిన నెచ్చటనున్నగతు లచ్చటనే కాని మఱియొకస్థలమున నుపసంహారము లే దనియే తేలుచున్నది. శ్రుత్యాదులలో నన్నిటికంటెఁ బ్రకరణమే బలవంతము. సామాన్యసంబంధ మొక్క-టి లేకున్న శ్రుత్యాదు లెవ్వియు స్వకార్యమును నిర్వహింపఁజాలవనియు సామాన్యసంబంధంబును ప్రకరణముచేతనే కలుగు ననియు మున్నే వివరించి యున్నాము కదా! కావున ప్రకరణము నాశ్రయించి యెచ్చటనున్న మార్గము నచ్చటనే నియమింపవలయును. ఇట్లు చేయకున్న శ్రుతిలింగాదు లన్నియు నప్రమాణములే యగును. అప్పుడు అన్నిటికి నన్నియర్థములును వచ్చు ననవలసి వచ్చును; ప్రతిదానిని ప్రతిస్థలమునందు నుపసంహారించుకొనవచ్చు నని సిద్ధాంతము చేయవలసి వచ్చును. ఇది సంభవింపదు కదా! మఱియొకవిశేషము దేవయానమార్గ మొక్క-టియే యుపకోసలవిద్యయందును పంచాగ్నివిద్యయందును గూడ పఠింపఁబడి యున్నది. కదా! అదియు మీయభిప్రాయమునకు విరుద్ధముగ సిద్ధాంతము చేసిన సరిపడదు. ఒకస్థలమున జెప్పఁబడియున్న మార్గమును మఱియొకస్థలమునకు కొనవలయు ననుటయే శ్రుతికి నభిప్రాయ మగునేని యప్పుడు ఒకస్థలమునందుమాత్రమే మార్గమును వర్ణించి యూరకుండ వచ్చునుగదా! కావున నెచ్చటఁజెప్పినమార్గ మచ్చటనేకాని మఱియొకస్థలమునకు రా దనుటయే శ్రుతికి నుద్దేశ మని తేలుచున్నది.

---

## అ-3. పా-3. సూ-3౧.

అవతారిక:—అని యిట్లు దృష్టాంతసంగతితో వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౩౯౧. అనియమః సర్వాసా మవిరోధః శబ్దానుమానాభ్యాం. ౩. ౩. ౩౧.

తాత్పర్యము:— ఇట్లు కాదు. దేవయానమార్గము బ్రహ్మలోక ప్రాప్తి నొసంగుసర్వవిద్యలతోను సంబంధించినదియే; నియతముగా నొక్కవిద్యకు మాత్రమే (అనఁగా నెచ్చట చెప్పఁబడియున్నదో యావిద్యకుమాత్రమే) సంబంధించునది కాదు. ఈసిద్ధాంతమువలన ప్రకరణవిరోధముగాని మఱియొక్కదోషముగాని కలుగదు. శ్రుతియు స్మృతియును మాసిద్ధాంతము నంగీకరించి యున్నవి. ఎట్లనిన:—

బృహదారణ్యకోపనిషత్తునందు "య ఏవ మేతద్విదు ర్యే చామీ అరణ్యే శ్రద్ధాం సత్య ముపాసతే" "ఎవ్వరు ఈవిషయమును (పంచాగ్ని విద్యను) తెలిసికొందురో మఱియు నెవ్వరు అరణ్యమున నివసింపుచు శ్రద్ధాపూర్వకముగ సత్యము నుపాసింతురో" అనుశ్రుతి పంచాగ్నివిద్య యందుఁ గలదు. దీనియర్థమును విమర్శించిన సగుణోపాసకుల కందఱ కును దేవయానము కల దని స్పష్ట మగుచున్నది. ఈవాక్యమునందు సత్యపదమునకు వ్యావహారికసత్యము లగుపదార్థము లర్థము. ఆపదము ప్రత్యక్షముగ పరమేశ్వరుని చెప్పునదియే యైనను విద్యాసంబంధమువలన నుపాసనార్థమై తదుపాధులఁ జెప్పును. "య ఏవ మేత ద్విదుః" అనువాక్య భాగముచేతనే పంచాగ్నివిద్యను గూర్చి చెప్పఁబడి యున్నది కావున నుత్తరభాగమున నితరవిద్యలను గూర్చియే చెప్పఁబడి యున్నట్లు నిస్సంశయముగా నిర్ణయింపవచ్చును. పంచాగ్నివిద్యావేత్తలకుఁ జెప్పఁ బడిన దేవయానమార్గమే వీరికిని కల దని సిద్ధాంతము చేయవచ్చును. మఱియు "త ద్యఇద్థం విదుః" "ఈవిధముగ నెవ్వ రెఱుంగుదురో" అను వాక్యముచే పంచాగ్నివిద్యావేత్తలవిషయము నుపసంహరించి వారికి దేవయానమార్గమును చెప్పి పిదప "యే చే మేఽరణ్యే శ్రద్ధా తప ఇ త్యుపాసతే" "అరణ్యముననుండి యెవ్వరు శ్రద్ధను తపస్సును విద్యా సహితముగ నాచరించుచున్నారో" అని యితరవిద్యల నుపాసించువారి విషయమును గూడ ప్రస్తావించి వారికిఁగూడ నామార్గమును ఛాందోగ్యశ్రుతి చెప్పియున్నది. "ఈఛాందోగ్యశ్రుతియందు శ్రద్ధా

తపస్సులనుగూర్చి మాత్రమే చెప్పఁబడియున్నది కాని విద్యలనుఁగూర్చి చెప్పఁబడలేదు కదా !" అనియెదవేమొ వినుము. విద్యాసంబంధము లేక కేవల శ్రద్ధాతపస్సులు దేవయానము నొసంగఁజాలవు. "విద్యయా త దారోహంతి యత్ర కామాః పరాగతాః న తత్ర దక్షిణాయంతి నావిద్వాంస స్తపస్వినః" "ఏస్థలమునందు (బ్రహ్మలోకమునందు) సర్వకామములును పరిపూర్ణములై యున్నవో ఆస్థలమునకు నుపాసకులు గాని పోనేరరు. ఎంత శ్రద్ధావంతులైనను తపోవంతులైనను విద్యలేక యచ్చటికిఁ బోఁజాలరు" అని మఱియొక శ్రుతి యీవిషయమును బోధింపుచున్నది. కావున దేవయానమార్గమును సర్వవిద్యలలోనికి నుపసంహరించుకొనవలయు ననుటయే సిద్ధాంతము. ఈసిద్ధాంతమునకు భంగము కలిగింపఁ జూచిన బహుదోషములు వచ్చును. "అథ య ఏతౌ పంథానౌ న విదు స్తే కీటాః పతంగాః య దిదం దందశూకం" "ఈపితృయాన దేవయానమార్గముల నెవ్వ రెఱుంగరో వారు పురుగులుగానైనను పక్షులుగానైనను సర్పములుగా నైనను జనించి యధోగతి నొందుదురు" అని మఱియొక శ్రుతి వివేకు లనఁబడువారి నందఱను దేవయానపితృయాన మార్గముల నొందవలసినవారినిఁగా జెప్పుచున్నది. ఇట్లుండ విద్యలలో దేవయానమార్గము నుపసంహారము చేసికొనకుండుటకు నెట్లు వీలు కలుగును ? చేసికొనకుండిన నుపాసకులలో కొంద రధోగతికి పోవలసినవార లగుదురు కదా! ఇది యుక్తము కా దనుట నిర్వివాదాంశము. ఇట్లే "శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే, ఏకయా యాత్యనావృత్తి మన్య యావర్తతే పునః" "దేవయానపితృయానమార్గములకు క్రమముగ శుక్లకృష్ణమార్గము లని పేరు. ఇవి నిత్యములైనవి. వివేకి యెవ్వఁడును ఈమార్గములఁ జెందకపోఁడు. ఇందు దేవయానమార్గమునఁ బోయినవాఁడు మఱల రాఁడు. పితృయానమార్గమునఁ బోయినవాఁడు పునర్జన్మము నొందును" అనుస్మృతియు పైవిషయమునే బోధింపుచున్నది. ఇదియు "వివేకులకు రెండుమార్గములు మాత్రమే కలవు" అని చెప్పుచున్నది. కావున నెట్లును మాసిద్ధాంతమున దోషము లేదు. శ్రుతిస్మృతివాక్యము లేవియు లేకున్న ప్రకరణము బలవంతమగును కాని యవి యున్నప్పుడు కానేరదు. శ్రుతి ప్రకరణమునకంటె బలవంత మనుట స్పష్టము కదా ! మఱియు దేవయానమార్గము పంచాగ్ని

విద్యయందు నుపకోసలవిద్యయందును గూడఁ జెప్పఁబడె ననుట దోషము కాదు. అది ధ్యానార్థమై యట్లు చెప్పఁబడెనుగాని యుపసంహారము లే దనునభిప్రాయముతో కాదు. కావున మాసిద్ధాంతమే యుక్తి యుక్తమైనది.

---

## ౧౯. యావదధికారాధికరణము.

విషయ సంశయములు:—ఈయధికరణమున "నిర్గుణవిదోపాసకునకు పునర్జన్మము కలదా? లేదా?" యనువిషయము విమర్శింపఁబడును. "ఈవిమర్శతో నావశ్యకత లేదు. 'నిర్గుణోపాసకునకు ముక్తి కలదా? లేదా?' యనియే విచారించు నట్లయినది. ఇది యేటివిచారము 'పాకసామగ్రి సమగ్రముగ నున్న పాక మగునా? కాదా' యని విచారించుట సంభవించునా!" అనియెదవేమొ వినుము. ఈవిచారమునకుఁ గొంతయుపపత్తి కలదు. పురాణాదులయందుఁ గొన్నిచోట్ల బ్రహ్మవేత్తలకుఁ గూడఁ బునర్జన్మము చెప్పఁబడి యున్నది. అపాంతరతముఁ డను వేదాచార్యుఁడు విష్ణునియాజ్ఞచే కలిద్వాపరసంధియందు కృష్ణద్వైపాయనుఁడై జనించెనట. వసిష్ఠమహాముని యు బ్రహ్మమానసపుత్రుఁడయ్యును నిమిశాపమువలన తనపూర్వదేహమును విడిచి బ్రహ్మదేవునియాజ్ఞచే మఱల మిత్రావరుణుల వలన ఊర్వశియందు జనించెనట. భృగువు మొదలగు బ్రహ్మమానసపుత్రులు ఒకకారణమువలన తమ దేహమును వదలి వరుణుని యజ్ఞము నందు మఱల జనించిరట. సనత్కుమారుఁడును బ్రహ్మమానసపుత్రుఁడే యయ్యును, ఈశ్వరునకు తానే వరమిచ్చి కుమారస్వామియై పుట్టెనట. ఇట్లే దక్షుఁడు నారదుఁడు మొదలగువారు అనేకకారణములచే బూర్వదేహములను వదలి జన్మాంతరముల నొందిరట. ఈవిషయము లన్నియు స్మృతిపురాణాదులయందే గాక మంత్రార్థవాదాదులయందును స్పష్టముగ నిరూపింపఁబడి యున్నవి. వీ రందఱును సర్వవేదార్థవేత్త లనుట నిస్సంశయము కదా! వీరిలో కొందఱు పూర్వదేహమును విడిచియు మఱి కొందఱు ఆదేహ మట్లే యుండఁగనే యోగబలమువలన నితరదేహముల గల్పించియు లోకోపకారముల నాచరించుచున్నా రనుట స్పష్ట మగుచున్నది. ఇట్లగుటచే అపాంతరతమాదిమునులకువలెనే యితర బ్రహ్మవేత్త

లకుఁ గూడ పునర్జన్మము కలదేమో యని సంశయము తోఁచవచ్చును. ఈసంశయ మీయధికరణమున నివారింపఁబడును.

పూర్వపక్షసంగతులు:— విచారించిన నిర్గుణవిద్యోపాసకులకుఁ గూడ పునర్జన్మ మున్నదనియే చెప్పవలసివచ్చును. కొందఱి కుండిన మఱి కొందఱికి లేకపోవు ననుట యెట్లు? "ప్రారబ్ధము కలదు కావున వసిష్ఠాదులకు నంతవఱకు దేహముండవచ్చును" అనియెద రేమొ. ఈస్థితి యొక్క దేహమునకు మాత్రమే సంభవించును; అనేక దేహములఁ దాల్చుటకు వీలు లేదు," 'న స పునరావర్తతే' 'బ్రహ్మలోకమును జెందినవాఁడు పునర్జన్మము నొందఁడు' అను శ్రుతి కలదు కదా!' అనియెదరేమొ యది నిర్గుణ విద్యను నుతించినది కావచ్చును. కావున నిర్గుణవిద్యకు మోక్షము ఫలము కానేరదు. అట్లే యైన నెవ్వనికిని పునరావృత్తి యుండఁగూడదు గదా! కావున నీవిద్యలకును ఐశ్వర్యాదులే ఫలములు కావలయును. పునర్జన్మము లేక వాని ననుభవించుటకు వీలు లేదు కావున నవశ్యముగ పునర్జన్మ ముండవలయు. అప్పుడు పరలోకప్రాప్తియు నచ్చట సుఖదుఃఖానుభవంబు నుండుటచే దేవయాన పితృయానమార్గములు కావలసి వచ్చును; నిర్గుణ విద్యలలోనికిఁ గూడ నవి యుపసంహరించుకొనఁబడవలసి వచ్చును. ఇట్లయిన నింతకుఁ బూర్వము చేయఁబడిన సిద్ధాంత మంతయు నిలువనేరదు. ఇట్లు కాదని పట్టు పట్టినను నిర్గుణవిద్యలకు మోక్షహేతుత్వంబును తదభావంబును గూడ గల దని యంగీకరింపవలసి వచ్చుటచే నేకపక్షమున నైనను ఈదోషములు ప్రాప్తించక మానవు.

## అ-3. పా-3. సూ-32.

అవతారిక:—అని యిట్లు ఆక్షేపసంగతితో వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## 32. యావదధికార మవస్థితిరాధికారికాణామ్. 3. 3. 32.

తాత్పర్యము:—ఇట్లుచెప్పుట యుక్తముకాదు. పూర్వాపరముల విమర్శించిన నిర్గుణవిద్యలకు ముక్తియే ఫలమని తేలుచున్నది. ఈవిషయ

మును మఱియొకవిధముగా వ్యాఖ్యానము చేయుటకు వీలు లేదు. ఇది విద్యాస్తుతియే యనుట సంభవింపదు. ఈకారణమువలన నిర్గుణవిద్యలకు నైశ్వర్యప్రాప్తి ఫలము కానేరదు; తదర్థమై పునర్జన్మంబును కలుగనేరదు. అట్లు కలుగవలసినపనియు లేదు.

అపాంతరతమాదిమహర్షులు ఆధికారికులు. జన్మాంతరములయందిట్టి వా రాచరించినయుపాసనలచేతను కర్మలచేతను ప్రీతుఁడై పరమేశ్వరుఁడు వారికి లోకోద్ధరణాధికారముల నొసంగెను. ఈకారణమువలన నాయధికారములు ముగియునంతవఱకు వారలు బ్రహ్మజ్ఞానము కలవారయ్యు ముక్తి నొందవలసినవారయ్యు దేహధారులై విహరింతురు. సూర్యుఁడు వేయియుగములవఱకు తనయధికారమును చెల్లించి పిదప నుదయాస్తమయరహిత్య మగుముక్తి నెట్లు జెందునో అట్లే వారును తమ యధికారములు ముగిసినపిదప ముక్తిని జెందుదురు. "అథ తత ఊర్ధ్వ ఉదేత్య నై వోదేతా నాస్తమే తైకల ఏవ మధ్యే స్థాతా" "ఆ సూర్యుఁడు పరమేశ్వరుఁడై సహస్రయుగాంతమున ముక్తినొంది మఱల నుదయింపఁడు అస్తమింపఁడు. స్వస్వరూపముతోనే నిలుచును" అని శ్రుతి యందు సూర్యునివిషయము వర్ణింపఁబడియున్నది. మఱియు నధికార నియుక్తులు కాని బ్రహ్మవేత్త లెట్లు ప్రారబ్ధకర్మము నశించునంతవఱకు నిలచి యుండి పిదప ముక్తు లగుదురో అట్లే వారును అధికారము ముగిసినపిదప ముక్తులగుదురు. "తస్య తావ దేవ చిరం యావ న్న విమోక్ష్యేఽథ సంపత్స్యే" "ప్రారబ్ధకర్మము నశించి శరీరపాతము కలుగుటయే యాలస్యము. వెంటనే ముక్తి దొరకును" అని శ్రుతియే బ్రహ్మవేత్తలను గూర్చియు చెప్పుచున్నది. ఈకారణమువలన నిర్గుణవిద్యలకు ఫలాంతరమును కల్పింపవలసినపని లేదు. ఫలము నొసంగఁగలపదార్థము కూడఁ బ్రతిబంధవశమువలన గొంతకాలమువఱకునూరకుండవచ్చును. ఇంతమాత్రమువలన నది ఫలహేతువు కాకపోవలయునా? ఏపదార్థమైనను తనకుఁ గల భారగుణముచేఁ గ్రిందికి పడుచున్నది. తొడిమెకు నంటుకొని యుండునంతవఱకు చెట్టునుండి పండు క్రింద పడదు కదా! ఇంతమాత్రమువలన "భారగుణము పదార్థపతనమునకుఁ గారణము కాదు." అని సిద్ధాంతము చేయుటకు వీ లగునా? కట్ట వేయుటచే నడ్డగింపఁబడి నీరు పల్లమునకు పోవలేదని "నీరు (చెరువునందలి నీరు) పల్లమునకుఁ బోవలేదు

కావున నెచ్చటను ఎప్పటికిని జలమున కాస్వభావము లేదు. (ఏజలం బును పల్లమునకుఁ బోవదు)" అని సిద్ధాంతము చేయుటకు వీలగునా? ఇట్లే (అపాంతరతమాది మునులవిషయమునఁ గూడ మఱియొక విధ ముగ సిద్ధాంతము చేయుటకు వీలు లేదు. సామాన్యులకు ప్రారబ్ధకర్మము వలెనే వారికిని అధికారములు ముక్తిప్రాప్తికి ప్రతిబంధకము లగును. అది యు వారికిఁ బ్రారబ్ధమే. పూర్వజన్మమున నాచరింపఁబడిన విద్యాకర్మలు పరిపక్వములై తమఫలము నొసంగుటకే కదా యధికారయుక్త మగు వారిదేహమును కల్పించెను. ఆగామిసంచితము లన్నియో జ్ఞానాగ్నిచే దహింపఁబడును. కావున నుత్తరజన్మమును కలిగింపనేరవు. ఈకారణము వలన నిర్గుణవిద్యలకు ముక్తియే ఫలమనుటలో విరోధ మేమియు లేదు.

"అపాంతరతమాదులవిషయ మిట్టిదియే యైన వారలకు బహు దేహములు బహుజన్మలు కలుగుటకుఁ గారణ మేమి?" అనియెదవేమొ వినుము. వారు ఇతరులవలె కర్మవశగతులై బలాత్కారముగ నొకదేహ మునుండి మఱియొకదేహమునకుఁ గొనిపోవఁ బడువారు కారు. స్వతం త్రులై యొకగృహమునుండి మఱియొకగృహమునకుఁ బోవునట్లు యోగ శక్తివలన నొక్కమాఱే గాని ప్రత్యేకముగాఁగాని దేహాంతరముల నొందుచుందురు. ఆగామిసంచితకర్మలు నశించుటచే నవి జన్మాంతరము లను కలిగింపనేర వని యిదివరకే చెప్పియున్నాము. ప్రారబ్ధ మొక్కటియే యధికారరూపఫలము నొసంగ నుపక్రమించె ననియు దెల్పియున్నాము. వార లాయధికారమును నిర్వహించుటకై యెన్నిదేహములనైన నంగీక రింపవచ్చును. ఒక్కకర్మకే యనేకదేహముల నొసంగుసామర్థ్యము కూడఁ గల దని శ్రుతిస్మృతులచే వివరింపఁబడి యున్నది. ఆగామిసంచిత ములుకూడ ఫలోన్ముఖము లగుచుండిన గదా జన్మమరణప్రవాహము నకు నంతము లేకపోవును. ఇచ్చట నొకప్రారబ్ధము మాత్రమే ఫలదాత కావున తద్బలమువలన కొన్నిజన్మలు కలిగినను అవసాన మేర్పడును. కావున ప్రారబ్ధావసానమున వారలకు ముక్తి కలుగు ననుటలో సంశయ మింతయైనను లేదు. బ్రహ్మజ్ఞానము కలవారయ్యును ముక్త లయ్యును సంసారబంధము లేనివార లయ్యును ఆయపాంతరత మాదిమునులు ప్రారబ్ధావసానమును ప్రతీక్షింపుచు సంసారులవలెనే సంచరించుచుందురు. "ఇట్లయిన వీరు జాతిస్మరులు (పూర్వ

జన్మమును స్మరించువారు కావలయును కదా!" యనియెదవేమొ వారు సర్వజ్ఞులే కాని జాతిస్మరులని మాత్రము వ్యవహరింపఁబడరు. ఏవిషయమైనను మొట్టమొదట నసాధ్యమై స్వాభావముగా సిద్ధింపకయుండి యెవ్వని చేతనైనను ప్రయత్నపూర్వకముగ సాధింపఁబడునని యప్పు డాతనికి తన్నిమిత్తమైనకీర్తి వచ్చును గాని యది స్వాభావసిద్ధమే యైనప్పు డట్లు రాదుకదా! ఈజాతిస్మరత్వము సామాన్యపురుషులకు స్వాభావసిద్ధము కాదు. కావున వారు యోగాదులమూలమున దానిని సాధించిరేని యప్పుడు జాతిస్మరు లని ప్రశంసింపఁబడుదురు. ఈమునులన్ననో సర్వజ్ఞులు కావున వీరికి జాతిస్మరత్వ మనునది స్వాభావసిద్ధమేకదా! స్మృతియు "త ఏ వైతే"="వారే వీరు" అని స్పష్టముగ పూర్వోత్తరదేహములయందున్నవారి నభిన్నులుగనే బోధించుచున్నది. సులభ యనునొక్క బ్రహ్మవాదిని జనకునితో వివాదము చేయఁదలంచి తనస్త్రీదేహము నట్లే యుంచి జనకశరీరమువంటిశరీరమును కల్పించి యందు బ్రవేశించి జనకునితో వాదించి మఱల తనదేహమును జేరెననియు పురాణములయందుఁ గలదు. కావున నవాంతరతమాదిమునులకు శరీరకల్పనమునందుఁ గూడ స్వాతంత్ర్యము కలదు.

మఱియు నొక్కకర్మ ఫలము నొసంగినపిదప మఱియొకకర్మ ఫలోన్ముఖ మగుచుండునేని యప్పుడు మఱియొకకర్మ కూడ నట్లే ఫలోన్ముఖము కావచ్చును కావున నెప్పటికిని ముగింపు లేకపోవుటచే "బ్రహ్మవిద్య మోక్షము నొసంగునా? లేదా?" యను విషయము చర్చింపఁబడవలసి యుండునుగాని యిచ్చట నట్లు లేదు. జ్ఞానము కలిగినవెంటనే యాగామి సంచితములు నశించిపోవు నని యిదివఱకే చెప్పియున్నాము. "భిద్యతే హృదయగ్రంథి చ్ఛిద్యంతే సర్వసంశయాః, క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే. స్మృతిలంభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః" "అపరాత్పరుని తెలిసికొనినచో హృదయగ్రంథి భిన్నమగును. సంశయము లన్నియు ఛిన్నము లగును. కర్మలు క్షీణించును. ఆత్మజ్ఞానము కలిగెనేని సర్వగ్రంథులును వీడిపోవును" అని శ్రుతులును "య థైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురు తేఽర్జున, జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా. బీజాన్యగ్న్యుపదగ్ధాని న రోహంతి యథా పునః, జ్ఞానదగ్ధై స్తథా క్లేశై ర్నాత్మా

సంపద్యతే పునః" "ఓయర్జునుఁడా! ప్రజ్వలించుచున్నయగ్ని యేవిధముగ సమిధలను భస్మము చేయునో అట్లే జ్ఞానాగ్ని సర్వకర్మములను భస్మము చేయును? అగ్నిచే దహింపఁబడిన బీజము లెట్లు మొలువవో యట్లే జ్ఞానముచే దహింపఁబడినకర్మలు ఫలము నొసంగవు" అనుస్మృతులును ఈ విషయమునే నిరూపించుచున్నవి. మఱియు సర్వకర్మబీజ మగునజ్ఞానము నశించినపిదపఁ గొన్నికర్మలు జన్మాంతరము నొసంగు ననుటయు మఱికొన్ని యట్లొసంగ వనుటయు యుక్తియుక్తము కానేరదు. కాలినపిదప వృక్షబీజ మొకభాగమున మొలచు ననుట సంభవింపదు కదా! ప్రారబ్ధకర్మ మన్ననో ఫలోన్ముఖ మయ్యే యున్నది కావున ధనుస్సునుండి విడువఁబడిన బాణము వలె వేగము నశించునంతవఱకు ప్రవర్తించుచునే యుండును. శరీర పాతమే ప్రారబ్ధవేగనాశము. ఒకానొకసందర్భమున నొక్కమాఱు ఫలోన్ముఖమైన ప్రారబ్ధమే యనేకజన్మముల కలిగించినను సామాన్యముగ నొక్కజన్మముతోనే ముగియు ననియే చెప్పవచ్చును. ఈవిషయము "తస్య తావదేవ చిరం" అనుశ్రుతిచే స్పష్టము చేయఁబడియున్నది. ఆశ్రుతియందు "మోక్షము కలుగుటకు దేహపాతమే యాలస్యము" అని చెప్పఁబడి యుండుటచే "జ్ఞానము కలిగినను దేహపాతమువఱకు పరిపూర్ణైక్యము కలుగుటకు ప్రతిబంధమున్నది" యనువిషయము తేటఁబడుచున్నది కదా! కావున మహామునులు తమయధికారములు ముగియునంతవఱకు ప్రారబ్ధవశమున జన్మముల నొందుచుండి యంతమున ముక్తు లగుదు రనుటలో విరోధ మేమియు లేదు.

ఇదియునుఁగాక జ్ఞానమువలన కలుగుమోక్షఫల మొక్కనికి మాత్రమే కలుగుననియు మఱియొక్కనికి కలుగదనియుఁ జెప్పుటకు వీలు లేదు. జ్ఞానము కలవా రందఱును ముక్తినిఁ జెందవలసినవారే యని శ్రుతి జెప్పుచున్నది. "తద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తదభవత్తథర్షీణాం తథా మనుష్యాణాం" "ఆకారణమువలన దేవతలలో నెవ్వఁడు పరమేశ్వరు నాత్మగాఁ నెఱింగెనో వాఁడు పరమేశ్వరుఁడే యయ్యెను. అట్లే ఋషులలోను మనుష్యులలోనుఁ గూడ నెవ్వఁ డాత్మ నెఱింగెనో వాఁడు పరమేశ్వరుఁడే యయ్యెను" అను మొదలగు శ్రుతివాక్యము లీవిషయమునఁ బ్రమాణవచనములు. ఇట్లగుటచే, జ్ఞానమున్నను

కొందఱకు సంసార ముండు ననియు అపాంతరతమాదిమును లిట్టితెగలోని వారే కావచ్చు ననియు, మఱికొందఱికి ముక్తియే కలుగు ననియు కొందఱు బ్రహ్మవేత్త లీతెగలోఁ గూడఁ జేరుదు రనియుఁ జెప్పుటకుఁ గూడ వీలు లేదు. నియతముగ నందఱకును ముక్తి కల దనియే చెప్ప వలయును; ప్రారబ్ధఫలభోగావసానము వఱకు మాత్రమే ప్రతిజ్ఞానియు సంసారివలె నుండు ననియుఁ జెప్పవలయును.

ఇంతమాత్రమే కాదు; మొట్టమొదట నీయపాంతరతమాదు లందఱును బ్రహ్మసాక్షాత్కారముకలవారే యనియు నియతముగఁ జెప్పుటకుఁ బ్రమాణ మేదియు లేదు. అధికారము వచ్చుటకు కర్మలును ఉపాసనలును గారణము లగునుగాని నిర్గుణబ్రహ్మజ్ఞాన మావశ్యకము కాదు కదా! ఇట్లుండ వారు ఐశ్వర్యాదులను గలిగించు కర్మోపాసనల చేయువారేల కాఁగూడదు? అధికార మనునది గూడ నైశ్వర్యభేదమే కదా! వారును ఐశ్వర్యములకుఁ గల యనిత్యత్వముఁ నెఱింగినపిదప వైరాగ్యవంతులై నిర్గుణబ్రహ్మము నాశ్రయించి ముక్తినొందవచ్చు ననుటలో విరోధ మేమియు లేదు. "బ్రహ్మణాసహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే, పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరంపదం" "సగుణవిద్యోపాసకు లందఱును ప్రళయకాలమువచ్చునంతవఱకు బ్రహ్మలోకమున నుండి జ్ఞానవైరాగ్య సంపన్నులై బ్రహ్మతోఁగూడఁ బ్రళయకాలమున దేహముల విడిచి ముక్తి నొందుదురు" అని యీవిషయమును స్మృతి బోధించుచున్నది. "తే బ్రహ్మలోకేషు పరాంతకాలే పరామృతా పరిముచ్యంతి సర్వే" "అట్లు ఉపాసనామాహాత్మ్యమున బ్రహ్మలోకమునకుఁ బోయినవారందఱు ప్రళయకాలమున ముక్తి నొందుదురు" అని శ్రుతియు నీవిషయమును చెప్పుచున్నది. కావున నీయుక్తినిఁ బట్టి చూచినను పూర్వపక్షము నిలువదు.

మఱియొకవిశేషము. వేదమునందు స్వర్గాదిరూపము లగుకర్మఫలంబులును మోక్షరూప మగుజ్ఞానఫలంబును గూడ వర్ణింపఁబడి యున్నవి. అందు కర్మఫలములనుగూర్చి విమర్శించిన మన కేమియుఁ దెలియదు. వేద మెట్లు చెప్పిన నట్లంగీకరింపవలసినవారమే కాని మఱి యేమియు లేదు. ఇట్లగుటచే నావిషయమున గొంతసంశయము గలిగిన గలుగవచ్చును గాని జ్ఞానఫలవిషయమున నట్టిసంశయము కలుగుటకు వీలు లేదు. జ్ఞానఫల మగుమోక్షము దేశాంతరమున రూపాంతరముతో

నుండునది కాదు. అది స్వస్వరూపభూత మగు బ్రహ్మమే. సంసారి యనియుఁ గర్త యనియు భోక్త యనియు సుఖి యనియు దుఃఖి యనియు పురుషుఁ డనియు స్త్రీ యనియు మనుష్యుఁ డనియు పశు వనియు వ్యవహరింపఁబడు జీవుఁ డెవ్వఁడుగలఁడో వాఁడేమోక్షము; అజ్ఞానముచే నాతనిస్వరూపమును తెలిసికొనలేకపోవుటయే గాని స్వరూపహాని యెప్పటికిని లేదు. జ్ఞానము వలన నాయజ్ఞానము నశింపఁగానే తనరూపమును తా నెఱుంగును. ఇదియే మోక్షము. ఇట్లు సర్వానుభవసిద్ధమై యున్నయీవిషయమున సంశయమే కలుగుటకు వీలు లేదు. జ్ఞానము కలవా రందఱు ముక్తిని జెందవలసినదియే యని నిర్వివాదముగ నంగీకరింపవచ్చును. "ఈవిషయ మెవ్వరికిని తెలిసినది కాదు. ఇది యనుభవసిద్ధమైన దనుట యెట్లు?" అని యెదవేమొ వినుము. బొత్తుగ నంతర్ముఖుండు విచారశీలుఁడు గాకున్న నీవిషయ మనుభవమునకు రాదు కాని లేకున్న నవశ్యముగ వచ్చును. విచారశూన్యులకు ననుభవమున లేదని నంతమాత్రమున విద్వదనుభవగమ్యమగువిషయ మప్రమాణ మగునా? వ్యావహారికవిషయములలోఁ గూడ నిట్టి వెన్ని లేవు? మఱియుఁ బదార్థముల బ్రతివాఁడును చూచుచునే యున్నాఁడు; చూచువానిని చూడఁబడువానికంటె భిన్నునిఁగా గ్రహించుచునేయున్నాఁడు కదా! ఆచూచువాఁడే జీవుఁ డనిన నాతఁడే బ్రహ్మ మనిన నదియే మోక్ష మనిన నింతకంటె ననుభవమును గూర్చి యేమి చెప్పవలయును?

"యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ త త్త్వమసి. త ద్ధైత త్పశ్య న్నృషి ర్వామదేవః ప్రతిపే దేఽహం మను రభవం సూర్యశ్చ" "ఏ జీవుఁడు ప్రత్యక్షముగా స్వయముగా పరబ్రహ్మమో ఆపరమేశ్వరుఁడే నీవు. వామదేవమహాముని స్వస్వరూపమును బ్రహ్మాభిన్నముగను బ్రహ్మము సర్వవ్యాపకమునుగ నెఱింగి 'నేను మనువు నైతిని సూర్యుఁడ నైతిని' అని నిశ్చయించుకొనెను" అని శ్రుతులు ఈయనుభవమునే యనువాదము చేయుచున్నవి; కర్మకాండయందలిశ్రుతులవలె క్రొత్తవిషయముల విధించుట లేదు. "ఇందు 'తత్త్వమసి' యనుశ్రుతికి 'నీవు మృతిచెందిన పిదపఁ బరమేశ్వరుఁడ వయ్యెదవు' అని యర్థము చెప్పవచ్చును. తక్కిన శ్రుతులను గూడ నిట్లే సమన్వయింపవచ్చును. ఇట్లయిన జీవబ్రహ్మైక్యము స్వాభావికము కానేరదు కదా! అప్పుడు మోక్షవిషయమునఁ గూడ

సంశయము జనింపవచ్చును" అనియెదవేమో యది యుక్తియుక్తముఁ
కాదు. ఆవాక్యమున "అసి=అయినావు" అని క్రియాపదము వర్తమానార్థ
మున నున్నది.దానికి మీరు చెప్పినయర్థమున భవిష్యదర్థము కల్పింపవలసి
వచ్చును. "మరణానంతరమున" అనునర్థ మిచ్చుపద మొక్కటియైన నందు
లేదు. దానిని క్రొత్తఁగా నధ్యాహారము చేసికొనవలసివచ్చును. ఊరకయే
యర్థము సరిపోవుచుండ నిరర్థకముగ నీప్రయాసయేల? ఈకారణమువలన
మేము చెప్పినయర్థమే యుక్తియుక్తము. అప్పుడు వర్తమానప్రయోగ
ముచే "జీవుఁ డెప్పటికిని బ్రహ్మరూపుఁ డయ్యేయున్నాఁడు."అని తెలును.
"సరియే శ్రుతి యనుభవమునే యనువాదము చేయుచున్నది యనిన నది
శాస్త్రమే కాకపోవలసివచ్చును. శాస్త్ర మనునది యపూర్వ మగువిష
యమున చెప్పవలయును కదా!" అనియెదవేమో వినుము. ఈజీవ
బ్రహ్మైక్య మంతర్ముఖునకుఁగాని యనుభవమునకు రా దని యిదివఱకే నిరూ
పించి యున్నాము. సామాన్యులందఱు నట్లు లే దనియు దెల్పియే
యున్నాము కావున నుపదేశకాలమున నిదియు నపూర్వమే యనుటలో
సంశయ మింతయైనను లేదు. ఇట్లు విమర్శించినచో జ్ఞానముగలవారికెల్ల
మోక్షము గలుగవలసినదియే యనియు అది స్వస్వరూపమే యగుటచే
జ్ఞానోత్తరకాలముననే కలుగు ననియు నిర్ణయించుటయే యుక్తియుక్తము.
ఈకారణమువలన నేదియో యొకప్రతిబంధమువలన మాత్రమే విదేహ
ముక్తికి నాటంకము కలుగును కాని యింతమాత్రమున నది శూన్య
రూపము కానేరదు, జ్ఞానము దాని నొసంగ లేకపోదు.

---

## ౨౦. అక్షరాద్యధికరణము.

విషయ సంశయ పూర్వపక్షసంగతులు:—"ఏత ద్వై త దక్షరం
గార్గి బ్రాహ్మణా అభివదన్ త్యస్థూల మన ణ్వహ్రస్వ మదీర్ఘ మలోహిత
మస్నేహమ్" "ఓగార్గీ! బ్రహ్మవేత్తలగువారు పరబ్రహ్మస్వరూపమును
గూర్చి యిట్లు చెప్పుదురు. ఆబ్రహ్మరూపముస్థూలముగాని సూక్ష్మముఁగాని
హ్రస్వముగాని దీర్ఘముగాని రక్తాదివర్ణములుగలదిగాని చమురుగలదిగాని
కాదు" అని బృహదారణ్యకోపనిషత్తునందు కొన్ని ధర్మముల నిషేధించి

తన్మూలముననఁ బరమేశ్వరరూపము తెలుపఁబడి యున్నది. ముండకోపనిషత్తునందును "అథ పరా యయా త దక్షర మధిగమ్యతే య త్త దద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణమ్ (చూ. ౧.౩.౨౧.)" అని యట్లే కొన్నిగుణముల నిషేధించి బ్రహ్మస్వరూపము బోధింపఁబడి యున్నది. అనేకోపనిషత్తులయందును కతిపయగుణ నిషేధపూర్వకముగా నిట్లే బ్రహ్మస్వరూపనిర్ణయము చేయఁబడియున్నది. ఈనిషేధము లన్నియు నన్నిస్థలములలోనికి సంగ్రహింపఁబడునా? లేదా? పూర్వాధికరణమునందు వసిష్ఠాది మునులకుఁ గలవని చెప్పఁబడిన దేహములు ప్రారబ్ధవశమునమాత్రమే కలుగవచ్చు ననియు నింతమాత్రమున నాగామిసంచితకర్మలు ఫలోన్ముఖములగు నని చెప్పవలసినపని లే దనియు "నెప్పటికిని జన్మపరంపర వచ్చుచునే యుండు నని సిద్ధాంతము చేయుట యుక్తియుక్తము కా దనియు సిద్ధాంతము చేయఁబడి యున్నది కదా! ఆవిధముగనే యిచ్చట సిద్ధాంతము చేయవచ్చును. ఏయుపనిషత్తునం దేధర్మములు నిషేధింపఁబడినవో యచ్చట నంతమాత్రమే చాలు ననవచ్చును. శ్రుతియుఁ బ్రత్యేకముగనే ప్రవర్తించుచున్నది కదా! కావున నీవిషయమున గుణోపసంహారము లేదనియే తేలుచున్నది.

## అ_3. పా_3. సూ_33.

అవతారిక:—అని యిట్లు దృష్టాంతసంగతితో వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు. "ఆనందాదయః (చూ. 3. 3. ౧౧.)" అను స్థలమున గుణవిధులనుగూర్చి యుపసంహారా నుపసంహారసంశయము నివారింపఁబడి యున్నను దానిచేతనే నిషేధములను గూర్చినసంశయము కూడ స్వయముగనే నివర్తి నొందుచున్నను మందబుద్ధులకు స్పష్టముగఁ దెలియుటకై యీయధికరణ మారంభించియున్నాఁడు.

## ౩౬౩. అక్షరధియాం త్వవరోధః సామాన్యతద్భావాభ్యా మౌపసదవత్తదుక్తమ్. 3. 3. 33.

తాత్పర్యము:—ఈసంశయముతోఁ బని లేదు. గుణనిషేధము లన్నియు నన్నిస్థలములలోనికి నుపసంహరించుకొనఁబడవలసినవియే. అన్ని

స్థలములయందును బ్రహ్మస్వరూపప్రతిపాదనమే చేయఁబడుచున్నది; దానికై గుణనిషేధమే యుపాయముగా నంగీకరింపఁబడి యున్నదికదా! ఇట్లుండ నన్యస్థలములయం దున్నవిశేషము లన్యస్థలములలోనికి నేల దెచ్చికొనఁబడఁగూడదు?

ఈవిషయమునకుఁదగిన ప్రమాణమును "ఆనందాదయః" అనుస్థలము నందే వివరించి యున్నాము. అచ్చట విధిరూపము లగుగుణములను గూర్చి విచారించి యున్నాము. ఇచ్చట నిషేధరూపములను గూర్చి విచారించుచున్నా మనుటయే విశేషముగాని తక్కినయంశ మంతయు నొక్కటియే. ఈకారణమువలన నాసిద్ధాంతమును స్థాపించుటకై యంతగాఁ బూనవలసిన యవసరములేదు. దీనికిఁ గర్మకాండమున దృష్టాంతము గలదు. ఒకయజ్ఞమున నొకానొక యిష్టియందు పురోడాశసంబంధము లగు కొన్నిమంత్రములు విధింపఁబడి యున్నవి. అవి సామవేదమంత్రములు. యజ్ఞమును నిర్వహించు ఋత్విజులలో అధ్వర్యువు ఉద్గాత హోత యను మువ్వురును యజుర్వేద సామవేద ఋగ్వేదమంత్రములఁ జెప్పుటకై నియమింపఁబడి యుందురు. అందు పురోడాశము నాచరించి హోమము గావించువాఁ డధ్వర్యువు. పురోడాశమునకు సంబంధించిన మంత్రము సామవేదమంత్రములే యైనను ఉద్గాతచేతనే చెప్పఁబడ వలసినవి యైనను అధ్వర్యునిచేతనే చెప్పఁబడవలసినవిగా సిద్ధాంతము చేయఁబడి యున్నవి. పురోడాశము ప్రధాన మగుటచేతను దాని నాచరింపవలసినవాఁ డధ్వర్యువే యగుటచేతను దానికి సంబంధించినమంత్రములు కూడ నేవేదమున నున్నవి యైనను వానిచేతనే పఠింపఁబడవలసి నట్లు సిద్ధాంతము చేయఁబడియున్నది. ఇట్లే ప్రకృతమునందును నిషేధములు బ్రహ్మస్వరూపనిరూపణమునకు సంబంధించినవియే యగుటచేతను ఆబ్రహ్మ మన్నిస్థలములయందు నొక్కరీతిగనే వర్ణింపఁబడి యుండుట చేతను సర్వస్థలములలోనికి నన్నిధర్మముల నుపసంహరించుకొనవలయు ననియే సిద్ధాంతము చేయఁబడవలసి యున్నది. "గుణముఖ్యవ్యతిక్రమే తదర్థత్వాన్ముఖ్యేన వేదసంయోగః" "గౌణమునకును ముఖ్యమునకును విరోధము వచ్చినప్పుడు ముఖ్యమే ప్రధాన మగుటచే వేదమంత్రముల దానితోనే సమన్వింపవలయును" అని జైమినిమహాముని చెప్పియున్నాఁడు. పై సిద్ధాంత మిట్టిదే. పురోడాశము ముఖ్యము; మంత్రములు సామవేద

మున నున్నవి కావున నుద్గాతచేతనే చెప్పఁబడవలయు ననుట గౌణము. ఈరెంటికిని విరోధము కలుగుటచేఁ బురోడాశము నాశ్రయించియే సిద్ధాంతము చేయఁబడెను. ప్రకృతమునందును బ్రహ్మము ముఖ్యము; నిషేధములు శాఖాంతరములయం దున్నవనుట గౌణము. ఈరెంటికిని విరోధము వచ్చినప్పుడు ముఖ్య మగు బ్రహ్మము నాశ్రయించియే సిద్ధాంతము చేయఁబడవలయును. ఈకారణములవలన విధులవలె నిషేధము కూడ నన్నియు నన్నిస్థలములయందు నుపసంహరించుకొనఁబడవలసినవియే.

---

## ౨౧. ఇయదధికరణము.

విషయసంశయములు:—"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాయతే తయో రన్యః పిప్పలం స్వాద్వ త్త్యనశ్న న్నన్యో అభిచాకశీతి (ము. ౧. ౨. ౧౧.)" అని ముండకోపనిషత్తునందును శ్వేతాశ్వతరోపనిషత్తునందును చెప్పఁబడి యున్నది. కఠోపనిషత్తునందు "ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధే, ఛాయాతపౌ బ్రహ్మవిదో వదంతి పంచాగ్నయో యే చ త్రిణాచికేతాః (ము. ౧. ౨. ౧౧.)" అని చెప్పఁబడి యున్నది. ఈరెండు విద్యలున్ను భిన్నములా ? యభిన్నములా? యనుసంశయ మిందు నిరాకరింపఁబడును.

పూర్వసంగతులు:—విచారించిన నీవిద్యలకు భేదమే యుండవలయునని తోఁచుచున్నది. ముండకశ్వేతాశ్వతరోపనిషత్తులయందు వర్ణింపఁబడినవారిలో నొక్కఁడుమాత్రమే భోక్త; కఠోపనిషత్తునందు వర్ణింపఁబడినవారిలో నిరువురును భోక్తలే. "*ఛత్రిన్యాయముచే భోక్తతోఁగూడ భోక్త కానివానినిఁ గూర్చి ద్వివచనము ప్రయోగింపఁబడినది" యనియెదవేమొ యది సంభవింపదు. మీరు చెప్పినయర్థము లక్షణావృత్తి నాశ్రయించినఁగాని గలుగదు. ముఖ్యార్థము సంభవించుచుండఁగా లక్షణ నాశ్రయించుట యుక్తము కాదుకదా! "వాక్యశేషము నాశ్రయించి నిర్ణయింపవచ్చును" అనుటయు యుక్తియుక్తము కానేరదు. అర్థమునందు

---

* ఛత్రిన్యాయము. (అ-౧. పా-౨. సూ-౧౧. పేజీ. 191 చూ.)

మున నున్నవి కావున నుద్గాతచేతనే చెప్పఁబడవలయు ననుట గౌణము. ఈరెంటికిని విరోధము కలుగుటచేఁ బురోడాశము నాశ్రయించియే సిద్ధాంతము చేయఁబడెను. ప్రకృతమునందును బ్రహ్మము ముఖ్యము; నిషేధములు శాఖాంతరములయం దున్నవనుట గౌణము. ఈరెంటికిని విరోధము వచ్చినప్పుడు ముఖ్య మగు బ్రహ్మము నాశ్రయించియే సిద్ధాంతము చేయఁబడవలయును. ఈకారణములవలన విధులవలె నిషేధము కూడ నన్నియు నన్నిస్థలములయందు నుపసంహరించుకొనఁబడవలసినవియే.

---

## ౨౧. ఇయదధికరణము.

విషయసంశయములు:—"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాయతే తయో రన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్న న్నన్యో అభిచాకశీతి (ము. ౧. ౨. ౧౧.)" అని ముండకోపనిషత్తునందును శ్వేతాశ్వతరోపనిషత్తునందును చెప్పఁబడి యున్నది. కఠోపనిషత్తునందు "ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్థే, ఛాయాతపౌ బ్రహ్మవిదో వదంతి పంచాగ్నయో యే చ త్రిణాచికేతాః (ము. ౧. ౨. ౧౧.)" అని చెప్పఁబడి యున్నది. ఈరెండు విద్యలును భిన్నములా ? యభిన్నములా? యనుసంశయ మిందు నిరాకరింపఁబడును.

పూర్వసంగతులు:—విచారించిన నీవిద్యలకు భేదమే యుండవలయునని తోచుచున్నది. ముండకశ్వేతాశ్వతరోపనిషత్తులయందు వర్ణింపఁబడినవారిలో నొక్కఁడుమాత్రమే భోక్త; కఠోపనిషత్తునందు వర్ణింపఁబడినవారిలో నిరువురును భోక్తలే. "*ఛత్రిన్యాయముచే భోక్తతోఁగూడ భోక్త కానివానినిఁ గూర్చి ద్వివచనము ప్రయోగింపఁబడినది" యనియెదవేమొ యది సంభవింపదు. మీరు చెప్పినయర్థము లక్షణావృత్తి నాశ్రయించినఁగాని గలుగదు. ముఖ్యార్థము సంభవించుచుండఁగా లక్షణ నాశ్రయించుట యుక్తము కాదుకదా! "వాక్యశేషము నాశ్రయించి నిర్ణయింపవచ్చును" అనుటయు యుక్తియుక్తము కానేరదు. అర్థమునందు

---

* ఛత్రిన్యాయము. (అ-౧. పా-౨. సూ-౧౧. పేజీ. 191 చూ.)

సంశయము కలిగిన దానిని నిర్ణయించుటకై వాక్యశేషము కావలయును గాని "ఇచ్చట ముఖ్యార్థము నాశ్రయింపవలయునా ? లాక్షణికార్థము నాశ్రయింపవలయునా ?" యను విషయమును నిర్ణయించుటకై కాదు. ఈకారణమువలన గుహాధికరణమునఁ (సూ. ౧. ౨. ౧౧.) జేయఁబడిన సిద్ధాంత మిచ్చటఁ బనికి రాదు. పూర్వాధికరణమున నన్నిశాఖలయందును బ్రహ్మ మొక్కటియే ప్రతిపాదింపఁబడుచుండుటచే నిషేధముల నన్నిటి నన్నిస్థలములలో నుపసంహరించుకొనవలయు నని చెప్పితిరి. ఇచ్చట ప్రతిపాదింపఁబడుపదార్థము భిన్నమగుటచే నట్లు సిద్ధాంతము చేయుటకు వీలు లేదు.

## అ-౩. పా-౩. సూ-౩౪.

అవతారిక:—అని యిట్లు ప్రత్యుదాహరణసంగతితో వచ్చిన పూర్వపక్షమును ఈయధికరణమున ఖండించుచున్నాఁడు. గుహాధికరణమునఁ జేయఁబడినసిద్ధాంతమునే మఱలఁ బ్రకటించుచున్నాఁడు.

## ౩౯౪. ఇయదామననాత్. ౩. ౩. ౩౪.

తాత్పర్యము:—ఇట్లు చెప్ప నక్కఱ లేదు. పైనఁజూపిన మూఁడు స్థలములయందును జీవేశ్వరు లిరువురు మాత్రమే చెప్పఁబడిరి. ఇట్లగుటచే నామూఁడుస్థలములయందును ప్రతిపాదింపఁబడిన యుపాస్యదేవత యొక్కఁడే యగును. ఇట్లగుటచే విద్యాభేదము కలుగదు.

"రెండుస్థలములయందు భోక్త యొక్కఁడును అట్లు కానివాఁడొక్కఁడును చెప్పఁబడి రనియు కఠోపనిషత్తునందు చెప్పఁబడినవా రిరువురును భోక్తలే యనియు రూపభేదమును జూపితిమి కదా !" అనియెదవేమొ యది సరి కాదు. ఈరెండుమంత్రములును జీవపరమేశ్వరులను గూర్చి మాత్రమే చెప్పుచున్నది గాని మఱియొకదానిని గూర్చి కాదు. "ద్వా సుపర్ణా" యను మంత్రమున "అనశ్న న్నన్యో అభిచాకశీతి" అని యాఁకలి దప్పులు లేని పరమేశ్వరుఁడు ప్రతిపాదింపఁబడెను కదా! "జుష్టం యదా పశ్యత్యన్య మీశం" "ఏసమయమున తనకంటె భిన్నుఁడును తనసమీపముననే యున్న వాఁడును లేక తనచే సేవింపఁబడినవాఁడును అగునీశ్వరు నెప్పుడు చూచును" అని శ్వేతాశ్వతరోపనిషత్తునందు వాక్య

శేషమువలన నీవిషయమే స్పష్టము చేయఁబడి యున్నది. కఠోపనిషత్తు నందు "ఋతం పిబంతౌ" అను మంత్రముచేతఁగూడ నీవిషయమే చెప్పఁ బడె ననవలయును. పరమాత్మకు కర్మఫలసంబంధము లేదనుట బహు శ్రుతిప్రసిద్ధము. దీనికి విరుద్ధముగ నొక్కస్థలమునఁ జెప్పఁబడి యుండునేని యప్పు డావాక్య మప్రమాణము కావలసివచ్చును. అధ్యయనవిధిబలము వలన వేదరాశియందలి యక్షర మొక్కటి యైన నప్రమాణము కాఁగూ డదు కదా! ఈదోషము పోవుటకై "పిబంతౌ" అను స్థలమున లక్షణా వృత్తి నవశ్య మాశ్రయింపవలయును; ఛత్రిన్యాయముచే కర్మఫలాను భవము గల జీవునితోఁ గూడఁ దద్రహితుఁ డగునీశ్వరుఁడు చెప్పఁబడె ననవలయును. "అన్యత్ర ధర్మాత్" అను మొదలగు ప్రకరణంబును వాక్యశేషంబునుఁ గూడ నీవిషయమునే నిర్ణయించుచున్నవి. "ప్రకరణ వాక్యశేషములకంటె శ్రుతి (ద్వివచనశ్రుతి) బలవంతమైనది కదా!" యనియెదవేమొ దానికి లాక్షణికార్థమును గ్రహింపకున్న వచ్చుదోషము మున్నె వివరింపఁబడెను.

మఱియు ముండకశ్వేతాశ్వతరకఠోపనిషత్తులు మూఁడింటి యందును పూర్వాపరముల విమర్శించిన నుదాహృతవాక్యములు పర మాత్మ ప్రకరణములోనే యున్నట్లు తేలుచున్నవి. "ఇట్లయిన నిందు జీవునిఁ గూర్చి చెప్పఁబడి యుండనేల?" యనియెదవేమొ యది కేవల *మనువాదము; జీవపరమేశ్వరులకుఁ గలవాస్తవాభేదమును నిరూపించు టకై లోకసిద్ధభేద మనువదింపఁబడెను. పరమాత్మను గూర్చి విచారించు నప్పుడు అభేదము మాత్రమే ప్రతిపాదింపఁబడుచుండు నని స్పష్టము చేసి యున్నాము కదా! పరమాత్మ యద్వితీయుఁడు కావున నందు భేద మను మాటయే యుండుటకు వీలు లేదని నిర్ణయించియున్నాము కదా! కావున నిచ్చట రెండువిద్యలయందును చెప్పఁబడువిషయ మొక్కటియే. ఈకార ణము వలననే విద్యాభేదము లేదు. ఒకస్థలమున నున్న విశేషగుణముల మఱియొకస్థలమునకు నుపసంహరించుకొనవచ్చును.

---

* అనువాదము. (అ-3. పా-3. సూ-౧౯. పేజీ-228. చూ.)

## ౨౨. అంతరత్వాధికరణము.

విషయసంశయములు :— బృహదారణ్యకోపనిషత్తునందు "యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ య ఆత్మా సర్వాంతరః"="ఎవ్వఁడు ప్రత్యక్షముగ బ్రహ్మమో యెవ్వఁడు సర్వాంతరుఁడగునాత్మయో" అను మొదలగు వాక్యములచే ఉషస్తి కహోళు లనుమహామునులు యాజ్ఞవల్క్యునిఁగూర్చి చేసినప్రశ్నలు నుత్తరంబులును గూడ వర్ణింపఁబడియున్నవి. వానియందు చెప్పఁబడినవిద్యలు భిన్నములా? కావా? యనుసంశయ మిందు నివారింపఁబడును. అభిన్నములే యని సిద్ధాంతము చేయఁబడును.

పూర్వపక్షసంగతులు:—ఇచ్చట నీవిద్యలు పరస్పరభిన్నములే యనుట నిస్సంశయము. శ్రుతియందు సమానవిద్య రెండుమాఱులు చెప్పఁబడియుండుటకుఁ గారణ మేమియుండును. "ఛాందోగ్యోపనిషత్తునందు 'స ఆత్మా తత్త్వమసి' అని తొమ్మిదిమాఱు లుపదేశింపఁబడి యున్నను భేదము కలుగలేదు కదా!" అనియెదవేమో యచ్చట "భూయ ఏవ మా భగవా న్విజ్ఞాపయత్" "ఓభగవంతుఁడా నాకు నీవిషయమును మఱల జెప్పుము" అనుప్రశ్నములు కలవు; వానికి నుత్తరముగా బోధ చేయఁబడి యున్నది. ఇచ్చట నట్టివిశేష మేమియు లేదు కదా! కావున నీరెండు సందర్భములయందును ప్రతిపాదింపఁబడుపదార్థ మొక్కటియే యైనను ప్రశ్నోత్తరములసందర్భ మొక్కటియే యైనను విద్యలుమాత్రము పరస్పరభిన్నములే. పూర్వాధికరణమున "పిబంతౌ" అనుపదము లాక్షణికమగుటచే "ద్వా సుపర్ణా" అనుపదములతో సమానార్థమునే చెప్పుననియు, ఇట్లు చెప్పుటచే రెండువిద్యలయందును ప్రతిపాద్యాంశ మొక్కటియే యగుటవలన విద్యలుగూడ నభిన్నములే యగు ననియు సిద్ధాంతము చేయఁబడి యున్నది. ఇచ్చట ప్రతిపాద్యాంశ మొక్కటియే యైనను విద్యాభేదము కానవచ్చుచున్నది కావునఁ బైసిద్ధాంతము యుక్తమైనది కానేరదు.

ఇంతమాత్రమే కాదు. ఉషస్తిబ్రాహ్మణమున "పరబ్రహ్మ మేకార్యము నాచరించువాఁడు కాఁడు" అని వర్ణింపఁబడి యున్నది; కహోళబ్రాహ్మణమున "పరమాత్మ ఆఁకలి దప్పి మొదలగునవి లేనివాఁడు" అని చెప్పఁబడియున్నది. ఈరెండుగుణములకును పరస్పరభేదముకలదు కదా! ఈకార

రణమువలన నావిద్యలయందుఁ బ్రతిపాదింపఁబడుపదార్థము కూడ భిన్నమే యైనను కావచ్చును కదా!

## అ_3. పా_3. సూ_35.

అవతారిక:—అని యిట్లు వచ్చినపూర్వపక్షమును ఖండింపుచున్నాఁడు. మొట్టమొదట రెండవపక్షమును (ఉపాస్యదేవతలు పరస్పర భిన్నములు అనుపక్షమును) నిరాకరింపుచున్నాఁడు.

# 35. అంతరా భూతగ్రామవత్స్వాత్మనః.

## 3. 3. 35.

తాత్పర్యము:—ఇందు రెండవపక్షమును గూర్చి మొట్టమొదట విచారింతము. ఈరెండుప్రకరణములయందు బ్రతిపాదింపఁబడినవాఁడొక్కఁడే యనుట నిస్సంశయము. ప్రశ్నోత్తరసందర్భమును విమర్శించి చూచిన రెండుస్థలములయందును సర్వాంతరుఁడగునాత్మయే వర్ణింపఁబడె నని తెలియవచ్చుచున్నది. సర్వాంతరు లగువా రిరువు రుండుటకు వీలు లేదు కదా! సర్వాంతరుఁ డనఁగా నన్నిటికి లోపల నుండువాఁ డని యర్థ మగుటచే నట్టివా రిరువు రుండుటకు వీలు లే దనుటలో వివాద మేమియు లేదు. అప్పు డొక్కఁడు ముఖ్యుఁడుగను మఱియొక్కఁడు గౌణభూతుఁడుగా నుండవలయును. "భూమికంటె జలములు దేహమున నాంతరము లే యున్నవి. జలములకంటె నగ్నియు నగ్నికంటె వాయువును అంతకంటె నాకాశంబు నాంతరములై యున్నవి" యనిన నన్నియు నాంతరములే యైనను వీనికి ముఖ్య మగునాంతరత్వము లేదు కదా! ఇట్లే యిరువురు సర్వాంతరులు కల రనినప్పుడు కూడ వారికి సమానముగ సర్వాంతరత్వము గలుగదు. ఇదియునుగాక "ఏకో దేవః సర్వభూతేషు గూఢః" "ఒక్కపరమేశ్వరుఁడే సర్వప్రాణులయందును లీనుఁడై యున్నాఁడు." అని శ్రుతియు సర్వాంతరుఁ డొక్కఁడే యని బోధించుచున్నది. కావున నీరెండుప్రకరణములయందునుఁ బ్రతిపాద్యాంశములు వేఱు కావు; విద్యాభేదంబును లేదు.

## అ_3. పా_3. సూ_3౬.

అవతారిక:—"ఇట్లయిన నొక్కవిద్యనే రెండుమాఱులు చెప్ప నేల ?" యనిన సమాధానము చెప్పుచు మొదటిపక్షమును ఖండించు చున్నాఁడు.

## 3౬. అన్యథా భేదానుపపత్తిరితి చే న్నోపదేశాంతరవత్. 3. 3. 3౬.

తాత్పర్యము, పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. విద్యలకు భేదము లేకున్న వేదము వానిని గూర్చి రెండుమాఱులు చెప్పదు. అప్పు డొక్కటి నిరర్థకము కావలసివచ్చిన నొక్క వేదభాగము నకు నప్రామాణ్యము రావలసి వచ్చును కదా!

సిద్ధాంతము:—ఇట్లు సంశయింప నక్కఱ లేదు. ఛాందోగ్యోపని షత్తునందు "తత్త్వమసి" యను నుపదేశములు తొమ్మిదిమాఱు లున్నను ఎట్లు పరస్పరభిన్నములు కావో అట్లే యిచ్చట గూడ నీవిద్యలు పరస్పర భిన్నములు కావు. అచ్చట "భూయ ఏవ మా భగవా న్విజ్ఞాపయత్" అని ప్రశ్నోపక్రమంబును "తత్త్వమసి" యను నుపసంహారంబును సమానములుగ నుండుటచే "ఉపదేశము లన్నియు నొక్కటియే" యని సిద్ధాంత మగుచున్నది యని మీరే యంగీకరించి యున్నారు కదా! అట్లే యిచ్చటఁ గూడ సిద్ధాంతము చేయవచ్చును. కహోళబ్రాహ్మణమునందు "య దేవ సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ" "ప్రత్యక్షముగాఁ బరబ్రహ్మ నెయ్యదియో దానినే నాకు వివరింపుము" అనియే ప్రశ్న మారంభింపఁ బడినది. ఈ ప్రశ్నముయొక్క యర్థమును విమర్శించిన నుషస్తిబ్రాహ్మణము లోనియర్థమే మఱల వివరింపఁబడవలసినట్లు తేలుచున్నది కదా! ఇఁక నుపసంహారంబును "అతో ఽన్య దార్తం" "ఈ బ్రహ్మమునకంటె భిన్నము లగుపదార్థము లన్నియు నాశవంతములే" అనియే రెండుస్థల ములయందు నున్నది. ఈకారణమువలన ఛాందోగ్యోపనిషత్తునందు వలెనే యిచ్చటఁగూడ విద్యలకు నభేదమునే సిద్ధాంతము చేయవలయును. "ఇట్లయిన పునరుక్తి రాదా?" యనియెదవేమో యట్లు రాదు. ఇవి

యుపాసనలు కావు. ఈ రెండు ప్రకరణములయందును వస్తుస్వరూపము మాత్రమే వివరింపఁబడియున్నది. వస్తుస్వరూపము నెన్నిమాఱులు చెప్పినను పునరుక్తి రాదు. మఱియు నిచ్చట నుషస్తిబ్రాహ్మణమునందు కార్యకారణరహితుఁడుగాను కహోళబ్రాహ్మణమునందు సంసారధర్మములగునాకలిదప్పులు లేనివాఁడుగాను ఒక్కపరమేశ్వరుఁడే వర్ణింపఁబడియున్నాఁడు. ఇట్లగుటచే విషయభేదముగూడఁ గలదు కావునఁ బౌనరుక్త్యము రాదు. ఎట్లు చూచినను విద్యలు పరస్పరము నభిన్నములే.

---

## ౨౩. వ్యతిహారాధికరణము.

విషయసంశయములు:— ఆదిత్యపురుషునిఁగూర్చి చెప్పునపుడు ఐతరేయశాఖవారు "తద్యోఽహం సోఽసౌ యోఽసౌ సోఽహం" "ఈ కారణమువలన నే నెవ్వఁడనో సూర్యునిలో నున్న పురుషుఁడు గూడ వాఁడే; సూర్యునిలో నున్న పురుషుఁ డెవ్వఁడో నేనును వాఁడనే" అని చెప్పుచున్నారు. జాబాలశాఖవారు నట్లే "త్వం వా అహ మస్మి భగవో దేవ తేఽహం వై త్వ మసి" "ఓభగవంతుఁడా దేవతా నీవే నేను నేనే నీవు" అని చెప్పుచున్నారు. ఇచ్చట జీవు నీశ్వరునిఁగా భావింపవలయు ననుట మాత్రమే యుద్దేశింపఁబడెనా? లేక నీశ్వరునిఁగూడ జీవునిఁగా భావింపవలయునని కూడ నిర్ణయింపఁ బడెనా? అనుసంశయ మీయధికరణమున నివారింపఁబడును.

పూర్వ సంగతులు:— ఆలోచించిన జీవున కీశ్వరరూపత్వ మొక్కటి మాత్రమే భావింపఁబడవలయు నని తోఁచుచున్నది. వేదాంతశాస్త్రమునకు నదియే కదా పరమాభిప్రాయము. ఇట్లు చేసిన జీవునకు శ్రేష్ఠత్వము కలుగును. ఈశ్వరునకుఁగూడ జీవరూపము కల దని భావింపఁబడవలసినచో నప్పు డీశ్వరుఁ డల్పుఁడు కావలసివచ్చును. ఇది సంభవింపదు కదా! కావున జీవు నీశ్వరునిగా భావింపవలయు ననునొక్కయంశము మాత్రమే యిచ్చట నుపదేశింపఁబడును. ఈశ్వరునకుఁ గూడ జీవరూపము కల దని చెప్పఁబడుట యెల్లఁ బైవిషయమును స్ఫురించునట్లు దృఢము గునట్లు జేయుటకై మాత్రమే యని తెలిసికొనవలయును. పూర్వాధి

కరణమున నొక్కవిద్య రెండుమారులు లున్నను భేదము నొందనట్లు ఇచ్చటఁ గూడ నీవిషయము రెండువిధములు కానేరదు.

## అ_౩. పా_౩. సూ_౩౭.

అవతారిక:—అని యిట్లు దృష్టాంతసంగతితో వచ్చిన పూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౩౯౭. వ్యతిహారో విశింషంతి హీతరవత్. ౩. ౩. ౩౭.

తాత్పర్యము:—ఇట్లు సంశయింపఁ బని లేదు. ఇచ్చట జీవునకు చెప్పఁబడిన యీశ్వరభావంబును ఈశ్వరునకుఁ జెప్పఁబడిన జీవభావంబునుఁ గూడ ధ్యానార్థమై చెప్పఁబడినవే. ఇది సగుణవిద్య కాని నిర్గుణవిద్య కాదు. ఇట్లగుటచే నాసగుణబ్రహ్మమునకు జీవరూపము ధ్యానింపఁబడినను నిర్గుణబ్రహ్మమునకు కొదువ లేదు. ఇతర సగుణోపాసనల యందు మనోమయత్వాదిగుణము లెట్లు చెప్పఁబడెనో అట్లే యిచ్చటను జీవరూపచింతనము చెప్పఁబడి యున్నది. ఈకారణమువలన నిచ్చట రెండువిధములగుచింతనములును జరుపఁబడవలసినవియే.

ఇట్లగుటచేతనే శ్రుతియందు ప్రత్యక్షముగనే చింతనద్వయము పేర్కొనఁబడి యున్నది. జీవునకు నీశ్వరరూపము కల దనుచింతన మొక్కటియే చేయఁబడవలసినదియగునేని రెండవచింతనమును గూర్చి చెప్పుట నిరర్థకము కావలసి వచ్చును. ఇది సంభవింపదు కదా! "ఇట్లయిన నిర్గుణునకు కాకపోయినను సగుణునకు హీనత్వము వచ్చునుకదా!" యని యాశంకింప నక్కఱ లేదు. ఉపాసనార్థమై సగుణునకే సత్యకామత్వాదిగుణముల నుపదేశించినను తద్ధ్యానమువలన నిర్గుణబ్రహ్మసాక్షాత్కారము కలుగునట్లు ఇచ్చటఁగూడ ద్వివిధధ్యానము నాచరించుట వలన తత్ఫలముగ జీవపరమేశ్వరైక్యమే చేకూరును. "ఇట్లయిన మాపక్షమే సిద్ధించినది. మేమును 'ద్వివిధచింతనముల నుపదేశించుట జీవేశ్వరైక్యమును దృఢపరుచుటకే' యని చెప్పియున్నాము కదా" అనియెదవేమో ఈవిషయమున మాకు వివాదమే లేదు. "ద్వివిధ చింతనముల నాచరింపవలయునా?

లేదా?" యని ప్రశ్నము వచ్చిన దానికి సమాధానముగ "శ్రుతివాక్యాను సారముగ ద్వివిధచింతనములు నాచరింపఁ బడవలసినవియే" యని చెప్పి తిమిగాని యాచింతనములవలన కలుగుఫలమును గూర్చి వివాద మేమియు లేదు. కావున శ్రుతివాక్యానుసారముగ ద్వివిధచింతనములు నాచరింపఁబడవలసినవియే.

---

# ౨౪. సత్యాద్యధికరణము.

విషయసంశయములు:— బృహదారణ్యకోపనిషత్తునందు ఐదవ యధ్యాయమున నాల్గవ బ్రాహ్మణమునందు సత్యవిద్య యొక్కటి యారం భింపఁబడియున్నది. అందుఁ పంచభూతాత్మకుఁ డగుహిరణ్యగర్భు నుపా సింపు మని చెప్పఁబడి యున్నది. ఆ బ్రహ్మ పంచభూతాత్మకమై యుండె ననియు నారూపముతో నాయన నెవ్వఁడు ధ్యానించునో వాఁడు సర్వలోక ములఁ దెలిసికొను ననియు నా బ్రాహ్మణమునఁ జెప్పఁబడియున్నది. ఉపాస్య దేవత యగు బ్రహ్మ సత్యరూపుఁడు గావున నుపాసనాఫలము కూడ సత్యమే కావలయు నని చెప్పఁబడియున్నది. పిదప నైదవ బ్రాహ్మణము నందు దేవతలు సత్యమునే యుపాసింతు రని చెప్పి యాసత్యపదము మఱియొకవిధముగా వర్ణింపఁబడి యున్నది. ఆపదమునందు "సత్ య" అను మూఁడువర్ణములు కలవనియు అందు సకారయకారములు సత్యము లనియు తకార మనృత మనియు మృత్యు వనియు నీకారణమువలన ననృ తము రెండువైపులను సత్యముచే నాక్రమింపఁబడిన దనియుఁ జెప్పఁబడి యున్నది. అనృతమృత్యుశబ్దములయందు నకారము గాని అకారసహిత యకారముగాని లేకపోవుటచే నారెండువర్ణములు ననృతరూపములు కావనియు తకారమునకు మాత్రము రెండుపదములయందును సంబంధ ముండుటచే నది యనృతమృత్యురూప మనియు, నాతకారమునకు రెండు వైపుల సత్యరూపము లగుసకారయకారము లుండుటచే ననృతమునకు సత్యముచే దిరస్కారము కలిగె ననియు శ్రుతి నుతించుచున్నది. ఇట్లు సత్యనామాక్షరములకుఁ గూడ నుపాసనను చెప్పి పిదప "ఆహిరణ్య గర్భు నే ప్రతిబింబమున నుపాసింపవలయును." అని సంశయము రాఁగా

దానిని నివారించుటకై "త ద్య త్త త్సత్య మసౌ స ఆదిత్యో య ఏష ఏతస్మిన్ మండలే పురుషో య శ్చాయం దక్షిణేక్ష న్పురుషః" "పైనచెప్పఁబడిన సత్యరూపుఁ డగుహిరణ్యగర్భుఁడే యీసూర్యబింబములో నున్న పురుషుఁడు కుడికంటిలోఁ గూడ నున్నపురుషుఁడు" అని చెప్పుచున్నది. "హంతి పాప్మానం" "పాపమును సంహరించును" అని మఱియొకమారు కూడ ఫలమును చెప్పుచున్నది. ఇట్లగుటచే "యిచ్చట చెప్పఁబడినవి రెండువిద్యలా ? లేక యొకవిద్యయేనా ?" అను సంశయము కలుగును.

పూర్వపక్షసంగతులు :— విమర్శించి చూచిన పైవిద్యలు రెండే యని తేలుచున్నది. రెంటికిని ఫలములు భిన్నములుగా నున్నవి. మొట్టమొదటివిద్యకు సర్వలోకవశీకరణంబును రెండవవిద్యకు పాపనాశనంబును ఫలములుగఁ జెప్పఁబడియున్నవికదా! "త ద్య త్త త్సత్యం" అని సూర్యునిఁగూర్చి చెప్పఁబడినప్పుడుకూడ పూర్వవిద్యయే పరామర్శింపఁబడియున్నను ఈభేదము తప్పదు. కర్మ యొక్కటియే యైనను ఫలభేదము వలన భిన్నమగు ననుట పూర్వమీమాంసాశాస్త్రమునందును సుప్రసిద్ధమై యున్నది. "దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత...యావజ్జీవం దర్శపూర్ణమాసాభ్యాం యజేత" "స్వర్గమును కోరువాఁడు దర్శపూర్ణమాసయాగముల నాచరింపవలయును......జీవించినంతవఱకు దర్శపూర్ణమాసముల నాచరింపవలయును." అని కర్మకాండమునఁ *గామ్యముగాను నిత్యముగాను కూడ దర్శపూర్ణమాసయాగములు విధింపఁబడియున్నవి. ఇచ్చట కర్మ యొక్కటియే యైనను ఫలభేదమువలన (అనఁగా కామ్యకర్మ స్వర్గమునకై చేయఁబడునదియు నిత్యకర్మ చిత్తశుద్ధిని సాధించునదియు నగుటవలన) భేదము కలుగునట్లే యిచ్చటఁ గూడ భేదము కలుగును. పూర్వాధికరణమున రెండుచింతనములు చెప్పఁబడి యుండుటచే విద్య రెండురూపములు గలది యైనట్లే యిచటను ఫలభేద ముండుటచే సత్యవిద్యయు రెండురూపములు కలది యగును.

## అ_౩. పా_౩. సూ_౩౮.

అవతారిక:—అని యిట్లు దృష్టాంతసంగతిచే వచ్చిన పూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

---

* కామ్య మనఁగా అభీష్టఫలసిద్ధికై చేయఁబడునది.

# 39. నైవ హి సత్యాదయః. 3. 3. 39.

తాత్పర్యము:—ఇట్లు కాదు. విషయమునఁ జూపఁబడిన విద్యలు రెండు నొక్కటియే. "త ద్య త్త త్సత్యం" అని సూర్యునిఁగూర్చి చెప్పు నప్పుడును పూర్వవిద్య పరామర్శింపఁబడియేయున్నది కదా! "ఇట్లున్నను విద్యాభేద ముండవచ్చుననియు ఉపాస్యదేవత యొక్కఁడే యగుటచే నట్టిపరామర్శ యుండవచ్చుననియుఁ జెప్పితిమికదా!" అనియెద వేమో అది సరియే. స్పష్టతర మగునితర కారణములవలన విద్యాభేదము దృఢమై యుండునేని యప్పు డిట్లు నిశ్చయించుటకు వీలు కలుగును. ఆవిద్యాభేదము కలదో? లేదో? యని సంశయమున్నప్పు డీవిషయమును ఎట్లును నిర్ణయించుటకు వీలు లేదు. ఈకారణములవలన నీవిద్యలు రెండు నొక్కటి యనియే నిర్వివాదముగఁ జెప్పవచ్చును. "ఇట్లైనను ఫలభేద మొక్కటి విద్యాభేదమును నిర్ణయించువిషయమునఁ బ్రబలకారణమై యున్నది కదా!" అనియెద వేమో వినుము. "హంతి పాప్మానం" అను వాక్యము ప్రత్యేకఫలమును విధించుటకై వచ్చినది కాదు. "తస్యోపనిష దహ రితి...త స్యోపనిష దహ నితి" అని ఆదిత్యాక్షి పురుషులకు నామ భేదములఁ జెప్పి తద్ధ్యానప్రభావమును నుతించుటకై యట్లు చెప్పఁబడెను. ఈపక్షము నంగీకరించిన ఫలభేదమే లేదుకదా! "అర్థవాదమును బట్టియే కదా ఫలమును కల్పింపవలయు" అనియెద వేమో యప్పటికిని మాసిద్ధాంత మునకు భంగము రాదు. అప్పుడు విద్యాభేదమును నిర్ణయించుటకు నిధి సాధనము కానేరదు. ఇచ్చట ఫలము కల్పింపఁబడెనే కాని శ్రుతిచేఁ బ్రత్యక్షముగఁ జెప్పఁబడి యుండలేదు కదా! ఈకారణమువలన నిచ్చట విద్యాభేదమును సాధించుటకుఁ దగినకారణము లేవియు లేకపోవుటచే నావిద్య లభిన్నములే యని సిద్ధాంతమైనది. యిట్లగుటచే నావిద్యావయవ ములను విధించునప్పుడు ప్రత్యేకముగ నిర్ణయింపఁబడినఫలములు ముఖ్య మగువిద్యతోనే సంబంధించు ననవలయును. కావున నెట్లును యీసత్య విద్య యేకమే; అందు జెప్పఁబడియున్నగుణము లన్నియు నొక్కవిద్య తోనే సంబంధించునవి యగును.

విశేషాంశము:—మఱికొంద ఱీయధికరణమునకు మఱియొకవిధ ముగ వ్యాఖ్యానమును చేసిరి. విషయప్రకటనసమయమున నుదహరింపఁ

బడిన బృహదారణ్యకోపనిషత్తునందలి "తద్యత్తత్సత్యం" అను మొదలగువాక్యముల ఆదిత్యాక్షిపురుషులను గూర్చి చెప్పువాని నుదహరించి యీవిషయమునే చెప్పునట్టి "అథ య ఏషోఽంత రాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే........అథ య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే (చూ ౧. ౧. ౨౦)" ఛాందోగ్యోపనిషత్తునందలి వాక్యములను గూడ విషయవాక్యములనుగా నుదహరించిరి. ఈ రెండుసందర్భములయందును చెప్పఁబడినవిద్యలు భిన్నములా కావా యని సంశయించిరి. "బృహదారణ్యకోపనిషత్తునందు సత్యమును గూర్చియు ఛాందోగ్యోపనిషత్తునందు ఆదిత్యాక్షిపురుషులను గూర్చియుఁ జెప్పఁబడి యుండుటచే నీవిద్యలు పరస్పరభిన్నములు" అని పూర్వపక్షము చేసికొని రెండుస్థలములయందును ఆదిత్యాక్షిపురుషులనుగూర్చియే చెప్పఁబడి యుండుట విస్పష్టమగుటచే విద్యలకు భేదము లే దనియు బృహదారణ్యకోపనిషత్తునందు సత్యమును గూర్చి చెప్పఁబడి యుండుట గుణవిధానమే. (ఆదిత్యాక్షిపురుషులకు నుపాసనార్థమై యొకానొక విశేషణమును విధించుటయే) యనియు నీకారణమువలన నొక్కస్థలమునందలి గుణముల రెండవస్థలమునకుఁ దెచ్చికొనవలయు ననియు సిద్ధాంతము చేసిరి.

ఈసిద్ధాంతము యుక్తమైనది యని తోఁచలేదు. ఆవిద్యలు రెండు నొక్కటి కావు. బృహదారణ్యకోపనిషత్తులోనిది హిరణ్యగర్భోపాసన; ఛాందోగ్యోపనిషత్తులోనిది యుద్గీథోపాసన. జ్యోతిష్టోమ మనుకర్మకు నంగభూత మగు నుద్గీథమును ఆదిత్యాక్షిపురుషరూపముతో నుపాసింపవలయు నని యచ్చట (ఛాందోగ్యమునందు) చెప్పఁబడి యున్నది. ఉపక్రమోపసంహారము న్నిట్లే గానవచ్చు చున్నది. "ఇయ మేవ ర్గగ్నిః సామ" "ఈభూమియే ఋగ్వేదము; అగ్నియే సామవేదము" అని యుపక్రమమునందును "య ఏవం విద్వాన్సామ గాయతి" "ఎవ్వఁ డీవిధముగా తెలిసికొని (ఉపాసించి) సామగానము నాచరించునో" అని యుపసంహారమునందును కర్మవిషయమే చెప్పఁబడి యున్నది. "త స్యర్క్చ సామ చ గేష్ణౌ తస్మా దుద్గీథః" "ఆయాదిత్యపురుషునకు ఋక్సామవేదములు పర్వములు (గణుపులు) ఈకారణమువలన నాతఁడే యుద్గీథము" అని నడుమఁ గూడ నాదిత్యపురుషునకు నుద్గీథత్వము చెప్పఁబడెను. బృహదారణ్యకోపనిషత్తునం దిట్టిగురుతు లేవియు లేవు కదా! కావున నుపక్ర

మాది భేదములవలన విద్యాభేదము స్పష్టమై యుండఁగ నిచ్చట గుణోప సంహార మెటునుండి వచ్చును? ఈకారణములవలన మొట్టమొదట నొన రింపఁబడి యున్న వ్యాఖ్యానమే సరియైనది.

---

## ౨౫. కామాద్యధికరణము

విషయసంగతి సంశయపూర్వపక్షములు:—"అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహ రోఽస్మి న్నంతరాకాశః (ఛా. ౧. 3. ౧౪.)" అని యారంభించి ఛాందోగ్యశాఖవారు "ఏవ ఆత్మాఽపహత పాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘ త్సోఽపిపాసః సత్యకామః సత్యసంకల్పః" "ఈహృదయాకాశమే యాత్మ యాతఁడు పాపరహితుఁడు. జరామృత్యువులు లేనివాఁడు. ఆకలిదప్పుల నొందని వాఁడు. కోరినకోర్కుల తత్క్షణమే పొందఁగలసామర్థ్యము కలవాఁడు. సంకల్పముల సిద్ధి నొందించుకొను ప్రభావము కలవాఁడు." అని కొన్ని గుణములఁ బఠింపుచున్నారు. వాజసనేయశాఖవారును "స వా ఏష మహా నజ ఆత్మా యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు య ఏషోఽంత ర్హృదయ ఆకాశ స్తస్మిఞ్ఛేతే సర్వస్య వశీ" "ఈయింద్రియాదులయందు లేక ప్రాణములయందు విజ్ఞానరూపుఁడై యేజీవుఁ డున్నాఁడో యాతఁడే మహాత్ముఁడు. సర్వవ్యాపకుఁడు. జన్మనాశములు లేనివాఁడు. హృదయాకాశమున నున్నాఁడు. సర్వలోకములను తనస్వాధీనమున నుంచుకొని యున్నాఁడు." అని చెప్పుచున్నారు. ఈవిద్యలలో పరస్పరగుణోపసంహారము కలదా? లేదా? యనుసంశయ మిందు విచారింపఁబడును. "పూర్వాధికరణమునఁ బ్రతిపాద్యవిషయ మొక్కటి యగుటచే విద్యలకు నభేదము వర్ణింపఁబడెనుకాని యిచ్చట నట్లు చేయుటకు వీలులేదు. ఈరెండువిద్యలును అనేకవిషయములయందు సమానము లై యున్నను ఛాందోగ్యోపనిషత్తునందలివిద్య సగుణపరముగాను బృహదారణ్యకోపనిషత్తునందలి విద్య నిర్గుణపరముగాను ఉన్నది. మఱియు ఛాందోగ్యోపనిషత్తునందు హృదయాకాశమునకే సత్యకామత్వాదిగుణములు కల వని చెప్పఁబడి యున్నవి; బృహదారణ్యకోపనిషత్తునందు శుద్ధపరబ్రహ్మమునకే యాగుణ

ములు చెప్పఁబడి యున్నవి. ఇట్లుండ నీరెండువిద్యలకును పరస్పర గుణోపసంహార మెట్లు కలుగును? ఈకారణమువలన నిచ్చట విద్యాభేద మునే యంగీకరించి తీరవలయును.

## అ-౩. పా-౩. సూ-౩౯.

అవతారిక:—అని ప్రత్యుదాహరణసంగతితో వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౩౯. కామాదీతరత్ర తత్ర చాయతనాదిభ్యః.

### ౩. ౩. ౩౯.

తాత్పర్యము. ఇట్లుకాదు. ఛాందోగ్యోపనిషత్తునందలి సత్యకామత్వాదిగుణములును బృహదారణ్యకోపనిషత్తునందలిసర్వవశత్వాదిగుణములును రెండుస్థలములలోనికి నుపసంహరించుకొనఁబడవలసినవియే. ఏలయనఁగా ఆరెండువిద్యలకును పోలిక విశేషముగఁ గలదు. రెండువిద్యలయందును హృదయస్థానము సమానముగనే చెప్పఁబడి యున్నది. రెండువిద్యలయందును పరమేశ్వరుఁడే తెలిసికొనఁదగినవాఁడుగా వర్ణింపఁబడి యున్నాఁడు. "లోకముయొక్క మర్యాదలు కలత నొందకుండుటకై పరమేశ్వరుఁడు సేతువువలె నున్నాఁడు." అను విషయంబును రెండుస్థలములయందును సమానముగఁ జెప్పఁబడియున్నది. ఈకారణములవలన రెండువిద్యలు నొక్కటియే. "ఛాందోగ్యోపనిషత్తునం దాకాశమునకును బృహదారణ్యకోపనిషత్తునం దాకాశమున నున్న బ్రహ్మమునకును గుణములు చెప్పఁబడి యున్నవి కదా! అనియెదవేమొ. "దహర ఉత్తరేభ్యః. ౧. ౩. ౧౪." అనుస్థలమున నీవిషయము చర్చింపఁబడి "ఆకాశశబ్దమునకుఁ బరబ్రహ్మమే యర్థము." అనువిషయము పరిష్కరింపఁబడి యున్నది. కావున రెండువిద్యలయందును చెప్పఁబడినవాఁడు పరమేశ్వరుఁడే.

"ఇప్పటికిని విద్యలకు సగుణత్వనిర్గుణత్వభేదము పోలేదు కదా!" అనియెదవేమొ అది సత్యమే. అట్టిభేద మున్నను పరస్పరగుణోపసంహారమునకు నాటంకములేదు. బృహదారణ్యకోపనిషత్తునందు నిర్గుణునిం గూర్చియే చెప్పఁబడి యున్నట్లు "అతఃపరం విమోక్ష యైవ బ్రూహి" "ఇఁకమీఁద ముక్తిని జెందునుపాయము చెప్పుము." అని యుపక్రమమున

నున్న ప్రశ్నముచేతను "స ఏష మేతి నే త్యాత్మా" "పరమాత్మ ప్రపంచాతీతుఁడు" అను నుపసంహారవాక్యములచేతను స్పష్ట మగుచున్నది. ఇట్లున్నను వశిత్వాదిగుణములు చెప్పఁబడి యున్నవి. దీని కభిప్రాయ మేమి యగును? పరమేశ్వరుని స్తోత్రము చేయుటయే కదా! ఇట్లగుటచే నిట్టి స్తోత్రముఁకొఱకే సగుణవిద్యయందు గల సత్యకామత్వాదిగుణము లుపసంహరింపఁబడును. ఇఁక ఛాందోగ్యోపనిషత్తు నందలి సందర్భమును విచారించిన "అథ య ఇ హాత్మాన మను విద్య వ్రజం త్యేతాం శ్చ సత్యాన్ కామాన్" "ఎవ్వరు ఈఆత్మను ఈతని సత్యకామములతోఁగూడ గ్రహింతురో" అని యుపోద్ఘాతము కూడ జెప్పఁబడి యుండుటచే నచ్చట సగుణబ్రహ్మమే వర్ణింపఁబడె నని స్పష్టమగుచున్నది. ఈస్థలమునకు నెన్నిగుణముల నైన నుపసంహరించు కొనవచ్చు ననుటలో వివాదము లేదు. అయినను దీనితో సమానమైన సగుణవిద్యయందు జెప్పఁబడినగుణము లైనచో దీనిలోనికిని ఉపాసనార్థ మయ్యే యుపసంహరించుకొనఁబడును. అచ్చటఁగూడ ధ్యానము చేయఁ బడవలయు ననునుద్దేశముతో వర్ణింపఁబడినవే కావున నిచ్చటికిఁగూడ నట్టియర్థముతోనే వచ్చును. నిర్గుణవిద్యయందలిగుణము లైనచో నవి యచ్చటఁగూడ నుపాసనార్థమై కాక కేవలస్తుత్యర్థముగానే చెప్పఁబడినవి యగుటచే నిచ్చటగూడ నట్లే యనువర్తించును. సత్యకామత్వాదిగుణములను విచారించినంతమాత్రముననే యర్థబలమువలన సర్వవశిత్వాదిగుణములు నుపసంహృతము లగును; కావున విద్యాభేద మున్నను యిచ్చట గుణోపసంహారము కలదు.

---

## ౨౬. ఆదరాధికరణము.

విషయసంశయములు:— ఛాందోగ్యోపనిషత్తునందు "త ద్యద్భక్తం ప్రథమ మాగచ్ఛే త్త ద్ధోమియ్యం" "మొట్టమొదట వచ్చు నన్న మేది కలదో అదియే హోమమున ఉపయోగింపఁబడవలసినది" అని వైశ్వానరవిద్యయందు ప్రాణాగ్నిహోత్రవిధానము చెప్పఁబడి యున్నది. ఆవైశ్వానరవిద్యోపాసకునకు అతిథులకంటె ముందుగ భుజించుట దోషము కా దనియు మఱియొకయుపనిషత్తునందు నయుక్తికముగ నిర్ణయింపఁ

బడియున్నది. తనయగ్నిహోత్రము నాచరింపక పరునియగ్నిహోత్రము నాచరించుట యుక్తము గానట్లు తనప్రాణాగ్నిహోత్రవిధిని చెల్లింపక నితరుల ప్రాణాగ్నిహోత్రములఁ దృప్తినొందింపఁ బూనుట యుక్తము కానేరదని వివరింపఁబడి యున్నది. ఈవిషయమునుగూర్చి యీయధికరణమున విచారింపఁబడును. "భుజింపకపోయినప్పుడీ ప్రాణాహుతులకు లోపము కలదా? లేదా?" అనుసంశయము నివారింపఁబడును.

దీనిపై వేదాంతప్రశ్నయాక్షేపము:— పై విషయమునందు సంశయహేతువే లేదు. భోజనము లేకున్న ప్రాణాహుతు లుండవనుట సులభముగనే తెలియుచున్నది. అన్న మనునది భోజనమునకై యేర్పడినది యేకాని కేవలప్రాణాహుతులకై కాదు. అన్నమునకును ప్రాణాహుతుల కునుగూడ భోజనమూలమునఁనే తప్ప నితరసంబంధము లేదు. ఇట్లుండ భోజనము లేక పోయిన ప్రాణాహుతు లెటనుండి వచ్చును? అప్పు డన్న మునకును ప్రాణాహుతులకును సంబంధమే లేదు కదా! ఈకారణము వలన నైవిషయమునుగూర్చి విచారించుటయే యనావశ్యకము.

## అ_౩. పా_౩. సూ_౪౦.

అవతారిక:— ఈ విధముగ వచ్చినయాక్షేపమును పరిహరించి సూత్రకారుఁడు స్వమతదృఢీకరణార్థమై పూర్వపక్షము ననువాదము చేయుచున్నాఁడు.

## ౪౦౦. ఆదరాదలోపః. ౩. ౩. ౪౦.

తాత్పర్యము:— ఈ ఆక్షేపము చెల్లదు. పైవిషయమును విమర్శించి చూచిన భోజనము లేకున్నను ప్రాణాగ్నిహోత్రవిధి మాత్రము లోపము నొందుటకు వీలు లేదు. వేదార్థమును యథేచ్ఛముగ నిర్ణయించుట సంభవింపదు కదా! జాబాల్యుపనిషత్తునందు "పూర్వోఽతిథిభ్యోఽశ్నీయాత్" "వైశ్వానరవిద్యోపాసకుఁడు అతిథులకంటె ముందుగ భుజింపవచ్చును" అని చెప్పఁబడియున్నది. యనుట మీఁకును విశదమే. విధి కాకున్నఁ గాకపోవునుగాక; దీనివలన వేదమునకుఁ బ్రాణాగ్నిహోత్రవిధిపైఁ గలయాదరము తేటపడుచున్నది కదా! యజమానుఁడు అతిథులకంటెఁ బిదప భుజింపవలయు నని ధర్మశాస్త్రములో లోక

మర్యాదలును ఘోషింపుచుండ నానియమమును సహితము గమ నింపక నాశ్రుతి ప్రాణాగ్నిహోత్రకాలమునుగూర్చి యిట్లు చెప్పెను కదా! యావిధముగ విధికి ధర్మ మగుకాలమును గూర్చినయల్ప విశేషమునే సహింపని యాశ్రుతిక్రియకే లోపముగలిగిన నెట్లు సహింపఁగలదు? ఈకారణమువలన "ప్రాణాగ్నిహోత్రమున కెన్నటికిని లోపము కలుగఁగూడదు" అనియే సిద్ధాంతము చేయవలసియున్నది.

"అన్నము భోజనార్థమై విధింపఁబడినది యనియు నాయన్న ముతో సంబంధ ముండుటవలన ప్రాణాగ్నిహోత్రవిధిగూడ భోజనముతో సంబంధించినదియే యనియు నీకారణమువలన భోజనము లేనప్పుడు ప్రాణాగ్నిహోత్రముకూడ లేదనియు చెప్పియున్నాము కదా!" అనియెద వేమొ అది యుక్తము కాదు. "తద్యద్భక్తం" అనుశ్రుతి యన్నమును మాత్రమే విధింపవలయు నని ప్రవర్తింపలేదు. ప్రాణాగ్నిహోత్రవిధికూడ నగ్నిహోత్రవిధియే యగుటచే నిచ్చటగూడ నిత్యాగ్నిహోత్రమునకు సాధనములుగ జెప్పఁబడియున్న పాలు మొదలగు పదార్థములే యుప యోగింపఁబడవలసి రాఁగా విశేషమును జూపుటకై మాత్రమే యీ శ్రుతి ప్రవర్తించినది. ఇతరపదార్థము లెవ్వియు నిచ్చట పనికిరా వనియు భోజనార్థ మగుద్రవ్యము మాత్రమే యుపయోగింపఁబడవలయు ననియు సిద్ధాంతము చేయుటకై యీశ్రుతి ప్రవర్తించుచున్నది. "అగునుగాక యిప్పటికిని భోజనమునకు ప్రాధాన్యముపోవలేదు."అనియెదవేమొ యట్లు కాదు. ఈప్రాణాగ్నిహోత్రవిధి భోజనమునకు మాత్రమే సంబంధించినది యగునేని భోజనకాలమునందే చెప్పఁబడి యుండవలయును. అట్లు లేదు. జాబాల్యుపనిషత్తునందు ప్రాణాగ్నిహోత్రము నాచరించువానికి ప్రథమ భోజనము చెప్పఁబడి యున్నది కదా! కావున కాలవిధానము భిన్నముగ నుండుటచేఁ బ్రాణాగ్నిహోత్రవిధికి భోజనముతో సంబంధము లేదని తోచుచున్నది. భోజనార్థము లగుపదార్థములతో మాత్రమే సంబంధము కలదనియుఁ దేటఁబడుచున్నది. ఈకారణమువలనఁ బ్రాణాగ్నిహోత్రము ముఖ్యము. భోజనము గౌణము. భోజన మున్నను లేకున్నను తత్సంబం ధము లగుపదార్థములకును ప్రాణాగ్నిహోత్రమునకును సంబంధము తొలఁగదని పైనిరూపణచేఁ దేటపడుచున్నది కదా! ఈకారణమువలన గౌణము లోపించినను ముఖ్యము లోపింప నక్కఱ లేదు. భోజనము

లేకున్నను ఉపవాసాదిసమయములయందు భోజనప్రత్యామ్నాయముగ ప్రాణధారణార్థమై యుపయోగింపఁబడు జలాదిపదార్థములతో నైనను ప్రాణాగ్నిహోత్రవిధిని చెల్లించి తీరవలయును.

సంగతి:—ఈకారణమువలన నుపాసనలు పరస్పరభిన్నము లైనను స్తోత్రార్థమై యెట్లు గుణోపసంహారము బూర్వాధికరణమున చేయఁబడెనో అట్లే యిచ్చటఁగూడ భోజనలోపము కలిగినను జాబాల్యుపనిషత్తునందు చేయఁబడినస్తోత్రము సార్థక మగుటకై ప్రాణాగ్నిహోత్రవిధికిమాత్రము లోపము కలుగ దని సిద్ధాంతము చేయఁబడవలయును.

## అ-3. పా-3. సూ-४౧.

అవతారిక:—అని యిట్లు దృష్టాంతసంగతిచే వచ్చిన పూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ४౦౧. ఉపస్థితేఽత స్తద్వచనాత్. 3. 3. ४౧.

తాత్పర్యము:—ఇట్లు కాదు. "త ద్య ద్భక్తం ప్రథమ మాగచ్ఛేత ద్ధోమీయం" అను శ్రుతియందుఁ దచ్ఛబ్దము కలదు కదా! అది సర్వనామ మగుటచే సమీపమున నున్న యేదియో యొకపదార్థము మాత్రమే పరామర్శింపవలయును కదా! ఆపదార్థమే భక్తము (అన్నము) అది భోజనార్థ మైనదియే కావున "భోజనము సేయుటకై యుపక్రమించు నప్పుడు మొట్టమొదట నుపయోగింపఁబడు నాహారపదార్థములోనే (అన్నముతోనే) ప్రాణాగ్నిహోత్రవిధిని జరుపవలయు" అని తేలుచున్నది. ఈకారణమువలన నాప్రాణాహుతు లప్రధానము లైనవి. భోజనప్రాణాహుతులకే ప్రధానసంబంధము కలదు కాని యన్నప్రాణాహుతులకు కాదు కదా! ఈకారణమువలన భోజన మున్నప్పుడే ప్రాణాహుతి యుండునుకాని లేనప్పుడు కాదు; ప్రాణాహుతులకై భోజనంబును నిత్యము కా నక్కఱలేదు. ఉపవాసాదివిధి లేకపోవ నక్కఱ లేదు.

మఱియు పైన నిరూపించినవిధముగా ప్రాణాగ్నిహోత్రవిధి యప్రధానమే యగుటచే నది యన్నము లేనప్పుడు తత్ప్రత్యామ్నాయ ముల నాకర్షింపనేరదు. విచారించిన నిత్యాగ్నిహోత్రధర్మములుకూడ నిచ్చట ప్రాప్తింపవు. ఇచ్చట "ప్రాణము లగ్నిహోత్రములు" అనుమాట

విద్యాస్తోత్రార్థమై యేర్పడిన యర్థవాదమునందు కలదుకాని విధివాక్య మున లేదు. ఇది బలహీనము కదా! దీనికి నంతసామర్థ్య మెక్కడిది? "అట్టి సామర్థ్యము కలదు" అని పట్టు పట్టినను ప్రయోజనము లేదు. ఇచ్చట నిత్యాగ్నిహోత్రధర్మములే ప్రాపించునేని యెప్పుడు అరణుల మథించుట మొదలగు ధర్మములుకూడ వచ్చు ననవలయును. ఇది సంభవింపదు. అగ్నిహోత్రమున హోమముచేయవలసియుండినగదా యరణుల మథింపవలయును. ఈహోమ మట్టిది కాదు. వక్త్రమునందు చేయఁబడవలసినదియే కాని అగ్నియందు చేయఁబడవలసినది కాదు. ప్రాణాహుతుల నగ్నియందు వేల్చినచో భోజనమే లేకపోవలయును. జాబాలశ్రుతియు 'పూర్వో ఽతిథిభ్యో ఽశ్నీయాత్' అని యీవిషయ మునే నిరూపించుచున్నది. మఱియు "ఉర ఏవ వేది ర్లోమాని బర్హి ర్హృదయం గార్హపత్యో మనో ఽన్వాహార్యపచన ఆస్య మాహవ నీయః" "ఈప్రాణాగ్నిహోత్రమునకు పురుషుని వక్షస్థలమే వేదిక (భూమి = నిత్యాగ్నిహోత్రమునకు వేదిక లేదుకావునను అన్నియు నిత్యాగ్నిహోత్రధర్మములే యిచ్చట వర్ణింపఁ బడుచుండుటచేతను యీ యర్థము చెప్పఁబడెను.) అందలిరోమములు దర్భలు. హృదయ కమలము గార్హపత్యాగ్ని. మనస్సు అన్వాహార్యపచనాగ్ని, ముఖము ఆహవనీయాగ్ని" అనిశ్రుతియందు అగ్నిహోత్రాంగము లన్నియు నుపాసనార్థమై కల్పితములుగామాత్రమే చెప్పఁబడి యున్నవి. దీనిని పట్టి చూచినను యీప్రాణాగ్నిహోత్రము వాస్తవాగ్ని కాదనియే తేలు చున్నది. ప్రాతస్సాయంకాలములు కదా యగ్నిహోత్రకాలములు. ఆకాలములయందు విధింపఁబడక ముందైనను వెనుకనైనను భోజన కాలమునందు మాత్రమే విధింపఁబడి యుండుటచేతఁ గూడ నిది ముఖ్యము కాదని తేలుచున్నది. ఇంతమాత్రమేకాదు. అనేకవిషయముల యందు ముఖ్యాగ్నిహోత్రమునకును దీనికిని సామ్యము కుదురదు. కావున నిత్యాగ్నిహోత్రధర్మములు దీనియందు ప్రాప్తింపవు; తన్ని వారణార్థమై శ్రుతియు ప్రవర్తింప నక్కఱ లేదు. ఈకారణముల వలన భోజనకాలమునందే మంత్రదేవతాద్రవ్యసంయోగము నాశ్ర యించి ప్రాణాగ్నిహోత్రవిధి ప్రవర్తింప వలయు ననుట సిద్ధాంత మగు చున్నది.

జాబాలశ్రుతి ప్రాణాగ్నిహోత్రవిధియందు అత్యంతాదరము జూపుచున్నది యనియు దానివలన నది నిత్యము కావలయు ననియు సిద్ధాంతము చేయుటకు వీలులేదు. ఆశ్రుతి పూర్వభోజనమునుగూర్చి మాత్రమే చెప్పుచున్నది; కాని ప్రాణాగ్నిహోత్రమునుగూర్చి చెప్పుటలేదు. భోజనముచేసినను చేయకున్నను అతిథులకంటెఁ బూర్వమున బ్రాణాగ్నిహోత్రవిధి నాచరింపవలయు నని నియమించుట లేదు. "ఇట్లయిన నిది ధర్మశాస్త్రమునకు విరుద్ధము కదా!" అనియెదవేని ఇది వైశ్వానరవిద్యోపాసకునిఁగూర్చినవిశేష విధి కావచ్చును. సామాన్యశాస్త్రము విశేషశాస్త్రముచే బాధింపఁబడవచ్చు ననుటలో సంశయము లేదు కదా! ఈ కారణములవలనఁ బ్రాణాహుతులకు నింతమాత్రమువలన నిత్యత్వమును సాధించుటకు వీలు లేదు. ప్రాణాహుతులు నిత్యములైనను కాకున్నను గూడ భోజనముమాత్రము ప్రవర్తింపవచ్చు ననుటలో విరోధము లేదు కదా! కావున నెట్లు చూచినను భోజనము లేకున్న ప్రాణాహుతులును లేవనుటయే సిద్ధాంత మగుచున్నది. ఈవిచార ముపాసనావిచారము కాకున్నను వైశ్వానరవిద్యకు సంబంధించిన ప్రాణాహుతులను గూర్చిన విచార మగుటచే నీపాదమునందుఁ జేర్పఁబడె నని తెలిసికొనవలయును.

---

## ౨౭. తన్నిర్ధారణాధికరణము.

విషయసంశయములు:— వేదమునందు అనేకము లగునుపాసనలు కర్మాంగములుగఁ జెప్పఁబడి యున్నవి. "ఓ మి త్యేతదక్షర ముద్గీథ ముపాసీత" "ఉద్గీథాంగ* మగునోంకారము నుపాసనచేయవలయును" అను మొదలగువాక్యములయం దట్టివిద్యలే చెప్పఁబడెను. వానివిషయ మీయధికరణమున నివారణ చేయఁబడును. "ఈయుపాసనలు కర్మలతో నిత్యముగ సంబంధించునా? లేదా?" అనుసంశయము నివారింపఁబడును.

పూర్వపక్షసంగతులు:— ఉద్గీథోపాసనయు దానియందు వర్ణింపఁబడియున్న ప్రాణాద్యుపాసనలును దీనితో సమానములైనతక్కినయుపాసనలును కర్మలతో నిత్యముగ సంబంధము లయ్యే యుండు ననియే

---

* ఉద్గీథాంగ మనఁగా ఉద్గీథ మనుసామభాగముయొక్క యవయవము.

సిద్ధాంత మగును. "యస్య పర్ణమయీ జుహూ ర్భవతి న స పాపం శ్లోకం శృణోతి" "ఎవ్వఁడు ఆకుచేఁ జేయఁబడిన జుహూవును (యజ్ఞపాత్రను) గ్రహించునో వాఁడు పాపకథను వినఁడు" అనువాక్యము యజ్ఞప్రకరణములలో నొక్కదానియం దైనను పఠింపఁబడకున్నను ఆవాక్యమునందు యజ్ఞముతో నిత్యసంబంధము కలజుహూవు ప్రస్తావింపఁబడి యుండుటచే "ఈవాక్యమునందు చెప్పఁబడియున్న నియమము యజ్ఞమునకు సంబంధించినదియే" అని పూర్వమీమాంసాశాస్త్రమునందు సిద్ధాంతము చేయఁబడి యున్నట్లే ఇచ్చటఁ గూడ ప్రాణాద్యుపాసనలు యజ్ఞప్రకరణమునందుఁ బఠింపఁబడకున్నను యజ్ఞాంగము లగునుద్గీథాదులతో సాహచర్యమునొంది యుండుటచే "ప్రాణాదివిద్యలకు యజ్ఞముతో నిత్యసంబంధము కలదు" అని సిద్ధాంతము చేయవలసియున్నది. "అగునుగాక. 'ఆపయితా హ వై ప్రాణానాం భవతి' 'ఈయుద్గీథోపాసన నాచరించినవాఁడు సర్వకామముల నొందించువాఁ డగును. (స్వయముగ సర్వపరిపూర్తి నొంది పరులకుఁ గూడ నట్టిపరిపూర్తి నొసంగు ననుట)' అని యావిద్యలయందు ప్రత్యేకఫలము వినవచ్చుచున్నది కదా!" అనియెదవేమొ యది ప్రధానఫల మగుటకు వీలు లేదు; ఆవిద్యలు కర్మాంగము లగుటచే కర్మఫలములే విద్యాఫలములు కావలయునుగాని స్వతంత్రఫల ముండుటకు వీలు లేదు. ఇదియును గాక నీఫలము వర్తమానక్రియచే జెప్పఁబడుట వలన నర్థవాదమాత్రమే యగును. "యస్య పర్ణమయీ" అను వాక్యమునందుఁగూడ ఫలము చెప్పఁబడియే యున్నది. పూర్వమీమాంసాశాస్త్రమున దాని నర్థవాదముగనే సిద్ధాంతము చేయఁబడియున్నది. కావున గర్మాంగములందు చెప్పఁబడిన యుపాసనలకుఁ గర్మలతో నిత్యసంబంధము కలదు. పూర్వాధికరణమున భోజన మనిత్యమగుటచే దానికి సంబంధించిన ప్రాణాహుతులు ననిత్యము లైనట్లె ఉద్గీథాదులు కర్మలతో నిత్యసంబంధము కలవి కావున దానితో సంబంధించినవి యగుటచే నుపాసనలు కూడ నిత్యసంబంధము కలవియే.

## అ-3. పా-3. సూ-౪౨.

అవతారిక:—అని యిట్లు దృష్టాంతసంగతితో వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ४०२. తన్నిర్ధారణానియమస్తద్దృష్టేః పృథగ్ఘ్యప్రతిబంధః ఫలమ్. ౩. ౩. ४२.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట సరి కాదు. ఉద్గీథాదులయందు చెప్పఁబడియున్నయుపాసనలు నిత్యముగ కర్మలకు సంబంధించినవియే యని చెప్పుటకు వీలు లేదు. ఈవిషయమును శ్రుతియే చెప్పుచున్నది. "తే నోభౌ కురుతో యశ్చైతదేవం వేద యశ్చ న వేద" "ఈవిద్య నెవ్వఁ డెఱుంగునో యెవ్వఁ డెఱుంగఁడో వా రిరువురును కర్మ నాచరించుచునే యున్నారు" అని స్వయముగనే నిర్ధారణ చేయుచున్నది. మఱియు నుపాసన యనఁగా దేవతయొక్క యథార్థ స్వరూపము నెఱుంగుటయే కావున నది యున్నను లేకున్నను కూడఁ గర్మము నాచరింపవచ్చును. ఇదియు శ్రుతివాక్యముల విమర్శించినఁ దేటఁబడుచునేయున్నది. "ప్రస్తోతర్యా దేవతా ప్రస్తావ మన్వాయత్తా తాం చే దవిద్వాన్ ప్రస్తోష్యసి, తాం చే దవిద్వా నుద్గాస్యసి" "ఓ ప్రస్తోతా (యజ్ఞములయందు దేవతల నుతించినవాఁడు) ప్రస్తావమునకు సంబంధించిన దేవత నెఱుంగక దానిని నుతింతువేని, ఏ దేవతనుఁగూర్చి సామగానము నాచరింపవలయునో దాని నెఱుంగక నట్టిగానము నాచరింతువేని" అని శ్రుతులయందు దేవతాస్వరూప జ్ఞానము లేనివారుకూడ గర్మల నాచరించినట్లు చెప్పఁబడి యున్నది. ఈ కారణమువలన నుపాసనల నాచరించినను ఆచరింపకున్నను గూడ కర్మల ననుష్ఠింపవచ్చును. ఇట్లగుటచేఁ గర్మోపాసనలకు నిత్యసంబంధము లే దనుట స్పష్ట మగుచున్నది.

మఱియు నుపాసనలకు కర్మలకంటె భిన్నముగ ఫలము కానవచ్చుచున్నది; కర్మఫల మట్లే కలుగుచు నున్నను దానికి విద్యాసంబంధము వలనఁ గొంతయాధిక్యము గల దని తెలియవచ్చుచున్నది. "తే నోభౌ కురుతో యశ్చైతదేవం వేద యశ్చ న వేద నానా తు విద్యా చావిద్యా చ యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా త దేవ వీర్యవత్తరం భవతి" "దేవతాస్వరూపము నెఱింగినవాఁడు నెఱుంగనివాఁడు కూడఁ గర్మల నాచరించుచునే యున్నాఁడు. జ్ఞానాజ్ఞానములు మాత్రమే యచ్చట భేదము. ఏకర్మ జ్ఞానముతోను ఉపనిషత్సంబంధ

మగు శ్రద్ధతోను గూడి యాచరింపఁబడునో అది మిగుల బలవంతమైనది యగును" అని శ్రుతి స్వయముగఁ జెప్పుచున్నది. "జ్ఞానపూర్వకముగఁ జేయఁబడినకర్మ మిగుల బలవంత మగును" అని చెప్పఁబడియుండుటచే "జ్ఞానము లేకున్నను కర్మ సామాన్యముగ బలవంతమే" యని చెప్పఁబడిన ట్లయ్యెను కదా! ఈకారణమువలన జ్ఞానము కర్మాంగము కా దని తేలుచున్నది; అంగ మైనను నిత్యసంబంధము కలది కా దని స్పష్టమగుచున్నది. దీనికి గర్మతో నిత్యసంబంధమే యుండునేని యిది లేనప్పుడు ఆకర్మ సంపూర్ణ ఫలము నొసంగఁగల దనుటయే సంభవింపదు కదా! ఏ పదార్థమైనను పరిపూర్ణ ఫలము నొసంగవలయు ననిన సర్వాంగపరిపూర్తి నొంది యుండవలయును కదా! ఉపాసనకు గర్మతో నిత్యసంబంధ ముండునేని యదియుఁ గర్మాంగమే యగును కదా! కావున నెట్లు చూచినను కర్మోపాసనలకు నిత్యసంబంధము లేదనియే చెప్పవలసి వచ్చుచున్నది.

ఇదియునుగాక నుపాసనలకు బ్రత్యేకముగఁ గూడ ఫలము చెప్పఁబడి యున్నది. "కల్పంతే హాస్మై లోకా ఊర్ధ్వా శ్చావృత్తా శ్చ" "ఈయుపాసన నాచరించినవానికి నూర్ధ్వలోకములును అధోలోకములును (అనఁగా: దిగివచ్చుమార్గమున నున్నలోకములును) సుఖకరములగును" అని వర్ణింపఁబడి యున్నది. ఇ ట్లగుటచే నుపాసనలకును కర్మలకును నిత్యసంబంధ ముండుటకు వీలు లేదు. "ఈఫలములు విధింపఁబడక వర్తమానక్రియతో మాత్రమే చెప్పఁబడి యుండుటచే నర్థవాదమాత్రములే యగును కదా?" అనియెదవేమో అది యుక్తము కాదు. ఇచ్చుటమాత్రము నిశ్చితముగ ఫలమునే కల్పింపవలయును. ఇట్లు చేయకుండిన నాఫలశ్రుతి యప్రధానము కావలసి వచ్చును కదా! ప్రకృత విషయమున నిది సంభవింపదు. ఎ ట్లనిన:—

ఉపాసనలు వ్యాపారరూపములు. ఉపాసన యనునది మనస్సంబంధమగు క్రియ కదా! క్రియకు ఫలము నియతముగ నుండవలయును. ఈ క్రియలకు నాశ్రయము లగునుద్గీథాదులు కర్మాంగములే యనుటకు బ్రమాణము లేదు. ఉద్గీథ మనునది సామవేదభాగ మగుటచే యజ్ఞాంగమే యైనను ప్రస్తుత ముపాస్యముగ చెప్పఁబడినయోంకారము మాత్రము యజ్ఞాంగము కాదు; అది యుద్గీథమునకు మాత్రమే యంగము

కదా ! కావున దీని నాశ్రయించియున్నయుపాసన యజ్ఞాంగము కానక్కఱ లేదు. ఒకవేళ యజ్ఞమునందు పేర్కొనఁబడిన యుద్గీథాదిదేవతల యొక్కయథార్థస్వరూపము నెఱుంగుటకై యుపాసనలు కావలసి వచ్చి నను నిత్యముగాఁ దత్సంబంధము కలిగియుండ నక్కఱలే దని యిదివఱకే శ్రుతియుక్తులతో నిరూపించియున్నాము. ఇట్లుండ వీనికిఁ బ్రత్యేకఫలము లుండవచ్చు ననుటలో సందేహ మేమి ? ఇవి యజ్ఞప్రకరణమునం దైనను పఠింపఁబడి యుండ లేదు కదా !

“పూర్వమీమాంసాశాస్త్రమున ప్రయాజాదివిధులు ఫలసహిత ములుగాఁ జెప్పఁబడి యున్నను ‘వీనికిఁ జెప్పఁబడినఫల మర్థవాదము’ అని సిద్ధాంతము చేయఁబడి యున్నది. ఇట్లే యిచ్చట గూడ వర్తమానక్రియ ప్రయోగింపఁబడి యుండుటచే సిద్ధాంతము చేయఁబడఁగూడదా?” అందు వేమొ యట్లు కాదు. ఆప్రయాజాదులు యజ్ఞప్రకరణమున బఠింపఁ బడి యున్నవి; యజ్ఞార్థమై నియమింపఁబడి యున్నవి. ఇట్లుండుటచే వానికి స్వతంత్రఫల ముండుటకు వీలు లేదు. కావున నచ్చట నట్లు సిద్ధాంతము చేయఁబడెను ; వర్తమానక్రియచేఁ జెప్పఁబడిన విషయము కూడ విధియే యగునేని యాసిద్ధాంతమునకు విరోధము వచ్చును. కావున “వర్తమానక్రియచే జెప్పఁబడినవిషయము విధి కానేరదు.” అని సంస్థాపింపఁబడినది. ఇచ్చట నట్లు లేదు కదా ! మఱియు “యస్య పర్ణమయీ జుహూః” అనుమొదలగువాక్యముకూడ యజ్ఞప్రకరణము నందు లేకున్నను దానికి నాశ్రయము లేకపోవుటచే దానికిఁ జెప్పఁబడి యున్నఫలము కూడ నర్థవాదమే యని సిద్ధాంతము చేయఁబడియున్నది. జుహూవునకు యజ్ఞముతో నిత్యసంబంధము కల దనుకారణముచేతనే కదా ఈవాక్యమునకును యజ్ఞప్రకరణమునకును సంబంధము వర్ణింపఁ బడినది; “ఆజుహూవు దేనితోఁ జేయఁబడవలయు ?” అని యాకాంక్ష కలుగఁగా దాని కుత్తరముగ నీవాక్య ముపయోగింపఁబడినది. ఇట్లగుటచే నీవాక్యమునకుఁగూడ యజ్ఞమునుఁగూర్చి చెప్పుటయే యభిప్రాయ మని తేలుచున్నది. ఈకారణమువలన నాశ్రయఫలములు రెండు నొక్క వాక్యముచేతనే చెప్పఁబడిన వని సిద్ధాంతము చేసినచో వాక్యభేదము వచ్చును కావునను ఆశ్రయము లేకున్న వాక్యార్థమే కుదురదు కావునను ఫలముకూడఁ గలుగుటకు వీలులేదు కావునను “ఈవాక్యమునకు

నాశ్రయమును చెప్పుటయందే తాత్పర్యము కలదు; ఫలమును చెప్పుట యర్థవాదమే" అని సిద్ధాంతము చేయఁబడవలసి వచ్చినవి. ప్రకృతవిషయ మునఁగూడ నిట్లేయజ్ఞప్రకరణసంబంధములేకున్నను యజ్ఞాంగము కాని యోంకార మాశ్రయముగా నుండుటచేతను ఆయోంకారము యజ్ఞాంగమేయైనను బాధ లేకపోవుటచేతను ఉపాసన దేవతాస్వరూప ప్రతిపాదకమేయగుటచే నెట్లును విరోధము లేకపోవుటచేతను "ఇచ్చటి ఫల మర్థవాదము" అని చెప్పుటకు వీలు లేదు. మఱియు జుహూ వనునది పదార్థము కాని క్రియకాదు. క్రియాసంబంధము లేనికేవలపదార్థమునకు ఫలము సంభవింప దనుట నిస్సంశయమేకదా! కావున గోదోహనాదులకు వలెనే యీయుపాసనలకును అనిత్యత్వమును చెప్పుట యుక్తియుక్తమై యున్నది. యజ్ఞమునకు నంగముగా 'చమస' మను నొకపాత్రను విధించి పిదప ఫలసహితముగ గోదోహనమును (పాలు పితుకునట్టిపాత్రమును) ఫలసహితముగ వేదము విధించుచున్నది. పశువృద్ధిని కోరువాఁడు గోదోహనమునందును బ్రహ్మవర్చస్సును కోరువాఁడు కాంస్యపాత్రమునందును జలము నుంచవలయు నని విధించుచున్నది. ఇచ్చట గోదోహనాదులకు జెప్పఁబడినఫల మర్థవాదము కా దనియు వానికి యజ్ఞములతో నిత్య సంబంధము లే దనియు పూర్వమీమాంసాశాస్త్రమున నిర్ణయింపఁబడి యున్నది. యజ్ఞాంగముగ విధింపఁబడినది చమసమే యగుటచేతను గోదోహనము దానిసంబంధమువలన మాత్రమే యజ్ఞమున ప్రవేశించి యుండుటచేతను ఇట్లు సిద్ధాంతము చేయఁబడి యున్నది. ఇప్పుడు యజ్ఞ ఫలము తనతో పరిపూర్ణసంబంధము లేనిగోదోహనముయొక్క ఫలమును బాధింపనేరదు కదా! మఱియు చంద్రకట్టైతో యూపస్తంభమును నిర్మించినవాఁడు బలాభివృద్ధి నొందు ననియు బిల్వవృక్షముతో యూపస్తంభమును నిర్మించినవాఁడు సుఖభోజనము నొందు ననియు వేదమున నొక్కస్థలమునఁ జెప్పఁబడి యున్నది. ఇదియు నర్థవాదము కాదనియే సిద్ధాంతము చేయఁబడెను. యూపసంబంధముచేత నే యీబిల్వాదులు యజ్ఞమునందు ప్రవేశించుచున్నవి కదా! ఇట్లయినను వీనికి యూపస్తంభము ప్రత్యేకాశ్రయముగా నున్నది. కావున ఫల మర్థవాదము కానేరదు. జుహూవాక్యవిషయ మన్ననో యిట్టిది కాదు. అచ్చట గూడ జుహూ వాశ్రయముగ నున్నను అచ్చట "ఈజుహువు దేనితో

చేయఁబడవలయును ?" అని యాజుహూవునకే యాకాంక్ష కలుగుచున్నది కావున నావాక్యమునందు తాత్పర్యముతో చెప్పఁబడినది పర్ణమయీత్వమే యగును కాని జుహూవు కానేరదు. యజ్ఞసంబంధము లేక నా పర్ణమయీత్వము స్థిరపడనేరదు కావున యజ్ఞఫలము తత్ఫలమును బాధించును. బిల్వోయూపాదివాక్యములం దన్ననో యూపస్తంభమునకు నియమ మేదియు లేదు. కావున "యూపస్తంభమును దేనితో చేయవల యును" అనునాకాంక్ష కలుగదు. ఇట్లగుటచే యూపము నాశ్రయించి సఫల ముగ ఖాదిరత్వాదులు (చంద్రకట్టెతో చేయవలయును అనుమొదలగు నవి) విధింపఁ బడుచున్నవి. ఇట్లగుటచే నీవిధులయందు చెప్పఁబడిన ఫలము లర్థవాదములు కా నక్కఱ లేదు. ప్రకృతమున గూడ నోంకారా దుల నాశ్రయించి యుపాసనలు విధింపఁబడి యున్నవి కావున నీనిఫలము లర్థవాదములు కానేరవు. ఇట్లగుటచేతనే కల్పసూత్రకారులు కూడ నిట్టి యుపాసనలఁ గర్మాంగములనుగా చెప్పలేదు. ఈకారణమువలన నెట్లు చూచినను కర్మలకు నుపాసనలకును నిత్యసంబంధము లేదు.

---

## ౨౫. ప్రదానాధికరణము

విషయ సంశయములు :—బృహదారణ్యకోపనిషత్తునందు "వది ష్యామ్యే వాహ మితి వా గ్దధ్రే" "నేను మాటలాడఁగలనుకదా! యని వాగింద్రియము శరీరధారణాభిమానమును పొందెను" అని యారం భించి సర్వేంద్రియములకు క్రమముగ నిట్టియభిమానమే కలిగినట్లును ప్రతిదానికిని మృత్యువువలన తిరస్కారము గలిగినట్లును అలసిపోవుట యనునదియే యాతిరస్కారమునకు స్వరూప మైనట్లును ముఖ్యప్రాణము మాత్రము ఆమృత్యువుచేఁ దిరస్కారమును జెందనట్లును ఈకారణము వలన నది దేహమధ్యమునందలివానిలో నధిక మైనట్లును వర్ణింపఁబడి యున్నది; అగ్న్యాదిదేవతలలో నెల్ల వాయు వధిక మని స్థాపింపఁ బడి యున్నది. ఇట్టే ఛాందోగ్యోపనిషత్తునందును సంవర్గవిద్యయందును ప్రాణవాయువులను గూర్చి చెప్పఁబడి యున్నది. ఈవిషయమును గూర్చి యిచ్చట విచారింపఁబడును. ఈప్రాణవాయువులకుఁ బరస్పరభేదము

కలదా ? లేదా? ధ్యానింపఁబడవలసిన పదార్థములు రెండా ? కావా ? అను సంశయ మిందు నివారింపఁబడును.

పూర్వ. సంగతులు:—విచారించిన నీరెండు నొక్కటిగనే తోఁచుచున్నది. రెండును వాయుతత్త్వమునకుఁ జేరినవియే కదా ! తత్త్వ మొక్కటియై యుండ నిరర్థకముగ భేదము భావింపఁబడవచ్చు ననుట యెట్లు ? శ్రుతియు నీవిషయమును స్పష్టముగనే చెప్పుచున్నది. శరీరమునందుండుట దేవతలలో నుండుట యను నింతమాత్రమున తత్త్వము భిన్నము కానేరదనుచున్నది. "అగ్ని ర్వాగ్ భూత్వా ముఖం ప్రావిశత్" "అగ్నిహోత్రుఁడు వాగింద్రియరూపముతో ముఖమును ప్రవేశించెను" అను మొదలగువాక్యము లీవిషయమున బ్రమాణములు. అగ్ని దేవతలలోనివాఁడు ; వాగింద్రియంబును శరీరములోనిది. ఈరెంటికి నేకరూపము లేకుండిన నగ్నికి ముఖప్రవేశము సంభవింప దనుట నిస్సంశయమే కదా ! మఱియు "త ఏతే సర్వ ఏవ సమాః సర్వేఽనంతాః" "ఈచెప్పఁబడిన వన్నియు సమానము లైనవే ? అన్నియు ఆద్యంతములు లేనివే." అను మొదలగువాక్యములను విమర్శించి చూచినను వాయ్వాదులకుఁ గల యనంతత్వము (ఇతరభూతమునకంటె వ్యాపకములై యుండుస్థితి) ప్రాణాదులకు కల దని చెప్పుటవలన రెంటికి నభేదమే గానవచ్చుచున్నది. మఱియు నొక్కస్థలమున "యః ప్రాణః స వాయుః" "ప్రాణమే వాయువు" అని స్పష్టముగనే వాయుప్రాణాభేదము ప్రకటింపఁ బడియున్నది. వాస్తవస్థితిలో శరీరమున నుండుట లేకుండుట మొదలగునవి గుణములుగాని పదార్థములు కావు. అవియు సిద్ధమైనయొకపదార్థము నాశ్రయించి మాత్రమే యున్నవి. వానికి నొకవేళ భేద మున్నను విశేష్య మగుపదార్థమునకు నట్టిభేద ముండదు. విధిచే నిర్ణయింపఁబడకమునుపు వచ్చుగుణము లేవియైన నుండినచో నవిమాత్రమే పదార్థమును భేదింపఁగలవుకాని లేకున్న నట్లు భేదింపనేరవు. "ఇది యాఁజంతువు" అని నిర్ణయము కాకమునుపు గల శృంగఖురాదులు మాత్రమే యాజంతువును భేదింపగలవు కాని పిదప వచ్చినసంజ్ఞాదులు అట్లు చేయనేరవు కదా! గోస్వరూపము తెలియనివానికి మొట్టమొదట "ఇది గోవు" అని యితరజంతువులనుండి గోవును విభాగింపవలసినప్పుడు ఆజాతియందు (గోజాతియందు) మాత్రమే యున్నట్టియు మఱియొకస్థలమున లేనట్టియు

విశేషమును చూపి "ఇది గోవు ఇది మఱియొక జంతువు" అని నిర్ణయింప వలయును గాని పిదప నాగోవులకు నెవ్వ రెన్ని నామములఁ బెట్టినను జెల్లి నిర్ణయింపవలసినపని లేదు. నామభేదములు నిర్ణయమైనపిదప వచ్చిన వగు టచే జాతిని భేదింప లేవు. "వీఁడు మనుష్యుఁడు" అని తెలిసినపిదప వాని పై నున్నవస్త్రాదులు ఆసంఘమున బరస్పరభేదమును కలిగింపఁగలవా? ఇదియంతయు సర్వానుభవసిద్ధము. ఇట్లే ప్రకృతమునందును అధ్యాత్మాధి దైవభేదములచే (దేహములో నుండుట దేవతలలో నుండుట యను భేదములచే) వాయురూపపదార్థము గాని విద్య గాని భేదింపదు. ఒక్క సంవర్గవిద్యకే ప్రాణంబును వాయువును దేవత లని యేర్పడదు. ఇరువురు నొక్కటియే యగుదురు. విద్యాస్వరూపము మొట్టమొదటనే నిర్ణయింపఁ బడియున్నది. ఇట్లే ఉపక్రమోపసంహారములఁ బట్టి చూచినను యీవిష యమే సిద్ధాంత మగుచున్నది. బృహదారణ్యకోపనిషత్తున నుపసంహారము నందు "ప్రాణా ద్వా ఏష ఉదేతి ప్రాణేఽస్తమేతి" "ఈ సూర్యుఁడు ప్రాణమునుండియే యుదయించును ప్రాణమునందే యస్తమించును." అని ప్రాణవాయువుల కభేదమును నిరూపించు వాక్యము కలదు. వాయువు అగ్న్యాదిభూతములకంటె విశేషదేశమును వ్యాపించియున్నది కావున సూర్యుఁడు దానియందే కదా యుదయాస్తమయముల నొందు చున్నాఁడు. మఱియు "తస్మా దేక మేవ వ్రతంచరే త్ప్రాణ్యా చ్చైవ వాపాన్యాచ్చ" "ఈకారణమువలన నొక్క వ్రతమునే యాచరింపవల యును. ప్రాణవ్యాపారమును జేయవలయును. అపానవ్యాపారము నాచరింపవలయును." (ఉచ్ఛ్వాసనిశ్వాసముల నాచరింపవలయు ననుట) అనువాక్యము కూడఁ బైవిషయమునే దృఢపరుచుచున్నది. ఇట్లే ఛాందోగ్యోపనిషత్తునందును "సంవర్గ మొక్కటియే" యని వర్ణింపఁబడి యున్నది కాని భేదము జెప్పఁబడి యుండ లేదు. ఈకారణములవలన నిచ్చట ప్రాణవాయువు లొక్కటియే యనియు తదుపాసనఁ గూడ నొక్క టియే యనియు సిద్ధాంతముచేయవలయును. పూర్వాధికరణమున ఫలభేద ముండుటచే కర్మోపాసనలకు నిత్యసంబంధము లే దని సిద్ధాంతము చేయఁ బడెను కాని యిచ్చట దేవతాభేదము లేకపోవుటచే నట్లు చేయఁబడుటకు వీలు లేదు.

కలదా ! లేదా? ధ్యానింపఁబడవలసిన పదార్థములు రెండా ? కావా ? అను సంశయ మిందు నివారింపఁబడును.

పూర్వ. సంగతులు:—విచారించిన నీరెండు నొక్కటిగనే తోఁచు చున్నది. రెండును వాయుతత్త్వమునకుఁ జేరినవియే కదా ! తత్త్వ మొక్కటియై యుండ నిరర్థకముగ భేదము భావింపఁబడవచ్చు ననుట యెట్లు ? శ్రుతియు నీవిషయమును స్పష్టముగనే చెప్పుచున్నది. శరీరమునందుండుట దేవతలలో నుండుట యను నింతమాత్రమున తత్త్వము భిన్నము కానేర దనుచున్నది. "అగ్ని ర్వా ద్భూత్వా ముఖం ప్రావిశత్" "అగ్ని హోత్రుఁడు వాగింద్రియరూపముతో ముఖమును ప్రవేశించెను" అను మొదలగువాక్యము లీవిషయమున బ్రమాణములు. అగ్ని దేవతలలోని వాఁడు ; వాగింద్రియంబును శరీరములోనిది. ఈ రెంటికి నేకరూపము లేకుండిన నగ్నికి ముఖప్రవేశము సంభవింప దనుట నిస్సంశయమే కదా ! మఱియు "త ఏతే సర్వ ఏవ సమాః సర్వేఽనంతాః" "ఈ చెప్పఁబడిన వన్నియు సమానము లైనవే ? అన్నియు ఆద్యంతములు లేనివే." అను మొదలగువాక్యములను విమర్శించి చూచినను వాయ్వాదులకుఁ గల యనంతత్వము (ఇతరభూతమునకంటె వ్యాపకములై యుండుస్థితి) ప్రాణాదులకు కల దని చెప్పుటవలన రెంటికి నభేదమే గానవచ్చు చున్నది. మఱియు నొక్కస్థలమున "యః ప్రాణః స వాయుః" "ప్రాణమే వాయువు" అని స్పష్టముగనే వాయుప్రాణాభేదము ప్రకటింపఁ బడి యున్నది. వాస్తవస్థితిలో శరీరమున నుండుట లేకుండుట మొదలగు నవి గుణములుగాని పదార్థములు కావు. అవియు సిద్ధమైనయొకపదార్థము నాశ్రయించి మాత్రమే యున్నవి. వానికి నొకవేళ భేద మున్నను విశేష్య మగుపదార్థమునకు నట్టిభేద ముండదు. విధిచే నిర్ణయింపఁబడక మునుపు వచ్చుగుణము లేవియైన నుండినచో నవిమాత్రమే పదార్థమును భేదింపఁగలవుకాని లేకున్న నట్లు భేదింపనేరవు. "ఇది యీజంతువు" అని నిర్ణయము కాకమునుపు గల శృంగఖురాదులు మాత్రమే యీజంతువును భేదింపగలవు కాని పిదప వచ్చినసంజ్ఞాదులు అట్లు చేయనేరవు కదా! గోస్వరూపము తెలియనివానికి మొట్టమొదట "ఇది గోవు" అని యితరజంతువులనుండి గోవును విభాగింపవలసినప్పుడు ఆజాతియందు (గోజాతియందు) మాత్రమే యున్నట్టియు మఱియొకస్థలమున లేనట్టియు

విశేషమును చూపి "ఇది గోవు ఇది మఱియొక జంతువు" అని నిర్ణయింపవలయును గాని పిదప నాగోవులకు నెవ్వ రెన్ని నామములఁ బెట్టినను లెల్ల నిర్ణయింపవలసినపని లేదు. నామభేదములు నిర్ణయమైనపిదప వచ్చిన వగుటచే జాతిని భేదింప లేవు. "వీఁడు మనుష్యుఁడు" అని తెలిసినపిదప వాని పై నున్నవస్త్రాదులు ఆసంఘమున బరస్పరభేదమును కలిగింపఁగలవా? ఇదియంతయు సర్వానుభవసిద్ధము. ఇట్లే ప్రకృతమునందును అధ్యాత్మాధిదైవభేదములచే (దేహములో నుండుట దేవతలలో నుండుట యను భేదములచే) వాయురూపపదార్థము గాని విద్య గాని భేదింపదు. ఒక్క సంవర్గవిద్యకే ప్రాణంబును వాయువును దేవత లని యేర్పడదు. ఇరువురు నొక్కటియే యగుదురు. విద్యాస్వరూపము మొట్టమొదటనే నిర్ణయింపఁబడియున్నది. ఇట్లే ఉపక్రమోపసంహారములఁ బట్టి చూచినను యీవిషయమే సిద్ధాంత మగుచున్నది. బృహదారణ్యకోపనిషత్తున నుపసంహారమునందు "ప్రాణా ద్వా ఏష ఉదేతి ప్రాణేఽ_స్తమేతి" "ఈ సూర్యుఁడు ప్రాణమునుండియే యుదయించును ప్రాణమునందే య_స్తమించును." అని ప్రాణవాయువుల కభేదమును నిరూపించు వాక్యము కలదు. వాయువు అగ్న్యాదిభూతములకంటె విశేషదేశమును వ్యాపించియున్నది కావున సూర్యుఁడు దానియందే కదా యుదయా_స్తమయముల నొందుచున్నాఁడు. మఱియు "తస్మా దేక మేవ వ్రతంచరే త్ప్రాణ్యా చ్చైవాపాన్యాచ్చ" "ఈకారణమువలన నొక్క వ్రతమునే యాచరింపవలయును. ప్రాణవ్యాపారమును జేయవలయును. అపానవ్యాపారము నాచరింపవలయును." (ఉచ్ఛ్వాసనిశ్వాసముల నాచరింపవలయు ననుట) అనువాక్యము కూడఁ బైవిషయమునే దృఢపరుచుచున్నది. ఇట్లే ఛాందోగ్యోపనిషత్తునందును "సంవర్గ మొక్కటియే" యని వర్ణింపఁబడియున్నది కాని భేదము జెప్పఁబడి యుండ లేదు. ఈకారణములవలన నిచ్చట ప్రాణవాయువు లొక్కటియే యనియు తదుపాసనఁ గూడ నొక్కటియే యనియు సిద్ధాంతము చేయవలయును. పూర్వాధికరణమున ఫలభేదముండుటచే కర్మోపాసనలకు నిత్యసంబంధము లే దని సిద్ధాంతము చేయఁబడెను కాని యిచ్చట దేవతాభేదము లేకపోవుటచే నట్లు చేయఁబడుటకు వీలు లేదు.

## అ-౩. పా-౩. సూ-౪౩.

అవతారిక:—అని యిట్లు ప్రత్యుదాహరణసంగతితో వచ్చిన పూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౪౦౩. ప్రదానవ దేవ త దుక్తం. ౩. ౩. ౪౩.

తాత్పర్యము:—ఇట్లు చెప్పఁగూడదు. శ్రుతియందు వాయుప్రాణములు వేఱువేఱుగా జెప్పఁబడియుండుటవలన వానిని భిన్నము లనియే భావింపవలయును. ఉపాసన యభిన్న మనువిషయమున మాకు వివాదము లేదు; గుణభేదమువలన దదాశ్రయ మగుపదార్థమునకు భేదము కలుగ దనువిషయమునఁగూడ మావివాదము లేదు. అయినను ఇచ్చట మాత్రము దేవతాభేదము నవశ్య మంగీకరించి తీరవలయును. ఇచ్చట ధ్యానార్థమై మాత్రమే గుణభేదము (అధ్యాత్మాధిదైవభేదము) చెప్పఁబడియున్నది. అగ్నిహోత్ర మొక్కటియే యైనను ప్రాతస్సాయంకాలభేదములచే దానియందు భేదప్రవృత్తి కలుగునట్లు ఇచ్చటగూడ విద్యయొక్కటియేయైనను భేదప్రవృత్తి కలుగవచ్చును. ఇట్లు లేకున్న నాశ్రుతియే నిరర్థకము కావలసి వచ్చును కదా! ఇది యుక్తము కాదు. ఈకారణమువలన నవశ్యముగ దేవతాభేదము నంగీకరింపవలయును.

"వాయుప్రాణములకుఁ దత్వ మొక్కటియే యగుటచే నిది యుక్తము కా దంటినికదా" యనియెదవేమొ యది యొకదోషము కాదు. తత్వమొక్కటియే యైనను స్థితిభేదము నాశ్రయించి భేదము నుపదేశింపవచ్చును; అట్లే యుపాసనను గూడ నాచరింపవచ్చును. ప్రాణము శరీరములో నుండునది. వాయువు సర్వవ్యాపకము కదా! మఱియు నుపసంహారవాక్యము కూడ తత్వాభేదము నాశ్రయించియే ప్రవర్తింపవచ్చును. ఇంతమాత్రమున నది ప్రాణవాయువులకు నభేదమును స్థాపింపవలయునా? "న యత్యైషాం ప్రాణానాం మధ్యమః ప్రాణ ఏవ మేతాషాం దేవతానాం వాయుః" "ఇంద్రియములలో ముఖ్యప్రాణ మెట్లు శ్రేష్ఠమో అట్లే దేవతలలో వాయువు శ్రేష్ఠము" అను నుపమానమును విమర్శించిన భేదముకూడ శ్రుతికిఁ దాత్పర్య మనియే తేలుచున్నది. మీ రన్నట్లు ఉపసంహారము అభేదపరమే యగునేని యీశ్రుతికిని దాని

కిని విరోధము వచ్చును. ఈవిరోధమును పరిహరించుటకై కూడ పైన వర్ణించినట్లే యుపసంహారవాక్యమున కర్థము చెప్పవలయు నని తోచు చున్నది. వేదమున నొక్క యక్షరమైన నీప్రమాణము కాఁగూడదు; ఉపసంహారవాక్యమునే ప్రధానమును గావించిన నుపక్రమవాక్యమునకు దాత్పర్య ముండదు. ప్రకరణమునకు నభేదము తాత్పర్య మైయుండ నడుమ భేదము జెప్పఁబడె ననుట యప్రామాణికమే యగును కదా! ఇట్లే "ఏకమేవ వ్రతం చరేత్" అను శ్రుతికిఁ గూడ నర్థము చెప్పవలయును. ఈశ్రుతియు తాత్త్వికాభేదమును బట్టి ప్రవర్తించినదియే "ఏవ" యను *నవధారణ మున్నను అది ప్రాణవ్రతమును మాత్రమే విధించును కాని వాయువ్రతమును నిషేధింపదు. అంతమునందు "తేనో ఏతస్యై దేవతాయై సాయుజ్యం స లోకతాం జయతి" "ఉపాసకుండు ఈదేవత యొక్క సాయుజ్యమును పొందును. ఆదేవతయొక్క లోకమును జెందును" అని చెప్పఁబడియుండుటచే నీవిషయమే స్పష్టమగుచున్నది. అగ్న్యాదిదేవతలకంటె వ్యాపక మగుటచే వాయువే దేవతాశబ్దముచే జెప్పఁబడుచున్నది. "సై షా న స్త మితా దేవతా య ద్వాయుః" "వాయువే అస్తమానము లేనిదేవత" అని శ్రుతియే యీవిషయమును బోధించుచున్నది. ఉపక్రమమునందును "అథాతో వ్రత మీమాంసా" "ఇక వ్రతమును విచారింతుము" అని యారంభించి వాగాదీంద్రియ ములకు సంబంధించిన వ్రతములు భగ్నవ్రతము లని నిర్ణయించి వాయుప్రాణవ్రతముల నభగ్నవ్రతములుగా నిర్ధారణ చేసి యంతము వఱకు వానినిఁ గూర్చియే చెప్పఁబడి యున్నది. పైనఁ జూపఁబడియున్న యవధారణ మీవిషయమునే ప్రకటించును. వాగాదివ్రతములు భగ్న వ్రతము లనియు వానిని విడిచి యభగ్నవ్రత మగుప్రాణవ్రతమును మాత్రమే యాచరింపవలయు ననియు నిర్ధారణ చేయును. ఛాందోగ్యోప నిషత్తునందును "తౌ వా ఏతౌ ద్వౌ సంవర్గౌ వాయురేవ దేవేషు ప్రాణః ప్రాణేషు" "దేవతలలో వాయువును యింద్రియములలో ప్రాణంబు నను నీరెండును సంవర్గములు" అని వాయుప్రాణములకు భేదము చెప్పఁబడి యున్నది. ఇట్లగుటచే తత్త్వభేదము లేకున్నను

* అవధారణము (అ-3. పా-3. సూ-౧౭. పేజీ-2 . 3 చూ.)

విద్యాభేదము లేకున్నను ధ్యానార్థమై దేవతాభేద మంగీకరింపఁబడ వలసినదే.

దీనికి గర్మకాండమునందు దృష్టాంతము కలదు. "ఇంద్రాయ రాజ్ఞే పురోడాశ మేకాదశ కపాల మింద్రా యాధిరాజా యేంద్రాయ స్వరాజ్ఞే" "రాజైనట్టియు అధిరాజైనట్టియు స్వరాజైనట్టియు నింద్రునకు పదునొకండు మూకుండ్లతో పురోడాశము నొసంగవలయును" అని మూఁడుపురోడాశ ప్రదానములచే నొనర్పఁదగిన యిష్టి యొకటి వేదమున నుపదేశింపఁ బడియున్నది. "సర్వేషా మభిగమయన్" "పురోడాశముల నొక్కమాఱే గ్రహింపవలయును" అని కూడ తద్విధానము వర్ణింపఁబడియున్నది. ఈవాక్యములను విమర్శించి చూచిన మూఁడు హవిస్సుల నొక్కమాఱే హోమము చేయవలయు ననియే తోఁచుచున్నది. ఇంద్రుఁ డొక్కఁడే దేవత; హవిస్సులు మాత్రము మూఁడుగా నున్నను అవియన్నియు నొక్కమాఱే గ్రహింపఁబడవలసినవి. గ్రహించుటయు హోమార్థమే కావున గ్రహణమువలెనే హోమము కూడ నొక్కమాఱే యాచరింపఁ బడవలసి యగునేమో యని సంశయ ముదయించుచున్నది. పూర్వ మీమాంసాశాస్త్రమున నీసంశయ మీక్రిందివిధముగ నివారింపఁబడెను. ఇష్టిస్వరూపము నిర్ణయింపఁబడక మునుపే (యింద్రుఁడు) రాజాధిరాజ స్వరాజగుణభేదములతో గ్రహింపఁబడెను కావున నిచ్చట దేవత యొక్కటియే యనుటకు వీలులేదనియు *యాజ్యానువాక్యలును వ్యత్యాసముగ (అనఁగా నొకహోమమునందు యాజ్యగా నుండునది మఱియొక హోమమునం దనువాక్యగాను ఒకహోమమున ననువాక్యగా నుండునవి మఱియొక్కచోట యాజ్యగాను) విధింపఁబడియుండుటచే హోమములు నైక్యము నొందనేర వనియు వర్ణింపఁబడి యున్నవి. ఇట్లే యిచ్చటకూడ దత్త్వ మభిన్నమే యైనను ధ్యానము చేయఁదగిన యంశములు (ఆధ్యాత్మికత్వాధిదైవికత్వములు) భిన్నము లగుటచే దేవతాభేదము కలుగును. విద్యాస్వరూపనిర్ణయమునకుఁ బూర్వమే గుణభేద ముండుటచేఁ గర్మకాండమునందు (పైన వర్ణింపఁబడిన యిష్టియందు) కర్మభేదము కలదు గాని యిచ్చట మాత్ర మట్లు లేకపోవుటచే విద్యాభేదము లేదు.

* యజ యని చెప్పినపిదప పఠింపఁబడుమంత్రము యాజ్య యనియు, అను బ్రూహి యని చెప్పినపిదప బఠింపఁబడుమంత్ర మనువాక్య యనియు చెప్పఁబడును.

ఇంతమాత్రమున దేవతలు కూడ నైక్యము నొంద నక్కఱలేదు. ఉపక్రమోపసంహారాదులను విమర్శించిన "విద్యయొక్కటియే" యని తేలుచున్నది. ధ్యానవిధిని నిరూపించువాక్యములను విమర్శించిన దేవతాభేదంబును స్పష్టమగుచునే యున్నది. శ్రుతిప్రామాణ్యమువలన నీరెంటిని కూడ నంగీకరింపవలసినదియే. అగ్నిహోత్ర మొక్కటియే యైనను సాయంప్రాతః కాలములయందు వేర్వేరుగ తదుపాసన ప్రవర్తింపఁబడుచున్నట్లు భిన్నక్రమములు ననువర్తింపఁబడుచున్నట్లు ఇచ్చటకూడ ననువర్తింపఁబడవచ్చును. "నానావా దేవతా పృథగ్జ్ఞానాత్" "జ్ఞానభేదమువలన దేవతాభేదము కలుగును" అని సంకర్షణసూత్రమునందును నిర్ణయింపఁబడియున్నది. కావున నిస్సంశయముగా వాయుప్రాణములును వేఱువేఱుగనే కలుగవచ్చు నను నింతమాత్రమున పోలికగైకొనియే "ప్రధానవత్"అను దృష్టాంతము సూత్రకారునిచేఁ జెప్పఁబడెను. ఇంతయే గాని దృష్టాంత దార్ష్టాంతికములకు సంపూర్ణసామ్యము లేదు. అట్లుండవలసిన పనియు లేదు కదా!

---

## ౨౫. లింగభూయస్త్వాధికరణము

విషయ సంశయములు:—వాజసనేయశాఖయందు అగ్నిరహస్యమున నొక్కవిషయము కలదు. "నైవ వా యిద మగ్రే స దాసీత్" "ఈప్రపంచ మంతయు సృష్టికిఁ బూర్వమున సద్రూపము గాకుండెను. (ఇంద్రియములకు గోచరము కాకుండె నట)" అని యారంభించి యచ్చట సృష్టి చెప్పఁబడి యున్నది. మనస్సృష్టి చెప్పఁబడినపిదప నింద్రియసృష్టి వర్ణింపఁబడినతర్వాత నుపాసనార్థమై కల్పితము లగునగ్నులు కొన్ని చెప్పఁబడి యున్నవి. పురుషునియాయుస్సు నూఱుసంవత్సరములు; (ముప్పదియాఱువేల దినములు) ప్రతిదినమునందును జనించు చిత్తవృత్తులనేకముగ భావించి దాని నగ్నిగా కల్పించి "అగ్నులు ముప్పదియాఱు వేలు" అని చెప్పఁబడి యున్నది. ఒక్కొక్క యింద్రియముయొక్క

వృత్తుల నిట్లే భావించి యగ్నులుగఁ గల్పింపఁబడి యున్నవి. "తత్షట్ త్రింశత్సహస్రా ణ్యపశ్య దాత్మనోఽగ్నీ నర్కా న్మనోమయా న్మనశ్చితః" "సృజింపఁబడినపిదప నామనస్సు తనచేఁ గూర్పఁబడినట్టియు తానే స్వరూపముగఁ గలిగినట్టియు తనవృత్తులే యను నగ్నుల ముప్పదియారు వేలను చూచెను" అనియుఁ జెప్పఁబడి యున్నది. వాగాదీంద్రియములను గూర్చియు నిట్లే చెప్పఁబడి యున్నది. ఇట్లు చెప్పుటచే నీయగ్నులుపాసనార్థమై చెప్పఁబడె నని స్పష్ట మగుచున్నను, ప్రకరణము కర్మప్రకరణ మగుటచే "ఈయగ్నులకుఁ గర్మతో సంబంధ ముండునేమో" యను సంశయము జనించును. ఆసంశయ మిందు నివారింపఁబడును.

## అ-3. పా-3. -సూ ౪౪.

అవతారిక:—పై విషయమును విచారించి "యీయగ్నులు స్వతంత్రములే కాని కర్మకు సంబంధించినవి కావు" అనువిషయమును నిర్ణయించుటకై మొట్టమొదట సిద్ధాంతము నుపక్రమించుచున్నాఁడు.

## ౪౦౪. లింగభూయస్త్వా త్తద్ధి బలీయ స్తదపి. 3. 3. ౪౪.

తాత్పర్యము:—ఈయగ్నులు బుద్ధికల్పితములే యగుటచే నుపాసనకై స్వతంత్రముగ జెప్పఁబడినదే యగును కాని కర్మాంగములు కానేరవు. ఈవిషయమును నిరూపింపజాలులింగము లనేకము లా బ్రాహ్మణమునందుఁ గలవు. ఆయగ్నులనుగూర్చి చెప్పు నొకస్థలమున "తద్య త్కిం చేమాని భూతాని మనసా సంకల్పయ న్తి తేషా మేవ సా కృతిః" "జంతువులు ఏయేసంకల్పము నాచరించునో అవియే ఆయగ్నులకు స్వరూపము" అని పయిన వర్ణింపఁబడినవిషయము స్పష్టముగనే భోధింపఁబడుచున్నది. మఱియొకస్థలమునందును "సర్వదా సర్వాణి భూతాని చిన్వంతి" "ఆయగ్నులు యింద్రియవృత్తిరూపములే యగుటచే వీనిని సర్వజంతువులును సర్వకాలములయందును కూర్చుకొనుచునే యున్నవి" అనియు నీవిషయమే దృఢము చేయఁబడి యున్నది. ఇట్టిగురుతు లనేకము లుండుటచే నాయగ్నులు స్వతంత్రములే యని చెప్పుటయే యుక్తియుక్తము

కర్మప్రకరణమున నివి చెప్పఁబడిన వనుట యొక్కటియే కదా మీకు నాధారము! ఈలింగము ప్రకరణమునకంటె బలవత్తరము. ప్రకరణ సంబంధమాత్రమువలన వచ్చినసిద్ధాంతమును బాధింపఁగలదు. "శ్రుతి లింగవాక్య ప్రకరణస్థానసమాఖ్యానాం సమవాయే పారదౌర్బల్య మర్థవిప్రకర్షాత్" "శ్రుతి (స్పష్టముగ విషయమును బోధింపఁగలపదము) గురుతు వాక్యము ప్రకరణము పాఠక్రమము పేరు అనునివి యొక్కచో గూడెనేని వెనుకవెనుక నున్నవానికంటె ముందుముందుగ నున్నవి బలవత్తరము లగును" అని యీవిషయము పూర్వమీమాంసాశాస్త్రము నందు ప్రకటింపఁబడి యున్నది. ప్రకరణము లింగమునకంటె వెనుక నున్నదియే కదా! కావున నిర్వివాదముగ నీయగ్నులు స్వతంత్ర ములే.

---

## అ-౩. పా-౩. సూ-౪౫.

అవతారిక:—ఈసిద్ధాంతమును వృథపఱచుటకై రెండుసూత్రము లచేఁ బూర్వపక్షము ననువాదము చేయుచున్నాఁడు.

---

## ౪౫. పూర్వవికల్పః ప్రకరణాత్ స్యాత్ క్రియా మానసవత్. ౩. ౩. ౪౫.

తాత్పర్యము :—పైన చేయఁబడిన సిద్ధాంతము యుక్తియుక్త మైనది కాదు. ఆబ్రాహ్మణమునందు మొట్టమొదట గర్మకు సంబంధిం చినయగ్ని చెప్పఁబడియున్నాఁడు. ఈకారణమువలన నీయగ్నులు గూడ తద్భేదములే కావలయును. ఒకప్రకరణమున నొకవిషయమును గూర్చి చెప్పుచు నట్టనడుమ నాకస్మికముగ మఱియొకవిషయమును గూర్చి చెప్పుట యెందైనఁ గలదా? "లింగము ప్రకరణమునకంటె బలవత్తర మనియుఁ దదనుసారముగ సిద్ధాంతము గావింపవలయు ననియు, అది యగ్నిస్వాతంత్ర్యమునే ప్రకటించుచున్నది, యనియుఁ జెప్పియున్నాము కదా!" యనియెదవేమొ వినుము. నీవు చూపిన లింగమునకుఁ బ్రకరణ మును బాధించుసామర్థ్యము లేదు. ఎట్లనిన:—

సామర్థ్య మనియు అన్యార్థదర్శన మనియు లింగము రెండువిధ ములు. అందును శబ్దగత మనియు నర్థగత మనియు సామర్థ్యము కూడ రెండువిధములు. శబ్దగత మనఁగా శబ్దశక్తివలన నొకవిషయమును బోధించునది. అపూర్వము లగుదేవతానామముల బోధించుమంత్రము లన్నియు సామాన్యముగ నీజాతిలో చేరినవే. అర్థగత మనఁగా నర్థముచే నొకవిషయమును స్థిరపరుచునది. పదార్థసంఖ్యను దెలిసికొనుటకు నుప యోగించువచనాదులన్నియు నీజాతియందు జేరినవే. ఈ రెండువిధములుగ నర్థనిర్ణయమును గావించునదియే సామర్థ్య మనఁబడును. ఈలింగము మాత్రము స్వతంత్రముగఁ బ్రకరణమును బాధింపఁగలుగును. మీరు పైనుదహరించినలింగము నీజాతిలోఁ జేర నేరవు. అచ్చట స్వతంత్రముగ నగ్నుల స్వాతంత్ర్యమును దెలుపుశబ్దార్థము లెవ్వియు లేవు కదా! మఱియు నన్యార్థదర్శన మనఁగా మఱియొకప్రమాణముచే స్థిరపరుపఁ బడిన యర్థమును దృఢముచేయునది ఇదియుఁ బ్రమాణబలముచే నొకొ్కక్కసమయమునఁ బ్రకరణమును బాధింపవచ్చును కాని ప్రకృత లింగములు మాత్రమాజాతిలోఁ గూడఁ జేరినవిగాఁ దోపలేదు. ఇచ్చట "అగ్నులు స్వతంత్రములు" అనువిషయము మఱియొకప్రమాణముచే స్థిరపరుపఁబడి యుండలేదు కదా! ఇట్లుగాక వీని నీజాతిలో జేర్చినను మీసిద్ధాంతము నిలువదు. ఇవియు లింగములే కావునను సామర్థ్యరూప ములు కాకపోవుటవలనను ఈ రెండవజాతిలోఁ జేర్పఁబడవచ్చును గాన నింతమాత్రమున మీకు గలుగునుపకార మెద్దియు లేదు. అన్యార్థ దర్శనలింగములు స్తోత్రరూపములుగాఁగూడ నుండవచ్చును. బలవత్ప్ర మాణసిద్ధ మగువిషయమును దృఢముచేయుటకు స్తుతియైనను జాలును కదా! ఇట్లే ప్రకృతిలింగములును స్తుతిమాత్రము లైనచో మీకు నుప యోగ ముండదు. స్తుతివాక్యములు విధితో నేకవాక్యములే యగుటచేఁ బ్రకరణార్థమును మాత్రమే నుతింపఁగలవు కాని భిన్నార్థమును కాదు కదా! ఇట్లగుటచే నీయగ్నులు బుద్ధికల్పితములేయైనను క్రియతో సంబం ధించునవియే కావలయును. ప్రకరణమిట్లే బోధించుచున్నది కదా!

కర్మకాండమున నిట్టిదృష్టాంతము కలదు. మనోమయ మగువిష యము కర్మతో సంబంధించు ననుటకు నిదర్శనముకలదు. దశరాత్ర మను యాగమును వర్ణించునప్పుడు వేదము మానసికక్రియ నొక్కదాని గర్మాం

గముగ నుపదేశించి యున్నది. పదియవదినమునందు ప్రజాపతికై చేయఁ బడవలసినకర్మ యొక్కటి కలదు. అది సోమదానము. అందు భూమిని పాత్రము గాను సముద్రమును సోమరసము గాను భావింపవలయు నని శ్రుతి విధించుచున్నది. అప్పుడు చేయవలసిన తక్కిన క్రియల నన్నిటిని మానసికములనుగానే చేయవలయు నని బోధింపుచున్నది. ఈమానస క్రియలన్నియుఁ గర్మాంగములే యని పూర్వమీమాంసాకారులు నిర్ణయించి అట్లే యిచ్చట గూడ నగ్నిభావనారూపము లగు నీమానస క్రియలఁ గర్మాంగములనుగానే నిర్ణయించి తీరవలయును.

---

## ౪౦౬. అతిదేశాచ్చ. ౩. ౩. ౪౬.

తాత్పర్యము:—మఱియు "షట్ త్రింశత్సహస్రాణ్యగ్నయోఽర్కా స్తేషా మేకైక ఏవ తావా న్యావా నసౌ పూర్వః" "ఈచెప్పఁబడిన ముప్పదియాఱు వేలయగ్నులును పూజనీయులే. వీరిలో ప్రతివాఁడును మొట్టమొదటివానితో నన్నివిధములలోను సమానుఁడే (మొట్టమొదటివాఁడు కర్మార్థమై చెప్పఁబడినయగ్ని)" అని కల్పితాగ్నులకును వాస్తవాగ్నియొక్క ధర్మములే చెప్పఁబడి యున్నవి. కల్పితాగ్నియందు వాస్తవాగ్నిధర్మము లతిదేశింపఁబడి యున్నవి. సంబంధ మేమియు లేకున్న నిట్లు చేయుటకు వీలు లేదుకదా! కర్మతో సంబంధించుట యనునది తప్ప నితరవిధ మగుసంబంధము కూడ వీనికి (కల్పితవాస్తవాగ్నులకు) నుండుటకును వీలు లేదు కదా! కావున దీనిని పట్టి చూచినను కల్పితాగ్నులు కర్మతో సంబంధించు ననుట దృఢ మగుచున్నది.

సంగతి:—పూర్వాధికరణమునందు పరస్పర విరుద్ధధర్మములతో నేకధ్యానము సంభవింపదు కావునఁ దదర్థమై దేవతాభేదము స్థాపింపఁ బడెను. కాని యిచ్చటమాత్ర మట్లు కాదు. పైన నిరూపింపఁ బడిన హేతువులవలన కల్పితాగ్నులు సహితము కర్మమునఁ జేరు నని తేల్పఁబడి యున్నది. ఇచ్చట పరస్పరభిన్నములుగాఁగాన వచ్చుచున్నను దేవత లభిన్నములే యైనవి; పూర్వాధికరణయుక్తి యంతగా మేలైనది కాదు.

---

## అ_3. పా_3. సూ_౪౭.

అవతారిక :— అని యిట్లు ప్రత్యుదాహరణసంగతితో వచ్చిన పూర్వపక్షమును ఖండించు చున్నాఁడు.

---

## ౪౦౭. విద్యైవ తు నిర్ధారణాత్. 3. 3. ౪౭.

తాత్పర్యము:—ఈపూర్వపక్షము యుక్తియుక్త మైనది కాదు. కల్పితాగ్నులు స్వతంత్రములే యని శ్రుతియే స్పష్టము చేయుచున్నది. "తే హైతే విద్యాచిత ఏవ విద్యయా హైవైత ఏవం విద శ్చితా భవంతి" "ఈయజ్ఞులు విద్యచేత మాత్రమే కూర్పఁబడునవి. ఈవిధముగ నెవ్వఁ డెఱుంగునో వానివిద్యచేతనే (ఉపాసనచేతనే) యవి కూర్పఁబడినవి యగును" అని యీవిషయమును గూర్చి శ్రుతి చెప్పుచున్నది. కర్మ సంబంధ మేమియు లే దని దీనిచే స్పష్ట మగుచున్నది కదా!

## ౪౦౮. దర్శనాచ్చ. 3. 3. ౪౮.

తాత్పర్యము:—మఱియు నీవిషయమును నిరూపించుటకై లింగములు కల వని "లింగభూయస్త్వాత్. 3. 3. ౪౪." అనుస్థలమున నిదివఱకే వివరించి యున్నాము.

## అ_3. పా_3. సూ_౪౯.

అవతారిక:_"ఈరెండుసూత్రములయందును చెప్పఁబడిన హేతువులు యుక్తియుక్తములు కావు. 'అవిదో్యచిత ఏవ' అను నవధారణ శ్రుతికాని 'ఏవంవిద శ్చితా భవంతి' అని కల్పితాగ్నులకు పురుషసంబంధమును తెల్పువాక్యముగాని ప్రకరణమును బాధింపనేరవు. అవధారణ శ్రుతి బాహ్యసాధనములను కూడ నిషేధించి యుండవచ్చును; ఈకల్పితాగ్నుల నుపాసించుటకు (సేవించుటకు) విద్యకంటె నితర మగు సాధనము లేదు' అని చెప్పవచ్చును. కదా! ఇఁక వాక్యంబును అనావ్యర్థదర్శనమే యగుటచేఁ బ్రమాణాంతరమువలన సిద్ధ మగు పదార్థమును గూర్చి చెప్పవలసినదియే యగుటచే స్వతంత్రముగఁ గల్పితాగ్నులకు వచ్చుకర్మశేషత్వమును నివారింపఁజాలదు. లింగమునుగూర్చి యిదివఱకే సవిస్తరముగఁ

జెప్పియున్నాము. ఇట్లుండ నేయాధారమును గైకొని ప్రకరణమును బాధింపఁబోవుచున్నారు?" అనిన జెప్పుచున్నాఁడు.

## ౪౦౯. శ్రుత్యాదిబలీయస్త్వాచ్చ న బాధః.

### ౩. ౩. ౪౯.

తాత్పర్యము:—కేవలప్రకరణము నాశ్రయించి "మనశ్చిదాద్యగ్నులు స్వతంత్రములు కావు" అని చెప్పుట యుక్తము కాదు. పై నుదహరింపఁబడిన శ్రుతిలింగవాక్యములు ప్రకరణమును బాధించి మాయభిప్రాయమును స్థిరము జేయును. శ్రుతిలింగసూత్రము విమర్శించి చూచిన ప్రకరణమునకంటె శ్రుతిలింగవాక్యములు మూఁడును బలవత్తరములే కదా! అనాన్యార్థదర్శనము లగునవి యొకవిధి నపేక్షించి యుండుటచేఁ బ్రకరణమును బాధింపలేకున్నను యీశ్రుతిలింగాదులు బాధింపవచ్చును. విచారించి చూచిన వీనియందు విధ్యుద్దేశ మున్నట్లు గానవచ్చుట లేదు కదా! ఇవి స్వతంత్రముగ నొకానొక భిన్నవిషయమును బోధించుచున్నవి యనుట స్పష్టముగ నున్నది. * "వచనాని త్వపూర్వత్వాత్" అనున్యాయము ననుసరించి వీనియందు విధియొక్కటి కల దనియే యూహింపవలసి యున్నది. ఈకారణమువలన వీనియం దేయేయర్థము చెప్పఁబడెనో దానిదాని నట్లే యంగీకరింపవలయును.

"విద్యాచిత ఏవ" అనునది శ్రుతి. ఇందు అవధారణము కలదు. కావున "మనశ్చిదాద్యగ్నులు ఉపాసనకై జెప్పఁబడినవే కాని కర్మతో సంబంధించునవి కావు" అనుట స్పష్ట మగుచున్నది. ఇట్లు కాకున్న నా యవధారణశ్రుతికి బాధ కలుగవలసి వచ్చును. "అది బాహ్యార్థనిషేధమును చేయుటకై ప్రవర్తించె నంటిని కదా!" యనియెదవేమొ యది

* "వచనాని త్వపూర్వత్వాత్" అనున్యాయమునకు "అతిప్రసిద్ధమై మఱియొక ప్రమాణముచేఁ దెలియఁబడనిదై యుండువిషయమున కేవల శ్రుతిని మాత్రమే యాధారము చేసి తక్కిన లింగాదుల బాధించి సిద్ధాంతముఁ జేయవలయును. శబ్దప్రమాణ మపూర్వవిషయములను బోధించుటకై ప్రవర్తించునదియే కదా" అని యభిప్రాయము. ఈన్యాయము ననుసరించి వర్తమానక్రియ లున్నస్థలములయందుఁ గూడ నపూర్వార్థ మును చెప్పునప్పుడు విధిని కల్పింపవచ్చును.

సంభవింపదు. "విద్యాచితః" అని కేవలవిద్యను గ్రహించుటచేతనే బాహ్యసాధనములు తొలఁగి పోయినవి ; విద్యచేత మాత్రమే యీమనశ్చిదాద్యగ్నులు కూర్పఁబడవలయు నని తేలినది. ఇట్లుండ నిఁక నీవిషయమును నిర్ణయించుటకై ప్రత్యేకముగా నవధారణ మేల ? ఈకారణము వలన నాయవధారణముచే నిషేధింపఁబడవలసినయర్థము వేఱుగనే యుండి తీరవలయు నని తోఁచుచున్నది. మనశ్చిదాద్యగ్నుల సంపాదించుటకు బాహ్యసాధనములతోఁ బని లేదని తెలిసినను "ఈయగ్నులకు కర్మతో సంబంధ ముండునేమో" యనుసంశయము ప్రకరణబలమున గలుగును. దశరాత్రయాగమునందు గల మనోమయవిధానములను మీరేదృష్టాంతముగఁ జూపియున్నారు కదా ! కావున దానిని నివర్తింపఁ జేయుటయే యీయవధారణమునకు విషయ మని నిర్ణయింపవలసియున్నది. ఇట్టినిర్ణయము లేకున్న నిరర్థకముగ నీశ్రుతి బాధింపఁబడవలయును కదా ! కావున శ్రుతిచే నగ్నిస్వాతంత్ర్యము దృఢపఱుపఁబడెను.

"సర్వదా సర్వాణి భూతాని చిన్వంతి" అనునది లింగము. "మనశ్చితాద్యగ్నులు సర్వకాలములయందు సంపాదింపఁబడుచునే యుండును." అని యీలింగము తెలుపుచున్నది. ఈకారణమువలన కౌషీతకీబ్రాహ్మణోపనిషత్తునందలి యొకానొకసందర్భమునందు నిర్ణయించినట్లు ఇచ్చటఁగూడ విద్యకు స్వాతంత్ర్యమునే నిర్ణయింపవలయును. ఆయుపనిషత్తునం దొకస్థలమున వాక్ప్రాణముల నగ్నులుగా నిరూపించి చెప్పి వానియందు పరస్పరము హోమమును జెప్పి "ఏతే అనంతే అమృతే ఆహుతీ జాగ్రచ్చ స్వపం శ్చ సతతం జుహోతి" "ఈయాహుతులు రెండును ఆద్యంతములు లేనివి. అమృతమయము లైనవి. వీనిని జాగ్రదవస్థయందును స్వప్నావస్థయందును కూడ సర్వకాలములయందును పురుషుఁ డాచరించుచునే యుండును. (వాక్ప్రాణములకుఁ గలసంబంధ మిట్టిదియే కావున నిట్లు చెప్పఁబడెను.)" అని యాహోమమునకు సాతత్యమును (అవిచ్ఛిన్నత్వమును) శ్రుతి చెప్పుచున్నది; అచ్చట విద్యాస్వాతంత్ర్యము కూడ నిర్ణయింపఁబడి యున్నది. ఇచ్చటఁ గూడ నిట్లే నిర్ణయింపఁబడవలయును. అగ్నులకు క్రియాసంబంధమే యుండునేని ఇట్టియవిచ్ఛిన్నత్వమును సంభవింపదు. కర్మప్రయోగ మల్పకాలమునకే ముగియును కదా ! కావున నీలింగమునకుఁ గూడ నగ్నిస్వాతంత్ర్యమును స్థాపించుటయందు సామ

ర్థ్యము కలదు. "ఇది యర్థవాదము కాఁగూడదా?" అనియెదవేమొ వినుము. విషయము శ్రుతిలింగాదులచే విస్పష్టముగ విశదము చేయఁబడి యుండునేని యప్పుడు దానినిఁగూర్చి సామాన్యముగ జేయఁబడినప్రస్తావము లర్థవాదము లగును కాని యిచ్చట నట్లు కానేరదు. ఇచ్చట మనశ్చితాద్యగ్నులనుగూర్చి స్పష్టముగా వర్ణించు శ్రుతిలింగాదులు లేవు కావున కేవలవర్ణనమునుబట్టియే సర్వము నూహింపఁబడవలసి యున్నది. ఈకారణమువలన నీలింగ మర్థనిర్ధారకమే యగును కాని యర్థవాదము కానేరదు. ఈవిధముగనే "త ద్యత్కిం చేమాని భూతాని మనసా సంకల్పయంతి తేషా మేవ సాకృతిః" అనులింగముకూడ నర్థనిర్ధారకమే యగును. అదియు నితరశ్రుత్యాదులచే నిరూపింపఁబడని విషయమును గూర్చియే చెప్పుచున్నది కదా! కావున నీలింగములసామర్థ్యమువలనఁ గూడ నగ్నిస్వాతంత్ర్యమే స్పష్ట మగుచున్నది.

ఇట్లే "ఏవం విదే" అని యగ్నులకు పురుషసంబంధమును తెల్పు వాక్యముకూడ నీవిషయమునే స్పష్టము చేయుచున్నది. లింగములవలెనే యిదియు నన్యశ్రుత్యాద్యనిరూపితపదార్థమును చెప్పునదియే కావున స్వాతంత్ర్యము కలదియే. ఈకారణమువలన దీనియర్థమునుఁగూడ యథాశ్రుతముగానే గ్రహింపవలయును. అట్లు గ్రహించిన నీమనశ్చిదాద్యగ్నులు ప్రత్యేకపురుషసంబంధము కలవి యగుటచే స్వతంత్రములే యగును. కావున నెట్లు చూచినను అగ్నులు స్వతంత్రములే.

## అ-౩. పా-౩. సూ-౫౦.

అవతారిక:—ఈవిషయమును నిర్ణయించుటకై మఱియొకకారణమును చెప్పుచున్నాఁడు.

## ౪౧౦. అనుబంధాదిభ్యః ప్రజ్ఞాంతర పృథక్త్వవ దృష్టశ్చ తదుక్తమ్. ౩. ౩. ౫౦.

తాత్పర్యము:—మఱియు నీవిషయమును నిర్ణయించుటకు ననేక హేతువులు కలవు. ఎట్లును ప్రకరణము నాశ్రయించుటకు వీలు లేదు. మనశ్చిదాదులనుగూర్చి చెప్పునప్పుడు వేదము కర్మాంగముల నన్నిటిని

మనోవ్యాపారములచేతనే కల్పించుచున్నది. "మన సైవాధీయంత మన సాచీయంత మనసైవ గ్రహా అగృహ్యంత మన సాఽస్తువన్మన సాఽశంసన్యత్కించ యగ్నే కర్మ క్రియతే యత్కించ యజ్ఞియం కర్మ మన సైవ తేషు తన్మనోమయేషు మనశ్చిత్సు మనోమయ మేవ క్రియతే" "మనస్సుచేతనే ఆధానము చేయవలయును. అగ్నులఁ గూర్పవలయును. పాత్రముల గ్రహింపవలయును. స్తోత్రముచేయవలయును. ప్రశంసింపవలయును. మఱియు యజ్ఞమున తదంగము లగుకర్మ లేవేవి చేయఁబడునో అవియన్నియు మనోమయము లగుమనశ్చిదాదులవిషయమున మనోమయములుగానే చేయఁబడవలయును" అనుమొదలగువాక్యములయం దీవిషయము స్పష్టముగా నున్నది. ఈయగ్నులకు కర్మసంబంధ ముండు నేని యిట్లు చెప్ప నక్కఱలేదు. అప్పుడు ఆధానాదులు ప్రత్యక్షముగనే యింద్రియములతో నాచరింపఁబడవచ్చును కదా! కావున నీయవయవములు కల్పింపఁబడిన వనియు నగ్నులకును క్రియాసంబంధ మీకారణము వలన లేదనియుఁ జెప్పి తీరవలయును. "ఇట్లు లేకున్నను మఱియొక విధముగా నైనఁ గ్రియాసంబంధ ముండవచ్చును. ఉద్గీథోపాసన గర్మాంగమును గూర్చివిధింపఁబడినది యగుటచే ననిత్యముగ నైనను గర్మతో సంబంధించునట్లు ఈయుపాసనయు సంబంధింపవచ్చును" అనియెదవేమొ వినుము. ఇచ్చట నావిషయమును దెల్పుశ్రుత్యాదు లెవ్వియు లేవు. ఇచ్చట నున్నవిధానము లేక విధము భిన్నముగ నున్నది. ఇచ్చట దేనినైన యొక కర్మాంగమును గైకొని "దీని నీనామముతో నుపాసింపవలయును" అని చెప్పఁబడి యుండలేదు కదా! ప్రకరణారంభమున కర్మను విధించియే యున్నను దానికి సంబంధింపనిమనోవృత్తుల మాత్రమే గ్రహించి వానియం దగ్నిత్వము నారోపించి మాత్రమే చెప్పుచున్నది కదా! పురుషవిద్యయందువలె యజ్ఞావయవముల నన్నిటిని గూడ నట్లే కల్పించి యున్నది కదా! కావున నుద్గీథాద్యుపాసనలవలె నీయుపాసన కర్మాంగోపాసన కానేరదు. కర్మతో నెట్లును సంబంధింపనేరదు. ఈకారణమువలన నగ్నులు స్వతంత్రములే కావలయును. క్రియాసంబంధముండిన క్రియాంగముల గల్పింపవలసినపని లే దని యదివఱకే నిరూపించియున్నాము.

ఇట్లే అతిదేశాదులవలనఁగూడ నగ్నిస్వాతంత్ర్యము నిర్ణయింపఁబడవచ్చును. "తేషా మేకైక ఏవ తావా న్యావా నసౌ పూర్వః" అను

వాక్యము ముఖ్యాగ్ని ప్రభావమును కల్పితాగ్నులకుఁ జెప్పుచున్నది కదా! దీనిని పట్టిచూచిన నీవాక్యమునకు కర్మయం దాదరమే లేదని తెలియ వచ్చుచున్నది. "కలదు" అనినచో విరోధమువచ్చును. ముఖ్యాగ్ని క్రియా మయమైనది; మనశ్చిదాదులు జ్ఞానమయము లైనవి. పై యతిదేశవాక్య మునకు "జ్ఞానమయము లగుమనశ్చిదాదులకుఁ గూడఁ గర్మతో సంబం ధము కలదు" అనునభిప్రాయ ముండునేని యప్పుడు రెండగ్నులును సర్వ విధముల సమానములే కావలయును. యజ్ఞకర్మమునందు ప్రత్యక్షాగ్ని యేయేవిధముల నుపయోగింపఁబడునో ఆయావిధములతో జ్ఞానమయా గ్నులు కూడ నుపయోగింపఁబడవలయును. ఇది సంభవింప దనుట నిర్వి వాదమే కదా! సంభవింపకపోయిన శ్రుతి యప్రమాణము కావలసి వచ్చును. అసంభవార్థమును ప్రకటించునది యగునేని శ్రుత్యభిప్రాయము నకు సార్థకత్వ మెట్లు కలుగును? ఈకారణమువలన పై శ్రుతికిఁ గర్మవిష యమున ననాదరమే కల దని యంగీకరించి తీరవలయును. ఇట్లు చెప్పు టచే నలుబదియైదవసూత్రమునఁ జెప్పఁబడినవికల్పము కూడ ఖండింపఁ బడిన ట్లయినది. వికల్ప మనఁగా ప్రస్తావింపఁబడినపదార్థములలో దేనితో నైనఁ గార్యనిర్వాహము కలుగు నని నిరూపించుటయే కదా! ఇచ్చట ముఖ్యాగ్నితో గలుగుకార్యనిర్వాహము మనోమయాగ్నితో గలుగ దని నిరూపించియే యున్నాము. "సామాన్యము లేకున్న నతిదేశము సంభవింపదు కావున ముఖ్యజ్ఞానమయాగ్నులకు సామాన్యముండవలయు ననియు అదియే కర్మాంగత్వ మనియుఁ జెప్పితిమి కదా" యనియెదవేని వినుము. సామాన్య ముండవలయు ననుట నిశ్చయమే కాని యది కర్మాం గత్వరూప మైనదిగనే యుండవలయునని నియమము కలదా? మాపక్షు మున నది యగ్నిత్వరూపమైనదియే. కల్పింపఁబడినను మనోమయాగ్నులు కూడ నగ్నిశబ్దవాచ్యములే కదా! ఈకారణమువలన నాశ్రుతి ముఖ్యాగ్ని ధర్మముల గల్పితాగ్నియం దతిదేశించుచున్నది. కావున నీయతిదేశము కూడ మాపక్షమునే దృఢము చేయును. కావున తమతమలక్షణములతోఁ గూడిన శాండిల్యాదివిద్యలు కర్మలకంటెను నితరము లగునుపాసనల కంటెను ఎట్లు భిన్నములో అట్లే యామనశ్చిదాద్యగ్నులును కర్మకంటె భిన్న ములే. శ్రుతిలింగాదులు ప్రకరణమును బాధించు నని మున్నే చెప్పియు న్నాము.

కర్మకాండమునందును యిట్టిసృష్టాంతము లనేకములు కలవు. రాజసూయయాగమును గూర్చి చెప్పునప్పుడు అవేష్టి యనునొక యిష్టి వర్ణింపఁబడియున్నది. దానిని వర్ణించునప్పుడు "అవేష్టిని మూఁడువర్ణముల వారు (బ్రహ్మక్షత్రియవైశ్యులు) నాచరింపవచ్చును" అని చెప్పఁబడి యున్నది. ప్రకరణారంభమున "రాజసూయము క్షత్రియులచేఁ జేయఁ బడఁదగినయజ్ఞము" అని నిర్ధారణ చేయఁబడి యున్నది. ఇట్లున్నను పూర్వ మీమాంసయందు "అవేష్టిరాజసూయప్రకరణమున నున్నను దానికంటె భిన్నమయినది" అని సిద్ధాంతము చేయఁబడియున్నది. వర్ణత్రయమునకు నాయిష్టియం దధికారము జెప్పఁబడి యుండుటయే యీసిద్ధాంతమునకు హేతువుగ వర్ణింపఁబడి యున్నది. "క్రత్వర్థాయా మితి చేన్న వర్ణత్రయ సంయోగాత్" "రాజసూయార్థమయి చెప్పఁబడి యుండుటచే నీయిష్టి తద్భిన్నము లేక తదధికము కాదు" అనియెదవేమొ యది యుక్తము కాదు. 'ఆయిష్టియందు వర్ణత్రయమునకు నధికారము కలదు' అనుసూత్రముచే నీవిషయము సిద్ధాంతము చేయఁబడియున్నది. కావున ప్రకృతవిషయ మునఁగూడ నిట్లే విచారింపవలయును; మనశ్చిదాదులు కర్మాంగములు కావనియే సిద్ధాంతము చేయవలయును.

## అ-3. పా-3. సూ-౫౧.

అవతారిక:—"దశరాత్రయాగమునందు మనోమయము లగు పదార్థములు చెప్పఁబడి యాకర్మకే యంగములై యున్నట్లు ఇచ్చటి మనోమయాగ్నులుకూడ కర్మకే యంగములు కావలయును." అను పూర్వ పక్షభాగ మీసూత్రమున ఖండింపఁబడుచున్నది.

## ౪౧౧. న సామాన్యాదప్యుపలబ్ధేర్మృత్యువ న్న హి లోకాపత్తిః. 3. 3. ౫౧.

తాత్పర్యము:—యజ్ఞాంగము లగుమానసవిధానములవలె మనశ్చి దాద్యగ్నులు కర్మాంగములు కానక్కఱ లేదు. ప్రత్యేకముగ పురు షార్థరూప మగుస్వతంత్రఫలము లేనప్పుడు మాత్రమే యొకదానిని మఱి యొకదానికి నవయవముగఁ గల్పింతు రనుట లోకప్రసిద్ధము. పై నిరూ

పింపఁబడిన శ్రుత్యాదులవలన నీయగ్నులగు (అగ్నియుపాసనకు) ప్రత్యేక ఫలము కలదని సిద్ధాంతమగుచున్నది. నిష్ఫలముగ నేదియు విధింపఁబడి యుండదు కదా! ఈకారణమువలన వీనికిని ఇతరములైన యజ్ఞాంగ మానసవిధులకును సంబంధము లేదు. ఈరెంటిస్థితియు నొక్కవిధముగనే యుండవలయు ననునియమము లేదు. "రెండును మానసవిధులేకదా!" అనియెదవేమో. ఎట్టిపదార్థములకైనను ఏదియో యొకవిషయమునఁ గొంతపోలిక యుండవచ్చును. ఇంతమాత్రమువలన పోలికగలవి రెండును సర్వవిషయములయందు సమానములే కావలయు నని నియమించుటకు వీలు కలదా?

చూడుము. "స వా ఏష ఏవ మృత్యుర్య ఏష ఏతస్మిన్ మండలే పురుషః. అగ్నిర్వై మృత్యుః" "ఈసూర్యమండలమున నేపురుషుఁడు ప్రకాశించుచున్నాఁడో వాఁడే మృత్యువు. అగ్నిహోత్రుఁడే మృత్యువు" అని ఆదిత్యపురుషాగ్నిపురుషులయందు మృత్యునామము సమానముగనే యున్నను వారికి సంపూర్ణమగుపోలిక గలుగుచున్నదా? "అసౌ వావ లోకో గౌతమాగ్నిస్తస్యాదిత్య ఏవ సమిత్" "ఓగౌతముఁడా, ఈద్యులోకమే యగ్ని; దానికి సూర్యుఁడే సమిధలు" అను వాక్యము యొక్క యర్థమును విచారించిన సమిధలు మొదలగువానిచే నగ్నికిని ద్యులోకమునకును పోలిక యున్నది గాని యింతమాత్రమున ద్యులోక మగ్నియగుచున్నదా! "వీఁడు పశువు" అనువాక్యముయొక్క యర్థమును విమర్శించినఁ బశువునకును పురుషునకును మూఢత్వమునఁ బోలికయున్నను అభేదము కలదా? కావున నేదియో యొకధర్మమున నించుక పోలిక యున్నను అంతమాత్రమున స్వభావసిద్ధ మగువైషమ్యము నశింపదు. కావున మనశ్చిదాద్యగ్నులు యజ్ఞాంగమానసవిధివంటివి కానక్కఱలేదు.

---

## ౪౧౨. పరేణ చ శబ్దస్య తాద్విధ్యం భూయస్త్వాత్త్వనుబంధః. ౩. ౩. ౫౨.

తాత్పర్యము:—మఱియు ప్రస్తుతప్రకరణమునకుఁ బూర్వోత్తర ప్రకరణములయందు విద్యలే వర్ణింపఁబడి యున్నవి కాని కర్మలు కావు.

ఉత్తర ప్రకరణమునందు "విద్యయా త దారోహంతి యత్ర కామాః పరా గతాః న తత్ర దక్షిణా యంతి నా విద్వాంస స్తపస్వినః" "ఏస్థలమున సర్వ కామములును పరిపూర్ణము లగునో అచ్చటికి నుపాసకులుగాని పోవరు. దక్షిణమార్గము ననుసరించిన కర్మకులుగాని తపోవంతులుగాని యచ్చటికి బోవరు." అనువాక్యముచే కర్మనిందాపూర్వకముగా విద్యను నుతించుచు "విద్యయే యీ ప్రకరణమునకు తాత్పర్యము" అనువిషయమును శ్రుతి బోధించుచున్నది. పూర్వ ప్రకరణమునందును "సోఽమృతో భవతి" "వాఁడు (ఉపాసకుఁడు) ముక్తినొందును" అని విద్యాఫలము నభివర్ణించుచు ప్రకరణము ముగియుటచేత దానికిని విద్యయే తాత్పర్య మని తేలుచున్నది. ఇట్లు పూర్వోత్తర ప్రకరణములందు విద్యాపరములే యై యుండ నడుమ నాకస్మికముగ కర్మపర ప్రకరణ మెటునుండి వచ్చును? ఈకారణమువలనఁ గూడ మనశ్చిదాద్యగ్నులు స్వతంత్రములే. "అగ్న్యవయవముల నధిక ముగ కల్పింపవలయు ననునుద్దేశముతోఁ జెప్పఁబడిన యుపాసనయే యగు టచే దీనికి నగ్నిసంబంధము కలిగెను గాని మఱియొకకారణమునఁ గాదు. ఈకారణమువలన ప్రస్తుత ప్రకరణమునకుఁ గర్మను గూర్చి చెప్పవలయు ననునుద్దేశమే లేదు. మనశ్చిదాద్యగ్నులు స్వతంత్రములే.

---

## ౩౦. ఐకాత్మ్యాధికరణము.

విషయ సంశయములు :— ఈయధికరణమున "ఆత్మ దేహవ్యతి రిక్తుఁడు" అనువిషయము సిద్ధాంతము చేయఁబడును. ఇట్లు చేసినఁగాని బంధమోక్షాదులు సిద్ధింపవు. దేహాతిరిక్తుఁ డగునాత్మ లేకపోయినయెడల పూర్వకాండ మెవ్వనిఁ గూర్చి కర్మల బోధించును? ఉత్తరకాండ మెవ్వనిఁ గూర్చి బ్రహ్మాత్మత్వమును ప్రదర్శించును? ఎవ్వనిఁ గూర్చి స్వర్గ బ్రహ్మలోకప్రాప్తులఁ బ్రకటించును? కావున నిర్వివాదముగ నీయధికరణ మారంభింపఁబడవలసినదియే. "ఈవిషయము పూర్వమీమాంసా శాస్త్రమునందే చెప్పఁబడెను కదా!" అనియెదవేమో అది యథార్థమే. అయినను అచ్చట నీవిషయమును భాష్యకారుఁడు చెప్పెనే కాని

సూత్రకారుఁడు చెప్పలేదు.ఇచ్చట మాత్రము సూత్రకారుఁడే యాక్షేప సమాధానములతో నీవిషయమును సంస్థాపించుచున్నాఁడు. ఇచ్చట నుండియే యాకర్షించి పూర్వమీమాంసాభాష్యకారుఁ డగుశబరస్వామి యచ్చట (పూర్వమీమాంసాశాస్త్రారంభమున) నీవిషయము నభివర్ణించి యున్నాఁడు. ఈకారణమువలననే ఉపవర్షుఁడు పూర్వమీమాంసాశాస్త్రమునకు వ్యాఖ్యానముఁ జేయుచు దేహవ్యతిరిక్తాత్మను వర్ణింపవలసి వచ్చినప్పుడు "ఈవిషయమును శారీరకమీమాంసయందు (బ్రహ్మసూత్రమునందు) వర్ణించెదము" అని యుపరమించెను. ఈకారణమువలన నీవిషయ మవశ్యము విచారింపఁదగినదియే. "దేహాత్మలకు భేదము కలదా ? లేదా ?" యనుసంశయము నివారింపఁబడవలసినదియే.

సంగతి:— ఈపాదమున మొట్టమొదటినుండియు నుపాసనలే విచారింపఁబడుచు వచ్చెను గదా! ఆయుపాసనలకు బ్రహ్మలోకప్రాప్తియే ఫల మగుటవలన దేహాభిన్నుఁ డగునాత్మ యొక్కఁడు లేకపోయిన నది సంభవింపదు కావున "ఆత్మ దేహాభిన్నుఁడా ? కాఁడా ?" యనువిషయము ప్రస్తావసంగతితో నీయధికరణమున విచారింపఁబడును. మఱియుఁ బూర్వాధికరణమున "మనశ్చిదాద్యగ్నులు పురుషార్థసాధనము లగుటచే స్వతంత్రములు." అని సిద్ధాంతము చేయఁబడి యున్నది. దానిపై "పురుషుఁ డనఁగా నెవ్వఁడు? ఈయగ్ను లెవ్వనికి ఫలసాధనములై యున్నవి" అని యాకాంక్ష కలుగఁగా దానిని నివారించుటకై ఈయధికరణ మారంభ మైనది.

## అ_౩. పా_౩. సూ_౫౩.

అవతారిక:— ఈవిషయమును నిర్ణయించుటకై మొట్టమొదట నాక్షేపము ననువాదము చేయుచున్నాఁడు. ఆక్షేపపూర్వకముగ వివరింపఁ బడిననే కదా శిష్యులకు శాస్త్రార్థజ్ఞానము దృఢముగా కలుగుట !

## ౪౧౩. ఏక ఆత్మనః శరీరే భావాత్. ౩. ౩. ౫౩.

తాత్పర్యము:— లోకాయతమతస్థు లీవిషయమున నీక్రిందివిధముగ నభిప్రాయపడుచున్నారు. పరలోక మనునది లేదు. అచ్చటికిఁ బోవుటకై శరీరవ్యతిరిక్తుఁ డగునాత్మయు లేఁడు. శరీరమే యాత్మ. పృథివ్య

స్తేజోవాయువులు నాల్గు మాత్రమే భూతములు. ఈభూతములయందు ప్రత్యేకముగ చైతన్యము లేకున్నను అన్నియు గలసినప్పుడు కలుగును. మద్యము చేయుటకు సాధనము లగుపదార్థములలో నొక్కదానియందైనను ప్రత్యేకముగా మదశక్తిలేకున్నను వానిసంయోగమువలనఁ గలుగునట్లు ఈచైతన్యముకూడ భూతసంయోగమువలనఁ గలుగును. ఇదియే మన కనుభవములో నున్న జ్ఞానమునకు నుత్పత్తిప్రకారము. జ్ఞానచైతన్యపదములు పర్యాయనామములే కదా ! ఆభూతములయొక్కసంయోగమువలననే దేహము జనించును; జ్ఞానముకూడ నట్లే జనించును. కావున నది (జ్ఞానము) దేహధర్మమే. ఈకారణమువలననే "నేను ఎఱ్ఱనివాఁడను" అను మొదలగు వ్యవహారములు శరీరమునకే సంబంధించుచున్నవి. శరీరమునకంటె భిన్నుఁ డగునాత్మ యుండి యీవ్యవహారము లన్నియు నాతనికే సంబంధించునేని యప్పుడు ఈప్రత్యక్షము భగ్న మగును. ఒకపాత్రములో జలము వైచియుంచిన నంతమాత్రమున జలగుణములు పాత్రమునకు కలుగునా ? కావున నెట్లును దేహభిన్నుఁ డగునాత్మ లేఁడు. మఱియు "నేను నడచుచున్నాను" అనునప్పుడు నడచునది దేహమే కాని తద్భిన్నపదార్థము కాదు కదా ! అహంశబ్దార్థము దేహమే యైనయెడల నిది సరిపడును కాని కా కున్న నెట్లు యుక్త మగును ?

"ఈయాత్మ ప్రత్యక్షుఁడు కాకున్నను అనుమానముచే సాధింపఁబడును" అనియెదవేమొ అదిబొత్తుగనే సంభవింపదు. ప్రత్యక్షమున లేనిపదార్థమనుమానముచే నెట్లు నిర్ణయింపఁదగియుండును? విచారించినఁ బ్రత్యక్షమొక్కటియే ప్రమాణముగాని తక్కినవి కావు. "దేశకాలాదిరూపాణాం భేదాద్భిన్నాసుశక్తిషు, భావానా మనుమానేన ప్రసిద్ధిరతిదుర్లభా" "దేశకాలాది భేదములతో ప్రాపంచికశక్తులు క్షణక్షణమునకు భేదించుచుండును. ఈకారణమువలన నేదియో యొకలక్షణమునో కార్యమునో పట్టి చేయఁబడు ననుమానమువలన వస్తుప్రసిద్ధి తెలియఁబడు ననుట సంభవింపదు." అని మహాత్ములు చెప్పియున్నారు. తనుచూచినతోడనే తన కాశ్రయమగు పదార్థమును స్పష్టము చేయఁబడినలింగమే (అనుమానప్రమాణమునకు సాధనమగు హేతువే) ఇట్లయిన నిఁక తక్కిన ప్రమాణములనుగూర్చి యేమి చెప్పవలయును? శబ్దప్రమాణ మూరక నప్రత్యక్షవిషయములఁ జెప్పునది.

అర్థాపత్తి మనస్సునకుఁగూడ విస్పష్టముగ గోచరముగాని యతిపరోక్ష విషయమును ప్రతిపాదించునది. ఉపమానప్రమాణముసుగూర్చి విచారింపఁబోయిన దానిస్థితి యన్నిటికంటె కష్టతరము. ఆప్రమాణము నాచరించినవాఁడు ఒకదానిపోలికవలనఁగదా మఱియొకపదార్థమును గ్రహింపవలయును; ఆపోలిక సర్వసామ్యరూపమా ? లేక దేశసామ్యరూపమా ? (అనఁగా: వాఁడు మొట్టమొదట గ్రహించియున్న పదార్థమునకును గ్రహింపఁబోవుపదార్థమునకును అన్ని విధములయందును పోలికయుండునా? లేక కొన్ని విధములలో మాత్రమే యుండునా?) సర్వసామ్యరూపమైనచో పదార్థభేదమే సంభవింపదు; కావున నప్పుడు ప్రమాణముతోనే పనిలేదు. తాను చూచినపదార్థమునకంటె భిన్నపదార్థము గ్రహించుటకే కదా ప్రమాణము నాశ్రయించుట ! ఇట్లు కాక నది యేకదేశసామ్యరూపమే యగునేని యప్పుడు నియమమే లేకపోవును. అన్ని పదార్థములకును ఏదియో యొకవిషయమునఁ బోలిక యుండనే యున్నది కదా ! కావునఁ బ్రత్యక్షమే ప్రమాణము; దానిచే నెఱుఁగఁబడలేదు కావున శరీరవ్యతిరిక్తుఁ డగునాత్మ లేఁడు.

శుభము కలుగుటకును, అశుభము తొలఁగుటకును బహువిధ కార్యముల నాచరించుట ఉచ్ఛ్వాసనిశ్వాసములు సుఖదుఃఖములు ఇచ్ఛాద్వేషాదులు మొదలగునవియన్నియు శరీరధర్మములే. ఆత్మవాదులు మాత్రము వీని నాత్మధర్మములనుగాఁ జెప్పుచున్నారు. గాని అది యుక్తియుక్తముగ నుండలేదు. అదియు దేహాంతర్భాగమున నున్నట్లు గానవచ్చుచున్నవి; దేహ మున్నంతకాలమే యున్నవి కాని పిదప లేవు. ఏ రెండుపదార్థములలో నొకటి యున్నప్పుడు మాత్రమే రెండవది కూడ నుండునో అది లేనప్పుడు రెండవది కూడ నుండదో అవి ధర్మధర్ము లగుట ప్రత్యక్షప్రసిద్ధము (భావాభావముల కాశ్రయ మైనది ధర్మి, దాని నాశ్రయించి యుండునది ధర్మము). వేఁడిమి కాంతి యనురెండుగుణములును అగ్ని యున్నప్పుడు మాత్రము ఉండును; అది నశింపఁగానే నశించును. ఇట్లగుటచే నవి యగ్నిధర్మములుగ సర్వజనులచేతను పరిగణింపఁబడుచున్నవి. ఇట్లే ప్రస్తుతచేష్టాదులును (చేష్ట యనఁగా శుభము కలుగుటకు నశుభము తొలఁగుటకుఁ జేయఁబడు వ్యాపారము) దేహ మున్నప్పుడు మాత్రమే కానవచ్చుచున్నవి; అది నశింపఁగానే నశింపు

చున్నవి కదా! ఇట్లగుటచే నివి నిస్సంశయముగ దేహధర్మములే. దేహ భిన్నాత్మ యట్లును సిద్ధింపఁ డని మున్నే వివరించి యున్నాము.

## అ-౩. పా-౩. సూ-౫౪.

అవతారిక:—ఇట్లు వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

# ౪౧౪. వ్యతిరేక స్తద్భావాభావిత్వా న్న తూపలబ్ధివత్. ౩. ౩. ౫౪.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. జీవుఁడు దేహమునకంటె భిన్నుఁ డనియే యవశ్య మంగీకరించి తీరవలయును. ఆతఁడు ప్రత్యక్షముగ గానరా కున్నను అనుమానముచే నిర్ణయింపఁదగియు న్నాఁడు. లోకమున నెవ్వఁ డేకార్యము నాచరించినను దానిఫలము ననుభవించుచున్నాఁ డనుట ప్రత్యక్షముగనే యున్నది. ఒకఁడు తనచేతితో నొకపదార్థమును చఱచిన నాపదార్థమున కెంతదెబ్బ తగులునో ఆతని చేతికిఁ గూడ నంతదెబ్బ తగులు ననుట ప్రత్యక్షమై యున్నది. దెబ్బ సమానమే యైనను సుకుమార మగుపదార్థమున కదియే యధికముగ దోఁచును; కఠినమైనదానికి నది గణనీయముగ నుండ దని తెలిసికొన వలయును. ఈకారణమువలన ప్రతిక్రియకును ప్రతిఫల ముండవలయుట యావశ్యక మగుటచేఁ బరలోక మావశ్యముగ నుండి తీరవలయును. పురుషుఁడు పుట్టినప్పటినుండియు నాచరించు పుణ్యపాపముల కిచ్చట ఫలము ననుభవించుట లేదని యందఱు నెఱుంగుదురు. ఈకారణము వలన వానిఫలము ననుభవింపఁ జేయుటకై కేవలసుఖాత్మకము లగుపుణ్య లోకములును దుఃఖాత్మకము లగునరకాదిలోకములును ఉండితీరవల యును. "ఇట్లు చెప్పనేల పుణ్యమునకు కీర్తియు పాపమునకు నపకీర్తియు ఫలములు కావచ్చును. ఇంతకంటె నధికఫలములఁ గల్పింప నేల?" అనియెద వేమొ వినుము. మనస్సునందు స్థిరపడినభావన తగినంతకారణము లేక నభివృద్ధినైన నాశమునైన నొందదని యెల్లరు నెఱుంగుదురు. సత్కార్యముల సంకల్పించువాఁ డెప్పటికిని అట్లే సంకల్పించుచుండును. దుష్కార్యముల నాచరించువాఁడు నట్టిసంకల్పములే కలిగియుండును

ఈ రెండును తగినసహవాసమువలన నభివృద్ధి యగును. సత్పురుషసమాగమము కలిగినచో సత్కార్యచింతయు దుష్టసమాగమము కలిగినచో దుష్కార్యచింతయు నభివృద్ధినొందును. విపరీతసంసర్గమువలన క్షయము నొందును. సత్సంకల్పములు దుస్సంకల్పములుగాను, దుస్సంకల్పములు సత్సంకల్పములుగాను మారిపోవును. ఇది యొకవిధము. ఫలానుభవము వలనఁగూడ నిట్టివృద్ధిక్షయములు కలుగును. ఏవృత్తియందుఁగాని ప్రవేశించినప్పుడు దానివలన లాభము గానఁబడినచో నితరవృత్తుల నన్నిటిని వదలి పురుషుఁడు తదేకవృత్తి కలవాఁడగు ననుట ప్రత్యక్షసిద్ధము. దుఃఖముకలిగినచో దానిని విడుచు ననుటయు ప్రత్యక్షసిద్ధమే. ఈప్రత్యక్షము నాశ్రయించి చూచిన పుణ్యాపాపములకు సుఖదుఃఖములే ఫలములనుట స్పష్టమగుచున్నది. పుణ్యము నాచరింపవలయు ననుటయు పాపమును విడువవలయు ననుటయు మీకు సమ్మతమే కదా! "కీర్త్యపకీర్తులే ఫలము లైనను పైవిధమెల్ల సంభవింపవచ్చును." అనియెదవేమొ యట్లు కాదు. కొన్నిస్థలములయందు కపటసంచారమువలనఁ గూడఁ గీర్తి కలుగుచున్నది. యథార్థసంచారమువలనఁ గూడ నపకీర్తి జనించుచున్నది. "ఇది పరుల యవివేకము. పరమార్థము లగు కీర్త్యపకీర్తులే పుణ్యాపాపములకు ఫలములు" అనియెదవేమొ, యప్పుడు నిర్ణయ మెట్లు కుదురును? మందబుద్ధి యగువాఁడు కపటసంచారము వలనఁ గలిగినకీర్తినిఁగూడ యథార్థకీర్తినిఁగా భావించి తానును కపటసంచారమునందే ప్రవర్తింపవచ్చును కదా! అప్పుడు కీర్తినిసంపాదించుటయే ప్రధాన మగునుకాని నిష్కల్మషసంచారము నాశ్రయించుట ప్రధానము కానేరదు. ఇంతియే గాదు. ఏసంచారము కీర్తిని గలిగించునో అదియెల్ల నిష్కల్మషసంచారమే యని కూడ భావింపఁబడవలసి వచ్చును. యథార్థనిష్కల్మషసంచారముకూడ నొకొక్కస్థలమున నపకీర్తికరమగుచుండుటవలన నది యధర్మ మనియు భావింపఁబడవలసి వచ్చును. ఇట్లగుటచే కీర్త్యపకీర్తులనే పుణ్యాపాపఫలములనుగా నిర్ణయించిన ధర్మాధర్మవ్యవస్థ కుదురదు. "వివేకుల యనుభవమే ప్రమాణముగాని మందబుద్ధులయనుభవము కాదు కదా! వివేకులకు మాత్ర మీధర్మాధర్మవిభాగము స్పష్టముగనే తెలియును" అనియెదవేమొ; వారు స్వతంత్రులు. వారికి నీయుపదేశ మేల? ఉపదేశ మనునది మందబుద్ధుల నుద్ధరించుటకై

పుట్టినదియే కాని పరిపూర్ణవివేకులచర్య ననువాదము చేయుటకై కాదు. కావున పుణ్యపాపములకు కీర్త్యపకీర్తులే ప్రధానఫలము లనుట యుక్తము కాదు. ఇట్లు చెప్పుటచే మేము "పుణ్యపాపములకు కీర్త్యపకీర్తులకును సంబంధమే లేదు" అని చెప్పుచున్నామని తలంపవలదు. అవి వాని (పుణ్యపాపముల) కానుషంగికఫలములు; సుఖదుఃఖములు ప్రధానఫలములు. సుఖప్రాప్తికై పుణ్యము నాచరించువానికిఁ గీర్తి తనంతనే కలుగును; అట్లాచరింపనివానికి ప్రధానముఁగ దుఃఖంబును ఆనుషంగికముగ నపకీర్తియు గలుగును. ఈపక్షము నాశ్రయించినచో నెంతమందబుద్ధులకైనను పెడత్రోవ త్రొక్కుటకు వీ లుండదు. దొంగతనము మొదలగు పాపకార్యములవలన సుఖము కలిగినట్లు కానఁబడినను తత్కర్తలు మితిమీరిన మనోవేదన ననుభవించుచునే యున్నారు కదా! కీర్తివిషయమునందును పురుషునకు తన కపటవర్తనము తెలిసియే యున్నను, దానివలన మనస్సునందు సంతాపము కలుగుచునే యున్నను ఏదియోయొకవిధముగ కీర్తిమాత్రము వచ్చును గావునఁ దత్పరిత్యాగమునందు (కపటవర్తనపరిత్యాగమునందు) ప్రయత్నము కలుగవలసినయావశ్యకత యుండదు. మాపక్షమున నన్ననో వేదన యనునది యెంతమాత్ర మున్నను అది సుఖము కానేరదు; కావున తత్పరిత్యాగమునకై (దుఃఖహేతు వగు నధర్మమును పరిత్యజించుటకై) ప్రయత్న మావశ్యక మగును. కావున పుణ్యపాపములకు సుఖదుఃఖములే ఫలములు. వాని యనుభవమునకై స్వర్గనరకములుకూడ నావశ్యకములు. "పుణ్యపాపములకు సుఖదుఃఖములు ఫలములు కావచ్చునుగాని యింతమాత్రమున స్వర్గనరకము లెట్లు సిద్ధించును" అనియెదవేమొ వినుము. అపూర్వములగువిషయములు ఆకర్షించినంతదృఢముగ సామాన్యవిషయములు చిత్తవృత్తి నాకర్షింప లేవనుట సర్వలోకప్రసిద్ధము. ఆట్లు పరిపూర్ణముగ తనవైపునకు నాకర్షించుకొనఁబడిననేకాని చిత్తవృత్తి స్వాధీనము కాదు; తనచే నిచ్చవచ్చినట్లు ప్రవర్తింపఁజేయఁబడుటకు శక్యము కాదు. ఈకారణమువలన మనస్సును చక్కనిమార్గమునకు త్రిప్పుటకై యేర్పడియున్నపదార్థము మొట్టమొదట దానిని సంపూర్ణముగ తనవైపునకు నాకర్షించుకొనుసామర్థ్యము కలదిగాను తనవైపున నేకాగ్రత నొందించుసామర్థ్యము గలదిగాను ఉండవలయును. ఐహికములగుసుఖదుఃఖములకు నట్టిసామర్థ్యము లేదు. అవి చిర

పరిచితములు; అల్పములు. ఇట్లగుటచే పరిపూర్ణసుఖాత్మక మగు స్వర్గంబును అత్యంతదుఃఖాత్మక మగునరకంబును అనుమానప్రమాణముచేఁ గల్పింపఁబడినవి. "మీసిద్ధాంతమును చూచిన సర్వమును కల్పితమాత్రమే యని తోఁచుచున్నది. యథార్థస్థితికి నిది విరుద్ధమే యగునేమో" అనియెదవేమొ యట్లుకాదు. ప్రత్యక్షమువలె ననుమానముకూడ విషయనిర్ణయమునందుఁ బ్రమాణమే. ఈవిషయమును సవిస్తరముగ దిగువ నిరూపించెదము. మఱియొకపక్షమున సత్ప్రవృత్తిని లోకమున నెలకొల్పుటకై లేనివానిని కల్పించుటయు నయుక్తము కాదు. లోకమును చెఱచుసత్యమునకంటె చెఱుపనియసత్యమే శతవిధముల మే లనుట సర్వవిద్వత్సమ్మతము. కావున పరలోకసిద్ధాంత మెట్లును భిన్నము కాదు. ఈశరీర మీలోకమునందే పూడ్పఁబడియో దహింపఁబడియో నశించునుగావున నిది పరలోకసుఖదుఃఖముల ననుభవింపలేకపోవుటచేఁ దదనుభవమునకై దేహవ్యతిరిక్తాత్మ కల్పింపఁబడవలయు ననుసిద్ధాంతంబును భగ్నము కాదు.

ఈయాత్మ జ్ఞానరూపుఁ డనియే మాసిద్ధాంతము. జ్ఞానము భూతచతుష్టయమువలన కలిగిన దనుట యయుక్తము. అది భూతములకుఁ గాని తత్పరిణామమునకుఁ గాని నియతముగ సంబంధించియున్నగుణమే యగునేని దేహ మున్నంతవఱకు నట్లే యుండవలసి వచ్చును; భూతములున్నంతవఱకుఁ గూడ నట్లే యుండవలసివచ్చును. "మదశక్తి మద్యకారణము లగుపదార్థములయొక్క పరిణామమునందే కలుగుచున్నది కాని యేపదార్థములయందు లేదు కదా!" యనియెదవేమొ వినుము. ఇది సామాన్యశక్తి కావున చైతన్యమువలె నియమముగ నుండవలసిన పని లేదు. "చైతన్యము కూడ నట్టిదే యేల కాకూడదు" అనియెదవేమొ. మీమతమునందు నాల్గుభూతములకంటె నితర మగుపదార్థమే లేదు కదా! చైతన్యమును సర్వవ్యాపక మగుటచే దానినే యవశ్యమాశ్రయించి యుండవలయును. ఇట్టిది విశేషగుణమే యగును కదా! విశేషగుణ మెకప్పుడు స్వాశ్రయమును విడుచు ననుటయు సంభవింపదు కదా! మదశక్తి యట్టిది కాదు. అది నియతముగఁ గొన్నిపదార్థములయందు మాత్రమే యుండునది కాదు. కొన్నిటియం దధికముగను మఱికొన్నిటియం దల్పముగనుఁ గూడ నది యుండును. ఈకారణము

వలన నిది సామాన్యగుణము. దీనికి విశేషగుణమునకువలె నిత్యత్వ మక్క-
ఱలేదు. ఈనిరూపణవలన చైతన్యము భూతములను తత్పరిణామ మగు
దేహమును గూడ విడువఁగూడ దని తేలుచున్నది. ఇది మాత్రము
ప్రత్యక్షమునకు విరుద్ధము. మృతిచెందినపిదపఁగూడ దేహము కలదు
కాని చైతన్యము లేదు కదా! ఇట్లగుటచే నాచైతన్యము భూతసము
దాయమువలనఁ గలిగినది యగుటకు వీలు లేదు. మఱియు మద్యము
నందు మదశక్తి ప్రతియవయవములోను గూడ నున్నట్లు ఈదేహము
నందును చైతన్యము ప్రతియవయవమునందు నుండవలయు ననుట
యనుమానసిద్ధము. దీని నంగీకరించినచో నొక్కత్రాటికిఁ గట్టఁబడిన
యనేకపక్షులవలె నొక్కదేహమున ననేకచైతన్యము లుండవలసి వచ్చును.
అన్నియును స్వతంత్రములే కావునను ఒకదానియభిప్రాయమును రెండవది
యనువర్తింపవలయు నను నియమ మేదియు లేకపోవుటచేతను, ఈదేహము
ఒక్కకార్యమునైనను చేయఁజాలకుండవలయును. ఒకచైతన్యము
నడువవలయు ననిన మఱియొక్కటి కూర్చుండవలయు ననవచ్చును;
ఒక్కటి భుజింపవలయు ననిన మఱియొక్కటి యుపవసింపవలయు నన
వచ్చును. ఇట్లుండ దేహ మెట్లు నియతములుగ గార్యముల నాచరింపఁ
గలుగును? ఈహేతువునుబట్టి చూచినను చైతన్యము భూతపరిణామము
వలన జనించినది కాఁగూడదు. అదియే (చైతన్యమే) జననమరణశూన్యంబును
సర్వవ్యాపకంబును నై యాకాశము ఘటాదుల నాశ్రయించినట్లు దేహ
ముల నాశ్రయించు నేని యప్పు డిట్టివైషమ్య మేదియు నుండదు. మా
సిద్ధాంత మిదియే. అది యట్లుండె. మఱియొక హేతువును వినుము.
"దేహజ్ఞానములకు *నన్వయము (దేహమున్నప్పుడు జ్ఞానముండుట లేక

*అన్వయము-వ్యతిరేకము.

ప్రత్యక్షాదులస్వరూపము మున్నే (అ-౧. పా-౧ సూ-3.) వివరింపఁబడియున్నది. అనుమానప్రమాణమును వివరించునప్పుడు హేతుసాధ్యముల స్వరూపము వర్ణింపఁబడినది. హేతువే లింగ మనియుఁ జెప్పఁబడినది. హేతు వున్నస్థలమున సాధ్య ముండవలయు ననియు అనియే వ్యాప్తి యనియు తజ్జ్ఞానమే యనుమితికి సాధన మనియు వర్ణింపఁబడెను.

ఈ వ్యాప్తి సామాన్యముగ రెండువిధములై యున్నది. అన్వయవ్యాప్తి యనియు వ్యతిరేకవ్యాప్తి యనియుఁ జెప్పఁబడుచున్నది. అన్వయవ్యాప్తి యనఁగా "హేతు

జ్ఞాన మున్నప్పుడు దేహ ముంచుట) కలదు కావున వానికి *ధర్మధర్మిభావము చెప్పఁబడెను." అనియెదవేమొ అంతమాత్రము చాలదు. వ్యతిరేకము (దేహము లేనప్పుడు జ్ఞానము లేకుండుట) కూడ నుండిననే గాని విషయము సిద్ధాంతము కానేరదు. ప్రస్తుతమునన్ననో యీవ్యతిరేకము సంశయముగ నున్నది. మరణానంతరమున నీదేహమును విడిచి చైతన్యము మఱియొకస్థలమునకుఁ బోయినను బోవచ్చును కదా ! ఈయభిప్రాయము సత్యము కాకపోనిండు; సంశయము మాత్రము కలుగుటకు నవకాశము కలదు కదా! ఇంతమాత్రమైనను ఆవ్యతిరేకమును భగ్నము చేయుటకుఁ జాలును. కావున నెట్లును జ్ఞానము భూతజన్యము కానేరదు. మఱియొక విశేషము మీమతమున జ్ఞానమనకు స్వరూపమేది? భూతచతుష్టయమేనా ? లేక తదన్యమా ? భూతచతుష్టయమునకంటె నన్యమగుపదార్థము మీమతమున లేదు. ఇట్లగుటచే నిర్వివాదముగ భూతజ్ఞానములకు నభేదమునే యంగీకరింపవలయును. అట్లు చేసిన విరోధము వచ్చును. భూతములు తమ్ము తామే తెలిసికొనుచున్న వనవలసి వచ్చును. ఇది ప్రత్యక్ష విరుద్ధము. భూతగుణము లగురూపాదు లచేతనము లనియు జ్ఞానముచే తెలిసికొనఁబడుచున్న వనియు నందఱకును తెలిసినవిషయమే. చైతన్యము స్వప్రకాశ మగుటచే నది మాత్రము తన్ను దాను తెలిసికొనవచ్చును. రెండవచేతన మున్న దనుటయు విచారించినచో విరుద్ధ మగును. ప్రకాశ్యచేతనమునకంటె ప్రకాశకచేతన మల్ప మగుటకుఁ గాని సమ మగుటకుఁ గాని వీలు లేదు. అధిక మైనచో "దానిని ప్రకాశింపఁజేయుటకు నంతకంటె నధికమైనది మఱియొక్కటి కావలయును" అని యాక్షేపము వచ్చుటకు వీ లుండుటచే ననవస్థాదోషము వచ్చును. రెండును చేతన

---

వుండునప్పుడు సాధ్యమున్నది" యనుట. వ్యతిరేకవ్యాప్తి 'సాధ్యము లేనప్పుడు హేతువు లేదు' అనుట. పొగను చూచి యనుమానప్రమాణముచే నగ్ని నూహించునప్పు డీరెండువ్యాప్తులును కలవు. పొగయున్నస్థలమున నవశ్యముగ నగ్ని యుండును; అగ్నిలేకున్న పొగ యుండదు. ఈ రెండే అన్వయవ్యతిరేకము లనికూడ చెప్పఁబడును. హేతుసాధ్యములు కాకున్నను ఏపదార్థములైనను పరస్పరము విడువ కుండినప్పుడుగూడ నీపదములనే వ్యవహరింతురు.

* ధర్మధర్మిభావము=ధర్మమనఁగా గుణము, ధర్మియనఁగా నాగుణములు కలది. వీని పరస్పరసంబంధము ధర్మధర్మిభావము.

ములే కావున వానిలో భేదమును నిరూపించుటకును వీ లుండదు. ఈకారణములవలన చైతన్యముమాత్రము స్వప్రకాశము కావచ్చును. మీమతము నాశ్రయించిన జడములు కూడ నట్టివే కావలసివచ్చుటచే ప్రత్యక్షవిరోధము దుర్నివారము. పైనిరూపణ ననుసరించి చైతన్యమునకు తప్ప తక్కినయేపదార్థమున కైనను తనయందు వృత్తి (అనఁగా తానుచేయు కార్యమునకు తానే కర్తగాఁ గర్మగాఁ గూడ నుండుట) సంభవింపదు. విచారించి చూచిన చైతన్యమునకుఁ గలస్వప్రకాశత్వంబును వృత్తి కాదు; స్వరూపమే. అదియే చైతన్యము కావున దానికి స్వభావముగ నన్నియుఁ దెలియుచుండును. ఈకారణమువలన నెంతనేర్పరియైనను తనభుజములపై తానుకూర్చుండనేరనట్లు అగ్ని తనయుష్ణస్వభావముచేఁ దన్ను కాల్పనేరనట్లు భూతధర్మ మగునేని యీచైతన్యంబును భూతభౌతికముల గ్రహింపనేరదు. "భూతజ్ఞానములు కార్యకారణములు. మట్టికుండలకువలె వానికి భేదాభేదములు రెండు నుండవచ్చును. ఈమతము మీకును సమ్మతమే. ఇట్లగుచున భేదమువలనఁ గర్మకర్తృత్వభావంబును అభేదమువలన నైక్యంబును కలుగవచ్చును" అనియెదవేమొ యట్లుకాదు. మీమతమున భేదము పారమార్థికమా? లేక నపారమార్థికమా? పారమార్థికమైనచో భూతచతుష్టయములకంటె నధికముగ నైదవపదార్థము నంగీకరింపవలసి వచ్చును. అపారమార్థిక మైనచో వెనుకటిదోషములన్నియు వచ్చును. "ఇట్లు చెప్పనేల మీరును బ్రహ్మములకు నభేదమే పారమార్థికమైనను అపారమార్థిక మగుభేదము నాశ్రయించి కూడ వ్యవహారము చేయుచున్నారుకదా!" అనియెదవేమొ వినుము. అచ్చట జీవునకు *బాధ కలదు. విచారించిన జీవబ్రహ్మాభేదము సిద్ధింపదు. ఈకారణమువలన నది భ్రాంతిమాత్రకల్పితమగును; జ్ఞానోదయముకాఁగానే తొలఁగిపోవును. ఇట్లగుటచే భ్రాంతిగలవారినిఁగూర్చి యట్టివ్యవహారము నాచరింపవచ్చును. జ్ఞానజ్ఞేయభేద మనిననో యట్టిది కాదు. జ్ఞానము పదార్థముల నెఱుంగు నను విషయ మెప్పుడు బాధింపఁబడు ననుటకు వీలులేదు. "మీరు పరమార్థస్థితిని వర్ణించునప్పుడు జ్ఞేయాభావము చెప్పుచున్నారు కదా! అప్పుడు

---

* బాధ.—లోకమున ధ్వంస మనియు బాధ యనియు నాశము రెండువిధములు. ఘటాదులను కాష్ఠాదులతో మోది చూర్ణము గావించుట ధ్వంసము; త్రాటినిఁ జూచి సర్ప మని భ్రాంతి జెందునప్పుడు వివేకముచే దానిని తొలఁగించుట బాధ.

జ్ఞానము దేనిని తెలిసికొనును" అనియెదవేమొ యప్పుడు నీ వన్నట్లు జ్ఞానమునకు విషయ ముండ దనుట సత్యమే కాని తెలిసికొనుసామర్థ్యముమాత్రము పోవదు; 'జ్ఞానము ఇతరపదార్థములఁ దెలిసికొనును' అను నియమమునకు మాత్ర మెప్పటికిని బాధ కలుగదు. ఈ కారణమువలన జ్ఞానజ్ఞేయ సంబంధము భ్రాంతికల్పితము కానేరదు. ఆజ్ఞానము పదార్థము లున్నప్పుడు పదార్థములఁ జూచును; లేనప్పుడు కేవల స్వస్వరూపమును జూచును. దృశ్యము లున్నను లేకున్నను దృష్టికిమాత్ర మెప్పటికిని లోపము లేదు కదా! కావున నీవిషయమున నీపారమార్థిక భేదము కలదనుట యుక్తము కాదు. ఆత్మభిన్నపదార్థములు అవిద్యాకల్పితములే యగుటచే మామతమున జ్ఞానజ్ఞేయసంబంధంబును జ్ఞానమునకు జ్ఞేయప్రకాశమునందుఁ గల కర్తృత్వంబును భేదంబును కల్పితము లగును గాని సర్వంబును యథార్థమే యగుటచే మీమతమున నట్లు కానేరదు. మఱియు మీకుఁ బ్రత్యక్ష మొక్కటియే ప్రమాణము కావున మీమతమున ననిర్వచనీయత్వ వాదము కూడఁ గుదురదు. మీరు యథాదృష్టముగ భేదాభేదముల సత్యములుగ నంగీకరింపవలసినవారే కదా! కావున నిప్పటి నిరూపణవలనఁ గూడ జ్ఞానము భూతజన్యము కానేరదు. ఇట్లగుటచేతనే జ్ఞానము భూత భౌతికములకంటె భిన్నము. జ్ఞానమే మామతమున నాత్మ గావున నాయన దేహమునకంటె భిన్నుఁడు. సర్వసాక్షిగ నుండవలసినవాఁడు కావున నిత్యుఁడు. సాక్షియగువాఁడు ఉత్పత్తిస్థితిప్రళయములకుఁ గూడ సాక్షిగా నుండవలయును గావున ఆసర్వకాలములయందు నంతకుఁ బూర్వమునను పరమునను కూడ నుండితీరవలయును కదా! కావున నీవివిధానుమానములచే దేహవ్యతిరిక్తాత్మ సిద్ధించెను.

ఇట్లే అస్మచ్ఛబ్దార్థమునుఁ గూర్చి తెలిసిన వాదంబును యుక్తియుక్తము కానేరదు. దేహచైతన్యములకు భేదము లేకున్ననేగాని యావాదము చెల్లదు. ఇది (దేహచైతన్యము నొక్కటి యగుట) విరుద్ధమని పూర్వముననే నిరూపింపఁబడెను. మఱియు విచారించినచో నస్మచ్ఛబ్దార్థము దేహభిన్నపదార్థమే యని తేలుచున్నది. లోకమునఁ బురుషుఁడు తనకంటె భిన్నము లగుగృహాదులనుఁ గూర్చి 'ఇది నాయిల్లు. ఇది నాధనము. వీఁడు నాపుత్త్రుఁడు' అని వ్యవహరించుచున్నాఁడు; 'ఇది నాదేహము. ఇది నా కాలు. ఇది నాచెయ్యి' అనియు వ్యవహరించుచున్నాఁడు. ఈవ్యవహార

సామ్యమును పట్టిచూచిన పురుషగృహములకు భేద మెట్లు కలదో అట్లే దేహమునకు నస్మచ్ఛబ్దార్థమునకుఁ గూడ భేద ముండవలయు నని తోఁచు చున్నది. ఇది జాగ్రదనుభవము. స్వప్నమునందును ఈదేహము శయన ముపై చేష్టలు దక్కి పరుండియున్నను మఱియొకదేహము గలుగుటయు దానియం దాత్మాభిమాన ముండుటయుఁ గానవచ్చుచున్నది. పురుషుఁ డొక్కఁడే యనుటలో నెవ్వరికిని వివాదము లేదుకదా! ఒక్కపురుషునకు నిట్టియభిమానభేదము గానవచ్చుచుండుటచే దేహమునకంటె నాతఁడు భిన్నుఁడే యని చెప్పవలసి యున్నది; స్వప్నపురుషుఁడు భిన్నుఁ డనినచో 'నేను రాత్రి కలఁగంటిని' అను జాగ్రదనుభవమునకు విరోధము వచ్చును. ఒకఁడు చూచినదానిని మఱియొక్కఁడు స్మరించు ననుట యుక్తియు క్తము కానేరదు కదా! కావున స్వప్నావస్థను పట్టి చూచినను దేహాత్మభేదమే సిద్ధాంతమగుచున్నది. మఱియు యోగులు తమమనోబలముచే నొక్క మాఱే యనేకదేహముల నిర్మించుచున్నారు; వానియం దెల్ల నభిమాన ముతో ప్రవర్తింపుచున్నారు. ఈదృష్టాంతముచేతను స్వప్నదృష్టాంతము చేతను వలె విషయము నిర్ణయింపవలసి యున్నది. ఈకారణమువలన నస్మచ్ఛబ్దము దేహభిన్నమగుపదార్థమే బోధించును. అది శరీరమునే బోధించు ననుతలంపు భ్రాంతి. దేహాత్మభేదజ్ఞానము లేకుండుటచే వాని నేకముగ భావించి "నేను ఎఱ్ఱనివాఁడను. నడుచుచున్నాను" అని దేహేం ద్రియధర్మముల నాత్మయం దారోపించుచున్నారు. ఇంతమాత్రమేగాని యిందు యథార్థస్థితి యేమియు లేదు. మఱియు "దేహాన్వయముచేఁ జైతన్యము దేహధర్మము" అనుపక్షు మిదివఱకే ఖండింపఁబడెను కావున సర్వ విధముల నాత్మ దేహభిన్నుఁడే.

చైతన్య మెట్లు దేహభిన్నమో అట్లే చైతన్యధర్మము లగుప్రాణ చేష్టాదులుకూడ దేహధర్మములు కావేరవు. వానికిఁగూడ దేహాన్వయ ముండుటయే కదా! దేహధర్మత్వమును కలిగింపవలయును. అది యిది వఱకే ఖండింపఁబడెను. దేహ మున్నప్పు డుండునవి కావున దేహధర్మము లని నిశ్చయించినచో దేహమున్నప్పుడు కూడ లేదు కావున దేహధర్మ ములు కా వని యేల నిశ్చయింపరాదో దెలియకున్నది. దేహము మృతి చెందినను కాల్పఁబడునంతవఱకు దేహరూపాదులు మాత్ర మున్నవి కాని ప్రాణచేష్టాదులు మృతిచెందిన పిదప లేవు కదా! ఇప్పుడు దేహధర్మము

లెవ్వి యగునో కొంచెము విచారింపుఁడు ? మఱియొకవిశేషము. ఏది యేవస్తువునకు స్వాభావికధర్మమై యుండునో యది తనకును పరులకును గూడ గోచర మగుచుండును. దేహవిషయమును గూర్చి విచారించిన రూపాదు లిట్లు ప్రత్యక్షములై యున్నవి కాని యిచ్ఛాద్వేషాదులు లేదు. ఇప్పుడు దేహధర్మము లేవి యగునో కొంచెము విచారింపుఁడు. సాహచర్యము కలిగినంతయాత్రముననే ధర్మధర్మిభావము కలుగనేరదు. కదా ! శాత్రులయందు దీప ముండిననేకాని పదార్థజ్ఞానము కలుగదు. ఇంతమాత్రమున జ్ఞానము దీపధర్మ మగునా ? ఈకారణములవలన నిచ్ఛాద్వేషాదులు దేహధర్మములు కానేరవు. ఆదీపమైనను పదార్థజ్ఞానమునకు కొంత యుపయోగకర మగును గాని చైతన్యమున కీదేహ మెంతమాత్రమైన నుపయోగించునట్లు తోఁపలేదు. స్వప్నావస్థయం దీదేహము లేకున్నను సర్వవ్యవహారములును జరుగుచునే యున్నవి కదా ! కావునఁ జైతన్య మెట్లును దేహభిన్నమే; ఆత్మ దేహాతిరిక్తుఁడే.

"సరియే యీవిషయము నంతయును మీ రనుమానము నాశ్రయించి సిద్ధాంతము చేసితిరి. మొట్టమొదట నది ప్రమాణమే కాదు." అనియెదవేమొ వినుము. ఈవాదము సయుక్తికము కానేరదు. "అనుమానాదులు ప్రమాణములు కావు" అంటివి కదా ! ఈసిద్ధాంతమునకు నీకు నాధార మేది? ప్రత్యక్షమా లేక మఱియొకప్రమాణమా? నీమతమున రెండవప్రమాణము లేదు కావున పైనిర్ణయమునకుఁ గూడఁ బ్రత్యక్షమే ప్రమాణ మని తీరవలయును. ఇట్లయిన పైనిర్ణయమునకు నాధారమే లేదు. ప్రత్యక్షమనఁగా యెదుటనున్నవిషయమును చూచిగాని వినిగాని స్పృశించిగాని మూర్కొనిగాని ఆస్వాదించిగాని యెఱుంగుట. దీనివలన పదార్థములు మాత్రమే గోచరము లగునుకాని "ఈపదార్థము అన్నికాలములయందు నిట్లేయుండునా ?" అనుమొదలగువిషయములు గోచరములు కానేరవు. అవి విచారమునకు గోచరములు కావలసినవియే కదా ! మఱియు అనుమానాదులయందుఁ గలయప్రామాణ్యము ఘటాదులవలె గోచర మగునది కాదు కదా ! కావున నీ కిష్టము లేకున్నను అన్యప్రమాణముల నంగీకరించియే తీరవలయును. ఇట్లు చేయకపోయినచో మిగుల ననర్థములు వాటిల్లును. విద్వాంసులగువారు లోకమున జ్ఞానవంతుని విడిచి యజ్ఞానవంతులకు నుపదేశ మిచ్చుచున్నారు. ఇట్లే చేయవలయు

ననుట మీకును సమ్మతమే కదా! మీమతమున మాత్ర మిది సిద్ధింపదు. ఈవిషయము (అనఁగా వీనికి జ్ఞానము కలదా? లేదా ? యనువిషయము) కేవల ప్రత్యక్షమునకు గోచర మగునది కాదు. జ్ఞానాజ్ఞానములు ఘటాది పదార్థములవలె గానరావు. శబ్దమువలె వినరావు; వానిమాటలచేతను చర్యలచేతను మాత్రమే యూహింపఁదగి యుండును. ఇది యనుమానము. ఇది మీకు సమ్మతము కాదు. కావున మీమతము నాశ్రయించి చూచిన జ్ఞానియా ? యజ్ఞానియా ? యనువిచారము లేకయే కనఁబడిన వాని కెల్ల నుపదేశము చేయుచుండవలసి వచ్చును. ఇప్పుడు విద్వాంసులకుఁ గలయాధిక్య మేమి ? మఱియు జ్ఞానశూన్య మగుపశువుకూడ "ఇది హితము ఇది యహితము" యని విచారించి లేఁతపచ్చికగలభూమియందు విహరించును; బురద ముండ్లు మొదలగునవి యున్నస్థలమును పరిహరించును. నీకు నిదియు సంభవింపదు. హితాహితనిర్ణయ మనుమానమువలన కలుగునుగాని ప్రత్యక్షమువలనఁ గలుగదు కదా! కావున నాస్తికమతము నాశ్రయించినవాఁడు పశువునకంటె పశువు. ఇదియునుగాక వానికి శబ్దము కూడఁ బ్రమాణము కాకపోవుటచే ఒకవిషయమును మఱియొక్కనితో చెప్పుటయే సంభవింపదు. ఆహా! నాస్తికమత మేమిమతము వారికి పునర్జన్మము లేకున్న లేకపోయెనుగాని యీజన్మమునందే మాటలాడుటకుఁ గూడ నవకాశ మొసంగనిమహానరకము ప్రాప్తించినది. ప్రవృత్తినివృత్తి జ్ఞానముకూడ ననుమానగమ్యమగుటచే వారిమతమున నుండుటకు వీలు లేదు గావున సంచారాభావరూప మగుదురవస్థ ప్రాప్తించినది.

కావున నిర్వివాదముగ నన్యప్రమాణములనంగీకరింపవలసినదియే. ప్రత్యక్ష మిదివఱకే యంగీకరింపఁబడెను. అనుమానమును గూర్చియు చెప్పఁబడినదోషము "దేశకాలభేదములవలన లింగము భేదించును" అనుటయే గదా ఈవిషయమును నిర్ణయించుటయందుఁగాని తుదకు విచారించుటయందుఁగాని ప్రత్యక్షమున కధికారము లేకపోవుటచే నీయాక్షేపము చెల్లదు. మఱియు నిట్టిభేద మొకానొకస్థలమునకలిగిన దాని ననుమానాంతరమే నిర్ణయించును. ఈకారణమువలనను సర్వవిషయములు ననుమానముచేతనే నిర్ణయింపఁబడవలయుటచేతను చిత్తవ్యాపార మంతయు సామాన్యమగుననుమానమేయగుటచేతను అనుమానప్రమాణము నంగీకరింపవలయును. సర్వసామాన్యమువలనఁగాని యేకదేశసామాన్యమువలనఁ

గాని యుపమాన ప్రమాణము సిద్ధింపకపోయినను బహుధర్మసామా న్యమువలన సిద్ధించును గావున దానినిఁ గూడ నంగీకరింప వల యును. ఏ రెండుపదార్థములు పరస్పరము బహు విషయముల యందు సమానములైయుండునో వానిని పరస్పరోపమానముచే గ్రహింప వచ్చును కదా! మిగుల నపరోక్ష మగుపదార్థమును చెప్పునదియే యైనను ప్రస్తుతసందర్భమునకు నత్యావశ్యక మగుదానిని జెప్పునదిగావున నర్థాపత్తియు నంగీకార్యమే కావున నిందు విడువఁ దగిన దెద్దియు లేదు. కావున ప్రత్యక్షగోచరుఁడు కాకున్నను ఆత్మ యనుమానాదులకు గోచ రుఁడై యున్నాఁడు; ప్రాణచేష్టాదులును అతనిధర్మములే.

---

## ౩౧. అంగావబద్ధాధికరణము.

విషయసంశయములు:—పూర్వాధికరణముతో ప్రసంగాగతము లైనవిచారములు ముగిసినవి. మఱల గుణోపసంహారవిచార మారంభ మగుచున్నది. వేదమున నచ్చటచ్చట నుద్గీథాదికర్మాంగమున నాశ్రయించి విధింపఁబడినయుపాసనలు కలవు. ఓంకారమును ప్రాణముగా నుపాసింప వలయు ననియు అయిదువిధము లగుసామవేదమునందు క్రమముగ పృథి వ్యాదిదృష్టుల నుంపవలయు ననియు ననేకము లగునుపాసనలు చెప్పఁబడి యున్నవి. ఆయుద్గీథాదులను శాఖానుసారముగ స్వరభేదము కలిగి యున్నవి. ఈకారణముచే పరస్పరభిన్నము లగుచున్నవి. ఇట్లగుటచే వానినిఁగూర్చి చెప్పఁబడియున్న యుపాసనలు అన్ని శాఖలలోనికి నుపసంహ రించుకొనఁబడవలయునా? లేదా? యనుసంశయము కలుగును. అది యిందు నిరాకరింపఁబడును.

పూర్వ సంగతులు:—"విచారించినచో నెచ్చట చెప్పఁబడి యున్న యుపాసన యచ్చటి యుద్గీథాధులను మాత్రమే యాక ర్షించు నని తోఁచుచున్నది. స్వరభేదముచే శాఖాంతరములలో నున్న యుద్గీథాదులు పరస్పరభిన్నములే యగుచున్నవి కదా! వాని నన్నిటి నొక్కస్థలమున నుపసంహరించుకొనవలయు ననుటకుఁ గార ణము లేదు. 'ఉద్గీథ ముపాసీత' అను సామాన్యశ్రుతి విశేషము నాకాంక్షిం

చును; అప్పుడు స్వశాఖయందే యాయుద్గీథము కలదు కావున దానిచే తనే యాయాకాంక్ష శాంతించును. ఇట్లుండ నితరశాఖలయందలి విద్యల నాకర్షించుకొననేటికి ? 'సామాన్యశ్రుతి సర్వోద్గీథముల నాకర్షించుచుండ నొక్కదానినిమాత్రమే గ్రహించుటవలన దానికి (శ్రుతికి) బాధ కలుగును' అనియెదవేమొ యట్లు కాదు. సామాన్య మనునది ప్రతివ్యక్తియందును సమాప్తి నొందును. గోజాతి ప్రతిగోవునందును పరిపూర్ణముగఁ గలదు కదా! జాతి యనఁగా నాకారవిశేషమే యని యిదివఱకే (దేవతాధికరణమునందు ౧. 3. ౨౮. 33.) నిరూపించి యున్నాము. ఇట్లే యిచ్చటఁ గూడ నొక్కవ్యక్తిని గ్రహించినను సామాన్యశ్రుతియొక్కయాకాంక్ష పరిపూర్ణ మగును. కావున సన్నిధానబలమువలన స్వశాఖయందలి వ్యక్తులనే (ఉద్గీథాదులనే) గ్రహించుట యుక్తము. దీనిచే శ్రుతియు బాధింపఁబడదు. శ్రుతి అభిధావృత్తిచేఁ జెప్పిన సామాన్యమును లక్షణావృత్తిచేఁ జెప్పినవిశేషమును కూడ గ్రహించితిమి కదా ! కావున దేహాత్మలకు భేద ముండుటచే వారిధర్మములు పరస్పరభిన్నము లగు నని చెప్పఁబడి యున్నట్లే యిచ్చటఁ గూడ స్వరభేదముచే భేదము కలిగియుండుటవలన భిన్నశాఖలయందున్నయుద్గీథాదులు పరస్పరభిన్నము లనియు తద్ధర్మము లగునుపాసనలును ఈకారణమువలన నన్నిటితోను సంబంధింప వనియు మాత్రమే సిద్ధాంతము చేయఁబడవలసి యున్నది."

## అ-3. పా-3. సూ-౫౫.

అవతారిక:—అని యిట్లు దృష్టాంతసంగతిచే వచ్చినపూర్వపక్షము ఖండించుచున్నాఁడు.

# ౪౧౫. అఙ్గావబద్ధాస్తు న శాఖాసు హి ప్రతివేదమ్. 3. 3. ౫౫.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఉద్గీథాద్యుపాసనలు స్వశాఖయందు మాత్రమే నిలువవు. అవి ("ఉద్గీథ ముపాసీత" అను మొదలగునవి) సామాన్యశ్రుతులు. వీనివలన "ఇట్టిస్వరముగల యుద్గీథము నుపాసింపవలయును; ఇట్టిదాని నుపాసింపఁగూడదు." అని భేదమేర్ప

డదు. ఇట్లుండ సమీపమునసున్న యుద్గీథాదులను మాత్రమే గ్రహించి తక్కినవానిని గ్రహింపక పోవుటకుఁ గారణ మేమి? ఉద్గీథ మంతయు నుపాసనాయోగ్యమనియే కదా యాశ్రుతికి నర్థము. కేవలసన్నిధి నాశ్రయించి యాశ్రుతిని సంకోచించుట యుక్తము కాదు. సన్నిధికంటె శ్రుతి బలవత్తరము. కావున నెన్ని భేదములున్నను ఉద్గీథ మగునేని దాని నుపాసింపవలసినదియే. ఇట్టి యుపాసన సంభవింప దనుటకును బ్రమాణ మేదియును లేదు. ధనార్థియగువాఁడు ధనికుని సేవింపవలయు ననిన తన గ్రామమున నున్న ధనికుని మాత్రమే సేవింపవలయు నని యర్థము చెప్పుటకు వీలు కలదా? జాత్యాదులవలన తన గ్రామముననున్న వానికంటె నితర గ్రామములయం దుండువారు భిన్నులే కావచ్చును. ఇంతమాత్రమువలన వారి నుపాసింపఁగూడ దనుట వాక్యార్థ మగునా? కావున నెట్లును కర్మాంగమునకు సంబంధించినయుపాసనలన్నియు సర్వశాఖాగతము లగునంగముల నుపసంహరించుకొనునవియే కాని యొక్కచోట నిలచునవి కావు. "జాతి ప్రతివ్యక్తియందును పరిపూర్తి నొందవచ్చునంటివి కదా!" అని యెదవేమొ యది సత్యమే కాని ప్రస్తుతవిషయమునకు మాత్ర మది దృష్టాంతము కానేరదు. సామాన్యముచేతనే కార్యనిర్వాహ మగుచుండ నెట్టినిర్బంధ మావశ్యకము కాదు కదా! కావున నిట్టియుపాసనలు సర్వశాఖలయందలి యుద్గీథాదులతోను సంబంధము కలిగియే యుండును.

## ౪౧౬. మన్త్రాదివ ద్వాఽవిరోధః. ౩. ౩. ౫౬.

తాత్పర్యము:—మఱియు నొకశాఖయందు చెప్పఁబడినయుపాసన మఱియొకశాఖలోనికర్మాంగముతో సంబంధపడుట యెట్లని సంశయింప వలసినపనియే లేదు. మంత్రములు కర్మలు గుణములు (అనఁగా కొన్ని కొన్నివిశేషాంశములు) అనునివి యొకశాఖయందే యున్నను మఱియొక శాఖలోనికి నుపసంహరించుకొనుటఁ గానవచ్చుచున్నది. "కుటరు రసీ" అని రాతిని గ్రహించుటకై యొకమంత్రము కలదు. ఇది యన్నిశాఖలయందును లేదు. అట్లయినను "కుక్కుటోఽసీ త్యశ్మాన మాదత్తే కుటరు రసీతి వా" "కుక్కుటోసి" యనుమంత్రముతోనైనను కుటరురసీ యను మంత్రముతోనైనను ఱాతి నెత్తికొనును" అని సర్వశాఖలయందు నీ మంత్రము నియమింపఁబడి యున్నది. మఱియు ప్రయాజ లనుకర్మలు ఉప

దేశింపఁబడినశాఖలయందును "ఋతవో వై ప్రయాజాః సమానత్ర హోతవ్యాః" "ఋతువు లే ప్రయాజములు వాని నొక్కస్థలమునందే హోమము చేయవలయును (ఆకర్మల నాచరింపవలయు ననుట)" అని పర శాఖలనుండి యుపసంహరించుకొనఁబడుచున్నవి. మఱియుఁ గొన్ని శాఖల యందు అగ్నీషోమీయపశువును గూర్చి స్పష్టముగ చెప్పఁబడకున్నను "ఛాగస్య వపాయా" "మేకయొక్క వపకు" అని ఇతరశాఖలయందు చెప్పఁ బడినని శేషము పరిగ్రహింపఁబడుచున్నది. మఱియు "అగ్ని ర్వైర్హోత్రం వేరధ్వరం" అను మొదలగుమంత్రము లనేకములు ఒకవేదమున నున్నను మఱియొకవేదమున నుపసంహరింపఁబడెను. "యో జాత ఏవ ప్రథమో మనస్వాన్" "అనుసజనీయసూక్తము ఋగ్వేదముననే యున్నను యజు ర్వేగమును చెప్పవలసిన యధ్వర్యునకు విధింపఁబడి యున్నది. ఇట్లే ఒక శాఖయందు చెప్పఁబడియున్నయుపాసనలుఁగూడ నితరశాఖలోనికి దెచ్చి కొనఁబడవచ్చును. కర్మాంగములు పరస్పరశాఖలలోనికి శాఖాంతరముల లోనికి నుపసంహరించుకొనఁబడుచుండ తదాశ్రితము లగునుపాసనలకు మాత్ర మావిషయమున ననుపపత్తి యేమియుండును ?

---

## ౩౨. భూమజ్యాయస్త్వాధికరణము.

విషయ సంశయములు:— వైశ్వానరవిద్యనుగూర్చి సర్వవిష యంబును వైశ్వానరాధికరణమునందు (౧. ౨. ౨౪. ౨౩) వివరింపఁబడి యున్నది. అచ్చట వైశ్వానరునియవయవము లగుద్యులోకాదులయొక్క ప్రత్యేకోపాసనయు అవయవి యగువైశ్వానరునియొక్క యుపాసనయుఁ గూడ కల దని నిరూపించి యున్నాము. ఈవిషయమునుఁగూర్చియే మఱి యొకసంశయ మీయధికరణమున నివారింపఁబడును. ఇచ్చట వ్యస్తసమ స్తోపాసనలు రెండును విధింపఁబడెనా? లేక సమస్తోపాసన యొక్కటియే విధింపఁబడెనా? అనుసంశయము నివారింపఁబడును.

పూర్వపక్ష సంగతులు:— "ఈయుపాసనలు రెం డనియే తోఁచు చున్నది. ప్రత్యేకోపాసనలకుఁగూడ ఫలము చెప్పఁబడి యున్నది; సమస్తో

పాసనకుఁ గూడ ఫలము చెప్పఁబడి యున్నది. ఫలవంతము లగువిషయము లొకదానితో నొకటి సంబంధించితీరవలయు నని నియమము కలదా! దేని దేనికి ఫలముండునో అది స్వతంత్రమే యగుచున్నది. క్రియాపదములను పట్టిచూచినను అన్నిస్థలములయందును వర్తమానార్థకములే యున్నవి. ఎచ్చటనైనా విధివిభక్తి గానవచ్చినచో దానిని ప్రధానము చేసి తక్కిన వానిని స్తుతిపరములుగాను మఱియొకవిధముగాను సమన్వయింపవచ్చును కాని యిచ్చట నట్లు లేదు. *'వచనాని త్వపూర్వత్వాత్' అనున్యాయము ననుసరించినను ఇచ్చట రెండుస్థలములయందును విధి కల్పింపఁబడవలసి వచ్చును; లేకున్న రెండుస్థలములయందును లేకనే పోవలసివచ్చును. ఫల కల్పనగూడ నిట్టిదే. ఉండిన రెండుస్థలములయం దుండును; లేకున్న లేకపోవును. కావున నెట్లు చూచినను ఇచ్చట నుపాసనాద్వయము కల దనుటలో విరోధము లేదు. 'అచ్చట వ్యస్తోపాసన నిందింపఁబడి యున్నది కదా! దీనిచే సమస్తోపాసనయే విధింపఁబడె ననుట సిద్ధాంత మగును' అనియెదవేమొ వినుము. ఒకయుపాసనను విధించునప్పుడు మఱియొక్కదాని నిందించుట తప్పు కాదు. విధింపఁబడునుపాసనను నుతించుటకై యట్లు చేయఁబడును. ఇంతమాత్రమువలన నిందితోపాసనలు కర్తవ్యములు కా వనుట యుక్తి శూన్యము. కావునఁ బూర్వాధికరణమున నుద్గీథాద్యుపాసనలకు సాన్నిధ్య ప్రభావమువలన వచ్చినస్వశాఖావ్యవస్థను (అనఁగా తనశాఖయందు మాత్రమే నిలిచి యితరశాఖలలోనికి నుపసంహరించుకొనఁబడక యుండ వలసినస్థితిని) బాధించి యెట్లు ఉపసంహారమును (సర్వశాఖలయందు నుప సంహరింపఁబడఁదగినస్థితిని) స్థాపించితిరో అట్లే యిచ్చటఁగూడ సమస్త విద్యాసాన్నిధ్యబలమున వ్యస్తవిద్యలకు వచ్చినస్తుతిపరత్వమును బాధించి స్వాతంత్ర్యమును స్థాపింపుఁడు."

---

## అ_3. పా_3. సూ_౫౭.

అవతారిక:—అని యిట్లు దృష్టాంతసంగతితో వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

---

* వచనానిత్వపూర్వత్వాత్ (అ-3. పా-3. సూ-౪౯. పేజీ-315 చూ.)

# ౪౧౭. భూమ్నః క్రతువజ్జ్యాయ స్త్వం తథాహి దర్శయతి. ౩. ౩. ౫౭.

తాత్పర్యము:—ఇట్లు కాదు. సమస్తోపాసనయే యీవాక్యము నందు ప్రధానము. ప్రత్యేకోపాసన లట్టివి కావు. యజ్ఞవిధులను పట్టి చూచిన నచ్చట నాయజ్ఞమునకై ప్రయాజాదు లెన్నియో చెప్పఁబడి యుండినను యజ్ఞ మొక్కటియే ప్రధాన మగుచున్నది కాని తక్కినవి య ట్లగుట లేదు. అన్ని యాగములతో కూడిన ప్రధానక్రతు వొక్కటియే యాచరింపఁబడుచున్నది కాని యంగవిహీనముగఁగాని కతిపయాంగసహిత ముగ (కొన్ని యంగములతో మాత్రమే కూడినదిగాఁ) గాని చేయఁబడుట లేదు. ఇట్లే యిచ్చటఁ గూడ సమస్తోపాసన యొక్కటియే యాచరింపఁబడ దగినది. ఈవిషయమును శ్రుతియే బోధించుచున్నది. వ్యస్తసమస్తోపాసనల యందు(వ్యస్తమనఁగా ప్రత్యేకము సమస్తమునకువ్యతిరేకము)వర్తమాన క్రియ లేయున్నను పూర్వాపరవిమర్శ జేసినచో నాసమస్తోపాసనయే ప్రధా నముగఁ దెలియవచ్చును; వాక్యమంతయు నేకవాక్యముగానే సమ న్వయ మగును. ఎట్లనిన :—ప్రాచీనశాలాదులు వైశ్వానరస్వరూపము నెఱుంగ లేక నశ్వపతికడకుఁ బోయి రని యుపాఖ్యాన మారంభింపఁబడి యున్నది. అచ్చట వారు మొట్టమొదట తమతమయభిప్రాయముల తమతమయుపాస్యదేవతల నెఱింగించిరి. అశ్వపతియు వానిని వైశ్వా నరావయవమాత్రములనుగా నిర్దేశించి వానియుపాసనలవలనఁ బ్రయో జనము లే దని నిందాపూర్వకముగఁ జెప్పెను; పిదప వైశ్వానరస్వరూ పము నిరూపించి సమస్తోపాసనను విధించెను. ఇట్లుండ నీవాక్యము లకు భిన్నార్థ మెట్లువచ్చును? వ్యస్తోపాసన లెట్లు కర్తవ్యము లగును? ఈకారణమువలన నాప్రత్యేకోపాసనలయందుఁ గానవచ్చువిధులు పరాభి ప్రాయము నాశ్రయించి చెప్పఁబడినవియే యనియును ఫలములును సమస్తోపాసనాస్తుత్యర్థమై వర్ణింపఁబడినవే యనియు సిద్ధాంత మగు చున్నది. ఎట్లును ఇందు వాక్యభేదమును నిరూపించుటకు వీలులేదు. పై నిరూపించినవాక్యార్థసందర్భమువలన "ప్రత్యేకోపాసనానింద సమస్తోపాస నాస్తోత్రార్థమైనది" అని నిర్ణయించుటకు వీలు లేదు. వ్యస్తోపాసనల విధిం

చుటయందు వేదమునకుఁ దాత్పర్యము కల దనుటయే మొట్టమొదట సంభవింపకున్నది కదా! కావున నచ్చట విధింపఁబడినది సమస్తోపాసనయే.

విశేషాంశము :— సూత్రకారుఁడు వ్యస్తోపాసనాపక్షమును గూడ సమ్మతించె ననియు సమస్తోపాసనమును శ్రేష్ఠముగ మాత్రమే గ్రహించె ననియు మఱికొందఱు చెప్పుచున్నారు. ఇది యుక్తము కాదు. పైనిరూపించినరూపణవలన నాసందర్భమంతయు నేక వాక్యముగ నిర్ణయింపఁబడుటకు వీలు కలిగియుండ వాక్యభేదము నుద్భా వించుట న్యాయము కానేరదు కదా! "మూర్ధా తే వ్యపతిష్యత్" "వైశ్వానరుని శిరస్సగు ద్యులోకమును మాత్రమే వైశ్వానరుఁడుగా (అవయవిగా) నజ్ఞానముచే నుపాసింతువేని నీశిరస్సుభగ్నమై యుండును." అను మొదలగు నిందావాక్యములకును ఈసమ్మతి విరోధ మగును. ఆనిందలు ప్రత్యేకోపాసనలను నిరాకరించుచున్నవి కదా! మఱియు పైసందర్భమున నుపసంహారమునందు సమస్తోపాసనయు నుపక్రమమునందు వ్యస్తోపాసనయుఁగూడ స్పష్టముగనే విధివాచక క్రియాపదబలమువలన (ఆపదములు వర్తమానకాలములోనే యున్నను "వచనాని" అను న్యాయము ననుసరించి విధివాచకములుగఁ గల్పింపఁబడవలయు ననుట) కర్తవ్యమునుగా స్పష్టము లగుచుండుటచేత "ఇచ్చట వ్యస్తోపాసనల నాచరింపవలయునా? లేక సమస్తోపాసనల నాచరింపవలయునా?" అను సంశయమే మొట్టమొదట కలుగుటకు వీలు లేదు; "వ్యస్తసమస్తోపాస నలను రెంటినిఁ గూడ నాచరింపవలసినదియే" యని సిద్ధాంతము వచ్చు టకును వీలులేదు. "ఇట్లయిన సూత్రమునందు కల జ్యాయస్త్వపదమున కర్థ మేమి? శ్రేష్ఠత్వమా? కాదా? శ్రేష్ఠత్వమైనచో నంతకంటె హీన మైనది యొక్కటి యవశ్యముగనుండవలయును కావున నప్పుడు వ్యస్తో పాసనయు నవశ్య మంగీకార్యమే యగును" అనియెదవేమొ. అది యుక్తము కాదు. ఆపదమునకు లక్షణావృత్తితోఁ గూడ నర్థము చెప్ప వచ్చును. ప్రమాణసిద్ధ మగుటచే సమస్తోపాసన శ్రేష్ఠ మనవచ్చును; అట్టిది కాకపోవుటచే వ్యస్తోపాసన హీన మనియుఁ జెప్పవచ్చును. ఇట్లు చెప్పిన నప్పుడు వ్యస్తోపాసనను సమ్మతింపవలసినయావశ్యకత లేదు కదా! కావున వీరివ్యాఖ్యానము దోషయుక్తమైనది. సమస్తోపాసన నొక్కదానిని

మాత్రమే యాచరింపవలయు ననుటయు వ్యస్తోపాసనను పరిత్యజింప వలయు ననుటయు మాత్రమే శ్రుతికిని సూత్రకారునకును గూడ సమ్మతము.

## 33. శబ్దాదిభేదాధికరణము.

విషయసంశయసంగతులు:—పూర్వాధికరణమునందు వ్యస్తోపాస నలకుఁ గూడ ఫలశ్రుతి యున్నను సమస్తోపాసనయే శ్రేష్ఠ మని చెప్పఁ బడి యున్నది. ఈ కారణమువలన నన్ని యుపాసనలవిషయము కూడ నిట్లేయగునేమో; ప్రత్యేకఫలశ్రుతులును విధిశ్రుతులును బాధింపఁబడి సగుణోపాసనజాతి ప్రాణోపాసనాజాతి యంతయు నొక్కటియే యగు నేమో యని దృష్టాంతసంగతితో సంశయము వచ్చును. పరమేశ్వరు నొక్కనినే గుణభేదములతో నుపాసన చేయవలయు నని విధించు శాండిల్యవిద్య దహరవిద్య మొదలగునవి యనేకములు వేదమునఁ గలవు. ప్రాణోపాసన యనుపేర్లుగలవిద్యలు ననేకములు గలవు. ఇవి యేజాతికి నాజాతి యేకోపాసనయే కావచ్చు నేమో యనుసంశయము జనించును. ఇది యీ యధికరణమున నిరాకరింపఁబడును. పాదారంభము మొదలు నింతవఱకు విద్యాభేదమును సిద్ధముగఁ గైకొని విచారింపఁబడెను. ఇప్పు డావిద్యాభేదమే యాక్షేపపూర్వకముగ నిరూపింపఁబడును.

పూర్వపక్షము.—"సగుణుఁ డగునీశ్వరుని గూర్చి చెప్పునుపాస నలును ప్రాణాదులను గూర్చి చెప్పునుపాసనలును మఱియు నచ్చటచ్చట గలసజాతీయోపాసనలు నేకములేయని తోఁచుచున్నది. ప్రత్యేకముగ విధి శ్రుతులును ఫలశ్రుతులు నున్నను అవి పూర్వాధికరణన్యాయమున బాధింపఁబడవచ్చును. ఉపాస్యదేవతయు సజాతీయోపాసనలయందు భేదిం పదు. గుణము లొకచోట నొక్కస్థలమునకంటె మఱియొక్కస్థలమున నధిక ములుగానో యల్పములుగానో చెప్పఁబడియున్నను అంతమాత్రమువలన గుణికి భేదము కలుగవలసినపని లేదు. ముఖ్యముగ పరమేశ్వరునిఁగూర్చి చెప్పు నుపాసనలనాశ్రయించి చూచిన నీవిషయము బొత్తుగనే సంభవిం పదు. ఆతఁడు స్వతస్సిద్ధుఁ డగుటచే నాతనిగుణములు కూడ నట్టివే కావల యును. ఒకపురుషునిఁగూర్చి 'వీఁడు విశాలనేత్రుఁడు' అని యొక్కస్థలము

నను 'వీఁడు విశాలవక్షస్కుఁడు' అని మఱియొకస్థలమునను చెప్పినంత మాత్రమున వానికి (ఆవిశేషణములచే ప్రశంసింపఁబడిన పురుషునకు) భేదము కలుగునా ? వస్తువునకు నెప్పటికిని వికల్పముండదు. ఈకారణము వలన గుణములు భిన్నములైనను దేవత భిన్నము కాదు; గుణవిధాన పరము లగుటచే శ్రుతులకును బాధ లేదు. కావున దేవతకు భేదము లేకపోవుటచే నొక్కశాండిల్యవిద్య నుపాసింపఁదలచినవాఁడైనను పరమేశ్వర ప్రతిపాదకము లగుదహరాదివిద్యలలో నున్నగుణముల నుపసంహరించుకొనవలయును. ఒక్కప్రాణవిద్య నుపాసించువాఁడైనను అట్టి విద్యలయందలి గుణముల నుపసంహరించుకొనవలయును."

---

## అ_3. పా_3. సూ_౫౮.

అవతారిక :— అని యిట్లు వచ్చిన పూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౪౧౮. నానాశబ్దాదిభేదాత్. 3. 3. ౫౮.

తాత్పర్యము :— ఇట్లు చెప్పఁగూడదు. విద్యలు ఏకములు కానేరవు. పరమార్థస్థితిలో నుపాస్యదేవత యొక్కటియేయైనను విద్యలకు మాత్రము పరస్పరభేదము నిత్యముగఁ గలుగును. ఏల యనిన నాయా యుపాసనల విధించుశబ్దములు 'ఉపాసీత వేద క్రతుం కుర్వీత' 'ఉపాసన చేయవలయును క్రతువు నాచరింపవలయును తెలిసికొనవలయును' అని పరస్పరభిన్నములుగ నున్నవి. ఎచ్చట శబ్దభేదము కానవచ్చునో యచ్చట నాశబ్దములచే విధింపఁబడువానికిఁ గూడ భేదము కలుగవలయు ననుట నియమము. "సరియే మీయుదాహరణమునందు శబ్దములుమాత్రము భిన్నములే కాని తదర్థములు భిన్నములు కావు. అన్నిపదములును మనోవ్యాపారమును గూర్చియే కదా చెప్పుచున్నవి. కర్మకాండమున నన్ననో 'యజతి' అనుమొదలగుపదములకు పరస్పర మర్థభేద ముండును కావున నచ్చట కర్మభేదమును సాధించుటకు నిది హేతువుగా నుండును. ఇచ్చట నట్లు లేదు కదా !" అనియెదవేమొ వినుము. అన్నిపదములును మనోవృత్తినిఁ గూర్చి చెప్పునవియేయైనను ఆమనోవృత్తికి నాలంబనను లగు గుణములు పరస్పరభిన్నము లగుటచేతను దాని నాశ్రయించి యుపాస్య

దేవతయు స్వయముగ నభిన్నుఁడే యైనను రూపభేదములచే భిన్నుఁడుగాఁ గల్పింపఁబడుచుండుటచేతను విద్యలుమాత్రము పరస్పరము భిన్నములు కావచ్చును. పరమేశ్వరుఁ డొక్కఁడే యుపాస్యదేవత యైనను ఉపాసనా ప్రకరణములలో నొకదానియందు చెప్పఁబడినగుణములు మఱియొకదాని యందు లేవు; ప్రాణవిద్యలయందుఁగూడ నట్లే లేవు. ఆప్రాణమునే ఒక స్థలమున నొకవిధముగాను మఱియొకస్థలమున మఱియొకవిధముగాను ఉపాసింపవలయు నని చెప్పఁబడియున్నది. ఈకారణమువలన గుణభేదము వలన విద్యాభేదము కలుగును. ఒకపురుషుని కొందఱు యజమానునిఁగాను కొందఱు తండ్రిగాను కొందఱు సోదరునిఁగాను మఱికొందఱు మిత్రునిఁగాను ఉపాసించునప్పుడు పురుషుఁడొక్కఁడే యైనను అన్నిగుణములు నాతనియందే యున్నను ఉపాసనలు మాత్రము భిన్నము లైనట్లు దేవత యొక్కఁడే యైనను ఉపాసనలయందు పేర్కొనఁబడినగుణము లన్నియు నాతనియందే యున్నను ఉపాసనలుమాత్రము పరస్పరము భేదించును.

"ఏది యెట్లున్నను వస్తువునకు వికల్పము సంభవింపదు కదా" అనియెదవేమొ వినుము. ఉపాసనలు వస్తువు నాశ్రయించినవి కావు; "ఈవస్తువును ధ్యానింపవలయును" అనిమాత్రమే విధించునవి. ఇట్లగుటచే నుపాసనాభేద మున్నను వస్తువునకు వికల్ప ముండవలసినపని లేదు. "ఇట్లయినను దోషము తొలఁగిపోవదు. ఉపాసనక్రియ మనోవ్యాపారము నాశ్రయించును. అదియు నుపాస్యదేవత నాశ్రయించును. ఆదేవతయు స్వతస్సిద్ధుఁడు. గుణములు నట్టివే కావలయును. ఈకారణమువలన యథాపూర్వముగనే విద్యలకు నభేదము కలుగవలసి వచ్చినది" అనియెదవేమొ యట్లు కాదు. మనోవ్యాపార ముపాస్యదేవత నాశ్రయించినను ఉపాసనావిధి నాధారమును చేసికొనియే నాశ్రయించును కావున దానికి నాపరమేశ్వరుఁడు సమగ్రగుణసమన్వితుఁడై గోచరుఁడు కాఁడు. పురుషుఁ డొక్కఁడే యైనను ఉపాసకులభావన నాశ్రయించి యందఱకు నన్నిరూపులై యుండు నని యిదివఱకే చెప్పియున్నాము కదా! ఉపాసన కార్యము కావున నది పురుషేచ్ఛకు నధీనమైయుండును. కావుననే యుపాసనార్థమై గ్రహింపఁబడుగుణములు కర్మలవంటివి. కర్మలు పురుషేచ్ఛాధీనములై చేయఁబడుటకుఁగాని చేయఁబడకుండుటకుఁగానిమఱియొకవిధముగ

చేయఁబడుటకుఁగాని వీలగునట్లు ఈసత్యకామత్వాదిగుణములు కూడ నట్లే భావింపఁబడుటకుఁగాని భావింపఁబడకుండుటకుఁగాని మఱియొకవిధముగ భావింపఁబడుటకుఁగాని వీలగుచుండుటచే వీనికిఁ గర్మలతో సామ్య మని యెఱుంగునది. ఇట్టివే యైనను కర్మ లెట్లు నియతములై యున్నవో యట్లే యుపాసనలు గూడ సంకేతితములై (ఈగుణములతో బరమేశ్వరు నుపాసించిన నాధ్యానమున కీపేరు అని నామకరణము చేయఁబడినవియై) యున్నవి. కావున నీగుణములు వాస్తవస్థితిలోఁ బ్రధానములు కాక పోయినను ప్రధాన మగునుపాస్యదేవత యభిన్నమే యైనను పురుషా ధీనతవలన విద్యలుమాత్రము భేదించును. ప్రభువు ఒక్కఁడే యైనను అధికారిభేదమువలన సేవలు భేదించును కదా! ఆసేవాభేదమునకు నధి కారులవిద్యయు గుణములును సామర్థ్యంబును హేతువు లగునుకాని రాజగుణములు కావు. రాజగుణములు ఒక్కొక్కనికి ఒక్కొక్కటిగా పంపఁబడియుండలేదు కదా! సర్వము కల్పనామాత్రమే యగుటచే విద్యా భేదము కలుగు ననువిషయమున విరోధ మింతయు లేదు. మఱియు నేవిషయమైనను సిద్ధాంత మైనపిదప నుండుగుణములు త (విషయ) ద్భేద కములు కానేరవనియు సిద్ధాంతము కాకమునుపే యుండు గుణములు మాత్రము తద్భేదకము లగు ననియు నిదివఱకు నిరూపించి యున్నాము. ప్రకృతమున "ఈయుపాసన యిట్టిది" యని విధింపఁబడకమున్నే గుణ విభాగము చేయఁబడియున్నది. అట్లే యుండవలయును; లేకున్న నుపదేశ భేదమే సంభవింపదు కదా! కావున నుపాసనలయందు పేర్కొనఁబడిన గుణములు విషయభేదకములే (దేవతాభేదకములే) యగు ననుట నిస్సంశయము. ఆభేదకత్వంబును కల్పితమే యని వివరించి యున్నాము కావున దేవతాభేదము వాస్తవస్థితిలో లేకున్నను విద్యాభేదముమాత్ర ముండు ననుటలో విరోధము లేదు.

"ఇట్లయినను ఒకవిద్య ప్రధానమనియు తక్కినవి గుణవిధు లనియు జెప్పఁబడవచ్చును" అనియెదవేమొ, యది యుక్తము కాదు. ఆవిద్య లలో నేది ప్రధానమో యేదిగుణవిధియో నిర్ణయించుటకుఁ బ్రమాణ మేదియు లేదు కదా! మఱియు విద్యలలో గుణము లనేకములుగఁ జెప్పఁ బడియున్నవి. ఒక్కస్థలముననే యన్నివిద్యలును బ్రాప్తించు ననుటయు యుక్తియుక్తముగ లేదు. పరమేశ్వరుఁ డనంతగుణములు కలవాఁడు.

వాని నన్నిటిని ధ్యానించి యెవ్వఁ డుపాసన నాచరింపఁగలుగును? పూర్వాధికరణములయందు నిరూపింపఁబడినవిధంబున నాశ్రయ మొక్కటి యగుటచే నొకానొకచోట నొకవిద్యను వర్ణించునప్పుడు మఱియొకవిద్య యందలిగుణము లుపసంహారమునకు వచ్చు ననుట సంభవింపదు. అట్లుప సంహరించుకొనుటయు నశక్యమే కదా! మఱియు నీపక్షమునే ("ఒకటి ప్రధానవిద్య; తక్కినవి గుణవిద్యలు" అనుపక్షమునే) యాశ్రయించిన నొక స్థలమునందుఁ జెప్పఁబడియున్న గుణములు మఱియొక స్థలమునఁ జెప్పఁబడకూడదు. వేదమున విమర్శించిన నిట్లు లేదు. శాండిల్య విద్యయందు చెప్పఁబడినగుణములే దహరవిద్యయందును కలవు. ఇవియును గాక ఫలాదినిర్ణయముతోఁ బ్రతియుపాసనయు ముగింపఁబడి యున్నది. వానికి నితరాకాంక్ష బొత్తుగనే లేదు. ఇట్లుండ నన్యవిద్యలయందలి గుణముల నేల యుపసంహరించుకొనును? మఱియు వైశ్వానరవిద్య యందు సర్వవాక్యములును సమస్తోపాసనాపరములుగ సమన్వయించు చున్నవి. కాని యిచ్చట (సర్వవిద్యావిషయమున) నట్లు లేదు. అన్ని విద్యలు నవయవములను బోధింపుచు నొక్క ప్రధానవిద్యను నిరూపించు చుండుట లేదు. అట్లుండిననే కదా యన్నియు నేకవాక్యము లగును. ఇదియునుగాక నుపాస్యదేవతయొక్క యభేదముచే నిరంకుశముగ విద్య లనేకము చేయఁబూనిన నప్పుడు సర్వగుణములును గ్రహింపఁబడవలయు ననువిషయ ముపదేశింపఁబడిన ట్లగును. ఇది యశక్య మని మున్నే వివ రించి యున్నాము. ఇట్టియశక్యవిషయము శాస్త్రము బోధించునా? ఈకారణమువలన విద్యలకు భేదము కల దనుటయే యుక్తము.

విశేషాంశము:—ఈయధికరణము నిర్ణయింపఁబడినపిదపనే యీ పాదము ప్రవర్తింపవలసి యుండెను. అయినను ప్రస్తావవశమున సూత్ర కారుఁడు దీని నిచ్చట వ్రాసె నని తెలిసికొనవలయును.

---

## ౩౪. వికల్పాధికరణము.

సంగతి, విషయసంశయములు:—పూర్వాధికరణమున విద్యాభే దము సిద్ధించెను కావున నాకారణమువలన నీయధికరణమునందు మఱి

యొకవిషయ మావిద్యలనుగూర్చి విచారింపఁబడును. "ఈవిద్యలలో నేదియో యొక్కటియే యుపాసింపఁబడవలయునా ? లేక ననేకవిద్యలు సముచ్చయముగఁ గల్పి యుపాసింపఁబడవచ్చునా ?" యనుసంశయ మిందు నివారింపఁబడును.

పూర్వపక్షము:—"విచారించినచో నిచ్చట సముచ్చయమును కాని వికల్పమును కాని నియమించుటకు వీలు లేదు. శ్రుతియందు విద్యాభేదము ప్రత్యక్షముగ వర్ణింపఁబడియుండ వానిసముచ్చయమును నియమించుటకు గారణ మేమియు లేదు కదా! 'అగ్నిహోత్రము దర్శపూర్ణమాసములు మొదలగుభిన్నకర్మలుకూడ సముచ్చితములై యొక్కని చేతనే యాచరింపఁబడుచు నున్నవి కదా!' అనియెదవేమొ యచ్చట విరోధము లేదు. అవి నిత్యములని శ్రుతిచేఁ జెప్పఁబడుచున్నవి. నిత్యకర్మలనిన నన్నికాలములయందు నేకరూపముతో నాచరింపఁబడవలసినవియే యగుటచేత నార్థికముగ సముచ్చయము సిద్ధించినది కాని యిచ్చట నట్లు లేవు. ఈయుపాసనలు నిత్యములు కావు కదా ! 'నిత్యములు కాకున్నను అన్నిటికిఁ బరమేశ్వరప్రాప్తి యొక్కటియే ఫల మగుటచే వీనికి వికల్పము సిద్ధించును. దేని నుపాసన చేసినను వచ్చుఫల మొక్కటియే కదా! కావున వికల్పమును నియమింపవచ్చు నని తోచుచున్నది' అనియెదవేమొ ఇదియు సిద్ధింపదు. కర్మకాండమునందు ఒక్కస్వర్గమునే యిచ్చునట్టికర్మలనేకము లున్నను వానియందు స్వేచ్ఛాచారము (అనఁగా పురుషుని యిచ్చచొప్పున వికల్పముగానైన సముచ్చయముగానైన నాచరింపఁబడుట) గానవచ్చుచున్నది. కావున నీయుపాసనలయందుఁగూడ యట్లే యుండ వచ్చును. అధికఫలము కావలయు నని కోరువాఁడు అయిదా ఉపాసనల కలిపి యాచరింపవచ్చును; లేనివాఁడు ఒక్కయుపాసననే యాచరింపవచ్చును కావున నిచ్చట నేపక్షమును కూడ నియమించుటకు వీలు లేదు."

## అ_౩. పా_౩. సూ_౫౯.

అవతారిక :—అని వచ్చినపూర్వపక్షమును ఖండించి "విద్యావిషయమున వికల్పమునే నియమింపవలయును" అని సిద్ధాంతము చేయుచున్నాఁడు.

—

## ౪౧౯. వికల్పోఽవిశిష్టఫలత్వాత్. 3. 3. ౫౯.

తాత్పర్యము:—ఈయుపాసనలవిషయములో వికల్పములే సిద్ధాంతము చేయవలయును. ఒకదాని నొనర్చినపిదప మఱియొకదాని నొనర్పవలసినపని లేదనియే నిరూపింపవలయును. ఏలయనిన అన్ని యుపాసనలకును పరమేశ్వరసాక్షాత్కార మొక్కటియే ఫలము. అది యొక్కయుపాసనచేతనే సిద్ధించుచుండ మఱియొకయుపాసన నాచరింపవలసినపని యేమి? సాక్షాత్కార మనిన పదార్థస్వరూపము నెఱుంగుట యగుటచే నది యొకదానివలన నల్పముగఁ గలుగు ననుటయు రెంటిమూఁటిని కలిపి యాచరించిన నధికముగఁ గలుగు ననుటయు లేదు. అది జ్ఞానమే యగుటచేఁ గలుగు ననిన సంపూర్ణముగనే కలుగవలయును లేకున్న బొత్తుగనే కలుగకుండవలయును. ఈకారణమువలన "ఫలాభివృద్ధికై యుపాసనల సముచ్చయముగా నాచరింపవచ్చును" అనుట యుక్తియుక్త మగుమాట కాదు. మఱియు ననేకవిద్యల నాచారములో నుంచుకొనిన నొకప్పు డొకరూపముతోను మఱియొకప్పుడు మఱిగొకరూపముతోను పరమేశ్వరు ధ్యానింపవలయుటచేఁ జిత్తవిక్షేపము కలుగును; దానివలన గలుగుసనర్థముల జెప్ప నక్కఱ లేదు కదా!

"విద్యలకు క్రమముక్తి ఫల మై యుండఁగా సాక్షాత్కారము ఫల మనుట యెట్లు? సాక్షాత్కారము ప్రత్యక్షమోక్షమే కదా!" అని యెదవేమొ వినుము. మోక్షము నిర్విశేషబ్రహ్మసాక్షాత్కారమువలనఁ గలుగును; క్రమముక్తి సగుణబ్రహ్మసాక్షాత్కారమువలనఁ గలుగును. క్రమముక్తికిఁగూడ సాక్షాత్కారము కావలయు నని శ్రుతిస్మృతులు ఘోషించుచున్నవి. "యస్య స్యా దద్ధా న విచికి త్సాస్తి. దేవో భూత్వా దేవా నప్యేతి" "ఏయుపాసకునకు నీబ్రహ్మస్వరూపము తెలియునో బ్రహ్మప్రాప్తినిఁ గూర్చినసంశయ ముండదో, ఆపరమేశ్వరునకును తనకును భేదము లే దని నిర్ణయించినవాఁడు పరమేశ్వరునిఁ జెందును" అని శ్రుతులయందును "సదా తద్భావ భావితః" "ఎప్పుడును పరమేశ్వరభావనతోను పరిపూర్ణుఁడై యుండువాఁడు" అని స్మృతులచేతను యీవిషయము వివరింపఁబడెను. సముచ్చయమునుగాని స్వేచ్ఛా

చారముగాని సిద్ధాంతముఁ జేసిన దీనికి భంగము వచ్చు నని తెలిపితిమి కావున వికల్పమే సిద్ధాంతము.

---

## ౩౫. కామ్యాధికరణము

సంగతి, విషయ సంశయ పూర్వపక్షములు:-పూర్వాధికరణమునఁ జేయఁబడినవికల్పసిద్ధాంతము సాక్షాత్కారసంబంధము లేనివిద్యలయందు కుదుర దని ప్రత్యుదాహరణసంగతితో వచ్చినయాక్షేపము నంగీకారముచే నీయధికరణమునఁ బరిహరించుచున్నాఁడు. "న య ఏత మేవం వాయుం దిశాం వత్సం వేద న పుత్రరోదం రోదితి స యో నామ బ్రహ్మే త్యుపాస్తే యావ న్నామ్నో గతం తత్రాస్య యథాకామచారో భవతి" "ఎవ్వఁడు ఈవిధముగ వాయువును దిక్కులకు పుత్రునిఁగా నెఱుంగునో వాఁడు పుత్రశోకము నొందఁడు. ఎవ్వఁడు నామధేయమును బ్రహ్మమునుగా నుపాసించునో యట్టివానికి నామధేయ మున్నచోట నెల్ల స్వేచ్ఛాసంచారము కలుగును" అని సాక్షాత్కారమాత్రసాధ్యములు కానిఫలములఁ జెప్పు నుపాసనలైనను సముచ్చయవికల్పముల పురుషేచ్ఛాధీనములై చెందునా? చెందవా? యనుసంశయమును నిరాకరించుచున్నాఁడు. ఒకవేళ పూర్వమువలెనే వికల్పనియమమే కలిగినను కలుగవచ్చు ననుపూర్వపక్షాభిప్రాయమును ఖండించుచున్నాఁడు.

---

## ౪౨౦. కామ్యాస్తు యథాకామం సముచ్చీయేరన్న వాపూర్వహేత్వభావాత్. ౩. ౩.౬౦.

తాత్పర్యము:—సాక్షాత్కారమూలమున క్రమముక్తి నొసంగునవి కాక నదృష్టమును కలిగించి దానిమూలమున కామ్యఫలముల నొసంగునుపాసనలవిషయములో పూర్వాధికరణసిద్ధాంతము ప్రవర్తింపదు. అవి పురుషేచ్ఛాధీనములై సముచ్చయవికల్పముల నొందును. వానికి ఫల మేకము కాదు కావున ఫలాధిక్యమునకై సముచ్చయముగ

నైనను శక్తి లేకున్న వికల్పముతో బ్రత్యేకముగ నైనను యథేచ్ఛముగ వాని నాచరింపవచ్చును.

---

# ౩౬. యథాశ్రయభావాధికరణము

సంగతి విషయసంశయములు:-పూర్వాధికరణమునఁ గొన్నియుపాసనలయందు యథేచ్ఛాచార మంగీకరింపఁబడెను. అవి స్వతంత్రము లగుటచేతఁ బరతంత్రములగుకర్మాంగాశ్రితోపాసనలయందు ఆస్వేచ్ఛాచారముండుటకు వీలు లేదని ప్రత్యుదాహరణసంగతితో వచ్చునాక్షేప మీయధికరణమునఁ బరిహరింపఁబడును. ఉద్గీథాదికర్మాంగముల నాశ్రయించినయుపాసనలనుగూర్చి యిందు విచారింపఁబడును. తన్నిర్ధారణాధికరణమునందు (సూ. 3. 3. ౪౨.) ఈవిషయమే ప్రస్తావింపఁబడి "పర్ణమయీన్యాయమున నుపాసనలు ప్రధానయాగముతో జేరియే యుండవలయును" అని చేయఁబడినయాక్షేపమునకు "ఆయుపాసనలుపురుషార్థహేతువులగుటచేత వానికి నన్యసంపర్కముతోఁ బనిలేదు" అని నిర్ణయింపఁబడియున్నది. అట్టిపని యుండిననేగాని అనుష్ఠానవిధి రెంటికి నొక్కటిగా నుండదు; ఉండకపోయిన రెండును అభిన్నములు కానేరవు కదా! ఇట్లయినను ఆసిద్ధాంతముపై వచ్చుమఱియొకయాక్షేప మీయధికరణమున విచారింపఁబడుచున్నది. సముచ్చయస్వేచ్ఛాచారములలో నేది యుక్తియుక్తమనుసంశయము నివారింపఁబడుచున్నది.

---

## అ-3. పా-3. సూ-౬౧.

అవతారిక:—సిద్ధాంతమునకై మొట్టమొదట నాల్గుసూత్రములతోఁ బూర్వపక్షము ననువాదము చేయుచున్నాఁడు.

---

## ౪౨౧. అఙ్గేషు యథాశ్రయభావః 3. 3. ౬౧.

తాత్పర్యము:—"విచారించిన కర్మాంగాశ్రితోపాసనలు తమకాశ్రయము లగుస్తోత్రాదులవలెనే కర్మలతో సముచ్చయము నొందవలయు

ననియే తోఁచుచున్నది. ఇవి ఫలార్థమై చేయఁబడునవి యగుటచే కామ్యము లైనను పురుషార్థము నొసంగఁగలవి యైనను స్వతంత్రములు మాత్రము కానేరవు. అప్పుడు (స్వతంత్రములే యైనచో) కర్మలకును వీనికిని సంబంధ ముండుటకు వీలులేదు. కావున కర్మలతోఁ గూడ నైనను కర్మలకంటె బిడప నైనను కేవలములుగా నైనను ఆచరింపఁబడవలసి వచ్చును. అది ప్రత్యక్షమున లేదు కదా! ఈకారణమువలన నాయా యుపాసనలకు చెప్పఁబడినఫలములుకూడ నవి (ఉపాసనలు) యజ్ఞముతో జేర్చి యాచరింపఁబడినప్పుడే కలుగు ననుటయే శ్రుతికి నుద్దేశమైనట్లు స్పష్టమగుచున్నది. ఇట్లగుటచే నాశ్రయము లగుయజ్ఞాంగములనుగూర్చి ప్రవర్తించు ప్రయోగవిధులే యీయాయుపాసనలకును ప్రయోగవిధులగును, ఆయజ్ఞాంగమునకు యజ్ఞములతో సంబంధము సముచ్చయము కలిగినట్లే యీయాయుపాసనలకును సముచ్చయము కలదు. యజ్ఞాంగములకు గలసము చ్చయము నిత్య మైనట్లే వీనిసముచ్చయము గూడ నిత్య మగును. ఇట్లు లేకున్న నీయుపాసనలకుఁ గర్మాంగసంబంధము కలుగుటకే వీలులేదు కదా! 'ఇట్లు చెప్పుటకు వీలులేదు. పురుషుఁడు ఫలమును కోరి ఉపాసనల నాచ రించును. కోరకున్న నాచరింపఁడు. ఇట్లుండ కర్మతో వానికి నిత్యసము చ్చయ మెట్లు కుదురును? కర్మాంగము నిత్యము కర్మలతో సముచ్చయము పొందవలసినది. దాని నాచరింపకున్నఁ గర్మకు లోపము వచ్చును. ఉపాసనయో యనిత్యము. దాని నాచరించినఁ గర్మకు నధికబలము వచ్చు ననియు నాచరింపకున్నను అది (కర్మ) నిష్ఫలము కానేర దనియును శ్రుతి చెప్పుచున్నది. ఇట్లుండ నిత్యానిత్యములకు పోలిక యెటనుండి వచ్చును?' అనియెదవేమొ వినుము. కర్మాంగమునకు సంబంధించిన ప్రయోగవిధియే తదాశ్రిత మగునుపాసనలతోఁ గూడ సంబంధించు నని యిదివఱకే చెప్పి తిమిగదా! ఆవిధియే పురుషునకు నిత్యముగ ఫలవాంఛను కలిగించును. ఫలవాంఛ లేకున్న నుపాసన నాచరింపఁడు కావున ఆచరింపకున్న ప్రయోగ విధి నిరర్థకము కావలసివచ్చును కావునను అది (ఆప్రయోగవిధి) నియత ముగ ఫలవాంఛను కలిగించును. కావున నెట్లును ఆశ్రయము లగు స్తోత్రాదులవలె నుపాసనలును కర్మలతో సముచ్చయము నియతముగ నొందునవియె.

---

## ౪౨౨. శిష్టేశ్చ. 3. 3. ౬౨.

తాత్పర్యము :— మఱియు విధానప్రకారమును బట్టిచూచినను కర్మాంగములకు దదుపాసనలకును భేదము లేదు. వేదత్రయమునందును 'ఉద్గీథాదులను కర్మసమయములయం దాచరింపవలయును. (వాని యధ్యయనము మొదలగువాని నాచరింపవలయు ననుట)' అని కర్మాంగములను గూర్చియు "ఉద్గీథమును (అందలి యోంకారమును) ప్రాణమునుగాను సూర్యునిగాను ఉపాసింపవలయును." అని యుపాసనలనుగూర్చియు విధి సమానముగనే యున్నది. 'ఉపాసనలు కర్మాంగములకు నంగములుగ నున్నను వానిని యథేచ్ఛముగ నాచరింపవచ్చును.' అనియు 'యజ్ఞాంగములను మాత్ర మెప్పటికిని యాజ్ఞములతోఁ జేర్చియే యాచరింపవలయును' అనియు నెచ్చటను లేదు కదా ! ఈకారణమువలనఁ గూడ కర్మాంగములును వాని నాశ్రయించిన యుపాసనలును కర్మతో సముచ్చయము నొందు ననియే చెప్పి తీరవలయును.

---

## ౪౨3. సమాహారాత్. 3. 3. ౬3.

తాత్పర్యము:—ఇదియునుగాక నీవిషయమున లింగము గూడ కలదు. ఛాందోగ్యోపనిషత్తునందు ఉద్గీథవిద్యయందు 'హోతృషదనాద్ధైవాపి దురుద్గీథ మనుసమాహరతి' 'ఉద్గాత తనకర్మమునందు (సామగానమునందు) లోపమును గావించెనేని హోతయొక్కస్థానమునఁ గూర్చుండి యాతఁడు చేయుకర్మను జేసినచో నాదోషమునుండి విముక్తుఁడగును.' అని యున్నది. దీనినిఁ బట్టి విమర్శించిన వేదత్రయమున విధింపఁబడినవన్నియు నన్నిస్థలములలోనికి దెచ్చికొనఁబడవచ్చునని తెలియవచ్చుచున్నది. ఉద్గాత సామగానము నాచరించువాఁడు; హోత ఋగ్వేద మంత్రములతో నాయా కార్యముల నాచరించువాఁడు. ఉద్గాతకు దోష శాంతికై ఋగ్వేదమంత్రములు అందలి విధానములు కావలసివచ్చుటచే నవసరమైనవిషయము లన్నియు నన్ని వేదములనుండియుఁ బరిగ్రహింపఁబడవలసినవియే యని తోఁచుచున్నది.

---

## ౪౨౪. గుణసాధారణ్యశ్రుతేశ్చ. 3. 3. ౬౪.

తాత్పర్యము :—మఱియొకగుఱుతుకూడఁ గానవచ్చుచున్నది. ఉద్గీథవిద్యయందు ఓంకారమే యుపాస్యదేవతగాఁ జెప్పఁబడి యున్నది. ఉద్గీథావయవ మగుటచే నదియే విద్యకు నాశ్రయమై కర్మాంగమైకూడ నున్నది. దానినిగూర్చియు 'తే నేయం త్రయీ విద్యా వర్తతే' ఈయోంకారముచేతనే వేదత్రయమునందుఁజెప్పఁబడినకర్మలును ప్రవర్తించుచున్నవి' యని సర్వవేదోపసంహారము చెప్పఁబడి యున్నది. ఉపాస్యదేవత సర్వవేదములతోను సంబంధించియుండ నుపాసనమాత్రమేల సంబంధింపదు? విచారించిన నీరెంటికిని (కర్మాంగమునకును తదుపాసనకును భేదము కానరాదు కదా! కావున నీగుఱుతునుబట్టి చూడ కర్మాంగోపాసనలు కర్మలతో సముచ్చయము నొందునవియే.

మఱియుఁ బ్రయోగవిధి రెంటికిని సమానముగ నుండుటచే సర్వవిషయములును సమానములుగనే యుండవలసి వచ్చును. కర్మాంగములకుఁ గర్మలతో సముచ్చయము లేకున్న నుపాసనలకును లేకపోవచ్చును గాని యట్లు లేదు. ఈకారణములవలన నుపాసనలు గర్మలతో సముచ్చయము నొందు ననుటయే నిర్వివాదాంశము."

### అ_3. పా_3. సూ_౬౫.

అవతారిక:—అని యిట్లు వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౪౨౫. న వా తత్సహభావాశ్రుతేః. 3. 3. ౬౫.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. అంగములు సముచ్చితములై యున్నను ఉపాసనలుమాత్ర మట్లుండనేరదు. శ్రుతియందు "గ్రహం వా గృహీత్వా చమసం వోన్నీయ స్తోత్ర ముపాకరోతి స్తోత్ర మనుశంసతి ప్రస్తోతః సామ గాయ హోత రేత - ద్యజ" "పాత్రమును గ్రహించి కాని చమసమును పైకి నెత్తికాని స్తోత్రము నాచరించును. స్తోత్రమును పఠించును. ఓస్తోత్రము చేయువాఁడా సామగానము నాచరింపుము. హోమము చేయువాఁడా నీవు హోమము నాచ-

ఠిష్ఠపుము" అని యవసరము కలిగినప్పుడు వేదత్రయమునందు నున్న విధుల నొక్కస్థలముననే యుపసంహారించుకొనవలయు ననునది స్పష్టము గనే వివరింపబడియున్నది. ఉపాసనలను గూర్చి మాత్ర మిట్లు చెప్పఁబడియుండలేదు. "ప్రయోగవిధి సర్వసాధారణముగ నున్నది కావునఁ గర్మాంగములవలెనే యుపాసనలును సముచ్చితములు కావచ్చునంటిమి కదా!" అనియెదవేమొ యది సరికాదు. ఉపాసనలకు ప్రత్యేకఫలములు కల వనియు అవి పురుషేచ్ఛాధీనము లనియు నిదివఱకే చెప్పితిమి. ప్రయోగవిధి మొట్టమొదటినుండియు సిద్ధమై యున్నవస్తువు నాశ్రయించునేగాని వానిస్వభావమును మార్పఁజాలదు. కర్మాంగములు కర్మతో నిత్యసంబంధము కలిగియుండవచ్చును గావున వానినిమాత్రము కర్మలతో ప్రయోగవిధులు సముచ్చయము చేయఁగలవు. కాని యుపాసనలనుమాత్ర మట్లు చేయనేరవు. అవి స్వతంత్రములు; పురుషకామము నాశ్రయించి ప్రవర్తించునవి. కామంబును ఉద్దేశము; ఒకదానిని చెందవలయు ననుసంకల్పము. ఇది పురుషాధీనముగఁ గలుగవలసినదియే కాని మఱియొకని నిర్బంధమువలన కలుగవలసినది కాదు కదా! ఇందును నిర్బంధ ముండవచ్చు ననిన నప్పు డదిసంకల్పమే కానేరదు. ఈ కారణము వలన కర్మాంగములు నిత్యములు; అనిత్యకామముల నాశ్రయించినవి యగుటచే విద్య లనిత్యములు. వీనికి నాశ్రయాశ్రయిభావసంబంధ మున్నను సాదృశ్యము మాత్రము కలుగదు.

ఇట్లు కొన్ని నిత్యములును మఱికొన్ని యనిత్యములు నగుటయే యుపదేశమునందలి భేదము. "దీని నిట్లు గావింపవలయును" అనునంశము మాత్ర మంతటను సమానముగనే యున్నను పూర్వాపరవిమర్శ నాచరించినచో నీభేదము కానవచ్చుచున్నది. మఱియు మీ రుపన్యసించిన రెండు లింగములును మీపూర్వపక్షమును దృఢపఱుపనేరవు. కర్మాంగములు కర్మ సముచ్చితములు కావచ్చు నని మే మంగీకరించుచునే యున్నాము; ఉపాసనలకును వానికిని సంబంధ మున్నను సాదృశ్య ముండ దని మాత్రమే నిరూపించుచున్నాము. ఉపాసనలు గర్మాంగములకు సంబంధించు ననఁగా గర్మాంగము లున్నప్పుడే యవి యుండు ననుటయు లేనప్పు డుండ వనుటయు మాత్రమే యర్థము కాని త్రాటితో కట్టఁబడినవానివలె నాయంగములతోడనే కట్టఁబడియుండి యవి యెటకుఁ బోయిన నటకుఁ బోవుచు

నుండు ననుట యర్థము కాదు. ఉపాసనలకు కర్మాంగము లుపాస్యదేవతలు మాత్రమే కదా యగుచున్నవి. ఇట్లగుటచే నుపాసనలు స్వతంత్రములు; పురుషేచ్ఛ నాశ్రయించినవి. ఈకారణమువలన నిచ్ఛవచ్చినట్లు కర్మతో చేర్చి యైనను చేర్పక నైనను ఆచరింపఁబడవచ్చును ; ఆచరింపఁబడకను పోవచ్చును.

---

## ౪౨౬. దర్శనాచ్చ. ౩. ౩. ౬౬.

తాత్పర్యము:—మఱియు ప్రత్యక్షముగనే శ్రుతి యీవిషయమును చెప్పుచున్నది. కొన్నికర్మాంగోపాసనలను బోధించి "ఏవం వి ద్ధ వై బ్రహ్మా యజ్ఞం యజమానం సర్వాంశ్చ ఋత్విజోఽభిరక్షతి" "ఈవిధముగఁ గర్మాంగస్వరూపము నెఱింగినవాఁడు యజ్ఞమును ఋత్విజులనుగూడ రక్షించును" అని యుపాసకుని శ్రుతి ప్రశంసించుచున్నది. ఉపాసనలు ప్రతికర్మయందును గర్మాంగములతోఁబాటు నుపసంహరించుకొనవలసినవియే యగునేని యందఱకుఁ దత్ జ్ఞానము కలుగవలయుట యావశ్యకమే యైయుండ శ్రుతి యిట్లొక్కని నేల ప్రశంసించును? కావున దీనినిబట్టి చూచిన "ఉపాసనావిధి యందఱకు నావశ్యకము గాదు; పురుషేచ్ఛాధీనమే" యని తేలుచున్నది. ఇట్లగుటచేఁ బురుషుఁడు గర్మాంగోపాసనల యథేచ్ఛముగ సముచ్చయముతో నైనను వికల్పముతో నైన నాచరింపవచ్చును.

బ్రహ్మసూత్రార్థచంద్రికయందు తృతీయాధ్యాయమున
తృతీయపాదము.

---

•



# బ్రహ్మసూత్రార్థచంద్రిక

## తృతీయాధ్యాయము - చతుర్థపాదము

## పాదావతారిక

పూర్వపాదమున సగుణనిర్గుణవిద్యలనుగూర్చి విచారింపఁబడెను. గుణోపసంహారనిర్ణయమువలన వానిసంఖ్య యార్థికముగ స్థిరపఱుపఁబడెను. ఆయుపాసనలు ముప్పదిరెండుమాత్రమే కల వని తెలిసికొనవలయును. ఈపాదమునందు "ఆ సగుణనిర్గుణవిద్యలు మఱియొకకర్మతో సంబంధపడక స్వతంత్రములయియే ఫలము నొసంగును" అనువిషయము సయుక్తికముగ నిరూపింపఁబడును.

ఉపనిషద్బ్రహ్మజ్ఞానమునకు మోక్షఫలము నొసంగుసామర్థ్యము కల దనియు సగుణోపాసనలుకూడ నట్టివే యనియు నంగీకరించి పూర్వపాదమునందు గుణోపసంహారవిచారము మాత్రము చేయఁబడెను. ఇచ్చట నాఫలదానస్వాతంత్ర్యమే యాక్షేపసమాధానములతో నిరూపింపఁబడును. "ఉపనిషదాత్మజ్ఞానము స్వతంత్రముగ మోక్షసాధన మగుటచే మాత్రమే పురుషార్థసాధనమా? లేక కర్మల నాచరించుకర్తను ప్రతిపాదించుటచే పురుషార్థసాధనమా ?" యనువిషయము విమర్శింపఁబడును. "ఈయుపాసనలు కర్మసంబంధములు కాకపోయెనేని వీనిని చేయవలయు ననుటయే సంభవింపదు. చేయఁబడునది యంతయుఁ గర్మయే కదా! అట్లు కర్తవ్యత సంభవింపకపోయిన నావిద్యలు ఫలసాధనములగుట యెట్లు? కొన్నిసాధనములచే సాధింపఁబడు ననుట యెట్లు?" అని సంశయము

రాఁగా దానిని నిరాకరించుటకై యజ్ఞము మొదలగుబహిరంగసాధనము లును శమదమాదులు శ్రవణమననములు మొదలగు నాంతరంగసాధనము లును మనోవ్యాపారరూపము లగుకర్తవ్యతలును నిరూపింపఁబడును. ఇట్లు ఈపాదముకూడ విద్యావిషయమును చర్చించునదియే యగుటచే దీనికినిఁ బూర్వపాదమునకునుఁ గలసంబంధ మేకవిషయసంబంధము.

---

## అధికరణావతారిక

"ఉపనిషత్తులయందు కర్తయు భోక్తయు నగుజీవునికంటె భిన్నముగ నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁ డగుపరమేశ్వరుఁడు చెప్పఁబడియున్నాఁడను టయు ఆయనయే జీవునియథార్థరూప మని వర్ణింపఁబడియున్నాఁ డను టయు సత్యమే అయినను, ఉపాసనలు ప్రమాణాంతరములవలనఁగర్మార్థము లని యేర్పడెనేని యప్పుడు కర్మకు నెంతవఱకు కావలయునో యంత వఱకే యుపనిషదర్థము ప్రమాణ మగును. నిత్యశుద్ధత్వాదులను చెప్పు భాగము స్తుతిపరము మాత్రమే యగునుకాని ప్రామాణికము కానేరదు. 'ఇట్లయిన నప్పుడు జీవదేహములకు భేదమును పాటింప నక్కఱ లేదు. దేహముకూడ కర్తయు భోక్తయు నగుచున్నది కదా!' యనియెదవేమొ యట్లుకాదు. దేహమనిత్యము. భోక్తయు ననిత్యుఁడెయగునేని *యకృతా భ్యాగమకృతవిప్రనాశదోషములు వచ్చును. ఈకారణమువలన కర్మ కర్తయు నిత్యుఁడుగనే యుండితీరవలయు ననుటయే సిద్ధాంతము." అను నది సామాన్యముగ సర్వాధికరణములయందును గలపూర్వపక్షములకుఁ దాత్పర్యము. "విద్యలు అంతరంగ బహిరంగసాధనములతో నాచరింపఁ బడి స్వతంత్రముగనే ముక్తినొసంగును." అనునది సిద్ధాంతాభిప్రాయము. "విద్యలు కర్మకర్తను ప్రతిపాదించునవియే; స్తోత్రము చేయునవియే"

---

* అకృతాభ్యాగమ మనఁగా చేయఁబడనిది యనుభవమునకు వచ్చుట. కృతవిప్రనాశ మనఁగా చేసినది యనుభవమునకు రాకుండ నశించిపోవుట. పూర్వజన్మ లేకపోయినచో తనచేఁ జేయఁబడకుండియు పుణ్యపాపములు ప్రస్తుతజన్మమున ఫలము నొసంగవలయును; ఉత్తరజన్మము లేకున్నచో ప్రస్తుతజన్మమునఁ జేయఁబడిన పుణ్య పాపములు ఫలము నొసంగకయే నశించిపోవలయును. ఇవి రెండును విరుద్ధములే.

యనునది పూర్వపక్షమునకును "విద్యలు స్వతంత్రములే బ్రహ్మైక్యమును క్రమముగాఁగాని ప్రత్యక్షముగాఁ గాని యొసంగునవియే" యనునది సిద్ధాంతమునకు ఫలము. సంగత్యాదులు అచ్చటచ్చటనే ప్రతిపాదింపఁ బడును. "ఉపనిషత్తులు జీవస్వరూపానువాదపూర్వకముగా బ్రహ్మైక్యము ప్రతిపాదించు నని యిదివఱకే యచ్చటచ్చట నధికముగఁ బ్రతిపాదింపఁబడి యున్నను కొన్ని విశేషపూర్వపక్షహేతువుల నిరాకరించి స్థూణాఖనన న్యాయముచే నావిషయమే యీపాదమున మఱల నిరూపింపఁబడు చున్నది యని తెలిసికొనవలయును. ఇందు కొన్ని విశేషహేతువులు ఉండుటచే నిందు పౌనరుక్త్యము లేదు.

---

## ౧. పురుషార్థాధికరణము

సంశయ విషయ సంగతులు :—"(సగుణ) నిర్గుణవిద్యలు స్వతంత్రముగనే ఫలము (మోక్షము) నొసంగునా? లేక కర్తను ప్రతిపాదించుచు నాకర్తమూలమున నేదియో యొకకర్మయందు ప్రవేశించి దానిమూలమున ఫలము నొసంగునా?" అనువిషయ మీయధికరణమున నాక్షేప సమాధానములతో నిర్ణయింపఁబడును. విషయనిరూపణముచేతనే సంశయము నిరూపింపఁబడెను. ప్రథమాధికరణమగుటచే దీనికిఁ బ్రత్యేకసంగతి యవసరములేదు. మఱియుఁ బూర్వపాదాంతమున కర్మాంగవిద్యలు ప్రస్తావింపఁబడి యుండుటచే "బ్రహ్మవిద్యకూడ నట్టిదే యగునేమో" యని వచ్చునాక్షేపము దీనికిఁ బూర్వాధికరణముతో గలసంగతి కావచ్చును.

### అ_3. పా_४. సూ_౧.

అవతారిక:—పైవిషయమును నిరూపించుటకై మొట్టమొదట సూత్రకారుఁడు స్వాభిప్రాయమును జూపుచున్నాఁడు.

### ४౨౭. పురుషార్థోఽతః శబ్దా దితి బాదరాయణః.

### 3. ४. ౧.

తాత్పర్యము:—(నిర్గుణ) విద్యలు స్వతంత్రముగనే ఫలము నొసంగును గాని కర్మసంబంధము నెట్లు నొందవు. సూత్రకారుఁ డగుబాదరా

యణుం డిట్లే యభిప్రాయపడుచున్నాఁడు. వేదంబును ఇట్లే చెప్పుచున్నది. "తరతి శోక మాత్మవిత్. సయో హ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి. బ్రహ్మవి దాప్నోతి పరం. ఆచార్యవాన్ పురుషో వేద తస్య తావ దేవ చిరం యావన్న విము క్ష్యేఽథ సంపత్స్యే." "ఆత్మ నెఱింగినవాఁడు (ఎఱుంగుట యనఁగా నుపాసనచే సాక్షాత్కారము నొందుట.) సంసారదుఃఖమును తరించును. ఎవ్వఁడు ప్రపంచాతీతుఁ డగు బ్రహ్మము నెఱుంగును వాఁడు బ్రహ్మమే యగును. బ్రహ్మవేత్త మోక్షమును జెందును. సద్గురువు నాశ్రయించినవాఁడు పరమేశ్వరు నెఱుంగును. మోక్షముఁ జెందుటకు జ్ఞానము జనించినపిదప ప్రారబ్ధనాశ మొక్కటియే యాలస్యము" అను మొదలగు వాక్యములను విమర్శించిన నీయర్థము తేటపడును. "య ఆత్మాఽపహతపాప్మా" "సర్వపాపవినిర్ముక్తుఁ (ఇచ్చట పాపమనఁగా కేవలపాపకర్మయే కా దనియు సర్వవిధము లగుసంసార సంబంధములుకూడ నాపదముచే నూహింపఁబడవలయు ననియు తెలిసికొనవలయును.) డగుజీవుఁ డెవ్వఁడు గలడో వాఁడే బ్రహ్మము అని యారంభించి యంతమున "సర్వాంశ్చ లోకా నాప్నోతి సర్వాంశ్చ కామా న్యస్త మాత్మాన మనువిద్య విజానాతి" "ఎవ్వఁడు తనస్వరూపము నుపాసించి యెఱుంగునో యట్టివాఁడు పరిపూర్ణకాముఁ డగుటచే సర్వలోకముల సర్వకామముల నొందును (కైవల్యము నొందు ననుట) అని కేవలవిద్యయే మోక్షదాయకముగ ఛాందోగ్యోపనిషత్తు నందుఁ జెప్పఁబడియున్నది. ఇట్లే బృహదారణ్యకోపనిషత్తునందును "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" "ఓమైత్రేయా మోక్షార్థియగువాఁడు స్వస్వరూపము నెఱుంగవలయును" అని యుపక్రమించి యంతమున "ఏతావదరే ఖల్వమృతత్వం" "ఓమైత్రేయా ముక్తి యనఁగా నిదియే" యని యుపసంహరింపఁబడి యున్నది. ఈప్రకరణమువలనఁ గూడ "విద్య స్వతంత్రముగనే ఫలము నొసంగును" అనువిషయమే తేటఁబడుచున్నదికదా! ఇట్టి శ్రుతిసందర్భములు మఱియు ననేకములు కలవు. కావున నెట్లును సగుణ విద్యకుఁగాని నిర్గుణవిద్యకుఁగాని క్రమముక్తి సాక్షాన్ముక్తిరూపము లగు ఫలముల నొసంగుటకుఁ గర్మసహాయ మక్కఱ లేదు.

## అ-3. పా-4. సూ-2.

అవతారిక.—ఇట్లు స్వమతము ననువాదము చేసి పూర్వపక్షము నుపక్రమించుచున్నాఁడు.

## 4-2. శేషత్వాత్పురుషార్థవాదో యథాఽన్యే ష్వితి జైమినిః. 3. 4. 2.

తాత్పర్యము. ఈవిషయమున జైమినిమహాముని భిన్నాభిప్రాయుఁడై యున్నాఁడు. "విద్యలు కర్మసంబంధముచేతనే కాని ఫలము నొసంగవు" అని చెప్పుచున్నాఁడు. ఆవిద్యలకు స్వర్గాదిభిన్నము లగుఫలములు ప్రత్యేకముగ శ్రుతియందుఁ జెప్పఁబడియున్న నుఆవియర్థవాదమాత్రము లే యగుననుచున్నాఁడు. విద్య యనఁగా నాత్మస్వరూపజ్ఞానమే కావునను, ఆత్మ కర్త గావునను, జుహూసంబంధమువలన పర్ణమయీత్వము యజ్ఞముతో సంబంధించినట్లు (చూ. 3-3-42.) ఈవిద్యయు (వైదిక) కర్మములతో సంబంధించు ననియు నీకారణమువలన పర్ణమయీత్వవాక్యమునందుఁ గలఫలశ్రుతివలెనే విద్యలవిషయములోఁ గలఫలశ్రుతియు నర్థవాదమే యగు ననియుఁ జెప్పుచున్నాఁడు. "ద్రవ్యసంస్కారకర్మసు పరార్థత్వాత్ఫలశ్రుతి రర్థవాదః స్యాత్" "ద్రవ్యములు ప్రోక్షణము మొదలగు సంస్కారములు అంగభూతములుగా నాచరింపఁబడు కార్యభేదములు అనునవి యొకక్రతువుకొఱకై యేర్పడి యుండుటచే వానినిఁ గూర్చి చెప్పఁబడు ఫలము లర్థవాదమాత్రములే" అనున్యాయము స్వసిద్ధాంతము నాశ్రయించి ప్రస్తుతవిద్యాఫలములుకూడ నర్థవాదమాత్రములే యనుచున్నాఁడు. ఈవిద్యలు కూడ యజ్ఞాంగ మగుకర్తకు సంబంధించినకర్మలే కదా యనుచున్నాఁడు. కర్మాంగమునకు సంబంధించినకర్మ యంగభూతమే యగును కదా యని నిరూపించుచున్నాఁడు.

వేదాంతి పూర్వపక్షము:—ఇది యెట్లు? ఈయాత్మవిద్యలు కర్మప్రకరణమునందు లేదు. ఇవి కర్మాంగము లనువిషయమును సూచింపఁగలశ్రుత్యాదులును లేవు. ఏమియు లేకున్న నీపక్ష మెట్లు సరిపడును? శోధములను హోమార్థమై వినియోగించుటకుఁ బూర్వి ముదకముచేఁ

బ్రోక్షింపవలయును" అను నిట్టిసందర్భములు యజ్ఞప్రకరణమునఁ బఠింపఁ బడినవగుటచే దానితో సంబంధింపవచ్చును; ఇందలి ప్రోక్షణము యజ్ఞాంగ మగుగోధుమలద్వారా యజ్ఞముతోఁ గలయవచ్చును. ఇచ్చటిస్థితిమాత్ర మిట్టిదికాదుకదా! "ఇచ్చటఁగూడ యజ్ఞాంగమగుకర్త కలఁడుకదా! వాని మూలమున నివియు యజ్ఞసంబంధము నొందవచ్చును" అనియెదవేమొ యది యుక్తము కాదు. "యస్య పర్ణమయీ జుహూర్భవతి (యూ. 3. ౭. ౨౨.)" అనువాక్యముకూడ నిట్లే యజ్ఞప్రకరణమున లేకున్నను అందు వర్ణింపఁబడిన జుహూవు కేవల యజ్ఞమునకే సంబంధించునది కావున దాని మూలమున పర్ణమయీత్వమునకు యజ్ఞసంబంధము కలిగినది. ఇచ్చట యన్ననో కర్త యట్టివాఁడు కాఁడు. యజ్ఞములు వైదికకర్మములు; మరణానంతరమున ఫలముల నొసంగునవి. ఇవికాక లౌకికకర్మములు కూడ ననేకములు కలవు. ఈరెండువిధము లగుకర్మలకును కర్త కావలయును. ఇట్లుండ కర్తను గూర్చి బోధించునంతమాత్రమున విద్యలకు యజ్ఞసంబంధము కల దని నిరూపించుటకు నెట్లు వీలు కలుగును? లౌకికకర్మలతోఁ గూడ నీయుపాసనలకు సంబంధము కలదనుట వారికిని సమ్మతము కాదు కదా! ఇఁక వైదికకర్మములతో మాత్రమే వీనికి సంబంధము కల దని సిద్ధాంతముఁ జేయుటకు వారాశ్రయించినయుక్తి చాలదు. కర్త యుభయ సాధారణుఁడై యనియతముగ నున్నాఁడు కదా!

జైమినిసమాధానము:—ఇట్లు కాదు. ఉపనిషత్తులయందు దేహ భిన్నుఁ డగునాత్మ బోధింపఁబడుచున్నాఁడు. కావున నాయాత్మ లౌకిక వైదికకర్మములలో వేనికి నియతకర్త కావలయునో వానికే యీవిద్యలు సంబంధించు నని సిద్ధాంతము చేయవచ్చును. లౌకికకర్మలకు నిహలోకము నందే ఫలములు కలుగుచుండుటచే దేహాత్మజ్ఞానమాత్రమువలనఁ గూడ గార్యనిర్వాహమగును. ఆత్మస్వరూప మెట్టిదియైన నగుగాక. తజ్జ్ఞానముతో మాత్రము లౌకికకర్మలకు నావశ్యకత లేదు. వైదికకర్మలవిషయ మన్ననో యిట్టిది కాదు. వానికి దేహపాతానంతరముననే కాని ఫలము కలుగదు కావున దేహాత్మభేద మవశ్యముగ గ్రహింపఁబడవలయును. "నేను దేహ భిన్నుఁడను" అనుజ్ఞానము కలిగిననే కాని సాధకునకు పరలోకభోగముల యందు నమ్మకము నిశ్చయము జనింపదు కదా! కావున నుభయసాధా

రణుఁ డైనను దేహవ్యతిరేకవిజ్ఞానసహితుఁ డగుగ ర్తమాత్రము వైదిక కర్మలతో నిత్యసంబంధము కలవాఁడు; విద్యలును వ్యతిరేకమును బోధించునవి యగుటచే కర్తృమూలమున క్రతుసంబంధమును కలిగి యుండునవియే. ఈ కారణమువలననే వా ర ట్లభిప్రాయపడిరి.

"ఇదియు సరిగా నుండ లేదు. 'అపహతపాప్మా' అను మొదలగు విశేషణములు జీవవిషయమునఁ బ్రయోగింపఁబడియుండుటచే 'జీవుఁడు సంసారి కాఁడు' అనువిషయమే యుపనిషత్తులచే ప్రతిపాదింపఁబడునట్లు తెలియుచున్నది. ఇ ట్లయిన వారియభిప్రాయము దోషయుక్తమగునుకదా" అనియెద వేమో వినుము. "నవా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి (వృా. ౧. ౪. ౧౯.)" అను మొదలగు శ్రుతులచే నా ప్రకరణము నందు మొట్టమొదట ప్రియమగుపదార్థము నిర్దేశింపఁబడెను. ఆయాత్మ సంసారియే యనుట నిర్వివాదము కదా! ఇ ట్లగుటచే నుపసంహారము కూడ నిట్టిదియే (జీవపరమే) కావలయును. ఈకారణమువలన నడుమ నడుమ నున్నవిశేషణము లన్నియు నర్థవాదమాత్రములే కావచ్చునని వానియభిప్రాయము. ఈయభిప్రాయములవలన వారు (జైమినిమునీశ్వరులు) విద్యలను కర్మాంగములునుగాఁ జెప్పుచున్నారు.

## ౪౨౯. ఆచారదర్శనాత్. 3. ౪. 3.

తాత్పర్యము :— మఱియు నాముని తనయభిప్రాయమును బలపఱచుటకై కొన్ని కారణాంతరములను గూడ జూపుచున్నాఁడు. "జనకో హవై దేహో బహుదక్షిణేన యజ్ఞే నేజే. యక్ష్యమాణో వై భగవంతో ఽహ మస్మి" "విదేహరాజగు జనకుఁడు అమితముగ దక్షిణ నొసంగి యజ్ఞము నాచరించెను. ఓమహాత్ములారా నేను యజ్ఞము చేయఁ బోవుచున్నాను" అను మొదలగు వాక్యములను విమర్శించిన బ్రహ్మవేత్తలు కూడ కర్మల నాచరించినట్లు తేలుచున్నది. మఱియు "ఉద్దాలకమహాముని తనపుత్రునకు బ్రహ్మవిద్య నుపదేశించెను" అని యుపనిషత్తులయందే వర్ణింపఁబడి యుండుటచే బ్రహ్మవేత్తలకుఁ గూడ గృహస్థాశ్రమసంబంధ మున్నట్లు తోఁచుచున్నది. ఆయాశ్రమము బహువిధకర్మలతో సంబంధము కలది కదా! యాజ్ఞవల్క్యమహాముని తనభార్యకు నొసర్చిన యుపదేశమును వర్ణించు సందర్భమును విమర్శించినను ఈవిషయమే

(బ్రహ్మవేత్తలు గృహస్థు లనువిషయమే) తేటపడుచున్నది. కర్మసంబంధముతోఁ బని లేక కేవలజ్ఞానముచేతనే పురుషార్థము కలుగునేని యాజనకాదులు మహాయాససాధ్యము లగుకర్మల నేల యాచరింతురు? "అర్కేచే న్మధు విందేత కిమర్థం పర్వతం వ్రజేత్" "ఊరిప్రక్క నున్న జిల్లేడుచెట్లమీఁదనే తేనె దొరకునేని పర్వతమున కేల పోవలయును" అని కదా లోకజ్ఞులు చెప్పుదురు. ప్రతివానికిని తనసౌఖ్యమును గమనించుటయే స్వాభావికము. కదా! కావున నీయాచారములను పట్టి చూచిన విద్యలకు నవశ్యము కర్మసంబంధము కల దనుటయే సిద్ధాంత మగుచున్నది యనుచున్నారు.

---

## ౪౩౦. తచ్ఛ్రుతేః. ౩. ౪. ౪.

తాత్పర్యము:—మఱియు "య దేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా త దేవ వీర్యవత్తరం భవతి. (ఛా. ౩. ౩. ౧౦.)" అను వాక్యమునుబట్టి చూచిన విద్య కర్మాంగ మనుట స్పష్ట మగుచున్నది. "ఇది కేవల ముద్గీథవిద్యకు సంబంధించినవాక్యమే" యనియెదవేమొ యట్లు కాదు. "య దేవ" అని సర్వనామంబును, అవధారణంబు నుండుటచే నీవాక్యము సర్వవిద్యాపరముగానే సమన్వయింపఁబడవలసి యున్నది. కావున నీనిరూపణమువలనఁ గూడ విద్యలు కర్మలతో సంబంధించియే ఫలము నొసంగు ననుట సిద్ధాంత మగుచున్నది.

---

## ౪౩౧. సమన్వారంభణాత్. ౩. ౪. ౫.

తాత్పర్యము:—"తం విద్యాకర్మణి సమన్వారభేతే" "ఆమోక్షఫలమును విద్యాకర్మలు రెండును ఆరంభించును. (కలుగఁజేయు ననుట)" అని ప్రత్యక్షముగఁ జెప్పఁబడియుండుటచేతఁ గూడ విద్యాకర్మలకు సంబంధము కల దని తోఁచుచున్నది. విద్యాకర్మలు పరస్పరము కలసి ఫలము నొసంగు ననియే కదా యాశ్రుతికి నర్థము. "ఇట్లే కావలయు నని నియమమేమి? 'విద్య కాని కర్మ గాని యాఫలమును సమానసామర్థ్యముతోనే యొసంగును' అని 'మాత్ర' మర్థము కాఁగూడదా" అనియెదవేమొ. అట్లయినను పై నుదహరింపఁబడిన యుక్తులవలన పరస్పరసంబంధమునే

నిర్ణయింపవలసి వచ్చుచున్నది. కావున విద్యలు కర్మసంబంధము లేక స్వతంత్రముగ ఫలము నొసంగ నేరవు.

## ౪౩౨. తద్వతో విధానాత్. ౩. ౪. ౬.

తాత్పర్యము:—ఇది యంతయుఁ గాక "ఆచార్యకులా ద్వేద మధీత్య యథావిధానం గురోః కర్మాతిశేషే ణాభిసమావృత్య కుటుంబే శుచౌ దేశే స్వాధ్యాయ మధీయానః" "పురుషుఁడు సద్గురువును జేరి యాయనకు శుశ్రూష చేయుచు మిగిలిన కాలమునందు పరిపూర్ణ వేదాధ్యయనము నాచరించి ముగించి గృహస్థాశ్రమమును సక్రమముగ నాశ్రయించి బహువిధకర్మల నాచరించుచు పరిశుద్ధస్థలమునఁ గూర్చుండి వేదమును పఠింపుచుండవలయును." అను మొదలగు శ్రుతులను విమర్శించిన సర్వవేదార్థము నెఱింగినవానికే కర్మాధికార మున్నట్లు తోఁచుచున్నది. ఉపనిషత్తులు కూడ వేదభాగమే యగుటచే తదర్థజ్ఞానము కూడఁ గల వానికే కర్మాధికార మున్నది యనవలయును. ఇట్లు చెప్పిన విద్యాకర్మలకు సంబంధ మున్నట్లు స్పష్ట మగును కదా! "సరియే కాని యిట్లు చెప్పుటకే మొట్టమొదట వీలు లేదు. పై శ్రుతియందు కేవల వేదాధ్యయనము మాత్రమే వర్ణింపఁబడెను కాని యర్థజ్ఞానము కాదు." అనియెదవేమొ. అర్థజ్ఞానము లేని కేవలాధ్యయనముతోఁ బ్రయోజనము లేదను విషయ మందఱు నెఱింగినదియే. కావున నెట్లును విద్యాకర్మసంబంధము తప్పునది కాదు.

## ౪౩౩. నియమాచ్చ. ౩. ౪. ౭.

తాత్పర్యము:—ఇది యంతయు నిట్లుండ "కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః" "కర్మల నాచరింపుచునే నూఱుసంవత్సరములు బ్రతుక నిచ్ఛయింపవలయును" అను మొదలగు నుపనిషద్వాక్యములు కొన్ని కర్మను సర్వకాలము ననువర్తింపవలసినదానినిఁగా నిరూపించుచున్నవి. ఈనియమమువలనఁగూడ విద్యకు కర్మసంబంధ మావశ్యక మనుట తేలుచున్నది. అట్లు లేకుండిన నీనియమము నిరర్థక మగును కదా! కావున నెట్లును విద్య కర్మతో సంబంధించియే ఫలము నొసంగును. అని యాజైమినిమహాముని తనసిద్ధాంతమును స్థాపించుకొనుచున్నాఁడు.

## అ-3. పా-౪. సూ-౮.

అవతారిక:—ఇట్లు వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు. మొట్టమొదట రెండవసూత్రమున నిరూపింపఁబడిన విషయమును ఖండించు చున్నాఁడు.

## ౪3౪. అధికోపదేశాత్తు బాదరాయణ స్యైవం తద్దర్శనాత్. 3. ౪. ౮.

తాత్పర్యము:—ఈయభిప్రాయము యుక్తమైనది కాదు. "శేష త్వా త్పురుషార్థవాదః (3-౪-౨.)" అనుసూత్రమునఁ జెప్పఁబడియున్న విషయము యుక్తము కాదు. ఉపనిషత్తులయందు సంసారియు కర్తయు భోక్తయు నగుపురుషుఁ డొక్కఁడే శరీరాతిరిక్తుఁడుగా వర్ణింపఁబడియుండు నేని, ఇతరసంబంధ మేమియు లేకుండునేని యప్పుడు ఆసూత్రమునందలి నిరూపణ యుక్త మగును. ఉపనిషత్తులయభిప్రాయ మది కాదు. వాని యందు దేహాతిరిక్తుఁడును నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁడును కర్తృత్వ భోక్తృత్వాదిధర్మవివర్జితుఁడు నగుపరమేశ్వరుఁడు జీవాభిన్న రూపముతో నెఱుంగఁబడవలసినవాఁడుగా వర్ణింపఁబడుచున్నాఁడు. మఱియు తెలియఁ బడని యపూర్వవిషయమును చెప్పుటయే శాస్త్రమునకు శాస్త్రత్వ మును కలిగించు నను విషయము మీకును సమ్మతమే. సంసారియు కర్తయు భోక్తయు నగుజీవుఁడును సర్వలోకప్రత్యక్షుఁడు. ఇట్లుండ కేవల జీవునిఁగూర్చియే వేదము చెప్పు ననుట యెట్లు యుక్తియుక్త మగును ? జీవపరములుగఁ గొన్ని వాక్యములు కానవచ్చినను వాని నను వాదమాత్రములనుగా యూహింపవలయును. అపూర్వవిషయమును వర్ణించుటకుఁ దత్సంబంధి యగుప్రసిద్ధవిషయము ననువాదము చేయుట దోషము కాదు కదా ! కావున నుపనిషత్తులు కేవలజీవపరములు కావు. పరమేశ్వరజ్ఞానంబును కర్మాచరణమునకు నుపయోగించునది కాదు. విరు ద్ధముకూడ నైయున్న దని "ఉపమర్దం చ. (3. ౪. ౧౬.)" అనుస్థలమున సూత్రకారుఁడు నిరూపింపఁబోవుచున్నాఁడు. ఇట్లగుటచే విద్యాకర్మలకు నెట్టిసంబంధమును కుదురదు. సంబంధమే లేదనిన నిఁక శేషత్వ (అధీ

సత్త్వ మెటనుండి వచ్చును. నిత్యసంబంధ ముండిననే కాని శేషత్వము కలుగదు కదా! కావున విద్యలకు వర్ణింపఁబడినఫలము లర్థవాదమాత్రములు కానేరవు. "పురుషార్థోతః. (3. 4. 1.)" అనుస్థలమున సూత్రకారుఁ డొసర్చిననిరూపణమే యుక్తియుక్తమైనది. పూర్వపక్షమునఁ జూపఁబడినహేతువు లన్నియు *నాభాసమాత్రములే; సూత్రకారుని సిద్ధాంతమును ఇంచుకయైనను కదల్పనేరవు.

వాస్తవస్థితిలో జీవపరమేశ్వరులకు భేదము లేదు. ఘటోపాధియందు ప్రవేశించుటచే సర్వవ్యాపక మగునాకాశము ఘటాకాశనామముతో వ్యవహరింపఁబడుచున్నట్లు బుద్ధియందు ప్రవేశించుటచే పరమేశ్వరుఁడే జీవశబ్దముచే వ్యవహరింపఁబడుచున్నాఁడు. రజ్జువునందుఁ గలుగు సర్పజ్ఞానమువలె నీజ్ఞానము కేవలభ్రాంతిమాత్రమే యై యున్నది. ఏకరూపునియందు భేద ముండదుకదా! ఈవిషయ మంతయు నిదివఱకే యచ్చటచ్చట శ్రుతిస్మృతియుక్తముతో బోధింపఁబడెను కదా! శ్రుతి పరమపురుషార్థమును బోధించుటకై ప్రవర్తించినదికావున దానికి నీభ్రాంతిని తొలఁగించుట యావశ్యక మయ్యెను. ఇట్లగుటచేత ఆప్తుఁడగువాఁడు రజ్జుసర్పభ్రాంతిని తొలఁగింపవలసినప్పుడు "ఇప్పుడు నీవు చూచుచున్నసర్పము రజ్జువే" అని సర్పానువాదపూర్వకముగ దానియథార్థరూప మగురజ్జువును బోధించునట్లు జీవానువాదపూర్వకముగ నాతని యథార్థరూప మగు పరమేశ్వరుని బోధించుచున్నది.

"యః సర్వజ్ఞః సర్వవిత్ భీషాఽస్మా ద్వాతః పవతే. మహద్భయం వజ్రముద్యతం. ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి. తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి. తత్తేజోఽసృజత" "ఎవ్వఁడు సామాన్యముగను విశేషముగను సర్వము నెఱుంగుచున్నాఁడో ఆపరమేశ్వరుని భయమువలన వాయువు వీచుచున్నాఁడు. ఆపరమేశ్వరుఁడు ఎత్తఁబడిన వజ్రాయుధమువలె సర్వప్రపంచమునకును భయకారణమై యున్నాఁడు; గాని నాశరహిత మగునీపరమేశ్వరునియొక్క యాజ్ఞయందే సర్వప్రపంచము నున్నది. ఆపరమేశ్వరుఁడే స్వయముగ ప్రపంచరూపము నొందవలయు నని సంకల్పించెను. ఆపరమేశ్వరుఁడు ఆకాశవాయుభూతోత్పత్త్యనంతరమున తేజోభూతమును సృజించెను" అను మొదలగువాక్యములను

* ఆభాసమనఁగా వాస్తవస్థితిలో లేకుండియు నున్నట్లు తోచునది.

వివర్శించిన నీవిషయము తేటపడును. జీవుఁడు విశేషజ్ఞానరూపుఁడనియు పరమేశ్వరుఁడు సామాన్యజ్ఞానరూపుఁడనియు వాక్యాన్వయాధికరణమున (౧. ౪. ౧౯.) సవిస్తరముగ వివరించియున్నాము. ఇప్పుడు జీవునకు సర్వజ్ఞత్వము సంభవింపదుకదా! శ్రుతికి కేవల జీవప్రకటనమునందే యభిప్రాయము కలదేని అపహతపాప్మత్వాదిగుణములను వర్ణించుట కేవల స్తుత్యర్థమే యగునేని "యః సర్వజ్ఞః" అని చెప్పఁబడి యుండఁగూడదు. మఱియు జీవస్వభావములు ప్రత్యక్షసిద్ధములు. వాయ్వాదులు జీవునకు భయపడుట లేదు కదా! ఇట్లగుటచే "వేదము జీవభిన్నునిఁగూర్చి చెప్పదు" అనిన, "భీషాస్మాత్" అను మొదలగు శ్రుతులు విరుద్ధము లగును. "ఇదియును శ్రుత్యర్థమే" యని వాదింపఁబూనినను సృష్టికర్తనుగూర్చి చెప్పువాక్యములు కలవుకదా! ఆసృష్టి జీవునకు సాధ్యము కాకపోవుటచే తత్కర్త జీవభిన్నుఁడే యగుట నిస్సంశయము. కావున వేదము కేవల జీవునిఁగూర్చియే కాక తద్భిన్నుఁ డగుపరమేశ్వరునిఁగూర్చియు చెప్పుచున్నది. కేవల జీవునిఁగూర్చి చెప్పునేని యప్పుడు జైమినిసిద్ధాంతము నిలుచును గాని యట్లు లేదు.

"ఇట్లు కాదు. 'ఆత్మన స్తు కామాయ సర్వం ప్రియం భవతి. ఆత్మా వా అరే ద్రష్టవ్యః. యః ప్రాణేన ప్రాణితి స త ఆత్మా సర్వాంతరః. య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే......ఏతం త్వేవ తే భూయోఽను వ్యాఖ్యాస్యామి' 'తనకొఱకే (జీవునికొఱకే) సర్వపదార్థములు నిష్టము లగుచున్నవి. ఓమైత్రేయా ఆత్మస్వరూపమునే యెఱుంగవలయును. ఎవ్వఁడు ప్రాణముచే జీవించుచున్నాఁడో వాఁడే సర్వాంతరుఁడగునీయాత్మ. ఈకంటియం దెవ్వఁడు గానవచ్చుచున్నాఁడో...ఆపురుషునే నీకు మఱల వివరించెదను (తెలిసికొనఁదగినవానినిఁగా నిర్ణయించెదను)' అను మొదలగు వాక్యములవలన జీవుఁడే జ్ఞేయపదార్థముగ నాకర్షింపఁబడె నని తోఁచుచున్నది. ఇట్లుండ నుపనిషత్తులయందు జీవభిన్నపదార్థ మెటనుండివచ్చెను." అనియెదవేమొ వినుము. వాస్తవస్థితిలో జీవబ్రహ్మములకు భేదమే లేదు కావున నిట్లు చెప్పఁబడెను. జీవునికంటె భిన్నుఁ డగుపరమేశ్వరుఁడే యుద్దేశింపఁబడినను వారిరువురికిని గలయత్యంతాభేదమువలన నిట్లు వర్ణింపఁబడెను. "అస్య మహతో భూతస్య నిఃశ్వసిత మేత ద్య దృగ్వేదః. యోఽశనాయాపిపాసే శోకం మోహం జరాం మృత్యు మత్యేతి. పరంజ్యోతి

రుపసంపద్య స్వేన రూపే ణాభినిష్పద్యతే స ఉత్తమః పురుషః”
“సర్వవ్యాపకుఁ డగుపరబ్రహ్మమునకు ఋగ్వేదము నిశ్వాసమాత్రము.
ఎవ్వఁడు ఆఁకలిదప్పులను ముసలితనమును మూర్ఛను దుఃఖమును మరణ
మును కూడ నతిక్రమించునో, ఆజీవుఁడు సుషుప్త్యవస్థయందు పరమేశ్వరుని
జెంది స్వస్వరూపముతోనే నిలుచును. అతఁడే యుత్తమపురుషుఁడు” అను
మొదలగు వాక్యశేషములందు జీవునకు సంబంధింపని ధర్మములు వర్ణింపఁ
బడియుండుటచే నీవిషయమే స్పష్టమగుచున్నది. ఈప్రకరణమునందు జీవ
బ్రహ్మాభేద ముద్దేశింపఁబడకుండినయెడల జీవోపక్రమమునకును బ్రహ్మోప
సంహారమునకును విరోధము వచ్చును కదా! కావున జీవకథన మనువాద
మాత్రము పరమేశ్వరరూపనిరూపణము తాత్పర్యము. అత్యంతాభేదము
వలన నొక్కొక్కస్థలమున జీవోపక్రమాదులు గానవచ్చుచున్నది. ఇంత
మాత్రమువలన నుపనిషత్తులందు జీవుఁడుమాత్రమే వర్ణింపఁబడె ననియు
బ్రహ్మధర్మములఁ జెప్పుట స్తోత్రమాత్రమే యనియు వాదించుట యుక్తి
యుక్తము కాదు. ఇట్టి బ్రహ్మస్వరూపమును ప్రతిపాదించునవి యగుటచే
విద్యలును స్వతంత్రముగ ఫలము నొసంగునవియే.

## అ-3. పా-౪. సూ-౯.

అవతారిక :— మూఁడవ సూత్రమునఁ బ్రతిపాదింపఁబడిన
యాచారాదివిషయముల నిట ఖండించుచున్నాఁడు.

## ౪౩౫. తుల్యం తు దర్శనమ్. 3. ౪. ౯.

తాత్పర్యము:—మఱియు “బ్రహ్మవేత్తలకుఁ గూడ యజ్ఞాదికర్మా
చరణ మున్నట్లును గృహస్థాశ్రమ మున్నట్లును శ్రుతులయందు చెప్పఁబడి
యుండుటచే విద్యాకర్మలకు సంబంధముండవలయును.” అని చేయఁబడిన
సిద్ధాంతము గూడ యుక్తియుక్తము కాదు. “బ్రహ్మవేత్తలు యజ్ఞాదుల
నాచరించిరి.” అని యెట్లు చెప్పఁబడియున్నదో అట్లే “బ్రహ్మవేత్తలకుఁ
గర్మలతోఁ బని లేదు.” అనియుఁ జెప్పఁబడి యున్నది. “ఏతద్ధ స్మ వై త
ద్విద్వాంస ఆహుర్ ఋషయః కావషేయాః కిమర్థా వయ మధ్యేష్యా
మహే కిమర్థా వయం యక్ష్యామహే. ఏతద్ధ స్మ వై త త్పూర్వే

విద్వాంసో ఽగ్నిహోత్రం న జుహవాంచక్రిరే. ఏతం వైత మాత్మానం విదిత్వా బ్రాహ్మణాః పుత్రైషణాయా శ్చ విత్తైషణాయా శ్చ లోకైష ణాయా శ్చ వ్యుత్థా యాథ భిక్షాచర్యం చరంతి."="కావషేయమునులు బ్రహ్మజ్ఞానము కలవారై 'మనము వేదాధ్యయనము చేయనేటికి ? యజ్ఞ ముల నాచరింపనేటికి?' అనిరి. బ్రహ్మవేత్తలగువారు పూర్వకాలమున హోమము నాచరింపలేదు. ఈయాత్మస్వరూపము నెఱింగిన బ్రహ్మజ్ఞానులు పుత్రవిత్తలోకములయం దభిమానమును వదలి సర్వము పరిత్యజించి భిక్షాచర్యము నాచరింతురు" అను మొదలగు వాక్యము లీవిషయమునం బ్రమాణములు. రెండువిషయములయందును శ్రుతులు సమానము లేయగు టచే నొక్కదానినింగూడ నిరాకరించుటకు వీలు లేదు. ఈకారణమువలన జ్ఞానము కలిగినపిదపం గూడ కర్మల యథేచ్ఛముగ నాచరించిన నాచరింప వచ్చు నంతియ కాని అట్లాచరించి తీరవలయు ననునియమముమాత్రము లేదనుట సిద్ధాంత మగుచున్నది. "నైవతస్య కృతే నార్థో నాకృతే నేహ కశ్చన. సాస్త్యకృతః కృతే న"="బ్రహ్మవేత్తకుం గర్మల నాచరించుట వలనం బ్రయోజనము లేదు; ఆచరింపకపోవుటవలన హానియు లేదు. బ్రహ్మ వేత్త కర్మల నాచరించిన నాచరింపకున్న నొక్కటియే" అను శ్రుతిస్మృతు లచే నీవిషయమే స్పష్టము చేయంబడుచున్నది. గృహస్థాశ్రమము నొందుట మొదలగునవికూడ నిట్టివే. "ఏతావ దరేఖ ల్వమృతత్వ మితి హోక్త్వా యాజ్ఞవల్క్యోవిజహార"="ఓమైత్రేయీ యిదియే మోక్షము అనిచెప్పి యాజ్ఞవల్క్యమహాముని వెడలిపోయెను" అను మొదలగుకొన్ని వాక్యములు యాజ్ఞవల్క్యాదులకుం గూడ కర్మలే దని చెప్పుచున్నవి. వెడలిపోయె ననంగా సంసారమును పరిత్యజించె ననియే యర్థ మని యచ్చటి సందర్భమువలన (మైత్రేయీబ్రాహ్మణమునందలిసందర్భమువలన) స్పష్ట మగుచున్నది. ఈకారణములవలన నెట్లును విద్యలు కర్మాంగము లనువిష యము సిద్ధాంతము కానేరదు. మఱియు "యక్ష్యమాణో వై భగవం తోఽహ మస్మి" అను శ్రుతి వైశ్వానరవిద్యలో నున్నది. అది సగుణవిద్య కావున దానితోంగూడ నేకర్మయైన నెట్లయిన నాచరింపంబడవచ్చును. కర్మకును దానికిని విరోధము లేదు. ఇట్లయినను అదిమాత్రము కర్మాం గము కానేరదు. ఆవిషయమును నిరూపించుటకుం దగిన ప్రకరణాదులు లేవు కదా! కావున నెట్లును విద్యాకర్మలకు నంగాంగీభావము పొసంగదు.

## అ-3. పా-౪. సూ-౧౦.

అవతారిక:—ఇట్లు మూఁడవసూత్రమునందుఁ జూపఁబడిన పూర్వపక్షయుక్తిని ఖండించి నాల్గవసూత్రమునఁ జూపఁబడినయుక్తిని ఖండించుచున్నాఁడు.

---

## ౪౩౬. అసార్వత్రికీ. 3. ౪. ౧౦.

తాత్పర్యము:—ఇట్లే "యదేవ విద్యయా కరోతి" అనుశ్రుతియు కార్యకారి కానేరదు. అది యుద్గీథవిద్యను గూర్చి మాత్రమే చెప్పునది గూడఁ గావచ్చును కదా! "సర్వనామావధారణములచే వ్యాప్తి సూచింపఁబడుచున్నది; విద్యాశబ్దము నీకారణమువలన సర్వవిద్యాపరముగా వ్యాఖ్యానము చేయుటకు వీలు కలుగుచున్నది" అనియెదవేమొ యదియు యుక్తము కాదు. ఉద్గీథవిద్య నారంభించి యందు ప్రాణోపాసనయు ఆదిత్యాక్షిపురుషోపాసనయు మొదలగునవి చెప్పఁబడి యున్నవి. వానియందంతట వ్యాప్తి కలుగుటకై యీసర్వనామాదులు ప్రయోగింపఁబడి యుండవచ్చును కదా! "బ్రాహ్మణుల కందఱకును భోజన మిడవలయును" అనిన నప్పుడు "అందఱు" అనుసర్వనామము చాతుర్వర్ణ్యమును గూర్చియే సామాన్యముగఁ జెప్పునది యైనను బ్రాహ్మణపదప్రయోగబలము వలన బ్రాహ్మణులనుఁగూర్చి మాత్రమే చెప్పునట్లు ఈసర్వనామంబును ఉద్గీథప్రయోగబలమువలన నుద్గీథవిద్యలనుఁగూర్చియే చెప్పవచ్చును. కావున నింతమాత్రమువలన "విద్యలు కర్మాంగము లగును" అనువిషయమును నిరూపించుట వీలులేదు. "ఉద్గీథవిద్యలకుమాత్ర మట్టిస్థితిని (కర్మాంగములై ఫలము నొసంగుస్థితిని) సమ్మతించిరి కదా!" అనియెదవేమొ ఈవిషయమునుఁగూర్చి యిచ్చట చర్చింపవలసినపని లేదు. తన్నిర్ధారణాధికరణమునందే (3-3-౪౨.) యీవిషయము చర్చింపఁబడెను.

## అ-3. పా-౪. సూ-౧౧.

అవతారిక:—ఐదవసూత్రమునందలిపూర్వపక్షయుక్తి నీక్రింద ఖండించుచున్నాఁడు.

## ౪౩౭. విభాగః శతవత్. ౩. ౪. ౧౧.

తాత్పర్యము:—అయిదవసూత్రమునందుఁ జూపఁబడినశ్రుతియు జైమినిసిద్ధాంతమును స్థాపింపఁజాలదు. "విద్యాకర్మణి సమన్వారభేతే" అనుశ్రుతి విద్యాకర్మసంబంధమును జెప్పుట లేదు. విద్య యొకపురుషుని కల్పించు (సృజించు) ననియు కర్మ మఱియొక్కని సృజించు ననియు మాత్రమే యాశ్రుతి చెప్పుచున్నది యని తెలిసికొనవలయును. "ఈయిరువురికి నూఱురూప్యముల నొసంగుము" అనినప్పుడు యేబదియేబదిగా విభాగించి యెట్లొసంగవలయునో అట్లే పైశ్రుతి చెప్పువిద్యాకర్మలనుఁ గూడ విభాగించియే యొసంగవలయును.

"దీనితాత్పర్య మది కాకుండ రాదా" అని పట్టు పట్టినను ప్రయోజనము లేదు. మొట్టమొదట నీశ్రుతి మోక్షార్థివిషయమును నిరూపించుటకు వచ్చినది కాదు. సంసారవిషయమును చెప్పునదియే. "ఇతి ను కామయమానః" = "ఇది సంసారిప్రకారము" అని యుపసంహారమున నున్నది. పిదప "అ థాకామయమానః"="ఇక వైరాగ్యవంతుని తెఱంగెట్టి దనిన" అని మోక్షేచ్ఛ గలవానినిఁగూర్చి చెప్పుటకై ప్రత్యేకముగా నుపక్రమింపఁబడి యున్నది. ఇట్లగుటచే విద్యాకర్మపదములచేత విహితప్రతిషిద్ధవిద్యాకర్మలు రెండును గ్రహింపఁబడును. విహితవిద్య లుద్గీథాదులు; ప్రతిశుద్ధవిద్యలు. "నానృతం వదేత్" అను మొదలగునవి. విహితకర్మలు యజ్ఞాదులు; విశుద్ధకర్మలు హింసాదులు. ఆవిద్యాకర్మపదములవలన విశేషమేమియు గ్రహింపఁబడకుండుటచే నిట్లు సామాన్యము నాశ్రయించుటలో విరోధము లేదు. ఈద్వివిధవిద్యాకర్మములచేతనుగూడఁ బురుషునకు వృద్ధిక్షయములు కలుగుచున్న వనుట నిర్వివాదాంశము కదా! కావున నీపక్షము నాశ్రయించి చూచినచో నావిద్యాకర్మల సముదాయముగానే పరిగ్రహించినను లోపము లేదు. మనము వాదించుచున్నది మోక్షేచ్ఛ గలవానివిషయమునుగూర్చి మాత్రమే; ఈవిద్యాకర్మశ్రుతియో సంసారినిఁగూర్చి మాత్రమే చెప్పునది. కావున నీశ్రుతి మోక్షేచ్ఛగలవాని విషయమై వలసిన నిర్ణయమును చేయనేరదుకదా! కావున నెట్లును విద్యలకు నస్వాతంత్ర్యము లేదు.

## అ-౩. పా-౪. సూ-౧౨.

అవతారిక:—ఆఱవసూత్రమునందు చెప్పఁబడినయుక్తిని ఖండించుచున్నాఁడు.

## ౪౩౮. అధ్యయనమాత్రవతః. ౩. ౪. ౧౨.

తాత్పర్యము.—మఱియు, "ఆచార్యకులా ద్వేద మధీత్య" అను ఛాందోగ్యశ్రుతియందు కేవలాధ్యయనము మాత్రమే విధింపఁబడి యుండుటచే నంతమాత్రపువానికే కర్మాధికారము కలుగు నని మేము తలంచుచున్నాము. "అర్థజ్ఞానము లేనికేవలాధ్యయనముచే బ్రయోజనము లేదు కదా!" అనియెదవేమొ వినుము. మేము వేదార్థజ్ఞాన మక్కఱలే దనుట లేదు; పరిపూర్ణాధ్యయనము కూడ నక్కఱ లే దనుట లేదు. ఇఁక నేమి యనిన, సర్వవేదము నధ్యయనము గావించినను సర్వార్థము నెఱింగినను జ్యోతిష్టోమస్వరూపజ్ఞానము వాజపేయాధికారికి నుపయోగింపనట్లు వేదాంతజ్ఞానము కర్మాధికారికి నుపయోగింప దని మాత్రమే చెప్పుచున్నాము. ఉపనిషదధ్యయనము కేవలాధ్యయనమాత్రమే యగు ననుచున్నాము. కర్మకాండాధ్యయనము మాత్రమే వారికి సార్థకమగు ననుచున్నాము. పఠింపఁబడినంతమాత్రమున నర్థము నెఱింగినంత మాత్రమున నన్నియు నన్నిస్థలములయందు నుపయోగింపఁబడవలయు నని నియమము కలదా? కావున నెట్లును వేదాంతమునందలివిద్యలు కర్మసంబంధములు కానేరవు.

## అ-౩. పా౪. సూ-౧౩.

అవతారిక:—ఈ క్రింద "నియమాచ్చ౩. ౪. ౭." అనుసూత్రమునందు చూపఁబడినయుక్తిని నిరాకరించుచున్నాఁడు.

## ౪౩౯. నావిశేషాత్. ౩. ౪. ౧౩.

తాత్పర్యము:—ఇట్లే "కుర్వ న్నే వేహకర్మాణి" అను మొదలగు నియమశ్రుతుల నాశ్రయించియు జైమినిసిద్ధాంతమును దృఢపఱుచుటకు వీలు లేదు. ఆశ్రుతులయందు జ్ఞాన్యజ్ఞానులను గూర్చి విశేష మేమియు

చెప్పఁబడి యుండలేదు. ఇట్లగుటచే నానియమ మజ్ఞానులను మాత్రమే గూర్చికూడఁ జెప్పఁబడి యుండవచ్చునుకదా! "జ్ఞానులైనను కాకున్నను జీవితకాల మంతయు కర్మల నాచరించుచుండవలయును" అని యాశ్రుతుల యందు చెప్పఁబడియుండినచో జైమినియభిప్రాయము స్థిర మగును కాని లేకున్న కానేర దనుటలో వివాదము లేదు.

## అ_3. పా_౪. సూ_౧౪.

అవతారిక :—"ఆశ్రుతియందు విశేషము చెప్పఁబడకున్నను 'శతం సమాః' అని చెప్పుటచే నట్టియర్థమునే (జ్ఞానికాని యజ్ఞానికాని కర్మల నాచరింపవలయు ననునర్థమునే) గ్రహించితీరవలయును" అని పట్టుపట్టినను ప్రయోజనము లే దనుచున్నాఁడు.

## ౪౪౦. స్తుత యేఽనుమతి ర్వా. 3. ౪. ౧౪.

తాత్పర్యము:—ఆశ్రుతి సామాన్యముగ నందఱను గూర్చి చెప్పునది యగుటచే జ్ఞానులనుఁగూర్చి కూడ చెప్పుచున్నది యని సాధించినను జైమినిసిద్ధాంతము నిలువదు. స్తోత్రార్థమై కూడ నట్లు చెప్పవచ్చును కదా! "ఇట్లు కాదు. ఆయుపనిషత్తున నారంభమునుండియు బ్రహ్మవిద్యయే చెప్పఁబడుచుండుటచే నీశ్రుతియు బ్రహ్మవేత్తను గూర్చియే చెప్పునది యగును" అనియెదవేమొ అట్లయినను విరోధము లేదు. "న కర్మ లిప్యతే నరే" = "కర్మ తత్వజ్ఞాని నంటదు" అని వాక్యశేషమున నున్నదిగావున నీశ్రుతి స్తుత్యర్థయే యని నిరూపింపఁబడవలసి యున్నది. "బ్రహ్మవేత్త యగువాఁడు యావజ్జీవము సామాన్యులవలెఁ గర్మల వివిధములుగ నాచరించినను వానివలన నాతనికి వృద్ధిక్షయములు కలుగవు" అని కర్మానుమతిపూర్వకముగ విద్యాప్రభావము నుతించుచున్నది యని యే సిద్ధాంతము చేయఁబడవలయును. కావున నిది యెట్లును నియమశ్రుతి కానేరదు; జైమినిసిద్ధాంత మిట్లు కాకున్న నిలువనేరదు.

## అ_3. పా_౪. సూ_౧౫.

అవతారిక.—ఈవిషయమున స్వసిద్ధాంతమును దృఢము చేయుటకై మూఁడు హేతువులను స్వతంత్రముగఁ జెప్పుచున్నాఁడు.

## 441. కామకారేణ చైకే. 3. 4. 15.

తాత్పర్యము :— మఱియు కొందఱు బ్రహ్మవేత్తలు విద్యాఫల మగు బ్రహ్మజ్ఞానమును జెంది శాంతులై తదాధారమువలన నితరఫలముల సాధించునట్టి సంతానాదులు నిష్ప్రయోజనము లని వర్ణింపుచున్నారు. ఇట్టి వర్ణనమును దెల్పుశ్రుతి వాజసనేయశాఖయందు కలదు. "ఏతద్ధ స్మ వై త త్పూర్వే విద్వాంసః ప్రజాం న కామయంతే కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయ మా త్మాఽయం లోకః" = "బ్రహ్మ వేత్త లగువారు సంతానమును కోరరు. సర్వప్రపంచము మనకు నాత్మభూతమే యై యుండ నిక పుత్రులేటికి? వారలతో మనము సాధింప వలసినకార్య మెద్ది యని తలంతురు" అను బృహదారణ్యకోపనిషద్వాక్య ముచే నీవిషయము స్పష్టమగుచున్నది. దీనివలన "విద్యాకర్మఫలము లొక్కటియే" యనుమాట పోయెను కదా! విద్యాఫలములు జైమిని మునియభిప్రాయము ననుసరించి యర్థవాదమాత్రములే యగునేని కర్మ ఫలములే విద్యాఫలములుగఁ గూడ నుండవలసి వచ్చు ననుట నిర్వివాదము. ప్రస్తుతనిరూపణవలన నాయాస పోయినది. ఇంతమాత్రమే కాదు. విద్యాఫలము స్వస్వరూపజ్ఞాన మగుటచేఁ బ్రత్యక్షము; కర్మఫల మన్ననో పరోక్షము కాలాంతరమున గలుగునది. ఈరెంటిచే నభేదము కలుగుటకు వీలు లేదని యిదివఱకే పలుమాఱు నిరూపించియున్నాము. కావున నీకారణమువలనఁగూడ విద్య కర్మశేషము కాఁగూడదు; విద్యా ఫలములును అర్థవాదమాత్రములు కానేరవు.

## అ-3. పా-4. సూ-16.

అవతారిక:— ఇట్లు విద్యాకర్మఫలములకుఁ గలవైషమ్యమునుఁ జూపి విరోధముఁ జూపుచున్నాఁడు.

## 442. ఉపమర్దం చ. 3. 4. 16.

తాత్పర్యము :— ఇదియంతయుఁ గాక బ్రహ్మవిద్యాఫల మగు బ్రహ్మజ్ఞానమునకును కర్మలకును ప్రత్యక్షవిరోధము కలదు. ఒక కర్మ నాచరింపవలయు ననిన కర్త కర్మ సాధనములు అను మూఁడుపదార్థము

లుండవలయును. స్వస్వరూపజ్ఞానమాత్రమే యగుటచే విద్యకు నవి యక్కఱ లేదు. "యత్ర వా అస్య సర్వ మాత్మై వాభూత్త త్కేన కం పశ్యేత్ త త్కేనకం జిఘ్రేత్" = "ఎవ్వనికి జ్ఞానప్రభావమువలన సర్వము నాత్మయే యయ్యెనో వాఁడు దేనిని దేనితో చూచును? దేనిని దేనితో నాఘ్రాణించును?" అను మొదలగుశ్రుతులు విద్య ఫలించినపిదప కర్త్రాదు లన్నియు నశించు నని చెప్పుచున్నవి. యుక్తులతో విమర్శించి నను ఇదియే సిద్ధించును. బ్రహ్మము జీవాభిన్నము; తజ్జ్ఞానమే విద్యాఫలము. తన్ను దాను తెలిసికొనునప్పుడు కర్త యెవ్వఁడు? కర్మయెయ్యది? సాధనము లేల? ఇట్లయిన నావిద్య కర్త్రాదుల కవకాశ మియ్య దనుటలోఁ గాని యవకాశ మీకున్న గర్మ జరుగ దనుటలోఁ గాని సంశయ మేమి కలదు? ఈకారణమువలన విద్యను కర్మాంగముగఁ బరిగణించువా రాకర్మమునకు నిర్మూలధ్వంసమును కావించినవార లగుదురు. కావున నెట్లును విద్యలు పరతంత్రములు కానేరవు; తత్ఫలశ్రుతులును అర్థవాదమాత్రము కానేరవు.

## అ-౩. పా-౪. సూ-౧౩.

అవతారిక:—విద్యావిధానకాలమునుబట్టికూడ స్వసిద్ధాంతమే దృఢపడుచున్నది యనుచున్నాఁడు.

## ౪౪౩. ఊర్ధ్వరేతస్సు చ శబ్దేహి. ౩. ౪. ౧౭.

తాత్పర్యము:—మఱియు నీవిద్య యూర్ధ్వరేతస్కులకు శ్రుతి యందు జెప్పఁబడి యున్నది. వారికి * నగ్నిహోత్రాదికర్మలు లేకపోవుటచే విద్య కర్మాంగ మనుటకు వీలు లేకున్నది. కర్మలు లేకుండఁగనే తదంగము లుపదేశింపఁబడు ననుట హాస్యాస్పదము కదా! "త్రయో ధర్మస్కం

* ఊర్ధ్వరేతస్సునకు అగ్నిహోత్రము లేదు.—

అగ్నిహోత్ర మనఁగా సాధానపూర్వకముగ వేదికయందు స్థాపింపఁబడు త్రేతాగ్నులే యని వేదపరిభాష. బ్రహ్మచారి వానప్రస్థ సన్యాసులకు నిది లేదు. అందు బ్రహ్మచారి ఉపకుర్వాణ బ్రహ్మచారియైనను (ఉపకుర్వాణ బ్రహ్మచారి యనఁగా సంవత్సరముగాని వేదాధ్యయనాంతముపఱకుఁ గాని బ్రహ్మచర్యము సలిపి గృహస్థాశ్రమమును పరిగ్రహించువాఁడు.) నైష్ఠిక బ్రహ్మచారియైనను లౌకికాగ్నిహోత్రము

థాః”=“బ్రహ్మచర్యగార్హస్థ్యవానప్రస్థము లనుమూఁడును ధర్మవిభాగములు” అనుమొదలగువాక్యములచేతను “బ్రహ్మచర్యా దేవ ప్రవ్రజేత్” = “బ్రహ్మచర్యమునుండియే సన్యసింపవచ్చును” అనుమొదలగు వాక్యములచేతను ఊర్ధ్వరేతస్కులనుగూర్చి చెప్పఁబడియున్నది. ఆయా యాశ్రమనియమములను బట్టి చూచిన గృహస్థుఁడు కాక తక్కిన వారు ఊర్ధ్వరేతస్కులే; గృహస్థుఁ డైనను తక్కినయాశ్రమముల (వానప్రస్థసన్యాసముల) నాశ్రయించెనేని యూర్ధ్వరేతస్కుఁడే. కావున నన్యాశ్రమములవారును కాలభేదమువలనను స్వయముగ నూర్ధ్వరేతస్కులు కావచ్చును. వీరినిఁగూర్చి విధింపఁబడుటచే విద్యలును స్వతంత్రఫలములే యగును. ఇట్లు చెప్పుటవలన గృహస్థులకు బ్రహ్మవిద్యాధికారము లే దని తలంపవలదు. స్వస్వరూపము నెఱింగినవాఁడు వర్ణాశ్రమనియమములకు లోఁబడువాఁడు కాఁడు కదా!

---

## ౨. పరామర్శాధికరణము

విషయ సంశయ సంగతులు:— ఈయధికరణమునందు బ్రహ్మవిద్యల కంతరంగసాధన మగుసన్యాసాశ్రమము నిరూపింపఁబడును. ఊర్ధ్వరేతస్కాశ్రమములు కలవా? లేవా? యనుసంశయము నివారింపఁబడును. “పూర్వసూత్రమున నూర్ధ్వరేతస్కాశ్రమములను సిద్ధములనుగాఁ గైకొని తద్బలముచే విద్యాస్వాతంత్ర్యము స్థాపించితిరి. విచారించిన గృహస్థాశ్రమభిన్నము లగునాశ్రమములే నిలుకడ నొందవు” అని యాక్షేపసంగతితో వచ్చుపూర్వపక్షము ఖండింపఁబడును. ఇందు పూర్వపక్షమున నూర్ధ్వరేతస్కాశ్రమములు లేకుండుటచే విద్యలకు పారతం

---

నం దే వేల్పుచు. వానప్రస్థుఁడు తనభార్యను పుత్రునియొద్ద విడిచియైనను తనతో దీసికొనియైనను వనమునకుఁ బోవచ్చును. విడిచిపోవుపక్షమున నగ్నిహోత్రము నాత్మయందే యారోపించుకొనును; లేనిపక్షమున మాత్ర మగ్ని యుండును. ఇట్లగుటచే నీతనికిఁ గూడ నగ్న్యభావము చెప్పఁబడెను. సన్యాసికి నియతముగ నాత్మారోపమేవిధి. కావున నూర్ధ్వరేతస్కాశ్రమములకు నగ్నిహోత్రము లేదు.

త్ర్యము కలుగవలయు ననుటయు సిద్ధాంతమున నాయాశ్రమము లుండు టచే స్వాతంత్ర్యమే యనుటయు ఫలములు.

## అ-౩. పా-౪. సూ-౧౮.

అవతారిక:— పై విషయమును నిరూపించుటకై సూత్రకారుఁడు మొట్టమొదటఁ బూర్వపక్షము ననువాదము చేయుచున్నాఁడు.

## ౪౪౪. పరామర్శం జైమిని రచోదనా చ్చాపవదతి హి. ౩. ౪. ౧౮.

తాత్పర్యము :— ఊర్ధ్వరేతస్కాశ్రమము లెట్లును సిద్ధింపవు. "త్రయో ధర్మస్కంధాః" అను మొదలగుశ్రుతులు వానిని విధించునవి కావు. వాని నుదహరించి సన్న్యాసాద్యాశ్రమముల నిలుపఁజూచుట సయు క్తము కాదు. ఆశ్రుతులు ప్రసిద్ధము లగునాశ్రమాంతరముల బరామ ర్శించునవియే కాని క్రొత్తయాశ్రమముల విధించునవి కా వని జైమిని మహాముని తలంచుచున్నాఁడు. ఈతలంపే సరి యైనది. ఆశ్రుతులు ఆశ్రమ ములను విధించునవియే యగునేని యందు లింగాదులలో నేదియైన నొకటి గాని కొన్ని గాని యుండవలయును. అట్లు లేదు కదా! ఆశ్రుతియందు "యజ్ఞము వేదాధ్యయనము దానము అనునవి ధర్మముయొక్క మొదటి విభాగము; తపస్సు రెండవవిభాగము; గురుకులవాసమున యావజ్జీవమును జరుపు బ్రహ్మచర్యము మూఁడవవిభాగము" అని వర్ణింపఁబడి యున్నది. వీని నాశ్రయించినవారలకు పుణ్యలోకము కలుగు నని చెప్పఁబడి యున్నది. ఆశ్రమధర్మాచరణమువలన పరిపూర్ణఫలము లే దని చెప్పఁ బడి యోంకారోపాసన మాత్రము పరిపూర్ణఫలము నొసంగునదిగా నుతింపఁబడుచున్నది. "బ్రహ్మసం స్థోఽమృతత్వ మేతి" ఓంకారో పాసకుఁడు బ్రహ్మనిష్ఠుఁడు ముక్తినొందును." అనువాక్యభాగముచే నీవిషయము తేటపడుచున్నది. కావున యజ్ఞాదులు గృహస్థునిఁ గూర్చియే విధింపఁబడినవి కావున గృహస్థాశ్రమ మొక్కటియే వేదసమ్మ తము. దానికి మార్గ మగుటచే బ్రహ్మచర్యాశ్రమము కూడ నట్టిదియే.

"ఇట్లు కాదు. యజ్ఞాధ్యయనదానములను వర్ణించుటచే గృహస్థాశ్రమము పరామర్శింపఁబడినను తపశ్శబ్దముచే వానప్రస్థయత్యాశ్రమములును అత్యంతబ్రహ్మచర్యవర్ణనముచే నైష్ఠికబ్రహ్మచర్యాశ్రమంబును పరామర్శింపఁబడిన వని తోఁచుచున్నది." అనియెదవేమొ నిశ్చయమే. ఈవిషయము స్మృత్యాచారప్రసిద్ధి ననుసరించి యూహింపఁబడుచున్నదియేకాని ప్రత్యక్షశ్రుతిప్రసిద్ధిని కాదు. శ్రుతిస్మృతులకు విరోధము వచ్చినచో స్మృతి యప్రమాణ మగును కదా! ఈకారణమువలన కేవల స్మృతి ననుసరించి "తపస్సు చేయువాఁడు వనస్థుఁడే కావున తపశ్శబ్దముచే నాయాశ్రమము పరామర్శింపఁబడెను. అందును సన్యాసికిఁ గూడ యమనియమాదిరూప మగుతపస్సు కలదు కావున నాతఁడును ఆపదముచేతనే పరామర్శింపఁబడెను. యావజ్జీవము బ్రహ్మచర్యమును జరుపునైష్ఠిక బ్రహ్మచారి యొకఁడు స్మృతులయందు వర్ణింపఁబడి యుండుటచేతను ఇచ్చట అత్యంతబ్రహ్మచర్యపదము కానవచ్చుటచేతను ఆనైష్ఠికబ్రహ్మచారియే యిచ్చటఁ బరామర్శింపఁబడెను" అని నిర్ణయించుటకు వీలు లేదు. "గృహస్థాశ్రమము కూడ నిట్టిదియే (పరామర్శింపఁబడినదియే) కదా!" అని యెదవేమొ దానికి ప్రత్యక్షశ్రుతి కలదు. కర్మకాండ మంతయు నాయాశ్రమమును గూర్చియే విధింపఁబడి యుండుటచే దానికి శ్రుతిప్రసిద్ధి కలదు. కావున గృహస్థాశ్రమ మొక్కటియే కలదు. కాని తక్కినవి లేవు. స్మృతిప్రసిద్ధి యెట్టిదియో యాచారప్రసిద్ధి కూడ నట్టిదియే (శ్రుతితో విరోధము కలిగినప్పుడు అప్రమాణ మగునదియే) కావునఁ దదనుసారముగఁ గూడ నాశ్రమాంతరములను గల్పించుటకు వీలు లేదు. మఱియు నీస్మృత్యాచారములు లోకానుసారముగ గల్పింపఁబడినవి యగుటచే వీనికి వేఱొకయుపపత్తికూడ నుండవచ్చును. గృహస్థాశ్రమమునకు వివాహ మావశ్యకము కావునను అవివాహము నకు యోగ్యులు కానిపురుషులు కూడ ననేకు లుండుట సంభవించుటచేతను ఆశ్రమము లేకుండ నొక్కక్షణమైన నుండుట యయుక్త మగుటచేతను అట్టివారికి ఈయూర్ధ్వరేతస్కాశ్రమములు కల్పింపఁబడె నన వచ్చును. అట్టివారికిఁ గర్మాధికారము కూడ లేదు కదా! కావున నెట్లును గృహస్థాశ్రమ మొక్కటియే యాశ్రమము. దీర్ఘజాడ్యాదులతో పూర్వజన్మకృతమహాపాపము ననుభవించువా రగుటచే వివాహాయోగ్య

లగుపురుషులయాశ్రమము లాశ్రమము లనియే పరిగణించుటకు వీలులేదు కదా! కావున "త్రయో ధర్మస్కంధాః" అనుశ్రుతి స్తోత్రార్థ మైనదియే కాని విధ్యర్థ మైనది కాదు.

ఇదియంతయుఁ గాక శ్రుతి ప్రత్యక్షముగనే గృహస్థేతరాశ్రమముల నిందించుచున్నది. "వీరహా వా ఏష దేవానాం యోఽగ్ని ముద్వాసయ తే. ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతంతుం మావ్య వచ్ఛేత్సీః. నాపుత్రస్య లోకోఽస్తీతి త త్సర్వే పశవో విదుః." "ఎవ్వఁడు అగ్నిహోత్రము నుద్వాసన చేయునో వాఁడు దేవతల విషయములో వీరహత్య చేసినవాఁ డగును. విద్యాభ్యాసము ముగిసినపిదప నాచార్యునికి గురుదక్షిణ నొసంగి తదాజ్ఞచే వివాహము చేసికొనుము. సంతానలతను ఛేదింపకుము. ఎన్ని వ్రతముల నైన నాచరించి పుత్రుని పడయుము. పుత్రుఁడు లేకున్న సద్గతి లే దనువిషయమును పశువులు కూడ నెఱుంగును" అను మొదలగు వాక్యము లీవిషయమున ప్రమాణములు. ఈవాక్యములలో నూర్ధ్వరేతస్కాశ్రమములు నిందింపఁబడెను కదా! "ఇట్లయినను 'త్రయో ధర్మస్కంధాః' అనుశ్రుతి యాశ్రమాంతరముల బోధింపకున్నను 'యే చే మేఽరణ్యే శ్రద్ధా తప ఇ త్యుపాసతే' 'ఎవ్వరు అరణ్యమున నుండి తపము చేయుదురో' అనుశ్రుతివలన నాశ్రమాంతరములు విధింపఁబడవచ్చును" అనియెదవేమొ అదియు యుక్తము కాదు. ఆవాక్యము దేవయానమార్గమునుగూర్చి చెప్పునదియే కాని యాశ్రమాంతరములను గూర్చి చెప్పునది కాదు. తపశ్శబ్దముచే వాన ప్రస్థసన్యాసాశ్రమములు చెప్పఁబడు నను విషయము సంశయాస్పద మని యిదివఱకే నిరూపించియున్నాము. ఈశ్రుతియందును అంతకంటె నాధిక్యమేమియు లేదు కదా! "అగునుగాక మఱియొకస్థలమున 'ఏత మేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛంతః ప్రవ్రజంతి'='ఈపరమేశ్వర ప్రాప్తిని గోరియే సన్యాసులు సర్వసంసారమును విడుచుచున్నారు.' అనుశ్రుతి కలదు. ఇది స్పష్టముగనే సన్యాసమును విధించుచున్నది కదా!" అనియెదవేమొ. ఇదియు బ్రహ్మలోకస్తుతియే కాని సన్యాసవిధి కానేరదు. కావున నెట్లును ఆశ్రమాంతరము సిద్ధింపదు; ఊర్ధ్వరేతస్కత యనునదియే వేదమునకు సమ్మతము కాదు.

విశేషాంశము:—వాస్తవస్థితిలో నీయధికరణము నారంభింపవలసినపనియే లేదు. "బ్రహ్మచర్యా దేవ ప్రవ్రజేత్" అనుశ్రుతి ప్రత్యక్షముగనే సన్యాసమును విధించుచున్నది కావున నీవిచారముతోనే పని లేదు. అయినను యాశ్రుతి లేదని భావించి యీవిచార ముపక్రమింపఁబడెను. ఈశ్రుతి లేకున్నను సన్యాసాశ్రమమును స్థిరపఱుపవచ్చు నని నిరూపించుటకై యీవిచార మారంభ మైనది.

## అ-3. పా-4. సూ-19.

అవతారిక:—ఇట్లు వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## 447. అనుష్ఠేయం బాదరాయణః సామ్య శ్రుతేః. 3. 4. 19.

తాత్పర్యము:—ఈపూర్వపక్షము యుక్తియుక్త మైనది కాదు. వేదమునందు స్పష్టముగఁ జెప్పఁబడకుండుటచే నూర్ధ్వరేతస్కాశ్రమములు బొత్తుగనే లేవనియు, ఉన్నను వివాహయోగ్యులు కానివారలచేత మాత్రమే యాదరింపఁబడవలసినవి యనియు అగ్నిహోత్రాదివిధుల బలమువలన ననుమానముచేతను ప్రత్యక్షముగ శ్రుతిచేతనుఁ గూడ గృహస్థాశ్రమము మాత్రము వర్ణింపఁబడె ననియు నభిప్రాయపడుట యుక్తియుక్తము కాదు. సమ్మతి లేకున్నను గృహస్థాశ్రమమువలెనే తక్కినయాశ్రమములు కూడ నంగీకరింపఁబడవలసినవియె. "త్రయో ధర్మస్కంధాః" అనుశ్రుతియం దన్నియాశ్రమములును సమానముగఁ బరామర్శింపఁబడి యుండుటచే వ్యాసుఁ డిట్లే యభిప్రాయపడుచున్నాఁడు.

పైశ్రుతియందు అన్నియాశ్రమములును పరామర్శింపఁబడియే యున్నవికాని యొక్కటియైనను విధింపఁబడి యుండలేదు కదా! ఈకారణమువలన గృహస్థాశ్రమమువలెనే తక్కినవియు నంగీకరింపఁబడవలసినవియే. గృహస్థాశ్రమ మెట్లవశ్యకర్తవ్యముగ నంగీకరింపఁబడుచున్నదో యట్లే తక్కినవియు నంగీకరింపఁబడవలసినవియే. ఈపరామర్శ స్తోత్రార్థమే యగును గాక. అట్లయినను ఇందు చెప్పఁబడినవిషయములు మాత్రమప్రమాణములు కానేరవు. ఈపరామర్శశ్రుతియం దాశ్రమాంతరములు స్ఫురింపకుం

పునేని స్ఫురించినను శ్రుత్యంతరముచే బాధింపఁబడునేని యప్పుడు వానిని (ఆశ్రమాంతరములను) పరిగ్రహింపకుండవలసి వచ్చునుగాని యిచ్చట నట్లు లేదు. యజ్ఞాధ్యయనదానముల వర్ణించుటచే గృహస్థాశ్రమంబును ప్రత్యక్షముగనే బ్రహ్మచర్యాశ్రమంబును ఆశ్రుతియందు చెప్పఁబడి యున్నవి. తపశ్శబ్దముచేతఁ గూడ నొకయాశ్రమము వర్ణింపఁబడినట్లు దీని చేతనే నిర్ణయింపఁబడవలసి యున్నది. యజ్ఞాదిరూపములచే ధర్మము లనేక విధములై యుండ వానికి మూఁడువిభాగములు మాత్రమే కల వనుట యెట్లు సరిపడును? ఇందు మూఁ డాశ్రమంబులు వర్ణింపఁబడి యుండునేని యా యాశ్రమములకు సంబంధించినధర్మములనొక్కవిభాగముగఁ గైకొను టకు వీ లగును. ఈకారణమువలన తపశ్శబ్దముచే తపఃప్రధాన మగు మఱి యొక యాశ్రమము వర్ణింపఁబడె ననియె చెప్పి తీరవలయును. కావున నీపరామర్శయందు ఆశ్రమాంతరములు స్ఫురింపలే దనుట యుక్తము కాదు. ఇట్లు స్ఫురించిన నీయాశ్రమాంతరములకు మఱియొకశ్రుతిచే బాధకల దేమో యనిన నదియుఁ గానరా లేదు. "వీరహావై" అను మొద లగు నిందావాక్యములును గృహస్థుఁడై ప్రమాదమువలననో మౌర్ఖ్యము వలననో అగ్నిహోత్రము నుద్వాసన చేయఁదలంచినవానినిఁగూర్చి ప్రవర్తిం చినవి కావచ్చును. ప్రాప్తియే లేకున్న నింద సంభవింపదు. ఊర్ధ్వరేతస్కా-శ్రమముల యం దగ్నిహోత్రాదులే లేవు కదా! కావున నెట్లును ఆశ్ర మాంతరముల నిషేధించుటకు వీలు లేదు.

మఱియు పరామర్శ యనఁగా స్థలాంతరమునందు సిద్ధించినవిషయ మును అనువాదము చేయుటయే కాని క్రొత్తదానిని ఎచ్చటను లేని దానిని వర్ణించుట కాదు కదా! కావున నన్యస్థలసిద్ధ మగుగృహస్థాశ్రమ మెట్లు పరామర్శింపఁబడెనో అట్లే యాశ్రమాంతరములును పరామర్శింపఁ బడినవి యనవచ్చును. గృహస్థాశ్రమమువలెనే తక్కినయాశ్రమములు కూడ మఱియొకస్థలమున విధింపఁబడియే యున్నవి యని సిద్ధాంతము చేయవచ్చును. అర్థవాదములు స్వార్థమును చెప్పకుండునవియే యైనను విధిని మాత్రమే నుతించునవియే యైనను వానియందు ప్రస్తావింపఁబడిన విషయములు మాత్ర మప్రామాణికములు కానేర వనిదేవతాధికరణమున (చూ. ౧. 3. ౨౬.) నిరూపింపఁబడి యున్నది. ఆన్యాయము ననుసరిం చియే యిచ్చట పరామర్శ స్తుత్యర్థమయ్యు యున్నను అందు ప్రస్తావింపఁ

విశేషాంశము:—వాస్తవస్థితిలో నీయధికరణము నారంభింపవలసినపనియే లేదు. "బ్రహ్మచర్యా దేవ ప్రవ్రజేత్" అను శ్రుతి ప్రత్యక్షముగనే సన్న్యాసమును విధించుచున్నది కావున నీవిచారముతోనే పని లేదు. అయినను యాశ్రుతి లేదని భావించి యీవిచార ముపక్రమింపఁబడెను. ఈశ్రుతి లేకున్నను సన్న్యాసాశ్రమమును స్థిరపఱుపవచ్చు నని నిరూపించుటకై యీవిచార మారంభ మైనది.

## అ-౩. పా-౪. సూ-౧౯.

అవతారిక:—ఇట్లు వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౪౪౫. అనుష్ఠేయం బాదరాయణః సామ్యశ్రుతేః. ౩. ౪. ౧౯.

తాత్పర్యము:—ఈపూర్వపక్షము యుక్తియుక్త మైనది కాదు. వేదమునందు స్పష్టముగఁ జెప్పఁబడకుండుటచే నూర్ధ్వరేతస్కాశ్రమములు బొత్తుగనే లేవనియు, ఉన్నను వివాహయోగ్యులు కానివారలచేత మాత్రమే యాదరింపఁబడవలసినవి యనియు అగ్నిహోత్రాదివిధుల బలమువలన ననుమానముచేతను ప్రత్యక్షముగ శ్రుతిచేతనుఁ గూడ గృహస్థాశ్రమము మాత్రము వర్ణింపఁబడె ననియు నభిప్రాయపడుట యుక్తియుక్తము కాదు. స్మృతి లేకున్నను గృహస్థాశ్రమమువలెనే తక్కినయాశ్రమములు కూడ నంగీకరింపఁబడవలసినవియే. "త్రయో ధర్మస్కంధాః" అను శ్రుతియం దన్నియాశ్రమములును సమానముగఁ బరామర్శింపఁబడి యుండుటచే వ్యాసుఁ డిట్లే యభిప్రాయపడుచున్నాఁడు.

పైశ్రుతియందు అన్నియాశ్రమములును పరామర్శింపఁబడియే యున్నవి కాని యొక్కటియైనను విధింపఁబడి యుండలేదు కదా! ఈకారణమువలన గృహస్థాశ్రమమువలెనే తక్కినవియు నంగీకరింపఁబడవలసినవియే. గృహస్థాశ్రమ మెట్లవశ్యకర్తవ్యముగ నంగీకరింపఁబడుచున్నదో యట్లే తక్కినవియు నంగీకరింపఁబడవలసినవియే. ఈపరామర్శ స్తోత్రార్థమే యగును గాక. అట్లయినను ఇందు చెప్పఁబడినవిషయములు మాత్రమప్రమాణములు కానేరవు. ఈపరామర్శశ్రుతియం దాశ్రమాంతరములు స్ఫురింపకుం

డునేని స్ఫురించినను శ్రుత్యంతరముచే బాధింపఁబడునేని యప్పుడు వానిని (ఆశ్రమాంతరములను) పరిగ్రహింపకుండవలసి వచ్చునుగాని యిచ్చట నట్లు లేదు. యజ్ఞాధ్యయనదానముల వర్ణించుటచే గృహస్థాశ్రమంబును ప్రత్యక్షముగనే బ్రహ్మచర్యాశ్రమంబును ఆశ్రుతియందు చెప్పఁబడి యున్నవి. తపశ్శబ్దముచేతఁ గూడ నొకయాశ్రమము వర్ణింపఁబడినట్లు దీని చేతనే నిర్ణయింపఁబడవలసి యున్నది. యజ్ఞాదిరూపములచే ధర్మము లనేక విధములై యుండ వానికి మూఁడువిభాగములు మాత్రమే కల వనుట యెట్లు సరిపడును? ఇందు మూఁడాశ్రమంబులు వర్ణింపఁబడి యుండునేని యా యాశ్రమములకు సంబంధించినధర్మముల నొక్కవిభాగముగఁ గైకొను టకు వీ లగును. ఈకారణమువలన తపశ్శబ్దముచే తపఃప్రధాన మగు మఱి యొక యాశ్రమము వర్ణింపఁబడె ననియె చెప్పి తీరవలయును. కావున నీపరామర్శయందు ఆశ్రమాంతరములు స్ఫురింపలే దనుట యుక్తము కాదు. ఇట్లు స్ఫురించిన నీయాశ్రమాంతరములకు మఱియొకశ్రుతిచే బాధకల దేమో యనిన నదియుఁ గానరా లేదు. "వీరహావై" అను మొద లగు నిందావాక్యములును గృహస్థుఁడై ప్రమాదమువలననో మౌర్ఖ్యము వలననో అగ్నిహోత్రము నుద్వాసన చేయఁదలంచినవానినిఁగూర్చి ప్రవర్తిం చినవి కావచ్చును. ప్రాప్తియే లేకున్న నింద సంభవింపదు. ఊర్ధ్వరేతస్కా శ్రమముల యం దగ్నిహోత్రాదులే లేవు కదా! కావున నెట్లును ఆశ్ర మాంతరముల నిషేధించుటకు వీలు లేదు.

మఱియు పరామర్శ యనఁగా స్థలాంతరమునందు సిద్ధించినవిషయ మును అనువాదము చేయుటయే కాని క్రొత్తదానిని ఎచ్చటను లేని దానిని వర్ణించుట కాదు కదా! కావున నన్యస్థలసిద్ధ మగుగృహస్థాశ్రమ మెట్లు పరామర్శింపఁబడెనో అట్లే యాశ్రమాంతరములును పరామర్శింపఁ బడినవి యనవచ్చును. గృహస్థాశ్రమమువలెనే తక్కినయాశ్రమములు కూడ మఱియొకస్థలమున విధింపఁబడియే యున్నవి యని సిద్ధాంతము చేయవచ్చును. అర్థవాదములు స్వార్థమును చెప్పకుండునవియే యైనను విధిని మాత్రమే స్తుతించునవియే యైనను వానియందు ప్రస్తావింపఁబడిన విషయములు మాత్ర మప్రామాణికములు కానేర వని దేవతాధికరణమున (చూ. ౧. ౩. ౨౬.) నిరూపింపఁబడి యున్నది. ఆన్యాయము ననుసరిం చియే యిచ్చట పరామర్శ స్తుత్యర్థమయ్యు యున్నను అందు ప్రస్తావింప

బడినవిషయములుమాత్ర మప్రమాణములు కానేరవు. మఱియు ప్రత్యక్ష శ్రుతి లేకున్నను స్మృతి ననుసరించి దాని ననుమానముచేఁ గూడఁ గల్పింప వచ్చు ననియు నిదివఱకే సిద్ధాంత మైనది. కావున నెట్లును ఆశ్రమాంత రముల నిషేధించుటకు వీలు లేదు; తపశ్శబ్దమువలన వానప్రస్థసన్యాసా శ్రమములు విధింపఁబడె ననుటలో సంశయము లేదు.

ఈశ్రుతివలెనే తక్కినశ్రుతులును నిర్వివాదముగ నాశ్రమాంతర ముల బ్రతిపాదించునవియే. "త మేతం ప్రవ్రాజినః" అనుశ్రుతి నిర్వివా దముఁగ సన్యాసమునుగూర్చియే చెప్పుచున్నది. ఆబృహదారణ్యకవా క్యమునందు "త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసా నాశకేన" "బ్రాహ్మణులు యీపరమేశ్వరరూపమును వేదాధ్యయనముచేతను యజ్ఞముచేతను దానముచేతను ఆశారహిత మగు కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సులచేతను యమనియమాదులచేతను తెలిసి కొన నిచ్ఛయింతురు." అని యాదినుండియు సర్వాశ్రమములును పరా మర్శింపఁబడి యున్నవి. అంతమున "ప్రవ్రజంతి" యని సన్యాసాశ్రమము కూడ పరామర్శింపఁబడి యున్నది. కేవల మాపద మొక్కటియే యుండె నేని యప్పుడు సన్యాసవిధి గ్రహించినను గ్రహింపవచ్చును. లేకున్న లేక పోవచ్చును. గాని యిచ్చట నట్లు లేదు. క్రమప్రాప్త మగుటచే నావిధి నవశ్య మంగీకరించియే తీరవలయును. "యే చే మే ఽరణ్యే" అనుశ్రుతియు నిట్లే పంచాగ్నివిద్యయందు బఠింపఁబడి యున్నది. పితృయానము కర్మ మార్గ మగుటచే నచ్చటను గృహస్థవానప్రస్థాశ్రమములే యుద్దేశింపఁ బడినట్లే తోఁచుచున్నది. అరణ్యపద మీవిషయమునకు గుఱుతుగ నున్నది కదా ! మఱియు తపశ్శబ్దముచే సన్యాసాశ్రమమును గూడ గ్రహింపవచ్చు నని యిదివఱకే నిరూపించియున్నాము. కావున నాశ్రమ ధర్మమాత్రపరుఁ డగుసన్యాసియు నాశ్రుతియందు వర్ణింపఁబడి యుండ వచ్చును. విద్యాసిద్ధి నొందినవానికిఁ గాని దేవయానమార్గము లేదు కావున సన్యాసికైనను ఆశ్రమధర్మమాత్రపరుఁ డగునేని పితృయానమే కలుగు ననవచ్చును. కావున నెట్లును గృహస్థాశ్రమమువలె తక్కిన యాశ్రమములు కూడ నాశ్రయింపఁబడవలసినవియే.

## అ_౩. పా_౪. సూ_౨౦.

అవతారిక:—ఈసిద్ధాంతమును మఱియొకవిధముగఁ గూడ స్థాపించుచున్నాఁడు.

## ౪౪౬. విధిర్వా ధారణవత్. ౩. ౪. ౨౦.

తాత్పర్యము:—మఱియును "త్రయోధర్మస్కంధాః" అనువాక్యమున "బ్రహ్మసంస్థో ఽమృతత్వమేతి" అనుభాగము విధియే యని కూడఁ జెప్పవచ్చును. కేవలపరామర్శమే యని పట్టు పట్ట నక్కఱ లేదు. "ఇట్లు కాదు. 'ధర్మవిభాగములు మూఁడును పుణ్యలోకసాధనములు (అందు) బ్రహ్మనిష్ఠుఁడు ముక్తుఁడగును' అనియుండుటచే నిది యేకవాక్యముగ గానవచ్చుచున్నది. ఆశ్రమములలో దేని నవలంబించినవాఁడైనను బ్రహ్మనిష్ఠుఁడైన ముక్తి నొందవచ్చు నను నర్థము తేలుచున్నది. కావున 'త్రయో ధర్మస్కంధాః' అనుభాగము మాత్రము పరామర్శ యనియు మిగిలినభాగము విధి యనియు జెప్పిన వాక్యభేదము వచ్చును. ఏకవాక్యత్వము సిద్ధింపుచుండ దీని నాశ్రయించుట యన్యాయము కదా" యనియెదవేమో. ఇది నిశ్చయమే. అయినను ఇచ్చట విధినే యంగీకరించి తీరవలయును. సన్యాసాశ్రమమును గూర్చియు వానప్రస్థాశ్రమమును గూర్చియు గూడ ప్రత్యేకవిధి లేదని మీరే చెప్పియున్నారు కదా! అట్లు లేకున్న పరామర్శయు పరామర్శ లేకున్న స్తుతియు సంభవింపనేరవు కదా! కావున వాక్యభేదము నైన నంగీకరించి యిచ్చట విధినే గ్రహింపవలయును. ఇది యపూర్వము కదా! దీనికి గర్మకాండమున దృష్టాంతము కలదు. "అథస్తాత్సమిధం ధారయ న్ననుద్రవే దుపరి హి దేవేభ్యో ధారయతి" "సమిధను అగ్నికి నధోభాగమున ధరించి నడువవలయును. దేవతలకై దాని నూర్ధ్వభాగమునందు ధరింతురు" అనువాక్యమున అధోధారణ మూర్ధ్వధారణ మనురెండు విషయములును జెప్పఁబడి యున్నవి; వాక్యంబును ఏకవాక్యముగఁ గూడ గానవచ్చుచున్నది. ఇట్లున్నను ఊర్ధ్వధారణము అపూర్వ మగుటచే దన్నిర్ణయభాగము విభాగముగనే గ్రహింపఁబడెను. ఇట్లే యిచ్చటను సన్యాసాశ్రమము విధింపఁబడవలయును. "విధిస్తు ధారణేఽపూర్వ

తత్వాత్” “చెప్పఁబడినవిషయ మపూర్వ మగుటచే ధారణవిషయమున శ్రుతి విధిశ్రుతియే” యని జైమిని సిద్ధాంతము చేసియున్నాఁడు. కావున నెట్లును ఆవాక్యము విధివాక్యముకూడఁ గావచ్చును.

ఇట్లుగాక పరామర్శయే యైనను సన్న్యాసవిధి సిద్ధించును. ‘బ్రహ్మనిష్ఠ కలవాఁడు ముక్తి నొందును’ అని యెవ్వని నుతించినను ‘బ్రహ్మనిష్ఠ మోక్షఫలము నొసంగును’ అనుటయు ‘ఆబ్రహ్మనిష్ఠప్రదానధర్మముగఁగల ముక్తులు కొంద అుండవలయును’ అనుటయు నిస్సంశయముగసిద్ధించును. దానివలన నొకవిధి యేర్పడును. విధిలేకున్న కేవలపరామర్శయు స్తుతియుఁగూడ సంభవింపవు. మొట్టమొదట ‘బ్రహ్మనిష్ఠునకు ముక్తి కలుగును’ అనువిషయమే స్థిరము కాకుండిన ‘వీఁడు బ్రహ్మవేత్త యైన ముక్తి నొందును’అనుస్తోత్ర మెట్లుసంభవించును ? కావున నెట్లునుఇచ్చట సన్న్యాస విధి యవశ్యము కల దని యంగీకరింపవలయును. ఆవిధియు (బ్రహ్మనిష్ఠత్వంబును) నాల్గాశ్రమములలో నెవ్వనికైనఁ గలుగవచ్చునా? లేక కేవల సన్న్యాసికి మాత్రమే కలుగవలయునా? అనువిషయమును గూర్చి కొంత విచారింపవలసియున్నది. అన్నియాశ్రమములవారినిగూర్చియు నావిధి ప్రవర్తించునేని యప్పుడు ‘యెవ్వఁడైనను సరియే. బ్రహ్మనిష్ఠత్వము కలిగెనేని ముక్తుఁ డగును’ అని సిద్ధాంతమగును. కాదేని ‘సన్న్యాసికొక్కనికే బ్రహ్మనిష్ఠత్వ మసాధారణ ధర్మము. తక్కినవారలకు నది యుండిన నుండవచ్చును; లేకున్న లేకపోవచ్చును’ అనువిషయము సిద్ధాంత మగును.

పూర్వపక్షము:— ఈవిషయమునఁ గొంద ఱిట్లభిప్రాయ పడుచున్నారు. ‘యజ్ఞోధ్యయనం’ అనువాక్యమునందుఁ గలతపశ్శబ్దముచే వానప్రస్థుఁడే గాక యతియుఁ బరామర్శింపఁబడె ననుచున్నారు; బ్రహ్మసంస్థపదముచే బ్రత్యేకాశ్రమము విధింపఁబడ లే దనుచున్నారు. బ్రహ్మసంస్థపదముసన్న్యాసినిచెప్పుననుటకుఁగారణ మేమి?*రూఢియా? లేక†యోగమా? రూఢియైనచో నప్పుడు ఆశ్రమ స్వీకారోత్తరక్షణముననే ముక్తి రావలసి యుండును. కావున బ్రహ్మజ్ఞానము నిరర్థక మగును. “నాన్యః పంథా విద్యతే ఽయనాయ. జ్ఞానా దేవ తు కైవల్యం” “మోక్షమునకు జ్ఞానభిన్న మగుమార్గ మేదియు లేదు. జ్ఞానమువలనమాత్రమే మోక్షముకలుగును”

* రూఢి. (అ-1. పా-4. పేజీ-163 చూ.)

† యోగము. (అ-1. పా-4. పేజీ-164 చూ.)

అను మొదలగు శ్రుతులకు విరోధము వచ్చును. అవయవార్థమువలన (యౌగికార్థమువలన) కార్యనిర్వాహము గలుగుచుండ ఉపపత్తియుఁ గుదిరియుండ నిరర్థకముగ సముదాయార్థమును (అప్రసిద్ధమగు రూఢ్యర్థ మును) కల్పించుట యుక్తము కానేరదు. ఈకారణమువలన నిచ్చట యోగమునే యాశ్రయింపవలయును; నాలు 'గాశ్రమములలో నెవ్వఁడు బ్రహ్మనిష్ఠుఁడో వాఁడే ముక్తి నొందును' అని తాత్పర్యమును వర్ణింప వలయును. బ్రహ్మమునందు నిలుకడగలవాఁడు బ్రహ్మనిష్ఠుఁడు' అని యర్థము చెప్పవలయును. ఈవిధముగ బ్రహ్మసంస్థపదము ప్రత్యేకాశ్రమమును గ్రహింపలేనిదగుటచే తక్కినపదములచేతనే నాల్గాశ్రమములును వర్ణింపఁ బడినవి యనవలయును. అందు యజ్ఞదానాదిపదములచే గృహస్థాశ్రమం బును బ్రహ్మచర్యపదముచే బ్రహ్మచర్యాశ్రమంబును వర్ణింపఁబడినవి. ఇఁక తపశ్శబ్దముచేఁ దక్కిన రెండాశ్రమములును కల్పి వర్ణింపఁబడె ననవలయును. ఈవానప్రస్థసన్న్యాసాశ్రమములకు తగినపోలిక లేకపోలేదు. కృచ్ఛ్రచాంద్రాయణాదిరూప మగుతపస్సును వానప్రస్థులకును '(యతి) యెనిమిది గ్రాసముల భుజింపవలయును' అను మొదలగు నియమములును *యమనియమాదులును స్వరూపముగ గలతపస్సు యతికిని గూడ కలదు. ఈసామ్యముచే రెండాశ్రమములు నొక్కటిగఁ బరిగ్రహింపఁబడి తప శ్శబ్దముచే వర్ణింపఁబడె ననవచ్చును. దీనిచే 'త్రయో ధర్మస్కంధాః' అను త్రిత్వప్రతిజ్ఞకు హానిలేదు. 'గృహస్థాదులకు భేదసాధ్యమగుకర్మ యుండు టచే బ్రహ్మజ్ఞానంబును తన్నిష్ఠయు సంభవింపదు. అనిన నదియు యుక్తము కాదు. కర్మల నాచరించుట యనఁగా నేదియో యొకకార్యము నెట్లో

---

* యమము నియమము ఆసనము ప్రాణాయామము ప్రత్యాహారము ధ్యానము ధారణ సమాధి అనునివి యమనియమాదులు. అందు అహింసా సత్యము అస్తేయము బ్రహ్మచర్యము ఽపరిగ్రహము అనునివి యమము లనఁబడును. (అస్తేయ మనఁగా దొంగలింపకుండుట అపరిగ్రహ మనఁగా ఒకనియొద్దనుండి ధనమును గ్రహింపకుండుట) శౌచము (పరిశుద్ధముగా నుండుట) తపస్సు వేదాధ్యయనము తృప్తి యీశ్వరధ్యానము అనునివి నియమములు. యోగాసనాదు లాసనంబులు. ప్రాణనిరోధము ప్రాణాయామము. ఇంద్రియములను వాని వృత్తులనుండి మఱలించుట ప్రత్యాహారము, ధ్యానరూపము స్పష్టము. ధ్యానింపఁబడుచున్నవిషయమును మనస్సున స్థిరముగ నిలుపుట ధారణ. చిత్తైకాగ్రత సమాధి.

యొకట్లాచరించుటయా? లేక ఫలేచ్ఛతో నాచరించుటయా? యిందు మొదటిపక్షము నాశ్రయించిన యతులకుఁ గూడ నట్టికర్మ కలదు. భుజించుట సంచరించుట యను మొదలగు కార్యముల యతులు గూడ నాచరించుచునే యున్నారు కదా! ఇఁక రెండవపక్షమును నాశ్రయించిన నది గృహస్థులకుఁ గూడ సంభవింపవచ్చును. లోకానుగ్రహార్థమో మఱియొక కారణముననో కర్మ నాచరించినను ఫలేచ్ఛారహితముగ నాచరింపవచ్చును కదా! కావునఁ గర్మ యున్నను జ్ఞానోదయము కలుగవచ్చును. బ్రహ్మనిష్ఠయు చేకూరవచ్చును. బ్రహ్మమునందు గలనిలుకడయే బ్రహ్మనిష్ఠ కాని కర్మపరిత్యాగమాత్రము కాదు. కేవల కర్మపరిత్యాగమువలన బ్రహ్మనిష్ఠ దొరకదనుట నీకును సమ్మతమేకదా! కావున నాశ్రుతికి 'ఈనాల్గాశ్రమములును బ్రహ్మనిష్ఠ లేనప్పుడు పుణ్యలోకహేతువు లగును. ఇం దెవ్వఁడైనను వివేకవంతుఁడై బ్రహ్మనిష్ఠను జెందెనేని ముక్తి నొందును' అనియే యర్థము చెప్పవలయును. అవివేక వివేక దశాభేదములచే ఫలభేదము కలుగు ననుటలో విరోధ మేమియు లేదు. అజ్ఞానిగా నున్నప్పు డెట్టివాఁడుగా నున్నను జ్ఞానము కలిగినపిదప శ్రేష్ఠుఁడు కావచ్చునుగదా! కావున బ్రహ్మసంస్థపదము యౌగికార్థమును చెప్పునదియే; పైన వివరించినవిధముగ పూర్వవాక్య భాగముచేఁ బరామర్శింపఁబడిన నాల్గాశ్రమములతోను సంబంధము కలిగినదియే. కావున వాక్యారంభమునఁ బరామర్శింపఁబడిన యాశ్రమములు మాత్రమే నుతింపఁబడుచున్నవి కాని యెట్లును క్రొత్త సన్యాసాశ్రమము ప్రత్యేకముగ విధింపఁబడుట లేదు. తపశ్శబ్దముచే దానికిఁ గూడ సంగ్రహము కల దని సమ్మతించియే యున్నాము కదా! అనుచున్నారు.

సిద్ధాంతము :— ఇట్లు చెప్పుట యుక్తము కాదు. అప్పుడు ఉపక్రమోపసంహారమునకు వైషమ్యము కలుగును. ఈతపశ్శబ్దము వానప్రస్థాశ్రమమును పరామర్శించుచుండ నదియే సన్యాసాశ్రమములుగూడ పరామర్శించు ననుట యుక్తము కానేరదు. గత్యంతరము లేకుండినచో నేదియో యొకవిధముగ సమన్వయింపవలసి వచ్చును. కాని యిచ్చట నట్లు లేదు. ఉపక్రమమునందు బ్రహ్మచారి గృహస్థాశ్రమములు తమ తమ యథాధారణధర్మములతోనే వర్ణింపఁబడి యున్నవి. వానప్రస్థాశ్రమముకూడ తనయథాధారణధర్మ మైనతపస్సుతోనే వర్ణింపఁబడెను.

ఇట్లుండ సన్న్యాసాశ్రమ మొక్కటి మాత్ర మట్లు
యెట్లు సరిపడును ? కృచ్ఛ్రచాంద్రాయణాదిరూప మగు
నకే తపశ్శబ్దము రూఢనామము; వానప్రస్థునకు నాతపస్సే
ధర్మము. సన్న్యాసికిని యింద్రియనిగ్రహము శౌచసంతోషాది
భక్షణము (ఎనిమిదిముద్దలను మాత్రమే భుజించుట) మొదలై య
మము లున్నను వానియందు తపశ్శబ్ద మౌపచారికముగఁ బ్రయోగింపఁ
బడవలయునేగాని రూఢము మాత్రము కాదు. మహాత్ములగువారు యీ
శౌచాదులకంటె భిన్నముగనే తపస్సును పరిగణించుచున్నారు. "శౌచ
సంతోషతపఃస్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః" "పరిశుద్ధత్వము
సంతోషము కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సు వేదాధ్యయనము ఈశ్వర
ధ్యానము అనునవి నియమములు" అని మహాత్ములు చెప్పుచున్నారు.
గత్యంతరము లేకుండిన నౌపచారికప్రసిద్ధినిబట్టి యైనను వ్యవహరింప
వలసి వచ్చును గాని యిచ్చట నట్లు చేయనేటికి ? అంతమున యత్యా
శ్రమమునకు నసాధారణధర్మ మగు బ్రహ్మసంస్థత్వము వర్ణింపఁబడియే
యున్నది కదా ? ఇది యంతయు గాక నాశ్రమములు నాలుగని ప్రసిద్ధి
యుండ మూఁడుగానే పరామర్శింపఁబడుచున్నవి యనుటయు నన్యాయమే.
కావున తపశ్శబ్దము సన్న్యాసాశ్రమమును గూర్చి చెప్పెననుట యట్లు
యుక్తియుక్తము కానేరదు.

మఱియొకవిశేషము. ఈవాక్యమునకు మూఁడాశ్రమములవారు
పుణ్యలోకమును జెందుదు రనియు బ్రహ్మసంస్థుఁ డగునాల్గవవాఁడు ముక్తి
నొందుననియు జెప్పఁబడి యున్నది. ఇది పరస్పరభేద ముండిననేగాని సరి
పడదు. "త్రయ ఏతే పుణ్యలోకా భవంతి" "వీరు మువ్వురును పుణ్య
లోకము నొందుదురు." అని చెప్పఁబడియున్నచోట నీసన్న్యాసికూడ పరా
మర్శింపఁబడి యున్నాఁ డనినచో యీసన్న్యాసిని ప్రత్యేకముగ చెప్పలే దని
నచో విరోధము వచ్చును. ఈతనికి బ్రహ్మసంస్థత్వ మసాధారణధర్మ మని
యిదివఱకే చెప్పియున్నాము. బ్రహ్మసంస్థునికి ముక్తియే ఫలమనియు శ్రుతి
యందు నిరూపింపఁబడి యున్నది. ఆశ్రమత్రయముతోకూడ నతఁడును
పరామర్శింపఁబడి యుండునేని యీతనికిఁగూడ పుణ్యలోకఫలము కలుగ
వలసివచ్చును. అప్పు డొక్కనికే పుణ్యలోకములు ముక్తియు గలుగు
ననుట విరుద్ధ మగును. మఱియుఁ దక్కినయాశ్రమములకుఁగూడ బ్రహ్మ

యొక ట్లాచరించుటయా? లేక ఫలేచ్ఛతో నాచరించుటయా? యిందు మొదటిపక్షము నాశ్రయించిన యతులకుఁ గూడ నట్టికర్మ కలదు. భుజిం చుట సంచరించుట యను మొదలగు కార్యముల యతులు గూడ నాచ రించుచునే యున్నారు కదా! ఇక రెండవపక్షమును నాశ్రయించిన నది గృహస్థులకుఁ గూడ సంభవింపవచ్చును. లోకానుగ్రహార్థమో మఱియొక కారణముననో కర్మ నాచరించినను ఫలేచ్ఛారహితముగ నాచరింపవచ్చును కదా! కావునఁ గర్మ యున్నను జ్ఞానోదయము కలుగవచ్చును. బ్రహ్మ నిష్ఠయు చేకూరవచ్చును. బ్రహ్మమునందు గలనిలుకడయే బ్రహ్మనిష్ఠ కాని కర్మపరిత్యాగమాత్రము కాదు. కేవల కర్మపరిత్యాగమువలన బ్రహ్మనిష్ఠ దొరకదనుట నీకును సమ్మతమేకదా! కావున నాశ్రుతికి 'ఈనాల్గాశ్రమ ములును బ్రహ్మనిష్ఠ లేనప్పుడు పుణ్యలోకహేతువు లగును. ఇం దెవ్వఁ డైనను వివేకవంతుఁడై బ్రహ్మనిష్ఠను జెందెనేని ముక్తి నొందును' అనియే యర్థము చెప్పవలయును. అవివేక వివేక దశాభేదములచే ఫలభేదము కలుగు ననుటలో విరోధ మేమియు లేదు. అజ్ఞానిగా నున్నప్పు డెట్టివాఁ డుగా నున్నను జ్ఞానము కలిగినపిదప శ్రేష్ఠుఁడు కావచ్చునుగదా! కావున బ్రహ్మసంస్థపదము యోగికార్థమును చెప్పునదియే; పైన వివరించినవిధముగ పూర్వవాక్య భాగముచేఁ బరామర్శింపఁబడిన నాల్గాశ్రమములతోను సంబంధము కలిగినదియే. కావున వాక్యారంభమునఁ బరామర్శింపఁబడిన యాశ్రమములు మాత్రమే నుతింపఁబడుచున్నవి కాని యెట్లును క్రొత్త సన్యాసాశ్రమము ప్రత్యేకముగ విధింపఁబడుట లేదు. తపశ్శబ్దముచే దానికిఁ గూడ సంగ్రహము కల దని సమ్మతించియే యున్నాము కదా! అనుచున్నారు.

సిద్ధాంతము :— ఇట్లు చెప్పుట యుక్తము కాదు. అప్పుడు ఉపక్రమోపసంహారమునకు వైషమ్యము కలుగును. ఈతపశ్శబ్దము వాన ప్రస్థాశ్రమమును పరామర్శించుచుండ నదియే సన్యాసాశ్రమములుగూడ పరామర్శించు ననుట యుక్తము కానేరదు. గత్యంతరము లేకుండినచో నేదియో యొకవిధముగ సమన్వయింపవలసి వచ్చును. కాని యిచ్చట నట్లు లేదు. ఉపక్రమమునందు బ్రహ్మచారి గృహస్థాశ్రమములు తమ తమ యథాధారణధర్మములతోనే వర్ణింపఁబడి యున్నవి. వానప్రస్థా శ్రమముగూడ తనయథాధారణధర్మమైనతపస్సుతోనే వర్ణింపఁబడెను.

ఇట్లుండ సన్న్యాసాశ్రమ మొక్కటి మాత్ర మట్లు వర్ణింపఁబడలే దనుట యెట్లు సరిపడును ? కృచ్ఛ్రచాంద్రాయణాదిరూప మగుకాయశోషణము నకే తపశ్శబ్దము రూఢనామము; వానప్రస్థునకు నాతపస్సే యసాధారణ ధర్మము. సన్న్యాసికిని యింద్రియనిగ్రహము శౌచసంతోషాదులు అష్టగ్రాస భక్షణము (ఎనిమిదిముద్దలను మాత్రమే భుజించుట) మొదలగు నియ మము లున్నను వానియందు తపశ్శబ్ద మౌపచారికముగఁ బ్రయోగింపఁ బడవలయునేగాని రూఢము మాత్రము కాదు. మహాత్ములగువారు యీ శౌచాదులకంటె భిన్నముగనే తపస్సును పరిగణించుచున్నారు. "శౌచ సంతోషతపఃస్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః" "పరిశుద్ధత్వము సంతోషము కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సు వేదాధ్యయనము ఈశ్వర ధ్యానము అనునవి నియమములు" అని మహాత్ములు చెప్పుచున్నారు. గత్యంతరము లేకుండిన నౌపచారికప్రసిద్ధినిబట్టి యైనను వ్యవహరింప వలసి వచ్చును గాని యిచ్చట నట్లు చేయనేటికి ? అంతమున యత్యా శ్రమమునకు నసాధారణధర్మ మగు బ్రహ్మసంస్థత్వము వర్ణింపఁబడియే యున్నది కదా ? ఇది యంతయు గాక నాశ్రమములు నాలుగని ప్రసిద్ధి యుండ మూఁడుగానే పరామర్శింపఁబడుచున్నవి యనుటయునన్యాయమే. కావున తపశ్శబ్దము సన్న్యాసాశ్రమమును గూర్చి చెప్పెననుట యట్లు యుక్తియుక్తము కానేరదు.

మఱియొకవిశేషము. ఈవాక్యమునకు మూఁడాశ్రమములవారు పుణ్యలోకమును జెందుదు రనియు బ్రహ్మసంస్థుఁ డగునాల్గవవాఁడు ముక్తి నొందుననియు జెప్పఁబడి యున్నది. ఇది పరస్పరభేద ముండిననేగాని సరి పడదు. "త్రయ ఏతే పుణ్యలోకా భవంతి" "వీరు ముప్వురును పుణ్య లోకము నొందుదురు." అని చెప్పఁబడియున్నచోట నీసన్న్యాసికూడ పరా మర్శింపఁబడి యున్నాఁ డనినచో యీసన్న్యాసిని ప్రత్యేకముగ చెప్పలే దని నచో విరోధము వచ్చును. ఈతనికి బ్రహ్మసంస్థత్వ మసాధారణధర్మ మని యిదివఱకే చెప్పియున్నాము. బ్రహ్మసంస్థునికి ముక్తియే ఫలమనియు శ్రుతి యందు నిరూపింపఁబడి యున్నది. ఆశ్రమత్రయముతోకూడ నతఁడును పరామర్శింపఁబడి యుండునేని యీతనికిఁగూడ పుణ్యలోకఫలము కలుగ వలసివచ్చును. అప్పు డొక్కనికే పుణ్యలోకములు ముక్తియు గలుగు ననుట విరుద్ధ మగును. మఱియుఁ దక్కినయాశ్రమములకుఁగూడ బ్రహ్మ

సంస్థత్వము కలుగవచ్చు ననినచో నది దానికి నసాధారణధర్మము కాదు. కావున నొకానొకప్పు డొకానొకనికి మాత్రమే కలుగు నని చెప్పవలయును. సన్న్యాసి కన్ననో యది యసాధారణ మగుటచే సర్వకాలముల యందు నుండు ననవలయును. ఇట్లయిన వాక్యాన్వయము విపరీత మగును. ఒక్కస్థలమునఁ బరామర్శింపఁబడినవి యన్నియు సమానధర్మములు కలవి యయ్యే యుండవలయు ననుట నియమము కదా! కావున సన్న్యాసాశ్రమ మాశ్రమత్వభిన్నముగానే వర్ణింపఁబడి యుండవలయు నని తేలుచున్నది. "దేవదత్తయజ్ఞదత్తులిరువురును మూఢులు వారిలో నొక్కఁడుమాత్రము బుద్ధిమంతుఁడు" అనుట యెట్లు యుక్తియుక్తమగును. బుద్ధిమంతుఁడగు వాఁడు వారికంటె భిన్నుఁడుగనే యుండవలయును కదా! ఇట్లే పుణ్యలోక ప్రాప్తి గలయితరాశ్రమములకంటె మోక్షప్రాప్తి గలసన్న్యాసాశ్రమము భిన్నమే యైయుండవలయును.

"బ్రహ్మసంస్థశబ్దము యౌగిక మగుటచే దనర్థ మన్నియాశ్రమములతోను సంబంధము కలిగియుండవచ్చు ననియు సన్న్యాసాశ్రమమున కొక్కదానికే సంబంధించి యుండవలసినపని లే దనియు నిట్లుగాక రూఢి నాశ్రయించినచో నాశ్రమప్రాప్తిమాత్రముననే మోక్షము కలుగవలసి వచ్చును కావున జ్ఞానము నిరర్థకము కావలసి వచ్చు ననియు చెప్పితిమి కదా!" అనియెదవేమొ వినుము. నీ వన్నట్లు ఆపదము యౌగికమే యగునుగాక; తగిన వీ లున్నప్పుడు అప్రసిద్ధవిషయములయందు ప్రవర్తింపఁజేయకూడదు: వీలు లేనప్పుడు మాత్రము వేదప్రామాణ్యము భగ్నము గాకుండుటకై యట్లు చేయవచ్చును. ప్రకృత వాక్యమున సన్న్యాసాశ్రమమును గూర్చి చెప్పఁబడియుండుట సందిగ్ధ మగుటచే నప్రసిద్ధమే యైనను బ్రహ్మసంస్థపదము నాయర్థమున సమన్వయింపవచ్చును. తక్కినయాశ్రమములకు నాధర్మము సంభవింపదు కావున నిట్లు చేయవచ్చును. బ్రహ్మసంస్థత్వ మనఁగా సర్వభావమును పరబ్రహ్మమునందే నిలిపి యితరవ్యాపారముల మాని యుండుట యిట్టిస్థితి సన్న్యాసికే కాని మఱియొక్కనికి సంభవింపదు. గృహస్థాదులు సకర్మనిష్ఠులై యుండవలయు ననియు అట్లు కాకున్న *ప్రత్యవాయము కలుగు ననియు

* ప్రత్యవాయ మనఁగా విధింపఁబడినదాని నాచరింపకుండుటవలనఁ గలుగు దోషము.

శ్రుతులయందు చెప్పఁబడి యున్నది. జ్ఞానోదయము కలిగినను వారికి బ్రహ్మనిష్ఠ వొరకుటకు వీలు లేదు కదా! సన్న్యాసి యన్ననో సర్వకర్మల విధ్యుక్తప్రకారమున విడిచినవాఁడు కావున వానికి కర్మలఁ జేయకపోవుట వలన ప్రత్యవాయ మేదియు కలుగదు. సర్వకాలములయందును బ్రహ్మనిష్ఠుఁడై యుండుటకును వీలు కలుగును. ఈ కారణమువలన నిది యతులకు నసాధారణధర్మ మగును. వీరికిని యమనియమాదు లున్నను అవియు బ్రహ్మనిష్ఠ నభివృద్ధి చేయునవియే యగుటచే విరుద్ధములు కానేరవు. కర్మలనిననో భేదసాధకములగుటచే జ్ఞానమునకు విరుద్ధములగును. ఈ కారణము వలన యత్యాశ్రమము వర్ణింపఁబడకయేపోయినను బ్రహ్మసంస్థపదముచే నవశ్య మాకర్షింపఁబడవలయును. లేకున్న గృహస్థాద్యాశ్రమముల యందు దీనిని సమన్వయించుట విరుద్ధ మగును కదా! "న్యాస ఇతి బ్రహ్మా బ్రహ్మా హి పరః పరోహి బ్రహ్మా తాని వా ఏతాన్యవరాణి తపాంసి న్యాస ఏవాత్యరేచయత్. వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాః సన్న్యాసయోగాద్యతయః శుద్ధసత్త్వాః" "న్యాసమనునదియే బ్రహ్మము. ఆ బ్రహ్మమే సర్వోత్తమము. ఆ బ్రహ్మమే సర్వాధికము. యజ్ఞాధ్యయనాదిరూపము లగుకర్మలన్నియు హీనములు. వానినన్నిటి నీన్యాసము తుడిచివేయును. వేదాంతార్థజ్ఞానముచే తత్త్వనిర్ణయమును గావించి సన్న్యాసయోగమువలన పరిశుద్ధమనస్కులై యున్నయతులు" అను మొదలగుశ్రుతులచే "యతులకు బ్రహ్మనిష్ఠయే యసాధారణధర్మము" అని చెప్పఁబడెను. "త ద్బుద్ధయ స్తదా త్మాన స్త న్నిష్ఠా స్తత్పరాయణాః" "పరమేశ్వరుని తెలిసికొనుచు ఆయనయందే మనస్సు నిలిపి ఆయనయందే స్థిరులై ఆయనయే ముఖ్యాశ్రయముగఁ గలిగి" అను మొదలగువాక్యములచే స్మృతులును ఈవిషయమునే బోధించుచున్నవి. యతికి బ్రహ్మధ్యానముతప్ప మఱియొకకర్మ లేదని చెప్పుచున్నవి. ఈ కారణమువలన పైనఁజూపిన దోషములు రావు. ఈసన్న్యాసాశ్రమము జ్ఞానాంగముగ విధింపఁబడిననేకాని దీనివలన జ్ఞానము కలుగు ననుట లేదు. ఏయాశ్రమమునందైనను వేదాంతశాస్త్రాద్యభ్యాసముచే గురుకరుణచే జ్ఞాన ముదయించెనేని యప్పుడు దానికి విరుద్ధము లగుటచే కర్మలను పరిత్యజింపవలసిరాగా ఆకర్మలయం దశ్రద్ధ జనింపఁగా వానిని స్వతంత్రముగఁ బరిత్యజించుట లోకులకు నజ్ఞానులకు ననర్థమును కల్పించును గావున

విధ్యుక్త మగురీతి సన్యాసాశ్రమమును పరిగ్రహింపవలయు ననుట మాత్రమే యిచ్చట విధింపఁబడెను. మహాత్ము లాచరించినయాచారములే మార్గదర్శకము లగును. కావున నొక బ్రహ్మవేత్త తగినయధికారముతో స్వతంత్రత్యాగము నాచరించినఁ దక్కినవారును అజ్ఞాను లయ్యు ననధి కారు లయ్యు తన్నిదర్శనమున బ్రమాదముతోఁ ద్యాగము నాచరింతురు. ఇది యనర్థహేతువు కదా! దీనిని పరిహరించుట శ్రుతికి నవశ్యకర్తవ్య మగుటచేఁ గర్మత్యాగానుకూల మగు నాశ్రమము కల్పింపఁబడెను. ఇట్లగుటచే "జ్ఞానమువలనఁ బ్రయోజనము లేకపోవలసి వచ్చును" అనుదోషము కలుగదు. వివాహయోగ్యులు కానివారలకే యీయాశ్రమము విధింపఁబడి యుండవచ్చు ననుటయు సంభవింపదు. కావున పై వాక్యమును విధివాక్య మని యంగీకరింపకున్నను సన్యాసాశ్రమము వర్ణించినవిధముగా విధింపఁబడినదియే యగును.

విశేషాంశము:—వాస్తవస్థితిలో నింతవిచారము పనియే లేదు. జాబాలశ్రుతియందు "బ్రహ్మచర్యం పరిసమాప్య గృహీ భవే ద్గృహీ భూత్వా వనీ భవే ద్వనీ భూత్వా ప్రవ్రజేత్ యది వేతరథా బ్రహ్మచర్యా దేవ ప్రవ్రజే ద్గృహా ద్వా వనా ద్వా" "బ్రహ్మచర్యమును ముగించి గృహస్థాశ్రమమును గైకొనవలయును. గృహస్థుఁడై వానప్రస్థుఁడు కావలయును. పిదప సన్యాసాశ్రమమును గైకొనవలయును. ఇట్లు కాకున్నను జ్ఞానము కలిగెనేని వైరాగ్యముఁ జనించెనేని యేయాశ్రమము నుండియైనను సన్యసింపవచ్చును" అని సన్యాసవిధి ప్రత్యక్షముగనే యున్నది. "ఈవిధి లేకున్నను సన్యాసాశ్రమసద్భావమును దృఢపఱుపవచ్చును" అను నుద్దేశముతో సూత్రకారుఁ డీవిచారము నారంభించెను. ఈశ్రుతివలన సన్యాసము రెండువిధము లనియు ఒకటి యాశ్రమమాత్రమే యనియు మఱియొక్కటి జ్ఞానాంగ మనియు నేర్పడుచున్నది. జ్ఞానశూన్యుఁడగు కేవలాశ్రమి ముక్తిని జెందు ననుటకు వీలు లేకపోవుటచేఁ బుణ్యలోకప్రాప్తియే కల్పింపఁబడవలసియున్నది. జ్ఞానాంగసన్యాసంబును వివిదిషాసన్యాసమనియు విద్వత్సన్యాసమనియు రెండువిధములు. వైరాగ్యము మాత్రము కలిగి జ్ఞానాభ్యాసమునకై చేయఁబడుసన్యాసము వివిదిషాసన్యాసము; జ్ఞానము కలిగినపిదప ననుభవమునకై చేయఁబడుసన్యాసము

విద్యత్సన్న్యాసము. వీరిరువురును జ్ఞానవంతులే యగుటచేఁ గ్రమముగాఁగాని తత్క్షణమేగాని ముక్తి నొందుదురు. ఇట్లగుటచే విద్యాస్వాతంత్ర్యమునకు హాని లేదని తెలిసికొనవలయును.

---

## ౩. స్తుతిమాత్రాధికరణము.

విషయ సంశయ సంగతులు:—"స ఏష రసానాం రసతమః పరమః పరార్ధ్యో ఒష్టమో య దుద్గీథః అగ్నిః సామ" "ఈయెనిమిదవది యగునుద్గీథము సర్వభూతములకంటె రసతమము (శ్రేష్ఠము) పరమాత్మరూప మగుటచే సర్వోత్తమము ఉత్తమస్థానమునకు నర్హము. సామవేదమే అగ్ని" అను మొదలగు వాక్యములు శ్రుతియందు కొన్ని కలవు. ఇవియన్నియు కర్మాంగముల నాశ్రయించినయుపాసనలయందు గుణముల విధించువాక్యములుగ నున్నవి. ఏవియో కొన్ని గుణముల నాశ్రయించియే కదా యేయుపాస్యదేవత నైన నుపాసింపఁగలుగుట! కావున నట్టివాక్యములనుగూర్చి యీయధికరణమున విచారింపఁబడును. ఇవి కర్మాంగముల నాశ్రయించినయుపాసనలకు సంబంధించినవి యగుటచే తదంగసహితము లగుకర్మలయొక్క విధులనే నుతించునవి యగునేమో యని సంశయము జనించుటకు వీలు కలదు. పూర్వాధికరణమున సామాన్యశ్రుతి నాశ్రయించి సన్న్యాసాశ్రమవిధి యెట్లు నిర్ణయింపఁబడెనో అట్లే యిచ్చటగూడ "ఇయ మేవ జుహూ రాదిత్యః" "ఈజుహువే సూర్యుఁడు" అను మొదలగునర్థవాదములతో సమానములుగ నుండుటచే ప్రస్తుత విషయవాక్యములుకూడ నర్థవాదములే కావచ్చునని తోఁచును. ఆ జుహువువలెనే యీయుద్గీథము గూడ గర్మాంగమే కావున నచ్చటి యాదిత్యపదమువలెనే యిచ్చటిరసతమాదిపదములును స్తుత్యర్థములే కావచ్చునని తోఁచును. ఇట్లు దృష్టాంతసంగతితో కలుగు నీసంశయ మిందు సవిమర్శముగా నివారింపఁబడును. ఈవాక్యములు స్తుత్యర్థములు కావని నిర్ణయింపఁబడును. కర్మాంగోపాసనలుగూడ నాచరణీయములే యనువిషయము ప్రతిపాదింపఁబడును. దీనివలన నుపాసనలవశ్యకర్తవ్యములనియు వానిఫలము నిర్వివాదముగ స్వతంత్రమే యనియు సిద్ధాంత

మగును. కర్మాంగముల నాశ్రయించియున్నయుపాసనలే ముముక్షుజన కర్తవ్యములై ముక్తిఫలదాయకములై యుండ నిఁక స్వతంత్రోపాసనలఁ గూర్చి చెప్పనేల ? ఈకారణమువలననే యీయధికరణ మీపాదము నందుఁ జేర్పఁబడెను.

## అ-3. పా-౪. సూ-౨౧.

అవతారిక:—సిద్ధాంతమును దృఢపఱుచుటకై సూత్రకారుఁడు పూర్వపక్షానువాదపూర్వకముగ సిద్ధాంతము నుపక్రమించుచున్నాఁడు.

# ౪౪౭. స్తుతిమాత్రముపాదానా దితి చే న్నాపూ ర్వత్వాత్. 3. ౪. ౨౧.

తాత్పర్యము, పూర్వపక్షము:—ఈవిషయవాక్యములు కర్మల స్తుతించునవియే కాని ఉపాసనల విధించునవి కావు. ఇవి కర్మాంగముల నాశ్రయించి ప్రవర్తించినవి. "ఇయ మేవ జుహూః" అనుమొదలగువాక్యములు ఎట్లు జుహువు మొదలగుకర్మాంగముల నాశ్రయించి యున్నవో అట్లే ఇవియు నుద్గీథాదికర్మాంగముల నాశ్రయించి యున్నవికదా! "ఇట్లు కాదు. ఆకర్మవిధులు సమీపమున లేకపోవుటచే నివి వానితో నేకవాక్యములు కానేరవు. ఉద్గీథ ముపాసీత' అనుమొదలగునుపాసనావిధివాక్యములు మాత్రమే సమీపమున నున్నవి కావున (నీవాక్యములు) వానిని గూర్చియే యేదియో యొకవృత్తాంతమును చెప్పును" అనియెదవేమొ యట్లు కాదు. ఈరెండుసిద్ధాంతములును నిలువనేరవు. కర్మవిధి సమీపమున లేకున్నను ఉద్గీథమునకు దానితో నిత్యసంబంధము కలదు. కావున నది (ఉద్గీథము) దాని (కర్మవిధిని) నాకర్షించును; అప్పు డీవాక్యములును దానితో నేకవాక్యము లగును. దూరముగా నున్నవాక్యములతో నేకవాక్యత్వము నొందఁగూడ దని నియమ మేమియు లేదు. కర్మకాండమును విమర్శించి చూచిన ననేకస్థలములయందు ఇట్టి యేకవాక్యత గానవచ్చుచున్నది. కొన్నిస్థలములయందు బహువాక్యాంతమున నొక్కచోఁ జెప్పఁబడియున్నవిశేషము ప్రతివాక్యముతోను సంబంధ పడుచున్నది. మఱియొకస్థలమున నొకకర్మయందు గలస్థితి మఱియొకకర్మయొక్క

సమీపమునకు *నతిదేశముచే నుపసంహరించుకోనబడి యున్నది కావున నిట్లే ప్రకృతమునందును ఈవిషయవాక్యములు కర్మవిధితో నేకవాక్యములు కావచ్చును. మఱియు "ఉద్గీథ ముపాసీత" అను నుపాసనావిధి సమీపమున నున్నను ఈవిషయవాక్యములు ఉపాస్యదేవత నెట్లును సమర్పింపనేరవు. "ఓ మి త్యేత దక్షర ముద్గీథం" అనుభాగమే కదా యుపాస్యదేవతను చెప్పుచున్నది. ఆదేవతను వర్ణింపలేకపోయిన నీవిషయవాక్యములు ఉపాసనాగుణవిధాయకము లగుట యెట్లు? ఇట్లగుటచే నివి స్తోత్రపరములు మాత్రము కావలయును.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఈవిషయవాక్యములు అపూర్వవిషయమును చెప్పుచున్నవి. ఇవి విధివాక్యము లైననే యధికప్రయోజనము కలుగును కాని స్తుతిపరములైనప్పుడు కాదు. ఈవిషయము సర్వసాధారణము. ఏవాక్యమున కైనను విధివాక్యమైనప్పుడు కలుగునంత ప్రయోజనత్వ మర్థవాద మైనప్పుడు కలుగదు కదా! కావున వీనిని విధిపరములుగాని నిర్ణయించుట ప్రయోజనకారి; ఉపాస్యదేవతకు గుణమును చెప్పునదిగా వర్ణించుట లాభకారి. సమీపమునందును "ఉపాసీత" అను నుపాసనావిధివాక్యము కలదు కదా! "ఇట్లున్నను ఇవి యుపాసనను కూడ స్తుతించునా? లేక నుపాస్యదేవతను సమర్పించునా?" యని విచారింపవలసిన నప్పుడును పై యుక్తియే కార్యసాధన మగును. స్తుతిపర మనుటకంటె విధిపర మనుట మిగులఁ బ్రయోజనకారి కదా! గతి లేకున్నఁ దాత్పర్య మెట్లును కుదురకున్న నప్పుడు కదా వాక్యముల స్తుతిపరములఁ గావింపవలయుట! ఇచ్చట నట్లు లేదు. ఉపాసనార్థమై యోంకారము విధింపఁబడియుండుటచేతను ధ్యానార్థమై యన్నియు కల్పితధర్మములే చెప్పఁబడుచుండుటచేతను ఈరసతమాదివాక్యములు కూడ నిస్సంశయముగ విధులు కావచ్చును. "ఇయ మేవ జుహూః" అను మొదలగు వాక్యము లన్ననో జుహూవు పాత్ర కావునను సూర్యుఁడు దేవత కావునను అచ్చట నుపాసన చెప్పఁబడలేదు కావునను స్తుతిపరములు కావచ్చును. మఱియొకవిధముగ పాత్రకును దేవతకును సంబంధము కలుగదు కదా! కావున నెట్లును ఈవాక్యములు ఉపాసనావిధివాక్యములే యగు నని యంగీకరించి తీరవలయును.

---

* అతిదేశము. (అ-ం. పా-3. సూ-ం. పేజీ-326 చూ.)

"ఇవి (విషయవాక్యములు) కర్మాంగమగు నుద్గీథము నాశ్రయించి యుండుటచే దానిమూలమున గర్మలతో సంబంధించును" అనుట యెట్లును యుక్తము కాదు. కర్మవిధియు నీవాక్యములును పరస్పరము మిగుల దూరమున నున్నవి. ఏవాక్యములు విధివాక్యములకు సమీపముననుండి వానితో నేకవాక్యములగునో అవియే స్తుతిపరములుగ పరిగణింపఁబడును కాని తక్కినవి కావు. "ఇయ మేవ జుహూః" అను మొదలగు వాక్యము లిట్టివే. ప్రస్తుతవాక్యములు మాత్ర మట్టివి కావనుట యతివిశదము. "అయినను ఉద్గీథము కర్మాంగమగుటచే నది కర్మవిధి నాకర్షింపవచ్చును కదా" యనియెదవేమొ యంత యావశ్యకత యేమియు లేదు. స్తుతివాక్యములు లేకున్న విధికి నేదైన లోపము కలుగునేని యప్పు డెట్లయినను దాని నాకర్షించుకొనవలసి వచ్చునుగాని యట్టినిర్బంధ మేమియు లేదు. "ఈకర్మ ఈఫలము నొసంగునది యగుటచే నవశ్య మాచరింపఁబడవలయును" అని తెలిసినపిదప నిరాటంకముగా పురుషుఁడు దానియందు ప్రవర్తింపనచ్చును కదా! ఇక కేవల స్తుతితో కావలసినపని యేమి? ఇట్లు వాస్తవస్థితిలో స్తుతి లేకున్న విధివాక్యముయొక్క ప్రామాణ్యమునకు హాని యేమియు లేకున్నను వేదము కారణాంతరమున విధులను స్తుతించుచున్నది. ఫలజ్ఞానము కలిగినను మందబుద్ధులగువారు అశ్రద్ధ చేయుదురేమో యని యట్లు స్తుతించెను. "వస్త్రము నిర్మింపఁబడినది" అను నింతమాత్రముననే ప్రతిపాద్యాంశము ముగిసినను ఆవాక్యమునందు "ఎట్టిని" అనుపద మున్నప్పుడు మాత్ర మే క్రొత్తగా "ఎట్టివస్త్రము నిర్మింపఁబడుచున్నది" యనునాకాంక్ష నుత్పత్తి చేయునట్లు విధివాక్యముతోనే ప్రతిపాద్యాంశము పూర్ణమైనను దాని ప్రక్కన స్తుతివాక్యమున్నప్పుడుమాత్ర మే యాకాంక్ష యుత్పత్తి చేయఁబడును. ఇంతియే కాని సమీపమున స్తుతిలేనప్పుడు దూరమునుండి యాకర్షింపఁబడదు. విధికిఁ దదపేక్షయే లేదు కదా! "అతిదేశాదుల విషయ మెట్లు?" అనియెదవేమొ వినుము. అతిదేశస్థలమున "ప్రస్తుత కర్మయు పూర్వకర్మవంటిదే" యనువచన ముండును. ఆవచనము ననుసరించి దూరమున నున్న వాక్యమైన నిర్వివాదముఁగ నాకర్షింపఁబడవచ్చును. వచనములేక నతిదేశము సంభవింపదు. "ఇదియే ఇది" అని రెండు పదార్థములయొక్క ధర్మముల నైక్యము సంపాదించుటయే కదా యతి

దేశము. ఇట్లగుటచే నాదృష్టాంతము దీనికి తగదు. ఇచ్చట నంగోపాసనయు ముఖ్యకర్మవిధియు నొక్కటి యని చెప్పఁబడలేదు కదా! "మఱియొకదృష్టాంతము కలదు. 'వాక్పతి స్త్వా పునాతు దేవ స్త్వా సవితా పునాతు అచ్ఛిద్రేణ పవిత్రేణ' 'ఛిద్రరహిత మగుపవిత్రముతో (సంపూర్ణ పారిశుధ్యముతో) బృహస్పతి నిన్ను రక్షించును గాక ప్రకాశమానుఁడగుసూర్యుఁడు నిన్ను రక్షించును గాక' అనుస్థలమున 'అచ్ఛిద్రేణ' అనునది దూరమున నున్నను ప్రతివాక్యముతోను సంబంధపడియున్నది. కదా!" అనియెదవేమొ. అచ్చట నాపదమునకు: బూర్వవాక్యాకాంక్ష కలదు. "అచ్ఛిద్ర మగుపవిత్రముతో నెవ్వఁ డేమిచేయును?" అనునాకాంక్ష దాని కావశ్యకముగాఁ గలదు. ఆయాకాంక్షకు సమాధానముగ పైవాక్యములు దానితో సంబంధపడును. ఇచ్చట నట్లు కూడ లేదు కదా! కావున నెట్లును వీనికి గర్మవిధితో సంబంధము లేదు. కర్మవిధి స్తుతిపరములే యనినచో నప్రమాణములు కావలసి వచ్చును. అది విరుద్ధము కదా! కావున నీవిషయవాక్యములు పైనవర్ణించినరీతిగా నుపాసనావిధి పరములే.

## అ_3. పా_4. సూ_21.

అవతారిక:—ఈవిషయమును నిరూపించుటకై మఱియొకహేతువును జెప్పుచున్నాఁడు.

## 443. భావశబ్దాచ్చ. 3. 4. 21.

తాత్పర్యము:—ఇదియును గాక నిచ్చట "ఉద్గీథ ముపాసీత. సామోపాసీత" అను మొదలగువిధులు ప్రత్యక్షములుగ నున్నవి. విషయవాక్యములును వీనినిగూర్చియే చెప్పుచున్న వనుట నిర్వివాదము. ఇట్లుండ నావాక్యములు స్తుతిపరము లయ్యెనేని యుపాసనావిధులకు నిరర్థకత్వము వచ్చును. "కుర్యాత్క్రియేత కర్తవ్యం భవే త్స్యా దితి పంచమం, ఏత త్స్యా త్సర్వవేదేషు నియతం విధిలక్షణం" "చేయవలయును చేయఁబడవలయును చేయఁదగినది జనించును ఉండును అనునివి యైదును సర్వవేదములయందు సుప్రసిద్ధము లగువిధులు" అను న్యాయవేత్తల వాక్యముల ననుసరించి చూచిన "ఉపాసీత", అను మొదలగుపదములకుఁ

గలవిధినిరూపణత్వము స్పష్ట మగుచున్నది. లోకమున సామాన్యముగ చేయుట జన్మించుట ఉండుట" అను నీయర్థములయందే సర్వధాతువులు నేకీభవించును. కావున నీమూఁడును విధినిరూపకములుగ గ్రహింపఁబడుటచే సర్వధాతువులును విధినిరూపకములే యైనవి. కావున విధివాక్యములు నిరర్థకములు కావలసి వచ్చుటచే పూర్వపక్షవాదము చెల్లదు.

ఇదియునుఁగాక ప్రతిప్రకరణమునందును "ఆపయిత హా వై కామానాం భవతి" అను మొదలగువాక్యములచే ఫలశ్రుతి కలదు. విధి లేక కేవలఫలశ్రుతి యుండదు కదా! ఈకారణమువలనఁగూడ నిచ్చట విధివాక్యము లవశ్యముగా నున్నవి యని గ్రహింపవలయును. మఱియు ఫలభేదమువలన విధిభేదములు విధిభేదమువలన గుణభేదంబును గ్రహింపవలయును. గుణభేదమువలన దద్విధాయకము లగువాక్యములు కూడఁ గొన్ని యుండవలయు నని యూహింపవలయును కదా! ఆవాక్యములే ప్రస్తుతవిషయవాక్యములు. ఇట్లు తగినగతి యున్నప్పుడు వానిని స్తుతిమాత్రములనుగా భావించి వేదభాగమునకు నానర్థక్యమును కల్పించుట యుక్తము కాదు. ఈవాక్యములయందు వర్ణింపఁబడినగుణములతో కర్మాంగము లగునుద్గీథాది దేవతలను భావించి ధ్యానింపవలయు ననుట సిద్ధాంతమైనది. ఇట్లు కర్మాంగముల నాశ్రయించినయుపాసనలే ముముక్షువులకుఁ గర్తవ్యము లని యేర్పడిన నిఁక బరమేశ్వరు నాశ్రయించినస్వతంత్రోపాసనలనుగూర్చి వేఱుగా చెప్పనేటికి? మోక్షేచ్ఛగలవాఁడు సర్వోపాసనల నాచరింపవచ్చును. చిత్తశుద్ధికై యవ్లే యాచరింపవలయును; మోక్షఫలము నొందవలయును.

---

## ౪. పారిప్లవాధికరణము.

సంగతి విషయ సంశయములు:—"అథ హ యాజ్ఞవల్క్యస్య ద్వే భార్యే బభూవతు ర్మైత్రేయీ చ కాత్యాయనీ చ(బృ.౧-౪-౧౯.) ప్రతర్దనో హ వై దైవోదాసి రింద్రస్య ప్రియం ధా మోపజగామ (కౌ. ౧-౧-౨౮). జానశ్రుతి ర్హ పౌత్రాయణః శ్రద్ధాదేయో బహుదాయి బహుపాక్య ఆస (ఛా.౧-౩-౩౪)." అను మొదలగువాక్యములచే

నుపనిషత్తులయందు కొన్నికథలు వర్ణింపఁబడి యున్నవి. ఈకథలు పారి ప్లవముకొఱకై వర్ణింపఁబడెనా? లేక విద్యాప్రసిద్ధికై వర్ణింపఁబడెనా? యని సంశయము జనించుచున్నది. పారిప్లవ మనఁగా నశ్వమేధయాగము నందు భార్యాపుత్రాదిసమన్వితుఁడై కూర్చుండియున్న ప్రభువునకు వినో దార్థమై చెప్పఁబడవలయు నని వేదమునఁ జేయఁబడినవిధి యని తెలిసికొన వలయును. "పూర్వాధికరణమున రసతమత్వాదివాక్యములు విద్యాస్తుతి పరము లగుటకంటె విధిపరము లగుట శ్రేష్ఠతరముగా నుండు నని యట్లు సిద్ధాంతము చేయఁబడి యున్నది కావున నిచ్చటఁగూడ నీకథలు కేవల విద్యాస్తుతిపరము లగుటకంటె పారిప్లవవిధిశేషము లగుట యుక్తముగ నుండును కావున నట్లే సిద్ధాంతము చేయవలయును" అని దృష్టాంతసంగ తితో నాక్షేపము రాగా నది సవిమర్శముగ నిందు నిరాకరింపఁబడును. ఈకథలు పారిప్లవవిధిశేషము లయ్యెనేని వీనితో నేకవాక్యముగ నున్న విద్యలును కర్మశేషములు కావలసి వచ్చుటచే వానికి (ఆవిద్యలకు) ఫలము లొసంగుటయందు గలస్వాతంత్ర్యము పోవును. కావున నీపక్షమును నిరాకరించి "కథలు విద్యాస్తుత్యర్థములు" అని నిరూపింపఁబడును; విద్య లును స్వతంత్రములే యని నిర్ణయింపఁబడును.

## అ-౩. పా-౪. సూ-౨౩.

అవతారిక:—ఈనిర్ణయమునకై పూర్వపక్షానువాదపూర్వకముగ సిద్ధాంతము నొనర్చుచున్నాఁడు.

---

# ౪౪౬. పారిప్లవార్థా ఇతి చేన్న విశేషితత్వాత్.

## ౩. ౪. ౨౩.

తాత్పర్యము, పూర్వపక్షము:—విచారించిన నీయుపనిషత్తుల యందలికథలును పారిప్లవశేషములే యని చెప్పితీరవలయును ననుట స్పష్ట మగుచున్నది. "సర్వాణ్యాఖ్యానాని పారిప్లవే" "పారిప్లవమునం దన్నికథ లను చెప్పవలయును" అని శ్రుతి విధించుచున్నది కదా! " 'సర్వా దాశ తయానసుబ్రూయాత్' 'ఈపదింటిని యిచ్చట చెప్పవలయును.' అని శ్రుతి యందు సర్వశబ్ద మున్నను పదియు నాయాకర్మలయందుఁ బ్రత్యేకముగఁ

గూడ నుపయోగింపఁబడుచున్న ట్లోకస్థలమున గానవచ్చుచున్నది. ఇట్లే ప్రస్తుత కథలును పారిప్లవార్థములే యైనను విద్యాప్రసిద్ధ్యర్థములు కూడఁ గావచ్చును" అనియెదవేమొ యదిసరిపడదు. అచ్చట ప్రత్యేకోపయోగం బును సముదాయోపయోగంబును గూడ శ్రుతియందే విధింపఁబడి యున్నది కాని యిచ్చట నట్లు లేదుకదా! ఇచ్చట విద్యాసన్నిధానమొక్కటి మాత్రము కాదు. ఇంతమాత్రముచేఁ బైవిషయమును నిర్ణయింప నెట్లు వీలగును? పారిప్లవశేషత్వము శ్రుతిచే విధింపఁబడెను; విద్యాశేషత్వము సాన్నిధ్యమాత్రముచే నిరూపింపఁబడెను. సన్నిధికంటె శ్రుతి బలవత్తర మైనది కాదు కదా! కావున నెట్లు చూచినను ఉపనిషత్తులయందలికథలు పారిప్లవశేషములే యగును. మఱియు కేవలస్తుతిపరము లగుటకంటె కర్మశేషములే యగును. మఱియు కేవలస్తుతిపరము లగుటకంటె కర్మశేషము లగుట శ్రేష్ఠతరము కదా! అప్పుడు కదా (కర్మకు సంబం ధించినది యైనప్పుడు కదా!) ప్రతివాక్యమునకును సార్థక్యము కలుగుట.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట యుక్తముకాదు. పారిప్లవమునుగూర్చి శ్రుతి చెప్పునప్పుడు కొన్నికథలనుమాత్రమే తచ్ఛేషములుగా విధించి యున్నది; కాని యన్నిటిని గాదు. గాదు. "సర్వాణ్యాఖ్యానాని" అని యున్నను ఆసర్వశబ్ద మీకథలనుఁ గూర్చి (పారిప్లవమున విధింపఁబడిన కథలనుగూర్చి) మాత్రమే ప్రవర్తించును గాని సర్వవిషయముగాఁ బ్రవ ర్తింపనేరదు. అట్లు ప్రవర్తించునేని "పారిప్లవ మాచక్షీత" "పారిప్లవ మును చెప్పవలయును" అనుశ్రుతి నిరర్థకము కావలసివచ్చును. ఏల యనిన "పారిప్లవమున నేచరితములైనఁ జెప్పవచ్చును" అని సామాన్యముగ నీని యతముగ విధింపఁబడియుండఁగా మఱలఁ దద్విషయ మేల ప్రస్తావింపఁబడ వలయును ? ఈ కారణముచేఁ బారిప్లవశబ్దమునకు దచ్ఛేషము లగుకథలే యర్థమనియు నాకథలను మాత్రమే చెప్పవలయు ననుట శ్రుతికి నుద్దేశ మనియుఁ జెప్పవలసి యున్నది. ఇట్లు చెప్పకున్న సామాన్యశ్రుతికిఁ బ్రయో జనమే లేదని యిదివఱకే చెప్పియున్నాము. ఈకారణమువలన "బ్రాహ్మ ణుల కందఱకును భోజన మిడవలయును" అనిన నప్పుడు అందలి సర్వ శబ్దము భోజనమునకుఁ బిలువఁబడిన బ్రాహ్మణులను మాత్రమే యెట్లు చెప్పునో అట్లే సామాన్యశ్రుతియందలి సర్వశబ్దముకూడ పారిప్లవశేషము లగుకథలను మాత్రమే చెప్పు నని తేలుచున్నది. ఈకారణమువలన

(విద్యా) సాన్నిధ్యమును బాధించునది యేదియు లేదు; ఈకథలు విద్యా శేషము లగు ననుటకును ప్రతిబంధము లేదు.

## అ_౩. పా_౪. సూ_౨౪.

అవతారిక:—ఈసిద్ధాంతమును దృఢపఱచుటకై మఱియొక హేతువును సదృష్టాంతముగ జూపుచున్నాఁడు.

## ౪౫౦. తథా చైకవాక్యతోపబంధాత్.

## ౩. ౪. ౨౪.

తాత్పర్యము:—మఱియు నీకథలు అచ్చటచ్చట నున్న విద్యలతో నేకవాక్యముగ నున్నవి యనుట నిస్సంశయము. పారిప్లవవిధికిని వీనికిని సంబంధము లేదనుట యిదివఱకే వివరింపఁబడెను. ఇట్లగుటచే వీనికి (యీకథలకు) ఉపాసనాశేషత్వమే సిద్ధమగును. కర్మకాండమునందును దేనిసమీపమున నేకథ చెప్పఁబడి యుండునో అది (ఆకథ) దానితో (ఆకర్మతో) నేకవాక్య మగుననియు నేదియో యొకవిధముగా దానిని గూర్చియే చెప్పునదియే యగుననియు సిద్ధాంతము చేయఁబడి యున్నది కదా! అట్లే యిచ్చటను సిద్ధాంతము చేయఁబడవచ్చును. "కథలవలన నుపాసనలకుఁ బ్రయోజన మేమి? యనియెదవేమొ దానినిగూర్చి యంతగా విచారింప నక్కఱ లేదు. శిష్యులకు విద్యయం దభిలాష జనించుటకును సుఖముగా నావిద్య బోధపడుటకును ఈకథ లుపయోగించును. దేనినైనను ఇతిహాసపూర్వకముగ చెప్పిన బాలురుకూడ గ్రహింతురు కదా! కావున కథ లుపాసనార్థము లగుటచే మాసిద్ధాంతమునకు నెట్టిహానియు రాదు.

---

## ౫. అగ్నీంధనాద్యధికరణము

విషయసంశయములు:— ఈపాదమునఁ బ్రథమాధికరణమునందు "విద్య స్వతంత్రముగనే ఫలము నొసంగును. అది కర్మ శేషము కాదు" అను

విషయము నిరూపింపఁబడెను. తరువాత మూఁడధికరణములయందును పై సిద్ధాంతమును పరంపరగా ఖండింపఁజూచుపూర్వపక్షము లనువాదపూర్వకముగ నిరాకరింపఁబడెను. ఇందు ఆసిద్ధాంతమునుగూర్చియే మఱియొక విషయము ఉత్తరపాదారంభబీజముగా నుపన్యసింపఁబడును. "ఈవిద్యలు కర్మలకు శేషములు కాకున్నను కర్మలైన నీవిద్యలకు శేషము లగునా? కావా? ఈవిద్యలు కలిగించుమోక్షముతోఁ గర్మల కేదైన సంబంధము కలదా? లేదా?" యనుసంశయము నిరాకరింపఁబడును.

సంగతి పూర్వపక్షము:—"త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన" "బ్రాహ్మణులగువారు వేదాధ్యయనముచేతను యజ్ఞముచేతను దానముచేతను ఆపరమేశ్వరునిఁ దెలిసికొనఁ దలంతురు" అనుశ్రుతియందు కర్మయు జ్ఞానేచ్ఛకు సాధనముగఁ జెప్పఁబడియున్నది. దీనిని బాగుగ విమర్శించిన "మోక్షము కలుగుటకుఁ గర్మసహాయముకూడ కావలయును" అని తేలును. ఎట్లనిన:—జ్ఞానేచ్ఛ యనునది స్వతంత్రముగ విషయసౌందర్యమునుబట్టి (తెలిసికొనఁబడవలయునని విధింపఁబడి యున్న పదార్థముయొక్క గుణాదులను బట్టి) జనింపవలసినదియే కాని కర్మలవలన జనించునది కాదు. "నీవు నేటినుండియు నరటిపండ్లను కోరుచుండవలయును" అని యుపదేశించినను అట్టికోరిక కలిగించుటకై దండించినను బెదరించినను పురుషుఁడు వానిని కోరునా? ఎవ్వనికి నాయరటిపండ్లయొక్క రుచి తెలియునో వాఁడు మాత్రము పరప్రయత్నముతోఁ బని లేకయే వానిని కోరుచుండును. ఇట్టగుటచేఁ గర్మకును జ్ఞానేచ్ఛకును సంబంధము (కార్యకారణభావమును) చెప్పుటకు వీలు లేదు. ఇట్లే వానికి విద్యతో సంబంధము కలుగు ననుటకును వీలు లేదు. విద్య యనఁగా జ్ఞానము. అది ప్రత్యక్షాదులవలనఁ గలుగును కాని కేవలకర్మలవలన జనింపదు. కర్మలు ఎప్పటికిని పదార్థములను స్వరూపముతోఁ (పుట్టుక మొదలగువానితోఁ) గల్పించును; ఉత్పత్త్యాదులు గలవానిని మాత్రమే జనింపఁజేయును. జ్ఞాన మన్ననో యట్టిది కాదు. అది నిత్యసిద్ధము కదా కావున పైశ్రుతికి నెట్లును అన్వయము కుదురదు; కుదురకున్నఁ బ్రామాణ్యము నిలువదు. కావున "కర్మలు విద్యలతో ఫలజననకార్యమున సంబంధపడును. (అనఁగా మోక్షఫలము నొసంగుటకు కర్మలు విద్యలకు సహాయము చేయును.") అనియే

యాశ్రుతికి నర్థముచెప్పి తీరవలయును. ఇట్లు చెప్పిన నార్థికముగ ఫలకర్మ సంబంధమే సిద్ధించును. పూర్వాధికరణమునందును "శిష్యులకు నాశ కలిగించుటకును సుఖముగ బోధ కలుగుటకును విద్యలచే కథ లపేక్షింపఁ బడుచున్నవి" యని సిద్ధాంతము చేసి యున్నారు కదా ? ఇట్లే యిచ్చటఁ గూడ "విద్యలు మోక్షము నొసంగుటకై కర్మల నపేక్షించును" అని సిద్ధాంతము చేయవలయును.

## అ-౩. పా-౪. సూ-౨౫.

అవతారిక:—ఇట్లు దృష్టాంతసంగతితో వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

# ౪౫౧. అత ఏవ చాగ్నీంధనాద్యనపేక్షా.

## ౩. ౪. ౨౫.

తాత్పర్యము:—ఈపూర్వపక్షము యుక్తియుక్తమైనది కాదు. విద్యలు స్వతంత్రముగనే పురుషార్థమును సాధింపఁగలవని మున్నే వివరించి యున్నాము. ఈకారణమువలన మోక్షఫలము కలిగించువిషయములో విద్యకు కర్మసహాయ మక్కఱలేదు. మోక్ష మనునది యవిద్యానాశ రూపము. అవిద్యానాశమునకు విద్యకంటె నితర మగుసాధన ముండుటకు వీలులేదు. త్రాటియందు సర్పభ్రాంతి కలిగిన నది రజ్జుజ్ఞానముచే దొలఁగును గాని మఱి యెన్నికర్మలచేతనైనఁ దొలంగునా? ఈకారణమువలన ఫలము లొసంగువిషయమున విద్యలకు నన్నిసహాయ మక్కఱలేదు.

"యజ్ఞేన దానేన" అనుశ్రుతికిని మీరు చెప్పిన ట్లర్థము చెప్పవలసిన పని లేదు. ఆయజ్ఞాదులు జ్ఞానేచ్ఛకే సాధనములు కావచ్చును. ఇచ్ఛ యనునది విషయసౌందర్యమువలననే జనించునది యైనను ఆవిషయ సౌందర్యము మొట్టమొదట మనస్సునకు గోచరము కావలయును కదా! మనస్సు బహువిధములుగా నుండుటయుఁ గొందఱకు నీచవిషయములు గూడ సుందరములుగాఁ దోఁచుటయు లోకమునఁ బ్రత్యక్షమై యున్నది. చిత్తము సత్వగుణాధిక్యముచే నిర్మల మగుకొలఁది నీచవిషయములపై యిచ్ఛ తొలఁగి యుక్తమగువిషయములపైఁ గలుగుచుండునదియు విశద

మయ్యే యున్నది. ప్రస్తుతజ్ఞానేచ్ఛకు విషయ మగుపరబ్రహ్మంబును ఉత్తమోత్తమము; అతిసూక్ష్మము. ఇట్లగుటచే నతినిర్మలచిత్తమునకుఁ గాని దీనియం దిచ్ఛ జనింపదు; కర్మాచరణము లేక చిత్తనైర్మల్యంబును గలుగదు. కావున చిత్తశోధనమూలమునఁ గర్మలు జ్ఞానేచ్ఛతోనే సంబంధపడును. కావున వానిని మోక్షముతో సంబంధపఱుపఁ బ్రయాస పడ నక్కఱ లేదు.

---

## ౬. సర్వాపేక్షాధికరణము.

విషయసంశయములు:— ఈయధికరణమున నాశ్రమకర్మలను గూర్చియే యించుక విచారింపఁబడును. పూర్వాధికరణమున "ఫలము నొసంగువిషయమున విద్యలకుఁ గర్మాపేక్ష లేదు." అనువిషయము సిద్ధాంతము చేయఁబడెను. కావున నావిద్యల నెప్పటికినిఁగూడ నట్టియపేక్ష లేదేమో యని సంశయము జనించును. అది యిందు దృష్టాంతముగ విమర్శింపఁబడి నివారింపఁబడును. ఈనిరూపణచే జ్ఞానమునకు సాధనములు నిరూపింపఁబడునుగావున యీయధికరణ మీపాదమునందుఁ జేర్పఁబడును.

పూర్వపక్షసంగతులు:—విచారించినచో విద్యలకు ఫలజననమున నెట్లు కర్మాపేక్ష లేదో అట్లే స్వరూపప్రాప్తియందును లే దని చెప్పుటయే యుక్తియుక్తముగఁ దోఁచుచున్నది. "వివిదిషంతి యజ్ఞేన" అను మొదలగు శ్రుతులవలన "కర్మలు విద్యలకు సాధనములు" అని నిరూపింత మనిన నదియు యుక్తము కాదు. అచ్చట *విధివిభక్తి యేదియు లేదు. క్రియ వర్తమానకాలమున మాత్రమే యున్నది. ఇట్లగుటచే నది స్తోత్రరూపమైనఁ గావచ్చును కదా! ఇదియునుగాక బ్రహ్మవిద్య నాల్గువిధములు. వేదాంతవాక్యమును విని దానియర్థము గ్రహించుట యొకవిధము. దీనినే శ్రవణమందురు. ఇది వాక్యార్థజ్ఞానముచేఁ గలుగును కావున నిచ్చట గర్మ చేయవలసినపని యేదియు లేదు. ఇట్లు శ్రవణము కలిగినపిదప నావిషయమునే యుక్తులచే విచారించి నిర్ణయించుట మనన మనఁబడును. ఇది రెండవ విధము. ఇదియు వాక్యార్థజ్ఞానమువలననే సంభవించును గావున నిచ్చటఁ

---

* విధివిభక్తి. అ-౧. పా-3. సూ-౨౦. పేజీ-३46 చూ.

గూడఁ గర్మతోఁ బని లేదు. ఇఁక మూఁడవవిధమునకు నిదిధ్యాసన మని పేరు. ఇది ధ్యానరూపమైనది. మనస్సునందు రెండవసంకల్పము రానీకుండ పరమేశ్వరుని ధ్యానించుచుండుట దానికి స్వరూపము. ఇదియు శ్రవణమననములవలన కలుగవచ్చును కావున ఇచ్చటఁగూడ గర్మాపేక్ష లేదు. కైవల్యము నాల్గవవిధము. దీనికి పరబ్రహ్మసాక్షాత్కారమే స్వరూపము. నిదిధ్యాసనము చిరకాల మేకనిష్ఠతో నాచరింపఁబడెనేని ఇది కలుఁగును. కావున నిచ్చటఁగూడఁ గర్మలచే నాచరింపఁబడవలసినపని లేదు. ఈకారణమువలన విద్యాకర్మలకు నించుకయైన సంబంధమే లేదని తోఁచుచున్నది.

## అ_౩. పా_౪. సూ_౨౬.

అవతారిక:—ఇట్లు దృష్టాంతసంగతితో వచ్చినపూర్వపక్షము ఖండించుచున్నాఁడు.

# ౪౫౨. సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతే రశ్వవత్.

## ౩. ౪. ౨౬.

తాత్పర్యము:—ఈపూర్వపక్షము యుక్తము కాదు. విద్యకు నన్ని యాశ్రమకర్మలతోను ప్రయోజనము కలదు. "పూర్వాధికరణము నందట్లు లే దని చెప్పితిరి కదా!" అనియెదవేమొ వినుము. పూర్వాధికరణమునందు "ఫలము నొసంగువిషయమున విద్యలకుఁ గర్మాపేక్ష లేదు." అని మాత్రమే చెప్పితిమి. ఇప్పుడు "విద్య తనయుత్పత్తికై గర్మ నపేక్షించును" అని చెప్పుచున్నాము కావునఁ బూర్వోత్తర విరోధము లేదు. ఉత్పత్తి యైనపిదపఁ గదా ఏదైనను ఫలము నొసంగఁ గలుగుట. అప్పు డొకవేళ గర్మలతోఁ బని లేకపోయినను జత్పూర్వమున నుండవచ్చు ననుటలో విరోధ మేమి? "శ్రవణాదులవలననే కార్యనిర్వాహమగుచుండఁ గర్మ యేల?" అనియెదవేమొ. శ్రవణాదు లంతరంగ సాధనములు; కర్మలు బహిరంగసాధనములు. ఏలయనిన:—

వర్ణాశ్రమధర్మముల నవలంబించుటచే ధర్మాభివృద్ధి కలుగును; అధర్మము నశించును. అనిత్యంబును అపరిశుద్ధంబును దుఃఖరూపంబు నగు నీసంసారమును నిత్యముగాను నిర్మలముగాను సుఖరూపముగాను

భాసించు భ్రాంతి తొలంగును. సర్వభ్రాంతులకు నధర్మమే కదా మూలము. ఇట్టిభ్రాంతి తొలఁగినపిదప సంసారముయొక్క యథార్థరూపము చిత్తమునకు విశదమగును; అది సర్వానర్థమూల మనుట తేటపడును. ఇట్లు తేటపడిన పురుషునకు దానియం దరుచి జనించును. ఇదియే వైరాగ్యము. ఈ వైరాగ్యమువలన "సంసారమును పరిత్యజింపవలయును" అనుతలంపు జనించును. దానిని సార్థకముఁ జేసికొనుటకై తర్వాత నుపాయమును వెదకును. అట్లు వెదకుచు శాస్త్రమువలనను గురువు వలనను "బ్రహ్మజ్ఞానముచే ముక్తి కలుగును" అని సామాన్యముగ నెఱింగి విశేషజ్ఞానమునకై శ్రవణాదుల నారంభించును. పైన వర్ణించిన విధముగ శ్రద్ధాధిక్యము కలిగిననే కదా శ్రవణాదుల నెవ్వఁడైనను బాగుగా నాచరించుట! ఈకారణమువలన శ్రవణాదులకంటెఁ బూర్వము జ్ఞానేచ్ఛాజననమునకై గర్మలావశ్యకములు. ఈవిషయము పైయధికరణమునందును సవిమర్శముగ వర్ణింపఁబడి యున్నది. ఈకారణమువలన విద్యలకు గర్మాపేక్ష కలదు.

"త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన" అనుశ్రుతియు నీవిషయమును స్పష్టముగనే చెప్పుచున్నది. ఈబృహదారణ్యకోపనిషద్వాక్యమునందు "యజ్ఞాదులు జ్ఞానేచ్ఛాసాధనములు" అని స్పష్టముగఁ జూపఁబడియున్నది. మఱియు ఛాందోగ్యోపనిషత్తునందు "అథ య ద్యజ్ఞ ఇ త్యాచక్షతే బ్రహ్మచర్య మేవ తత్" "యజ్ఞ మని యేది చెప్పఁబడుచున్నదో అది బ్రహ్మచర్యమే" అని బ్రహ్మచర్యము యజ్ఞరూపముతో స్తోత్రము చేయఁబడుచున్నది. దీనివలన "బ్రహ్మచర్యమువలెనే యజ్ఞము కూడ విద్యాసాధనమే" యని గ్రహించుటకు వీలు కలుగుచున్నది. బ్రహ్మచర్యము విద్యాసాధన మనువిషయమును గూర్చి కఠోపనిషత్తునందు "సర్వే వేదా య త్పద మామనంతి తపాంసి సర్వాణి చ య ద్వదంతి య దిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి త త్తే పదం సంగ్రహేణ బ్రవీమి" "సమస్తవేదములు నేస్థానమును వర్ణించునో సర్వతపంబులు నేస్థానమును ప్రశంసించునో (తప మనఁగా ధ్యానము లేక తత్త్వచింత) దేనిని కోరుచు మునులు బ్రహ్మచర్యము నాచరింతురో అట్టిస్థానమును నీకు చెప్పెదను" అని యున్నది. ఈవాక్యమును విమర్శించిన కేవల బ్రహ్మచర్యమే కాక వేదాధ్యయనంబును తపంబును కూడ విద్యాసాధనములే

యని తేలుచున్నది. వేదాధ్యయనము గృహస్థధర్మములలోనిది (ఇచ్చట వేదాధ్యయన మనఁగా బ్రహ్మయజ్ఞ మను పేరుగల వేదజప మని యెఱుంగునది.) యగుటచేతను తపస్సు వానప్రస్థధర్మ మగుటచేతను బ్రహ్మచర్యము బ్రహ్మచారిధర్మ మగుటచేతను "సర్వాశ్రమధర్మములును బ్రహ్మవిద్యాసాధనములే" యనుట స్పష్ట మగుచున్నది. ఉపలక్షణార్థమై యొక్కొక్క ధర్మము మాత్రము గ్రహింపఁబడె ననియుఁ జెప్పుటకు వీలు కలుగుచున్నది. కావున విద్యోత్పత్తికిఁ గర్మాపేక్ష కలదు. "కషాయపక్తిః కర్మాణి జ్ఞానంతు పరమం గతిః, కషాయే కర్మభిః పక్వే తతో జ్ఞానం ప్రవర్తతే" "ఆశ్రమకర్మలు చిత్తమును పరిపాకము నొందించునవి. జ్ఞానము మాత్రము ఆచిత్తశుద్ధికి ఫలము కర్మలచే పాపకర్మలు నశించి చిత్తశుద్ధి కలుగును; పిదప బ్రహ్మజ్ఞానము ప్రవర్తించును" అని స్మృతియు నీవిషయమును చెప్పుచున్నది.

మఱియు పదార్థభేదము లేకున్నను లోకమున యోగ్యతనుబట్టి యొక్కొక్కవస్తువు ఒక్కొక్కవిషయమునందు మాత్రమే యెట్లుపయోగింపఁబడునో అట్లే యీకర్మలు నుపయోగింపఁబడును. స్వరూపభేదము లేకున్నను యోగ్యత ననుసరించి విద్యోత్పత్తియందే యుపయోగింపఁబడును గాని ఫలజననమునం దుపయోగింపఁబడదు. *అశ్వ మొక్కటియే యయ్యును నాగలి నీడ్చుటయం దుపయోగింపఁబడక రథముల నీడ్చుటయందు మాత్రమే యుపయోగింపఁబడునట్లు ఈకర్మలు నుపయోగింపఁబడును. వీనికి మోక్షజననమునందు యోగ్యత లే దని మున్నే వివరించి యున్నాము కదా! కావున నెట్లును కర్మకు విద్యోత్పత్తియం దపేక్ష కలదు.

---

* పరదేశములయందు గుఱ్ఱములను నాగలి నీడ్చుటకుఁగూడ నుపయోగించుచున్నను యోగ్యత నాశ్రయించి యట్లు చెప్పఁబడెను. బలము కల దైనను ఇతర జంతువులవలె నది మొరటుపనులకు నుపయోగింపఁదగినది కాదు కదా! అది గౌరవనీయ మగుజంతువు. ఇట్లు కాకున్నను స్వదేశమున దాని కట్టి యుపయోగము లేకపోవుటచేతఁ గూడ దృష్టాంతార్థమై యట్లు చెప్పఁబడి యుండవచ్చును. ఒక్కస్థలమున మాత్రమే వ్యవహారములో నున్నవిషయమును గూడ దృష్టాంతముగా నొసంగవచ్చును కదా!

## అ-౩. పా-౪. సూ-౨౭.

అవతారిక:—“పైసూత్రమునందు విద్యలకుఁ గర్మాపేక్ష గల దను విషయమున కొన్నిశ్రుతు లుదహరింపఁబడినవి కాని యవి యాసిద్ధాంత మునకు తోడ్పడ నేరవు. వానియందు విధి లేదు. ‘వివిదిషంతి’ అనుక్రియ వర్తమానకాలమున మాత్రమే యుండుటచే కేవలస్తుతిపరమే యైయు న్నది. ‘ఈవిద్య యత్యుత్తమ మైనది. సాధకు లగువారు సర్వకర్మల నాచరించియు జ్ఞానమునే పొందదలంతురు’ అని యాశ్రుతులు విద్యల నుతించుచున్నవి. ఈకారణమువలన విద్యాకర్మసంబంధము ఎప్పటికిని కుదురదు. కావున మోక్షఫలోత్పత్తియం దెట్లు కర్మాపేక్ష లేదో అట్లే విదోత్పత్తియందును గర్మాపేక్ష లేదు. జ్ఞానేచ్ఛకును కర్మమునకును గూడ సంబంధ ముండుటకు వీలు లే దని యిదివఱకే చెప్పియున్నాము” అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౪౫౩. శమదమాద్యుపేతః స్యాత్తథాఽపి తు తద్విధే స్తదంగతయా తేషా మవశ్యానుష్ఠేయత్వాత్. ౩. ౪. ౨౭.

తాత్పర్యము.— పై పూర్వపక్షము (అవతారికయందలి పూర్వ పక్షము) నంగీకరించి విద్యాకర్మ సంబంధమును పరిత్యజించినను జ్ఞానమునకు సాధనములు లేకపోవు. “తస్మా దేవం వి చ్ఛాంతో దాంత ఉపరత స్తితి క్షుః సమాహితో భూ త్వాత్మ న్యే వాత్మానం పశ్యతి”=“ఈకారణము వలన పై నవర్ణించినవిధముగ నెఱింగినవాఁడు *శమదమోపరతితితీక్షాశ్రద్ధాసమాధానములు గలవాఁడై తనయందే తన్ను గాంచుచుండును.” అని శ్రుతియందు ప్రత్యక్షముగ జ్ఞానసాధనము లగుశమదమాదులు వర్ణింపఁబడి యున్నవి. ఇట్లగుటచే విద్య స్వతస్సిద్ధయే యైనను దాని

---

* శమము (మనోనిగ్రహము) దమము (ఇంద్రియనిగ్రహము) ఉపరతి (సర్వకర్మ పరిత్యాగము) తితీక్ష (ఓర్పు) శ్రద్ధ (విశ్వాసము) సమాధానము (అంగీకారము) అనునవి శమాదులు.

యుత్పత్తికిఁ గొన్ని సాధనములు చెప్పఁబడెను కావున మఱికొన్ని సాధనములు కూడ నుండిన నుండవచ్చు నని యంగీకరింపవలసి యున్నది. కర్మ యొక్కటియే విద్యోత్పత్తి సాధనముగ సాధింపఁబడుచుండి యితర సాధనము లెవ్వియు నెచ్చటను వర్ణింపఁబడి యుండకుండునేని యప్పుడు "ఈకర్మలు గూడ సాధనము లగునో? లేదో?" యనుసంశయము జనింపవచ్చును గాని యిచ్చట నట్లు లేదు కదా! కావున పైశ్రుతి ననుసరించి శమదమాదులతోఁ బాటు కర్మలు గూడ సాధనము లగు నని నిర్ణయించుకొనవలయును.

"ఈశమాదివాక్యమునందు విధి లేదు కదా!" అనియెదవేమొ యట్లు కాదు. "కస్మాత్" అని పూర్వప్రస్తావము ననువాదము చేయుట వలన నిది విధియే యని తోఁచుచున్నది. మాధ్యందిన శాఖయందు 'ఆత్మన్యే వాత్మానం పశ్యేత్' అని విధివిభక్తియు బ్రత్యక్షముగనే కలదు. కావున శమాదివాక్యము విధివాక్యమే. దీని నాశ్రయించి పైన నిరూపించినవిధముగ కర్మములను గూడ విద్యాసాధనములనుగా నంగీకరింపవలసినదియే. విచారించిన "వివిదిషంతి యజ్ఞేన" అను మొదలగువాక్యములును అపూర్వవిషయమును బోధించునవి యగుటచే విధులే యగును. "యస్య పర్ణమయీ జుహూర్భవతి" అను మొదలగు స్థలములయందు "భవతి" యను మొదలగు క్రియలు వర్తమానకాలముననే యున్నను అపూర్వ విషయమును బోధించుచుండుటచే విధివాచకము లగుచున్నవి కదా! ఈపూర్వ మీమాంసాసిద్ధాంతము ననుసరించి ప్రకృతమునఁ గూడ దనిన విధివాక్యములుగనే యంగీకరింపవలయును. జ్ఞానేచ్ఛకును కర్మలకును సంబంధము కల దనుమాట యుపదేశించునంతవఱకుఁ దెలియు లేదు కదా! కావున నెట్లును ఈవాక్యము విధివాక్యమే. పూర్వ మెక్కడను సిద్ధించి యున్నవిషయమును చెప్పుట మాత్రమే యనువాద మనఁబడును కావున నీశ్రుతి యట్టిది కానేరదు. ఈవిషయ విచారణ "విధి ర్వా ధారణవత్. 3. ౪. ౨౦." అను స్థలమున నిరూపింపఁబడి యున్నది. స్మృతులును ఫలాపేక్షారహితముగఁ జేయఁబడినకర్మలు జ్ఞానసాధనము లగు నని చెప్పుచున్నవి గావున నెట్లును కర్మలును శమదమాదులును గూడ విద్యాసాధనము లగును. అయినను ఈరెంటియందుఁ గొంత భేదము గలదు "ఏవం విత్" అని శమాదిశ్రుతియం దుండుటచే వానికి (శమాదులకు

కేవల విద్యతోనే సంబంధము. కర్మల కన్ననో "వివిదిషంతి" అని శ్రుతి చెప్పుటచే జ్ఞానేచ్ఛతో సంబంధము. ఈవిశేషము తప్ప తక్కినవన్నియు నొక్కటియే కావున విచారించిన సర్వకర్మలు నాచరింపఁబడవలసినవియే; వానినుండి పరంపరగా చిత్తశుద్ధిమూలమున జ్ఞానేచ్ఛయు జ్ఞానంబును ముక్తియు కలుగును.

---

# 8. సర్వాన్నానుమత్యధికరణము.

విషయసంశయములు :— "స హ వా ఏవం విది కించ నానన్నం భవతి" "ఈ ప్రాణసంవాదము నెఱింగినవాని కాహారము కాని దొక్కటియు నుండదు" అని ఛాందోగ్యోపనిషత్తునందును "స హ వా అస్యా నన్నం జగ్ధం భవతి నానన్నం ప్రతిగృహీతం" "ఈ ప్రాణసంవాదము నెఱింగినవానికి భక్షింపరాని ద్రవ్యము లేదు. స్వీకరింపరానిదియు నెద్దియు లేదు" అని బృహదారణ్యకోపనిషత్తునందును సర్వాన్నానుమతి (జాత్యాది భేదములతోఁ బని లేకయే యెవ్వరియన్నము నైన భుజింపవచ్చునను ననుమతి) కలదు. దీనినిఁగూర్చి యీయధికరణమున విచారింపఁబడును. "ఇది శమాదులవలె విద్యకు నంగముగ విధింపఁబడుచున్నదా ? లేక విద్యను స్తుతించుటకై వర్ణింపఁబడుచున్నదా?" అనుసంశయము నివారింపఁ బడును. ఈసర్వాన్నానుమతి స్తుత్యర్థమే యని సిద్ధాంతము చేయఁబడును. ప్రాణవిద్యయందు గలసంశయమును నిరాకరించి విరోధమును పరిహరించుటకై ఆప్రాణవిద్య మోక్షము నొసంగు ననువిషయమును స్థిరపరుచుటకై ప్రయత్నించునది కావున నీయధికరణ మీపాదమునఁ జెప్పఁబడెను.

పూర్వపక్షసంగతులు :— విచారించినచో నీసర్వాన్నానుమతి విద్యాంగ మనుటలో సంశయము లేదు. "భవతి" యనునది వర్తమాన క్రియయేయైనను 'వివిదిషంతి' యనుక్రియవలె విధివాచకము కావచ్చును. ఉపదేశము లన్నియు నాచరణార్థ మయ్యే కదా చేయఁబడును. ఇది విద్యకు సమీపమున నుండుటచే విద్యాంగవిధియే యని చెప్పవలసి యున్నది. ఏదియైనను విధి యైనచోఁ బ్రయోజనవంత మగును కాని

యర్థవాదమైనచో నంత ప్రయోజనవంతము కాదు కదా! "ఇట్లయిన భక్ష్యాభక్ష్యములనుగూర్చి చెప్పుశాస్త్రము నిరర్థకము కావలసి వచ్చును కదా!" అనియెదవేమొ యట్లు కాదు. అది సామాన్యముగ భక్ష్యాభక్ష్య పదార్థములను గూర్చి చెప్పునది యగుటచే సామాన్యశాస్త్రము; ఇది (ప్రస్తుతసర్వాన్నానుమతి) యన్ననో ప్రాణవిద్యోపాసకునిఁగూర్చి మాత్రమే చెప్పునది యగుటచే విశేషశాస్త్రము. ఈకారణమువలన విశేషశాస్త్రము సామాన్యశాస్త్రమును వాదింపవచ్చును. భూతహింస చేయరా దనుసామాన్యశాస్త్రము యజ్ఞపశువును గూర్చి మాత్రమే చెప్పువిశేషశాస్త్రముచే బాధింపఁబడునట్లు ఈభక్ష్యాభక్ష్యవిభాగ శాస్త్రముకూడ ప్రస్తుతశాస్త్రముచే బాధింపఁబడవచ్చును. కావున సర్వాన్నానుమతి విద్యాంగమే.

## అ_౩. పా_౪. సూ_౨౮.

అవతారిక:—అని యిట్లు దృష్టాంతసంగతితో వచ్చినపూర్వపక్ష మును ఖండించుచున్నాఁడు.

# ౪౫౪. సర్వాన్నానుమతి శ్చ ప్రాణాత్యయే తద్దర్శనాత్. ౩. ౪. ౨౮.

తాత్పర్యము:—ఈయభిప్రాయము సరియైనది కాదు. ఇచ్చట సర్వాన్నానుమతి విధింపఁబడుట లేదు. విధివిభక్తులతో నిచ్చట క్రియ గూడియుండలేదు. "భవతి" అని వర్తమానకాలము మాత్రమే యున్నది. "వివిదిషంతి" అనుస్థలమునందువలె నిచ్చట విధిని కల్పించుటకును వీలు లేదు. అచ్చట చెప్పఁబడి యున్నవిషయ మపూర్వము. ఇచ్చట నన్ననో యట్టిది లేదు. అన్నభక్షణ మప్రసిద్ధవిషయము కాదు కదా! కావున "ఉపదేశము లన్నియు నాచరణార్థమై మాత్రమే చెప్పఁబడును" అను నింతమాత్రము కారణము నాధారము చేసికొని విధిని కల్పింపఁజూచుట యుక్తము కాదు. అట్లు కల్పింపఁజూచినను ఒక్కకల్పనతో కార్య నిర్వాహము కాదు. ఆ వాక్యమునందు "నకించ నానన్నం భవతి" "ఏపదార్థంబును అన్నముకానిది కానేరదు" అని మాత్రమే యున్నది;

"నకించ నానన్నం భావయతి" "ప్రాణవిద్యావేత్త యొక్క పదార్థమును గూడ నాహారముగాఁ జేసికొనకూడదు" అని యుండిననేగాని విధికిఁ బ్రయోజనముండదు. "అన్న మగుచున్నది కానేరదు" అనుట వస్తు స్వభావమే యగునుకాని యందు పురుషకర్తవ్య మేమియు నుండదు కదా! ఇట్లు లేకున్న విధికిఁ బ్రయోజన మేమి? ఈకారణమువలన మొట్టమొదట "భవతి" యనుక్రియను "భావయతి" యనుక్రియఁగాఁ గల్పింపవలయును; వర్తమానకాల మైనచో విధి స్పష్టము కాదు కావున నేదియో యొకవిధముగ దానియందు విధిని కల్పింపవలయును. ఇట్టి కల్పనాపసంపద కార్యసాధనము గానేర్చునా? కావున నిచ్చట సర్వాన్న భక్షణము విధింపఁబడినది యనుటయే తగదు.

మఱియు "ఏజంతు వేయాహారమును భక్షించినను అది యంతయు ప్రాణముయొక్క యాహారమే" అనిన నది ధ్యానవిషయ మగునుగాని క్రియావిషయమగునా? ప్రతిజంతువును భుజించునాహార ముల మనుష్యుఁడు భుజింపఁగలఁడా? వ్యాఘ్రాదులు భుజించునాహార ముల గవాదులు భుజింపఁగలవా? ఏనుఁగు మఱ్ఱియూడలను కొమ్మలను భక్షింపగలదు. శునకము ఎముకలను చర్మమును కొఱికితినును. ఒంటె యెదురుమొలకలను వేపయాకులను నములును. పురుషుఁ డట్లుచేయఁ గలఁడా? చేయలేనిదానిని సామాన్యులే విధింప రనిన సర్వజ్ఞ మగువేద మట్లు చేయునా? ఈకారణమువలనను సర్వాన్నభక్షణకథనము విధి కానేరదు. మఱియు నిది విధియైన భక్ష్యాభక్ష్యవిభాగశాస్త్రమునకు విరోధము వచ్చును. అది సామాన్యశాస్త్రమే యైనను దీనిచే బాధింపఁ బడదు. ఇచ్చట నియతమగువిధి లేదు కదా! కల్పితములచే యథార్థ ములు బాధింపఁబడునా? ఈకారణమువలనఁగూడ నిచ్చటిసర్వాన్నాను మతి విధి కాదు. "సర్వజంతువులును భక్షించునన్నమును ప్రాణమే భక్షింపుచున్నది" యని ధ్యానించుటకు మాత్రము వీలు కలదు కావున నాధ్యానమునే ప్రశంసించుటకై యిట్లు చెప్పఁబడెను.

ఈసర్వాన్నానుమతియు శ్రుతియందు మఱియొకస్థలమున విధింపఁ బడి యున్నది. మితిమీఱినయాపద సంభవించి ప్రాణముపోవునప్పుడు మాత్రము మద్యము కాక తక్కినపదార్థముల నన్నిటిని భక్ష్యాభక్ష్య విభాగము లేకుండా నుపాసకుఁడుగాని మఱియొక్కఁడుగాని భక్షింప

వచ్చు నని చెప్పఁబడియున్నది. ప్రత్యక్షముగఁ జెప్పఁబడి యుండకపోయి నను ఒక యుపాఖ్యానమువలన నట్టియభిప్రాయము విశదీకరింపఁబడి యున్నది. ఎట్లనిన:—

ఒకానొకసమయమున శిలావృష్టిచేతను యొఱ్ఱనిపురుగులచేతను కురుదేశమునందలి సస్యములు చెడిపోవుటచే నచ్చట నిలువలేక నుషస్తి యను బ్రాహ్మణుఁడు అల్పవయస్కురాలగు తనభార్యతోఁగూడా దేశాంతరమునకు వచ్చెను. ఆయన జ్ఞానసంపన్నుఁ డయినను జీవితముపై నభిమానము లేనివాఁడైనను బ్రహ్మవిద్యోపాసకుఁడు గావున తచ్ఛిద్ధి కలుగునంతవఱకు దేహమును నిలిపికొనవలయు నని పూన్కి గలిగియుండెను. ఈ కారణమువలన తన కెట్టిశ్రమ కలిగినను సహించి ప్రాణధారణమునకై ప్రయిత్నించుచుండెను. అపరదేశమున నాహారార్థమై బిచ్చమెత్తుచుండెను. చాలదినములవరకు నచ్చటగూడ పరిపూర్ణాహారము దొరకలేదు. ఒక నాఁడు ఆఁకలిచే మిగుల బాధనొందుచు భిక్షార్థమై వెలికి రాఁగా నచ్చట నొకపురుషుఁడు ఒకపాత్రమున కొన్నియలచందల నుంచుకొని భక్షింపుచుండెను. వానినిఁజూచి యా బ్రాహ్మణుఁడు "నా కాహారము నొసంగుము" అని యాచించెను. "నాయొద్ద నింతకంటె నధికధాన్యము లేదు. కొంచెముగ నుండఁగా వీని నిప్పుడు భుజించుచున్నాను" అని యమ్మునికి నాతఁడు బదులు చెప్పెను. ఇట్లు ఆయలచందల నుచ్ఛిష్టములుగ నెఱింగియు నా బ్రాహ్మణుఁడు వానినే యడిగి పుచ్చుకొని భుజించెను. "ఈయుదకమును గూడ గైకొనుఁడు" అని యాపురుషుఁడు ప్రార్థింపఁగా నుచ్ఛిష్ట మనుకారణమున నా బ్రాహ్మణుండు దాని గైకొనలేదు. "అలచందలు గూడ నుచ్ఛిష్టములే కదా! వానిని గైకొని జలము నేల గ్రహింపరు" అని యాపురుషుఁ డడుగుటయు నమ్ముని యిట్లని సమాధానమును చెప్పెను. "ఇప్పుడు ఆఁకలిచే నాకు ప్రాణము పోవుచుండెను. దీనిని భక్షింపకుండిన నాప్రాణము పోయియే యుండును. జల మన్ననో దాని నదీతటాకాదులయం దెచ్చటనైనా సంపాదింపవచ్చును. ఈకారణమువలన నేను ఆహారమును మాత్రము భుజించితినికాని జలపానము చేయలేదు." అని యిట్లు చెప్పి తాను భుజింపఁగా మిగిలినయాహారము భార్యకై గృహమునకుఁగొనిపోయెను. భార్యా భక్షణాంతరమునఁ గూడ మిగిలియుండ మరునాఁడు మరల భుజించెను.

ఈచరిత్రమును విమర్శించి చూచినఁ బ్రాణాత్యయసమయమున మాత్రము సర్వాన్నానుమతి కల దనియు తక్కినసమయములయందు లే దనియు తేలుచున్నవి. అలచందలను మాత్రము భక్షించి ప్రాణములు నిలుపుటకు కొంత యాధారము దొరకఁగానే జలమును వర్జించె ననుటయే యిందుకు దృష్టాంతము. ఈస్థలమునందు మాత్రము సర్వాన్నానుమతి భక్ష్యాభక్ష్యవిభాగశ్రుతిని బాధింపఁగలదు. అభిప్రాయమును విమర్శించిన నిచ్చట విధి స్పష్ట మగుచున్నది కదా! కావున నెట్లును సర్వాన్నానుమతి (ప్రాణవిద్యయందు చెప్పఁబడినసర్వాన్నానుమతివాక్యము) స్తుతిపర మేగాని విధికాదు.

## 477. అబాధాచ్చ. 3. 4. 29.

తాత్పర్యము:— ఈసిద్ధాంతపక్షము నంగీకరించినచో భక్ష్యాభక్ష్యవిభాగశ్రుతియు బాధింపఁబడదు. ఆహారశుద్ధివలన చిత్తశుద్ధి కలుగు ననుట లోకశాస్త్రప్రసిద్ధ మగుటచే నావిషయముఁగూర్చి వర్ణించు భక్ష్యాభక్ష్యశ్రుతికి నిరర్థకముగ నన్యాయముగ బాధకలుగుటయు యుక్తము కాదుకదా! ప్రాణాత్యయసమయమునఁ జేయఁబడిన సర్వాన్నానుమతి కన్ననో ప్రబలహేతువు యుక్తియుక్త మగుహేతువు కలదుగాని ప్రాణవిదోృపాసకులకు నట్టియనుమతి యేల యుండవలయును? విధియు నచ్చట (ప్రాణవిద్యయందు) ప్రత్యక్షముగ లే దని యిదివఱకే చెప్పియున్నాము. కావున నాభక్ష్యాభక్ష్యవిభాగశ్రుతికి బాధ కలుగకుండుటకు వీ లగుటవలనఁ గూడ నీసర్వాన్నానుమతి ప్రాణవిద్యయందు శ్రుతిమాత్రముగనే చెప్పఁబడె నని యంగీకరింపవలయును.

## 478. అపి చ స్మర్యతే. 3. 4. 30.

తాత్పర్యము:—మఱియు జ్ఞాన్యజ్ఞానిభేదముతో నిమిత్తము లేకుండ నత్యంతాపద తటస్థించినప్పు డెవ్వఁడైనను సర్వాన్నభక్షణమును గావింపవచ్చు ననియు నితరకాలములయం దెవ్వఁడు నట్లు చేయరాదనియు స్మృతులు బోధింపుచున్నవి. "జీవితాత్యయ మాపన్నో యోఽన్న మత్తి యత స్తతః లిప్యతే న స పాపేన పద్మపత్ర మి వాంభసా" = "ఎవ్వఁడైనను సరియేప్రాణము పోవునప్పుడు భక్ష్యాభక్ష్యవిచారముచేయక నన్న

మును భుజింపవచ్చును. తామరాకును జల మంటనట్లు వానిని పాప మంటదు" అను మొదలగు వాక్యములయం దీవిషయము స్పష్టముగ నున్నది. ఇట్లు చెప్పుస్థలములయందు కూడా మద్యము మాత్రము నిందింపఁబడుటచే సర్వాన్నానుమతి యున్నప్పుడు కూడ మద్యాను మతి మాత్రము లే దని తెలియుచున్నది. మద్యమునుగూర్చి "సురాపాః కృమయో భవం త్యభక్ష్యభక్షణాత్"="మద్యపానమును చేసినవారలు అభక్ష్యతమ మగు పదార్థమును అనఁగా ఆపత్కాలమునందుఁగూడ భక్షింపఁదగనిపదార్థమును భక్షించినవా రగుటచే నుత్తరజన్మమున పురుగులై జనించెదరు" అని చెప్పఁబడి యున్నది. కావున సర్వాన్నాను మతి ప్రాణాత్యయమునందే కాని యితరస్థలములయందు లేదు.

---

## ౪౫౭. శబ్దశ్చాతోఽకామకారే. ౩. ౪. ౩౧.

తాత్పర్యము:—ఇదియునుగాక నాహారభక్షణవిషయమున స్వేచ్ఛ పనికిరా దనియు శాస్త్రవిహిత మైనదానిని మాత్రమే భుజింపవలయు ననియు నిషిద్ధమును పరిత్యజింపవలయు ననియు వేదమునందుఁ జెప్పఁబడి యున్నది. "తస్మా ద్బ్రాహ్మణః సురాం న పిబేత్"="ఈకారణమువలన బ్రాహ్మణుఁడు మద్యపానము చేయరాదు" అని కాఠకశాఖయందు కలదు. ప్రాణవిద్యయందుఁ గానవచ్చు సర్వాన్నానుమతి యర్థవాద మైననే కాని యిది సరిపడదు. ఇట్టిశాస్త్రములకు బాధ యుక్తము కా దని యిదివఱకే చెప్పి యున్నాము కావున "తస్మా దేవం విధి" అనునిట్టివాక్యము లన్నియు నర్థవాదమాత్రములే. ప్రాణవిద్యకును ముక్తియే ఫలము.

---

# ౯. ఆశ్రమకర్మాధికరణము

విషయసంశయములు:—సర్వాపేక్షాధికరణమునందు (౩-౪-౬) "సర్వకర్మలును విద్యాసాధనములు" అని సిద్ధాంతము చేయఁబడెను. ఆ సిద్ధాంతమువలన నిత్యకర్మలు కూడ విద్యాసాధనములే యని తేలును. ఈ విషయమునుగూర్చి యీయధికరణమున విచారింపఁబడును. "మోక్షేచ్ఛ

లేనివాఁడు విద్యాసిద్ధి యక్కఱ లేనివాఁడు యీనిత్యకర్మల నాచరింప వలయునా? లేదా?" యనుసంశయము నివారింపఁబడును.

సంగతి పూర్వపక్షములు:—"త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసా" అను మొదలగు శ్రుతులచే నాశ్రమ కర్మలు విద్యాసాధనములుగాఁ జెప్పఁబడి యున్నవి. "యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్"="బ్రతికియున్నంతకాలము అగ్నిహోత్రమును హోమముచే తృప్తి నొందింపవలయును" అను మొదలగు శ్రుతులచే నాయాయాశ్రమకర్మలు నిత్యము లనియు వర్ణింపఁబడి యున్నవి. ఈ రెండు శ్రుతులకును పరస్పరవిరోధము గానవచ్చుచున్నది. విద్యాసాధనములే యైనచో నాశ్రమకర్మలు కామ్యము లగును. విద్యాసిద్ధినిఁ గోరువారిచే నాచరింపఁదగినవియు కోరనివారిచే నాచరింపఁ బడునావశ్యకత లేనివియు నగును. కాకున్నచో సర్వజనులకు నవశ్యానుష్ఠేయము లగును. ఈ రెండును శ్రుతిసిద్ధములే యగుటచే దేనిని పరిత్యజించుటకును వీలు లేదు; విరోధమును తొలఁగించుటకును వీలు లేదు. "ఇట్లు చెప్పనేల? బలసమృద్ధిని గోరువాఁడు చంద్రకట్టెతో యూపస్తంభమును నిర్మింప వలయు ననుస్థలమున వచనమాత్రముచే వీర్యాభివృద్ధిఫలములందునువిధిచే యజ్ఞమునందునుఁ గూడ నాకట్టె యుపయోగింపఁబడునట్లు యిచ్చట గూడ నాశ్రమకర్మ లుపయోగింపఁబడవచ్చును. యూపము యజ్ఞము నందు విధింపఁబడినది కావున దానిమూలమున నాచంద్రకట్టె యజ్ఞార్థ మయ్యెను; 'వీర్యాభివృద్ధిని గోరువాఁ డాకట్టె నుపయోగింపవలయును' అని చెప్పఁబడి యున్నది. కావున నాఫలము నొసంగుటయందు నుపయోగింపఁబడెను. ఇట్లే యాశ్రమ కర్మలుగూడ విధివలన నిత్యములును విద్య నొసంగఁగల వనువచనమునఁ గామ్యములును గూడఁ గావచ్చును" అనియెదవేమొ అది సరిపడదు. చంద్రకట్టెను గూర్చి చెప్పుస్థలమున విరోధ మేమియు లేదు. అది యజ్ఞార్థంబును గావచ్చును; వీర్యాభివృద్ధిఫలమును గూడ నొసంగవచ్చును. ఇచ్చట మాత్ర మట్లు లేదు. ఒక శ్రుతివలన నిత్యత్వంబును మఱియొక శ్రుతివలన ననిత్యత్వంబును సంభవించుచున్నవి. ఇది యతివిరుద్ధము కదా! కావున దేనినైన నొకదాని నవశ్యముగ బాధించియే తీరవలయును. అందును యావజ్జీవశ్రుతి విధివిభక్తితో నుండుటచే దానిని బాధించుట సమంజసము కాదు.

"త మేతం" అను మొదలగు శ్రుతియందు విధివిభక్తి లేదు కావున దానిని బాధించుటవలన విరోధముండదు. అందు విధి కల్పితమాత్రమే యగుటచే దానిని నిరాకరించుట వాస్తవస్థితిలో బాధయే కూడ కానేరదు. కావునఁ బూర్వాధికరణమునందు భక్ష్యాభక్ష్యవిభాగశాస్త్రముతో విరోధము కల దనుకారణమున సర్వాన్నానుమతి శ్రుతి స్తుతిమాత్ర మని యెట్లు నిర్ణయింపఁబడెనో అట్లే యిచ్చటను యావజ్జీవశ్రుతులు విరోధ ముండుటచే యజ్ఞసాధనశ్రుతి మాత్రమే యని నిర్ణయింపవలయును.

## అ-3. పా-౪. సూ-3౨.

అవతారిక:—అని యిట్లు దృష్టాంత సంగతితో వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౪౫౮. విహితత్వాచ్చాశ్రమకర్మాపి. 3. ౪. 3౨.

తాత్పర్యము :— ఈపూర్వపక్ష ముచితము కాదు. మోక్షేచ్ఛ యున్నను ఆశ్రమకర్మ లాచరింపఁబడవలసినవియే. యావజ్జీవశ్రుతిచేత నవి నియతముగ విధింపఁబడియే యున్నవి కదా! "విద్యాంగము లని మఱియొకశ్రుతిచే వర్ణింపఁబడి కూడ నున్నవి కదా!" యనియెదవేమో. దానివలన విరోధము లేదు. రెండును విధులే యగుటచే నాయాశ్రమకర్మల రెండువిధములుగఁగూడ నుపయోగింపఁబడవచ్చును. ఈకర్మలు విధి ననుసరించి యెచ్చటెచ్చట నెట్లెట్లు విధింపఁబడునో అట్లెల్ల నాచరింపఁబడవలసినవియే యగును. ఎన్నివిధములుగఁ జెప్పఁబడియున్నను సిద్ధవస్తువునందు విరోధము కలుగును కాని సాధ్యవస్తువునందు కలుగదు. పరమేశ్వరుఁడు స్వతస్సిద్ధుఁడు. ఆయనను గూర్చి యొకస్థలమున నొకవిధముగాను మఱియొకస్థలమున మఱియొకవిధముగాను చెప్పఁబడి యుండునేని విరోధము కలుగును. సర్వజనప్రత్యక్షము లగుజలాదులను గూర్చి యొకస్థలమున నొకవిధముగాను మఱియొకస్థలమున మఱియొకవిధముగాను చెప్పఁబడి యుండునేని విరోధము కలుగును. కర్మ లట్టివి కావు. క్రొత్తగా నాచరింపఁబడవలసినవి; అప్రత్యక్షము లైనవి. వీనిస్వరూపస్వభావాదుల నెఱుంగుటకు వేదవాక్యమునకంటె భిన్న మగునుపాయ మేది కలదు? ఈకారణమువలన వానినిఁ గూర్చి యెచ్చట నెట్లు చెప్పఁబడియుండునో అచ్చట నట్లే

గ్రహించుటకంటె వేఱొకమార్గము లేదు. కావున విధుల ననుసరించి ఈ యాశ్రమకర్మలు నిత్యములుగాను కర్మాంగములుగాను కూడ నాచరింపఁబడవలసినవియే. షోడశిని గూర్చి రెండుస్థలములయందు రెండువిధములుగఁ జెప్పఁబడియున్న నప్పుడు వికల్పమునే గదా పూర్వమీమాంసయందు గ్రహించియున్నారు. ఇట్లే యిచ్చటఁగూడ వికల్పమును గ్రహింపవలసినవియే కాని విరోధము ఉద్భవింపరాదు.

"ఇది యెట్లు? విద్యకు నధికారి భిన్నుఁడు. దానియునికియు నిత్యము కాదు. ఏదియో యొకసమయమున నెవ్వనికో యొక్కనికి మాత్రమే యది కలుగును. ఇట్లుండ దానిని సాధించుటకై జేయఁబడుకర్మ లనిత్యములు కాకపోవుట యెట్లు? అనిత్యములైన పూర్వవిహితనిత్యత్వము విరుద్ధము కాకుండుట యెట్లు? ఒకపక్షమున నీవిధిశ్రుతులలో నేదియైన బాధింపఁబడవలయును. అట్లు కాకున్న విద్యార్థికి నిత్యకర్మలు బ్రత్యేకముగనైన నాచరింపఁబడవలయును" అనియెదవేమొ వినుము. విద్యాసంబంధము వలనఁ గర్మలకు కాదాచిత్కత్వము (ఒకానొకసమయమునాడు మాత్రమే యుపయోగింపఁబడుట) కలిగినను అంతమాత్రమువలన వానికి ననిత్యత్వము కలుగదు. ఏవిషయమై యుపయోగింపఁబడినను కర్మస్వరూపము మాత్ర మొక్కటియే కదా! కర్మ నిత్యమయ్యె యున్నను నిమిత్తభేదమువలన నన్యార్థముగ నుపయోగింపఁబడవచ్చును. ఇంతమాత్రమువలన గర్మలకు ననిత్యత్వముగాని పృథక్ప్రయోగముగాని (అనఁగా ప్రత్యేకముగ నాచరింపఁబడవలయుటగాని) రాదు. స్వర్గము కలుగుటకై యాచరింపఁబడునగ్నిహోత్రము కామ్యమైనను తద్భిన్నముగ నిత్యాగ్నిహోత్రము చేయఁబడుట లేదు. ఇట్లే సోమపానము నొనర్పఁదలంచిన క్షత్రియులకును వైశ్యులకును యజ్ఞకాలమున సోమమునకు మాఱుగా మఱ్ఱియూడలఁ దెచ్చి పిండిచేసి పెరుగులో కలిపి యొసంగవలయు నని యున్నది. ఇట్లు నైమిత్తికముగ నిది విధింపఁబడినను సోమము చేయుకార్యమునే చేయుచున్నది కావున దానికి (ఆసోమమునకు) ననిత్యత్వము లేదు. ఇట్లే యిచ్చట కూడ విద్యార్థమై యాచరింపఁబడునిత్యకర్మలుగూడ నగ్నిహోత్రాదిరూపములే యగుటచే నెప్పటికిని వానికి ననిత్యత్వము కలుగదు; ప్రత్యేక ప్రయోగంబును సంభవింపదు. కావున నీయాశ్రమకర్మమే రెండువిధములుగఁ గూడ నాచరింపఁబడవచ్చు ననుటలో విరోధము లేదు.

## అ-3. పా-౪. సూ-33.

అవతారిక:—"ఇదియు యుక్తియుక్తముగ నుండలేదు. దృష్టాంతములయం దెట్లున్నను దార్ష్టాంతికమునందు పైయుక్తి సరిపడదు. రూపభేదము లేకున్నను కర్మలకు ఫలభేదము కలదు. నిత్యకర్మలు పాపక్షయము నొసంగునవి; విద్యాంగకర్మలు విద్య నొసంగునవి కదా ! ఈకారణమువలన నవశ్యముగ భేద ముండియే తీరవలయును" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౪౫౬. సహకారిత్వేన చ. 3. ౪. 33.

తాత్పర్యము:—ఇట్లు సంశయింపవలసినపనిలేదు. ఈకర్మలువిద్యకు సహాయకారులు మాత్ర మే యై యున్నవి. "త మేతం వేదానువచనేన" అనుశ్రుతి యీవిషయమునే చెప్పుచున్నది. సహకారిత్వ మనఁగా కర్మలు స్వస్వరూపముతో నుండియే కార్యాంతరముల నాచరింపకుండియే విద్యకు ఫలము నొసంగుస్వాతంత్ర్యము గలుగఁజేయుట "రెండవమనుష్యుఁడుండినఁ జాలును. సర్వకార్యముల నేనే నిర్వహించుకొనియెదను" అను నిట్టివ్యవహారములయందు రెండవమనుష్యుఁడును సహాయకారియే యనఁబడినను నిమిత్తమాత్రుఁడే యెట్లగుచున్నాఁడో అట్లే యిచ్చటఁగూడ గర్మ నిమిత్తమాత్ర మగుచున్నది. విద్యాకర్మలకు నింతకంటె నధికసంబంధము లేదు. ఏదియైన విధింపఁబడి యుండునేని యప్పుడు విధిబలముచే నది సాధనముల నాకర్షించుకొనును గాని యిచ్చట విద్య విధింపఁబడునది కాదు. "శ్రోతవ్యోమంతవ్యోనిదిధ్యాసితవ్యః"అనునిట్టివాక్యములయందు విద్యావిధి యున్నట్లు గానవచ్చినను అది విధిచ్ఛాయయే గాని విధి కాదు. బ్రహ్మజ్ఞానమునుగూర్చిగాని బ్రహ్మోపాసననుగూర్చిగాని విధి సంభవింపదు. భ్రాంతివలనఁ దెలియఁబడకుండిన నుండునుగాక ; పరమేశ్వరుఁడు మాత్రము సస్వరూపములకంటె నన్యుఁడు కాఁడు కదా ! ఇట్టివానిని తెలిసికొనవలయు నని సర్వజ్ఞ మగు వేద మెట్లు విధించును ? తెలిసికొనవలయు ననిన తెలిసికొనఁబడువాఁడు తెలిసికొనువాఁడు తెలివి యను మూఁడుపదార్థము లుండవలయును; పరమేశ్వరునియందు భేదము లేదు

కదా! మఱియు వేదమున నిష్టవిధియే యుండునేని యది బ్రహ్మస్వరూ
పము నిరూపించునది కానేరదు. దానికి జ్ఞానవిధియందే తాత్పర్యము
గల దని కదా యొప్పవలెను నిర్ణయింపవలసి వచ్చును. "ఇట్లైనను బ్రహ్మ
స్వరూపనిరూపణము లేక జ్ఞానము కలుగదు కావున దాత్పర్యము వేఱైనను
వేదము బ్రహ్మస్వరూపమును చెప్పునది కావచ్చును" అనియెదవేమొ
యట్లును నియమము చేయుటకు వీలు లేదు. యథార్థ మగువస్తుస్వరూ
పమును చెప్పకున్నను ఒకదానియందు మఱియొకదాని నారోపించినను
గూడ జ్ఞానము సిద్ధింపవచ్చును; తెలిసికొనుటకు వాస్తవస్వరూపమే
కావలయు ననునియమము లేదు కదా! కావున జ్ఞానమునుగూర్చి విధి
సంభవింపదు; ఉపాసనలనుగూర్చియు నిట్లే విధి సంభవింపదు. వానివలన
జ్ఞానాభివృద్ధి కలుగు ననుటయు అవి లేకున్న నట్లు కలుగ దనుటయు విమ
ర్శకులకు స్పష్టముగనే తెలియుటచే వానిని ప్రత్యేకముగ యజ్ఞాదులను
వలె విధింపవలసినపని లేదు. యజ్ఞమువలన స్వర్గము కలుగు ననువిషయ
మెంత విమర్శించినను తెలియదు కావున నది విధింపబడవలయునే కాని
విద్య కాదు. ఇక శబ్దార్థజ్ఞానమునందు విధి బొత్తుగనే సంభవింపదు కదా!
వాక్యమునకు సంబంధించినపదముల నన్వయప్రకారముల నెఱింగిన
వారికెల్ల నిర్వివాదముగ శబ్దజ్ఞానము కలుగును కదా! కావున నిచ్చట
(విద్యలయందు) విధియే లేదు. విధియే లేకుండుటచే గర్మలును ఆవిద్య
లతో సంబంధింపనేరవు. కర్మలకు విద్య ఫలము కానేరదు. కర్మలు చిత్త
శుద్ధిమూలమున జ్ఞానేచ్ఛను కలిగించునే కాని జ్ఞానమును కలిగింపవని
"సర్వాపేక్షా (౩. ౪. ౨౬.)" అనునధికరణమున నిదివఱకే స్పష్టముచేసి
యున్నాము. మఱియు వీనికి విద్యాఫల మగుమోక్షముతో బొత్తుగనే
సంబంధము లేదు. ఆమోక్షము బ్రహ్మరూపమే యగుటచే స్వతస్సిద్ధము
కావున గర్మలచే సాధ్యము కాదు. విద్యలకు ఫలము నొసంగువిషయమున
గర్మాపేక్ష లే దని "అత యేవ చాగ్నీంధనాద్యనపేక్షా (౩. ౪. ౨౫.)"
అనునధికరణమున నిదివఱకే నిరూపించి యున్నాము. కావున కర్మలు విద్య
లకు సహాయమాత్రములే కాని ఉత్పాదకములు కావు.

ఈ కారణమువలననే కర్మలయందు విరోధము రాదు. స్వరూపము
భిన్నము కానక్కఱ లేదు; నిత్యత్వంబును వ్యాహతము కానక్కఱ లేదు.
అవి స్వభావముగనే పాపక్షయమును గావించును. పాపక్షయమువలన

చిత్తశుద్ధియు దానివలన సంసారదోషదర్శనంబును వైరాగ్యంబును దత్త్వజ్ఞానేచ్ఛయు విద్యయు క్రమంబుగఁ గలుగును. ఆవిద్యవలన ముక్తి సంభవించును. ఇప్పుడు విచారింపుడు, కర్మలయందు విరోధ మేమి వచ్చును? మఱియు నీవిషయమున నిత్యత్వానిత్యత్వములు విరుద్ధములు కానేరవు. చంద్రకర్రతోఁ జేయఁబడిన యూపము నిత్యముగ యజ్ఞాంగమై యిచ్చార్థముగ పురుషార్థముకూడ నగునట్లు యీకర్మలును గావచ్చును. కర్మలకు ఫలభేదము కల దనుభ్రాంతివలనఁ బూర్వపక్షమునందు దృష్టాంత దార్ష్టాంతికములకు (చంద్రకర్రకును కర్మలకును) భేద మెన్నఁబడినది కాని యాభ్రాంతి యిపుడు నివారింపఁబడెను కదా! కావున నెట్లును ఆశ్రమకర్మలు విద్యార్థులు కానివారిచేతకూడ నాచరింపఁబడవలయు ననువిషయములో సంశయ మింతయు లేదు.

## అ–3. పా–౪. సూ–3౪.

అవతారిక:—"ఇట్లు చెప్పుటకు వీలులేదు. 'మాస మగ్నిహోత్రం జుహ్వోతి' అనువిధి ప్రకరణభేదముచే నెట్లు కర్మాంతరమును విధించునో యట్లే 'తమేతం వేదానువచనేన' అనుమొదలగువిధియుఁ గర్మాంతరమున విధించు నని తీరవలయును. ఈవాక్యము యజ్ఞప్రకరణమునందు లేదు కదా!" అనిన సమాధానమును చెప్పుచున్నాఁడు.

# ౪౬౦. సర్వ థాపి త ఏవో భయలింగాత్.

## 3. ౪. 3౪.

తాత్పర్యము:—ఇట్లు సంశయింపఁబని లేదు. నిత్యకర్మ లను పక్షమునందును విద్యలకు సహాయకారు లనుపక్షమునందును గూడఁ గర్మలకు భేదము లేదు. అనిత్యకర్మలే చిత్తశుద్ధి మూలమున విద్యకు సహాయకారు లగు నని పూర్వమునవే వివరించియున్నాము కదా! శ్రుతిస్మృతులు నిట్లే చెప్పుచున్నవి. "తమేతం వేదానువచనేన" అనుశ్రుతి భిన్నప్రకరణమునందే యున్నను యజ్ఞాదులను సద్రూపముతోనే యనువాదము చేయుచున్నది కాని "మాస మగ్నిహోత్రం జుహ్వోతి" అనుశ్రుతివలె నపూర్వ మగురూపమును వానికిఁ జెప్పుట లేదు.

"అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః" "ఎవ్వఁడు ఫలము నాసింపక చేయఁదగిన కార్యము నాచరించునో" అను మొదలగు స్మృతియు "కార్యం కర్మ" యనుటచే విషయమునే నిరూపించుచున్నది. కర్మ స్వరూపమునందు భేద మేమియు లే దనియు ఫలపరిత్యాగ మొక్కటియే యావశ్యక మనియుఁ బ్రకటించుచున్నది. కావునఁ గర్మస్వరూపమునకు నెప్పటికిని భేదము లేదు.

"ఇది యేల ? ప్రకరణభేదము సమానమై యుండఁగా నొకస్థలమున మాత్రము భిన్నకర్మ చెప్పఁబడె ననుటయు మఱియొకస్థలమునఁ బూర్వ కర్మయే యనువాదము చేయఁబడె ననుటయు నెట్లు?" అనియెదవేమో వినుము. కేవల ప్రకరణభేద మున్నంత మాత్రమునఁ గర్మభేదము కలుగ నేరదు. అపూర్వవిధి యున్నప్పుడు మాత్రమే యది కలుగును. ప్రకరణ భేదము లేనప్పుడు కర్మ యొక్కటియే యని స్పష్టముగ గుఱుతింపఁబడు చుండును కావున నందుఁ గొన్ని యపూర్వవిధు లున్నను గుణవిధాయక ములు మాత్రమే యగుచు కర్మను భేదింపనేరవు. ఆప్రకరణమే భిన్న మైనప్పు డన్ననో యట్టిగుఱుతు లేదు కావున స్వతంత్రముగఁ గర్మను భేదించును. కావున నెచ్చటనైన నపూర్వవిధియే కర్మభేదకముగాని ప్రకరణ మాత్రము కాదు. "త మేతం" అను మొదలగు శ్రుతియందు జ్ఞానేచ్ఛా జనకత్వము మాత్రమే యపూర్వముగ విధింపఁబడెను కాని కర్మస్వరూప మట్లు విధింపఁబడ లేదు. "అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః. యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్" అనుస్థలమునందు నిత్యాగ్నిహోత్ర మునే స్వర్గదాయకముగాఁ గూడ విధించినట్లు యిచ్చటఁ గూడ పూర్వ విహిత యజ్ఞాదులకే జ్ఞానసహకారిత్వమును శ్రుతి విధించుచున్నది. "మాసమగ్నిహోత్రం జుహ్వాతి అను శ్రుతిమాత్ర మిట్టిది కా దని యిది వఱకే చెప్పియున్నాము. "ఇది యేల?" అనియెదవేమో వినుము. ఆశ్రుతి యందు హోమవిధియే ప్రత్యక్షముగఁ గానవచ్చుచున్నది. ఇదియునుగాక నిత్యాగ్నిహోత్రము యావజ్జీవ మాచరింపఁబడవలసినది యైయుండ దాని యందు అపూర్వ మగు కాలనియమ మొక్కటి గానవచ్చుచున్నది. ఇట్టినియమము సామాన్యశాస్త్రమునకు విరుద్ధము. కాలమునందు కర్మ విధింపఁబడవలయును కాని కర్మయందు కాలము విధింపఁబడ దనునది సామాన్యశాస్త్రము. "యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్" అను

మొదలగు కాలనియమము లేనివిధులు సామాన్యవిధులు. ప్రస్తుతవిధి యిట్టిది కాదు కదా ; ఇది విశేషవిధి యగుటచే నపూర్వవిధియే. కావున నిచ్చట కర్మభేదము కలదుకాని "తమేతం" అనువాక్యమునందు లేదు. కావున నెట్లు చూచినను నిత్యకర్మలే జ్ఞానసహకారులు గూడ నగునుగాని ప్రత్యేకకర్మలు కావు.

---

## అ_౩. పా_౪. సూ_౩౫.

అవతారిక:— " 'నిత్యకర్మలే జ్ఞానదాయకములు' అనువిషయమును శ్రుతియే ప్రత్యక్షముగఁ జెప్పుచున్నది" యని చూపుచున్నాఁడు.

---

## ౪౬౧. అనభిభవం చ దర్శయతి. ౩. ౪. ౩౫.

తాత్పర్యము:—మఱియు నీవిషయమును శ్రుతియే స్వయముగ నిరూపించుచున్నది. ఆశ్రమధర్మముల శ్రద్ధతో నవలంబించినవానికి కామక్రోధాదులవలన దిరస్కారము కలుగదని చెప్పుచున్నది. "ఏష హ్యాత్మా న నశ్యతి యం బ్రహ్మచర్యేణా ను విన్దతే" "ఎవ్వఁడు బ్రహ్మచర్యవ్రతముతో నాత్మను దెలిసికొనునో వానికి నాజ్ఞానము స్థిరమై యుండును" అను మొదలగు వాక్యము లీవిషయమునకుఁ బ్రమాణములు. ఈకారణమువలనఁగూడ విద్యాసిద్ధికై యపూర్వకర్మ నాచరింపఁబడవలసినపని లేదు. మోక్షేచ్ఛలేనియాశ్రమమాత్రపరులచేత నేకర్మ లాచరింపఁబడునో అవియే జ్ఞానార్థులచేతఁ గూడ నాచరింపఁబడును. కావున సర్వజనులచేతఁగూడ విశేషముగ నిత్యకర్మ లాచరింపఁబడవలసినవియే; ఫలాపేక్షాశూన్యముగఁ గామ్యకర్మలు ఆచరింపఁబడవలసినవియే.

---

# ౯. విధురాధికరణము

విషయ సంశయ సంగతి పూర్వపక్షములు:—ఈయధికరణమున విద్యాధికారులనుగూర్చి విచారింపఁబడును. "పూర్వాధికరణసిద్ధాంతమువలన నాలుగాశ్రమములవారును విద్యలయం దధికారులని తెలిసినది. ఇట్లయిన నాశ్రమశూన్యులై యుండువారిగతి యేమి ?

భార్యావియోగము నొందినవాఁడు గృహస్థుఁడును కాఁడు; బ్రహ్మచారియు కాఁడు; వానప్రస్థుఁడును గాఁడు కదా! ఇఁక వానిగతి యేమి? వాఁ డెవ్వని నాశ్రయింపవలయును. వేదము మాత్రము వాని నెట్లు పరిగ్రహించును" అనుసంశయము నివారింపఁబడును. "ఆశ్రమకర్మలు విద్యాసాధనము లగునేని యనాశ్రమికి నవి లేవు కావున వానిచే సాధింపఁబడవలసిన మోక్షమును లేదు" అనుపూర్వపక్షము సయుక్తికముగ ఖండింపఁబడును. "యజ్ఞాదిశ్రుతులవలన పూర్వాధికరణమున నన్నియాశ్రమములవారికి విద్యాధికారము కల దని తేలినను ఇచ్చట నట్లు తీరదు అని ప్రత్యుదాహరణసంగతితో వచ్చినసంశయబీజము నిరాకరింపఁబడును.

## అ-౩. పా-౪. సూ-౩౬.

అవతారిక:—విద్యయందు సర్వజనులకు నధికారము కల దని నిరూపించుటకై శ్రుతినిఁ జూపుచు ప్రతిజ్ఞ చేయుచున్నాఁడు.

## ౪౬౨. అంతరా చాపి తు తద్దృష్టేః. ౩. ౪. ౩౬.

తాత్పర్యము:—ఆశ్రమశూన్యులై యున్నవిధురాదులకుఁ గూడ బ్రహ్మవిద్యయం దధికారము కలదు. రైక్వుఁడు వాచక్నవి మొదలగు వార లిట్టివారే యైనను వేదమున బ్రహ్మవేత్తలుగ వర్ణింపఁబడియున్నారు.

## అ-౩. పా-౪. సూ-౩౭.

అవతారిక:—ఈవిషయమునందే * స్మృతిప్రమాణమును చూపుచున్నాఁడు.

## ౪౬౩. అపి చ స్మర్యతే. ౩. ౪. ౩౭.

తాత్పర్యము:—ఇట్లే యితిహాసములయందును ఆశ్రమకర్మలు లేనివారలకుఁ గూడ విద్యావత్త్వము చెప్పఁబడి యున్నది. సంవర్తుఁడు మొదలగువా రనేకులు దిగంబరులయ్యు మహాయోగు లైయుండి రని చెప్పఁబడి యున్నది. దిగంబరత్వ మాశ్రమశూన్యులకుఁదప్ప నుఱియొకనికి సంభవింపదు కదా!

---

* స్మృతి (అ-౧. పా-౨. సూ-౬. పేజీ-172 చూ.)

## అ-౩. పా-౪. సూ-౩౭.

అవతారిక:—"సరియే. ఈచెప్పఁబడినవి గుఱుతులే కదా! వీని వలన నాశ్రమరహితుల కధికారము సిద్ధించుట యెట్లు?" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౪౬౪. విశేషానుగ్రహశ్చ. ౩. ౪. ౩౭.

తాత్పర్యము:—పైసిద్ధాంతమున సంశయాస్పద మగువిషయ మింతయు లేదు. అవి గుఱుతులే యైనను వానినుండి యాసిద్ధాంతమును గ్రహింపనచ్చును. విధురాదులు బ్రహ్మవేత్తలని కదా శ్రుతిస్మృతుల యందు వర్ణింపఁబడి యున్నది. విచారించి చూచిన వారికి నాశ్రమకర్మలు మాత్రము లేవు కాని కర్మలు బొత్తుగ లేకపోవలేదు. దేవతారాధాన జపము ఉపవాసము మొదలగుసామాన్యకర్మలు అన్నివిధముల వారిచేతఁ గూడ నాచరింపఁబడఁదగినవి యగుటచే వారికినిఁ గలవు. ఈకారణమువలన బాగుగ విమర్శించినచో నాశ్రమకర్మాధికరణమున (సూ. ౩. ౪. ౩౨.) జేయఁబడినసిద్ధాంత ("ఆశ్రమకర్మలు విద్యాసాధనములు" అని చేయఁబడినసిద్ధాంత) ముపలక్షణార్థమే యనియుఁ గర్మసామాన్యమే విద్యాసాధన మగు ననియుఁ దెలుచున్నది. కావున నావిధురాదులును తమకున్న కర్మలచేతనే జ్ఞానవంతులు కావచ్చు నని చెప్పవలసి వచ్చుచున్నది. "జప్యేనైవ తు సంసిద్ధ్యే ద్బ్రాహ్మణో నాత్ర సంశయః కుర్యా దన్య న్న వా కుర్యా న్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే" "బ్రాహ్మణుఁడగువాఁడు మఱియొక దాని నాచరించినను ఆచరింపకున్నను కేవల జపముచేతనే సిద్ధి నొందును. మంత్రమే బ్రాహ్మణుఁడు" అని స్మృతియు నీవిషయమునే చెప్పుచున్నది. ఆశ్రమకర్మ నాచరించినను నాచరింపకున్నను కర్మమాత్ర ముండినచో జ్ఞానమున కధికారము కల దనుచున్నది.

మఱియు నీకర్మలు విద్యోత్పత్తికి సహాయకారులేకాని విద్యాఫల మగుమోక్షముయొక్క జన్మమునకుఁ గా వని పలుమాఱు చెప్పియున్నాము. అందును వానికి జ్ఞానముతో ప్రత్యక్షసంబంధము లే దనియు చిత్తశుద్ధిమూలమున జ్ఞానేచ్ఛను గలిగించు ననుటయే సంబంధ మనియు పలుమాఱు ప్రకటించియున్నాము. ఇట్లుండుటచేఁ బ్రకృతజన్మమున నాశ్ర

మము లేకున్నను ఆశ్రమకర్మల నాచరింపకున్నను పురుషునియందు జ్ఞానేచ్ఛ గానవచ్చెనేని యది పూర్వజన్మకర్మలచే వచ్చె ననియు యూహింతము. "అనేకజన్మ సంసిద్ధ స్తతో యాతి పరాం గతిం" "పురుషుఁడు అనేక జన్మములయందు సంపాదింపఁబడిన పుణ్యముయొక్క పరిపాకమువలన నప రోక్షజ్ఞానము కలిగి పరమపదమును జెందును" అని స్మృతియు నీవిషయ మును చెప్పుచున్నది. విద్యాఫల మగుమోక్షమునకుఁగూడ కర్మ సహాయము కావలసి యుండునేని యప్పుడు ఫలకాలమునందు కర్మలుండ వలయును గావున గర్మ లేనివాఁడు విద్యాధికారి కాకపోవలసి వచ్చును గాని యిచ్చట నట్లు లేదు. ఆశ్రమకర్మ లని చెప్పుటవలన సర్వకర్మలును గ్రహింపఁబడవలయు నని యిదివఱకే నిరూపించి యున్నాము; అట్లు గ్రహింపకున్నను ఈశ్రుతికి ("త మేతం" అనుశ్రుతికిఁ) బూర్వజన్మకర్మలు కూడ నర్థము కావచ్చు నని యిప్పుడు నిరూపించితిమి.

"ఇట్లు కాదు. ప్రస్తుతజన్మమున వేదాధ్యయనము నాచరింపని వానికిఁ గర్మాచరణమున నధికార మెట్లు లేదో, అట్లే ప్రస్తుతజన్మమున నాశ్రమ కర్మాచరణ మొనర్పనివానికి విద్యాధికారము లేకపోవచ్చును గదా!" అనియెదవేమో వినుము. కర్మఫలము ప్రత్యక్షము కాదు; అ విద్యానాశరూప మగుజ్ఞానఫలము ప్రత్యక్షము. ఈకారణమువలన దానికి నియమము కావలయును గాని జ్ఞానమునకు నక్కఱ లేదు. కర్మ లున్నను లేకున్నను జ్ఞానముకలుగఁగనే నజ్ఞానము నశించు ననుట ప్రత్యక్షమై యున్నది. స్వర్గాదిఫలములు అధ్యయనసహితము లగుకర్మలచేఁ గలుగునో లేక కేవలకర్మలచేఁ గూడఁ గలుగునో సందిగ్ధము కదా! కావున విద్యా విషయమున నిట్టినియమ మేమియు నక్కఱ లేదు. ఈకారణమువలన నన్ని తెఱంగులవారికిని విద్యలయం దధికారము కలదు.

## అ-౩. పా-౪. సూ-౩౯.

అవతారిక:—"ఇట్లయిన నాశ్రమములతోనే పని లేదు. బ్రహ్మ జ్ఞానమే కదా పరమపురుషార్థము. దానియం దెట్టివారికైన నధికారము కలదంటిరి. ఇక నాయాసకరము లగుచాశ్రమముల నవలంబింప నేటికి ?" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౪౬౫. అత స్త్వితర జ్జ్యాయో లింగా చ్చ.

### ౩. ౪. ౩౯.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుటవలన నాశ్రమనియమముల నను వర్తించుట యర్థ మని తలంపవలదు. అందఱకు నధికారము సమానమే యైనను అనాశ్రమిత్వమునకంటె నాశ్రమిత్వము మేలు. శ్రుతిస్మృతులయం దిట్లే చెప్పఁబడి యున్నది. "తే నైతి బ్రహ్మవి త్పుణ్యకృత్" అనాశ్రమీ న తిష్ఠేత దినమేకమపి ద్విజః సంవత్సర మనాశ్రమీ స్థిత్వా కృచ్ఛ్రమేకం చరేత్"="ఆశ్రమకర్మల నిర్వర్తించినవాఁడు (శీఘ్రముగ) పరబ్రహ్మమును జేరును. బ్రహ్మక్షత్రియవైశ్యులలో నొక్కఁడును ఆశ్రమరహితుఁడై యొక్కదినమైన నుండఁగూడదు. ఆశ్రమరహితుఁడై సంవత్సరకాల మున్నవాఁడు ఒక *కృచ్ఛ్రవ్రతము నాచరింపవలయును" అను మొదలగు వాక్యము లీవిషయమున ప్రమాణములు కావున నాశ్రమముల నవలంబింపవలయు ననుట ప్రతివానికి నావశ్యకమే. దైవవశమున భార్యాదినాశమువలన నొకవేళ నాశ్రమము లేకపోవుట సంభవించినను విద్యాధికారము మాత్రము నశింప దని యింతమాత్రము ఈయధికరణమున నిరూపింపఁబడెను.

---

* కృచ్ఛ్రవ్రతములు:—ప్రాజాపత్యకృచ్ఛ్ర మనియుం, తప్తకృచ్ఛ్ర మనియుం, సాంతపనకృచ్ఛ్ర మనియు, పారాకకృచ్ఛ్ర మనియుం కృచ్ఛ్రవ్రతములు నాల్గు విధములు. అందు ప్రాజాపత్యకృచ్ఛ్రమును పండ్రెండుదినములు ఆచరింపవలయును. మొదటిమూఁడుదినములు ప్రాతఃకాలమునందును తర్వాత మూఁడుదినములు సాయంకాలమునందును మాత్రమే భుజింపవలయును. తర్వాత మూఁడుదినములు స్వయముగ యాచింపకఁ బరులచేఁ బెట్టఁబడినప్పుడు మాత్రమే యన్నమును భుజింపవలయును. అప్పుడు దొరకినయెడల రెండుపూటలును భుజింపవచ్చును. తక్కిన మూఁడురోజులు నుపవాసముఁ జేయవలయును. ఇదియే ప్రాజాపత్య కృచ్ఛ్రవ్రతమునకు స్వరూపము. స్మృతులయందు కేవల కృచ్ఛ్రశబ్దము ప్రయోగింపఁబడినప్పు డీప్రాజాపత్యకృచ్ఛ్రమే గ్రహింపఁబడుచున్నది. కావున ప్రస్తుతమునఁ గూడ నట్లే గ్రహింపవలయును. తప్తకృచ్ఛ్రాదులస్వరూపము గ్రంథవిస్తరభయముచే వ్రాయమానితిని. స్మృతులలో నరయునది.

# ౧౦. తద్భూతాధికరణము.

విషయ, సంశయ, సంగతి, పూర్వపక్షములు:—(సూ. 3. ౪. ౧౯.) పరామర్శాధికరణమునందు వానప్రస్థసన్యాసాశ్రమములు కల వని నిరూపించి యున్నాము. వానినిఁగూర్చి యొకవిశేష మిందు విమర్శింపఁబడును. "పూర్వాధికరణమున నాశ్రమరహితులకుఁ గూడ విద్యాధికారము కల దని చెప్పియున్నారు కదా! ఇట్లుండ నాశ్రమస్థితులలో నెట్టివారికైన నాయధికారము కల దనుటలో సంశయము లేదు. స్వాశ్రమమునందే యున్నను అం దుండి భ్రంశము నొంది యాశ్రమాంతరము నంగీకరించి నను గూడ విద్యాధికార మున్నది యనిన నాక్షేపమేమి? ఉత్తమాశ్రమమును బొందినవారి కైనను కామాదిదోషములవలన గృహస్థాద్యాశ్రమములయం దభిమానము కలుగవచ్చు ననుటలో సంశయ మేమి ?" అని * కైముత్యన్యాయముచే వచ్చిన యాక్షేపము నిరాకరింపఁబడును. "సన్యాసాద్యుత్తమాశ్రమముల నాశ్రయించినవారు మఱల గృహస్థాద్యాశ్రమములకు వచ్చుట శాస్త్రసమ్మతమా? కాదా?" యనుసంశయము నివారింపఁబడును. "విచారించిన నాశ్రమమునుండి భ్రంశము నొందినవాని కర్మలుగూడ విద్యాసాధనములే కావలయును. అట్లు కాకున్న నాశ్రమములయం దాధిక్య మేమి ?" యనుట పూర్వపక్షఫలము. "ఆశ్రమభ్రంశమే మొట్టమొనట నప్రామాణిక మగుటచే నీయాక్షేపమునకే యవకాశము లేదు" అనుట సిద్ధాంతఫలము.

## అ-3. పా-౪. సూ-౪౦.

అవతారిక:—ఈసిద్ధాంతమును క్రిందిసూత్రముచే నిరాకరించుచున్నాఁడు.

## ౪౯౯. తద్భూతస్య తు నాతద్భావో జైమినేరపి నియమాతద్రూపాభావేభ్యః. 3. ౪. ౪౦.

* "ఈ (గొప్ప)పదార్థముయొక్క స్థితియే యిట్లుండ నిఁక నీ (యల్ప) పదార్థమునుగూర్చి చెప్ప నేల ?" యని యొకదానియందలి యనుపపత్తిచే మఱియొకదానియందలి యనుపపత్తిని భావించుట కైముత్యన్యాయము.

తాత్పర్యము:—ఉత్తమాశ్రమమును జెందినవాఁడు భ్రంశము నొందఁగూడదు. ఏలయనిన శ్రుతిస్మృతులు ఈవిషయమునే నియమించుచున్నవి. "అత్యంత మాత్మాన మాచార్యకులే౽వసాదయన్. అరణ్యమియా దితి పదం తతో న పున రేయా ది త్యుపనిషత్. ఆచార్యేణాభ్యనుజ్ఞాత శ్చతుర్ణా మేక మాశ్రమం, ఆవిమోక్షా చ్ఛరీరస్య సో౽నుతిష్ఠే ద్యథావిధి." = "ఆచార్యగృహమునందు పరిపూర్ణముగ నిలచి ఏకాంత ప్రదేశమునకుఁ బోవలయును. అటనుండి మఱలి రాఁగూడదు. గురువునొద్ద నాజ్ఞఁ గైకొని నాల్గాశ్రమములలో నేదియో యొకదానిఁ బరిగ్రహించి మరణకాలమువఱకు ధర్మపరుఁడై దాని నాశ్రయింపవలయును" అను మొదలగు వాక్యము లీవిషయమునఁ బ్రమాణములు. ఈకారణమువలన నాశ్రమభ్రంశము శ్రుతిస్మృతి విరుద్ధ మగును. మఱియు నెచ్చట జూచినను "బ్రహ్మచర్యం సమాప్య గృహీభవేత్. బ్రహ్మచర్యా దేవ ప్రవ్రజేత్. (చూ. 3. ౪. ౨౦.)" అని యారోహశ్రుతులే గానవచ్చుచున్నవి గాని యవరోహశ్రుతులు గానవచ్చుట లేదు. శిష్టాచారములఁ జూచినను ఇట్లే యున్నవి.

కావున నిర్వివాదముగ నాశ్రమప్రచ్యుతి యప్రామాణికము. "వెనుకటి యాశ్రమములయందలికర్మల నాచరింపవలయు నని కాని కామాదులవలనఁగాని యొకయాశ్రమమున నున్నవాఁడు మఱియొక యాశ్రమమునకు రావచ్చును" అనుట యుక్తము కాదు. "స్వధర్మో విగుణః శ్రేయా న్పరధర్మా త్స్వనుష్ఠితాత్" "ఎంతబాగుగ నాచరింపఁబడిన దైనను పరధర్మము నిర్గుణ మగుస్వధర్మమునకంటెఁగూడఁ దక్కువయే (ఈవాక్యము స్వధర్మపరిత్యాగమును నిషేధించు నర్థవాదముగాని మఱియొక్కటి కాదు)" అను మొదలగు వాక్యములవలన స్వధర్మపరిత్యాగ మయుక్తమై తెలియుచున్నది. మఱియు ధర్మాధర్మములప్రత్యక్షము లగుటచే వానినిగూర్చి పురుషులు విచారింపనేరరు. వేదముచేతనే యావిషయము ప్రతిపాదింపఁబడవలయును కావున నావేదమే యాశ్రమమున కేధర్మములను చెప్పునో అవియే వానికి నియతములగునుగాని (చేయుటకు)శక్యములైన వన్నియు(నియతములు) కానేరవు. శ్రుతినియమముండఁగాఁ బురుషుఁడు రాగాదివశగతుఁడై ప్రవర్తించుట దోషమని వేఱుగ జెప్ప నక్కఱ లేదు కదా! కావున నుత్తమాశ్రమమునుండి భ్రం

శమే సంభవింపదు; భ్రష్టునకుఁగూడ విద్యాధికారము కలుగు ననుసంశయ మక్కఱలేదు. వాఁ డధర్మాత్ముఁడు కదా! ఈసిద్ధాంతము వ్యాసునకే కాక జైమినిమహామునికిఁగూడ సమ్మతమే యని తెలిసికొనవలయును.

## ౧౧. అధికారికాధికరణము

విషయ సంశయ సంగతులు:—పూర్వాధికరణమునందు ఊర్ధ్వరేతస్కాశ్రములవారికి (సన్న్యాసికిని నైష్ఠికబ్రహ్మచారికిని వానప్రస్థులకును) స్వాశ్రమభ్రంశము శాస్త్రవిరుద్ధ మనియు నట్టి భ్రష్టులచేఁ జేయఁబడినకర్మలు విద్యాహేతువులు కానేరవనియుఁ జెప్పఁబడియున్నది. "అట్టి భ్రష్టులైనను ప్రాయశ్చిత్తవిధానముచే శుద్ధుఁడై మరల స్వాశ్రమనిష్ఠుఁడయ్యెనేని యధర్మము నశించిపోవుటచే వానికర్మము విద్యాంగములు కావచ్చును." అని యీయధికరణమున నిరూపింపఁబడును. ఇదియే యీరెండధికరణములకును గలసంబంధము. కావున "నైష్ఠికబ్రహ్మచారికి ప్రమాదవశమున భ్రంశము కలిగినఁ బ్రాయశ్చిత్తము కలదా? లేదా?" అనుసంశయ మీయధికరణమున నివారింపఁబడును.

### అ-3. పా-ర. సూ-రగ.

అవతారిక:—ఈవిషయమును విచారించుటకై మొట్టమొదట బూర్వపక్షము ననువాదము చేయుచున్నాఁడు.

## రౌ౭. న చాధికారిక మపి పతనానుమానాత్తద యోగాత్. 3. ర. రగ.

తాత్పర్యము: పూర్వమీమాంసాశాస్త్రమునందు "అవకీర్ణి పశుశ్చ తద్వ దాధాన స్యాప్రాప్తకాలత్వాత్" "భ్రంశము నొందిన నైష్ఠిక బ్రహ్మచారి ప్రాయశ్చిత్తార్థమై తనపశువును లౌకికాగ్నియందే హోమము చేయవలయును. భార్య యుండిననేగాని యాధానము చేయుటకు వీలు లేదు కదా! కావున నుపనయనమునందువలెనే ప్రాయశ్చిత్త సమ

యమునందును బ్రహ్మచారికి లౌకికాగ్నియందే హోమము విధింపఁబడెను." అనుసూత్రముచే భ్రష్టుఁడైన (నైష్ఠిక) బ్రహ్మచారికి ప్రాయశ్చిత్తార్థమై పశువు కలదనియు తద్ధోమము లౌకికాగ్నియందే చేయఁబడవలయు ననియు నిర్ణయింపఁబడి యున్నది. శ్రుతియందును "బ్రహ్మచార్యవకీర్ణి నైరృతం గర్దభ మాలభేత్" "భ్రంశము నొందిన బ్రహ్మచారి నైరృతు నుద్దేశించి గర్దభ పశువును హోమము చేయవలయును." అని ప్రాయశ్చిత్తవిధి యొకటి గానవచ్చుచున్నది. ఇది నైష్ఠికబ్రహ్మచారి విషయమే యగునేమో యని సంశయము తోఁచవచ్చును గాని యట్లు నిర్ణయించుటకుమాత్రము వీలులేదు. "ఆరూఢో నైష్ఠికం ధర్మం య స్తు ప్రచ్యవతే పునః ప్రాయశ్చిత్తం న పశ్యామి యేన శుద్ధ్యేత్స ఆత్మహా" "ఏ పురుషుఁడు నైష్ఠికధర్మము నాశ్రయించి మరల భ్రంశము నొందునో ఆయాత్మఘాతకునకు పరిశుద్ధి కలుగ వలయు ననిన ప్రాయశ్చిత్తమే లేదు" అని స్మృతివాక్య మొక్కటి కలదు. ఇది మూలశ్రుతి లేక సంభవింపదు కావున ననుమానముచే నిట్టిశ్రుతిని కల్పింపవలసియున్నది. ఈకారణము వలన పైనుదహరింపఁబడిన శ్రుతి సామాన్య బ్రహ్మచారివిషయమే యగును గాని నైష్ఠిక బ్రహ్మచారివిషయము కానేర దనుట స్పష్టమగుచున్నది. ఈకారణమువలన శిరఃపాతమున కెట్లు ప్రతిక్రియ లేదో యట్లే నైష్ఠికబ్రహ్మచారిపాతమునకు కూడ ప్రతిక్రియ లే దనియే చెప్పవలయును. ఇట్లగుటచే నూర్ధ్వరేతస్కాశ్రమములవారు ప్రమాదము వలన భ్రష్టు లైనచో వారికి నెట్లును సద్గతి దొరక దనుటయే సిద్ధాంతము.

## అ_౩. పా_౪. సూ_౪౨.

అవతారిక:—ఇట్లు పూర్వపక్షము ననువాదముచేసి సిద్ధాంతముఁ జేయుచున్నాఁడు.

## ౪౬౭. ఉపపూర్వ మపి త్వేకే భావ మశనవ త్తదుక్తం. ౩. ౪. ౪౨.

తాత్పర్యము:—ఇట్లు కాదు. నైష్ఠిక బ్రహ్మచారికి గురుభార్యాదివ్యతిరిక్తస్థలములందు గలుగు బ్రహ్మచర్యభ్రంశము మహాపాపములలో

గణింపఁబడలేదనియు, యీకారణమువలన నది యుపపాతకమే యనియుఁ గొందఱాచార్యు లభిప్రాయపడుచున్నారు. మహాపాపమైనచో నది ప్రాయశ్చిత్తమునకు నశింపదుగాని యుపపాతకమునకు నట్టిస్థితి లేదనియు నిట్లగుటచే సామాన్యబ్రహ్మచారితోపాటు నైష్ఠిక బ్రహ్మచారికి కూడఁ బ్రాయశ్చిత్తముఁ గలదనియు నంగీకరించుచున్నారు. ఈయిరువురకును (సామాన్య నైష్ఠిక బ్రహ్మచారులకు నిరువురకును) బ్రహ్మచారిత్వంబును భ్రష్టత్వంబును సమానమే కదా! యని హేతువును జూపుచున్నారు. బ్రహ్మచారికి మధుమాంసాహారమువలన వ్రతలోపంబును దానికి బ్రాయశ్చిత్తంబు నున్నట్లును ఆప్రాయశ్చిత్త మిరువురు బ్రహ్మచారులకును సమానమే యైనట్లును ప్రస్తుతప్రాయశ్చిత్తము కూడఁ గావచ్చునని దృష్టాంతమును చూపుచున్నారు. కావున వీరిసిద్ధాంతము ననుసరించుటయే యుక్తము.

స్మృతిప్రసిద్ధి దీనికి విరుద్ధముగా నున్నను పరిగ్రహింపఁబడుటకు వీలు కానిదై యున్నది. దానికి మూలశ్రుతి లేదు; అనుమానముచేఁ గల్పింపఁబడుటకును వీలు లేదు. ఏల యనిన స్మృతియందు "నైష్ఠిక బ్రహ్మచారికి ప్రాయశ్చిత్తము లేదు" అని ప్రత్యక్షముగఁ జెప్పఁబడి యుండలేదు; "నైష్ఠిక బ్రహ్మచారికి ప్రాయశ్చిత్తము కల దని కానము" అని మాత్రమే చెప్పఁబడి యున్నది. ఇట్లగుటచే "కానము" అనుపదమును బట్టి "యీస్మృతి నిషేధపరము" అని కల్పింపవలసి యున్నది; ఇట్లు కల్పించినపిదప "దీనికి మూలభూత యగుశ్రుతి యుండి తీరవలయును." అని యనుమానము చేయవలసి యున్నది. ఇట్టైన నీయనుమానమునకు ప్రబలాధారమే యుండదు కదా! కావున నిదియు దీనివలన సిద్ధించు మూలశ్రుతియు దాని నాధారముగఁ గైకొని ప్రవర్తించు స్మృతియు నిర్మూలము లగును. కావున ప్రాయశ్చిత్తాభావపక్షము దృఢముగ లేదు. తద్భావపక్ష ("నైష్ఠిక బ్రహ్మచారికి బ్రాయశ్చిత్తము కలదు" అనుపక్ష) మన్ననో దృఢమై యున్నది. "బ్రహ్మచా ర్యవకీర్ణీ" అను సామాన్యశ్రుతి యీపక్షమునకు నాధారముగ నున్నది. ఆశ్రుతి బ్రహ్మచారి యని మాత్రమే చెప్పినదికాని "సామాన్యబ్రహ్మచారి నైష్ఠిక బ్రహ్మచారి కాఁడు" అని విశేషించి చెప్పలేదు కదా! కావున నీభావపక్షము నంగీకరించుటయే యుక్తియుక్తము. "శాస్త్రస్థా వా తన్నిమిత్త

త్వాత్" "ఆచార్యులకు పరస్పరము అభిప్రాయభేదము కలిగినప్పుడు శాస్త్రమున కనుకూలమగుదానిని మాత్రమే గ్రహింపవలయును. శాస్త్రమే కదా ప్రధానము" అని పూర్వమీమాంసయం దున్నది. ఇట్లే ప్రస్తుతాధికరణమునందును సిద్ధాంతముఁ జేయవలయును. భావాభావపక్షములకు విరోధము వచ్చెను కావునను శ్రుతి భావపక్షమునకే యనుకూలముగనున్నది కావునను దానినే సిద్ధాంతము చేయవలయును.

విశేషాంశము:—ఈవిధముగ నైష్ఠిక బ్రహ్మచారినిగూర్చి సిద్ధాంతము చేయఁబడెను. ఇట్లే వానప్రస్థసన్యాసుల విషయముకూడ నూహింపవలయును. వారికిని ప్రమాదమువలన స్వాశ్రమములనుండి భ్రంశము కలిగినప్పుడు శ్రుతియందు ప్రాయశ్చిత్తము చెప్పఁబడి యున్నది. "వానప్రస్థో దీక్షాభేదే కృచ్ఛ్రం ద్వాదశరాత్రం చరిత్వా...భిక్షుర్వానప్రస్థవ త్సోమవల్లీవర్జం స్వశాస్త్రసంస్కారశ్చ" "తనదీక్ష లోపము నొందెనేని వానప్రస్థుఁడు పండ్రెండు దినము లాచరింపఁదగిన కృచ్ఛ్రవ్రతము నాచరించి...సన్యాసియు వానప్రస్థునివలెనే వ్రతముచేసి సోమవల్లీ వర్జముగ స్వశాస్త్రవిహిత సంస్కారముగ నాచరించుకొనవలయును" అను వాక్యము లీవిషయమునఁ బ్రమాణములు. వీరివిషయమున సంశయమునకే హేతువు లేదు. కావున నూర్ధ్వరేతస్కాశ్రమములవారికి ప్రమాదవశమున భ్రంశము కలిగినను అంతమాత్రమున విద్యాధికారము గాని తత్సిద్ధిగాని లేకపోవ నక్కఱ లేదు.

---

## ౧౨. బహిరధికరణము

విషయ, సంగతి, సంశయ, పూర్వపక్షములు:—ఈయధికరణమునకును ఆశ్రమభ్రంశమే విషయము. ఆశ్రమభ్రష్టులకు ప్రాయశ్చిత్తము కల దని పూర్వాధికరణమున సిద్ధాంత మగుటచే "ఆట్టివారితోఁ గూడ వ్యవహరింపవచ్చునా? లేదా?" అనుసంశయము కలుగును. ఇది యిందు నిరాకరింపఁబడును. "దోష మున్నవానితోఁ గూడ వ్యవహరించుట యుక్తము కాదు కాని నిర్దోషితో వ్యవహరించిన నేమి? ఆశ్రమభ్రష్టుఁడు దోషయుక్తుఁడే యైనను ప్రాయశ్చిత్తము వలన వానిదోషము పోయినది. పోకున్నఁ బ్రాయశ్చిత్త మేటికి?

క్షీణములగు ప్రాయశ్చిత్తము జరగినపిదప వారితో నిర్వివాదముగ వ్యవహరింపవచ్చును" అని యాక్షేపసంగతితో వచ్చినపూర్వపక్షము ఖండింపఁబడును. "ఇట్లు ఆశ్రమభ్రష్టులతోఁ గూడ సంసర్గ యంగీకరింపఁబడినచో వారితోఁ గలసి చేయఁబడు వేదాంతశ్రవణాదులు విద్యాసాధనము లగును" అనుపక్షము ఖండింపఁబడును.

---

## ౪౬౮. బహిస్తూభయథాపి స్మృతేరాచారాచ్చ. 3. 4. 43.

తాత్పర్యము:—ఇట్లు కాదు. యోగారూఢులై భ్రంశము నొందినవారు చేసినపాపము మహాపాప మయినను కాకున్నను గూడ వారితో శిష్టులు వ్యవహరింపఁగూడదు. పాపము పురుషులకు ద్వివిధమగు నపారిశుద్ధ్యమును గలిగించును. ఇహపరలోకములకు సంబంధించిన రెండపారిశుద్ధ్యములను కలిగించును. ఆపాపంబులును రెండువిధములై యుండును. కొన్నిపాపములు ప్రాయశ్చిత్తముచే నశింపఁగానే పైచెప్పిన రెండపారిశుద్ధ్యములును తొలఁగును; మఱికొన్ని నశించినప్పుడు పరలోకమునకు సంబంధించిన యపారిశుద్ధ్యము మాత్రమే తొలంగును. స్త్రీహత్య బాలహత్య మొదలగునవి చేసినవారలకుపలె నిహలోకాశుద్ధి మాత్రము ప్రాయశ్చిత్తములచే నెన్నటికిని తొలఁగింపఁబడదు. ఇదియే పాపములవలనఁ గలుగు నపూర్వము. "బాలఘ్నాంశ్చ కృతఘ్నాంశ్చ విశుద్ధానపి ధర్మతః, శరణాగతహంతౄంశ్చ స్త్రీహంతౄంశ్చ న సంవసేత్" "బాలహత్య చేసినవారును, చేసినమేలు మఱచినవారును, శరణాగతుల చెఱచినవారును, స్త్రీలను సంహరించినవారును క్రమ మగుప్రాయశ్చిత్తముచే పరిశుద్ధులైనను కులములోనికిఁ జేర్చికొనఁదగరు." అను మొదలగుస్మృతివాక్యము లీవిషయమునఁ బ్రమాణములు. ఇట్టియ ప్రత్యక్షవిషయము లన్నియు శబ్దప్రమాణము నాశ్రయించి గ్రహింపఁబడవలసినవియే కదా! యుక్తిచేత విచారించినను శాస్త్రమునందలి విశ్వాసముచే నొకవేళ నిర్దోషత్వమును గూర్చినవిశ్వాస మున్నను బాలఘాతుకాదులకు ప్రపంచమునందలి దూష్యత్వము పోవదు కదా! కావున నిక్కే ప్రకృతమునందును స్మృత్యాచారముల బలమువలన నాశ్రమభ్రష్టులకుఁ

గూడఁ బరలోకాశుద్ధి తొలఁగినను యిహలోకాశుద్ధి తొలఁగ దనియే నిర్ణయింపవలయును. "ఆరూఢో నైష్ఠికం ధర్మం......ఆత్మహా (చూ. 3. ౪. ౪౧.) ఆరూఢ పతితం విప్రం మండలా చ్చ వినిః సృతం, ఉద్బద్ధం కృమిదష్టం చ స్పృష్ట్వా చాంద్రాయణం చరేత్" "ఉత్తమాశ్రమము నుండి భ్రంశము నొందినట్టిగాని తనసంఘమును విడిచి పరజాతిలో కూడి నట్టిగాని ఉరివేసికొనినట్టిగాని వేయఁబడినట్టిగాని పురుగులచే (గాయము నందు పడినపురుగులచే) కలుగఁబడినట్టిగాని బ్రాహ్మణుని స్పృశించినఁ * చాంద్రాయణ వ్రతము నాచరింపవలయును." అను మొదలగు స్మృతు లీవిషయమునఁ బ్రమాణములై యున్నవి. శిష్టాచారము నిట్లే యున్నది. వా రాశ్రమభ్రంశము నొందినవారితో సహవాసము చేయుట లేదు. ఈకారణమువలన నాశ్రమభ్రష్టులకు ప్రాయశ్చిత్తానంతరమునఁ గూడ సంసర్గాధికారము లేదు ; వారలతోఁ గూడి చేయఁబడిన శ్రవణాదులు విద్యాసాధనములు కానేరవు.

---

## ౧౩. స్వామ్యధికరణము.

విషయసంశయములు:—అధికారి ప్రస్తావమువలన కర్మాంగోపాస నల యధికారులను గూర్చి యిందు విచారింపఁబడుచున్నది. "ఈకర్మాంగో పాసనల నాచరింపవలసినవాఁడు ఋత్విజుఁడా? లేక యజమానుఁడా?" అనుసంశయము నివారింపఁబడును. "దానికి నధికారి ఋత్విజుఁడే" అను విషయము నిర్ధారణ చేయఁబడును.

---

* చాంద్రాయణవ్రతము:—కోడిగ్రుడ్డంత ప్రమాణముగల యన్నపు ముద్ద లను శుక్లపక్ష పాడ్యమి యారంభించి యొక్కొక్కటిగ నభివృద్ధిచేయుచు పూర్ణిమ నాటికి పదునైదుముద్దల నొక్కపూటమాత్రమే భుజింపవలయును. మరల కృష్ణపా డ్యమి మొదలొక్కొక్క ముద్దనుగా తగ్గించుచు నమావాస్యనాడుమాత్ర మేమియు భుజింపఁగూడదు. ఇదియే చాంద్రాయణ వ్రతస్వరూపము.

## అ-౩. పా-౪. సూ-౪౪.

అవతారిక:— ఈ అధికరణమునకై "పూర్వాధికరణమునందు 'ఎవ్వనికి ప్రాయశ్చిత్తము జరిగెనో వానితోఁ గూడ వ్యవహారము జరుపవచ్చును' అను సామాన్యశాస్త్రమునకు 'ఆరూఢపతితం' అను మొదలగు నిందా స్మృతులవలన బాధ కలుగు నని చెప్పఁబడి యున్నది. ఆ బాధ నాశ్రయించియే సిద్ధాంతము కూడఁ గావింపఁబడి యున్నది. అట్లే యిచ్చటఁ గూడఁ జేయవలయును. 'అంగానుష్ఠానము నాచరించువాఁడే తదాశ్రితోపాసన నాచరింపవలయు' ననుట సామాన్యశాస్త్రము. ఫల ముపాసకునకే కలుగు నని యుద్గీథవిద్యయందు చెప్పఁబడియున్నది. ఈ రెంటికిని విరోధము గావున పరస్పరము బాధ్యబాధకభావము కలుగును; పూర్వాధికరణమునందువలెనే యిచ్చటఁగూడ ఫలశ్రుతి సామాన్యశ్రుతిని బాధించును' అనియే సిద్ధాంతము చేయవలయును." అని దృష్టాంతసంగతితో వచ్చు పూర్వపక్షము ననువాదము చేయుచున్నాఁడు.

---

## ౪౭౦. స్వామినః ఫలశ్రుతే రిత్యాత్రేయః.

### ౩. ౪. ౪౪.

తాత్పర్యము :— ఈ యుపాసనలయందు యజమానునికే యధికార మున్నట్లు గానవచ్చుచున్నది. శ్రుతియందు "వర్షతి హాస్మై" "వర్షమునందు సామభాగముల నుపాసించువానికి సకాలవృష్టి కురియును." అని యుపాసన యొనర్చువానికే ఫలము చెప్పఁబడి యున్నది. ఆ ఫలము కర్మకర్త యగు యజమానునకే కలుగవలయు ననుట న్యాయసిద్ధము. కర్మవలన గలుగు సర్వఫలముల ననుభవించుటకయ్యే కదా యజమానుఁడా కర్మ నాచరించుచున్నాఁడు. ఇట్లుండ నందుఁ గొంతఫలము ఋత్విజులకుఁ బోవు ననిన నది యెట్లు సరి యగును. ఫలానుభవయోగ్యత గల వానికేఁ గాని కర్మయం దధికారము కలుగ దనుట సుప్రసిద్ధము. ఇట్టి యోగ్యత ఋత్విజులకు సంభవింపదు కదా! (వారికిని) యింద్రియ పటుత్వాదు లున్నను వారు ధనమాత్రార్థులై పరార్థముగ యాజనమును చేయుచున్నారుగదా! ఈ కారణమువలనఁ గర్మఫలములు లేశమైనను

వారలకు వచ్చు ననుటకు వీలు లేదు. అధికారినిఁ గూర్చియే కదా సర్వమును విధింపఁబడును. అధికారియు ఫలానుభవముఁగలయజమానుఁడే యని మున్నే వివరించి యున్నాము. కావున నీకర్మాంగోపాసనల యజమానుఁడే యాచరింపవలయును. "'ఆత్మనేవా యజమానాయ వా యం కామం కామయతే త మాగాయతి' 'ఋత్విజుఁడు తనకైగాని యజమానునకైగాని యేదినైన నొకకోర్కెను కోరెనేని దానిని దానము చేయును.' అను మొదలగు వాక్యములనుబట్టి చూచిన ఋత్విజునకుఁ గూడ కర్మఫలము వచ్చు నని చెప్పఁబడి యున్నది." అనియెదవేమొ. వేదవాక్యము రాజాజ్ఞవంటిది కావున నట్లు చెప్పఁబడియున్నచోట మాత్రము అట్లే కలుగవచ్చును గాని దాని నాశ్రయించి సర్వస్థలముల యందు నట్లే వచ్చు నని నిర్ణయింపఁబూనుట యుక్తముకానేరదు. కావున నంగసహిత మగుకర్మకు నెవ్వఁడు కర్తయో వాఁడే యుపాసనలకుఁ గూడఁ గర్త. ఇది యాత్రేయమహామునియొక్క యభిప్రాయము.

## అ-౩. పా-౪. సూ-౪౫.

అవతారిక:—ఇట్లు పూర్వపక్షమతము ననువాదముచేసి యౌడులోమిమతముచే సిద్ధాంతముఁ జేయుచున్నాఁడు.

## ౪౭౧. ఆర్త్విజ్య మిత్యౌడులోమి స్తస్మై హి పరిక్రియతే. ౩. ౪. ౪౫.

తాత్పర్యము :—ఇట్లు చెప్పుట సరికాదు. ఈయంగాశ్రితోపాసనలకు ఋత్విజులే కర్త లని యౌడులోమిమహాముని యభిప్రాయపడుచున్నాఁడు. ఏల యనిన:—శ్రుతియందు "తం హ బకోదాల్భ్య విదాంచకార సహ నైమిశీయానా ముద్గాతా బభూవ" "దాల్భ్యుని పుత్త్రుఁ డగుమహర్షి యీయుద్గీథవిద్య నుపాసించెను. ఆతఁడు నైమిశారణ్యమున క్రతువుల నాచరించుశౌనకశౌనకాదులకు నుద్గాత యయ్యెను." అని యొకయుపాఖ్యానము వర్ణింపఁబడి యున్నది. దీనిని విమర్శించిన చో నుద్గాతయే యుద్గీథోపాసనకుఁ గర్త యని తేలుచున్నది. బలవత్తర ప్రమాణములేక యీశ్రుతిని బాధించుటకు వీలు లేదు. కర్మఫలమంతయు

యజమానునకే సంబంధించునదియు నగువిషయమునకుఁగూడ నీసిద్ధాంతము విరుద్ధము కానేరదు. ఆయజమానుఁడు తనకొఱకై కర్మను సాంగోపాంగముగ నిర్వర్తించుటకే గదా విశేషదక్షిణనొసంగి ఋత్విజు నేర్పఱచుకొని యున్నాఁడు. ఇట్లుండ నుపాసనను స్వయముగనే యాచరించినను ఆఋత్విజునకు హానిఫల మెట్లు వచ్చును? ఈకారణమువలన శ్రుత్యనుసారముగ నుపాసనాకర్త ఋత్విజుఁడనియే యంగీకరింప వచ్చును. మీ రన్నట్లు వచనపూర్వకముగ విధింపఁబడిన స్థలమునందే కదా ఋత్విజునకు ఫల ప్రాప్తి. కావున "ఉపాసనలకు యజమానుఁడే కర్త కావలయును" అని పట్టుపట్ట నక్కఱలేదు.

## ౪౭. శ్రుతేశ్చ. 3. ౪. ౪౬.

తాత్పర్యము:—మఱియు "యాం వై కాంచన యజ్ఞ ఋత్విజ ఆశిష మాశాసత ఇతి యజమానా యైవ తా మాశాసతే," "ఋత్విజులు యజ్ఞమునందు డేయేకామమను నర్థింతురో దాని నెల్ల యజమానున కయ్యే యర్థింతురు" అని శ్రుతియందు ఋత్విగ్యజమాన సంబంధంబును యజ్ఞఫలప్రాప్తి ప్రకారంబును స్పష్టముగనే వర్ణింపఁబడి యున్నది. ఈ కారణమువలన నుపాసనలు ఋత్విక్కర్మ లైనను తత్ఫలములు నిర్వివాదముగ యజమానునే చెందు ననుట స్పష్ట మగుచున్నది. కావున నుపాసనలు నిర్వివాదముగ ఋత్విక్కర్మ లే.

## ౧౪. సహకార్యంతరవిధ్యధికరణము

విషయ సంశయములు:— బృహదారణ్యకోపనిషత్తునందు "తస్మాద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేద్బాల్యం చ పాండిత్యం చ నిర్విద్యాథ ముని రమౌనం చ మౌనం చ నిర్విద్యాథ బ్రాహ్మణః" "పరబ్రహ్మము నెఱింగినవారలు సర్వేషణారహితు లై పరమసుఖము నొందుదురు కావున బ్రాహ్మణుఁ డగువాఁడు (బ్రహ్మనెఱుంగఁగోరువాఁడు) మొట్టమొదట శాస్త్రార్థజ్ఞానమును సంపాదింపవలయును. పిదప నాజ్ఞానము దృఢపడుటకై యుక్తులతో మననము నాచరింపవలయును.

పిదప మౌనరూప మగునిదిధ్యాసనమును గావింపవలయును. అప్పుడు బ్రహ్మవేత్త యగును" అని యొకవాక్యము కలదు. ఈవాక్యము నిదిధ్యాసనమును విధించు ననుట సిద్ధాంతిపక్షము. ఈపక్ష మీయధికరణమున దృఢము చేయఁబడును. "ఇచ్చట నిదిధ్యాసనవిధి కలదా? లేదా?" యనుసంశయము నిరాకరింపఁబడును.

సంగతి పూర్వపక్షము:—విచారించిన నిచ్చట నిదిధ్యాసనవిధి లేదని తోఁచుచున్నది. విధివిభక్తి యెచ్చట గానఁబడునో యచ్చటనే విధిని గ్రహించుట యుక్తము. ఈవాక్యమునందు "బాల్యేన తిష్ఠాసేత్" అను స్థలమున మాత్రమే విధివిభక్తి గానవచ్చుచున్నది. కాని మౌనసన్నిధానమునందు లేదు. "ఇట్లయిన జ్ఞానాంగములలో ప్రసిద్ధ మగుమౌన మేవిధి నుండి గ్రహింపఁబడవలయును?" అనియెదవేమొ వినుము. పండితమునిశబ్దములు రెండును జ్ఞానార్థములే యగుటచే "పాండిత్యం నిర్విద్య" అనుట చేతనే మౌనవిధి సంభవించును. ఇట్లు కాకున్నను "గార్హస్థ్య మాచార్యకులం మౌనం వానప్రస్థం" "గృహస్థాశ్రమము బ్రహ్మచర్యము సన్న్యాసము (ఇదియే నిదిధ్యాసనము) వానప్రస్థము" అనుస్థలమున మౌనము విధింపఁబడియే యున్నది. కావున ప్రస్తుతవిషయవాక్యమునందలి మునిశబ్దము ఈరెండుస్థలములలో నెచ్చటనుండి యైనను మౌనమును బరామర్శింపవచ్చును; స్తోత్రార్థమై యనువాదము చేయవచ్చును. "మౌనం చామౌనం చ నిర్విద్యాథ బ్రాహ్మణః" అనువాక్యశేషమున నెట్లు బ్రాహ్మణత్వవిధి లేదో అట్లే యిచ్చటను మునిత్వవిధి లేదు. పూర్వాధికరణమునందును, "తం హ బకో" అనుస్థలమున "సహ నైమిశీయానా ముద్గాతా బభూవ" అనువాక్యశేషము నవలంబించి "ఉపాసనలు ఋత్విజుల కార్యములే" యని సిద్ధాంతము చేసినట్లు ఇచ్చటను సిద్ధాంతము చేయవచ్చును. విధిమాత్రము బాల్యమును (మననమును) గూర్చి నదియే.

---

## అ-3. పా-4. సూ-4౭.

అవతారిక:—ఇట్లు దృష్టాంతసంగతితో వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౪౭౩. సహకార్యంతరవిధిః పక్షేణ తృతీయం తద్వతో విధ్యాదివత్. ౩. ౪. ౪౭.

తాత్పర్యము:— ఈపూర్వపక్షము యుక్తము కాదు. ఈవాక్యము నందు శ్రవణమననములతోఁబాటు నిదిధ్యాసనము కూడ మౌనశబ్ద ముచే లేక మునిశబ్దముచే విధింపఁబడియే యున్నది. ఇది క్రొత్తవిష యము; జ్ఞానాంగములలో ముఖ్యము. పాండిత్యమునుగూర్చి చెప్పు నప్పుడు గాని "గార్హస్థ్య మాచార్యకులం మౌనం" అనుస్థలమునందు గాని యీనిదిధ్యాసనము విధింపఁబడలేదు. పాండిత్య మనఁగా సామాన్య జ్ఞానము; మౌన మనఁగా జ్ఞానఫలప్రాయ మగుధ్యానము. ఇట్లగుటచే పం డితమునిపదములు పర్యాయనామములు కావు. ఇట్లుండ పాండిత్యవిధిచే మౌనవిధి యెటనుండి వచ్చును? "మననా న్మునిః" "మననము చేసి సిద్ధి నొందినవాఁడు ముని" అని పండితశబ్దవ్యుత్పత్తికంటె భిన్నముగ ముని శబ్దవ్యుత్పత్తి కలదు. "మునీనా మప్యహం వ్యాసః" "మననము వలన సిద్ధిఁజెందినవారలలో నేను వ్యాసుఁడను" అను మొదలగు ప్రయోగ ములు నీభేదమునే బోధించుచున్నవి. మఱియు "గార్హస్థ్యం" అను మొదలగుశ్రుతియందును మునిశబ్దము కేవలసన్యాసిపరముగాఁ బ్రయో గింపఁబడె ననుటకు వీలు లేదు; సన్యాస విధియే మౌనవిధి యనియు దానివలన నచ్చటివిధినే ప్రస్తుతమునిశబ్దము పరామర్శించె ననియుఁ జెప్పుటకు వీలు లేదు. "వాల్మీకి ర్మునిపుంగవః" "వాల్మీకి మునిశ్రేష్ఠుఁడు" అని వానప్రస్థునియందును మునిశబ్దము ప్రయోగింపఁబడి యుండు టచే నీవాదము నిర్మూల మైనది. "ఇట్లయిన 'గార్హస్థ్యం' అను శ్రుతి యందు మౌనశబ్దమునకు సన్యాసాశ్రమ మని యర్థ మెట్లు చెప్పితిరి?" అనియెదవేమొ వినుము. అచ్చట నాశ్రమప్రస్తావముండుటచే జ్ఞానప్రధాన మనుకారణమువలన లక్షణావృత్తిచే నట్లు చెప్పఁబడెను గాని యది పదా ర్థము కాదు. మఱియు నచ్చట "గార్హస్థ్యం" అని ప్రత్యక్షముగనే గృహస్థాశ్రమంబును, "ఆచార్యకులం" అని విస్పష్టలింగముతో బ్రహ్మ చర్యాశ్రమంబును, "వానప్రస్థం" అని స్వవాచకశబ్దముతోనే వాన ప్రస్థాశ్రమంబును వర్ణింపఁబడి యున్నవి. ఇట్లగుటచే మౌనపదంబును

నాల్గవది యగుసన్న్యాసాశ్రమంబును మిగిలెను కావున వానికి రెంటికి నెట్లో యొకట్లు సంబంధము కుదుర్పవలసి వచ్చినది. మౌనము జ్ఞానాధిక్యస్వరూపము కావున యతియు జ్ఞానప్రధానుఁడు కావునను లక్షణావృత్తిచే నా మౌనపదమునకు యత్యాశ్రమ యర్థముగఁ జెప్పఁబడెను. ఇంతయే గాని యది మౌనశబ్దమునకు నర్థము కాదు. కావున పాండిత్యబాల్యమునకంటె (శ్రవణమననములకంటె) నధికముగ మూఁడవది యగునీనిదిధ్యాసనము విధింపఁబడె ననియే యవశ్య మంగీకరింపవలయును. ఇది యపూర్వ మని పై నిరూపణచే తేలెను కదా!

ఇట్లు కాక ఒకవేళ విధిని బాల్యమునందే జ్ఞానబలరూప మగుదున నమునందే యంగీకరించినను "మననా మునిః" అను వ్యుత్పత్తిచే తత్ఫల రూప మగుమౌనమునందును విధి నవశ్య మంగీకరింపవలయును. ముని పదమునొద్ద విధివిభక్తి ప్రత్యక్షముగ లేకున్నను "స్యాత్" అను క్రియ నధ్యాహారము చేసికొనవచ్చును కదా! ఇదియునుగాక "మౌనంచా మౌనంచ నిర్విద్య" అని మౌనమునుఁగూడ ప్రాప్తవ్యమునుగాఁ జెప్పియుండుటచేఁ గూడ నీవిషయమే నిర్ణీత మగుచున్నది. కావున నెట్లును ఈవాక్యమునందు జ్ఞానాంగముగ నిదిధ్యాసనము విధింపఁబడె ననియే యంగీకరింపవలయును. జ్ఞానాతిశయరూప మగుటచే నిది బ్రహ్మజ్ఞానమునకు నంతరంగ సాధనములలో ముఖ్యము.

ఇదియు బ్రహ్మజ్ఞానవంతుఁ డగుసన్న్యాసినిఁ గూర్చి విధింపఁబడు చున్నది. "ఇచ్చట విద్యావంతుఁ డని మాత్రమే చెప్పఁబడి యున్నది కాని సన్న్యాసి యని చెప్పఁబడలేదు కదా!" అనియెదవేమొ ఆవిషయ మార్థికముగ సిద్ధించుచున్నది. బ్రహ్మనిష్ఠుఁడై యుండుటకు సంపూర్ణావకాశము కలవాఁ డగుటచే సన్న్యాసికే బ్రహ్మవిద్యాధికారము కలదని పరామర్శాధికరణమునందే (౩. ౪. ౧౮.) సిద్ధాంతము చేసి యున్నాము కదా! అందును శ్రవణమననము లన్నియాశ్రమములవారికిని సంభవించినను సర్వసంకల్పత్యాగరూపమగు నిదిధ్యాసనము మాత్రము సన్న్యాసికి తప్ప మఱియొక్కనికి సంభవించుటకు వీలు లేదు. కావున నీవిధి సన్న్యాసిని గూర్చినదియే. "ఆత్మానం విదిత్వా పుత్రాద్యేషణాభ్యో వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి" "ఆత్మస్వరూపమును తెలిసికొని లేక బ్రహ్మవిద్యచే నుపాసించి పుత్రాదివాంఛలను వదలి భిక్షాచర్యము నాచరింతురు." అని శ్రుతి

యందును ఈయర్థమును స్పష్టముగనే చెప్పఁబడియున్నది. ఆత్మవిద్యకు సన్న్యాసియే యధికారి యని వర్ణింపఁబడి యున్నది. "భిక్షాచర్యం చరంతి" అనుభాగముచే సన్న్యాసాశ్రమధర్మము స్పష్టముగనే చెప్పఁబడి యున్నది కదా! కావున నీవిధి సన్న్యాసినిఁ గూర్చినదియే. ఇంతమాత్రమువలన గృహస్థాదులు వేదాంతవాక్యములను వినుటకైన నర్హులు కారని యర్థము చేయకూడదు. "బ్రహ్మ కించి ద్విచారయేత్" "విశ్రాంతిసమయమున గృహస్థుడు పరబ్రహ్మవిచారమును గావింపవలయును." అని స్మృతులయందుఁ గలదు. వసిష్ఠాది గృహస్థమునులు బ్రహ్మవేత్త లని యితిహాసాదులయందు సుప్రసిద్ధమై యున్నది. ఇఁక వానప్రస్థులనుగూర్చియు వారిజ్ఞానసిద్ధినిఁ గూర్చియుఁ బ్రత్యేకముగ ముచ్చటించవలసినపనియే లేదు. ఇట్లగుటచే శ్రవణమననాదులయందు సర్వాశ్రమములవారికి నధికారము కలదు. స్వాశ్రమకర్మల నాచరించువారైనను శ్రద్ధ కలదేని సర్వకాలములయందును చిత్తమును పరబ్రహ్మమునందే చేర్చి తన్నిష్ఠులైయుండవచ్చును; కర్మల నాచరించునప్పుడుకూడ నట్లే యుండవచ్చును. లోపములేకుండ గర్మాచరణమును గావింపవచ్చును. సర్వానుభవసిద్ధ మగునీసంసారదశయందు "నేను బ్రాహ్మణుఁడను నాపేరు కృష్ణుఁడు" అను మొదలగు భావన లెన్ని కార్యముల నెల్లెట్లాచరించినను తొలంగిపోవుచున్నవా? వానివలన కర్మలకు హాని యేదైన కలుగుచున్నదా? పరపురుషానురక్త యగు కామిని తనచిత్తమునెల్ల తనప్రియునియందుఁ జేర్చి యున్నను అప్రమాదముతో గృహకృత్యముల నిర్వర్తించుటలేదా? ఈవిధముగనే సర్వాశ్రమములవారును బ్రహ్మనిష్ఠులయ్యు స్వాశ్రమకర్మముల నిర్వర్తింపవచ్చును. విచారించిన "నేను బ్రాహ్మణుఁడను" అనునభిమాన మెట్టిదియో "నేను పరమేశ్వరుఁడను" అనుభావన కూడ నట్టిదియే ఇట్లైన నిం దొక్కటి కర్మలకుఁ బ్రతిబంధకము కాకుండిన రెండవది మాత్ర మట్టిది యేట్లగును? సంసారులు బ్రాహ్మణత్వాదులనే స్వస్వరూపమునుగా నిశ్చయించి యున్నారు; తన్నిష్ఠవలనఁ గర్మలోపమింతయుఁ గలుగుట లేదు. జ్ఞానోదయమువలన బ్రాహ్మణత్వాదులు స్వస్వరూపము కాదనియుఁ బరమేశ్వరుఁడే స్వస్వరూప మనియుఁ దెలిసినది; ఇప్పుడు మాత్రము తన్నిష్ఠవలన గర్మలోప మేల కలుగవలయును. ఈతస్వస్వరూపజ్ఞానమువలన కలుగనిప్రతిబంధము మఱియొకదానివలనఁ

గలుగుననుట యేటి యుక్తి? మఱియు సర్వేంద్రియములకును తద్వ్యాపారములకును తాను సాక్షిగా మాత్రమే యుండ స్వస్వరూపము నెఱింగిన వానికి గర్మలోప మేల కలుగవలయును? తనసాక్షిత్వము సర్వేంద్రియ ప్రవర్తకము గాని నివర్తకము కాదు కదా! "మనస్సు అంతర్ముఖమై బహిర్ముఖము కాకుండుటచే బ్రహ్మనిష్ఠకలవానికి నింద్రియవ్యాపారములు సంభవింపవు" అనియెదవేమో వినుము. ఇది నిశ్చయమే. ఈకారణము వలననే అభ్యాసలాఘవమున కయ్యును ఒకనివలన లోకమునకు హాని రాకుండుటకయ్యును సన్న్యాసాశ్రమము శ్రుతిస్మృతులచే విధింపఁబడి యున్నది. ఆయాశ్రమమునకు సర్వకర్మపరిత్యాగము విధివిహిత మగుటచే నట్టివానినిఁ జూచి యితరులు స్వతంత్రముగఁ గర్మపరిత్యాగము నాచరింపరు. వానికిని అంతర్ముఖ మగుచిత్తమును మరల్పవలసినపని యుండదు. ఓంకారజపాదు లుపాసనయే కావున నవి మనసు నంతర్ముఖము చేయుటకు సహాయకారు లగునే కాని విక్షేపకములు కానేరవు. ఆహారాదులకై కొంత బహిర్ముఖత్వము కావలసియున్నను అది నిష్ఠాదార్ఢ్యము ననుసరించి వచ్చినను వచ్చును; రాకున్నను రాకపోవును. ఇదియే * బ్రహ్మవిదాదులకుఁగల తారతమ్యము. కావున సన్న్యాసాశ్రమ మభ్యాసలాఘవార్థమై విధింపఁబడినదియే కాని చిత్తశుద్ధిప్రభావమువలన † బ్రహ్మధారణ

---

* బ్రహ్మవిదాదులు:— బ్రహ్మవిదుఁడు బ్రహ్మవిద్వరుఁడు బ్రహ్మవిద్వరీయుఁడు బ్రహ్మవిద్వరిష్ఠుఁడు అని బ్రహ్మవేత్తలు నాల్గువిధములుగ నున్నారు. అందు బ్రహ్మజ్ఞానముగలిగియుఁ బ్రారబ్ధానుసారముగ బ్రవర్తించువాఁడు బ్రహ్మవిదుఁడు. అట్లే యావశ్యక కృత్యములయందుమాత్రమే ప్రవర్తించువాఁడు బ్రహ్మవిద్వరుఁడు. అట్లును ప్రవర్తింపక పరప్రేరణ లేక నాహారము నైనఁ గైకొనకుండువాఁడు బ్రహ్మవిద్వరీయుఁడు. ఎప్పటికిని మేలుకువయే లేక పూర్ణసమాధి నిష్ఠుఁడై యుండువాఁడు బ్రహ్మవిద్వరిష్ఠుఁడు.

† బ్రహ్మధారణ యనఁగా నేయేకార్యముల నెట్టెట్లాచరించుచున్నను "నేను కార్యముల నాచరించువాఁడను కాను; కార్యముల నాచరించునవి యింద్రియములే నేను వానికి సాక్షిని" అని దృఢభావనతో నుండుట. సంసారదశయందు "నేను బ్రాహ్మణుఁడను" అను మొదలగు భావనలు సర్వకాలములయందును సుస్థిరము లయ్యే యుండునట్లు "నేను బ్రహ్మము" అనుభావన సుస్థిరమై యుండుట.

కుదురునేని యేయాశ్రమమైన నొక్కటియే. వాస్తవస్థితిలో నట్టివానికి నాశ్రమమే లేదు కదా!

ఈవిషయమునే "పక్షేణ" అనుసూత్ర భాగముచే సూత్రకారుఁడు సూచించియున్నాఁడు. "ఎవ్వనికైనను శ్రవణాదులవలన జ్ఞానము జనించియుఁ జిత్తదోషమువలన ననాది యగు భేదభ్రాంతి నశింపకుండునేని వానికై యీనిదిధ్యాసనము విధింపఁబడెను" అని యాసూత్రావయవము నకు నర్థము. ఈకారణముచేతనే సన్యాసినిఁ గూర్చి చెప్పు "తద్వతః" అను పదమునకుఁ గూడ విద్యాభ్యాసియే యర్థ మవునుగాని విద్యాసిద్ధుఁడు కాఁడు. విద్యాసిద్ధునకు స్వభావముగనే యాధిక్యము వచ్చును గావున నిదిధ్యాసన మక్కఱ లేదు కదా! కావున నీవిధి భేదదృష్టిని విడువని విద్యాభ్యాసినిఁ గూర్చినదియే యని తెలిసికొనవలయును. కొందఱకు నుపదేశోత్తరకాలముననే కూడ చిత్తశుద్ధి ప్రభావమున బ్రహ్మధారణ కుదిరి పోవును. పరస్పరసంబంధము నెఱుంగని శ్రోత్రవానికిని "నీకును మాకును బంధుత్వము కలదు" అని సంబంధము నెల్ల నిరూపించినచో దత్క్షణమే వానికి బంధుత్వభావన దృఢమగునట్లు, 'నీవు జీవుఁడవు కావు; బ్రహ్మంబవు' అని చెప్పి యుపపత్తుల నిరూపించినఁ దత్క్షణమే కొందఱకు బ్రహ్మత్వ భావన దృఢమగును. ఇట్టివారినిఁగూర్చి యీవిధి ప్రవర్తింపదు.

అది యట్లుండె. ఎట్లు చూచినను విషయవాక్యమునందు నిదిధ్యాసన మెట్లును విధింపఁబడియేయున్నది. కర్మకాండమునందు "దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత" "స్వర్గమును కోరువాఁడు దర్శపూర్ణమాసములతో దేవతల నారాధింపవలయును" అను మొదలగు విధుల సన్నిధానమున సమిధలు మొదలగు నపూర్వపదార్థములు ప్రస్తావింపఁబడి యుండినచో నచ్చట (సమిధలు మొదలగువానియొద్ద) ప్రత్యక్షవిధిశ్రుతి లేకున్నను కల్పింపఁబడునట్లు యిచ్చటకూడ మునిపదసన్నిధానమున విధి శ్రుతి కల్పింపఁబడవలయును. "అచ్చట గర్మను చెప్పునప్పుడైనను విధికలదు; ఇచ్చట విద్యావిషయమున నదియు లేదు కదా!" అనియెదవేమో అట్లు లేకున్నను దోషము లేదు. ఇదియు (విద్యాప్రస్తావంబును) నుపదేశరూపమైనదియే; పురుషార్థసాధన మైనదియేకదా! కావున నెట్లును ఇచ్చట విద్యాభివృద్ధికై నిదిధ్యాసనము విధింపఁబడియే యున్నది.

## అ_౩. పా_౪. సూ_౪౮.

అవతారిక : — "ఈనిరూపణవలన సభ్యాసికి సన్యాసాశ్రమమే యనుకూల మనియు నది వైరాగ్యవంతులకెల్ల నవశ్యాదరణీయ మనియుఁ దేలినది. శ్రుతివాక్యములును ప్రత్యక్షముగనే దీనిని నిరూపించుచున్నవి యని యిదివఱకే తెల్పఁబడెను. ఇట్లు సర్వప్రమాణసిద్ధమై యుత్తమోత్తమమై సన్యాసాశ్రమముండ ఛాందోగ్యోపనిషత్తునందు 'అభిసమావృత్య కుటుంబే' 'వేదాధ్యయనమును ముగించి గృహస్థుఁడై' అను మొదలగు వాక్యముచే నుపసంహారమున గృహస్థాశ్రమము మాత్రమే యేల వర్ణింపఁబడెను ? ఈవర్ణనముచే 'గృహస్థాశ్రమమునకంటె భిన్నములగునాశ్రమములు లేవు' అని సూచింపఁబడుచున్నది కదా!" యనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౪౭౪. కృత్స్నభావాత్తు గృహిణోపసంహారః.

### ౩. ౪. ౪౮.

గృహస్థాశ్రమముతో నుపసంహారముఁ జేయుటవలన విరోధమేమియు లేదు. గృహస్థునకు స్వాశ్రమ కర్మము లగుయజ్ఞాదులును ఇతరాశ్రమకర్మము లగుమనోనిగ్రహాదులును కూడ విధింపఁబడియే యున్నవి. వానికిఁ జిత్తదోషమువలన స్వర్గాదులయందలి యభిలాష యధికమైనచో యజ్ఞాదికామ్యకర్మముల నాచరించి తత్సిద్ధిని బొందవచ్చును. మోక్షేచ్ఛ కలిగినచో నవశ్యాచరణీయము లగునిత్యనైమిత్తికముల మాత్ర మాచరించుచు జపాదులమూలముననైనను వైశ్వానరవిద్యాదులమూలముననైనను బ్రహ్మజ్ఞానసిద్ధిని బొందవచ్చును. ఇట్లగుటచే వానియాశ్రమముతో నుపసంహారము చేయుట విరుద్ధము కానేరదు; ఇంతమాత్రమువలన నాశ్రమాంతరములును అసిద్ధములు కానేరవు. కావున నెట్లును పూర్వసిద్ధాంతమునకు విరోధము లేదు.

## అ_౩. పా_౪. సూ_౪౯.

అవతారిక:—ఇట్లు గృహస్థసన్యాసాశ్రమములఁ గూర్చి చెప్పుటచే మందబుద్ధులకు నొకవేళ (నైష్ఠిక) బ్రహ్మచారివానప్రస్థాశ్రమములు లేవని

తోఁచునేమో యనునభిప్రాయముతో నాసంశయమును నిరాకరించుటకై యుత్తరసూత్రము నారంభించుచున్నాఁడు.

---

## ౪౭౯. మౌనవదితరేషామప్యుపదేశాత్.

### 3. ౪. ౪౯.

తాత్పర్యము:—ఇట్లు రెండాశ్రమములను గూర్చి మాత్రమే చెప్పుటవలన తక్కినయాశ్రమములు లేవని భ్రాంతినొందకుఁడు. సన్న్యాస గృహస్థాశ్రమములవలెనే తక్కిన రెండాశ్రమములును ఉపదేశింపఁబడియే యున్నవి. "తప ఏవ ద్వితీయః బ్రహ్మచార్యాచార్యకులవాసీ తృతీయః" అని యాయాశ్రమములను విధించుశ్రుతి మున్నే (సూ. 3. ౪. ౧౯.) వివరింపఁబడియున్నది. కావున సమానముగ నుపదేశింపఁబడియుండుటచే నన్నియాశ్రమములును ప్రత్యేకముగనైనను సంభవించినంతవఱకు సముచ్చయముగనైనను ఆచరింపఁబడవలసినవియే.

విశేషాంశము:—ఈసూత్రమున రెండాశ్రమములఁ గూర్చియే చెప్పఁబడియున్నను 'ఇతరేషాం' అని బహువచనము ప్రయోగింపఁబడెను. ఇది * ఆశ్రమవృత్తిభేదముల నాశ్రయించి కాని పురుషుల నాశ్రయించి కాని ప్రయోగింపఁబడె నని తెలిసికొనవలయును.

---

* ఆశ్రమవృత్తిభేదములు :—౧. గాయత్ర్య, బ్రాహ్మ, ప్రాజాపత్య, బృహత్తు లని బ్రహ్మచారి నాల్గువిధములు. ఉపనయనానంతరము మూఁడుదినములు క్షారలవణ వర్జితముగ భుజించుచు గాయత్రిం బఠించువాఁడు గాయత్రుఁడు. వేదగ్రహణ పర్యంతము బ్రహ్మచర్యము సలుపువాఁడు బ్రాహ్మణుఁడు. ఋతుకాలమందే స్వభార్యను బొందుచు నిత్యమును బరస్త్రీవిముఖుఁడుగ నుండువాఁడు ప్రాజాపత్యుఁడు ఒండె నొక సంవత్సరము వేదవ్రతము నాచరించువాఁడు ప్రాజాపత్యుఁడు. మరణపర్యంతము గురుకులవాసియై నైష్ఠికుఁడుగ నుండువాఁడు బృహత్తు.

౨. వార్తాక శాలీన యాయావర ఘోరసన్న్యాసికులని, గృహస్థులు నాల్గు విధములు. కృషిగోరక్షాదులను జేసికొని వైశ్యాదివృత్తిచే జీవించుచు నిత్యనైమిత్తికాది క్రియాపరుఁడగువాఁడు వార్తాకుఁడు. యాజనాధ్యాపన ప్రతిగ్రహవిముఖుఁడైన

# ౧౫. అనావిష్కారాధికరణము

విషయ సంగతి సంశయ పూర్వపక్షములు:—"తస్మా ద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్" అను వాక్యమే పూర్వాధికరణమున విచారింపఁబడి యందు నిదిధ్యాసనవిధి ప్రతిపాదింపఁబడెను. ఈ యధికరణమునఁగూడ నందలి బాల్యశబ్దార్థము నిర్ణయింపఁబడును. ఇట్లగుటచే నీరెండధికరణములకు నేకవిషయత్వమే సంగతి. "బాల్యపదమునకు ప్రసిద్ధార్థములు రెండు కలవు. బాలునివయస్సును బాల్య మందురు; వానిస్వభావములనుఁ గూడ నట్లే చెప్పుదురు. ఇందు వయస్సు కాలానుసారముగ వచ్చునదియే కాని యిచ్ఛానుసారముగ వచ్చునది కాదు.

యయాచితవృత్తిచే జీవించువాఁడు యాయావరుఁడు. షట్కర్మ నిరతుఁడై యాచనాది వృత్తులచే నార్జించువాఁడు శాలీనుఁడు. వడకట్టిన శుద్ధజలములతో స్వకార్యముల నిర్వర్తించుచు ప్రత్యహమును హింసావిముఖతచే శిలోంఛ వృత్తికుఁడై గ్రామవాసి యగువాఁడు ఘోరసన్న్యాసికుఁడు.

3. వైఖానస ఔదుంబర వాలఖిల్య ఫేనపు లని వానప్రస్థులు నాల్గువిధములు. గ్రామములకు వెలపల దున్ననిభూమియందు బండినధాన్యములతో నగ్నిహోత్రాదులను జేయుచుండువాఁడు వైఖానసుఁడు. ప్రొద్దున లేచి యేదిశను జూచునో యటుబోయి యందున్న యౌదుంబరీ బదరనీవారశ్యామాకాదులచే గర్మముల నాచరించువాఁ డౌదుంబరుఁడు. జటావల్కలధారియై యెనిమిదిమాసము లార్జించి యట్లార్జించినదానిని దక్కిన నాల్గుమాసములయందు భుజింపుచు మిగిలినవానిని గార్తికమాసమునఁ బరిత్యజించువాఁడు వాలఖిల్యుఁడు. స్వచ్ఛందముగ రాలిన పర్ణఫలముల భుజించుచు నెచ్చటనైననుండి కర్మముల నాచరించువాఁడు ఫేనపుఁడు.

౪. కుటీచక బహూదక హంస పరమహంస లని పరివ్రాజకులు నాల్గువిధములు. స్వపుత్ర గృహమున భిక్షను జేయుచుఁ ద్రిదండులయి యుండువారు కుటీచకులు. త్రిదండులును శిక్య జలపవిత్ర పాదుకాసన శిఖాయజ్ఞోపవీత కౌపీన కాషాయ వేషధరులును దీర్ఘయాత్రాపరులును నై భిక్షమును జేసికొనుచు నాత్మధ్యానము సల్పువారు బహూదకులు. ఏకదండులును శిఖావర్జముగ యజ్ఞోపవీతధారులును శిక్యకమండలుపాణులును గ్రామైకరాత్రవాసులును గృచ్ఛ్రచాంద్రాయణపరులును నగువారు హంసలు. ఏకదండధరులును శిఖాయజ్ఞోపవీతరహితులును సర్వకర్మవర్జితులును నాత్మనిష్ఠులు నగువారు పరమహంసలు.

కావున బాలస్వభావము లగుస్వేచ్ఛాసంచారాదులే తిష్ఠన్మాత్రత్వాదులే యిచ్చట బాల్యశబ్దార్థములు కావలయును. మఱియొకవిధముగాఁ జూచిన బాలసదృశస్థితియు (అనఁగా నహంకారకామాదివికారముల వర్జించి యేమియు దెలియనియట్లుండుటయు) బాల్యము కావచ్చును. ప్రకృత వాక్యమున నీరెండర్థములలో నేది గ్రహింపఁబడవలయును” అనుసంశయము నిరాకరింపఁబడును. “శౌచాదిధర్మములు విధింపఁబడి యున్నను అవి సామాన్యశాస్త్రము గావున విశేషశాస్త్రముచే బాధింపఁబడును. శౌచాదులు సామాన్యముగ నన్నితెఱఁగులవారినిఁగూర్చియు జెప్పఁబడి యున్నవి; బాల్యము బ్రహ్మవిద్యాభ్యాసులనుగూర్చి మాత్రమే చెప్పఁబడి యున్నది కదా! అహింసావ్రతము సర్వజనసామాన్యముగఁ జెప్పఁబడి యున్నను దానిని బాధించి యజ్ఞార్థహింస ప్రవర్తించినట్లు ఈప్రస్తుత బాల్యవిధిశాస్త్రంబును ప్రవర్తించును. కావున బ్రహ్మజ్ఞానాభ్యాసి బాలునివలె తిష్ఠన్మాత్రుఁడై స్వేచ్ఛాచారియై యుండవలయును.” అను పూర్వపక్షము ఖండింపఁబడును. “జ్ఞానికి శౌచాదులవశ్యానుష్ఠేయములు” అనుసిద్ధాంతము స్థాపింపఁబడును.

## ౪౭౬. అనావిష్కుర్వన్నన్వయాత్. ౩.౪.౫౦.

తాత్ప:-ఇట్లుచెప్పుట యుక్తముకాదు. బాల్యశబ్దమునకు స్వేచ్ఛాచారాదిరూప మగుబాలచర్య సర్వము నర్థముగ గ్రహించినచో నట్టివానికి జ్ఞానాభ్యాసమే సంభవించుటకు వీలులేదు. ఇది ప్రత్యక్షసిద్ధము. ఈకారణమువలన నేదియో యొకవిధముగ జ్ఞానాభ్యాసికిని బాలునకును పోలికను కల్పింపవలసినవియే కాని ప్రత్యక్షముగ సర్వవిధములయందును పోలికను చెప్పఁగూడదు. ప్రౌఢేంద్రియుఁడు కాకపోవుటయు కామాదులచే బాధింపఁబడకుండుటయు నిందాస్తోత్రాదులకు రాగద్వేషముల నొందకుండుటయు మొదలగునవియే జ్ఞానాభ్యాసికి బాలునితో గలసామ్యము. బాలునకు నీగుణములు వయోవస్థావిశేషమువలన దమంతనే వచ్చును; జ్ఞానాభ్యాసికి నభ్యాసప్రభావమువలనఁ గలుగవలయును. దృష్టాంతదార్ష్టాంతికములకు సంపూర్ణసాదృశ్య ముండుట కూడ సంభవింప దని మున్నే వివరించి యున్నాము కదా! కావున బాల్యశబ్దమునకు బాలసదృశస్థితియే యర్థ

ఇంద్రియప్రౌఢి లేకుండుటచే నిర్లేప మగురీతి నున్న బాలుని చిత్తవృత్తియే బాల్యశబ్దార్థము.

ఈవిధముగ (బాల్యశబ్దమునకు) గత్యంతరము సంభవించుచుండ శౌచాదివిధిశాస్త్రమును నిరర్థకముగ బాధింప నేటికి ? ఎచ్చటనైనను ప్రధానమునకు తోడ్పడవలయు ననియే కదా యంగమును విధింతురు ! ఇట్లుండ నాప్రధానమునకు హానికర మగువిషయము నంగమునుండి (బాల్యవిధినుండి) యేల గ్రహింపవలయును? గత్యంతరము లేకపోయి నచో నెట్లో యొకవిధముగఁ జేయవలసి యుండును గాని యిచ్చట నట్లు లేదు కదా! కావున బాల్యశబ్దమునకు శాంతచిత్తత్వమే యర్థము.

ఈవిషయమునే "అనావిష్కుర్వన్" అనుపదముచే సూత్ర కారుఁడు వివరించి యున్నాఁడు. ఆవిష్కార మనఁగా ప్రసిద్ధి; జ్ఞాన ధార్మి కత్వాదులచేఁ దనకు కీర్తి రావలయు నని కోరుట; తనప్రభావమును పరు లకు వెల్లడించుట ఇట్టిగుణము జ్ఞానాభ్యాసికి నుండఁగూడదు. ఏమియు నెఱుంగనివా రగుటచే బాలురకు నీగుణము లెట్లు లేవో అట్లే జ్ఞానికిని లేకుండవలయును. ఇట్టియర్థమును గ్రహించిననే కదా బాల్యవిధి జ్ఞానోప కారక మగును !

ఈవిషయమును స్మృతులు ని ట్లభివర్ణించుచున్నవి. "యం న సంతం న చాసంతం నాశ్రుతం న బహుశ్రుతం, న సువృత్తం న దుర్వృ త్తం వేద కశ్చి త్స బ్రాహ్మణః. గూఢధర్మాశ్రితో విద్వా నజ్ఞాతచరితం చరేత్, అంధవజ్జడవ చ్చాపి మూకవ చ్చ మహీం చరేత్. అవ్యక్తలిం గోఽవ్యక్తాచారః" "ప్రపంచమున బ్రతికియున్నాఁడని కాని లేఁడని కాని విద్యావంతుఁడని కాని కాఁడని కాని మంచివాఁ డని కాని చెడ్డవాఁ డని కాని యెవ్వని జను లెఱుంగరో వాఁడే బ్రహ్మజ్ఞాని (అనఁగా బ్రహ్మజ్ఞాని యగువాఁడు స్వప్రసిద్ధిని కోరరా దనుట) జ్ఞాని యగువాఁడు తనకుఁ గల గుణవిశేషముల మరుగుపరచుకొని లోకమున నజ్ఞాతవాసము చేయవల యును. (ఎవ్వనికిని తెలియకుండ సంచరింపవలయు ననుట) గ్రుడ్డివానివలెను మోటువానివలెను మూగవానివలెను సంచరింపవలయును. జ్ఞానియొక్క చిహ్నములుగాని ఆచారములుగాని బయలుపడరాదు" అను నిట్టివాక్య ములనేకములు కలవు. ప్రసిద్ధినిగోరినచో నాశోరిక నాశ్రయించియే యనేక దుర్గుణములు జనించును. తనకుఁ గల యవగుణముల కప్పిపుచ్చవలయు;

యనియు సుగుణముల నున్నస్థితికంటె ననేకగుణము లధికముగఁ బ్రశంసింప
నట్లయు నని యు తోఁచును. పరులు తన్ను నుతించునప్పు డభిమానంబును
నిందించునప్పు డీర్ష్యయును కలుగును. తనకు యథార్థముగ నున్న దుర్గుణము
నుగ్గడించినను ప్రసిద్ధిలోపము కలుగు ననుచింతవలన మహాక్రోధము జనిం
చును. ఇట్లయిన నిఁక గలుగఁబోవు హానికి మితి యెక్కడిది? ఈకారణము
వలన జ్ఞానికి నజ్ఞాతచర్య విధింపఁబడె నని తెలిసికొనవలయును.

---

## ౧౬. ఐహికాధికరణము

విషయ సంగతి సంశయములు:—"సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతే రశ్వవత్. (3. ౪. ౨౬.)" అనునధికరణము మొదలు పూర్వాధికరణము వఱకు విద్యయొక్క యంతరంగబహిరంగసాధనములు నిరూపింపఁబడెను. ప్రస్తుతాధికరణమున వాని నాశ్రయించి ఫలసిద్ధికాలము నిరూపింపఁబడును. కావున పూర్వగ్రంథముతో నీయధికరణమునకుఁ గలసంబంధ మాశ్రయాశ్రయిభావసంబంధము. "ఈవిద్యాఫలసిద్ధి యేజన్మమున శ్రవణాదు లొనర్పఁబడెనో ఆజన్మముననే కలుగునా? లేక నొకజన్మమున శ్రవణాదుల నాచరించిన మఱియొకజన్మమునందుఁగూడ కలుగునా?" అను సంశయము నివారింపఁబడును. "శ్రవణాదులు నియతముగ విద్యాసిద్ధి నొసంగునవియే" యని స్థాపింపఁబడును.

పూర్వపక్షము:—విచారించి చూచిన విద్యాఫలము నియతముగఁ బ్రకృతజన్మమునందే కలుగవలయు నని తోఁచుచున్నది. ప్రత్యక్షముగ విద్యాఫలమును సాధింపఁగలుగునవి శ్రవణాదులే కాని యజ్ఞాదులు కావు. యజ్ఞాదులు మఱియొకప్రమాణముచే సాధింపఁబడవలసినవి శ్రవణాదులు స్వయముగనే ప్రమాణభూతములు కదా! కావున యజ్ఞాదులు చిత్తశుద్ధిమూలమునఁగాని శ్రవణాదులకుఁ గలుగుప్రతిబంధములను నివారించుటమూలమునఁగాని విద్యాసాధనము లగునే కాని ప్రత్యక్షముగఁ గానేరవు. ఈకారణమువలన యజ్ఞాదులకు సంబంధించిననియమములను విద్యాఫలముపై నారోపించుట యుచితము కాదు. "యజ్ఞాదు లనియత ఫలము లగుటచేతను విద్యయు తత్ఫలమే యగుటచేతను అది నియతము

కానేరదు. ఎప్పుడో యేజన్మముననో కలుగునదియే కావలయును" అనుట యుక్తము కానేరదు. శ్రవణాదులు ప్రమాణము లగుటచే తదుత్తరకాలముననే నియతముగ విద్యాఫలము జనించి తీరవలయు ననియే నిర్ణయింపవలసి యున్నది.

మఱియు నెవ్వఁడును తనకు నెప్పుడో ఫలశుద్ధి కావలయు నను నుద్దేశముతోఁ బ్రమాణార్థమై ప్రవర్తింపఁడు కదా! ఘటాదిపదార్థము లను చూడఁదలంచువాఁ డెవ్వఁడైనను "మనము కన్ను దెఱచుకొనియుం డిన నెప్పుడో ఘటము కానవచ్చును" అనునుద్దేశముతో దృష్టుల నిగు డ్చునా? "మన కిప్పుడే పదార్థదర్శనము కావలయును" అనియే కదా యుద్దేశించి ప్రవర్తించును. ఈకారణమువలనఁ గూడ విద్యాసిద్ధి ప్రస్తుత జన్మముననే నియతముగఁ గలిగి తీరవలయును. ప్రమాణోత్పత్తికిఁ బిదప సాధ్యసిద్ధికిఁ గాలాతిక్రమ మెందును గానవచ్చుట లేదు.

## అ-3. పా-४. సూ-౫౧.

అవతారిక:—అను నీ పూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

# ४౭౭. ఐహిక మప్యప్రస్తుత ప్రతిబంధే తద్దర్శనాత్. 3. ४. ౫౧.

తాత్పర్యము:—విద్యాఫలము ప్రస్తుతజన్మమునందే నియతముగ కలుగు ననుటకు వీలులేదు. కర్మప్రతిబంధము లేకపోయిన శ్రవణాద్యుత్త రకాలముననే మీ రన్నట్లు కలుగును; * ప్రతిబంధ ముండినచో నుత్తర జన్మమున కలుగును. ఈ ప్రతిబంధము ప్రారబ్ధకర్మవశమునఁ గలుగును.

---

* ప్రతిబంధత్రయము:— జ్ఞానమునకు ౧. భూతప్రతిబంధ మని, ౨. వర్త మానప్రతిబంధ మని, 3. భావిప్రతిబంధ మని ప్రతిబంధములు మూఁడు కలవు. ౧. అందు బహు కుటుంబియగు నొకవిప్రుఁడు జీవనార్థము ఒకగోవును సంపాదించి దానిపాలు పెరుగు నెయ్యి వీనిచే వచ్చినరొక్కముచేత పుత్రకళత్రాదులను గాపా డుచు ఆగోవును కసవు ప్రత్తిగింజలు మొదలగువానిచేత తుష్టిగా మేపుచు తదేకనిష్ఠుఁ డైయుండ కొంతకాలమునకు ప్రారబ్ధవశమున ఆతని పుత్రకళత్రాదులు చచ్చిరి. గోవును మృతినొందెను నప్పు డతఁ డేకాకియై అసత్యమగుసంసారమును నమ్మి

సమయమునకు నేని [illegible] యొకకర్మ ఫలించి శ్రవణాదిసాధనములకుఁ గాని చిత్తశుద్ధికిఁ గాని ప్రతిబంధమును కలిగించునేని యప్పుడు ఫలసిద్ధి

---

పడరాని పాట్లు పడితిని. కడపట నిప్పు డది కలవలె కల్లయయ్యె. సంసారాపేక్షకలవాని కంటె మూఢుఁడు మఱియొక్కఁడు లేఁడని విసికి సంసారము తుచ్ఛమని యెంచి విరాగియై సన్యసించి సద్గురు సాన్నిధ్యముచేరి, శ్రవణాదులఁ జేయుచుండఁగా ఒకనాఁడు గురువు ఆతనిఁ జేరఁబిలిచి నీవు బహునాళ్లనుండి శ్రవణాదులు జేసితివే కృతకృత్యత నీకుఁ గలదా? అనిన స్వామీ మఱేమియుఁ గానము. పూర్వాశ్రమమందొకగోవు గల దది నాఁడే చచ్చినను శ్రవణ మనన నిదిధ్యాసకాలములందు,ఆ గోవే కనఁబడుచున్నదనెను. అంతట గురువులు మిక్కిలి కటకటఁబడి యిది భూతప్రతిబంధ (భూతకాలమున నున్నపదార్థము జ్ఞానసిద్ధికి నాటంకమును కలిగించుట) మని తలఁచి దానిని బోఁగొట్టుటకై ఆ గోవునందలి చెలిమి ననుసరించి తత్వబోధఁ గావింపఁదలఁచి "ఓయీ నీకుఁ గనఁబడుగోవు అస్తిభాతిప్రియ నామరూపము లనెడి ఐదులక్షణములు గలది గనుక నామరూపములను విడిచి అస్తిభాతిప్రియములు నేనని మననముఁజేయుము" అని బోధించెను. అట్లాశిష్యుఁడు మననముఁజేయుచురాఁగా కల్పితనామరూపములు తోఁచక సచ్చిదానందరూపపరబ్రహ్మము నేననెడు నిశ్చయముతోఁచి ధన్యుఁడయ్యె. విద్యారణ్యస్వాములు ప్రతిబంధత్రయమును దానికి నివృత్తియు పంచదశ ప్రకరణమం దిట్లు నిరూపించిరి. గాన నిది భూతప్రతిబంధము.

2. వర్తమానప్రతిబంధము విషయాసక్తిలక్షణ ప్రజ్ఞామాంద్య కుతర్క విపర్యయ దురాగ్రహము లని నాల్గువిధములు. అందు విషయాసక్తిలక్షణ మనఁగా విషయముల యందు గూఢ మగు నాసక్తి గలిగి యుండుట. ప్రజ్ఞామాంద్య మనఁగా గురువులు చెప్పిన వేదాంత మహావాక్యార్థము బుద్ధియం దెక్కకపోవుట. కుతర్క మనఁగా గురువులానతిచ్చిన వాక్యార్థమునకు విపరీతార్థము దోఁచుట. విపర్యయదురాగ్రహమనఁగా "నేను శ్రోత్రియుఁడను వరక్తుఁడను" అని దేహేంద్రియాదులయం దాత్మ బుద్ధి గలుగుట. ఈ నాలుగు వర్తమాన ప్రతిబంధములు (జ్ఞానసమయమునందే యున్న వృత్తి భేదములవలన జ్ఞానసిద్ధికిఁ గలుగు నాటంకము) వీనికి నివృత్తి యెట్లనఁగా, శమదమోపరతి తితీక్షాసంపదచేత విషయాసక్తి లక్షణము, అనవరతశ్రవణముచే ప్రజ్ఞామాంద్యము, మననమువలన కుతర్కము, నిదిధ్యాసముచేత విపర్యయదురాగ్రహము చెడును. ఇట్లు ప్రతిబంధము నశింపఁగా ముముక్షువులకు నేను బ్రహ్మ మను దృఢత్వము గలుగును.

3. ఆగామిప్రతిబంధము పాపకర్మమువలన కాలనియతి తెలియక వచ్చునది. [illegible] మనఁగా సంచితపాపకర్మము ముముక్షువున కొక్క తెలియఁగునందు

కలుగదు; లేకున్న కలుగును. "ఇట్లయిన శాస్త్రమువలనఁగాని స్వబుద్ధి వలన తనస్థితుల విమర్శించిగాని రాఁబోవు ప్రతిబంధము నెఱింగి జ్ఞానాభ్యాసి ప్రవర్తింపరాదా?" అనియెదవేమొ యది సాధ్యమగు కార్యము కాదు. దేశము కాలము తగినహేతువు అనువానిసంయోగము వలన పూర్వకర్మ ఫలము నొసంగుచుండును. ఈదేశకాలాదు లన్నిటికి నేక విధములే యగునేని యప్పుడు తనస్థితుల విమర్శించి రాఁబోవుదాని నెఱుంగుటకు పురుషుఁడు శక్తుఁ డగును కాని యట్లు లేదు. ప్రతికర్మకును దేశకాలహేతువులు ప్రత్యేకము లయ్యే యుండును; కొన్నికొన్ని చోట్ల సమానముగఁ గూడ నుండును. ఈవిషయ మెట్లును నియమించుటకు వీలు లేదు. ఒకకర్మ ఫలము నొసంగుచుండగనే యాకస్మికముగ మఱియొకకర్మ విరుద్ధఫలము నొసంగుటయు కలదు. అన్నిటికి ఫలోన్ముఖత్వమును గలిగించునవి సమానదేశకాలహేతువులే యగునేని యిట్టివిరోధము కలుగఁగూడదు కదా! కావున స్వబుద్ధిచే నెఱింగి యీప్రతిబంధమును తప్పించుకొనుటకు వీలు లేదు. శాస్త్రమును విచారింత మనిన నదియు "ఈకర్మకు నీఫలము కలుగును" అని యంత మాత్రమే చెప్పినది కాని దేశకాలహేతువులనుగూర్చి చెప్పలేదు. కావున కర్మఫలసిద్ధివిషయ మెట్లును నిర్ణయింపఁబడుటకు వీలు లేదు. సర్వము ననియతమే యగుటచే గొన్నిప్రారబ్ధములు ప్రతిబంధము కలిగింపఁగలవి యైనను శ్రవణాదులసామర్థ్యవిశేషముచే నడఁగిపోవచ్చును. మఱికొన్ని య ట్లడంగక సాధనసామర్థ్యలోపముచే విజృంభింపవచ్చును. కావున నీప్రతిబంధమునుగూర్చి ఫలము కలిగినపిదప (అనఁగా శ్రవణాదులు తిరస్కరింపఁబడినపిదప) తెలిసికొనఁబడవలసినదియే కాని ముందుగాఁ

---

రూఢమై దయారూపమగు నాసక్తిని పుట్టించును. అది భావిప్రతిబంధ మని యెఱుఁగ వలయును. అట్లెఱుఁగఁజాలక అకర్తను అసంగుఁడను అగు నన్నీయాసక్తి యేమిచేయఁనని సడ్డచేయకయుండెనేని అది వానికి కొన్నిజన్మంబులు గల్గించును. అది జన్మములఁ గలిగించుటకు తార్కాణమేమనఁగా వామదేవున కొకజన్మము. భరతునకు మూఁడుజన్మములు. మఱికొందఱికి పెక్కుజన్మములు గల్గెనని పురాణములు చెప్పుచున్నవి. గనుక ముముక్షు వీబంధత్రయమును విచారించి అవి తన్నంటక యుండ దొలఁగించుకోవలయుఁ. అట్లు చేయకున్న కొన్నిజన్మములు గలుగుట సిద్ధము; సంశయము లేదు. ఈ బంధత్రయ మేజన్మమున నివృత్తియో వాని కాజన్మముననే ముక్తి గలుగును.

తెలియదు. కావున నాప్రతిబంధ ముండునేని ప్రస్తుతజన్మమున జ్ఞానసిద్ధి లేదు. లేకున్న కలదు. ఈకారణమువలన జ్ఞానసిద్ధినిఁగూర్చి నియమమును కల్పించుటకు వీలు లేదు. ప్రస్తుతజన్మమునం దైనను ప్రస్తుతసంస్కారముచే బరజన్మమునం దైనను విద్య సిద్ధించు నని మాత్రమే చెప్పవలయును.

శ్రవణాదులు ప్రమాణములే యైనను ప్రతిబంధము కలిగినప్పుడవి యేమి చేయఁగలవు. కన్ను తెలుపఁబడినను చూడఁబడవలసినపదార్థము లెదుటనే యున్నను అంధకారము గలిగినచో నది (దర్శనప్రమాణము) ఏమి చేయఁగలదు? వస్త్రాదు లడ్డమయినచో నేఫలము జనింపఁగలదు? ఈకారణమువలననే యజ్ఞాదులు ప్రమేయము లైనను వానినాశ్రయించి విద్యాసిద్ధిని నిర్ణయించుటకు వీలు కలుగుచున్నది. యజ్ఞాదులు చిత్తశుద్ధిని కలిగించును; శ్రవణాదులకు ప్రారబ్ధవశమునఁ గలుగు విఘ్నములనైనను తొలఁగించును. వాని (ఆచిత్తశుద్ధివిఘ్నధ్వంసముల) నాశ్రయించి శ్రవణాదులు ప్రవర్తించును. ఈవిషయము మీకును సమ్మతమే కదా! దీని నంగీకరించినచోఁ బ్రమాణము లగుశ్రవణాదులకుఁ గూడ యజ్ఞాద్యపేక్ష కల దని తేలుచున్నది. కావున యజ్ఞాదులఫలము నియతముకాదు కావున శ్రవణాదులఫలము కూడ నియతము కాఁగూడదు. యజ్ఞాదులు చిత్తశుద్ధ్యాదిరూపఫలముల నియతముగ నొసంగిననే కదా శ్రవణాదులువిద్యాసిద్ధి నొసంగుట. ఈకారణమువలన యజ్ఞాదులను బట్టిగూడ విద్యాసిద్ధిని నిర్ణయింపవచ్చును. యజ్ఞాదులఫలము నియతము కాకపోవుటకుఁగూడ పైఁజూపినప్రతిబంధమే కారణము. కావునసర్వమును ప్రతిబంధము ననుసరించియే యుండునుగాని యట్లును నియమము నేర్పఱచుటకు వీలు లేదు. "కాలాంతరమున ఫలము కావలయు నని తలంచి యెవ్వఁడును ప్రమాణార్థమై ప్రవర్తింపఁడు!" అంటివికదా యదియు నియతము కాదు. ఇచ్ఛ స్వతంత్ర మైనదికదా! కొందఱకు నీయుత్తరక్షణముననే ముక్తి కలుగవలయు నను నుద్దేశముండవచ్చును. మఱికొందఱకి ముక్తి దొరకినఁ జాలును అని కాలనియమము లేకుండఁగనే యిచ్ఛ జనింపవచ్చును. మఱియు నెట్లు జనించినను పురుషేచ్ఛామాత్రమున ఫలము కలుగదు కదా! కావున నెట్లును విద్యాసిద్ధికి నియమము సంభవింపదు.

శ్రుతిస్మృతులయందును ఈవిషయము స్పష్టముగనే చెప్పఁబడి యున్నది. "శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః శృణ్వంతోఽపి బహవో యం న విద్యుః ఆశ్చర్యోఽస్య వక్తా కుశలోఽస్య లబ్ధాశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః" "బహుజనులకు నెవ్వని వినుట యైనను సంభవింపదో, వినియు బహుజను లెవ్వనిఁ దెలిసికొననేరరో, చెప్పువాఁడును వినువాఁడును తెలిసికొనువాఁడును ఆశ్చర్యభూతులో యట్టివాఁడు పరమేశ్వరుఁడు" అనువాక్యముచే "ప్రతిబంధ ముండినయెడల బరమేశ్వర విషయము లగుశ్రవణమననములు కూడ సంభవింపవు" అని నిరూపింపఁ బడి యున్నది. దీనివలన "శ్రవణాదులకుఁ బిదప మాత్రమేగాక తత్పూర్వమునఁ గూడ బ్రతిబంధము కలుగవచ్చును" అని స్పష్ట మగుచున్నవి కదా! ఇఁక విద్యాఫలము పూర్వజన్మాభ్యస్తసాధన ముల బలమువలన నుత్తరజన్మమునందు కలుగు నను విషయమును గూర్చి యున్న శ్రుతిస్మృతులకు లెక్కయే లేదు. శ్రుతియం దొక చోట "గర్భమున నుండఁగనే వామదేవునకు నాత్మజ్ఞానము కలిగెను" అని చెప్పఁబడి యున్నది. పూర్వజన్మసంస్కారమునవలనఁ గాకున్న నిది యెట్లు సంభవించును? ప్రస్తుతజన్మమునందు సాధనాభ్యాసము గావించె ననుట గర్భస్థునియందు సంభవింపదు కదా! మఱియు గీతాస్మృతియందు విస్పష్టముగనే యీ విషయము తెలుపఁబడి యున్నది. "ప్రాప్య యోగ సంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి" "శ్రీకృష్ణుఁడా యోగాభ్యాసమును నారంభించి సిద్ధినిఁ బొందనిపురుషుఁడు ఏలోకమునకుఁ బోవును" అని యర్జునుఁడు ప్రశ్నింపఁగా "న హి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి?" "ఓశిష్యుఁడా! మంచిపని చేసినవాఁడు దుర్గతిని పొందఁడు కదా!" అని సమాధానముఁ జెప్పి పిదప నాతనికి పుణ్యలోక ప్రాప్తియు మఱల సత్కులంబున జన్మంబును కలుగు నని చెప్పి శ్రీకృష్ణుఁ డంతమున "అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాంగతిం" "అనేకజన్మములకు సిద్ధుఁడై ముక్తిని బొందును" అని యుపదేశించి యున్నాఁ డని నిరూపింపఁబడి యున్నది. కావున విద్యాసిద్ధికి ప్రతిబంధభావాభావములే కారణములు గాని తద్భిన్న మగునియమ మేదియు లేదు.

---

# ౧౭. ముక్తిఫలానియమాధికరణము

విషయ సంశయ సంగతులు:—ఇంతవఱకు జ్ఞానసాధనములను గూర్చియు జ్ఞానోత్పత్తికాలమును గూర్చియు విచారింపఁబడెను. ఇప్పుడు జ్ఞానఫల మగుముక్తినిఁగూర్చి విచారింపఁబడుచున్నది. "యజ్ఞాదిసహాకృతము లగు శ్రవణాదిసాధనములయొక్క సామర్థ్యవిశేషముచేఁ దత్ఫల మగు విద్యయందును ఐహికాముష్మిక రూపభేదమువలన న్యూనాధికత్వములు కలిగినట్లు విద్యాఫల మగుముక్తియందుఁ గూడఁ గలుగవచ్చునేమో" యని దృష్టాంతసంగతితో వచ్చుసంశయము నిరాకరింపఁబడును. "ముక్తికిని న్యూనాధికభేద మున్నచో నదియు స్వర్గాదులవలె కర్మసాధ్యమే కావచ్చును" అనుపక్షము ఖండింపఁబడి "ముక్తి యేకరూపమే యగుటచే జ్ఞానమాత్రసాధ్యమే. కర్మ నిత్యఫలము నొసంగనేరదు కదా" యని స్థాపింపఁబడును.

పూర్వపక్షము:—సాధనములలోని సామర్థ్యభేదముచే విద్యలయందు గుణభేదము కలిగియున్నట్లు విద్యయందలి గుణభేదముచే తత్ఫల మగు ముక్తియందును భేదము కలుగు ననుటయే యుక్తియుక్తముగా నున్నది. ఆముక్తియందును కలుగు న్యూనాధికత్వభేదము రూపభేదమే కావలయును. ఉపాసన సిద్ధిఁజెందిన యుత్తరక్షణమునందే ప్రారబ్ధకర్మానుభవము ముగిసినను ముగియకున్ననుఁ గూడ ముక్తి కలుగవలయు ననుట నియమము కదా! ఇట్లగుటచే దానియం దైహికాముష్మికభేదము సంభవింపదు. కావున నిర్వివాదముగ నచ్చుట నుండునది రూపభేదమే. ఇట్లు ముక్తియందు స్వరూపభేద ముండునేని యప్పు డది యనిత్యమగును; స్వర్గాదులవలెఁ గర్మసాధ్య మగును. ఇట్లైనఁ బురుషార్థాధికరణసిద్ధాంతము (3. ౪. ౧.) నిర్మూల మగును.

---

## అ-3. పా-౪. సూ-౫౨.

అవతారిక:—ఇట్లు వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

# ౪౭౮. ఏవం ముక్తిఫలానియమ స్తదవస్థావధృతే స్తదవస్థావధృతేః. ౩. ౪. ౫౨.

తాత్పర్యము:—ఇట్లు ముక్తివిషయములో సంశయింపవలసినపని లేదు. ముక్తిస్వరూపమునందు భేద మేమియుఁ గలుగదు. ఏలయనిన సర్వ వేదాంతములయందును ముక్తిస్వరూప మొక్కవిధముగనే నిర్ణయింపఁ బడి యున్నది. ముక్తికిఁ బరమేశ్వరుఁడే స్వరూపము; ఆయన యన్ని స్థలములయందు నొక్కవిధముగనే వర్ణింపఁబడి యున్న దనుటలో సంశయము లేదు కదా! "అస్థూలమనణు...స ఏష నేతి నే త్యాత్మా...యత్ర నాన్య త్పశ్యతి...బ్రహ్మై వేద మమృతం పురస్తాత్...ఇదం సర్వం య దయ మాత్మా...స వా ఏష మహా నజ ఆ త్మాజరోఽమరోఽ మృతోఽభయో బ్రహ్మ...యత్ర త్వస్య సర్వ మా త్మై వాభూ త్త త్కేన కం పశ్యేత్"="పరమేశ్వరుఁడు స్థూలరూపుఁడును గాఁడు, సూక్ష్మరూపుఁడును గాఁడు. ఆపరమేశ్వరుఁడు సర్వప్రపంచమును నిషేధించినపిదప మిగులువాఁడు. ఏస్థలమున పురుషుఁడు రెండవపదార్థమును చూడఁడో ఆసర్వాత్మకపదార్థమే బ్రహ్మము. మనయెదుట గానవచ్చు బహుభేదభిన్నమగు ప్రపంచ మంతయు బ్రహ్మమే. ముక్తిస్వరూపమే. అద్వితీయమే. ఈప్రపంచమేది కలదో అది యంతయు నాత్మయే. మనకుఁ బ్రత్యక్షముగఁ గానవచ్చునీజీవుఁడు సర్వవ్యాపకుఁడు జన్మమృత్యువులు లేనివాఁడు క్షీణింపనివాఁడు భయరహితుఁడు నిత్యముక్తుఁడు పరబ్రహ్మరూపుఁడు. ఏయవస్థయందు జీవునకు సమస్తము నాత్మరూపమే యయ్యెనో ఆయవస్థయందు పురుషుఁడు దేనిని దేనితో చూడఁగలఁడు (చూచువాఁడును సాధనంబులును చూడఁబడుపదార్థంబు నొక్కటియే యైన నిఁక దర్శనవ్యాపారమెట్లు ప్రవర్తించు ననుట)" అనుమొదలగువాక్యము లైకకంఠ్యముగ "పరమేశ్వరుఁడు ఏకస్వరూపుఁడు; న్యూనాధిక భావములు లేనివాఁడు" అని చెప్పుచున్నవి. బ్రహ్మముక్తులకు భేదము లేదు కావున నివి యన్నియు ముక్తినిఁ గూర్చి చెప్పుననియే యగును. ఇట్లు "ముక్త్యవస్థ యేకరూపమైనది" యనుటయే వేదాంతసిద్ధాంత మగుటచే నీవిషయమున భిన్నాభిప్రాయము తగదు.

విచారించిన నెట్లును ముక్తియందు రూపభేదము సాధింపఁబడుటకు వీలు లేదు. ఫలము సాధనసాధ్య మగు నేని యప్పుడు మాత్రమే సాధన సామర్థ్యభేదమువలన నాఫలమునకు భేదము కలుగును. స్వర్గము కర్మ సాధ్య మగుటచేఁ గర్మసామర్థ్యభేదమువలన నందు న్యూనాధికభావము కలుగుచున్నది యనుటయే యీనియమమునకు నిదర్శనము. విద్యయు శ్రవణాదిసాధనసాధ్య మగుటచే సాధనసామర్థ్యభేదమువలన న్యూనాధికభావము కలిగియున్నది యనుటయే దీనికి నిదర్శనము. వాస్తవస్థితిలో విద్యయు జ్ఞానమగుటచే స్వతస్సిద్ధమే గ్రైనను శ్రవణాదులు దానిని పరంపరగా నుత్పత్తిఁ జేయు నని యిదివఱకే చెప్పియున్నాము కదా! ప్రకృతమున మాత్ర మీనియమము ప్రవర్తింపదు. ముక్తి సాధనసాధ్యము కాదు. అది నిత్యము కదా! దానికిని బ్రహ్మమునకును భేదమే లేదని యిదివఱకే చెప్పి యున్నాము. ఈకారణమువలన సాధనసామర్థ్యభేదముచే విద్యకు భేదము కలిగినను విద్యాభేదముచే తత్ఫల మగుముక్తికి మాత్రము భేదము కలుగదు. "ముక్తి స్వభావసిద్ధము; అదియే జీవునియథార్థస్వరూపము" అని తెలిసికొనుట మాత్రమే విద్యాముక్తులకుఁ గలసంబంధము. ఈకారణమువలన నెట్లును ముక్తియందు రూపభేదము లేదు. కల దని పట్టుపట్టిన నప్పు డెట్లుండవలయును? "ముక్తి నిర్విశేషము; క్లేశాది శూన్యము" అని నిరూపింపఁబడెను కావున క్లేశాదివంత మగుముక్తి కూడ నొక్కటి యుండవలసి వచ్చును. ఇది సంభవింపదు కదా యనుట సర్వజన విదిత మగుటచే బునరుక్తియే. మఱియు విచారింపఁబోయిన ముక్తి సాధన మని చెప్పఁబడువిద్యయందును భేదము గానరాదు. ప్రతిబంధ వశమునఁ బ్రస్తుతజన్మముననో జన్మాంతరముననో సిద్ధించు ననుట యొక్కటియే కదా పూర్వాధికరణమున ప్రతిపాదింపఁబడెను. శ్రుతిసందర్భమును విచారించిన దానికి రూపభేదము లేదు. విద్య లన్నియు బ్రహ్మజ్ఞానరూపము లగుటచే నేకరూపములే కదా! భేదము కల దని పట్టుబట్టిన నప్పుడు హీన రూప యగునది విద్యయే కాకపోవలయును కదా! కావున వాస్తవస్థితిలో సాధనమునందును రూపభేదము లేకపోవుటచే తత్సాధ్య మగు ముక్తి యందు దది కలుగదు. "సగుణవిద్యయందు గుణభేదముచే భేదము గానవచ్చుచున్నది కదా!" యని యెదవేమో. అది పరమేశ్వరయథార్థరూపమును ప్రకటించునది కాకపోవుటచే ప్రత్యక్షముక్తి సాధనము కాదు. ఇట్లగు

టచే దానియందు భేదము కానవచ్చినను తద్భేదమువలన తత్ఫలములును యథాసంభవముగ భిన్నము లైనను ముక్తికి మాత్రము రూపభేదము కలుగవలసినపని లేదు. సగుణవిద్యాఫలమునకు భేదము కల దనియు "తం యథా యథోపాసతే త దేవ భవతి" "ఆపరమేశ్వరు నేయేవిధముల నుపాసించునో ఆయావిధములతోనే యేర్పడును" అను మొదలగువాక్యములు చెప్పుచున్నవి. అవి య ట్లుండె. పై నిరూపణమువలన ముక్తికి మాత్ర మెట్లును భేదము లేదు.

విశేషాంశము:—సూత్రమునందు "తదవస్థావధృతేః తదవస్థావధృతేః"అని యొక్కపదమునే రెండుమారులు ప్రయోగించుట యధ్యాయసమాప్తిని బోధించుటకై యని తెలిసికొనవలయును.

# అధ్యాయ తాత్పర్య సంగ్రహము

ద్వితీయాధ్యాయాంతముతో సర్వవిరోధపరిహారపూర్వకముగ వేదాంతవాక్యసమన్వయము స్థిరపరుపఁబడెను. బ్రహ్మము జీవాభిన్నుఁ డనియు ప్రపంచమున కభిన్ననిమిత్తోపాదానకారణ మగుటచేఁ బ్రపంచాభిన్నుఁ డనియు సర్వకాలములయందు నాయనతో నైక్యము కలిగియే యున్నను అనాద్యవిద్యావశమున జీవులు తమ్ము బ్రహ్మాభిన్నులుగాను సంసారులుగాను భావించుచున్నా రనియు తత్త్వజ్ఞానమువలన నీభావన తొలంగునేని యదియే మోక్ష మనియునిరూపింపఁబడెను. ప్రస్తుతతృతీయాధ్యాయమున నాతత్త్వజ్ఞానమునకు ప్రాప్తిసాధనములు సాధకులు నుపదేశింపఁబడిరి. ప్రథమపాదమున పరలోకగమనాగమనవర్ణనముచే సంసారస్వరూపము నిరూపింపఁబడెను; గమనాగమనరూప మగుచక్రభ్రమమే కదా సంసారమునకు స్వరూపము. ఈనిరూపణముచే సంసారమునందలి దుఃఖము తేటపడుననియు దానివలన వైరాగ్యము జనించు ననియు నుద్దేశింపఁబడెను. పరలోకసుఖములు నిత్యములు కాకపోవుటచే నెంత శ్రమపడి యజ్ఞాదుల నాచరించినను బ్రయోజనము లేకపోవుటయు అధర్మలేశ మైనను లేకుండ నుండనచ్చు ననుట నియతముగ నీసంభవ మగుటచే నెట్టివాఁ డయినను మఱలమఱల భూలోకదుఃఖము ననుభవింపవలసినవాఁడే యగుచుండుటయు పూర్వజన్మసంస్కారమువలన నాయధర్మమే కొంత యధిక మగునేని వానికి పుణ్యలోకమార్గమును త్రొక్కుటకైనను

భాగ్యము లేకపోవుటయు మొదలగుదుఃఖపరంపరలు విచారణశీలుర చిత్తమును విరక్తమును గావించు నని యుద్దేశింపఁబడెను. వైరాగ్యము లేకున్నఁ దత్త్వజ్ఞానేచ్ఛయే జనింపదు కావున నది మొదట వర్ణింపఁబడెను. రెండవ పాదమునందు ఐక్యసిద్ధికై జీవబ్రహ్మస్వరూపములు నిరూపింపఁబడెను; పరమపురుషార్థము నిరర్ణింపఁబడెను. మూఁడవపాదమున పురుషార్థ సాధనములగు బ్రహ్మవిద్యలయొక్క సంఖ్యయు గుణోపసంహారంబును నిర్ణయింపఁబడెను; నిర్గుణసగుణవిద్యలకు రెంటికిని ఫల మొక్కటియే యను విషయముద్దేశింపఁబడెను. నాల్గవపాదమున విద్యాబహిరంగసాధనము లగు యజ్ఞాదులును అంతరంగసాధనము లగుశ్రవణాదులును నిరూపింపఁబడెను. అధికారులుఁగూడ నిక్కే నిరూపింపఁబడిరి. ఈవిధముగ తృతీయాధ్యాయ సమాప్తితో సాధనసాధ్యస్వరూపములు ప్రతిపాదింపఁబడెను. ఇఁక ఫల స్వరూప మొక్కటియే శేషించియున్నది.

బ్రహ్మసూత్రార్థచంద్రికయందు తృతీయాధ్యాయమునఁ జతుర్థపాదము.

తృతీయాధ్యాయము ముగిసెను.





# బ్రహ్మసూత్రార్థచంద్రిక

## చతుర్థాధ్యాయము - ప్రథమపాదము.

శ్లో. విశుద్ధసత్త్వాభవదోషవర్త్మనా
అకామనాకామితనైజవృత్తయః;
క్రమేణ గచ్ఛంతి విధాతృమందిరా
ద్యమేకమత్రాపి తమీశమాశ్రయే.

---

## అవతారిక.

తృతీయాధ్యాయమున విద్యాసాధనములంగూర్చి విచారింపఁబడెను కదా! ఈయధ్యాయమున తత్ఫలమగుముక్తినిఁగూర్చి విచారింపఁబడును. *క్రమముక్తినిఁగూర్చియు †జీవన్ముక్తినిఁగూర్చియు ‡విదేహముక్తినిఁగూర్చియు విచారింపఁబడును. ప్రథమపాదమున జీవన్ముక్తియు ద్వితీయపాదమున జీవుఁడు శరీరమునుండి నిర్గమించుప్రకారంబును తృతీయపాదమున బ్రహ్మవేత్త దేవయానమార్గమునఁ బోవువిధంబును చతుర్థపాదమునఁ

---

* క్రమముక్తి (అ-3. పా-౧. సూ-౧౨. పేజీ-40 చూ.)

† జీవన్ముక్తి యనఁగా బ్రహ్మజ్ఞానము కలిగియుఁ లోకానుసారముగ ప్రారబ్ధవశమునఁ బ్రవర్తించుచు నసంగుఁడై యుండుట అనారబ్ధాధికరణమునందును ఇతరక్షపణాధికరణమునందును దీనిస్వరూపము స్పష్టము.

‡ దేహపాతానంతరమునఁ గలుగునిర్విశేష బ్రహ్మైక్యము.

బూర్వార్ధమున విదేహముక్తియు నుత్తరార్ధమునఁ గ్రమముక్తియు వర్ణింపఁబడును. ఇట్లగుటచే నీరెండధ్యాయములకును హేతుహేతుమద్భావ సంగతి. సాధనవిచారము లేక ఫలవిచారము ప్రవర్తించుటకు వీలు లేదు కావునఁ దృతీయాధ్యాయము హేతువు; దాని నాశ్రయించి ప్రవర్తించునది కావున నీయధ్యాయము హేతుమత్తు (కారణముచే సాధింపఁదగినది యనుట.)

అందు ఈ ప్రథమపాదమున మొట్టమొదటి కొన్నియధికరణముల వఱకు సాధనములను గూర్చినవిచారమునందలి శేషమే విచారవిషయమై ప్రవర్తించును. పూర్వాధ్యాయమున శ్రుతిచేఁ బ్రత్యక్షముగ విధింపఁబడి యున్నంతవఱకు మాత్రమే సాధనధర్మములు విమర్శింపఁబడినవి. ఇప్పుడు ప్రమాణాంతరములవలన సిద్ధించుసాధనధర్మములు విమర్శింపఁబడు ననుటయే యధ్యాయభేదమునకు (తృతీయాధ్యాయమున నుపక్రమింపఁబడియున్న విచారమునే చతుర్థాధ్యాయమునఁగూడ ననుసరించుటకుఁ) గారణము. ఇట్లే యధ్యాయమున నంతటను ప్రస్తావానుసారముగ వచ్చినకొన్ని విషయములు కూడ చర్చింపఁబడును. బహువిషయములతోఁ గూడినది యగుటచే నీయధ్యాయమున నంతటను బూర్వపక్ష సంశయాదులు ఆయాయధికరణములయొక్క యారంభములయందే నిరూపింపఁబడును; అచ్చటనే విశేషములు విమర్శింపఁబడును.

---

## ౧. ఆవృత్త్యధికరణము

విషయ సంశయ సంగతులు:—"ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః. త మేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత. సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః" "ఓ మైత్రేయీ! ఆత్మను సాక్షాత్కరింప వలయును వినవలయును మననముచేయవలయును ధ్యానింపవలయును. ఆపరమేశ్వరు నెఱింగి విద్వాంసుఁ డగుబ్రాహ్మణుఁడు స్వానుభవమును సమకూర్చుకొన వలయును. ఆ పరమేశ్వరుని వెదుక వలయును. తెలిసికొనవలయును" అను నిత్యాదివాక్యములే యీయధికరణమునకు విషయవాక్యములు. "ఈవిధుల నన్నిటి నొక్కమాఱు మాత్రమే

యాచరింపవలయునా? లేక పలుమా ఱాచరింపవలయునా?" అనునది యిందు నివారణీయ మగుసంశయము. "వీని (శ్రవణాదుల) నొక్కమాఱే యాచరించిన ఫలసిద్ధి కలుగుట యప్రత్యక్ష మగుటచేతను రెండవ మా ఱాచరించుటకు వీలు లేకపోవుటచేతను శ్రవణాదులు బ్రహ్మజ్ఞానమున కు సాధనము లగు ననువిషయము సంశయాస్పదము" అనుట పూర్వ పక్షమునకు ఫలము. "ఫలము కలుగునంతవఱకు శ్రవణాదుల నెన్ని మాఱులైనఁ జేయుట శాస్త్రసిద్ధమే యగుటచేనవి నియతముగ జ్ఞానమును సాధింపఁగలవు." అనుట సిద్ధాంతమునకు ఫలము. ఇది పాదమునకు ప్రథ మాధికరణము గావున సంగతి ప్రత్యేకముగ లేదు.

పూర్వపక్షపాదసంగతియే దీనికిని సంగతి:—విచారించిన నీవిధు లన్నియు నొక్కమాఱే యాచరింపవలసిన వని తోఁచుచున్నది. ముక్తి యనునది మిగుల బరోక్షమైయున్నది. ఇట్లగుటచే దానినిఁగూర్చి చేయఁ బడవలసినశ్రవణాదులు శాస్త్రోక్తప్రకారముగా మాత్రమే చేయఁబడ వలయునుగాని మఱియొకవిధముగఁ జేయఁబడుటకు వీలు లేదు. వానివలన కలుగుఫలము ప్రత్యక్షము కాకపోవుటచే శాస్త్రోక్తవిధానము నాచరించిన సరిపడునే కాని మనము స్వబుద్ధి నుపయోగించినచో నేది యెట్లగునో తెలియదు కదా! ఈకారణమువలన శాస్త్రానుసారముగ నీసర్వవిధులు నొక్కమాఱు మాత్రమే యాచరింపఁబడవలసినవియే. "ఇట్లు కాదు. వేదమునందు అనేకస్థలములలో నిట్లే విధింపఁబడి యున్నది. ఇట్లగుటచే శ్రవణాదులఫలము గలుగు పర్యంతము పలుమాఱు చేయుచుండవల యును" అనియెదవేమొ యది సరి కాదు. ఏప్రకరణమున జెప్పఁ బడినవిధి యాప్రకరణమునకు మాత్రమే సంబంధించును గావున సర్వ ప్రకరణముల సమగ్రముగ నొక్కమాఱు వినవలయు విమర్శింపవలయును. తదర్థమును ధ్యానింపవలయు నని మాత్రమే యావిధులవలనఁ దేలును. ఇంతకంటె నధిక మేదియు లేదు. కావున శ్రవణాదు లొక్కమా ఱాచ రింపఁబడవలసినవియే. వీనివిషయమే ఇట్లుండ "ఉపాసీత వేద" అను మొదలగు విధులనుగూర్చి వేఱుగఁ జెప్పవలసిన దేమి? అవి యొక్క మాఱే విధింపఁబడిన వగుటచే నిస్సంశయముగ నొక్కమాఱే యాచరింపఁ బడవలసినవియే యగును.

## అ-౪. పా-౧. సూ-౧.

అవతారిక:—అని యిట్లు వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౪౭౯. ఆవృత్తిరసకృదుపదేశాత్. ౪. ౧. ౧.

తాత్పర్యము:—ఈపూర్వపక్షము యుక్తియుక్తమైనది కాదు. ఫలము కలుగునంతవఱకుఁ బలుమాఱు శ్రవణాదుల నాచరింపవలయు ననుటయే సిద్ధాంతము. వేదమునందును "శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అని పలుమాఱు లుపదేశింపఁబడి యున్నది కదా! అందొక్కస్థలమును విమర్శించినను మాసిద్ధాంతమే తేలును; మనననిదిధ్యాసనముల నొక్కమాఱు (ఒక్కచిత్తవృత్తిపుట్టి నశించునంతలో) చేసి యూరకుండుట శక్య మగునా? "దీనికి సమాధానమును చెప్పియున్నాము. వేదమున నున్నంతవఱకే శ్రవణాదుల నాచరింపవలయు నంతియకాని యధికముగ నాచరింపరా దంటిమి కదా!" అనియెదవేమొ అది యుక్తము కాదు. శ్రవణాదులకు సాక్షాత్కారమే ఫలము. సాక్షాత్కారమనఁగా త్రాటియందుఁ గలసర్పభ్రాంతి తొలఁగిన త్రాడు ఎప్పటికి నొక్కవిధముగనే యుండియు బ్రత్యక్షమైనట్లు (అనఁగా క్రొత్తగఁ బ్రత్యక్షమైనదానివలె తోఁచునట్లు) స్వస్వరూపభూతుఁ డగుపరమేశ్వరుఁడు ప్రత్యక్షమగుటయే ఈకారణమువలన దానికి (సాక్షాత్కారపదమునకు) నవిద్యాధ్వంస మని యర్థము చెప్పుటయే మిగుల యుక్తియుక్తముగ నుండును. ఇట్లు ప్రత్యక్షఫలము లగుటచే శ్రవణాదులు ఫలప్రాప్తిపర్యంత మెన్నిమాఱులైన నాచరింపఁబడవచ్చు ననుటయే నిర్ణయము. లోకమునందును శాస్త్రార్థము నెఱుంగఁగోరువాఁడు అది తెలియఁబడునంతవఱకుఁ బలుమాఱు శ్రవణాదుల జేయుచుండు ననుట ప్రత్యక్షసిద్ధ మయ్యే యున్నది. సర్వశాస్త్రములయందు నీన్యాయము సమాన మైయుండ వేదాంతశాస్త్రమునందు మాత్ర మిది యేల లేకపోవును? సాక్షాత్కారంబును అవిద్యానాశరూపమే కావున నప్రత్యక్షము కానేరదు. విద్యావిద్యలకు గలవిరోధ మప్రత్యక్షము కాదు కదా! విద్యయు శ్రవణాదులచే జనించు ననుటకు పైదృష్టాంతమే "శాస్త్రార్థము నెఱుంగఁగోరువాఁడు లోకమున

శ్రవణాదుల నాచరించుచున్నాఁడు” అను దృష్టాంతమే చాలును. ఇట్లగుటచే ఫలోత్పత్తివఱకు విడువకఁ జేయఁబడు దంచుట మొదలగు లౌకిక కర్మములవలె నీశ్రవణాదులును పలుమా ఱాచరింపఁబడవలసినవియే.

“ముక్తి పరోక్ష మని యిదివఱకే చెప్పియున్నాము. ఇట్లుండ శ్రవణాదులఫలము ప్రత్యక్ష మగుట యెట్లు?” అనియెదవేమొ వినుము. ఈయాక్షేపమువలన నీయభిప్రాయమేమి? “విద్య ముక్తిని కలిగించును” అనుట ప్రత్యక్షము కా దనియా? లేక “శ్రవణాదులు విద్యను కలిగించును” అనుట ప్రత్యక్షము కా దనియా? ఇం దేపక్షంబును సరి కాదు. ముక్తి యనునది యప్రత్యక్షమే యగుగాక; అది జ్ఞానము కలుగఁజేయు ననుటలో విరోధ మేమియు నుండదు. అజ్ఞాననివృత్తియే ముక్తి యని వేదము చెప్పుచున్నది; జ్ఞానోత్పత్తి యజ్ఞాననాశక మనువిషయము గూడ సుప్రసిద్ధమే యై యున్నది. ఇప్పుడు జ్ఞానఫలము దృష్టమే (ప్రత్యక్షమే) యయ్యెను కదా! ఇఁక శ్రవణాదులవిషయమును విమర్శింపఁబోయిన నది సదృష్టాంతముగ నిదివఱకే నిరూపింపఁబడెను. “లోకమున శ్రవణాదులచే సర్వశాస్త్రార్థజ్ఞానములు నెట్లు కలుగుచున్నవో అట్లే వేదాంతశాస్త్రార్థ జ్ఞానముఁ గూడ కలుగును” అని యనుమానముచే వానివిషయమును (శ్రవణాదులు జ్ఞానమును ప్రత్యక్షముగనే యొసంగఁగలవు” అను విషయమును) నిర్ణయింపవచ్చును కదా! కావున శ్రవణాదులఫలము పరోక్షము కానేరదు; కాకున్న వానిని మఱల మఱల నాచరించుటలో విరోధ ముండదు. స్వర్గాదులు ప్రత్యక్షములు కావు కావున వానినిఁ గూర్చి చేయఁబడుకర్మలు కేవల శాస్త్రము నాశ్రయించియే చేయఁబడవలయును గాని యిచ్చట నట్టినిర్బంధము లేదు. శాస్త్రముకూడ మాసిద్ధాంతమునే బోధించుచున్నవి యని మొట్టమొదటనే నిరూపించితిని కదా!

కావున నిర్వివాదముగ శ్రవణాదులు ఫలోత్పత్తిపర్యంతము పలుమా రాచరింపఁబడవలసినవియే. దేనికైనను ప్రత్యక్షఫలము సంభవించుచుండ పరోక్షఫలమును కల్పింపరాదు కదా! మఱియు నీశ్రవణాదులకు లోకదృష్టి ననుసరించి చూచిన తమయభివృద్ధితోఁ గూడఁ దత్క్షణమే ఫలము నొసంగుటయే స్వభావము గాని చిరకాలమునకు ఫలోత్పత్తి నొనర్చుటఁగాదు. కావున వేదాంతశాస్త్రము నభ్యసించుటకు నుపక్రమించి నదిమొదలు ఫలసిద్ధి కలుగునంతవఱకు శ్రవణాదు లుండవలసినవియే;

ఎన్నిమాఱు లైన నావృత్తి నొందింపవలసినవియే. “అగునుగాక యిప్పటి
కిని యాసిద్ధాంతము నిలువదు. ‘నీవు యథార్థస్థితిలోఁ బరమేశ్వరుఁడవు’
అని చెప్పినతోడనే ప్రతివానికిని జీవబ్రహ్మైక్యము గోచర మగుచునే
యున్నది. ఆబ్రహ్మరూపమును స్వయముగ ననుభవింపకున్నను జ్ఞానము
మాత్రము కలదు కదా! కావున శ్రవణాదుల నొక్కమాఱాచరించిననే
చాలును.” అనియెదవేమొ వినుము. ఇది సంభవింపదు. ‘బ్రహ్మమే నేను’
అను నపరోక్షజ్ఞానము దృఢముగ కలిగిననే గాని యవిద్య సంపూర్ణ
ముగ నశింపదు. అనాదినుండియు నీయవిద్య యపరోక్షరూపముగనే
యున్నది కదా! సమానమగుధర్మమున కలవి కాని యొండొంటిని బాధింప
నేరవనుట లోకశాస్త్రప్రసిద్ధము. ఈకారణమువలన జ్ఞానమనఁగా నప
రోక్షజ్ఞానమే యని తెలిసికొనవలయును. దోషప్రకోపమువలన బెల్లము
చేదుగా నున్న పురుషునకు గల భ్రాంతిజ్ఞానము, దోషసామ్యముచే మఱల
నది తియ్యనై గానవచ్చినప్పుడు మాత్రము నశించునుగాని మఱియొక
ప్పుడు కాదు కదా! ఈదృష్టాంతమునఁ జూడుఁడు. దోషప్రకోప మున్న
ప్పుడు రసనేంద్రియములకు చేదు ప్రత్యక్షముగ దోచినది; దానిని దోష
సామ్యమువలన తియ్యదనమునుఁగూర్చి కలిగిన ప్రత్యక్షజ్ఞానమే నశింపఁ
జేసినదికదా! ఇట్లే యిచ్చటగూడఁ బ్రత్యక్ష మగుయవిద్య నట్టివిద్యయే
కాని నశింపఁజేయలేదు. చేదు ననుభవించుచున్నప్పు డెవ్వఁడెన్ని మాటలు
చెప్పినను దోషప్రకోపము గలవాఁడు బెల్లముపై నభిమాన ముంపనట్లు
అవిద్యావశగతుఁడై యున్నవాఁడును మాటలచే బ్రహ్మస్వరూపాభిమా
నము నుంపనేరఁడు. ఈకారణమువలన నపరోక్షజ్ఞానము కలుగునంతవఱకు
నిస్సంశయముగ శ్రవణాదుల బలుమాఱాచరింపవలసినదియే.

ఇది శ్రవణాదుల తెఱంగు “వేద ఉపాసీత” అను మొదలగు పద
ములచే విధింపఁబడిన యుపాసనలవిషయము కూడ నిట్టిదియే. “పలుమా
ఱాచరింపఁబడవలయును” అనునర్థ మాపదములయందు (“వేద ఉపాసీత”
అను పదములయందు) స్వాభావికముగనే యున్నది. లోకమునందు
గురువునందుఁగాని ప్రభువునందుఁగాని యధికభక్తి గలిగి పలుమాఱు వారి
నామరూపచేష్టాదు లను స్మరింపుచు వారికే వందనాదుల వివిధోపచార
ములఁ బలుమాఱాచరింపుచు నుండువారినిఁ గూర్చియే “వీఁడు గురువు
నుపాసించుచున్నాఁడు; ప్రభువు నుపాసించుచున్నాఁడు” అను మొదలగు

వ్యవహారములు ప్రవర్తింపఁజేయఁబడుచున్నవి. సర్వకాలములయందును పలుమాఱు పతిని దలంచుచు నుండుయువతినిఁ గూర్చియే "ఈపతివ్రత తనపతిని ధ్యానింపుచున్నది" యనువ్యవహారము ప్రవర్తింపఁజేయఁబడు చున్నది. ధ్యానాదులును ఉపాసనయందుఁ జేరినవియే కదా! ఈకారణమువలన నుపాసనావిధులయందు ఉపదేశము మాత్ర మొక్కమాఱే యున్నను శబ్దశక్తిచేతనే యావృత్తి (పలుమాఱు చేయఁబడవలయుట) సూచింపఁబడుచున్నది. కావున నన్నియుపాసనలు శ్రవణాదులను పరమేశ్వరసాక్షాత్కారపర్యంతము పలుమాఱు ఆచరింపఁబడవలసినవియే.

"ఇందును విరోధము కలదు. 'ఉపాసీత' యనుపదమున నొకవేళ మీరు చూపినసామర్థ్యమున్నను 'వేద' అనుపదమున లేదు కదా!" యెదవేమొ వినుము. లోకముననైన నిట్లే భావింపవచ్చునుగాని వేదమున నట్లుచేయుటకు వీలులేదు. అందు యీపదములు రెండును సమానార్థకములుగా నుపయోగింపఁబడియున్నవి. కొన్ని ప్రకరణములయందు "ఉపాసీత" యనుపదముతో నుపక్రమించి "వేద" యనుపదముతోను, మఱి కొన్నిస్థలములయందు "వేద" అనుదానితో నుపక్రమించి "ఉపాసీత" యనుదానితోను (యీధాతువులతో ననుట) ఉపసంహరింపఁబడి యున్నది. "యస్తద్వేద యత్స వేద స మయైతదుక్తః అను మ ఏతాం భగవో దేవతాం శాధి యాం దేవతా ముపాస్తే" అనువాక్యములలో మొట్టమొదటిది యుపక్రమవాక్యము. ఇది "వేద" అనుపదముతో నారంభించి యున్నది. రెండవది యుపసంహారవాక్యములయందు 'ఉపాసీత' యనుపదము కలదు. "మనో బ్రహ్మే త్యుపాసీత...భాతి చ తపతి చ కీర్త్యా యశసా బ్రహ్మవర్చసేన య ఏవం వేద." ఇచ్చటఁగూడ మొదటి యుపక్రమవాక్యమున "ఉపాసీత" యనుపదంబును రెండవది యగు నుపసంహారమున "వేద" యనుపదంబును కలదు. ఇట్లగుటచే వేదాంత శాస్త్రమునందుమాత్ర మీరెండును సమానార్థకములే; ఈకారణమువలన సమానధర్మములే. కావున నొక్కమాఱే యుపదేశము కలదని చెప్పఁ బడియున్నస్థలములందుఁగూడ నావృత్తి సిద్ధించినది. పలుమాఱుపదేశము గలస్థలములనుగూర్చి యిదివఱకేచెప్పియున్నాము. ఆస్థలముల బ్రత్యేకముగ గ్రహించినను ఆవృత్తియే సూచింపఁబడు నని తెలిపియున్నాము.

కావున ఫలసిద్ధి కలుగునంతవఱకు నుపాసనలుగాని శ్రవణాదులుగాని మరల మరల నాచరింపఁబడవలసినవియే.

## ౪౮౦. లింగాచ్చ. ౪. ౧. ౨.

తాత్పర్యము:—ఇంతయేల ? ఈవిషయమును నిరూపించుటకు శ్రుతియందుఁ జే లింగము కలదు. ఉద్గీథవిద్యయందు "ఆదిత్య ఉద్గీథః" "సూర్యుఁడే యుద్గీథము" అని యారంభించి "సూర్యు నొక్కనినే యుద్గీథముగా నుపాసించిన నొక్కపుత్త్రుఁడు మాత్రమే కలుగును" అని యాయుపాసనను నిందించి "రశ్మీం స్త్వం పర్యావర్త్యాత్"="నీవు కిరణముల నావర్తింపవలయును (అనేకము లని తెలిసికొనవలయును. పలుమాఱు చింతింపవలయు ననుట)" అని చెప్పి "ఇట్లయిన ననేకపుత్త్రులు కలుగుదురు" అని ప్రశంసింపఁబడి యున్నవి. ఆవృత్తి స్వరూపమును చెప్పకయే యిచ్చట లోకసిద్ధ యగునావృత్తి యుపదేశింపఁబడి యున్నది. ఇదియు జ్ఞానావృత్తియే కావున సర్వజ్ఞానములకు నావృత్తి కల దని దీనిచే సూచింపఁబడుచున్నది. కావున నిర్వివాదముగ సర్వజ్ఞానములును ఫలపర్యంత మావర్తింపఁబడవలసినవియే.

విశేషాంశము పూర్వపక్షము:— ఈయావృత్తిసిద్ధాంతము అన్నియుపాసనలవిషయమునందును సంభవింపనేరదు. ఆయుఃపుత్రకీర్త్యాది ఫలముల నొసంగునుపాసనలవిషయమునందు మాత్రమే సంభవించును. ఏల యనిన:— ఆయుపాసనలయొక్క ఫలములు మాత్రమే (ఆయుః పుత్రకీర్త్యాదులు మాత్రమే) (కర్మ) సాధ్యము. (కర్మ) సాధ్యము లగుటచే కర్మావృత్తివలన వానికి నాధిక్యము సంభవించును. నిర్గుణమై నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావమై యుండు పరబ్రహ్మమును దెలుపునుపాసనలవిషయము మాత్ర మిట్టిది కాదు. వానికి ఫల మగుపరమేశ్వరసాక్షాత్కారము (కర్మ) సాధ్యము కాదు. విచారించిన పరబ్రహ్మమునకును తత్సాక్షాత్కారమునకును భేదమే లేదు. ఈయుభయమునకును జ్ఞానమే స్వరూప మగుటచే భేదము లేదు. ఇట్లగుటచే బ్రహ్మంబు నిత్యము ; తత్సాక్షాత్కారంబును నిత్యంబే. ఇట్లున్న నిఁక నీసాక్షాత్కారమునకుఁ గర్మావృత్తిచే గలుగునాధిక్య మేమి ? నిత్యంబును నిర్విశేషంబు నగు పదార్థమునకుఁ గర్మలు వృద్ధిక్షయముల నొసంగనేవు కదా ! కావున పర

మేశ్వరసాక్షాత్కారసాధనము లనఁబడునుపాసనల మాత్ర మొక్కమాఱే యాచరింపవలయు ననవలయును. అప్పుట నావృత్తి నిష్ప్రయోజన మని నిరూపించితిమి కదా!

"ఈపక్షము యుక్తము కాదు. ఒక్కమాఱు వినినంతమాత్రమున జీవబ్రహ్మైక్యజ్ఞానము కుదురుట సంభవింపదు. ఇట్లగుటచే శ్రవణమనన ములు బలుమాఱాచరింపవలయు ననుటయే సిద్ధాంతము. 'బ్రహ్మసాక్షాత్కారము బ్రహ్మస్వభావమే యని చెప్పితిని కదా!' అనియెదవేమొ యది యుక్తము కాదు. ఈపక్షంబును శ్రుతిసమ్మతమే యైనను ఉపాసనలచే గలుగవలసినసాక్షాత్కారము మాత్ర మది కాదు. ఆసాక్షాత్కార మవిద్యను తొలఁగింపనేరదు. ఒకపక్షమున బ్రహ్మమునకు నవిద్యకును విరోధమే లేదు; రెండవపక్షమున నట్టివిరోధమును సాధింపఁబోయినచో నవిద్య జనించుటకే వీలు లేదు. పరమేశ్వరుఁడు నిత్యుఁడు కదా! ఒకప్పుడాయన నెఱుంగఁబడకుండు ననుట యెట్లు సంభవించును? లోకమునందును అవిద్య సర్వానుభవసిద్ధమై యున్నది; దానినివృత్తియే ముక్తి యని శ్రుతిస్మృతులచే జెప్పఁబడుచున్నది. కావున నీకార్యమునకై (అవిద్యను తొలఁగించుటకై) మఱియొకవిధ మగు సాక్షాత్కారమునే యంగీకరింపవలయును. అదియే యుపాసనలచే కలిగింపఁబడు ననవలయును. అది సాధ్యమే యగుటచే ఆయుఃపుత్త్రాదిఫలములకు వలెనే దానికిఁగూడఁ గర్మావృత్తివలన నాధిక్యము కలుగవచ్చును. ఈకారణమువలన పరబ్రహ్మము దెల్పునుపాసనలకుఁగూడ నావృత్తి యావశ్యకమే." అనియెద వేమొ యదియు యుక్తము కానేరదు. అప్పటికిని ఉపాసనావృత్తివలనఁ బ్రయోజనము లేదు. వాక్యము నెన్నిమాఱులావర్తించినను అపరోక్షసాక్షాత్కారము కలిగింపనేరదు. అపరోక్షసాక్షాత్కారము ప్రత్యక్షప్రమాణసిద్ధము; వాక్యమన్ననో పరోక్షార్థప్రతిపాదకము. ఈరెంటికిని సంబంధ మెట్లు కుదురును? ఏదియో యొకవిధముగ నట్టిజ్ఞానము కలిగినను అది కేవలమానసిక మగుటచే భ్రాంతి యగునేకాని పరమార్థము కానేరదు. మఱ్ఱివిత్తనమువలన జువ్విచెట్టు జనించె ననిన నెవ్వరు విశ్వసింతురు? ఇట్లు కాక యేదియో యొకవిధముగ నీపక్షమును ("వాక్యావృత్తివలనఁ గూడ నపరోక్షజ్ఞానము జనింపవచ్చును" అనుపక్షమును) సాధించినను ఆవృత్తి మాత్రము సఫలము కానేరదు. అప్పటికిని

ఒక్కమారు (వాక్యము) వినఁబడినంతమాత్రముననే యాసాక్షాత్కారము జనింపవచ్చును కదా! "తత్త్వమసి" అని యొక్కమారు చెప్పినప్పుడు "జీవబ్రహ్మములకు భేదము లేదు" అనువిషయము తెలియఁబడకుండిన నిఁక నెన్నిమారులు చెప్పిన నేమి ప్రయోజనము? కావున నెప్పటికిని బ్రహ్మసాక్షాత్కారఫలము లగునుపాసనలవిషయమున నావృత్తి సంభవింపదు; బ్రహ్మసాక్షాత్కారము బ్రహ్మస్వభావము కాకున్నను సంభవింపదు. అది (బ్రహ్మసాక్షాత్కారము) మనోవృత్తిరూపమే యైనను అపరోక్షము మాత్రము కాకపోదు కదా!

"ఇట్లును చెప్పుటకు వీలు లేదు. మేము కేవలవాక్యావృత్తినిఁ జెప్పుట లేదు. అట్లయిన కదా యది యపరోక్షజ్ఞానమును కలిగింపలేకపోవుట. ఇఁక నేమి యనిన 'యుక్తిసహకృత మగువాక్యమే యట్టిజ్ఞానమును కలిగించును' అనుచున్నాము. 'కేవలవాక్యమేవిషయమును కూడ నిర్ణయింపదు. దానియర్థమును అనుకూలతర్కముచే స్థిరపరుపవలయును.' అనుట సర్వలోకప్రసిద్ధము కదా!" అనియెదవేమొ అప్పటికిని ఆవృత్తివలనఁ బ్రయోజనము లేదు. ఆయుక్తియే యొక్కమారు వాక్యార్థమును నిర్ణయించినఁ జాలును గదా! అర్థనిర్ణయ మొక్కటియే కావలసినది కాని దానిని పలుమారు చేయవలయు ననుట కావశ్యకత లేదు కదా! కల దనిన పైనఁజూపఁబడినదోషము లన్నియు వచ్చును. ఒక్కమారు చేయఁబడినయర్థనిర్ణయము ఫలము (సాక్షాత్కారము) నొసంగలే దనినఁ బలుమారులు చేయఁబడుటవలనమాత్రము దాని నెట్లు కలిగింపఁగలుగును? ఎన్నిమారులు చేయఁబడినను అర్థనిర్ణయ మొక్కటియే కదా! కావున నెట్లును ఆవృత్తికి బ్రయోజనము లేదు; పరబ్రహ్మవిషయకము లగువిద్యలవిషయమున బ్రయోజనము లేదు.

"ఈవిషయమున నొకవిశేషము కలదు. వాక్యముగాని దానికి సహాయకారి యగుయుక్తికాని యనుభవరూప మగువిశేషజ్ఞానమును కలిగింపనేరదు. అనుభవము ప్రత్యక్షరూప మనియు వాక్యాదులు పరోక్షార్థమును చెప్పు ననియు నిదివఱకే నిరూపించి యున్నాము కావున వాక్యయుక్తులు సామాన్యవిషయమును మాత్రమే బోధింపఁగలవు. 'నాకు హృదయమునందు శూల కలదు. చూడుము. శరీర మెట్లు వణఁకుచున్నదో?' అని చెప్పిన నప్పుడు పరుఁ డెంతమాత్రము గ్రహించును?

సామాన్యముగ శూల కల దని మాత్రమే కదా గ్రహించును; విశేషము నించుక యైన ననుభవింపఁడు కదా! ఆయనుభవము రోగికి మాత్రమే కదా కలదు! ఈకారణమువలన వాక్యయుక్తులవలన ప్రత్యక్షరూప మగు సాక్షాత్కారము జనించుటకు వీలులేదు. ఇట్లగుటచే నాసాక్షాత్కారము నకై యావృత్తి యంగీకరింపఁబడెను. మొట్టమొదట జనించినది సామాన్య జ్ఞానమే యైనను యెడతెగక బలుమా ఱభ్యసింపఁబడుటవలన దృఢపడి యదియే యపరోక్షానుభవమును బుట్టించును. నటులు స్త్రీవేషాదుల ధరించి యభ్యాసానుసారముగ నభినయించునప్పుడు తొలుదొల్త 'నేనుస్త్రీ వేషమును ధరించి యున్నాను' అనుజ్ఞాన మున్నను విశేషరూప మగునను భవజ్ఞానము లేకున్నను అంతమునకు తద్రూపత్వమును (వేషమునకును తనవాస్తవరూపమునకు నభేదదృష్టియే) యేర్పడు ననుట స్పష్టమే కదా! ఇచ్చట మొట్టమొదట వేషమునుగూర్చిమాత్రమే యున్నజ్ఞానము సామాన్యజ్ఞానము; దానివలననే యంతమునకు ననుభవజ్ఞానము కలిగినది. ఇట్లే యిచ్చటఁగూడ కలుగవచ్చును. ఇట్లు కలుగుటకయ్యే యావృత్తి యంగీకరింపఁబడెను" అనియెదవేమొ వినుము. ఇప్పటికిని మీసిద్ధాంతము నిలువదు. సామాన్యజ్ఞానమును కలిగింపఁగలశాస్త్రయుక్తులు యెన్నిమాఱు లావర్తింపఁబడినను తద్విరుద్ధముగ విశేషజ్ఞానము నెట్లు జనింపజేయఁగలు గును? ఎంతదోహదమును (దోహద మనఁగా వృక్షముల నభివృద్ధిచేయు టకై యుపయోగింపఁబడునెరువు మొదలగునవి) గావించినను మామిడి ముట్టెనుండి నిమ్మచెట్టు పుట్టునా? ఇట్లుకాక ఆయుక్తులచే నిర్ణయింపఁబడిన వాక్యార్థము సామాన్యరూప మైనను భావనాబలముచే విశేషజ్ఞానముగఁ బరిణమించు నని కాని విశేషజ్ఞానమును జనింపఁజేయునని కాని చెప్పుటయు యుక్తియుక్తముగ నుండదు. అప్పటికిమాత్రము సామాన్యభావనచే విశేషజ్ఞానము జనించు ననుట ప్రత్యక్షవిరుద్ధము కదా! కావున నెట్లును ఆవృత్తికిఁ బ్రయోజనములేదు. శాస్త్రయుక్తులు సామాన్యజ్ఞానమునే కలిగించు ననినను మీరన్నట్లు విశేషజ్ఞానమునే కలిగించునని యంగీకరించి నను గూడ నావృత్తి యక్కఱలేదు. దేనికి దేనిని జనింపజేయఁగల సామర్థ్య ముండునో యది దాని నొక్కపర్యాయమునకే జనింపఁజేయఁ గలుగునుకదా! వామదేవాదులవృత్తాంతము విచారించిన బుద్ధిమంతుఁ డగువాఁ డొక్కమాఱునకే సాక్షాత్కారము నొందవచ్చు నని తేలు

చున్నది. ఆవామదేవుఁడు గర్భస్థితుఁడయ్యే విజ్ఞానవంతుఁ డయ్యెను కదా! కావున వాక్యయుక్తులు విశేషజ్ఞానము నొసంగఁగలవని యంగీకరించినను మీసిద్ధాంతము నిలువదు.

ఇది యంతయు నిట్లుండఁ బరమేశ్వరునియందు విచారించినచో సామాన్యవిశేషభావమే యుండుటకు వీలు లేదు. ఆయన నిరవయవుఁడు సచ్చిదానందస్వరూపుఁడు నిర్విశేషుఁడు. ఈయనవిషయమున దెలిసికొనుటయో తెలిసికొనకుండుటయో మాత్రమే కాని యితర భేదము లేవియు నుండుటకు వీలులేదు. అనేకభాగములతో సందర్భములతోఁ గూడియున్నవగుటచే లోకవ్యవహారములు మాత్ర మొకప్పుడు కొంచెముగాను మఱియొకప్పు డధికముగాను తెలిసికొనఁబడుచు సామాన్యవిశేషజ్ఞానములకు నాస్పదములు కావచ్చును గాని పరమేశ్వరుఁడు మాత్ర మట్లు కానేరఁడు. ఆయన కవయవములు లేవు కదా! కావున నెట్లు విచారించినను పరమేశ్వరప్రతిపాదకము లగువిద్యలకు మాత్ర మావృత్తి సంభవింపదు.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఆవృత్తి యంతట నుండవలసినదియే. "తత్త్వమసి" అను మొదలగునుపదేశము లొక్కమాఱు గావింపఁబడినంతమాత్రముననే సర్వార్థమును నిర్ణయింపఁగలసూక్ష్మబుద్ధి జన్మాంతరసంస్కారమువలన నెవ్వనికైనఁ గలిగెనేని ఆమహాత్మునకు మాత్రము ప్రకృతజన్మమున నావృత్తితోఁ బనిలేదు కాని తక్కినవారలకు నవశ్యముగ గలదు. వామదేవాదులను గూర్చి చెప్పు శ్రుతి యావృత్తిని బోధింపకున్నను శ్వేతకేతువు మొదలగువారినిఁగూర్చి చెప్పు శ్రుతి మాత్రము దానిని బోధించుచున్నది. ఛాందోగ్యోపనిషత్తునందు "తత్త్వమసి శ్వేతకేతో" అని యుపదేశించినపిదప దానితాత్పర్యమును బాగుగ గ్రహింపలేక నాశ్వేతకేతువు మఱిమఱి నావిషయము నుపన్యసింపుమని వేఁడినట్లును అప్పటప్పటికిఁ గలుగుసంశయములు నివారించుచు నావాక్యమునే తొమ్మిదిమారులు అతనితండ్రి యుపదేశించినట్లును చెప్పఁబడియున్నది. మఱియు "శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అను మొదలగు వాక్యములుకూడ నావృత్తినే బోధించు నని యిదివఱకే నిరూపించియున్నాము. ఈకారణమువలన నెట్లును ఆవృత్తి సర్వోపాసనలకును కలదనియే యంగీకరింపవలయును.

కేవలయుక్తులీస్థలమున బొత్తుగనే పనికి రావు. ఏల యనిన:— 'ఆవృత్తివలన నపరోక్షజ్ఞానము కలుగును,' అనిన నాక్షేపించితివి కదా! అందు నీయభిప్రాయ మేమి? "ఆవృత్తి స్వయముగ నపరోక్షజ్ఞానమును కలిగింపలేదు. కావునను (అది) తాను సహాయముచేసి యితరప్రమాణములచేత మాత్రమే యాకార్యమును (అపరోక్షజ్ఞానోత్పత్తిని) చేయించునది కావునను దానికంటె భిన్నముగా మఱియొకప్రమాణము తత్సహాయార్థియై యుండవలయును; ఇచ్చట నట్టిప్రమాణము కానరాలేదు" అనియా? లేక "అట్టిప్రమాణ మున్నను దానికి లక్ష్యము కాఁదగినప్రమేయపదార్థము లేదు" అనియా? ఇందు మొదటిపక్షము యుక్తముకాదు. శాస్త్రముగాని యుక్తిగాని యీరెండును కలసిగాని స్వతంత్రముగనే యపరోక్షజ్ఞానమును పుట్టించు నని మేము చెప్పుట లేదు. వానికి నియోజ్యములై (అనఁగా వానిసహాయమును గైకొని కార్యమును సమర్థించునవియై) మఱికొన్ని ప్రమాణము లుండవలయు ననుటలోను మాయాక్షేప మేమియు లేదు. ఇఁక నేమి యనిన అట్టిప్రమాణము మాత్రము కల దని మేము నిరూపింపఁబోవుచున్నాము. పురుషుఁడు శాస్త్రార్థాభ్యాసమును పలుమాఱు గావించినచో నది చిత్తమందు దృఢ మగును; ఆ దార్ఢ్యమువలన నపరోక్షానుభవరూప మగువృత్తి జనించును. ఇదియే యపరోక్షజ్ఞానప్రమాణము; ఇదియే శాస్త్రయుక్తులనుండి సహాయమును గైకొనును. ప్రమాణము లనఁగా చిత్తవృత్తులే యనుట లోకప్రసిద్ధము కదా! కావున మొట్టమొదటిపక్షము యుక్తిశూన్యము. "ఇట్లయినను ఆవృత్తి యనుమానరూపమై భ్రాంతి కావచ్చును. అనుమానమునందు పదార్థము ఎదుట లేకుండుటచేతను మఱియొకవిధముగఁ గూడ నుండుట సంభవించుటచేతను అది (అనుమానము) భ్రాంతి యైనను గావచ్చును కదా! పొగను చూచి యగ్ని కల దని యూహించిన నప్పుడా యగ్ని యుండిన నుండవచ్చును. లేకున్న లేకపోవచ్చును. గొల్ల లుపయోగించు *ఘుటికయందలిధూమమును చూచి చేయఁబడినయ (యగ్న్య) నుమానమున నగ్ని యుండదు కదా! కావున దానివలెనే యీయపరోక్షవృత్తియు నొకపక్షమున భ్రాంతి యైనను కావచ్చును కదా! ఇది

* ఘుటిక యనఁగా పొగ మొదలగువానిని నింపుట కుపయోగింపఁబడు తోలుసంచి.

ప్రమాణ మనఁబడుట యెట్లు ?" అనియెదవేమొ వినుము. అనుమానము నందు విషయము లగువహ్న్యాదులు ప్రత్యక్షములు కావు; ఇచ్చటమాత్రము బ్రహ్మము ప్రత్యక్షము. ప్రత్యక్షములు కాకపోవుటచే నచ్చటివృత్తులు (అనుమాన వృత్తులు) భ్రాంతిరూపము లైనను కావచ్చును; సర్వకాలముల యందును ప్రత్యక్షుఁ డగుటచే బ్రహ్మవిషయకవృత్తులు మాత్ర మట్టివి కానేరవు. ఎదుట నున్నదానిని జూచుట భ్రాంతి యగునా ? సర్వలోకమునకును పరమప్రత్యక్షభూతుఁడై యున్న జీవుఁడే యాబ్రహ్మము; జీవస్వరూపసాక్షాత్కారమే బ్రహ్మస్వరూపసాక్షాత్కారము. ఆబ్రహ్మమే యుపాధిసహితుఁడై యున్న జీవుఁ డగును; ఈజీవుఁడే యుపాధిరహితుఁడై యున్న బ్రహ్మ మగును. ఇంతకంటెఁ బ్రత్యక్ష మగువిషయము కూడ మఱియొక్కటి కలదా? ఈ కారణమువలన నీయపరోక్షజ్ఞానరూపవృత్తి భ్రాంతి కానేరదు. "జీవుఁడు ప్రత్యక్షుఁడే యైనను ఆతనియథార్థరూపము లగు నిత్యశుద్ధబుద్ధత్వాదు లప్రత్యక్షములు కదా !" అనియెదవేమొ యట్లు కాదు. అజ్ఞానదశయందు తెలియఁబడకున్నవి యనుటమాత్రమే గాని విచారించిన నవియు పరమార్థస్థితిలో జీవునికంటె భిన్నములు కానేరవు కదా ! ఉపాధిరహితజీవుఁడే పరమేశ్వరుఁ డని యిదివఱకే నిరూపించి యున్నాము. కావున విషయమునిత్యప్రత్యక్షమగుటచే నీయపరోక్షవృత్తి భ్రాంతి కానేరదు కావున మొట్టమొదటిపక్షము ("శాస్త్రయుక్తులవలన సహాయమును గైకొను ప్రమాణాంతరము లేదు" అనుపక్షము) యుక్తియుక్తము కానేరదు. ఇట్లే రెండవపక్షము ("ప్రమాణ మున్నను ప్రమేయ ముండదు" అనుపక్షము) కూడ యుక్తము కాదు. ఆయపరోక్షవృత్తికి పరమేశ్వరరూపము లేక జీవునియుపాధిరహితరూపము గోచర మగు నని చెప్పితిమి కదా ! నెట్లును ఆవృత్తిసిద్ధాంతమును ఆక్షేపించుటకు వీలు లేదు.

"ఇప్పటికిని దోషము సంపూర్ణముగ నివర్తింపలేదు. జీవుఁడును ఉపాధ్యభావంబునను రెండుపదార్థము లుండిననేగానిసాక్షాత్కారముకుదురదు. పదార్థములు రెండు; సాక్షాత్కారము ఏకవస్తువిషయమై మాత్ర మున్నది. బ్రహ్మభిన్న మగుపదార్థము లేదు' అనియే కదా సాక్షాత్కారము జనించును. ఇట్లు రెండుపదార్థముల నొక్కదానినిఁగా భావించుట వలన నావృత్తి భ్రాంతియే యగును." అనియెదవేమొ యట్లు కాదు.

వస్తువు సత్యమైనచో నభావముకూడ వాస్తవ మగును గాని లేకున్న కా దనువిషయ మందఱకును తెలిసినదియే. ఒకఘట ముండినచో దాని యభావము కూడ యథార్థ మగునుగాని ఎండమావులనీటియభావమట్టిది కానేరదు కదా! ఇ ట్లగుటచే నుపాధులు మిథ్యాభూతములే యగుటచే వానియభావము కూడ వాస్తవము కానేరదు. వాస్తవ మగునేని యప్పు డొకవేళ దానితో ద్వైతము సంభవించిన సంభవింపవచ్చునుగాని యట్లు లేకున్న నది (భేదము) యు లేదు కదా! మఱియు నితరపదార్థములవలె నీయభావము తనతో నున్నదానికి ద్వైతమును కలిగించునది కాదు. అభావ మనఁగా శూన్యమే కదా! అది బొత్తుగనే లేనిది కదా! దానితో మఱియొకదానికి భేదము కలుగు ననిన నెట్లు? ఈకారణములవలన నుపాధ్యభావముతో జీవునియథార్థరూపమునకు ద్వైతము సంభవింపదు. “ఇ ట్లయిన ‘జీవుఁడు సర్వకాలములయందును స్వస్వరూపముతోనే ప్రకాశించుచున్నాఁడు’ అని చెప్పిన ట్లయినది. ఇ ట్లయిన నిఁక శాస్త్రార్థ జ్ఞాన మేల? అది తెలుపు క్రొత్తవిషయ మేమి? క్రొత్తవిషయమును తెలుప కున్న నది శాస్త్ర మె ట్లగును? ఆహా పాండిత్యవిభవమువలన మూల చ్ఛేదము కలిగినది” అనియెదవేమొ వినుము. వస్తువెప్పటికిని స్వస్వ రూపముతోనే యున్నను దానినిఁగూర్చి కలిగినవిపరీతభావనను తొలఁ గించుటచేఁగూడ శాస్త్రము ప్రయోజనవంతమగును. విపరీతభావనచేతఁగాని మఱియొకవిధముగఁ గాని యొకవిధమున దలంపఁబడుచున్నపదార్థమును మఱియొకవిధముగ నిరూపించుట క్రొత్తవిషయమును చెప్పుటయే కదా! ఈకారణమువలన శాస్త్రత్వధర్మమునకు (“అపూర్వవిషయమును బోధించు నదియే శాస్త్రము” అనునియమమునకు) ను హాని కలుగదు. షడ్జాది స్వరములు స్వాభావికరూపములతోనే సర్వకాలములయందును అందఱి చేతను వినఁబడుచుండినను సంగీతశాస్త్రము వానినిఁగూర్చియే చెప్పు చున్నది. విభక్తిప్రత్యయసహితము లగుశబ్దము లందఱిచేతను వ్యవహరింపఁ బడుచునే యున్నను వానినిఁగూర్చియే వ్యాకరణశాస్త్రము వక్కాణింపు చున్నది. ప్రతిపదంబును మగణజగణాదిరూపములతోనే యున్నను ప్రతివాక్యంబును యేదియోయొకవృత్తరూపమే కలిగియున్నను వానినిఁ గూర్చియే ఛ్ఛందశ్శాస్త్రము వివరింపుచున్నది. ఇట్లే వేదాంతశాస్త్రంబును సర్వానుభవసిద్ధ మగుజీవరూపమునుగూర్చియే విమర్శించుచున్నది.

షడ్జాదులును పదములును వృత్తములును వ్యవహారములోనే యున్నను జనులకు వానినింగూర్చి యథార్థజ్ఞానము లేదు. షడ్జమును మధ్యమ స్వరముగాను మధ్యమును గాంధారముగాను క్రియావాచకమును కర్తృ వాచకమునుగాను షష్ఠీవిభక్తిని పంచమీవిభక్తినిగాను వసంతతిలకా వృత్తమును పృథ్వీవృత్తముగాను మంజుభాషిణీవృత్తమును శార్దూల విక్రీడితమునుగాను యగణమును భగణమునుగాను వారవివేకమున భావింపుచుందురు. ఇట్లే ప్రకృతమునఁ గూడ బ్రహ్మము స్వస్వరూపము తోనే ప్రకాశించుచున్నను ఆయనను జీవునిఁగా భావింపుచున్నారు. కావున నాయవివేకములను తొలఁగించుటవలన నాసంగీతశాస్త్రాదు లెట్లు ప్రయోజనవంతములో యీయవివేకమును (బ్రహ్మమును జీవరూపునిఁగా దలంచునవివేకమును) తొలఁగించుటవలన వేదాంతశాస్త్రముకూడఁ బ్రయోజనవంతము. వివేకవంతుఁడై సర్వవిషయముల నెఱింగినపిదప గలుగునంతయానంద మవివేకికి వస్త్వనుభవము సమానముగానే యున్నను కలుగదు కదా! కావున శాస్త్రజ్ఞాన మెప్పటికిని నిరర్థకము కానేరదు. ఎట్లును ఆవృత్తిసిద్ధాంతమునకు భంగము రానేరదు.

"ఇట్లు కాదు. ఒక్కమాఱు అర్థప్రతీతిని కలిగింపలేనివాక్యము ఎన్నిమాఱు లావర్తింపఁబడినను ఆయర్థప్రతీతిని కలిగింపలే దని యిది వఱకే చెప్పియున్నాము కదా!" అనియెదవేమొ ఇది యొకదోషము కాదు. ప్రత్యక్షసిద్ధ మగువిషయమును కేవలయుక్తులచే నన్యథాకరించు టకు వీలు లేదు. లోకమునందు సామాన్యముగ ప్రతివాఁడును అర్థమును స్పష్టతమముగ గ్రహించుటకై వాక్యమును పలుమాఱావర్తించు చున్నాఁ డనుట ప్రత్యక్షసిద్ధము. ఒక్కమాఱు వినినంతమాత్రమున నత్యల్పముగా స్పష్టమైన యాతాత్పర్యము ఆవృత్తిచే మిగుల విశద మగు చున్నది యనుట సర్వానుభవసిద్ధము. సామాన్యముగఁ బరోక్షవిషయము లనుఁ గూర్చిచెప్పులౌకికవాక్యములయందే ఆవృత్తిప్రయోజన మీరీతిఁ గానఁబడుచుండ నిఁక మహావాక్యములవిషయమున నేమి చెప్పవలయును? మొట్టమొదట వానియర్థము స్వాయముగ విశదమై పిదప చిత్తమున నది దృఢమై యభ్యాసబలమువలన సాక్షాత్కారరూపచిత్తవృత్తిని కలి గింపవలయును కదా! మఱియు వాక్యార్థజ్ఞానము కావలయు ననిన మొట్టమొదటఁ బదార్థజ్ఞానము కావలయు ననుట స్వరలోకప్రసిద్ధము.

ఈకారణమువలనఁగూడ మహావాక్యములకు నవశ్యముగ నావృత్తి కావల యును. లోకసిద్ధార్థము లగుపదములు గలసామాన్యవాక్యములకే యావృత్తి కావలసియుండ నలౌకికార్థమును జెప్పుపదములుగలమహావాక్యములవిషయమున నేమి చెప్పవలయును ? చూడుఁడు. "తత్త్వమసి"అను మహావాక్యము త్వంశబ్దార్థమునకు తచ్ఛబ్దార్థభావమును చెప్పుచున్నది. ఆతచ్ఛబ్దంబును ప్రకరణానుసారముగ నుత్పత్తిస్థితినాశహేతు వగుబరమేశ్వరుని పరామర్శించుచున్నది. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ (౧. ౧. ౨.) విజ్ఞాన మానందం బ్రహ్మ అదృష్టం ద్రష్టృ. అవిజ్ఞాతం విజ్ఞాతృ. అజమజర మమరం. అస్థూల మన ణ్వహ్రస్వ మదీర్ఘం"అను మొదలగు శాస్త్రములచే నా బ్రహ్మముయొక్క రూపము నిరూపింపఁబడియున్నది. అజాతిశబ్దములచే*షడ్వికారములును నిషేధింపఁబడినవి. అస్థూలాదిశబ్దములచే లౌకికపదార్థధర్మములన్నియు నిరాకరింఁబడియున్నవి. విజ్ఞానాదిశబ్దములచే చైతన్యస్వరూపము నిరూపింపఁబడినది. కావున నాతత్పదార్థము లోకాతీతమై నిర్గుణమై అనుభవమాత్రస్వరూపమై యున్నది. ఇట్లే దానితో నభిన్న మగుత్వంపదార్థంబును సాక్షియు సర్వేంద్రియములద్వారా సర్వకార్యముల నాచరించువాఁడు నగుబుద్ధ్యవచ్ఛిన్నచైతన్య స్వరూపుఁడు ఆతఁడుభ్రాంతిచే దేహాదిరూపుఁడుగా భావింపఁబడుచున్నాఁడు. కావున నీతఁడు నుపాధిరహిత స్వస్వరూపముతో బ్రతిపాదింపఁబడుటవలన నపూర్వుఁడే. ఈవిధముగ మహావాక్యపదార్థములు రెండును అపూర్వము లగుటచే వానిని సకృచ్ఛ్రవణమాత్రముచే (వాక్యము లొక్కమాఱు వినినంతమాత్రముచే) గ్రహించుట కష్టతరము. ఇంతమాత్రమే గాక నివి యజ్ఞానబలముచే విపరీతముగఁ గూడ (లోకాతీతుఁ డగుపరమేశ్వరుఁడు లేఁ డనియు జీవుఁడు దేహాదిభిన్నుఁడు కాఁడనియు అయినను పరమేశ్వరునకు సేవకుఁ డగునే కాని తద్భిన్నుఁడు కానేరఁ డనియుఁ గూడ) భావింపఁబడుచున్నవి. ఇట్లగుటచే నీవిపరీతభావన నశించుటకై శాస్త్రయుక్తులనవశ్య మావర్తింపవలసియుండును. సామాన్యవాక్యములయందే యావృత్తి గానవచ్చుచుండు. విశేషవాక్యములనుఁ గూర్చి వేఱుగా జెప్ప నక్కఱలే దని యిదివఱకే ప్రతిపాదించియున్నాము కదా !

---

* ఉండుట, పుట్టుట, వృద్ధినొందుట, పరిణామమును జెందుట, క్షీణించుట, నశించుట అనునీయాఱును షడ్వికారములు.

“ఇదియును సరికాదు. సామాన్యవాక్యములవిషయములో బదార్థము లొకదానివెనుక నొకటి యెఱుంగఁబడుచు వచ్చినపిదప వానిసంసర్గము వలనఁ దాత్పర్యార్థము తేటపడుచుండును. మహావాక్యములవిషయ మన్ననో యట్టిది కాదు. అవి యొకపదముచేత బ్రహ్మమును మఱియొక పదముచేత బ్రహ్మాభిన్నుఁ డగుజీవుని నిరూపించునవి. ఈరెండుపదార్థ ములు నొక్కటియే; ఈరెండు నపరోక్షములే. ఇట్లుండ నిచ్చట నర్థ క్రమము గలుగుటకు నవకాశము లేదు కదా! పరమేశ్వరునకు విభా గములు లేవు. కావున నావృత్తివలన నిందుఁ గావలసినపని యేమి? సామాన్యవాక్యముల విషయమున నన్ననో యొకమాఱు ఒకపదము యొక్కయు మఱియొకమాఱు మఱియొకపదముయొక్కయు నర్థము విశదము కావచ్చును. కావున నావృత్తికిఁ బ్రయోజనము కలదు. ఈకార ణమువలననే ‘మహావాక్యార్థ మొక్కపర్యాయముననే తెలిసిన తెలియ వలయును, లేకున్న లేకపోవలయును. ఇంతియకాని యిచ్చట నావృత్తి వలనఁ బ్రయోజన మేమియు లేదు’ అని యిదివఱకే యాక్షేపించి యున్నాము.” అనియెదవేమో వినుము. పరమేశ్వరుఁడు మీ రన్నట్లప రోక్షుఁడే భాగరహితుఁడే (నిరవయవుఁడే) యైనను అజ్ఞానవశమునఁ బరో క్షుఁడుగాను సావయవుఁడుగాను గానవచ్చుచున్నాఁడు. దేహేంద్రి యాదు లన్నియు నజ్ఞానముచే నాయాత్మునియం దారోపింపఁబడియుండు టచే నాయాపదార్థములమూలమున వచ్చుజ్ఞానప్రకాశములు పరస్పరభిన్న ములుగను పరమేశ్వరుని లేక జీవుని యంశములుగను భావింపఁబడు చున్నవి. కావున నొక్కొక్కయావృత్తిచే నొక్కొక్కయంశము నిరాక రింపఁబడుచు వచ్చి యంతమునకు నిరవయవబ్రహ్మవిషయక మగుతాత్పర్య జ్ఞానము కలుగును. ఇట్లు వాస్తవాంశములు లేకున్నను కల్పితాంశము లుండుటచే దన్నివృత్తికై యావృత్తి సామాన్యవాక్యములయందువలెనే యుపయోగించును. “ఇట్లయినను యిది బ్రహ్మసాక్షాత్కారము కానేరదు కదా! కావున నీయావృత్తివలన ఫలము కలుగు ననుట యిప్పటికిని సిద్ధాంతము కాలేదు. సాక్షాత్కారమే ఫలము; ఆవృత్తి వలనఁ గలిగినది మాత్రము పరోక్షజ్ఞానము కదా!” అనియెదవేమొ యట్లు చెప్పఁగూడదు. ఈవర్ణింపఁబడిననిరవయవబ్రహ్మజ్ఞానరూప మగువా క్యార్థజ్ఞానమే (బ్రహ్మ) సాక్షాత్కారమునకుఁ బూర్వరూపము. ఈజ్ఞానము

చేతను దీనిని మననము చేయుటచేతను మాత్రమే కదా యుత్తరకాలమునఁ జిత్తము అపరోక్షజ్ఞానరూపవృత్తిని కలిగింపఁగలుగుట కావున నిర్వివాదముగ నావృత్తి సఫలమే. ఏమహాత్ములు పూర్వజన్మాభ్యాసబలమువలనఁ బ్రతిబంధశూన్యులై తత్త్వంపదార్థములయందు విపరీతభావన నొందకున్నారో అట్టివారికి మాత్ర మావృత్తి యక్కఱలే దనుట మాకును సమ్మతమే. కావున నావృత్తి యవశ్యకర్తవ్యమే. "అహం బ్రహ్మాస్మి. అయ మాత్మా బ్రహ్మ" అను మొదలగు మహావాక్యములవిషయముఁగూడ నిట్లే యూహింపవలయును. "ఇట్లు కాదు ప్రతిబంధము లేకపోయినను వాక్యార్థజ్ఞానమునకుఁ గ్రమ మవశ్యముండవలయును కదా!" అనియెదవేమొ. ఫలము గలిగినపిదప దేనితోను పని లేదు. కేవలవాక్యార్థజ్ఞానమువలనఁగూడ ఫలము జనింపదు కదా! కావున ప్రతిబంధరహితులై యున్నమహానుభావులవిషయములో గ్రమాపేక్ష లేదు. వారు పూర్వజన్మాభ్యాసమువలననే సిద్ధులైరి కావున వారికి నపరోక్షజ్ఞానము కలుగుటకు వాక్యశ్రవణము వ్యాజమాత్రమే యగును కాని ముఖ్యసాధనము కానేరదు. కావున నీపక్షమున దోషమేమియు లేదు.

"ఇట్టిజ్ఞాన మెవ్వనికైనఁ గలుగునేని కలుగుటకు వీలు కలదేని యప్పుడీసిద్ధాంతము యుక్తమగునుగాని యట్లు లేదు. త్రాటియందు సర్పమువలె నారోపింపఁబడి యున్నవి యగునేని ధర్మములు బాధింపఁబడును కాని పరమార్థములైనప్పుడు బాధింపఁబడవు కదా! జీవునివిషయమునఁ గలదుఃఖిత్వాదు (దిభావన) లారోపితము లనుటకు వీలు లేదు. అవి సర్వజనులకును సమానములుగనే జనించుచున్నవి కదా! కావున సుఖదుఃఖాదిధర్మవిముక్తాత్మజ్ఞానము జనించుటకే వీలు లేదు." అనియెదవేమొ అది యుక్తము కాదు. దేహాత్మత్వాదిభావనలవలెనే యీసుఖిత్వదుఃఖిత్వాదిభావనలును మిథ్యాభూతములే కావచ్చును. సర్వప్రపంచమునందును కల వనునింతమాత్రమువలన నేవియు పరమార్థములు కావలసిన పని లేదు. దేహము జీవునికంటె భిన్న మనువిషయము సుప్రసిద్ధము; ఐకాత్మ్యాధికరణమున (సూ 3. 3. 53, 54)ఁ బ్రకటితము. ఇట్లున్నను దానిని లోకు లందఱు నాత్మగా భావించుచున్నారు; దానిని ఛేదించునప్పుడు కొట్టినప్పుడు "నన్ను ఛేదించుచున్నారు కొట్టుచున్నారు" అని

భావించుచున్నారు. ఇంతయే కాదు. దేహమునకంటెఁ గూడ మిగుల వెలుపల నున్నపుత్రకళత్రాదులనుగూడ నాత్మగా భావించుచున్నారు; వారికి పరితాపము గలిగినప్పుడు "నామనస్సున మిగులఁ బరితాపము కలిగినది" యని చెప్పుచున్నారు. ఇట్లే సుఖిత్వదుఃఖిత్వాదులను గూడ నాత్మధర్మములుగా భావింపవచ్చును. ఈదేహాదులవలెనే యవియు (సుఖాదులును) ఆత్మకంటె బాహ్యములుగానే యున్నట్లు గానవచ్చుచున్నవి కదా! విచారించిన జీవుఁడు వానినిఁ జూచువాఁడే కాని వానితో సంబంధము కలవాఁడు కాఁడు. విచారించిన నీసుఖాదులు జీవునకు స్వరూపములు కానేరవు. ఇవి వచ్చుచుఁ బోవుచుండునవి; ఆత్మ యన్ననో నిత్యశుద్ధబుద్ధముక్తస్వరూపుఁడు. అట్టియాయనకు నివి స్వరూపము లెట్లగును? "స్వరూపములు కాకున్న ధర్మములు కావచ్చును." అనియెదవేమొ యదియు సంభవింపదు. ధర్మధర్ములకు నత్యంతభేద ముండదు. అత్యంతభిన్నము లగునవియు పరస్పరము ధర్మధర్మిభావము లొంపనేరవు. గోవునకు నశ్వము ధర్మము కానేరదు కదా! మఱియు రెండుపదార్థములకు సంబంధము కావలయు ననిన నది బొత్తుగనే సంభవింపదనియు అసంబంధము పదార్థద్వయమునకంటె భిన్న మని గాని యభిన్న మని గాని నిరూపింపఁబడుటకు వీలు లేదనియు భిన్నమైనచో దానికిఁ గూడ బదార్థములతో సంబంధము గలిగించుటకై మఱియొకసంబంధము కావలసి వచ్చు ననియు అప్పు డనవస్థాదోషము వచ్చు ననియు నది (యాసంబంధము) పదార్థమాత్రరూపమే యగునేని యప్పు డది సంబంధరూపమే కాకపోవు ననియు భేదాభేదములు రెండును కల వనిన నది విరుద్ధ మగు ననియు నీకారణమువలన బారమార్థికముగ సంబంధ మనునదియే యుండుటకు వీలు లేదనియు సంబంధ మంతయు నారోపితమే యనియు నిదివఱకే ద్వితీయాధ్యాయమున (సూ. ౨-౧-౧౮.) నిరూపింపఁబడియున్నది. కావున నెట్లును సుఖదుఃఖాదులు జీవునికి సంబంధింపవు. భ్రాంతివలన నట్లు తలంచుచున్నారే కాని మఱి యేమియు లేదు. ఇట్లగుటచే బాహ్యము లగు దేహాదులయందు గలయాత్మబుద్ధివలె నాత్మయందు గలసుఖిత్వదుఃఖిత్వాదిభావనయు కేవలభ్రాంతియే. మఱియు నీసుఖదుఃఖాదులు జాగ్రదవస్థయందు మాత్రమే కలవుగాని సుషుప్త్యవస్థయందు లేవు. ఇవి యాత్మధర్మములే యగునేని యప్పుడు

కూడ నుండవలయును కదా! "అప్పు డాత్మయే లేఁడేమో" యని యెదవేమొ వినుము. నిదురించి మేల్కాంచినవాఁడు నిద్రాసుఖమును స్మరింపఁగలుగుటయే ఈవిషయమున (సుషుప్తియం దాత్మ కలఁ డను విషయమున) నిదర్శనము. శ్రుతియు "పశ్య న్నై వ త న్న పశ్యతి" "సుషుప్త్యవస్థయందు పురుషుఁడు చూచుచునే యున్నను రెండవపదార్థము లేకుండుటచేఁ జూచువాఁడు కానేరఁడు" అని యీవిషయమునే నిరూపించుచున్నది. కావున "నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁ డగు పరమేశ్వరుఁడే నేను" అనుభావనయే యథార్థభావనగాని, "నేను సుఖిని దుఃఖిని" అనుభావన కాదు. ఇట్టిబ్రహ్మాత్మభావనయే యవశ్యముగఁ గలుగవలయును కావున నంతవఱకు మహావాక్యము లావర్తింపఁబడవలసినవియే; ప్రతిబంధరహితునకు బ్రహ్మాత్మైక్యజ్ఞానము శ్రవణమాత్రముననే కలుగును కావున నీయావృత్తి యక్కఱ లేదు. ఇంత యేల? నీయనుభవము పరిపూర్ణముగఁ గలవారలు చేయవలసినకార్యమే లే దని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి. "కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయ మాత్మాయం లోకః" "మనకు నీసర్వప్రపంచము నాత్మయే యైయుండ పుత్రులతో మన మేమిచేయఁగలము?" అనుమొదలగుశ్రుతులును "యస్త్వాత్మరతి రేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః, ఆత్మ న్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే" "ఏపురుషుఁడు ఆత్మయందే క్రీడించువాఁడై యాత్మానుభవమువలననే తృప్తుఁడై సంతుష్టుఁడై యున్నాఁడో యట్టివాఁడు చేయవలసినకార్య మేఁడియు లేదు." అనుమొదలగుస్మృతులు నీవిషయమును బోధించుచున్నవి. కావున బూర్వజన్మపరిపాకము గలవారికితప్ప తక్కినవారికి ననుభవార్థమై యావృత్తి కావలసినదియే.

"ఇట్లయినను మఱియొకదోషము వచ్చును. ఇచ్చట నావృత్తి విధింపఁబడుచున్నదియా? లేదా? అది క్రియయే కావున విధింపఁబడుచున్నది. యనియే యంగీకరింపవలయును. అట్లంగీకరించిన నప్పు డావిధియే ప్రధాన మగును. పరబ్రహ్మస్వరూపము భూతార్థ మగుటచే నప్రధాన మగును. ఇట్లయిన పరబ్రహ్మవిషయకము లగునుపాసనలయం దావృత్తి సంభవింపదు. అదియే ప్రధాన మగుటచే నుండిన నుండవచ్చును. లేకున్న లేకపోవచ్చును కదా!" అనియెదవేమొ వినుము. వేదముచే స్వయముగనే యీయావృత్తి కొన్నిస్థలములయందుఁ జెప్పఁ

బడియు మఱికొన్నిటియందు సూచింపఁబడియు నున్నది యని యిది వఱకే చెప్పియున్నాము. అది మీ రన్నట్లు విధియే యగునేని పైనఁజెప్పిన దోషము లన్నియు వచ్చును; ప్రధానతాత్పర్యమునకు భంగము వచ్చును. "స దేవ సోమ్యేద మగ్ర ఆసీత్" అని యారంభించి "త త్త్వ మసి" యనువాక్యముతో సర్వార్థము నుపసంహరించి వేదము "జీవబ్రహ్మై క్యమునందే తనకు తాత్పర్యము కలదు" అనువిషయమును ప్రకటించు చున్నది. ఈజీవబ్రహ్మైక్యము స్వతస్సిద్ధమేకాని కల్పితము లేక నాగం తుకము కాదు కదా! ఇట్లు స్వతస్సిద్ధవిషయమును గూర్చియే చెప్పు శాస్త్రమునకుఁ గూడ నది ప్రధానము కా దనిన నిఁక నేనియమము నిలు కడనొందఁగలదు. ఏది దేనికి తాత్పర్యమో-అది దానికి ప్రధాన మనుట సర్వ లోకప్రసిద్ధ మగువిషయము కదా! కావున దీనికి విరుద్ధముగా వేద మన్య విషయమును విధింపదు. ఎవ్వఁడును కర్తృనాశమునకై కర్మను విధింపఁడు గదా. కావున నీయావృత్తి విధి కానేరదు. పరబ్రహ్మవిషయమున విధి సంభవింప దని యిదివఱకే నిరూపించియున్నాము. ఇంతయే గాక ఉప నిషద్వాక్యముల విధిపరములుగ సాధించినను దోషము వచ్చును. అప్పుడు నియుక్తునకు "నేను బ్రహ్మధ్యానమునందు నియోగింపఁబడితిని, బ్రహ్మ మును చెందెదను" అనునిట్టియభిమానములు కలుగును. ఏకస్వరూపుఁ డగు బ్రహ్మమునం దిట్టిభేదబుద్ధి కలుగుట విరుద్ధము కదా! కావున "ఆవృత్తి జరుగవలయును" అను మొదలగునవి సామాన్యము లగువాచోయుక్తులే కాని విధులు కావు. కావున పరబ్రహ్మవిషయకము లగునుపాసనల యందును నిరపాయముగ నావృత్తి సిద్ధించినది.

---

## ౨. ఆత్మత్వోపాసనాధికరణము.

విషయసంశయసంగతులు:—పూర్వాధికరణమున బ్రహ్మానుభవ పర్యంతము శ్రవణాదులు ఆవర్తింపఁబడవలయు నని నిర్ణయింపఁబడెను. దాని నాధారముచేసికొని యుపజీవ్యోపజీవకభావసంగతితో నిదిధ్యా సనప్రకార మిందు విమర్శింపఁబడును. "నిదిధ్యాసనకాలమున నా బ్రహ్మము స్వస్వరూపభూతుఁడుగా ధ్యానింపఁబడవలయునా? లేక

భిన్నుఁడుగా ధ్యానింపఁబడవలయునా?" అనుసంశయము నివారింపఁబడును. "అభేదశ్రుతులకు ముఖ్యార్థ ముండుటకు వీలు లేదు" అనుపక్షమును ఖండించి "అభేదశ్రుతులు ముఖ్యార్థములే" యను పక్షము సిద్ధాంతము చేయఁబడును. అభేదశ్రుతులకు ప్రత్యక్షాదుల వలన కల దని భావింపఁబడుచున్న విరోధము పరిహరింపఁబడును. విరోధమును పరిహరించునది యగుటచే నీయధికరణ మవిరోధాధ్యాయమునందే (ద్వితీయాధ్యాయమునందే) యుండవలసినది యైనను మహావాక్యార్థనిర్ణయము నిదిధ్యాసనమునకు నంతరంగము కావునఁ దద్విచార సందర్భమున నీపాదమునందుఁ జేర్పఁబడెను.

"అంతయు సరియే కాని మొట్టమొదట నీవిషయమే విచారణీయము కాదు. ఆత్మశబ్దమునకుఁ బ్రత్యగాత్మ(సర్వసాక్షి యగుచైతన్యము) అర్థ మనుట సర్వలోకప్రసిద్ధమై యుండ నాప్రత్యగాత్మయు బ్రహ్మ మగుట స్పష్టమైయుండ నీవిచార మేటికి?" అనియెదవేమొ వినుము. జీవేశ్వరులకు నైక్యము సంభవించునేని యప్పుడు గాని యాత్మశబ్దమున కీముఖ్యార్థము (ప్రత్యగాత్మ యనునర్థము) గ్రహింపఁబడదు. ఇచ్చట పూర్వపక్షికి నాయభేదము విరుద్ధ మని యభిప్రాయము. ఇట్లయిన వాఁడాత్మశబ్దార్థమును గౌణముగనే గ్రహించును కదా! శరీరాదిసహితుఁడగుజీవుఁడే సుఖిత్వదుఃఖిత్వాదిసంపన్నుఁడే కదా యాశబ్దమునకు గౌణార్థము. ఈకారణమువలన నభేదశ్రుతులయర్థమును స్థాపించుటకై యీవిచార మవశ్యకర్తవ్యమే యగును.

పూర్వపక్షము:—విచారించిన నుపాసనాకాలమందు పరమేశ్వరుని స్వస్వరూపభూతునిఁగా గ్రహించుటకు వీలు లేదని తోఁచుచున్నది. పరమేశ్వరుఁడు నిర్గుణుఁడు శుద్ధుఁడు సర్వపాపరహితుఁడు. జరామరణాదులు లేనివాఁడు. జీవుఁ డన్ననో గుణసహితుఁడు మలినుఁడు. పుణ్యపాపసంసక్తుఁడు జరామరణసహితుఁడు. ఇట్టివారికి నైక్యమెట్లు సంభవించును? ఒకవిధముగ నున్నవాఁడు మఱియొకవిధముగ గ్రహింపఁబడుటకు వీ లెట్లు కలుగును? కా దని గ్రహించినను అది విరుద్ధమగును. ఈశ్వరుఁడే జీవుఁడైనచో శాస్త్రము నిరర్థక మగును. అప్పుడు జీవునిచేఁ బొందఁబడుటకు తద్భిన్నుఁ డగునీశ్వరుఁడు లేఁడు కదా! ఇట్లే జీవుఁడే యీశ్వరుఁ

దైనను ప్రయోజనము లేదు. అప్పుడును శాస్త్రము నిరర్థకమగును. అప్పు డధికారియే లేఁడు కదా! శాస్త్ర మెవ్వనిఁ గూర్చి యుపదేశించును ? ఈ కారణమువలన జీవేశ్వరుల కైక్యభావన కుదురదు. మఱియు నీవిషయము ప్రత్యక్షాదులకు విరుద్ధము లోకమున నెచ్చటను విరుద్ధగుణములు గల జలాగ్న్యాదులకు నైక్యము గానవచ్చుట లేదు కదా! కావున శాస్త్రము నకు మఱియొకవిధముగ నర్థమును కల్పింపవలయును. ప్రతిమాదులయందు విష్ణ్వాదులను భావించునట్లు జీవునియం దీశ్వరభావనను భావింపవలయు ననుటయే శాస్త్రార్థ మని నిర్ణయింపవలయును. ఇట్లు చెప్పినను "తత్త్వ మసి" అనుమొదలగువాక్యముల కర్థము సరిపడును కదా! "రజ్జువును చూచి సర్ప మని భ్రాంతి నొందినవానిఁగూర్చి 'నీయెదుట నున్నపదా ర్థము సర్ప మని తలంచుచున్నావు గాని యది సర్పము కాదు త్రాడే' అని చెప్పినట్లు ఇచ్చటఁగూడ 'నీయెదుట నున్నపదార్థమును జీవునిఁగా భావించుచున్నావుకాని యది పరమేశ్వరుఁడే' యని శాస్త్రము చెప్పి యుండవచ్చును కదా!" అనియెదవేమో యది సరిపడదు. దృష్టాంత మందు పదార్థ మొక్కటి యెదుటఁ గానవచ్చుచున్నది. సామాన్యముగ గ్రహింపఁబడినది. విశేషమును గూర్చి విచారణ కలిగినప్పుడు భ్రాంతిచే విరుద్ధముగ గ్రహింపఁబడినదానిని తొలఁగించి సత్య మగునది బోధింపఁ బడెను. దార్ష్టాంతికమునందన్ననో పరమేశ్వరుఁడు నిత్యవిజ్ఞానరూపుఁ డగు టచే ప్రత్యక్షుఁడే యైనను నిర్గుణుఁ డగుటచే నాయనయందు సామాన్య విశేషభావము లేదు. ఈకారణమువలన నచ్చట నిట్టియుపదేశము సంభ వింపదు కావున నెట్లును మహావాక్యములు "మనో బ్రహ్మే త్యుపాసీత" "మనస్సును పరబ్రహ్మ మని యుపాసింపవలయును" అను మొదలగు వాక్యములవలెఁ *ప్రతీకోపాసనను బోధించునవియే కావలయును.

---

## అ-౪. పా-౧. సూ-3.

అవతారిక:—అనిన నట్లు కా దని నిరూపించుచున్నాఁడు.

---

* ప్రతీక మనఁగా నాధారము. ప్రతిమవంటిది. దానియం దిష్టదైవమును భావించి యుపాసించుట ప్రతీకోపాసన యనఁబడును.

# ౪౨౧. ఆత్మేతి తూపగచ్ఛంతి గ్రాహయంతి చ

## ౪. ౧. ౩.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట సరి కాదు. పరమేశ్వరుని స్వస్వరూపభూతునిఁగనే ధ్యాసకాలమున భావింపవలయును. జాబాలశాఖవారిట్లే యంగీకరించి యున్నారు. "త్వం వా అహ మస్మి భగవో దేవ తేఽహం వై త్వ మసి భగవో దేవతే" "ఓ దేవతా నీవే నేను నేనే నీవు" అనువాక్యము వారియుపనిషత్తునందుఁ గలదు. ఇట్లే "అహం బ్రహ్మాస్మి" అను మొదలగువాక్యములచేఁ దక్కినశాఖవారుకూడ నీవిషయము నంగీకరించుచునే యున్నారు. ఇంతయేల వేదాంతవాక్యము లన్నియును ఈవిషయమునే (జీవబ్రహ్మైక్యమునే) బోధించుచున్నవి. "ఏష త ఆత్మా సర్వాంతరః. ఏష త ఆత్మాఽంతర్యా మ్యమృతః" "సర్వకోశములకు లోపలనున్న యీజీవుఁడే యాబ్రహ్మము. అంతర్యామియు మోక్షస్వరూపుఁడు నగునాబ్రహ్మమే జీవుఁడు" అని బృహదారణ్యకోపనిషత్తునందును "తత్సత్యం స ఆత్మా త త్త్వమసి" "ఆజగత్కారణమే సత్యము. అదియే యాత్మ అదియే నీవు" అని ఛాందోగ్యోపనిషత్తునందును ఈవిషయమే బోధింపఁబడియున్నది. కావున నిర్వివాదముగ నభేదమునే యంగీకరింపవలయును.

"ఈమహావాక్యములు ప్రతీకోపాసనను చెప్పునవి కూడఁ గావచ్చునంటిని కదా!" అనియెదవేమొ యది యుక్తము కాదు. అప్పుడు వానియర్థము గౌణము కావలసి వచ్చును. ముఖ్యార్థము సంభవించుచుండఁగా గౌణార్థము గ్రహించుట యుక్తము కాదు కదా! మఱియు ప్రతీకోపాసనను గూర్చి చెప్పునప్పుడు సామాన్యముగ నావిషయ మొక్కమాఱే చెప్పఁబడునుగాని *యభ్యాస ముండదు. "మనో బ్రహ్మ ఆదిత్యో బ్రహ్మ" అను మొదలగుస్థలములయం దిట్లే యున్నది కదా! ప్రకృతమున నన్ననో "ఓ దేవతా నీవే నేను నేనే నీవు" అని యభ్యాసము గానవచ్చుచున్నది. ఎచ్చటనైనా అభ్యాస ముండినచో నందుఁ జెప్పఁబడియున్న విషయ మధికముగ దృఢ మగు ననుట లోకప్రసిద్ధము. ఇట్లుండ నాయర్థ

---

* అభ్యాసము (అ-౧. పా-౧. సూ-౪. పేజీ 45 చూ.)

మును తగ్గించుటకైనను వీలు లేనప్పుడు బొత్తుగనే తొలఁగించుటకు వీలు కలుగునా? ఈకారణమువలన నభ్యాసము గలచోట నేయర్థము ముఖ్యముగఁ గానవచ్చుచున్నదో యదియే గ్రహింపఁబడవలసి యున్నది. ప్రతీకోపాసనను జెప్పు శ్రుతికంటె ప్రస్తుత శ్రుతికి విరుద్ధరూపము కాదు కదా! ఇంతమాత్రమే కాక శ్రుతియందు భేదదృష్టి వెల్లుగ నిందింపఁబడి యున్నది. "అథ యోఽన్యాం దేవతా ముపాస్తేఽ న్యోఽసా వన్యోఽహ మస్మీతి. న స వేద. సర్వం తం పరాదా ద్యోఽన్య త్రాత్మనః సర్వం వేద" "ఎవ్వఁడు తా నుపాసించుదేవతను తనకంటె నన్యమునుగా భావించునో వాఁ డజ్ఞాని. ఎవ్వఁడు ఈ ప్రపంచమును తనకంటె భిన్నమునుగా భావించునో వాని నా ప్రపంచము ముక్తికి దూరస్థునిఁ జేయును" అని బృహదారణ్యకోపనిషత్తును "మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నా నేవ పశ్యతి" "ఎవ్వఁడు భేద మున్నట్లు భావించునో వాఁడు మరణమునుండి మరణమును బొందును" అని కఠోపనిషత్తునందును ఇట్లే సర్వోపనిషత్తులయందును గూడ భేదనింద కానవచ్చుచున్నది. మహావాక్యములయర్థము ప్రతీకోపాసనయే యగునేని యిది సంభవింపదు కదా! ప్రతీకోపాసనయందు దేవతలకు ప్రతీకమునకును భేదము పరమార్థమై యుండును కదా! దానియందే శ్రుతికిఁ దాత్పర్య ముండునేని వాని నేల నిందించును? కావున నిరర్థకముగ గౌణార్థము నంగీకరింపవలయుటచేతను వాక్యములయందును విరుద్ధరూపము గానవచ్చుటచేతను భేదనింద వెల్లుగ నుండుటచేతను ప్రతీకోపాసనపక్ష మంగీకారార్హము కాదు.

మఱియు "జీవేశ్వరులగుణములు విరుద్ధము లగుటచే వారికి నైక్యము సంభవింపదు" అనుటయు యుక్తియుక్తము కానేరదు. కానవచ్చుచున్న దంతయు యథార్థముగానే యుండవలయు నను నియమము లేదని పలుమాఱు చెప్పియున్నాము. కావున నీజీవేశ్వరులగుణములును భ్రాంతివలన పరస్పరవిరుద్ధములుగ నున్నట్లు తోఁచుచున్నవి యనియుఁ జెప్పవచ్చును కదా! శ్రుతికిని యిదియే యభిప్రాయము కావచ్చును. ఇట్లు కాకున్న నైక్యమును బోధించుట యెట్లు సంభవించును? "ఇట్లు చెప్ప నేల? ప్రత్యక్షప్రమాణ మన్నిప్రమాణములలోను ముఖ్యము. దానినాశ్రయించియే యన్నియు ప్రవర్తింపవలయును. ఈకారణమువలన వేదమే యప్రమాణము కావచ్చును. ప్రత్యక్షసిద్ధ మగునర్థమునకంటె వేదార్థము భిన్న

ముగ నున్నది కదా !" అనియెదవేమొ యట్లుకాదు. వేదము పౌరుషే యము (పురుషబుద్ధివిశేషమువలనఁ గలిగినయూహ) కా దని ప్రథమా ధ్యాయమునందే (సూ. ౧-౧-౩) నిరూపించియున్నాము. ఈకారణము వలన దానియందు దోషము నుద్భావించుటకు నవకాశము లేదు. పురుషబుద్ధికి బ్రమాదము కలుగవచ్చును గాని పరమేశ్వరబుద్ధికి నట్లు కలుగదు కదా! మఱియు నది చెప్పువిషయములు ప్రత్యక్షాదులకు నగో చరములు. అట్టివిషయములను చెప్పిననేగాని శాస్త్రము శాస్త్రము కానేర దని పలుమాఱు నిరూపించియు నున్నాము. ఈకారణమువలన దానికి (వేదమునకు) స్వయముగనే ప్రామాణ్యము కల దని తేలుచున్నది. ఇట్లగుటచే నది తాను చేయుపదార్థనిర్ణయమునందు ప్రత్యక్షము నపేక్షింప నక్కఱ లేదు. దేనిని నిర్ణయింపవలసినప్పు డైనను ప్రమాణములు చేయ వలసినకార్యములు రెండుమాత్రమే యుండును. కొన్నినిర్ణయముల యందు వైపరీత్యమును పరిహరించును; మఱికొన్నిటియం దనువాదమును మాత్రమే యాచరించును. ప్రకృతమున వేదార్థనిర్ణయవిషయములోఁ బ్రత్యక్ష మీరెంటిలో నొక్కదాని నైనను చేయవలసినపని లేదు. ఇది పౌరుషేయ మగుటచేతను వేద మపౌరుషేయ మగుటచేతను దానియం దలివైపరీత్యము నిది పరిహరింపనేరదు. అందు (వేదమునందు) దోషము లుండు ననుశంకయే కలుగుటకు వీలు లే దని మున్నే చెప్పియున్నాము. ఇఁక ననువాదము చేయవచ్చు ననిన నప్పుడు మాపక్షమే స్థిర మగును. అనువాదము చేయుట యనఁగా సిద్ధమై యుండుదాని నంగీకరించుటయే కదా ! విచారించిన నిట్టియనువాదమునకుఁ గూడ బ్రత్యక్షము సమ ర్థము కాదు. అందలి విషయములు దానికి గోచరము లగునవియే కావు కదా! కావున నెట్లును వేదము ప్రత్యక్షప్రమాణము ననుసరించునది కాదు. "అగునుగాక నావేద మేదియో యొకవిషయము నెట్లో యొకట్లు చెప్పినను దాని నట్లే యంగీకరించినను తద్విషయక మగుజ్ఞానము కలుగు టకై ప్రత్యక్ష మావశ్యకమే యగును." అనియెదవేమొ అదియు యుక్తము కాదు. ఇప్పుడు మేము వేదప్రత్యక్షముల పరస్పరసంబంధమును గూర్చి మాటలాడుచున్నాము గాని జ్ఞానోత్పత్తిప్రత్యక్షములసంబంధ మునుఁగూర్చి మాటలాడుట లేదు. మఱియు వేదమునకు స్వార్థ నిర్ణయ మునఁ బ్రత్యక్షాపేక్ష లే దని చెప్పుచున్నాము గాని ప్రత్యక్షము ప్రమా

ణము కా దనుట లేదు. అది పరమార్థమునఁ బ్రమాణము కా కున్నను వ్యవహారమునఁ బ్రమాణమే. సర్వప్రమాణములు తుదకు వేదము కూడ నిట్టిదే యని శాస్త్రావతారికయందు వివరించియే యున్నాము. మఱియు ప్రమాణములు వ్యావహారికములే యైనను వానివలనఁ దత్త్వజ్ఞానము కలుగవచ్చు ననుట లోకప్రసిద్ధము. కాలధర్మము లగు హ్రస్వత్వ దీర్ఘత్వాదులను వర్ణములపై (అక్షరములపై) నారోపించి "నాగః నగః జాలం జలం" అని పదముల నుచ్చరించి వానినుండి "ఏనుఁగు పర్వతము సమూహము ఉదకము" అనునర్థములను గ్రహించిన నది పరమార్థజ్ఞానమే యగుచున్నదిగాని భ్రాంతి యగుట లేదు కదా! ఇట్లే ప్రత్యక్షము వ్యావహారికమే యైనను దానినుండి తత్త్వజ్ఞానము జనింపవచ్చును. కావున శ్రుతిసిద్ధార్థమును ప్రత్యక్షము బాధింపనేరదు; జీవేశ్వరభేదదర్శనము మిథ్య కావచ్చు ననుటలో నాక్షేపము లేదు. "న విధౌ పరః శబ్దార్థః" "తదేకపరమై విధిని చెప్పువాక్యమున నన్యార్థ ముండదు" అను మీమాంసాభాష్యవాక్యము ననుసరించి తత్పరములై యొక్క విషయమును గూర్చి చెప్పువాక్యముల నౌపచారికము లనుటయు యుక్త మగుపని కాదు. ఉపనిషత్తులకు జీవబ్రహ్మైక్యమునందే దాత్పర్య మనువిషయము పలుమాఱు నిరూపింపఁబడియే యున్నది. కావున నెట్లును జీవబ్రహ్మైక్యము కల దనుటయే ప్రామాణికము.

త్రాటిని సర్ప మని భ్రమించినవానినిఁ గూర్చి "నీయెదుట నున్న పదార్థము సర్పము కాదు త్రాడు" అని బోధించినట్లే యీశ్రుతి "నీకు దుఃఖిత్వాదిరూపములతో నున్నట్లు కానఁబడుచున్న యాత్మ దుఃఖిత్వాదులు కలవాఁడు కాఁడు. ప్రత్యక్ష పరమేశ్వరుఁడే" యని బోధించుచున్నది. దృష్టాంతమునందు దృష్టిగోచర మైనపదార్థమునకు సామాన్యవిశేషభావములు కలవనియు దార్ష్టాంతికమునం దవి లేవనియు నీకారణమువలన నీదృష్టాంతము విరుద్ధ మనియుఁ జెప్పుటకు వీలు లేదు. పరమార్థస్థితిలోఁ బరమేశ్వరుఁడు సర్వవిశేషసామాన్యరహితుఁడే యైనను అవిద్యావశమున నవి కలవానివలె (సామాన్యవిశేషసహితునివలె) దోఁచుచున్నాఁడని నిర్ణయింపవచ్చును. ప్రత్యక్షము చైతన్యమాత్రమును గ్రహించుచున్నది; శ్రుతి దానినిర్వికారత్వమును జూపుచున్నది కదా! వాస్తవస్థితిలో

భ్రాంతియే లేదు. జీవత్వమే లేదు. జీవునకు నపూర్వముగా బరమేశ్వరత్వము వచ్చుటయే లేదు.

ఇట్లగుటచేతనే "జీవబ్రహ్మైక్యము నంగీకరించినచోఁ బరమేశ్వరుఁడైనను జీవుఁడైనను లేకపోవలసి వచ్చును. అప్పుడు ఒకపక్షమున గంతవ్య పదార్థము లేకపోవుటచేతను మఱియొకపక్షమున నధికారి లేకపోవుట చేతను శాస్త్రము నిరర్థకము కావలసివచ్చును." అనుటయు సరిపడదు. వేదము స్వతంత్ర ప్రమాణ మని యిదివఱకే నిరూపించి యున్నాము. అది పరమేశ్వరసద్భావమును చెప్పుచుండ నాతఁ డెట్లు లేకపోవును? మఱియు విచార కాలమునందును మే మాతనియభావము నంగీకరింపము. శ్రుతి పరమేశ్వరునకు జీవత్వమును విధించుట లేదు. జీవునకు మాత్రమే జీవత్వమును తొలఁగించి పరమేశ్వరత్వమును చెప్పుచున్నది. ఇట్లగుటచే లేకపోయిన జీవుఁడే లేకపోవలయును గాని పరమేశ్వరుఁడు కాఁడు. జీవుఁడు లేకపోవచ్చు ననఁగా జీవధర్మము లని భ్రాంతిచేఁ జూడఁబడుచున్న దుఃఖిత్వాదులే లేకపోవును కాని యీశ్వరగుణము లని చెప్పఁబడిన యపహత పాప్మత్వాదులు లేకపో వని యభిప్రాయము. చైతన్యము నశించునది కాదు కదా! ఇట్లే యధికారి లేకపోవు ననుటయు మాకు సమ్మతము కాదు. జ్ఞానము కలుగునంతవఱకు జీవుఁడు సంసారి యయ్యే యుండును; అంతవఱకు నాతఁ డధికారి యగును ప్రత్యక్షాది ప్రమాణములు నంతవఱకే యుండు ననియు నీకారణమువలన వేదప్రామాణ్యమునకు వానివలన భంగము రా దనియు నిదివఱకే నిరూపించి యున్నాము. శ్రుతియు జ్ఞానానంతరమున "యత్ర త్వస్య సర్వ మాత్మై వాభూ త్తత్కేన కం పశ్యేత్" "ఏజ్ఞానావస్థయందు సర్వము నాత్మయే యగునో యప్పు డెవ్వఁడు దేనిని దేనితోఁ జూచును" అని ప్రత్యక్షాద్యభావమును బోధించుచున్నది. "ఇట్లయిన వేదము కూడ నిట్టిదియే యగును కదా!" యనియెదవేమో. అది మాకు సమ్మతమే. శ్రుతియు నట్లే చెప్పుచున్నది. "అత్ర పితాఽపితా భవతి వేదా అవేదాః" "ఈజ్ఞానావస్థయందు తండ్రి తండ్రి కానేరఁడు. వేదములు వేదములు కానేరవు" అనువాక్య మీవిషయమున ప్రమాణము.

సరియే "మొట్టమొదట నజ్ఞాన మెవ్వనికిఁ గలిగెను. అట్లు కలిగిన బ్రహ్మ మొక్కటియు నజ్ఞాన మొక్కటియు నని పదార్థద్వయ మేర్పడు

చుండ నద్వైతత మెట్లు కుదురును ?" అనియెదవేమొ వినుము. "ఎవ్వఁడీ ప్రశ్నమును చేయుచున్నాఁడో వానికే యజ్ఞానము" అనుటయే దీని కుత్తరము. "శ్రుతి ప్రతివానినిఁ బరమేశ్వరుఁ డనియే చెప్పుచున్నది కదా!" అనియెదవేమొ యట్టినిశ్చయము కలిగిన నెవ్వనికి నజ్ఞానమే లేదు. జ్ఞానిదృష్టికి నందఱును జ్ఞానులే; అజ్ఞానదృష్టికి నందఱు నజ్ఞానులే. దృష్టిభేదమే కాని జ్ఞానాజ్ఞానులకు వాస్తవభేద మేమియు లేదు. "న నిరోధో న చోత్పత్తిః న వంద్యో న చ శాసనం న ముముక్షా న ముక్తి శ్చ ఇత్యేషాపరమార్థతా" "ప్రళయము కాని సృష్టి కాని లేదు. నమస్కరింపఁదగినవాఁడు కాని ఆచరింపఁదగినయాజ్ఞ గాని లేదు. మోక్షేచ్ఛ గాని ముక్తిగాని లేదు. ఇదియే పరమార్థస్థితి" యని మహాత్ములు చెప్పుచున్నారు. ఈకారణమువలననే యనిర్వచనీయ మగునవిద్యతో నాత్మకు ద్వైతముకూడ సంభవింపదు. కావున జీవబ్రహ్మైక్యము కల దనుటలో నాక్షేప మేమియు లేదు. ఈకారణమువలన ధ్యానకాలమున బరమేశ్వరు నాత్మరూపునిఁగా భావించుటయే యుపాసకునకుఁ గర్తవ్యము.

---

## ౩. ప్రతీకాధికరణము.

విషయసంశయములు:—"మనో బ్రహ్మే త్యుపాసీత నామ బ్రహ్మే త్యుపాసీత" అను మొదలగు ప్రతీకోపాసనలనుఁ గూర్చి ప్రస్తావవశమున నీయధికరణమున విచారింపఁబడును. *"అహంగ్రహోపాసనల యందువలెనే ప్రతీకోపాసనలయందుఁగూడ నాప్రతీకముల నాత్మనుగా భావింపవలయునా ? లేదా?" అనుసంశయము నివారింపఁబడును.

సంగతి పూర్వపక్షము:—"విచారించిన సర్వోపాసనలయందు నాత్మత్వధ్యానమునే యాచరింపవలయు నని తోఁచుచున్నది. పరమేశ్వరుఁడు పరమార్థస్థితిలో స్వస్వరూపభూతుఁ డనుకారణమువలనను అద్వితీయుఁ డని శ్రుతులచేఁ జెప్పఁబడుచున్నాఁ డనుకారణమువలనను మాత్రమే కదా జీవుఁడు అహంగ్రహోపాసనలయం దాయన నాత్మభూతునిఁగా భావించు

---

* "నేనే బ్రహ్మము" అని చేయఁబడవలసిన యుపాసనలు అహంగ్రహో

చున్నాఁడు. ఇచ్చటగూడ నట్లే మృత్తికావికారము లగుఘటాదులు స్వకారణ మగుమృత్తికకంటె భిన్నములు కానట్లు బ్రహ్మవివర్త మగునీప్రపంచముకూడ బ్రహ్మాభిన్నము కా దనుట యుక్తిసిద్ధ మగుటచే బ్రతీకోపాసనలయందును ఆప్రతీకముల నాత్మభూతములనుగా భావింపవచ్చును. జీవాభిన్నము బ్రహ్మము; బ్రహ్మాభిన్నములు ప్రతీకములు. ఇట్లగుటచే నిందు విరోధ మేమి కలదు? పరమేశ్వరుఁడును అద్వితీయుఁడే కావున తద్భిన్నముగ నేపదార్థము నుండఁగూడ దనుటయు నిర్వివాదాంశమే. కావునఁ బూర్వాధికరణమునందువలెనే యిచ్చటను ప్రతీకములయం దాత్మబుద్ధిని కర్తవ్యముగా సిద్ధాంతము చేయవలయును. 'ఇట్లు చేయుటవలన సిద్ధాంతమునకుఁ బ్రయోజనమేమి' అనియెదవేమొ వినుము. ప్రతీక మనునది ప్రపంచములోనిభాగము. అది యజ్ఞానులచే బ్రహ్మాభిన్నముగ భావింపఁబడుచున్నది కదా! దాని నాత్మగా భావింపవలయు నని యేతదధికరణసిద్ధాంతముచే నేర్పడినఁ బరమేశ్వరునియద్వితీయత్వము స్థిరపడును. ఆత్మగా భావింపఁబడవలయు ననినను బ్రహ్మముగా భావింపఁబడవలయు ననిన నొక్కటియే కదా! ఒక్క ప్రతీకమును బ్రహ్మమునుగా భావింపవలయు ననిన దద్దృష్టాంతముచే సర్వప్రపంచమును గూడ బ్రహ్మాత్మమునుగా భావింపవలయు నని తేలును కావున నీసిద్ధాంతమే యవశ్యకర్తవ్యము."

## అ-౪. పా-౧. సూ-౪.

అవతారిక:—అని దృష్టాంతసంగతితో వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౪౮౨. న ప్రతీకే న హి సః. ౪. ౧. ౪.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. పూర్వాధికరణమునకును ఈయధికరణమునకును (అనఁగా ఈరెండధికరణముల విషయములకు) భేదము కలదు. "అహం బ్రహ్మాస్మి" అనుమొదలగు నహంగ్రహోపాసనలయందు ఉపాస్యదేవత యగుబ్రహ్మము నహంకారాస్పదమునుగా (అనఁగా అహంకారమునకు నాధారముగ "నేను" అని యభిమానింపఁబడవలసినదానినిఁగా) శ్రుతి వర్ణించుచున్నది. ప్రతీకోపాసనలయం దన్ననో మనస్సు మొదలగుప్రతీకములును బ్రహ్మమునుగా నుపాసింప

వలయు ననిమాత్రమే చెప్పుచున్నదిగాని యహంకారాస్పదములనుఁగాఁ జెప్పుట లేదు. "ఇట్లు చెప్పకున్నను కొన్నిస్థలములయందు 'బ్రహ్మ మహంకారాస్పదము' అని చెప్పఁబడి యుండుటచేత, నేయేపదార్థములు బ్రహ్మరూపముతో నుపాసింపఁబడవలయునో అవి యన్నియు అహంకారాస్పదములుగానే యుపాసింపఁబడవలయు నని తేలును" అనియెదవేమొ, యది సంభవింపదు. ఇచ్చట (ప్రతీకోపాసనలయందు) నట్టిశ్రుతి ప్రత్యక్షముగ లేదు. అర్థబలమువలనఁ గల్పింపఁబోయిన నప్పు డామనః ప్రభృతి ప్రతీకము లాకాశాదిరూపములతోఁ గూడ నుపాసింపఁబడవలసినవి యగును. అవియు బ్రహ్మవికారములే కదా! అప్పు డుపాసనావిభాగమే యేర్పడకపోవలసివచ్చును. ఇది సమ్మతము కాదు కదా! కావున "యావద్వచనం వాచనికం" "'దీని నిట్లు భావింపవలయును' అని విధింపఁబడిన చోట్ల నెంతమాత్రము చెప్పఁబడెనో యంతమాత్రమే గ్రహింపవలయును" అనున్యాయము ననుసరించి ఎచ్చట నెట్లు చెప్పఁబడి యున్నదో అచ్చట నట్లే గ్రహింపవలయును. అహంగ్రహోపాసనలయందు బ్రహ్మమాత్మరూపముగ భావింపఁబడవలయు ననియుఁ బ్రతీకోపాసనలయందు అట్లు భావింపఁబడఁగూడ దనియు గ్రహింపవలయును. అధికము నూహించిన నతిప్రసంగము వచ్చు నని నిరూపించితిని కదా!

ఈకారణమువలన నుపాసకులు ప్రతీకముల నాత్మగా భావింపరాదు. ఉపాసకుఁడు వేఱు; ప్రతీకములు వేఱు. ఇట్లుండ నీరెంటికి నభేద మెట్లు కలుగును? మనస్సు మొదలగువానికిని జీవునకు నభేదము కల దను విషయ మనుభవగోచరము కాదు; శ్రుతిసిద్ధంబును కాదు కదా! "మనః ప్రభృతులు కూడ బ్రహ్మవికారములే కదా!" యనియెదవేమొ. ఇట్లు చెప్పిన నతిప్రసంగము వచ్చు నని మున్నే వివరించి యున్నాము. ఇంత మాత్రమే కాక నప్రతీకములును స్వరూపహానియములు కావలసివచ్చును. మనస్సు మొదలగునవి బ్రహ్మవికారములే యైనను వికారస్వరూపము నశింపనిది శుద్ధబ్రహ్మరూపములు కానేరవు; కాకున్నంతవఱకు నహంకారాస్పదములును కానేరవు. ఇట్లు స్వస్వరూపమే నశించిన నవి ప్రతీకము లగుట యెట్లు? అహంగ్రహముచే నుపాసింపఁబడుట యెట్లు? "స్వస్వరూపము నశింప నక్కఱ లేదు. అహంగ్రహోపాసనలయందు జీవుఁడు తన్ను బ్రహ్మరూపునిఁగా భావించునప్పు డాతనికి బ్రహ్మత్వముచే నభా

వము కలుగుచున్నను అది యెట్లు స్వస్వరూపాభావము కాదో అట్లే ఇచ్చ టను స్వస్వరూపాభావము లేకుండఁగనే యాభావము కలుగవచ్చును. జీవుఁడు జ్ఞానము కలిగినపిదపఁ గూడ నవచ్ఛిన్నుఁడయ్యే యుండునట్లు మనస్సుకూడ బ్రహ్మముగా భావింపఁబడి యహంకారముతో గ్రహింపఁ బడినను స్వస్వరూపముతోనే యుండవచ్చును. అచ్చట భావన మాత్రమే ప్రయోజక మగును." అనియెదవేమొ యదియు ప్రస్తుత విషయమున సంభవింపదు. మీపక్షమున నహంకారముచే నుపాసింపఁ బడవలసినవి ప్రతీకములా? లేక బ్రహ్మమా? ప్రతీకము లైనచో వానికి నావశ్యకముగ స్వరూపాభావము కలిగి తీరవలయును. ఏల యనిన:— ఉపాసకుఁడగుజీవునకును ప్రతీకములకును భేదము కల దనుట సర్వలోక ప్రసిద్ధము. అహంకారంబును ఆయుపాస్యదేవతలతో (ప్రతీకములతో) సంబంధింపవలయు ననుటయు స్పష్టము. ఈకారణమువలనఁ గల్పితముగాఁ గాని యథార్థముగాఁ గాని ప్రతీకరూప ముండినచో నచ్చట యాత్మ భావము సంభవింపదు. ప్రత్యక్షముగ నైనను పరంపరగా నైనను పర మేశ్వరునియందే కదా యాత్మభావము ఉపనిషత్సిద్ధాంతము ననుసరించి సంభవింపవలయును. కావున ప్రతీకస్వరూప మవశ్యముగ నశించి తీర వలయును. అహంగ్రహోపాసనలవిషయ మన్ననో యిట్టిది కాదు. అచ్చట నుపాస్యదేవతయం దహంకారసంబంధము లేదు. ఉపాస్యదేవత యుపాస కునికంటె భిన్నుఁడు కాఁడు కదా! త్రాటినిఁ జూచి సర్ప మని భ్రమించిన వానినిఁగూర్చి "ఇది సర్పము కాదు; త్రాడు" అని చెప్పినట్లు జీవునిఁ జూపి "వీఁడు జీవుఁడు కాఁడు పరమేశ్వరుఁడే" అని మాత్రమే యిచ్చట (అహం గ్రహోపాసనలయందు) చెప్పఁబడుచున్నదిగాని మఱియేమియు లేదు; కావున నాయుపాసనలయందు కల్పితభేదము గలజీవుఁడుమాత్రమే స్వస్వ రూపము నహంకారముతో నుపాసించును. ఇట్లగుటచే నచ్చట స్వరూప నాశ మక్కఱ లేదు. ఉపాసకస్వరూపమునకు నుపాస్యస్వరూపమునకును భేదమే లేదు కదా! కావున నవచ్ఛిన్నత్వ మట్లే యున్నను స్వరూపా భావము లేకపోయినను జీవబ్రహ్మము లొక్కటి కావచ్చును. ప్రతీకోపా సనలవిషయమున నట్లు కానేరదు. అచ్చట నుపాస్యోపాసకులు భిన్నులు. ఉపాసకునిస్వరూపము పరబ్రహ్మము, ఉపాస్యస్వరూపము మనస్సు. పర్వవికారములును బ్రహ్మమయము లనుకారణముచే నాప్రతీకమును

గూడ బ్రహ్మమునుగా గ్రహించిన నప్పుడు ప్రతీకమే లేదు; ప్రతీకోపాసనయే లేదు. కావున నిర్వివాదముగ ప్రతీకములయందు దాత్మబుద్ధి యుంప నక్కఱ లేదు.

"ఇట్లు కా కున్నను పరమేశ్వరుఁడే యాత్మగావున పరమేశ్వర దృష్టితోఁ జేయఁబడవలయు నసునప్పు డాత్మదృష్టితోఁ జేయఁబడవలయు నని కల్పింపవచ్చును" అనియెదవేమొ యది సంభవింపదు. ఈ ప్రతీకోపాసనలు అహంగ్రహోపాసనలతో నేకవాక్యములుగ లేవు. భిన్నప్రకరణమున సున్నవి. మఱియుఁ గర్తయు భోక్తయు సుఖియు దుఃఖియు నగువాఁడే ఈ ప్రతీకోపాసనలయందుఁ గర్తగా నిర్ణయింపఁబడి యున్నాఁడు. అహంగ్రహోపాసనలయం దన్ననో నిట్టివాఁడు కాఁడు. కర్తృత్వాది సంసారధర్మములు లేనప్పుడే కదా జీవునకు పరమేశ్వరరూప ముపదేశింపఁబడుచున్నది. ఇట్లుండ బ్రతీకోపాసనలయం దుపాసకుఁడుగా వర్ణింపఁబడిన సంసారికి బ్రహ్మాత్మత్వ మెట్లు కలుగును? ఆతఁడును ప్రతీకములవంటివాఁడే; బ్రహ్మవికారము కాకపోయినను తక్కినధర్మములలోఁ బ్రతీకము లగుచిత్తాదులతోఁ సమానుఁడే. ఇట్లయిన వానికి బ్రహ్మాత్మత్వ మెట్లుకలుగును? ఆతఁడును ప్రతీకములును ప్రత్యేకముగ బ్రహ్మరూపములే యైన నగుఁగాక వానికి నైక్య మెట్లు కలుగును? కటకకేయూరములు రెండును బ్రత్యేకముగ సువర్ణరూపములే యైనను వానికిఁ బరస్పరభావము సంభవింపదు కదా! కారణము (బ్రహ్మము) ననుసరించి రెంటికి నైక్యమును చెప్పఁదలఁచిన నప్పుడు ప్రతీకమే యుండ దని యిదివఱకే చెప్పియున్నాము. కావున నెట్లును ప్రతీకోపాసనలయందు ప్రతీకముల నాత్మగా భావింప నక్కఱ లేదు.

"ప్రపంచలయమే యిట్టిభావనకు ఫల మగును." అనుటయు యుక్తిశూన్యమే. అప్పుడు ఆయుపాసనావాక్యమునందు "సర్వం ఖ ల్విదం బ్రహ్మ" అనువాక్యమునందువలె ప్రపంచవాచకపదములే గ్రహింపవలయును గాని ఒకమనస్సును మాత్రమే గ్రహించుటకు వీలు లేదు. అభిప్రాయ మొక్కటి యుండ దానిని వివరింపక ప్రచ్ఛన్నముగ నుంపవలసినంత యావశ్యకత యేమి? "ప్రచ్ఛన్నము చేయలేదు మనశ్శబ్దముచే సజాతీయ మగుప్రపంచము నంతయును గ్రహింపవలయు ననియే యావాక్యమున కుద్దేశము" అనియెదవేమొ యదియు యుక్తము కాదు. అప్పుడు

యితర ప్రతీకోపాసనలు నిరర్థకములు కావలసివచ్చును. ఒక్క ప్రతీకము చేత నే సర్వప్రపంచము గ్రహింపఁబడిన రెండవ ప్రతీక మేటికి? మఱియు ముఖ్యార్థము సంభవించుచుండ గౌణార్థమును గ్రహించుటయుఁ బాడి కాదు కదా! కావున మీ రుద్భావించినఫలంబును యుక్తియుక్తము కాదు. కావున నెట్లు చూచినను ప్రతీకములయం దాత్మభావన ముంపఁదగదు.

---

# ౪. బ్రహ్మదృష్ట్యధికరణము

విషయసంశయసంగతులు:— ఈయధికరణమునందును పూర్వాధికరణవిషయము లగు ప్రతీకోపాసనలనుగూర్చియే మఱియొకవిషయము విచారింపఁబడును. ఈకారణమువలన నేకవిషత్వమే పూర్వాధికరణముతో దీనికిఁ గలసంబంధము. ఇదియుఁ బ్రస్తావవశమున నే యీపాదమునందుఁ జేర్పఁబడెను. "ఈ ప్రతీకోపాసనలయందు మనస్సు మొదలగువానిని బ్రహ్మమునుగా భావింపవలయునా? లేక బ్రహ్మమును మనస్సు మొదలగువానినిఁగా భావింపవలయునా?" అనుసంశయము నిరాకరింపఁబడును. "హీనముల నధికదృష్టితో భావింపవలయును గాని యధికముల హీనదృష్టితో నుపాసించుట యుక్తము కాదు." అనులోకన్యాయము స్థిరపరుపఁబడును.

పూర్వపక్షము:—"విచారించిన నీ ప్రతీకోపాసనలయందు నియమమైనను లేకపోవలయును. పరబ్రహ్మమునందు మనఃప్రభృతిభావనయైన నుండవలయును. ఏలయనిన:—రెండుపదములుసమానవిభక్తిలోఁ బ్రయోగింపఁబడి యుండుట సామానాధికరణ్య మనఁబడును. ఈ ప్రతీకోపాసనలయందు 'ఆదిత్యో బ్రహ్మ ప్రాణో బ్రహ్మ విద్యుద్బ్రహ్మ' అని యిట్లు సామానాధికరణ్యము కలదు. భిన్నార్థములను చెప్పుపదములకు నిరర్థకముగా నేసంబంధము లేకపోయినచో సామానాధికరణ్య ముండదు. 'గోవు అశ్వము' అని సామానాధికరణ్య మెందైన నుండునా? కావున నీసామానాధికరణ్యమున కర్థ మేదియో కొంచెము విచారింపవలసి యున్నది.

'కారణకార్యభావమే యీసామానాధికరణ్యమున కర్థము కావచ్చును.' అనిన నది యుక్తము కాదు. అప్పుడు వికారములకు స్వరూప

నాశము కలుగవలయు నని పూర్వాధికరణమున సిద్ధాంతము చేయఁ బడెను. అట్లు కలిగినచో నప్పుడు ప్రతీకమే యుండ దనియు ప్రతీకోపాస నయే యుండ దనియుఁ గూడ పూర్వాధికరణమునందే సిద్ధాంతము చేయఁబడెను. ఆసిద్ధాంతము ననుసరించి చూచిన నప్పుడు వాక్యము బ్రహ్మపరమే యగును. అట్లయిన నుపాసనాధికారమే బాధిత మగును. కర్తృత్వాదిగుణములు గలసంసారికి బ్రహ్మాత్మత్వము సంభవింప దనియు అవి లేనిశుద్ధునకు నుపాసకత్వము సంభవింప దనియు మున్నే వివరింపఁబడి యున్నది. మఱియు వికారనాశ మనఁగా సర్వవికారనాశమే యగుటచే నప్పుడు ఒక్కపదార్థమును మాత్రమే గ్రహించి దానికి మాత్రమే బ్రహ్మా త్మత్వమును బోధించుటవలనఁ బ్రయోజన ముండదు. కావున నీసామా నాధికరణ్యమునకుఁ బ్రకృతివికారభావ మర్థము కాదు.

ఇట్లగుటచే 'బ్రాహ్మణ నోఽగ్నిః' 'బ్రాహ్మణుఁడు అగ్నిహోత్రము' అను మొదలగు వాక్యములయందువలె నీప్రతీకోపాసనావాక్యముల యందును ఒకదానిని మఱియొకవిధముగ భావింపవలయు ననుటయే యభి ప్రాయ మగును. అందలిసామానాధికరణ్యమునకు నిదియే యర్థ మనవలసి వచ్చును. ఇట్లయిన నేపదార్థము నేపదార్థముగా భావింపవలయునో యనుసంశయ ముదయించును. ఆవిషయమును నిర్ణయించుశాస్త్ర మేదియు లేకపోవుటచే నీయుపాసనలయందు నియమమే లే దని యొక సిద్ధాంతము స్ఫురించుచున్నది. ఎట్లయినను సామానాధికరణ్యమునకు మాత్రము భంగము రాదుకదా! సామాన్యదృష్టికి నిట్లున్నను కొంచెము విమర్శించిన 'పరబ్రహ్మము చిత్తాదిరూపములతో భావించుటయే యుక్తము' అని తోచుచున్నది. అట్లు భావించిన పరబ్రహ్మమే యుపాస్యదేవత యగును. అట్లయిననే గాని ఫలము సంభవింపదు కదా! బ్రహ్మమే యన్నిటి లోను ప్రధాన మనువిషయము నిర్వివాదమే కావున బ్రహ్మమునే చిత్తాది రూపములతో భావింపవలయును గాని చిత్తాదులను బ్రహ్మరూపముతో భావింపరాదు. 'హీనము నధికరూపముతో భావింపవలయును గాని యధిక మును హీనరూపముతో భావింపరాదు' అని లౌకికన్యాయమున్నను అది యీనిర్ణయమును బాధింప నేరదు. ఇది విచారణాపూర్వకముగ నిర్ణయింపఁ బడిన వేదార్థము; అది సామాన్య మగులోకన్యాయము. కావున బలాబల విచారము గావించినచో శ్రుతిచే న్యాయము బాధింపఁబడవలయును

కాని న్యాయముచే శ్రుతి కాదు కదా! కావున బ్రహ్మమును చిత్తాది రూపములతో నుపాసింపవలయు ననుటలో నాక్షేపము లేదు."

## అ-౪. పా-౧. సూ-౫.

అవతారిక:—అని యిట్లు వచ్చినపూర్వపక్షమును ఖండించు చున్నాఁడు.

## ౪౮౩. బ్రహ్మదృష్టి రుత్కర్షాత్. ౪. ౧. ౫.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట సరికాదు. మనస్సు సూర్యుఁడు మొదలగువానియందు బ్రహ్మదృష్టి నుంచుటయే కర్తవ్యము. బ్రహ్మ మధికుఁడు; ఆదిత్యాదు లల్పులు. ఇట్లగుటచే నాదిత్యాదులయందు బ్రహ్మదృష్టి నుంచిన వారల గౌరవించిన ట్లగును. ఇదియే లౌకికన్యాయము. హీనులగు మంత్రి మొదలగువారిని రాజదృష్టితో నూచినచో నది లాభకారి యగును గాని రాజును మంత్రిసామంతాదిదృష్టులతోఁ జూచిన దానివలనఁ బ్రయోజన ముండదు కదా! రాజశ్రేయమును కోరినవారు మంత్రికడకుఁ జేరి "మీరే ప్రభువులు మీవలననే కార్యనిర్వాహము కావలయును" అని నుతించిన నప్పుడు ప్రయోజనము కలుగును గాని అల్పునిఁగా గణించిన నట్లు కలుగదు కదా! కావున లోకన్యాయానుసారముగనే యిచ్చట సిద్ధాంతము గావింపవలయును. మనస్సు సూర్యుఁడు మొదలగువారి యందు బ్రహ్మదృష్టి నుంపవలయును; లేకున్న భృత్యుఁ డని భావింపఁబడిన రాజు ఫలము నొసంగ లేనట్లు పరమేశ్వరుఁడును ఫలము నొసంగ నేరఁడు; ఆభావనవలన దోషము కలుగునట్లు ఈభావనవలనఁగూడ దోషము కలుగును.

"శ్రుత్యర్థము మఱియొకవిధముగా నుండ నిట్లు కేవల లోకన్యాయము ననుసరింపఁ జూచుట యుక్తము కాదు. శ్రుతికంటె న్యాయము బలహీనము కదా" అనియెదవేమొ యట్లు కాదు. శాస్త్రార్థము నిర్ణీతమై యున్నప్పుడు మాత్రమే లోకన్యాయమును పరిపూర్ణముగఁ బరిత్యజించుటకు వీలు కలుగును కాని సందిగ్ధముగానే యున్నప్పు డట్లు చేయుటకు వీలు లేదు. అప్పుడు లోకన్యాయము కూడ నిర్ణయమునకు నొకయాధారముగా గైకొనఁబడవచ్చును కదా! ప్రస్తుతవిషయమున శాస్త్రార్థము

నిర్ణీతము కాలేదు. వాస్తవస్థితిలో ఫలదాత యగుటచే నన్నియెడలను పరబ్రహ్మమే ప్రధాన మైనను శ్రుతిబలమువలనఁ గొన్ని కొన్ని స్థలముల యందుఁ గర్మాదిపదార్థాంతరములును ప్రధానము లగుచున్నవి. సర్వ యజ్ఞములయందును ఆయాయజ్ఞముచే నారాధింపఁబడిన దేవతయే ఫలము నొసంగునది యగుటచే బ్రధాన మైనను ఆయాయజ్ఞములే (ఫలదాయకములుగాను) ప్రధానములుగాఁ బూర్వమీమాంసా శాస్త్రమునందు నిర్ణయింపఁబడి యున్నది. దేవత సామాన్యముగ నన్ని ఫలముల నొసంగునది యగుటయు విశేషఫలసిద్ధికిఁ గర్మయే కారణ మగు టయు నీవిషయమున హేతువులుగ నభివర్ణింపఁబడినవి. కావున నిచ్చటఁ గూడ నొకవేళ లోకన్యాయానుసారముగ నికృష్టు లగునాదిత్యాదులే కూడ ప్రధానులు కావచ్చునేమో యనియుఁ దోఁచుచున్నది. ఫలము నొసంగు విషయమునుబట్టి చూచిన దాని కెట్లును విరోధము రాదు. పరబ్రహ్మ మును ప్రధానముగ నంగీకరించిననే కాని ఫలము కలుగ దనుమాట లేదు. ఆయనయే సర్వాధ్యక్షుఁ డగుటచే ప్రధానుఁడుగాఁ గైకొనఁబడి నను లేకున్నను కూడ ఫలము నొసంగవచ్చును. అతిథులను పూజించిన శుభఫలము కలుగు నని యున్నది కదా! ఆశుభఫలము నొసంగువా రెవ్వరు? అతిథులకు నట్టిసామర్థ్యము లే దనుట నిర్వివాదాంశము కదా! ఈకారణమువలన నయ్యతిథిసత్కారమువలన సంతుష్టుఁడైనపరమేశ్వ రుఁడే ఫలము నొసంగు నని చెప్పవలసి యున్నది. ఇంతమాత్రమువలన నతిథులకుఁ గలప్రాధాన్యము నశింపదు కదా! ఇట్లే ఆదిత్యాద్యుపాసనల కును పరమేశ్వరుఁడే ఫలదాత కావచ్చుమ; ఆదిత్యాదులకు ప్రాధాన్యము కూడఁ గలుగవచ్చును. సర్వవిధముల బ్రహ్మమే ప్రధానము కావలసి యున్నను శాస్త్రము పైనిరూపించినహేతువులను బట్టి "బ్రహ్మదృష్టితో సూర్యాదుల నుపాసించిన నప్పుడు బ్రహ్మము ఫలము నొసంగును" అనియే యుపదేశించి యుండు నేమో యని సంశయించుటకు వీలు కలదు కదా! ఉపాస్య దేవతలు సూర్యాదులే యైనను ధ్యానకాలమున బుద్ధికి గోచర మగునది బ్రహ్మమే కావున నెట్లుభావించినను "ఫలదాత బ్రహ్మము." అను సిద్ధాంతమునకు నాక్షేప ముండదు కదా! ఈవిషయము ("ఏయుపాసన నాచరించినను బ్రహ్మమే ఫలము నొసంగును" అనువిషయము) "ఫల మత ఉపపత్తేః 3. 2. 38." అనుస్థలమున సవిమర్శముగా నిర్ణయింపఁ

బడి యున్నది. కావున పైన వర్ణించినవిధముగా శాస్త్రార్థము సందిగ్ధ మగుటచే నిర్ణయమునకై లోకన్యాయ మొకప్రబలహేతువుగా నంగీక రింపఁబడవలసినదియే.

ఇంతమాత్రమే కాదు. కేవల లోకన్యాయమును పట్టియే కాక పూర్వాపరసందర్భమునుపట్టి శ్రుతివలనఁగూడ నీవిషయమే (ఆదిత్యా దులే ప్రధాను లనువిషయమే నిర్ణయింపఁబడుటకు వీలు కలదు. "ఆదిత్యో బ్రహ్మ మనో బ్రహ్మ" ఇత్యాద్యుపాసనావాక్యములయందు ఆదిత్యాది పదములు మొట్టమొదట నున్నవి. ఇట్లగుటచే వానికి ముఖ్యార్థమునే గ్రహింపవచ్చును. ముఖ్యము లగువానిని మొట్టమొదట ప్రయోగింతు రనుట లోకవేదసిద్ధ మగున్యాయము కదా! ఇట్లు గ్రహించిన పై సిద్ధాం తమే దృఢ మగును. ఇట్లు గ్రహించుటవలన విరోధ మేమియు కలుగ దని పూర్వముననే నిరూపించి యున్నాము; ఆయవిరోధమునే సంశయ హేతువునుగాఁ గూడ వర్ణించి యున్నాము. కదా! కావున నీహేతు వుచే నాదిత్యాదిపదములవలన బుద్ధి తదర్థము లగుబింబాదుల గ్రహించి యుండఁగాఁ బిమ్మట బ్రహ్మపదము వినవచ్చును. అప్పుడు దానికిని ముఖ్యా ర్థమునే గ్రహించిన పూర్వభావనకు (ఆదిత్యాదిభావనకు) బాధ వచ్చును. ఇది సంభవింపదు. అప్పుడు మీరు చెప్పువాక్యార్థము కూడఁ గుదురదు కదా! అప్పు డాదిత్యప్రతీకమే యుండుట సంభవింప దని మీరే చెప్పి యున్నారు. ఈకారణమువలన నా బ్రహ్మపదమునకు గౌణార్థమునే యంగీక రింపవలయును. అదియు మఱియొకవిధముగా సంభవింపనేరదు. కావున నట్టిభావన (బ్రహ్మభావన) మాత్రమే యాబ్రహ్మపదముచే నుద్దేశింపఁ బడె ననవలయును. "ప్రతీకోపాసనలయందు ఒకపదార్థమును మఱియొక పదార్థముగ భావింపవలయు ననియే యుపదేశింపఁబడి యున్నది" యని యీవిషయము మీరే చెప్పియున్నారు. కావున మొట్టమొదట నుండు టచే సూర్యాదులే ప్రధానులు కావచ్చును.

ఇట్లే సర్వవాక్యములయందును బ్రహ్మపదము వెంట "ఇతి"శబ్దము ప్రయోగింపఁబడి యున్నది. "బ్రహ్మేత్యాదేశః. బ్రహ్మేత్యుపాసీత. బ్రహ్మేత్యుపాస్తే." "బ్రహ్మ మని యుపదేశింపఁబడెను. బ్రహ్మ మని యుపాసన చేయవలయును. బ్రహ్మ మని యుపాసనచేయునో" అని ప్రతి స్థలమునందు నాశబ్దము కలదు. దీని కర్థ మేమి? "(సూర్యుని) బ్రహ్మ మని

యుపాసింపవలయును" అనిన "(సూర్యుని) బ్రహ్మమునుగా భావింపవలయును" అని మాత్రమే కదా యర్థము. ఇట్లయిన "ముత్యపుచిప్పను వెండి యని తలంచుచున్నాఁడు" అను మొదలగు స్థలములయందువలెనే యిచ్చటఁ గూడ తాత్పర్యనిర్ణయము చేయవలసియుండును. ఈవాక్యమునకు "ఎదుట నున్నది ఆముత్యపుచిప్పయే గాని వెండి కాదు. అయినను ఆముత్యపుచిప్పను వెండిగాఁ దలంచుచున్నాఁడు. వెండి మనస్సునందు మాత్రమే భావింపఁబడుచున్నది గాని చూడఁబడుచున్నది మాత్రము ముత్యపుచిప్పయే." అనుటయే యెట్లభిప్రాయమో అట్లే ప్రతీకోపాసనావాక్యములకుఁ గూడ "సూర్యుఁడు మాత్రమే యెదుట నున్నాఁడు. బ్రహ్మము మనస్సునందు మాత్రమే భావింపఁబడుచున్నది." అనుటయే యభిప్రాయ మగును. ఈపక్షము నంగీకరింపకున్న నీక నాయితిశబ్దమున కెట్లును స్వార్థకత్వమును కల్పించుటకు వీలు లేదు. బ్రహ్మశబ్దమునకు స్వార్థమును గ్రహించునెడల నీయితిశబ్దముతో బొత్తుగ నేపని లేదు. ఇట్లు గాక "గా వితి మే గవయః" "నేను గవయమృగమును గోవని చెప్పితిని" అనునిట్టివాక్యములయందువలె నితిశబ్దమునకు స్వార్థకత్వమును కల్పించుటకును వీలు లేదు. ఇచ్చట గోశబ్దము గవయవాచకముగా భ్రాంతిచే గ్రహింపఁబడెను. ఇచ్చట శ్రుతికి భ్రాంతి యుండదు; బ్రహ్మపదము ఆదిత్యవాచకంబును కాదు కదా! కావున నిర్వివాదముగ పైఁజెప్పినయర్థమునే ("ప్రతీకమును బ్రహ్మబుద్ధితో నుపాసింపవలయును" అనునర్థమునే) గ్రహించి తీరవలయును.

ఇంత యేల? అచ్చటివాక్యశేషములను విమర్శించిన నీయర్థము విస్పష్టముగ తేటపడును. అచ్చట ఆదిత్యాదిప్రతీకముల కర్మవాచక మగు ద్వితీయావిభక్తితో చెప్పి వానిచే యుపాసనాక్రియతో సంబంధ మున్నట్లు శ్రుతి తెలియఁజేయుచున్నది. "స య ఏత మేవం విద్వా నాదిత్యం బ్రహ్మే త్యుపాస్తే, యో వాచం బ్రహ్మే త్యుపాస్తే, యః సంకల్పం బ్రహ్మే త్యుపాస్తే" "ఎవ్వఁడు ఈవిధముగ నెఱింగి యీసూర్యుని బ్రహ్మబుద్ధితో నుపాసించునో, ఎవ్వఁడు వాక్కును బ్రహ్మ మని యుపాసించునో, ఎవ్వఁడు సంకల్పమును బ్రహ్మ మని యుపాసించునో" అను మొదలగువాక్యము లీవిషయమునఁ బ్రమాణములు. క్రియాసంబంధము ప్రత్యక్షముగాఁ గలది యగుటచే నాదిత్యాది ప్రతీకవాచకపదసమా

హము బ్రహ్మపదమునకంటె ప్రధానము. ఫలముకూడ నెట్లయినను పరమేశ్వరునివలననే కలుగవచ్చు ననియు నింతమాత్రమున బరమేశ్వర ప్రాధాన్యమును గ్రహింపవలయు నను నియమము లేదనియు నిదివఱకే చెప్పియున్నాము. కావున నిర్వివాదముగ సూర్యాదులయందు బ్రహ్మ దృష్టి నుంచుటయే కర్తవ్యము. ప్రతిమాదులను విష్ణ్వాదులనుగా భావించునట్లు ఈసూర్యాదులనుఁగూడ బ్రహ్మమునుగా భావింపవలయు ననుటయే సిద్ధాంతము.

---

## ౫. ఆదిత్యాదిమత్యధికరణము.

విషయ సంశయములు :— బ్రహ్మదృష్ట్యుపాసనలను గూర్చి విచారింపఁబడుటవలన నీయధికరణమున ప్రస్తావవశమున నంగాశ్రితోపాసనలనుఁగూర్చి విచారింపఁబడుచున్నది. "య ఏ వాసౌ తపతి త ముద్గీథ ముపాసీత" "ఎవ్వఁడు ప్రకాశించుచున్నాఁడో వానిని (సూర్యుని) ఉద్గీథమునుగా నుపాసింపవలయును" అను మొదలగు నుపాసనావాక్యములు శ్రుతులయందు కలవు. వానియందు "సూర్యాదుల నుద్గీథాదిదృష్టితో నుపాసింపవలయు నని చెప్పఁబడి యున్నదా? లేక ఉద్గీథాదులను సూర్యాదిదృష్టితో నుపాసింపవలయు నని చెప్పఁబడి యున్నదా?" అను సంశయము నివారింపఁబడును.

సంగతి పూర్వపక్షము:—"ఇచ్చట రెండువిధములుగఁ దోఁచుచున్నది. ఒకపక్షమున నియమమే యుండఁగూడ దని తోఁచుచున్నది. అట్టి నియమమును నిరూపించుశాస్త్ర మేదియుఁ గానరాలేదు. లోక న్యాయము ననుసరించి చూత మనినను ఇందు హీనాధికభావములు గానరాలేదు. బ్రహ్మదృష్ట్యుపాసనలయం దన్ననో పరమేశ్వరుఁడు సృష్టిస్థితిలయకారణభూతుఁడును సర్వజ్ఞుఁడు నగుటచే నాదిత్యాదులకంటె నుత్తముఁడు కావచ్చును గాని యిచ్చటనుద్గీథాదులుగాని యాదిత్యాదులుగాని తక్కినవానికంటె యుత్తమము లగుటకుఁ గారణ మేమియు లేదు. కావున నెట్లును ఇచ్చట న్యూనాధికభావమును నిర్ణయించుటకు వీలులేదు. ఆదిత్యాదు లుద్గీథాదులుఁ గూడ బ్రహ్మవికారములే కావున వానిలో భేదమును నిర్ణయించుటకు వీలు లేదు కదా!

యుపాసింపవలయును" అనిన "(సూర్యుని) బ్రహ్మమునుగా భావింపవల యును" అని మాత్రమే కదా యర్థము. ఇట్లయిన "ముత్యపుచిప్పను వెండి యని తలంచుచున్నాఁడు" అను మొదలగు స్థలములయందువలెనే యిచ్చటఁ గూడ తాత్పర్యనిర్ణయము చేయవలసియుండును. ఈవాక్యము నకు "ఎదుట నున్నది ఆముత్యపుచిప్పయే గాని వెండి కాదు. అయినను ఆముత్యపుచిప్పను వెండిగాఁ దలంచుచున్నాఁడు. వెండి మనస్సునందు మాత్రమే భావింపఁబడుచున్నది గాని చూడఁబడుచున్నది మాత్రము ముత్యపుచిప్పయే." అనుటయే యెట్లభిప్రాయమో అట్లే ప్రతీకో పాసనావాక్యములకుఁ గూడ "సూర్యుఁడు మాత్రమే యెదుట నున్నాఁడు. బ్రహ్మము మనస్సునందు మాత్రమే భావింపఁబడుచున్నది." అనుటయే యభిప్రాయ మగును. ఈపక్షము నంగీకరింపకున్న నిఁక నా యితిశబ్దమున కెట్లును స్వార్థకత్వమును కల్పించుటకు వీలు లేదు. బ్రహ్మ శబ్దమునకు స్వార్థమును గ్రహించునెడల నీయితిశబ్దముతో బొత్తుగ నే పని లేదు. ఇట్లు గాక "గా వితి మే గవయః" "నేను గవయమృగమును గోవని చెప్పితిని" అనునిట్టివాక్యములయందువలె నితిశబ్దమునకు స్వార్థ కత్వమును కల్పించుటకును వీలు లేదు. ఇచ్చట గోశబ్దము గవయవాచ కముగా భ్రాంతిచే గ్రహింపఁబడెను. ఇచ్చట శ్రుతికి భ్రాంతి యుండదు; బ్రహ్మపదము ఆదిత్యవాచకంబును కాదు కదా! కావున నిర్వివాదముగ పైఁజెప్పినయర్థమునే ("ప్రతీకమును బ్రహ్మబుద్ధితో నుపాసింపవలయును" అనునర్థమునే) గ్రహించి తీరవలయును.

ఇంత యేల? అచ్చటివాక్యశేషములను విమర్శించిన నీయర్థము విస్ప ష్టముగ తేటపడును. అచ్చట ఆదిత్యాదిప్రతీకముల కర్మవాచక మగు ద్వితీయావిభక్తితో చెప్పి వానిచే యుపాసనాక్రియతో సంబంధ మున్నట్లు శ్రుతి తెలియఁజేయుచున్నది. "స య ఏత మేవం విద్వా నాదిత్యం బ్రహ్మే త్యుపాస్తే, యో వాచం బ్రహ్మే త్యుపాస్తే, యః సంకల్పం బ్రహ్మే త్యుపాస్తే" "ఎవ్వఁడు ఈవిధముగ నెఱింగి యాసూర్యుని బ్రహ్మబుద్ధితో నుపాసించునో, ఎవ్వఁడు వాక్కును బ్రహ్మ మని యుపాసించునో, ఎవ్వఁడు సంకల్పమును బ్రహ్మ మని యుపాసించునో" అను మొద లగువాక్యము లీవిషయమునఁ బ్రమాణములు. క్రియాసంబంధము ప్రత్యక్షముగాఁ గలది యగుటచే నాదిత్యాది ప్రతీకవాచకపదసమూ

హము బ్రహ్మపదమునకంటె ప్రధానము. ఫలముకూడ నెట్లయినను పరమేశ్వరునివలననే కలుగవచ్చు ననియు నింతమాత్రమున బరమేశ్వర ప్రాధాన్యమును గ్రహింపవలయు ననునియమము లేదనియు నిదివఱకే చెప్పియున్నాము. కావున నిర్వివాదముగ సూర్యాదులయందు బ్రహ్మదృష్టి నుంచుటయే కర్తవ్యము. ప్రతిమాదులను విష్ణ్వాదులనుగా భావించునట్లు ఈసూర్యాదులనుఁగూడ బ్రహ్మమునుగా భావింపవలయు ననుటయే సిద్ధాంతము.

---

## ౫. ఆదిత్యాదిమత్యధికరణము.

విషయ సంశయములు:—బ్రహ్మదృష్ట్యుపాసనలను గూర్చి విచారింపఁబడుటవలన నీయధికరణమున ప్రస్తావవశమున నంగాశ్రితోపాసనలనుఁగూర్చి విచారింపఁబడుచున్నది. "య ఏ వాసౌ తపతి త ముద్గీథ ముపాసీత" "ఎవ్వఁడు ప్రకాశించుచున్నాఁడో వానిని (సూర్యుని) ఉద్గీథమునుగా నుపాసింపవలయును" అనుమొదలగు నుపాసనావాక్యములు శ్రుతులయందు కలవు. వానియందు "సూర్యాదుల నుద్గీథాదిదృష్టితో నుపాసింపవలయు నని చెప్పఁబడి యున్నదా? లేక ఉద్గీథాదులను సూర్యాదిదృష్టితో నుపాసింపవలయు నని చెప్పఁబడి యున్నదా?" అను సంశయము నివారింపఁబడును.

సంగతి పూర్వపక్షము:—"ఇచ్చట రెండువిధములుగఁ దోఁచుచున్నది. ఒకపక్షమున నియమమే యుండఁగూడ దని తోఁచుచున్నది. అట్టి నియమమును నిరూపించుశాస్త్ర మేదియుఁ గానరాలేదు. లోకన్యాయము ననుసరించి చూతమనినను ఇందు హీనాధికభావములు గానరాలేదు. బ్రహ్మదృష్ట్యుపాసనలయం దన్ననో పరమేశ్వరుఁడు సృష్టిస్థితిలయకారణభూతుఁడును సర్వజ్ఞుఁడు నగుటచే నాదిత్యాదులకంటె నుత్తముఁడు కావచ్చును గాని యిచ్చటనుద్గీథాదులుగాని యాదిత్యాదులుగాని తక్కినవానికంటె యుత్తమము లగుటకుఁ గారణ మేమియు లేదు. కావున నెట్లును ఇచ్చట న్యూనాధికభావమును నిర్ణయించుటకు వీలు లేదు. ఆదిత్యాదు లుద్గీథాదులుఁ గూడ బ్రహ్మవికారములే కావున వానిలో భేదమును నిర్ణయించుటకు వీలు లేదు కదా!

మఱియు మఱియొకవిధముగఁ జూచిన నాదిత్యాదులయం దుద్గీథాదిదృష్టి నుంపవలయు నని నియమించుటకు వీలు కల దనియుఁ దోఁచుచున్నది. ఉద్గీథాదులు కర్మాంగము లగుటచే ఫలము నొసంగును. ఆదిత్యాదు లట్టివి కాకపోవుటచే ఫలప్రదాయకములు కానేరవు. ఈకారణమువలన నుద్గీథాదులు ఆదిత్యాదులకంటె శ్రేష్ఠములు. ఇట్లయిన నాదిత్యాదులయం దుద్గీథాదిదృష్టుల నుంపవలయు ననుట లోకన్యాయమువలనఁ దేలుచున్నది. ఆదిత్యాదులయం దుద్గీథాది దృష్టుల నుంచినచో నప్పు డవి స్వస్వరూపమును మాని కర్మాత్మకము లగును; ఫలముల నొసంగును. అట్లు గాక నుద్గీథాదులయందు ఆదిత్యాది దృష్టి నుంచినచో నవి తమఫలదానశక్తినిఁ గూడఁ గోల్పోవును కదా! కావున నాదిత్యాదులయందే యుద్గీథాదిదృష్టి నుంపవలయు ననుట శ్రుతిసమ్మతమై యుండును. ఈవిషయమును శ్రుతియే నిరూపించుచుఁ గూడ నున్నది. 'ఇయ మే వ ర్గగ్ని సామ' 'ఈభూమి ఋక్కు అగ్నిహోత్రము సామము' అని యారంభించి యంతమున 'త దేత దేతస్యా మృ చ్యధ్యూఢం సామ' 'ఈఋక్కుయందు సామము నిలచి యున్నది' అని చెప్పుచున్నది; ఋక్‌శబ్దముచే భూమిని సామశబ్దముచే నగ్నినిఁ గూడ జెప్పుచున్నది. దీనిని పట్టిచూచిన పృథివ్యగ్నులయందు ఋక్సామదృష్టుల నుంపవలయు ననియే శ్రుత్యుద్దేశ మగునట్లు తోఁచుచున్నది. మంత్రిని రాజుగ భావింపు మని చెప్పినప్పుడే కదా మంత్రియందు రాజశబ్ద మౌపచారికముగాఁ బ్రయోగింపఁబడును. రాజునందు మంత్రిదృష్టి నుంపవలయు నన్నచో నది సంభవింపదు కదా! ఇట్లే యిచ్చట గూడ పృథివ్యగ్నులయందు ఋక్సామశబ్దములు ఔపచారికముగాఁ బ్రయోగింపఁబడి యుండుటచే ఋక్సామదృష్టియే (పృథివ్యగ్నులయందు) వానియం దుంపఁబడవలయు ననుటయే శ్రుత్యుద్దేశ మైనట్లు తోఁచుచున్నది. మఱియు 'లోకేషు పంచవిధం సామోపాసీత' 'లోకములయందు ఐదువిధము లగుసామము నుపాసింపవలయును' అను శ్రుతిచే పృథివ్యాది లోకములయందే *హింకారాదిదృష్టి యుంపఁబడవలయు నని తెలియఁజేయఁబడుచున్నది. 'ఏత ద్గాయత్రం ప్రాణేషు ప్రోతం'='ఈయుపాసనకు గాయత్ర మనిపేరు. ఇది ప్రాణములయందు (ఇంద్రియప్రాణములయందు)

* హింకారము సామవేదములోని యొకభాగము.

నిలిచి యున్నది' అను శ్రుతిచే నీవిషయము స్పష్టముగనే నిరూపింపఁబడి యున్నది; సప్తమీవిభక్తితోఁ జెప్పఁబడియున్నవానికి సంబంధించినవాని యందే (లోకేషు-అనిన పృథివ్యాదిలోకములయందే) తక్కినవాని నారోపింపవలయు నని స్పష్టము చేయఁబడి యున్నది.

మఱియుఁ బూర్వాధికరణమునందు ప్రథమనిర్దిష్టము లగుటచే నాదిత్యాదులే ప్రధానము లని చెప్పి యున్నారు. ఇచ్చటఁ గూడ నట్లే చెప్పవలయును. 'పృథివీ హింకారః' అని శ్రుతులయందు పృథివ్యాదులే మొట్టమొదట నిర్దేశింపఁబడి యున్నవి. ఈకారణమువలన నాదిత్యాదుల యందే ఉద్గీథాదిదృష్టుల నుంపవలయు నని తోఁచుచున్నది. పూర్వాధికరణసిద్ధాంతమువలెనే యిచ్చటఁగూడ సిద్ధాంతము గావింపవలయు నని తోఁచుచున్నది."

## అ-౪. పా-౧. సూ-౬.

అవతారిక:—అనిన నీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౪౭౪. ఆదిత్యాదిమతయశ్చాఙ్గ ఉపపత్తేః.

## ౪. ౧. ౬.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. కర్మాంగము లగునుద్గీథాదులయందు సూర్యాదిదృష్టుల నుంచుటయే యవశ్యకర్తవ్యము. ఇచ్చట చెప్పఁబడిన యపూర్వవిషయ మదియే (ఆదిత్యాదులను గూర్చినదియే) కదా! మఱియు "య దేవ విద్యయా కరోతి...వీర్యవత్తరం భవతి (చూడు 3-3-౪౨)" అని విద్యాసహితముగ నాచరింపఁబడినకర్మకు బలాధిక్యము చెప్పఁబడి యున్నది కదా! ఇదియు నాదిత్యాదులయం దుద్గీథాదిదృష్టి నుంపవలసినచోఁ సరిపడదు. ఆదిత్యాదులు కర్మరూపులు కారు. వారు స్వతస్సిద్ధులు. కర్మలైననేకాని యొక్కనిచే నాచరింపఁబడు ననుటకు వీలు కలుగదు. అట్లాచరింపఁబడిననే కాని అధిక బలము కలిగియుండుట అల్పబలము కలిగియుండుట యనునవి సంభవింపవు. కావున నేవి కర్మలుగ నున్నవో యేవి పరులచే నాచరింపఁబడఁదగి యున్నవో అట్టియుద్గీథాదులే యిచట ప్రధానము లని తోఁచుచున్నది.

వానియందు రచింపఁబడిన యాదిత్యాదిభావనలు వానిని సంస్కరించి బలాధికములను గావించు ననుటయే యుక్తియుక్తముగఁ దోఁచుచున్నది.

"అగునుగాక కర్మఫలములకు నాధిక్యమును కలిగించునుపాసనల విషయ మిట్లేయుండిననుండవచ్చునుగాని స్వతంత్రముగ ఫలముల నొసంగ గలయుపాసనలనుగూర్చి నిర్ణయ మెట్లు? వానియందు కేవలగుణములు మాత్రమే విధింపఁబడి యున్నవి కదా!" అనియెదవేమో వినుము. అచ్చటఁ గూడ పైసిద్ధాంతమే యాదరణీయము. కేవలగుణము కర్మసంబంధము లేక ఫలము నొసంగఁజాలదు కదా! ఈకారణమువలన నెచ్చట నేగుణము విధింపఁబడినను ఏదియోయొకకర్మ నాశ్రయించియే విధింపఁబడె ననవలసి వచ్చును. సమీపమున నేకర్మయు జదింపఁబడకున్నను ప్రకరణారంభమున నుద్దేశింపఁబడినకర్మయే వీనికిఁగూడ నాశ్రయ మని సిద్ధాంతముచేయవలయును. ఆఫలము కూడ కర్మలకు బలాధిక్యమును కలిగించుటచేతనే జనించు నని చెప్పవలయును. లేకున్న కేవలగుణమునకు ఫలదానసామర్థ్యము సంభవింప దని చెప్పితిమికదా! మఱియు నేగుణ మెట్లు విధింపఁబడినను కర్మాధికారినిఁ గూర్చియే విధింపఁబడియున్నది యనుటయు నీసిద్ధాంతమును దృఢపఱచుచున్నది. ఇవి కర్మాంగముల నాశ్రయించినయుపాసనలే కదా! కావున యిట్టియుపాసనలయం దన్నియెడలను కర్మాంగము లగునుద్గీథాదులయం దాదిత్యాదిదృష్టులనే యుంపవలయును.

"ఇట్లు సిద్ధాంతముచేయుటకు వీలులేదు. పూర్వాధికరణమునందు ఆదిత్యాదులకంటె బ్రహ్మము శ్రేష్ఠమగుటచే లోకన్యాయానుసారముగా తద్దృష్టి (బ్రహ్మదృష్టి) యాదిత్యాదులయందుఁ గర్తవ్య మని నిర్ణయింపఁబడెను కాని యిచట నట్లుచేయుటకు వీలులేదు. కర్మాంగములకును ఆదిత్యాదులకును భేదము (న్యూనాధికభావము) నెన్నుటకుఁగారణ మేదియు లేదు. అన్నియు బ్రహ్మవికారములే యగుటచే సమానములే కదా!" అనియెదవేమో యది యుక్తము కాదు. ఇచ్చటఁ గూడ భేదనిర్దేశమునకుఁ గారణము కలదు. సూర్యాదులు ఫలరూపులు; కర్మాంగములు క్రియారూపములు. ఇట్లగుటచేఁ గర్మాంగమునకంటె నాదిత్యాదు లధికు లగుదురు. కర్మాంగోపాసనలకుఁగర్మలకుఁ గూడ నాదిత్యాదిలోకప్రాప్తియే ఫలముగ వర్ణింపఁబడి యున్నదికదా! ఇంతమాత్రమేకాక నుద్గీథాదికర్మాంగములే ద్వితీయావిభక్తితో చెప్పఁబడి యుపాసనాక్రియకు కర్మలుగ నుద్దేశింపఁబడి

యున్నవి. ఇట్టివి ప్రధానము లగు ననువిషయము పూర్వాధికరణమున వివరింపఁబడియే యున్నది. దీనినిఁబట్టి చూచినను పూర్వసిద్ధాంతమే స్థిర పడును. కర్మాంగములు ప్రధానములైనచో నితరము లప్రధానము లగు ననుటలో సంశయమేమి? అప్రధానము లైనదత్స్వరూపముతోఁ గర్మాం గములనే యుపాసింపవలయు ననుటలో నాక్షేప మేమి? ఈకారణము వలన నాదిత్యాదులకు నుద్గీథాదులకును భేదము కలదు; ఆభేదముచే నధికు లగునాదిత్యాదులయొక్క రూపముతో న్యూనము లగు నుద్గీథా దుల నుపాసింపవలయు ననుటయే సిద్ధాంతమైనది.

"ఉద్గీథాదిరూపములతో సూర్యాదుల నుపాసించినయెడల వారు కర్మాత్మకులై ఫలము నొసంగుదురు. ఉద్గీథాదుల నాదిత్యాదిదృష్టులతో నుపాసించిన వానికర్మత్వము నశించుటచే ఫలదానసామర్థ్యము పోవును" అనుటయు విచారించిన సయుక్తమే. భావన నెట్లాచరించినను ఉపాసనయే కర్మ కావున నదియే ఫలము నొసంగవచ్చును. ఆదిత్యాదులకుఁ గర్మాత్మ త్వము వచ్చిననేగాని ఫలము కలుగఁ గూడ దని నియమము లేదు. ఉద్గీ థాదులకుఁ గర్మాత్మత్వము పోవుటవలన ఫలము కలుగ దనుటయు లేదు. విచారించిన నాదిత్యాదిస్వరూపములతో నుపాసించినంతమాత్రమున నుద్గీ థాదులకుఁ గర్మాత్మత్వము పోనక్కఱ లేదు. ఈభావన (ఆదిత్యాదిభావన) యేదియో యొకపోలిక ననుసరించి లాక్షణికముగ నాచరింపఁబడునదియే కాని మఱియొక్కటి కాదు. ఈకారణమువలన "ఈబ్రహ్మచారియగ్ని" అను మొదలగు వ్యవహారములందువలె నిచ్చటకూడ నుద్గీథాదులకు స్వరూపనాశము కలుగ నక్కఱ లేదు. ఆవ్యవహారములయందు చురుకు దనము పవిత్రత్వము మొదలగు పోలికల ననుసరించి యగ్నిగా భావింపఁ బడినను బ్రహ్మచారికి స్వరూపనాశము కలుగుట లేదు కదా! కావున "ఆదిత్యాదులయం దుద్గీథదృష్టి నుంచిననేకాని ప్రయోజనము లేదు" అని పట్టుపట్టుటకు వీలు లేదు.

ఇట్లే "ఏతస్యామృచ్యధ్యూఢం సామ" అనువాక్యమునుగూర్చి చేసిన విచారణయు యుక్తియుక్తము కాదు. ఆవాక్యమున ఋక్సామ శబ్దములు లాక్షణికములుగ పృథివ్యగ్నులయందుఁ బ్రయోగింపఁబడి యున్నవి. లక్షణావృత్తియు ననియతముగ నేదియో యొక యించుక సంబంధము నాశ్రయింపవచ్చును. ఇట్లుండ నింతమాత్రమున 'పృథివ్యగ్నుల

యందు ఋక్సామదృష్టి యుపదేశింపఁబడెను" అని సాధించుటకు వీలు లేదు. ఋక్సామములయందు పృథివ్యగ్నిదృష్టి నుంపవలయునని యుపదే శింపఁదలఁచినప్పుడుకూడ నీలక్షణ ప్రవర్తింపవచ్చును. ఋక్సామపద ములు ప్రసిద్ధము లగుటచేతను అవి స్వాభావికస్థితిలో భిన్నములు కాక పోయినను ఆధారాధేయభావముతో భిన్నములుగ వర్ణింపఁబడియుండుట చేతను పృథివ్యగ్నులు వానిసమీపమునఁ బఠింపఁబడి యుండుటచేతను "ఈఋక్సామపదములచే నిచ్చటఁ బృథివ్యగ్నులే గ్రహింపఁబడెను" అని యూహింపఁబడవచ్చును. కావున నింతమాత్రమున నీవాక్యము మాసిద్ధాంతమును భంగము చేయనేరదు. "ఇయ మేవ ర్గగ్ని సామ" "ఈభూమియే ఋక్కు అగ్నియే సామము" అనువాక్యము మాసిద్ధాంత మునే దృఢపఱచుచున్నది. ఋక్సామములయందు పృథివ్యగ్నిదృష్టి నుంప వలయు ననియే బోధించుచున్నది. శ్రుతికి నిట్టియుద్దేశము లేకున్నచో "ఇది ఋక్కే" "ఇయం ఋగేవ" అనియే యుండవలసియుండును. మఱియు నుపసంహారమునందు "య ఏవం విద్వా న్సామ గాయతి" "ఈవిధముగ నెఱింగి యెవ్వఁడు సామగానము నాచరించునో" యని సామవేదవిషయము మాత్రమే చెప్పఁబడి యున్నది కాని పృథివ్యాదుల విషయమును కాదు. కావున నెట్లు చూచినను కర్మాంగములయందే యాదిత్యాదిదృష్టి నుంపవలయునని తెలుచున్నది.

ఇట్లే "లోకేషు పంచవిధం సామోపాసీత" అనువాక్యమును గూర్చినవిషయమునుగూడ నిర్ణయింపవలయును. ఇచ్చట "లోకేషు" అని లోకపదము సప్తమీవిభక్తియం దున్నను దానిని తృతీయావిభక్తిలోనికే మార్పవలయును. లోకబుద్ధితో సామము నుపాసింపవలయు నని యర్థ నిర్ణయమును గావింపవలయును. సామపదము ద్వితీయావిభక్తియం దుండుటచే నదియే యుపాసనాక్రియకుఁ గర్మ యని తేలుచున్నది; ఉపసంహారమువలనఁ గూడ నీవిషయమే స్పష్టమగుచున్నది కదా! ఈకారణమువలన నీశ్రుతికి బాధ కలుగకుండుటకై యాసప్తమీ విభక్తినే యేదియో యొకతీరుగా తృతీయావిభక్తిలోనికే మార్చుకొనుట యుక్తియుక్త మగుచున్నది. "గాయత్రం ప్రాణేషు" అనునిట్టి వాక్య ములను గూడ నిట్లే నిర్ణయింపవలయును. "అథ ఖ ల్వాము మాదిత్యం

సప్తవిధం సామోపాసీత" "ఈసూర్యుని *సప్తవిధము లగుసామము నుగా నుపాసింపవలయును" అని యుభయపదములయందును ద్వితీయా విభక్తి గలవాక్యములను గూర్చి విచారించునప్పుడు గూడ నర్థనిర్ణయ మిట్లే కావింపవలయును. "సమస్తస్య ఖలు సామ్న ఉపాసనం సాధు" "సామవేదము నంతయు నుపాసించుట పుణ్యము" అని యుపక్రమమున "సామవేదమే యుపాసనాక్రియకు: గర్మ" అని నిర్ణయింపఁబడి యున్నది కదా! కావున నిర్వివాదముగ కర్మాంగములయందే యాదిత్యాదిదృష్టి నుంపవలయును. "పృథివీ హింకారః" "హింకార మనుసామభాగము భూమి" అను నిట్టివాక్యములయర్థమును గూడ "హింకారమునందు పృథివీదృష్టి నుంపవలయును" అని యీవిధముగనే నిర్ణయించుకొనవల యును. శ్రుతియందు పదప్రయోగము వ్యత్యాసముగ నున్నను సంద ర్భము ననుసరించి యర్థనిర్ణయమును గావించుకొనవలయును. ఈకారణ మువలన మాసిద్ధాంతమే దృఢపడినది; అంగములయందు ఆదిత్యాదిదృష్టి నుంపవలయు ననుటయే యుక్తియుక్తమైనది.

---

# ౬. ఆసీనాధికరణము.

విషయ సంశయ సంగతి పూర్వపక్షము:—పూర్వాధికరణమున నంగాశ్రితోపాసనలు విచారింపఁబడినవి. ఇచ్చట మరల నుపాసనా ప్రస్తా వమున నుపాసకునిస్థితి వర్ణింపఁబడును. "ఉపాసనలను కూర్చుండి చేయవలయునా? లేక నిలుచుండి గాయైనను పరుండి యైనను చేయ వచ్చునా?" అనుసంశయము నివారింపఁబడును. అంగాశ్రితోపాసనలు కర్మకు సంబంధించినవి యగుటచే నాకర్మ లెట్టి స్థితియందు విధింపఁబడి యున్నవో అట్టి స్థితియందే విధింపఁబడినట్లు సుఖముగ నిర్ణయింపఁబడ వచ్చును. అపరోక్షసాక్షాత్కారార్థము లగునుపాసనలను స్వతస్సిద్ధ మగు పదార్థమునకు సంబంధించినవి యగుటచే నచ్చట నవస్థానియమము సంభ

---

* ౧. హింకారము. ౨. ప్రస్తావము. ౩. ఆది. ౪. ఉద్గీథము. ౫. ప్రతిహారము. ౬. ఉపద్రవము. ౭. తన్నిధనము అనునివి యేడును సామవేదములోనిభాగములు. ఇవియే సప్తవిధసామములు.

వింపదు. ఇట్లగుటచే నీరెండు తెఱంగులును గాక తక్కినయుపాసనలను గూర్చి యీవిచారము ప్రవర్తించుచున్నది. "నియామకశాస్త్ర మేదియు లేకపోవుటచే నీవిషయమున నెట్లును నియమము సంభవింపదు. ఉపాసనలు మానసికములు; వానికి శరీరస్థితిభేదములతోఁ బనియేమి?" అనుపూర్వ పక్షము ఖండింపఁబడుచున్నది.

## ౪౮౫. ఆసీనః సంభవాత్. ౪. ౧. ౭.

తాత్పర్యము:—విచారించిన నీసంశయమే కలుగుటకు వీలులేదు. ధ్యానము నాచరించుటకుఁ గూర్చుండుటయే చక్కనిస్థితి. అప్పుడు మాత్రమే చిత్తము సర్వవ్యాపారముల మాని ధ్యేయపదార్థమునందు నిశ్చలముగ నిలుచును. నిలుచఁబడినప్పుడు మనస్సునకు దేహధారణా కార్య మొక్కటి యుండుటచే నప్పుడు సంపూర్ణముగ ధ్యేయపదార్థము నందు నిలుచుటకు వీలులేదు. నిలుచఁబడినప్పుడు దేహమును క్రిందఁబడ కుండ నొకవంక రక్షించుకొనుచునే యుండవలసి వచ్చునుకదా! ఇక పరుండినప్పుడు క్షణక్షణమునకును నిద్ర మనస్సును స్వాధీనము చేసి కొనుచు లక్ష్యమునందు నిలువనీయదు. కావున నెట్లును కూర్చుండిన వానికే ధ్యానము బాగుగఁ గుదురును.

## ౪౮౬. ధ్యానాచ్చ. ౪. ౧. ౮.

తాత్పర్యము:—మఱియు "ధ్యాయతి" యనుక్రియకు ఒక్కవిష యమును మరలమరల నేకాగ్రచిత్తముతో స్మరించుటయే యర్థము. ఇదియేకదా ధ్యాన మనియు నుపాసన యనియు నిదిధ్యాసన మనియుఁ జెప్పఁబడుచున్నది. విచారించిన సర్వావయవముల సడలించి నిశ్చే ష్టుఁడై యొక్కవైపుననే దృష్టిని పారించుచు నొకపదార్థమునందే మన స్సును నిలిపి యున్నవానినిఁగూర్చి యీధ్యాయతిపదముఁ బ్రయోగింపఁ బడుచున్నది. ఇట్లగుటచే నిట్టివాఁడే ధ్యానమున కర్హుఁ డని తోఁచు చున్నది. కొంగ నీటియొడ్డున నిశ్చలమై నిశ్చేష్టమై యున్నప్పుడు దాని విషయమున "కొంగ ధ్యానము చేయుచున్నది-బకో ధ్యాయతి" అని ధ్యాయతిపదముఁ బ్రయోగింపఁబడుచున్నది. ఏవిషయమున నీపదమే ప్రయోగింపఁబడుచున్నది. విచారించినచో నిట్టిస్థితికిఁ (అవయవాదులు

సడలించుట మొదలగుస్థితికిఁ గూర్చుండుటయే యనుకూలము. వానికి నే విధము లగు శ్రమలు నుండవు. కావున నీకారణమువలనఁగూడఁ గూర్చుండియే ధ్యానము నాచరింపవలయును.

---

## ౪౮౭. అచలత్వం చాపేక్ష్య. ౪. ౧. ౯.

తాత్పర్యము:—మఱియు "ధ్యాయతీవ పృథివీ" "ఈభూమి ధ్యానించుచున్నట్లున్నది" అని కేవలనిశ్చలత్వమును మాత్రమే యుద్దేశించి శ్రుతియందు ధ్యాయతిపదము ప్రయోగింపఁబడి యున్నది. దీనినిఁ బట్టి విమర్శించినను కూర్చుండియే యుపాసన చేయవలయు ననుట యేర్పడుచున్నది. కూర్చుండకున్న సరి యగునిశ్చలత్వము దొరకదు కదా! శయనాదికాలములయందును నిశ్చలత్వము సంభవించినను అచ్చట చిత్తైకాగ్ర్యము కుదుర దని నిరూపించియున్నాము కదా!

---

## ౪౮౮. స్మరంతి చ. ౪. ౧. ౧౦.

తాత్పర్యము:—ఇది యంతయును గాక సజ్జనులు ప్రత్యక్షముగ నే యాసనము నుపాసనాంగమునుగా ప్రశంసించుచున్నారు. "శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః" "ఉపాసకుఁడు పరిశుద్ధస్థలమున తన యాసనమును స్థిరముగ స్థాపించి" యని స్మృతులయందుఁగూడ నున్నది. యోగశాస్త్రమునందును సింహాసన పద్మాసన యోగాసనాదు లగునాసనములు యోగార్థమై యుపదేశింపఁబడి యున్నవి. కావున నిస్సంశయముగ నుపాసనలు కూర్చుండి చేయఁబడవలసినవియే.

---

# ౭. ఏకాగ్రతాధికరణము.

విషయసంశయసంగతిపూర్వపక్షము:—ఉపాసనాప్రస్తావము ననుసరించియే యీయధికరణమున దిగ్దేశకాలములనుగూర్చి విచారింపఁబడును. "ఉపాసనలు చేయుటకు దిక్కులు ప్రదేశములు కాలములు నియతములై యున్నవా? లేవా?" యనుసంశయము నివారింపఁబడును. "వేదమున

నన్నిస్థలములయందు నిట్టినియమ ముండుటచే నిచ్చటఁగూడ నది యుండ వలయును" అనుపూర్వపక్షము నిరాకరింపఁబడును.

---

# ౪౮౯. యత్రైకాగ్రతా తత్రావిశేషాత్.

## ౪. ౧. ౧౧.

తాత్పర్యము:—ఈయుపాసనలయం దిట్టినియమ మేమియు లేదు. కర్మాంగోపాసనలకు మాత్రము కర్మసంబంధము లగునియమము లుండును గాని తక్కినవానికి లేదు. మనస్సునకు నేదేశమున నేకాలమున నేదిశ యందు ఏకాగ్రభావము కుదురునో ఆదేశముననే యాకాలముననేయాదిశ యందే యుపాసన నాచరింపవచ్చును. కర్మకాండయందు కొన్నిస్థలము లలో విశేషము వినవచ్చుచున్నది గాని బ్రహ్మవిద్యావిషయమున నట్లు లేదు.

"ఇట్లు కాదు. 'సమే శుచౌ శర్కరావహ్నివాలుకావివర్జితే శబ్దజలాశ్రయాదిభిః మనోనుకూలే న తు చక్షుపీడనే గుహానివాతాశ్రయణే ప్రయోజయేత్' 'సమానమైనదియు పరిశుద్ధమైనదియు గులకఱ్ఱ్లు అగ్నియిసుక కలకలము తటాకాదులను లేనిదియు మనస్సునకు నింపైనదియు దోమలు లేనిదియు నగుప్రదేశమునందు పరమేశ్వరోపాసన నాచరింపవలయును. గుహయైన మేలు' అని యీయుపాసనలకును దేశనియమము చెప్పఁబడియే యున్నది." అనియెదవేమొ వినుము. ఇట్టినియమ మున్నను వీని యందలి విశేషములు నియతములు కావని యాచార్యుఁడు తన యభిప్రాయము నెఱింగించెను. శ్రుతియు "మనోనుకూలే" అనుపదముచే నీవిషయమునే ప్రకటించుచున్నది కదా! కావున నెట్లును ఈసిద్ధాంతమునకు భంగము లేదు.

# ౮. ఆప్రాయణాధికరణము

విషయ సంశయములు:—ఈపాదమున ప్రథమాధికరణమునందు "సర్వోపాసనలకును ఆవృత్తి కలదు" అనువిషయము స్థాపింపఁబడెను. ఆయావృత్తినిగూర్చి కాలనియమ మీయధికరణమున విచారింపఁ

బడును. ఆయుపాసనలలో బ్రహ్మసాక్షాత్కారమునుగూర్చి విధింపఁబడిన యుపాసనలవిషయమున నీకాలనియమము విస్పష్టమయ్యే యున్నది. అపరోక్షసాక్షాత్కారము కలుగునంతవఱకు వాని నావర్తింపవలయు నను విషయము తేటపడుచున్నది. ఫలము కలిగినపిదప మఱియొక కార్యమును నియోగించుట యుక్తియుక్తము కాదు కదా! విచారింపఁబోయిన జీవబ్రహ్మైక్యము స్వాభావిక మగుటచే నితరకర్మలవలె దానిని నియోగించుటకుఁగాని దానియం దధికారసంబంధమును నియమించుటకుఁగాని బొత్తుగనే వీలులేదు. కావున నీనివిషయమును (అపరోక్షసాక్షాత్కారము ఫలముగఁ గలయుపాసనల విషయమును) వస్తుస్వరూపానువాదమును చేయవలసినదియే కాని శాస్త్ర మంతకంటె నధికమును చేయనేరదు. ఇట్లగుటచే నీయుపాసనల ఫలోత్పత్తికాలమువఱకు నాచరింపవలయు ననుట సర్వలోక ప్రత్యక్షము. ఇట్లగుటచే నీజాతియందు చేరక నభ్యుదయముసు మాత్రమే కలిగింపఁగల యుపాసనలవిషయమునందే ప్రస్తుతవిచారము ప్రవర్తించుచున్నది. "ఆయుపాసనలు కొంతకాలము మాత్రమే యావర్తింపఁబడవలయునా? లేక జీవితాంతమువఱకు నావర్తింపఁబడవలయునా?" యనుసంశయము నివారింపఁబడును.

సంగతి పూర్వపక్షములు:—"విచారించిన నీయుపాసనలఁ గొంతకాలము మాత్రమే యావర్తించి విడువవలయు ననుటయే యుక్తియుక్తముగఁ దోఁచుచున్నది. వాస్తవస్థితిలోఁ గర్మలవలె నీయుపాసనలుకూడ నొక్కమాఱే యాచరింపఁబడినను శాస్త్రోద్దేశము పరిపూర్ణమగును. అయినను ఉపాసనాశబ్దమునకు నావృత్తి యర్థ మగుటచేఁ గర్మలకును వీనికిని (ఉపాసనలకును) భేదము కల దను కారణమున నివి కొన్నిమాఱులావర్తింపఁబడవలసి వచ్చుచున్నది. రెండుమాఱు లావర్తించినను శాస్త్రోద్దేశము ముగియును కావున జీవితాంతమువఱకు వీని నావర్తింపఁ బని లేదు; కొంతకాలము మాత్రమే యాచరింపఁబడి విడువఁబడినను కర్మలు అపూర్వముమూలమున స్వర్గాదిఫలముల నొసంగునట్లు ఈయుపాసనలును అపూర్వముమూలమున నభివృద్ధి నొసంగవచ్చును' కావునఁ బూర్వాధికరణమునందు దిగ్దేశకాలములనుగూర్చి విశేషశ్రుతి లేకపోవుటచే వానియభావమే సిద్ధాంతము చేయఁబడినట్లు యిచ్చటఁ గూడ విశేషశ్రుతి లేకపోవుటచేతను సామాన్యవిధి ననుసరించి చూచిన పైన

నిరూపించిన విధముగ యావజ్జీవావృత్తి సిద్ధింపకపోవుటచేతను మాపక్షమున సిద్ధాంతముఁ జేయవలయును."

## అ_౪. పా_౧. సూ_౧౨.

అవతారిక:—అని యిట్లు వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౪౬౦. ఆప్రాయణాత్తత్రాపి హిదృష్టమ్.౪.౧.౧౨.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట సరికాదు. ఉపాసనలు మరణకాలము వరకు నావర్తింపఁబడవలసినవియే. అంత్యకాలమున జనించినజ్ఞానము మాత్రమే ఫలదాయక మగును. అపూర్వాముమూలమున ఫలము నొసంగఁగలవి యని చెప్పఁబడుకర్మలు కూడ మరణకాలమున స్వర్గాదిభావనారూప మగుజ్ఞానముఁ నపేక్షించును. "సవిజ్ఞానో భవతి సవిజ్ఞానమే వాన్వవక్రామతి ...యచ్చిత్త స్తే నైష ప్రాణ మాయాతి...ప్రాణ స్తేజసా యుక్తః సహాత్మనా యథా సంకల్పితం లోకం నయతి" "మరణకాలమునందు పురుషునకుఁ గర్మానుగుణముగ సంకల్పము జనించును. ఆసంకల్పముతోడనే జీవుఁడు నిర్గమించును...పురుషునిచిత్తము మరణకాలమునఁ దేనిని సంకల్పించునో ఆసంకల్పముతోఁ గూడియే జీవుఁడు ప్రాణముతో నేకీభవించును...ప్రాణము సంకల్పసహిత మగుమనస్సుతోఁ గూడి జీవుని సంకల్పితలోకమునకుఁ గొనిపోవును" అని శ్రుతి యీవిషయమును స్పష్టముగఁ జెప్పుచున్నది. తృణజలూక (చొప్పతోదేలు) యెదుట నున్నతృణమును గ్రహించి వెనుకటిదానిని విడచునట్లు జీవుఁడును సంకల్పముచే రాఁబోవుదేహమును గ్రహించియే వెనుకటిదేహమును విడుచు ననుట యుక్తియుక్తముగఁ గూడ నున్నది. ఇట్లగుటచే నుపాసకులకుఁ గూడ మరణకాలమున నిట్టిసంకల్ప ముండవలయు నని తేలుచున్నది. ఉపాసన యనఁగా ధ్యానమేయగుటచే నది మఱియొకసంకల్పము నపేక్షించు ననుట యుక్తిశూన్యము. ఉపాసనయం దేదేవత ధ్యానింపఁబడునో ఆదేవతయే ఫలరూపము గావున తద్భావనయే కదా మరణకాలమునఁ గావలసినది. కర్మలకన్ననో తత్స్వరూపమునకంటె ఫలస్వరూపము భిన్న మగుటచేత మరణకాలమున ఫలభావన కర్మభావనకంటె భిన్నము కావచ్చునుగాని

యుపాసనావిషయ మట్టిది కాదు కదా! కావున మరణకాలమువఱకు నుపాసన యావర్తింపఁబడవలయు ననుటయే సిద్ధాంతము.

శ్రుతిస్మృతులును ప్రత్యక్షముగ నీవిషయమును బోధించుచున్నవి. "స యావత్క్రతు రయ మస్మాల్లోకా త్ప్రైతి" "పురుషుఁడు ఉపాసనా రూపసంకల్పముతోఁ గూడియే పరలోకమునకుఁ బోవును" అను మొదలగు శ్రుతులును "యం యం వాఽపి స్మర న్భావం త్యజ త్యన్తే కలేవరమ్... తం త మే వైతి కౌన్తేయ సదా తద్భావభావితః... ప్రయాణకాలే మన సాఽచలేన" "ఓయర్జునా! ఏయేపదార్థమును స్మరింపుచు దేహమును విడుచునో అయాభావనచే సంస్కరింపఁబడినవాఁ డగుటవలన నాయాజన్మ మునే యెత్తును. మరణకాలమునందు నిశ్చలమగు మనస్సుతో" అను మొదలగు స్మృతులును ఈవిషయమునే బోధింపుచున్నవి.

# ౯. తదధిగమాధికరణము

విషయ సంశయ సంగతులు:—ఈగొనిమిదధికరణములతో తృతీయాధ్యాయమునకు సంబంధించినకొఱత ముగిసినది. ఇఁకమీఁద చతుర్థాధ్యాయమునకు సంబంధించినఫలవిచారము హేతుహేతుమద్భావసంగతితో నాచరింపఁబడును. అం దిది ప్రథమాధికరణము గావున దీనికిఁ బూర్వాధికరణముతో నవాంతరసంగతి లేదు. మొట్టమొదట యిచ్చట బ్రహ్మ విద్యాప్రభావమునుగూర్చి విచారింపఁబడును. "బ్రహ్మజ్ఞానము వలనఁ బూర్వపాపములు నశించుటయు నుత్తరపాపము లంటకుండుటయు (ఇచ్చట పాప మనఁగా నశుభకర్మమాత్రమే కాదనియు బంధహేతువులగుటచేఁ బుణ్యకర్మలుగూడ నాశబ్దముతో చెప్పఁబడె ననియు గ్రహింపవలయును) ననుఫలము కలుగునా? లేదా?" యనుసంశయము నివారింపఁబడును.

పూర్వపక్షము:—"ఎట్లుచూచినను కర్మలకు వినాశము కలుగుటకు వీలు లేదు. వేదముచేఁ గర్మ ఫలార్థమై విధింపఁబడెను. ఫలము నొసంగకయే యది నశించునేని యానాశ మాకస్మిక మగును. శ్రుతియు బాధిత మగును. ఫలార్థ మగుదానికి భోగానంతరమునఁ గాని నాశము సంభ

వింపదు కదా! 'నాభుక్తం క్షీయతే కర్మ' 'ఫలానుభవములేక కర్మ నశింపదు' అని స్మృతియు ఘోషింపుచున్నది. 'ఇట్లయినను ప్రాయశ్చిత్తవిధి నిరర్థకము కావలసి వచ్చును." అనియెదవేమొ యదియు సంభవింపదు. 'గృహము దహింపఁబడెనేని యాగృహాధికారి క్షామవతీష్టి నాచరింపవలయును' అనునట్లు కారణాంతరమునుబట్టి యొకానొకయధికారికి ప్రాయశ్చిత్త మనుకర్మ విధింపఁబడియుండవచ్చును. ఇంతమాత్రమునఁ బ్రాయశ్చిత్తము కర్మక్షయకర మగు నని నిర్ధారణ చేయ వీలు లేదు. ఈప్రాయశ్చిత్తవిధి ఫలపర మనుటకు హేతు వేదియును లేదు కదా! 'ఇట్లు కాదు క్షామవతీష్టి మొదలగువానివిషయమునకును ప్రాయశ్చిత్తవిషయమునకును భేదము కలదు. అచ్చట గృహదాహాదులు ముగిసెను కావున వానినిఁగూర్చి మఱల నేమియుఁ జేయుటకు వీలు లేక పోవుటచే నధికారి మాత్రమే యుద్దేశింపఁబడెను; గృహదాహనిమిత్తమునుబట్టి మాత్రమే యాకర్మ విధింపఁబడెను. ప్రాయశ్చిత్తవిషయ మట్లు కాదు; పాపము కల దనునిమిత్తమువలన మాత్రమే యది విధింపఁబడియుండు ననుటకు వీలు లేదు. ఆపాపమును నశింపఁ జేసినను నశింపఁ జేయవచ్చును కదా! కావున నీవిధి ఫలార్థమైనదియే కావలయును' అనియెదవేమొ యప్పటికిని యీదృష్టాంతమువలన మీకు బ్రయోజనము కలుగదు. అది (ప్రాయశ్చిత్తము) దోషసన్నిధానమునఁ బఠింపఁబడి యున్నది కాని బ్రహ్మజ్ఞాన మట్లు లేదు. కర్మలనుఁ గూర్చి ప్రసంగించిన పిదపఁ దత్క్షయార్థముగ విధింపఁబడి యుండ లేదు. 'బ్రహ్మజ్ఞానమువలన ముక్తి కలుగును.' అని ముక్త్యర్థముగ మాత్రమే యది విధింపఁబడెను. ముక్తి యనఁగాఁ గర్మక్షయ మని యర్థము చెప్పుట యుక్తియుక్తము కాదు కదా! కావున బ్రహ్మజ్ఞానమువలన కర్మక్షయము కలుగ నక్కఱ లేదు.

'ఇట్లయిన నెప్పటికిని కర్మఫలములనే యనుభవింపవలసివచ్చుటచే మోక్షమే సంభవింపదేమొ' అనియెదవేమొ యట్లు కాదు. బ్రహ్మవేత్త యగువాఁడు సర్వకర్మనాశ మగునంతవఱకు నొక్కదేహమునందే యుండి యంతమునకు ముక్తినిఁ జెందవచ్చును. కర్మలు అనేకవిరుద్ధఫలముల నొసంగునవి యనినను యోగశక్తిచే పృథివ్యాకాశాదులయందు బహువిధము లగుదేహములఁ గల్పించి వానితోఁ గర్మఫలమును నిశ్శేషముగ

ననుభవించి పిదప ముక్తినిఁ జెందవచ్చును. ఇట్టిసామర్థ్యము యోగులకు కలదు కదా ! కావున నెట్లును బ్రహ్మజ్ఞానమువలన కర్మక్షయము కలుగ నక్కఱ లేదు. కర్మక్షయమునుఁ గూర్చి చెప్పుశ్రుతు లౌపచారికములు గావచ్చును."

## అ-౪. పా-౧. సూ-౧౩.

అవతారిక:—అని యిట్లువచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౪౯౧. తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేష వినాశౌ తద్వ్యపదేశాత్. ౪. ౧. ౧౩.

తాత్పర్యము:—ఈపూర్వపక్షము యుక్తమైనది కాదు. బ్రహ్మజ్ఞానము కలిగినతత్క్షణమే కర్మక్షయము కలుగును. జ్ఞానోదయమునకుఁ బూర్వమునఁ జేయఁబడినకర్మలన్నియు నాశము నొందును; జీవన్ముక్త దశయందు జ్ఞానోత్తరకాలమున నాచరింపఁబడుకర్మలు సాధకుని నంట కుండును. వేద మిట్లే చెప్పుచున్నది. "యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యంత ఏవ మేవం విధి పాపం కర్మ న శ్లిష్యతే" "తామరయాకును నీరంటనట్లు ఈ బ్రహ్మజ్ఞానము కలవానిని బంధహేతు వగుకర్మ యంటదు." అని జ్ఞానోత్తరకాలమునఁ గలుగుకర్మాసంసర్గమును శ్రుతివర్ణింపుచున్నది. "త ద్య థేషీకాతూల మగ్నౌ ప్రోతం ప్రదూయే తైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే" "గడ్డిపరక గాని దూదిగాని యగ్నియందు వైవఁబడిన యెట్లు గ్రహింపఁబడునో అట్లే బ్రహ్మజ్ఞానికి సర్వపాపములును జ్ఞానాగ్నిచే దహింపఁబడును" అని పూర్వకర్మనాశమునుగూడ ప్రతిపాదించుచున్నది. "భిద్యతే హృదయగ్రంధి చ్ఛిద్యంతే సర్వసంశయాః, క్షీయంతేచాస్య కర్మాణి తస్మిం దృష్టే పరావరే" "ఆపరాత్పరుఁడు సాక్షాత్కరింపఁబడఁగానే హృదయగ్రంధి వీడిపోవును. సంశయములన్నియు తెగిపోవును. నీకర్మలన్నియు నశించును" అను మొదలగుననేక శ్రుతులు సామాన్యముగ నీవిషయములను బోధించుచున్నవి.

"ఫలము నొసంగక కర్మ క్షీణించు ననినఁ గర్మలకు ఫలదాన సామర్థ్యము నభివర్ణించుశాస్త్రము నిరర్థక మగును." అనుయుక్తియు సమం

జనము కాదు. మేము కర్మకు ఫలదానసామర్థ్యము లేదని చెప్పుట లేదు. దానికి ఫలదానసామర్థ్య మవశ్యముగఁ గలదు. అయినను అది విద్యాదిరూపము లగు కారణాంతరములచే ప్రతిబంధింపఁబడు నని మాత్రమే చెప్పుచున్నాము. శాస్త్రంబును, కర్మలు ఫలము నొసంగఁగల వను నింతమాత్రము బోధించుచున్నవే గాని యాసామర్థ్యమునకు ప్రతిబంధమెద్దియు లేదు అనువిషయమును బోధించుట లేదు. ఒకవాక్యమునకు నర్థద్వయమును కల్పించిన వాక్యభేదము కలుగును కదా! ఈకారణమువలన "నాభుక్తం క్షీయతే కర్మ" అనుస్మృతికిని యిదియే యర్థము ప్రతిబంధము లేవియు లేకున్న కర్మఫలముల నొసంగఁగలదు కాని మఱియొకప్పుడు లే దనుటయే సిద్ధించును. ఇట్లు కాక కర్మకు నాశమే లేకపోయినచో ప్రాయశ్చిత్తాదివిధులు నిరర్థకము లగును. "సర్వం పాప్మానం తరతి. తరతి బ్రహ్మహత్యాం యోఽశ్వమేధేన యజతే య ఉ చైన మేవం వేద." "ప్రాయశ్చిత్తమువలన సర్వపాపము నతిక్రమించును. ఎవ్వఁడు అశ్వమేధయాగమును చేయునో వాఁడు బ్రహ్మహత్యను నశింపఁ జేసికొనును." అని శ్రుతియందు ప్రాయశ్చిత్తప్రభావము స్వయముగనే చెప్పఁబడియున్నది. మఱియు నివి (ప్రాయశ్చిత్తములు) దోషసన్నిధానమున పఠింపఁబడి యుండుటచే వానిని నివర్తింపఁజేయునవి కావచ్చును. ఇట్లు ప్రత్యక్షఫలము సంభవించుచుండ నప్రత్యక్షఫలము కల్పించుట యుక్తము కాదు; కేవల మధికారినిఁ గూర్చియే యావిధి చెప్పుచున్నది యనుట యుక్తియుక్తము కాదు. పూర్వపక్షమునందే మీరు దీనినంగీకరించి యున్నారు కావున ప్రాయశ్చిత్తములచేఁ గర్మలు నశించు ననుట సిద్ధించినది. ఇట్లొకదానివలన నాశము కలుగుననుట యుక్తియుక్తమైనచో మఱియొకదానివలన మాత్ర మట్లేల కలుగరాదు? ఈకారణమువలన "నాభుక్తం" ఇత్యాదిస్మృతులు ప్రతిబంధములేని కర్మలనుగూర్చి చెప్పునవియే కావలయును. శ్రుతులట్టివేయని యిదివఱకే నిరూపించి యున్నాము.

"ప్రాయశ్చిత్తములవలె విద్యలు దోషవినాశోద్దేశముతో విధింపఁబడలేదు" అనువిషయ మొక్కటిమాత్రము విచారణీయమై యున్నది. దీనివలనఁగూడ మాపక్షమునకు వచ్చువిరోధ మేమియు లేదు. సగుణవిద్యలు మాత్రము దోషక్షయార్థమై కూడ విధింపఁబడియే యున్నవి. వానిని వర్ణించునప్పుడు వాక్యశేషములయందు పాపనివృత్తియు నైశ్వర్య

ప్రాప్తియుఁ గూడ వర్ణింపఁబడియున్నవి. ఆవర్ణనమును బట్టి "పాపనివృత్తి పూర్వకముగా నైశ్వర్యప్రాప్తి కలుగును" అని నిర్ణయింపఁబడుచున్నది. ఇఁక నిర్గుణవిద్యలయం దట్టివిధి గానరాకున్నను వానిస్వభావమును విమర్శించిన నట్లే తేలుచున్నది. సాధకుఁ డగువాఁడు అప్పుడు (నిర్గుణవిద్య యందు) తనను అకర్తగాను అభోక్తగాను భావించును గావునఁ గర్మ లవశ్యము నశించునవియే కావలయును. కర్తృత్వభోక్తృత్వములు లేకున్నఁ గర్మ లెక్కడివి? జ్ఞానోదయమైనపిదప కర్తృత్వాభిమానమే లేకపోవుటచే నప్పటి కర్మలు వాని నంటవు. పరులు జేయుకర్మలు తనను బాధింపనట్లు వానిని బాధింపవు. జ్ఞానోదయము కాఁ పోవుటచేఁగడచినకర్మల నాచరించు నప్పుడు మాత్రము భ్రాంతివలనఁ గర్తృత్వాభిమానమున్నను జ్ఞానోదయ మైనపిదప నది పోవుటచే నాకర్మలకును ఫలదానసామర్థ్యము సంభవింపదు. బ్రహ్మవేత్త యగువాఁడు తానొకప్పుడు కర్తగా నున్నట్లును ఒకప్పుడా కర్తృత్వమును విడచినట్లును తలంపఁడు. ఎప్పటికిని అనఁగా పూర్వమున నైనను ప్రస్తుతముననైనను భవిష్యత్కాలముననైనను తాను శుద్ధుఁ డనియు నిత్యుఁ డనియు కర్తృత్వాదులు లేనివాఁ డనియు భ్రాంతిచేత మాత్రమే యట్లు తలంచుచుండె ననియు తెలిసికొనును. ఈకారణము వలన అజ్ఞానసమయమున నున్నకర్తృత్వము నాశ్రయించి యున్నకర్మలు జ్ఞానకాలమున ఫలము నొసంగనేరవు. త్రాటినిఁ జూచి సర్ప మని యజ్ఞానముచే తలంచుసమయమున కలిగిన భయము వడఁకు మొదలగునవి రజ్జుయథార్థజ్ఞానము కలిగినపిదప వానిఫలము నొసంగ గలవా? సంస్కారవిశేషమువలనఁ గొంతకాలమువఱకు ననువర్తించినను స్వయముగనే నశించి పోవుచున్నవికదా! ఇట్లే కర్మలును సంస్కారవశమువలన దేహపాతము వఱకు ననువర్తించినను నిర్మూలములై నశించిపోవును.

"కర్మానుభవమునకుఁ బిదప మోక్షము కలుగవచ్చు నంటిని కదా!" అనియెదవేమొ యది సంభవింపదు. మోక్ష మనినఁ గర్మలు నశింపవలసి నదియే లేకున్నఁ గర్మలకు నంత మెక్కడిది? జన్మక్రమమునఁ గాని చిరకాలానువర్తి యగునేకదేహమునఁ గాని దాని ననుభవింపవలయు ననిన నంతమే యుండదు. అనుభవించునప్పుడు కూడఁ బురుషుఁడు మఱికొన్ని కర్మల నాచరించుచునే యుండును కదా! ఇట్లయిన ముగింపు కలుగుట యెట్లు? యోగశక్తిచే ననేకదేహములఁ గల్పించి యందు సర్వఫలముల

నొక్కమారే యనుభవింపవచ్చు ననిన నది సాధ్యము కాదు. ప్రతికర్మకును ఫలాభిముఖ్యము కలుగుటకుఁ గొంతకాలము కావలయును. అన్ని కర్మలు నొక్కమారే యాచరింపఁబడినవి యగు ననుటకును వీలు లేదు. ఇట్లుండ ననేకయుగములకాల మనుభవింపఁదగినకర్మల నొక్కమారే అనుభవించుట యెట్లు? కావునఁ గర్మానుభవమునకుఁ బిదప మోక్షము కలుగవచ్చు ననుట సంభవింపదు. కావున నవశ్యముగ సర్వకర్మలును నశింపవలసినదియే.

“ఇట్లు చెప్పనేల? అనేకకర్మ లున్నను మోక్షఫలము నొసంగు కర్మ దాని నొసంగినపిదపనే తక్కినవి తమఫలముల నొసంగవచ్చును.” అనియెద వేమో యది యుక్తము కాదు. అప్పుడు మోక్షమునకు ననిత్యత్వంబును అపరోక్షత్వంబును వచ్చును. ఇవి రెండును సంభవింపవు. మోక్షమనునది స్వర్గాదులవలె కర్మచే సాధింపఁదగినది కాదు. అది బ్రహ్మస్వరూపమే యని యిదివరకే పలుమారు చెప్పియున్నాము. బ్రహ్మము నిత్య మనియు వివరించియున్నాము. కార్యము కానిది యనిత్యము కాదు కదా! కావున మోక్షము నొసఁగఁజాలు కర్మ యొక్కటి యుండ దనుటయే సంభవింపదు. ఇఁక దదనంతరమున సుఖదుఃఖఫలములు మఱల కలుగు ననుట యేటిమాట? ఇట్లే యాముక్తి జ్ఞానఫల మని చెప్పఁబడుట వలన స్వర్గాదులవలె నప్రత్యక్షము కాఁగూడదు. కర్మఫలము లైనచో మొట్టమొదట కర్మయుఁ బిదప నపూర్వంబును బిదప స్వర్గాదిఫలములు నని యిట్లు కలుగుచుండుటచే నప్రత్యక్షము లగును. జ్ఞానఫల మన్ననో యట్టిది కాదు. తెలివి కలిగినచో దానికి నెదుట నున్న పదార్థము గోచరమగుటయే ఫలము కాని అపూర్వ మగునది జనించుట కాదు కదా! కావున నిచ్చటఁ గూడ జ్ఞేయ మగు బ్రహ్మస్వరూపమే ముక్తి గాని వేఱొక్కటి కాదు. అది స్వతస్సిద్ధమే యైయుండి భ్రాంతివలన దూరస్థముగ భావింపఁబడుచుండి జ్ఞానముచే యథార్థస్థితితో గ్రహింపఁబడుచున్న దియే కాని వేఱు కాదు. ఇట్లు జ్ఞానఫలము ప్రత్యక్ష మగుట లోకప్రసిద్ధమై యుండ దానికిఁ బరోక్షత్వమును కల్పించుట యుక్తము కాదు. కావున నిర్వివాదముగ ముక్తి దశయందు సర్వకర్మలును నశింపవలయు ననుటయే సిద్ధాంతము.

# ౧౦. ఇతరాసంశ్లేషాధికరణము.

విషయ సంగతి సంశయములు:—పూర్వాధికరణమునందు పాపమును గూర్చి విచారింపఁబడెను. బంధహేతుత్వసామ్యముచే పుణ్యము గూడ నాపాపశబ్దముచే గ్రహింపఁబడవలయు నని యచ్చట వర్ణింపఁబడియున్నను పుణ్యశబ్దము ప్రత్యక్షముగ లేకపోవుటచే దానివిషయమునందు నీయధికరణమునఁ బూర్వన్యాయ మతిదేశింపఁబడుచున్నది. "అశాస్త్రీయ మగుటచే నధర్మము జ్ఞానమునకు విరుద్ధము కావచ్చునుగాని ధర్మ మట్లు కాఁగూడదు" అనుసంశయము నిరాకరింపఁబడును. అతిదేశ మగుటచే నీయధికరణమునకుఁ బూర్వాధికరణముతో బ్రత్యేకసంగతి యక్కఱ లేదు.

పూర్వపక్షము:—"ఎట్లును పాపమువలె పుణ్యము నశించుననుటకు వీలు లేదు. అది శాస్త్రవిహితము. దర్శపూర్ణమాసాదులకువలె దానికిని జ్ఞానమునకును విరోధ ముండఁగూడదు. పాపము కామక్రోధాదులవలన కలుగును; ధర్మము శాస్త్రవిహితమై జనించును. ఈ రెండును సమానములే. సమానముగ నశింపవలసినవియే యగునేని యాహా! బహుళాయాససాధ్యము లగుధర్మముల నాచరించుటవలనఁ బ్రయోజన మేమి? మఱియు వేదము పాపనాశమునుగూర్చియే విశేషముగఁ జెప్పియున్నది. ఒకానొకచోట పుణ్యనాశమునుగూర్చికూడ చెప్పినట్లుతోఁచినను దాని నీకారణము వలన మఱియొకవిధముగ మాత్రమే సమన్వయింపవలయును గాని యథాశ్రుతముగ నిర్ణయింపరాదు. ఒకదానిని నిషేధించిన రెండవదాని నంగీకరించినట్లే నిర్ణయింపవలయును కదా! దేవదత్తుఁడు కుడికంటితోఁ జూడఁగలఁడు. అనిన యెడమకంటితోఁ జూడలేఁడనియే కదా యర్థము. కావున నెట్లును పుణ్యమునకు వినాశముగాని సంసర్గరాహిత్యముగాని సంభవింపదు. దానిని మాత్ర మనుభవించియే తీరవలయును."

---

## అ-౪. పా-౧. సూ-౧౪.

అవతారిక:—అనిన నట్లు కా దని సిద్ధాంతముఁ జేయుచున్నాఁడు.

# ౪౯-౨. ఇతరస్యాప్యేవమసంశ్లేషః పాతేతు. ౪. ౧. ౧౪.

తాత్పర్యము:—ఇట్లు తలంచుట యుక్తము కాదు. పాపము వలెనే పుణ్యముఁగూడ నవశ్యము నశించును; అసంసర్గమును గూడ జెందును. దానిఫలముగూడ జ్ఞానఫలమునకంటె భిన్నమగుటచే నిత్యమగు జ్ఞానఫలముచేత నది నివర్తింపఁబడవచ్చును. అట్లు నివర్తింపఁబడకున్న నవశ్యముగ తత్ఫల మనుభవింపఁబడవలయుటచేతను అట్లయిన ముక్తికి ప్రతిబంధము కలుగును గావునను జ్ఞానముచేఁ బుణ్యముఁగూడ నవశ్యము నశింపఁజేయఁబడవలసినదియే. "ఉభే ఉహ్యైవైష ఏతే తరతి" "బ్రహ్మవేత్త యగువాఁడు పుణ్యపాపముల రెంటి నతిక్రమించును" అని శ్రుతియు నీవిషయమును ప్రకటించుచున్నది. తగినయుపపత్తి యుండ శ్రుతికి నౌపచారికార్థమును లేక నన్యార్థము కల్పించుట యుక్తము కాదు. తరించు నను క్రియ రెంటియందును సమానముగ ప్రవర్తించుచుండ నొకటి నశించు ననియు రెండవది ఫలము నొసంగు (క్షీణించు) ననియు జెప్పుట యుక్తి యుక్త మగునా? కావున నిర్వివాదముగ పాపముతోఁబాటు పుణ్యము కూడ నశించును; అసంసర్గమును గూడ నుండును.

మఱియు నజ్ఞానము అదృష్టము లగునపూర్వాదులమూలమునఁ బాపమును నశింపఁజేయుటలేదు. అట్లయినచో నాకారణములదృష్టములు గావున వానికిఁ బుణ్యమును నశింపఁజేయుసామర్థ్యము కలదో? లేదో? యని సంశయించుటకు వీ లుండును; ఏదియోయొకవిధముగా పుణ్యనాశములే దని వాదించుటకును వీ లుండును గాని యిచ్చట నట్లులేదు. బ్రహ్మజ్ఞానము వలన "నేను కర్తను గాను భోక్తనుగాను ఎప్పటికిని నిర్వికారుఁడను" అను నిశ్చయము జనించును. ఇది ప్రత్యక్షము. ఇట్టి ప్రత్యక్షనిశ్చయము వలన గర్త్రాదిరహితమై నిర్మూలమై కర్మము నశించును. ఇది ప్రత్యక్ష మగుటచే దీనినిఁ గూర్చి సంశయ మింత యైనను కలుగుటకు వీలు లేదు. కర్త్రాదిరాహిత్యమువలన నిర్మూల మగుట పుణ్యమునకుఁ గూడ సమానమే యగుటచే నదిమాత్ర మేల నశింపకుండవలయును? కావున నిర్వివాదముగఁ బాపముతోఁబాటు పుణ్యముఁ గూడ నశించి తీరవలయును.

శాస్త్రమునందు విధింపఁబడియున్నవి యనునంతమాత్రమున నన్నిటికిని విరోధము లేకుండవలసినపని లేదు. అన్నియుఁ బ్రత్యక్షములేయైనను అగ్ని ప్రత్యక్షము జలప్రత్యక్షమును బాధించుచునే యున్నది కదా! శుక్తి ప్రత్యక్షము రజతప్రత్యక్షమును బాధించుచునే యున్నది కదా! శ్రుతియు "క్షీయంతే చాస్యకర్మాణి" అని యవిశేషముగ సర్వకర్మలకును పై కారణమువలననే క్షయమును చెప్పుచున్నది.

మఱియుఁ బుణ్యఫలము నాశాపియుక్త మైనది; మోక్ష మట్టిది కాదు. ఈకారణమువలనఁగూడ ముక్తునకుఁ బుణ్యఫలానుభవము కలుగు ననుటకు వీలు లేదు. వానికి వానియం దిచ్ఛయే జనింపదు కదా! కావునఁ బుణ్యమునకుఁ గూడ పాపముతోఁబాటు నాశ మవశ్య ముండవలయును. పాపశబ్ద మొక్కటియే ప్రయోగింపఁబడియున్నస్థలమునందును పుణ్యము నుపలక్షణముచే గ్రహింపవలయును. ప్రత్యక్షముగాఁ గూడ శ్రుతియందు పుణ్యపాపములను బోధించుటకై పాపశబ్దము ప్రయోగింపఁబడికూడ నున్నది. "న సుకృతం న దుష్కృతం సర్వే పాప్మానోఽతో నివర్తంతే" "పుణ్యముగాని పాపముగాని యీసర్వదోషములును (పాప్మలును) యీ పరమేశ్వరు నంటవు" అనుస్థలమునఁ బుణ్యపాపములు రెంటిని ప్రస్తావించి యుపసంహారమున కేవలపాపశబ్దమే ప్రయోగింపఁబడి యున్నది కదా! కావున నిర్వివాదముగఁ బాపముతోఁ గూడఁ బుణ్యంబును నశించును. అసంసర్గమును కూడ నొందును.

ఇట్లు పుణ్యపాపములు రెండును నశించిపోవుటచేత వానిఫలము లను జ్ఞాని యనుభవింప నక్కఱ లేదు. జ్ఞానోత్తరకాలమున దేహపాతము వఱకు సంస్కారవశమున నవి యనువర్తించినను తామరాకునకు జల ముతోవలె వానికి వానితో సంబంధ ముండదు. కావున మరణము కలుగఁ గనే వానికి (బ్రహ్మవేత్తకు) విదేహకైవల్యము కలుగును. అంతవఱకు సంసారమున నున్నను కుమ్మరపురుగు బురదలో నున్నను దాని నంటకయే సంచరించునట్లు అతఁడును దాని (సంసారము) నంటకయే సంచరించు చుండును. సన్యసించినవానినిఁగూర్చి ప్రత్యేకముగఁ జెప్ప నక్కఱ లేదు కదా! "తస్య తావ దేవ చిరం" అనుమొదలగు శ్రుతియు నీవిదేహకైవ ల్యమునుఁ గూర్చియే చెప్పుచున్నది.

## ౧౧. అనారబ్ధాధికరణము

విషయ సంశయ సంగతులు:—గడచిన రెండధికరణములయందును జ్ఞానమువలన కర్మలు నశించు నని చెప్పఁబడి యున్నది. వానినిఁగూర్చి యిచ్చట యొకవిశేషము చర్చింపఁబడును కావున నీయధికరణమునకుఁ బూర్వాధికరణములతోఁ గలసంబంధము ఏకవిషయత్వ సంబంధము. "కర్మలు నశించు ననిన ఫలోన్ముఖము లైనవియు గానివియుఁ గూడ నొక్కపెట్టున నశించునా? లేక కొన్నిమాత్రమే నశించునా?" యను సంశయ మిందు నివారింపఁబడును. ఫలోన్ముఖములు కానికర్మలు మాత్రమే నశించు నని సిద్ధాంతము చేయఁబడును.

పూర్వ:—"విచారించినచో నన్నికర్మలు నొక్కపెట్టుననే నశింపవలయు నని తోఁచుచున్నది. బ్రహ్మజ్ఞానము కర్తృకర్మాదిభావనను నశింపఁ జేయును. దానివలన నిర్మూలములై కర్మలు చెడిపోవును. ఇట్లుండ నేకర్మ లైన నేమి? కర్తృకర్మలు లేకున్న నన్నియుఁ జెడునవియే కదా! 'ఇట్లయినను కుమ్మరవానిచక్రమువలె సంస్కారశేషమువలన నశించినబిదపఁగూడ కొంతకాలము కర్మ యనువర్తించును. త్రిప్పుటను విడచినను వేగము వలన నాచక్రము కొంతసేపు తిరుగుచునే యుండునట్లు ఈకర్మలును స్వకారణ మగునజ్ఞానము నశించినను కొంతకాలము ప్రవర్తించుచునేయుండును' అనియెదవేమొ యిది సంభవింపదు. పదార్థ మైనచో నిట్టిసంస్కారంబును అనువృత్తియు సంభవించును గాని మీామతమున గర్మ పదార్థమే కాదు కదా! సర్వము మాయాకల్పిత మగుటచే నయథార్థమే కదా! ఇట్లయిన నిఁక సంస్కార మెక్కడిది? దానివలనఁ గలుగు నని చెప్పఁబడిన యనువృత్తి యెక్కడిది?' త్రాటినిఁ జూచి సర్పమని భ్రమించినప్పుడు కలిగిన భయకంపాదులుభ్రాంతి నివృత్తియైనబిదపఁగూడ నుండునట్లియాకర్మయు నజ్ఞానకల్పిత మైన నుండవచ్చును' అనియెదవేమొ యిదియు యుక్తము కానేరదు. అచ్చట సర్వ మసత్యమైననుతజ్జ్ఞానముసత్యము. ఇచ్చటనన్నో కర్మలతోఁబాటు వానికిఁ గారణ మగునవిద్యయు నసత్యమే కదా! ఇట్లుండ నీరెంటికిని పోలిక గలుగుట యెట్లు? 'ఇట్లయిన 'తస్య తావ దేవ చిరం' అను శ్రుతికి విరోధము వచ్చును' అనియెదవేమొ అట్లును సంశయింపఁ బని లేదు. ఆశ్రుతి మోక్షముయొక్క శీఘ్రతను గూర్చి చెప్పు

చున్నదియే గాని శరీరపాతముపఱకు నవధిని చెప్పుటలేదు. 'నేను భుజించుటకు స్నానము చేయుటయే యాలస్యము' అనిన 'నేను శీఘ్రముగ భుజింతును' అని మాత్రమే యర్థముకాన స్నానము చేయునంతపఱకు భుజింపను అని యర్థము కాదు కదా! 'అట్టియర్థమునుకూడ నీవాక్యమువలన గ్రహింపవచ్చును' అనియెదవేమొ అట్లయినను మామతమునకు విరోధము రాదు. ఒకవాక్యమునకు రెండర్థములనుజెప్పిన వాక్యభేదము కలుగును కదా! కావున నశించిన నన్నికర్మలును నశింపవలయును. లేకున్న నొక్కటియు నశింపఁగూడదు."

## అ_౪. పా_౧. సూ_౧౫.

అవతారిక:—అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

---

## ౪౬౩. అనారబ్ధకార్యే ఏవ తు పూర్వే తదవధేః.

## ౪. ౧. ౧౫.

తాత్పర్యము:—ఇట్లు సంశయింపఁ బని లేదు. ఏకర్మలు పూర్వజన్మములయందును జ్ఞానోత్పత్తిపఱకుఁ బ్రస్తుతజన్మమునందును సంపాదింపఁబడి ఫలోన్ముఖములు కాకయున్నవో ఆకర్మలుమాత్రమే నశించును గాని యితరకర్మలు నశింపవు. అవి ఫలము నొసంగ నారంభించి జాతి స్వభావము మొదలగువానితోఁ గూడినయీదేహమును గల్పించి తక్కిన కర్మలకంటె బలవంతములై యున్నవి కదా! ఇట్లగుటచే సర్వప్రపంచ విరోధి యయ్యును బ్రహ్మజ్ఞానము వానిని (ప్రారబ్ధకర్మలను) బాధింపనేరదు. బాధించు ననిన లోకానుభవమునకు విరోధము వచ్చును. మనువు హిరణ్యగర్భుఁడు మొదలగుమహానుభావులు దివ్యజ్ఞానసంపన్నులయ్యును జీవించి వ్యవహారముల నాచరించుచు బహువిధసుఖదుఃఖముల ననుభవించుచు నున్నారు. కదా! ఇది సంభవింపకపోవలసి వచ్చును. జ్ఞానము సర్వకర్మల నశింపఁజేయునేని యప్పుడు బ్రతుకుటకే హేతువు లేక పోవుటచే బ్రహ్మజ్ఞాని బ్రహ్మానుభవము కలిగినవెంటనే మృతినొందవలసినవాఁడగునుకదా! ఇది ప్రత్యక్షవిరుద్ధము. ఆహిరణ్యగర్భాదులకు బ్రహ్మజ్ఞానము లేదనుట సాహసమాత్ర మగును కదా! కావున నెట్లును శ్రుతి

ననుసరించియే సర్వము నంగీకరింపవలయును. ప్రారబ్ధకర్మకు నాశము లేదనవలయును. "తస్య తావదేవ చిరం" అను శ్రుతియు "దేహపాతము వఱకు జ్ఞాని కర్మానుభవము నాచరించుచునే యుండవలయును" అని మాత్రమే చెప్పుచున్నది. ముక్తిశీఘ్రత పూర్వముననే చెప్పఁబడియుండ దాని ననువాదము చేయుచు నీశ్రుతి దేహపాతావధిని మాత్రమే విధించు చున్నది గావున నెట్లును వాక్యభేదము కలుగదు. ఈకారణమువలన నియతముగ ప్రారబ్ధకర్మ మాత్రము నశింపదు; నిర్మూల మైనను జీవి తాంతము వఱకు ననువర్తించుచునే యుండును.

"ఇట్లు చెప్పిన నెట్లు సరిపడును? 'నేను కర్తను కాదు' అనుజ్ఞానము సర్వకర్మలను నిర్మూలము చేయుచు స్వరూపాభావము నొందింపుచు నుండ కొన్ని మాత్ర మెట్లు మిగిలియుండును? అగ్నిసంస్పర్శ సమాన ముగ నుండఁగా కొన్నివిత్తనములు కాలి మఱికొన్ని కాలకుండు ననుట యెట్లు సంభవించును." అనియెదవేమొ వినుము. శరీరమునకు ప్రారబ్ధ కర్మలే కారణము కావున వాని నాశ్రయింపక నాతత్వజ్ఞానముకూడఁ గలుగుటకు వీలు లేదు. ఆశ్రయించినయెడల కుమ్మరసారెవలె దిరుగుచున్న ప్రారబ్ధము సంస్కారవశమువలన తనఫలము ముగియునంతవఱకుఁ దిరుగు చునే యుండ దాని కేదియు నాటంకము కలిగింపఁజాలదు. ఆప్రారబ్ధము వాస్తవస్థితిలో నసత్యమే యైనను ప్రపంచాదులవలె వ్యావహారికసత్యమై యున్నది. అన్నియెడలను వ్యావహారికసత్యములే కదా వ్యవహార సాధనము లగుచున్నవి. కుమ్మరసారెయు నీజాతిలో చేరినదియే కదా! కావున నది సత్య మనియు ప్రారబ్ధ మసత్య మనియు నీకారణమున దాని నిచ్చుట దృష్టాంతముగఁ దేగూడ దనియుఁ జెప్పుట విరుద్ధము. ఈకార ణమువలన జ్ఞానోదయ మైనపిదపఁ గూడ ప్రారబ్ధము ఫలము నొసంగు చుండును. బ్రహ్మజ్ఞానము దానికి బాధకమే యైనను కొంతకాలమువఱకు నవిరెండు నన్యోన్యానువర్తులై యుండును. ఇట్టిదృష్టాంతములు లోకమున గలవు. రజ్జుసర్పభ్రాంతి తొలంగినపిదపఁగూడ సర్పభావనవలనఁ గలిగిన భయకంపాదులు కొంతకాలమువఱకు నుండును. బ్రహ్మ మొక్కటితప్ప తక్కినవి యన్నియు వ్యావహారికసత్యములేయగుటచే సర్పజ్ఞానమువలెనే మాయయు యథార్థము కావచ్చు నని మున్నే సూచించి యున్నాము. కావున లోకమున విరోధులపరస్పరానువృత్తి యత్యల్పకాలము మాత్రమే

కానఁబడినను మనము ప్రకృతవిషయమున వేదానుసారముగ నధికతర మనునసువృత్తి నంగీకరింపవచ్చును. కావున నెట్లును ప్రారబ్ధమునకు క్షయము లేదు. జ్ఞానమనునది పరమార్థసత్యమే యైనను అది స్వయముగ భయకంపాదులను కలిగింపనేరదు కావున నది సర్వవిషయక మగువిశేష జ్ఞానమే యనవలయును. అది యోపాధికము గావున నుపాధి లేకున్న నుండదు. కావున సర్వము నశించినను జ్ఞాన ముండవచ్చు ననుట సంభవింపదు. కావున నెట్లును బ్రహ్మజ్ఞాన మున్నను ప్రారబ్ధకర్మము కూడ నశింపకుండవచ్చును.

ఇంత యేల ఈవిషయమున వివాదమే యక్కఱ లేదు. బ్రహ్మజ్ఞానంబును ప్రారబ్ధానువృత్తియు ననునవి జ్ఞానియొక్క హృదయమునకు మాత్రమే గోచర మగువిషయములు. ఇట్టివానినిఁగూర్చి మన మేమి విచారింపఁగలము. జ్ఞానులచర్యలతిదుర్జ్ఞేయములు. శ్రుతిస్మృతులయందును జ్ఞాన సిద్ధులను గూర్చి చెప్పునప్పు డిట్లే చెప్పఁబడియున్నది. కావున శ్రుత్యను సారముగఁ బ్రారబ్ధకర్మలు నశింప వనియే సిద్ధాంతముఁ జేయవలసి యున్నది.

---

## ౧౨. అగ్నిహోత్రాద్యధికరణము.

సంగతి:—"ఇదివఱకు (పదియవయధికరణమునందు) పాపమువలెనే పుణ్యముగూడ జ్ఞానముచే నశించు ననియు అసంసర్గమును గూడ నొందు ననియుఁ జెప్పఁబడి యున్నది. అది సర్వకర్మలను గూర్చినవిషయమే యైయుండవలయును. కావున మోక్షేచ్ఛగలవాఁడు నిత్యకర్మలఁ గూడ నాచరింపఁగూడదు." అనునాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడెను. కావున దీనికి పదియవయధికరణముతో నాక్షేపసంబంధము కలదు. మఱియుఁ బూర్వాధికరణమునందు ప్రారబ్ధకర్మలు గాక తక్కిన వన్నియు జ్ఞానముచే నశించు నని సామాన్యముగఁ జెప్పఁబడి యున్నది. ఇది నిత్యనైమిత్తికములకుఁ గూడ సంబంధించునేమో యను నాక్షేపమునకు సమాధానముగ నీయధికరణ మారంభింపఁబడెను. కావున నికిఁదీ బూర్వాధికరణముతోఁ గూడ నాక్షేపసంబంధము కలదు.

విషయ సంశయము:—ఇం దగ్నిహోత్రాది నిత్యకర్మలను గూర్చియు శ్రాద్ధాదినైమిత్తికకర్మలనుగూర్చియు విచారింపఁబడును. "అవి ముముక్షువునకుఁ గర్తవ్యములా? కావా?" యనుసంశయము నివారింపఁబడును. కర్తవ్యములే యని సిద్ధాంతముఁ జేయఁబడును.

పూర్వపక్షము:—"ఆలోచించిన మోక్షేచ్ఛ గలవాఁడు తదర్థమై ప్రయత్నించువాఁడు నిత్యనైమిత్తికకర్మముల నాచరింప నక్కఱ లేదు. అవియు సర్వపుణ్యములతోఁబాటు నశించును. అంటకుండ నైన బోవును గదా! ఇట్లుండ వాని నాచరింపనేల? 'వీనికి నేను కర్తను కాను' అని పరిత్యజింపనేల? 'ప్రక్షాళనాద్ధి పంకస్య దూరా దస్పర్శనం వరం' 'బుర దను త్రొక్కి కడిగికొనుటకంటె మొట్టమొదటనే తాక కుండుట బుద్ధిమంతుని కార్యము' అనున్యాయము ననుసరించి మొట్టమొదటనే వాని నాచరింపకుండుట యుక్తమగును కదా! 'వివిదిషంతి యజ్ఞేన' అను మొదలగు శ్రుతులు 'నిత్యకర్మలకుఁ గూడ మోక్షసాధనత్వమును చెప్పుచున్నవి' యనియెదవేమో యట్లుగాదు, జ్ఞానియగువాఁడు కర్తృత్వభోక్తృత్వాభిమానముల సంపూర్ణముగఁ బరిత్యజించును. విద్యాప్రభావ మిట్టిదిదైయుండ భేదసాధ్యము లగు కర్మలు దానితోఁ గూడ నెట్లు నివసింపఁగలవు? సమానఫలము నెట్లొసంగఁగలవు? కావున నాశ్రుతి బ్రహ్మజ్ఞానము యొక్కగాని కర్మయొక్కగాని స్తోత్రమును కావించునేగాని మఱి యేమియుఁగాదు. కావున నిర్వివాదముగ మోక్షేచ్ఛగలవాఁడు నిత్యనైమిత్తికముల నాచరింపఁగూడదు."

## అ-౪. పా-౧. సూ-౧౬.

అవతారిక:—అని వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

---

# ౪౬౪. అగ్నిహోత్రాది తు తత్కార్యాయైవ తద్దర్శనాత్. ౪. ౧. ౧౬.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట సరి కాదు. అగ్నిహోత్రాదినిత్యనైమిత్తికకర్మలు మోక్షేచ్ఛకలవారిచే నాచరింపఁబడవలసినవియే. ఆకర్మలును జ్ఞానమువలెనే ముక్తిసాధనము లగుచున్నవి. శ్రుతియు "త మేతం

వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన (బృ. 3. 4. ౨౨)" అని యీవిషయమునే బోధించుచున్నది. కావున నిర్గుణోపాసకులుగూడ నుపాసనాసిద్ధి కలుగునంతవఱకు నీకర్మల నాచరింపవలయును. అప్పు డివి చిత్తశుద్ధికారకములై యుపాసనాదార్ఢ్యమును కలిగించును. "కామ్య కర్మములు కూడ నిట్లే యాచరింపఁబడవచ్చును కదా! సిద్ధి కలుగునంత వఱకు నేను కర్తను గాను; అను నిశ్చయము కలుగదు గావున కర్మలకు వేనికిని వినాశముండఁగూడదు" అనియెదవేమొ యట్లు కాదు. మోక్షేచ్ఛ కలుగఁగనే యల్పఫలము లగుయజ్ఞాదికర్మలయందు ఇచ్ఛ తొలంగును. మోక్షము శాశ్వతసుఖరూపము; స్వర్గాదులు నాశయుక్తములు. ఈకార ణమువలన నకర్త్రాత్మజ్ఞానము కలుగునంతవఱకు కామ్యము లుండ నక్కఱ లేదు. వైరాగ్యదశయందే యవి నిరాధారములై పోవును. పాపకర్మలు ధ్వంస మగుటకైనను ముక్తిసిద్ధి కావలయును గాని వీని వినాశమునకు దానితోఁ బని లేదు. ఉపాసన నాచరించుచున్నను సస్వరూపజ్ఞానము దృఢమగునంతవఱకు తనయకర్తృత్వము తేటపడునంతవఱకు బ్రహ్మధారణ కుదురునంతవఱకుఁ గూడ సాధకుఁ డొకానొకప్పుడు తనపూర్వపాపములఁ గూర్చి వగచుట సంభవించును గాని వైరాగ్యము కలిగినపిదప స్వర్గాదు లను గోరుటమాత్ర మెన్నటికిని సంభవింపనేరదు. కావున నుపాసనా రంభసమయమునకు నిత్యనైమిత్తికములు మాత్రమే శేషించి యుండును. అవియు ముక్తిసాధనములే యగుటచే ఫలసిద్ధి కలుగునంతవఱకు నుపాస కునిచే నాచరింపఁబడవలసినవియే.

"ఇట్లు కాదు. కర్మజ్ఞానము నొక్కసమయమున నుండుటయు నొక్కకార్యము నాచరించుటయు సంభవింపదు. వానిఫలములు భిన్న ములు కదా!" అనియెదవేమొ యట్లైనను దోషము లేదు. లోకమున సంయోగభేదముచేఁ గారణవిరుద్ధము లగుకార్యములు గూడ గానవచ్చు చున్నవి. పెరుగు విశేషముగ నుపయోగింపఁబడిన జ్వరమును కలిగించు నది యయ్యును బెల్లముతోఁ గూడెనేని యట్టిదోషమును చేయక తృప్తిని మాత్రమే కలిగించుచున్నది. విషము ప్రాణమును హరించునది యయ్యును మంత్రసంయోగముచే దేహపుష్టిని కలిగించుచున్నది. అనేకపదార్థములు స్వాభావికముగ నారోగ్యకరములే యైనను మఱియొకపదార్థముతోఁ

జేరినప్పుడు విషము లగుచున్నవి. ఇట్లే కర్మలును స్వతంత్రముగ భిన్న ఫలముల నొసంగునవియేయైనను జ్ఞానసంయోగముచే మోక్షము నొసంగ వచ్చును.

"మోక్షము మీమతమున స్వాభావసిద్ధమే యగుటచే నది కర్మ సాధ్యము కా దని మీరే చెప్పియున్నారు. దానికి విరుద్ధముగ నిచ్చట నాకర్మలే ముక్తిసాధనము లని చెప్పుట యెట్లు సంభవించును?" అనియెద వేమో వినుము. మేము "కర్మలు ప్రత్యక్షముగ మోక్షము నొసంగును" అనుట లేదు. అవి చిత్తశుద్ధిమూలమున జ్ఞానసాధనము లగుటచే దాని మూలమున (జ్ఞానము మూలమున) ముక్తి నొసంగు ననుచున్నాము. ఇట్లైనను కర్మలు ముక్తిసాధనములే యగును కదా! కావున ఫలము కలుగునంతవఱకు ముముక్షువులు అగ్నిహోత్రాదుల నాచరింపవచ్చును; ఆచరింపవలయును. కర్మనుగూర్చి యేవిషయము చెప్పఁబడినను ఫలసిద్ధికిఁ (మోక్షసిద్ధికి) బూర్వస్థితి నుద్దేశించియే చెప్పఁబడునని తెలిసికొనవలయును. సిద్ధి కలిగినపిదప నాముక్తునిఁగూర్చి శాస్త్రములే ప్రవర్తింపవు కదా! సగుణవిద్యలవిషయమును గూర్చి విచారించిన నచ్చట నుపాస్యసాక్షా త్కారరూప మగుఫలసిద్ధి కలిగినపిదపఁ గూడఁ గర్మాచరణావకాశము కలదు. ఆసగుణోపాసకులకు "నేను కర్తను కాను" అను జ్ఞానము లేదు కదా! అవియు ఫలాపేక్షరహితముగ చేయఁబడెనేని పరమముక్తికి సాధ నము లగును.



## అ-౪. పా-౧. సూ-౧౪.

అవతారిక :— "ముక్తిసిద్ధికిఁ బిదపఁ గర్మలు లేకపోయినచో 'జ్ఞానోత్తరకాలమున నాచరింపఁబడినకర్మలు ముక్తు నంటవు' అనువాక్యమే కర్మలనుగూర్చి చెప్పఁబడెను; అగ్నిహోత్రాదులు జ్ఞానసాధనము లగుటచే నాచరణీయములే యగునేని యేకర్మలనుగూర్చి వినాశము చెప్పఁబడెను? 'సుహృదః సాధుకృత్యం ద్విషంతః పాపకృత్యం (3-3-౨౬)' అని విభాగ మెవ్వానినిఁ గూర్చి చెప్పఁబడెను?" అనిన సమాధానమును చెప్పు చున్నారము.

## ౪౬౫. అతోఽన్యాపి హ్యేకేషా ముభయోః.

### ౪. ౧. ౧౭.

తాత్పర్యము:—విచారించిన ముక్తిశుద్ధికిఁ బిదపఁ గర్మ లేకున్నను జీవన్ముక్తుఁడు బ్రతికియున్నంతవఱకు లోకానుసారముగ సర్వమును నాచ రింపవలసినవాఁడే యగును. కావున నట్టికర్మలను గూర్చియే యీవిభా గాదులు చెప్పఁబడియున్నవి. అందును ఫలాపేక్షారహితముగ నాచ రింపఁబడినవానితో పరులకుఁ గూడఁ బ్రయోజన మేమియు లేదు కావునఁ గామ్యకర్మలను గూర్చియే యీవిభాగాదులు చెప్పఁబడె ననవలయును. అగ్నిహోత్రాదినిత్యకర్మలు చిత్తశుద్ధిసాధకములు మాత్రమే యగుట చేతను ఒక్కనిచేఁ జేయఁబడినకర్మలు మఱియొక్కనికి చిత్తశుద్ధిని కలి గించు ననుట విరుద్ధ మగుట చేతను ఈవిభాగాదులు వానినిగూర్చి (అగ్నిహోత్రాదులనుగూర్చి) చెప్పఁబడలే దనవలసి యున్నది. నిత్యనై మిత్తికములకుఁ జిత్తశుద్ధికంటె భిన్న మగుఫలము లే దనియు వాని నాచ రింపకున్న బ్రత్యవాయము మాత్రము కలదుగాని ఆచరించిన ఫలము లే దనియుఁ బూర్వమీమాంసాశాస్త్రమున సిద్ధాంతముఁ జేయఁబడి యున్నది. "ముక్తునకు ఫలాభిలాషయే లేదు కదా! వాఁడు కామ్యముల నెట్లాచరించును?" అనియెదవేమో వినుము. ఆతనికి ఫలములయం దభిలాష యెట్లు లేదో నిరభిలాషయు నట్లే లేదు. కావున లోకానుసార ముగ వాఁడు కర్మల నాచరించును; వానికి ఫలముల నొసంగుట స్వభావము కావున నవి ఫలాభిలాష గల యితరులకు ఫలము నొసంగును. వాస్తవ స్థితిలో నీవిషయము (విభాగవర్ణనము) స్తుతిమాత్రమే యని హాన్యధి కరణమున (3-3-౨౬) సిద్ధాంతము చేయఁబడి యున్నది. కావున నిర్వివాదముగ నిది కామ్యకర్మవిషయమే. మఱియు నాకామ్యకర్మ జ్ఞానము నకు నుపకారి కాదని జైమినిబాదరాయణాచార్యు లిరువురు నంగీక రించియే యున్నారు. కావున నిర్వివాదముగ నిత్యనైమిత్తికములు ముముక్షువులచే నాచరణీయములే.

## ౧౩. విద్యాజ్ఞానసాధనత్వాధికరణము.

విషయ సంగతి సంశయములు:—ఈయధికరణమునందు కూడ అగ్ని హోత్రాదులవిషయమయ్యే మఱికొంతవిషయము విచారింపఁబడును. కావున దీనికిఁ బూర్వాధికరణముతో నేకవిషయత్వసంగతి కలదు. ప్రస్తావానుసారముగ వచ్చినది యగుటచే నీయధికరణ మీపాదమునందు జెప్పఁబడెను. అగ్నిహోత్రాదిరూప మగునిత్యనైమిత్తికకర్మసమూహమును మోక్షేచ్ఛగలవాఁడు గూడ నాచరింపవలసినదియే యనియు నాకర్మలు పాపముల నశింపఁజేసి మనస్సును శుద్ధిజేసి సూక్ష్మ మగు బ్రహ్మతత్త్వమును దృఢముగ నెఱుంగుసామర్థ్యమును కలిగించుననియు నిట్లు చేయుటచే పరంపరగ మోక్షసాధనము లగు ననియుఁ బూర్వాధికరణమునఁ దేలినది. ఆ కర్మలు రెండువిధములుగ నున్నవి. కొన్నిచోట్ల "య ఏవం విద్వాన్యజతి...య ఏవం విద్వాం జుహోతి...య ఏవం విద్వాం ఛంసతి...య ఏవం విద్వాం గాయతి" "ఎవ్వఁడు ఈవిధముగా నెఱింగి యజ్ఞము చేయునో, ఎవ్వఁ డీవిధముగ నెఱింగి హోమము చేయునో, ఎవ్వఁ డీవిధముగ నెఱింగి స్తోత్రము చేయునో, ఎవ్వఁ డీవిధముగ నెఱింగి సామగానము చేయునో" అని ప్రతికర్మకును విద్యలు సహాయముగఁ జెప్పఁబడి యున్నవి. మఱికొన్నిస్థలములయం దట్లు లేదు. కావున "ఆకర్మలు విద్యాసహితములుగ నాచరింపఁబడవలయునా? లేక కేవలములే యాచరింపఁబడవలయునా?" అనుసంశయము నివారింపఁబడును. "యజ్ఞేన దానేన" అను మొదలగు శ్రుతి సామాన్యముగనే యజ్ఞాదులను విధించి యుండుటయు, "య దేవ విద్యయా కరోతి" అను మొదలగు శ్రుతిచే నుపాసనాసహిత మగు కర్మయే శ్రేష్ఠ మని చెప్పఁబడి యుండుటయు నిచ్చట సంశయకారణములు. ఈసంశయము నివారింపఁబడి "అంగాశ్రితోపాసన లున్నను లేకున్నను గూడ నగ్నిహోత్రాదులు చిత్తశుద్ధి నొసంగఁగలవు" అని సిద్ధాంతము చేయఁబడును.

పూర్వపక్షము:—"విచారించిన విద్యాసహితము లగు కర్మలే జ్ఞానార్థమై యాచరింపఁబడవలయు నని తోఁచుచున్నది. జ్ఞాన మనునది యుత్తమఫల మగుటచే నది యుత్తమకర్మములవలనఁగాని కలుగదు. ఉత్తమకర్మ మనఁగా విద్యాసహితము లగుకర్మలు 'యదేవ విద్యయా

కరోతి...యదహరేవ జుహోతి తదహః పునర్మృత్యు మపజయ త్యేవం విద్వాన్' 'ఈవిధముగ నెఱింగినవాఁడు ఏదినమున హోమముచేయునో ఆదినముననే మృత్యువును జయించును' అను మొదలగు శ్రుతులును 'బుద్ధ్యా యుక్తోయయా పార్థకర్మబంధం ప్రహాస్యసి...దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ' 'ఓయర్జునా యేజ్ఞానముచేఁ గర్మబంధమును పరిత్యజింపఁగలవో దానిని విను. జ్ఞానమునకంటె కర్మ తక్కువ' అను మొదలగుస్మృతులును ఈవిషయమునే బోధించుచున్నవి కావున నిట్టి కర్మలనే మోక్షార్థి యాచరింపవలయును. 'యజ్ఞేన దానేన' అను మొదలగు శ్రుతులు సామాన్యకర్మనుగూర్చియే చెప్పుచున్నను వానికిఁ గూడనిదియే యభిప్రాయ మనవలయును. 'బ్రాహ్మణులకు దక్షిణనొసంగవలయును' అనిన నధ్యయనాదియుక్తుఁడై విద్వాంసుఁడై యున్న బ్రాహ్మణులకు దక్షిణ నొసంగవలయు ననియే యర్థము కాని మూర్ఖులును అనాచారవంతులు నగువారికి నొసంగవలయు నని యర్థము కాదు గదా! కావున నెట్లును అంగాశ్రితోపాసనలతోఁ గూడిన కర్మలే జ్ఞానికి ననుష్ఠేయములు."

## అ_౪. పా_౧. సూ_౧౮.

అవతారిక:—అనిన నట్లు నియమము లేదని సిద్ధాంతము చేయుచున్నాఁడు.

## ౪౯౬. యదేవ విద్యయేతి హి. ౪. ౧. ౧౮.

తాత్పర్యము:—ఇది సత్యమే. విద్యాయుక్తుఁడగు బ్రాహ్మణుఁడు విద్యావిహీనునికంటె శ్రేష్ఠుఁడైనట్లు కర్మాంగోపాసనతోఁ గూడిన కర్మ కేవలకర్మకంటె శ్రేష్ఠ మనుట నిస్సంశయము. అయినను ఉపాసనా విహీన మగుకర్మయుఁ బరిపూర్ణముగ విడువఁదగినది కాదు. ఏల యనిన "తమేతం యజ్ఞేన వివిదిషంతి" అని వేదము విద్యాసహితకర్మ లనిగాని రహితకర్మ లనిగాని చెప్పక సామాన్యముగఁ జెప్పియున్నది. "శ్రుతి యిట్లు చెప్పియున్నను శ్రేష్ఠమైనదానిని మాత్రమే గ్రహింపవలయును. ఉపాసనా హీన మగుకర్మయు ఫలము నొసంగఁగలదియె యైనను ఉత్తమఫల మగు జ్ఞానము నొసంగలేకపోవచ్చును" అనియెదవేమో అది సరికాదు. కర్మ జ్ఞానమునకు కారణ మనుచున్నాముకదా! ఈకారణత్వము ఉపాసనాసహిత

కర్మల కధికముగఁ గలుగు ననియు తద్రహిత కర్మలకు అల్పముగఁ గలుగు ననియు మాత్రమే కల్పింపవచ్చునుగాని దీనిచే "వివిదిషంతి యజ్ఞేన" అను శ్రుతియందుఁగలసామాన్యవిధిని విశేషవిధినిగా (విద్యాయుక్తము లగు కర్మలనుగూర్చి చెప్పుదానినిగా) గ్రహించుటకు వీలు లేదు. "య దేవ విద్యయా కరోతి" అనుశ్రుతి విద్యాసహిత మగుకర్మ వీర్యవత్తర మని చెప్పుచు దానికి స్వకార్యమునందు సామర్థ్యాతిశయమును ప్రకటించు చున్నను విద్యాహీన మగుకర్మను నిష్ప్రయోజన మనుట లేదు. విద్యా సహితకర్మ వీర్యవత్తరమైనఁ దద్రహిత కర్మ వీర్యవంత మగు ననుటలో సంశయము లేదు కదా! వీర్యవంత మగు ననఁగా స్వకార్యమును సాధింపఁ గలుగు ననియే కదా యర్థము. కావున విద్యాసహితముగాని తద్రహితము గాని యగు కర్మ మోక్షార్థిచే జ్ఞానఫలసిద్ధివఱకు ననియతముగ నాచరింపఁ బడవచ్చును. అది జ్ఞానప్రతిబంధకము లగుపాపముల నాశము నొందించి చిత్తశుద్ధిని సంపాదించి శ్రవణమననాదులయందు చిత్తమును ప్రవేశింపఁ జేసి జ్ఞానమూలమున ముక్తిని కలిగించును.

---

## ౧౪. ఇతరక్షపణాధికరణము.

విషయ సంశయ సంగతి పూర్వపక్షములు:—పూర్వము అనారబ్ధాధికరణమునందు "ప్రారబ్ధకర్మము జ్ఞానముచే నశింపఁగూడదు" అని సిద్ధాంతము చేయఁబడి యున్నది. దాని నాశ్రయించి యాప్రారబ్ధకర్మ నాశమునుగూర్చి యిందు విచారింపఁబడును. "బ్రహ్మవేత్త శరీరపాతానంతరమున ముక్తుఁ డగునా? (విదేహముక్తుఁ డగునా?) కాదా?" యను సంశయము నివారింపఁబడును. "దేహపాతమునకుఁ బూర్వమునందు జ్ఞానము కలిగినను సంసార మెట్లు నిలిచియున్నదో అట్లే దేహపాతానంతరమునఁ గూడ నిలిచి యుండవచ్చును" అని దృష్టాంతసంగతితో వచ్చిన యాక్షేపము నిరాకరింపఁబడును.

---

# ౪౯౭. భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే. ౪. ౧. ౧౯.

తాత్పర్యము:—జ్ఞానికి ప్రారబ్ధవశముచలన దేహపాతమువఱకు మాత్రమే సంసార మనువర్తించును కాని పిదప ననువర్తింపదు. ఫలభోగమువలన నాప్రారబ్ధము నశించినపిదపఁ గాని దానిచే నిర్మింపఁబడిన దేహము నశింపదు గదా! ఇట్లు దేహము నశించినవెనుక రెండవదేహమును కల్పింపఁగలకర్మ లేకపోవుటచే మరల సంసారము సంభవించుటకు వీలు లేదు. కావున బ్రహ్మవేత్తలు అనుభవముచే ప్రారబ్ధమును క్షీణింపఁజేసి పరమేశ్వరునిఁ జెందెదరు. పరమేశ్వరరూపము జీవులకు స్వతస్సిద్ధమే యగుటచే జ్ఞానము కలిగినతోడనే యది తనంతనే వచ్చును. దేహమును కల్పించినది యగుటచేఁ బ్రారబ్ధము ధనుర్ముక్తశరమువలె దేహపాతము వఱకు తనవేగమును చూపుచు విదేహకైవల్యమునకుఁ గొంత ప్రతిబంధమును కలిగించినను దేహపాతానంతరమున నట్టిదేదియు నుండదు. "తస్య తావ దేవ చిరం" అను శ్రుతి యీవిషయమునే స్పష్టము చేయుచున్నది. "బ్రహ్మైవ స న్బ్రహ్మాప్యేతి" "స్వయముగ పరబ్రహ్మమే యయ్యు నజ్ఞానవశమున నన్యునివలె దోచుచుండి జ్ఞానము కలుగఁగనే సస్వరూప మగుబ్రహ్మమును పొందును" అను శ్రుతి జీవునకు బ్రహ్మస్వరూపము స్వతస్సిద్ధ మని తెలుపుచున్నది. కావున దేహపాతానంతరమున సంసారము లేదు.

"అగును గాక! జీవన్ముక్తునకు బ్రహ్మాత్మజ్ఞానము కలిగినపిదపఁ గూడ సంసార మనువర్తించుచుండ దేహపాతానంతరమునమాత్ర మేల యనువర్తింపరాదు?" అనియెదవేమో వినుము. బ్రతికియున్నప్పుడు అనుభవింపఁబడవలసిన ప్రారబ్ధము మిగిలి యుండుటచే నచ్చట సంసారానువృత్తికి హేతువు కలదుగాని దేహపాతానంతరమున లేదుకదా! "అట్లు లేకున్నను క్రొత్తకర్మఫలము నొసంగ నుపక్రమింపవచ్చును" అనియెదవేమోవినుము. సర్వకర్మలును జ్ఞానాగ్నిచే మున్నే దహింపఁబడి యుండుటవలన ప్రారబ్ధభిన్నము లగుకర్మ లేవియు మరల నుద్భవింపనేరవు. ప్రారబ్ధమే యొకవేళ రెండుమూఁడుజన్మములయందు తనఫలము నొసంగవలసి యున్న నప్పుడు

మాత్రము జన్మానంతరములు కలుగును గాని తక్కినకర్మములుమాత్రము మరల తలఁజూప నేరవు. అవియన్నియు మిథ్యాజ్ఞానము నాశ్రయించియే ప్రవర్తించును; ఆమిథ్యాజ్ఞానము జ్ఞానముచే మొట్టమొదటనే నశించెను కదా! ప్రారబ్ధ మన్ననో అది దేహమును నిర్మించి ఫలము నొసంగ నారంభించినది యగుటచే విముక్తశరమువలె ఫలావసానమువఱకు మిథ్యాజ్ఞానమున్నను లేకున్నను గూడ ప్రవర్తింపవచ్చును. కావున దేహపాతానంతరమున మరల సంసారప్రాప్తిలేదు. ప్రారబ్ధభోగానంతరమున మరలఁ గర్మావిర్భావము లేదు.

ఇది బ్రహ్మసూత్రార్థచంద్రికయందు చతుర్థాధ్యాయమునఁ
ప్రథమ పాదము.





# బ్రహ్మసూత్రార్థచంద్రిక.

## చతుర్థాధ్యాయము - ద్వితీయపాదము.



### పాదావతారిక

పైపాదమునందు జీవన్ముక్తివిదేహములు వర్ణింపఁ బడినవి. ఉత్క్రాంతితోఁ బనిలేకయే నిర్గుణబ్రహ్మవేత్త ముక్తుఁడగు నని చెప్పఁ బడినది. ఈపాదమున సగుణబ్రహ్మవేత్తలకు కలుగుక్రమముక్తి విచారింపఁ బడును. దానికి సాధన మగు దేవయానమార్గము వర్ణింపఁబడును. ఆమార్గమున బ్రహ్మలోకమునకుఁ జని యచ్చట కల్పాంతమువఱకు నుండి చతుర్ముఖునితోఁగూడ ముక్తినిఁ జెందు ననిన మొట్టమొదట మనుష్యలోకమున ధరించియున్న శరీరమునుండి నిర్గమించుట యావశ్యక మగుటచే వేదానుసారముగ నాయుత్క్రాంతి మొట్టమొదట నిరూపింపఁబడును. " 'నతస్య ప్రాణా ఉత్క్రామంతి' 'బ్రహ్మవిదుని ప్రాణములు నిర్గమింపవు' అను మొదలగు శ్రుతివాక్యములవలన బ్రహ్మవేత్తకు నుత్క్రాంతియే లే దని తేలుచున్నది." అనియెదవేమొ యట్లు కాదు. ఈశ్రుతి నిర్గుణబ్రహ్మవేత్తను గూర్చి చెప్పు ననియు వానికి తప్ప తక్కినవారి కందఱకు నిర్గమనము కల దనియు ఈపాదమునందే సిద్ధాంతము చేయఁబడును.

---

### వాగధికరణము. ౧.

విషయ సంగతి సంశయములు:—ఉత్క్రాంతినిఁగూర్చి "అస్య సోమ్య పురుషస్య ప్రయతో వాఙ్మనసి సంపద్యతే మనః ప్రాణే ప్రాణస్తేజసి తేజః పరస్యాం దేవతాయాం" "ఓశాంతుఁడా! మరణకాలము

నందు వాగింద్రియము మనమునందుఁ జేరును. మనస్సు ప్రాణమున నేకీభ వించును. ప్రాణము తేజస్సునందును ఆతేజస్సు పరమాత్మయందును లీన మగును." అని శ్రుతిచేఁ జెప్పఁబడి యున్నది. ఇది ప్రథమాధికరణ మగు టచే స్వతంత్రముగ నీవాక్యమునుగూర్చి యిందు విచారింపఁబడును. "వాక్కు మనస్సునందుఁ జేరు ననిన వాగింద్రియము మనస్సునందు లయము నొందు ననియా? లేక వాగింద్రియవ్యాపారము మనస్సునందు లీన మగు ననియుఁ జెప్పవలయునా" అనుసంశయము నివారింపఁబడును.

పూర్వ:—"విచారించిన వాగింద్రియమే మనస్సునందు లీన మగు ననవలయును. శ్రుతి యట్లే కదా చెప్పుచున్నది. ఇచ్చట వృత్తిప్రస్తావ మును దెచ్చిన శ్రుతిని విడిచి లక్షణావృత్తి యంగీకరింపఁబడిన ట్లగును. అది విరుద్ధము కదా! కావున నిర్వివాదముగ వాగింద్రియము మనస్సు నందు లీన మగును. వాక్కునకు మనస్సు ఉపాదానకారణము కాక పోవుటచే 'ప్రతిపదార్థంబును ఉపాదానకారణమునందే లయము నొందవల యును' అనులోకన్యాయము నిలువదు."

## అ-౪. పా-౨. సూ-౧.

అవతారిక:—అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౪౬౭. వాఙ్మనసి దర్శనాచ్ఛబ్దాచ్చ. ౪. ౨. ౧.

తాత్పర్యము:—ఇచ్చట సంశయింపవలసినపని లేదు. వాగింద్రియ వ్యాపారములే మనస్సునందు లీన మగును. "ఈసూత్రమున వాగిం ద్రియవ్యాపార మనునర్థ మెటనుండి వచ్చెను" అనియెదవేమొ. అది యధ్యాహారముచే జెప్పఁబడెను. సూత్రకారుఁడు ఎనిమిదవయధికరణ మున "అవిభాగో వచనాత్" అని యీవిషయమునే స్పష్టము చేసి యున్నాఁడు. కావున నిచ్చట వాగ్వ్యాపారలయమే యాయనకు నుద్దేశ మైనట్లు తోఁచుచున్నది. ఆయధికరణమున (ఎనిమిదవయధికరణమున) వాగాదీంద్రియములకు పరమేశ్వరునియందు స్వస్వరూపములతోఁ బున రుద్ధానశూన్యముగ లయము కలుగు నని బ్రహ్మవేత్తవిషయ మభివర్ణింపఁ బడియున్నది. ఇచ్చటఁగూడ నట్టిలయమే యుద్దేశింపఁబడియుండునేని యిచ్చటఁ బ్రత్యేకముగ నవిభాగమును (నదులు సముద్రమునఁ గలసి

నట్లు బ్రహ్మమునఁ గలయుటను ఇదియే యాయధికరణమునఁ జెప్పఁబడిన లయము.) ప్రస్తావించుట యేల? ఈ కారణమువలన నచ్చటమాత్రమే యింద్రియములకు లయము చెప్పఁబడె ననియు నిచ్చట వృత్తిలయము మాత్రమే వర్ణింపఁబడె ననియు తోఁచుచున్నది. ఈ కారణమువలన "మనోవృత్తి యుండఁగనే వాగ్వృత్తి నశించును." అనుటయే యిచ్చటి సూత్రార్థము; ఇదియే "వాక్కు మనస్సునందు చేరును" అను శ్రుతికి నర్థము.

ఈవిషయము ప్రత్యక్షశబ్దప్రమాణములచేఁ దెలియఁబడుచున్నది. లోకమున మృతినొందువానినిఁ జూచినచో నీవిషయము (మనోవృత్తికంటె ముందుగ వాగ్వృత్తి లీనమగు ననువిషయము) ప్రత్యక్షమగుచునే యున్నదికదా! శ్రుతియుఁ బ్రత్యక్షసిద్ధ మగువిషయము నట్లే యనువాదము చేయఁగలదుగాని భిన్నముగఁ జేయలేదు. వాగింద్రియము లయమగుట బ్రత్యక్షమున లేదు కదా! కావున శ్రుతియుఁ బైవిషయమునే బోధించుచున్నది యనవలయును. "ప్రత్యక్షశ్రుతినిఁ బట్టి చూచినట్లు లేదని యిదివఱకే చెప్పితిమి. వాగ్వృత్తిలయము ప్రత్యక్షమే యైనను యింద్రియమునుఁ గూర్చి యేమియు దెలియుట లేదు. 'ఇంద్రియములు మనస్సున లయము నొందవు' అనువిషయము స్పష్ట మైననే కాని ప్రత్యక్షముగ నుండిననే కాని మీసిద్ధాంతము (ఇంద్రియస్వరూపలయభావసిద్ధాంతము) నిలువదు కదా" అనియెదవేమొ వినుము. "ప్రతి పదార్థంబును తనయుపాదానకారణమునందు మాత్రమే స్వరూపముతో లయమునొందునుగాని మఱియొకస్థలమున నట్లు చెందదు" అనున్యాయ మొక్కటి లోకప్రసిద్ధమై యున్నది. ఈవేదము కూడ దాని ననుసరించియే ప్రవర్తించును. అట్లే ప్రవర్తింపవలయును. ప్రమాణాంతరసిద్ధము లగు విషయముల నంగీకరింపకున్న వేదమునకు నప్రామాణ్యము రావలసి వచ్చును. ఇది యిష్టముకాదు కదా! కావున నిర్వివాదముగ మనస్సునందు లీనమగునది వాగ్వృత్తియే కాని యింద్రియము కాదు. ఇంద్రియమునకు మనస్సు ఉపాదానకారణము కాదు కదా! "ఇట్లయిన వృత్తిమాత్ర మామనస్సునం దెట్లు లీనమగును?" అనియెదవేమొ అందు విరోధము లేదు. వృత్తి లీనమగుట యనఁగా జనింపకుండుటయే ప్రతిబంధింపఁబడుటయే కాని విరుగఁగొట్టఁబడినఘటము మృత్తికయందు లీనమైనట్లు లీనమగుటకాదు. దీనికి నేదిన్యైన నొక్కటియే కదా! కావున నెట్లును ఇచ్చట

చెప్పఁబడినది వృత్తిలయమే కాని స్వరూపలయము కాదు. "శ్రుతియం దీవిషయము ప్రత్యక్షముగ లేదే" యనియెదవేమో. లేకున్నను పై యుక్తుల ననుసరించి కల్పింపవలయును. యుక్తికి ననుకూలమై యున్నప్పుడు లక్షణను గ్రహించుటయు విరుద్ధము కానేరదు. వృత్తికిని దానితోఁ గూడినధర్మికిని అభేదము చెప్పఁబడియుండవచ్చునుకదా! కావున నీ ప్రత్యక్షశబ్దమువలన పైసిద్ధాంతమే స్థిరపడినది.

## అ_౪. పా_౨. సూ_౨.

అవతారిక:—"ప్రశ్నోపనిషత్తునందు 'ఇంద్రియై ర్మనసి సంపద్యమానైః' 'మనస్సుతో నేకీభవించిన యింద్రియములచేత' అని సర్వేంద్రియలయము చెప్పఁబడి యున్నది. ప్రస్తుతశ్రుతియందు కేవలమనోలయము మాత్రమే వర్ణింపఁబడి యున్నది. ఇందు నిర్ణయ మెట్లు?" అని సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౪౯౯. అత ఏవ చ సర్వా ణ్యను. ౪. ౨. ౨.

తాత్పర్యము:—ఇచ్చట సంశయ మేమియు లేదు. పైన నిరూపించిన హేతువులవలన సర్వేంద్రియములకును చిత్తమునందు వృత్తిలయము కల దని యంగీకరింపవచ్చును. మనస్సు సంకల్పించుసామర్థ్యముతో నుండఁగనే మరణావస్థయం దున్నవానికి చెవులు వినరావు; కన్నులు గానరావు; సర్వేంద్రియవృత్తులు ఇట్లే నశించు ననుట ప్రత్యక్షమయ్యేయున్నది. పైన నిరూపించినట్లే *ప్రకృతివికారభావము లేకుండుటచే నింద్రియములకు స్వరూపలయము సంభవింపదు; లోకన్యాయమునకు విరుద్ధముగ శ్రుతియు దానిని బోధింపదు. కావున నాశ్రుతివాక్యమునకుఁ గూడ ధర్మధర్ము లయభేదమే యభిప్రాయము కావున నన్నియింద్రియముల విషయమునందును వృత్తిలయమే గ్రహింపఁబడవలయును. "వాఙ్మనసి" యనుశ్రుతి దృష్టాంతార్థమై చెప్పఁబడినదియే యని తెలిసికొనవలయును. వాగింద్రియవృత్తి లీన మైనట్లే తక్కినవానివృత్తులు లీన మగు నని చెప్పుటకు నాశ్రుతి ప్రయోగింపఁబడె నని తెలిసికొనవలయును.

---

ప్రకృతివికారభావము (అ-౨. పా-౧. సూ-౬. పేజీ-560 చూ.)

## ౨. మనోధికరణము.

విషయసంశయము:—పూర్వాధికరణమున "వా జ్మనసి సంపద్యతే" అనువాక్యముయొక్క యర్థము నిర్ణయింపఁబడును. ఇచ్చట "మనః ప్రాణే" అనువాక్యముయొక్క యర్థము విమర్శింపఁబడును. "ఈమనస్సయినను ప్రాణమునందు స్వస్వరూపముతో లయించునా? లేక దానివృత్తిమాత్రమే ప్రాణమున లయించునా?" అనుసంశయము నివారింపఁబడును.

సంగతిపూర్వపక్షము:—"ఉపాదానకారణమునందు మాత్రమే పదార్థములు లయింపవలయును కావునను ఇంద్రియమనస్సునకు నట్టి ప్రకృతివికారభావము లేదు కావునను వాగాదులకు స్వరూపలయము సంభవింపదని పూర్వాధికరణమున నిర్ణయించి యున్నారు. ఇచ్చట మాత్రము మనఃప్రాణములకు ప్రకృతివికారభావము కలదు. 'అన్నమయం హి సోమ్యమనః ఆపోమయాః ప్రాణాః' 'ఓశాంతుఁడా మనస్సు అన్నమయము ప్రాణములు జలమయములు' అనియు 'తా (ఆప) అన్న మసృజంత' 'ఆజలములు అన్నమును సృజించెను' అనియు వేదమున చెప్పఁబడి యున్నది. జలము అన్నమున కుపాదానకారణ మగుటచే జలమయ మగుప్రాణము అన్నమయ మగుమనస్సునకు నుపాదానకారణము గావచ్చును కావున నిర్వివాదముగ మనస్సు ప్రాణమునందు స్వస్వరూపముతో లయము నొందవచ్చును. ఇట్లయినశ్రుతికిని లక్షణ నంగీకరింపవలసినపని యుండదు."

### అ_౪. పా_౨. సూ_౩.

అవతారిక:—అనిన నీపూర్వపక్షము ఖండించుచున్నాఁడు.

### ౫౦౦. తన్మనః ప్రాణ ఉత్తరాత్. ౪. ౨. ౩.

తాత్పర్యము:—పూర్వాధికరణమున వర్ణించినవిధముగ సర్వేంద్రియవృత్తుల నుపసంహరించుకొనిన మనస్సుకూడ బ్రాణమునందు తన వృత్తినిమాత్రము లయము నొందించును. ఆప్రాణము తనవ్యాపారము నాచరించుచు నుండఁగనే మనోవ్యాపార మడఁగు ననుట సుషుప్తికాలమునందుఁ గూడ ప్రత్యక్షమై యున్నది యని యుత్తరవాక్యములయందు

నిరూపింపఁబడి యున్నది. మరణకాలమునందలిస్థితిగూడ నిట్టిదియే. మఱియు నామనస్సు ప్రాణము లీనమగు ననుటకు వీలు లేదు. ఇచ్చటఁ గూడ వీనికిఁ బ్రకృతివికారభావము లేదు. "కల దని నిరూపించితిని కదా!" అనియెదవేమో యానిరూపణ యుక్తమైనది కాదు. జలాన్నములకు ప్రకృతి వికారభావ ముండినంతమాత్రమున వానివికారము లగుప్రాణ మనస్సులకు ప్రకృతివికారభావ ముండదు. అట్లున్నదని సాధింపఁబోయిన నతిప్రసంగ దోషమువచ్చును. కావున దేనికి నేది ప్రత్యక్షముగ నుపాదానకారణమో దానియందేగాని యాకార్యము జనింపదు. ఇట్లు చూచిన మనస్సు తన కుపాదానకారణ మగునన్నమునందును ఆయన్నము జలమునందును లీనము కావలసివచ్చును; ప్రాణముఁగూడ తనకుఁ గారణము లగుటచే నాజలములయందే లీనము కావలయును కదా! ఇట్లయిన బ్రాణమనస్సునకు సంబంధ మెట్లు కలుగును? "శ్రుతియందు ప్రత్యక్షముగ వృత్తిలయము చెప్పఁబడి యుండలేదు కదా!" అనియెద వేమో యావిషయముఁ బూర్వాధికరణమునందే వివరింపఁబడెను. ధర్మ ధర్ములకు నభేదము నుద్దేశించియైనను శ్రుతి యట్లు చెప్పియుండవచ్చు నని సిద్ధాంతము చేయఁబడెను కావున మనోవృత్తిమాత్రమే ప్రాణమున లీన మగును కాని స్వరూపము కాదు.

---

## 3. అధ్యక్షాధికరణము.

విషయసంశయ సంగతులు:—ఈయధికరణమున "ప్రాణ స్తేజసి" అనుమూఁడవవాక్యము విచారింపఁబడును. ఉపాదానకారణమునందు తప్ప మఱియొకస్థలమునఁ బదార్థమునకు స్వరూపలయము సంభవింప దనుట యిదివఱకే సిద్ధమై యుండుటచే "ఇచ్చటఁ జెప్పఁబడినలయము వృత్తిలయమా? స్వరూపలయమా?" అనువిషయమున సంశయము లేదు. తేజశ్శబ్దము అగ్నిభూతమునందు *రూఢమై యుండుటచేతను "త ముత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి" "జీవుఁడు నిర్గమించుచుండ ముఖ్యప్రాణ మాతనితోఁ గూడి నిర్గమించును" అను మొదలగు శ్రుతులు ప్రాణమునకు జీవునితోమాత్రమే సంబంధము కల దనుటవలనను "ఇచ్చట తేజశ్శబ్ద

* రూఢము=రూఢి (అ-1. పా-2. పేజీ-163 చూ.)

మునకు జీవుఁ డర్థమో లేక నగ్ని యే యర్థమో" యను విషయమున సంశ యము కలుగును. ఆసంశయ మిందు నిరాకరింపఁబడును. యీాయధికర ణము లన్నియు వాక్యక్రమము ననుసరించి వచ్చునవి గావున *వీనికి క్రమప్రాప్తియే సంగతి.

పూర్వపక్షము :— "విచారించిన నిచ్చటి తేజశ్శబ్దమునకు ముఖ్యార్థమును చెప్పుటయే యుక్తమని తోచుచున్నది. శ్రుతి యిచ్చట నంతమాత్రమే చెప్పుచున్నది. అధికమును కల్పింపఁజూచుట యన్యాయ మగును. 'ఇచ్చట లేకున్నను మఱియొకస్థలమున జీవవిషయక మగుశ్రుతి కూడ కలదు కదా!' యనియెదవేమో దానికిని ఈసిద్ధాంతమువలన విరోధము సంభవింపదు. ఆతఁడు సర్వమునకు నధికారి యగుటచే నీప్రాణము తేజోమూలమున నతనియందుఁ జేరవచ్చును. మొట్టమొదట తేజస్సునందు లయమునొంది పిదప నాతేజస్సుతోఁ గూడ జీవునియందు లీనము కావచ్చును. కావున నిట్లు చెప్పినచో నన్నివిధముల ననుకూల ముగ నుండును."

## అ-౪. పా-౨. సూ-౪.

అవతారిక.—అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౫౦౧. సోఽధ్యక్షే తదుపగమాదిభ్యః.

## ౪. ౨. ౪.

తాత్పర్యము:—ఇట్లు తలంపకూడదు. ఆప్రాణము జీవునియందే లయము నొందును. అనేకశ్రుతు లీవిషయము నిట్లే బోధించుచున్నవి. "ఏవ మే వేమ మాత్మాన మంతకాలే సర్వే ప్రాణా అభిసమాయంతి యత్రైతదూర్ధ్వోచ్ఛ్వాసీ భవతి" "ఈజీవుఁడు నిర్గమించుటకు నెప్పుడు ప్రయత్నించునో యప్పుడు భృత్యులు రాజుకడకుఁ జేరునట్లు సర్వేంద్రియ ములును ముఖ్యప్రాణంబును గూడ నాతనికడకుఁ జేరును" అని సామాన్య ముగను "త ముత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి" అని విశేష ముగనుఁ గూడ శ్రుతి చెప్పుచున్నది. "ప్రాణ మనూత్క్రామంతం సర్వే

* క్రమప్రాప్తి యనఁగా వరుసగా నుండువానిని వరుసగా వివరించుట.

ప్రాణా అనూత్క్రామంతి" "ముఖ్యప్రాణము నిర్గమింపఁ బోవుచుండ సర్వేంద్రియములును నిర్గమించును" అని యింద్రియవిషయ మీవిశేష శ్రుతియందు ప్రత్యేకముగ వివరింపఁబడియున్నది. అది యట్లుండె. పైన వర్ణించినవిధముగ ముఖ్యప్రాణమునకు జీవోపగమనంబును తదనుసరణం బును మాత్రమే గాక మఱియొకశ్రుతిచే 'స విజ్ఞానో భవతి' అని యాతని యందలి స్థితియును (జీవునియందే యుండుటయును) వర్ణింపఁబడియున్నది. విజ్ఞాన మనఁగా సంకల్ప మైనను "విజ్ఞాయతే అనే నేతి విజ్ఞానం" "దీనిచేఁ బదార్థములు తెలియఁబడును గావున విజ్ఞానము" అను వ్యుత్పత్తిచే నింద్రియసమూహ మైనను వానితోఁ గూడిన ప్రాణముయొక్క సంస్థానమే యీశ్రుతియందు వర్ణింపఁబడి యున్నది. కావున శ్రుత్యనుసారముగఁ "బ్రాణవృత్తి జీవునియందే లయ మగును" అనియే యంగీకరించి తీర వలయును. సమాన మగువిద్యయందు శాఖాంతరములలోఁ జెప్పఁబడి యున్నవిశేషములను గూడ గ్రహింపవలయును. కావున నొక్కస్థలమున విస్పష్టముగ లేకున్నను ఈవిషయము మఱియొకస్థలమునుండి గ్రహింపఁ బడవలసినదియే.

"అయినను ప్రస్తుతశ్రుతియందు ఈవిషయము ప్రత్యక్షముగ లేదు. తేజశ్శబ్దము జీవవాచకము కాదు కదా!" అనియెదవేమో యిందు దోషము లేదు. తేజ మనఁగా యుష్ణత్వమే యైనను అది జీవుఁడు లేనప్పుడు దేహమునఁ గానరాదు. గావున నాశబ్దముతో (తేజశ్శబ్దముతో) జీవుఁడు పరిగ్రహింపఁబడి యుండవచ్చును. ఉత్క్రమణాది వ్యవహారములకును జీవుఁడేకదా ప్రధానము. కావున మాసిద్ధాంతమున లోప మేమియు లేదు. మఱియు మీపక్షము ననుసరించి ప్రాణము తేజస్సునందే లీనమగు నని యంగీకరించినను తేజస్సు జీవునియందు లీనమగునది కాదు. జీవుఁడు దాని యుపాదానకారణము కాకుండుటచే నందు దానికి స్వరూపలయము లేదు. ఉష్ణత్వము పోయినపిదప జీవుఁ డుండకపోవుటచే వృత్తిలయముఁ గూడ సంభవింపదు. మనోవృత్తి యున్నప్పుడే యింద్రియవృత్తులు నశించు ననియును ప్రాణవృత్తి యున్నప్పుడే సుషుప్త్యవస్థయందువలె మనోవృత్తి నశించు ననియును మాత్రమే కదా పూర్వాధికరణములయందు వృత్తి లయము సిద్ధాంతము చేయఁబడెను. కావున నిర్వివాదముగఁ బ్రాణవృత్తి జీవునియందే యేకీభవించును.

## అ-౪. పా-౨. సూ-౫.

అవతారిక:—“ ఇట్లైన తేజశ్శబ్దముయొక్క ముఖ్యార్థమునకు బాధ కలుగును కదా!” యనిన నట్లును కలుగ నక్కఱలే దని చెప్పుచున్నాఁడు.

---

## ౫౦౨. భూతేషు తచ్ఛ్రుతేః. ౪. ౨. ౫.

తాత్పర్యము:—బాగుగ విచారించిన నిచ్చట తేజశ్శబ్దమునకు నౌపచారికార్థమును గూడఁ జెప్ప నక్కఱ లేదు. తేజ స్సనఁగా నగ్నిభూత మగుటచే నాశబ్దమువలన సర్వభూతముల గ్రహింపవచ్చును. మరణకాలమునందు జీవుఁడు భూతసూక్ష్మములచేఁ బరివేష్టితుఁడై యుండు నని తదనంతర ప్రతిపత్త్యధికరణమున (3. ౧. ౧) నిరూపించి యున్నాము. కావున నాభూతము లాజీవునకు నుపాధులు. కావున జీవునిఁ జెందినను ముఖ్యప్రాణము తదుపాధు లగుభూతముల జెందినదియె యగును. కాశి నుండి ప్రయాణమైనవాఁడు జగన్నాథక్షేత్రమును జేరి యటనుండి భద్రాచలమునకు వచ్చినను భద్రాచలమునకు వచ్చినవాఁడే యగునట్లు జీవునిఁ జెంది పిదప భూతములను జెందినను ముఖ్యప్రాణము భూతములను జెందినదియే యగును. ఆభూతములను చెప్పుటకై తేజశ్శబ్దము నుపయోగించినది కావున నీశ్రుతియు నౌపచారికము కా నక్కఱ లేదు. కావున మాసిద్ధాంతమునకు నెట్లును భంగము కాదు. తేజశ్శబ్దమునకు ముఖ్యార్థమును గ్రహించినను ఔపచారికార్థమును గ్రహించినను మావాదమునకు భంగము లేదు. భూతముల నాశ్రయించి యున్నది జీవుఁడే ప్రాణవృత్తి జీవునియందే లయ మగుచున్నది. ఇట్లైనను పరంపరాసంబంధము నాశ్రయించి శ్రుతి ప్రాణమునకు తేజస్సంబంధమును చెప్పుచున్నది యని తెలిసికొనవలయును. జీవునియందే ప్రాణవృత్తి లయింపవలయును గాని తేజస్సునందు కా దని పైసూత్రమునందే శ్రుతియుక్తులతో నిరూపించి యున్నాము. కావున మాసిద్ధాంతమునకు నెట్లును భంగము లేదు.

---

## అ-౪. పా-౨. సూ-౬.

అవతారిక:—"ఇది యెట్లు? ఈశ్రుతియందు తేజశ్శబ్ద మొక్కటియే కలదుగాని పంచభూతప్రస్తావము లేదు కదా! పంచభూత విషయము నెట్లు ప్రస్తావింపఁగలిగితిరి" అనిన చెప్పుచున్నాఁడు.

## ౫౦౩. నైకస్మిన్దర్శయతో హి. ౪. ౨. ౬.

తాత్పర్యము:—జీవుఁడు భూతములయందు నిలిచియుండు నను విషయము సిద్ధాంత మైనపిదప నీసంశయము కలుగుటకే వీలు లేదు. మరణావస్థయందు జీవునకు నాశ్రయము లగునవి శరీరాంతరమును కల్పింపఁగల భూతములు. అవి యైదుగా నుండి తీరవలయును. దేహ మట్లే పంచభూతాత్మకముగానే) గానవచ్చుచున్నదికదా! కావున నగ్నిభూత మొక్కటియే యప్పుడు కల దనుట విరుద్ధ మగుటచే దానియందుమాత్రమే జీవుఁడు కలఁ డనుటయు విరుద్ధమే. ఈవిషయమునే (పంచభూత సంయుక్తుఁడై మాత్రమే జీవుఁడు ఒక దేహమునుండి మఱియొక దేహమునకుఁబోవు ననువిషయమునే) పంచాగ్నివిద్యయందలి ప్రశ్నోత్తరములు స్పష్టము చేయుచున్నవి; తదనంతరప్రతిపత్త్యధికరణమున (౩-౧-౨) వానిని సవిమర్శముగ నిరూపించియున్నాము. మఱియు శ్రుతులుకూడ "పృథ్వీమయ ఆపోమయోవాయుమయ ఆకాశమయ స్తేజోమయః" అని శరీరమును పంచభూతాత్మకముగఁ జెప్పుటచేత జీవుఁడు వాని నాశ్రయించియే యుండు నని తెలుచున్నవి. స్మృతులును "అణ్వ్యో మాత్రావినాశిన్యో దశార్ధానాం తుయాః స్మృతాః, తాభిః సార్ధ మిదం సర్వం సంభవ త్యనుపూర్వశః" "అతిసూక్ష్ములై మరణకాలమునందును నశింపనివి యై యుండు పంచభూతమాత్ర లేవికలవో వానితోఁగూడ క్రమక్రమముగ నీప్రపంచ మంతయు నుద్భవించును" అని యీవిషయమునే యనువాదముఁ జేయుచున్నవి. కావున నొక్కభూతమునే గ్రహించినఁ బ్రయోజనము లేదు కావున నాపదము నుపలక్షణముగా గ్రహించి సర్వభూతములును పరిగ్రహింపఁబడెను. కావున నిందు విరోధ మేమియు లేదు.

"సరియే మఱియొకశ్రుతియందు జీవుఁడు మరణకాలమున తనపూర్వకర్మము నాశ్రయించియుండు నని చెప్పఁబడియున్నది. దానికిని ప్రస్తుత

శ్రుతివాక్యమునకును విరోధము కలదు కదా!" అనియెదవేమో వినుము. అచ్చటఁ గర్మలు లేకున్న సంసార ప్రవృత్తి కలుగదు కావున నట్లు చెప్పఁబడెను. సంసారము లేకున్న జీవుఁడు లేఁడు కావున నట్లు చెప్పఁబడెను. ఇంతమాత్రమువలన మఱియొకయాశ్రయ మాతనికి లేకపోవ నక్కఱ లేదు. ఈశ్రుతియం దట్టినిషేధ మేదియు లేదు కదా! కావున జీవుఁడు పంచ భూతముల నాశ్రయించి యున్నాఁ డనవచ్చును. అవి శరీరారంభమునకు గారణములగుటచే వానినిఁ గూడ నవశ్యమాశ్రయించి తీరవలయును కదా! సమస్తఫలదాయక మగుటచే గర్మ యొకవేళ నధిక మైన నగును గాక ఇంత మాత్రమున భూతసహాయము లేకపోవదు. ప్రపంచమున కవియే కదా యుపాదానకారణములు. మఱియు వేద మీకర్మను ప్రశంసించి యున్నది; ఉత్తమ మని చెప్పియున్నది. రెండవపదార్థము లేకున్నచో నిట్లు చెప్పుటకు వీలు లేదు కదా! కావున నీకారణమువలన "జీవుఁడు పంచభూతముల నాశ్రయించి యున్నాఁడు. ప్రాణవృత్తులు జీవునియందే లయమగును. ఒక్క తేజస్సుమాత్రమే శ్రుతియందు చెప్పఁబడి యున్నను పంచభూతముల గ్రహింపవలయును" అను నీసిద్ధాంతమునకు హాని లేదు.

---

## ౭. ఆసృత్యుపక్రమాధికరణము.

విషయసంగతిసంశయములు:—ఈయధికరణమున నీయుత్క్రాంతి నాధారముచేసి కొంత విచారింపఁబడును. ఈవిచారమునకుఁ బూర్వాధి కరణసిద్ధాంతము లాధార మగుటచే వానికిని దీనికిని గలసంబంధ*ముపజీ వ్యోపజీవకభావసంబంధము. "ఈచెప్పఁబడినయుత్క్రాంతి సగుణోపాసకు నకు నుపాసనాశూన్యునకుఁగూడ సంబంధించినదియా? లేక నం దొక్కనికి మాత్రమే సంబంధించినదియా?" అనుసంశయము నివారింపఁబడును.

పూర్వపక్షము:—"విచారించిన నీయుత్క్రాంతియు నజ్ఞానులకు మాత్రమే సంబంధించినది యనవలయును. ఏల యనిన: ఈయుత్క్రాంతి భూతసూక్ష్మముల నాశ్రయించి యున్నది. భూతసూక్ష్మముల నాశ్ర

* ఉపజీవ్యోపజీవకభావము (అ-౩. పా-౨. పేజీ-563 చూ.)

యించిన పునర్జన్మము కలుగవలయు ననుట నిస్సంశయము. దేహాంతర మును కల్పించుట కయ్యే కదా భూతసూక్ష్మములు కావలయును. కావున నెవ్వనికిఁ బునర్జన్మము కలుగుటకు వీలు కలదో, వానికి మాత్రమే యుత్క్రాంతి కల దనవలయును. 'అమృతత్వం హి విద్వా నశ్నుతే' అనుశ్రుతిచే విద్వాంసునకు ముక్తియేగాని పునర్జన్మము లేదని తోఁచు చున్నది. కావున నుత్క్రాంతి వారికి సంబంధింపదు.

'ఇది యుక్తము కాదు. ఈయుత్క్రాంతి విద్యాప్రకరణమునందు చెప్పఁబడి యున్నది. కావున నిది యవశ్యముగ విద్వాంసునకే సంబంధింప వలయును.' అనియెద వేమో. అది యుక్తము కానేరదు. స్వప్నసుషు ప్త్యాద్యవస్థలనువలె నీయుత్క్రాంతినిఁగూడ బ్రహ్మస్వరూపార్థమై వేదము విద్యాప్రకరణమునఁ జెప్పియున్నది. ఎట్లనిన:—'యత్రైత త్పురుషః స్వపితినామ, అశిశిషతి నామ. పిపాసతి నామ' 'ఎచ్చట నీపురుషుఁడు నిదురించునో, భుజింపనిశ్చయించునో, పానముఁ జేయఁదలంచునో అదియే బ్రహ్మము (బ్రహ్మమునందే సర్వకార్యముల నాచరించుచున్నా రనుట)' అని పరమేశ్వరరూపమును మాహాత్మ్యమును వెల్లడించుటకై లోకస్థితుల ననువాదము చేసినట్లు ఇచ్చటఁగూడ లోకసిద్ధమగునుత్క్రాం తినే యనువాదము చేయుచున్నది. అసుషుప్త్యాదికీర్తనస్థలములయందు తత్తదధికారు లగుపురుషుల నిర్ణయించి విధించుటకునెట్లు నిర్దేశింపఁబడ లేదో అట్లే యిచ్చటఁగూడ నుత్క్రాంత్యధికారు లుద్దేశింపఁబడ లేదు. 'ఏ బ్రహ్మ మునందు మృతునితేజస్సు ప్రవేశించునో అట్టిబ్రహ్మమే యాత్మ. అతఁడే నీవు' అని నిరూపించుటకై మాత్రమే నీయుత్క్రాంతి వర్ణింపఁబడెను. అచ్చటఁగూడ సుషుప్త్యాదులవర్ణన మిట్టిదియే కదా! కావున నిర్వివాదముగ నుత్క్రాంతి యజ్ఞానులకు మాత్రము సంబంధించినది. లోకసిద్ధో త్క్రాంతి యనఁగా పామరజనములందు ప్రసిద్ధమై యున్నయుత్క్రాంతియే కదా! ఇదియునుగాక 'న తస్య ప్రాణ ఉత్క్రామంతి' అని ప్రత్యక్షముగనే జ్ఞానికి నుత్క్రాంతి లే దనువిషయము చెప్పఁబడి యున్నది. కావున నియ తముగ నీయుత్క్రాంతి యజ్ఞానికి సంబంధించినదియే."

## అ-౪. పా-౨. సూ-౭.

అవతారిక:—అనిన నీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

# ౫౦౪. సమానా చాసృత్యుపక్రమా దమృతత్వం చానుపోష్య. ౪. ౨. ౭.

తాత్పర్యము:—ఇట్లు చెప్ప నక్కఱ లేదు. మోక్షమార్గ మగునాడీ ద్వారము నాశ్రయించినంతవఱకు జ్ఞానికిఁగాని యజ్ఞానికిఁగాని యుత్క్రాంతి సమానముగానే యుండవలయు నని తోఁచుచున్నది. శ్రుతియందు అధికారిభేద మేమియుఁ జెప్పఁబడి యుండకపోవుటచే నిట్లు తోఁచుచున్నది. విద్వాంసుఁడగువాఁడు ఉత్క్రమణమునకుఁ బిదప భూత సూక్ష్మములతోఁ గలసియే ధ్యానముచేఁ బ్రకాశింపఁజేయఁబడి యున్న నాడీద్వారము నాశ్రయించును; అజ్ఞాని యగువాఁ డట్లు కాక నాభూత సూక్ష్మములతోనే గూడి పితృలోకాదులకు జని మఱల జన్మించును. "జ్ఞానికి భూతసూక్ష్మాశ్రయ మేటికి?" అనియెదవేమొ వినుము. భూత సూక్ష్మాశ్రయమువలనఁ బునర్జన్మమే రావలయు నను నియమము లేదని పూర్వముననే వివరించి యున్నాము కదా! ఇక జ్ఞానికి దానితోఁ గల సంబంధమును వినుము. విద్యలు పరాపరభేదములతో రెండువిధము లనియు నందు పరావిద్య పరబ్రహ్మస్వరూపమును ప్రత్యక్షముగ నెఱింగించు ననియు నపరవిద్య పరంపరగా నెఱింగించు ననియు నిదివఱకే తెలిపి యున్నాము. శ్రుతియును సగుణోపాసకులకు ముక్తిప్రాప్తికై నాడీ మార్గమును చెప్పుచున్నది. పరమార్థముక్తి బ్రహ్మస్వరూపమే కావున దానిని బొందుటకై మార్గాంతర మక్కఱ లేదు కదా! కావున సగుణో పాసనలవలనఁ గలుగుముక్తి యేదియోయొకవిధముగ నాపేక్షికమై (అనఁగా పరిపూర్ణముగాక కొంత గలదియై) మాత్రమే యుండి తీరవలయును. మొట్టమొదట బ్రహ్మలోకప్రాప్తియుఁ గల్పాంతమువఱకు నచ్చట నివ సించుటయు సర్వభూతవినాశ మైనప్పుడు చతుర్ముఖునితోఁ గూడ ముక్తి నొందుటయుఁ గలదని క్రమముక్తినిఁగూర్చి చెప్పఁబడియే యున్నదికదా! కావున లోకప్రాప్త్యాదులకు భూతసూక్ష్మములు కావలసియే యుండును. ఇట్లగుటచే సగుణోపాసకులకుఁ గూడ భూతసూక్ష్మములతో సంబంధము కలుగవచ్చును. వీరికిని మిథ్యాజ్ఞానము సంపూర్ణముగ నశింపలేదు; ఆశ్ర యము లేక కేవలప్రాణములు లోకాంతరములకుఁ బోగల వనుటయు నసం

యించిన పునర్జన్మము కలుగవలయు ననుట నిస్సంశయము. దేహాంతర మును కల్పించుట కయ్యేకదా భూతసూక్ష్మములు కావలయును. కావున నెవ్వనికిఁ బునర్జన్మము కలుగుటకు వీలు కలదో, వానికి మాత్రమే యుత్క్రాంతి కల దనవలయును. 'అమృతత్వం హి విద్వా నశ్నుతే' అను శ్రుతిచే విద్వాంసునకు ముక్తియేగాని పునర్జన్మము లేదని తోఁచు చున్నది. కావున నుత్క్రాంతి వారికి సంబంధింపదు.

'ఇది యుక్తము కాదు. ఈయుత్క్రాంతి విద్యాప్రకరణమునందు చెప్పఁబడి యున్నది. కావున నిది యవశ్యముగ విద్వాంసునకే సంబంధింప వలయును.' అనియెద వేమొ. అది యుక్తము కానేరదు. స్వప్నసుషు ప్త్యాద్యవస్థలనువలె నీయుత్క్రాంతినిఁగూడ బ్రహ్మస్వరూపార్థమై వేదము విద్యాప్రకరణమునఁ జెప్పియున్నది. ఎట్లనిన:—'యత్రైత త్పురుషః స్వపితినామ, అశిశిషతి నామ. పిపాసతి నామ' 'ఎచ్చట నీపురుషుఁడు నిదురించునో, భుజింపనిశ్చయించునో, పానముఁ జేయదలంచునో అదియే బ్రహ్మము (బ్రహ్మమునందే సర్వకార్యముల నాచరించుచున్నా రనుట)' అని పరమేశ్వరరూపమును మాహాత్మ్యమును వెల్లడించుటకై లోకస్థితుల ననువాదము చేసినట్లు ఇచ్చటఁగూడ లోకసిద్ధ మగునుత్క్రాం తినే యనువాదము చేయుచున్నది. ఆసుషుప్త్యాది కీర్తనస్థలములయందు తత్తదధికారు లగుపురుషుల నిర్ణయించి విధించుటకునెట్లు ద్దేశింపఁబడ లేదో అట్లే యిచ్చటఁగూడ నుత్క్రాంత్యధికారు లుద్దేశింపఁబడలేదు. 'ఏబ్రహ్మ మునందు మృతునితేజస్సు ప్రవేశించునో అట్టిబ్రహ్మమే యాత్మ. ఆతఁడే నీవు' అని నిరూపించుటకై మాత్రమే నీయుత్క్రాంతి వర్ణింపఁబడెను. అచ్చటఁగూడ సుషుప్త్యాదులవర్ణన మిట్టిదియే కదా! కావున నిర్వివాదముగ నుత్క్రాంతి యజ్ఞానులకు మాత్రము సంబంధించినది. లోకసిద్ధో త్క్రాంతి యనఁగా పామరజనములందు ప్రసిద్ధమై యున్న యుత్క్రాంతియే కదా! ఇదియునుగాక 'న తస్య ప్రాణ ఉత్క్రామంతి' అని ప్రత్యక్షముగనే జ్ఞానికి నుత్క్రాంతి లే దను విషయము చెప్పఁబడి యున్నది. కావున నియ తముగ నీయుత్క్రాంతి యజ్ఞానికి సంబంధించినదియే."

## అ-౪. పా-౨. సూ-౭.

అవతారిక:—అనిన నీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

# ౧౦౪. సమానా చాసృత్యుపక్రమా దమృతత్వం చానుపోష్య. ౪. ౨. ౭.

తాత్పర్యము:—ఇట్లు చెప్ప నక్కఱలేదు. మోక్షమార్గ మగునాడీ ద్వారము నాశ్రయించినంతవఱకు జ్ఞానికిఁగాని యజ్ఞానికిఁగాని యుత్క్రాంతి సమానముగానే యుండవలయు నని తోఁచుచున్నది. శ్రుతియందు అధికారిభేద మేమియుఁ జెప్పఁబడి యుండకపోవుటచే నిట్లు తోఁచుచున్నది. విద్వాంసుఁడగువాఁడు ఉత్క్రమణమునకుఁ బిదప భూత సూక్ష్మములతోఁ గలసియే ధ్యానముచేఁ బ్రకాశింపఁజేయఁబడి యున్న నాడీద్వారము నాశ్రయించును; అజ్ఞాని యగువాఁ డట్లు కాక నాభూత సూక్ష్మములతోనే గూడి పితృలోకాదులకు జని మఱల జన్మించును. "జ్ఞానికి భూతసూక్ష్మాశ్రయ మేటికి?" అనియెదవేమొ వినుము. భూత సూక్ష్మాశ్రయమువలనఁ బునర్జన్మమే రావలయు నను నియమము లే దని పూర్వముననే వివరించి యున్నాము కదా! ఇక జ్ఞానికి దానితోఁ గల సంబంధమును వినుము. విద్యలు పరాపరభేదములతో రెండువిధము లనియు నందు పరావిద్య పరబ్రహ్మస్వరూపమును ప్రత్యక్షముగ నెఱిం గించు ననియు నపరవిద్య పరంపరగా నెఱింగించు ననియు నిదివఱకే తెలిపి యున్నాముఁ. శ్రుతియును సగుణోపాసకులకు ముక్తిప్రాప్తికై నాడీ మార్గమును చెప్పుచున్నది. పరమార్థముక్తి బ్రహ్మస్వరూపమే కావున దానిని బొందుటకై మార్గాంతర మక్కఱ లేదు కదా! కావున సగుణో పాసనలవలనఁ గలుగుముక్తి యేదియోయొకవిధముగ నాపేక్షికమై (అనఁగా పరిపూర్ణముగాక కొఱఁత గలదియై) మాత్రమే యుండి తీరవలయును. మొట్టమొదట బ్రహ్మలోకప్రాప్తియుఁ గల్పాంతమువఱకు నచ్చట నివ సించుటయు సర్వభూతవినాశ మైనప్పుడు చతుర్ముఖునితోఁ గూడ ముక్తి నొందుటయుఁ గలదని క్రమముక్తినిఁగూర్చి చెప్పఁబడియే యున్నదికదా! కావున లోకప్రాప్త్యాదులకు భూతసూక్ష్మములు కావలసియే యుండును. ఇట్లగుటచే సగుణోపాసకులకుఁ గూడ భూతసూక్ష్మములతో సంబంధము కలుగవచ్చును. వీరికిని మిథ్యాజ్ఞానము సంపూర్ణముగ నశింపలేదు; ఆశ్ర యము లేక కేవలప్రాణములు లోకాంతరములకుఁ బోఁగల వనుటయు నసం

భవము కదా కావున నిర్గుణోపాసకులకు తప్ప తక్కినవారల కందఱకు నుత్క్రాంతి గలదు; నాడీమార్గమును బొందునంతవఱకు నది ఏకవిధముగాఁ గూడ నుండును.

---

## ౬. సంసారవ్యపదేశాధికరణము

విషయ సంగతి సంశయ పూర్వపక్షములు:—ఈయధికరణమున "తేజః పరస్యాం దేవతాయాం" అనువాక్యభాగము విచారింపఁబడును. ఇప్పటికి చేయఁబడిన నిరూపణలవలననే దీనియర్థము స్పష్టమైనది. "వాగాదీంద్రియవృత్తులతోను ప్రాణవృత్తులతోను వానితోఁ గూడియున్న జీవునితోను గలసి భూతసూక్ష్మములతోఁ గూడి తేజస్సు (సూక్ష్మశరీరము) పరమేశ్వరునియందు లీన మగును" అనువిషయము స్పష్ట మైనది. అయినను "ఈలయము స్వరూపలయమా? లేక సావశేషలయమా? (ఉత్తరజన్మాదులకుఁ గారణమగునట్లు కొంతకొఱతతో మాత్రమే లయ మగుటయా?)" యనుసంశయము నిరాకరింపఁబడును. "మృతిఁజెందినవానియొక్క సూక్ష్మశరీర మప్పుడే పరమేశ్వరునియందు సంపూర్ణముగఁ గలసిపోవును గావున నెవ్వనికిని పునర్జన్మము లేదు; ముక్తియు నప్రయత్నముగ మరణమాత్రముననే కలుగును. ఈకారణమువలన గమనాగమనములే లేకపోవుటచే నుత్క్రాంతియే యుండదు" అనుటయే పూర్వపక్షమునకు ఫలము. "నిర్గుణబ్రహ్మవేత్తలకు మాత్రమే సర్వసంసారహేతువగు మిథ్యాజ్ఞానము నశించును గావున సూక్ష్మశరీరనాశము సంభవించును. తక్కినవారలకు నది సంభవింపదు. కావున పునర్జన్మాదులు నిర్వివాదముగ సంభవింపవచ్చును; ఉత్క్రాంతియు నవశ్యముగ యుండవచ్చును" అనునది సిద్ధాంతమునకుఁ బ్రయోజనము. పూర్వాధికరణములయందును నిట్లే యూహింపవలయును. "వాగాదులు స్వరూపలయమును జెందవచ్చును" అను పూర్వపక్షమునకుఁ బునర్జన్మాభావమే ఫల మనియు "వాగాదివృత్తులు మాత్రమే లయము నొందును కాని స్వరూపములు కావు" అనుసిద్ధాంతమునకుఁ బునర్జన్మాదితద్భావంబును ఫల మనియు మాత్రమే గ్రహింపవలయును. అధ్యక్షాధికరణమునందు మాత్ర మొకవిశేషము కలదు.

అచ్చటఁ జెప్పఁబడిన ప్రాణవృత్తిలయము మాత్రము సగుణవిద్యలయందు ధ్యానార్థమై (ప్రాణమునకు నాధారము జీవుఁ డని ధ్యానించుటకై) చెప్పఁ బడెను. దీనికిఁ (ఈయథ్యక్షాధికరణసిద్ధాంతమునకుఁ) గూడ పైన చూపఁ బడినదియు (పునర్జన్మాదిసిద్ధి) ఫలమేయైనను ధ్యానమే ముఖ్యఫల మనవల యును. అది యట్లుండె. "పూర్వాధికరణమున జ్ఞాన్యజ్ఞానులకు నిరుపురకు నుత్క్రాంతి గొంతవఱకు సమానమే యనియుఁ బిదప జ్ఞానికి బ్రహ్మలోక ప్రాప్తియు నజ్ఞానికి జన్మాంతరప్రాప్తియుఁ గలుగు ననియు సిద్ధాంతముఁ జేసియున్నారు. అది యుక్తము కాదు. మరణకాలమున సూక్ష్మశరీరము పరిపూర్ణముగఁ బరమేశ్వరునియందు లయము నొందు ననవచ్చును. పరమే శ్వరుఁ డన్నిటికి నుపాదానకారణ మనుట యిదివఱకే సిద్ధాంత మైనది కదా!" అని యాక్షేపసంగతితో వచ్చిన పూర్వపక్షము ఖండింపఁబడును; "నిర్గుణ బ్రహ్మజ్ఞానికిఁ దప్పఁ దక్కినవారలకు సూక్ష్మశరీరము నిరవశేష ముగ నశింపదు" అని సిద్ధాంతము చేయఁబడును.

## ౧౦౫. తదాపీతేః సంసారవ్యపదేశాత్. ౪. ౨. ౮.

తాత్పర్యము:—ఇంద్రియాదిసహిత మగు నీసూక్ష్మశరీరము ముక్తి కలుగునంతవఱకు స్వరూపనాశము నొందదు. శ్రుతియందు "యోనిమన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినం" "కొందఱు జీవులు శరీరధారు లగు టకై యోనిని ప్రవేశింతురు" అని జన్మపరంపర యభివర్ణింపఁబడియున్నది. ఈకారణమువలనఁ గర్మానుగుణముగ జీవులు ముక్తి గలుగునంతవఱకు ననేకజన్మముల నెత్తవలసినవారలై యున్నారు. కావున వారికి సూక్ష్మశరీర నాశము కలుగఁగూడదు. సూక్ష్మశరీరము లేకున్న మరల జన్మించుట సంభవింపదు కదా! ఈహేతువువలన జన్మాంతరప్రాప్తికై యజ్ఞానులకును బ్రహ్మయోగప్రాప్తికై సగుణోపాసకులకును సూక్ష్మశరీర ముండవలయును. కావున బ్రహ్మజ్ఞానము కలవారికే తప్ప తక్కినవారలకు సూక్ష్మశరీరనాశము లేదు. ఇదియే సిద్ధాంతమగుటచే "తేజః పరస్యాం దేవతాయాం" అను వాక్యముచే సూక్ష్మశరీరమునకుఁ జెప్పఁబడిన బ్రహ్మైక్యము నిర్విశేషము కాదని తెలుచున్నది.

ఇట్లు గాక నాసూక్ష్మశరీరమునకు పరిపూర్ణలయమే కలుగవలయు నని పట్టుపట్టిన బహుదోషములు వచ్చును. అప్పుడు మరణోత్తరకాలము

నందే ప్రతివాఁడును ముక్తుఁడు కావలయును గదా! అట్లైన కర్మవిధి శాస్త్రంబును మోక్షశాస్త్రంబును గూడ నిరర్థకము కావలసివచ్చును. పరలోకసుఖదుఃఖానుభవము లేకున్న నగ్నిష్టోమాదుల శాస్త్ర మేల విధింపవలయును? అసత్యవచనాదుల నేల నిషేధింపవలయును? అప్రయత్నముగ సిద్ధించుచు నియతమై సంభవించుచున్న మరణమే ముక్తి యైనయెడల శ్రమదమాద్యభ్యాసరూప మగు నాయాసముతోఁ గూడిన యుపాసనల నేల బోధింపవలయును? ఈవిధముగ సర్వశాస్త్రములును నిరర్థకములు కావలసివచ్చుటయేగాక ప్రత్యక్షానుభవమున నున్న లోక న్యాయములకును నిరర్థకత్వము కలుగవలసివచ్చును. భ్రాంతివలనఁ ద్రాటియందు జనించిన సర్పబుద్ధి యథార్థజ్ఞానమువలనఁగాని నశింప దనుట లోకప్రసిద్ధము. ప్రపంచజ్ఞానముఁగూడ పరమేశ్వరస్వరూపమునందు నిట్లే జనించె నని యిదివఱకే నిర్ణయింపఁబడియున్నది. ఇది జ్ఞానమువలనఁ గాక నితరమువలన నశించు ననుట లోకన్యాయవిరుద్ధము కదా! కావున సూక్ష్మశరీర మెట్లును పరిపూర్ణవినాశము నొందు ననుటకు వీలులేదు. పరమేశ్వరుఁడు ఉపాదానకారణభూతుఁడే యైనను కారణము లేకపోవుటచే నాసూక్ష్మశరీరము పరిపూర్ణవినాశము నొందదు.

అవతారిక:—ఇట్లైన నాతేజస్సు వెలికి నిర్గమించునపుడు ప్రక్కనున్నవారలకు నేల కానరాదు? అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౫౦౯. సూక్ష్మం ప్రమాణతశ్చ తథోపలబ్ధేః.

### ౪. ౨. ౯.

తాత్పర్యము:—జీవునకు నాధారభూత మనియు దేహమునుండి నిర్గమించి యితర దేహములలోనికిఁగాని బ్రహ్మాదిలోకములకుఁ గాని పోవు ననియుఁ జెప్పఁబడియున్న తేజస్సు (భూతసూక్ష్మములతోఁ గూడినతేజస్సు) ప్రమాణమువలనను స్వరూపమువలనను గూడ మిగుల సూక్ష్మమై స్వచ్ఛమై యుండితీరవలయును. శ్రుతులయందు, ఆతేజస్సు అతిసూక్ష్మము లగునాడీరంధ్రములనుండి నిర్గమించు ననియు అందే సంచరించు ననియు వర్ణింపఁబడి యున్నది. ఇవి పూర్వపదార్థములకు సంభవింపవు కదా! కావున నాతేజస్సు అతిసూక్ష్మమై యుండవలయును; సూక్ష్మమగుటచేతనే

స్వచ్ఛముకూడఁ గావలయును. సామాన్యముగ సూక్ష్మపదార్థము లన్నియు స్వచ్ఛముగనే యుండును. సూక్ష్మమగు కొలఁది నితరపదార్థముల వలనఁ గలుగు మాలిన్యము తొలంగుట సంభవించును గావున నంతకంతకు స్వచ్ఛత్వము కలుగుటకు వీలు కలదుకదా! కావున నీ తేజస్సు దేహము నుండి మనయెదుటనే నిర్గమించుచున్నను మనకుఁ గానరాదు. పరమాణువులు మొదలగుపదార్థము లెన్నియో యిట్టివి (యెదుటనే యున్నను నేత్రమునకు గోచరములు కానివి) కలవు కదా! మఱియు (స్వచ్ఛమగుటచే) నా తేజస్సు ఇతరపదార్థములచే నేవిధముగను ఆటంకపఱుపఁబడదు. ఇతరపదార్థములు (స్వచ్ఛపదార్థముయొక్క గమనమార్గమున నున్నపదార్థములు) కూడ స్వచ్ఛము లగునేని యప్పుడు వానియందు స్వచ్ఛపదార్థముల గమనము వ్యక్తమగును; మలినము లగునేని వ్యక్తము కాదు. ఎదుట నద్దమున్నచో తేజస్సు ఆయద్దమునుండి ప్రసరించుచున్నది యనువిషయము తేటపడును; కొయ్యయున్నచో నట్లు తేటపడదు. ఇంతమాత్రమే కాని స్వచ్ఛము లగుపదార్థములకు గమనప్రతిబంధ మెచ్చటను కలుగదు. కావున మనకుఁ గానరానంతమాత్రమున సూక్ష్మశరీరనిర్గమనము లేదనుట యుక్తియుక్తము కాదు.

---

## ౫౦౭. నోపమర్దే నాతః. ౪. ౨. ౧౦.

తాత్పర్యము:—మఱియు నిట్లు మిగుల సూక్ష్మంబు స్వచ్ఛంబు నగుటచేతనే యీసూక్ష్మశరీరమునకు స్థూలశరీరబాధవలన బాధ కలుగదు. స్థూలశరీరమును కొట్టినను దానికి దెబ్బ తగులదు; దహించినను అది దహింపఁబడదు.

## అ_౪. పా_౨. సూ_౧౧.

అవతారిక:—సూక్ష్మశరీర మొక్కటి కల దనువిషయమునఁ బ్రమాణమును జూపుచున్నాఁడు.

## ౫౦౮. అస్యైవ చోపపత్తేరేష ఊష్మా. ౪. ౨. ౧౧.

తాత్పర్యము:—మఱియు నిట్టిసూక్ష్మశరీరము కల దనుటకు నొక ప్రత్యక్షము కలదు. మరణకాలమున నాశరీరమే యీదేహమునుండి వెడలిపోవు ననుటకును నిదర్శనము కలదు. బ్రతికియున్నవానిశరీరమున వేఁడిమిగానఁబడును. మృతిజెందినవానిశరీరమునఁ గానరాదు. కావున విచారించిన నావేఁడిమి స్థూలశరీరమునకు సంబంధించినది కాదనియు మఱియొకపదార్థమునకు మాత్రమే సంబంధించు ననియు దేలుచున్నది. మృతినొందినపిదప రూపాదులన్నియు నట్లే యున్నను దేహమునందు వేఁడిమి కానరాదు కదా! కావున నావేఁడిమికి నాశ్రయమైనపదార్థము సూక్ష్మశరీరమే కావలయును. అది పోవుటయే మరణ మంటిమి కదా! అది యున్నప్పుడు మాత్రమే యుండుటచేతను పోయినప్పుడు పోవుటచేతను యీవేఁడిమి దానిధర్మమే. శ్రుతియు "ఉష్ణ ఏవ జీవిష్యన్నితి మరిష్యన్" "బ్రతుకబోవువాఁడు వేఁడిమి కలవాఁ డగును. మృతినొందఁ బోవువాఁడు చల్లఁబడును." అని యీవిషయమునే నిరూపించుచున్నది. కావున సూక్ష్మశరీరము కలదు; అది సూక్ష్మమగుటచేతనే కన్నులకు గానరాదు. అది బీజావశేషముగా మాత్రమే పరమేశ్వరునియందు లీనమగును. ఆశేషము నాశ్రయించియే యజ్ఞానియగుజీవుఁడు పునర్జన్మము నొందును; సగుణోపాసకులు బ్రహ్మలోకము నొందుదురు.

---

## ౬. ప్రతిషేధాధికరణము.

విషయసంగతిసంశయములు:—ఆసృత్యుపక్రమాధికరణమున "అమృతత్వం చానుపోష్య" "అవిద్య నిశ్శేషముగ దహింపఁబడకమునుపు పరమార్థముక్తి దొరకదు" అనిచెప్పుటచే నిర్గుణబ్రహ్మవేత్తకు నుత్క్రాంతి గతులేలే వని సిద్ధాంతముఁ జేయఁబడెను. ఆవిషయ మీయధికరణమున నాక్షేపించి సమాధానపఱుపఁబడును. ఈకారణమువలన దీనికి నాల్గవ యధికరణముతో మాత్రమే సంబంధముకలదు గాని అయిదవయధికరణముతో లేదు. ఇది యాక్షేపరూపసంబంధము. దీనితోనే యిచ్చట "నిర్గుణబ్రహ్మవేత్తకు నుత్క్రాంతికలదా? లేదా?" యనుసంశయము నివారింపఁబడును. లే దని సిద్ధాంతముఁ జేయఁబడును.

## అ-౪. పా-౨. సూ-౧౨.

అవతారిక:—ఈసిద్ధాంతము స్థిరపడుటకై మొట్టమొదటఁ బూర్వపక్షము ననువాదము చేయుచున్నాఁడు.

---

# ౫౦౮. ప్రతిషేధాదితి చేన్న శారీరాత్.

## ౪. ౨. ౧౨.

తాత్పర్యము:— విచారించిన నిర్గుణబ్రహ్మవేత్తకుఁ గూడ నుత్క్రాంతి యుండి తీరవలయును. లోకసామాన్యమునకు నంతకును గలవిశేష మొక్కనికి మాత్రము లేకపోవు ననుట యెట్లు యుక్తియుక్తమగును? ఎవ్వనికిని వాగాదివృత్తులు నశింపకుండ సిద్ధి కలుగ దనుట (దేహాభావరూప మగుముక్తిసిద్ధి కలుగ దనుట) నిర్వివాదాంశము కదా! "ఇట్లు కాదు. శ్రుతి నిర్గుణబ్రహ్మవేత్తకు మాత్ర ముత్క్రాంతి లే దనుచున్నది. 'అథాకామయమానో యోఽకామో నిష్కామ ఆప్తకామ ఆత్మకామో భవతి న తస్య ప్రాణా ఉత్క్రామంతి బ్రహ్మైవ సన్బ్రహ్మాప్యేతి' 'తరువాత నేపురుషుఁడు పరమవైరాగ్యసంపన్నుఁడై బాహ్యవిషయములనుగాని ఆభ్యంతరవిషయములనుగాని గోరక స్వస్వరూపముతో మాత్రమే తృప్తినొందుచు నుండునో అట్టివానియొక్క ప్రాణములుఉత్క్రమింపవు. వాఁడు బ్రహ్మమే యైయుండి బ్రహ్మమును జెందును' అను మొదలగువాక్యము లీవిషయమునఁ బ్రమాణములు. అపూర్వవిషయములఁ దెలిసికొనుటకు శ్రుతికంటె భిన్న మగునాధార మేదియు లేదు కావున నాశ్రుతి యెట్లుచెప్పిన నట్లే యంగీకరింపవలయును కదా!" అనిన నిది యంత ప్రబలకారణము కాదు? ఈనిషేధము జీవప్రాణములకు వియోగము లే దనుటను సూచించునే గాని శరీరమునుండిగూడ ప్రాణములు నిర్గమింప వనుటకు బోధింపదు. మఱియొకశాఖయందు "న తస్మాత్ప్రాణా ఉత్క్రామంతి" "ఆజీవునుండి ప్రాణము లుత్క్రమింపవు" అని స్పష్టముగనే జీవప్రాణవియోగాభావము వెల్లడింపఁబడి యున్నది. ఈశ్రుతియందు పంచమీవిభక్తితో స్పష్టముగ నర్థనిర్ధారణ చేయఁబడి యుండుటచే "న తస్య ప్రాణా నుత్క్రామంతి" యనుశ్రుతికిఁగూడ నీయర్థమునే చెప్పవలయును.

అందు షష్ఠీవిభక్తి ప్రయోగింపఁబడి యున్నది. ఆవిభక్తి సామాన్య మగు సంబంధమును మాత్రమే తెలియఁజేయునది కావున శాఖాంతరమునందలి పంచమీవిభక్తి ననుసరించి యదియే దీనికి నభిప్రాయ మని స్థిరపఱుప వచ్చును కదా! ఈకారణమువలన మీ రుదహరించిన శ్రుతి జీవప్రాణ వియోగాభావమును గూర్చి మాత్రమే చెప్పును. "తస్మాత్" అనుస్థలమున ప్రకరణానుసారముగ జీవుఁడే కాని దేహము గ్రహింపఁబడనట్లు ఇచ్చటఁ గూడ "తస్య" అనుస్థలముననఁ గూడ కేవలజీవునే పరిగ్రహింపవలయును గదా! సర్వసంసారమునకు నధీశ్వరుఁ డగుటచే నాయన ప్రధానుఁడుగాఁ గూడ నున్నాఁడు; ఆసర్వనామములును ప్రధానమునే పరామర్శించును. కావున "సూక్ష్మశరీరము అందఱకును నొక్కటియే దాని నిర్గమనంబు నొక్కటియే. అది స్థూలదేహమునుండి నిర్గమించినను జీవునిమాత్రము విడువదు" అనుటయే మీ రుదహరించిన శ్రుతికి తాత్పర్యము. కావున నిర్గుణ బ్రహ్మజ్ఞాని యైనను సగుణవిద్యోపాసకుఁ డయినను మఱియెవ్వరైనను మరణకాలమున ప్రాణాదిసహితులై నిర్గమింపవలసినదియే. ముక్తులగుశుకాదులును మరణానంతరమున సూర్యలోకాదులకుఁ బోయినట్లు స్మృతుల యందు వెల్లుగఁగలదు.

## అ-౪. పా-౨. సూ-౧౩.

అవతారిక:—అని వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౫౧౦. స్పష్టో హ్యేకేషాం. ౪. ౨. ౧౩.

తాత్పర్యము:—పూర్వపక్షము యుక్తమైనది కాదు. సగుణోపాసకులవిషయమును గూర్చియు నజ్ఞానుల విషయమును గూర్చియు నిదివఱకే నిర్ణయించి యున్నాము. ఇఁక నిర్గుణబ్రహ్మజ్ఞానినిఁగూర్చివిచారింపఁ బోయిన వానికి నుత్క్రాంతి సంభవింపదు. "అథాకామయమానః" అనుశ్రుతి దేహప్రాణవియోగాభావమును సూచించునేగాని జీవప్రాణ వియోగాభావమును కాదు. మఱికొందఱుశాఖవారీవిషయమును స్పష్టముగనే చెప్పుచున్నారు. ఎట్లనిన:—

యాజ్ఞవల్క్యునిఁగూర్చి ఆర్తభాగుఁ డనుముని చేసినప్రశ్నముల నభివర్ణించునప్పుడు "యత్రాయం పురుషో మ్రియత ఉదస్మాత్ప్రాణాః

క్రామం త్యాహో నేతి" "పురుషుఁడు మృతిఁజెందునప్పుడు
లుత్క్రమించునా ? లేదా ?" అని యొక ప్రశ్న వర్ణింపఁబడి
"నేతి హోవాచ యాజ్ఞవల్క్యః" "ఆయాజ్ఞవల్క్యమహాముని
త్క్రాంతి లే దని చెప్పెను" అని యా ప్రశ్నమునకు నుత్తరము వర్ణింపఁ
బడి యున్నది. ఈయుత్తరముపై "ఇట్లయిన మృతియే లేదు" అని
సంశయము రాఁగా దానిని నివారించుటకై "అత్రైవ సమవనీయంతే"
"ఆప్రాణములు ఇచ్చటనే యడంగిపోవును" అని యాజ్ఞవల్క్యుని యభి
ప్రాయము వివరింపఁబడియున్నది; దీనినే నిర్ణయించుటకై "స ఉచ్ఛ్వయ
త్యాధ్మాయ త్యాధ్మాతో మృతః శేతే" "ఆపురుషుఁడు ఉబుకును. పొట్ట
యుబ్బరించును. దేహమంతయు నుబ్బి మృతుఁడై పడిపోవును." అని మర
ణావస్థ వర్ణింపఁబడి యున్నది. ఈసందర్భమును విమర్శించిన ప్రాణములు
దేహమునుండియే వెడలిపోవు నని తెలియవచ్చుచున్నది. ఉబుకుట ఉబ్బ
రించుట మొదలగునవి దేహమునకుఁ గలుగునుగాని జీవునకుఁ గలుగవు
కదా! "అత్రైవ సమవలీయంతే" అనుభాగమునకు నధ్యాత్మాధికరణము
నందు ప్రాణవృత్తిలయమునుగూర్చి చేయఁబడినసిద్ధాంతమే (జీవునియందుఁ
బ్రాణవృత్తులు లయ మందు ననుసిద్ధాంతమే) యభిప్రాయ మని తెలిసికొన
వలయును. పైవిమర్శనుబట్టి చూచిన నుత్క్రాంతి దేహమునుండియే
కలుగును గాని జీవునుండి కా దని స్పష్ట మయ్యెను కావున పైశ్రుతు
లకు దదనుగుణముగా నర్థము చెప్పుకొనవలయును. "న తస్య ప్రాణా
ఉత్క్రామంతి" అని యున్నచోట "జ్ఞానికి సంబంధించిన నిష్క్రమణము
లేదు." అని యర్థము చెప్పవలయును, "న తస్మా త్ప్రాణా ఉత్క్రా
మంతి" అనుస్థలమున జీవదేహములకు నభేదోపచారము చేసి "ఆతని
నుండి ప్రాణము నిర్గమింపదు" అని యర్థము చెప్పవలయును. పైశ్రుతి
సందర్భము సంసారిజీవునకు సంబంధించినదియే యైనను జ్ఞాని గూడ జీవుఁడే
కావున వానికిఁ గూడ నిది సంబంధించును. మఱియు ప్రస్తుతశ్రుతి
తాత్పర్యముల ("న తస్య ప్రాణా ఉత్క్రామంతి" అనునిట్టి శ్రుతితాత్పర్య
ముల) మాత్రమేపట్టిచూచినను ఉత్క్రాంతి దేహమునుండి కలుగునదియే
గాని జీవునుండి కా దని తేలుచున్నది. ఈవాక్యములయందు ప్రాణో
త్క్రాంతి నిషేధింపఁబడుచున్నది కదా! ప్రసక్తము కానిదాని నెట్లు
నిషేధింతురు? కావున నీనిషేధమునకుఁ బూర్వమే యుత్క్రాంతి

అందు షష్ఠీవిభక్తి ప్రయోగింపఁబడి యున్నది. ఆవిభక్తి సామాన్య మగు సంబంధమును మాత్రమే తెలియఁజేయునది కావున శాఖాంతరమునందలి పంచమీవిభక్తి ననుసరించి యదియే దీనికి నభిప్రాయ మని స్థిరపఱుప వచ్చును కదా! ఈకారణమువలన మీా రుదహరించిన శ్రుతి జీవప్రాణ వియోగాభావమును గూర్చి మాత్రమే చెప్పును. "తస్మాత్" అనుస్థలమున ప్రకరణానుసారముగ జీవుఁడే కాని దేహము గ్రహింపఁబడనట్లు ఇచ్చటఁ గూడ "తస్య" అనుస్థలమునఁ గూడ కేవలజీవునే పరిగ్రహింపవలయును గదా! సర్వసంసారమునకు నధీశ్వరుఁ డగుటచే నాయన ప్రధానుఁడుగాఁ గూడ నున్నాఁడు; ఆసర్వనామములును ప్రధానమునే పరామర్శించును. కావున "సూక్ష్మశరీరము అందఱకును నొక్కటియే దాని నిర్గమనంబు నొక్కటియే. అది స్థూలదేహమునుండి నిర్గమించినను జీవునిమాత్రము విడువదు" అనుటయే మీా రుదహరించిన శ్రుతికి తాత్పర్యము. కావున నిర్గుణ బ్రహ్మజ్ఞాని యైనను సగుణవిద్యోపాసకుఁ డయినను మఱియెవ్వరైనను మరణ కాలమున ప్రాణాదిసహితులై నిర్గమింపవలసినదియే. ముక్తు లగుశుకాదు లును మరణానంతరమున సూర్యలోకాదులకుఁ బోయినట్లు స్మృతుల యందు చెల్లుగఁగలదు.

## అ-౪. పా-౨. సూ-౧౩.

అవతారిక:—అని వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౫౧౦. స్పష్టో హ్యేకేషాం. ౪. ౨. ౧౩.

తాత్పర్యము:—పూర్వపక్షము యుక్త మైనది కాదు. సగుణోపా సకులవిషయమును గూర్చియు నజ్ఞానుల విషయమును గూర్చియు నిదివఱకే నిర్ణయించి యున్నాము. ఇఁక నిర్గుణబ్రహ్మజ్ఞానినిఁగూర్చివిచారింపఁ బోయిన వానికి నుత్క్రాంతి సంభవింపదు. "అథాకామయమానః" అనుశ్రుతి దేహప్రాణవియోగాభావమును సూచించునేగాని జీవప్రాణ వియోగాభావమును కాదు. మఱికొందఱుశాఖవా రీవిషయమును స్పష్టముగనే చెప్పుచున్నారు. ఎట్లనిన:—

యాజ్ఞవల్క్యునిఁగూర్చి ఆర్తభాగుఁ డనుముని చేసినప్రశ్నముల నభివర్ణించునప్పుడు "యత్రాయం పురుషో మ్రియత ఉదస్మాత్ప్రాణాః

క్రామం త్యాహో నేతి" "పురుషుఁడు మృతిఁజెందునప్పుడు వానిప్రాణము లుత్క్రమించునా? లేదా?" అని యొక ప్రశ్న వర్ణింపఁబడి యున్నది. "నేతి హోవాచ యాజ్ఞవల్క్యః" "ఆయాజ్ఞ వల్క్యమహాముని ప్రాణోత్క్రాంతి లే దని చెప్పెను" అని యాప్రశ్నమునకు నుత్తరము వర్ణింపఁబడి యున్నది. ఈయుత్తరముపై "ఇట్లయిన మృతియే లేదు" అని సంశయము రాఁగా దానిని నివారించుటకై "అత్రైవ సమవనీయంతే" "ఆప్రాణములు ఇచ్చటనే యడంగిపోవును" అని యాజ్ఞవల్క్యుని యభిప్రాయము వివరింపఁబడియున్నది; దీనినే నిర్ణయించుటకై "స ఉచ్ఛ్వయత్యాధ్మాయ త్యాధ్మాతో మృతః శేతే" "ఆపురుషుఁడు ఉబుకును. పొట్ట యుబ్బరించును. దేహమంతయు నుబ్బి మృతుఁడై పడిపోవును." అని మరణావస్థ వర్ణింపఁబడి యున్నది. ఈసందర్భమును విమర్శించిన ప్రాణములు దేహమునుండియే వెడలిపోవు నని తెలియవచ్చుచున్నది. ఉబుకుట ఉబ్బరించుట మొదలగునవి దేహమునకుఁ గలుగునుగాని జీవునకుఁ గలుగవు కదా! "అత్రైవ సమవలీయంతే" అనుభాగమునకు నధ్యక్షాధికరణము నందు ప్రాణవృత్తిలయమునుగూర్చి చేయఁబడినసిద్ధాంతమే (జీవునియందుఁ బ్రాణవృత్తులు లయ మందు ననుసిద్ధాంతమే) యభిప్రాయ మని తెలిసికొనవలయును. పై విమర్శనుబట్టి చూచిన నుత్క్రాంతి దేహమునుండియే కలుగును గాని జీవునుండి కా దని స్పష్ట మయ్యెను కావున పైశ్రుతులకు దదనుగుణముగా నర్థము చెప్పుకొనవలయును. "న తస్య ప్రాణా ఉత్క్రామంతి" అని యున్నచోట "జ్ఞానికి సంబంధించిన నిష్క్రమణము లేదు." అని యర్థము చెప్పవలయును, "న తస్మా త్ప్రాణా ఉత్క్రామంతి" అనుస్థలమున జీవదేహములకు నభేదోపచారము చేసి "ఆతని నుండి ప్రాణము నిర్గమింపదు" అని యర్థము చెప్పవలయును. పైశ్రుతి సందర్భము సంసారిజీవునకు సంబంధించినదియే యైనను జ్ఞాని కూడ జీవుఁడే కావున వానికిఁ గూడ నిది సంబంధించును. మఱియు ప్రస్తుతశ్రుతి తాత్పర్యముల ("న తస్య ప్రాణా ఉత్క్రామంతి" అనునిట్టి శ్రుతితాత్పర్యముల) మాత్రమేపట్టిచూచినను ఉత్క్రాంతి దేహమునుండి కలుగునదియే గాని జీవునుండి కా దని తేలుచున్నది. ఈవాక్యములయందు ప్రాణోత్క్రాంతి నిషేధింపఁబడుచున్నది కదా! ప్రసక్తము కానిదాని నెట్లు నిషేధింతురు? కావున నీనిషేధమునకుఁ బూర్వమే యుత్క్రాంతి

ప్రసక్తించి యుండవలయును. ఇంతవఱకు సంశయ మేదియు లేదు. తర్వాత నీప్రసక్తికి స్వరూప మేది యని మాత్రము కొంత విచారింప వలసియున్నది. ఈవిషయమును నిర్ధారణచేయుటకు నార్తభాగ యాజ్ఞవల్క్య సంవాద ముదహరింపఁబడియే యున్నది కదా! కావున "శరీరము నుండి ప్రాణములు నియతముగ నుత్క్రమించును" అని ప్రాప్తింపఁగా "బ్రహ్మవేత్తకు మాత్ర మట్లుత్క్రమింపవు" అని నిషేధింపఁబడెను. కావున నెట్లుచూచినను ఉత్క్రాంతి దేహమునుండి సంభవించునదియే కాని జీవునినుండి కాదు. మఱియు "చక్షుష్టో వా మూర్ధ్నో వాఽన్యేభ్యో వా శరీరదేశేభ్య స్త ముత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామంతి ప్రాణ మనూత్క్రామంతం సర్వే ప్రాణా అనూత్క్రామంతి" "నేత్రమునుండి కాని శిరస్సునుండి కాని యితరము లగు శరీరప్రదేశములనుండిగాని ఆ జీవుఁడు నిర్గమించుచుండఁగా ప్రాణము ఆతనితోఁ గూడ నిర్గమించును. ఆప్రాణముతోఁగూడ సర్వేంద్రియములును నిర్గమించును" అని పూర్వ వాక్యమునందు సంసారియొక్క యుత్క్రాంతి వర్ణింపఁబడి యున్నది. ఈ వర్ణనమువలన "ప్రాణములు దేహమునుండియే నిర్గమించును కాని జీవాత్మ నుండి కా దని తెలుచున్నది కదా! ఇట్లు చెప్పి యాయుత్క్రాంతి జ్ఞాని విషయమునఁ గూడఁ బ్రసక్తింపఁగా నది యుత్తరవాక్యమున "స తస్య ప్రాణా ఉత్క్రామంతి" అని నిషేధింపఁబడి యున్నది. ఇట్లు గాకున్న వాక్య సందర్భమునకు పరస్పరవిరోధము వచ్చును. ఒకస్థలమున దేహమునుండియు మఱియొకస్థలమున జీవునుండియు నిర్గమనమును చెప్పుట విరోధమే కదా! కావున నజ్ఞానినిఁ గూర్చి చెప్పఁబడినయుత్క్రాంతి జ్ఞానికిఁగూడ సంప్రాప్తింపఁగా నది యితరవాక్యముచే నిషేధింపఁబడి యుండవలయు ననుట మాత్రమే సిద్ధాంతము. అప్పుడు ఉత్క్రాంతిస్వరూపమునకు భేదము రాదు కావున నుత్క్రాంతి దేహమునుండియే ప్రవర్తించును కాని జీవునుండి కాదు. బాగుగ విచారించినచో నీవిషయమునుగూర్చి యింత వివాదమే యక్కఱలేదు. జ్ఞానియగువాఁడు సర్వాత్మక మగు బ్రహ్మము నాత్మరూపముగ నెఱిఁగినవాఁడు కావున నెచ్చట నుండియు నుత్క్రమింపఁడు. దేహమునుండి జీవుఁడు నుత్క్రమింపఁడు జీవునుండి ప్రాణములు నుత్క్రమింపవు. సర్వాత్మకుఁ డగువానికి నిర్గమణ మనునదియే సంభవింపదు కదా! "అత్ర బ్రహ్మ సమశ్నుతే" "బ్రహ్మవేత్తయగువాఁ డిచ్చ

టనే బ్రహ్మ మగును" అని శ్రుతి యీవిషయమునే బోధించుచున్నది. కావున నెట్లును బ్రహ్మజ్ఞానికి నుత్క్రాంతి లేదు.

## ౫౧౧. స్మర్యతే చ. ౪. ౨. ౧౪.

తాత్పర్యము:—స్మృతులయందు నీవిషయము జెప్పఁబడియే యున్నది. మహాభారతమునందు "సర్వభూతాత్మభూతస్య సమ్యగ్భూతాని పశ్యతః, దేవాఽపి మార్గేముహ్యన్త్యపదస్యపదైషిణః" "సమస్తభూతముల నాత్మమాత్రములనుగా నెఱింగి సర్వభూతముల యందు నున్నపరమేశ్వరుని స్పష్టముగఁ దెలిసికొని బ్రహ్మాభిన్న మగు స్థానము నపేక్షింపక నుండునట్టి బ్రహ్మవేత్తయొక్కస్థితిని గోరినను వారి మార్గమునందు (జ్ఞానమునందు) సర్వోత్తము లయ్యు దేవతలు భ్రాంతి నొందుదురు; అజ్ఞానమును పొందలేక నిరాశు లయ్యెదరు" అని చెప్పఁ బడియున్నది. దీనిని విమర్శించిన "బ్రహ్మవేత్తకు పరమేశ్వరభిన్న మగు గమ్యస్థానము లేదు" అని తేలుచున్నది. "ఇట్లు కాదు. 'శుకః కిలవైయాసకిర్ముముక్షు రాదిత్యమండల మభిప్రతస్థే పిత్రాచానుగమ్యాహూతో భో ఇతి ప్రతిశుశ్రావ' 'వ్యాసపుత్రుఁ డగు శుకుఁడు మోక్షేచ్ఛగలవాఁడై సూర్యమండలమునుగూర్చి ప్రయాణమయ్యెను. తండ్రియాయనను వెంబడించి పిలువఁగా 'ఓ'అని పలికెను'అని బ్రహ్మవేత్తకుఁగూడ గమనము వర్ణింపఁబడి యున్నది" అనియెదవేమో యది బ్రహ్మవేత్తనుగూర్చి చెప్పఁబడినమాట కాదు. శరీరముండఁగనే యోగబలమువలన నాశుకుఁడు స్వదేహమును విడిచి కల్పితదేహముతో సూర్యలోకమునకుఁ బోయె నని మాత్రమే యిచ్చటఁ జెప్పఁబడెను. ఆశుకుని భూతములు చూచె నను మొదలగువిషయము లాకథయందు వర్ణింపఁబడి యున్నవి. ఆయన శరీర రహితుఁ డయ్యె వెడలియుండునేని పరులు వానినిఁ జూడనోపరుకదా! ఈవిషయము నచ్చటియుపసంహారము తేట పరచుచున్నది. "శుకస్తు మారుతాచ్ఛీఘ్రాం గతిం కృత్వాఽన్తరిక్షగః, దర్శయిత్వాప్రభావం స్వం సర్వభూతగతోఽభవత్" "ఆశుకుఁడైతే గాలికంటెవేగముగ నాకాశ మధ్యమునఁ బోవుచు తనప్రభావమును వెల్లడించి పిదప సూక్ష్మరూపియై భూతములలోఁ గలసిపోయెను" అనునదియే యుపసంహారవాక్యము. ఇట్లగుటచే శ్రుతిస్మృతియుక్తుల నాశ్రయించి చూచిన బ్రహ్మవేత్త యగు

వానికి గతియే లేదు. గతిశ్రుతు లెవ్వనిఁ గూర్చి చెప్పుచున్నవో యావిషయమును ముస్ముందు వివరింపఁబోయెదము.

---

## ౭. వాగాదిలయాధికరణము.

విషయ సంశయ సంగతి పూర్వపక్షములు:—పై యధికరణమున నిర్గుణ బ్రహ్మవేత్తకు నుత్క్రాంతి లే దని సిద్ధాంతము చేయఁబడెను. దాని నాశ్రయించి యాశ్రయాశ్రయీభావసంగతితో నింద్రియాదిలయమును గూర్చి యీయధికరణమున విచారింపఁబడుచున్నది. సంసారులకుఁ గలుగు వాగాదిలయమునుగూర్చియు బీజభావావశేషముగ నవి (యింద్రియములు) పరమేశ్వరుని యందు లయము నొందుటనుగూర్చియు మున్నే వివరింపఁబడి యున్నది. జ్ఞానికి నిట్టివిలయము సంభవింపదుగావున దానినిఁ గూర్చి గలుగుసంశయమును నివారించుటకై యీయధికరణ మారంభింపఁబడెను. కొన్ని శ్రుతులు "ఏవ మే వాస్య పరిద్రష్టు రిమాః షోడశ కలాః పురుషాయణాః పురుషం ప్రాప్యా స్తం గచ్ఛంతి" "ఈవిధముగనే యీబ్రహ్మవేత్తయొక్క షోడశకళలును (పదునొకండు ఇంద్రియములు పంచప్రాణములును గలసి పదియాఱుకళలు) పరమేశ్వరుఁడే యాధారముగఁ గలవిగావున (పరమేశ్వరునందే యారోపింపఁబడినవి) కావున నాయనయందే లీనము లగును" అనియు మఱికొన్ని "గతాః కలాః పంచదశ ప్రతిష్ఠాః" "జ్ఞానికి మోక్షము కలుగునప్పుడు పదునేనుకళలును వాని వానియుత్పత్తిస్థానములను జెందును" అనియుఁ జెప్పుచున్నవి. ఈ రెంటికినిఁ గలవిరోధమునకు నీ యధికరణమునఁ బరిహారము చెప్పఁబడును.

---

## ౫౧౨. తాని పరే తథాహ్యాహ. ౪. ౨. ౧౫.

తాత్పర్యము:—"ఆయింద్రియములును సూక్ష్మభూతములును బ్రహ్మవేత్తకు పరమేశ్వరునియందే లీనము లగును; నిరవశేషముగ లీనము లగును. 'ఏష మేవ' అను మొదలగు శ్రుతి యీవిషయమునే బోధించుచున్నది. 'గతాః కలాః' అను శ్రుతి దీనికి విరుద్ధముగఁ జెప్పుచున్నది

కదా!" అనియెద వేమో వినుము. ఈరెండు శ్రుతులకును విషయములు భిన్నములు.'ఏవమేవ'అనుశ్రుతి పారమార్థికవిషయమును బోధించుచున్నది. ఆయింద్రియాదు లన్నియుఁ బరమేశ్వరునియందు భ్రాంతిచేఁ గల్పింపఁ బడినవియే కావున జ్ఞానము కలుగఁగానే యవి బ్రహ్మమాత్రములుగా జూడఁబడు నని బోధించుచున్నది. ఇదియు విలయమేకదా! వాస్తవస్థితిలో నిదియే విలయ మని కూడఁ జెప్పవచ్చును. ఇక 'గతాః కలాః' అనుశ్రుతి యన్ననో వ్యావహారికస్థితిని బోధించుచున్నది. ఏభూతమునుండి జనించిన పదార్థ మాభూతమున లయము నొందునని సామాన్యముగఁ జెప్పుచున్నది. కావున నెట్లు చూచినను జ్ఞానికి నింద్రియములు పరమేశ్వరునియందే లీనము లగును; జ్ఞానము కలిగిన యుత్తరక్షణముననే యిట్టిస్థితి సంభవించును. ప్రారబ్ధవేగ మున్నంతవఱకు మాత్రము సంస్కారవేగమువలన నవి వ్యవహారముగ నాచరించుచున్న ట్లుండును.

---

## ౮. అవిభాగాధికరణము.

విషయ సంశయ సంగతి పూర్వపక్షములు:— ఈయధికరణమునఁ గూడ నాయింద్రియలయమును గూర్చియే విచారింపఁబడును. అజ్ఞానులను గూర్చి చెప్పునప్పుడు వారియింద్రియలయము సావశేష మని చెప్పఁబడెను కావున నిదియు నింద్రియలయమే యగుటచే నట్టిదియే యగునేమో యను సంశయము నివారింపఁబడును. ఈరెండధికరణములును ఒక్కవిషయమును గూర్చియే విచారించునవిగావున వీనికి నదియే సంబంధము.—

---

## ౫౧౩. అవిభాగో వచనాత్. ౪. ౨. ౧౬.

తాత్పర్యము:—ఈవిషయమున సంశయమే యక్కఱ లేదు. జ్ఞానియొక్క దేహాంతమున నగునింద్రియలయము నిరవశేషమే యనవలయును. శ్రుతియు వాని లయమును జెప్పినపిదప "భిద్యేతే తాసాం నామరూపే పురుష ఇత్యేవం ప్రోచ్యతే స ఏషోఽకలోఽమృతో భవతి" "ఆకలలయొక్క నామరూపములు నశించును, పురుషుఁడని మాత్రమే యన్నియుఁ జెప్పఁబడును. ఇట్లు బ్రహ్మైక్యరూప మగులయము నొందిన నప్పుడు సాధ

కుఁడు నిష్కలుఁడును ముక్తుఁ డగును” అని వానికి స్వరూపవినాశమును గూడ చెప్పుచున్నది. మఱియు నీవిలయమును చెప్పునప్పుడు దీనిని జ్ఞాన మాత్రసాధ్యముగాఁ బూర్వాధికరణమున వర్ణించియున్నాము. ఇట్లైన శేష ముండుటకే వీలు కలుగదు. అవిద్యవలన జనించిన వీనికి నవిద్యానాశము నందు నిలుకడ యెట్లు సంభవించును? కారణము నశించినపిదప కార్య ముండునా? అజ్ఞానుల కన్న నో యవిద్యా శేషము కలదు కావున నీయింద్రి యాదులును శేషించి యుండవచ్చును. ఇట్లగుటచే జ్ఞానవిషయమున నింద్రియలయము నిరవశేషమే యగు ననియు నప్పుడది బ్రహ్మమాత్రము లయ్యేయుండు ననియు మాత్రమే సిద్ధాంతము చేయవలసియున్నది.

---

## ౯. తదోకోఽధికరణము.

సంగతి విషయ సంశయ పూర్వపక్షములు:—పై యధికరణముతో ప్రస్తావవశమున వచ్చిన నిర్గుణవిద్యావిచారము ముగిసినది. ఇప్పుడు అధ్యాయారంభమునుండియుఁ జేయఁబడుచున్న సగుణవిద్యావిచారము మఱల ప్రవర్తింపఁబడుచున్నది. ఆసృత్యుపక్రమాధికరణమునఁ బ్రయాణ మారంభించినంతవఱకు సగుణవిద్యోపాసకులకును అజ్ఞానులకును ఉత్క్రాంతి యొక్క తీరుననే యుండు నని చెప్పఁబడియున్నది. ఆ ప్రయాణా రంభమునుగూర్చి యిచ్చట విమర్శింపఁబడును. “స ఏతా స్తేజో మాత్రాః సమభ్యా దదానో హృదయ మే వాన్వవక్రామతి” “ఆజీవుఁడు భూతేం ద్రియముల నన్నిటిని గ్రహించి హృదయమును ప్రవేశించును” అని శ్రుతి నిష్క్రమణాభిముఖుఁడై యున్న జీవునకు హృదయప్రవేశమును జెప్పుచున్నది. ఇదియు జ్ఞాన్యజ్ఞానులకు సమానమే. “తస్య హైతస్య హృదయస్యాగ్రం ప్రద్యోతతే తేన ప్రద్యోతే నైష ఆత్మా నిష్క్రామతి చక్షుష్టో వా మూర్ధ్నో వాన్యేభ్యో వా శరీర దేశేభ్యః” “ఇట్లు జీవుఁడు ప్రవేశించినపిదప కర్మానుగుణముగ నాతనిహృదయము సంకల్పరూప మగువికాసమును జెందును. ఈజీవుఁ డావికాసముతో కంటినుండిగాని శిరమునుండిగాని యితర దేహభాగములనుండిగాని నిర్గమించును” అని యావలి వృత్తాంతమునుఁ గూడ శ్రుతి వెల్లడించుచున్నది. ఇదియు

పూర్వమువలెనే జ్ఞాన్యజ్ఞానులకు సమానమా? కాదా? యను సంశయ మిందు నిరాకరింపఁబడును. "పూర్వాధికరణమునందు శ్రుతి నాశ్రయించి యింద్రియాదులకుఁ గలుగువిలయము నిరవశేషమని సిద్ధాంతము చేసినట్లు ఇచ్చటఁ గూడ పై శ్రుతి ననుసరించి జ్ఞానికిఁ గలుగునిష్క్రమణముఁగూడ ననియతముగ నేదియో యొక ద్వారమునుండియే కలుగు నని సిద్ధాంతముఁ జేయఁబడవలసి యున్నది" అని దృష్టాంతసంగతితో వచ్చినయాక్షేపము నకు సమాధానము చెప్పఁబడుచున్నది.

## ౫౧౪. తదోకోగ్రజ్వలనం తత్ప్రకాశితద్వారో విద్యాసామర్థ్యాత్తచ్ఛేషగత్యనుస్మృతియోగాచ్చ హార్దానుగృహీతః శతాధికయా. ౪. ౨. ౧౭.

తాత్పర్యము:—నిష్క్రమించుటకు సిద్ధముగ నున్న జీవుఁడు హృదయమును ప్రవేశించుటయు కర్మానుగుణముగ నాహృదయముయొక్క యగ్రము వికాసమును జెందుటయు ననునవి మాత్రము జ్ఞాన్యజ్ఞానులకు సమానమే కాని యచ్చటనుండి మాత్రము భేదము కలదు. హృదయ ప్రకాశమువలన గంతవ్యమార్గము తేటపడును. ఇదియు నీయిరువురకును సమానమే గాని గతియందు మాత్రము భేదము కలదు. సగుణోపాసకుఁడు బ్రహ్మనాడీమార్గమున శిరమునుండియే నియతముగ నిర్గమించును; అజ్ఞాని యగువాఁడు నేత్రాదులలో దేనినుండి యైనను నిర్గమించును. ఏల యనిన:—

సగుణోపాసకులకు విద్య కలదు. దానిసామర్థ్యమువలన నీ నియమ మేర్పడును. అజ్ఞానులు నానావిధము లగుకర్మల నాచరించుచుండుటచే నానావిధము లగులోకముల నొందవలసినవాఁ డగుటచే హృదయవికాస మొక్కతీరుగ నుండదు; దానిచేఁ బ్రకాశింపఁజేయఁబడుద్వారంబును నొక్కవిధముగ నుండదు. అట్లుండుటకును వీలు లేదు. సగుణోపాసకుల విషయ మన్ననో యట్టిది కాదు. వారు సర్వకర్మలఁ బరిత్యజించి యైనను బరిత్యజింపక యైనను యేకదీక్షతో కేవల మగునుపాసన నాచరించిన వారు. ఈకారణమువలన విద్యవలనఁ గలుగునది యగుటచే హృదయ

వికాస మంతయు నొక్కతీరుగనే యుండును; దానిచేఁ బ్రకాశింపఁజేయఁ బడినద్వారంబును ఒక్కటేఱంగుననే యుండును. ఫల మొక్కటియే యగుటచే నిట్లే తీరవలయును. కావున నుపాసకు లందఱును బ్రహ్మనాడీ మార్గమున శిరస్సునుండియే వెలికి నిర్గమింతురు. ఇట్లు లేకున్న విద్య వలనఁ గలుగునాధిక్య మేమియు నుండకపోవలసి వచ్చును కదా! అట్లయిన విద్యావిధి నిరర్థకమే కావలసివచ్చును. శిరమునుండి నిర్గమింపకున్న బ్రహ్మ లోకము లేదని శ్రుతులయందుఁ జెప్పఁబడి యున్నది. విద్యలకును బ్రహ్మలోకప్రాప్తియే కదా ఫలము; కావున నిర్వివాదముగ నుపాస కులు శిరమునుండియే నియతముగ నిర్గమింతురు. మఱియు శ్రుతుల యందు విద్యోపదేశస్థలములలో గొన్నిచోట్ల నీమార్గముకూడ ధ్యేయమునుగా వర్ణింపఁబడి యున్నది. ఈకారణమువలనఁ గూడ పైసిద్ధాంతమే స్థిరపడుచున్నది. ఉపాసనాకాలమున నంతయు ధ్యానింపఁ బడియున్న మార్గమును వదలి మఱియొక్కమార్గము నాశ్రయించు ననుట యయుక్తము కదా! ఈకారణములవలన హృదయస్థానమున నున్న పరమేశ్వరు నుపాసించి తత్ప్రాప్తుఁడై నిలచినయుపాసకుఁడు ౧౦౧ వ నాడీద్వారము నాశ్రయించి బ్రహ్మలోకమునకుఁ బోవును; ఇతరులు మాత్రము తక్కిననాడులనుండి యనియతముగ నిర్గమింతురు. హృదయ స్థానమున నున్న పరమేశ్వరునిఁ గూర్చి యుపాసనను విధించుస్థలమున శ్రుతి యీవిషయమునే తెలియఁజేయుచున్నది. “శతం చైకా చ హృదయస్య నాడ్య స్తాసాం మూర్ధాన మభినిఃసృతైకా త యోర్ధ్వ మాయ న్నమృ తత్వ మేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి” “హృదయమునందు నూటనొక్కనాడులు గలవు. అం దొక్కనాడి మాత్రము శిరమునకుఁ బోయి యున్నది. ఆనాడి నాశ్రయించి యుత్క్రమించినజీవుఁడు బ్రహ్మ లోకప్రాప్తిపూర్వకముగఁ గ్రమముక్తినిఁ జెందును. తక్కిననాడుల నుండియు ఉపాసకులు గానివారు నిర్గమింతురు గాని దానికి బ్రహ్మలోక ఫలములేదు” అనువాక్యమే యీవిషయమునఁ బ్రమాణము. కావున నుపాసకుల యుత్క్రాంతికి మార్గము నియతమే.

---

# ౧౦. రశ్మ్యధికరణము. ౧౦.

విషయ సంశయ సంగతి పూర్వపక్షము:—పూర్వాధికరణమున సగుణోపాసకునియొక్క యుత్క్రమ మభివర్ణింపఁబడెను. సంసారులయు త్క్రమమునకును వాని యుత్క్రమమునకును గలభేదము ప్రకటింపఁబడెను. సంసారుల గత్యాగతులు తృతీయాధ్యాయ ప్రథమపాదమున నిరూపింపఁబడియే యున్నవి. కావున ప్రకృత ముపాసకునిగతి నిరూపింపఁబడును. వారు దేవయానమార్గముతో బ్రహ్మలోకమునకుఁ బోవుదు రనియు దేవయానమార్గస్వరూపంబును గూడ యిదివఱకే యచ్చటచ్చట నిరూపింపఁబడియున్నది. అయినను ఇప్పు డానంతర్యసంగతితో లేక ప్రస్తావసంగతితో నామార్గమే సవిమర్శముగ నిరూపింపఁబడును. ఉపాసకులామార్గమును దేనిమూలమున నాశ్రయింతురో అట్లాశ్రయించినపిదప నెట్లు ప్రయాణముచేయుదురో తుదకు బ్రహ్మలోకము నెట్లు చేరుదురో యావిధమంతయుఁ గ్రమముగ నిరూపింపఁబడును. అం దీపాదాంతము వఱకు క్రమముక్తినిఁ గూర్చిన కొన్నివిశేషములు విచారింపఁబడును. అం దీయధికరణమున దేవయానమార్గాశ్రయకాలము నిరూపింపఁబడును. ఛాందోగ్యోపనిషత్తునందు దహరవిద్యయందీవిషయమునుగూర్చి వర్ణింపఁబడియున్నది. సూర్యకిరణములకును హృదయమునందలి నాడులకును గల సంబంధమును సవిమర్శముగ నిరూపించి పిదప "అథ య త్రైత దస్మా చ్ఛరీరా దుత్క్రామ త్యథై తై రేవ రశ్మిభి రూర్ధ్వ మాక్రమతే" "ఈశరీరమునుండి నిర్గమించినజీవుఁడు సూర్యరశ్ములగుండా నూర్ధ్వలోకమునకుఁ బోవును." అని చెప్పఁబడి యున్నది. ఈవిషయమున నొక్కసంశయము కలదు. "పగలు మృతినొందినవారుమాత్రము తత్క్షణమే సూర్యకిరణముల నాశ్రయింపవచ్చును గాని రాత్రి మృతిఁజెందినవాఁ డెట్లు? వాఁడు సూర్యోదయమువఱకుఁ బ్రతీక్షింపవలయు నని తోఁచుచున్నది. శ్రుతి యన్ననో విషయవిభాగమును జేయక సామాన్యముగఁ జెప్పుచున్నది. ఇచ్చట నిర్ణయ మెట్లు?" అని సంశయము కలుగును. ఇది యిందు నివారింపఁబడును.

## అ-౪. పా-౨. సూ-౧౮.

అవతారిక:—ఈవిషయమున నిర్ణయము నాచరించుటకై మొట్ట మొదట సూత్రకారుఁడు స్వమతమును ప్రతిజ్ఞ చేయుచున్నాఁడు.

## ౫౧౫. రశ్మ్యనుసారీ. ౪. ౨. ౧౮.

తాత్పర్యము:—"అథ యత్రైతతు" అను శ్రుతి విభాగ మేమియు లేకుండఁగనేసర్వసామాన్యముగ సూర్యకిరణాశ్రయమును చెప్పుచున్నది. అందఱును నాడులనుండి సూర్యకిరణముల నాశ్రయించువారే యైనను సంసారులు స్వకర్మానుగుణముగ స్వర్గాదిలోకములకుఁ బోవుదు రనియు జ్ఞానులు మాత్రము నూట ఒకటవనాడినుండి నిర్గమించినవారగుటచే బ్రహ్మలోకమునకుఁ బోవుదు రనియు మాత్రమే యాశ్రుతి చెప్పుచున్నది గాని కాలవిభాగమునుగూర్చి చెప్పుట లేదు. కావున నెప్పుడు మృతిచెందినను కాలనియమముతోఁ బని లేకయే జీవుఁడు సూర్యరశ్ముల నాశ్రయించును.

## అ-౪. పా-౨. సూ-౧౯.

అవతారిక:—ఈప్రతిజ్ఞను ఆక్షేపసమాధానములతో స్థిరము చేయుచున్నాఁడు.

## ౫౧౬. నిశి నేతి చేన్న సంబంధస్య యావద్దేహ భావిత్వాద్దర్శయతి చ. ౪. ౨. ౧౯.

తాత్పర్యము, పూర్వపక్షము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. సూర్యకిరణములు పగటియందుఁగాని యుండవు. కిరణము లుండిననేగాని నాడులకు వానితో సంబంధము కలుగనేరదు. కావున పగటియందు మృతి చెందినయెడల సూర్యకిరణముల నాశ్రయింపవచ్చునుగాని లేకున్న నది సంభవింపనేరదు. రాత్రియందు సూర్యకిరణములు లేవుకదా!

సిద్ధాంతము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఇతర ప్రమాణముల ననుసరించి చూచినను నాడులకును సూర్యకిరణములకును గలసంబంధము శాశ్వత మని తేలుచున్నది. శరీర మున్నంతకాల ముండునదియే యని స్పష్ట మగుచున్నది. ఈవిషయమున వైద్యశాస్త్రము ప్రమాణము.

సర్వనాడులయందును వ్యాపించి యున్న పిత్తరసమే సూర్యునితేజస్సని యచ్చట చెప్పఁబడి యున్నది. దీనికి నొకప్పుడు నాడులనుండి వియోగము కలుగు ననుట సంభవింపదు కదా! మరణకాలమువఱకు నిది యిట్లే యుండును; జీవుఁడు నిర్గమించినపిదపఁ గాని యీపిత్తరసము నాశము నొందదుగదా! ఈకారణము వలన నిర్గమింపఁబోవువానికి సూర్యకిరణములే యుండవలయు ననునియమము లేదు. పిత్తరసరూప మగు సూర్యతేజస్సు నాశ్రయించియే వాఁడు సూర్యునిఁ జెందవచ్చును. "అముష్మా దాదిత్యా త్ప్రతాయంతే తా ఆసు నాడీషు సృప్తా ఆభ్యో నాడీభ్యః ప్రతాయంతే తేఽముష్మి న్నాదిత్యే సృప్తాః" "ఆకిరణములు సూర్యునుండి నాడులలోనికిని నాడులనుండి సూర్యునిలోనికిని వ్యాపించియున్నవి." అని శ్రుతియు నీసంబంధమునుగూర్చి చెప్పుచున్నది. కావున రాత్రియందు మృతి చెందినవాఁడుఁ గూడ నిత్యసంబంధముతో తననాడులయందు వ్యాపించియున్న సూర్యకిరణములగుండ (పిత్తరసరూప మగుసూర్యతేజస్సుగుండ) ప్రయాణముఁ జేయవచ్చును.

ఇదియును గాక సూర్యకిరణములు రాత్రులయందు లేవనుటయు సిద్ధాంతము కాదు. గ్రీష్మరాత్రులయందు వానియునికి ప్రత్యక్షముగనే తెలియవచ్చుచున్నది. మధ్యాహ్నకాలమునందువలె రాత్రులయందుఁ గూడ నాబుతువునందు సంతాపముకలుగుచుండుటచే నీవిషయమూహింపఁ బడుచున్నది. దీనినిఁ బట్టిచూచిన సర్వరాత్రులయందు నిట్లే యూహింపఁ బడవచ్చును. అధికములుగ నుండుటచే గ్రీష్మరాత్రులయం దాకిరణములు స్పష్టము లగుచున్నవి యనియు చక్కనరాత్రులయందు స్వల్పములుగ నుండుటచే నట్లు గానవచ్చుట లేదనియు నిర్ణయింపఁబడవచ్చును. ఈకారణమువలనఁ గూడ రాత్రిమృతులు సూర్యకిరణముల నాశ్రయింపవచ్చును. "అహారేవైతద్రాత్రౌ దధాతి" "సూర్యుఁడు పగటినే రాత్రియందుఁ గూడ నిలుపుచున్నాఁడు (పగ లనఁగా కిరణప్రసారము)" అను శ్రుతియు నీవిషయమునే స్పష్టము చేయుచున్నది. మఱియు జలమయుఁడగు చంద్రునియందు ప్రతిబింబించినసూర్యకిరణములే వెన్నెల. ఈకారణమువలనఁగూడ రాత్రులయందు సూర్యకిరణములు కలవు. ఇట్లు దివారాత్రులయందు సూర్యకిరణము లెడతెగక యుండుటచే నాడులకు వానితోఁ గలసంబంధ మెప్పటికిని నశింపదు. "అముష్మా దాదిత్యాత్"

అను శ్రుతి సామాన్యముగ నాడీకిరణసంబంధమును జెప్పుచున్నను "ఆసంబంధము సర్వకాలములయందు నుండునదియా? లేక యొకప్పుడు మాత్రమే యుండునదియా?" అనువిశేషమును బోధింపకున్నను ప్రస్తుత నిరూపణము ననుసరించి విశేషమును గ్రహింపవలయును. "అహ రేవ" అను శ్రుతి యీనిరూపణకుఁ గూడ నాధారముగ నున్నది కదా! కావున నెట్లును కాలభేదము లేక నెప్పుడు మృతిఁ జెందినను జీవుఁడు సూర్య కిరణముల నాశ్రయించు ననుటయే సిద్ధాంతము.

"ఇట్లు చెప్పనేల రాత్రి మృతి నొందినవాఁడు సూర్యకిరణముల నాశ్రయింపకయే సంకల్పాదిబలముచే నూర్ధ్వలోకమునకుఁ బోవచ్చును కదా!" అనుటయు యుక్తము కాదు. అప్పుడు రశ్మిసంచారమునుఁ గూర్చి చెప్పు శ్రుతియే నిరర్థకము కావలసి వచ్చును. ఉపాసకుఁడు దేవ యానమార్గము నాశ్రయించుటకు సూర్యకిరణసంబంధ మక్కఱ లేకుండిన నెప్పటికిని యక్కఱ లేకపోవలయునేగాని యొకప్పుడు మాత్రము కావలసి వచ్చు ననుట యెట్లు? శ్రుతియందు అట్టివిభాగము కానరా లేదు. పగలు మృతిఁ జెందినవాఁడు సూర్యకిరణముల నాశ్రయించు ననియు రాత్రి మృతినొందినవాఁ డట్లాశ్రయింపఁ డనియు శ్రుతి చెప్పుట లేదు కదా! కావున నీవాదము సరిపడదు. "ఇట్లయిన రాత్రికాలమున మృతి నొందెనేని విద్వాంసుఁడును ఊర్ధ్వలోకమునకుఁ బోవఁ డేమో" అనిన నదియు యుక్తము కాదు. అప్పుడు విద్యాఫలమునకు పాక్షికత్వము (అనఁగా కలిగినను కలుగవచ్చును లేకున్న లేకపోవచ్చును అనునియమాభావము) వచ్చును. ఉపాసకుఁడైనను పగటియందు మృతి గలిగిననే కాని బ్రహ్మలోకప్రాప్తి కలుగదు; ఆమృతియు నెప్పుడు గలుగునో స్పష్టము కాదు. విద్యావంతులకు నది పగలే కలుగు ననియు నియమించుటకు వీలు లేదు కదా! కావున నిదియే సిద్ధాంత మైనచో విద్యయం దెవ్వఁడును ప్రవర్తింపఁడు. ఫలనియమము లేనిపని నెవ్వఁ డాచరించును? కావున నీపక్ష మనర్థహేతువు. "ఇట్లయిన మఱియొకవిధముగాఁ జెప్పవచ్చును. రాత్రికాలమున మృతిఁజెందినవాఁడు సూర్యరశ్మిప్రాప్తికై పగటివఱకు నిరీక్షించు ననవచ్చును కదా!" అనుటయు సరి కాదు. అట్టి నిరీక్షణము నంగీకరించిన సూర్యోదయానంతరమునఁ గూడ నొకానొకప్పుడు రశ్మిప్రాప్తి లేకపోవలసి వచ్చును, నాడులతో సూర్యకిరణములు

సంబంధించునప్పుడే కదా వానిమూలమున (సూర్యకిరణములమూలమున) జీవునకు నూర్ధ్వగమనము తటస్థించును. దేహము బాగుగ నుండిననేగాని యిట్టి సంబంధము తటస్థింపదు. కొన్ని కొన్ని సమయములయందు మృత శరీరము లప్పుడే దహింపఁబడుటగూడఁ గలదు కదా! ఒకవేళ తెల్లవారు నంతకు తనదేహము భస్మ మగునేని యప్పు డాజ్ఞాని యేమిచేయును? సూర్యరశ్ముల నెట్లాక్రమించును? ఇట్లు విరుద్ధ మగుటచే నీమతము యుక్తియుక్తము కాదు. "స యావత్ క్షిప్యే న్మన స్తావ దాదిత్యం గచ్ఛతి" "ఆయుపాసకుఁడు మనస్సు నెప్పుడు ప్రయాణోన్ముఖమును గావించునో యప్పుడే సూర్యలోకమును జెందును" అను మొదలగు వాక్యములచే శ్రుతి "జ్ఞానులు ఏవిషయమును గూర్చియైనను నిరీక్షించువారు కారు" అని స్పష్టము చేయుచున్నది. కావున నెట్లును మృతినొందినవానికి సూర్య రశ్మిప్రాప్తి తత్క్షణమే కలుఁగు ననుటయే సిద్ధాంతము.

---

## ౧౧. దక్షిణాయనాధికరణము.

విషయ సంశయ సంగతి పూర్వపక్షములు : — ఈయధికరణము నందును పూర్వమువలెనే క్రమముక్తికాలము విచారింపఁబడును. కావున నీరెండధికరణములకు నేకవిషయత్వమే సంగతి. "దక్షిణాయనమున మర ణము నొందినవాఁడు ముక్తినిఁ జెందునా? చెందఁడా?" యనుసంశయము నిరాకరింపఁబడును. "శ్రుతిస్మృతులయం దుత్తరాయణమే ముక్తిసాధన మనియున్నది. 'ఆపూర్యమాణ పక్షా ద్యాన్ షడ్ దజ్ జేతి మాసాం స్తాన్' 'సూర్యుఁడు ఉత్తరపువైపు నడచు నుత్తరాయణమాసముల నాఱింటిని ఉపాసకుఁడు శుక్లపక్షమునుండి చెందును' అను వాక్యముచే శ్రుతియు; 'భీష్ముఁడు శరతల్పగతుఁడై యుత్తరాయణము వచ్చువంతవఱకు ప్రాణ ములను విడువక ప్రతీక్షించుచుండును' అను మొదలగు కథల వర్ణించుటచే స్మృతులును ఈవిషయమును స్పష్టము చేయుచున్నవి. కావున దక్షిణాయనమున మృతి నొందినవాఁడు ముక్తి నొందనేరఁడు. పూర్వాధికరణమునఁ గాలాపేక్ష జ్ఞానికి లేదంటిరి గాని యిచ్చట నట్లు

చెప్పుటకు వీలు లేదు" అని ప్రత్యుదాహరణసంగతితో వచ్చిన పూర్వ పక్షము ఖండింపఁబడును.

## ౫౧౭. అతశ్చాయనే౽పి దక్షిణే. ౪. ౨. ౨౦.

తాత్పర్యము :— ఈయాక్షేపమునకు సమాధానముగ మేము క్రొత్తగాఁ జెప్పవలసిన దేదియు లేదు. జ్ఞానియగువాఁడు ఫలప్రాప్తికై కాలమును ప్రతీక్షింపఁడనియు విద్యయు నియమముగ ఫలము నొసంగునది యనియు మృత్యువునకు కాలనియమము లేదనియుఁ బై యధికరణమునందే నిరూపించియున్నాము. ఈనిరూపణ నాశ్రయించిన నిచ్చటఁ గూడ కాల విభాగ నియమమునకు వీలుండదు. ఏయయనమున మృతినొందినను జ్ఞాని నిర్వివాదముగ ముక్తిఫలము నొందవచ్చును. ఉత్తరాయణమరణప్రసిద్ధి యజ్ఞానులను గూర్చినదియే కాని జ్ఞానివిషయమైనదికాదు. భీష్ముఁడు జ్ఞాని యయ్యు నుత్తరాయణమువఱకు ప్రతీక్షించుట లోకాచారమును పరి పాలించుటకయ్యే కాని మఱియొకకారణమువలనఁ గాదు. "ఆపూర్య మాణపక్షాత్" అనుశ్రుతికిని మీారు తలంచినది యర్థము కాదు. దానికి నుత్తరాయణాభిమానిదేవతయే యర్థము. ఈవిషయము "అతివాహి కాస్తల్లింగాత్. ౪. 3. ౪" అనుసూత్రమున స్పష్టము చేయఁబడును.

## అ-౪. పా-౨. సూ-౨౧.

అవతారిక:—"ఇట్లు కాదు. స్మృతియందు 'యత్ర కాలే త్వనా వృత్తి మావృత్తిం చైవ యోగినః, ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ' 'ఓయర్జునా! యోగులు ఏకాలమునందు మృతినొంది పునరావృత్తిలేని బ్రహ్మలోకమును జెందుదురో ఏకాలమున మృతినొంది పునరావృత్తి నొందుదురో ఆకాలమును చెప్పెద' అని కాలనిర్ణయ మారంభింపఁబడి * అర్చిరాదిమార్గము బ్రహ్మలోకప్రాప్తిసాధన మనియు †ధూమాదిమార్గము పునరావృత్తిహేతు వనియుఁ జెప్పఁబడియున్నది. అందు ఉత్తరాయణాదులు అర్చిరాదిమార్గమునందును దక్షిణాయన రాత్ర్యాదులు ధూమాదిమార్గమునందును జేరియున్నవి. కావున దక్షిణా

---

* అర్చిరాదిమార్గము (అ-౧. పా-౩. సూ-౧౫. పేజీ-202 చూ.)

† ధూమాదిమార్గము (అ-3. పా-౧. పేజీ-10 చూ.)

యనాదులయందు మృతిచెందినవానికి ముక్తి కలుగుట యెట్లు?" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

---

## ౫౧౮. యోగినః ప్రతి చ స్మర్యతే స్మార్తే చైతే.

### ౪. ౨. ౨౧.

తాత్పర్యము:—స్మృతులయందు నిరూపింపఁబడిన కాలభేదము శ్రుతులయందలి విద్యలలోనికి దెచ్చికొనఁబడుటకు వీలులేదు. శ్రుతుల యందు అర్చిరాదిశబ్దములచే నాయా దేవతలుమాత్రమే చెప్పఁబడియున్నవి. ఇట్లగుటచే రెండువిషయములును పరస్పరభిన్నములు. మఱియు స్మృతుల యందు *యోగసాంఖ్యవిభాగము కలదు; వేదమున నది లేదు. ఆ యోగ సాంఖ్యులనుగూర్చియే యిచ్చట నీకాలవిభాగము చెప్పఁబడెను. ఇట్లుండ నిది శ్రుతిసిద్ధము లగువిద్యలతో నెట్లు సంబంధించును. కావున నధికారి భేదము కూడ నుండుటచే నీస్మృతులకును వేదవాక్యములకును విరోధము రాదు. "ఇదియేమి శ్రుతియందలి దేవయాన పితృయానమార్గములే స్మృతి యందును గానవచ్చుచున్నవి" అనియెదవేమొ? అట్లయిన రెండువిషయ ములకును విరోధమే లేదు. శ్రుతియందువలెనే స్మృతియందును దేవతలే పరిగ్రహింపఁబడి యుండిరేని సర్వము సమానమే యగును కదా! "తం కాలం వక్ష్యామి" అనుకాలోపదేశప్రతిజ్ఞ స్మృతియందుఁ గాన వచ్చుటచే గదా మొట్టమొదట నీసంశయము కలిగినది. ఆ ప్రతిజ్ఞ యట్టిది గాక కాలోపదేశద్వారమునఁ దదభిమానిదేవతల నుపదేశించునది యగు నేని యిక భేద మేమి కలుగును కావున నెట్లును క్రమముక్తిఫలమునకు కాలనియమము లే దనుటయే సిద్ధాంతము.

బ్రహ్మసూత్రార్థచంద్రికయందు చతుర్థాధ్యాయమున
ద్వితీయపాదము.

---

* యోగ మనఁగా కర్మయోగము. సాంఖ్య మనఁగా జ్ఞానయోగము. వీనిని విభా గించి చెప్పుట యోగసాంఖ్యవిభాగము. మఱియు యోగ మనఁగా నిష్టానిష్టఫలముల యందు సమచిత్తత్వము. సాంఖ్య మనఁగా ఫలేచ్ఛారాహిత్యము.



# బ్రహ్మసూత్రార్థచంద్రిక.

## చతుర్థాధ్యాయము - తృతీయపాదము

### పాదావతారిక

పూర్వపాదమున నుత్క్రాంతి విచారింపఁబడెను. ప్రస్తుత *మంగాంగిభావసంగతితో నీయుత్క్రాంతికిఁ బిదప నాశ్రయింపఁబడు దేవయాన మార్గము విచారింపఁబడును. ఆమార్గముయొక్క స్వరూపంబును జీవులు దానియందు ప్రయాణముఁజేయువిధంబును బ్రహ్మలోకప్రాప్తిప్రకారంబును మఱియుఁ బ్రస్తావాగతము లగునితరవిషయములును నిరూపింపఁబడును.

---

### ౧. అర్చిరాద్యధికరణము

విషయసంగతిసంశయములు:—అందీప్రథమాధికరణమున బ్రహ్మలోకమార్గ మేకవిధమా? యనేకవిధమా? యనువిషయము విచారింపఁబడును. శ్రుతులయందు "అథైతై రేవ రశ్మిభి రూర్ధ్వ ఆక్రమతే" అని యొకచోట సూర్యకిరణములగుండా బ్రహ్మలోకప్రాప్తి కలుగుననియు "తేఽర్చిష మభిసంభవం త్యర్చి షోఽహః" "ఆయుపాసకులు తేజస్సు నాశ్రయింతురు. అటనుండి పగటిని జెందుదురు. (తేజస్సనఁగా దాని నభిమానించుదేవత పగ లనినను దాని నభిమానించుదేవతయే)" అని మఱియొకచోట నర్చిరాదిక్రమమున నాలోకమునకు నుపాసకులు పోవుదు

* అంగ మనఁగా నవయవము, అంగీ యనఁగా నవి కలది. నీరెంటికినిఁగల సంబంధ మంగాంగిభావసంబంధము.

రనియు, "స ఏతం దేవయానం పంథాన మాసా ద్యాగ్నిలోక మాగచ్ఛతి" "ఆయుపాసకుఁడు దేవయానమార్గము నాశ్రయించి యగ్నిలోకమునకు వచ్చును" అని వేఱొక్కచోట నగ్నిలోకాదులే బ్రహ్మలోకమునకు త్రోవ యనియు, "యదా వై పురుషోఽస్మాల్లోకా త్ప్రైతి స వాయు మాగచ్ఛతి" "ఎప్పుడు పురుషుఁడు దేహమును విడుచునో యప్పుడు వాయువును జేరును." అని కొండొకచోట వాయ్వాదులే తత్ప్రాప్తిసాధనము లనియు, "సూర్యద్వారేణ తే విరజాః ప్రయాంతి" "వారు నిర్విఘ్నముగా సూర్యునిగుండా బ్రహ్మలోకమును జెందుదురు" అని వెండియు నొక్కస్థలమున సూర్యాదులే తత్ప్రాప్తికై యాశ్రయింపఁబడవలసినవారనియు వర్ణింపఁబడి యున్నది. ఇదియే సంశయహేతువు. "ఈమార్గము లన్నియుఁ బరస్పరభిన్నములా? కావా? ఈయన్నివిశేషణముల నేదియో యొకవిధముగ నొక్కస్థలమునందే సమన్వయింపవలయునా? అనుసంశయ మీసందర్భమువలన కలుగును అది సయుక్తికముగ నిందు నిరాకరింపఁబడును. ఈయధికరణము మొదటి దగుటచే దీనికిఁ బ్రత్యేకసంగతి లేదు; పాదసంగతియే దీనికిని సంగతి యని తెలిసికొనవలయును.

పూర్వపక్షము:—"దేవయానమార్గము చేరునంతవఱకు నుపాసకులకును అజ్ఞానులకును గూడ నుత్క్రాంతిమార్గ మొక్కటియే యని పూర్వపాదమునందే వివరించి యున్నారు. ఆపిదప నజ్ఞానులగువారికిఁ గలుగుపరిస్థితులు మున్నే వివరింపఁబడి యున్నవి; జ్ఞానులకు బ్రహ్మలోకప్రాప్తి గలుగు ననియు వర్ణింపఁబడి యున్నది. ఆబ్రహ్మలోకప్రాప్తికి మార్గమగు దేవయానమార్గము శ్రుతులయం దనేకవిధములుగ వర్ణింపఁబడి యున్నది. దీనినిఁ బట్టిచూచిన బ్రహ్మలోకప్రాప్తి కనేకమార్గములు కలవనుటయే యుక్తియుక్తముగఁ దోఁచుచున్నది; ఉపాసకు లగువారు వానిలో నేదియో యొకమార్గము నాశ్రయించి బ్రహ్మలోకమును జెందవచ్చు ననుటయే నిర్వివాదముగ నున్నది. ఈమార్గములు వేఱువేఱుప్రకరణములయందును వేఱువేఱువిద్యలకు సమీపమునందును వర్ణింపఁబడినవి యగుటచే వేఱువేఱుగనే యుండి తీరవలయును. అన్నియు నొక్కటియే యైనయెడల 'ఏతై రేవ రశ్మిభిః' అనునవధారణ నిరర్థక మగును. 'ఉపాసకుఁడు సూర్యకిరణముల నాశ్రయించియే నిర్గమించును.' అనిన నర్థ మేమి? 'మఱియొకమార్గముగుండా నిర్గమింపఁడు' అనియే కదా! రెండవమార్గమే

లేకుండిన నీయవధారణ మెట్లు యుక్తియుక్త మగును? ఇదియును గాక 'స యావ త్క్షిప్యేత్' అను శ్రుతియందు త్వర వర్ణింపఁబడి యున్నది. ఇదియు రెండవమార్గము లేకున్న విరుద్ధ మగును. ఒకపట్టణమునకు నాల్గువైపులనుండియు ననేకమార్గము లుండి యందుఁ గొన్ని వంకర గాను మఱికొన్ని చక్కగాను ఉండినచో నప్పుడు 'ఇది వంకరమార్గము దీని నాశ్రయించిన నాపట్టణమునకు త్వరగాఁ జేరరు.' అనియు, 'ఇది చక్కనిమార్గము దీని నాశ్రయించిన నాపురమునకు శీఘ్రముగాఁ జేరు దురు.' అనియుఁ జెప్పఁబడవచ్చును గాని మార్గాంతరమే లేకుండిన నది యెట్లు సరిపడును? ఈకారణములవలన నిర్వివాదముగ మార్గములు భిన్నములే."

## అ-౪. పా-౩. సూ-౧.

అవతారిక:—అనిన నీపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౫౧౯. అర్చిరాదినా తత్ప్రథితేః. ౪. ౩. ౧.

తాత్పర్యము:—మార్గములు పరస్పరభిన్నము లని సంశయింపఁ బని లేదు. అర్చిరాదిమార్గ మొక్కటియే బ్రహ్మలోకమునకు మార్గము. ఉపాసకు లామార్గము నాశ్రయించియే ప్రయాణముఁ జేయుదురు. శ్రుతి యందు విద్యాభేదాదుల నపేక్షింపక సర్వోపాసకులకు నర్చిరాదిమార్గమే వర్ణింపఁబడి యున్నది. "యేచామీ అరణ్యే శ్రద్ధాం సత్య ముపాస తే" "ఎవ్వరు అరణ్యమున నివసించి శ్రద్ధాపూర్వకముగ పరమేశ్వరు నుపాసింతురో వారు దేవయానమును జెందుదురు" అని పంచాగ్నివిద్య యందు కలదు. అచ్చట నర్చిరాదిమార్గమే స్పష్టముగ వర్ణింపఁబడి యున్నది. ఈకారణమువలన నందఱకును అర్చిరాదిమార్గ మొక్కటియే మార్గ మని సిద్ధాంతముఁ జేయుటకు వీ లగుచున్నది.

"ఈసిద్ధాంతము కొంతవఱకు యుక్తమే. వేదమున ననేకవిద్యలు కలవు. అందు కొన్నిటియందు బ్రహ్మలోకమార్గము చెప్పఁబడి యున్నది; మఱికొన్నిటియందు చెప్పఁబడి యుండ లేదు. కావున పై శ్రుతి ననుసరించి చూచిన నేయేస్థలములయందు మార్గాంతరము చెప్పఁబడలేదో ఆయాస్థల ములయందు ఈయర్చిరాదిమార్గ మనువర్తింపవచ్చు నని తేలుచున్నది.

ఇంతయే గాని మార్గాంతరము చెప్పఁబడియున్నచోట్ల నిది యేల యను వర్తింపవలయును ?" అనియెదవేమొ వినుము. ఈమార్గములు పరస్పర భిన్నములై యుండునేని యప్పుడు మీ రన్నట్లే యగును; అర్చిరాది మార్గము మార్గాంతరములు చెప్పఁబడియున్నస్థలమున ననువర్తింపకుండును గాని యిచ్చట నట్లు లేదు. అన్నిచోట్లను చెప్పఁబడియున్న మార్గ మొక్కటియే. దానికి ననేకవిశేషణము లుండుటచే నొక్కొక్కస్థలమున నొక్కొక్కవిశేషణము గ్రహింపఁబడెను. ప్రధాననగరమునకు మాత్రమే బోవుచున్నను మార్గమునందు మధ్యమధ్య ననేకగ్రామము లుండునట్లు బ్రహ్మలోకమునకుఁ బోవునర్చిరాదిమార్గమునందును నడుమనడుమ ననేక లోకములు గలవు. వానిలో నొక్కొక్కటి యొక్కొక్కస్థలమున గ్రహింపఁబడి యున్నది. ఇట్లగుటచేతనే యన్నిశ్రుతులు నొక్కమార్గమునకే సంబంధించినవి యని గుఱుతింపఁబడుచున్నది. ఇట్లగుటచేతనే "మార్గ మంతట నొక్కటియే" అని సిద్ధాంతము చేయఁబడుచున్నది. ఇది యుక్తమేకదా! ఆశ్రుతులు భిన్నప్రకరణములయం దున్నను సమాన విద్యలయందు *గుణోపసంహారము చేయఁబడునట్లు సమానమార్గమునం దును గుణోపసంహారము చేయఁబడవచ్చును కదా! పైశ్రుతులయందును అచ్చటచ్చట గొంతయాధిక్యముఁ జెప్పఁబడి యున్నను అర్చిరాది మార్గప్రస్తావమున వర్ణింపఁబడియున్నలోకములలో నేదియైన నొక్కటి నియతముగఁ బ్రతిస్థలమునందును గ్రహింపఁబడుచున్నది. ఈకారణము వలన సర్వస్థలములయందు నొక్కమార్గమే యభివర్ణింపఁబడె ననుట నిర్ణయింప నగును. మఱియు విద్యలు గూడ పరస్పరభిన్నములే యైనను అన్నిటికిని బ్రహ్మలోకప్రాప్తియే ఫల మగుటచేతను అర్చిరాదిమార్గము నందు ప్రస్తావింపఁబడినలోకములలో నేదియైన నొక్కటి గ్రహింపఁ బడియే యుండుచుండుటచేతను మార్గమునకు మాత్రము భేదము కలు గదు. మార్గ మొక్కటియే యైనను అం దనేకలోకము లుండవచ్చును; ఒకస్థలమున గొన్నియు మఱికొన్ని స్థలముల మఱికొన్నియు నాలోక ములు వర్ణింపఁబడి యుండవచ్చును. ఇట్లుండ ననేకమార్గములు కల

* గుణోపసంహార మనఁగా నొకస్థలమున జెప్పఁబడియున్నధర్మముల సమాన మగు మఱియొకస్థలమునకుఁ దెచ్చికొనుట.

వని యంగీకరింపనేటికి ? అది *గౌరవము కదా! కావున నిర్వివాదముగ సర్వోపాసకులకును అర్చిరాదిమార్గ మొక్కటియే బ్రహ్మలోకప్రాప్తికి మార్గ మని సిద్ధాంతము చేయవచ్చును.

"అ థైతై రేవ రశ్మిభిః" అను నవధారణంబును త్వరను గూర్చి చెప్పుటయుఁ గూడ నీసిద్ధాంతమును భంగము చేయనేరవు. ఈ యవధారణము పదార్థాంతరముల నిషేధించుటకై చేయఁబడినది కాదు. అచ్చట నున్న వాక్యముల విమర్శించిన నీవిషయమే స్పష్ట మగును. ఈ కారణమువలన నాయవధారణము కారణములకుఁ గలస్వాతంత్ర్యమును కాలభేదముతోఁ బనిలేకయే కార్యనిర్వాహమును చేయఁగలుగుటను మాత్రమే చెప్పుచున్నది యనవలయును. మఱియు నొక్కపదమే యొక విషయమును విధించుచు తక్కినవిషయములను నిషేధింపుచుఁ గూడ నుండు నని చెప్పుట సంభవింపదు. అప్పుడు వాక్యభేదము కలుగును కదా! కావున నిర్వివాదముగ నీయవధారణము కిరణప్రభావము నభివర్ణించు నదియే. "వేదమున నవిశేషముగ విధింపఁబడి యుండుటచే జీవునకు రాత్రియైనను పగలైనను సూర్యకిరణములే మార్గములు." అనువిషయమును దృఢము చేయునదియే. విచారించిన నచ్చటి వాక్యసందర్భమునందు మొట్ట మొదటినుండియు నపూర్వముగఁ గిరణప్రస్తావము చేయఁబడి వానికి నాడులతోఁ గలసంబంధము ప్రయత్నపూర్వకముగ వర్ణింపఁబడి తుదకు నవియే ఊర్ధ్వగమనమార్గములుగఁ జెప్పఁబడి యున్నవి. ఇట్లుండ నిది విధికాక కేవల మర్థాంతరనిషేధమాత్ర మగుటకు వీలు లేదు కదా! కావున నిర్వివాదముగ నవధారణమువలన మాసిద్ధాంతమునకు భంగము రాదు. ఇట్లే త్వరను గూర్చి చెప్పుటయు భంగకరము కానేరదు. అర్చిరాదిమార్గము నొక్కదానినే పరిగ్రహించినను త్వర చెప్పఁబడవచ్చును. గంతవ్యప్రదేశ మొక్కటియే యైనను మార్గము కూడ నొక్కటియే యైనను గమనమునకు మాత్రము భేదము కలుగవచ్చును; ఇతరప్రదేశములకుఁ బోవువారికంటె వేగముగ నుపాసకులు బ్రహ్మలోకమును జెందవచ్చును. "వీఁడు నిమిషములో గమ్యస్థానమును జేరును" అను మొదలగువ్యవహారములవలె శ్రుతి యీవ్యవహారమునుగూడఁ జేసి యుండ

* గౌరవము. (అ-౧. పా-3. సూ-౨౧. పేజీ-317 చూ.)

వచ్చును. కావున నిర్వివాదముగ నర్చిరాదిమార్గము నొక్కదానినే యంగీకరింప వచ్చును.

దీనికి మఱియొక ప్రమాణముకూడ కలదు. "అథైతయోః పథోర్న కతరేణ చ న" "పాపాత్ము లగువారు ఈపితృయాన దేవయానములలో నొక్కదానినిఁగూడ నాశ్రయింపరు." అని శ్రుతియందు రెండుమార్గములు మాత్రమే చెప్పఁబడి వాని నాశ్రయింపనివారికి నతికష్ట మగు మూఁడవ మార్గము చెప్పఁబడి యున్నది. ఇట్లగుటచే నుత్తమగతికి సాధనము లగునవి రెండుమార్గములు మాత్రమే యని స్పష్టమగుచున్నది. ఆరెంటిలో నొక్కటి స్వర్గాదిప్రాప్తిసాధన మగుపితృయాన మనుటలో వివాదము లేదు కదా! ఇఁక మిగిలినది యొక్కమార్గమే. అదియే దేవయానము; అదియే యర్చిరాదిమార్గము; ఈనిరూపణమువలనఁగూడ నర్చిరాదిమార్గ మొక్కటియే వేదమునకు సమ్మత మైనట్లు తోఁచుచున్నది. ఇదియునుఁగాక నర్చిరాదిమార్గమును ప్రత్యక్షముగా వర్ణించునప్పుడు మార్గమధ్యమునం దనేకలోకము లున్నట్లు చెప్పఁబడి యున్నది. ఇతరస్థలములయం దన్నో క్రొత్తవిషయములు కొన్ని చెప్పఁబడినను ప్రాతవానిలో నొక్కటియే జెప్పఁబడుచు వచ్చెను; అల్పసంఖ్య గలుగునట్లు మాత్రమే మొత్తము మీఁద విషయము లభివర్ణింపఁబడుచు వచ్చెను. దీనిని బట్టిచూచినను మా సిద్ధాంతమే స్థిరమగును. అల్పవిషయముల నధికములోనికి నుప సంహరించు కొనవలయు ననుట యుక్తియుక్తము కదా! కావున నెట్లును అర్చిరాది మార్గ మొక్కటియే ముక్తికి సాధనము.

---

## ౨. వాయ్వధికరణము.

విషయ సంశయములు:— పై యధికరణమున మోక్షమార్గ మొక్కటియే యని నిరూపింపఁబడెను. ఇచ్చట గుణోపసంహారముఁ జేయ వలసిన తెఱంగు విచారింపఁబడును. అధికముగఁ జెప్పఁబడియున్న విషయ ముల నిచ్చటఁ జేర్పవలసినదియు వివరింపఁబడును. "స ఏతం దేవయానం పంథాన మాప ద్యాగ్నిలోక మాగచ్ఛతి స వాయులోకం స వరుణలోకం స ఇంద్రలోకం స ప్రజాపతిలోకం స బ్రహ్మలోకం" "ఆయుపాసకుఁడు

దేవయానమార్గము నాశ్రయించి మొట్టమొదట నగ్నిలోకమునకుఁ బోవును. వాయులోకమునకును అం దుండి వరుణలోకమునకును అం దుండి ఇంద్రలోకమునకును పిదప ప్రజాపతిలోకమునకును తరువాత బ్రహ్మలోకమునకును బోవును." అని కౌషీతకీబ్రాహ్మణోపనిషత్తునందు దేవయానశ్రుతి కలదు. ఇచ్చట మొట్టమొదట నగ్నిలోకము వర్ణింపఁబడెను; అర్చిరాదిమార్గమును చెప్పునప్పుడును మొట్టమొదట నర్చిశ్శబ్దము ప్రయోగింపఁబడెను. అర్చిశ్శబ్దమునకుఁ గూడ నగ్నియే యర్థ మగుటచే నింతవఱకు సంశయము లేదు. తర్వాత నిచ్చట వాయులోకమును గూర్చియు నచ్చట నహరభిమానదేవతను గూర్చియు చెప్పఁబడి యున్నది. ఇది విరుద్ధము కదా! "ఈవిషయము నెట్లు సమన్వయింపవలయును? వాయులోకము నెచ్చటఁ జేర్పవలయును?" అనుసంశయ మిచ్చట నిరాకరింపఁబడును. "సూర్యప్రాప్తికిఁ బూర్వము వాయుప్రాప్తి" యని సిద్ధాంతము చేయఁబడును.

సంగతి పూర్వపక్షము:—"ఇట్లు సిద్ధాంతము చేయుటకు వీలు లేదు. 'యదా వై పురు షోఽస్మా ల్లోకాత్ప్రైతి స వాయు మాగచ్ఛతి తస్మై స తత్ర విజిహీతే యథా రథచక్రస్య ఖం తేన స ఊర్ధ్వ మాక్రమతే స ఆదిత్య మాగచ్ఛతి" "ఎప్పుడు పురుషుఁడు యీశరీరమునుండి నిర్గమించునో అప్పుడు వాయువును జెందును. రథచక్రము యొక్క-రంధ్రమువలె నావాయువు తన యవయవముల సంకోచించి యూర్ధ్వగతికై వానికి మార్గము నొసంగును. దానితో నాతఁడు పైకిఁ బోవును సూర్యునిఁ జేరును." అనుశ్రుతిని ప్రమాణముఁ జేసికొని మీారు అట్టి సిద్ధాంతమును జేసియుండవచ్చును గాని యది నిలువదు. వాయుసూర్యులకు నెట్లును సంబంధము కుదురదు. వాయువు నొసంగినరంధ్రమునుండి జీవుఁడు పైకి మాత్రమే పోవునుగాని సూర్యుని యొద్దకుఁగాదు. అట్లు నిర్గమించుటకుఁ దగినసాధనమేమియు లేదు. "తేన" అనుపదము "ఊర్ధ్వ మాక్రమతే" అనువాక్యముతో మాత్రమే సంబంధించునుగాని "ఆదిత్య మాగచ్ఛతి" అను నుత్తరవాక్యముతో సంబంధింపదు. ఆవాక్యమునకు నీపదముతో * నాకాంక్ష లేదు. ఈపదము లేకున్న నావాక్యార్థమునకు వచ్చు కొఱతయు లేదు. ఆవాక్యార్థము

* ఆకాంక్ష. (అ-౧. పా-౪. సూ-3. పేజీ-451 చూ.)

స్వతంత్రమే కావచ్చును. ఈకారణమువలన వాయుసూర్యులకు సంబంధమును కల్పించుటకు వీలులేదు. కావున పూర్వాధికరణమునందు గుఱుతునాశ్రయించి యెట్లు అర్చిరాదిమార్గ మొక్కటియే యన్నిస్థలములయందును చెప్పఁబడినట్లు సిద్ధాంతముఁ జేసితిరో అట్లే యిచ్చటఁగూడ పాఠక్రమము ననుసరించి అగ్నిలోకమునకు వెనుక వాయులోకము నుపాసకుఁడు జెందు నని సిద్ధాంతము చేయవలయును. "పాఠక్రమమన్నిటికంటె దుర్బలము కదా!" యనియెదవేమో వినుము. అంతకంటె ప్రబలము లగుశ్రుత్యాదులు లేనప్పు డదియే బలవత్తర మగును. "నిరస్తపాదపే దేశే యేరండోఽపి ద్రుమాయతే" "వృక్షములు లేనిస్థలములందు ఆముదపుచెట్టు కూడ మహావృక్షమే" యనున్యాయము లోకమునఁ బ్రసిద్ధమైయున్నది కదా!

## అ_౪. పా_౩. సూ_౨.

అవతారిక :— అని యిట్లు దృష్టాంతసంగతితో వచ్చిన పూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

# ౫౨౦. వాయుమబ్దాదవిశేషవిశేషాభ్యాం.

## ౪. ౩. ౨.

తాత్పర్యము:—ఇట్లు సంశయింపవలసినపని లేదు. ఊర్ధ్వశబ్దము విశేషముగ నేదియైన నొకలోకమును చెప్పునది యగునేని యప్పుడు నీపూర్వపక్షము యుక్తమగును గాని యట్లు లేదు. అది సామాన్యముగ పైభాగమును మాత్రమే చెప్పుచున్నది. కావున విశేషవిజ్ఞానమునకై యేదేని లోకమును గ్రహింపవలసియుండును. సమీపమున నాదిత్యశబ్దముండుటచే నాలోకమే యాయూర్ధ్వశబ్దముచే నుద్దేశింపఁబడె ననుట యుక్తియుక్తము. విశేషనిర్దేశము లేకున్న సామాన్యమునకు నర్థముండదు కదా! కావున "యదా వై పురుషోఽస్మాల్లోకాత్ప్రైతి" అను శ్రుతియందలి "తేన" యనుశబ్ద మచ్చటి యాదిత్యలోకముతోనే సంబంధించు నన వలయును. ఇట్లగుటచే నాశ్రుతియందు వాయ్వాదిత్యలోకములకు సంబంధము చెప్పఁబడె ననుట స్పష్టము. ఈకారణమువలన నాయాదిత్యలోకమునకంటెఁ బూర్వముననే యీవాయులోకమును జేర్పవలయును.

"తేఽర్చిష మే వాభిసంభవం త్యర్చి షోఽహ రహ్న ఆపూర్యమాణపక్ష మాపూర్యమాణపక్షా ద్యాన్ షడ్ దజ్ జేతి మాసాం స్తాన్ మాసేభ్యః సంవత్సరం సంవత్సరా దాదిత్యం" "ఆయుపాసకులు దేహమునుండి నిర్గ మించినపిదప నగ్నిలోకమునకును అటనుండి అహర్లోకమునకును (పగటి నభిమానించు దేవతయొక్క లోకమునకును) ఇట్లే శుక్లపక్షలోకమున కును అటనుండి యుత్తరాయణలోకమునకును అందుండి సంవత్సరలోక మునకును ఆటనుండి సూర్యలోకమునకును బోవుదురు" అను వరుస యందు సంవత్సరలోకమునకంటె తరువాతను ఆదిత్యలోకమునకంటెఁ బూర్వమునను వాయులోకమును జెప్పవలయును. "సంవత్సరలోకము నుండి వాయులోకమునకును అటనుండి సూర్యలోకమునకును బోవుదురు" అని చెప్పవలయును. "అగ్నిలోకము వాయులోకము" అనుశ్రుతియందు సామాన్యముగఁ జెప్పఁబడియున్నను "యదా" ఇత్యాదిశ్రుతియందు తత్సంబంధము విశేషముగఁ జెప్పఁబడి యున్నది కదా!

"అగునుగాక 'అగ్నిలోక మాగచ్ఛతి స వాయులోకం' అనుశ్రుతి యందు అగ్నిలోకమునకు ప్రక్కనే వాయులోకము వర్ణింపఁబడియున్నది కదా! దీనినే విశేషవచనముగ నేల గ్రహింపరాదు. అగ్నిలోకమునకు ప్రక్కన వాయులోకము నేల చేర్పరాదు." అనియెదవేమొ వినుము. ఈశ్రుతియందు సామాన్యముగ నామనిర్దేశము మాత్రమే గానవచ్చు చున్నది గాని విశేష మేమియు గానరాలేదు. అగ్నిలోకమునకు వెనుక వాయులోకమునే చెందునని యావశ్యకతయు క్రమమును సూచించు పద మేదియు నిందు గానరాలేదు. విశేషశ్రుతి యేదియు లేకున్నచో నప్పుడు గతిలేకపోవుటచే నీపాఠక్రమమునే విషయనిర్ణయమునం దాధార ముగఁ గైకొనవలసివచ్చును గాని యిచ్చట వట్లు లేదు. విశేషశ్రుతి యందు ("యదా వై" అనుశ్రుతియందు) వాయులోకమునకుఁ బోవు టయు నావాయువు రథచక్రమంత రంధ్రము నొసంగుటయు నందుండి సూర్యలోకమునకుఁ బోవుటయు ననునీవిషయము లన్నియు స్పష్టముగ వర్ణింపఁబడి యున్నవి; సూర్యవాయువులకుఁ గలసంబంధము నిర్ణయింపఁ బడి యున్నది. ఈనిర్ణయమువలన "వాయులోకమునుండి సూర్యలోక మునకుఁ బోవును" అనుక్రమము గ్రహింపఁబడుటకు వీలు కలదు కదా! అగ్నిలోకమునకు ప్రక్కనే వాయులోకమును జేర్చినయెడల నందుండి

యహర్లోకమునకుఁ బోవలసిరాఁగా విశేషశ్రుతియందలిసంబంధవచనము నిరర్థక మగును కదా ! కావున నిచ్చట విశేషశ్రుతి నాశ్రయించియే యర్థనిర్ణయమును గావింపవలయును; సంవత్సరసూర్యులకు నడుమనే వాయులోకమును ప్రవేశపెట్టవలయును.

విశేషాంశము:—ఇందు మఱియొకవిశేషము గమనింపఁబడవలసి యున్నది. బృహదారణ్యకశ్రుతియందు "మాసేభ్యో దేవలోకం దేవలోకా దాదిత్యం" "ఉత్తరాయణమునుండి దేవలోకమునకుఁ బోవును. అట నుండి సూర్యలోకమునకుఁ బోవును" అని యున్నది. ఈశ్రుతి ననుసరించిన వాయులోకము దేవలోక సూర్యలోకములకు నడుమఁ జేర్పఁబడవలసి యుండును. విశేషశ్రుతియందు వాయులోకసూర్యలోకములకు సంబంధము చెప్పఁబడియున్నందున నడుమ మఱియొకలోక ముండుటకు వీలు లేదు కదా! ఇదియునుగాక బృహదారణ్యకోపనిషత్తునందు సంవత్సర లోకమునుగూర్చియు ఛాందోగ్యోపనిషత్తునందు దేవలోకమును గూర్చియుఁ జెప్పఁబడి యుండలేదు. అయినను మనకు నన్నిశ్రుతులును సమానములే కావున నిందేవిషయమును గూడ విడువఁగూడదు. కావున మాసములతో సంబంధము కలది యగుటచే వానిప్రక్కన సంవత్సర లోకము జేర్పవలయును. మిగిలినదేవలోకమును దానితర్వాత జేర్పవల యును. అదియు సూర్యలోకమునకంటెఁ బూర్వముననే పఠింపఁబడియున్నది కదా ! తరువాత నాసూర్యలోకముతో సంబంధము గలవాయులోక మును జేర్పవలెను. "ఉత్తరాయణలోకమునుండి సంవత్సరలోకమునకును అందుండి దేవలోకమునకును అటనుండి వాయులోకమునకును పిదప సూర్యలోకమునకుఁ బోవును" అని సిద్ధాంతము చేయవలయును.

"ఇట్లయిన 'వాయు మబ్దాత్' 'సంవత్సరమునకు ప్రక్కన వాయు లోకమును జేర్పవలయును' అని సూత్రకారుఁ డెట్లు చెప్పెను" అనియెద వేమో యది ఛాందోగ్యపాఠము ననుసరించి చెప్పఁబడినవిషయము.

---

# ౩. తడిదధికరణము

విషయసంశయ సంగతిపూర్వపక్షము:—ఈయధికరణమున "స వరుణలోకం స ఇంద్రలోకం స ప్రజాపతిలోకం" అని చెప్పఁబడియున్న లోకములయొక్క క్రమ మానంతర్యసంగతితో విచారింపఁబడును. "వీని క్రమమును సాధించుటకుఁ బ్రమాణము లేవియుఁ లేవు." అను సంశయము ఖండింపఁబడును. "వీనినిఁగూర్చి చెప్పుశ్రుతి యుపపత్తి లేకపోవుటచే నప్రమాణము కావలయును." అనుపూర్వపక్షము నిరాకరింపఁబడును.

## ౫౨౧. తడితోఽధి వరుణః సంబంధాత్

## ౪. ౩. ౩.

తాత్పర్యము:—"ఆదిత్యా చ్చంద్రమసం చంద్రమసో విద్యుతం" "సూర్యలోకమునుండి చంద్రలోకమునకును అటనుండి విద్యుల్లోకమునకును ఉపాసకుఁడు పోవును." అని దేవయానమార్గముయొక్క శేషము ఛాందోగ్యోపనిషత్తునందు వర్ణింపఁబడి యున్నది. "స వాయులోకం స వరుణలోకం" అనుశ్రుతియందుఁ జెప్పఁబడియున్న వరుణలోకమును నీవిద్యుల్లోకమునకు నావలఁ జేర్పవలయును. దానికి నిచ్చట సంబంధము కలదు. వరుణుఁడు జలాధిపతి యని శ్రుతిస్మృతులయందు ప్రసిద్ధమై యున్నది; మెఱుపునకు పైభాగమునందే మేఘములు జలసహితములై యున్నవి యనుటయుఁ బ్రత్యక్షమై యున్నది. మెఱుపు మెఱసిన పిదప వర్షము కురియుట సుప్రసిద్ధమై యున్నది. "విద్యోతతే స్తనయతి వర్షిష్యతి వా" "మెఱయుచున్నది ఉఱుముచున్నది వర్షించునేమో ? (మెఱుపుయొక్క సంచారకాలమునందు కలుగుధ్వనియే యుఱు మని శ్రుతిచే నుదాహృత వాక్యమునకుఁ బూర్వమున వర్ణింపఁబడి యున్నది. ఈకారణమువలననే యావాక్యమున నీరెంటికిని సంబంధము చెప్పఁబడె నని తెలిసికొనవలయును.)" అని శ్రుతియు నిట్లే చెప్పుచున్నది. కావున మెఱుపునకును జలమునకును సంబంధము కలదు; జలాధిపతి యగుటచే వరుణునకును వానిమూలమున వరుణలోకమునకును సంబంధముకలదు. కావున విద్యుల్లోకమునకు మీఁద వరుణలోకమును జేర్పవలయును. మఱియుఁ బాఠక్రమమును బాధింపఁగలసంబంధ మేదియు లేకపోవుటచే నింద్రప్రజాపతిలోకములఁ

దదనంతరమునందుఁ జేర్పవలయును. మఱియు *నాగంతుకము లగుటచేతఁ గూడ నీవరుణాదిలోకములు పాఠక్రమానుసారముగ నంతమునందే చేర్పఁ బడవలసినవి యై యున్నవి. తటిల్లోకము దేవయానమునకు నంతముగఁ జెప్పఁబడి యున్నది; అంతవఱకు నన్నిలోకములకును పరస్పరసంబంధ మేదియో యొకవిధముగ వర్ణింపఁబడియున్నది. కావున వానిమధ్యము నందు వరుణాదిలోకములకు సంబంధము కుదురదు కదా! కావున నెట్లును వరుణేంద్రప్రజాపతిలోకములు తటిల్లోకమునకుఁ బిదపనే నిర్వివాదముగఁ జేర్పఁబడవలయును. ఆగంతుకముల నంతమునందే జేర్చుట సంప్రదాయ సిద్ధము.

ఈకారణమువలన దేవయానమార్గము నెట్లు నిర్ణయింపవలయును? ఉపాసకుఁడు శరీరమును విడువగనే తవనాడులతో సంబంధపడియున్న సూర్యరశ్మల నాశ్రయించి యూర్ధ్వగమనము నారంభించును. మొట్ట మొదట నగ్నిలోకమును పిదప అహర్లోకమును తరువాత శుక్లపక్షలోక మును అనంతరమున నుత్తరాయణలోకమును ఆవల సంవత్సరలోకమునుఁ బిదప దేవలోకమును ఆవెనుక వాయులోకమును అనంతరమున సూర్యలోక మును పిమ్మట చంద్రలోకమును తర్వాత విద్యుల్లోకమును అవ్వల వరుణలోకమును అనంతరమున నింద్రలోకమును బిదప ప్రజాపతిలోక మును జేరును. అటనుండి గమ్యస్థాన మగు బ్రహ్మలోకమును ప్రవేశించును.

---

## ౪. ఆతివాహికాధికరణము.

విషయ సంగతి సంశయములు:—పూర్వాధికరణమునందు అర్చి రాదిమార్గమునకుఁ గలక్రమము నిరూపింపఁబడెను. ప్రస్తావసంగతితో వానిస్వరూప మిందు నిరూపింపఁబడును. "ఈయర్చిరాదులు బ్రహ్మ లోకమార్గమునకు గుఱుతులుగఁ జెప్పఁబడెనా? లేక ఉపాసకునకు భోగ స్థానము లని వర్ణింపఁబడెనా? అట్లు గాక నుపాసకుని బ్రహ్మలోకమునకు గొనిపోవునవి యని నిర్ణయింపఁబడెనా?" యనుసంశయ మిందు నివా

---

* ఆగంతుకము లనఁగా పూర్వోత్తరసందర్భము లేకయే యాకస్మికముగ ప్రస్తా వింపఁబడునవి.

రింపఁబడును. "ఈయర్చిరాదు లుపాసకుని ఆయాయుర్ధ్వలోకమునకుఁ గొనిపోవునవియే" యని సిద్ధాంతము చేయఁబడును.

పూర్వపక్షము:—"ఇట్లు సిద్ధాంతము చేయుటకు వీలు లేదు. ఒకపక్షమునఁ జూచిన నీయర్చిరాదులు మార్గచిహ్నములు మాత్రమే యగు నని తోఁచుచున్నది. ఇచ్చటియుపదేశక్రమ మట్లే యున్నది. లోక మున నొక గ్రామమునుగూర్చి పోవువానికి 'నీవు ఈమార్గమునఁ బోయిన నొకకొండ గానవచ్చును. అచ్చటినుండి నడచినఁ గొంతదూరమున నొక పెద్దమఱ్ఱిచెట్టును జేరఁగలవు. అచ్చటనుండి యట్లే నడచిన నొక్కనది గానవచ్చును. దానితీరమునందే నీవు చేరవలసిన గ్రామ మున్నది.' అని చేయఁబడు నుపదేశమువలెనే యిచ్చటియుపదేశము కూడ నున్నది. కావున నివి మార్గచిహ్నములుగనే యుపదేశింపఁబడె ననవలసి యున్నది.

ఇట్లు కాకున్నను ఇవి భోగస్థానములు కావచ్చును. ఉపాసకుఁడు వీనిలో సుఖముల ననుభవించును; కొంతకాలము గలసి పిదప బ్రహ్మ లోకమును జేరు ననవచ్చును. ఇవి యన్నియు లోకము లేకదా! లోకములనఁ బడునవి భోగసాధనములే యనుట సుప్రసిద్ధము; 'మనుష్యలోకము దేవ లోకము' అను మొదలగుపదములు ఇట్టియర్థమునందే గ్రహింపఁబడు చున్నవి కదా! మఱియు నీయర్చిరాదిశబ్దములు అచేతనపదార్థముల యందు రూఢములై యున్నవి. అచేతనములు బుద్ధిపూర్వకముగ స్వతంత్ర వ్యాపారములను చేయనేరవు. ఒకపురుషుని మఱియొకస్థలమునకుఁ గొనిపోవుట యను కార్యము వీని కెట్లు శక్య మగును? ఈకారణము వలన నివి భోగార్థమై మాత్రమే యుపయోగించునవిగా నుండ వలయు నని తోఁచుచున్నది. మఱియు నిచ్చటి పంచమీవిభక్తి కారణ మును నిరూపించునది కానేరదు; 'అగ్ని యనుకారణమువలన నుపాసకులు అహర్లోకమునకుఁ బోవుదురు' అని యీవిధముగ నర్థము చెప్పుటకు వీలు లేదు. గుణవాచకము లగుపదములపై గానవచ్చుపంచమీవిభక్తికి మాత్రమే యిట్టియర్థము కలదు. 'వాఁడు మూర్ఖతవలన నష్టము నొందెను.' అను మొదలగువ్యవహారములను విమర్శించిన నీవిషయము తేటపడును. 'వాఁడు చాపమీదనుండి లేచిపోయెను.' అను నిట్టివ్యవహారముల యందువలె నెచ్చటెచ్చట శబ్దముపై పంచమీవిభక్తి యుండునో యచ్చ

టచ్చట నది *యపాదానార్థక మగును. కావున నిచ్చట నుండుపంచమియు నట్టిదియే. ఇట్లయిన 'అగ్నిలోకమునుండి అహర్లోకమునకుఁ బోవును.' అని మాత్రమే ప్రకృత మర్థము చెప్పవలసి వచ్చుచున్నది. కావున నట్లు చూచిన యీయగ్నిలోకాదులు భోగసాధనము లనుటయే స్పష్ట మగు చున్నది. అపాదానార్థమును గ్రహించిన 'పురుషుఁడు కొంతకాల మా లోకములయం దుండి యటనుండి యవ్వలిలోకములకుఁ బోవును.' అనియే కదా తేలును. కార్యములేక నొక్కఁ డొక్కస్థలమున నేల యుండును? బ్రహ్మలోకమునకుఁ బోవువానికి నితరలోకములయందుఁ గార్యము మాత్ర మేమి కలదు? ఈకారణమువలన భోగ మొక్కటి యచ్చట నుండవలయు నని యూహింపవలసి యున్నది. కావున నెట్లును ఈయర్చిరాదులు పురుషుని లోకాంతరమును బొందించునవి కానేరవు.

'ఇట్లు చెప్ప నేల? విద్యుల్లోకమునుండి బ్రహ్మలోకమువఱకు నొక్క దేవపురుషుఁ డుపాసకులను గొనిపోవు నని యున్నది. దీనినిబట్టి చూచిన మొట్టమొదటినుండియు నీయుపాసకుఁడు పరులచేఁ గొనిపోవఁ బడువాఁడే యని యూహించుటకు వీలు కలుగుచున్నది. అచ్చట నర్చిరాదులు తప్ప విశేషమేమియు లేకుండుటచే నవియే వీనినిఁ గొనిపోవు నవలసి వచ్చుచున్నది' యనియెదవేమొ ఇదియు యుక్తము కాదు. వచనమాత్రము వలన గ్రహింపఁబడునర్థ మెంత చెప్పఁబడెనో యంతయే గ్రహింపఁబడ వలయునుగాని యధికముగ నూహింపఁబడకూడదు. అది యప్రత్యక్షవిషయము కదా! మఱియు నర్చిరాదులు పురుషుని వహించు నేని విద్యుదాదులకు మాత్ర మేల వహింపవు? ఆవిద్యుదాదులకు వహించు సామర్థ్యము లేదని మీ రుదహరించినసందర్భమువలననే తేటపడుచున్నది. వానికే సామర్థ్య ముండినయెడల దేవపురుషుఁ డేల? ఈ కారణము వలన విద్యుదాదులకువలెనే అర్చిరాదులకుఁ గూడ నట్టిసామర్థ్యము లేదని నిర్ణయించుటకు వీలుకలుగుచున్నది. కావున నిర్వివాదముగ నీయర్చిరాదులు భోగసాధనములే; ఆతివాహికములు (పురుషుని వహించునవి) కావు."

---

* అపాదానార్థక మనఁగా అపాదానమును బోధించునది. (అపాదానము, అ-౧. పా-౧. సూ-౧౪. పేజీ-620 చూ.)

## అ-౪. పా-౩. సూ-౪.

అవతారిక:—అని యిట్లు వచ్చినపూర్వపక్షమును ఖండించు చున్నాఁడు.

---

## ౫౨౨. ఆతివాహికా స్తల్లింగాత్. ౪. ౩. ౪.

తాత్పర్యము:—ఈపక్షము సరి యైనది కాదు. ఈయర్చిరాదులు ఆతివాహికములే యనియే సిద్ధాంతము చేసి తీరవలయును. అట్లే గుఱుతు కానవచ్చుచున్నది. శ్రుతియందు "చంద్రమసో విద్యుతం" అని విద్యుల్లోకగమనముఁ జెప్పఁబడినపిదప "త త్పురుషోఽమానవః స ఏతాన్ బ్రహ్మ గమయతి" "అప్పుడు మనుష్యసృష్టికి లోఁబడని యొక నొక దేవపురుషుఁడు ఆయుపాసకుల నావిద్యుల్లోకమునుండి బ్రహ్మలోకమునకుఁ గొనిపోవును" అని చెప్పఁబడియున్నది. ఈవాక్యమువలన "ఉపాసకులు ఎవ్వరిచేత నైన నూర్ధ్వలోకములకుఁ గొనిపోవఁ బడవలసిన వారు" అని సిద్ధాంత మగుచున్నది. కావున నర్చిరాదులుకూడ వారినిఁ గొనిపోవునవియే యని సిద్ధాంతముఁ జేయుటకు వీలు కలుగుచున్నది. "ఇది కేవల వేదగమ్య మగుటచే నిం దూహాలు పనికిరా వంటిని కదా!" అనియెద వేమొ యట్లు కాదు. "అమానవః" అనువిశేషణ మట్టియూహకు నవకాశమును కలిగించుచున్నది. అవకాశము లేకున్న నది యట్లే యగునుగాని ప్రస్తుత మట్లు కానేరదు. "విద్యుల్లోకమునుండి గొనిపోవు పురుషుఁడు మనుష్యులకు సంబంధించినవాఁడు కాఁడు" అని చెప్పిన "అదివఱకు మొదటినుండియు వచ్చుచున్నవారు మనుష్యులు" అని చెప్పిన ట్లగును కదా! ఉపాసకు లెవ్వరో యొకరు కొనిపోవలసినదియే యనువిషయము మాత్ర మిదివఱకే ప్రత్యక్షముగఁ బ్రకటింపఁబడి యున్నది. కావున నిర్వివాదముగ నర్చిరాదులును ఆతివాహికములే కావలయును. అర్చిరాదులు పురుషులై మనుష్యులై యుండిననే కాని "అమానవః" అని విద్యుల్లోకానంతరమున నాతివాహికుఁడై యున్న పురుషునకు విశేషణము సంభవింపదు కదా!

---

## అ-౪. పా-౩. సూ-౫.

అవతారిక:— "ఈయొక్కగుఱుతు మాత్ర మాశ్రయించి యిట్టి సిద్ధాంతము చేయఁబూనుట యుక్తము కాదు. ఇది యల్పబలము కదా!" అనిన సమాధానముఁ జెప్పుచున్నాఁడు.

## ౫-౨౩. ఉభయవ్యామోహాత్తత్సిద్ధేః. ౪. ౩. ౫.

తాత్పర్యము:— ఈవిషయమునందు మఱియొక ప్రమాణముగూడ కలదు. అర్చిరాదిమార్గము నాశ్రయించిన యుపాసకులు స్థూలదేహరహితులు; సమూహాహముగ నేర్పడిన యింద్రియములు కలవారు. ఇట్లనుటచే వారికి స్వతంత్రముగ గమనసామర్థ్యము లేదు. లేకున్న నెవ్వరైన వారి నూర్థ్వలోకమునకుఁ గొనిపోవలయును. అవశ్యముగ బ్రహ్మలోకప్రాప్తి యెట్లైనను కలిగితీరవలయునుకదా! కావున నవశ్యముగ వాహకులెవ్వరైన నుండి తీరవలయును. మఱియు మార్గచిహ్నము లని చెప్పినను భోగసాధనము లని యంగీకరించినను అర్చిరాదు లచేతనము లగుటమాత్రము నిస్సంశయము కదా! ఇంతకంటె భిన్నము లగునవి యేవియు నాసందర్భమునఁ జెప్పఁబడియుండలేదు. ఆతివాహికము లైనను కాకున్నను ఆయర్చిరాదులే కావలయును. అచేతనము లగుటచే వానికిని ఉపాసకుల వహించుటయందు స్వాతంత్ర్యము లేదు. సంకల్పము లేక నేదియు ప్రవర్తింప నేరదు కదా! కావున నిచ్చట నేదియో యొకపదార్థమును స్వతంత్రశక్తి కలదానినిగా నేదియో యొకవిధమున నంగీకరింపవలయును; తగినవీలు కల యప్పుడు పదార్థాంతరములఁ గల్పించుటయు యుక్తియుక్తము కాదు. అర్చిరాదిశబ్దములు తత్తదభిమానదేవతాపరములుగ సమన్వయింపఁ బడ వచ్చు ననుటయు లోకప్రసిద్ధము. కావున నిట్లే కల్పించుట యుక్తి యుక్త మని తోఁచుచున్నది. "అర్చిరాదిలోకములకు వచ్చిన పురుషుల తత్తల్లోకాభిమానిదేవత లగునగ్న్యాదులును తమలోకమునుండి యూర్ధ్వ లోకమునకుఁ గొనిపోవుదురు." అనియే నిర్ణయింపవలయు నని తోఁచు చున్నది. పైసూత్రమునందు చూపఁబడిన గుఱుతు గూడ నీయుక్తికి సహాయము చేయుచున్నది. కావున లోకమునందు మూర్ఛితులు మొదలగువారు పరులచే స్థానాంతరముల బొందింపఁబడునట్లే యుపాసకు

లును ఈదేవతలచే నూర్ధ్వలోకమును బొందింపఁబడుదు రనుటయే నిర్ణయము.

మఱియు నీయర్చిరాదులు మార్గచిహ్నము లగుటకు వీలు లేదు. చిహ్నము లన్నియు శాశ్వతములై యుండవలయునుకదా! అట్లు లేకున్న వాని నాశ్రయించి గ్రామాదుల గుఱుతించుటకు వీ లెట్లు కలుగును? ప్రస్తుత మీయర్చిరాదు లన్ననో యట్టివి కావు. అగ్నిలోకాదులు కొన్ని సర్వకాలములయందు నుండునవి యైనను రాత్రికాలమున మృతి బొందిన వాఁడు అహర్లోకముతో సంబంధము నొందఁడు; కావున నాలోకము వానికి లేనిదియే యగును. రాత్రిమృతులు ప్రాతఃకాలమువఱకు నిలువ దని యిదివఱకే నిరూపించి యున్నాము. రాత్రికాలమున పగలు గాన వచ్చు ననుటయు దాని నాశ్రయించి దేవయానమార్గమును గుఱుతింపఁ గలుగు ననుటయు విరుద్ధమని మఱియొకమారు చెప్పనక్కఱ లేదుగదా! విచారించిన నొక్క చిహ్నమునకు కొఱత వచ్చినను సిద్ధాంతమునకు (నియమమునకు) కొఱతయే కదా! కావున నీయర్చిరాదులు మార్గచిహ్నములు కానేరవు. ఈపదములను దేవతాపరములనుగాఁ జెప్పినచో దోష మేమియు రాదు. పగటితో సంబంధము లేకున్నను దాని నభిమానించు దేవత యాతని నూర్ధ్వలోకమునకుఁ గొనిపోవచ్చును. ఏపదార్థము నభి మానించు దేవతనైనను ఆపదార్థముయొక్క నామముతోఁ జెప్పవచ్చు ననుట లోకప్రసిద్ధము. దేవతలు నిత్యులు కదా! కావున నిర్వివాదముగ నీయర్చిరాదిపదములవలన దేవతలనే గ్రహింపవలయును.

మఱియు 'అర్చిషః' అను మొదలగు పదములయందుఁ గలపంచమీ విభక్తి హేతువాచక మగుపంచమీవిభక్తి కాదనియు నీకారణమువలన వానికి (అర్చిరాదులకు) నాతివాహికత్వము సంభవించ దనియు భావించు టయు యుక్తము కాదు. ఇది హేతువాచక పంచమి యగు ననుటలో నాక్షేప మేమి? లోకమునందును నిట్టిపంచమి ("నుండి" అనునర్థమిచ్చు పంచమి) ఆతివాహికవ్యవహారమునందు ప్రసిద్ధ మయ్యే యున్నది. "నీవు మొట్టమొదట బలవర్మను చేరుము. అటనుండి (వానిమూలమున) జయ సింహు నాశ్రయింపుము. ఆటనుండి కృష్ణగుప్తునిఁ జేరుము" అను మొద లగు వ్యవహారము వెల్లుగఁ గానవచ్చుచున్నది కదా! "ఈహేతుపంచమి

గుణములయందు మాత్రమే కానవచ్చుచున్న
గుణములు కావు కదా!" అనియెద వేమో విను
మీయభిప్రాయమేమి? సర్వవ్యాపకము లగు*న
గల †బుద్ధీచ్ఛాద్వేషాదులలో నున్న ‡యవాం

---

* ఆత్మాదిపదార్థములు:—తార్కికులు సర్వవ్యాపకము లని కొన్నిపదార్థముల నంగీకరించియున్నారు. ఆకాశము కాలము దిక్కు ఆత్మ (జీవుఁడును ఈశ్వరుఁడును) అనుపదార్థములు సర్వవ్యాపకము లందురు.

† బుద్ధీచ్ఛాద్వేషాదులు:—వీరిమతమునఁ గలపదార్థముల మున్నే (అ-౨. పా-౨. పేజీ7 .2 చూ) వివరించియున్నాము. అందు గుణము లిరువదినాల్గు. ఆగుణములు సామాన్యగుణము లనియు విశేషగుణము లనియు రెండువిధములు. సామాన్యగుణములు సర్వద్రవ్యముల నాశ్రయించియుండును. సంఖ్య, పరిమాణము, పృథక్త్వము సంయోగము, విభాగము, పరత్వము, అపరత్వము, స్వాభావసిద్ధము కాని (ఘృతము, సువర్ణము మొదలగువానికి అగ్నిసంయోగమువలన వచ్చునట్టి) ద్రవత్వము, గురుత్వము (బరువు), వేగ మనుసంస్కారము అనునవి సామాన్యగుణములు. విశేషగుణము లనఁగాఁ బ్రత్యేకముగ నొక్కపదార్థమును మాత్రమే యాశ్రయించియుండునవి. బుద్ధి సుఖము దుఃఖము ఇచ్ఛ ద్వేషము ప్రయత్నము రూపము రసము గంధము స్పర్శము స్నేహము స్వభావసిద్ధ మగు (జలమునం దున్న) ద్రవత్వము, ధర్మాధర్మములు భావనారూప మగు సంస్కారము శబ్దము అనునివి విశేషగుణములు.

వీనిలో నాకాశమునందు శబ్ద మను విశేషగుణంబును సంఖ్య, పరిమాణము, పృథక్త్వము, సంయోగము, విభాగము ననుసామాన్యగుణము లైదును గలవు. కాల దిక్కులయందు సంఖ్యాదు లైదుమాత్రమే కలవు. మఱియు వారిమతమున జీవాత్మ యనియు పరమాత్మ యనియు నాత్మ ద్వివిధుఁడు. అందు జీవాత్మకు సంఖ్యాదులైదును బుద్ధియు ఇచ్ఛాద్వేషములును సుఖదుఃఖములును ప్రయత్నంబును భావనయు ధర్మాధర్మములు ననువిశేషగుణంబును కలసి పదునాల్గుగుణములు కలవు. పరమాత్మకు బుద్ధియు నిచ్ఛయు ప్రయత్నంబు ననువిశేషగుణములును సంఖ్యాదు లగునైదుసామాన్య గుణములును కలసి యెనిమిదిగుణములు కలవు. ఇందు విశేషగుణములే వ్యాఖ్యానము నందు బుద్ధీచ్ఛాద్వేషాదు లని పేర్కొనఁబడె నని తెలిసికొనవలయును.

‡ అవాంతరజాతి:—ప్రతిపదార్థమునందును ప్రత్యేకముగ నొక్కొక్కజాతి యుండును. బుద్ధియందు బుద్ధిత్వము ఇచ్ఛయందు ఇచ్ఛాత్వము ద్వేషమునందు ద్వేషత్వము నని యిట్లు సర్వపదార్థములయందును పరస్పరభిన్నము లగుజాతు లుండును.

లును ఈ దేవతలచే నూర్ధ్వలోకమును బొందింపఁబడుదు రనుటయే నిర్ణయము.

మఱియు నీయర్చిరాదులు మార్గచిహ్నము లగుటకు వీలు లేదు. చిహ్నము లన్నియు శాశ్వతములై యుండవలయునుకదా! అట్లు లేకున్న వాని నాశ్రయించి గ్రామాదుల గుఱుతించుటకు వీ లెట్లు కలుగును? ప్రస్తుత మీయర్చిరాదు లన్ననో యట్టివి కావు. అగ్నిలోకాదులు కొన్ని సర్వకాలములయందు నుండునవి యైనను రాత్రికాలమున మృతి బొందిన వాఁడు అహర్లోకముతో సంబంధము నొందఁడు; కావున నాలోకము వానికి లేనిదియే యగును. రాత్రిమృతులు ప్రాతఃకాలమువఱకు నిలువ దని యిదివఱకే నిరూపించి యున్నాము. రాత్రికాలమున పగలు గాన వచ్చు ననుటయు దాని నాశ్రయించి దేవయానమార్గమును గుఱుతింపఁ గలుగు ననుటయు విరుద్ధమని మఱియొకమాఱు చెప్పనక్కఱ లేదుగదా! విచారించిన నొక్కచిహ్నమునకు కొఱఁత వచ్చినను సిద్ధాంతమునకు (నియమమునకు) కొఱతయే కదా! కావున నీయర్చిరాదులు మార్గచిహ్నములు కానేరవు. ఈపదములను దేవతాపరములనుగాఁ జెప్పినచో దోష మేమియు రాదు. పగటితో సంబంధము లేకున్నను దాని నభిమానించు దేవత యాతని నూర్ధ్వలోకమునకుఁ గొనిపోవచ్చును. ఏపదార్థము నభి మానించు దేవతనైనను ఆపదార్థముయొక్క నామముతోఁ జెప్పవచ్చు ననుట లోకప్రసిద్ధము. దేవతలు నిత్యులు కదా! కావున నిర్వివాదముగ నీయర్చిరాదిపదములవలన దేవతలనే గ్రహింపవలయును.

మఱియు 'అర్చిషః' అను మొదలగు పదములయందుఁ గలపంచమీ విభక్తి హేతువాచక మగుపంచమీవిభక్తి కాదనియు నీకారణమువలన వానికి (అర్చిరాదులకు) నాతివాహికత్వము సంభవించ దనియు భావించు టయు యుక్తము కాదు. ఇది హేతువాచక పంచమి యగు ననుటలో నాక్షేప మేమి? లోకమునందును నిర్దిష్టపంచమి ("నుండి" అనునర్థమిచ్చు పంచమి) ఆతివాహికవ్యవహారమునందు ప్రసిద్ధ మయ్యే యున్నది. "నీవు మొట్టమొదట బలవర్మను చేరుము. అటనుండి (వానిమూలమున) జయ సింహు నాశ్రయింపుము. అటనుండి కృష్ణగుప్తునిఁ జేరుము" అను మొద లగు వ్యవహారము వెల్లుగఁ గానవచ్చుచున్నది కదా! "ఈహేతుపంచమి

గుణములయందు మాత్రమే కానవచ్చుచున్నది; ఈయర్చిరాదులును గుణములు కావు కదా!" అనియెద వేమో వినుము. ఇందు గుణ మనఁగా మీయభిప్రాయమేమి? సర్వవ్యాపకము లగు*నాత్మాదిపదార్థములయందుఁ గల †బుద్ధీచ్ఛాద్వేషాదులలో నున్న ‡యవాంతరజాతి గుణత్వ మనియు

---

* ఆత్మాదిపదార్థములు:—తార్కికులు సర్వవ్యాపకము లని కొన్నిపదార్థముల నంగీకరించియున్నారు. ఆకాశము కాలము దిక్కు ఆత్మ (జీవుఁడును ఈశ్వరుఁడును) అనుపదార్థములు సర్వవ్యాపకము అందురు.

† బుద్ధీచ్ఛాద్వేషాదులు:—వీరిమతమునఁ గలపదార్థముల ము న్నే (అ-౧. పా-౧. పేజీ7-2 చూ ) వివరించియున్నాము. అందు గుణము లిరువదినాల్గు. ఆగుణములు సామాన్యగుణము లనియు విశేషగుణము లనియు రెండువిధములు. సామాన్యగుణములు సర్వద్రవ్యముల నాశ్రయించియుండును. సంఖ్య, పరిమాణము, పృథక్త్వము సంయోగము, విభాగము, పరత్వము, అపరత్వము, స్వభావసిద్ధము కాని (ఘృతము, సువర్ణము మొదలగువానికి అగ్నిసంయోగమువలన వచ్చునట్టి) ద్రవత్వము, గురుత్వము (బరువు), వేగ మనుసంస్కారము అనునవి సామాన్యగుణములు. విశేషగుణము లనఁగాఁ ప్రత్యేకముగ నొక్కపదార్థమును మాత్రమే యాశ్రయించియుండునవి. బుద్ధి సుఖము దుఃఖము ఇచ్ఛ ద్వేషము ప్రయత్నము రూపము రసము గంధము స్పర్శము స్నేహము స్వభావసిద్ధ మగు (జలమునం దున్న) ద్రవత్వము, ధర్మాధర్మములు భావనారూప మగు సంస్కారము శబ్దము అనునివి విశేషగుణములు.

వీనిలో నాకాశమునందు శబ్ద మను విశేషగుణంబును సంఖ్య, పరిమాణము, పృథక్త్వము, సంయోగము, విభాగము నను సామాన్యగుణము లైదును గలవు. కాల దిక్కులయందు సంఖ్యాదు లైదుమాత్రమే కలవు. మఱియు వారిమతమున జీవాత్మ యనియు పరమాత్మ యనియు నాత్మ ద్వివిధుఁడు. అందు జీవాత్మకు సంఖ్యాదు లైదును బుద్ధియు ఇచ్ఛాద్వేషములును సుఖదుఃఖములును ప్రయత్నంబును భావనయు ధర్మాధర్మములు ననువిశేషగుణంబును కలసి పదునాల్గుగుణములు కలవు. పరమాత్మకు బుద్ధియు నిచ్ఛయు ప్రయత్నంబు ననువిశేషగుణములును సంఖ్యాదు లగు నైదుసామాన్య గుణములును కలసి యెనిమిదిగుణములు కలవు. ఇందు విశేషగుణములే వ్యాఖ్యానము నందు బుద్ధీచ్ఛాద్వేషాదు లని పేర్కొనఁబడె నని తెలిసికొనవలయును.

‡ అవాంతరజాతి:—ప్రతిపదార్థమునందును ప్రత్యేకముగ నొక్కొక్కజాతి యుండును. బుద్ధియందు బుద్ధిత్వము ఇచ్ఛయందు ఇచ్ఛాత్వము ద్వేషమునందు ద్వేషత్వము నని యిట్లు సర్వపదార్థములయందును పరస్పరభిన్నము లగుజాతు లుండును.

నవి *రూపాదిచతుర్వింశతిపదార్థములయందు మాత్రమే కల దనియు కావున రూపాదులుమాత్రమే గుణము లనియు †వైశేషికులు చెప్పుదురు.

---

ఇట్లున్నను కొన్నిపదార్థములయం దనువర్తించి వానిని తక్కినవానినుండి విభాగించు జాతి యవాంతరజాతి యనఁబడును. ద్రవ్యత్వము గుణత్వము మొదలగునవి యవాంతర జాతులు. ఇవి ప్రత్యేకము లగు పృథివీత్వ జలత్వాదులతోను రూపత్వరసత్వాదుల తోను గూడియున్న పదార్థములయం దనువర్తించుచు వానిని పదార్థాంతరముల నుండియు పరస్పరము కూడ విభాగించుచున్నవి కదా! ప్రకృత మీగుణత్వజాతినిఁ గూర్చియే యీప్రస్తావముఁ జేయఁబడెను.

* రూపాదిచతుర్వింశతిపదార్థములు = గుణములు. (అ-౧. పా-౧. పేజీ-712 చూ.)

† వైశేషికులు చెప్పుగుణలక్షణము:—

సర్వవ్యాపకము లగుపదార్థములయందు (ఆకాశాదులయందు) గలపదార్థాంతరముల (శబ్దబుద్ధీచ్ఛాదుల) నాశ్రయించియున్నయవాంతరజాతి (గుణత్వము) యేది కలదో దానికి నాధారభూతము లగునవి గుణములు. ఇదియే వైశేషికులు చెప్పుగుణ లక్షణము. ఇందు ఏవిశేషణమును తీసివైచినను లక్షణము కుదురదు. సర్వవ్యాపకము లగుపదార్థములయం దున్నపదార్థాంతరముల నాశ్రయించినట్టిదియు, అవాంతరమైనట్టి దియు నని జాతికి రెండువిశేషణములు కలవు కదా! ఇందు మొదటివిశేషణమును తొలఁగించి యూరక "అవాంతర మైనట్టిజాతి గుణత్వము" అనిన నప్పు డతివ్యాప్తి దోషము వచ్చును. అతివ్యాప్తి యనఁగా జెప్పఁబడినలక్షణము ఉద్దేశింపఁబడినపదార్థ మునందే నిలుపక పదార్థాంతరములయందు సంక్రమించుట. ఇచ్చట నవాంతరజా తిత్వ మట్లే సంక్రమించుచున్నది. గుణత్వమునకుమాత్రమే లక్షణము చెప్పవలయు ననిన నందు నిలుపక ద్రవ్యత్వకర్మత్వములనుగూడ జెప్పుచున్నది. అవియు నవాంతర జాతులే కదా! కావున మొదటివిశేషణము నవశ్యముగ నంగీకరింపవలయును. అప్పుడు ఆద్రవ్యత్వకర్మత్వములు శబ్దబుద్ధ్యాదుల నాశ్రయించునవి కాకపోవుటచే నాదోషము రాదు. అందును సర్వవ్యాపకము లనక పదార్థములను సామాన్యముగ గ్రహించినచో మరలయొకయతివ్యాప్తి వచ్చును. పృథివ్యాదు లగునితరద్రవ్యములు సర్వవ్యాపక ములు కావు. అవి మొట్టమొదట పరమాణురూపములై యుండి క్రమక్రమముగఁ జాంచల్యమువలన పరస్పరము కలిసి స్థూలరూపమును జెందును. ఇట్లగుటచే వానియందు ఉత్క్షేపణాదులు (కర్మలు[అ-౧. పా-౧. పేజీ-712 చూ]) కలవు. ఈకారణమువలన వానియం దుండునవాంతరజాతి కర్మత్వ మగును. అజాతియు నీలక్షణమునకు లోఁబడు టచే నతివ్యాప్తి వచ్చుచున్నది. ఇట్లు కాక కేవలసర్వవ్యాపకపదార్థములను మాత్రమే

ప్రతిపదార్థముగూడ కొన్నిసమయములయందు ప్రధానముగాను మఱి కొన్నిసమయములయం దప్రధానముగాను కూడ నుండుట సంభవించు చున్నది యనియు నిట్లగుటచే నప్రధాన మైనప్పు డేదియైనను గుణము కావచ్చు ననియు, నిదియే "వాఁడు జాడ్యమువలన బలహీనుఁడయ్యెను. మూర్ఖతవలన చెడిపోయెను" అను మొదలగు *వ్యవహారములవలన తేట పడుచున్నది యనియు నీలోకప్రసిద్ధి ననుసరించి †యప్రాధాన్యమే గుణ శబ్దార్థ మని నిర్ణయింపవలయు ననియు ‡వైయాకరణులు చెప్పుదురు. ఇందు వైశేషికపక్షము నాశ్రయించిన నది లోకవిరుద్ధము. రూపాదులు

---

గ్రహించినచో వానియందుఁ గర్మ లేదు కావున నీలక్షణమునకు కర్మత్వము లక్ష్యము కానేరదు. ఇట్లే "సర్వవ్యాపకములయం దున్నపదార్థాంతరముల నాశ్రయిం చిన" అని గ్రహింపక "సర్వవ్యాపకము లగుపదార్థముల నాశ్రయించిన యవాంతర జాతి" యనినచో నప్పుడును ఈలక్షణము ద్రవ్యత్వమునకు సంక్రమించును. సర్వ వ్యాపకపదార్థము లగునాకాశాదులు గూడ ద్రవ్యములే కదా కావున మొదటివిశేషణ మంతయు నట్లే యుండవలయును. ఇఁక "అవాంతరమైన" అనువిశేషణముచు గ్రహిం పకపోయినచో యూరక "సర్వవ్యాపకము లగువాని నాశ్రయించినపదార్థాంతరముల యం దున్నజాతి గుణత్వము" అనినచో నప్పటికిని అతివ్యాప్తి వచ్చును. సర్వవ్యాప కము లగువానియం దున్నబుద్ధీచ్ఛాదులయందు కూడ సత్తాజాతి కలదు. ఇది గుణ త్వజాతి కాదు కదా! ద్రవ్యగుణకర్మలయందు మూఁటియందును సామాన్యముగ నీసత్తాజాతి కల దని వైశేషికమతము. ఇట్లగుటచే నిది సామాన్యజాతి యగును గాని యవాంతరజాతి కానేరదు. కావున అవాంతరవిశేషణమును పరిగ్రహించినచో నీయతి వ్యాప్తి తొలఁగును. అవాంతరజాతియే యపరజాతి (అపరసామాన్యము) యని తెలిసికొనవలయును.

* లోకమునందు ప్రతిపదము ప్రధానమును అప్రధానముగాను కూడ నుపయోగింపఁబడుచున్నది. "వాఁడు ధనికుఁడు" "వాఁడు ధనికత్వమువలన గర్వించు చున్నాఁడు" అను మొదలగు వ్యవహారములయందు ఈ విషయము స్పష్ట మగు చున్నది. ఇందు మొదటివాక్యమున ధనికపదము ప్రధానముగాను రెండవవాక్యమున నప్రధానముగాను ప్రయోగింపఁబడెను. ఇందలి విశేషములు వ్యాఖ్యానమునందే స్పష్టము చేయఁబడినవి.

† అప్రాధాన్యమే గుణత్వ మని వ్యాకరణమతము.

‡ వైయ్యాకరణులు = వ్యాకరణవేత్తలు.

గుణము లగుటలో సంశయము లేదు కాని అవిమాత్రమే తప్ప నితర గుణములు లేవనుట యుక్తియుక్తము కాదు. అప్రధానము లగు పదార్థములు లోకమున గుణశబ్దముచేఁ జెప్పఁబడుచున్నవి. "ఈబ్రహ్మచారి యగ్ని" యను మొదలగుస్థలములయందు బ్రహ్మచారివర్ణనమునకై మాత్రమే గ్రహింపఁబడినవాఁ డగుటచే నగ్ని గుణముగా నంగీకరింపఁబడుచున్నాఁడు (అగ్ని పదము గుణవాచకముగా నంగీకరింపఁబడుచున్నదియనుట.) "వాఁడు నేఁడు పుత్త్రునితోఁ గూడి వచ్చిన" అను నిట్టిస్థలముల యందు ప్రధానుఁ డగుపురుషునకు పుత్త్రుఁడు విశేషణముగా పరిగ్రహింపఁబడుచున్నాఁడు. ఇంత యేల నిత్యముగాఁగాని యాగంతుకముగాఁ గాని యన్యపదార్థము నాశ్రయించినది యెల్లగుణ మనియే చెప్పఁబడుచున్నది. మఱియు స్వభావమును తెల్పునప్పుడు ప్రతిపదార్థము గుణమే యగుచున్నది. "మూఢుఁడు మౌఢ్యము, జడుఁడు జాడ్యము" అను మొదలగునవి యీవిషయమున నుదాహరణములు. వైయాకరణులుకూడ నిట్లే చెప్పుచున్నారు కదా! ఈవిషయము నంతయు విమర్శించిన నేదేది ప్రధానము కాదో అదియెల్ల గుణమే యగు ననవలయును. అన్యపదార్థము నాశ్రయించినది యప్రధాన మగుననుటలో సంశయమే లేదు; స్వభావములును ఆస్వభావము కలవానినే యాశ్రయించునవి కావున నప్రధానములే. సర్వవ్యవహారసిద్ధమగు శబ్దార్థస్థితి యిట్లుండ (గుణ మనఁగా నప్రధానపదార్థము అని యిట్లుండ)ఁ గొన్నిటియందు మాత్రమే యాశబ్దమును *పారిభాషికముగా నుపయోగించుట యయుక్తము గదా! కావున నీవిధముగ నయుక్తమగుటచే వైశేషికపక్షమంగీకార్యము కాదు. ఇఁక వైయాకరణపక్షము నంగీకరించినచో నట్టిగుణభావము అర్చిరాదులయందుఁ గూడఁ గలదు. ఇచ్చట దేవయానమార్గమున నడువవలసినవాఁ డగుటచే నుపాసకుఁడు ప్రధానుఁడు; వానికి సహాయకారు లగుటచే నర్చిరాదు లప్రధానములు. ఈవిధముగ వీనికి గుణత్వము వచ్చుటచే నిచ్చటిపంచమి హేతుపంచమి కావచ్చును; వీనికి నాతివాహికత్వము కలుగవచ్చును. "అగ్నియొక్క సహాయమువలన నుపాసకుఁడు అహర్లోకమునకుఁ బోవును. తదభిమానిదేవతయొక్క సహాయమువలన శుక్లపక్షలోకమునకుఁ

---

* ఒక పురుషుఁడు లేక శాస్త్రము ఒక పదార్థమునకు వ్యవహారార్థముగ నామధేయమును కల్పించుట పరిభాష; ఆకల్పింపఁబడిన నామధేయము పారిభాషికము.

బోవును." అని యిట్లు శ్రుతివాక్యమునకు నర్థము చెప్పఁబడవచ్చును. "నీవు మొట్టమొదట బలవర్మకడకుఁ బొమ్ము." అను మొదలగు లోకవ్యవహారములు గూడ నీవిషయమునఁ బ్రమాణములుగ నుదహరింపఁ బడి యున్నవి. ఈవ్యవహారములయందును కృష్ణగుప్తునిఁ జేరవలసినపురుషుఁడు ప్రధానుఁడు; బలవర్మ జయసింహులు వానికి సహాయకారు లగుటచే నప్రధానులు కదా!

మఱియొక ప్రబలహేతువు గూడ నీయర్చిరాదుల యాతివాహికత్వమును కల్పించుటకు నాధారమై యున్నది. వాక్యోపక్రమమునందు "తేఽర్చిష మభిసంభవంతి" అని యర్చిర్లోకాదులకును పురుషులకును సామాన్యసంబంధము మాత్రమే చెప్పఁబడి యున్నది. "ఈసంబంధ మెట్టిది? సస్వరూపభావసంబంధమా? (అనఁగా నుపాసకుఁ డీసంబంధము వలన నగ్న్యాదిస్వరూపముఁ జెందునా?) జ్ఞాతృజ్ఞాపకభావసంబంధమా? (అనఁగా యీయర్చిరాదులు మార్గమునకు చిహ్నములై యుండుటచే వాని నాశ్రయించి యుపాసకుఁడు మార్గమును తెలిసికొనునా?) లేక భోక్తలు భోగ్యభావసంబంధమా (అనఁగా: నుపాసకుఁడు అర్చిరాదిలోకములయందలి సుఖదుఃఖముల ననుభవించునా?)" అని సంశయము రాఁగా దానిని నిర్ధారణ చేయుటకై సంబంధవిశేష మెచ్చటనైనను చెప్పఁబడి యున్నదేమో యని వెదుకవలసివచ్చినది. ఉపసంహారవాక్యమున "స ఏతాన్ బ్రహ్మ గమయతి" అని అతివాహ్యాతివాహకభావసంబంధము (అనఁగా దేవపురుషుఁడు కొనిపోవువాఁడనియు నుపాసకులు కొనిపోఁబడువా రనియు నిదియే వీరలకు గలసంబంధ మనియు) చెప్పఁబడి యున్నది. విశేషము కానవచ్చిన సామాన్యమును తన్మాత్రవిషయముగ (ఆవిశేషమునుఁగూర్చి మాత్రమే చెప్పుదానినిగా) నిర్ణయించుట సర్వసాధారణము. "బ్రాహ్మణులను పిలువుము. భోజనసమయము సమీపించుచున్నది" అను నిట్టివ్యవహారములయందు మొట్టమొదట బ్రాహ్మణు లని సామాన్యముగఁ జెప్పబడి యున్నను భోజనకాల మనువిశేషముచే "ఇచ్చట చెప్పఁబడిన బ్రాహ్మణులు భోజనార్థమై పిలువఁబడిన బ్రాహ్మణులే" యనువిషయము నిర్ణయింపఁబడును కదా! కావున నిచ్చటఁ గూడ నర్చిరాదులతో నుపాసకునకుఁ గల దని చెప్పఁబడినసంబంధముఁ గూడ కట్టకడపటివిశేషము నాశ్రయించి యాతివాహ్యాతివాహకభావసంబంధ మనియే నిర్ణయింప

వలసి యున్నది. కావున నర్చిరాదులు నిర్వివాదముగ నాతివాహికములే. ప్రమాణ మేమియు లేకుండుటచే నుపాసకులకు నర్చిరాదిభావము గలుగు ననుట సంభవింపదు. అట్టిభావము కలుగు నని సాధించినను విముక్తికి (ఆభావమునుండి తొలఁగి మఱియొకరూపమును జెందుటకు) హేతువు లేకుండుటచే బ్రహ్మలోకప్రాప్తికి హాని కలుగును. "సంకల్పమాత్రముననే బ్రహ్మలోకప్రాప్తి కలుగును." అని చెప్పుశ్రుతికిని ఇట్లైన విరోధము వచ్చును. ప్రతిలోకమునందును తత్స్వరూపభూతుఁడై యుండి విముక్తుఁ డగుచు బ్రహ్మలోకమును బొందవలయు ననిన ననంతకాలము పట్టును కదా! కావున నర్చిరాదులతో నుపాసకులకు సస్వరూపభావసంబంధము కుదురదు. జ్ఞాతృజ్ఞాపకభావసంబంధ మిదివఱకే నిరాకరింపఁబడెను. అర్చిరాదులు మార్గచిహ్నములు కానేర వని యిదివఱకే నిరూపించి యున్నాము కావున నిర్వివాదముగ వీనికి (లోకములకు నుపాసకులకును) గలసంబంధ మాతివాహ్యాతివాహక భావసంబంధమే.

విచారించిన వీనికి భోక్తలు భోగ్యభావసంబంధము కూడ నుండుటకు వీలులేదు. ఉపాసకులు ఇంద్రియప్రచారము లేనివా రని యిదివఱకే చెప్పియున్నాము కదా! "ఇట్లయిన లోకశబ్ద మెట్లు ప్రయోగింపఁబడెను" అనియెదవేమొ అది భోగస్థానము కాకున్నను ప్రయోగింపఁబడవచ్చును. ఆలోకములు ఈయుపాసకులకు గాకున్నను ఆయాలోకములయందున్నవారికి భోగ్యములే కదా! కావున లోకశబ్ద మున్నంతమాత్రమున నీయుపాసకులకే యాలోకములు భోగ్యములు కావలసివచ్చుననవలసినపని లేదు కావున నీయర్చిరాదు లాతి వాహికములే. ఉపాసకుఁడు అగ్నిలోకమును జేరఁగానే తల్లోకాధిపతి యగునగ్ని వాని నూర్ధ్వలోకమునకుఁ గొనిపోవును. అహర్లోకమును జేరగానే తదధిపతియు నిట్లే కొనిపోవును. ఈవిధముగనే ప్రతిలోకమునందును ఆయాయధిపతులు వానినిఁ గొనిపోవుచుందు రనుటయే సిద్ధాంతము.

## అ-౪. పా-౩. సూ-౬.

అవతారిక:—"ఇప్పటికిని సిద్ధాంతము దృఢము కాలేదు. న్యాయముగ విచారించిన నర్చిరాదుల కాతివాహికత్వమున్నచో విద్యుదాదులకుఁ గూడ నుండవలయును; లేకున్నచో నన్నిటికిని లేకపోవలయును. శ్రుతియం

దన్ననో విద్యుల్లోకము మొదలు దేవపురుషుఁ డొక్కఁడు వారినిఁగొనిపోవు నని చెప్పఁబడి యున్నది. వరుణాదులకుఁ గూడ నాతివాహికత్వము కల దనిన నిరువు రాతివాహికు లుండుట నిరర్థక మగును. లేదనిన పూర్వాపర విరోధము వచ్చును" అనిన సమాధానముఁ జెప్పుచున్నాఁడు.

---

## ౫౨౪. వైద్యుతే నైవ తత స్తచ్ఛ్రుతేః. ౪. ౩. ౬.

తాత్పర్యము:—ఈవిధముగఁద త్తదధిపతులచేఁ గొనిపోఁబడుచు విద్యుల్లోకమును జెందఁగానే యిచ్చటికి బ్రహ్మలోకమునుండి యొక దేవ పురుషుఁడువచ్చి యీయుపాసకులఁ గొనిపోవును. వరుణేంద్రప్రజాపతిలోక ములగుండా నీతఁడే గొనిపోయి బ్రహ్మలోకమును జేర్చును. "అమానవః పురుషః" అను మొదలగు శ్రుతి యీవిషయమునే చెప్పుచున్నది. ఇంత మాత్రమువలన వరుణాదులకు నాతివాహికత్వము లేక పోనక్కఱ లేదు. వారును వీనికి సహాయకారులు కావచ్చును కదా! కావున నిర్వివాద ముగ నర్చిరాదు లాతివాహికములే; అమానవపురుషుఁడు ప్రధానాతి వాహికుఁడైనను వరుణాదులు సహాయభూతు లగుటచే నప్రధానాతి వాహికులు (గౌణాతివాహికులు) కావచ్చును కదా! ఎట్లయిననుఅర్చిరాదుల యందును వరుణాదులయందును గూడనాతివాహికత్వము సమానమేయగు టచే వైషమ్య మేమియు రాదు. విశేషము లున్నను పదార్థము భేదింపదు; ప్రధానాప్రధానభావము లున్నను అతివాహికత్వము మాత్రము భిన్నము కాదు. కావున నిర్వివాదముగ నర్చిరాదు లాతివాహికములే. దేవతలే.

---

## ౫. కార్యాధికరణము.

విషయసంగతి సంశయములు:—ఈవిధముగ పైయధికరణముల యందు మార్గము నిరూపింపఁబడును. ఇప్పుడు ప్రస్తావసంగతితో ఫల స్వరూపము నిరూపింపఁబడును. "స ఏనాన్ బ్రహ్మ గమయతి' అని ఫల మునుగూర్చి చెప్పునప్పుడు శ్రుతియే బ్రహ్మశబ్దము ప్రయోగించి యున్నది. గతియుఁ జెప్పఁబడి యున్నది. కావున నిచ్చట నెట్లు నిర్ణయింప వలయును? దేవయానమార్గము నవలంబించి నడచువారు పరమేశ్వరు

నొందుదురా? లేక చతుర్ముఖునిఁ జెందుదురా?" అనుసంశయము యిందు నిరాకరింపఁబడును.

## అ-౪. పా-3. సూ-౭.

అవతారిక:—తరువాత పూర్వపక్షము ననువాదము చేయఁ బోవుచు మొట్టమొదట సిద్ధాంతమతమును జూపుచున్నాఁడు.

## ౫౨౫. కార్యం బాదరి రస్య గత్యుప పత్తేః ౪. 3. ౭.

తాత్పర్యము:—హిరణ్యగర్భరూపుఁ డగు కార్యబ్రహ్మయొక్క లోకములకే దేవపురుషుఁ డుపాసకులఁ గొనిపోవు నని బాదరిమహాముని నిర్ణయించుచున్నాఁడు. వేదమునందుఁ జెప్పఁబడియున్నగతి యిట్లయిననే గాని సరిపడదు. చేరవలసినస్థలము ప్రయాణము చేయువానికంటె భిన్నము గాను దూరస్థముగాను ఉండవలయు ననుట నియమము కదా! అది కార్యబ్రహ్మవిషయమునందే గాని సంభవింపదు. ఆకార్యబ్రహ్మ సత్యలోక మనఁబడు నొకప్రదేశమున నున్నాఁడు. ఆప్రదేశ మితరదేశముల కంటెను ఉపాసకులకంటెను భిన్నము కావున నచ్చటికి నెవ్వరైనను పోవచ్చును. మఱియొక్కనిచేఁ గొనిపోవఁబడవచ్చును. పరబ్రహ్మవిషయ మిట్టిది కాదు. ఆయన సర్వవ్యాపకుఁడు; ఆత్మరూపుఁ డగుటచే నభిన్నుఁడు. అచ్చటికి నెవ్వరుమాత్ర మెట్లు పోఁగలరు?

"పరమార్థస్థితిలో సర్వమును బ్రహ్మమే యగుటచే తనకంటె భిన్నమగుపదార్థమే లేదు కదా!" అనియెదవేమొ యది సత్యమే అయినను అవిద్య సర్వమునకును గారణ మగుచున్నది. "తత్త్వమసి" యను మొదలగుమహావాక్యములయొక్క యర్థ మగునైక్య మనుభవమునకు వచ్చునంతకుఁ బూర్వ మీజీవునిచే అవిద్యావశమున *నాత్మ సర్వవ్యాపకుఁ డయ్యుఁ †బరిచ్ఛిన్నుఁడుగాను సర్వాత్మకుఁడయ్యు భిన్నుఁడుగాను తలంపఁబడుచున్నాఁడు కదా! ఈతలంపు దృఢమైయుండుటచే నాతఁడు తన

---

* ఆత్మ = తాను.

† పరిచ్ఛిన్నుఁడు (అ-౧. పా-౧. సూ-౧3. పేజీ-157 చూ.)

కంటె భిన్నములు కానివయ్యు భిన్నములుగఁ దోఁచుచున్న లోకముల నాశ్రయింపవచ్చును. పారమార్థిక భేదము లేకున్నను వానికి (జీవునకును లోకములకును) వ్యావహారిక భేదము కలదు కదా! పరమేశ్వరవిషయమన్ననో యిట్టిది కాదు. స్వరూపసాక్షాత్కారము కలిగినపిదపఁగాని యాయనయొక్క యథార్థతత్త్వము బయలుపడదు. బయలుపడినవెనుక గతియు లేదు. గమనముఁ జేయువాఁడును లేఁడు. చేయించువాఁడును లేఁడు. నాగతిచే పొందఁదగినస్థానంబును లేదు. కావున సర్వవిధముల గతిశ్రుతులను పట్టిచూచిన బాదరిమతమే యుక్తియుక్తము.

## ౫౨౬. విశేషితత్వాచ్చ. ౪. ౩. ౮.

తాత్పర్యము:—మఱియు శ్రుతియందు "బ్రహ్మలోకేషు" అని విశేషణము (బ్రహ్మలోక మనఁగా గార్యబ్రహ్మలోక మని బోధించు విశేషము=గుఱుతు) ప్రయోగింపఁబడి యున్నది. దీనిని విమర్శించినను గతి కార్యబ్రహ్మమును గూర్చినదియే యనుట తేటపడును. శుద్ధపరబ్రహ్మమేకరూపమై యుండఁగా దానినిగూర్చి బహువచనము ప్రయోగింపఁబడుటకు వీలు లేదు. కార్యబ్రహ్మలోక మైనచో నదియు నొక్కటియేయైనను అవస్థాభేదములు కలది గావున దానినిగూర్చి బహువచనము ప్రయోగింపఁబడవచ్చును. మఱియు లోకశబ్దముగూడ శుద్ధపరబ్రహ్మవిషయమున ప్రయోగింపఁబడదగినది కాదు. "బ్రహ్మైవ లోకః=బ్రహ్మలోకః" "లోక మనఁగా స్వప్రకాశపదార్థ మగుటచే బ్రహ్మమే లోకము. కావున శ్రుతిచే బ్రహ్మలోక మని చెప్పఁబడుచున్నది" అని యొకానొకస్థలమున నుత్పత్తి కానఁబడినను అది గతి లేకపోవుటచే నాశ్రయింపఁబడు గౌణార్థమే కాని ముఖ్యార్థము కాదు. పైనఁ జూపినయుక్తులవలన నిచ్చట ముఖ్యార్థముచేతనే కార్యనిర్వాహ మగుచుండ నిరర్థకముగ గౌణార్థమును స్వీకరింపనేల? ఒకానొకసన్నివేశముతోఁగూడిన ప్రదేశభేదమునకుఁ గదా లోక మనువ్యవహారము కలదు. కార్యబ్రహ్మలోక మిట్టిదియే కావున శ్రుతి దాని నుద్దేశించియే యీపదమును ప్రయోగించె నన వచ్చును. ఇదియునుగాక "బ్రహ్మలోకమునం దుపాసకు లుందురు" అని యుపాసకులకు లోకము నాధారముగాను లోకమున కుపాసకుల నాధేయులుగాను శ్రుతి యీవిశేషణమువలన (బ్రహ్మలోకేషు అను

విశేషణమువలన) సూచించుచున్నది. ఇదియు పరమేశ్వరుని గ్రహించిన సంభవింపదు. అప్పుడు సర్వము నేకమే యగుటచే నాధారాధేయభావమే లేదు కదా! కార్యబ్రహ్మలోక మయినచో నవిద్యాకల్పితభేదము కలదు గావున నీ యాధారాధేయభావ ముండవచ్చును. కావున నీవిశేషణ మును విమర్శించినను గతి కార్యబ్రహ్మలోకమును గూర్చినదియే యని స్పష్ట మగుచున్నది.

## అ_౪. పా_౩. సూ_౯.

అవతారిక:—"ఇ ట్లెన్ని చెప్పినను బాదరిమతము సిద్ధాంతము కానేరదు. *ఇచ్చట నపుంసకలింగమున నున్న బ్రహ్మశబ్దము ప్రయోగింపఁ బడి యున్నది. ప్రథమాధ్యాయమున సర్వప్రపంచోత్పత్తిస్థితినాశహేతు వగునిర్వికారపరమేశ్వరుఁడే యాశబ్దమున కర్థముగా నిర్ణయింపఁబడి యున్నాఁడు. ఇట్లుండ నది కార్యబ్రహ్మమునం దెట్లు ప్రయోగింపఁ బడును?" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

---

## ౫౨౭. సామీప్యాత్తు తద్వ్యపదేశః. ౪. ౩. ౯.

తాత్పర్యము:—బ్రహ్మపదప్రయోగవిషయమై యిట్లు సంశయింప నవసరము లేదు. ఈకార్యబ్రహ్మ పరబ్రహ్మమునకు మిగుల సమీపమున నున్నది యగుటచే నట్లు చెప్పఁబడుచున్నది. ఉపాసనార్థమై మనోమయ త్వాదిగుణములతోఁ జెప్పఁబడునిర్వికారబ్రహ్మమే కదా కార్యబ్రహ్మము. ఆయుపాధులు కల్పితము లగుటచే నపరిశుద్ధములే యైనను మోక్ష హేతువులగుటచే మిగుల పరిశుద్ధములు. పరిశుద్ధదర్పణమునందు ప్రతిబింబించినముఖము ప్రతిబింబమే యైనను ముఖముతో సమాన మై నట్లు సన్ననివస్త్రముచే నాచ్ఛాదింపఁబడినవాయువు పరిచ్ఛిన్నుఁడే యైనను అనావృతప్రాయుఁడే యైనట్లు యీకార్యబ్రహ్మంబును కల్పిత గుణములతోఁ గూడినవాఁ డయినను నిర్గుణప్రాయుఁడే యగును. కావున నిట్లు పరబ్రహ్మమునకు మిగుల సమీపమున నుండువాఁ డగుటచే నీకార్య బ్రహ్మమునందును బ్రహ్మపదప్రయోగము ప్రవర్తించుచున్నది.

---

* ఇచ్చట="స ఏతాన్ బ్రహ్మగమయతి" అనువాక్యమునందు.

## అ-౪. పా-౩. సూ-౧౦.

అవతారిక :— "ఇదియు యుక్తము కాదు. కార్యబ్రహ్మ మనిత్యము. తత్ప్రాప్తివలన నిత్యమగుముక్తి కలుగు ననుటకు వీలులేదు. పరమేశ్వరుఁ డొక్కఁడు తప్ప తక్కిన వేమియు నిత్యములు కావు కదా! శ్రుతియం దన్ననో 'ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తంతే' 'ఈదేవయానమార్గముగుండా ప్రయాణముఁ జేసినవాఁడు మఱల నీమనుష్యలోకమునకు రాఁడు' అని యుపాసకులకు పునరావృత్తి రాహిత్యము చెప్పఁబడియున్నది. కావున నీశ్రుతిని విమర్శించిన గతి కార్యబ్రహ్మలోకవిషయమైనది కాఁగూడదు" అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౫౨౮. కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పర మభిధానాత్. ౪. ౩. ౧౦.

తాత్పర్యము :— మఱియు నీసగుణబ్రహ్మ మనిత్యమే యైనను ముక్తికి హాని యేమియు లేదు. ఆబ్రహ్మమునకు నాశము (లయము) కలుగునంతవఱకు నీయుపాసకు లాలోకమునందే యుండి బ్రహ్మసాక్షాత్కారము కలవారై ప్రళయకాలమున నాతనితోఁ గూడ ముక్తులు కావచ్చును. అనావృత్తిశ్రుతులవలన నిట్లే నిర్ణయము చేయఁబడవలసి యున్నది. పరబ్రహ్మమునుగూర్చి గతి సంభవింప దని యిదివఱకే నిరూపించి యున్నాము కదా! కావున గతి శ్రుతులకును అనావృత్తిశ్రుతులకును విరోధము లేకుండుటకై యిట్టిక్రమముక్తి నొకదాని నవశ్యము కల్పించి తీరవలయును. కావున నుపాసకులు చెందుముక్తి క్రమముక్తి; బ్రహ్మవేత్తలు చెందునది సాక్షాన్ముక్తి.

## ౫౨౯. స్మృతేశ్చ. ౪. ౩. ౧౧.

తాత్పర్యము:— "బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే. పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరం పదం" "ఆయుపాసకు లందఱును చతుర్ముఖునకు నాశకాల మగుప్రళయకాలము వచ్చునంతవఱకు

బ్రహ్మలోకమున నివసించుచుండి జ్ఞానవంతులై యంతమున నాయనతోఁ గూడ పరమేశ్వరునియం దైక్యము నొందుదురు" అని స్మృతికూడ నీ విషయమును స్పష్టము చేయుచున్నవి. కావున నెట్లు చూచినను వేదము చెప్పుగతి కార్యబ్రహ్మమును గూర్చినదియే. బాదరిమతమే యీవిధముగ విచారించిన మిగుల యుక్తియుక్తమై యున్నది. సూత్రకారుని మతముఁ గూడ నిదియే.

## అ-౪. పా-3. సూ-౧౨.

అవతారిక:—ఇట్లు సిద్ధాంతమును చూపి పూర్వపక్షము ననువాదము చేయుచున్నాఁడు.

## ౫3౦. పరం జైమిని ర్ముఖ్యత్వాత్. ౪. 3. ౧౨.

తాత్పర్యము:—ఈవిషయమున జైమినిమహామునియొక్క యభిప్రాయము భిన్నముగ నున్నది. గతివలన నుపాసకులు పరమేశ్వరునే జెందుదు రని యాయన చెప్పుచున్నాఁడు. శ్రుతియందు నపుంసకలింగమున నున్న బ్రహ్మశబ్దము ప్రయోగింపఁ బడియున్నది యనియు దానికి ముఖ్యార్థము సర్వకారణ మగుపరమేశ్వరుఁడే యగుటచే నిచ్చట నాయననే గ్రహింపవలయు ననియు నిరర్థకముగఁ గారణవాచక మగుశబ్దమునకుఁ గార్యవాచకముగ నర్థము చెప్పుట యుక్తియుక్తము కాదనియు నాయన చెప్పుచున్నాఁడు. అప్రధానార్థమును చెప్పిన నది యెవ్వరికిని విశ్వాస పాత్రము కాదు కదా యనుచున్నాఁడు.

పరమేశ్వరుఁడు సర్వవ్యాపకుఁ డగుటచేతను ఆత్మరూపుఁడే యగుట చేతను ఆయననుగూర్చి గతి సంభవింప దనుయుక్తికిని వీరిమతమున నొక విధముగ సమాధానము కలదు. తనకు నంతకుముందు సంప్రాప్తము కానిదిగా నుండుపదార్థమును పొందుటకై మాత్రమే గతి కావలయు ననియుఁ బరమేశ్వరుఁడు నిత్యప్రాప్తుఁడే యగుటచే నాతనినిగూర్చి గతి సంభవింప దని కదా బాదరిమహాముని చెప్పుచున్నాఁడు. ప్రాప్తము లగువానివిషయమునఁ గూడ గతి సంభవింపవచ్చు నని జైమిని లోక దృష్టాంతము నొకదానిని చూపుచున్నాఁడు. ఎట్లనిన:—ఒక మఱ్ఱిచెట్టు నెక్కియున్నకోతి దానియందే క్రిందినుండి మీఁదికిని మీఁదినుండి

క్రిందికిని తిరుగుచుండుటను మనము చూచుచున్నాము. ఆవృక్షిచెట్టు కోతికి నప్రాప్తము కాదు కదా! ఇట్లున్నను దానియందు గతి సంభవించు చున్నది కదా! ఆకోతి వృక్షమునందలి యొకయవయవముతో మాత్రమే సంయోగము కలిగియున్న దనియు నప్పుడు దాని రెండవయవయవ మప్రాప్తమే యగుటచే గతి సంభవించుచున్నది యనియు చెప్పుటకును వీలు లేదు. "కోతి ఒక్కయవయవముతో మాత్రమే సంయోగము కలిగి యున్నది" అనిన నీవాదము పరమాణుస్వరూపముదాఁక పోయిగాని నిలు వదు. అవయవముల విభాగింపఁజూచిన మితియే లేదు కదా! కావున నీవి షయమున లోకప్రత్యక్షము ననుసరించి "కోతి వృక్షము నాశ్రయించి యున్నది" అని మాత్రమే యంగీకరించి తీరవలయును. లేకున్న పరమాణు సంయోగ మప్రత్యక్ష మగుటచే లోకఃమున సంయోగసంబంధ మను నదియే లేకపోవలసి వచ్చును కదా! కావున నిత్యప్రాప్తుఁడైనను పర మేశ్వరునియందు గతి సంభవింపవచ్చు నని జైమినియభిప్రాయము.

## ౫౩౧. దర్శనాచ్చ. ౪. ౩. ౧౩.

తాత్పర్యము:—మఱియు నీవిషయమున శ్రుతిగూడ ప్రమాణ ముగఁ జూపఁబడి యున్నది. ఎట్లనిన:—"త యోర్ధ్వ మాయ నమృ తత్వ మేతి" అనుశ్రుతిచే బ్రహ్మనాడీమార్గమున నిర్గమించినవాఁడు ముక్తి నొందు నని చెప్పఁబడెను కదా! ఈముక్తి పరమేశ్వరప్రాప్తివలనఁగాని కలుగదనుట సర్వశ్రుతిప్రసిద్ధము. ఇట్లుండ గతికి నర్థ మేమిగా నుండవల యును? ఆగతి దేనినిగూర్చి ప్రవర్తించునది కావలయును? పరమేశ్వరునిఁ గూర్చియే యై యుండి తీరవలయును. "బాదరి క్రమముక్తి నొకదాని నంగీకరించెను కదా!" యనిన నదియు వీరిమతమునకు సరిపడదు. ప్రత్యక్ష ముక్తియే పైనఁజూపినవిధముగ గతిచే సంభవించుచుండ క్రొత్తదానిఁ గల్పింప నేటికి యని వారియభిప్రాయము. "అథ యత్రాన్య త్పశ్యతి... త దల్పం" "ఎచ్చట భేదము కలదో అది నీచమైనది" అను మొదలగు శ్రుతులు పరబ్రహ్మప్రాప్తికంటె భిన్నము లగుముక్తిస్వరూపములనెల్ల నిషే ధించుచున్నవి యని వారు తలంచుచున్నారు. ఈకారణమువలన "ఉపాస కుఁడు దేవయానమార్గము నాశ్రయించి కార్యబ్రహ్మలోక మగుసత్య లోకమును గడచి స్వప్రకాశరూపుఁ డగుపరమేశ్వరునిఁ జెందును.

అచట వారిలింగశరీరములు నశించును; వారికిని ఆయనతో నైక్యము కలుగును" అని గతిశ్రుతులకు నర్థము చెప్పుచున్నారు. "పురుషాయణాః పురుషం ప్రాప్యాస్తం గచ్ఛంతి" "పురుషునుండే జనించినవి యగుటచే నాపురుషునిఁ జెందగనే యీప్రాణాదులు అస్తమయమును జెందును" అనుశ్రుతి నీవిషయమున నుదహరించుచున్నారు.

మఱియు నీగతి చెప్పఁబడియున్న చోట్లలో ననేకస్థలములయందు పరబ్రహ్మవిషయము లగు ప్రకరణములే కానవచ్చుచున్నవి; కావున నిదియు "గతి బ్రహ్మవిషయమే." యనుటకుఁ బ్రమాణ మనుచున్నారు. ఇది సత్యమే. కఠోపనిషత్తునందు "అన్యత్ర ధర్మాత్" అను మొదలగువాక్యముచే పరబ్రహ్మవిషయమే యారంభింపఁబడి యున్నది. అంతమునందు "శతంచైకా చ" అని గతి వర్ణింపఁబడియున్నది. ఇట్లే యనేకస్థలములయందును గానవచ్చుచున్నది; కావున నెట్లును గతి పరబ్రహ్మప్రాప్తివిషయమే యగుచుండుటచే "బ్రహ్మలోకేషు" అనుస్థలమునఁ గలబహువచనాదుల నేదియో యొకవిధముగ సమన్వయింపవలయు ననుచున్నారు. వేదప్రయోగమగుటచే నేకవచనమునకు మారుగా బహువచనము గానఁబడుట దోషము కా దనియు లోకశబ్దమునకు స్వప్రకాశపరము చెప్ప వచ్చు ననియుఁ జెప్పుచున్నారు.

## అ-౪. పా-3. సూ-౧౪.

అవతారిక:—" 'ప్రజాపతేః సభాం వేశ్మ ప్రపద్యే' 'బ్రహ్మదేవుని యొక్క సభాగృహము పొందెదను' అని యుపాసకులతలంపు శ్రుతులయందు వర్ణింపఁబడియే యున్నది. వీరినిఁ బట్టిచూచిన వారికి (ఉపాసకులకు) కార్యబ్రహ్మలోకప్రాప్తియే కల దని తోఁచుచున్నది" యనిన సమాధానముఁ జెప్పుచున్నాఁడు.

## ౫3౭. న చ కార్యే ప్రతిపత్త్యభిసంధిః.

## ౪. 3. ౧౪.

తాత్పర్యము:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. "ప్రజాపతేః సభాం" అను మొదలగుశ్రుతి కార్యబ్రహ్మమునుగూర్చి చెప్పునది యగు

టకు వీలు లేదు. అచ్చట "నామరూపయో ర్నిర్వహితా తే యదంతరా తద్బ్రహ్మ" "నామరూపములను నిర్వహించుచు వానిమధ్యమున వెలుఁగు బ్రహ్మము" అని యారంభమున నుండుటచే నీశ్రుతి బ్రహ్మవిషయకమే యగుచున్నది. "యశో౽హం భవామి బ్రాహ్మణానాం" "నేను బ్రాహ్మణులకు యశశ్శబ్దవాచ్యుఁడను అగుదును" అను నుపక్రమముకూడ నీవిషయమునే నిర్ణయించుచున్నది. ఎట్లనిన:—"న తస్య ప్రతిమా అస్తి యస్య నామ మహ ద్యశః" "యశ స్సనియెడు గొప్పపేరు ఎవ్వనికిఁ గలదో అట్టి బ్రహ్మమునకు పోలికయంగును లేదు." అను శ్రుతివాక్యము ననుసరించి చూచిన యశశ్శబ్దము పరమేశ్వరునియందే వర్తించు ననుట స్పష్టమగుచున్నది. కావున "యశో౽హం భవామి" అనుసంకల్పము బ్రహ్మవిషయక మైనదియే యై తీరవలయును. ఇట్లగుటచే పై శ్రుతుల బలమువలన నిర్వివాదముగ "ప్రజాపతేః" అను శ్రుతి పరబ్రహ్మవిషయక మైనదియే యగును. ఈకారణమువలన "ఉపాసకులకు సత్యలోకప్రాప్తి సంకల్పము కలదు" అనువిషయ మెప్పుడును శ్రుతిచేఁ జెప్పఁబడియే యుండ లేదు; కార్యబ్రహ్మవిషయకమగు గతియు నిరూపింపఁబడియే యుండ లేదు. పై శ్రుతియందును "ప్రపద్యే" అనుపదముచే గతి చెప్పఁబడియున్నది; ఆశ్రుతి పరబ్రహ్మవిషయకమే యని యిదివఱకే నిరూపింపఁబడి యున్నది. కావున నిర్వివాదముగ గతి పరబ్రహ్మవిషయక మైనదియే కావలయును.

విమర్శము:—ఈవిధముగ నాచార్యుఁడు రెండుపక్షములఁ జూపి యున్నాఁడు. అందు బాదరిపక్షము జైమినిపక్షమును ఖండింపఁగల దను నుద్దేశముచే స్వాభిప్రాయమును ప్రకటించుటకై దానిని మొట్టమొదట నిరూపించియున్నాఁడు. ఇట్లు ఖండింపఁగలదు గనుకనే యామతము సిద్ధాంతమతముగా వ్యాఖ్యానము జేయఁబడియున్నది. రెండవది పూర్వపక్షముగ నిర్ణయింపఁబడి యున్నది. పాతక్రమ మెట్లున్నను యుక్తుల లోని బలాబలముల నాశ్రయించియేకదా నిర్ణయము గావింపవలయును. విచారించిన నిస్సంశయముగా బాదరిపక్షమునందలి యుక్తులు బలవంతములు. ఎట్లనిన:—

బ్రహ్మశబ్దమునకు ముఖ్యార్థము పరమేశ్వరుఁ డగుటచే దానిని విడుచుట యుక్తము కాదని కదా జైమిని చెప్పుచున్నాఁడు! ఈయల్పహేతువు

ఒకపక్షమును సాధింపఁ గలుగునా? పూర్వోత్తరసందర్భముల లోక ప్రమాణములఁ దాత్పర్యార్థముల విమర్శించి పిదప నేయర్థమును గ్రహించుట యుక్తమగునో దానినే కదా బుద్ధిమంతులు గ్రహింపవలయును. సర్వపదములకును ముఖ్యార్థమే గ్రహింపఁబడవలయునని యెందైనను నియమమున్నదా? అట్టినియమ మున్నచో నప్పు డెన్నియుపపత్తు లున్నను వానిని త్రోసివైచి కేవలముఖ్యార్థముపైననే యాధారపడి యుండవలసి వచ్చును. అట్లులేదు. అనేకస్థలములయందు ప్రమాణాదులకు విరోధము వచ్చినప్పుడు గౌణార్థముఁగూడ గ్రహింపఁబడుచునే యున్నది. ప్రకృతమునందును సామాన్యముగ గతి వర్ణింపఁబడి యున్నస్థలములయం దెల్ల సగుణవిద్యయే వర్ణింపఁబడి యున్నది. లోకమును బట్టిచూచినను ప్రతివాఁడును తనకంటె భిన్న మగుపదార్థమును గూర్చి నడచుచున్నాఁడు. గాని స్వస్వరూపమును:గూర్చి కాదు. శబ్దప్రమాణము ననుసరించిన సగుణబ్రహ్మమే తనతో కల్పితభేదము కలిగి యున్నాఁడుగాని నిర్గుణ బ్రహ్మము కాదు. శ్రుతితాత్పర్యమును విమర్శించినను బ్రహ్మసాక్షాత్కారము గలిగిననిఁక గ ర్తవ్యమే లేదని తేలుచున్నది. ఇట్లుండ సగుణబ్రహ్మమును గూర్చి కాక నిర్గుణబ్రహ్మమునుగూర్చి గతి యెట్లు సంభవించును? సంభవించు నని పట్టుపట్టిన పైఁ జూపిన ప్రకరణాదుల కన్నిటికిని విరుద్ధ మగును కదా! కావున నిట్లన్నివిధముల నసంభవ మగుటచే బ్రహ్మపదమునకు ముఖ్యార్థము గ్రహింపఁబడుటకు వీలు లేదు.

2. "బ్రహ్మ మాత్మరూపమే యైనను దానినిఁగూర్చి గతి సంభవింపవచ్చుననియు మఱ్ఱిచెట్టునకును వానరమునకును గలుగుసంయోగవిభాగములే యిందుకు దృష్టాంతము లనియు నిరూపించి యున్నారుకదా!" అనియెదవేమో అదియు స్వపక్షమును సంస్థాపింపనేరదు. జీవబ్రహ్మములకు పరమార్థస్థితిలో భేదమే లే దనియు అవిద్యావశమున మాత్రమే యట్టిభేదము భావింపఁబడుచున్నది యనియు నీకారణమువలన నట్టికల్పిత భేదము నాశ్రయించియే గతి సంభవించుచున్నది యనియు జ్ఞానమువలన నాయవిద్య నశించెనేని యప్పుడు సర్వమును స్వస్వరూపమాత్రమే యగును గావున గతియే లే దనియు నిదివఱకే నిరూపించి యున్నాము. ఈకారణమువలన మఱ్ఱిచెట్టునకును వానరమునకును కలుగుసంయోగవిభాగములవలె జీవబ్రహ్మములకు సంయోగవిభాగములు కలుగుటకు వీలు

లేదు. దృష్టాంతమునందు మఱ్ఱిచెట్టుకంటె వానరము భిన్నము. మఱ్ఱి
చెట్టునకును దానికిని సంయోగసంబంధము మాత్రమే కలదు. ఇచ్చట
నట్లుకాదు. బ్రహ్మము జీవునకును స్వస్వరూపభూతమే కదా! ఏపదార్థమున
కైనను తనస్వరూపమునందు క్రియ సంభవించునా? కత్తియంచు తన్ను
దాను ఛేదించుకొనునా? వ్రేలికొన తన్నుదాను స్పృశించుకొనునా?
ఈకారణమువలన దృష్టాంతదార్ష్టాంతికములకు సాదృశ్యము లేదు.
"దృష్టాంతదార్ష్టాంతికములకు పరిపూర్ణసాదృశ్య మెచ్చటకూడ నుండదు
కదా!" అనియెదవేమొ యది సత్యమే కాని యిచ్చట సాదృశ్యమునకై
యుద్దేశింపఁబడిన దేది? సంబంధమా? సంయోగవిభాగములా? లేక
ప్రాప్తప్రాప్తిమాత్రమేనా? సంబంధము సంయోగము కానేరదని యిది
వఱకే స్పష్టమైనది. ఈకారణమువలననే సంయోగవిభాగములు కూడ
నుండుటకు వీలు కలుగదు. ఇఁక ప్రాప్తప్రాప్తియే యుద్దేశింపఁబడి
యుండునేని యది బొత్తుగనే సంభవింపదు. విచారించిన న్యగ్రోధవానర
ములవిషయమునందును అది లేదు. వానరము మఱ్ఱిచెట్టుపై నెక్కియే
యున్నను కొమ్మలను విడిచిననేగాని మొదటికి రానేరదు; మొదటిని విడి
చిననేగాని కొమ్మలమీదికిఁ బోనేరదు. ఇట్లయిన నెప్పటికప్పుడు క్రొత్తఁ
గానేకదా వానర మాయాభాగముల నాశ్రయించుచున్నది! పూర్వ
మెుకప్పుడు ఆభాగములతో సంయోగము కలిగి యున్నను విభాగముచే
నది నశింపఁజేయఁబడుచుండుటచే నెప్పటికప్పుడు (సంయోగము) క్రొత్త
దియే యగుచుండును కదా! "ఇట్లు అవయవవానరసంయోగము నంగీక
రించినచో నది పరమాణుసంయోగమువఱకు వ్యాపించు ననియు నప్పుడు
పరమాణువులు ప్రత్యక్షములు కాని వగుటచే నాసంయోగముగూడ
ప్రత్యక్షము కాకపోవలసి వచ్చు ననియుఁ జెప్పఁబడి యున్నది కదా!"
అనియెదవేమొ వినుము. ఈవాదముఁగూడ సిద్ధాంతమతమునకే యను
కూలముగాని పూర్వపక్షమతమునకుఁ గాదు. ఎట్లనిన:—అవయవభేదము
లనుఁ బట్టి సంయోగవిభాగముల నిరూపింపఁబోయిన నవి (సంయోగ
విభాగములు) అప్రత్యక్షములు కావలసి వచ్చును; ఇట్లు కాక అవయవి
తోనే సంయోగవిభాగములు కల వనిన నప్పుడును ప్రత్యక్షమునకు విరో
ధము వచ్చును. "ఆవానరము శాఖలయం దున్నప్పుడు మొదలు అప్రా
ప్తము; మొదటియం దున్నప్పుడు శాఖ లప్రాప్తములు." అనువిష

యము ప్రత్యక్షసిద్ధమై యున్నది కదా! కావున తుదకు నీవాదము "అవయవికిని అవయవములకును భేదము కలదా, లేదా?" అనువిషయ మును గూర్చినవాదముగఁ బరిణమింపవలసి వచ్చును. అవయవికి నవయవములవలన భేదము కలిగిననే గాని పైనఁ జూపినప్రత్యక్షము సార్థ కము కాదు; అట్టిభేదము లేకున్ననేగాని జైమినిపక్షము నిలువదు. ఈ విషయమును గూర్చియు నిదివఱకే యనేకస్థలములయందు చర్చ జరుపఁ బడి యున్నది. అవయవావయవులకుఁ గలభేద మనిర్వచనీయ మని స్థాపింపఁబడి యున్నది. (చూ ౨-౧-౧౪) కావున నభేదమే పారమార్థిక మైనను నవిద్యావశమున భేద మారోపితమై యున్నది యనియు నాభే దము నాశ్రయించియే ప్రత్యక్షానుసారముగ గతి సంభవించుచున్నది యనియుఁ జెప్పవలసి వచ్చును. ఇట్లగుటచే దృష్టాంతమునందుఁ గూడ మొట్టమొదట పరమార్థ మగు ప్రాప్తప్రాప్తిని నిర్ణయించుటకు వీలు లేదు. ఇఁక దానిసాదృశ్యమున పరమేశ్వరునియందు దాని (ప్రాప్తప్రాప్తిని) నెట్లు నిర్వహింపనగును? అనిర్వచనీయభేద మవిద్యాకృత మగుటచే దాని వలనఁ గల్పితమాత్రముగఁ గలుగున్రప్తాప్తప్రాప్తి మాత్రము సంసారదశ యందు పరబ్రహ్మమునందుఁగూడ కల దని యంగీకరించియే యున్నాము; కావున జ్ఞానోదయము కలిగి యవిద్య నశించిన నప్పుడు స్వస్వరూపభూత మగు బ్రహ్మమునుగూర్చి గతి సంభవింపదు.

3. గతివలన నమృతత్వప్రాప్తి చెప్పఁబడె ననియు మోక్ష మనఁగా సాక్షాన్ముక్తియే కావలయునుగాని మఱియొక్కటి కాఁగూడ దనియు కావున క్రమముక్తి యనునదియే సంభవింప దనియు ముక్తి యనఁగా బ్రహ్మరూపమేగావున తత్ప్రాప్తియే గతికి ప్రయోజన మనియు చేసిన వాదము కూడ పైనిరూపణవలననే భగ్న మైనది. పరబ్రహ్మవిషయ మున గతి సంభవింప దని నిరూపించి యున్నాము. మఱియు విచారించిన శ్రుతిచే నిట్టియుపదేశము (పరమార్థమోక్షమును గూర్చి గత్యుపదేశము) చేయఁబడి యున్నది యనుటకును వీలు లేదు. శ్రుతి యర్చిరాదిమార్గ మును అజ్ఞానినిఁగూర్చియే కదా యుపదేశించుచున్నది. వానికి నిది స్వతంత్రముగ మోక్షఫలము నొసంగునా? లేక బ్రహ్మజ్ఞానసహితమై యొసంగునా? అర్చిరాదిమార్గధ్యానము నిత్యకర్మాదులవలె నాచరింపఁ బడినదై స్వతంత్రముగనే ఫలము నొసంగు ననుటకు వీలు లేదు. పరమే

రుఁడు స్వస్వరూపభూతుఁ డగుటచేతను అవిద్యావశమున భిన్నుని వలె దోఁచుచున్నవాఁడు మాత్రమే యగుటచేతను అజ్ఞాననాశక మగుజ్ఞానమువలన మాత్రమే తత్ప్రాప్తి కలుగవలయును గాని కర్మచేఁ గలుగుటకు వీలు లేదు. త్రాటియందు భ్రాంతివలన దోఁచిన సర్ప మెన్ని కర్మల నాచరించినను యథార్థజ్ఞానము కలుగక పోయిన తొలఁగదు కదా! కావున ధ్యానముఁ గూడ మానసికకర్మయే గావున దాని వలన మోక్షప్రాప్తి కలుగుటకు వీలు లేదు. "త మేవ విదిత్వాఽతి మృత్యు మేతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ" "ఆపరమేశ్వరుని తెలిసికొనుటవలన మాత్రమే ముక్తి కలుగును. దీనికి రెండవమార్గము లేదు." అని శ్రుతి జ్ఞానాతిరిక్తమార్గముల స్వయముగనే నిషేధించు చున్నది జ్ఞానముతోఁ గూడియే ముక్తి నొసంగు ననిన నప్పుడు ముక్తి నొసంగునది జ్ఞానమే కాని యర్చిరాదిమార్గధ్యానము కాదు కదా! మఱియు నీధ్యానము జ్ఞానకార్యమునందు సహాయము నాచరించునా? లేక తదుత్పత్తియందు సహాయము నాచరించునా? ఇందు మొదటి పక్షము యుక్తమైనది కాదు. బ్రహ్మజ్ఞాన మద్వైతవిషయ మైనది. అర్చిరాదిభావన భేదవిషయ మైనది. బ్రహ్మభావనయందు సాధకుఁడు సర్వమును బ్రహ్మమాత్రముగా జూచును; అర్చిరాదిభావనయందు అర్చిరాదులకంటె నన్యములనుగా జూచును. ఈ రెంటికి నిట్లుండ సహవాస మెట్లు కుదురును? రెండును ఏకకార్యము నాచరించుట యెట్లు? ఇఁక రెండవపక్షము నాశ్రయించి "యజ్ఞాదులవలె నీయర్చిరాదిమార్గ భావనకూడ జ్ఞానోత్పత్తిని కలిగించును." అనుటయు యుక్తము కానేరదు. అర్చిరాదిమార్గమును చెప్పినస్థలమున "స ఏనా న్బ్రహ్మ గమయతి" అని ప్రత్యక్షముగ బ్రహ్మప్రాప్తియే ఫలముగఁ జెప్పఁబడియున్నది. ఈ బ్రహ్మ ప్రాప్తి పరబ్రహ్మ ప్రాప్తియే యగునేని యప్పుడు అర్చిరాదిమార్గభావన జ్ఞానకార్యమునే యొనర్చునది కావలయును గాని తదుత్పత్తికి సహాయ కారి కానేరదు కదా! యజ్ఞాదులవిషయమున నన్ననో యచ్చట "వివిది షంతి యజ్ఞేన దానేన తపసా" అని స్పష్టముగనే విద్యోత్పత్తికారణత్వము వర్ణింపఁబడియున్నది. ఇట్లగుటచే నమృతత్వప్రాప్తికథనము సాక్షా న్మోక్షవిషయ మగుటకు వీలు లేదు. ఇప్పుడు దానిని (అమృతత్వప్రాప్తి కథనమును) మఱియొకవిధముగా సమన్వయింపవలయుట యావశ్యకము

కదా! ఇట్లగుటచేతనే క్రమముక్తి యంగీకరింపఁబడెను. "తే బ్రహ్మలోకేషు పరాంతకాలే పరామృతా పరిముచ్యంతి సర్వే" "ఆయుపాసకులు ప్రళయకాలమునందు బ్రహ్మతోఁగూడ ముక్తులగుదురు" అని శ్రుతియు "బ్రహ్మణా సహ తే సర్వే" అని స్మృతియు నీక్రమముక్తిని ప్రత్యక్షముగాఁ గూడ నంగీకరించుచున్నది. అజ్ఞానికి భేదదర్శనము కలదు. కావున బ్రహ్మలోకప్రాప్తియుఁ గలుగవచ్చును. అచ్చట తత్త్వజ్ఞానము సంభవింపవచ్చును. దానిచే లింగశరీరనాశము కలుగఁగా ప్రళయకాలమున ముక్తి దొరుకవచ్చును. జ్ఞాని సహితము ప్రారబ్ధకర్మఫలము ననుభవింపవలయు నని సిద్ధాంతము చేయఁబడియున్నది. కావున బ్రహ్మలోకప్రాప్తుఁ డగునుపాసకుల విషయమునందు నట్లే విషయనిర్ణయమును గావింపవలయును. బ్రహ్మలోకమునకుఁజేరిన యల్పకాలముననే జ్ఞానము కలిగినను విద్యారూప మగు ప్రారబ్ధ ముండునంతవఱకు బ్రహ్మలోకనివాసము ననుభవించుటకై యేర్పఱుపఁబడిన దేహము (మార్గమునందు ప్రయాణము చేయునప్పుడు కేవల సూక్ష్మశరీరమే యుండు ననియు సర్వేంద్రియములును ప్రవృత్తిసామర్థ్యము లేనివై యుండుననియు నీకారణమువలన నర్చిరాదిలోకములయందుపాసకులకు భోగము సంభవింప దనియు నిదివఱకు నిరూపింపఁబడెను. ఈకారణమువలన బ్రహ్మలోకమునందు వారికి భోగంబును తదుచిత మగు స్థూలశరీరంబును గూడ కల దని నిర్ణయింపవలసియున్నది.) నశించునంతవఱకు నాలోకమున ఛాయామాత్రముగ బహువిధభోగముల ననుభవించుచునే యుండవలయును. ఆలోకమును జెందినవారికి ముక్తియే గాని పునరావృత్తి లేదు. కావున ప్రళయకాలమువఱకు నాలోకమునందే వారు నివసింపవలసినవా రగుదురు. పిదప సమస్తభూతభౌతికములతోఁ బాటు తమ స్థూలసూక్ష్మశరీరములు కూడ నశించినఁ బరబ్రహ్మమున నైక్యము నొందుదురు. పరమార్థస్థితిలో నీప్రపంచమంతయు భ్రాంతికల్పితమే కావున నుత్పత్తి యనునది యూరక నున్నట్లు గానవచ్చుటయేగాని యెవ్వరికిని లేదు కదా! ఇదియే క్రమముక్తికి స్వరూపము. ఉపాసకులకు నిట్టిక్రమముక్తియే కలుగును గాని పరమార్థముక్తి కాదు.

4. "ఇట్లు చెప్పనేల జ్ఞానము కలిగినపిదపఁ గూడ శరీరనాశము వఱకు సంసార మనువర్తించునట్లు సూక్ష్మశరీరనాశమువఱకు గత్యాదు లుండవచ్చును. బ్రహ్మప్రాప్తికలుగఁగనే లింగశరీరనాశము కలుగును కావున

ముక్తి కలుగవచ్చును. ఇంతమాత్రమునకు శ్రుతిని స్వేచ్ఛానుసారముగ సమన్వయింపఁజూచుట తగునా?" అనిన నదియు యుక్తము కానేరదు. గతి యున్నను లేకున్నను బ్రహ్మజ్ఞానము కలిగినవానికిగాని పరమార్థముక్తి దొరుకదనుట నిర్వివాదాంశము కదా! శ్రుతితాత్పర్యమును విచారించిన నట్టిజ్ఞానికి నుత్క్రాంతియే లేదని తేలుచున్నది. "న తస్య ప్రాణా ఉత్క్రామంతి" అను మొదలగువాక్యము లీవిషయమునఁ బ్రమాణములై యున్నవి. మఱియు "జ్ఞానము కలిగిన యుత్తరక్షణముననే ముక్తి కలుగును." అనియు ననేకశ్రుతులచే జెప్పఁబడి యున్నది. "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" ఇత్యాదివాక్యము లీవిషయమునఁ బ్రమాణములు. విచారించిచూచిన యుక్తికిని ఈవిషయమే సాధ్య మగుచున్నది. "సర్వప్రపంచము బ్రహ్మమే అదియే నేను" అని భావింపుచు నభేదమును గ్రహించినవానికి అజ్ఞానమును సంపూర్ణముఁగ ధ్వంసము చేసినవానికి గతి యనునది సంభవించుట యెట్లు? "జీవన్ముక్తులకు దేహపాతమువఱకు ననుసరించినట్లే ఛాయామాత్రముఁగ నట్టిజ్ఞానికిఁగూడగతి ననుసరింపవచ్చును." అనిన నదియు సిద్ధాంతము కానేరదు. జీవన్ముక్తుఁడు దేహధారి కావున దేహస్వభావముమాత్రము ననుసరించి యసంసక్తుఁడై కొన్నికర్మల నాచరింపవచ్చును అవి ఫలించినను ఫలింపవచ్చును లేకున్నను లేకపోవచ్చును. వానిమనస్సు గిరగిరత్రిప్పివిడువఁబడిన చక్రమువలె సంస్కారమాత్రముచే మాత్రమే తిరుగుచున్నది; గాని యందు కర్మఫలబీజభూతము లగువాసన లెవ్వియు లేవు కదా! ఎట్లనిన:—అజ్ఞానమువలన పురుషుఁడు ప్రపంచమును తనకంటె భిన్నముగఁ జూచుచుఁ దనకు శోభముకలుగుటకై పాపములను గాని పుణ్యములనుగాని కొన్నికర్మల నాచరించును. ఆకర్మలు చిత్తమున వాసనారూపములై నిలచును. పుణ్యకర్మల నాచరించువానిచిత్తము పుణ్యవిషయములనే సంకల్పించును; పాపకర్మముల నాచరించువానిచిత్తము పాపకర్మములనే సంకల్పించును. వానియందే యభిమానమును కలిగియుండును. ఇదియేవాసన. ఈవాసన కాలక్రమమున దృఢపడును. మంచికర్మల నాచరించువాఁడు చెడ్డపని చేయవలయు నన్నను చెడ్డపని చేయువాఁడు మంచికార్యముల నాచరింపవలయు నన్నను ఎంతకాలము పట్టునదియు సర్వలోకప్రత్యక్షము. ఒకదానియం దభిమానము కలవాఁడు దానిని విడుచుట కెంతకాలము పట్టునదియుఁ బ్రత్యక్షమే. ఈకారణమువలన

అప్పుడే యుదయించియున్న కర్మవాసన స్థిరమగుటకు నెంతయో కాలము పట్టును. ఇట్లు స్థిరపడి సమానజన్మమునందును జన్మాంతరములయందును గూడ నావాసన తనకు ననుకూలముగ పురుషుని చిత్తమును త్రిప్పును; తనకు ననుకూలముగ కర్మలను చేయించును. ఆకర్మలవలనఁ బురుషునకు నిష్టానిష్టఫలములు కలుగును. పూర్వమునుండియు దృఢము లైనవాసనలనుండి కలిగినవి యగుటచే నాఫలములు పూర్వకర్మఫలము లని చెప్పఁబడును. ఇట్లగుటచే జ్ఞానము కలిగి భేదదృష్టి తొలఁగినపిదప నీవాసనలకు నభివృద్ధికారణము లేకపోవుటచే నవి (వాసనలు) నశించినవియే యగును. కర్మల నాచరించుటకు భేదదృష్టియే కదా మూలకారణము. అది పోయిన నాకర్మసంస్కారములు ఫలోన్ముఖము లగుట యెట్లు? ప్రస్తుత దేహమును కల్పించి దానియందు కొంతఫలము ననుభవింపఁజేయుటకు నారంభించియున్న వాసనలు మాత్ర మంతమువఱకు ఫలము నొసంగ వచ్చును. మన స్సనియెడుచక్రము వాసనలచే తమ కనుగుణముగా నదివఱకే త్రిప్పఁబడి యున్నది కదా! కావున జీవన్ముక్తునకు దేహపాతమువఱకు సంసారానువృత్తి కల దనుటలో విరోధము లేదు. అప్పుడు వాఁడాచరించుభోజనాదికర్మలు మాత్రమే ఫలించును గాని తక్కినవి ఫలింపనేరవు. అవి వాసనల కలిగించి కదా కాలక్రమమున ఫలింప వలయును. జీవన్ముక్తికి చిత్తమున భేదము నశించుటచే నట్టివాసనలు నిలుచుటకు నెడము లేదు. ఇట్లుండ నిఁక పూర్వకర్మలు (ప్రారబ్ధము తప్ప తక్కినపూర్వకర్మలు) ఫలించుట యెట్లు? జీవన్ముక్తస్థితి ఇట్లుండ ఇఁక జ్ఞానంబును స్థూలశరీరనాశంబును కూడ గలిగినవారినిఁ గూర్చి చెప్ప వలసిన దేమి? వానికి ప్రారబ్ధకర్మ ముగిసినది; క్రొత్తకర్మ ఫలోన్ముఖమగుటకు వీలు లేదు. ఇఁక గతి యెక్కడనుండి వచ్చును? ప్రారబ్ధనాశముఁతోనే సూక్ష్మశరీరము నశించును గదా! "ఈగతియు ప్రారబ్ధవశము ననే కలుగు ననరాదా?" అనిన నదియు యుక్తము కాదు. కర్మవలనఁ గలుగుగతి స్వర్గనరకములలో నొకదానినిఁ గూర్చినదియై యుండవలయునే గాని పరబ్రహ్మమునుగూర్చినది యుండుటకు వీలు లేదు. పరబ్రహ్మప్రాప్తి కర్మసాధ్యము కా దని మున్నే వివరించి యున్నాము కదా! కావున నిర్వివాదముగ బ్రహ్మప్రాప్తి గతివలనఁ గలుగదు; తత్ప్రాప్తి కలుగునంతవఱకు లింగశరీరము నిలువదు. బ్రహ్మప్రాప్తి క్రొత్తగా కలుగవలసినదియే

లేదని మున్నే వివరించియున్నాము కదా ! ఇట్లగుటచే లోకశబ్దమునకుం గాని బహువచనమునకుంగాని భిన్నాభిప్రాయములఁ గల్పింపనక్కఱలేదు.

5. ఇట్లు బహువిధయుక్తులు బాదరిపక్షమున కనుకూలములై యుండ కేవలప్రకరణబలము మాత్రము జైమినిపక్షము నెట్లు స్థాపింపఁ గలదు ? ప్రకరణము నిర్గుణవిషయక మైనదియే యైనను ఆనిర్గుణోపాసనా మాహాత్మ్యమును వర్ణించుటకు సగుణోపాసనాఫలభూత మగు బ్రహ్మలోక ప్రాప్తియంతమున ప్రస్తావింపఁబడవచ్చును. "పరమేశ్వరుఁడెప్పటికి నొక్కఁడే యైనను ఆయనయందు గుణములను కల్పించిన ముక్తి దూర మగును. గుణములు కలిగియుండుట యాయనకు స్వాభావికము కాదు కదా! కావున నాయన నెప్పటికిని నిర్గుణునిఁగనే యుపాసింపవలయును. అప్పుడు ముక్తి కరతలామలక మగును." అని యీ ప్రస్తావముచే నిర్గుణవిద్య నుతింపఁబడవచ్చును. మఱియు బ్రహ్మలోకప్రాప్తిని వర్ణించు శ్రుతి యందుఁగూడ బ్రహ్మనాడినిఁ గూర్చియే ప్రధానముగఁ బ్రస్తావింపఁబడినను "విష్వ ఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి" "నలుగడల వ్యాపించియున్న నితరనాడులును సామాన్యముగ నుత్క్రమణసాధనము లగును." అని చెప్పఁ బడియున్నది. ఇంతమాత్రమున "ఈనాడీప్రస్తావము బ్రహ్మలోకప్రాప్తినిఁ గూర్చి చెప్పుసందర్భమున నుండుటచే దానినిఁ గూర్చినదియే యగును. జీవుఁడు అధోమార్గమునుండి నిర్గమించినను బ్రహ్మలోకమునకే పోవును." అని సిద్ధాంతము చేయుటకు వీలు కలదా ? ప్రస్తుతవిషయముకూడ నట్టిదియే యని యూహింపవలయును. అచ్చట బ్రహ్మనాడిని సర్వనాడు లలో నుత్తమముగా నభివర్ణించుటకై యితరనాడీప్రస్తావముఁ జేయఁ బడెను; ఇచ్చటఁగూడ నిర్గుణవిద్యను నుతించుటకై సగుణోపాసకమార్గముఁ బ్రస్తావింపఁబడెను. వాక్యము ప్రకరణమునకంటె బలవంత మగుటచేతఁ గూడ నీవిషయమే నిర్ణయింపఁబడవలసి యున్నది. "ప్రజాపతేః సభాం వేశ్మ ప్రపద్యే" అనుస్థలమునఁగూడ నిట్లే నిర్ణయింపవలయును. అచ్చటఁ గూడ వాక్యభేదమును గావించియే తాత్పర్యమును సమన్వయింపవల యును. ఆశ్రుతియందును "ప్రపద్యే" అనుపదముచే గతి తెలుపఁబడు చున్నది. ఆగతి పరమేశ్వరవిషయమున సంభవింప దని చెప్పియున్నాము. కావున ప్రజాపతిభవన మనఁగాఁ గార్యబ్రహ్మలోకమే యనవలసి యున్నది.

ఇచ్చుటఁగూడ ప్రకరణమునకంటె బలవంతమైన గతిశ్రుతి కలదు కదా! కావున నెట్లు చూచినను జైమినిమతము యుక్తియుక్తము కాదు.

మఱియు నీమతమును స్థాపించుటకై యనేకు లనేకవాదములను జేయుచున్నారు. "నిర్గుణవిద్యయందు గతి సంభవింపదేని సగుణవిద్యయందును సంభవింపదు. సగుణబ్రహ్మయు తనగుణము లగుజ్ఞానైశ్వర్యాదులతోఁగూడ సర్వవ్యాపకుఁడై యున్నాఁడు. సర్వవ్యాపకుఁడగు శుద్ధపరబ్రహ్మమునందే కదా గుణము లారోపింపఁబడుచున్నవి. ఇట్లయిన నుపాసకులకు సగుణబ్రహ్మప్రాప్తికూడ నిచ్చటనే కలుగవచ్చును. ఇఁక గతి యేటికి? శ్రుతిప్రామాణ్యమువలన గతి నిర్ణయింపఁబడుచున్నది. యనిన నాశ్రుతి నిర్గుణవిద్యావిషయమున మాత్రము నిర్ణయసాధన మేల కారాదు? పరబ్రహ్మమునుగూర్చి చెప్పు ప్రకరణములయందుఁ గూడ నొక్కొక్కచోఁ గతి వర్ణింపఁబడియే యున్నది కదా! మఱియు నిర్గుణ మగుపదార్థ మొక్కటి కల దని యంగీకరించి యిట్లు చెప్పితిమి. విచారించిన నట్టివస్తువే మొట్టమొదట లేదు. పరబ్రహ్మమునకును జ్ఞానాదిగుణములు కలవు. ఆయన వానికంటె భిన్నుఁడయ్యును కానివాఁడగుటచే సగుణుఁడే కావలయును." అని చెప్పుచున్నారు. ఇదియంతయు నసంగతమే. ఆకాశము సర్వవ్యాపకమే యైనను దానిగుణ మగుశబ్దము కూడ నట్టిదియే యైనను వేణురంధ్రమున నున్నయాకాశము నందు మాత్రమే శబ్దవ్యక్తి కలుగునట్లు సగుణబ్రహ్మముగూడ సర్వవ్యాపకుఁడే యైనను ఉపాసకులకు బ్రహ్మలోకమునందు మాత్రమే యాయనగుణము లగుజ్ఞానైశ్వర్యాదులకు నభివ్యక్తి కలుగవచ్చును. మఱియు నిర్గుణపదార్థము లే దనుటయు యుక్తియుక్తము కాదు. తార్కికులు గూడ రూపాదిగుణములకు గుణము కలదని యంగీకరింపరు. "గుణములకు గుణము లేకున్నను ద్రవ్యములకు కలదు కావున 'గుణము లేని ద్రవ్యము లేదు' అనుటయే వారియభిప్రాయమైయుండవచ్చును" అనియెద వేమొ యదియు నిలువదు. శ్రుతి నిర్గుణమగుదాని నొక్కదానిని చెప్పుచుండ నీసిద్ధాంత మెట్లు కుదురును? అన్నిద్రవ్యములును సర్వప్రమాణానుకూలముగ సగుణములని తేలిన నప్పుడే కదా యీసిద్ధాంతము నిలుచును. ఇఁక ద్రవ్యములకుఁ బ్రత్యేకలక్షణమును చెప్పి దానిపై గుణవత్త్వసిద్ధాంతమును స్థాపింపఁజూతమనిన నదియుఁ గుదురదు. ఆ ప్రత్యేకలక్షణ మేది? "ఏపదార్థము లుపాదానకారణము లగునో అవియే ద్రవ్య

ములు" అనుటయే తల్లక్షణ మనవలయును. ఇప్పటికిని కొంతవిచారణీ యాంశము కలదు. ఉపాదానకారణముగ నుండుట యనినఁ గార్యరూపముతో బరిణమించుట యని యభిప్రాయమా? లేక *వివర్తవశమున గార్యరూపముగా దోఁచుట యని యభిప్రాయమా? ఉభయవిధములఁ గూడ నీలక్షణము కుదురదు. లోకమున నన్ని యుపాదానకారణములును కార్యరూపములతోఁ బరిణామమును జెందుచున్నవి యనుట సిద్ధాంతము కానేరదు. రజ్జుసర్పాదు లెన్నియో వివర్తమువలన జనించుచుండుట ప్రత్యక్షమై యున్నది. ఇఁక వివర్తవాదము నాశ్రయించిన నది వారిచే (తార్కికాదులచే) గుణములుగ గ్రహింపఁబడి యున్న సత్తాదులయందును సంక్రమించుచున్నది. రజ్జుసర్పభ్రాంతి కలిగినప్పుడు ఆసర్పసత్తకు రజ్జుసత్తయే కదా యాధారము. కావున నెట్లు చూచినను వారిమతమున ద్రవ్యలక్షణమే కుదురదు కావున నెట్లును బ్రహ్మమునందు గుణములను సాధించుటకు వీలులేదు. నిర్గుణునిఁగూర్చియు గతి సంభవించు ననుటకు వీలు లేదు. కావున నెట్లును జైమినిమతము యుక్తిశూన్యమే. సగుణబ్రహ్మమునుగూర్చికూడ నచ్చటచ్చట సర్వమయత్వాదులు చెప్పఁబడి యున్నను అవి స్తోత్రార్థములే యగును కాని వాని వలన సగుణబ్రహ్మము నిర్గుణబ్రహ్మము కానేరదు; నిర్గుణబ్రహ్మమునకు గుణములును సంభవింపనేరవు. ఇట్లగుటచే బాదరిమతమే సిద్ధాంతము.

ఈవిషయమున కొందఱువాదులయభిప్రాయము తత్ఖండనము:—

ఈవిధముగా బాదరిపక్షమే సిద్ధాంతపక్షముగాఁ దేలుచున్నను కొందఱు "ముందున్నవి పూర్వపక్షసూత్రములే కావలయును" అను నల్పకారణమున జైమినిపక్షమునే సిద్ధాంతపక్షమునుగా స్థాపించుచున్నారు. గతి పరబ్రహ్మమునుగూర్చియే కలుగు ననుచున్నారు. బహుయుక్తిశ్రుతుల వలన తేలినయభిప్రాయమును ఇంత యల్పకారణముచే భగ్నము చేయఁ జూచుట యెంతవెఱ్ఱితనము? పరమేశ్వరుఁడు సర్వవ్యాపకుఁడు సర్వాంతర్యామి సర్వమయుండు. "ఆకాశవ త్సర్వగత శ్చ నిత్యః. య త్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ య ఆత్మా సర్వాంతరః. ఆత్మై వేదం సర్వం. బ్రహ్మైవేదం విశ్వం" అను మొదలగుశ్రుతివాక్యము లీవిషయమునే స్పష్టము చేయుచున్నవి. ఇట్టివాఁ డగుటచేత నీయననుగూర్చి గతి సంభ

* వివర్తము (అ-౧. పా-౧. సూ-౬. పేజీ-77 చూ).

వింప దని యిదివఱకే నిరూపించి యున్నాము. గంతవ్య మగుపదార్థము తనకంటె భిన్నముగ నుండవలయు ననుట ప్రసిద్ధము కదా! మఱియు నీవిషయమునఁ జెప్పఁబడిన న్యగ్రోధవాదదృష్టాంతముకూడ నిదివఱకే ఖండింపఁబడెను. దేశకాలములవలన విశేషము లేపదార్థములకు కలుగునో (అనఁగా: నేపదార్థములు ఒకస్థలముననుండి మఱియొక స్థలమున లేనివై యుండునో ఒకకాలమున నుండి మఱియొక కాలమున లేనివై యుండునో) అట్టిపదార్థములఁగూర్చి దేశకాలభేదము వలన గతి సంభవించును. భూమియందు అనేక ప్రదేశములు కలవు. గావున (ఒకస్థలమున నున్నయూరు మఱియొకస్థలమున నుండదు గావున) దానినిఁ గూర్చి గతి సంభవించుచున్నది. న్యగ్రోధవిషయము కూడ నిట్టిదియే కదా! మఱియుఁ గాలవిశేషసంబంధమువలన బాలుఁడు స్వస్వరూపభూత మగువార్ధకమును జెందుచున్నాఁడు. పరమేశ్వరునియం దన్ననో యిట్టి విశేషము లెవ్వియు లేవు. "నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం...అస్థూల మన ణ్వహ్రస్వ మదీర్ఘం...స బాహ్యాభ్యంతరో హ్యజః...స వా ఏష మహా నజ ఆత్మాఽజరోఽమరోఽమృతోఽభయో బ్రహ్మ...స ఏష నేతి నే త్యాత్మా" అను మొదలగు శ్రుతివాక్యము లీవిషయము స్పష్టముఁ జేయుచున్నవి. ఈకారణమువలన నాయనను గూర్చి పారమార్థిక మగుగతి సంభవింపదు. ఇఁక కల్పితగతి యున్ననో అదియు కల్పిత మగుకార్యబ్రహ్మలోకమునుగూర్చియే సంభవించును గాని బ్రహ్మమునుగూర్చి సంభవింపదు. వస్తువు పరమార్థ మనియు గతి మాత్రము కల్పిత మనియుఁ జెప్పుటకు వీలులేదు కదా! కావున వారి పక్ష మెట్లును యుక్తియుక్తము కానేరదు. న్యగ్రోధాదులనుగూర్చివలె నిత్యప్రాప్త మగుబ్రహ్మమును గూర్చికూడ గతి సంభవించు ననుట యుక్తము కాదు.

"ఇట్లు చెప్పనేల? పరమేశ్వరునకు ననేకశక్తులు పరమార్థముగాఁ గలవు. లేకున్న నాయన ప్రపంచసృష్ట్యాదులను గావింపనేరఁడు. పరిణామము లేనిపదార్థము మఱియొకదానికి నుపాదానకారణ మగుట యెట్లు? పరిణామత్వము బ్రహ్మమునకు కల దని యంగీకరించిన నప్పుడు ఆయనకు విశేషము లుండుటకు వీలు కలుగుటచే నాయననుగూర్చి గతి సంభవింప వచ్చును కదా! ఇట్లుండ వారిమతమును నిరాకరింప నేల?" అనియెద

వేమొ వినుము. సృష్టివిషయమున మావాదము వివర్తవాదము. అది యట్లుండె. ఉత్పత్త్యాదిశ్రుతులు పరమేశ్వరునకు విశేషములు కలవనుటకై రాలేదు. అట్లే వచ్చినవి యనిన "అస్థూల మనణు" ఇత్యాది విశేషనిరాకరణశ్రుతులు వ్యర్థములు కావలసివచ్చును. ఉత్పత్త్యాదిశ్రుతుల యర్థమును (మీరు తలంచిన యర్థమును) గ్రహించిన వానికి (విశేష నిరాకరణశ్రుతులకు) నర్థమే లేకపోవలసివచ్చును. "ఉత్పత్త్యాదిశ్రుతుల విషయము గూడ నిట్టిదియే కదా! విశేషనిరాకరణశ్రుతుల యర్థమునే ప్రధానముగా గ్రహించిన నివియు నిరర్థకములే కావలసివచ్చునుకదా!" అనియెదవేమొ యట్లు కానక్కఱలేదు. ఈ శ్రుతులు ఉత్పత్త్యాదినిరూపణ పూర్వకముగ ప్రపంచబ్రహ్మభేదమును నిరూపించుచున్నవి యనవచ్చును; బ్రహ్మముయొక్క యద్వితీయస్వరూపమును ప్రకటించుచున్నవి యన వచ్చును. "మృల్లోహవిస్ఫులింగాద్యైః సృష్టిర్యా చోదితాఽన్యథా, ఉపాయః సోఽవతారాయ నాస్తి భేదః కథం చన" అను మహాత్ముల వాక్యముగూడ నీవిషయమును నిర్ణయించుచున్నది. "ఇది యేల? ఉత్పత్త్యాదిశ్రుతులు మాత్ర మనార్థముగా ప్రవర్తించుచున్నవి యనియు విశేషనిరాకరణశ్రుతు లట్లు కావనియు పట్టు పట్ట నేటికి? శ్రుతు లన్నియు సమానబలము కలవియే కదా!" అనియెదవేమొ వివరించెదను వినుము:—

విశేషనిరాకరణశ్రుతులపై *నాకాంక్ష లేదు. ఆత్మ నిత్యుఁడనియు నేకస్వరూపుఁడనియు సుఖదుఃఖసంబంధము లేనివాఁడనియు నిత్యముక్తుఁ డనియు తెలిసికొనినపిదప విచారింపవలసిన దేది కలదు? ఇట్లు తెలిసి కొనుటయే కదా పురుషార్థము. "తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః" "పరమేశ్వరుని స్వరూపము నేకముగా నెఱింగినవానికి మోహ మెక్కడిది? శోక మెక్కడిది?" "అభయం వై జనక ప్రాప్తోఽసి" "ఓజనకమహారాజా! నీవు ఆత్మను తెలిసికొంటివి. అభయమును జెందితివి" "విద్వాన్న బిభేతి కుతశ్చన" "ఆత్మస్వరూపము నెఱింగినవాఁడు దేనినుండి కూడ భయము నొందఁడు" "ఏతం హ వావ న తపతి కిమహం సాధునా కరవం కిమహం పాప మకరవం" "ఆత్మస్వరూపము నెఱింగినవాఁడు 'నేను సత్కార్యముల నేలచేయకపోతిని. పాపకార్యముల నేలయాచరించితిని'

* ఆకాంక్ష (అ-౧ పా-౪. సూ-3. పేజీ-151 చూ.)

అని పరితపింపఁడు" అను మొదలగు శ్రుతివాక్యము లీవిషయమునే బోధించుచున్నవి. కావున విశేషనిరాకరణశ్రుతులు చెప్పునర్థము ఫలవంతమైనవి. మఱియు "మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" అను మొదలగు శ్రుతులును భేదదృష్టిని నిరాకరింపుచు నీయర్థమునే దృఢపఱచుచున్నవి. ఈకారణమువలన విశేషనిరాకరణ శ్రుతులు అప్రధానము లనుట చెల్లదు. పురుషార్థము దేనివలన కలుగునో అది ప్రధాన మగు ననుటలో సంశయము లేదు కదా!

ఉత్పత్త్యాదిశ్రుతులవిషయ మన్ననో యిట్టిది కాదు. వానియర్థముపై నాకాంక్ష లేకపోలేదు. కేవల సృష్ట్యాదిజ్ఞానమువలన గలుగుపురుషార్థమేదియు లేదు కదా! మఱియు నీసృష్ట్యాదిశ్రుతులు విషయాంతరమును బోధించుటకై ప్రవర్తించునవియే యనికూడ శ్రుతియే స్పష్టముగ చెప్పుచున్నది. "తత్రైత చ్ఛుఙ్గ ముత్పతితం సోమ్య విజానీహి నేద మమూలం భవిష్యతి" "ఓశాంతుఁడా! యీప్రపంచము కార్యము. దీనికి మూలము లేకుండదు" అని యుపన్యాసమున నారంభించి సర్వప్రపంచమునకును సన్మాత్రమే మూల మని ఛాందోగ్యశ్రుతి చెప్పుచున్నది "యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి యత్ప్రయం త్యభిసం విశం తీతి తద్విజిజ్ఞాసస్వ త ద్బ్రహ్మ (సూ. 1. 1. 2.)" అని తైత్తిరీయ శ్రుతియు నీవిషయమునే బోధించుచున్నది. ఇట్లగుటచే సృష్ట్యాది శ్రుతులకు సృష్ట్యాదులను చెప్పుటయందుఁ దాత్పర్యము లేదు. "ఫలవత్సన్నిధా వఫలం త దంగం" "ఫలము గలవిషయము చెప్పఁబడియున్న చోట దానికి సమీపమున ఫలశూన్య మగువిషయము చెప్పఁబడెనేని యది ఫలవద్విషయమునకు నంగము మాత్రమే యగును" అను న్యాయము ననుసరించి ఫలవంతము లగువిశేషనిరాకరణశ్రుతులచెంతఁ జెప్పఁబడియుండుటచే నీయుత్పత్త్యాదిశ్రుతులు వానికి నంగములే యగును. ఈవిషయము శ్రుతిచేతఁగూడ నిర్ణయింపఁబడియే యున్నది కదా! కావున నుత్పత్త్యాదిశ్రుతులు అభేదమునుమాత్రమే బోధించును; పరమేశ్వరునకు వికారములు లేక విశేషములు (శక్తులు) కలవని బోధింపవు. వ్యావహారికస్థితి నాశ్రయించి యన్నిశక్తు లున్నను పారమార్థికస్థితియందవి లేవు కావున బ్రహ్మమునుగూర్చి యెట్లును గతి సంభవింపదు.

"న తస్య ప్రాణా ఉత్క్రామంతి" అను శ్రుతి యీవిషయమును ప్రత్యక్షముగనే చెప్పుచున్నది. "స్పష్టో హ్యేకేషాం.౪.౨.౧౩." అనుస్థలమున నీశ్రుతియొక్క తాత్పర్యము నిర్ణయింపఁబడి యున్నది. కావున నెట్లు చూచినను జైమినిమతమే సిద్ధాంతమత మనువాదఃఉపక్షము యుక్తియుక్తమైనది కాదు.

ఇట్లు గాక "బ్రహ్మమునందుఁ గూడ గతి కలదు." అని పట్టుపట్టినను ప్రయోజనము లేదు. కొంచెము విచారించిన నాపక్షము నిలువదు. అప్పుడు జీవుఁడు పరమేశ్వరునియొక్క యవయవముగానైనను వికారముగానైనను (ఒకపదార్థమునుండి దానిపరిణామమువలన కలుగు మఱియొకపదార్థము వికారము) లేక సంపూర్ణముగ భిన్నుఁడుగా నైన నుండవలయును. పరిపూర్ణముగ నభిన్నుఁడే యైన గతి సంభవింపదు కదా! "సరియే యిట్లయిన నేమి? అవయవావయవులకు భేదాభేదములు కలవు గావున నందు భేదపక్షము నాశ్రయించి గతి సంభవింపవచ్చును కదా!" అనియెదవేమొ వినుము. జీవుఁడు బ్రహ్మావయవ మైనచో గతి సంభవింపదు. అవయవ మనఁగా నవయవిలోనిభాగమే యగుటచే నవయవి దానికి (అవయవమునకు) నిత్యప్రాప్తుఁడే యగును కదా! మఱియు బ్రహ్మము నిరవయవ మని వేదమునఁ బ్రసిద్ధమై యుండ దానికి నవయవములఁ గల్పించుటయు యుక్తియుక్తము కానేరదు. "ఇట్లయిన జీవుని బ్రహ్మవికార మనియెదము." అనిన నీపక్షమునందును పైనఁజెప్పిన దోషములు వచ్చును. ఏపదార్థమునుండి వికారము జనించెనో అది యావికారమునకు నిత్యప్రాప్తమే యై యుండును. ఘట మెన్నటికిని దానికిఁ బరిణామికారణ మైనమృత్తికను విడచి యుండదు కదా! విడచిన నదియు లేనిదియే యగును కదా! కావున వికారమైనను జీవునకు నిత్యప్రాప్తులై యున్నపరబ్రహ్మమునుగూర్చి గతి సంభవింపదు. ఇదియును గాక నీపక్షముల నాశ్రయించిన జీవునకు సంసారగతియే కలుగదు. ఆకాశమునకు లేనిరూపాదులు ఘటాకాశమునకు కలుగనట్లు మృత్తికకు లేనిలఘుత్వాదులు ఘటమునకు సంభవింపనట్లు బ్రహ్మమునకు లేనిచాంచల్యము జీవునకు సంభవింపదు; బ్రహ్మమునకు లేనిసంసారగతి జీవునకు సంభవింపదు. "అవయవవికారములకును పదార్థములకును భేదాభేదములు కలవు, అందు భేదపక్షము నాశ్రయించిన నన్నియు కలుగవచ్చును" అను

టయు యుక్తియుక్తము కానేరదు. పరస్పరవిరుద్ధము లగుటచే భేద భేదము లొక్కస్థలమున నుండనేరవు. ఈపక్షములయందు అవయవియు సత్యమే; అవయవంబును సత్యమే. ఇట్లే వికారియు సత్యమే; వికారం బును సత్యమే. వివర్తవాదమున నన్ననో ఆరోపితపదార్థ మసత్యము కావున నచ్చట వాస్తవముగ నభేదంబును కల్పితముగ భేదంబు నుండ వచ్చును; దాని నాశ్రయించి సర్వవ్యవహారములు ప్రవర్తింపవచ్చును. ఇచ్చట మాత్ర మట్లు సరిపడదు. ఉండిన భేదాభేదములు రెండును పారమార్థికములుగానే యుండవలసివచ్చును. అట్లుండుట యసంభవము కదా!

ఇంక "జీవుఁడు పరమేశ్వరునికంటె సంపూర్ణముగ భిన్నుఁడు" అని చెప్పిన నదియుం గుదురదు. అప్పుడు జీవునకుం బరిమాణ మేది? అణు త్వమా? మధ్యమపరిమాణత్వమా? సర్వవ్యాపకత్వమా? సర్వవ్యాపకత్వ మయిన గతి సంభవింపదు. మధ్యమపరిమాణత్వమైనచో ననిత్యత్వము కలుగును. మధ్యమపరిమాణము గలఘటాదులన్నియు నశించుట స్పష్ట ముగ గానవచ్చుచున్నవి. ఇంక అణు (పరిమాణ)త్వమైనచో నప్పుడు శరీర మున నాపాదమస్తకముగ గలుగుశీతోష్ణాదిజ్ఞానము సంభవింపదు. అణు మధ్యమపరిమాణములు మున్నే (౨. ౩. ౧౯; ౨. ౨. ౩౩.) విశేషవిమ ర్శతో నిరాకరింపఁబడియున్నవి. మఱియు నభేదపక్షము నాశ్రయించిన "తత్త్వమసి"అనుమొదలగు శాస్త్రములకు బాధ కలుగును. ఇంతకుం బూర్వము దూషింపఁబడి యున్న వికారావయవపక్షముల నాశ్రయించినను ఈదోషము (శాస్త్రబాధ)తప్పదు. "ఇట్లుచెప్ప నేల? వికారావయవములు తమ కాశ్రయమగుపదార్థముతో భిన్నాభిన్నములు కావున నభేదపక్షము నాశ్రయించిన నీబాధ కలుగదుకదా!" అనియెదవేమొ యది యుక్తము కాదు. ఆపక్షములయందు భేదాభేదములు వాస్తవములే కావలయు ననియు వానికి పరస్పరవిరోధ ముండుటచే నట్లు కా వనియు నిదివఱకే చెప్పియున్నాము కావున భేదము బుద్ధిచేత మాత్రమే కల్పింపఁబడు చున్నది; సమవాయసంబంధము కల దనుకారణము నాశ్రయించి యభేద ముపచరింపఁబడుచున్నది. ఇట్లగుటచే ప్రధాన మగునేకత్వము (జీవబ్రహ్మా భేదము) లేదు కదా! ఇట్లయిన "తత్త్వమసి" అనుశాస్త్రమునకు బాధ యెట్లు లేకపోవును? మఱియు నీయన్నిపక్షములలో (అవయవవికార

భేదపక్షములలో) దేని నాశ్రయించినను జీవునకు సంసారము నిత్యమే కావలసి వచ్చును; కావున మోక్షము కలుగదు. ఒకవేళ కలిగినను జీవ స్వభావము పోవలసివచ్చుటచేతను అది (జీవస్వభావము) బ్రహ్మాభిన్న మగుట చేతను జీవునకు స్వరూపనాశము కలుగవలసి వచ్చును. ఇది విరుద్ధము. అప్పుడు మోక్షార్థమై యెవ్వఁడును ప్రవర్తింపఁడు కదా! అభివృద్ధికై యెవ్వఁ డయినను ప్రవర్తించునుగాని నాశమునకై ప్రవర్తింపఁడు కదా! "జీవుఁడు బ్రహ్మవివర్తము" అనుమాపక్షమున నీదోషము లేదు. అప్పుడు ఆరోపితసర్పమునకు రజ్జువే స్వభావ మైనట్లు ప్రతిబింబమునకు బింబమే స్వభావ మైనట్లు జీవునకు బ్రహ్మమే స్వభావ మగును. ఇట్లగుటచే ముక్తి యందు జీవత్వమునకు మాత్రమే నాశము కలుగునుగాని జీవస్వభావము నకు కాదు. కావున గతిని కల్పించుటకై యెన్నిపాట్లు పడినను ప్రయో జనము లేదు.

"ఇట్లు చెప్ప నేల? జీవుని బ్రహ్మవివర్తముగ నంగీకరింపకున్నను ముక్తియందు జీవవినాశము కలుగ నక్కఱ లేదు. వ్యాధిహేతువులై యభివృద్ధి నొందియున్న వాతపిత్తాదుల నౌషధాదులచే నశింపఁజేసి మఱల వానికి నభివృద్ధి కలుగకుండునట్లు అపత్యపదార్థములు విడ చిన కారణము లేకుండుటచే వ్యాధి యుత్పత్తి నొందనట్లు ఆరోగ్యము తనంతఁదానే లభించునట్లు కర్మ లేకపోయిన సంసారము నశించును; మోక్షము తనంతనే దొరకును. పురుషుఁడు నిత్యనైమిత్తికకర్మముల నాచ రించుచుండిన *ప్రత్యవాయరూప మగుపాదము రాదు. కామ్యనిషిద్ధ కర్మముల విడిచిన స్వర్గనరకప్రాప్తి కలుగదు. వెనుకటికర్మము లన్నియో ప్రస్తుతజన్మమున ననుభవించుటచే క్షీణము లగును. ఇట్లయిన నాజీవు నకు నుత్తరజన్మము కలుగుటకు గారణ మేమి యుండును? ఈకారణము వలన పైఁజెప్పినవిధముగ నాచరించినవానికి స్వయముగనే ముక్తి దొర కును. అప్పుడు స్వభావనాశము కలుగ నక్కఱలేదు కదా!" అని పై యాక్షేపమునకుఁ గొందఱు సమాధానమును చెప్పఁ జూచుచున్నారు. ఇది కుదురదు. ఈవిషయమునఁ బ్రమాణ మేదియు లేదు. ఇది యప్ర త్యక్షవిషయ మగుటచే దీనిని నిరూపించుటలో శాస్త్రము తప్ప మఱి

* ప్రత్యవాయ మనఁగా చేయవలసినదానినిఁ జేయకపోవుటవలన కలిగెడు దోషము.

యేదియుఁ బ్రమాణము కానేరదు. ఆశ్రమన్నన్నో మోక్షార్థికి జ్ఞాన మావశ్యక మగుచున్నది కాని పైఁజెప్పిన యాచారమే చాలు ననుట లేదు. ఆవిషయము స్వబుద్ధిచే మాత్రమే యూహింపఁబడినదియే. సంసార మునకుఁ గర్మ కారణ మగుటచే నేదియో యొకవిధముగ నాకర్మకు నభావము సంభవించిన సంసార ముండదు కదా యనునభిప్రాయముతో ని ట్లూహింపఁబడెను. అయినను నీయూహ పొసఁగదు. సంసార మనాది యగుటచే నందలికర్మలకు మితి లేదు. అవి దేశకాలానుగుణములై తమ ఫలముల నొసంగుచుండును. కొన్ని మాత్రము తమ కవకాశము కలుగు టచే నీజన్మమునందలి దేహమును కల్పించి తమఫలముల ననుభవింపఁ జేయును. మఱికొన్ని దేశకాలనిమిత్తములన పేక్షించుచు వేచియుండును. ఇట్లుండ నీజన్మముతో సర్వకర్మలు ననుభవింపఁబడు నని నిర్ణయ మెట్లు? కర్మపరంపర యనంత మగుటచే నేవిషయమునుగాని యెట్లుగాని నిర్ణ యించుటకు వీలు లేదు. ఏదినైన నెట్లయిన నుండవచ్చును కదా! కావున పైనవర్ణింపఁబడినయాచారము కలవానికైనను పురాకృతకర్మము వలన జన్మాంతరము కలుగవచ్చును. శ్రుతియు "య ఇహ రమణీయ చరణాః" అని కర్మశేషము కల దనువిషయమును బోధించుచున్నది. కావున పై యభిప్రాయము యుక్తమైనది కాదు.

"ఇట్లు చెప్ప నేల? నిత్యనైమిత్తికకర్మలు పురాకృతముల నెల్ల నశింపఁజేయవచ్చును కదా!" అనియెదవేమొ యది సంభవింపదు. నిత్యనైమిత్తికకర్మలకును పూర్వజన్మార్జితకర్మలకును విరోధము లేదు. ఒకవేళ పూర్వజన్మార్జితములలోని పాపకర్మలు అపరిశుద్ధరూపము లగు టచే నిత్యనైమిత్తికములకు విరోధు లైనను పుణ్యకర్మలు మాత్ర మట్టివి కానేరవు. అవి పరిశుద్ధరూపములే కదా! కావున నిత్యకర్మ లొకవేళ పాపములను నశింపఁజేసినను పుణ్యముల నశింపఁజేయవు. పాపములనైనను సంపూర్ణముగ నశింపఁజేయఁగల వనుటకుఁ బ్రమాణము లేదు. అగుఁగాక. వానిని సంపూర్ణముగ నశింపఁజేసినను పుణ్యకర్మలవలన జన్మాంతరము కలుగవచ్చును కదా! కావున నిత్యనైమిత్తికకర్మలవలనఁ బూర్వకర్మక్షయము కలుగు ననుట సంభవింపదు. విరోధ ముండిననే కదా యొకదాని నొక్కటి నాశము చేసికొనఁ బ్రయత్నించుట! మఱియు నిత్యనైమిత్తికములు ప్రత్యవాయమును మాత్రమే తొలఁగించు ననియు వాని

వలన నితరఫలములు కలుగ వనియు నియమించుటకుఁ గూడ వీలు లేదు. ఒక్కఫలము ప్రధాన మైనను ఎన్నియో ఫలము లానుషంగికములై కలుగవచ్చును. అవియు నొకపక్షమున జన్మాంతరమును కలిగించు నేమో యెవ్వఁ డెఱుంగును? ప్రత్యక్షమునఁ జూచిన వానివలనఁగూడ బ్రహ్మ వర్చస్సుపుట్టి ఆయుర్వృద్ధి మొదలగుఫలాంతరములు కలుగుచునే యున్నవి. ఆపస్తంబుఁడును "తద్యథా౽౽మ్రే ఫలార్థే నిమిత్తే ఛాయా గంధా వనూత్పద్యేతే ఏవం ధర్మం చర్యమాణ మర్థా అనూత్పద్యంతే" "మామిడిచెట్టు పండుకొఱకై మాత్రమే నాటఁబడినను దానినుండి చల్లని నీడయు సువాసనయు జనించినట్లు ధర్మముఁగూడ చిత్తశుద్ధికై మాత్రమే లేక భోగమునకై మాత్రమే యాచరింపఁబడినను దానినుండి యానుషం గికమై ధనము వచ్చును" అని యానుషంగికఫలములనుగూర్చి చెప్పి యున్నాఁడు.

ఇదియునుఁ గాక బ్రహ్మాత్మైక్యజ్ఞానము లేకుండ మఱియొకవిధముగ కామ్యనిషిద్ధకర్మలనుగూడ సంపూర్ణముగ వదలుటకు వీలు కలుగ దన వచ్చును. ఏల యనిన:— దేహమున్నప్పు డెట్టివాఁడయినను సుఖార్థమై కామ్యనిషిద్ధకర్మల నించుకయైన నాచరింపక గూడదు. కామ్యనిషిద్ధములు సుఖజనకము లగుటచే వానిని ఎట్టివాఁడైనను అల్పముగా నైన నంగీక రించు ననుట ప్రత్యక్షసిద్ధము. జ్ఞానము కలిగినచో నీకర్తృత్వాదులతోఁ దనకు సంబంధము లే దనువిషయము తేటపడినచో నప్పు డొకవేళ నీప్రమాణము కలిగినను పురుషుఁడు చక్కచేసికొనవచ్చును గాని లేకున్న నెట్లు దానినుండి తప్పించుకొనఁగలఁడు? మఱియు జ్ఞానము పరిపాకము నొందినచో నాకర్మల బొత్తుగ నాచరింపకుండిన నుండవచ్చును గాని లేకున్న నెట్లు ప్రమాదమునకు లోనుగా కుండును? కావున విచారించిన నజ్ఞాని కామ్యనిషిద్ధములఁ బరిపూర్ణముగ వర్జింపఁగల దనుట సిద్ధింపదు; మఱియు నీజీవబ్రహ్మైక్యము నంగీకరింపకుండినఁ గర్తృత్వాదులు తొలఁ గవు. అప్పు డవి జీవునకు స్వభావములే యగుచు కదా! ఏపదార్థమునుండి యైనను దానిస్వభావమును వేఱుచేయుటకు వీలు లే దనుట సర్వజనవిది తము. అగ్నినుండి వేఁడిమినిగాని నీటినుండి చల్లఁదనమునుగాని వేఱుచేయు టకు వీలు కలదా? ఇట్లు కర్తృత్వాదులకు నాశము లేకుండిన కార్యము నకు ననుభవమునకుఁ గూడ నాశ ముండదు. ఇట్లున్న నీక సంసారనిమి

త్తము లగుకర్మలకు నభావ మెటనుండి వచ్చును? కావున పైనవర్ణించిన విధముగా నాచరించుటయు దుర్ఘటమే; అట్లాచరించినను ఒక్కజన్మముతో లేక పెక్కుజన్మములతోనైనను ముక్తి కలుగుటయు దుర్ఘటమే.

“ఇట్లు చెప్ప నేల? కర్తృత్వభోక్తృత్వశక్తులవలనఁ గలుగు ననర్థమేదియు లేదు. వానికార్యము లగుకర్మానుభవములవలననే కదా సర్వానర్థములును కలుగుచున్నవి. పైన వర్ణింపఁబడినయాచారము నాశ్రయించినవానికి క్రియాభోగములు లేవు కావున శక్తు లున్నను ముక్తికి హాని లేదు.” అనియెదవేమొ అది యుక్తము కాదు. శక్తి యున్న నది కార్యముల నేల చేయకుండును? “కేవలశక్తి యెప్పటికిని కార్యముల సాధింప నేరదు. దానికి నితరకారణములయొక్క సహాయముగూడఁ గావలయును.” అనియెదవేమొ అట్లయినను మాపక్షమునకు హాని రాదు. శక్తి యుండిన దానికిఁ గావలసినసామగ్రి యంతయు దానితోనే సంబంధించి యుండును. అన్నియు నొక్కకార్యమునే యాచరించును గావున సమానశక్తిత్వ మనుసంబంధముతో నవి కూడియే యుండును. కావున కర్తృత్వభోక్తృత్వములు జీవునకు స్వభావము లయ్యెనేని జ్ఞానమువలన నాతనికి బ్రహ్మరూపత్వము కలిగి యాకర్తృత్వాదులకు నాశము కలుగదేని యప్పుడు మోక్షమే లేక పోవలసి వచ్చును. జ్ఞానముచేఁ గర్తృత్వాదులకు నాశము కలుగునేని యప్పు డవి యారోపితమాత్రములే యగుటచే వానికార్యముల నాచరించుచున్నసమయమునందుఁ గూడ హానిని కలిగింపనేరవు. “నేను బద్ధుఁడనై యున్నాను” అని తలంచుటయే గాని వాస్తవస్థితిలో బంధ మెవ్వనికిని లేదు కదా! కావున జ్ఞాన మొక్కటియే మోక్షమున కుపాయము. “నాన్యః పంథా విద్యతే ఽయనాయ” అను శ్రుతియు నీవిషయమునే స్పష్టము చేయుచున్నది; జ్ఞానమునకంటె నితరమగుమోక్షమార్గము లే దనుచున్నది. “ఇట్లు చెప్పిన సర్వవ్యవహారములకును లోపము కలుగవలయును. జీవబ్రహ్మము లేకమైన నప్పుడు జీవుఁడు బ్రహ్మమువలెనే నిర్వికారుఁడు కావలయును కదా!” అనియెదవేమొ యట్లు సంశయింప నక్కఱ లేదు. వాస్తవస్థితిలో నిర్వికారుఁడే యైనను ఆజీవుఁడు అజ్ఞానవశమునఁ దన్ను బరిచ్ఛిన్నునిఁగా భావించుచున్నాఁడు గావున జ్ఞానము కలుగునంతకు లోపల ప్రత్యక్షాది సర్వవ్యవహారములును ప్రవర్తింపవచ్చును. వాస్తవస్థితిలో బ్రాహ్మణుఁడే

యైనను నిద్రావశమున మనోవైచిత్రిచే దన్ను శూద్రునిఁగా భావించిన పురుషునకు స్వప్నావస్థయందు మఱల మెలఁకువ గలుగుటకు బూర్వము భావనానుగుణము లగువ్యవహారములు ప్రవర్తించుచున్నవి కదా! "యత్ర హి ద్వైత మివ భవతి. త దితర ఇతరం పశ్యతి" "ఎచ్చట (అజ్ఞానదశయందు) రెండుగా గానఁబడునో అచ్చట నొక్కఁడు మఱి యొక్కనిఁ జూచును" అని యజ్ఞానివిషయమునుగూర్చి స్వప్నసదృశ వ్యవహారమును శ్రుతి బోధించుచున్నది. "యత్ర త్వస్య సర్వ మాత్మై వా భూ త్తత్కేన కం పశ్యేత్" "ఎచ్చట (జ్ఞానదశయందు) నీజీవునకు సర్వమును స్వస్వరూపభూతమే యయ్యెనో అచ్చట దేనితో దేనిని జూచును" అని జ్ఞానినిఁగూర్చి వ్యవహారాభావమును తెల్పుచున్నది. జ్ఞానము కలిగినపిదపఁ గూడ దేహపాతమువఱకు ప్రారబ్ధబలమువలన నాభాసమాత్రముగా వ్యవహార ముండుననియు నిరూపించి యున్నాము కదా! కావున నీయా క్షేపములకు నవకాశము లేదు. కావున బ్రహ్మవేత్తనుగూర్చి విచారించిన వానికి భేదజ్ఞానమంతయు నశించెను గావున గతియే సంభవింపదు.

"ఇట్లయిన గతిశ్రుతులకు విషయ మెయ్యది? అవి దేనినిగూర్చి చెప్పుచున్నవి?" అనియెదవేమొ వినుము. అవి సగుణోపాసకులఁగూర్చి చెప్పుచున్నవి. వారికి భేదదర్శనము నశింపలేదు. కావున వారినిఁగూర్చియే గతిని చెప్పుచున్నవి. ఎచ్చటఁ జూచినను గతి సగుణవిద్యలయందే కలదు కాని నిర్గుణవిద్యలయందు లేదు. పంచాగ్నివిద్య పర్యంక విద్య వైశ్వానరవిద్య మొదలగు విద్యలయందు మాత్రమే యీగతి కానవచ్చుచున్నది. "ప్రాణో బ్రహ్మ......దహరం పుండరీకం" అను మొదలగు కొన్నిస్థలములయందు బ్రహ్మప్రస్తావము నారంభించి గతి చెప్పఁబడి యున్నను అచ్చట వామనత్వాదిగుణములతోఁ గూడిన సగుణ బ్రహ్మమే యుపాస్యుఁడుగా వర్ణింపఁబడియుండుటచే నాగతి సగుణవిద్యా విషయమే యగుచున్నది. కేవల పరమేశ్వరవిషయము చెప్పఁబడి యున్న చోట్ల "స తస్య ప్రాణా ఉత్క్రామంతి" అని యిట్లు గతి నిషేధింపఁబడి యున్నది గాని యొక్కస్థలముననైన నంగీకరింపఁబడి యుండలేదు. "బ్రహ్మవి దాప్నోతి పరం" అనుస్థలమున "ఆప్నోతి" అనుపదము గతివాచకమే యైనను పైన్యాయము ననుసరించి దేశాంతరప్రాప్తిని తెలుపునది కాదనియే నిర్ణయింపవలసియున్నది. అవిద్యాధ్వంసమువలనఁ గలుగు

స్వస్వరూపప్రాప్తియే యాపదమునకు నర్థమని నిర్ణయింపవలసియున్నది. "బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" "పరబ్రహ్మమే యై యుండి పరబ్రహ్మమును జెందును" అను నిట్టిప్రయోగము లీవిషయమున దృష్టాంతములు. ఈ వాక్యమునందు పైనవివరించినయర్థము స్పష్టముగనే తెలియుచున్నదికదా! కావున గతిశ్రుతులు సగుణోపాసకులఁ గూర్చినవియే.

మఱియు శుద్ధబ్రహ్మమునుగూర్చియే గతి చెప్పఁబడియుండిన నది పరబ్రహ్మజ్ఞానమునం దిచ్ఛ జనింపఁజేయుటకై చెప్పఁబడి యుండునా? లేక నుపాసనార్థమై చెప్పఁబడియుండునా? ఇం దేపక్షముకూడ యుక్తము కాదు. ఫలభూత మగుపదార్థ మప్రత్యక్షమై దూరస్థితమై యుండునేని యప్పుడు దానినిఁగూర్చి గతి చెప్పఁబడవచ్చును. "అచ్చటికిఁ బోవుమార్గ మెంతయో సుఖకరముగా నుండును" అను వర్ణింపఁబడవచ్చును. ఈవర్ణ నము ననుసరించి "మార్గమే యింతసుఖకరముగా నుండిన నిక నాస్థాన మెట్లుండును?" యని ఫలార్థు లువ్విళు లూరవచ్చును. ఆయాశవలనఁ దదర్థము లగుకర్మల నాచరింపవచ్చును. ఇచ్చట మాత్ర మట్లు లేదు. బ్రహ్మము స్వస్వరూపభూతమే. అజ్ఞానముచే మాత్రమే తనకంటె భిన్న ముగఁ దోఁచుచున్నది. ఇట్లగుటవలన దాని నెఱింగినంతమాత్రముననే చిత్తస్వాస్థ్యము పరమానందము కలుగుచుండ నిక గతిస్తుతి దేనికిఁ బనికి వచ్చును? ఈకారణమువలననే బ్రహ్మవేత్తకు గతిధ్యానమువలనఁ గూడఁ బ్రయోజనము లేదు. బ్రహ్మవస్తువు స్వతస్సిద్ధమయినది. అజ్ఞానముచే తిరోహితమై మాత్రమే యున్నది. అదియే ముక్తి గావున బ్రహ్మవేత్తకు ఫల మదియే. అది కర్మలవలనఁ గలిగింపఁబడదు కదా! జ్ఞానమువలన "ఇది యిట్టిది" అని తెలిసికొనుట మాత్రమే చాలును కదా! ఇట్లుండ నజ్ఞానము గతి నేల యపేక్షించును? ఇట్లగుటచే పరబ్రహ్మవిషయమై గతి యుండుటకు వీలులేదు. గతియంతయు సగుణబ్రహ్మమును గూర్చియే చెప్పఁబడియున్నది. ఇట్లున్నను ప్రమాదముచే దానిని కొందఱు నిర్గుణ పరబ్రహ్మవిషయమునుగా సమన్వయింపఁ జూచుచున్నారు.

"ఇట్లయిన బ్రహ్మము రెండువిధములుగ నున్నదియా?" అని యొదవేమొ యది సత్యమే. "ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః" ఓసత్యకాముఁడా! పర మనియు నపర మనియు

నే బ్రహ్మము కలదో అది యీ యోంకారమే" అని పరాపర బ్రహ్మమును గూర్చి శ్రుతి స్పష్టముగనే చెప్పుచున్నది. "వానిస్వరూపము లెవ్వి?" యనిన వినుము. అవిద్యవలనఁ గలిగిన నామరూపాదులను విడిచి "అస్థూలమణును" అను మొదలగువాక్యములచే నేది బోధింపఁబడును. అది పరబ్రహ్మము; ఏదియో యొకనామరూపములతోఁ గూర్చి యేది యుపాసనార్థమై బోధింపఁబడును. అది యపరబ్రహ్మము. "మనోమయః" అను మొదలగుస్థలములు దీని కుదాహరణములు. "ఇట్లయిన నద్వితీయశ్రుతికి బాధ వచ్చును" అనియెదవేమొ యట్లు రా నక్కఱ లేదు. ఉపాధు లన్నియు కేవల మజ్ఞానకృతములే కాని వాస్తవములు కావని చెప్పియున్నాము కదా! ఇట్లుండ ద్వైత మెట్లు సంభవించును? పదార్థ మొక్కటియే యై యున్నను ఒక్కమాఱే దానియథార్థస్థితిని తెలిసికోనలేనివారలకు సోపాన ప్రాయముగ మొట్ట మొదట నవిద్యాకల్పనల నంగీకరించి సగుణముగ నుపదేశింపఁబడుచున్నది. ఇంతమాత్రమువలన భేద మెట్లు కలుగును? కావున నెట్లును విరోధము లేదు. మఱియు నాయపరబ్రహ్మ నుపాసన చేయుటవలన సాంసారిక మగు ఫలమే కలుగును గాని మొట్టమొదటనే ముక్తి కలుగదు. అన్ని సగుణో పాసనలవలనను క్రమముక్తి కలుగు ననియు నియమము లేదు. కొన్నిటి వలన నైశ్వర్యప్రాప్తియు మఱికొన్నిటివలన పాపక్షయంబును వేఱొక కొన్నిటివలన స్వేచ్ఛాచారసామర్థ్యాదులును కూడఁ గలుగును. "స యది పితృలోకకామో భవతి" "వానికి పితృలోకముపైఁ గోర్కెయుండిన యెడల" అను మొదలగు శ్రుతులీవిషయమును నిర్ణయించుచున్నవి. ఇ ట్లగుటచే నీఫలములు లోకాంతరములయందుఁగలుగునవి కావునను ఆలో కములు ప్రదేశవంతములై దూరమున నున్నవి కావునను దత్ప్రా ప్తికై గతి యావశ్యకము. క్రమముక్తి నొందవలసినవారుగూడ బ్రహ్మ లోకమునకుఁ బోవలసినవారలే కదా! ఆయపరబ్రహ్మముకూడా సర్వ వ్యాపకుఁడే యైనను ఆకాశమునకుఁ గలశబ్దగుణము వేణురంధ్రమున నున్న యాకాశమునందుమాత్రమే యభివ్యక్తమైనట్లు ఆయనకుఁ గల జ్ఞానైశ్వర్యాదులు సత్యలోకమునందు మాత్రమే వ్యభివ్యక్తములు కావచ్చునని యిదివఱకే నిరూపించియున్నాము. జీవుఁడును సర్వవ్యాప కుఁడే యైనను సర్వవ్యాపక మగునాకాశము ఘటావచ్ఛిన్న మైనప్పుడు

ఘటముతోఁబాటు గమనాగమనముల నాచరించునట్లు బుద్ధ్యవచ్ఛిన్నుఁడగుటచే బుద్ధితోఁగూడ గమనాగమనముల నాచరింపవచ్చు నని "తద్గుణసారత్వాత్ ౨. 3. ౨౯." అనుస్థలమున వివరించియున్నాము. కావున నెట్లు చూచినను బాదరిపక్షమే సిద్ధాంతము. బుద్ధి వికాసము నొందుటకై జైమినిపక్షము చూపఁబడెనే కాని మఱియొకయుద్దేశమునఁగా దని తెలిసికొనవలయును.

## ౬. అప్రతీకాలంబనాధికరణము.

సంగతివిషయసంశయములు:—ఇట్లు గతిని నిర్ణయించి యామార్గముచే బ్రహ్మలోకమునకుఁ బోవునధికారుల ప్రస్తావసంగతితో నిర్ణయించుచున్నాఁడు. "ఉపాసకు లందఱును బ్రహ్మలోకమునకుఁ బోవుదురా? లేక కొందఱుమాత్రమే పోవుదురా? ఆదేవపురుషు లందఱను గొనిపోవునా? లేక కొందఱను మాత్రమే గొనిపోవునా?" అనుసంశయమును నిరాకరించుచున్నాఁడు.

పూర్వపక్షము:—"విచారించిన నుపాసకు లందఱును బ్రహ్మలోకమునకుఁ బోవుదు రనియే తోఁచుచున్నది. 'అనియమః సర్వాసామ్. 3. 3. 3౧.' అనుస్థలమున సన్నివిద్యలయందును గతి నుపసంహరించుకొనవచ్చు నని చెప్పియున్నారు. నిర్గుణబ్రహ్మవేత్తలకు తప్ప తక్కినవారికి గతి లే దనుట సంభవింపదు కదా! 'బ్రహ్మోపాసన చేసినవారు కాకపోవుటచే *ప్రతీకోపాసకులకు గతి సంభవింపదు' అనియెద రేమొ, యది సరి కాదు. పంచాగ్నివిద్యోపాసకులు బ్రహ్మోపాసకులు కాకున్నను వారికి బ్రహ్మలోకప్రాప్తి కలుగుచున్నది కదా! మఱియుఁ బ్రతీకోపాసకులును మనస్సు మొదలగువానిని బ్రహ్మముగా నుపాసించువారు గావున బ్రహ్మోపాసకులే యగుదురు. ఆయాయుపాసనలయందే ప్రత్యేకఫలములు చెప్పఁబడియున్నను ఆఫలము లెల్ల బ్రహ్మలోకమునందే సంభవింపవచ్చును. బ్రహ్మలోకమునఁగూడ న్యూనాధికభావములు గలవు కదా!"

---

* ప్రతీకోపాసకులు (అ-౪. పా-౧. సూ-3. పేజీ-4౭4 చూ.)

## అ-౪. పా-౩. సూ-౧౫.

అవతారిక:—అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

# ౫౩౩. అప్రతీకాలంబనాన్నయతీతి బాదరాయణ ఉభయథాఽదోషాత్తత్క్రతుశ్చ.

## ౪. ౩. ౧౫.

తాత్పర్యము:—ఇట్లు కాదు. ఉపాసకుల నందఱను దేవపురుషుఁడు బ్రహ్మలోకమునకుఁ గొనిపోవఁ డనియు ప్రతీకోపాసకులను విడిచి తక్కినవారిని మాత్రమే గొనిపోవు ననియు బాదరాయణమహాముని తలంచుచున్నాఁడు. ఇట్లు కొందఱు బ్రహ్మలోకమునకుఁ బోరనియు మఱి కొందఱు మాత్రము పోవుదు రనియుఁ జెప్పుటవలన విరోధ మేమియు రాదు. "అనియమః సర్వాసాం" అనున్యాయమును ప్రతీకభిన్నోపాసనల యందే సమన్వయించినఁ బాతక మేమియు లేదు కదా! మఱియు నీవిషయమును సాధించుటకు గొప్ప హేతు వొకటి కలదు. ప్రతీకోపాసకులు తప్ప తక్కిన వార లందఱు బ్రహ్మోపాసకులు. ఇట్లగుటచే నా బ్రహ్మయొక్క యైశ్వర్యము నొందదగియుందురు. "తం యథా యథోపాసతే త దేవ భవతి" "ఆపరమేశ్వరు నెట్లెట్లుపాసింతురో అట్లట్లే యగుదురు." అని శ్రుతి యీవిషయమునే బోధించుచున్నది. ప్రతీకోపాసనలయం దిట్లు బ్రహ్మోపాసన లేదు. అచ్చట మనస్సు మొదలగువానియందే బ్రహ్మదృష్టి యుంపఁబడుచున్నది గాని బ్రహ్మమునందు మనస్సు మొదలగువానిదృష్టి కా దని యిదివఱకే (౪. ౧. ౪.) నిరూపించియున్నాము. కావున నందు ప్రతీకములే ప్రధానములు. ఇట్లగుటచే నాయుపాసనలు బ్రహ్మోపాసనలో కానేరవు. మఱియు నాయుపాసనల నాచరించినవారియందు ఫలప్రాప్తిలో న్యూనాధికభావము చెప్పఁబడి యున్నది. అవియు బ్రహ్మోపాసనలే యగునేని యిట్టిన్యూనాధికభావ ముండఁదగదు. బ్రహ్మోపాసకుల కందఱకును అవిశేషముగ శ్రుతియందు బ్రహ్మలోకప్రాప్తియే చెప్పఁబడియున్నది. బ్రహ్మలోకము నాశవంతమైనది యనునీకారణమువలన నందు శ్రుతిప్రసిద్ధము కానిన్యూనాధికభావమును కల్పించుట యన్యాయము కదా!

మఱియు నీయుపాసకులు పరబ్రహ్మముయొక్క యవయవముల నుపాసింతు రేని యప్పుడు తత్తదవయవానుసారముగ నొకవేళ బ్రహ్మలోకమునందును న్యూనాధికభావ ముండవచ్చును గాని అట్టియుపాసనలు కల వను విషయమునఁ బ్రమాణములు లేవు. కావున నిర్వివాదముగఁ బ్రతీకోపాసకులకు బ్రహ్మలోకప్రాప్తి లేదనుటయే సిద్ధాంతము. "పంచాగ్నివిద్యోపాసకులు బ్రహ్మోపాసకులు కాకున్నను బ్రహ్మలోకమును జెందుచున్నారు కదా!" అనిరేని యది ప్రత్యేకవిషయము. శ్రుతిచే నావిషయమునుఁ బ్రత్యక్షముగఁ జెప్పఁబడియున్నది కదా! ఇట్లగుటచే నది విశేష విధి కావచ్చును. ఇంతమాత్రమున బ్రహ్మోపాసకులు కానివారల కందఱకును బ్రహ్మలోకప్రాప్తిని కల్పించుటకు వీలు కలదా? కావున నెట్లును ప్రతీకోపాసకులకు బ్రహ్మలోకప్రాప్తి లేదు.

## ౫౩౪. విశేషం చ దర్శయతి. ౪. ౩. ౧౬.

తాత్పర్యము:—మఱియు బ్రహ్మోపాసకులకును ప్రతీకోపాసకులకును శ్రుతియే భేదముఁ జెప్పుచున్నది. "యావన్నామ్నో గతం తత్రాస్య యథా కామచారో భవతి...వాగ్వావ నామ్నో భూయసీ... యావద్వాచో గతం తత్రాస్య యథా కామచారో భవతి...మనో వావ వాచో భూయః." "నామమును బ్రహ్మమునుఁగా నుపాసించువాఁడు నామప్రచారము గలయంతవఱకు స్వేచ్ఛాసంచారి యగును. వాక్కు నామమునకంటె నధికము. దానిని బ్రహ్మమునుఁగా నుపాసించువాఁడు తత్ప్రచారము కలయంతవఱకు స్వేచ్ఛాసంచారి యగును. ఆవాక్కునకంటె మనస్సు గొప్పది." అని యిట్లు ప్రతీకోపాసకులకు ఫలభేదమును చెప్పుచున్నది. న్యూనాధికభావమును బోధింపుచున్నది. బ్రహ్మోపాసకులకు నిట్టిఫలభేదము లేదు కదా! ఈభేదమువలన వీ రిరువురకును పోలిక కలుగదు. ప్రతీకోపాసకులకు బ్రహ్మోపాసకులవలె బ్రహ్మలోకప్రాప్తి కలుగదు.

బ్రహ్మసూత్రార్థచంద్రికయందు చతుర్థాధ్యాయమున
తృతీయపాదము.



# బ్రహ్మసూత్రార్థచంద్రిక.

## చతుర్థాధ్యాయము - చతుర్థపాదము

### పాదావతారిక

ఈపాదమున బూర్వార్ధమున బ్రహ్మవేత్తలకుఁ గలుగు పాటోన్మ క్తియు నుత్తరార్ధమున సగుణోపాసకులకుఁ గలుగు బ్రహ్మసమానైశ్వర్యం బును వర్ణింపఁబడుచున్నది. ఈపాదము ఫలనిరూపణమును చేయును గావున నీయధ్యాయమునఁ జేర్పఁదగియున్నది. అధికరణము లన్నియు ఫలనిరూపణమును గావించునవియే యగుటచే నీపాదమునఁ జేర్పఁదగి యున్నవి.

## ౧. సంపద్యావిర్భావాధికరణము

సంగతి విషయ సంశయములు:—పూర్వపాదాంతమున బ్రహ్మ లోకప్రాప్తికి నర్హు లగువారు నిరూపింపఁబడిరి. కావున నిర్గుణవిద్యోపాస కులు బుద్ధిసులు కాఁగా వారిముక్తినిఁగూర్చి బుద్ధిసలకుఁణసంగతితో నిందు విచారింపఁబడును. "ఏవ మే వైష సంప్రసాదోఽస్మా చ్ఛరీరా త్సముత్థాయ పరం జ్యోతి రుపసంపద్య స్వేన రూపే ణాభినిష్పద్యతే (ఛా. ౧. ౩. ౧౮.)" అనుశ్రుతి ముక్తస్థితిని వర్ణించుచున్నది. ఈశ్రుతి విషయమున గొంతసంశయము కలదు. "ఈశ్రుతియందు జీవుఁడు బ్రహ్మ మునుఁజెంది స్వస్వరూపముతో నిలచు నని యున్నదికదా! దీని కభిప్రాయ మేమి? స్వర్గాదులను జెందినవాఁడు ఆయాలోకములయందలి సుఖము ననుభవించుటకై యుచిత మగురీతి నేదియో యొకయాధిక్యమును

జెందునట్లు ఈముక్తుఁడు కూడ నొందుననియా ? లేక స్వస్వరూపముతోనే నిలచు ననియా ?" అనునీసంశయ మీయధికరణమున నిరాకరింపఁబడును.

పూర్వపక్షము:—"విచారించిన లోకాంతరములయందువలె ముక్తియందు నేదియో యొకవిశేషమే కలుగు నని తోచుచున్నది. నిష్పత్తి యనఁగా నుత్పత్తి బొత్తుగ లేనిపదార్థముగాని నిత్యమై యున్నపదార్థముగాని యుత్పత్తికాదు కదా! ఈమోక్షము స్వస్వరూపమే యగునేని నిత్యము కావలయును. ఇట్లయిన నది యుత్పత్తి నొందనేరదు. ఇఁక బంధాభావ ముత్పత్తి యగు ననిన నదియు సంభవింపదు. బంధము తుచ్ఛ మగుటచే నది యెప్పటికిని లేనిదే కదా! మఱియు ముక్తి నిత్యమైన నితరము లగునవస్థలయందును అనుభవింపఁబడు చుండవలయును. ఇట్లు లేదు కదా! మఱియు నీమోక్షము నిర్గుణోపాసనకు ఫల మని చెప్పఁబడి యున్నది కదా! ఫల మెప్పటికిని స్వతస్సిద్ధమై యుండదు. కావున నిర్వివాదముగ ముక్తుఁడు. ముక్తి నొందినప్పు డేదియోయొకవిశేషరూపమునే చెందవలయును."

## అ-౪. పా-౪. సూ-౧.

అవతారిక:—అని యిట్లువచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

---

## ౫౩౫. సంపద్యావిర్భావః స్వేనశబ్దాత్. ౪.౪.౧.

తా:—ఈ పూర్వపక్షము యుక్తమైనది కాదు. జీవుఁడు మోక్షమును జెందినప్పుడు స్వస్వరూపముతోనే నిలచునుగాని మఱియొకధర్మము నొందఁడు. శ్రుతియందు "స్వేన రూపే ణాభినిష్పద్యతే" అని స్వశబ్దము ప్రయోగింపఁబడి యున్నది. పైన వర్ణించినవిధముగా నర్థము చెప్పకుండిన నీప్రయోగము నిరర్థకము కావలసి వచ్చును. తగినయర్థము సంభవించుచుండఁగా నిట్టినిరర్థకత్వమును గైకొనుట పాడి కాదు. శాస్త్ర మనునది యపూర్వవిషయమును అజ్ఞాతవిషయమును బోధింపవలయు ననుటయే సిద్ధాంతము కదా! ఇట్లుండ నిరర్థకముగ దాని *ననువాదమాత్రము

* అనువాదము. (అ-౧. పా-౩. పేజీ-276 చూ.)

నుగాఁ జేయఁబూనుట యయుక్తకార్యము కదా! వీ లున్నంతవఱకుఁ బ్రతివాక్యము నుండియు నపూర్వార్థమునే గ్రహింపవలయు ననుట యావశ్యకకృత్యము. కావున స్వశబ్దమువలన స్వస్వరూప మనియే యర్థమును గ్రహించి తీరవలయును.

"స్వశబ్దము స్వకీయ మగురూపమునుఁ గూడ జెప్పును గదా! ముక్తియందు జీవునకు భిన్న స్వరూపము వచ్చినను అది స్వకీయమే కావలసి వచ్చుటచే నారూపమునే శ్రుతి స్వశబ్దముచేఁ బరామర్శించుచున్నది యనవచ్చును కదా!" అనియెద వేమో. అట్లు కాదు. ముక్తియందు జీవుఁడు భిన్నస్వరూపము నొందునేని యది నియతముగ. వానికి స్వస్వరూపమే యగుటచే మఱల స్వశబ్దమును విశేషణముగా ప్రయోగింపవలసినయవసర ముండదు. ఇట్లు కాక స్వశబ్దమున కాత్మార్థమే యుండునేని ("స్వేన రూపేణ" "తా నైన రూపముతో" అనునర్థమే పరిగ్రహింపఁబడునేని) యప్పుడు మిగుల నుపయోగము కలదు. "ముక్తి నొందినప్పుడు జీవుఁడు స్వస్వరూపమునే జెందును గాని మఱియొకరూపమును జెందఁడు. ముక్తియనఁగా స్వతస్సిద్ధ మగుస్వస్వరూపస్థితియే కాని యన్యము కాదు" అను విషయము నిర్ధారణ యగును. స్వశబ్దమును రూపవిశేషణముగానే ప్రయోగించినను శ్రుతికి దోషము లేదు కాని అయినను పదము అర్థవంత మగుటకు వీలు కలుగుచుండ దానిని నిరర్థకమును చేయుట యుక్తము కాదు కదా! కావున జీవుని స్వస్వరూపస్థితియే ముక్తి.

## అ_౪. పా_౪. సూ_౨.

అవతారిక :— "ఇట్లయినను మోక్షముకు ఫల మనుచున్నారు కదా! 'నిష్పద్యతే' అను నుత్పత్తివాచకశబ్దముకూడ ప్రయోగింపఁబడి యున్నది కదా! వీనికి నర్థ మెట్లు కుదురును?" అనినఁ జెప్పుచున్నాఁడు.

## ౫౩౬. ముక్తః ప్రతిజ్ఞానాత్. ౪. ౪. ౨.

తాత్పర్యము:— "అపూర్వవిషయమును అజ్ఞాతవిషయమును బోధించునదియే శాస్త్రమగుటవలన నట్టిదానిని తగినంత బలవత్తరకారణము లేకుండ ననువాదమాత్రముగ నన్వయించుట యుక్తము కాదు" అని యిదివఱకే చెప్పియున్నాము. ప్రస్తుతశ్రుతి బోధించు నీపూర్వవిషయ

మేది యనిన:—జీవుఁడు మనకు సంసారసంబంధము కలవాఁడుగాను సుఖిగాను దుఃఖిగాను దోఁచుచున్నాఁడు కాని స్వస్వరూపముతోఁ దోఁచుట లేదు. "అంధో భవతి. రోదితీవ. వినాశ మే వాపీతో భవతి" "శరీరము గ్రుడ్డిదైన నాత్మ గ్రుడ్డివాఁడగును. (ఇది జాగ్రదవస్థాదోషము లాత్మకు కల వనుట). పరమార్థస్థితిలో రోదనముఁ జేయకున్నను చేసిన ట్లుండును. (స్వప్నావస్థయందు దేహాత్మలకు సంబంధము లేకుండుట స్పష్టమై యున్నను స్వప్నకల్పితదేహసంబంధముచే దుఃఖాదిసంబంధ మాత్మకు నాయవస్థయందును కల దనుట). సంపూర్ణముగ నశించినట్లే యుండును. (ఇది సుషుప్త్యవస్థాదోషసంసర్గమును జెప్పుట)" అని శ్రుతియు కథారూపమున జీవునిస్థితినిఁ జెప్పుచున్నది. అనంతరమునందును ఆతని స్వస్వరూపస్థితిని ముక్తి యనుపేర వర్ణించుచున్నది. ఇది యపూర్వవిషయమే కదా! యజ్ఞాతవిషయమే కదా! మన మింతకుఁ బూర్వ మెఱుంగని జీవబ్రహ్మాభేదమును కదా వేదము బోధించుచున్నది. ఇట్టిదానిని నిరర్థకముగ ననువాదమాత్రమును జేయుట యుక్తియుక్త మగునా?

"ఈ శ్రుతిచే ముక్తియే చెప్పఁబడెనని యెట్లు తెలియును?" అనియెదవేమొ ఆవిషయము శ్రుతిచేతనే ప్రత్యక్షముగాఁ జెప్పఁబడియున్నది. కథోపక్రమమునందు "య ఆత్మాపహతపాప్మా' అని యింద్రవిలోచనులు సామాన్యముగ నెఱుంగఁబడియున్న శుద్ధజీవునిఁగూర్చియే ప్రశ్నించినట్లు చెప్పఁబడియున్నది. ముక్తియే జీవునియథార్థస్థితి యని పలుమాఱు నిరూపించియున్నాము. ముక్తి యనఁగా బ్రహ్మస్వరూపమే కదా! ఈవిధముగ నుపక్రమించి పిదప "ఏతం త్వేవ తే భూయోఽనువ్యాఖ్యాస్యామి" అని మఱలమఱల నాయాత్మనే పరామర్శించుచు వచ్చి సర్వసంశయనిరాకరణపూర్వకముగ నవస్థాత్రయమునుండియు శరీరమునుండియు నాతని వేఱుచేసి యంతమున "ఏష సంప్రసాదః" అను వాక్యముచే నుపసంహారము చేయఁబడియున్నది. ఇది కథాసందర్భానుసారముగ (ఈకథనుగూర్చి చూ. ౧-3-౧౯) ముక్తినిఁగూర్చినదియే కావలయును కదా! కావున నీ శ్రుతియందు నిర్వివాదముగ ముక్తియే వర్ణింపఁబడినది. ఇది స్వస్వరూపస్థితి యనుటలో వివాదము నొంద నక్కఱలేదు.

"ముక్తికి ఫల మనికదా వ్యవహారము. ఫలము కార్యమే యైతీర వలయు ననుటయు లోకనియమము కదా! ఈముక్తియు నియమము

ననుసరించి జనించునది యగునేని యప్పుడు స్వస్వరూపస్థితి కానేరదు కదా!" అనియెదవేమొ యట్లుకాదు వినుము. ముక్తి ఫలమగుటయు నది యుత్పత్తి నొందవలయుటయు యథార్థమే కాని యది స్వస్వరూప స్థితిమాత్రమః కాకపోదు. ఉత్పత్తి యనఁగా నావిర్భావమే కాని మఱి యొక్కటి కాదని యిదివఱకే ప్రకటింపఁబడియున్నది. లేనిపదార్థము పుట్టదని పలుమాఱు చెప్పియున్నాముకదా! కావున లేనిముక్తి క్రొత్తగా జనించుననుటకు వీలులేదు. అట్లు జనించిన నది భ్రాంతిసిద్ధమై యనిత్యము కావలయును. ఇది వేదమునకు సమ్మతము కాదు. కావున నాముక్తి స్వతస్సిద్ధమే యైనను భ్రాంతిసిద్ధ మగుబంధముచే జ్ఞానోదయకాలమువఱకు తిరస్కృతమై యున్నది గావున జ్ఞానోదయానంతరమున నభివ్యక్తమై క్రొత్తగా జనించినట్లు తోఁచును. ఇట్లగుటచే "నిష్పద్యతే" యనునుత్పత్తి వాచకపద ప్రయోగంబును ఫలత్వప్రసిద్ధియు స్వస్వరూపస్థితి యను స్వరూపంబునకును (ముక్తిస్వరూపంబునకు) నాశకరంబులు కానేరవు. కారణమున సూక్ష్మరూపముతో నున్న ఘట మభివ్యక్తము కాకుండునట్లు చేయు ప్రతిబంధముయొక్క వినాశమే ఘటోత్పత్తిశబ్దముచేఁ జెప్పఁబడు నట్లు ఇచ్చటఁగూడ ముక్తి నభివ్యక్తము కాకుండునట్లు జేయుసంసారము యొక్కవినాశమే మోక్షోత్పత్తిశబ్దముచేఁ జెప్పఁబడవచ్చును కదా! "విచారించిన నిది యుత్పత్తియే కాకపోవును. అప్పుడు ఉత్పత్తిశబ్దము యొక్క స్వారస్యము పోవును. ఇదియు ననిష్టమే కదా!" యనియెదవేమొ వినుము. ఇది యొక్కటియే గాదు; ప్రపంచమునందుఁ గలసర్వవ్యవహార ములు నిట్టివే. బ్రహ్మాభిన్న మగుపదార్థ మేదియు లేకుండుటవలన భేదము నాశ్రయించి కలుగువ్యవహారములన్నియు పరమార్థస్థితిలో నిలుకడలేనివే యగును కావున ముక్తి ఫల మగుటవలనఁగాని యుత్పత్తి నొందు నని చెప్పఁబడుటవలనఁగాని కలుగువిరోధ మేదియు లేదు. ఆరోగ్యమే స్వభావసిద్ధమైనను రోగము వచ్చి పోయినచో నప్పుడు "ఆరోగ్యము వచ్చినది" అనిచెప్పునట్లు ముక్తియు స్వతస్సిద్ధమే యైనను జ్ఞానమువలన సంసారము తొలంగఁగానే "మోక్షము వచ్చినది" అని చెప్పుచున్నారు గాని యిందువిశేష మేమియు లేదని తెలిసికొనవలయును.

---

మేది యనిన:—జీవుఁడు మనకు సంసారసంబంధము కలవాఁడుగాను సుఖిగాను దుఃఖిగాను దోఁచుచున్నాఁడు కాని స్వస్వరూపముతోఁ దోఁచుట లేదు. "అంధో భవతి. రోదితీవ. వినాశ మే వాపీతో భవతి" "శరీరము గ్రుడ్డిదైన నాత్మ గ్రుడ్డివాఁడగును. (ఇది జాగ్రదవస్థాదోషము లాత్మకు కల వనుట). పరమార్థస్థితిలో రోదనముఁ జేయకున్నను చేసిన ట్లుండును. (స్వప్నావస్థయందు దేహాత్మలకు సంబంధము లేకుండుట స్పష్టమై యున్నను స్వప్నకల్పితదేహసంబంధముచే దుఃఖాదిసంబంధ మాత్మకు నాయవస్థయందును కల దనుట). సంపూర్ణముగ నశించినట్లే యుండును. (ఇది సుషుప్త్యవస్థాదోషసంసర్గమును జెప్పుట)" అని శ్రుతియు కథారూపమున జీవునిస్థితినిఁ జెప్పుచున్నది. అనంతరమునందును ఆతని స్వస్వరూపస్థితిని ముక్తి యనుపేర వర్ణించుచున్నది. ఇది యపూర్వవిషయమే కదా! యజ్ఞాతవిషయమే కదా! మన మింతకుఁ బూర్వ మెఱుంగని జీవబ్రహ్మాభేదమును కదా వేదము బోధించుచున్నది. ఇట్టిదానిని నిరర్థకముగ ననువాదమాత్రమును జేయుట యుక్తియుక్త మగునా?

"ఈ శ్రుతిచే ముక్తియే చెప్పఁబడెనని యెట్లు తెలియును?" అనియెదవేమొ ఆవిషయము శ్రుతిచేతనే ప్రత్యక్షముగాఁ జెప్పఁబడియున్నది. కథోపక్రమమునందు "య ఆత్మాపహతపాప్మా" అని యింద్రవిలోచనులు సామాన్యముగ నెఱుంగఁబడియున్న శుద్ధజీవునిఁగూర్చియే ప్రశ్నించినట్లు చెప్పఁబడియున్నది. ముక్తియే జీవునియథార్థస్థితి యని పలుమాఱు నిరూపించియున్నాము. ముక్తి యనఁగా బ్రహ్మస్వరూపమే కదా! ఈవిధముగ నుపక్రమించి పిదప "ఏతం త్వేవ తే భూయోఽనువ్యాఖ్యాస్యామి" అని మఱలమఱల నాయాత్మనే పరామర్శించుచు వచ్చి సర్వసంశయనిరాకరణపూర్వకముగ నవస్థాత్రయమునుండియు శరీరమునుండియు నాతని వేఱు చేసి యంతమున "ఏష సంప్రసాదః" అను వాక్యముచే నుపసంహారము చేయఁబడియున్నది. ఇది కథాసందర్భానుసారముగ (ఈకథనుగూర్చి చూ. ౧-౩-౧౯) ముక్తినిఁగూర్చినదియే కావలయును కదా! కావున నీ శ్రుతియందు నిర్వివాదముగ ముక్తియే వర్ణింపఁబడినది. ఇది స్వస్వరూపస్థితి యనుటలో వివాదము నొందఁ నక్కఱలేదు.

"ముక్తికి ఫల మనికదా వ్యవహారము. ఫలము కార్యమే యైతీరవలయు ననుటయు లోకనియమము కదా! ఈముక్తియు నియమము

ననుసరించి జనించునది యగునేని యప్పుడు స్వస్వరూపస్థితి కానేరదు కదా!" అనియెదవేమో యట్లుకాదు వినుము. ముక్తి ఫలమగుటయు నది యుత్పత్తి నొందవలయుటయు యథార్థమే కాని యది స్వస్వరూప స్థితిమాత్రముః కాకపోదు. ఉత్పత్తి యనఁగా నావిర్భావమే కాని మఱి యొక్కటి కాదని యిదివఱకే ప్రకటింపఁబడియున్నది. లేనిపదార్థము పుట్ట దని పలుమాఱు చెప్పియున్నాముకదా! కావున లేనిముక్తి క్రొత్తగా జనించుననుటకు వీలులేదు. అట్లు జనించిన నది భ్రాంతిసిద్ధమై యనిత్యము కావలయును. ఇది వేదమునకు సమ్మతము కాదు. కావున నాముక్తి స్వత స్సిద్ధమే యైనను భ్రాంతిసిద్ధ మగుబంధముచే జ్ఞానోదయకాలమువఱకు తిరస్కృతమై యున్నది గావున జ్ఞానోదయానంతరమున నభివ్యక్తమై క్రొత్తగా జనించినట్లు తోఁచును. ఇట్లగుటచే "నిష్పద్యతే" యనునుత్పత్తి వాచకపదప్రయోగంబును ఫలత్వప్రసిద్ధియు స్వస్వరూపస్థితి యను స్వరూపంబునకును (ముక్తిస్వరూపంబునకు) నాశకరంబులు కానేరవు. కారణమున సూక్ష్మరూపముతో నున్నఘట మభివ్యక్తము కాకుండునట్లు చేయుప్రతిబంధముయొక్క వినాశమే ఘటోత్పత్తిశబ్దముచేఁ జెప్పఁబడు నట్లు ఇచ్చటఁగూడ ముక్తి నభివ్యక్తము కాకుండునట్లు జేయుసంసారము యొక్కవినాశమే మోక్షోత్పత్తిశబ్దముచేఁ జెప్పఁబడవచ్చును కదా! "విచారించిన నిది యుత్పత్తియే కాకపోవును. అప్పుడు ఉత్పత్తిశబ్దము యొక్క స్వార్థము పోవును. ఇదియు ననిష్టమే కదా!" యనియెదవేమో వినుము. ఇది యొక్కటియే గాదు; ప్రపంచమునందుఁ గలసర్వవ్యవహార ములు నిట్టివే. బ్రహ్మభిన్న మగుపదార్థ మేదియు లేకుండుటవలన భేదము నాశ్రయించి కలుగువ్యవహారములన్నియు పరమార్థస్థితిలో నిలుకడలేనివే యగును కావున ముక్తి ఫల మగుటవలనఁగాని యుత్పత్తి నొందు నని చెప్పఁబడుటవలనఁగాని కలుగువిరోధ మేదియు లేదు. ఆరోగ్యమే స్వభావసిద్ధమైనను రోగము వచ్చి పోయినచో నప్పుడు "ఆరోగ్యము వచ్చినది' అనిచెప్పునట్లు ముక్తియు స్వతస్సిద్ధమే యైనను జ్ఞానమువలన సంసారము తొలంగఁగానే "మోక్షము వచ్చినది" అని చెప్పుచున్నారు గాని యిందువిశేష మేమియు లే దని తెలిసికొనవలయును.

---

## అ-౪. పా-౪. సూ-౩.

అవతారిక:—ఈ క్రిందిసూత్రమువలనఁ బ్రయోజనము లేదు. ఇందు "పరం జ్యోతి రుపసంపద్య" అని శ్రుతియందు ప్రయోగింపఁబడిన జ్యోతిశ్శబ్దముయొక్క యర్థము విచారింపఁబడవలయు నని మీరు చెప్పు చున్నారు కదా! ఈకార్యమువలనఁ బ్రయోజనము లేదు. జ్యోతియనఁగా నగ్ని యనుటః సర్వప్రసిద్ధవిషయము. ఈజీవుఁడును అర్చిరాదిమార్గము గుండా మోక్షమునకుఁ బోవచ్చును గదా! కావున నీసూత్రమే యర్థము.

సిద్ధాంతము:—ఇట్లు చెప్పఁగూడదు. శ్రుతికి నిదియే యుద్దేశమై యుండునేని జ్యోతిస్సును జెందినపిదప దానిని మఱల విడచుటనుఁ గూర్చియుఁ జెప్పఁబడి యుండవలసి వచ్చును. ఇట్లు లేదుకదా! "ఈవిష యము నధ్యాహారముఁ జేసికొనవచ్చును" అనియెదవేమో. అప్పటికిని నిర్గుణబ్రహ్మవేత్తనుగూర్చి యగ్నిలోకప్రాప్తినిఁ జెప్పుట నిరర్థకమే యగును. నిర్గుణబ్రహ్మవేత్తకు గతియే లే దని సిద్ధాంతము చేయఁబడి యున్నది కదా! కావున జ్యోతిగ్ప్రాప్తినిఁ గూర్చి చెప్పుట జ్యోతిస్వరూప స్థితినిఁ గూర్చి చెప్పుటయే యగునేమో (అనఁగా: జీవుఁ డగ్నిరూపమును జెందు ననియే చెప్పఁబడెనేమో) యనుసంశయము కలుగును. అగ్ని వినా శము కలది యగుటచే జీవుఁడు నట్టివాఁడే కావలసి రాఁగా నాతనినిత్యత్వ మునకు భంగముకలుగు నేమో యని సంశయము జనించును. ఇట్టియగ్ని జీవైక్యము శ్రుతిచే నుద్దేశింపఁబడియుండకపోయిన జ్యోతిగ్ప్రాప్తినిఁ గూర్చి చెప్పుటవలనఁ బ్రయోజనమే లేదు కదా! యని తోఁచును. కావున నీసంశయముల నివారించుటకై జ్యోతిశ్శబ్దార్థ మవశ్యవిచారణీ యము. సూత్ర మవశ్యముగ నారంభింపఁబడవలసినదియే.

## ౫౩౭. ఆత్మాప్రకరణాత్. ౪. ౪. ౩.

తాత్పర్యము:—ఇచ్చట జ్యోతిశ్శబ్దార్థమునుగూర్చి సంశయ మక్కఱ లేదు. ఆపద మాత్మనే తెల్పును. ప్రకరణవాక్యములవలన నీవిషయము తేటపడుచున్నది. "ఏష ఆత్మాపహతపాప్మా" అని యాత్మ విషయ ముపక్రమింపఁబడియుండ నడుమ నగ్ని యేల ప్రస్తావింపఁబడును? బ్రహ్మవేత్తకు నుత్క్రాంతిగాని దేవయానమార్గముగాని లే దని మున్నే

వివరించియున్నాము కదా! మఱియు వాక్యమున నాజ్యోతిశ్శబ్దమునకు "పరం" అనువిశేషణముఁ బ్రయోగింపఁబడి యున్నది. పరత్వ మనఁగా సర్వోత్తమత్వము. ఇది బ్రహ్మముఁనకుఁ దప్ప మఱియొక్కపదార్థమునకు సంభవింపదు. తగినకారణము లేక పదార్థమును సంకోచింపరాదు కదా! కావున నిచ్చట జ్యోతిశ్శబ్దముచే బ్రహ్మమే చెప్పఁబడెను. మఱియు జ్యోతిశ్శబ్దము పరమేశ్వరవాచకముఁగూడ నగునని "జ్యోతి ర్దర్శనాత్. ౧. 3. ౪౦." అనునధికరణమున స్పష్టము చేసికూడా ఉన్నాము. కావున నిర్వివాదముగ నీపద మాత్మవాచకమే. "సంపద్య...నిష్పద్యతే" అని కాలభేదమును చెప్పుటయు కాలభేదనిరూపణాభిప్రాయముతో కాదు.లోకమునందు కాలభేదము లేకున్నను (వ్యత్యాసముగా నున్నను) కూడ నిట్టిప్రయోగములు కానవచ్చుచున్నవి. మనుష్యుఁడు నిదురించినపిదపనే నోరు తెఱచుకొనినను "వాఁడు నోరు తెఱచుకొని నిదురించుచున్నాఁడు." అని లోకులు చెప్పుదురు కదా! ఇట్లే యిచ్చటఁగూడ స్వస్వరూపప్రాప్తి (స్వస్వరూపజ్ఞానము) కలిగినపిదపనే బ్రహ్మైక్యము సంభవించుచున్నను ఇట్లు ("బ్రహ్మమును జెంది స్వస్వరూపముతో నేర్పడును" అని) చెప్పఁబడి యున్నది. ఈవిషయముఁగూడ దహరాధికరణమున (చూ. ౧. 3. ౧౯.) వివరించియే యున్నాము కావున జ్యోతిశ్శబ్దార్థ మాత్మయే; ముక్తియు స్వస్వరూపస్థితియే.

---

## ౨. అవిభాగేనదృష్టత్వాధికరణము.

సంగతి విషయసంశయ పూర్వపక్షములు:—పూర్వాధికరణమున ముక్తిస్వరూపము విచారింపఁబడెను. ఇప్పుడు ముక్తస్వరూపము విచారింపఁబడును. ఈ కారణమువలన నీయధికరణములకు బుద్ధిస్థ లక్షణసంగతిగాని యేకఫలత్వసంగతిగాని కల దని తెలిసికొనవలయును. "ముక్తుఁడైనజీవుఁడు బ్రహ్మమాత్రుఁడయ్యే నిలచునా? లేక బ్రహ్మభిన్నుఁడై నిలచునా?" అనుసంశయము నివారింపఁబడును. " 'స తత్ర పర్యేతి, పరం జ్యోతి రుపసంపద్య' 'ఆజీవుఁడు బ్రహ్మమునందు నిలుచును, బ్రహ్మమును

పొందును' అని శ్రుతి యొకచో *నాధారాధేయ భావమును చెప్పుట వలనను మఱియొక్కచో †గర్మకర్తృభావమును చెప్పుటవలనను జీవ బ్రహ్మములకు భేద ముండునట్లు తోఁచుచున్నది" అను పూర్వపక్షము ఖండింపఁబడును. జీవబ్రహ్మైక్యమునుగూర్చి యిదివఱకే పలుమాఱు తెల్పఁబడియున్నను ‡స్థూణానిఖననన్యాయమున నావిషయమే యిచ్చట మఱల బోధింపఁబడుచున్నది.

---

## ౫౩౭. అవిభాగేన దృష్టత్వాత్. ౪. ౪. ౪.

తాత్పర్యము:—ముక్తిదశయందు జీవుఁడు బ్రహ్మముతో నభిన్నుఁడయ్యే నిలుచును. శ్రుతి యిట్లే బోధించుచున్నది. "తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి, బ్రహ్మైవ సన్బ్రహ్మాప్యేతి, యత్ర నాన్యత్పశ్యతి నతు తద్వితీయమస్తి తతోఽన్య ద్విభక్తం యత్పశ్యేత్" అనునిట్టివాక్యములు శ్రుతియొక్క యభిప్రాయమును వెల్లడించుచు వేనవేలుగాఁగలవు. మఱియు తత్క్రతున్యాయము (చూ. ౪-౩.౧౫) ననుసరించి ఎవ్వని కెట్టిభావన యుండునో యట్టిఫలమే కలుగు ననుటయే శాస్త్ర యుక్తమగు విషయము. బ్రహ్మజ్ఞాని సర్వమును తనను కూడ బ్రహ్మగా భావించుచుండ వానికి బ్రహ్మైక్యమేల కలుగకపోవును? ఇదియునుగాక "యథోదకం శుద్ధే శుద్ధమాసికం తాదృగేవ భవతి. ఏవం మునేర్విజానత ఆత్మా భవతి గౌతమ" "ఓనాచికేతుఁడా పరిశుద్ధము లగుజలములయందు వైవఁబడిన పరిశుద్ధజలము తదభిన్నమే యగుట యెట్లో? అట్లే బ్రహ్మజ్ఞానియొక్కయాత్మయు బ్రహ్మాభిన్నుఁడే యగును" అని కఠోపనిషత్తునం దీవిషయము విస్పష్టముగా వర్ణింపఁబడెను. మఱియు ముక్తజీవునకును బ్రహ్మమునకును భేదము లేదని యనేకవాక్యము లిట్లే ప్రకటించుచున్నవి. నదీసముద్రాదిదృష్టాంతములుకూడ ననేకము లిట్లే యొసంగఁబడియున్నవి. "ఇట్లయిన భేదము నేల చెప్పవలయును" అని

---

* ఆధారాధేయములు. (అ-౧. పా-౪. సూ-౩. పేజీ-436. చూ.)

† కర్మకర్తృభావమనఁగా గర్మకును కర్తకును గలపరస్పరసంబంధము. ప్రకృతము బ్రహ్మ కర్మగాను జీవుఁడు కర్తగాను ఉండుట.

‡ స్థూణానిఖననన్యాయము. (అ-౨. పా-౧. సూ-౩౪. పేజీ-650. చూ.)

యెదవేమో యందు విరోధము లేదు. శాస్త్రము లోకవ్యవహారము ననుస
రించినది కావునను లోకవ్యవహారము భ్రాంతిసిద్ధభేదము నాశ్రయించి
నది కావునను శిష్యులకు సుఖముగా బోధ యగుటకై యిట్లు చెప్పఁబడు
చున్నది. "స భగవః కస్మి న్ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని...ఆత్మరతి
రాత్మక్రీడః" "ఓభగవంతుఁడా! ఆపరమేశ్వరుఁడు దేనియందు స్థాపింపఁ
బడి యున్నాఁడు? తనశక్తియందే (తనయందే) ఆత్మయం దాసక్తిగల
వాఁడు ఆత్మయందు క్రీడించువాఁడు" అనునిట్టి ప్రయోగము లీవిషయ
మున నుదాహరణములు. వీనిని విమర్శించిన నభేదమే చెప్పఁబడుచుండుట
స్పష్ట మగుచున్నవి కదా! అయినను బాహ్యమునకు నీవాక్యములు భేద
మునే చెప్పుచున్నట్లు గూడ నున్నది కదా! కావున నభేదమును చెప్పఁ
దలఁచినప్పుడు కూడా లోకానుసారముగ భేదమును చెప్పవచ్చును.
ఇంతమాత్రమువలన భేదమే శ్రుతితాత్పర్య మనుటకు వీలు కలదా?
సర్వత్ర విచార మావశ్యకము. విచారించిన ముక్తియందు జీవబ్రహ్మములకు
భేదము లేదనుట స్పష్టమగుచునే యున్నది. ఇదివఱకుఁగూడ ననేక
స్థలములయందుఁ బ్రతిపాదింపఁబడియు నున్నది.

---

# బ్రాహ్మాధికరణము. 3.

సంగతి విషయసంశయములు:— ప్రథమాధికరణమున ముక్తుఁడు
బ్రహ్మమునందు స్వస్వరూపముతో నిలుచు నని సిద్ధాంతము చేయఁ
బడెను. వానిస్థితినిఁగూర్చి నవిశేషముల నిరూపించుటకై యేకవిషయత్వ
సంగతితో నీయధికరణ మారంభింపఁబడెను. "ముక్తి నొందినజీవుఁడు
పరమేశ్వరునకు కలవని చెప్పఁబడుచున్న సర్వజ్ఞత్వాదిరూపప్రపంచము
లతోఁ గూడి యుండునా? ఆగుణము లసత్యము లగుటచే బొత్తుగనే
లేవనుకారణమువలన కేవలసచ్చిద్రూపముతో మాత్రమే యుండునా?
లేక పరమార్థస్థితిలో సచ్చిద్రూపముతోనే యున్నను వ్యావహారికము
నగు సర్వజ్ఞత్వాదులతోఁ గూడి యుండునా?" అను సంశయము నిరాక
రింపఁబడును.

---

## అ-౪. పా-౪. సూ-౫.

అవతారిక:— మొట్టమొదట రెండుసూత్రములచేఁ బూర్వపక్ష మనువాదము చేయఁబడుచున్నది. అందును "సర్వజ్ఞత్వాదిధర్మములు పరమేశ్వరునకు సత్యముగనే యున్నవి. జీవుఁడు భ్రాంతివలన సంసార దశలో నున్నప్పుడు వానిని తనవి కావని భావించుచున్నాఁడు. జ్ఞానము కలిగినప్పుడు తన నిజస్థితిని తెలిసికొనును. అప్పుడు పరమేశ్వరునితో తనకు భేదము లేదు కావున తనవియే యైనసర్వజ్ఞత్వాదిగుణములతోఁ గూడియుండును. కావున ముక్తియందును జీవుఁడు స్వప్రపంచుఁడే" అనుజైమినిపక్షము ననువాదముఁ జేయుచున్నాఁడు.

## ౫౩౮. బ్రాహ్మేణ జైమినిరుపన్యాసాదిభ్యః.

### ౪. ౪. ౫.

తాత్పర్యము:— బ్రహ్మస్వరూపమే జీవస్వరూప మనుట నిర్వివాదాంశము కదా! ఆబ్రహ్మమునకు *భావాభావరూపము లగుధర్మము లనేకములు కలవు. సర్వజ్ఞుఁడుగా నుండుట సర్వాధిపతి యగుట సర్వభూతములకు నంతర్యామి యగుట మొదలగునవి భావధర్మములు. పాపసంబంధము లేనివాఁ డగుట హ్రస్వస్థూలాదిభావములు లేనివాఁ డగుట జరామరణములు లేనివాఁ డగుట మొదలగునవి యభావరూపధర్మములు. ఈధర్మములాయనకు యథార్థము లయ్యే యుండవలయు ననుట నిస్సంశయము. అట్లు లేకుండిన శ్రుతి వానినిఁ గూర్చి చెప్పుటవలననే ప్రయోజన ముండదు కదా! "ఇట్లయిన నద్వైతమునకు భంగము వచ్చునుకదా!" అని సంశయింతువేమో యట్లు పని లేదు. ధర్మధర్ములకు భేదము లేదు కదా! ఈకారణమువలన నెన్నిధర్మము లున్నను వానితోఁ గూడి బ్రహ్మ మొక్కఁడే యగును. ఇట్లీధర్మములు స్వకీయములే యైనను జీవుఁ డజ్ఞానమువలన తనకు సంబంధింపనివిగా భావించుచున్నాఁడు. గురూపదేశ

* ఉన్నవి యని చెప్పఁబడుధర్మములు భావరూపధర్మములు. "ఈతనికి సర్వేశ్వరత్వము కలదు. సర్వాంతర్యామిత్వము కలదు" అను మొదలగునవి యిందు ఉదాహరణములు. ఇట్లే లేవు అని చెప్పఁబడునవి యభావరూపధర్మములు. "ఈయనకు గుణములు లేవు. ఆకారములుఁ లేవు" అను మొదలగునవి.

ప్రభావమువలన నట్టిమిథ్యాభావనను విడిచి యథార్థస్థితిని భావించినచో ముక్తి కలుగును. అప్పు డీగుణము లన్నియు జీవునకు వచ్చును. కావున ముక్తియందును జీవుఁడు సత్యసంకల్పుఁడే; బ్రహ్మముగూడ నట్టిదియేకదా! అని యిట్లు జైమినిమహాముని యభిప్రాయపడుచున్నాఁడు.

ఈవిషయము శ్రుతిచేతనే స్పష్టముగఁ జెప్పఁబడియున్నది. "య ఆత్మాఽపహతపాప్మా..."సత్యకామ సత్యసంకల్పః" "ఏయాత్మ సర్వపాపరహితుఁడో...ఆతఁడు సత్యకాముఁడు (కోరినకోర్కెను ఫలింపఁజేసికొను సామర్థ్యము గలవాఁడు) సత్యసంకల్పుఁడు. (సంకల్పించిన విషయమును ముగించువాఁడు.) అని కానవచ్చు * నుపన్యాసముచే నీవిషయము విశదీకరింపఁబడియున్నది. ఇచ్చట పరమేశ్వరుని ధర్మము లగు సత్యకామత్వాదులాత్మకుఁ గల వను విషయము ప్రతిపాదింపఁబడియున్నది కదా! మఱియు "స తత్ర పర్యేతి జక్షన్ క్రీడన్ రమమాణః...తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి" "భుజించుచు క్రీడించుచు రమించుచుఁ గూడ ఆజీవుఁడు బ్రహ్మమునందే నిలుచును. వానికి సర్వలోకములయందును స్వేచ్ఛాసంచారము కలుగును" అను † విధియు జీవునకు సర్వస్వాతంత్ర్యమును తెల్పుచు నీవిషయమునే (పరమేశ్వరధర్మములు జీవునియందుఁ గల వను విషయమునే) బోధించుచున్నది. "ఏష సర్వేశ్వరః" "ఈజీవుఁడే సర్వేశ్వరుఁడు" అను మొదలగు ‡ వ్యపదేశంబులు నిట్లయిననేగాని యుక్తియుక్తములు కానేరవు. పరమేశ్వరధర్మములు లేకుండిన జీవుఁడు సర్వేశ్వరుఁడు కానేరఁడు కదా! కావున నెట్లును ముక్తియందు జీవుఁడు సర్వజ్ఞత్వాదిగుణప్రపంచముతోఁ గూడియే యుండును.

---

* ఉపన్యాస మనఁగా నిదివఱకు తెలిసినదానిని యుద్దేశపూర్వకముగాఁ జెప్పుట. "య ఆత్మాఽపహతపాప్మా" = "ఇదివఱకే సకలపాపసంబంధరహితుఁడుగా నీకు దెలిసియున్నయాత్మ యెవఁడు కలఁడో" అను మొదలగునవి యుపన్యాసములు.

† విధి యనఁగా శరీరవిషయమును చెప్పుట "సతత్ర పర్యేతి" = ఆయుపాసకుఁడు పరమేశ్వరునియందు నిలుచును" అను మొదలగువిధులును.

‡ ఈ రెండువిధములలోను చేరనిది వ్యపదేశ మనఁబడును. "ఈతఁడు సర్వజ్ఞుఁడు" అను మొదలగునవి వ్యపదేశములు. ఇదివఱకు తెలియనివిషయ మగుటచే దీనిని చెప్పుట యుపన్యాసము కానేరదు. శ్రోత్రకార్యమును చెప్పకుండుటచే నిది విధియుఁ గానేరదు కదా!

## అ-౪. పా-౪. సూ-౬.

అవతారిక:—ఇట్లు జైమినిమతమును నిరూపించి "సర్వజ్ఞత్వాదులు గూడ కుందేటికొమ్మువలె నిపరమార్థములే యగుటచే జీవుఁడు ముక్తి దశయందు శుద్ధచైతన్యరూపముతో మాత్రమే నిలుచును." అను నౌడులోమిపక్షము ననువాదముఁ జేయుచున్నాఁడు.

# ౫౪౦. చితి తన్మాత్రేణ తదాత్మకత్వాదిత్యౌడు లోమిః. ౪. ౪. ౬.

తాత్పర్యము:—"ఈపక్షము యుక్తమైనది కాదు. పరమేశ్వరుఁడు నిత్యవిజ్ఞానస్వరూపుఁడు. భావాభావరూపము లగుధర్మము లాయన యందు పారమార్థికములై యుండనేరవు. 'బ్రహ్మము పాపములతో సంబంధము లేనివాఁడు' అను మొదలగు నభావధర్మోపన్యాసములు స్వాభావిక మగుధర్మాభావమును నిరూపించుచు స్వరూపమును ప్రకటించునే గాని ధర్మవియోగమును (ధర్మ ముండి నశించుటను) తెలియఁజేయవు. 'పరమేశ్వరుఁడు లేక జీవుఁడు. సత్యకాముఁడు. సత్యసంకల్పుఁడు' అను మొదలగు విధిధర్మోపన్యాసంబులును ఔపాధికము లగుగుణములనే బోధించును గాని పారమార్థికగుణములను బోధింపవు. 'విజ్ఞాన ఘన ఏవ' అను మొదలగు శ్రుతులు పరమేశ్వరునియందుఁగాని తదభిన్నుఁ డగుజీవుని యందుఁగాని జ్ఞానభిన్న మగుపదార్థమేదియు లేదని ప్రకటించుచున్నవి. ఈ శ్రుతులతాత్పర్యమును నిర్ణయించుటకు పైనిరూపణ (జైమినిపక్షము) యంతయు విరుద్ధము కదా! కావున నెట్లును పరబ్రహ్మమునకు పారమార్థిక గుణముల నంగీకరించుటకు వీలులేదు. ఔపాధికగుణము లుండవచ్చునని యంగీకరించినను అవి వ్యవహారమునకు మాత్రమే పనికివచ్చును కాని నిరూపణావిషయములయందు ప్రస్తావింపఁదగవుకదా! అవి కుందేటి కొమ్మువలె శూన్యరూపములే యగుటచే వానిని ప్రస్తావించుటయే యయుక్తము. కావున జీవుఁడు ముక్తిదశయందు శుద్ధచైతన్యమాత్రుఁడై మాత్రమే నిలుచును; ఆయనయందు ప్రపంచ మింతయైనను నుండదు. ఆతఁడు బ్రహ్మరూపుఁడే కదా!" అని యౌడులోమిమహాముని తలంచుచున్నాఁడు.

పరమేశ్వరునకు సర్వజ్ఞత్వాదులు పారమార్థికములుగానే యున్నవి యనిన నాయన యనేకరూపములు కలవాఁడు కావలసి వచ్చును. ఇది శ్రుతికి విరుద్ధమని "న స్థానతోఽపి. ౩. ౨. ౧౧." అను నధికరణమున నిరూపించి యున్నాము. ఈదోషమును జైమినిపక్షమువారెట్లును పరిహరించుకొన నేరరు. ఒక్కనికే యనేకాకారములు కలవనిన నొక్కపదార్థమే యనేకరూపములతో నున్నది యనియు; లేక ననేకరూపములు గలభిన్నపదార్థము లొక్కటిగా నున్నవనియు నభిప్రాయము. ఇం దేపక్షము నాశ్రయించినను వారిపక్షము నిలువదు. ఆకారము లనేకములయిన నప్పుడు పదార్థ మొక్కటి యగుటకు వీలు లేదు. ఆకారములలో పరస్పరవిరోధముఁగూడ నుండవచ్చును కదా! విరుద్ధాకారము లొక్కపదార్థమునకు నుండు ననుట యెట్లు? "విరోధము లేనియాకారములనే గ్రహింపవచ్చును కదా!" అనియెదవేమొ. ఈవిషయమున నియమ మేదియు లేదు. "సందర్భానుసారముగ నట్టినియమమును కల్పింపవచ్చును" అనియెదవేమొ యప్పటికిని వారిపక్షము నిలువదు. విరోధ మనఁగా భేద మని మాత్రమే మాయభిప్రాయము. భేద మనునది సమానము లగు రెండాకారములకుఁగూడ గలుగవచ్చును కదా! దీర్ఘాకారము కలవియే యైనను వర్తులాకారము కలవియే యైనను గూడ రెండువస్తువులకు పరస్పరము భేద ముండును కదా! కావున నెట్లు చూచినను ఒకపదార్థమున కనేకాకారము లుండుటకు వీలులేదు. "ఇది యేల? జల మొక్కటియేయైనను వరిమళ్లయందు వ్యాపించినప్పుడు ఆమళ్లయాకారము ననుసరించి బహువిధము లగునాకారముల నొందుచున్నది కదా!" యనియెదవేమొ. సత్యమే కాని యాయాకారము లుపాధుల నాశ్రయించి వచ్చినవియే కాని జలమునకు స్వాభావికములు కావు కదా! పదార్థములకు స్వాభావికాకారము లనేకములై యుండుటకు వీలులేదు. కాని వ్యావహారికాకారము లెన్నియైన నుండవచ్చును. ఔపాధికాకారముముతో పదార్థమునకుఁ బరమార్థసంబంధ ముండదు కదా! ఆయాకారములు ప్రత్యక్షముగ గానవచ్చుచున్నను లేనివే యగును. ఉపాధుల యొక్క యాకారములను పదార్థమునందే యున్నవానినిఁగాఁ దలంచుట భ్రాంతియే యగును కదా! కావున నొక్కపదార్థమున కనేకాకారము లుండు ననుట యుక్తము కాదు. "ఆకారము లనేకములు కల వని

యెవ్వరు చెప్పిరి? జైమినిగుతస్థులు గుణములు మాత్రమే కదా యనే
కము లనుచున్నారు. గుణము లాకారము లెట్లగును?" అనియెదవేమొ
వినుము. గుణములు పదార్థమును భేదించును. "వీఁడు దానశీలుఁడు ;
వీఁడు దయావంతుఁడు; వీఁడు సత్యవాది" అను నిట్టి వ్యవహారము లీవిష
యమునఁ బ్రమాణములు. ఈవ్యవహారములను విమర్శించిన నాయా
గుణములచే వారిని తక్కినజనులనుండి వేఱు చేసినట్లే కదా యర్థ
మేర్పడుచున్నది. "వీఁడు దానశీలుఁడు" అను వాక్యమునకు "తక్కిన
వారికిని వీనికినిఁ గలభేదము దానగుణము; ఇతరులు దానము చేయు
వారు కారు; వీఁడు దాత" అనియే కదా యర్థము. "వీఁడు దయావం
తుఁడు" అను మొదలగువ్యవహారములయందుఁగూడ నర్థము నిట్లే
గ్రహింపవలయును. ఈవిధముగ గుణములు స్వరూపమును భేదించునవి
యగుటచే నొక్కదేహమున నున్నయాత్మనుకూడ భేదించునవియే
యగును. బాహ్యమునఁ గానవచ్చుభేదమునకు హేతువు లైయున్న
గుణములే యాంతరమునఁ గూడ నున్నవి కదా! కావున నీగుణములు
కరచరణాదిరూపములు కాకున్నను భేదకము లగుటచే నాకారప్రాయ
ములే యగును. వీనివలన కల్పింపఁబడుభేద మౌపాధిక మగునేని యప్పు
డాత్మ యొక్కఁడే కావచ్చును; ఆకారభేదంబులును గానరావచ్చును.
పరమార్థము లైనచో నట్లుండుటకు వీలు లేదు కదా! కావున నొక్క
పదార్థమునకు ననేక కాకారము లుండుట సంభవింపదు. ఇట్లే భిన్నాకార
ములు గలపదార్థములు నొక్కటి యగుటకు వీలు లేదు. అప్పుడు వానికి
అనేకత్వమే సంభవింపదు కదా! కావున నెట్లు చూచినను ఆకారభేద
మంగీకారార్హము కాదు.

మఱియు నీగుణములకుఁ బరమేశ్వరునితోఁ బారమార్థికసంబం
ధము కల దని కదా జైమినిమతస్థులు చెప్పుచున్నారు. అప్పుడు వారు
పరమేశ్వరగుణములకును భేదాభేదముల నంగీకరింపవలసినవారుకూడ
నగుదురు. భేదము నంగీకరింపకపోయిన "ఇవి గుణములు. ఈతఁడు పర
మేశ్వరుఁడు" అనువ్యవహారము సిద్ధింపదు; అభేదము నంగీకరింపక
పోయిన నద్వితీయత్వము నిలువదు. ఇట్లు రెంటి నంగీకరించి యవి పార
మార్థికము లని గూడఁ జెప్పినచో నెట్లు సరిపడును? పరస్పరవిరుద్ధము
లగు భేదాభేదము లొక్కస్థలమున నుండు ననుట యెట్లు యుక్తియుక్త

మగును? భేదము పారమార్థిక మైనచో నభేద ముండదు; అభేదము పారమార్థిక మైనచో భేద ముండదు. గుణములు బ్రహ్మమునకంటె భిన్నములే యైన నద్వైతశ్రుతులకు బాధ వచ్చును; అభిన్నములే యైన నన్నియు బ్రహ్మమాత్రములే యగుటచే వానిలోఁగూడ (గుణములలోఁగూడ) పరస్పరభేదము లేకపోవలసి వచ్చును. ఆత్మరూపమునకు భేదము లేకుండగా దానితో నభిన్నము లైనవానికి మాత్రము భేద మెట్లు వచ్చును? ఇంతమాత్రమే కాదు. అభేదపక్షమున పరస్పరభిన్నము లగుగుణములతో నభిన్న మగుటచే నాత్మరూప మైనను భేదింపవలసి వచ్చును. ఇవి యన్నియు ననర్థములే కదా! ఆధర్మములు బ్రహ్మముతో మాత్ర మభిన్నము లగు ననియు పరస్పరము మాత్రము భిన్నములే యగు ననియుఁ జెప్పుట సంభవింపదు. ఇది పై నిరూపణ ననుసరించి యుక్తియుక్తము కానేరదు కదా! కావున నెట్లును భేదాభేదపక్షము నిలువదు.

"ఇట్లయిన వారు కేవలభేదపక్షమునే యాశ్రయింపవచ్చును. అప్పుడు అద్వైతశ్రుతులకును బాధ రాదు. 'బ్రహ్మమునకు పుణ్యపాపసంసర్గ లేదు.' అని యిట్లు నిషేధపూర్వకముగ ధర్మము లుపదేశింపఁబడుచున్నవి. ఈధర్మమునకును బ్రహ్మమునకును పారమార్థిక భేద మున్నను అద్వైతమునకు హాని రాదు. ధర్మము బొత్తుగనే లేదు కదా!" అనియెదవేమో వినుము. ఉన్నవాఁడు పరమేశ్వరుఁ డొక్కఁడే యనువిషయమును వారుకూడ నంగీకరించుచునే యున్నారుకదా! ఇఁక నాయనకంటె భిన్నముగ పాపపుణ్యము లెక్కడివి? అవి యాకస్మికముగ (అనఁగా వాస్తవస్థితిలో లేకున్నను ఉన్నట్లు భావించి) గ్రహింపఁబడినవే కదా! ఇట్టివానికి కల్పితము లనియే లోకవ్యవహారము కలదు. కావున వీనినాశ్రయించి నిర్ణయింపఁబడినయభావముగూడ నిట్టిదియే (కల్పితమే) కావలయును. ఇట్లుండ దీనితోఁ బరమేశ్వరునకు భేదముగాని యభేదముగాని యుండుట యెట్లు? కల్పితములు కుందేటికొమ్మువంటివే కదా! కావున నీయభావరూపధర్మము అద్వైతశ్రుతులకు భంగములు కలిగింప వనుట నంగీకరించినను మొట్టమొదట వీనితోఁ బరమేశ్వరునకు సంబంధమే కలుగదు. సంబంధనిరూపణమే కదా వారిపక్షమునకు ప్రధానకృత్యము. ఇదియునుఁ గాక నేదియో యొకవిధముగ సంబంధము కల్పింప సాహసించినను విధిరూపము లగుగుణము లద్వైతమును బాధింప కుండవు.

కావున నభావరూపధర్మములను బోధించుస్థలమునందు చేసిననిరూపణము నాశ్రయించి విధిరూపధర్మములు కూడ కల్పితమాత్రములే యని యంగీకరించుటయే యావశ్యకము. కల్పితములు శూన్యము లగుటచే వానితోఁ బరమేశ్వరునకు భేదముకాని యభేదముకాని యుండుటకు వీలు లేదని యంగీకరించుటయే కర్తవ్యము. ఇట్లగుటచే జీవుఁడు ముక్తిదశయందు నిర్వికల్పంబును నిరంజనంబును అవాఙ్మానసగోచరంబును నిత్యశుద్ధస్వరూపంబు నగు కేవల చైతన్యరూపముతోనే నిలచును. "య ఆత్మాపహతపాప్మా" అను మొదలగు శ్రుతిస్మృతు లన్నియు నిరర్థకము లగు పదములచేతనే యాముక్తజీవుని వర్ణించుచున్న వనవలయును. కల్పితములు శూన్యములే కావున వానికి వ్యావహారిక సత్యత్వ మైనను కల దనుట యుక్తియుక్తము కానేరదు. ఈకారణమువలననే "ఆత్మరతిః ఆత్మక్రీడః" అను మొదలగువచనము లెట్లు కేవలస్తుతిపరములో అట్లే "జక్షన్ క్రీడన్ రమమాణః" అను మొదలగునవియు దుఃఖాభావమాత్రము సూచించునవియే కావున నిర్వివాదముగ జీవుఁడు శుద్ధ చైతన్యమాత్రుఁడయ్యే నిలుచును.

## అ-౪. పా-౪. సూ-౭.

అవతారిక:—ఇట్లు పూర్వపక్షముల నిరూపించి సూత్రకారుఁడు సిద్ధాంతమును జేయుచున్నాఁడు; "జీవుఁడు శుద్ధచైతన్యరూపముతోనే నిలుచుటయే యథార్థ మైనను అపహతపాప్మత్వాదిశ్రుతు లర్థశూన్యములు కా నక్కఱలేదు. వ్యావహారికముగ సర్వగుణములతో నాతనికి సంబంధ ముండవచ్చును"అని తనయభిప్రాయమును ప్రకటించుచున్నాఁడు.

## ౫౪౧. ఏవ మప్యుపన్యాసా త్పూర్వభావా దవిరోధం బాదరాయణః. ౪. ౪. ౭.

తాత్పర్యము:— "ఈఔడులోమిమత మన్నివిధముల యుక్తియుక్త మయ్యే యున్నది. అయినను అపహతపాప్మత్వాదిధర్మముల శూన్యరూపము లనుట సరి కాదు. జైమినిపక్షస్థులు చెప్పినప్రకారము ఉపన్యాసాదులచే శ్రుతి యాధర్మములనుఁ గూడా చెప్పుచునే యున్నది;

వానిని మఱల నిరాకరింపనుగూడ నిరాకరింపకున్నది కదా! కావున పరమార్థముగా వానితో జీవునకు సంబంధము లేకున్నను వ్యావహారికముగఁ గొంతసంబంధ ముండవచ్చును. ఈకారణమువలన లోకప్రసిద్ధములగునీగుణముల సంపూర్ణముగ నిరాకరించుట యుక్తముగా నుండలేదు. కావున జీవుఁడు ముక్తిదశయందు శుద్ధచైతన్యరూపముతోనే యుండువాఁడైనను వ్యావహారికములుగ నాతనియందు గుణము లుండవచ్చును" అని వ్యాసమహాముని తలంచుచున్నాఁడు. ఆగుణములుకూడ నౌపాధికములే యగుటచే బరమార్థములు కాకున్నను వ్యావహారికము లగుప్రత్యక్షాదిప్రమాణములకు గోచరము లగుచున్నవి కదా!

---

# ౪. సంకల్పాధికరణము.

విషయసంగతి సంశయములు:—మూఁడవయధికరణముతో నిర్గుణవిద్యాఫలమును గూర్చినవిచారము ముగిసినది. ఇఁక బుద్ధిస్థలక్షణసంగతితో సగుణవిద్యాఫలము విమర్శింపఁబడును. అందీయధికరణమున "స యది పితృలోకకామో భవతి సంకల్పా దే వాస్య పితరః సముత్తిష్ఠంతి" "బ్రహ్మలోకమును పొందిన సగుణవిద్యోపాసకుఁడు భోగార్థమై పితృలోకమును సంకల్పించునేని యాసంకల్పముతోడనే పితరులు వానికడకు వచ్చి యాలోకమునందలిభోగముల ననుభవింపఁజేయుదురు" అని దహరవిద్యయం దున్న శ్రుతివాక్యము విచారింపఁబడును. "ఈవాక్యమున నుపాసకునకు సంకల్పమాత్రమువలననే పితృలోకభోగము కలుగు నని చెప్పఁబడెను కదా! ఆభోగము కేవలసంకల్పమువలననే కలుగునా ? లేక సాధనాంతరసహాయముతోఁ గూడిన సంకల్పమువలన కలుగునా?" అను సంశయము నివారింపఁబడును.

పూర్వపక్షము:—"సామాన్యదృష్టికి శ్రుతియం దున్న యవధారణమును (ఏవశబ్దమును) పట్టిచూచిన సంకల్పమాత్రమువలననే యిష్టసిద్ధి కలుగు నని తోఁచినను విచారించిన నీపక్షము నిలుచున ట్లుండలేదు. శ్రుతి సర్వవిషయములను లోకానుసారముగనే చెప్పుచున్నది. పూర్వాధికరణమునందును ఈలోకప్రసిద్ధి ననుసరించియే కదా సత్యసంకల్పత్వాదుల

అపహతపాప్మత్వాదుల వ్యావహారికములుగ నంగీకరించి యున్నారు. ఈ కారణమువలన నన్నివిషయములయందును లోకప్రసిద్ధి ననుసరించుటయే యావశ్యక మగును. ప్రస్తుతవిషయమున లోకప్రసిద్ధిని విమర్శించినచో నది మఱియొకవిధముగానున్నది. సాధనాంతరములు లేక యెవ్వనికిని కేవల సంకల్పమువలన కార్యసిద్ధి గలుగుట లేదు. 'శ్రుతియందు అవధారణము కలదు కావున ముక్తులకుమాత్ర మట్టిసామర్థ్య ముండవచ్చును' అని యెదవేమొ యదియు యుక్తము కానేరదు. సాధనాంతరసహాయ ముచేఁ గావ్యముల సాధించువారినిఁగూర్చి కూడ లోకమున నిట్టి వ్యవహారము లున్నవి. ప్రభువునుగూర్చి చెప్పునప్పుడు 'ఆయన కేమి ఆయన తలంచిన నెట్టికార్యమైనను సమకూడును' అని చెప్పుచున్నారు. తలంచఁగానే కార్య మెవ్వనికిని కాదు కదా! కావున నీయవధారణము స్తుతిమాత్రము. అజ్ఞానులకు సాధనసంపత్తి యెంతయధికముగ కావల యునో జ్ఞానికి నంతయధికముగ నక్కఱలే దనుటయే దీనికి నభిప్రాయము. ప్రభువిషయ మగుదృష్టాంతమునఁ గూడఁ దాత్పర్యము నిట్లే కదా నిర్ణ యింపవలయును. కావున నుపాసకులు సాధనసహాయము కలవారే యైనను వారినిఁగూర్చి యిట్టియవధారణ ముండవచ్చును. 'ఇట్లు కూడఁ జెప్ప నక్కఱలేదు. సాధనాంతరసహాయము లేకయే కేవల సంకల్ప మాత్రము వలన వచ్చినపదార్థములు కూడ భోగసాధనము లగుచున్నవి. స్వప్నము నందు చూడఁబడినవ్యాఘ్రము కూడ భయమును కలిగించుచున్నది; పురుషుఁ డాభయమువలన బిగ్గరగాకూడనఱచుచున్నాఁడు కదా! ఆవ్యా ఘ్రము సంకల్పమాత్రమువలన వచ్చినదియే యైనను భోగము (దుఃఖాను భవము) నొసంగెను కదా! ఇట్లే కేవల సంకల్పమువలననే వచ్చినవారలయి నను పితరులు సుఖభోగము నొసంగవచ్చును' అనియెదవేమొ యదియు యుక్తము కానేరదు. కేవల సంకల్పజన్యము లగుపదార్థములు కొంత భోగము నొసంగినను పరిపూర్ణముగ నొసంగనేరవు. స్వప్నజ్ఞానము యథార్థమే యైనను అందలిపదార్థము యథార్థము కానట్లు సంకల్పజన్య పదార్థజ్ఞానము యథార్థమే యైనను అపదార్థము మాత్రము యథార్థము కానేరదు. ఇట్లగుటచేత స్వప్నమున పులినిఁ జూచుటవలన భయము కలిగి నను అది కొట్టినదెబ్బలు మొదలగునవి సత్యములు కానట్లు సంకల్ప మాత్రకల్పితు లగుపితను చూచినంతమాత్రమున కొంతసుఖము కలిగి

నను వారిచే నొసంగఁబడినపదార్థాదులు సత్యములుగ నుండకపోవుటచే పరిపూర్ణభోగము కలుగనేరదు. ఈకారణములవలన నవశ్యముగ నెవ్వరికైనను సాధనాంతరము లుండియే తీరవలయునుగాని కేవల సంకల్పమువలన కార్యసిద్ధి కలుగనేరదు."

## అ_౪. పా_౪. సూ_౮.

అవతారిక :—అని యిట్లు వచ్చిన పూర్వపక్షమును ఖండించు చున్నాఁడు.

---

## ౫౪౨. సంకల్పా దేవ తు తచ్ఛ్రుతేః. ౪. ౪. ౮.

తాత్పర్యము:—ఈపక్షము సరి యైనది కాదు. శ్రుత్యనుసారముగ నుపాసకులకు పితృలోకభోగము కలుగువిషయమున కేవల సంకల్పమే చాలు నని యంగీకరించి తీరవలయును. లేకున్న శ్రుతికి బాధ వచ్చును. శ్రుతి యనునది ప్రమాణాంతరముతోఁ బనిలేక స్వతంత్రముగనే ప్రతిపాద్యాంశమును వర్ణించునది. అనుమానమునకే అన్యప్రమాణసిద్ధము లగువ్యాప్త్యాదులు కావలయునుగాని శ్రుతికి నట్టి వేమియు నక్కఱ లేదు. ఈకారణమువలన ననుమానము స్వతంత్రప్రమాణ మగు శ్రుతిచే బాధింపఁబడవచ్చునుగాని శ్రుతి పరతంత్రప్రమాణ మగు ననుమానముచే బాధింపఁబడఁదగదు. కావున నిర్వివాదముగ జ్ఞానికి భోగమును కలిగించుటయందు కేవలసంకల్పమే చాలు నని యంగీకరించి తీరవలయును. ఆసంకల్పమునకు ననుకూలము లగు దేశకాలాదు లెవ్వియైన సహాయములుగ నుండిన నుండవచ్చునుగాని సంకల్పోత్పత్తికి ననంతరమున మాత్రమేసాధనముగాని యుండు నని యంగీకరించుటకు వీలు లేదు. అప్పుడు సాధనప్రాప్తివఱకు సంకల్పము ఫలశూన్య మయ్యే యుండవలయును; కావున విద్యాప్రభావము కొంతతపడవలసి వచ్చును; ఉపాసకుఁడు వ్యర్థసంకల్పుఁడు కావలసి వచ్చును. ఇది శ్రుతికి సమ్మతము కాదు. ఈ యుపాసకుఁడు మహాయోగి యగుటచే నీతనిసంకల్పము సామాన్యుల సంకల్పమువంటిది కాదు. ఇట్లగుటచేతనే వారిసంకల్పమువలన జనించిన పదార్థములు స్వప్నగతపదార్థములవలె నర్థభోగము నొసంగక పరిపూర్ణ

భోగము నొసంగునంతవఱకు నిలచి యుండును. యోగప్రభావమునకు మితి లేదు కదా! కావున శ్రుత్యనుసారముగ సర్వము నంగీకరించుటయే యుక్తము.

## ౫౪౩. అత ఏవ చానన్యాధిపతిః. ౪. ౪. ౯.

తాత్పర్యము:—"అథ య ఇహాత్మాన మనువిద్య వ్రజంత్యేతాంశ్చ సత్యాన్ కామాం స్తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి" "ఏపురుషుఁడు స్వస్వరూపమును పొంది (తెలిసికొని) తనయందే సర్వకామములు నుండుటను గ్రహించి పరలోకమునకుఁ బోవునో వానికి చక్రవర్తికివలె సర్వలోకములయందును స్వతంత్రసంచారము కలుగును." అనుశ్రుతి విద్వాంసునకు సర్వస్వాతంత్ర్యమును తెల్పుచున్నది. స్వతంత్రుఁడగువాఁడు మఱియొకనికి లోఁబడఁ డనుట స్పష్ట మగుటచే వీరికి మఱియొక యధిపతి లేఁ డనుట స్పష్ట మగుచున్నది. స్వాతంత్ర్యము కలవాఁ డెవ్వఁడును తనకు నధిపతి కలఁ డనువిషయమును సంకల్పింపఁడు కదా! కావున నీస్వాతంత్ర్యమువలనఁగూడ వారిసంకల్పమే కార్యసాధక మగు నని తోఁచుచున్నది. సాధనముల నపేక్షించుటయుఁ బారతంత్ర్యమే కదా! కావున నిర్వివాదముగ వీరికి సంకల్పమాత్రమువలననే భోగసిద్ధి కలదు.

---

## ౫. అభావాధికరణము.

విషయసంశయములు :—పూర్వాధికరణసిద్ధాంతముచే "బ్రహ్మలోకమును జెందినవిద్వాంసులకు మనస్సు కలదు" అనువిషయము తేలినది; "వారికి భోగము కల దనుటఁ గూడ సిద్ధాంత మైనది. దాని నాశ్రయించి యీయధికరణమున 'విద్వాంసునికి శరీరము కలదా? లేదా?'" యను విషయము చర్చింపఁబడును.

### అ-౪. పా-౪. సూ-౧౦.

అవతారిక:—అందు మొట్టమొదట బాదరిమతము నుపన్యసించుచున్నాఁడు.

# ౪౪౪. అభావం బాదరి రాహ హ్యేవమ్.

## ౪. ౪. ౧౦.

తాత్పర్యము:—"ఉపాసకులకు దేహేంద్రియాదులు లేవు" అని బాదరిమహాముని యభిప్రాయపడుచున్నాఁడు. ఏల యనిన:—"మనసై తాన్ కామాన్ పశ్యన్ రమతే" "ఉపాసకులు బ్రహ్మలోకము నొంది నప్పుడు సర్వకామములను మనస్సుచేత మాత్రమే జూచుచుఁ దృప్తి నొందుదురు" అని శ్రుతి చెప్పుచున్నది. వానికి దేహేంద్రియాదు లుండినచో "మనసా" యను విశేషణమును ప్రయోగింపనేటికి? ఈవిశేషణము వలన ప్రత్యేకభేదము (అనఁగా: ఇంద్రియాదులు కలవానికంటె భేదము) తెలియవచ్చుచున్నది కదా! కావున బ్రహ్మలోకస్థితునకు దేహేంద్రియాదు లుండుటకు వీలు లేదు.

పూర్వాధికరణమున "ఏవ" యను నవధారణశ్రుతిచే "ఉపాసకునకు భోగార్థమై సంకల్పభిన్నము లగుసాధనములు లేవు." అని సిద్ధాంతము చేసి నట్లు ఇచ్చటఁగూడ 'మనసా' అను విశేషణము నాశ్రయించి "ఉపాసకులకు మనోభిన్నము లగునింద్రియాదు లేవియును బ్రహ్మలోకమున లేవు" అనియే సిద్ధాంతము చేయుట యుక్తియుక్తముగా నుండును.

" 'స ఏకధా భవతి ద్విధా భవతి' 'ఆయుపాసకుఁడు ఒక్కఁడుగా నుండును, ఇరువురుగా నుండును' అను మొదలగు శ్రుతి నాశ్రయించి చూచిన వారికి శరీరేంద్రియము లున్నట్లు తోఁచుచున్నదికదా!" అనిమొద వేమొ వినుము. ఆశ్రుతి దేహమునుగూర్చియే చెప్పెనన నక్కఱ లేదు. యోగప్రభావమువలన నాయుపాసకులకు మనస్సులే యనేకములు కావచ్చును; అనేకవిషయముల నొక్కమాఱే సంకల్పింపవచ్చును కదా! ఈశ్రుతియు నాయనేకభావమును గూర్చియే చెప్పుచున్నది యనవచ్చును. ఇట్లు కాకున్నను దానిని స్తుతిపరముగా సమన్వయింపవచ్చును. ఇది నిర్గుణ విద్య యగు భూమవిద్యయం దున్నది కాని సగుణవిద్యయందు లేదు. నిర్గుణబ్రహ్మవేత్తలకు నిట్టియనేకభావము సంభవింపదు కదా! కావున నీశ్రుతి కేవలస్తుతిమాత్రమే యైనను కావచ్చును. స్తోత్రము నాచరించు

నప్పుడు లేనిగుణములనుకూడ వర్ణింపవచ్చును కదా! కావున బ్రహ్మలోక ప్రాప్తులకు శరీరము లేదనియే చెప్పవచ్చును.

## అ-౪. పా-౪. సూ-౧౧.

అవతారిక:—అని యిట్లు దృష్టాంతసంగతితో వచ్చినబాదరి మతము నుపన్యసించి జైమినిమతము నుపన్యసించుచున్నాఁడు.

## ౫౪౫. భావం జైమిని ర్వికల్పామననాత్.

### ౪. ౪. ౧౧.

తాత్పర్యము:—"బ్రహ్మలోకమును జెందినవారికి శరీరేంద్రియ ములు నియతముగ నున్నవి. 'స ఏకధా భవతి ద్విధా భవతి' అనుశ్రుతి యీవిషయమును గూర్చియే చెప్పుచున్నది. దేహభేదము లేకుండిన కేవలమనోభేదమాత్రముచే రూపభేదము కలుగదు కదా! మనస్సు ఎవ్వరికి గానవచ్చును? ఈకారణమువలన నియతముగ వారికి దేహేంద్రియాదు లుండి తీరవలయును. అవి లేకున్న పరిపూర్ణభోగము కలుగదు కదా! భోగ మనిన పరిపూర్ణభోగమేకాని మఱియొక్కటి కా దనుట నిర్వివా దాంశము కదా! కావున బ్రహ్మలోకప్రాప్తులకు దేహేంద్రియాదులు కలవు." అని జైమినిమహాముని తలంచుచున్నాఁడు. "మనసా" అను విశేషణము శ్రుతియం దున్నను అది శరీరేంద్రియాదులయభావమును తెలుప నక్కఱ లేదనియు "దేవదత్తుఁడు ధనుర్ధరుఁడై వచ్చుచున్నాఁడు" అను మొదలగువాక్యములయం దున్న ధనుర్ధరవిశేషణము ఖడ్గాది సాధ నాంతరసంపత్తి నెట్లు నిరాకరింపదో ("వీనియొద్ద ధనుస్సు మాత్రమే కలదు. ఇతరసాధనములు ఖడ్గము, బాణములు మొదలగునవి లేవు" అని యెట్లు చెప్పదో) అట్లే ప్రస్తుతవిశేషణముగూడ దేహేంద్రియాది సంపత్తిని నిరాకరింప దనియుఁ జెప్పుచున్నాఁడు. "ఏ కధా భవతి" అను శ్రుతి నిర్గుణవిద్య యగుభూమవిద్యయందే యున్నను దానిని స్తోత్రము గావించుటకయ్యె యుపయోగింపఁబడి యున్నను అందు జెప్పఁబడినమైశ్వ ర్యము మాత్ర మభావరూపము కానేర దనుచున్నాఁడు. నిర్గుణబ్రహ్మ వేత్తలకు నాయనేకధాభావము లేకున్నను సగుణోపాసకులకు యోగ

ప్రభావమువలన నది యుండుటకు వీలు కలుగుటచే దానినే యిచ్చట స్తోత్రార్థమై యనువాదము చేసియుండవచ్చును కదా యనుచున్నాఁడు. సౌభరిమహాముని తనయోగసామర్థ్యముచే నేబదిరూపములఁ గల్పించి మాంధాతపుత్రిక లైనయేబండ్రు కాంతలతో నొక్కమాఱే క్రీడించె ననుపౌరాణికవృత్తాంతము నీవిషయమున (యోగసిద్ధివలన నెన్నిరూపముల నైనఁ గల్పింపవచ్చు ననువిషయమున) కుదాహరణముగఁ జెప్పుచున్నాఁడు. మఱియు నాభూమవిద్యాప్రకరణమున మొట్టమొదట "ప్రాణోవా ఆశాయా భూయాన్" అని సగుణవిద్య కలదు కదా! యనియు దాని ఫల మగుననేకధాభావము స్తుత్యర్థమై భూమవిద్యయందు ప్రస్తావింపఁబడియున్నది యనుట నిర్వివాదాంశమే యనియుఁ జెప్పుచున్నాఁడు. తగిన యర్థము సంభవించుచుండ శ్రుతికి నిరర్థకముగ నభావరూపత్వమును (అర్థశూన్యత్వమును) కల్పించుట పాడి కాదనుచున్నాఁడు.

## అ_౪. పా_౪. సూ_౧౨.

అవతారిక:—ఇట్లు పూర్వపక్షముల ననువాదము చేసి సిద్ధాంతమును వర్ణించుచున్నాఁడు.

## ౫౪౬. ద్వాదశాహవదుభయవిధం బాదరాయణోఽతః. ౪. ౪. ౧౨.

తాత్పర్యము:—ఇట్లు భావాభావములలో నొక్కొక్కదానిని నియమింపఁజూచుట యయుక్త మనియు శ్రుతి రెండువిధములుగాఁ గూడ నుండుటచే రెండువిధములుగాఁ గూడ నంగీకరింపవచ్చు ననియు బ్రహ్మలోకప్రాప్తులు స్వతంత్రులు కావున శరీరము కావలయు నని సంకల్పించిన శరీరసహితులుగను అక్కఱలే దని సంకల్పించినఁ దద్రహితులునుఁ గూడ కావచ్చు ననియు వారి సంకల్ప మప్రతిహతము కదా యనియు బాదరాయణమహాముని (సూత్రకారుఁడు) నిర్ణయించుచున్నాఁడు. ద్వాదశాహవిధిని ఈవిషయమునకు దృష్టాంతముగఁ జూపుచున్నాఁడు. ఎట్లనిన:—"'ద్వాదశాహ మృద్ధికామా ఉపేయుః' 'అభివృద్ధిని లేక ఐశ్వర్యమును కోరువారు ద్వాదశాహము నాశ్ర

యింపవలయును.' అనియు 'ద్వాదశాహేన ప్రజాకామం యాజయేత్'
'సంతానమును కోరువానిచే ద్వాదశాహమును చేయింపవలయును.'
అనియు ద్వాదశాహమునుగూర్చి శ్రుతియందుఁ జెప్పఁబడి యున్నది.
ఒకస్థలమున ద్వాదశాహమునకు గర్త లనేకు లనియు మఱియొక
స్థలమున నొక్కఁడే యనియు వర్ణింపఁబడి యున్నది. అనేక కర్తలచేఁ
జేయఁబడుయాగమునకు సత్రమని పేరు. ఆసత్రమునకు పదునేడ్గురు
కంటె తక్కువ గాకుండ నిరువదినలుగురికంటె నధికము కాకుండ కర్త
లుండవలయు నని యున్నది కదా! ఇట్లే యొక్కకర్తచే నొనర్పఁబడు
యాగమునకు 'అహీనము' అనిపేరు. ఇట్లు యాగము ద్వివిధము. ద్వాద
శాహమునకును ఈద్వివిధలక్షణములును శ్రుతిచేఁ జెప్పఁబడి యున్నది.
ఇట్లుండుటచే నీవిషయమును విమర్శించునప్పుడు పూర్వమీమాంసా
శాస్త్రకర్త సర్వమును విచారించి 'ఈద్వాదశాహము రెండువిధములుగఁ
గూడ నున్నది. సంకల్పానుగుణముగ దీని నెట్లయిన నాచరింపవచ్చును.'
అని సిద్ధాంతముఁ జేసియున్నాఁడు. ఇట్లే యిచ్చటఁగూడఁ జేయవచ్చును.
ఇచ్చటను బ్రహ్మలోకప్రాప్తివిషయమున శరీరభావాభావశ్రుతు లున్నవి
కదా!" యని నిరూపించుచున్నాఁడు.

"ఈసిద్ధాంత మెట్లు యుక్తియుక్త మగును. శ్రుతి ద్వివిధముగ
నున్నట్లు కానవచ్చుచున్నది గాని యాయంశములు పరస్పరవిరుద్ధము
లగుటచే శ్రుతికి నవి రెండును తాత్పర్యభూతములే యగు ననుట యెట్లు?
మనోవిశేషణబలముచే శరీరాభావము నైనను గ్రహింపవలయును;
ఆవిశేషణమును సామాన్యముగ గ్రహించి శరీరసద్భావము నైనను
దృఢము చేయవలయును. ఇంతయేగాని నియమాభావము నంగీకరించు
టకు నెట్లు వీలు కలుగును? ఇవి పరస్పరవిరుద్ధములు కదా! ద్వాదశాహ
విషయ మన్ననో యిట్టిది కాదు. అది కర్మ యగుటచే సంకల్పాధీనముగ
నెట్లయినఁ జేయఁబడవచ్చును. అందు విరోధము కలుగదు కాని యిచ్చట
నట్లు కాదు కదా! ఒక్కనికే దేహాదులు కలవు, లేవు, అనుట యెట్లు
సరిపడును?" అనియెదవేమొ వినుము.

ఈపక్షముపై నాక్షేప మేదియు లేదు. అభావపక్షమును కేవల
ముగ నంగీకరించిన భావపక్షశ్రుతికిని దానిని (భావపక్షమును) కేవలముగ
నంగీకరించిన నభావపక్షశ్రుతికిని యర్థత్వము సంభవించుటచే పైబాదరి

జైమినిపక్షములయందే దోషము కలదు. వేదమున నొకయక్షరము గూడ వ్యర్థము కాఁగూడదు కదా! "ఈభావాభావములు రెండును పరస్పరవిరుద్ధము లగుటచే శ్రుతికి తాత్పర్యభూతములు కావు కదా! ఇట్లగుటచే శ్రుతులు ద్వివిధములుగ నున్నను అవి ప్రమాదమువలన నట్లు తోఁచుచున్నవి యనవలయును" అనుటయు యుక్తము కాదు. యోగప్రభావమువలన నెట్టి దుర్ఘటకార్యములైనను కావచ్చునని యిదివఱకే చెప్పితిమి. ముక్తుఁడును స్వతంత్రుఁడని యెఱింగించితిమి. మఱియు వీలు కలుగునంతవఱకు వేదార్థమును సిద్ధాంతముగ గ్రహింపవలసినదియే కాని దానికి లోకన్యాయములతో విరోధమును శంకింపరా దని పలుమాఱు నిరూపించియే యున్నాము. ప్రత్యక్షాదులకంటె భిన్నముగ శబ్దమను నొకప్రమాణము నంగీకరించినప్పుడు దానిచే (శబ్దప్రమాణముచే) స్థిరపఱుపబడినవిషయముల నిర్వహించుటకు ప్రత్యక్షాదిసహాయము కావలసి వచ్చినచో దానికి విలువయే యుండదు కదా యని యనేకస్థలములయందు నిర్ణయించియున్నాము. కావున నెల్లవిధముల వేద మెట్లు చెప్పిన నట్లెల్ల నంగీకరించుటయే సాధారణముగ నన్నిస్థలములయందును గర్తవ్యము. ఇచ్చట దానికి నుపపత్తినిఁ గూడ జూపియే యున్నాము కదా! యోగసామర్థ్య మందఱిచేత నంగీకరింపఁబడినవిషయమే యనుటలో సంశయము లేదు కదా! కావున నాభావాభావశ్రుతులకు నవి పరమాభిప్రాయములే కాని యితరములు కావు. ఆశ్రుతులఁ బ్రధానములుగ భావించుట భ్రాంతి యనుటయు వానికి నారెంటిలో (భావాభావములలో) నొక్కటియే తాత్పర్యముగ నుండితీరవలయు ననుటయు ఆభావాభావములకుఁ బరస్పరవిరోధము కల దనుటయు యుక్తియుక్తము కానేరదు.

మఱియు నాద్వివిధశ్రుతులలో నొక్కదానిని ప్రధానముగాను మఱియొక్కదాని నప్రధానముగాను చేసినఁ గదా యొక్కయభిప్రాయము గ్రహించి రెండవదానిని విడుచుటకు వీ లగుట! విచారించినచో మొట్టమొదట నట్టిప్రధానాప్రధానభావమే కుదురదు. బాదరిపక్షము నంతయు నిరాకరించి జైమిని తనపక్షమును సిద్ధాంతము జేయునప్పుడు "ఏకధా భవతి" అనుశ్రుతిని ప్రధానముగ గావించుట కెంతయో శ్రమపడెను గాని మఱికొంతసూక్ష్మదృష్టితో విచారించిన నాశ్రమ నిరర్థకమే. అంత ప్రయత్నించినను "మనసా" అనుమొదలగుశ్రుతి యప్రధానము కా

నేరదు. అందలివిశేషణము "దేవదత్తుఁడు ధనుస్సును ధరించి వచ్చు చున్నాఁడు" అను మొదలగువాక్యములయందలి విశేషణములవలె సామాన్యవిశేషణము అన్యపదార్థసంబంధము నంగీకరించువిశేషణము కా నేరదు. ఏల యనిన:— భోగ మనునది శరీరేంద్రియమనస్సులవలన కలుగునది యనుట లోకవేదప్రసిద్ధము. ఇట్లు శరీరేంద్రియాదు లన్నియు భోగముతో నిత్యసంబంధము కలవియే యైయుండ భోగమునుగూర్చి చెప్పునప్పుడు వానివృత్తాంతము నేల ప్రస్తావింపవలయును? "వాఁడు భోగము ననుభవించును" అని చెప్పినచో "దేహేంద్రియమనస్సులతో ననుభవించును" అనువిషయము స్పష్టముగనే తెలియునుగదా! ఇట్లగు టచే ప్రస్తావముఁ జేయఁదలంచిన నన్నిఁటిని ప్రస్తావింపవలయును; లేకున్న దేనినిఁగూడ ప్రస్తావింపకుండవలయు నంతియె కాని యొక్క మనస్సును మాత్రము ప్రస్తావించి తక్కినవానిని ప్రస్తావింపకుండుట యెట్లు ? ఈ కారణమువలన మనఃప్రస్తావముచే తక్కినవి నిరాకరింపఁబడె ననియే నిర్ణయింపవలసియున్నది. "దేవదత్తుఁడు ధనుర్ధరుఁడై వచ్చుచున్నాఁడు" అనువాక్యముల విషయ మన్ననో యిట్టిది కాదు. భోగవిషయమున మనస్సు నియత మైనట్లు యుద్ధాదివిషయములందు లేక ధారణావిష యమునందుధనుస్సు నియతముకాదు. ఒకసమయమునధనుస్సునే గ్రహింప వచ్చును: మఱియొకసమయమున మఱియొకయాయుధమును గ్రహింప వచ్చును. ఇట్లు ఆధనుర్ధరవిశేషణము వైకల్పిక మగుటచే (నది) యన్య పదార్థసంబంధమును నిషేధింపనేరదు. ప్రస్తుతమనోవిశేషణమన్ననో నియతమగుటచే నట్లు నిషేధించును. కావున "మనసా" యనువిశేషణము నాధారము చేసికొని దేహేంద్రియాభావమును నిర్ణయించినబాదరి పక్షముగూడా నిరాకరణీయము కాదు. "మనసా" యనుశ్రుతియు స్వాతంత్ర్యార్థమును చెప్పగలదియే యని నిరూపించితిమి కదా! ఇట్లే దీని నాశ్రయించి "ఏకధా భవతి" అనుశ్రుతినిఁగూడ నప్రధానమును గావిం చుటకు వీలులేదు. అది నిర్గుణవిద్యయందుఁ జెప్పఁబడి యున్నను స్తోత్రా ర్థముగ నుపయోగింపఁబడినది యైనను దేనియర్థమును చెప్పునది కానేర దనియు నీకారణమువలన దానియర్థము నవశ్యముగ నంగీకరింపవలసిన దియే యనియు జైమినిపక్షనిరూపణసమయమున నిరూపింపఁబడియే యున్నది కదా! కావున రెండుశ్రుతులును ప్రధానములే; ముఖ్యార్థములును

చెప్పునవియే. ఇం దొక్కదాని నైనను నిరాకరించుటకు వీలు లేదు. కావున ద్వాదశాహము విషయమునందువలె నీవిషయమునందును శ్రుత్యను సారముగ ద్వైవిధ్యము నంగీకరించి తీరవలయును. ద్వాదశాహము కర్మయే యైనను ప్రస్తుతవిషయమునకును దానికిని సామ్యము కొంత వఱకు లేకున్నను స్తుతిప్రామాణ్యాంగీకారవిషయమునందు మాత్రమే యది దృష్టాంతముగ నుపన్యసింపఁబడె నని తెలిసికొనవలయును. కావున బాదరాయణమతమున నాక్షేప మింత యైనను లేదు.

## అ_౪. పా_౪. సూ_౧౩.

అవతారిక:—"యుక్తితో నెట్లో యీపక్షమును నిరూపించితిరి కాని యనుభవమున కిది యెట్లు సరిపడును? బాదరిపక్షము నంగీకరించి నచో శరీరేంద్రియములు లేనివారు భోగము నె ట్లనుభవింతురు" అనిన ననుభవమును చూపుచున్నాఁడు.

## ౫౪౭. తన్వభావే సంధ్యవ దుపపత్తేః. ౪. ౪. ౧౩.

తాత్పర్యము:—ఇఁక నీసిద్ధాంతమువలన ననుభవమునకు భంగము కలుగ దనువిషయమును వివరించెదను వినుము. మనము నిద్రించు నప్పుడు స్వప్నము కలిగెనేని యప్పుడు సర్వసుఖదుఃఖముల ననుభవించు చున్నాము కదా! అప్పుడు దేహ మున్నదా? ఇంద్రియములుకలవా? విషయములు కలవా? ఇ ట్లేవియు లేకున్నను అచ్చట భోగము కలుగునట్లు శరీరము లేకున్నను బ్రహ్మలోకప్రాప్తునకు కేవలమనస్సువలన భోగములు కలుగవచ్చును. "ఆభోగములు పరిపూర్ణములు కావు. పదార్థము లసత్యములైనను తజ్జ్ఞానము పరమార్థ మగుటచేఁ దన్నిమిత్త మగు కొంతభోగము కలిగినను జాగ్రదవస్థవలెను సత్యముగాఁ గూడ నున్నను పదార్థమువలనఁ గలుగవలసినభోగములు మాత్రము యథార్థముగా నుండవుకదా!" అనియెదవేమొ ఆభోగములు జాగ్రదవస్థవలెను నిలువ కున్నను స్వప్నావస్థయందు మాత్రము యథార్థములే కదా! కావున నిలిచినను నిలువకున్నను భోగము లెప్పటికిని భోగములే ఇచ్చటఁగూడ "భోగములు కలుగుటకు వీలు కలదా? లేదా?" యనువిషయమున మాత్రము విచారముకాని "ఆభోగము యథార్థమా? కాదా?" అను

విషయమునఁ గాదు కదా! కావున నీవిషయమున నిట్టిసంశయ మక్కఱ లేదు. పరమార్థస్థితిలో నాత్మభిన్నము లగునవి యన్నియును పారమార్థికములు కావు కదా!

## అ-౪. పా-౪. సూ-౧౪.

అవతారిక:—"ఇట్లయిన దేహము కల దని గ్రహించుటవలనఁ బ్రయోజనము లేదు కదా!" అనినఁ జెప్పుచున్నాఁడు.

## ౫౪౭. భావే జాగ్రద్వత్. ౪. ౪. ౧౪.

తాత్పర్యము:—ఇట్లే శరీరము కల దని యంగీకరించినప్పుడు (ముక్తుఁడు సంకల్పబలముచే శరీరమును సృజించినప్పుడు) జాగ్రదవస్థ యందలి సుఖదుఃఖానుభవమువలె ననుభవము కలుగును. ఇదియు యుక్తియుక్తమే కదా! "దేహము లేకుండినఁ గూడ భోగము కలుగుచుండ దాని నంగీకరింప నేటికి?" అనియెదవేమొ యట్లంగీకరించుట శ్రుతిప్రసిద్ధి ననుసరించియే కాని స్వాయముగ గా దని యిదివఱకే నిరూపించియున్నాము కావున బాదరాయణసిద్ధాంతమే శ్రుతిస్మృత్యనుభవమునకు ననుకూలమైనది. ముక్తునకు సంకల్పాధీనమై దేహ ముండిన నుండును; లేకున్న లేకపోవును.

## ౬. ప్రదీపాధికరణము.

విషయ సంశయములు:— పూర్వాధికరణమునందు. "భావం జైమినిర్వికల్పామననాత్. ౪. ౪. ౧౧." అనుసూత్రమున "ఉపాసకులకు దేహేంద్రియములు కలవు." అని స్థాపింపఁబడెను. తర్వాత సూత్రములచే వ్యాసునకు నీమతముగూడ సమ్మతమే యని తెల్పఁబడెను. దానిని గూర్చి కలుగుసంశయ మీయధికరణమున నివారింపఁబడును. "ఉపాసకులకు దేహము లేకున్న స్వప్నభోగమువలె భోగము కలుగవచ్చు ననుటలో విరోధ మేమియు లేదు. దేహ మున్న దని యంగీకరించినను ఒక్క దేహ ముండినచో జాగ్రదవస్థయందువలె భోగము కలుగవచ్చు నను

టయు యుక్తియుక్తమే. అనేకదేహములుగూడ నుండు ననిన జీవుఁ డన్నిటియందు నొక్కఁడే ప్రవేశించి యుండుట యెట్లు? ఒక్క శరీరము మాత్రమే భోగసాధనమై తక్కినవి దారుయంత్రములవలె నిరర్థకములై తనచేత మాత్రమే ప్రేరేపింపఁబడునవియై యుండవలయు నని తోఁచుచున్నది. ఇందు నిర్ణయ మెట్లు? ఆశరీరములు దారుయంత్రముల వంటివేనా? లేక భోగసాధనములా?" అను సంశయము నిరాకరింపఁ బడును.

పూర్వపక్షము:—"పరమేశ్వరునితో నభిన్నుఁడే యైనను జీవుఁడు అనాద్యవిద్యావశమునఁ బ్రాదేశమాత్ర (లొడితెడు) మగునంతఃకరణమున నిలిచి ప్రాదేశమాత్రుఁడై యున్నాఁడు. ఇట్టివాఁడు ఒక్కఁడూతే యనేక శరీరములయందు ప్రవేశించు ననుటకు వీలు లేదు. సంకల్పబలమువలన శరీరము సృజింపఁబడినట్లే మఱియొక్క జీవుఁడు కూడా సృజింపఁబడ వచ్చును కదా! యనిన నాజీవుఁడు మొదటిజీవునకంటె భిన్నుఁడా, యభిన్నుఁడా? భిన్నుఁడైన ననాత్మయే కావలసిన వచ్చును. ఆత్మయే యైనను కర్మకర్తృభావము కలవాఁ డగును. అప్పుడు ఒక్కయుపాసకుఁడే సర్వదేహములయందును ప్రవేశించె ననుటకు వీలు లేదు కదా! ఇఁక నభేదపక్షము నాశ్రయించిన నున్నయాత్మ యొక్కఁడే యగుటచే నాతనికి ననేకశరీరప్రవేశము సంభవింప దని యిదివఱకే చెప్పియున్నాము. ఇది యునుగాక నొక్కొక్కజీవున కుపాధిగా నుండునంతఃకరణ మొక్కొక్క టియే యగుటచే దానికిని సర్వశరీరప్రవేశము సంభవింపదు. అది ప్రవేశింపకుండిన కేవలజీవుఁడు ప్రవేశించుట కలిగినను ప్రయోజనము లేదు. ఉపాధిలేకున్న జీవుఁడు జీవుఁడే కాఁడుకదా? ఆయంతఃకరణమునుగూడ ఉపాసకుఁడు సంకల్పశక్తిచే నిర్మింపవచ్చును కదా! అనియెదవేమొ యది సంభవింపదు. అట్లు నిర్మింపఁబడినయంతఃకరణము ఆత్మకు నుపాధి కానేరదు. అనాదిసిద్ధమై భూతపంచకమువలన జనించినయంతఃకరణము మాత్రమే యాయనకు నుపాధియగునుగాని క్రొత్తయంతఃకరణము లట్లుకానేరవు. కర్మవాసనలును ప్రపంచభ్రాంతియు ననాదు లగుటచే వాని నాశ్రయ మగునంతఃకరణముకూడ ననాదియే యైతీరవలయును; జీవుఁడును అనాది నుండియుఁ గర్మవాసనాదుల కనుగుణముగఁ జనించువాఁడు కావున నా యనాద్యంతఃకరణమే వానికి నుపాధియగుటకు తగియుండును. క్రొత్తగా

సృజింపఁబడినయంతఃకరణ మన్ననో భ్రాంత్యాదులకు నాశ్రయ మగుటకు వీలు లేకపోవుటచే జీవునకు నుపాధి కాఁదగదు. కర్మవాసనలు కర్మాచరణ మునకుఁ బిదపఁ గాని జనింపనివి యగుటచేఁ గ్రొత్తగా పుట్టినయంతఃకరణ మఁన నుండవు; ప్రపంచభ్రాంతియు నొకవేళ పుట్టినప్పుడే యుదయించినను నిరూఢము కాకపోవుటచే జీవుని బంధింపనేరదు. కావున నేదియో యొకవిధముగ దాని నాత్మాంతరమున కుపాధిగా నంగీకరించినను ప్రయో జనము లేదు. ఉపాసకునికంటె కర్మశేషాభావమువలన రెండవయాత్మ శుద్ధుఁడు కదా! ఇట్లగుటచే నుపాసకునికివలె రెండవవానికి భోగములయం దభిమానము కలుగుటకు వీలు లేదు? ఆకస్మికముగ నాభోగముల ననుభ వించుటకును వీలు లేదు; కర్మశేషము లేనివాఁడు కూడ ఫలము ననుభ వింపవచ్చుననిన *నకృతాభ్యాగమకృతవిప్రనాశదోషములు వచ్చునుకదా! ఆయుపాసకుఁడు సర్వస్వతంత్రుఁ డగుటచే తా సృజించునంతఃకరణములు కూడఁ దనయంతఃకరణమువంటివానినిఁగానే సృజింపవచ్చు ననియెదవేమొ యదియు సంభవింపదు. పంచభూతములు సత్యవ్యాపకములే యుండుటచే వానియవయవములను (సాత్త్వికభాగములను) గ్రహించి మనస్సును సృజింప వచ్చును; భూతములును కల్పితము లగుటచే వానినుండి జనించినయంతఃకరణము సర్వప్రపంచమును సత్యముగ భావించిన భావింపవచ్చును గాని యాచరించినపిదపఁగాని కలుగనికర్మవాసనలు మాత్రము ఊరక జనించు నవి కావు కదా! కావున నెట్లును 'అనేక దేహములయం దుపాసకునకు నొక్క మాటే భోగము కలుగును' అనుపక్షము యుక్తియుక్తము కానేరదు."

## అ-౪. పా-౪. సూ-౧౫.

అవతారిక :—అని యాక్షేపసంగతితో వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

## ౫౪౯. ప్రదీపవ దావేశ స్తథా హి దర్శయతి.

### ౪. ౪. ౧౫.

ఇట్లు సంశయింపఁ బనిలేదు. దీప మొక్కటియే యైనను బహు రూపముల నెందుసామర్థ్య ముండుటవలన నెట్లు అనేకము లగుచున్నదో

*అకృతాభ్యాగమకృతవిప్రనాశదోషములు. (అ-౨. పా-3. పే-907 చూ.)

అట్లే యీయుపాసకుఁడును యోగసామర్థ్య ముండుటవలన ననేకరూప ముల నొందుచున్నాఁడు. అనేక దేహములలోఁ బ్రవేశించి యనేకస్థల ములయందొక్కమాఱే యనేకవిధము లగుభోగముల నిచ్ఛానుసార ముగ ననుభవించుచున్నాఁడు. స్వాభావిక మగుశరీరమున నున్న యంతః కరణము మాత్రమే సంకల్పించు ననియు సృజింపఁబడినశరీరములయందలి యంతఃకరణము లన్నియు దదనుగుణముగానే సంకల్పించు ననియుఁ దెలిసి కొనవలయును. "ఈయెదుట నున్న శరీరముతో నేను స్వర్గలోకభోగము ననుభవింపవలయును" అని యుపాసకునకు సంకల్పము కలుగఁగానే ఆ రెండవ శరీరమునకుఁ గూడ "నేను స్వర్గలోకసుఖము ననుభవింతును." అని సంకల్పము కలుగును. ఈవిధముగ నేకాభిప్రాయము కలిగిన యనేకశరీర ముల నింద్రియమనోసహితములనుగాఁ గల్పించి యందు దాను ప్రవే శించి యుపాసకుఁడు భోగముల ననుభవించును యోగశాస్త్రసిద్ధాంత మిదియే సౌభరిమహాముని మొదలగుసిద్ధులు బహుదేహముల నాశ్ర యించి రనుట యిట్లే; శ్రుతియు "ఏకధా భవతి ద్విధా త్రిధా పంచ ధా నవధా" అని యీవిషయమునే చెప్పుచున్నది. "దారుయంత్రముల వలె నుపాసకునిచే ననేకదేహములు సృజింపఁబడును." అనుటయే శ్రుతికి నభిప్రాయమైనయెడల నిట్లు చెప్పదు. కొన్ని బొమ్మలను నిర్మించి యాడించు వానినిఁగూర్చి "వాఁడు బొమ్మల నాడించుచున్నాఁడు" అనువ్యవహారము మాత్రమే కలుగునుగాని "వాఁడు అనేకరూపముల నొందుచున్నాఁడు" అనువ్యవహారము కలుగదు కదా! మఱియు నుపాసకులచే రెండవజీవుఁడు సృజింపఁబడు ననుటయు శ్రుతికి సమ్మతము కాదు. అప్పుడు మీా రన్నట్లు భేదము దుర్నివార మగుటచే ననాత్మత్వాదిసర్వదోషములును వచ్చును. ఇది యంతయుఁ గాక నప్పటికిని "ఒక్కఁడే యనేకధాభావమును జెందు చున్నాఁడు." అనుటకు వీలు లేదు కదా? కావున పైనవర్ణించినవిధముగ యోగసామర్థ్యముచే నొక్కఁడే యనేకవిధముల నొందుననుటయే శ్రుతికిఁ గూడ నభిప్రాయము. జీవుఁడు ఉపాధివశమున నొక్కదేహమునే యభి మానించుచున్నను సర్వవ్యాపకుఁ డగుటచే నెన్ని దేహములయందైన నొక్కమాఱే వ్యాపింపవచ్చును. బ్రహ్మలోకప్రాప్తుఁడు దాదాపుగా నవి ద్యను విడిచినవాఁ డగుటచే నీశ్వరునివలె తనయప్రతిహతశక్తిని చూపఁ గలఁ డనుటలో వివాద మేమియు లేదు. ఈకారణమువలననే యాతనికి

ననాదిసిద్ధ మగునంతఃకరణమునకు మాత్రమే వశుఁడై యుండవలయు నను నిర్బంధము లేదు. శ్రోత్రయంతఃకరణముల సృజించి వానితోఁ గూడి యథేచ్ఛముగ సంచరింపవచ్చును. "ఆ శ్రోత్రయంతఃకరణములు అప్పుడే సృజింపఁబడినవి యగుటచే వానియందు గర్మవాసన లుండుటకు వీలు లేదని చెప్పితిని కదా! అనియెదవేమో యది యొకదోషము కాదు. స్వతంత్రుఁడైనపిదప భోగముల ననుభవింపవలయు ననిన నప్పుడు సంకల్ప మొక్కటియే కాని కర్మవాసన లక్కఱ లేదు కదా! కావున నిర్వివాదముగ నుపాసకుఁడు యోగసామర్థ్యమువలన ననేకశరీరములఁ గల్పించి యందు ప్రవేశించి యనేకలోకములయం దొక్కమాఱే భోగముల ననుభవింపవచ్చును. ఇదియంతేయును గాక "శరీరములులేకున్న ననేకధాభావము సంభవింపదు." అని పూర్వాధికరణమున (౪. ౪. ౧౧.) నిరూపింపఁబడి యున్నది. దేహమనఁగా భోగసాధనమే కాని రెండవది కాదు. ఇచ్చట భోగసాధనత్వ మనఁగా భోగమున కాధార మగుటయే (అనఁగా : దేని యందు నిలచి యాత్మ సుఖదుఃఖముల ననుభవించువాఁ డగునో యట్టిదై యుండుటయే) యని తెలిసికోనవలయును. ఇట్లగుటచే దేహములు దారుయంత్రములవంటివి కానేరవు. వానినిఁగూడ నొకచేతనుఁడు ప్రేరేపించుచున్నను ఆచేతనుఁడు వానియందు నిలచి భోగముల ననుభవింపక పోవుటచే నవి దేహములు కానేరవు కదా! కావున ననేకధాభావము కేవలదేహానుసారి యగుటచేతఁ గూడ పైసిద్ధాంతమే నిర్ణీత మగుచున్నది.

## అ-౪. పా-౪. సూ-౧౬.

అవతారిక:—"ఇది యెట్లు? ముక్తునకు నైశ్వర్యము నంగీకరింపుచున్నారు. 'త త్కేన కం విజానీయాత్. న తు త ద్వితీయ మస్తి తతోఽన్య ద్విభక్తం య ద్విజానీయాత్...సలిల ఏకో ద్రష్టాఽద్వైతో భవతి' 'అంతయు నాత్మయే యైయుండ నెవ్వఁడు దేనిని దేనితోఁ దెలిసికొనును. తనకంటె వేఱుగ విభాగించి యెఱుంగుటకు రెండవపదార్థము లేదు...జలమునందు వైవఁబడినజలమువలె చూచువాఁడు(జీవుఁడు) పరమేశ్వరునితో నొక్కఁడే యగును.' అను మొదలగుశ్రుతులు ముక్తియందు విశేషజ్ఞానము లే దనియే చెప్పుచున్నవి కదా!" అనిన సమాధానముఁ జెప్పుచున్నాఁడు.

## ౫౫౦. స్వాప్యయసంపత్త్యోరన్యతరాపేక్షమావిష్కృతం హి. ౪. ౪. ౧౬.

తాత్పర్యము:— "స్వ మపీతో భవతి" అను శ్రుతి ననుసరించి చూచిన స్వాప్యయ మనఁగా సుషుప్త్యవస్థ "బ్రహ్మైవ సన్బ్రహ్మాప్యేతి" అనుమొదలగు శ్రుతి ననుసరించి చూచిన సంపత్తి యనఁగా కైవల్యమని తేలుచున్నది. ఈ రెంటిలో నేదియో యొకదాని ననుసరించి మాత్రమే శ్రుతులు విశేషవిజ్ఞానాభావమును బోధించుచున్నవి. కొన్నిచోట్ల సుషుప్త్యవస్థ నుద్దేశించియు మఱికొన్నిచోట్ల సాయుజ్యముక్తి నుద్దేశించియు నీవిషయము చెప్పఁబడి యున్నది. ఆయాశ్రుతులను విమర్శించిన ప్రకరణానుసారముగ నీయర్థమే తెలియును. ఇఁక నీయైశ్వర్యమన్ననో కర్మపరిపాకమువలనఁ గలుగుస్వర్గాదులవలె విద్యాపరిపాకము వలనఁ గలుగునది యగుటచే నెట్లు వర్ణింపఁబడె నని తెలిసికొనవలయును. పునరావృత్తి లేదుకావునను చతుర్ముఖునితోఁ గూడ సాయుజ్యముక్తి కలుగును కావునను అట్టియైశ్వర్యవంతులను గూర్చి ముక్తులను వ్యవహారము ప్రవర్తించుచున్నది యని తెలిసికొనవలయును; కావున నీ యధికరణమున జేయఁబడినసిద్ధాంతము దోషయుక్తమైనది కాదు.

---

## ౭. జగద్వ్యాపారాధికరణము.

విషయ సంశయములు:— "ఉపాసకులకుఁ గలయైశ్వర్యము పరిపూర్ణమైనదియా? లేక నల్పమైనదియా?" యనువిషయ మీయధికరణమున విచారింపఁబడును. "ఈశ్వరునివలె నీతఁడును సృష్ట్యాదులను జేయునేమో?" యనుసంశయము నివారింపఁబడును.

పూర్వపక్ష సంగతులు:— "ఉపాసకులు గూడ జీవునివలె సర్వస్వతంత్రులే కావలయునని తోచుచున్నది. 'ఆప్నోతి స్వారాజ్యం...సర్వేఽస్మై దేవా బలి మావహంతి...తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి.' 'ఈయుపాసకుఁడు స్వారాజ్యమును పొందును. దేవత లందఱును వానికి పూజల నొసంగుదురు. ఆయుపాసకులకు సర్వలోకములయందును

స్వేచ్ఛాసంచారము దొరకును.' అను మొదలగు శ్రుతు లుపాసకునకు నిరంకుశైశ్వర్యము కల దనియే చెప్పుచున్నవి. 'ఈశ్వరు నుపాసించి కదా యీయుపాసకుఁడు సామర్థ్యము సంపాదించుకొనియెను. ఇట్టివాఁడు పరమేశ్వరునితో సమానుఁ డగుట యెట్లు?" అనియెదవేమొ యీసంశయ మక్కఱలేదు. సామర్థ్యము కలుగునంతవఱకే పరమేశ్వరానుగ్రహము కావలయును గాని కలిగినపిదప దానితో గార్యముల సాధించునప్పుడు దానితోఁ బని యేమి? ఘటము సిద్ధమగునంతవఱకు మృత్తిక చక్రము మొదలగువానిసాహాయ్యము కావలయునుగాని సిద్ధమైనపిదప జలాదులను గొనితెచ్చుటకు వానిసహాయ మేల? 'ఇట్లయినను ఒకని నాశ్రయించి శక్తి సంపాదించుకొనిన నాశ్రితునిశక్తి (అట్లు సంపాదించుకొనిన వానిశక్తి) ఆశ్రయభూతునిశక్తికంటెఁ (ఆశక్తి నొసంగినవానికంటెఁ) దక్కువయై యుండవలయు ననుట నియమము కదా!' అనియెదవేమొ యదియు సరి కాదు. గురుశిష్యులవిషయములో నీవిషయము విశదమగుచున్నది. శిష్యుఁడు మొట్టమొదట గురువునొద్దనుండియే విద్య నార్జించినను ఆగురువుకంటె నధికుఁడు గూడ నగుచున్నాఁడు కదా! ఇట్లే రాజానుగ్రహమువలన రాజ్యము సంపాదించినసామంతులు కూడ నా రాజుతో సమానుఁడుగను అధికుఁడుగను గూడ నుండుటయు తుదకు నా రాజును జయించుటయుఁగూడ గలదు కదా! కావున నుపాసకులు పరమేశ్వరతుల్యులు కావచ్చు ననుటలో సంశయము లేదు. అధికు లగుటకు వీలు లేకున్నను సములు కావచ్చు ననుటలో సంశయము లేదు కదా! కావున పూర్వాధికరణమునఁ జేసినసిద్ధాంతము ననుసరించియే యిచ్చటఁ గూడ నుపాసకులకు నిరంకుశాధికార మంగీకరింపవలయును. వారు పరమేశ్వరునివలెనే ప్రపంచసృష్ట్యాదులను గూడఁ గావింతు రని యంగీకరింపవలయును."

---

## అ-౪. పా-౪. సూ-౧౮.

అవతారిక:— అని యిట్లు దృష్టాంతసంగతిచే వచ్చినపూర్వపక్షమును ఖండించుచున్నాఁడు.

# ౫౫౧. జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసంనిహితత్వాచ్చ. ౪. ౪. ౧౭.

తాత్పర్యము:—ఈయుపాసకులు ఐశ్వర్యవంతులే యైనను ప్రపంచ సృష్ట్యాదుల గావింపనేరరు. భోగవిషయమునందు మాత్రమే వీరికి స్వాతంత్ర్యము కలదు గాని తక్కినవానియందు లేదు. సృష్టి యనఁగాఁ గేవలకారణముగా నున్నపదార్థముచేతనే యగునా? లేక నొకదానివలన జనించి మఱియొకదానికిఁ గారణ మగుచు గూడ నున్నపదార్థముచేత నగునా? ఇందు రెండవపక్ష మెట్లును నిలువదు. ఆపక్షమున నుద్దేశింపఁబడిన వస్తువునకుఁ గూడ నొక్కమూలకారణ ముండవలయును కదా! అట్లయిన నదియే సర్వప్రపంచమునకును గారణ మగుట సంభవించుచుండ మఱియొకపదార్థము దానినుండియే సంభవించినదానిని గ్రహింపనేటికి? అట్టి మూలకారణము పరమేశ్వరుఁడే యనుట నిర్వివాదాంశము. మఱియు నాయనకు నిట్టిసామర్థ్య ముండుట సిద్ధాంతమయ్యే యున్నది. ఉపాసకుల కన్ననో యది కల్పింపఁబడవలసినదియే కదా! వారు ఐశ్వర్యమును జెందిరనుకారణమువలన మాత్రమే కదా యీసామర్థ్యము కల్పింపఁబడవలయును. ఈకారణమువలన పరమేశ్వరునకుఁ గలసామర్థ్యము నిత్యము; వీరికిఁ గలది విద్యాప్రభావాదులవలన వచ్చినది యగుటచే నాగంతుకము. ఆగంతుకమునకంటె నిత్యమైనది ముఖ్య మగు ననుటలో సంశయము లేదు గదా! ఇట్లు యుక్తులచేఁ జూచిన జగత్సృష్టిసామర్థ్యము పరమేశ్వరునకు తప్ప మఱియొక్కనికి నుండునట్లు తోఁచుట లేదు. శ్రుతియందును అట్లు వినఁబడుటలేదు. అచ్చట "స దేవ సోమ్యేద మగ్ర ఆసీత్" అని సృష్టిప్రకరణములయందు పరమేశ్వరుఁడే యుపక్రమింపఁబడి యున్నాఁడు. మఱియు నాయనను వెదకి తెలిసికొనుటవలనఁగాని యీయుపాసకులకు నైశ్వర్యము కలుగ దని చెప్పఁబడి యుండుటచే నాసృష్టిసమయమున వీరు ఆయనతోఁగూడ నున్నారని యైనను చెప్పుటకు వీలు లేదు. ఇట్లుండ వీరికి సృష్ట్యాదిసామర్థ్య మెట్లు కలుగును? మఱియు వీరే స్వతంత్రులై వీరికే యట్టిసామర్థ్యమున్నది యనినచో వీ రందఱును సమానులే యగుటచే నొక్కఁడు సృష్టింపఁ దలంచినప్పుడు మఱియొక్కఁడు సంహరింపఁ

దలంపవచ్చును. ఇది విరుద్ధముకదా! సమానబలముకలవా రొకరి నొక రనువర్తింతు రనుటయు నియమము కాదు. అట్టినియమమును సాధింపఁ బోయిన నట్టివారి కందఱకును నియామకుఁ డొక్కఁ డుండవలసివచ్చును. ఒకనియాజ్ఞకు లోఁబడిననే కదా యందఱు నొక్కనియమమునకు లోఁబడి యుండుట. ఇట్లుచెప్పిన నాయాజ్ఞాపించువాఁడు పరమేశ్వరుఁడే యగుటచే సృష్ట్యాదిసామర్థ్య మాయనకే యుండవలసివచ్చును. సర్వనియమములఁ బరిపాలించువాఁ డాయన యొక్కఁడే కదా! కావున నిర్వివాదముగ నుపాసకులకు సృష్ట్యాదిసామర్థ్యములు లే వనియే యంగీకరింపవలయును.

## అ-౪. పా-౪. సూ-౧౮.

అవతారిక:—“ఇట్లయిన ‘ఆప్నోతి స్వారాజ్యం’ అని యుపాసకు నకు నిరర్గళసామర్థ్యము కల దని చెప్పుశ్రుతి యేమికావలయును.” అనిన సమాధానము చెప్పుచున్నాఁడు.

## ౫౫౨. ప్రత్యక్షోపదేశా దితి చేన్నాధికారిక మండలస్థోక్తేః. ౪. ౪. ౧౮.

తాత్పర్యము:—ఈస్వారాజ్యశ్రుతి యుపాసకులకు నిరంకుశైశ్వర్యము కలదని చెప్పునది కాదు. సామాన్యముగ నణిమాదిరూప మగు నైశ్వర్యము మాత్రమే కల దని చెప్పును. ఉపాసకప్రాప్యము లగు సూర్యాదిమండలములలో పరమేశ్వరునకు లోఁబడియే యీయుపాసకు లుందు రని చెప్పును. “ఆప్నోతి మనసస్పతిం” “సర్వమనస్సులకు నధీశ్వరుఁ డగువానిని పొందును” అనువాక్యముచేఁ దైత్తిరీయశ్రుతి యీవిషయ మును స్పష్టము చేయుచున్నది. ఒకనికి లోఁబడి యున్నవానికి పరి పూర్ణైశ్వర్యము కలుగు ననుట విరుద్ధము కదా! కావున నుపాసకులకుఁ బరిపూర్ణైశ్వర్యము కల దనుట శ్రుతికిఁ దాత్పర్యభూతార్థము కాదు. పర మేశ్వరునివెనుక నంతటివాడు లేకపోవుటచే శ్రుతి వారిని స్వారాజ్యవంతు లుగ స్తుతించినది. “వీఁడు ప్రభువు” అనిన “వీఁడు భూలోకమునకు ప్రభువు” అనిమాత్రమే యర్థమగును కాని “త్రిలోకములకును ప్రభువగుపరమేశ్వ

రుఁడు"అని యర్థము కాదుకదా! ఇట్లే యుపాసకులను గూర్చి చెప్పిన స్వారాజ్యశ్రుతి గూడ జీవమాత్రపరముగా ("వీఁడు ఇతరజీవులకంటె స్వతంత్రుఁడు" అనిమాత్రమే చెప్పునదిగా) సమన్వయింపఁబడవలయును. ఉపాసకులుగూడ జీవులే యగుటచే నిట్టియర్థమే యుక్తియుక్తమగును. ఎవ్వరు ప్రస్తావింపఁబడుదురో వారినిఁగూర్చియే విశేషము గ్రహింపఁబడవలయునుగాని ప్రస్తావింపఁబడనివానినిఁగూడ నచ్చటకు దెచ్చికొనుట యయుక్తము. మనుష్యులను ప్రస్తావించి రాజశబ్దము ప్రయోగింపఁబడినప్పుడు దానికి మృగరాజని యర్థము చెప్పుటకు వీలుకలదా? కావున స్వారాజ్యశ్రుతి నిరంకుశైశ్వర్యమును బోధించునది కాదు.

## అ-౪. పా-౪. సూ-౧౯.

అవతారిక :—ఈవిషయమును నిర్ధారణచేయుటకై మఱియొక హేతువును జూపుచున్నాఁడు.

## ౫౫౩. వికారావర్తి చ తథా హి స్థితి మాహ.

### ౪. ౪. ౧౯.

తాత్పర్యము :—మఱియొకవిశేషము: సూర్యమండలాదులయందున్న పరమేశ్వరునకు సవికారరూపమొక్కటియు నిర్వికారరూపమొక్కటియు శ్రుతిచేఁ జెప్పఁబడియున్నది. "ఏతావా నస్య మహిమా అతో జ్యాయాంశ్చ పురుషః పాదోఽస్య సర్వాభూతాని త్రిపాదస్యామృతం దివి" "ఈవికారజాత మంతయు నాపరమేశ్వరునియొక్క విస్తారము. ఆయన మాత్ర మీవికారమునకంటె నావల (నిర్వికారుఁడై) కూడ నున్నాఁడు. ఈసర్వభూతములును ఆయన కొకపాదము. అమృతరూపమగుముక్తియందు తక్కినమూఁడుపాదములు నున్నవి" అనుమొదలగువాక్యము లీవిషయమునఁ బ్రమాణములు. ఆయుపాసకుఁ డన్ననో సగుణరూపము నుపాసించినవాఁ డగుటచే దానిని మాత్రమే చెందునుగాని నిర్గుణరూపమును చెంద దనుట శ్రుత్యర్థవిమర్శచే విస్పష్టమగుచున్నది. ఇట్లు పరమేశ్వరునకు రెండురూపము లున్నను ఉపాసనానుగుణముగ నుపాసకుఁ డొక్కరూపమునే చెందుటనుబట్టి చూచిన నాయనగుణములలోఁగూడఁ గొన్నిటిని మాత్రమే యీతఁడు చెందు ననుట సిద్ధాంతమగుచున్నది.

అచ్చట నుపాసనానుగుణముగ స్వరూపప్రాప్తిఁ గలిగినట్లే యిచ్చటఁ గూడ నుపాసనానుగుణముగ గుణప్రాప్తి కలుగు ననుటలో సంశయ మేమి? "నేను సత్యకాముఁడను సత్యసంకల్పుఁడను జరామరణములు లేనివాఁడను" అనియే యుపాసకుఁడు భావించునుగాని "నేను సృష్టికర్తను సంహారకర్తను"అని భావింపఁడు. అట్టిశ్రుతిలేదు కదా! కావున నీద్విరూపశ్రుతినిఁబట్టి చూచినను పైసిద్ధాంతమే తేలుచున్నది. నిర్గుణోపాసకులు కేవలపరమేశ్వరులే యగుటచే వారినిఁగూర్చి యీవివాదమే లేదు కదా!

## అ-౪. పా-౪. సూ-౨౦.

అవతారిక:—ఇట్లు పరమేశ్వరునకు రూపద్వయము కల దని చెప్పి దానివలన నుపాసకుల సామర్థ్యపరిమాణమును నిర్ణయించి యీ రూపద్వయమునే మఱల ప్రమాణాంతరముచే నిరూపించుచున్నారు.

## ౫౫౪. దర్శయతశ్చైవం ప్రత్యక్షానుమానే.

### ౪. ౪. ౨౦.

తాత్పర్యము:—మఱియుఁ బరమేశ్వరునకు రూపద్వయము కల దను విషయమును గూర్చి శ్రుతిస్మృతులుఁ గూడఁ జెప్పుచున్నవి. "న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః...న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః" అనువాక్యములయందు సర్వతేజస్సులకంటె నధిక మగుతేజస్సు కల దనుట స్పష్ట మగుచున్నది కదా! కావున నీశ్వరునకు రెండురూపములు కల వనుట నిస్సంశయ మగువిషయము.

## ౫౫౫. భోగమాత్రసామ్యలింగాచ్చ.

### ౪. ౪. ౨౧.

తాత్పర్యము:—మఱియు నుపాసకులకు నిగంకుశైశ్వర్యము లే దనుటకు మఱియొకగుఱుతు కూడఁ గలదు. శ్రుతులయందు వారికి నుపాస్యదేవతతో భోగమునందు మాత్రమే సామ్యము చెప్పఁబడి యున్నది కాని సర్వవిషయములయందును కాదు. "త మా హాపో వై ఖలు

మీాయంతే లోకోఽస్మా" "బ్రహ్మలోకమునకుఁ బోయిన యుపాసకులను జూచి చతుర్ముఖుఁ డిట్లు చెప్పెను. ఓయుపాసకులారా! యిచ్చట నమృత రూపము లగుజలముల నే నుపయోగించుచున్నాను; మీాకును ఈలోక మిట్లే యనుభవయోగ్య మగుచున్నది." అను మొదలగువాక్యములచే నీవిషయము స్పష్ట మగుచున్నది. కావున నీకారణమువలనఁగూడ నుపాసకులకు సృష్ట్యాదిసామర్థ్య ముండ నక్కఱ లేదు.

## అ-౪. పా-౪. సూ-౨౨.

అవతారిక:— "ఇట్లయినచో వీరలయునికి సాతిశయ మగును. (అనఁగా కొఱఁతకలది యగును.) ఇట్లయినచో నాకొఱఁత తీరుటకై పున రావృత్తి కలుగవలసి వచ్చునేమో" యనిన నట్లు రా దని సూత్ర కారుఁడు చెప్పుచున్నాఁడు.

## ౫౫౬. అనావృత్తిః శబ్దా దనావృత్తిః శబ్దాత్.

### ౪. ౪. ౨౨.

తాత్పర్యము:— నాడీరశ్మిమార్గము ననుసరించి యగ్న్యాదిదేవ తలచేఁ గొనిపోఁబడుచు వారివారిలోకములగుండా నుపాసకుఁడు బ్రహ్మ లోకమును చెందుదు రని యిదివఱకే నిర్ణయించియున్నాముకదా! ఆ బ్రహ్మలోకము భూలోకమునుండి మూఁడవది యనియు నచ్చట అరము నియము అను పేర్లుగల సముద్రతుల్యము లగు రెం డమృతసరస్సులు కల వనియు అన్నమయమై మనస్సునకు నానందమును కలిగించు నైరమ్మదీయ మను మఱియొకసరస్సుగూడ కల దని సోమసవన మనుపేరుతో నమృతవర్షి యగునొకయశ్వత్థవృక్షము నందుఁ గల దనియు హిరణ్యగర్భునకు నివాస స్థాన మగు సువర్ణమయమందిరముతోఁ గూడి మిగుల మనోహరమై యపరాజిత యనునొకపట్టణముకూడ నందు కల దనియు మఱియు ననేక విధములుగ నచ్చటిభోగ్యములనుగూర్చి శాస్త్రము చెప్పుచున్నది. ఇట్టి యా బ్రహ్మలోకమునకుఁ జేరినయుపాసకుఁడు చంద్రలోకాదులకుఁ బోయిన వారివలె మఱల రాఁడు. వారియైశ్వర్యమంతము కలదియేయైనను భోగా వసానమున వారికి ముక్తియే కాని పునరావృత్తిలేదు. "త యోర్ధ్వమా య న్నమృతత్వ మేతి. తేషాం న పునరావృత్తిః. ఏతేన ప్రతిపద్యమానా

ఇమం మానవ మావర్తం నావర్తంతే. బ్రహ్మలోక మభిసంపద్యతే. న చ పున రావర్తతే." అను మొదలగువాక్యము లీవిషయమునఁ బ్రమాణములు. "కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః. పరం ౪-౩-౧౦" అను నధికరణమున సయుక్తికముగాఁగూడ నీవిషయము నిరూపింపఁబడెను. కావున వీరిమైశ్వర్యమునకు నంత మున్నను వీరికిమాత్రము పునరావృత్తి లేదు. నిర్గుణవిద్యోపాసకులనుగూర్చి విచారణీయాంశము కొంచెమైనను లేదనుట నిర్వివాదము. వారు స్వభావసిద్ధంబును ముక్తిరూపంబు నగు నిర్గుణబ్రహ్మమును మాత్రమేకదా యుపాసించిరి. సగుణవిద్యోపాసకులకుఁ గూడ జ్ఞానమువలన నాబ్రహ్మముతో నేకీభవించుటవలననే యనావృత్తి కలుగుచున్నది యనిన నిఁక వారినిఁగూర్చి వేఱుగాఁ జెప్పనేల? కావున వారికిఁ బునరావృత్తి లేదనుట స్వయముగనే సిద్ధించినది. సూత్రమును రెండుమాఱులు చెప్పుట శాస్త్రసమాప్తిని సూచించుట కని తెలిసికొన వలయును.

# అధ్యాయతాత్పర్యసంగ్రహము.

ఈయధ్యాయమున మొట్టమొదట మూఁడధికరణములలో నుపాసనలకు సంబంధించినవిచారము జరుపఁబడెను. తరువాత ప్రథమపాదాంతమువఱకు నిర్గుణబ్రహ్మవేత్తకు గలుగుజీవన్ముక్తియు ద్వితీయపాదమున జీవుఁడు శరీరమునుండి నిర్గమించువిధంబును బ్రహ్మనాడీప్రాప్తివఱకు సగుణోపాసకునకును అజ్ఞానికిని గతి యొక్కటియే యనుటయు నిర్గుణబ్రహ్మవేత్తకు గతియే లేదనుటయుఁ దృతీయపాదమున సగుణోపాసకుని మార్గంబును బ్రహ్మలోకప్రాప్తియు క్రమముక్తియు వీనియధికారులును చతుర్థపాదమునఁ బూర్వార్థమున నిర్గుణముక్తినిఁగూర్చియు నుత్తరార్థమున సగుణముక్తినిఁగూర్చియు వివరింపఁబడెను.

బ్రహ్మసూత్రార్థచంద్రికయందు చతుర్థాధ్యాయమునఁ

జతుర్థపాదము

బ్రహ్మసూత్రములు సమాప్తము.



# బ్రహ్మసూత్రార్థచంద్రిక.

## శాస్త్రతాత్పర్యసంగ్రహము.

---

చిదానందఘనం దేవ జగజ్జన్మాది కారణమ్,
అద్వితీయ మనాద్యంతం నమామి పరమేశ్వరమ్.

శాస్త్రస్వరూపము:— ఈబ్రహ్మసూత్రములకు నుత్తరమీమాంస యని పేరు. ఇదియుఁ బూర్వమీమాంసాశాస్త్రమువలె వేదవాక్యముల విమర్శించుటకై యేర్పడినదియె. పూర్వమీమాంస కర్మకాండయందలి వాక్యములయర్థమును విమర్శించిన నిది జ్ఞానకాండమునందలివాక్యముల యర్థమును విమర్శించును. నడుమనడుమ మతఖండనములు యుక్తి వాదములు మొదలగునవి యున్నను అవి వేదతాత్పర్యమును నిరూపించుటకై స్థిరముచేయుటకై యనువాదరూపముగ నుపయోగింపఁబడినవియె కాని స్వతంత్రములు కావు. "వేదాంతమునకు పరమతాత్పర్యభూతమగుజీవబ్రహ్మైక్యమునే యీ ప్రత్యక్షము తెలుపుచున్నది. దానినే యీ యనుమానము బోధించుచున్నది" అనిచెప్పుటకుమాత్రమే యందలి ప్రత్యక్షాద్యుపన్యాసము ఉపయోగింపఁబడినదికాని తర్కశాస్త్రాదులయందువలె స్వతంత్రముగఁగాదు. వానిమతములయందు మొట్టమొదట యుక్తిచే నభిమతార్థము నిర్ణయింపఁబడినపిదప దానికి ననువాదరూపముగ శ్రుతి నుదహరింపఁబడుచుండును కదా ! మఱియు "వేదతాత్పర్యభూత మగు జీవబ్రహ్మైక్యసిద్ధాంతము నంగీకరింపకుండిన నీకముక్తిమార్గ మేదియు దొరకదు" అనువిషయమును నిరూపించుటకై మాత్రమే మతఖండనము ఉపయోగపడునుగాని వారిని నిందించుటకై కాదు. జీవబ్రహ్మైక్యమే శ్రుతిసూత్రాదులకు, ఇంత యేల, వేదబాహ్యాగమములతోఁగూడ సర్వశాస్త్రములకును, దాత్పర్యజాతార్థము. ప్రత్యేకముగ విరుద్ధాంశములను జెప్పినను సర్వశాస్త్రములును ఈసిద్ధాంతమునే పరమతాత్పర్యముగ

స్వతంత్రముగను చేతనసహాయముచేతను సృష్టి నొనర్చు ననియుఁ, బరమాణువులె జగత్కారణము లనియు, పరమేశ్వరుఁడు మాయచేఁ బ్రపంచమును పుట్టింపఁజేయు ననియు సృష్టినిగూర్చి కలవాదములు ఖండింపఁబడి "అవిద్యచేత మాత్రమే ప్రపంచము కల్పింపఁబడెను" అను వాదమె యవశ్యాశ్రయణీయ మనువిషయము నిరూపింపఁబడెను. అసంగులగుజీవు లనేకు లున్నారనియు ఆజీవులకు జ్ఞానము ఆగంతుకధర్మమె కాని స్వరూపము కా దనియు వారు పరమేశ్వరసదృశులే యైనను భిన్నులే యనియు వారిపరిమాణ మణుత్వమె యనియు శరీరసమానపరిమాణ మనియు వారు బ్రహ్మమునుండి జనింతు రనియుఁ గలజీవవిషయ వాదములును ఖండింపఁబడి జీవుఁ డొక్కఁ డేనియు మహత్పరిమాణుఁ డనియు జ్ఞానస్వరూపుఁ డనియు స్థాపింపఁబడెను. ఒక్కఁడె నిమిత్త కారణముగ నుపాదానకారణముగఁ గూడ నుండుట సంభవింప దనియుఁ, జేతనమునుండి జడ మెట్లు జనించు ననియు మొదలగు లోకన్యాయములును ఖండింపఁబడి సిద్ధాంతము నిర్దోషము చేయఁబడెను. మోక్షార్థులచే వేదమార్గమే యవశ్యాశ్రయణీయ మని నిరూపింపఁబడెను.

సాధనాధ్యాయ సంగ్రహము:—ఇట్లు సిద్ధాంతమును స్థాపించి యీమార్గమున ముక్తిని సాధించుటకు జ్ఞానమె ప్రధానము కావునను దానికి చిత్తశుద్ధి యావశ్యకము కావునను యజ్ఞాదికర్మల బహిరంగ సాధనములనుగాను శమదమాదుల నంతరంగ సాధనములనుగాను ఈ శాస్త్ర మంగీకరించుచున్నది. కర్మఫలము లనిత్యము లగుటచే వానిని (కర్మలను) చిత్తశుద్ధికై మాత్రమె యాచరింపవలయును కాని ఫలార్థమై యాచరింపరా దని చెప్పుచున్నది. సంసారము యిహపరలోకములయందు కొంత సుఖరూపముగఁ గానవచ్చినను శాశ్వతము గాకపోవుటచే దానియం దభిమానము వదలుటయే యుక్త మనుచున్నది. ఇట్టి వైరాగ్యము కలిగిననే కాని పరమానందరూప మగుముక్తిని సాధించుటకు ప్రయత్నింపఁ డని దీనియభిప్రాయము. పిత్తరోగులకు మధుర మగు గుడము చేదగునట్లు సంసారులకు నాత్మసుఖము చేఁదగును కదా! కావున వైరాగ్యమె యన్నిటికిఁ బ్రధాన మనుచున్నది. జాగ్రదాదులయందుఁ గలపదార్థమునకు సాక్షిగా మాత్రమె యుండుటచే జీవునకు వానితోఁ బారమార్థికసంబంధము లేదనియు, బ్రహ్మముఁగూడ నిట్టివాఁడే యగుటచే

నిరుపుస నొక్కటియే యనియు, కొంచెము విమర్శించిన నీవిషయ మనాయాసముగనే తేటపడు ననియు వివరించుచున్నది. ఈవిషయమును మొట్టమొదటనే గ్రహింపలేకపోయిన వైరాగ్యవంతుఁడు సగుణోపాసనల నైన నాచరించి క్రమముక్తి నందవచ్చు ననుచున్నది. శివ విష్ణ్వాద్యుపాసనలుకూడ నీజాతిలోనే చేరు ననుచున్నది. దేని నుపాసించినను బ్రహ్మమాత్రముగ నుపాసింపవలయు ననుచున్నది. ఆయా యుపాసనాప్రకరణములయందు చెప్పఁబడినగుణములు కలవారు బ్రహ్మాభిన్ను లని తలంపవల దనుచున్నది. ఉపాసకుఁ డగుతనకును ఉపాస్య దేవతకును భేదము లే దని భావింపవలయు ననుచున్నది.

ఫలాధ్యాయ సంగ్రహము:—ఇట్లు సగుణోపాసనల నాచరించిన దేవయానమార్గమున బ్రహ్మలోకమునకుఁ జని అచ్చట కల్పాంతమువఱకు నివసించి బ్రహ్మోపదేశప్రభావమున జ్ఞానవంతులై యాయనతోఁగూడ ముక్తి నొందుదు రనుచున్నది. బ్రహ్మజ్ఞానము కలిగిన యుత్తరక్షణముననే ముక్తికలుగుననియు అట్లైనను దేహపాతమువఱకు ఛాయామాత్రముగఁ బ్రారబ్ధకర్మ యనువర్తించు ననియు మరణానంతరమున వారికి నిష్క్రమణమే లే దనియు వారిసర్వేంద్రియములు ప్రాణములు మనంబు నిచ్చటనే వానివాని యధిష్ఠానములయందుఁ జేరు ననియుఁ జెప్పుచున్నది. ముక్తి నొందినపిదప నెవ్వరికిని ఘోరసంసారమునందుఁ బునరావర్తి కలుగ దని నిరూపించుచున్నది.

పరపక్షదూషణము:—ఈవిషయముల నన్నిటిని సవిమర్శముగ వివరింపుచు శంకరభగవత్పాదులు ఈశాస్త్రమునకు చక్కనిభాష్యమును వ్రాసి యున్నారు. దానియం దచ్చటచ్చట పరబ్రహ్మమును చెప్పు స్థలములయందు విష్ణ్వాదినామము లుపయోగింపఁబడి యున్నవి. పైమతమును బాగుగ విమర్శించినఁ బరమేశ్వరునకు నామరూపములే లేవుకదా! ఇట్లున్నను కొందఱు ఆ పదప్రయోగమువలన కేవలాద్వైతి యగు భాష్యకారునకు వైష్ణవులకువలె "విష్ణువే పరబ్రహ్మము" అను నభిప్రాయ ముండవచ్చు నని తలంచుచున్నారు. ఇది యెంతవెఱ్ఱి? నామరూపవిహీనుఁ డగుపరమేశ్వరునిఁ బేర్కొనునప్పు డేనామమైన నేమి? "శివనామము లొక్కస్థలముననైనను ప్రయోగింపఁబడి యుండకపోవుట కేమికారణము?"

అనియెదరేమొ యింతటివివేచనాశక్తి కలవార లుదయింతు రని యప్పటి కమ్మహానుభావునకు తోఁపకపోవచ్చును. సిద్ధాంతము చేయఁబడుచున్న మతమునకు విరుద్ధముగా మతకర్తకు పక్షపాత ముండు నని తలంచు వారలు కలుగబోదురేమొ యని యూహించుట సర్వజ్ఞులకుఁగూడ యథార్థముగ దుర్విజ్ఞేయమే.

తే. గీ. బ్రహ్మసూత్రార్థచంద్రిక పరిఢవిల్లు
నాపయోధిగిరీంద్రతారార్కముగను
నిర్మలాద్వితీయానందనిరుపమాన
బోధఘనుఁ డగునీశ్వరుపూర్ణకరుణ.





# బ్రహ్మసూత్రార్థచంద్రిక.

## వ్యాసతాత్పర్యనిర్ణయము - ఆంధ్రీకరణము



ఉ. శ్రీసరసీరుహాక్షశివరీతుల సేవ్యత నంది యీశుఁ డై
భాసురసత్వయుక్తి, తదుపాసకజీవుఁడు నై రజోగుణా
భూషితుఁ డై తమోమయత భోగ్యజగంబును నై వెలుంగు నే
ధీసుఖసత్యరూపుఁ డగు దేవుఁడు వాని నెదన్ దలంచెదన్.

తే. అవని శ్రీధరవేంకటేశార్యశిష్యుఁ
డలహరికవీంద్రు ననుజుండు నాత్మజుండు
వేంకటపతికి వెల్గోటివిభుల కనుగు
వీణయయ్యన్న భువనసంప్రీతికొఱకు.

తే. పరగ రచియించె వ్యాసతాత్పర్యనిర్ణ
యం బనఁగ సార్థనామకం బైనకబ్బ
మార్యశంకరజయపటహంబు గాఢ
రూఢదుర్మతవృక్షనిర్మూలనంబు.

ఉ. దానిఁ దెనుంగుబాస జనతాసుఖవేద్యముగా రచింపఁగాఁ
బూనితి నాదరంబుమెయి బుద్ధిబలంబు దలంప కేమియున్
ఐన బుధోత్తముల్ గరుణ నందులఁ దప్పులు కల్గెనేనియున్
బూని క్షమించుచున్ సమత బోల గ్రహింతురుగాత తత్వమున్.

తే. పక్షపాతంబు విడనాడి బ్రహ్మసూత్ర
పరమతాత్పర్య మెఱుఁగంగ నరయువారి
నఖిలవేదాంతవార్ధిసారాంశ మైన
యయ్యనార్యవచస్సుధ యలరఁజేయు.

పరమదయాపరుం డగునారాయణుండు లోకానుగ్రహార్థము వ్యాసరూపమున భూమియందు అవతరించి పరస్పరవిరుద్ధములుగాఁ గనఁ

బడుచున్న వేదాంతవాక్యములలోనితాత్పర్యమెఱుంగలేని మందబుద్ధులకు దానిని నిర్ణయించి తెలియఁజేయువాఁడై ఉపనిషత్తులయందలి ముఖ్యతాత్పర్యము తెలియఁజేయునట్టి బ్రహ్మసూత్రము లనుపేరుగల "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అనిమొదలు "అనావృత్తిశ్శబ్దాదనావృత్తిశ్శబ్దాత్" అను వఱకుఁ గలసూత్రములను నిర్మించెను.

ఈవిషయమునుగూర్చి శైవాగమమునందు ఏకాదశరుద్రసంహితలో నిట్లు చెప్పఁబడియున్నది.

శ్లో. 1. స చ నారాయణ స్యాంశో భగవా న్బాదరాయణః,
దృష్ట్వా మందమతీ న్మర్త్యా కృపయా పర యాన్వితః.

2. వేదాన్తార్థ స్తు సర్వేషాం నానా భాతి న చైకధా,
అత స్తేన కథం బ్రహ్మ జానా త్వ(త్య)ల్పమతిః పుమాన్.

3. ఇతి సంచింత్య మతిమా న్పునః కారుణికో త్తమః,
సూత్రయామాస వేదా న్తవాక్యార్థం శంకరాజ్ఞయా.

ఆవ్యాససూత్రములయభిప్రాయము అంతగా స్పష్టము కాక పోవుట చేత భిన్నభిన్నమతములు గల శంకరాది భాష్యకారు లనేకులు తమతమ యభిప్రాయములే, సూత్రాభిప్రాయము లని వర్ణించియున్నారు. అందు శంకరభగవత్పాదపూజ్యులు పరమార్థస్థితిలో జీవబ్రహ్మలకు స్వాభావికముగా భేదము లేదనియు నీకనఁబడు భేద ముపాధిభేదముచే కలిగినది కావున నసత్య మనియుఁ జెప్పుచు అదియే వ్యాసునితాత్పర్య మని నిరూపించి యున్నారు. భట్టభాస్కరాచార్యులు పరమార్థస్థితిలో జీవబ్రహ్మలకు భేదము లేకుండుట యథార్థమె యైనను ఈకనఁబడు నుపాధికృతభేదము గూడఁ బరమార్థమె యని చెప్పుచు ఇదియేవ్యాసతాత్పర్య మనుచున్నారు.

---

1. నారాయణాంశజుఁ డగువ్యాసమహాముని మందబుద్ధు లగుమనుజులను జూచి దయతో.

2. "ఉపనిషద్వాక్యములయర్థము అనేకవిధములుగా నున్నట్లు కానవచ్చు చున్నదేగాని యొక్కవిధముగఁ దెలియవచ్చుట లేదు. ఇట్లున్న మందబుద్ధి యగుపురుషుఁడు పరబ్రహ్మము నెట్లెఱుఁగఁగలఁడు."

3. అని యిట్లు విచారించి పరమేశ్వరునియాజ్ఞచే వేదాన్తవాక్యార్థమును సూత్రములుగా రచించెను.

యాదవప్రకాశులు అభేదమువలె భేదము కూడ జీవబ్రహ్మలకు స్వాభావ సిద్ధమే కాని యుపాధులవలన వచ్చినది కాదని చెప్పుచు ఇదియె వ్యాసుని పరమతాత్పర్య మని నిశ్చయించుచున్నారు. రామానుజ శ్రీకంఠాచార్యులిరువురును పై వారి కంటెకు విరుద్ధముగా జీవబ్రహ్మలకు అభేద మెప్పటికిని లేదనియు వారలకు భేదమే స్వాభావ మనియు అట్లయ్యును (పరస్పర భేదము గలిగియుండియు) అవయవములతోఁగూడి పురుషుఁ డొక్కఁడె యయినట్లు తనకును ప్రకాశమునకును భేద మున్నను ప్రకాశముతోఁ గూడి సూర్యుఁ డొక్కఁడె యైనట్లు జీవసమూహముతోఁ గూడి బ్రహ్మ మొక్కఁడే యనియుఁ జెప్పుచు వ్యాసునితాత్పర్య మిదియే యని వివరించుచున్నారు. వీరిరువురిమతము నొక్కటియె యైనను విష్ణువే పరతత్వ మని రామానుజులును రుద్రుఁడే పరతత్వ మని శ్రీకంఠాచార్యులును చెప్పుటచే వారిరువురికిని భేదము కలిగె నని తెలుసుకొనవలయును.

ఇఁక మధ్వాచార్యులు జీవబ్రహ్మములు ఎప్పటికిని భేదము గలవారె యని సిద్ధాంతము చేయుచు ఇదియె వ్యాసతాత్పర్య మని నిశ్చయించుచున్నారు. ఇట్లుండుటచే:—

4. స్థాపయధ్వ మిమం మార్గం ప్రయత్నే నాపి హే ద్విజాః,
స్థాపితే వైదికే మార్గే సకలం సుస్థిరం భవేత్.

5. యేవా స్థాపయితుం శక్తో నకుర్యా న్మోహితో నరః,
తస్య హంతా న(స)పాపీయా నితి వేదాన్తనిర్ణయః.

6. యః స్థాపయితు ముద్యుక్త శ్శ్రద్ధ యైవాశు మోపి సన్,
సర్వపాపవినిర్ముక్తః సాక్షా ద్జ్ఞాన మవాప్నుయాత్.

---

4. ఓ బ్రాహ్మణులారా! యెంతప్రయత్నము నైనను గావించి వేదమార్గమును స్థాపింపుఁడు. అది స్థాపింపఁబడెనేని సర్వమును స్థిరమగును.

5. శక్తి గలిగియుఁ నెవ్వఁడు వేదమార్గమును స్థాపింపఁబ్రయత్నింపఁడో వానిని సంహరించినను పాపము రాదు.

6. శక్తి లేకుండియుఁ శ్రద్ధాతిశయమువలన నెవ్వఁడు వేదమార్గ సంస్థాపనమున కుపక్రమించునో వాఁడు సర్వపాపరహితుఁడై బ్రహ్మజ్ఞానవంతుఁ డగును.

7\. యస్తు విద్యాభిమానేన వేదమార్గప్రవర్తకమ్,
ఛలజాత్యాదిభి ర్జిత్వా స మహాపాతకీ భవేత్.

అను స్కాందపురాణవాక్యములను విమర్శింపఁగా వేదాంతవాక్య తాత్పర్యార్థమును నిర్ణయించుట యత్యావశ్యక మయినపనిగా నున్నది గదా! ఇప్పు డీలోకులకును "వేదాంతశాస్త్రకర్త యగువ్యాసమహా మునికి నేయభిప్రాయము గలదో" యనువిషయమున సంశయము కలదు. శంకరాదులవివిధ భాష్యములు పరస్పరవిరుద్ధములుగా నున్నవి కదా! కావున నాసంశయమును నివారించుటకై ఈగ్రంథమునందు వ్యాసమహామునితాత్పర్యము అద్వైతమె కాని వేఱు కాదని నిర్ణయింపఁ బడుచున్నది.

పూర్వపక్షము:—ఈనిర్ణయమునకై యింతప్రయత్న మేల?

8\. ద్వాపరే ద్వాపరే విష్ణు ర్వ్యాసరూపే మహామునే.

9\. చతుర్భి స్సహ శిష్యై స్తు శంక రోఽవతరిష్యతి.

ఇది మొదలగు పురాణవాక్యములను విచారించి చూచిన శంకర భగవత్పాదపూజ్యులు సాక్షాచ్ఛంకరావతార మని తెలియవచ్చుచున్నది గదా! మఱియు,

శ్లో. 10. తా మష్టాదశ ధా దృష్ట్వా శంకర స్సూత సంహితామ్,
చక్రే శారీరకం భాష్యం సర్వశ్శ్రుతిమనోహరమ్.

ఇది మొదలయినకావ్యముల నాలోచించి చూచిన వా రొనర్చిన భాష్యము సూతసంహిత ననుసరించి వ్రాయఁబడిన దని తెలియవచ్చు చున్నది కదా! ఇట్లుండుటచే వారియభిప్రాయ మగు కేవలాద్వైతమె

---

7\. విద్యాభిమానమువలన నెవ్వఁడు వేదమార్గస్థాపకుని వాదముచే గెలువఁ జూచునో వాఁడు మహాపాపాత్ముఁ డగును.

8\. ఓమునీంద్రా! ప్రతిద్వాపరమునందును విష్ణువు వ్యాసరూపముతో జన్మించును.

9\. నలుగురుశిష్యులతోఁ గూడి శివుఁడును శంకరాచార్యరూపముతో నవతరించును.

10\. ఆశంకరాచార్యులు సూతసంహితను పదునెనిమిదిమారులు చూచి సర్వజనుల కింపగునట్లు శారీరకమీమాంసాభాష్యమును రచించెను.

వ్యాసతాత్పర్య మనువిషయము నిస్సంశయ మై యుండ దానినిగుఱించి మఱియొక గ్రంథము నారంభింప నేటికి ?

సిద్ధాంతి:—నిజముగా నీవిషయములో వేఱొక గ్రంథము నారంభించుట కవసరము లేకపోయినను,

శ్లో. 11. అనంతః ప్రథమం రూపం లక్ష్మణ స్తు తతః పరమ్,
బలభద్ర స్తృతీయం తు కలౌ కశ్చి ద్భవిష్యతి.

ఇవి మొదలగు వాక్యములను విమర్శించినచో రామానుజాచార్యులు గూడ శేషునియవతార మని తెలియవచ్చుచున్నది. మఱియును,

12. భగవద్బోధాయనకృతాం విస్తీర్ణాం బ్రహ్మసూత్రవృత్తిం పూర్వాచార్యాస్సంచిక్షిపుః తన్మతానుసారేణ సూత్రాక్షరాణి వ్యాఖ్యాస్యంతే (అథాతో బ్రహ్మజిజ్ఞాసా).

అను భాష్యసందర్భము ననుసరించిచూచిన ఆరామానుజులు రచించిన భాష్యము బోధాయనోక్తి ననుసరించి చేయఁబడిన దని తెలియవచ్చుచున్నది గావున వారియభిప్రాయమె వ్యాసాభిప్రాయ మని చెప్పుటకూడ సప్రమాణముగానే తోచుచున్నది. ఇదియునుగాక,

13. ప్రథమో హనుమా న్నామ ద్వితీయో భీమసేనకః,
పూర్ణప్రజ్ఞ స్తృతీయ స్తు భగవ త్కార్యసాధకః.

అను మొదలగు వాక్యముల ననుసరించి చూచిన మధ్వాచార్యులు వాయుదేవుని యవతార మనియు వారిమతములో ప్రసిద్ధములై యుండ

---

11. ఆదిశేషుఁడు మొదటియవతారము. లక్ష్మణుఁడు రెండవయవతారము. బలభద్రుఁడు మూఁడవయవతారము. కలియుగమునందుఁ మఱియొక శేషావతారము రాఁగలదు. (అదియే రామానుజావతారము.)

12. మహాత్ముఁడగు బోధాయనమునిచే బ్రహ్మసూత్రములకు విపుల మగువృత్తి రచింపఁబడెను. పూర్వాచార్యులందఱును దానిని సంక్షేపించి తమతమమతములే వ్యాసమతములుగా వ్యాఖ్యానముఁజేసియున్నారు. ఇప్పుడు నేను మాత్ర మాబోధాయనవృత్తి ననుసరించియే సూత్రములకు వ్యాఖ్యానమును గావించెదను.

13. వాయుదేవునకు హనుమంతుఁడు మొదటియవతారము. భీముఁడు రెండవయవతారము. పూర్ణప్రజ్ఞుఁడు (మధ్వాచార్యులు) మూఁడవయవతారము. ఈయవతారములలో వాయువు భగవంతునికార్యముల సాధించుచుండును.

బ్రహ్మతర్కము మూలరామాయణము మొదలగుగ్రంథములు వారొసం ర్చిన భాష్యమున కాధార మనియు తెలియవచ్చుచుండుటచే వారియభి ప్రాయ మగు ద్వైతమె వ్యాసాభిప్రాయ మని చెప్పుటకు కూడ ప్రమాణ ములు లేకపోలేదు. ఆప్రకారమె భట్టభాస్కరుఁడు యాదవప్రకాశుఁడు, శ్రీకంఠాచార్యుఁడు మొదలగువారందఱుకూడ వారివారి మతములలోని ప్రమాణవాక్యములను పట్టిచూచిన వారందఱు నేదోయొక దేవతయొక్క యవతారమే యనియు వారు రచించిన భాష్యములు గూడ నేదో యొక ప్రమాణగ్రంథము నాధారముచేసికొనియే రచింపఁబడిన వనియు తెలియ వచ్చుట సాధారణమే యైనందున వారివారియభిప్రాయము లన్నియుఁ గూడ వ్యాసునియభిప్రాయములే యనుటకును చక్కనియవకాశము కలదు. ఇట్లు అంపఱి యభిప్రాయమును వ్యాసుని పరమాభిప్రాయములే అనుటకు నవకాశముండుటచే పరస్పరవిరుద్ధార్థము లగునానాభాష్యము లను చూచినప్పు డెల్ల మందబుద్ధు లగువారలకు వీనిలో వ్యాసతాత్పర్య మేదియై యుండునో అని సందేహ మవశ్యముగ గల్గును కావున దానిని నివారించుటకై ఈగ్రంథము నారంభించుట యంతయు నావశ్యకము.

ఈవిషయమునుగూర్చి యిట్లు విచారింపవలసియున్నది.

మొదటిపక్షము:—వ్యాసునితాత్పర్యమును నిర్ణయించువిషయ ములో సూతసంహిత బోధాయనవృత్తి మొదలగుప్రమాణగ్రంథము లన్నియును వాని నాధారముగాఁ జేసికొని వ్రాయఁబడినభాష్యము లన్ని యును ప్రమాణములేనా?

రెండవపక్షము:—అవి యేవియును ప్రమాణములు కావా?

మూఁడవపక్షము:—అట్లుకాక పైఁ జెప్పినయన్నిటిలో నేదియో యొక్కటి ప్రమాణ మై తక్కినవి కావా?

వీటిలో నన్నియుఁ బ్రమాణమే యందురేని వస్తువు (వ్యాసాభిప్రా యము) నానావిధవిరుద్ధభేదములు గలది కావలసి వచ్చును. ఇట్లుండుట సర్వప్రమాణవిరుద్ధము కదా!

అట్లు కాక రెండవపక్షము నవలంబించి యేవియును ప్రమాణ ములు కా వన్నచో వేదాంతశాస్త్రమే అప్రమాణము కావలసివచ్చును. ఎట్లనిన: ఈభాష్యములలోచెప్పఁబడినభేదాభేదపక్షములలో నేదియో

యొకటి శ్రుతులకును సూత్రములకును అభిప్రాయముగా నుండి తీరవల
యును గదా! కావున నన్నిభాష్యములు నప్రమాణములే యయిన
శ్రుతిసూత్రములు గూడా నప్రమాణములే కావలసివచ్చును.

కావున నిఁక మూడోపక్షము (సూతసంహితాదులలో నొక్కటియే
ప్రమాణము అనుపక్షము) మాత్రము మిగిలి యున్నది. దానిని విచా
రింపఁబోయినను సూతసంహితాదిగ్రంథము లనేకము లుండుటచే వానిలో
నేది ప్రమాణమో యేది యప్రమాణమో నిర్ణయించుట కెవ్వరికిని
సాధ్యము కాకున్నది.

పూర్వపక్షి:— ఇట్లన నేల? శంకరభట్టభాస్కరాదులభాష్య
ముల నన్నిటిని బాగుగపరిశీలించి వారివారిభాష్యములలో మీమాంసా
న్యాయసహితములుగ నిరూపింపఁబడిన యుపక్రమాది తాత్పర్యలింగ
ములతోఁగూడిన శ్రుతిసూత్రార్థముల బలాబలముల ననుసరించి అన్నిటి
కంటెను ఏభాష్యకారునితాత్పర్యము ప్రబలముగా నుండునో అదియే
వ్యాసునితాత్పర్య మని సుఖముగా నిర్ణయింపవచ్చును. ఆతాత్పర్యమును
వివరించుభాష్య మొక్కటియే ప్రమాణ మనవచ్చును కదా!

సిద్ధాంతి:—ఇట్లు చేయుటకు వీలు కాదు. భాష్యకారు లంద
ఱును పైఁజెప్పినయుపక్రమాదిలింగముల ననుసరించియే శ్రుతిసూత్రము
లకు వ్యాఖ్యానము సేయుచు తమతమయభిప్రాయములే వ్యాసముని
యభిప్రాయ మని నిశ్చయించి యుండుటచేత వారికంటె నెక్కువగా
బలాబలములను విమర్శించి తారతమ్యముల నేర్పఱచుటకు వీలే లేదు.

పూర్వపక్షి:— అట్లు కాక పోయిన పోనిండు. వారిభాష్యము
లతో నవసరము లేకయే మనమే స్వయముగా యుక్తిశ్రుతులస్వారస్య
బలాబలముల ననుసరించి వ్యాసతాత్పర్య మిదియె యని నిర్ణయించుటకు
వలను పడదా?

సిద్ధాంతి:—అట్లుచేయుటకు వీ లేమి యున్నది? కేవలము యుక్తి
బలమును మాత్రమే యనుసరించి వ్యాసునితాత్పర్యమును నిర్ణయింప
వచ్చు ననినచో నాపక్షము వాదమునకు నిలుచునది కాదు. ఎట్లనిన:—
యుక్తులు రెండువిధములు. మీమాంసాశాస్త్రమందు ప్రసిద్ధమై యున్న
యుపక్రమాదిరూప మగునది యొకటి; తర్కశాస్త్రప్రసిద్ధ మైనప్రత్య

క్షానుమానాదిరూప మైనది యొకటి. ఇందు మొదటి దగునుపక్రమాది రూపయుక్తిచే వ్యాసతాత్పర్యమును నిర్ణయింత మనిన నాయుపక్రమాదులు శ్రుతిని విడచి యుండవు కావున నప్పుడు మనము కేవల యుక్తి బలముతో సూత్రమే వ్యాసతాత్పర్యమును నిర్ణయించితి మనుటయే సత్యము కాకపోవును. శ్రుతిసహిత మగుయుక్తితో వ్యాసతాత్పర్యమును నిర్ణయింపరా దనుటనుగూర్చి తర్వాత విచారింతము.

ఇట్లు కాక తర్కప్రసిద్ధము లగుప్రత్యక్షాదులచే బ్రహ్మస్వరూప మిట్టిది యని నిర్ణయించి దానిమూలమున వ్యాసునితాత్పర్య మిదియే యని నిర్ణయింపఁదలఁచినయెడల నదియును సరిపడదు.

14. నైషా తర్కేణ మతి రపనేయా.

15. తర్కాప్రతిష్ఠానాత్.

శ్లో. 16. యత్నే నానుమి తోఽప్యర్థః కుశలై రనుమాతృభిః,

అభియుక్తతరై రన్యై రన్యథై వోపపాద్యతే.

అను మొదలగు శ్రుతిసూత్రమహాపురుషవాక్యములు బ్రహ్మను తెలిసికొను విషయములో వేదాంతవాక్యములే కాని కేవల యుక్తు లేమియు నుపయోగింపవు. అవి కేవల యుక్తిని నిరాకరించి యుండుటచే మన మామాట తలంచుట కుందేటికొమ్మును తేఁబోవఁ దలంచుటయే కాని వేఱు కాదు.

ఇట్లు యుక్తిబలముచే వ్యాసునితాత్పర్యమును నిర్ణయింప లేక పోయినను శ్రుతిబలముతో నైన దానిని నిర్ణయింపవచ్చు ననినచో నదియును సరి కాదు.

17. "అహం బ్రహ్మాస్మి. 18. తత్త్వమసి. 19. అయ మాత్మా బ్రహ్మ"

---

14. పరమేశ్వరునిఁ గూర్చినజ్ఞానము తర్కముచేఁ గలుగునది కాదు.

15. పరమేశ్వరునివిషయమున తర్కములు నిల్వుకడనందవు. (చూడు. బ్రహ్మసూత్రము. ౨. ౧. ౧౧)

16. పరమేశ్వరునివిషయమున నెంకటిబుద్ధిమంతు లనుమానమును గావించినను అన్యులచే నది ధ్వంసము చేయఁబడుచునే యుండును.

17, 18, 19. నేనే బ్రహ్మను. నీవే బ్రహ్మవు. ఈజీవుఁడు బ్రహ్మము.

అను మొదలగు 20. "పృథ గాత్మానం ప్రేరితారం చమత్వా. 21. ద్వా సుపర్ణా" అను మొదలగు "జీవబ్రహ్మలు వేరువేరుగా నున్నారు" అని చెప్పు శ్రుతులును సమానములుగానే యున్నందున కేవలశ్రుతినిమాత్రమే ఆధారము చేసుకొని వ్యాసతాత్పర్యమును నిర్ణయించుట యశక్యము. ఇందువలననే కదా యిదివఱకు నీశ్లోకమును ఉదహరించి యున్నాము.

శ్లో. 22. వేదాన్తార్థస్తు సర్వేషాం నానా భాతి నచైకథా,
అత స్తేన కథం బ్రహ్మ జానా త్యల్పమతిః పుమాన్.

ఇట్లు గాక యుక్తులతోఁగూడినశ్రుతులసహాయముచే వ్యాసమహాముని తాత్పర్యమును నిర్ణయింపవచ్చు నన్నచో నదియును యుక్తముగా నుండ లేదు. శ్రుతులతోఁగూడినయుక్తు లనఁగా మీమాంసాశాస్త్రప్రసిద్ధము లైనయుపక్రమాదియుక్తులే యని యిదివఱకే తెలియఁజేసి యున్నాముగదా! శంకరాదిభాష్యకారు లందఱును తమతమభాష్యముల యందు నీయుపక్రమాదియుక్తులతోఁగూడిన శ్రుతిబలము నాశ్రయించియే గదా తమతమయభిప్రాయమునే వ్యాసాభిప్రాయముగా నిర్ణయించి యున్నారు. మఱియును మనకంటె నెన్నియో రెట్లు జ్ఞానాధికు లగుప్రాచీన గ్రంథకారు లందఱును పైవారొనర్చినభాష్యముల నన్నిటిని బాగుగ విమర్శించి ప్రతివాదులకు వాక్ స్తంభన మొనర్చుచు సకలజనమనోహరముగా దామొనర్చినయద్వైతసిద్ధ్యాదిగ్రంథములమూలమున తమమతమే వ్యాసమత మని నిర్ధారణ చేయుట యీయుక్తిసహితశ్రుతిబలము నాశ్రయించియే కదా! ఇట్లుండ కించిద్ జ్ఞులమై స్వమతాభిమానమును విడువ నేరక నూరక నేదియో కొంచెము మాట్లాడనేర్చుకొనినమనమే వారందఱికంటె నెక్కువగా యుక్తిసహితశ్రుతిబలము నవలంబించి వ్యాసతాత్పర్యమును నిర్ణయింపఁగలుగుదు మనుట భ్రాంతియే యగును కదా!

పూర్వపక్షి:—ఇట్లు మనము స్వయముగా వ్యాసతాత్పర్యమును నిర్ణయించుటకు వీలు లేకపోయినయెడల నీక్రింద చెప్పఁబోవునట్లు చేయవచ్చును. వ్యాసతాత్పర్య మేదియో నిర్ణయించిన బాగుండు నని

---

20, 21. తనకంటె తన్ను ప్రేరేపించు నంతర్యామిని భిన్నునిగా నెఱింగి జతవిడువక నుండునట్టియు మిత్రులైనట్టియు జీవేశ్వరు లను రెండుకక్షులు కలవు.

22. వ్యాసతా- పేజీ-674 చూ.

కోర్కెగల పురుషశ్రేష్ఠుఁడగు నొకరాజోత్తముని యాస్థానమునకుఁజని యచ్చట మధ్యస్థులుగా కొందఱు పండితుల నేర్పఱచుకొని వాదిప్రతి వాదులిద్దఱు ని ట్లొకనిబంధనపత్రమును వ్రాసి యియ్యవలయును. ఈదినము మొదలు నెలదినములవఱకు మేమిద్దఱమును ద్వైతాద్వైత ములనుగూర్చి తర్కించెదము. తర్వాత నీమధ్యస్థు లగుపండితులు ఏమతమును ప్రమాణ మని చెప్పుదురో ఆమతములో మే మిరువురము ప్రవేశింపఁగలవారము. అని యిట్లు నిబంధనము నేర్పఱచుకొని వాదమున కారంభించి మన మే యుక్తిశ్రుతులబలాబలముల ననుసరించి మధ్యస్థ పండితసన్నిధాన బలముచే వ్యాసతాత్పర్యమును నిర్ణయింపవచ్చును.

సిద్ధాంతి:—ఇట్లు చేయుటకుఁగూడ వీలుపడదు. పైఁ జెప్పినట్లు వ్యాసతాత్పర్యనిర్ణయమునం దిచ్ఛ గలప్రభువు దొరకుటయె కష్టము. అట్లొకవేళ రాజు దొరకినను మధ్యస్థులుగా నుండఁదగినవార లొత్తుగానే లేరు. ఎట్లనిన:—మధ్యస్థత్వ మనఁగా వాదిప్రతివాదులపక్షములలో దేనియందును స్వపక్షాభిమానము లేకుండి ఆవాదిప్రతివాదిపక్షములలోని బలాబలముల నిర్ణయించుసామర్థ్యము గలిగియుండుట గదా! ఇట్టిమధ్యస్థ త్వము ఎవ్వరికుండును? కొంచెము చెప్పెదను. నాస్తికాదివేదబాహ్యమతా వలంబులకా, సాంఖ్యాదిమతావలంబులకా, లేక వేదాంతమతావ లంబులకేనా యీమధ్యస్థత్వ ముండుట? వీనియందు మొదటిపక్షము మిక్కిలి యసంగతము. బౌద్ధఅర్హతచార్వాకాదినాస్తికమతస్థులు వేద ములు అప్రమాణములని వాదించువా రగుటచే వా రుపనిషత్తుల చదువ నేచదువరు. కావునవారు ఆయుపనిషత్తులలోనియుపక్రమాదితాత్పర్యలిం గములను ఎట్లు తెలుసుకొనఁగలరు? వానిచేఁ బరతత్త్వము నెట్లు నిర్ణయిం పఁగలరు? మఱియును వేదోచ్చారణమును వినుటకుఁ గూడ నధికారము లేనినాస్తికులయెదుట వేదాంతమును విచారణచేయుటయే ప్రత్యవాయకర మగును. వేదాక్షరములను నాస్తికులు వినఁగూడదనుటనుగూర్చి గౌతమ ధర్మమునందు ఇట్లు చెప్పఁబడియున్నది:—"అథ హాస్య వేద ముపశృణ్వ తస్త్రపుజతుభ్యాం శ్రోత్రప్రతిపూరణం ఉదాహరణే జిహ్వాచ్ఛేదః ధారణే శరీరభేదః." రెండవపక్షము పైదానివలెనే సరియయినది కాదు. కపిలకణాద గౌతమాదిమతముల నవలంబించినవారు ఇప్పు డెచ్చటను గానరాకుండు

టచే వారు బ్రహ్మతత్త్వనిర్ణయమునకు మధ్యస్థు లగుదు రనుట గోడలేని చిత్రముల వ్రాయఁదలఁచుటయే కాని వేఱు కాదు. ఒకవేళ నట్టివా రున్నను వారు ద్వైతాద్వైతమతస్థులవాదములలో నిష్పక్షపాతులగు మధ్యస్థులు కానేరరు. ఎట్లనిన: వారలు జీవు లనేకు లనియు ప్రపంచము సత్యమనియు జీవబ్రహ్మములకు భేదము కల దనియు వాదించువార లగుట చేతవారలకుద్వైతాద్వైతవాదములలో తమమతములకనుకూలములగు సిద్ధాంతములపై నభిమానము కలుగకుండు ననుట యసంభవము గదా! ఇక మూఁడవపక్షము నంగీకరించిన నదియు నిట్లే యసంభవ మగుచున్నది. ఎట్లనిన: వేదాన్తశాస్త్రమును ప్రవర్తింపఁజేయు నానావిధభాష్యకారులమతముల నవలంబించినవారిలో ప్రస్తుత మున్నవారు శంకర రామానుజమధ్వశ్రీకంఠాచార్యులమతముల నవలంబించిన నాలుగుతెగల వారు మాత్రమే యైయున్నారు. వారును పరస్పరవిరోధముగా భేదాభేద పక్షములలో నేదియో యొకదాని నవలంబించినవారగుటచే వారలయందు పైఁజెప్పిన మధ్యస్థత్వ ముండు ననుట యాకసము పుష్పించె నను నట్లుండును.

మఱియును వారిని మధ్యస్థులుగా నిర్ణయించుకొని వాదించి వాదిప్రతివాదులలో నెవ్వఁడైన తనమతమును స్థిరపఱచినచో నప్పుడామధ్యస్థులు చేయుపని వాదిప్రతివాదుల జ్ఞానతారతమ్యములను నిర్ణయించుటతోనే ముగియును గాని మతములు సిద్ధాంతపఱచునంతవఱకు ప్రవర్తింపనేరదు. అట్లొకవేళ మతనిర్ణయము చేయవలసిన నిర్బంధము గలిగినచో ననాదినుండియు గురూపదిష్టమై పరంపరగా వచ్చుచున్న స్వమతమునకు హాని కలుగుట సంభవించును గావున అప్పటివారిదురాగ్రహమును వాదించుట కెవరికిని సాధ్యము కాదు గదా!

ఇందువలననే, 23. "వాదిదౌర్బల్యం వినా న మతదౌర్బల్యం" అను నట్టి యొక లోకోక్తి కూడా ప్రపంచమునఁ బ్రసిద్ధమై యున్నది. కావున నిట్లాలోచించి చూచిన మధ్యస్థులయెదుట తత్త్వనిర్ణయము సేయవచ్చు ననుట వృథాలాపము.

---

23. వివాదసమయములయందు వాదులు దుర్బలులు కావలసినదియె కాని మతములుమాత్ర మెప్పటికిని దుర్బలములు కావు.

పూర్వపక్షి:—ఇట్లు కేవలయుక్తిబలముతోఁ గాని కేవల శ్రుతిబలముతోఁగాని యుక్తిసహితశ్రుతిబలముతోఁగాని మధ్యస్థులసన్నిధానబలముతోఁగాని యివియన్నియుఁ గాకపోయినను సూతసంహిత బోధాయనవృత్తిమొదలగువాని సాక్ష్యబలములచే నిర్మింపఁబడిన శంకర భగవత్పాదరామానుజాదులభాష్యగ్రంథములపరిశీలించి కాని వ్యాస తాత్పర్య మిది యని యెవరును నిర్ణయింపలేకపోయినయెడల నీవు మాత్రము దీని నెట్లు సిద్ధాంతము చేసెదవు?

సిద్ధాంతి:—చెప్పెదను వినుము. స్తోత్రభాష్యమునందు విష్ణు శివులలో సత్వాశ్రయుఁ డెవ్వఁడని సంశయము గలిగి సిద్ధాంతముఁ జేయ వలసి వచ్చినప్పుడు వేదాంతదేశికులు పక్షపాతయుక్తము లగుటచేఁ బురాణములనెల్ల విడిచి అట్టిపక్షపాతము లేమియు నుండవలసిననిమిత్తము లేని మధ్యస్థ మగుశిల్పిశాస్త్రములోని యీక్రిందివాక్యము ననుసరించి విష్ణువే సత్వాశ్రయుఁ డని నిరూపించి యున్నాఁడు:—

శ్లో. 24. స్యాన్మాగధద్రావిడవేసరఞ్చ క్రమేణ వై సత్వరజస్తమాంశి,
మహీసురోర్వీపతివైశ్యశాస్త్రే హరి ర్విధాతా హర ఆదిదేవాః.

ఇట్లే చతుర్వేదతాత్పర్యసంగ్రహ మనుగ్రంథము వ్రాయు నప్పుడు శివవిష్ణువులలో నమశ్శేషి యెవ్వఁడని సిద్ధాంతపఱుపవలసినప్పుడు సుదర్శనాచార్యుండును వేదాంతాచార్యునివలెనే పక్షపాతయుక్తములగు పురాణముల విడచి మధ్యస్థ మగుభరతశాస్త్రములోని

శ్లో. 25. వజ్రిణ్యా ముద్రయా శక్రం పద్మిన్యా దర్శయే ద్విధిమ్,
శంఖిన్యా కేశవం రుద్రం శిర స్యంజలిముద్రయా.

అనువాక్యములు ప్రమాణముగాఁ జేసికొని యీశ్వరుఁడె నమ శ్శేషి యని నిర్ణయింపుచు నాభావమును ఈక్రిందిశ్లోకముతోఁ జూపి యున్నాఁడు:—

---

24. మాగధ ద్రావిడ వేసరదేశములును బ్రాహ్మణక్షత్రియవైశ్యులును విష్ణు బ్రహ్మమహేశ్వరులును క్రమముగ సాత్వికరాజసతామసులు.

25. ఇంద్రుని వజ్రముద్రతోను, బ్రహ్మను పద్మముద్రతోను, విష్ణువును **శంఖముద్రతోను, శివుని నమస్కారముద్రతోను అభినయించి చూపవలయును.**

శ్లో. 26. యా శంఖినీ భవతి శంకరవజ్రిణీ యా
ముద్రా చ యా కమలినీభరతోపదిష్టా,
తాభి ర్ధ్రువం త్వభినయా విబుధాంతరాణాం
మౌళిస్పృశాకరపుటాంజలిముద్రయా తే.

పై సందర్భములయందువలెనే యిచ్చటఁగూడ వ్యాససూత్రముల కనేకభాష్యము లుండుటవలన ఆభాష్యతాత్పర్యములలో వ్యాసతాత్పర్య మేది యని మనకు సంశయము కలిగియున్నది. దాని నిప్పుడు నివారింప వలయును గనుక నేనును పై వారివలెనే మధ్యస్థవాక్యముల నాశ్రయించు చున్నాను. ఎట్లనిన:—కపిలకణాదగౌతమ పతంజలిజైమిని తంత్రముల యందును వానికి సంబంధించిన సూత్రభాష్యవార్తిక వృత్తిగ్రంథముల యందును శైవపాంచరాత్రబౌద్ధ అర్హతచార్వాకతంత్రములయందును ఈచెప్పిన పది తంత్రములలోను "27. యావత్పరమతం న నిరాక్రియతే తావత్స్వమత మప్రతిష్ఠితం భవతి" అనున్యాయము ననుసరించి కపిలాదు లందఱును స్వమతమును స్థాపించుకొనుటకై పరమతములను ఖండించి యున్నారు. ఆమతఖండనప్రస్తావములో వారందఱును వ్యాసమహాముని తాత్పర్య మద్వైతమే యని వ్యాసమతమును వివరించిరి కావున వారు ఈవ్యాస తాత్పర్యవిషయములో మధ్యస్థులే కదా! శిల్పిభరతాదుల వలె వీరలకును వ్యాసతాత్పర్యమును వివరించుటయందు పక్షపాత ముండ వలసిన యగత్యము లేదని వేఱుగాఁ జెప్పనవసరము లేదు కదా! కావున నామధ్యస్థు లగుకపిలాదులవాక్యముల ననుసరించి వా రనువాదము చేసిన యద్వైతమే వ్యాసమహాముని తాత్పర్య మని నిర్ణయించుచున్నాము.

ఇట్లు మధ్యస్థుల మూలకముగా విషయమును నిర్ణయించుట యుక్త మని గౌతమధర్మమునందు ఇట్లు చెప్పఁబడియున్నది. "విప్రతిపత్తౌ

26. ఓపరమేశ్వరా! భరతమహామునిచే నుపదేశింపఁబడినముద్రలలో శంఖిని (శంఖాకారహస్తము) వజ్రిణి (వజ్రాకారహస్తము) కమలిని (పద్మాకారహస్తము) అనుముద్రలు ఇతరదేవతలకు మాత్రమే సూచకము లగును. నీకుమాత్రము కేవల నమస్కారముద్రయే సూచక మగుచున్నది.

27. ఎంతవఱకు పరమతములు నిర్హాకరింపఁబడవో యంతవఱకు స్వమతము నిలుకడ నొందదు.

సాక్షీనిమిత్తా సత్యవ్యవస్థా” ఇట్లు నిర్ణయించి పిదప శంకరభాష్యమే ప్రమాణ మని సిద్ధాంతపఱచుచున్నారు.

పూర్వపక్షి :— జీవు లనేకు లనియు జగత్తు సత్య మనియు జీవ బ్రహ్మములకు భేదము కల దనియు వాదించువా రగుటచే కపిలాదులు వ్యాసతాత్పర్యనిర్ణయవిషయములో మధ్యస్థులు కానేర రని యింతకు ముందు చెప్పి యిప్పుడు మరల వారలనే మధ్యస్థులుగా నొప్పుకొని వారలు చేసినయనువాదమునే యాధారముగా గొని వ్యాసతాత్పర్య మును నిర్ణయింతు నని చెప్పుటవలన మీమాటను మీరే ఖండించు కొనిన ట్లైనది.

సిద్ధాంతి:—మీరు చెప్పిన ట్లాకపిలాదులు భేదాభేదవిషయము లగుశ్రుత్యర్థములు విచారించుటలో మధ్యస్థులు కాకపోయినను వ్యాస మతము ననువాదము చేసి ఖండించి స్వమతమును స్థాపించుకొనువా రగుటచేత వారి కవశ్యము వ్యాసాభిప్రాయము యిదియే యని తెలిసి యుండితీరవలయును గదా! మఱియు వారికి ఆవ్యాసమతమునందు అభిమాన ముండదు గదా! కావున వ్యాసతాత్పర్య మిది యని నిర్ణ యించుటలో వీరు మధ్యస్థులు కావచ్చును.

పూర్వపక్షి :— అట్లైన మఱియొకదోషము సంభవించును. ఏ మనిన:-కపిలాదులు చేసిన యనువాదము నాధారము చేసికొని వ్యాస తాత్పర్యము అద్వైతమే యని సిద్ధాంతపఱచినయెడల నీక నాభాష్య గ్రంథమును చూచువా రెవరు ?

సిద్ధాంతి:—అట్లేమియు కాదు. ప్రతివాదును భాష్యమును ఎప్పటికైనను చూచియే తీరవలయును. ఏల యనిన:—“తంత్వౌపనిషదం పురుషం పృచ్ఛామి, నావేదవి న్మనుతే తం బృహన్తమ్” అనుశ్రుతిప్రమాణ ములనుబట్టి యాలోచించి చూడఁగా నుపక్రమోపసంహారాది యుక్తు లతోఁ గూడిన శ్రుతిబలము నాశ్రయించియే పరతత్త్వమును నిర్ణయింప వలయును గాని వేఱొకమార్గమున వలనుపడ దనుటయే వ్యాసుని యభి ప్రాయ మని స్పష్టమగుచున్నది. కావున నట్టి పరతత్త్వమును నిర్ణయించు టకు ప్రయత్నించువారు శ్రుత్యర్థమును వివరించునవి యగుటచే భాష్య గ్రంథముల నవశ్యముగాఁ జూచియే తీరవలయును. ఈసందర్భములో

బ్రహ్మసూత్రములకు ననేకభాష్యము లుండుటచేతను ఆయాభాష్యముల యందు వేఱువేఱుగా నుపక్రమాదులు చెప్పఁబడియుండుటచేతను ఆయా మతస్థులు తనుతమభాష్యములే ప్రమాణము లని చెప్పుచు నితర భాష్యములను ఆదరింపకుండుటవలనను ఏభాష్య మైనను ప్రమాణ మనుటకు తృప్తికరమై సకలజనహృదయంగమమగు నాధార మేమియు లేక పోవుటచేతను బ్రహ్మవిచారణమునందు నిచ్ఛగలవారికి శాంకరాది సర్వభాష్యములలో బ్రహ్మనిర్ణయమునకు నేభాష్యము ఆదరణీయమో యని సంశయ నివార్యమై యున్నది. కావున నీగ్రంథముచే అద్వైతమే వ్యాసమహర్షి తాత్పర్య మని నిర్ణయింపఁబడుటచే పైసంశయము తీరి యద్వైతప్రతిపాదక మగు శంకరభాష్యమే బ్రహ్మవిచారణవిషయమై యాదరణీయ మనియు ఆభాష్యమునందు చెప్పియున్న యుపక్రమాదులే అందఱిచేత నంగీకరింపఁబడవలె ననియు నేర్పడునే కాని వే తేమియు లేదు గదా! దీనివలన జనులు భాష్యగ్రంథముల నేల విడువవలయును?

ఇఁక సిద్ధాంతప్రారంభము.

వేదాంతశాస్త్రమునందు "28. రచనానుపపత్తేశ్చ నానుమానమ్" అను అధికరణములో వ్యాసమహాముని సాంఖ్యమతమును ఖండించి యున్నాఁడు. అట్లే సాంఖ్యశాస్త్రమునందును కపిలాచార్యుఁడు స్వమత స్థాపనమునకై పరమతముల ఖండించునప్పుడు వేదాంతమతమును అద్వైత మత మనియే యభిప్రాయపడి జీవబ్రహ్మలకు భేదము లే దనుట, యీ ప్రపంచమునందు ననుభవములో నున్న భేదములు ఒక్కయాత్మకే యుపాధిభేదములవలన కలిగిన వనుట, యీ ప్రపంచము అనిర్వచనీయ మైన దనుట మొదలగు నామతసిద్ధాంతముల నీక్రిందివిధముగా నను వాదముచేసి ఖండించియున్నాఁడు. ఎట్లనిన: సాంఖ్యశాస్త్రమునందు మొదటి అధ్యాయములో

---

28. అచేతనము సృష్టినిఁ జేయు ననుటకు వీలు లేదు. కావున సాంఖ్యమతము యుక్తియుక్తముకాదు. (వివరము. చూడు. బ్ర. సూ. ౨-౨-౧.)

29. నావిద్యాతో ప్యవస్తునాబన్ధాయోగాత్. సూ-౨౦.

30. వస్తుత్వే సిద్ధాన్తహానిః. సూ-౨౧.

31. విజాతీయ్యద్వైతాపత్తిశ్చ. సూ-౨౨.

32. విరుద్ధోభయరూపా చేత్. సూ-౨౩.

33. న తాదృక్పదార్థాప్రతీతేః. సూ-౨౪.

అనుసూత్రములచే నవిద్యవలన జీవునకు బంధము గలిగె ననునద్వైత సిద్ధాంతమును అనువాదము చేసి ఖండించియున్నాఁడు.

మఱియు నాఅధ్యాయమునందే,

34. ఉపాధిభేదే ప్యేకస్య నానాయోగ ఆకాశ స్యేవ ఘటాదిభిః. సూ-౧౪౦.

35. ఉపాధి ర్భిద్యతే న తు తద్వాన్. సూ-౧౪౧.

36. ఏవమేకత్వేనపరివర్తమానస్యనవిరుద్ధధర్మాధ్యాసః.సూ-౧౪౨.

---

29. అవిద్య వస్తువుకాదు. కావున దానివలన జీవునకు బంధము కలుగు ననుట తగదు.

30. ఆ యవిద్యను వస్తువుగానే యంగీకరింతు మనిన నద్వైతసిద్ధాంతమునకు హాని వచ్చును.

31. విజాతీయ మగుద్వైతముకూడ సంభవించును. (విజాతీయ మనఁగా విరుద్ధ జాతి గలది. ఆత్మకు రెండవదిగా నంగీకరింపఁబడినయవిద్య చేతనముఁ గాకపోవుటచే నాయాత్మకంటె భిన్నజాతి కలదికదా యనుట.)

32. ఆ యవిద్య వస్త్వవస్తురూపములు రెండును కలది యందువేని.

33. యుక్తముకాదు. అట్టిపదార్థము లోకమున లేదు.

34. ఆకాశ మొక్కటి యయ్యును, ఘటాదులవలన భిన్నమైనట్లు ఆత్మయొక్కఁడే యైనను శరీరోపాధులవలన భిన్నుఁడుగాఁ గానరావచ్చును.

35. ఇట్లు చెప్పిన నుపాసకులకే భేదము కలుగును కాని అందున్న జీవునకు కాదు కదా! ఇట్లైన నొక్కనియందే విరుద్ధధర్మము నుండవలసివచ్చును. కావున నాత్మల పరస్పరభిన్నులుగానే యంగీకరింపవలయును.

36. ఇట్లైన పరస్పరవిరుద్ధధర్మము లొక్కనియం దుండనేరవు. ఒకదాని ధర్మము మఱియొకదానియందు నుండనేరదు.

37. అన్యధర్మత్వేపి నారోపాత్తచ్ఛిద్ధిరేకత్వాత్. సూ-౧౫౩
38. నాద్వైతశ్రుతివిరోధో జాతిపరత్వాత్. సూ-౧౫౪
39. విహితబన్ధకారణస్య దృష్ట్యా తద్రూపమ్. సూ-౧౫౫
40. నాన్ధదృష్ట్యా చక్షుష్మతా మనుపలమ్భః. సూ-౧౫౬
41. వామదేవాదిర్ముక్తో ముక్త్యాపినాద్వైతమ్. సూ-౧౫౭
42. అనాదా వద్య యావదభావా ద్భవిష్య దప్యేవమ్. సూ-౧౫౮

---

37. మీమతమునందును (సాంఖ్యమతమునందును) ప్రకృతికి గలకర్తృత్వము పురుషునియం దారోపింపఁబడుచున్నది కదా యనిన నది సరికాదు. ఆరోపించినంత మాత్రమున లేనిది కలుగనేరదు. పురుషుఁ డెప్పటికిని నిర్మలుఁడే, ఏకరూపుఁడే యగుటచే నాతనికి జన్మమరణములు కాని కర్తృత్వాదులుకాని లేవు. కావున నారోపమాత్రమువలన ధర్మములు సిద్ధింపవచ్చు ననుట యుక్తము కాదు.

38. ఇట్లుచెప్పినను అద్వైతశ్రుతులకు విరోధము రాదు. అవి జాతినిఁగూర్చి చెప్పును.

39. ఆత్మ లనేకు లని యంగీకరించినను బంధమోక్షములు ప్రతివానికిని కలుగ వలయును కదా! అది విరుద్ధమగును అనుట యుక్తము కాదు. మామతమున (సాంఖ్య మతమున) జీవునకు వాస్తవ మగుబంధము లేదంటిమి కదా! ఈవిషయమును తెలిసికొనిన నదియే ముక్తి. అజ్ఞానమువలన వచ్చినట్లు భావింపఁబడునది పారమార్థికము కానేరదు కదా!

40. ఇట్లైన మాపక్షముకూడ (అద్వైతపక్షము కూడ) యుక్తమే యగు ననుటకు వీలు లేదు. ఆత్మ యొక్కఁ డనుటకంటె ననేకు లనుట మిగుల యుక్తియుక్తము. గ్రుడ్డివారికి వస్తుజ్ఞానము లేకున్న కన్నులు కలవారుకూడ నట్లే యుండవలయునా? మీకు (అద్వైతులకు) నేకాత్మపక్షము జ్ఞానశూన్యతవలన సరిగాఁ దోఁచినది; మేమైనను (దానిని విచారింపఁగూడదా!)

41. మఱియుఁ బురాణాదులయందు "వాసుదేవుఁడు ముక్తుఁడయ్యెను. శుకుఁడు ముక్తుఁడయ్యెను." అని యొక్కొక్కఁడు మాత్రమే ముక్తి నొందె నని చెప్పఁబడి యున్నది. ఆత్మ యొక్కఁడే యైనచో సర్వప్రపంచమునకు నొక్కమాఱే ముక్తి కలుగవలయును కదా!

42. నానాత్మపక్షము నంగీకరించినను నొక్కొక్కఁడుగా ముక్తుఁ డగుచు వచ్చిన నంతమునకు ప్రపంచము శూన్యము కావలసివచ్చును కదా! యనిన నది యుక్తము కాదు. ముక్తి యొకప్పుడు లేకపోలేదు కావున నెప్పటికి నిట్లే యుండవచ్చును.

43. ఇదానీ మివ సర్వత్ర నాత్మన్యోచ్ఛేదః. ౧౫౭

అను నీసూత్రములచే "ఆత్మ యొక్కఁడు ఉపాధిభేదములచే నానా రూపుఁడయి యున్నాఁడు యుపాధినాశమే మోక్షము. అది జ్ఞానము వలన కలుఁగును." అనుపక్షములను ఖండించి యున్నాఁడు. ఇవి యద్వైత పక్షములె కదా! జ్ఞానమువలన ముక్తి కలుగు నను విషయము వీరికి సమ్మతమె యైనను అది (ముక్తి) యుపాధినాశరూప మైనది కాకపోవుటచేతను ఆయుపాధి యవిద్యాకల్పితము కాకపోవుటచేతను "జ్ఞానముచే నుపాధి నాశరూప మగుముక్తి కలుగదు' అని వారియభిప్రాయము. వారిమతము నందలిముక్తి యుపాధినాశమువలన కలుగునది కాదు కదా! (వీనిమత మునుగూర్చి చూడుడు బ్రహ్మసూత్రము-౨-౧-౧) ఇట్లే పంచమా - ధ్యాయమునందును,

44. నావిద్యాశక్తియోగో నిస్సఙ్గస్య. సూ-౧౩

45. తద్యోగే తత్సిద్ధా వన్యోన్యాశ్రయత్వమ్. సూ-౧౪

46. నబీజాఙ్కురవత్సాదిసంసారశ్రుతేః. సూ-౧౫

47. విద్యాతోఽన్యత్వే బ్రహ్మబాధప్రసక్తిః. సూ-౧౬

48. అబాధే నైష్ఫల్యమ్. సూ-౧౭.

---

43. ఇట్లు కాకున్నను ప్రపంచము ప్రవాహరూపమగుటచే జీవులకు ముక్తియుఁ గలుగవచ్చును. ప్రపంచమునకు నాశంబును కలుగకుండవచ్చును.

44. కొందఱు (అద్వైతులు) అవిద్యాశక్తిసంబంధమువలన నాత్మకు కర్తృత్వము కలుగు నందురు. అది యుక్తముకాదు. వారిమతమునందును ఆత్మ నిర్వికారుఁడే. నిర్వికారునకు వికారసంబంధము కలుగదు కదా!

45. మఱియు నవిద్య లేకున్న సృష్టి లేదు. సృష్టి లేకున్న నవిద్య లేదు. కావున నాపక్షమున నన్యోన్యాశ్రయదోషము గూడ వచ్చును.

46. అనాదు లగుటచే బీజాంకురములవలె నివియుఁ పరస్పరసంబంధము నొంద వచ్చు ననుటయు సరి కానేరదు. శ్రుతులయందు సంసారమునకు నాది చెప్పఁబడి యున్నది.

47. మఱియు నవిద్య యనఁగా నేది ? విద్యకంటె భిన్నమయినది యనినచో బ్రహ్మము గూడ నట్టివాఁడే కావలసివచ్చును. కావున విద్యచే బాధింపఁబడవలసికూడ వచ్చును.

48. ఇక విద్య యవిద్యను బాధింపకుండిన నది విద్యయే కాకపోవలసి వచ్చును.

49. విద్యాబాధ్యత్వే జగతో ప్యేవమ్. సూ-౧౯

50. తద్రూపత్వే సాదిత్వమ్. సూ-౧౯

అనుసూత్రములచే "అవిద్యాసంబంధమువలన నాత్మకుఁ గర్తృత్వము కలిగెను. ప్రపంచ మవిద్యాకల్పిత మైనది. ఆయవిద్య విద్యచే నశించును" అనుపక్షములను ఖండించి యున్నాఁడు. మఱియు నా యధ్యాయమునందె,

51. నానిర్వచనీయస్య తదభావాత్. సూ-౫౪

అను సూత్రముచే "ప్రపంచము అనిర్వచనీయ మగుటచే బ్రహ్మ భిన్నము" అనుపక్షమును నిరాకరించి యున్నాఁడు. మఱియు నాయధ్యాయమునందె,

52. నాద్వైత మాత్మనో లిఙ్గా త్తద్భేదప్రతీతేః. సూ-౬౧.

53. నానాత్మ నాపి ప్రత్యక్షబాధాత్. సూ-౬౨

---

49. బాధించు ననిన ప్రపంచముకూడ నవిద్యయే కావలసివచ్చును. ఇదియు విద్యాభిన్నమే కదా!

50. ఆపక్షము నంగీకరించిన ననాది యని చెప్పఁబడుచున్న యవిద్యకు సాదిత్వము వచ్చును. ప్రపంచము సాది కదా!

51. అనిర్వచనీయమని యొకపదార్థమే లేదు. "ఇది యున్నదియుఁ గాదు. లేని దియుఁగాదు." అనియును "ఇది రజతము" అనియును శుక్తిరజతమునుకూడ నిర్వచించుచునే యున్నారు.

52. మఱియు నాత్మ యొక్కఁడే యనుట చెల్లదు. ఆయన పరస్పరభిన్న రూపుఁ డైనట్లు జరామరణసుఖదుఃఖానుభవములవలనఁ దెలియుచున్నది. (ఏకాత్మ పక్షదూషణ మిదివఱకు వచ్చియున్నది. అయినను అచ్చట సిద్ధ మగువిరుద్ధధర్మాధ్యాసము ననువాదముచేసి మతమును దూషించెను. ఇచ్చట దానినే [విరుద్ధధర్మాధ్యాసమునే] సాధించుచున్నాఁడు. కావునఁ బునరుక్తి లేదు.)

53. చేతనులు అనేకులే యైనను ఆత్మానాత్మలకు భేదము లే దనవచ్చును. ఇంత మాత్రముననే యద్వైతము సిద్ధించును కదా! యనిన నదియుం యుక్తము కాదు. ఘటాద్యనాత్మపదార్థములు ఆత్మకంటె భిన్నముగా నున్నవి యని ప్రత్యక్షముగా దెలియవచ్చుచున్నది కదా!

54. నోభాభ్యాం తేనైవ. సూ-౬౩
55. అన్యపరత్వ మవివేకానాం తత్ర. సూ-౬౪
56. నాత్మావిద్యా నో భయం జగదుపాదానకారణం నిస్సఙ్గత్వాత్. సూ-౬౫
57. నైక స్యానన్దచిద్రూపత్వే ద్వయో ర్భేదాత్. సూ-౬౬

అను సూత్రములచే "ఆత్మ యొక్కఁ డయ్యును బాలురచే నాకాశము నీలపీతాదిరూపములతోఁ జూడఁబడునట్లు బహుభేదములతోఁ జూడఁబడుచున్నాఁడు." అనుపక్షమును మరల ఖండించి "అద్వైతులకు జగదుపాదానకారణమే లేదు. ఆత్మకును స్వరూపము లేదు" అని వేదాంత మతమును దూషించియున్నాఁడు. మఱియు నాయధ్యాయమునందే,

58. నానన్దాభివ్యక్తి ర్ముక్తి ర్నిర్ధర్మత్వాత్. సూ-౭౪.

అనుసూత్రముచే "స్వస్వరూపభూత మగు నానందము స్ఫురించుటయె మోక్షము" అనుపక్షము నిరాకరించియున్నాఁడు. ఇట్లె యాఱవయధ్యాయమునందు,

59. ఉపాధి ర్భే త్తత్సిద్ధౌ పున ర్ద్వైతమ్. సూ-౭౬.

---

54. ఈకారణమువలననే యెట్లును (చేతనులుగాని చేతనాచేతనములు గాని యభిన్నము లని రెండువిధములుగఁ జెప్పినను) అద్వైతము సిద్ధింపదు.

55. అద్వైత శ్రుతులును జాలిపరము లగుటచే నీసిద్ధాంతములకు వానివలన విరోధము లేదు.

56. మఱియు నద్వైతమతమున నాత్మగాని యవిద్యగాని రెండును గలసి కాని జగదుపాదానకారణములు కానేరవు. ఆత్మ సత్యరూపుఁడు. అసంగుఁడు. అవిద్య మిథ్యారూపము.

57. మఱియు నాత్మ చిదానందరూపుఁ డనుట తగదు. ఆచిదానందములు పరస్పరభిన్నములు కదా!

58. ఇట్లే ఆనందము (స్వాభావికానందరూపము) అభివ్యక్త మగుటయే ముక్తి యనుట చెల్లదు. అచ్చట ననుభవించువాఁడు మొదలగువారు లేరు. ఆనంద మెవ్వనికిని ధర్మమగుటకును. వీలు లేదు.

59. భేద ఉపాధివలన సిద్ధించుననిన నది సరిపడదు. అద్వైతమతమున నుపాధి మిథ్య, అది పరమార్థ మైననే కాని భేదము కుదురదు.

60. ద్వాభ్యా మపి ప్రమాణవిరోధః. సూ-౮౭.

61. ద్వాభ్యామ ప్యవిరోధా న్న పూర్వ ముత్తరం చ సాధకా భావాత్. సూ-౮౮.

52. స్వప్రకాశ త స్తత్సిద్ధౌ కర్మక ర్తృవిరోధః. సూ-౮౯.

63. జడవ్యావృత్తో జడం ప్రకాశయతి చిద్రూపః. సూ-౯౦.

64. న శ్రుతివిరోధో రాగిణాం వైరాగ్యాయ తత్సిద్ధేః. సూ-౯౧.

65. జగత్సత్య మదుష్టకారణ జన్యత్వా ద్బాధకాభావాత్. సూ-౯౨.

---

60. ఆయుపాధిని సత్యముగ నంగీకరించినను అసత్య మనినను విరోధమే.

61. ఇట్టి యుపాధి నంగీకరించిననే కాని అద్వైత ద్వైతశ్రుతులకు సమన్వ యము కుదురదు. అనిన నది యుక్తము కాదు. అద్వైతశ్రుతులు జాతిపరములో స్తుతిపరములో యగుటచే వాని యభిప్రాయము ప్రధానము కానేరదు. దానిని సాధించుయుక్తులు లేవు. ఇట్లగుటచే నభేదమే లేదు. భేదశ్రుతులయర్థమే ప్రామా ణికము.

62. ఆత్మరూపము స్వప్రకాశ మగుటచే నదియే యద్వైతసిద్ధాంతమునకు ప్రమాణము అనియెద రేమో యదియు సంభవింపదు. అప్పు డంతయు నాత్మయే యైన నెవ్వఁడు దేనిని తెలిసికొనును?

63. మఱియు నాయాత్మ జడము కాకుండుటచేఁ జేతనుఁ డని చెప్పఁబడు చున్నాఁడు గాని యది వానికి ధర్మము కాదు. ఇట్లగుటచే చేతనుఁ డనునది యౌపచారిక వ్యవహారమే కాని మఱియొక్కటి కాదు. ఆచైతన్య మాత్మధర్మ మగునేని యాధర్మ ముతో నాయన జడపదార్థముఁ బ్రకాశింపఁ జేయునుగాని యట్లు లేదు. జడము కానంతమాత్రమున చేతనుఁ డనుచున్నారు కాని చైతన్య మాయనకు లేదు. అది పంచ భూత సంయోగమువలన (అనఁగా: నాభూతములు శరీరరూపమును చెందినపుడు) లుగునదియే.

64. ఇట్లైన స్వప్రకాశశ్రుతులకు విరోధము వచ్చును కదా! యనిన నదియు యుక్తము కాదు. ఆశ్రుతులు సంసారమునందలి యభిలాష తొలఁగుటకై వైరాగ్యము జనించుటకై యాత్మను నుతించుచున్నవి.

65. ప్రపంచము మిథ్య యనుటయు సరి కాదు. మిథ్య యైన దానికిఁ గారణము తెలిసియుండవలయును. బాధకజ్ఞానముఁగూడ నుండవలయును. ఈప్రపంచవిషయమున విచారింపఁబోయిన దీనికి గారణములు గానరావు. "ఇది ప్రపంచము కాదు" అని బాధకజ్ఞానంబును లేదు. కావునఁ బ్రపంచము సత్యమే.

అనుసూత్రములచే మఱియొకసందర్భమున నుపాధినిఁగూర్చియు' అద్వైత శ్రుతుల ప్రాముఖ్యతనుగూర్చియుఁ బరమేశ్వరుని స్వప్రకాశత్వమును గూర్చియు దోషములఁ జెప్పియున్నాఁడు. ఈవిధముగ పరపక్షనిరాకరణ ప్రస్తావమునందు సాంఖ్యసూత్రములలో కేవలాద్వైతపక్ష మధికముగా ననువాదముచేసి ఖండింపఁబడెను. వ్యాసాభిప్రాయ మొక్కటి తప్ప తక్కిన గౌతమాది యభిప్రాయములు సంశయాస్పదములు కాకుండుటచే ననియన్నియు నాపరమతనిరాకరణప్రస్తావమునందు అనువాదమాత్రము చేతనే స్పష్టముగఁ దెలియవచ్చుచున్నవి. తక్కినవారితోపాటు వేదాంత దర్శనకర్త యగువ్యాసమహామునియు నాప్రస్తావమున ప్రస్తావింపఁబడవల సినవాఁడే యయియుండ నాయనకై యీ కేవలాద్వైతపక్ష మొక్కటి మాత్రమే మిగిలియున్నది. ఆయనమతము లెక్కకు మిక్కిలి యగువిరుద్ధ భాష్యములవలన సంశయాస్పదముగఁ జేయఁబడి యుండుటచే ననువాద మాత్రమున విస్పష్టము కాకున్నను పైనవర్ణించినవిధముగ పారిశేషిక న్యాయమున (వ్యాసుఁడును అద్వైతపక్షంబును మిగిలియుండుటచే) విస్పష్టమగుచున్నది. ఈయద్వైతపక్షము అప్రసిద్ధుఁడగుమఱియొకనిదియై యుండవచ్చు ననుటకు సాహసించినను అందు (సాంఖ్యసూత్రముల యందు) మఱియేమతమును గౌతమమతాదులకంటె భిన్నముగా ననువా దము చేయఁబడి యుండ లేదు. వ్యాసునిమత మద్వైతము కాకపోయినఁ గాకపోవునుగాక నితరమతమైన భట్టభాస్కరాదిభాష్యోక్తమతములలో నేమత మయిన వ్యాసమత మని యనువాదముఁ జేయఁబడి యుండవల యును కదా! అట్లు కానరాలేదు కావునఁ గపిలాచార్యునకు వ్యాసమత మద్వైత మనియే తాత్పర్య మనుట నిర్వివాదాంశము.

ఈవిధముగ సాంఖ్యసూత్రములయందలి యనువాదమువలన వ్యాసునితాత్పర్యము కేవలాద్వైతమె యని తేలుచున్నను భేదవాదులు కొందఱు అనాదినుండియు గురూపదిష్టమై వచ్చుచున్న తనమతమునందలి యభిమానమును విడువనేరక అత్యల్పబలము లగుకొన్నియుక్తులతో నీసిద్ధాంతమును ఖండింపఁజూచుచున్నారు. ఎట్లనిన:—

౧. సాంఖ్యసూత్రములయందలి యనువాదమును నాశ్రయించి వ్యాసతాత్పర్యము నద్వైతముగా నిర్ణయించుటకు వీలు లేదు. గొప్ప వారిచే భాష్యకర్తలచేఁ జేయఁబడినగ్రంథములయం దెచ్చటఁగూడ నీ

సూత్రము లుదహరింపఁబడలేదు. ఈకారణమువలన నివి కపిలాచార్యుల చేత రచింపఁబడిన వగునో కావో తెలియకున్నది. ఇట్లగుటచే మత నిర్ణయ విషయమున నీసూత్రములు ప్రమాణములు కావు.

2. మఱియు నీయనువాదమును అద్వైతమును సాధించు ప్రబల యుక్తిగా పూర్వగ్రంథములవా రెవరు నంగీకరింపకుండుటచే నిప్పుడు మీరు మాత్రము క్రొత్తగా నంగీకరించుటవలనఁ బ్రయోజన ముండదు.

3. ఇదియునుగాక కపిలాచార్యులు వ్యాసునికంటెఁ బూర్వమున నున్నవారు. వ్యాసమహాముని తర్వాతివాఁడు. ఇట్లుండ వ్యాసమునిమత మును కపిలాచార్యుఁ డనువాదము చేసె ననుట యెట్లు?

4. పయి నుదహరింపఁబడిన సాంఖ్యసూత్రములయం దెచ్చటను వ్యాసశబ్దము లేదు. ఇట్లుండ అచ్చట వ్యాసమతమె యనువాదము చేయఁబడె నని గ్రహించుటకు వీ లెట్లు కలుగును?

5. విచారించినచో నీకేవలాద్వైతమును వ్యాససూత్రముల యందుఁ గానవచ్చుటయే లేదు. అట్లు కానవచ్చిననేకదా యాగురుతు ననుసరించి "యిదియే వ్యాసమతము సాంఖ్యసూత్రములయందు అనువా దము చేయఁబడిన దిదియే" యని గుఱుతించుటకు వీలు కలుగును. అట్లు లేదుకావున సాంఖ్యశాస్త్రమును ననువాదము చేయఁబడిన దెవరిమతమొ యెట్లు తెలియును?

6. ఇది యంతయుఁ గాక కపిలమహాముని వ్యాసాభిప్రాయము నవశ్యముగ ఖండింపవలయునేని యప్పుడు 66. "ఈశ్వరాసిద్ధేః" అను మొదలగుసూత్రములయందె దానిని ఖండించెను. వ్యాసుఁడు జగత్కా రణముగాఁ బరమేశ్వరునంగీకరించువాఁడు. ఆపక్షమును కపిలుఁడు తిరస్క రించెను కదా! ఈవిధముగా వ్యాసమత మొక్కస్థలమున ఖండింపఁ బడి యుండ నద్వైతానువాదమునుగూడ దన్మతానువాదంబుగానే (వ్యాసమతానువాదముగానే) కల్పింపవలసిననిర్బంధ మేమి? అట్టి యద్వైత పక్షపాతి యెవ్వఁడో యొకఁ డుండవచ్చును కదా!

7. ఇట్టి యద్వైతవాది మఱియొక్కఁడు లేకున్నను కపిలాచా ర్యుఁడు తనమతమును స్థాపించుకొనుటకై స్వబుద్ధిచేతనే యీయద్వై తమును భావించి ఖండింపవచ్చును.

---

66. ఈశ్వరుఁ డున్నాఁ డనువిషయము సిద్ధింపదు.

౮. ఇట్లు కాకున్నను ఆకాలమున నెవ్వఁడో యొకయద్వైతవాది యుండిననుండవచ్చును. వాఁడిప్పుడు మనకు ప్రసిద్ధుఁడు కాకపోవచ్చును. వానిమతమునే యనువాదముచేసి కపిలాచార్యుఁడు ఖండింపవచ్చును.

౯. ఇట్లును చెప్ప నక్కఱలేదు. సూతసంహిత విష్ణుపురాణము మొదలగువానియందు జడభరతాదులనుగూర్చి చెప్పఁబడి యున్నది. వారద్వైతవాదులు ప్రసిద్ధులు. వారిమతము నైనను కపిలాచార్యుఁ డనువాదముచేసి యుండవచ్చును. ఇంతమాత్రమున నద్వైతము వ్యాసుని మత మనియు కపిలాచార్యుఁడు దానినే యనువాదము చేసె ననియుఁ జెప్పుటకు నెట్లు వీలుపడును?

౧౦. అట్లు చెప్పవలయు నని పట్టుపట్టినను దానిని మఱియొకవిధముగా సమర్థింపవచ్చును. 67. "తదనన్యత్వ మారమ్భణశబ్దాదిభ్యః. ౨. ౧. ౧౪." అనునధికరణమున నద్వైతపక్షము వ్యాసునిచే నంగీకరింపఁబడినట్లు గానవచ్చుచున్నది. దాని నాధారముఁ జేసికొని యైనఁ గపిలాచార్యుఁ డద్వైతానువాదమును చేసి యుండవచ్చును. ఇంతమాత్రమున నది వ్యాసునిపరమాభిప్రాయము కానేరదు కదా!

౧౧. ఇట్లు కాకున్నను 68. "ఆత్మేతి తూపగచ్ఛన్తి గ్రాహయన్తి చ. ౪. ౧. 3." అను మొదలగు సూత్రములను జూచి యాకపిలాచార్యులు వ్యాసమత మద్వైతమే యని భ్రాంతి నొందియుండవచ్చును.

౧౨. సర్వజ్ఞుఁ డగుటచే నాకపిలాచార్యునకు భ్రాంతి యుండ దని సాధించినను మీసిద్ధాంతము నిలువదు. ఆయనకు గోచరముకానివిషయ మేదియు నుండదు. కావున రాబోవు శంకరాచార్యమతమునుగూడ నాయన యనువాదముచేసి ఖండించి యుండవచ్చును.

౧౩. ఇట్లు కాకున్నను ఆశ్మరథ్యుఁడు ఔడులోమి బాదరి కాశకృత్స్నుఁడు అను మునులుకూడ నద్వైతులే కావున వారిమతములలో దేనినైన నొకదాని ననువాదము చేసియుండవచ్చును.

---

67. "వాచారంభణం వికారో నామధేయం" అనుమొదలగుశ్రుతులవలన గార్యకారణము లొక్కటియే యగు ననుటయే సిద్ధాంతము (వివరము. చూడు. బ్ర-సూ-౨-౧-౧౪).

68. మహాత్ములందఱును బ్రహ్మము నాత్మనుగానే యంగీకరించుచున్నారు శ్రుతులు నట్లే చెప్పుచున్నవి.

ఈవిధముగ సాంఖ్యసూత్రములయందు చేయఁబడియున్న యను వాదము మఱియొకవిధముగా నైనను కూర్చుకొనుటకు వీలుండుటచే వ్యాసుఁడే యద్వైతవాది యని నిరూపించుటకు నెట్లును వీలులేదు. ఈయనువాదబలము నాశ్రయించి వ్యాసునకు కేవలాద్వైతమే తాత్పర్య భూతార్థ మని నిర్ణయించుటకు వీలు లేదు.

ఈఆక్షేపము లన్నియు యుక్తియుక్తములు కావు. ఎట్లనిన:—

౧. "సాంఖ్యసూత్రములు ప్రాచీనగ్రంథములయం దుదహరింపఁబడ లేదు" అనుటకు వీలు లేదు. సూతసంహితావ్యాఖ్యాన మగుతాత్పర్య దీపికయందు విద్యారణ్యస్వామిచే 69. "అత ఏవ సాఙ్ఖ్యై రుచ్యతే సత్త్వరజస్తమసాం సామ్యావస్థా ప్రకృతిరితి" అనియు పరిమళమునందు అప్పయ్యదీక్షితులచే 70. "ఆనుమానిక మప్యేకేషామ్. ౧-४-౧" అనునధి కరణమునందు 71. "అతఏవ 'స్థూలా త్పఞ్చ తన్మాత్రస్య' ఇత్యాదీని 'సంహతపరార్థత్వా త్పురుషస్య' ఇత్యన్తాని కపిలసూత్రాణి" అనియు నిజ్లె పురుషార్థరత్నాకరమునందు బాలకృష్ణానందస్వామిచే 72. "మోక్ష స్తు లక్షిత స్సాంఖ్యైః అథ త్రివిధదుఃఖాత్య న్త నివృత్తి రత్య న్తపురుషార్థః" అనియు కపిలసూత్రములు పెల్లుగా నుదహరింపఁబడి యున్నవి. ఇట్లగుటచే సాంఖ్యసూత్రములు కపిలముని ప్రణీతములు కా వనుటకు వీలు లేదు కదా! "ఇట్లయినను నీ వుదహరించిన కేవలాద్వైతానువాదకసూత్ర ములు మాత్రము కపిలకృతములు కాకపోవచ్చునుకదా!" అనిన నదియు యుక్తియుక్తము కానేరదు. కపిలసూత్రములకు వ్యాఖ్యానము నొనర్చిన

69. ఇట్లగుటచేతనే "సత్వరజస్తమస్సుఁయొక్క సామ్యావస్థయే మూల ప్రకృతి" యనుచున్నారు.

70. అనుమానసిద్ధ మగుప్రధానముఁ గూడ కొన్నియుపనిషత్తులయందు చెప్పఁ బడెను......

71. ఈకారణమువలననే "స్థూల పంచతన్మాత్రస్య" అని యారంభించి, "సంహతపదార్థత్వ పురుషస్య" అనువఱకు నున్న సూత్రములచే సాంఖ్యశాస్త్రమున వైయభిప్రాయము వివరింపఁబడెను.

72. "అథ త్రివిధదుఃఖాత్యంత నివృత్తి రత్యంతప్రరుషార్థః" అని సాంఖ్యులు మోక్షమునకు లక్షణము చెప్పిరి.

యనిరుద్ధాచార్యుఁడు మొదలగువారు 73. "అథ త్రివిధదుఃఖాత్యన్త నివృత్తిరత్యన్తపురుషార్థః ౧-౧" అను మొదలు 74. "యద్వా తద్వాతదుచ్ఛిత్తిః పురుషార్థస్తదుచ్ఛిత్తిః పురుషార్థః. ౬-౭౦" అనువఱకు గల సర్వసూత్రములకును వ్యాఖ్యానము చేసియుండ నడుమ నున్న యీ కేవలాద్వైతానువాదకసూత్రములు మాత్ర మేల నన్యము లగును? సాంఖ్య శాస్త్రమున కేల సంబంధింపకపోవును? కపిలమునికృతము లేల కాక పోవును? కావున నీపక్షమువలన మాసిద్ధాంతమునకు భంగము రాదు.

2. "సాంఖ్యానువాదము అద్వైతమును సాధించుటలోఁ బ్రమాణముగఁ బూర్వులచే నుదహరింపఁబడలేదు" అనునంతమాత్రమువలనఁ గూడ పై సిద్ధాంతములకు హాని రాదు. కపిలాదులనే ప్రతివాదులుగ నుంచుకొని వారిమతముల నిరాకరించుటకుఁ బ్రయత్నించినవార లగుటచే భాష్యకారులు తమమతము స్థాపించుటకై వారియనువాదములఁ బ్రమాణములుగ గ్రహించుట యనావశ్యకము. వారు మొట్టమొదట తమమతమె వ్యాసమత మని సిద్ధాంతము చేసికొనియే కదా కపిలాదుల ఖండింప నుపక్రమించిరి. "వారిమతములలో వ్యాసతాత్పర్య మేది?", యని సంశయము కలిగినప్పుడు ప్రస్తుతభేదవాదులకు సమాధానము చెప్పుటకై మధ్యస్థవాదముగ నాకపిలానువాదము గ్రహింపఁబడవలసి వచ్చినది కాని మొట్టమొదటనే దీనిని గ్రహింపనేల? మఱియు నప్పయ్య దీక్షితాదులును తమతో సమానముగ యుక్తులను చెప్పగలవారు లేక పోవుటచే నీయనువాదయుక్తిని గ్రహింపలేదు. ఇంతమాత్రమున మనము గూడ దీనిని గ్రహింపఁగూడ దనుట యేటిమాట? యుక్తి సరియైనది యని తెలియుచుండ దాని నెవ్వఁడో యేకారణమువలననో గ్రహింపలే డనునించుకకారణమువలన మనముగూడ గ్రహింపకుండవలయు ననుట యనాదరణీయము కద!

3. "కపిలుఁడు పూర్వుఁడు; వ్యాసుఁడు వెనుకటివాఁడు. ఇట్లగుటచే వ్యాసమతమును కపిలుఁ డనువాదము చేసె ననుట సంభవింపదు" అనుపక్షము యుక్తియుక్తము కాదు. వ్యాసకపిలాదు లొక్కమాటే

---

73. మూఁడువిధము లగుదుఃఖములు పరిపూర్ణముగ నివర్తించుటయే పరమపురుషార్థము.

74. ఎట్లైనను ఆదుఃఖములు నశించుటయే పురుషార్థము.

జనించి యూరకుండువారు కారు. లోకోద్ధరణమునకై ప్రతికల్పమునందును జనించుచుందురు. ఇట్లగుటచే వారు స్వమతస్థాపనమునకై పరస్పరమతముల ననువాదము చేసికొనవచ్చును. ఇట్లు కాకున్న చారిత్రికదృష్టాంతము ననుసరించి యల్పకాలమునకుఁ బూర్వమే యభివృద్ధినిఁ గాంచియున్న బౌద్ధమతమును వ్యాసమహాముని యెట్లనువాదము చేయఁగలిగెను? ఇట్లగుటచేఁ బురాణానుసారముగ వీరియుత్పత్తుల నంగీకరించి తీరవలయును కావున వీరలలో పూర్వాపరవ్యవహారము లేదు. పూర్వకల్పమునందలి వ్యాసుఁడు ప్రస్తుతకల్పమునందలి కపిలునికంటెఁ బూర్వుఁడు; ప్రస్తుత కల్పమునందలికపిలుఁడు ప్రస్తుతకల్పమునందలి వ్యాసునికంటెఁ బూర్వుఁడు. కావున ననువాదవిషయమున సంశయ మేమియు లేదు.

౪. మఱియు అనువాదస్థలమున వ్యాసపదము లేకున్నంతమాత్రమున నది వ్యాసమతము కాకపోదు. గౌతమాదిమతములస్వరూపములు స్పష్టములైయుండుటచేతను కేవలాద్వైతమొక్కటియు వ్యాసుఁడొక్కఁడును మాత్రమె మిగిలి యుండుటచేతను ఆయద్వైతమే వ్యాసునిమతము కావలయునని సిద్ధాంతముఁ జేయుటకు వీ లగుచున్నది కదా! దీని నంగీకరింపకుండిన 75. "ఈక్షతే ర్నాశబ్దమ్. ౧-౧-౫" అనుమొదలగుస్థలముల యందు బ్రహ్మసూత్రమున కపిలమతమును ఖండించునప్పుడు కపిల పదము ప్రయోగింపఁ బడవలయు ననవలసివచ్చును; ఆపదము ప్రయోగింపఁబడి యుండకపోవుటచే నచ్చట ఖండింపఁబడినమతము కపిలునిది యగునో కాదో యని సంశయింపవలసివచ్చును. ఇట్టిసంశయ మెవ్వనికిని లేదు కదా! భాష్యకారు లందఱు నేకవాక్యముగ నాసూత్రముల (ఈక్షతేః అను మొదలగు సూత్రముల) సాంఖ్యమతఖండనపరములనుగ నంగీకరించియే యున్నారుకదా! కావున నామప్రయోగము లేకపోయినంతమాత్రమున వచ్చుహాని యేదియు లేదు.

౫. ఈవిధముగ కపిలసూత్రములయందలి యనువాదము నాశ్రయించి వ్యాసమతము నద్వైతమునుగా నిర్ణయించుటకు వీలు కలుగు చుండుటవలన బ్రహ్మసూత్రములయందు ప్రత్యేకముగ నద్వైతమును బోధించుసూత్రము కానరావలయు నని నియమము లేదు. బ్రహ్మసూత్ర

75. శ్రుతియందు సంకల్పపూర్వకసృష్టి చెప్పఁబడినది కావున ప్రధానము జగత్కారణము కానేరదు.

మంతయు నద్వైతపర మనియే కదా పైయనువాదమువలన సిద్ధాంత మగుచున్నది! "ఇట్టిగుఱుతు లేకుండిన నద్వైతమె వ్యాసతాత్పర్యమని యెట్లు నిర్ణయింతువు?" అని భ్రాంతి నొందెదవేమొ వినుము. అద్వైతవాది మఱియొక్కఁడు లేఁడనియు, నీకారణమువలన వ్యాసునే యాస్థానమున నిలిపితి మనియుఁ బలుమాఱు చెప్పియున్నాము. మఱియు బ్రహ్మసూత్రములయం దద్వైతమే స్పష్టముగ గుఱుతింపఁబడి యుండెనేని యప్పుడు తక్కిన భాష్యము లారంభింపఁబడుటకే వీలులేకపోవుటచే నిట్టి సంశయమునకే యవకాశము లేకుండును.

ఇంతవివాద మేల? అట్టిగుఱుతులు కూడ బ్రహ్మసూత్రమునందు కలవు. "ఉపాధివలన భేదము కలుగు ననుట యుక్తియుక్తము కాదు" అనువిషయము 76. "ఉపాధిభేదే ప్యేకస్య నానాయోగ ఆకాశస్యేవ ఘటాదిభిః. ౧-౫౦" అను మొదలగు సూత్రములచే సాంఖ్యశాస్త్రమున నిరూపింపఁబడియున్నది. "ఆత్మ యొక్కండైనను ఆతనికి నుపాధులవలన భేదము కలుగుచున్నది" అనువిషయము 77. "అత ఏవ చోపమా సూర్యకాదివత్ 3-౨-౧౮...78. ఆభాస ఏవ చ ౨-3-౫౦" అనుసూత్రములచే బ్రహ్మసూత్రమునందు నిరూపింపఁబడియున్నది. ఇట్లె "ఆత్మ కాని అవిద్య కాని రెండును కలసి కాని ప్రపంచోపాదానకారణము కానేరదు" అను విషయము 79. "నాత్మా ఽవిద్యా నో భయం జగదుపాదానకారణం నిస్సంగత్వాత్. ౫-౬౫" అను మొదలగు సూత్రములయందు నిరూపింపఁబడియున్నది. 80. "జన్మాద్యస్య యతః ౧-౧-౨...81. ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా

76. (వ్యాసతా- పేజీ 688 చూ.)

77. ఇట్లగుటచేతనే సూర్యప్రతిబింబములు మొదలగునుపమానములుం చెప్పఁబడెను.

78. ప్రతిబింబమే.

79. (వ్యాసతా- పేజీ 692 చూ.)

80. ఈప్రపంచముయొక్క యుత్పత్తి స్థితి వినాశము లెవ్వనివలన కలుగుచున్నవో వాఁడే బ్రహ్మము.

81. ఏకవిజ్ఞాన ప్రతిజ్ఞవలనను మృత్పిండాది దృష్టాంతములవలనను ప్రపంచోపాదానకారణము గూడ బ్రహ్మమే.

దృష్టాన్తానుపరోధాత్ ౧-౪-౨౩" అను మొదలగుసూత్రములచే "పరమేశ్వరుఁడే జగదుపాదానకారణము" అనువిషయము బ్రహ్మసూత్రములయందును నిర్ణయింపఁబడి యున్నది. ఇట్లగుటచే బ్రహ్మసూత్రమున నద్వైతప్రత్యభిజ్ఞానము కూడఁ గలదు.

"ఇట్లు చెప్పెద వేమి? 82. 'నాత్మావిద్యా నోభయం జగదుపాదాన కారణం' అనుసూత్రముల కపిలాచార్యుఁడు 'ప్రకృతిసహితబ్రహ్మము జగదుపాదానకారణము కానేరదు' అని కదా నిరాకరించెను. ఈ పక్షము శంకరమతమువారికె గాక రామానుజాదిమతస్థులకుఁ గూడ సమ్మతమేకద! ఇట్లుండ నీనిరాకరణమువలన కేవలాద్వైతమె గుఱుతింపఁబడె ననుట యెట్లు?" అనియెదవేమొ వినుము. ఆసూత్రమున కపిలాచార్యునిచే మూఁడువిధములుగా విషయము వికల్పింపఁబడియున్నది. "కేవలుఁడను నాత్మయె జగదుపాదానకారణమా? లేక కేవలావిద్యయే కారణమా? ఇట్లుగాక నిరువురును కలసియే కారణమా?" అనునవి వికల్పస్వరూపములు. ఈపక్షములలో "కేవలావిద్యయె జగదుపాదానకారణమా" యను రెండవపక్షము విచారించినచో నీసంశయము తొలంగును. కపిలాచార్యుఁ డాసూత్రమున నుద్దేశించినయవిద్య యపరమార్థ మగునవిద్యయా? లేక నిత్య మగుప్రకృతియా యని విచారింపవలసియున్నది. అద్వైతులు చెప్పునవిద్య పరమార్థరూపిణి కాదు. దానిని భావరూపముగ నంగీకరించి నను అనిర్వచనీయరూపిణి యగుటచే బ్రహ్మాభిన్నము కానేరదు కదా! రామానుజమతస్థులు మొదలగువారు చెప్పునది నిత్యమై పరమేశ్వరునితోఁ గూడి యుండునట్టిప్రకృతి. సాంఖ్యులు చెప్పునది గూడ నిట్టిదియె. ఇట్లుండ నాకపిలుఁడు ఖండింపఁబూనినయవిద్య యేదియైయుండవలయును? నిర్వివాదముగ నద్వైతులు చెప్పునవిద్యయే యైయుండవలయు. లేకున్న ప్రకృతివిషయమున సాంఖ్యమతముకూడ రామానుజాదిమతములతో కొంచె మించుమించు సమానమె యగుటచే నాపక్షమును ఖండించిన నాయన (కపిలాచార్యుఁడు) స్వపక్షమునే ఖండించుకొనినవాఁడగును కదా! కావున నిర్వివాదముగ నాయన యుద్దేశించినది యద్వైతుఁడు చెప్పునవిద్యనే. మఱియు 83. "నావిద్యాతోప్యవస్తునా బన్ధాయోగాత్.

---

82. (వ్యాసతా-పేజీ 692 చూ.)
83. (వ్యాసతా-పేజీ 688 చూ.)

౧-౨౦" అనుస్థలమున నున్నయవిద్యాశబ్దము అవస్తుజాతావిద్యనే చెప్పు ననుట సిద్ధాంతమై యుండ నిచ్చట యవిద్యాశబ్దము మాత్రము భిన్నార్థమును చెప్పు ననుట యెట్లు? ఒకపదమునకు నొకయర్థ మేర్పడిన పిదప నిరర్థకముగ మఱియొకయర్థమును కల్పించుట యనుచితము కదా! కావున నాకపిలాచార్యునిచే నవస్తురూపిణి యగు నవిద్యతోఁ గూడిన బ్రహ్మము జగదుపాదానకారణ మగు ననువిషయమె ఖండింపఁబడె నన వలయును. ఇది రామానుజాదులకు సమ్మతము కాకుండుట నిర్వివాదమె కద! ఈకారణమువలన నిచ్చట ఖండింపఁబడినది కేవలాద్వైతపక్షమె. ఈపక్షము వ్యాససూత్రములయందును సూచింపఁబడె నని చెప్పితిమి కదా! కావున నయిదవపక్షముకూడ మాసిద్ధాంతమునకు భంగమును కలిగింపఁజాలదు.

౬. మఱియు 84. "'ఈశ్వరాసిద్ధేః ౧-౯-౨.' అను మొదలగు సూత్రములచేతనే వ్యాసమతము ఖండింపఁబడె ననవచ్చును" అనుటయు యుక్తియుక్తము కానేరదు. ఈశ్వరునంగీకరించినమతస్థు లనేకు లున్నారు. అనిరుద్ధాచార్యుఁడు మొదలగువ్యాఖ్యాతలును ఆసూత్రములకు గౌత మాతిపథఖండనపరముగా నర్థము చెప్పియున్నారు. ఇట్లుండ నవి వ్యాసమత మును నిరాకరించు నవియె యని కల్పించుట యెట్లు యుక్తియుక్తమగును? కేవలాద్వైతము ననువాదముఁ జేయుసూత్రము లనేకములు గానవచ్చు చుండ నావాదమున బ్రతివాది యెవ్వఁడును లేకుండ మతకర్త యగుటచే వ్యాసమతమును యవశ్యము ఖండింపఁబడవలసియుండ బహుభాష్యదుష్ట మగుటచే నాయనమతము సంశయాస్పదమైయుండ నాయననే నీయద్వైత పక్షమునఁ బ్రతివాదిగా నియమించుటకు వీలు కలుగుచుండ సామాన్యవిష యముల నిరాకరించు సూత్రములతోనే తన్మతము ఖండింపఁబడియె ననుట యుక్తిశూన్యము కదా! అద్వైతానువాదకసూత్రములు విశేషవిషయ ములను (ప్రత్యేకవిషయమును) చెప్పుచున్నవి; "ఈశ్వరాసిద్ధేః" అను మొదలగుసూత్రములు సర్వమతస్థులును సామాన్యముగ నంగీకరించు విషయములఁ జెప్పుచున్నవి. ఇట్లగుటచే వీనిలో విశేషవిషయమును జెప్పు నద్వైతానువాదకసూత్రములుముఖ్యములుకదా! కావున వానినాశ్రయిం

84. (వ్యాసతా- పేజీ 695 చూ.)

చియే యర్థనిర్ణయమును గావింపవలయు ననుట యుక్తము. కావున నీ యాఱవపక్షము ఇట్లు యుక్తమైనది కాదు.

౭. "కపిలుఁడు తనబుద్ధిబలమువలననే యీమతమును నూహించి ఖండించెను" అను నేడవపక్షముకూడా యుక్తియుక్తము కానేరదు. కపిలసూత్రములయందు 85. "వస్తుత్వే సిద్ధాన్తహానిః. ౧. ౨౧" అను సూత్రము కలదు. దానియర్థమును విమర్శించిన నొకానొకవాదియొక్క సిద్ధాంతమును గైకొనియే ఖండింప నుపక్రమించినట్లు తేలుచున్నది. ఇట్లుండ నిది స్వబుద్ధికల్పితమే యని యెట్లు చెప్పఁగలము ?

౮. ఇట్లె యెనిమిదవపక్షముకూడ యుక్తియుక్త మైనది కాదు. ఆకాలమున నద్వైతవాది యెవ్వఁడో కలఁ డనిన నావిషయమును నిరూపించుటకు వీలు లేదు. అప్పుడు కలఁ డని చెప్పఁబడువాఁడు మహర్షియా? లేక యన్యుఁడా? మహర్షియైనచో గురుశిష్యపరంపరగా గౌతమకాణాదాది మతములవలె వానిమతముఁగూడ నిప్పటివఱకు వ్యాపించి యుండవలసి వచ్చును. అట్లు లేదు కదా! ఇఁక నన్యుఁడైనచో వాఁడు కలఁడో లేఁడో ప్రమాణమేమి? అది యట్లుండె. ప్రసిద్ధులగువ్యాసమహామునియొక్కఁ డద్వైతవాదియై గానవచ్చుచుండ నాయనను విడిచి యప్రసిద్ధుని మఱి యొక్కని గల్పింపఁబోవుట యెంత యయుక్తకార్యము? ఇట్లగుటచే నప్పటి వానిమతమును కపిలాచార్యుఁ డనువాదముఁ జేసియుండవచ్చు నను పక్షము నిలుచున్నది కాదు.

౯. ఇట్లె సూత జడభరతాదులును కపిలునకు ప్రతివాదులు కానేరరు. వారు ప్రత్యేకముగ శాస్త్రమును ప్రవర్తింపఁజేసినవారు కారు కదా. వాదప్రతివాదములకు సమానులై యుండవలయును గాని హీనాధికు లుండరా దనుట నిర్వివాదాంశము కదా! ఇదియుఁగాక ఆసూతాదులను కేవలాద్వైతపక్షమువారినిగ నంగీకరించినచో నాగ్రంథములకు (సూతసంహిత విష్ణుపురాణము మొదలగువానికి) నద్వైతమే తాత్పర్య మని యంగీకరింపఁబడిన ట్లగును. వానికి నద్వైతము తాత్పర్యమైనచో వానితో సమానార్థములగు శ్రుతిసూత్రములకును అయద్వైతమే తాత్పర్య మని తేలును. అప్పుడు మాసిద్ధాంత మూరకనే సిద్ధించినది యగును. మఱియు రామానుజాదులు ఆగ్రంథములకు భేదపరముగ నర్థము

85. (వ్యాసతా- పేజీ 683 చూ.)

చెప్పియుండుటచే వానివ్యాఖ్యానము లన్నియు భ్రాంతిసిద్ధము లని యంగీకరింపఁబడిన ట్లగును. ఇది మీకు ననిష్టము కదా! కావున నెట్లును ఈ తొమ్మిదవపక్షము యుక్తియుక్తము కానేరదు.

౧౦. "తదనన్యత్వ మారంభణశబ్దాదిభ్యః. ౨. ౧. ౧౪." అను మొదలగుసూత్రములవలన సామాన్యముగ నెఱుంగఁబడిన యద్వైతముసే కపిలుఁడు నిరాకరించెను" అనుటయు మాసిద్ధాంతమును భంగము జేయఁగలపక్షము కాదు. సామాన్యముగ నెఱుంగఁబడిన యద్వైతము ననఁగా నాయద్వైతము వ్యాసునకు పూర్వపక్ష మనియా? సిద్ధాంత పక్ష మని యాయభిప్రాయము? "వస్తుత్వే సిద్ధాన్తహానిః. ౧. ౨౧." అని వ్యాససిద్ధాంతమును ఖండింప నుపక్రమించిన కపిలాచార్యుఁడు ఆయన పూర్వపక్షమును ఖండించు ననుట యుక్తియుక్త మగునా? ఎవ్వఁడైనను ఖండింపఁదలఁచిన సిద్ధాంతమునే ఖండించునుగాని పూర్వపక్షమును ఖండింపఁ డనుట నిర్వివాదాంశము కదా! కావున నద్వైతము వ్యాసుని పూర్వపక్ష మనుట యుక్తియుక్తము కాదు. ఇఁక నది (అద్వైతపక్షము) యాయన సిద్ధాంతమే యనిన నదియే కదా మాపక్షము. కావున నీపది యవపక్షము నవలంబించుటవలనఁ గూడఁ బ్రయోజనము లేదు.

౧౧. మఱియు నాకపిలునకు వ్యాసమతానువాదవిషయమున భ్రాంతి కలిగె ననుట సమంజసము కానేరదు. పరమతనిరాకరణమూలమున స్వమతమును స్థాపించుటకు నుపక్రమించినకపిలుఁడు పరమతసిద్ధాంతముల జాగరూకతతో విమర్శింపవలయునుకాని ప్రమాదపడుటకు వీలు లేదు కదా! ప్రమాదమునఁ జేయఁబడినపనులు కార్యసాధకము లగుట యెట్లు? మఱియు గౌతమాదిమతానువాదములవిషయమున మీ కిట్టి సంశయము లేదుకదా! ఇట్లుండ నందఱిమతముల బాగుగ ననువాదముఁ జేసినప్పుడు ఒక్కవ్యాసమతమును మాత్రము ప్రమాదముతో నను వాదమును చేసె ననుట యెట్లు యుక్తియుక్త మగును? ఆకపిలుఁడు మనవలె నల్పజ్ఞుఁడు కాదుకదా!

౧౨. "ఆకపిలుఁడు సర్వజ్ఞుఁ డగుటచే కాబోలు శంకరాచార్యుని మతమునే యనువాదముచేసి ఖండించి యుండవచ్చును." అను పండ్రెండవ పక్షముకూడా మామతమును ఖండింపఁజాలదు. పరమతనిరాకరణప్రస్తావమున శాస్త్రకర్త లగుగౌతమాదులపక్షములె వరుసగా ఖండింపఁబడు

చుండ నొక్కస్థలమునమాత్ర మాకస్మికముగా శాస్త్రకర్త యగు వ్యాసునిమతము ననువాదముఁ జేయక భాష్యకారులలో నొక్కనిమతము మాత్రమే యనువాదముఁ జేసె ననుట యెట్లు? భాష్యకారులమతములనే యనువాదము చేసె ననుపక్షమున శంకరమతమునువలెనే రామానుజాదిమతములనుగూడ ననువాదముఁ జేయవలసి యుండును. వారిమతములోను సాంఖ్యులకు సమ్మతములు కానివిషయము లనేకములు కలవు కదా! విచారించిచూచిన వారి విశిష్టాద్వైతపక్షాదులను ఖండించుసూత్ర మొక్కటియైనను సాంఖ్యశాస్త్రమునఁ గానరాదు. ఇట్లగుటచే వ్యాసమతమె కపిలాచార్యునిచే ననువాదము చేయఁబడి ఖండింపఁబడె నని యంగీకరించి తీరవలయును. ఇట్లుగాక శంకరమతమె యనువాదము చేయఁబడె ననినను మాపక్షమునకు హాని లేదు. వ్యాససూత్రతాత్పర్యమును నిర్ణయించుటకై తదేకచిత్తముతో ప్రవర్తించినభాష్యకారు లనేకులుండ నొక్కశంకరాచార్యునిమతము మాత్రమే ప్రత్యేకముగ గ్రహించి ఖండించుటచే నదియే వ్యాసమతముగా నుండనోపు నని నిశ్చయించుటకు వీలు కలుగుచున్నది కదా! కావున నీపండ్రెండవపక్షము మాపక్షమును నిరాకరించుటకు మారుగా దృఢపఱచుచున్నది.

౧3. "వేదాంతులలో నేకదేశు (కొంతవఱకుమాత్రమే తెలిసినవారు) లగు నాశ్మరథ్యాదులమతములనె యనువాదము చేసియుండవచ్చును." అనుపక్షముకూడా పయివానివలెనే నిస్సారమయినదియె. స్వతంత్రముగ శాస్త్రముల నిర్మించినగౌతమాదులమతములనే యన్నిస్థలములయందును అనువాదపూర్వకముగా ఖండించి యుండ నొక్కస్థలమున మాత్రము శాస్త్రప్రవర్తకునిమతమును ఖండింపక నేకదేశమతమును ఖండించెననుట యేటియుక్తి? 86. ప్రధానమల్లనిబర్హణన్యాయముచే శాస్త్రప్రవర్తకుఁడు ఖండింపఁబడినచో వానితోఁగూడనే తత్సంబంధు లందఱు ఖండింపఁబడుదురుకదా! ఇట్లుకాక నేకదేశమతస్థు లేయచట ఖండింపఁ

86. అనేకు లగుమల్లురు యుద్ధమునకు వచ్చిన నందు ముఖ్యుఁడగువానిని సంహరించినచో నందఱు నోడిపోయినవారే యగుదు రనుట 'ప్రధానమల్లనిబర్హణన్యాయము. సమాన మగుమతములో నించుకభేదము కలవా రనేకులు ఖండింపఁబడవలసి వచ్చినచో నప్పుడు ముఖ్యుఁడగు మతకర్తను మాత్రమే ఖండించిన దక్కినవారు ఖండింపఁబడినట్లే యగుదురు.

బడినని పట్టుపట్టిన వేదాంతసూత్రములయందుకూడ సాంఖ్యమతైకదేశు లగుసనందనాచార్యుడు మొదలగువారే ఖండింపఁబడియుందు రని యంగీకరింపవలసివచ్చును. ఇది యెవ్వరికిని సమ్మతము కాదు. భాష్యకారు లందఱు నేకవాక్యముగ 87. "ఈక్షతే ర్నాశబ్దమ్. ౧-౧ ౫" అను మొద లగుసూత్రములచే కపిలమహాముని యే ఖండింపఁబడె నని యంగీకరించి యున్నారు కదా! మఱియు నద్వైతానువాదకము లగుసూత్రము లన్నియు నేకదేశి మతఖండనపరములె యగునేని యప్పుడు వ్యాసమత మట్లే యుండుటచే దానిని ఖండింపనిది కపిలమతము స్థిరము కానేరదు. 88. "యావత్పరమతం న నిరాక్రియతే తావ త్స్వమత మప్రతిష్ఠితం భవతి" అని కదా న్యాయము. ఈకారణములవలన నీపదమూఁడవ పక్షము యుక్తియుక్త మైనది కాదు.

మఱియు "నేకదేశమతములలో దేనినైన ననువాదముచేసి యుండ వచ్చును" అనిన నం దెవ్వరిమతము ననువాదము చేసియుండవచ్చును? ఆశ్మరథ్యుఁడు ఔడులోమి కాశకృత్స్నుఁడు బాదరి అని వీరు నలుగురే యేకదేశమతస్థులు. ఇం దెవ్వరిమత మనువాదము చేయఁబడుటకు వీలుగా నున్నది? ఆశ్మరథ్యునిమత మనినచో నది యుక్తము కాదు. ఎట్లనిన:—

జీవుఁడు పరమేశ్వరునికార్య మగుటయు నిట్లగుటచే మృత్తికాఘటములకువలె నాజీవబ్రహ్మలకు భేదాభేదములు రెండును స్వాభావికములె యనియు నాయాశ్మరథ్యునియభిప్రాయము. ఈవిషయము 89. "వాక్యాన్వయాత్ ౧-౪-౧౯" అనునధికరణమునందు 90. "ప్రతిజ్ఞాసిద్ధే ర్లింగ మాశ్మరథ్యః. ౧-౪-౨౦" అనుసూత్రమునకు వ్యాఖ్యానము చేయు నప్పుడు అన్నిభాష్యములయందు నేకవాక్యముగ వివరింపఁబడి యున్నది.

---

87. (వ్యాసతా-పేజీ 699 చూ.)

88. (వ్యాసతా-పేజీ 685 చూ.)

89. పూర్వోత్తరసందర్భములను విమర్శించిన వాక్యము బ్రహ్మపరముగానే సమన్వయించును.

90. సర్వవిజ్ఞానప్రతిజ్ఞకు విరోధము రాకుండుటకై జీవబ్రహ్మలకు నభేదము కూడ నంగీకరించి శ్రుతి ఇట్లు (జీవవాచక శబ్దములచే బ్రహ్మమును) చెప్పినది యని యాశ్మరథ్యాచార్యులు తలంచుచున్నారు.

రామానుజభాష్యవ్యాఖ్యానమగు శ్రుతప్రకాశికయందును 91. "యాదవపక్షో ఽస్మిన్సూత్రే ఉపన్యస్తః తత్రహి కార్యాత్మనా కారణాత్మనాచ జీవ బ్రహ్మణో ర్భేదాభేదౌ స్వాభావికావితి" అను మొదలగువాక్యములచే నీవిషయమె స్పష్టము చేయఁబడి యున్నది. ఈవిధముగ నాశ్మరథ్యాచార్యుఁడు స్వాభావికభేదమును వాదించువాఁడై యుండ వానిని గూర్చి 92. "ఉపాధిభేదేప్యేకస్య నానాయోగ ఆకాశస్యేవఘటాదిభిః" అను ననువాదంబును 93. "ఏవ మేకత్వేన పరివర్తమానస్య న విరుద్ధధర్మాధ్యాసః" అను మొదలగు దూషణంబును సంభవింపదు కదా! కావున నాశ్మరథ్యమతము ననువాదము చేయుటకుఁగాని వానిని ఖండించుటకుఁగాని వీలు లేదు.

పై నిరూపణముచేతనే ఔడులోమిమతముకూడ సాంఖ్యసూత్రములయం దనువాదము చేయఁబడలే దని నిరూపింపఁబడిన ట్లైన ముక్తికిఁ బూర్వమున జీవబ్రహ్మములకు స్వాభావికముగనే భేద ముండు ననియు ననంతరమున స్వాభావికముగనే యభేద ముండు ననియు నౌడులోమి ముని యభిప్రాయపడుచున్నాఁడు. ఈవిషయముకూడ నావాక్యాన్వయాధికరణమునందె 94. "ఉత్క్రమిష్యత ఏవం భావా దిత్యౌడులోమిః ౧-౪-౨౧" అనుసూత్రమునకు వ్యాఖ్యానముఁ జేయునప్పుడు భాష్యకారు లందఱు నేకవాక్యముగఁ జెప్పియున్నారు. కావున నౌపాధికభేదము కల దనునభిప్రాయమే లేనియితనిఁగూర్చి గూడ నౌపాధికభేదనిరాకరణము సంభవింపదు కదా!

ఈయౌడులోమిమతము కొంచె మించుమించు యాశ్మరథ్యమతమునను సరించినదియె యనియు వీనిమతమునందు జీవబ్రహ్మలకు సంసార

---

91. ఇది యాదవప్రకాశునిపక్షము. ఇందు జీవబ్రహ్మములకు కార్యకారణభావమువలన భేదాభేదము లంగీకరింపఁబడెను కదా!

92. (వ్యాసతా-పేజీ 628 చూ.)

93. (వ్యాసతా-పేజీ 688 చూ.)

94. జీవుఁడు సంసారదశయం దెట్లున్నను అదేహేంద్రియాది సంబంధమును విడచినచోఁ బరమేశ్వరుఁడే యగును కావున జీవవాచకశబ్దములతో శ్రుతి పరమేశ్వరుని చెప్పుచున్నది యని యౌడులోమి తలంచుచున్నాఁడు.

బడినని పట్టుపట్టిన వేదాంతసూత్రములయందుకూడ సాంఖ్యమతైకదేశు లగుసనందనాచార్యుఁడు మొదలగువారే ఖండింపఁబడియుందు రని యంగీకరింపవలసివచ్చును. ఇది యెవ్వరికిని సమ్మతము కాదు. భాష్యకారు లందఱు నేకవాక్యముగ 87. "ఈక్షతే ర్నాశబ్దమ్. ౧-౧ ౫" అను మొదలగుసూత్రములచే కపిలమహాముని యే ఖండింపఁబడె నని యంగీకరించి యున్నారు కదా! మఱియు నద్వైతానువాదకము లగుసూత్రము లన్నియు నేకదేశి మతఖండనపరములె యగునేని యప్పుడు వ్యాసమత మట్లే యుండుటచే దానిని ఖండింపనిది కపిలమతము స్థిరము కానేరదు. 88. "యావత్పరమతం న నిరాక్రియతే తావ త్స్వమత మప్రతిష్ఠితం భవతి" అని కదా న్యాయము. ఈకారణములవలన నీపదమూఁడవపక్షము యుక్తియుక్తమైనది కాదు.

మఱియు "నేకదేశమతములలో దేనినైన ననువాదముచేసి యుండవచ్చును" అనిన నం దెవ్వరిమతము ననువాదము చేసియుండవచ్చును? ఆశ్మరథ్యుఁడు ఔడులోమి కాశకృత్స్నుఁడు బాదరి అని వీరు నలుగురే యేకదేశమతస్థులు. ఇం దెవ్వరిమత మనువాదము చేయఁబడుటకు వీలుగా నున్నది? ఆశ్మరథ్యునిమత మనినచో నది యుక్తము కాదు. ఎట్లనిన:—

జీవుఁడు పరమేశ్వరునికార్య మగుయు నిట్లగుటచే మృత్తికాఘటములకువలె నాజీవబ్రహ్మలకు భేదాభేదములు రెండును స్వాభావికములె యనియు నాయాశ్మరథ్యునియభిప్రాయము. ఈవిషయము 89. "వాక్యాన్వయాత్ ౧-౪-౧౯" అనునధికరణమునందు 90. "ప్రతిజ్ఞాసిద్ధే ర్లింగ మాశ్మరథ్యః. ౧-౪-౨౦" అనుసూత్రమునకు వ్యాఖ్యానము చేయునప్పుడు అన్ని భాష్యములయందు నేకవాక్యముగ వివరింపఁబడి యున్నది.

---

87. (వ్యాసతా-పేజీ 699 చూ.)

88. (వ్యాసతా-పేజీ 685 చూ.)

89. పూర్వోత్తరసందర్భములను విమర్శించిన వాక్యము బ్రహ్మపరముగానే సమన్వయించును.

90. సర్వవిజ్ఞానప్రతిజ్ఞకు విరోధము రాకుండుటకై జీవబ్రహ్మలకు నభేదము కూడ నంగీకరించి శ్రుతి ఇట్లు (జీవవాచక శబ్దములచే బ్రహ్మమును) చెప్పినది యని యాశ్మరథ్యాచార్యులు తలంచుచున్నారు.

రామానుజభాష్యవ్యాఖ్యానమగు శ్రుతప్రకాశికయందును 91. "అయం యాదవపక్షోఽస్మిన్సూత్రే ఉపన్యస్తః తత్రహి కార్యాత్మనా కారణాత్మనాచ జీవ బ్రహ్మణో ర్భేదాభేదౌ స్వాభావికావుక్తౌ" అను మొదలగువాక్యములచే నీవిషయమె స్పష్టము చేయఁబడి యున్నది. ఈవిధముగ నాశ్మరథ్యాచార్యుఁడు స్వాభావిక భేదమును వాదించువాఁడై యుండ వానిని గూర్చి 92. "ఉపాధిభేదేప్యేకస్య నానాయోగ ఆకాశస్యేవఘటాదిభిః" అను ననువాదంబును 93. "ఏవ మేకత్వేన పరివర్తమానస్య న విరుద్ధ ధర్మాధ్యాసః" అను మొదలగు దూషణంబును సంభవింపదు కదా! కావున నాశ్మరథ్యమతము ననువాదము చేయుటకుఁగాని దానిని ఖండించుటకుఁగాని వీలు లేదు.

పై నిరూపణముచేతనే ఔడులోమిమతముకూడ సాంఖ్యసూత్రములయం దనువాదము చేయఁబడలే దని నిరూపింపఁబడిన దైన ముక్తికిఁ బూర్వమున జీవబ్రహ్మములకు స్వాభావికముగనే భేద ముండు ననియు అనంతరమున స్వాభావికముగనే యభేద ముండు ననియు నౌడులోమి ముని యభిప్రాయపడుచున్నాఁడు. ఈవిషయముకూడ నావాక్యాన్వయాధికరణమునందె 94. "ఉత్క్రమిష్యత ఏవం భావా దిత్యౌడులోమిః ౧-౪-౨౧" అనుసూత్రమునకు వ్యాఖ్యానముఁ జేయునప్పుడు భాష్యకారు లందఱు నేకవాక్యముగఁ జెప్పియున్నారు. కావున నౌపాధిక భేదము కల దనునభిప్రాయమే లేనియితనిఁగూర్చి గూడ నౌపాధికభేద నిరాకరణము సంభవింపదు కదా!

ఈయౌడులోమిమతము కొంచె మించుమించు యాశ్మరథ్య మతముననుసరించినదియె యనియు వీనిమతమునందు జీవబ్రహ్మలకు సంసార

---

91. ఇది యాదవప్రకాశునిపక్షము. ఇందు జీవబ్రహ్మములకు కార్యకారణ భావమువలన భేదాభేదము లంగీకరింపఁబడెను కదా!

92. (వ్యాసతా-పేజీ 6౪8 చూ.)

93. (వ్యాసతా-పేజీ 688 చూ.)

94. జీవుఁడు సంసారదశయం దెట్లున్నను అదేహేంద్రియాది సంబంధమును విడచినచోఁ బరమేశ్వరుఁడే యగును కావున జీవవాచకశబ్దములతో శ్రుతి పరమేశ్వరుని చెప్పుచున్నది యని యౌడులోమి తలంచుచున్నాఁడు.

దశయందు స్వాభావికభేదంబును ముక్తిదశయందు స్వాభావికాభేదంబును గల దనియు భాష్యములయందును తద్వ్యాఖ్యానగ్రంథములయందును కూడ విస్పష్టముగ నున్నది. ఎట్లనిన: రామానుజభాష్యమునందు:— 95. "అత్ర జీవాత్మన ఉత్క్రాన్తేః పూర్వ మనేవమ్భావః కిం స్వాభావికః ఉతౌపాధికః తత్రాపిపారమార్థికోఽపారమార్థికోవా" అని వికల్పించి యౌడులోమిమతము నిరాకరింపఁబడియున్నది. ఈ భాష్యభాగమును వివరించుచు శ్రుతప్రకాశికయందు 96. "సమ్భావితపక్షయోః పరాభిమతం పరిశేషయితుం స్వాభావికౌపాధికవికల్పః కృతః శఙ్కరభాస్కరోక్త పక్షద్వయ స్యాప్యుత్క్రమిష్యత ఇత్యేకే నైవ సూత్రేణ నిరాచికీర్షితత్వజ్ఞాపనాయ పారమార్థికాపారమార్థికవికల్పః కృతః" అనుసందర్భముచే నౌడులోమిపక్షము కూడ స్వాభావికభేదాభేదపక్షమె యని నిర్ణయింపఁబడెను.

శంకరభాష్యమునందును 97. "ఔడులోమిపక్షే స్పష్టమే వావస్థాన్తరాపేక్షౌ భేదాభేదా వితి" అని యౌడులోమిపక్షము నిరాకరింపఁబడెను. భామతియందు 98. "జీవో హి పరమాత్మ నోత్యన్తభిన్న ఏవ

---

95. ఈ యౌడులోమిమతమున సంసారదశయందు జీవునకు బ్రహ్మభావము లేదని యంగీకరింపఁబడెను కదా! ఆభేదము స్వాభావికమా? లేక ఉపాధికృతమా? అందును పారమార్థికమా? లేక వ్యావహారికమా?

96. ఇచ్చట నూహింపఁబడిన పక్షములలో పరులయభిప్రాయము (ఔడులోమిమతము) ఏదియో నిర్ణయించుటకై "సంసారకాలమున నున్న జీవబ్రహ్మభేదము స్వాభావికమా! కాదా!" అను వికల్పము చేయఁబడెను. శంకరాచార్యులును భట్టభాస్కరులును నంగీకరించినపక్షములను గూడ (జీవబ్రహ్మాభేదము పారమార్థిక మని భట్టభాస్కరుఁడును కాదని శంకరాచార్యులును చెప్పుచున్నారు.) ఈసూత్రమునందే ఖండించుచున్నామని సూచించుటకై "ఈ జీవబ్రహ్మాభేదము పారమార్థికమా? కాదా?" అను వికల్పము చేయఁబడెను.

97. ఔడులోమిపక్షమునందు భేదాభేదము లవస్థాభేదముల నపేక్షించి యుండు ననుట స్పష్టమే.

98. జీవుఁడు పరమాత్మకంటె భిన్నుఁడే. అతఁడు దేహేంద్రియాదియుక్తుఁడై సర్వకాలములయందును కలుషత నొంది యున్నాఁడు. జ్ఞానము ధ్యానము మొదలగు సాధనములతోఁ గూడి ఆ దేహేంద్రియాదుల విడుచునేని యప్పుడు శుద్ధపర

స తు దేహేన్ద్రియమనోబుద్ధ్యుపాధిసంపర్కా త్సర్వదా కలుషః తస్య జ్ఞానధ్యానాదిసాధనసమ్పన్నస్య దేహేన్ద్రియాదిసఙ్ఘాతా దుత్క్రమిష్యతః పరమాత్మ నైక్యోపపత్తేః" అని యాదులోమిమతము వివరింపఁబడి యున్నది. కల్పతరువునందును 99. "ఉపాధిసంపర్కో హేతుః కాలుష్యే న జీవపరభేదః" అని యిదియె వివరింపఁబడి యున్నది కావున వీనిని విమర్శించిచూచిన నౌడులోమియు స్వాభావికభేదవాదియె యని తేలుచున్నది కదా! మఱియొక గ్రంథమునందు నిట్లు "ఉత్క్రమిష్యతః" అను సూత్రమునకు వ్యాఖ్యానము చేయునప్పుడు 100. "సంసారదశాయాం జీవస్య పరమేశ్వరాద్భేదేపి మోక్షదశాయాం తద్భావప్రాప్తే ర్జీవశబ్దైః పరమేశ్వరాభిధానమి త్యౌడులోమిమతమ్" అని యాడులోమిమతస్వరూపము వివరింపఁబడియున్నది. ఈవిధముగ విమర్శించిన నౌడులోమియు స్వాభావికభేదవాదియే యగుటచే నాతనిఁగూర్చి సాంఖ్యసూత్రోక్త మగునౌపాధికభేదనిరాకరణము సంభవింపదు కదా! కావున నీమత మాసూత్రములయం దనువాదము చేయఁబడె ననుట యనుచితము.

మఱియు నాకపిలాచార్యుఁడు కాశకృత్స్నమతమునె యనువాదము చేసియుండు ననుటయుఁ జెల్లదు. ఆయనయభిప్రాయమును పలువురు పలుతెఱంగుల వ్యాఖ్యానము చేసియున్నారు. అందు శ్రీకణ్ఠభాష్యమున 101. "అవస్థితే రితి కాశకృత్స్నః. ౧-౪-౨౨" అను సూత్రమునకు వ్యాఖ్యానము 102. "సర్వేషాం చిదచిద్వస్తూనా మన్తర్యామితయా

బ్రహ్మమే యగును. పరమార్థస్థితిలో నతఁడును పరమేశ్వరునివలె శుద్ధుఁడే కావున నట్లు కావచ్చును.

99. జీవునకు మాలిన్యము కలుగుటకు దేహేంద్రియాది సంబంధమే కారణము కాని జీవబ్రహ్మభేదముకాదు.

100. సంసారదశయందు జీవబ్రహ్మములకు భేద మున్నను ముక్తదశయందు అట్లు లేకపోవుటచే శ్రుతి జీవవాచకశబ్దములతోఁ బరమేశ్వరునిఁ జెప్పుచున్నది యని యాడులోమిమతము.

101. అవిద్యోపాధివశమున బ్రహ్మమే జీవరూపముగ నుండుటచే జీవవాచకశబ్దములతో శ్రుతి పరమేశ్వరునిఁ జెప్పుచున్నది యని కాశకృత్స్నిమతము.

102. చేతనాచేతనపదార్థములయం దెల్ల వ్యాపించి సర్వశరీరుఁడై యున్న శివుఁడు సర్వశబ్దములచేతనే చెప్పఁబడుచున్నాఁడు. కావున కాశకృత్స్నాచార్యుఁడు

ఒను ప్రవిష్ట స్సర్వశరీర స్సర్వశబ్దవాచ్యః పరమేశ్వర శ్శివ ఇతి విజ్ఞాయతే. అతః కాశకృత్స్నమత మేవ సమఞ్జసం శ్రుతిసూత్రమహాభియుక్త సమ్మతం” అని చేయఁబడియున్నది. ఇట్లె రామానుజభాష్యమునందును 103. “స్వశరీరభూతే జీవాత్మ న్యాత్మతయా వస్థితే ర్జీవశబ్దేన బ్రహ్మ ప్రతిపాదన మితి కాశకృత్స్నాచార్యో మన్యతే స్మ. జీవశబ్ద శ్చ జీవస్య పరమాత్మపర్యన్త స్యైవ వాచకో న జీవమాత్రస్య” అని సూత్రార్థము వర్ణింపఁబడియున్నది. ఇట్లు వీరిరువురును ఆకాశకృత్స్నమతమును విశిష్టాద్వైతమతమునుగా వర్ణించియున్నారు. శంకరభగవత్పాదు లన్ననో దాని నద్వైతముగా నిరూపించియున్నారు. మధ్వభాష్యము ననుసరించి చూచిన నాశ్మరథ్యాదులు మువ్వురును ద్వైతులే. ఇట్లుండ నెవ్వరిపక్షము ననుసరించి కపిలమహాముని కాశకృత్స్నమతము ననువాదము చేసె ననియెదరు? విశిష్టాద్వైతద్వైతపక్షముల ననువాదము చేసె ననుటకు వీలులేదు కదా! ఇఁక నద్వైతపక్షమునే యనువాదము చేసె ననిన నప్పుడు మాసిద్ధాంతమే స్థిరమయినది. ప్రతిభాష్యకారుఁడును కాశకృత్స్నమతమునే వ్యాసమతమునుగా నిర్ణయించియున్నారు. ఇట్లగుటచే నామతము నద్వైతముఁగా ననువాదము చేసిన నదియే వ్యాసమత మగు ననుటలో సంశయ మేమి? ఇట్లు విమర్శించిన నేకదేశమతస్థులలో మువ్వురును కపిలునికి ప్రతివాదులు కానేరరు.

ఇఁక నీయేకదేశమతస్థులలో బాదరిముని యొక్కఁడు మిగిలియున్నాఁడు. ముక్తిదశయందు శరీరేంద్రియాదులు జీవునకు నుండ వనుటయె యాతనిమతము. 104. “అభావం బాదరి రాహ హ్యేవమ్. ౪-౪-౧౦” అను

---

జీవవాచకశబ్దములచే బరమేశ్వరుని చెప్పవచ్చు ననుచున్నాఁడు. ఈతనిమతమే శ్రుతిసూత్రాదులకు తాత్పర్య మని యున్నది.

103. పరమేశ్వరునకు జీవుఁడును శరీరభూతుఁడే. ఇట్లగుటచే నాతనియందును ఆ పరమేశ్వరుఁ డున్నాఁడు. ఈ కారణమువలననె జీవవాచకశబ్దములతో శ్రుతి పరమేశ్వరుని చెప్పెనని కాశకృత్స్నుని యభిప్రాయము. జీవశబ్దంబును జీవు నారంభించి యాతనిలోపల నున్నపరమేశ్వరునివఱకు చెప్పునుగాని కేవల జీవునిమాత్రమే చెప్పి యూరకుండదు కదా!

104. బాదరిమహాముని ముక్తునకు దేహేంద్రియాదులు లేవని చెప్పుచున్నాఁడు. శ్రుతియు నట్లే చెప్పుచున్నది.

సూత్రమునకు వ్యాఖ్యానముచేయునప్పుడు భాష్యకారు లందఱు నేక
వాక్యముగ నీవిషయమునే వివరించియున్నారు. ఇంతమాత్రమువలననీయన
మతము కేవలాద్వైతమతము కానేరదు కదా! దేహేన్ద్రియాద్యభావ
మాత్రమువలననే యద్వైతము సిద్ధించునేని గౌతమకణాదాదిమతస్థులు
కూడ నద్వైతులె కావలయును. వారును ముక్తిదశయందు దేహేన్ద్రి
యాద్యభావము నంగీకరించుచునే యున్నారు కదా! వా రద్వైతు లని
యెవ్వరు నంగీకరింప రనుటయు నిర్వివాదమె కావున బాదరికూడ నద్వైతి
కాఁడు. ఆతనిమతముకూడ సాంఖ్యసూత్రములయం దుదహరింపఁబడు
టకు నర్హమయినది కాదు. సాంఖ్యోక్తదూషణము లాయననుగూర్చి
వ్యాపింపనేరవు.

ఇట్లు సర్వమును విమర్శించిన కపిలాచార్యుఁడు కేవలాద్వైతమునె
యనువాదము చేసి ఖండించుటవలన వ్యాసమతమునె యనువాదము చేసి
ఖండించె నని తెలియవచ్చుచున్నది. వ్యాసుఁడు తప్ప కేవలాద్వైతవాది
మఱి యెవ్వఁడును లే దనుట పయినిరూపణమువలన స్పష్టమైనది కదా!
మఱియుఁ దక్కినగౌతమాదితంత్రములయందును అల్పముగ వ్యాసమత
మద్వైత మనియే యనువాదముచేసి ఖండింపఁబడియున్నది గాని ద్వైతా
దులలో నొక్కటి యని యనువాదము చేయఁబడియుండలేదు. వ్యాస
సూత్రములయం దనేకస్థలములలో కపిలాచార్యునిఁ గూర్చియే దూషణ
ములు చెప్పఁబడియుండుటవలన కపిలసూత్రములయందుఁగూడ నట్లె
వ్యాసునిఁగూర్చి యనేకస్థలములయందు దూషణములుచెప్పఁబడియున్నవి.
ఇదియే కదా యుక్తము. తన్ను పరుఁ డెంతయధికముగ దూషించునో
పరునిఁగూడ తా నంతయధికముగానే దూషింపప్రయత్నించు ననుట లోక
న్యాయసిద్ధము కదా! ఈకారణమువలనఁగూడ సాంఖ్యసూత్రముల
యందు వ్యాసమత మవశ్య ఖండనార్హ మగుచున్నది. గౌతమాదుల
విషయ మన్నను వ్యాససూత్రములయందు వారిమతము లొక్కస్థలము
నందు మాత్రమే యనువాదము చేసి ఖండింపఁబడి యున్నవి కావున
వారు నట్లే వ్యాసమతమును గూడ నొకానొకస్థలమునందు మాత్రమే
యనువాదము చేసి ఖండించి యున్నారు. దానిని మాత్ర మద్వైతమును
గానే గ్రహించి యున్నారు. ప్రతిశాస్త్రమునందును పారిశేషికన్యా

యముచే (అద్వైతమతంబును వ్యాసుండును మిగిలియుండుటచే) నీవిష యము సిద్ధించుచున్నది. ఎట్లనిన:—

వేదాంతశాస్త్రమునందు 105. "మహద్దీర్ఘవద్వా హ్రస్వపరిమణ్డలాభ్యామ్. ౨-౨-౧౧" అనుస్థలమున కణాదమత మనువాదముచేసి వ్యాసునిచే నిరాకరింపఁబడియున్నది కదా! ఇట్లే వైశేషికశాస్త్రమునందును వ్యాసమత మద్వైతమే యని నిరాకరింపఁబడి యున్నది.

ఆవైశేషికశాస్త్రమున మూఁడవయధ్యాయమునందు రెండవ యాన్వికమున మొట్టమొదట "ఆత్మ ననుమానప్రమాణముచే గ్రహింప వచ్చును" అని తమమతమును నిరూపించి యనంతరమున నాశాస్త్ర కర్త యగుకణాదుఁడు వేదాంతమతమును ఖండింప నుపక్రమించెను. మొట్టమొదట 106. "తస్మా దాగమికః. 3-౨-౮" అనుసూత్రముచే వేదముచేతమాత్రమే తెలిసికొనఁబడఁదగినవాఁ డని చెప్పఁబడుచున్న వేదాంత్యభిమతాత్మ ననువాదముచేసి పిదప 107. "సుఖదుఃఖజ్ఞాననిష్పత్త్యవిశేషాదైకాత్మ్యంసర్వశరీరాణామ్. 3-౨-౧౯." అనుసూత్రముచే నాయాత్మకు నద్వైతవాదులచేఁ జెప్పఁబడు నేకత్వమును కూడ నను వాదముచేసి 108. "నానాత్మానో వ్యవస్థాతః. 3-౨-౨౦." 109. "శాస్త్ర సామర్థ్యాచ్చ. 3-౨-౨౧" అనుసూత్రములచే నీపక్షమును ఖండించి యున్నాఁడు. దీనినిబట్టి చూచినను వ్యాసునిమత మద్వైతమే యని తేలుచున్నది కదా! "ఈసూత్రములకు నర్థమేదియో" యని సంశయింప నక్కఱ లేదు. పైసూత్రములకు వ్యాఖ్యాన మిట్లున్నది. 110. "ఏవం సమధిగత స్యాత్మనో నానాత్వైకత్వ సన్దేహే పూర్వపక్షమాహ: సుఖ

---

105. హ్రస్వపరిమండలప్రమాణములు గలవానినుండి మహద్దీర్ఘపరిమాణములు గలపదార్థములు జనించినట్లు......

106. కావున కేవల వేదమువలన మాత్రమే యాత్మ తెలియఁబడు ననుట యుక్తము కాదు.

107. 108. 109. (క్రింది 110-వ పేరా చూ.)

110. అవ. ఇట్లు నిర్ణయింపఁబడిన యాత్మ యొక్కఁడా? అనేకులా? అని సంశయము రాగా పూర్వపక్షమును చెప్పుచున్నాఁడు:—

, సూ. సుఖదుఃఖజ్ఞాననిష్పత్త్యవిశేషా దైకాత్మ్యం సర్వశరీరాణాం.

టీ. సర్వశరీరములయందు నాత్మ యొక్కఁడే. సుఖదుఃఖజ్ఞానాదు లన్ని చోట్లను కూడ నున్నవి. అవియు కదా యాత్మ కలఁ డనుటకు గుఱుతులు! ప్రతి

దుఃఖజ్ఞాననిష్పత్త్యవిశేషా దైకాత్మ్యం సర్వశరీరాణాం సర్వేషుశరీరే ష్వేకఏవాత్మా తల్లిఙ్గానాం సుఖదుఃఖజ్ఞానాదీనాం సర్వత్రావిశేషా దుక్తం సల్లిఙ్గావిశేషా ద్విశేషలింగాభావాచ్చైకో భావ ఇతి సిద్ధాన్త మాహ నానాత్మానోవ్యవస్థాతః ప్రతిశరీరం నానాత్మానః కుతః వ్యవస్థాతః వ్యవతిష్ఠన్తే హి జ్ఞానసుఖాదయః ప్రతిశరీరం నైకాధికరణ్యేనానుసన్ధీయన్తే ఐకాత్మ్యే త్వేకశరీరం ఇవానుసన్ధానప్రసఙ్గః హేత్వన్తరమాహ శాస్త్రసామర్థ్యాచ్చ శాస్త్రాణ్య ప్యేవం సమర్థితాని భవన్తి జ్ఞాజ్ఞౌ ద్వావజా వీశనీశౌ భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా ద్వా సుపర్ణా సయుజా సఖాయా య థాగ్నేః క్షుద్రా విస్ఫులిఙ్గా వ్యుచ్చరన్తి ఏవ మస్మా దాత్మనో

---

శరీరమునందు నివి యున్నవి. వీనిస్వరూప మంతట నొక్కటియే కదా! ఇంతకంటె విశేషము లగుగుఱుతులును లేవు. ఇట్లగుటచే వీనిచే నూహింపఁబడి ఆత్మయు నొక్కఁడే కావలయును.

అవ. సిద్ధాంతమును చెప్పుచున్నాఁడు:—

సూ. నానాత్మానో వ్యవస్థాతః.

టీక. ఇట్లు చెప్పఁగూడదు. ఆత్మ లనేకులే. సుఖదుఃఖములయొక్క స్వరూపము లేకములే యైనను వానిస్థితి భిన్నముగా నున్నది కదా! ఆత్మ యొక్కఁడేయైన నీసుఖదుఃఖాదు లొక్కశరీరమున నున్నట్లే సర్వశరీరములయందు నుండవలసి వచ్చును. ఇట్లు లేదుకదా! కావున నాత్మలు భిన్నులే.

అవ. ఈవిషయమున మఱియొక హేతువును చెప్పుచున్నాఁడు:—

సూ. శాస్త్రసామర్థ్యాచ్చ.

టీక. ఇట్లు సిద్ధాంతము చేసిననేకాని వేదము సమర్థితము కాదు. వేదమునందు "జ్ఞాజ్ఞౌ ద్వావజా విశనిశౌ" "జీవేశ్వరులు జన్మమృత్యువులు లేనివారు. జీవుఁడజ్ఞాని. ఈశ్వరుఁడు జ్ఞాని." "భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వాద్వా సుపర్ణాసయుజా సఖాయా (చూడు 20-21)" "య థాగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చరన్తి ఏవ మస్మా దాత్మనో వ్యుచ్చరన్తి" "అగ్నినుండి మిడుఁగుఱు లెట్లు వెలుపలికి వచ్చునో అట్లే పరమేశ్వరునుండి జీవులు వత్తురు." "ఏకో బహూనాం యో విదధాతి" "ఒకఁడయ్యు నీశ్వరుఁ డనేక లగుజీవులకు ఫలముల నొసంగుచున్నాఁడు" అను మొదలగువాక్యము లిట్లు సిద్ధాన్తము చేసిననే కాని సార్థకములు కానేరవు. ఏకత్వమును చెప్పుశాస్త్రములు కూడఁగలవు కదా యనిన నవి ఈశ్వరపరములు కావున నాత్మ లనేకులే.

వ్యవచ్ఛరన్తి ఏకో బహూనాం యోవిదధాతీత్యాదీని ఏకత్వశాస్త్రాణి త్వీశ్వర విషయాణి తస్మాత్ప్రతిశరీరం భిన్నా ఆత్మానః” ఈవ్యాఖ్యానముచే పైవిషయము స్పష్టముగనే తెలుపఁబడియున్నది కదా! కావున వైశేషికసూత్రముల ననుసరించి చూచినను వ్యాసమత మద్వైతమే యని నిర్వివాదముగఁ దేలుచున్నది.

ఇట్లే వేదాంతశాస్త్రమునందు 111. “తర్కాప్రతిష్ఠానాత్. ౨-౧-౧౧” అనునధికరణమున గౌతమమతము ఖండింపఁబడి యున్నట్లే ఆనైయాయికశాస్త్రమునందును వ్యాసమతము ఖండింపఁబడి యున్నది. అచ్చటఁ గూడ పైశాస్త్రములయందువలె కేవలాద్వైతమే యనువాదము చేయఁబడి యున్నది.

ఇట్లే 112. “ఏతేన యోగః ప్రత్యుక్తః. ౨-౧-3” అనునధికరణమునందు వ్యాసమహామునిచే పతంజలిమతము ఖండింపఁబడెను. అట్లే యోగశాస్త్రమునందును కేవలాద్వైత మనియే వ్యాసమత మనువాదముఁ జేయఁబడి ఖండింపఁబడియున్నది. భోజవృత్తియందు 113. “స్వరూపప్రతిష్ఠావాచితిశక్తిః” అనుసూత్రమునకు వ్యాఖ్యానముచేయుసందర్భమున 114. “యే తు వేదాన్తవాదిన శ్చిదానన్దమయత్వ మాత్మనో మోక్ష మ్మన్యన్తే తేషాం న యుక్తః పక్షః తథాహి ఆనందస్య సుఖరూపత్వా త్సుఖస్య చ సదైవ సంవేద్యతయైవ ప్రతిభాసా త్సంవేద్యమాన

---

111. (వ్యాసతా-పేజి 680 చూ.)

112. ఈసాంఖ్యసిద్ధాంత ఖండనముచే యోగసిద్ధాంతము కూడ ఖండింపఁబడినట్లయ్యెను.

113. స్వభావముగనే సచ్చిదానందస్వరూపుఁడగుపురుషుఁడు అట్టివాఁడేయైన పరమేశ్వరునితో కలియుట (అనఁగా సజాతీయములగుపక్షులొకదానిప్రక్కనొక్కటి యున్నట్లు కలిసియుండుట) ముక్తి.

114. ఆత్మ స్వభావముగానే జ్ఞానానందస్వరూపుఁడనియు నదియే (స్వస్వరూపస్థితియే) ముక్తి యనియు వేదాంతులు చెప్పుదురుగాని వారిమతము యుక్తియుక్తమైనది కాదు. ఏల యనిన: ఆనంద మనఁగా సుఖము. అది యెప్పుడును దృశ్య మయ్యే యున్నది. ద్రష్ట లేక దృశ్య ముండదు. కావున దృశ్యము నంగీకరించినవా రవశ్యము ద్రష్టము గూడ నంగీకరింపవలయును. ఇట్లైన రెండుపదార్థము లంగీకరింపఁబడుట వలన నద్వైతము భగ్న మగును.

త్వఙ్చ సంవేదనవ్యతిరేకే ణానుపపన్నమితి సంవేదనసంవేద్యయో రభ్యుపగమా దద్వైతహానిః" అని వేదాంతిమత మద్వైతముగానే యనువాదముఁ జేయఁబడి ఖండింపఁబడియుండుటచే నీవిషయమే స్పష్ట మగుచున్నది కదా! కావున పతంజలిమతము ననుసరించి చూచినను వ్యాసమత మద్వైతమే యని తేలుచున్నది.

మఱియు వేదాంతశాస్త్రమునందు 115. "ఫల మత ఉపపత్తేః. 3-2-38" అను నధికరణమున పూర్వమీమాంసామతము ఖండింపఁబడెను. ఇట్లే పూర్వమీమాంసాశాస్త్రమునందును అద్వైత మనియే వ్యాసమత మనువాదముచేసి ఖండింపఁబడెను. ఎట్లనిన: తర్కపాదమునందు వార్తికమునందు

116. "స్వయఞ్చ శుద్ధరూపత్వా దభావా చ్చాన్యవస్తునః, స్వప్నాదివ దవిద్యాయాః ప్రవృత్తి స్తస్య కిం కృతా."

117. "అన్యే నోపప్లవేఽభీష్టే ద్వైత వాదః ప్రసజ్యతే, స్వాభావికీ మవిద్యా న్తు నోచ్ఛేత్తుం కించి దర్హతి."

118. "విలక్షణోపపాతే హి నశ్యే త్స్వాభావికీ క్వచిత్, న త్వేకా త్మాభ్యుపాయానాం హేతు రస్తి విలక్షణః."

అను మొదలగువాక్యములచే మీమాంసావ్యాఖ్యాత యగుభట్టపాదాచార్యుఁ డద్వైతమునే యనువాదము చేసి ఖండించియున్నాఁడు. మఱియు శాస్త్రదీపికయందు పార్థసారథిమిశ్రులును తర్కపాదమునందు

---

115. కర్మఫలము బాగుగ విచారించినఁ బరమేశ్వరునుండియే కలుగు నని తోఁచుచున్నది.

116. పరమాత్మ స్వతస్సిద్ధుఁడు; ఆయనకంటె భిన్న మగుపదార్థము లేదు. ఇట్లుండ స్వప్నాదులవలె నాయన కవిద్య యెట్లు కలుగును?

117. మఱియొక్కఁడీయవిద్య నాయనకు కలిగించు ననినను, ఆయనకంటె భిన్నముగ నవిద్య కల దనినను కూడ ద్వైతవాదము వచ్చును. ఇట్లు గాక నాయవిద్య యాయనకు స్వభావమే యగునేని యది యప్పటికిని తొలంగదు.

118. అపూర్వ మగునొకానొకవిషయము సంభవించినప్పుడు మణిసంయోగము వలన నగ్నియొక్క దాహశక్తి నశించునట్లు స్వాభావిక మగునది కూడ నొక్కొకప్పుడు నశించుట కలదు కాని ఏకాత్మవాదులకు నట్టి యపూర్వవిషయమే లేదు కదా!

119. "స్యాన్మతం ఆ త్మైవైకో జగదాదావాసీత్. స ఏవ స్వేచ్ఛయా వ్యోమాదిప్రపంచరూపేణ పరిణమతే బీజ మివ వృక్షరూపేణ చిదేకరసం కథం జడరూపేణ పరిణమత ఇతిచే న్న పరమార్థతః పరిణామం బ్రూమః కి న్త్వపరిణత మేవ పరిణత వ దేకమేవ స దనేకధా ముఖ మివాదర్శేష్వ విద్యావశా ద్వివర్తమాన మాత్మే వా నాత్మ న శ్చిద్రూప మచిద్రూప మివాద్వితీయం స ద్వితీయ మివ పశ్యతి సేయ మవిద్యోపాదానా స్వప్న ప్రపఞ్చవన్మహదాది ప్రపఞ్చసృష్టిః తథా చ సర్వం ఖల్విదం బ్రహ్మ ఆత్మా వేదం సర్వం నేహ నా నాస్తి కిఞ్చన ఇత్యాదయో బహవో ఒద్వైత వాదాః తథా ఇన్ద్రో మాయాభిః పురురూప ఈయ్యత ఇతి భేదావగతే ర్వ్యక్తమేవ మాయానిబన్ధనత్వం దర్శితం తథా లోకా న్తం పరాదుర్యోఒన్య

---

119. వారిమత మేమి యనిన:—ప్రపంచసృష్టికి బూర్వము న నాత్మ యొక్కఁడే యుండెను. అతఁడు స్వయముగనే ఆకాశాది ప్రపంచరూపముతో పరిణ మించెను. బీజము వృక్ష మయిన ట్లాయనయే ప్రపంచ మగును. జ్ఞానరూప మగు నాత్మ జడరూప మగు ప్రపంచముగా మారుట యె ట్లనిన మేము (వేదాన్తులము) ఆయనకు పరమార్థపరిణామమును చెప్పుట లేదు. పరిణమింపకయే పరిణమించినట్లు ఏకస్వరూపుఁడయ్యు యనేకవిధములుగా నున్నట్లు అద్దములయందు ప్రతిబింబించిన ముఖమువలె గానవచ్చుచున్నాఁడు. తన్ను తానే చూచుకొనుచున్నాఁడు. అవిద్యావశ మున వివర్తము నొందుచు నాత్మస్వరూపము ననాత్మస్వరూపమునుగాను చేతన స్వరూపమును జడముగాను అద్వితీయస్వరూపమును సద్వితీయ స్వరూపమునుగాను గ్రహించుచున్నాఁడు. ఈ యవిద్యయే ప్రపంచమున కుపాదానకారణము. విచా రించిన పరమార్థస్థితిలో సృష్టియే లేదు. ఇట్లు చెప్పుటవలన "ఇది యంతయు బ్రహ్మమే. ఇది యంతయు నాత్మయే. ఇచ్చట ననేక మనునదియే లేదు." అను మొదలగు నద్వైతవాదములు సమర్థింపఁబడిన ట్లగును. మఱియు "పరమేశ్వ రుఁడు మాయచే ననేకరూపములతో నున్నట్లు తోఁచుచున్నాఁడు." అను శ్రుతిభేద మంతయు భ్రాంతిసిద్ధమై స్పష్టముగనే చెప్పుచున్నది. "ఎవ్వఁడు లోకముల నాత్మ భిన్నములనుగా చూచునో వాని నాలోకములు ముక్తికి దూరస్థునిఁ జేయును. ఎవ్వఁడు అనేకపదార్థము లున్నట్లు చూచునో వాఁడు మరణమునుండి మరణమును బొందును." అను మొదలగువాక్యములు భేదదర్శనమును నిందించుచున్నవి. ఈశ్రుతి సందర్భ మంతయు విమర్శింపఁబడు నేని "సర్వము బ్రహ్మమే భేదదర్శన మనర్థకరము. సృష్టికి నజ్ఞానమే కారణము." అనువిషయమే స్పష్టమగును కదా!

త్రాత్మనో లోకా న్వేదే త్యాదినా అనాత్మదర్శననిన్దా మృత్యోస్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్య తీతి చ నానాత్వదర్శననిన్దా సర్వ మిద మద్వితీయం బ్రహ్మాపరం అనర్థకర భేదదృష్టిః సృష్టి శ్చా విద్యోపాదానే త్యేత మర్థం ప్రకటయతి" అని కేవలాద్వైతమె యనువాదము చేయఁబడియున్నది.

మఱియు వ్యాకరణశాస్త్రమునందును తద్వ్యాఖ్యాత యగు భర్తృహరి:

120. శ్లో. "యత్ర ద్రష్టా చ దృశ్యఞ్చ దర్శన ఞ్చాపి కల్పితమ్,
త స్యై వార్థస్య సత్యత్వ మహు స్త్రయ్యన్తవేదనః."

అని వేదాంతమతము నద్వైతముగానే చెప్పియున్నాఁడు.

మఱియు వేదాంతశాస్త్రమునందు "121. పత్యు రసామఞ్జస్యాత్. ౨-౨-3౭" అనునధికరణమున శైవమతమును నిరాకరింపఁబడియున్నది. ఇట్లే శైవాగమమునందును శివునిచే వ్యాసమత మద్వైతమె యని నిరాకరింపఁబడి యున్నది. ఎట్లనిన:—

మృగేంద్రసంహితయందు జ్ఞానపాదమున చతుర్థపటలమునందు,

భరద్వాజ ఉవాచ:—

122. ౧. "వేదాన్తసాఙ్ఖ్యసదసత్వార్హికమతాదిషు.
ససాధనా ముక్తి రస్తి కో విశేష శ్శివాగమే."

శక్ర ఉవాచ:—

123. ౨. "ప్రణేత్రసర్వదర్శిత్వా న్న స్ఫుటో వస్తుసఙ్గ్రహః,
ఉపాయా స్సఫలా స్తద్వ చ్ఛైవే సర్వ మిదం పరమ్.

124. 3. వేదాన్తే ష్వేక ఏ వాత్మా చిదచిద్వ్యక్తిలక్షితః,
ఆత్మై వేదం జగ త్సర్వం నేహ నా నాస్తి కిఞ్చన.

---

120. ద్రష్టయు దృశ్యంబును దర్శనంబు నెచ్చట కల్పింపఁబడెనో ఆపదార్థమే సత్య మని వేదాంతులు చెప్పుదురు.

121. శైవమతము యుక్తమయినది కాదు. అందు పెక్కుదోషములు కలవు.

122-123-124-125-126-127. వీనియర్థము గ్రంథమునందే వివరింపఁబడి యున్నది.

125. ౪. ప్రతిజ్ఞామాత్ర మే వేదం నిశ్చయః కిం నిబంధనః,
అథ ప్రమాణం తత్రాత్మా ప్రమేయత్వం ప్రపద్యతే.
126. ౫. యత్రైత దుభయం తత్ర చతుష్టయ మపి స్థితమ్,
అద్వైతహాని రేవం స్యా న్నిష్ప్రమాణకథాన్యథా.
127. ౬. భోగసామ్యవిమోక్షౌ చ యా నేష్టా వాత్మవాదిభిః,
నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః."

అను మొదలగుశ్లోకములచే వర్ణింపఁబడిన ఇంద్రభారద్వాజసంవాదమువలన నీవిషయము స్పష్ట మగుచున్నది. "వేదాంతసాంఖ్యాదిమతములలో నన్నిటియందును ముక్తియు తత్సాధనములును కూడ నుండ నీశైవాగమమున నున్నయాధిక్య మేమి?" అని భరద్వాజుఁడు ప్రశ్నింపగా నాప్రశ్నమునకు నింద్రుఁడు సమాధానము చెప్పుచు సామాన్యముగ సర్వమతముల దూషించి మొట్టమొదట వేదాంతమతమునే సవిశేషముగ దూషించి యున్నాఁడు. "శైవాగమము నొసఁగినశివుఁడు సర్వజ్ఞుఁడు. తక్కినవ్యాసాదిమును లట్టివారు కారు. కావున సామాన్యముగఁ జూచిన నితరమతము లేవియు ప్రమాణములు కానేరవు. ప్రత్యేకముగ వివరింపఁబోయినచో వేదాంతమతస్థులు ఆత్మభిన్న మగుపదార్థము నంగీకరింపరు. ఇట్లున్న నిది కేవలప్రతిజ్ఞమాత్రమె యగునుకాని సిద్ధాంతము కానేరదు. ఇదియె సిద్ధాంత మైనచో నీవిషయమున వేదాంతశాస్త్రము ప్రమాణ మగునా? కాదా? మొదటిపక్షమున నాత్మ ప్రమేయుఁడు కావలసివచ్చును. ప్రమాణప్రమేయములు రెండు నుండినచోఁ బ్రమాతయుఁ బ్రమితియుఁ గూడ నుండవలసివచ్చును. ఇట్లు నాల్గుపదార్థము లుండవలసివచ్చిన నద్వైతమునకు భంగము వచ్చునుకదా! ఇఁక రెండవపక్షము నాశ్రయించిన నావాదమువలనఁ బ్రయోజనమె యుండదు. మఱియు నాత్మయొక్కఁ డయినచో ప్రపంచమున కంతయును భోగ మొక్కరీతిగ నుండవలసివచ్చును. మోక్షముకూడ నొక్కమాఱే కలుగవలసివచ్చును. లేకయైన పోవలసివచ్చును. ఏకరూపునియందు కర్మభేదము కూడ సంభవింపదు కదా" అని నిరూపించి యున్నాఁడు. ఇట్లే ఆ మృగేంద్రసంహితకు వృత్తి నాచరించిన భట్టనారాయణశ్రీకర్ణాచార్యులచేతను ఆవృత్తికి వ్యాఖ్యానమును రచించిన అఘోరశివాచార్యులచేతను ఈవిషయము ప్రకటింపఁబడి యున్నది. వారివ్యాఖ్యానము లపరిమితములుగ నుండుటచే

గుణుతునకై కొంతమాత్రమే యీగ్రంథమున ప్రకటించుచున్నాను.
128. "వేదాన్తే ష్వేక ఏవేతి తథా ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా ఏకం విశ్వం బహుధా యః కరోతీత్యాదిశ్రుతిభిః పరమాత్మైవ సకలచిదచిద్భావావిర్భావతిరోభావ ప్రకృతిభూతపరిపూర్ణషాడ్గుణ్యవైభవస్వతన్త్ర ఏకోఽపి న స్సంస్పృ (హా) త్యర్థం తత్తద్వివిధమనోలక్షణోపాధిభేద స్వభావాన్తరానువిధాయీ యథావదవగతోఽభ్యుదయాయ భవతీతి వేదాన్తం తస్యైవ తథా తథా వైచిత్ర్యేణావస్థితే స్సత్యత్వాత్ ద్వైతప్రతిభాసస్య ద్విచన్ద్రాదిజ్ఞానవద్భ్రాన్తత్వాత్ తథా చాహ తత్ర భగవాన్ (భర్తృ) హరిః 'యథా విశుద్ధ మాకాశం తిమిరోపప్లుతో జనః, సఙ్కీర్ణ మివ మాత్రాభి శ్చిత్రాభి రభిమన్యతే. తథేద మమృతం బ్రహ్మ నిర్వికార మవి

---

128. "వేదాన్తే ష్వేక ఏవ" అనుశ్లోకమునకు వ్యాఖ్యానము చేయుచున్నాము. "పరమేశ్వరుఁ డొక్కఁడే సర్వభూతములయందు నంతర్యామిస్వరూపముతో నున్నాఁడు. అతఁడే ప్రపంచము ననేకవిధములుగా నొనర్చుచున్నాఁడు." అను మొదలగుశ్రుతుల ననుసరించి చూచిన ప్రపంచమునఁ గానవచ్చు సర్వభేదములకు నుత్పత్తి వినాశములకు నాదికారణభూతుఁడై స్వతంత్రుఁడై యున్నపరమేశ్వరుఁడే యొక్కఁడం డయ్యు శుద్ధుఁడయ్యు నాయామనస్సుల ననుసరించుచు సంసారము నొంది జీవుఁ డని వర్ణింపఁబడుచున్నాఁడు. ఇతనిస్వరూపము యథార్థముగఁ దెలిసికొనఁబడునేని ముక్తి కలుగును. సర్వస్వరూపములతో నాపరమేశ్వరుఁడే యుండుటవలనను భేదవృష్టి రజ్జుసర్పజ్ఞానమువలె మిథ్యయే యగుటవలనను ఇదియే సిద్ధాంత మని వేదాన్తులు చెప్పుదురు. "తిమిరరోగము కలవాఁడు నిర్మల మగునాకాశమును నానావర్ణములతోఁగూడిన దానినిగా తలంచునట్లు అమృతస్వరూపుఁడై నిర్వికారుఁడై యున్నపరమేశ్వరుని గూడ నవిద్యావశమున కాలుష్యమును జెందినవానినిగా దలంచుచున్నారు; భిన్నునిగా భావించుచున్నారు." అని భర్తృహరి యీవిషయమునే వివరించియున్నాఁడు. ఈకారణమువలన వేదాంతిమతమున నాత్మ యొక్కఁడే. మనస్సులతో నాతనికి సంబంధము కల దనియు దానివలన స్వభావముగ నిర్వికారుఁడే యయ్యును జలములయందు ప్రతిబింబించిన సూర్యునికివలె నాయనకు వికారములు కలిగినట్లుండు ననియుఁ వారు చెప్పుదురు. "సూర్యుఁ డొక్కఁడయ్యు జలములలో ప్రతిబింబించి యనేకులుగా దోఁచునట్లు పరమేశ్వరుఁడును దేహములలోనుండి యనేకులుగాఁ దోఁచుచున్నాఁడు." అని చెప్పుశ్రుతినిఁగూడ నీవిషయమునఁ బ్రమాణముగ నుదహరించుచున్నాఁడు. ఈపక్షము సరిపడదు.

ద్వయాహ, కలుషత్వ మి వాపన్న మ్భేదరూపే ప్రవర్తతే' ఇతి ఏవం చా
భిన్న మే వేదం పరం బ్రహ్మ పరమాత్మలక్షణం మనసా హి సంసార
ధర్మై స్సుఖదుఃఖాదిభి ర్యోగః పరమాత్మా తు సూర్య ఇ వామ్భః ప్రతి
బిమ్బ భేదై రుపాధిభి రభి న్నోపి భిన్న ఇవ ప్రతిభాతి యథా హ్యయం
జ్యోతి రాత్మా వివస్వా నపోభిన్నా బహుధైకోమగచ్ఛన్ ఉపాధినా
క్రియతే భేదరూపో దేవః క్షేత్రే ష్వేవమ జోయ మాత్మా త దేత
న్నోపపద్యతే" అని భట్టనారాయణశ్రీకణ్ఠాచార్యవృత్తియందును 129.
"అథాన్యదర్శనాస్ఫుటత్వప్రకాశనాయ ప్రథమం వేదాన్తవాదిమత స్యా
స్ఫుటత్వం సూచయిత్వా దర్శయితుం వేదాన్తేష్విత్యాదిశ్లోకార్ధేన తన్మత
ముపన్యస్యతే త దేవ దర్శయ త్యాత్మై వేద మిత్యాది అవిద్యానుబన్ధ
తోఽ సత్యరూప ఏవ పశు మృగాద్యనన్తశరీర భేదేన బహు ప్రకారోర్థో
జీవాత్మభి ర్దృశ్యతే స్వప్న ఇవ స్వప్నే హ్యనన్త పురుష ప్రకాశాది
ప్రకారో దృశ్యతే తతశ్చ ద్విచన్ద్రప్రతిభాసవ ద్దైతప్రతిభాసో ప్యసత్య
ఇత్యేక ఏవాత్మా శ్రుతితో యుక్తిత శ్చ సిద్ధః" అని యావృత్తికిఁ జేయఁ
బడిన యఘోరశివాచార్యుని వ్యాఖ్యానమునందు నున్నది. ఇట్లగుటచే
కేవలాద్వైతమె వేదాంతశాస్త్రమునకు తాత్పర్యమని తేలుచున్నది. అంద
ఱును వేదాంతమత మనుపేరుతోనే కదా పైయద్వైతము ననువాదముఁ
జేసియున్నారు.

---

129. ఇఁక నన్యమతములయందు కలదోషములను నిరూపింప నుపక్రమించి మొట్టమొదట వేదాన్తిమతమునందలి దోషముల సూచించి ఖండించుటకై "వేదాన్తేషు" అనునర్థశ్లోకమున వారిమతము ఉపన్యసింపఁబడెను. "అత్మైవేదం" అను తక్కిన యర్థశ్లోకమున నదియే వివరింపఁబడినది. వస్తు వొక్కటియే యైనను అవిద్యాసంబంధమువలన పశుపక్షిమృగాదినానాభేదములతో జీవులు దానిని చూచుచున్నారు. స్వప్నమునందు ఆత్మభిన్నము లగుపదార్థము లేవియు లేకున్నను తనకంటె భిన్నములుగ ననేకములఁ జూచునట్లు సంసారదశయందును జూచుచున్నారు. కావున నిరువురు చంద్రులు కల రనుట యెట్లసత్యమో ప్రపంచము కల దనుటయు నట్లే యసత్యము. ఈకారణమువలన నాత్మ యొక్కఁడే యనుట యుక్తులవలన సిద్ధించునది. శ్రుతులుగూడ నీవిషయమున ననేకములు గలవు. కావున నాత్మ యొక్కఁడే యనుట సిద్ధాన్త మయినది.

ఇట్లే అగస్త్యమహాముని ప్రణీత శివరహస్యమునందు మూఁడవ యంశమున ముప్పదియాఱవ యధ్యాయమునందు.

130. "న తే గౌతమాకాశనిత్యత్వవాదో
మతో వేదవేదాన్తతత్త్వజ్ఞమూర్తే,
న తే జైమినేశ్శబ్దనిత్యత్వవాదో
న మిథ్యాల్పవాదోపి వేదాన్తినాం తే.

131. న బన్ధోపి మోక్షోపి వేదాన్తశాస్త్రే
తథా దృష్టిసృష్టిప్రవాదోపి దృష్టః,
అవిద్యావిలాసో న కో పీహ కల్పో
విలాసై ర్యత స్తే జగజ్జాల మాసీత్.

132. న చానన్తవేదాన్తవార్తావిచారే
హ రారాధకారాధ్యభావాభిమానః,
న చేన్నాధునా కర్మమార్గో వినష్ట
శ్శివారాధనామార్గవార్తా కుతస్స్యాత్."

అని గౌతమమునియభిప్రాయ మగునాకాశ సత్యత్వవాదంబును జైమిని మునియభిప్రాయ మగు శబ్దనిత్యత్వవాదంబును వేదాంత్యభిప్రాయ యగు జగన్మిథ్యాత్వవాదంబును బంధమోక్షవ్యవస్థాభావవాదంబును దృష్టసృష్టివాదంబును యవాదపూర్వకముగా ఖండింపఁబడియున్నది. ఇందు ఆరంభమున గౌతమజైమినిమునులఁ బేర్కొనియుండుటచే వేదాంతశబ్దము చేత వేదాంతసూత్రకర్త యగువ్యాసునే పేర్కొని యున్నట్లు తోఁచు

---

130. ఓ వేదవేదాన్త తత్త్వవేత్త! నీకు గౌతముఁడు చేయు నాకాశ సత్యత్వ వాదము సమ్మతముకాదు. జైమినిమహాముని శబ్దము నిత్యమని చేయువాదంబును వేదాంతులు ప్రపంచము మిథ్య యనియు,

131. బంధమోక్షములు పరమార్థస్థితిలో లేవనియు దృష్టిచేత మాత్రమే సృష్టి కల్పింపఁబడెననియుఁ జేయువాదము నీకు సమ్మతము కాదు. నీవిలాసములచేతనే సర్వప్రపంచము కల్పింపఁబడియుండ నవిద్య నేల కల్పింపవలయును?

132. మఱియు వేదాన్తమతమును విచారించిన నో పరమేశ్వరా! పూజ్యపూజక భావమే కుదురదు. వారు యీవిషయమును కుదుర్చుటకై యెంతనో ప్రయాసపడుచున్నారు కాని ప్రయోజనము లేదు. భేద మనునదియే లేకపోవుటచే మొట్టమొదట కర్మయే నశించెను. ఇఁక మానసకర్మరూప మగునారాధన నెట్లు సిద్ధించును?

చున్నది. కావున నిచ్చట వేదాంతమతముగా ననువాదముఁ జేయఁబడి యున్న కేవలాద్వైతము వ్యాసమతమే యనుట సిద్ధాంత మగుచున్నది. మఱియు వేదాంతశాస్త్రమునందు

133. "ఉత్పత్త్యసమ్భవాత్. ౨-౨-౪౨.
134. సముదాయ ఉభయహేతుకేపి తదప్రాప్తిః. ౨-౨-౧౮.
135. నైకస్మిన్నసమ్భవాత్. ౨-౨-33.
136. ఏకఆత్మనశ్శరీరే భావాత్. 3-3-౫3"

అను నాలుగుఅధికరణములయందు వ్యాసమునిచేఁ గ్రమముగ పాంచరాత్రబౌద్ధార్హతచార్వాకమతములు ఖండింపఁబడెను. ఇట్లె యీపాఞ్చరాత్రాదితంత్రములయందును వ్యాసమతము కేవలాద్వైతమనియె యనువాదముచేసి ఖండింపఁబడె నని తెలుసుకొనవలయును. గ్రంథవిస్తరభీతిచే వాని నిట నుదహరింపలేదు. పైనవర్ణించినవిధముగ నాయాతంత్రములయం దద్వైతము ననువాదముఁ జేసియున్న చోట్ల నాయద్వైతము వేదాంతశాస్త్రాభిమతమని స్పష్టముగనే ప్రతిపాదింపఁబడి యుండుటచే "వేదాంతమతమనఁగా నద్వైతమతమె" యని స్పష్టమయినది. ఇట్లగుట చేత వేదాంతసూత్రకర్త వ్యాసుఁడే యగుటచే నాయనమత మద్వైతమె యని తేలినది. కావున సర్వవాదిసమ్మతు లగుకపిలాదు లందఱు నేకవాక్యముగ వ్యాసతాత్పర్యము నద్వైతమనియె యనువాదము చేసియుండుట వలన వ్యాసతాత్పర్య మద్వైత మనుటలో నెవ్వనికిగూడ వివాద ముండ దని విశ్వసించుచున్నాను. ప్రతివాదుల వాదము లెవ్వియైనను యీ సిద్ధాంతమును నిరాకరింపఁజాలవని నొక్కి చెప్పగలను. ఈవిధముగ నుపనిషత్తువాక్యములయర్థమును విమర్శించుటకై యేర్పడిన బ్రహ్మసూత్రము

133. జీవుఁడు పరమేశ్వరునుండి జనించు ననుట సంభవింపదు.

134. పరమాణువులవలన కలుగునని చెప్పఁబడు పృథివ్యాదిసముదాయములు కాని స్కంధములవలన కలుగునని చెప్పఁబడు నాంతరసముదాయములు కాని కలుగుటకు వీలులేదు.

135. ఒక్కనియందు విరుద్ధధర్మము లుండు ననుట సంభవింపదు.

136. శరీర మున్నప్పుడే సుఖాదు లుండుటవలనను లేనప్పుడు లేకపోవుటవలనను శరీరమే యాత్మ యని కొందఱు చెప్పుదురు.

లకు నద్వైతమే తాత్పర్యమైనయెడల శ్రుతులకుకూడ నదియె తాత్పర్య మనుట నిర్వివాదాంశము.

ఇట్లగుటచేతనే సూతసంహితయందు యజ్ఞవైభవఖండమున

137. "ఏక మే వాద్వితీయం స్యా దిత్యాహ శ్రుతి రాదరాత్,
మాయామాత్ర మిదం ద్వైత మితి చా హాపరా శ్రుతిః.

138. ఏకత్వ మ్పశ్యతో మోహా శ్శోకః క ఇతి చాహ హి,
ద్వితీయా ద్వై భయం నాల్పే సుఖ మి త్యపి చాహ హి.

139. అత స్తర్క ప్రమాణాభ్యాం వ స్త్వేకత్వం సునిశ్చితం,
విదుషా మనుభూత్యా చ వ స్త్వేకత్వం సునిశ్చితం,

140. వ స్త్వేకత్వం మహావాక్యా దేవ జాన న్తి యే ద్విజాః,
తే ముచ్య న్తే హిసంసారా ద్యథా స్వప్నా త్ప్రబోధతః.

141. భేదదర్శన మాస్థాయ ము క్తిం వాఞ్ఛ న్తి యే నరాః,
తే మహాఘోరసంసారే పత న్త్యేవ న సంశయః."

అనిజెప్పఁబడియున్నది. మఱియు నచ్చటనే మఱియొకచోట ముప్పది తొమ్మిదవయధ్యాయమునందు

---

137. "ఒక్కండే రెండవది లేదు." అని యాదరముతో శ్రుతి చెప్పుచున్నది. "ఈ భేదమంతయు మాయయే" అని మఱియొక శ్రుతి చెప్పుచున్నది.

138. "తత్ర కో మోహః క శోక ఏకత్వ మనుపశ్యతః" అనునది శ్రుతి స్వరూపము. "సర్వము నేకముగాఁ జూచువానికి శోకమోహము లెక్కడివి" అనియు శ్రుతి కలదు. "రెండవది యుండిన భయము కలుగును. అల్పమునందు సుఖము లేదు." అనియుఁ జెప్పుచున్నది.

139. ఈ కారణమువలన యుక్తులతోడను శ్రుతులతోడను విద్వదనుభవము తోడను వస్తు వొక్కటియే యనుట నిర్ణయింపఁబడెను.

140. ఈవిధముగ మహావాక్యార్థజ్ఞానమువలన నెవ్వరు పదార్థైక్యము నెఱుంగుదురో యట్టివారు కలనుండి మేల్కొంచినట్లు సంసారమునుండి ముక్తు లగుదురు.

141. ఇట్లుగాక భేదదృష్టిని విడువక నెవ్వరు ముక్తి నొందదలంతురో వారు సంసారముననే చెందుదురు.

142. అథాతః సమ్ప్రవక్ష్యామి సమాసేన న విస్తరాత్,
అవిరోధం తు వేదానా మశేషాణాం మునీశ్వరాః.

143. ద్వివిధో వేదరాశి స్తు మునయ స్సంశితవ్రతాః,
సత్యాద్వైతపరః కశ్చి ద్వేదమార్గ స్సమానతః.

144. కల్పితద్వైతనిష్ఠ స్తు వేదభాగోఽపరో ద్విజాః,
సత్య మేవ స దాఽద్వైత మసత్యంద్వైత మాస్తికాః.

145. ప్రత్యక్షాదే రగమ్యత్వా దద్వైతస్య తు సర్వదా,
తత్రైవార్థవతీ సాక్షా దద్వైతశ్రుతి రాస్తికాః.

146. అన్తరేణ శ్రుతి ర్భేదో లోకసిద్ధ స్స దైవ హి,
తేన నార్థవతీ తత్ర శ్రుతి ర్మానాతిగామినీ"

అని చెప్పఁబడియున్నది. అచ్చటనే బ్రహ్మగీతయందు ఐదవయధ్యాయమున

147. త్వంశబ్దార్థో య ఆభాతి సోఽహం శబ్దార్థ ఏవ హి,
యోఽహంశబ్దార్థ ఆభాతి స త్వంశబ్దార్థ ఏవహి.

---

142. ఓఋషులారా ! సర్వవేదములకును పరస్పరవిరోధము లేదను విషయమును సంక్షేపముగాఁ జెప్పెదను.

143, 144. ఓమునులారా ! వ్రతనిష్ఠులారా ! వేదము రెండువిధములుగానున్నది. అందు కొంతభాగము పారమార్థిక మగున భేదమును జెప్పుచున్నది. మఱికొంతభాగము కల్పిత మగు భేదము ననువాదముఁ జేయుచున్నది. అద్వైతమే సత్యము ద్వైత మసత్యము.

145. అభేదము ప్రత్యక్షాదులకు గోచరమగునది కాదు కావున శాస్త్రమునకు దానిని బోధించుటవలన మాత్రమే సార్థకత్వము కలుగును. కాని మఱియొకవిధముగా కాదు. తెలియఁబడనిదానిని కదా శాస్త్రము చెప్పవలయును.

146. ఇఁక భేదమన్ననో లోకసిద్ధమై శ్రుతిచేఁ జెప్పఁబడినను చెప్పఁబడకున్నను గూడ తెలియవచ్చుచున్నది. కావున దానినిఁ జెప్పుటవలన శాస్త్రము సార్థకము కానేరదు. ప్రత్యక్షాదిసిద్ధ మగుదానినే శబ్దము కూడఁ జెప్పిన నది యనువాదమే యగును కాని విషయనిరూపణము కానేరదు. ఇట్టైన శబ్దము ప్రమాణమే కాకపోవలయును కదా !

147. నీవు అనుపదమునకు నర్థమేదియో నేను అనుపదమునకుఁగూడ నర్థమదియే; నేను అనుపదమునకు నర్థమేదియో నీవు అనుపదమునకుఁగూడ నర్థ మదియే.

148. త్వమహంశబ్దలక్ష్యార్థ స్సాక్షీ త్వప్రత్యక్చితి స్సురాః,
తచ్ఛబ్ద స్యైవ లక్ష్యార్థ స్యైవ నాత్రవిచారణా.

149. త్వమహంశబ్దవాచ్యార్థ స్యైవ దేహాదివస్తునః,
న తచ్ఛబ్దార్థతాం వక్తి శ్రుతి స్తత్త్వ మసీతి యా.

150. తదర్థైక్యవిరుద్ధార్థ స్త్యక్త్వా వాచ్యగతం శ్రుతిః,
అవిరుద్ధం చిదాకారం లక్షయిత్వా బ్రవీతిహి.

151. తదర్థే చ త్వ మర్థైక్యవిరుద్ధాంశం ని నై వ తు,
కారణత్వాది వాచ్యస్థం లక్షయిత్వా తు కేవలం.

152. చిదాకారం పున స్తస్య త్వమర్థైక్యం బ్రవీతి చ,
తత్వంశబ్దార్థభూతస్య చిన్మాత్రస్య పరాత్మనః.

153. ఏకత్వం య త్స్వత స్సిద్ధం స హి వాక్యార్థ ఆస్తికాః,
ఇతోఽన్యథా యో వాక్యార్థస్సో వాక్యార్థో న సంశయః.

అని చెప్పఁబడి యున్నది. మఱియు నందే పండ్రెండవయధ్యాయమునందు

---

148. ఓ దేవతలారా! త్వమహంశబ్దములకు లక్ష్యార్థ మైన ప్రత్యక్చైతన్య మేది గలదో అదియే తచ్ఛబ్దమునకుఁగూడ లక్ష్యార్థము. ఇందు సంశయ మక్కఱలేదు.

149. తత్త్వమసి యనుశ్రుతి త్వమహంశబ్దవాచ్యార్థ మగు దేహాదులకు దచ్ఛబ్దార్థముతో నైక్యముఁ జెప్పదు.

150. ఆశ్రుతి పరస్పరైక్యము నొందుటకు వీలుగాని విరుద్ధాంశములను వదలి విరోధములేని చిదాకారమును లక్షించి చెప్పుచున్నది.

151. తచ్ఛబ్దార్థములో త్వంశబ్దార్థముతో నైక్యము నొందుటకు వీలులేని సర్వజ్ఞత్వాదుల వదలి కేవల శుద్ధరూపమును లక్షణావృత్తిచే గ్రహించి,

152. ఆతని చిదాకారమునకును త్వం శబ్దార్థమగుజీవుని చిదాకారమునకును ఐక్యము చెప్పుచున్నది. ఇట్లె త్వంశబ్దార్థమునందును విరుద్ధము లగుకించిద్జ్ఞత్వాదుల విడిచి శుద్ధమగుచిదాకారమునకును పరమేశ్వరునకు నైక్యముఁ జెప్పుచున్నది. కావున తత్త్వశబ్దమునకు నర్థమై జ్ఞానమాత్రరూపుఁడై యున్న యాత్మకు,

153. స్వాభావికమగు నేకత్వ మేది కలదో అదియే వాక్యార్థము. ఓ ఆస్తికు లారా! ఇంతకంటె వేరుగా వాక్యార్థమును జెప్పిన నది వాక్యార్థమే కాదు. నిస్సంశయము.

154. "వేదానా మన్యథైవార్థం యే వదన్తి విమోహితాః,
మహాసాహసికా ఏవ నేతరే హి న సంశయః.
155. మదుక్తార్థప్రకారేణ వినా యే ప్రవదన్తి తే,
అన్ధకూపే నిరాలమ్బే పతన్త్యేవ నసంశయః.
156. వేదార్థ పరమాద్వైతం నేతర త్సురపుఙ్గవాః,
న చే ద త్రైవ మే మూర్ధా పతిష్యతి న సంశయః.
157. అన్యథా వేదవాక్యానా మర్థ ఇ త్యతిశఙ్కయా,
అనిశ్చితార్థా శ్చేన్మూర్ధా యుష్మాక శ్చ పతిష్యతి.
158. ఇతః పరం న వక్తవ్యం విద్య తే సురపుఙ్గవాః,
సత్య మేవ మయాప్రోక్తం శంభోః పాదం స్పృశా మ్యహం"
అనియుఁ జెప్పఁబడి యున్నది.

ఈ కారణమువలన భగవద్గీతలయొక్క యభిప్రాయముకూడ నద్వైతమె యని యంగీకరింపవలయును. అందు పదమూఁడవయధ్యాయమున

159. "క్షేత్రజ్ఞ ఞ్చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత,
క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం య త్త ద్జ్ఞానం మతం మమ.

---

154. వేదములకు మఱియొకవిధముగ నెవ్వ రర్థము చెప్పుదురో వారు మహాసాహసికులుగాని సామాన్యులు గారు.

155. నేను (చతుర్ముఖబ్రహ్మ) చెప్పినట్లుగాక మఱియొకవిధముగ నెవ్వరు వేదార్థమును చెప్పుదురో వారు నిరాధార మగు పాడుబావియందు పడినవారే యగుదురు. సంశయము లేదు.

156. ఓదేవతలారా! వేదార్థము కేవలాద్వైతమేకాని రెండవది కాదు. అట్లుగునేని యాక్షణముననే నాతల నేలపైఁ బడును.

157. వేదములకు మఱియొకయర్థము కలదేమొ యను శంకచే నర్థనిర్ణయమును గావింపకుందురేని మీశిరస్సుకూడ నేలపైఁబడును.

158. ఓదేవతాశ్రేష్ఠులారా! ఇంతకంటె చెప్పవలసినది యేమియు లేదు. నేను ఇప్పుడు సర్వమును యథార్థమునే చెప్పితిని. శివునిపాద మాన.

159. ఓయర్జునా! సర్వక్షేత్రములయందును క్షేత్రజ్ఞుని నన్నుగా నెఱుంగుము. క్షేత్రక్షేత్రజ్ఞులను విభాగించి యెఱుంగుటయే నామతమున జ్ఞానము.

160. తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్,
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు.

161. ఋషిభి ర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్.
బ్రహ్మసూత్రపదై శ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః”

అని చెప్పఁబడియున్నది కదా! ఈవాక్యములను పట్టిచూచిన నిందు జెప్పఁబడినవిషయమె బ్రహ్మసూత్రములయందును చెప్పఁబడె నని తేలుచున్నది. బ్రహ్మసూత్రతాత్పర్య మద్వైతమెయని నిర్ణయించితిమి. ఇట్లగుటచే భగవద్గీతతాత్పర్యము కూడ నిర్వివాదముగ నద్వైతమె కావలయును.

ఇట్లగుటచేతనే పాంచరాత్రాగమమున పద్మసంహితయందు

162. “పరక్షేత్రజ్ఞయో రైక్య మాత్మనో శ్శ్రుతిచోదితం,
క్షేత్రజ్ఞస్య బహుత్వం హి దేహభేదా త్ప్రతీయతే.

163. ఏక స్యైవ తు బింబస్య దర్పణేషు యథా భిదా,
భూతపఞ్చకసఙ్ఘాతం క్షేత్రం తత్ర వ్యవస్థితమ్.

164. జీవో య స్తం విదుః ప్రాజ్ఞాః క్షేత్రజ్ఞం పరసన్మితమ్.”

అను మొదలగుశ్లోకములచే జీవాత్మపరమాత్మలకు భిన్నభేదము వర్ణింపఁబడియున్నది.

---

160. ఆక్షేత్ర మేదియో యెట్టిదియో యేవికారములు కలదియో దేనినుండి యేది జనించెనో యావిషయంబును ఆక్షేత్రజ్ఞుఁ డెవ్వఁడో యెట్టిసామర్థ్యముగలవాఁడో యావిషయమునుఁ గూడ సంక్షేపముగా వివరించెదను వినుము.

161. ఈవిషయమునుగూర్చి అనేకమునులును వేదములును చక్కని హేతువులతోఁ గూడిన బ్రహ్మసూత్రములును అనేకవిధములుగా నిరూపించి యున్నవి.

162. పరక్షేత్రజ్ఞరూపు లగునాత్మలకు వేదమున నైక్యము చెప్పఁబడియున్నది. జీవభేద ఉపాధులవలనమాత్రమే గానవచ్చుచున్నది. ఉపాధులు దేహములే.

163-164. ఒకపదార్థమునకే అద్దములయం దనేకప్రతిబింబములు కలిగి వానికి బరస్పరభేద ముండునట్లు బింబముతోఁగూడ భేద ముండునట్లు ఆత్మకును పరమాత్మతోను స్వస్వరూపమునందును గూడఁ బరస్పరభేదమున్నట్లు కానవచ్చుచున్నది. పంచభూతములు మొదలగునవి యన్నియుఁ గలసి క్షేత్ర మనఁబడుచున్నది. అం దున్న పరమేశ్వరుఁడు జీవుఁడని వ్యవహరింపఁబడుచున్నాఁడు. ఇంతయేకాని జీవబ్రహ్మభేద మెప్పటికిని లేదు.

ఇట్లగుటచేతనే హనుమంతుఁడు భగవద్గీతలపై నొనర్చిన పైశాచ భాష్యమున నిట్లు గీతాతాత్పర్యము వివరింపఁబడెను. ద్వితీయాధ్యాయమునందు

165. "నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః,
ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః.

అసతోఽవిద్యమానస్య రజ్జుసర్పవ ద్దృష్టనష్టస్వభావస్య జగతో భావస్సత్తా న విద్యతే తథా పరమార్థత స్సత ఆత్మనః అభావః అవిద్యమానతా న విద్యతే సర్వత్రా వ్యభిచారాత్ అనయో స్సదసతో ర్దృష్ట ఉపలబ్ధః అన్తః నిశ్చయః తత్త్వదర్శిభి రాత్మదర్శిభి రిత్యర్థః తస్మా త్తత్త్వదర్శినాం దృష్టి మాశ్రిత్య శోకం మోహం చ హిత్వా శీతోష్ణాదీ న్తితిక్షస్వే త్యభిప్రాయః" అనియున్నది. మఱియు నచ్చటనే పదునెనిమిదవ యధ్యాయమునందు

166. "భక్త్యా మా మభిజానాతి యావా న్యశ్చాస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరం.

భక్త్యా భజనేన మాం సర్వేశ్వర మభిజానాతి అవగచ్ఛతి యావా నహ ముపాధికృతభిన్నప్రపఞ్చరూపేణ య శ్చాస్మీతి అపాస్తసమస్తోపాధి

---

165. (ఇచ్చట వ్యాఖ్యానసహితముగ శ్లోక ముదహరింపఁబడినది గావున వ్యాఖ్యానమునకు మాత్రమే యర్థము వ్రాయఁబడును.) అసతః=లేనిదానికి-అనఁగా రజ్జుసర్పమువలె కనఁబడి నశించుస్వభావముగల జగత్తునకు, భావః=ఉనికి, నవిద్యతే=లేదు. అట్లె పరమార్థరూపముతో, సతః=ఉన్నట్టియాత్మకు, అభావః=లేమి, నవిద్యతే=లేదు. సర్వదేశసర్వకాలములయందు నేకరూపముతో నుండుటవలన, అనయోః=ఈసదసత్పదార్థములయందు, దృష్టః=తెలిసికొనఁబడెను. అంతః=నిర్ణయము, తత్త్వదర్శిభిః=ఆత్మనెఱింగిన వారిచేతననుట. కావున తత్త్వవేత్తలయొక్క దృష్టి నాశ్రయించి శోకమోహముల జయించి శీతోష్ణాదుల సహించు నని యభిప్రాయము.

166. (ఇచ్చటకూడ వ్యాఖ్యానమునకే యర్థము వ్రాయఁబడును.) భక్త్యా=సేవచే, మాం=సర్వేశ్వరుఁడ నగునన్ను, అభిజానాతి = తెలుసుకొనును, యావాన్ = నేను ఉపాధికృత మగుప్రపంచరూపముతో నెంతవాఁడనో, యశ్చాస్మి=సమస్తోపాధులును లేని శుద్ధస్వరూపముతో నెవ్వఁడనో, తత్త్వతః= పరమార్థముగా (తెలిసికొనును.) ఏవం-ఇట్లు, తతః=తర్వాత, జ్ఞాత్వా=తెలిసికొని, మాం=నన్ను, తదనంతరం=తర్వాత, విశతే=ప్రవేశించును. బ్రహ్మమే యగును.

స్వరూపే ణేతి చ తత్వతః పరమార్థతః ఏవం తతో జ్ఞాత్వా తతో మాం తదనన్తరం విశతే ప్రవిశతి బ్రహ్మైవ సమ్పద్యత ఇ త్యర్థః" అను మొదలగుసందర్భములచే ప్రపంచమిథ్యాత్వప్రతిపాదనపూర్వకముగ జీవబ్రహ్మైక్యము నిరూపింపఁబడెను. ఇట్లె యాజ్ఞవల్క్యస్మృతియందును

167. "ఆకాశ మేకం హి యథా ఘటాదిషు పృథ గ్భవేత్,
త థా త్మైకో హ్యనేక శ్చ జలాధారే ష్వి వాం శుమాః"

అను మొదలగువాక్యములును కేవలాద్వైతమునే నిరూపించుచున్నవి. ఇట్లే విష్ణుపురాణమునందును

168. "తద్భావభావమాపన్న స్త థాసౌ పరమాత్మనా,
భవ త్యభేదీ భేద స్తు త స్యాజ్ఞానకృతో భవేత్.

169. విభేదజన కేఽ జ్ఞానే నాశ మాత్యన్తికం గతే,
ఆత్మనో బ్రహ్మణో భేద మస న్తం కః కరిష్యతి.

170. జ్ఞానస్వరూప మత్య న్తనిర్మలం పరమార్థతః,
తదే వార్థస్వరూపేణ భ్రాన్తిదర్శనత స్థితం.

171. ప్రత్య స్తమితభేదం య త్సత్తామాత్ర మగోచరం,
వచసా మాత్మసంవేద్యం త జ్జ్ఞానం బ్రహ్మ సంజ్ఞితం.

అహం మ మేత్యవి ద్యేయం వ్యవహార స్త థానయా,
పరమార్థ స్త్వసల్లాప్యో గోచరో వచసాం న యః.

---

167. ఆకాశ మొక్కటి యయ్యు నెట్లు ఘటాదులయందు వేరువేరుగా నుండునో, సూర్యుఁ డొక్కఁ డయ్యుఁ జలఘటనదీసముద్రాదులయందు ప్రతిబింబించి యె ట్లనేకులగునో అట్లే పరమాత్మయు నొక్కఁడయ్యు ననేకులుగా నున్నాఁడు.

168. సంసారియగుజీవుఁడు ఆపరమేశ్వరుని భావించుచుండి లేని యాయనయే యగును. భేదము కేవల మజ్ఞానకృతమే.

169. భేదము కలిగించునజ్ఞానము పరిపూర్ణముగ నశించెనేని స్వాభావికస్థితిలో లేని జీవబ్రహ్మాభేదము నెవ్వఁడు కల్పింపఁగలండు ?

170. వాస్తవస్థితిలో జ్ఞానస్వరూపము మిగుల నిర్మలమైనది. అయినను ఇంద్రియములు బాహ్యమును మాత్రమే చూడఁగలవి యగుటచే భ్రాంతివలన నదియే పదార్థరూపముతోఁ గానవచ్చుచున్నది.

171. భేదశూన్య మయినదియు అవాఙ్మానసగోచరమయినదియు నగు నునికియే జ్ఞానము అదియే బ్రహ్మము.

172. అహం హరి స్సర్వ మిదం జనార్దనో
నాన్య త్తతః కారణకార్యజాతం,
ఈదృ జ్మనో యస్య న తస్య భూయో
భవోద్భవా ద్వన్ద్వగదా భవన్తి."

అను మొదలగువాక్యములచే కేవలాద్వైతమే ప్రతిపాదింపఁబడియున్నది. ఇట్లే భాగవతమునందు పదునొకొండవస్కంధమున పదునొకొండవ యధ్యాయమునందు

173. "బద్ధో ముక్త ఇతి వ్యాఖ్యా గుణతో మే నవస్తుతః,
గుణస్య మాయామూలత్వా న్న తో మోక్షో న బన్ధనమ్.

174. శోకమోహౌ సుఖం దుఃఖం దేహోత్పత్తి శ్చ మాయయా,
స్వప్నే య థాత్మనః ఖ్యాతి స్సంసృతి ర్న తు వాస్తవీ.

175. విద్యావిద్యే మమ తనూ విద్ధ్యుద్ధవ శరీరిణాం,
మోక్షబన్ధకరీ ఆద్యే మాయయా మే వినిర్మితే.

176. ఏక స్సై వ మ మాంశస్య జీవస్యైవ మహామతే,
బ న్ధో స్యావిద్యయా నాది ర్విద్యయా చ త థేతరః."

అను కృష్ణవాక్యముకలదు మఱియు తృతీయస్కంధమున కపిలదేవహూతిసంవాదమున యిరువదియొనిమిదవయధ్యాయమునందు

---

172. "నేను విష్ణువును. ఈప్రపంచ మంతయును విష్ణువే. ఈ కారణకార్యము లేవియు నాకనికంటె భిన్నములు కావు." అని యెవ్వనిమనస్సు నిశ్చితమై యుండునో అట్టివానికి సంసారజన్యము లగుద్వంద్వరోగములు (సుఖదుఃఖాదులు) కలుగవు.

173. బద్ధుఁడు ముక్తుఁడు ననువ్యవహారము గుణము ననుసరించి మాత్రమే నాకు కలుగుచున్నది కాని పరమార్థముగ గాదు. గుణము మాయామయమగుటచే నాకు బంధంబును లేదు. ముక్తియు లేదు.

174. శోకమోహములు జరామరణములు మొదలగునవి యన్నియు మాయవలననే జనించుచున్నవి. ఈసంసారము కలవంటిదే కాని వాస్తవము కాదు.

175. ఓయుద్ధవుఁడా! అనాదులై నాకు శరీరభూతములై నామాయచే కల్పింపఁబడినవి యగువిద్యావిద్యలు కలవు. అవియే మోక్షబంధముల గలిగించును.

176. ఓబుద్ధిమంతుఁడా! నాకునంశమై నిర్వికారుఁడై యున్నజీవునకు నవిద్యచే బంధము కలుగును, విద్యచే మోక్షము కలుగును.

177. "సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షే తానన్యభావేన భూతే ష్వివ తదాత్మతామ్.

178. స్వయోనిషు యథా జ్యోతి రేకం నానా ప్రతీయ తే,
యోనీనాం గుణవైషమ్యా త్త థాత్మా ప్రకృతేస్థితః.

179. తస్మా దిమాం స్వాం ప్రకృతిం దైవీం సదసదాత్మికాం,
దుర్విభావ్యాం పరాభావ్య స్వరూపే ణావతిష్ఠ తే."

అని యున్నది. ఇట్లె యిరువదితొమ్మిదవయధ్యాయమున

180. "అర్చాదా వర్చయే త్తావ దీశ్వరం మాం స్వకర్మకృత్,
యావ న్న వేద స్వహృది సర్వభూతే ష్వవస్థితం.

181. ఆత్మ న శ్చ పర స్యాపి యః కరో త్యన్తరోదరం,
తస్య భిన్నదృశో మృత్యు ర్విదధే భయ ముల్బణమ్."

అనియున్నది. ఇట్లె ముప్పదిరెండవయధ్యాయమున

182. "జ్ఞానమాత్రం పరం బ్రహ్మ పరమాత్మేశ్వరః పుమాన్,
దృశ్యాదిభిః పృథగ్భావై ర్భగవా నేక ఈయ తే.

---

177. పంచభూతమయము లగుపదార్థములయందు భూతమయత్వమును జూచునట్లు జంతువులయందును ఆత్మమయత్వమును చూడవలయును.

178. అగ్ని యంతట నొక్కటియే యైనను తనయుపాధులయందు భిన్నభిన్నముగ నెట్లు గానవచ్చుచున్నదో అట్లే యాత్మయు తనయుపాధులయందు భిన్నభిన్నముగా గానవచ్చుచున్నాఁడు.

179. కావున పరమేశ్వరుఁడు స్వకీయ మైనట్టియు దేవసంబంధ మైనట్టియు సదసద్రూపిణి యైనట్టియు భావింపఁబడుటకు నలవికానట్టియు ప్రకృతిని జయించి స్వస్వరూపముతో నిలచి యుండును.

180. యెంతకాలమువఱకు సర్వభూతగతుఁడ నగునన్ను తెలిసికొనకుండునో యంతవఱకు కర్మల నాచరించువాఁడు మొట్టమొదట పరమేశ్వరుఁడ నగునన్ను పూజింపవలయును.

181. ఎవ్వఁడు తనకును పరమేశ్వరునకును భేదముకల దనువిషయమును కొంచె మైనను భావించునో వానికి సంసారము భయహేతు వగును.

182. జ్ఞాన మొక్కటియే పరమేశ్వరుఁడు. ఆయనయే ద్రష్టృదృశ్యాది బహుభేదములతోఁ జెప్పఁబడుచున్నాఁడు.

183. ఏతావానేవ యోగేన సమగ్రేణేహ యోగినః,
యుజ్యతేఽభిమతో హ్యర్థో యదసజ్జస్తుకృత్స్నశః.

184. జ్ఞానమేకం పరాచీనై రిన్ద్రియై ర్బ్రహ్మ నిర్గుణం,
అవభాత్యర్థరూపేణ భ్రాన్త్యా శబ్దాది ధర్మిణా."

అనియున్నది.

ఇట్లే ముప్పదిమూఁడవ యధ్యాయమున

185. "భక్తిప్రవాహయోగేన వైరాగ్యేణ బలీయసా,
యుక్తానుష్ఠానయోగేన జ్ఞానేన బ్రహ్మయోగినా.

186. విశుద్ధేన తదాత్మాన మాత్మనా విశ్వతోముఖః,
స్వానుభూత్యా తిరోభూత మాయాగుణవిశేషణమ్.

187. బ్రహ్మణ్యవస్థితమతి ర్భగవత్యాత్మ సంశ్రయే,
నివృత్తజీవాపత్తిత్వా ద్వీతక్లేశాత్మనివ్వృతిః.

188. నిత్యారూఢసమాధిత్వా త్పరావృత్తగుణభ్రమా,
న సస్మార తదాత్మానం స్వప్నదృష్ట మివోత్థితః"అనియున్నది.

---

183. యోగులు పరిపూర్ణమగుయోగముచేత నీపరమేశ్వరుని రూపమునే గ్రహింతురు. అభిమత మగుపదార్థమునుగాని యెవ్వఁడును సాధింపనెంచరు. పరమసుఖరూప మగునీబ్రహ్మంబును నిర్వికారమే కావున నధికధ్యానమువలనగాని సంప్రాప్తింపదు.

184. జ్ఞానమొక్కటియే కలదు. అదియే నిర్గుణబ్రహ్మము. ఇంద్రియములు బాహ్యపదార్థములను మాత్రమే చూడఁగలవి యగుటచే శబ్దాదిరూపములతోనదియే వెలుపల నున్నట్లు తోఁచుచున్నది.

185-186-187-188. భక్తిప్రవాహముచేతను బలవంతమగు వైరాగ్యముచేతను తగినట్లు కర్మల నాచరించుటచేతను పరమేశ్వరైక్యమును కలిగించు జ్ఞానముచేతను నిర్మల మగుమనస్సుతో మాయాగుణముల నశింపఁజేసి స్వానుభవముతో పరిశుద్ధుఁడగు నాత్మను గ్రహించి యాత్మరూపుఁ డగుబ్రహ్మమునందు స్థిరచిత్తుఁడై జీవస్వభావము లేకపోవుటవలన సర్వదుఃఖరహితుఁడై స్వస్వరూపానందము కలవాఁడై పరిపూర్ణసమాధి సిద్ధినొందినవాఁ డగుటచే గుణభ్రాంతి లేనివాఁడై మేల్కాంచినవాఁడు కలలోఁ జూడఁబడినవానిని స్మరింపనట్లు తనరూపము స్మరింపలేదు. (ఒడలు మఱచె ననుట.)

వీనియర్థమును విమర్శించిన భాగవతతాత్పర్యము గూడ నద్వైతమే యని తెలుచున్నది. ఈవిధముగ కపిలాదులసూత్రములయందలి యనువాదబలమువలన శ్రుతిసూత్ర శ్రుతిపురాణేతిహాసాదులయొక్క పరమతాత్పర్యము కేవలాద్వైతమే యని నిర్ణయింపఁబడుటవలన

189. "సత్యాద్వైతపరః కశ్చి ద్వేదభాగ స్సమాసతః,
కల్పితద్వైతనిష్ఠ స్తు వేదభా గోఽపరో ద్విజాః."

అను సూతసంహితావాక్యము ననుసరించి వానియం (సూత్రాదులయం) దెచ్చటనయిన భేదము చెప్పఁబడియుండు నేని యది కల్పితభేదము నను వాదముఁజేయుటయే యని నిశ్చయింపవలసివచ్చుచున్నది.

ఇట్లగుటచేతనే పరమేశ్వరావతారరూపులును సర్వజ్ఞులును శ్రుతిసూత్రాదులతాత్పర్యముల నిర్ణయించుటయందుఁ బూన్కిఁగలవారలు నగుశంకరభగవత్పాదులచే బ్రహ్మసూత్ర భగవద్గీతోపనిషత్సనత్సుజాత సహస్రనామభాష్యములయందు "అద్వైతమె పరమార్థము" అని యతి విశదముగ నిరూపింపఁబడి యున్నది. ఇట్లగుటచేతనే ఆదిత్యపురాణము నందు.

190. "వ్యాకుర్వ న్వ్యాససూత్రాణి శ్రుతే రర్థం య థోచితాః,
స ఏ వార్థ శ్శ్రుతే ర్గ్రాహ్య శ్శఙ్కర స్సవితాననా" అని చెప్పఁబడియున్నది. కూర్మపురాణమునందును

191. "కరిష్య త్యవతారాణి శఙ్కరో నీలలోహితః,
శ్రౌతస్మార్తప్రతిష్ఠార్థం భక్తానాం హితకామ్యయా.
ఉపదేక్ష్యతి త చ్ఛాస్త్రం య జ్జ్ఞానం బ్రహ్మసంజ్ఞితం"

అని చెప్పఁబడియున్నది.

కావున సజాతీయవిజాతీయస్వగతభేదములు లేనట్టియు సత్తాసామాన్యరూపమైనట్టియు సచ్చిదానందస్వరూపమైనట్టియు నిర్విశేషమైన

---

189. (724 పేజీ 143-144 పేరా చూ.)

190. వ్యాససూత్రములకు వ్యాఖ్యానముఁ జేయుచు శంకరుఁ డేయర్థమును చెప్పఁబోవునో దానినే శ్రుత్యర్థమునుగా గ్రహింపవలయును.

191. నీలలోహితుఁ డగు శివుఁడు శ్రౌతస్మార్తధర్మముల నిలుపుటకును భక్తులకు మేలుచేయుటకును అవతారముల నెత్తఁగలఁడు. బ్రహ్మజ్ఞానము నుపదేశింపఁగలఁడు.

ష్టిచయు నన బ్రహ్మమే సమస్తశ్రుతిసూత్రపురాణేతిహాసములకు తాత్పర్య భూతమైనది యని సిద్ధించినది.

పూర్వపక్షి :— ఇట్లు చెప్పుటచే వ్యాసతాత్పర్య మద్వైతమే యని నిర్ణయింపఁబడినను రామానుజమధ్వాది భాష్యములకు నాధారము లేకపోవునేగాని వ్యాసమతముమాత్రము నిలువనేరదు. గౌతమాదు లందఱును దీనికిఁ బ్రతివాదులేకదా! వారును యీయద్వైతమును ఖండించి ద్వైతమునే స్థాపించియుండుటచే మధ్వాదిభాష్యములకుఁగూడ పూర్తిగా నవకాశము లేకపోలేదు. సూత్రాభిప్రాయ మొకవేళ నది కాక పోయినను మతములుమాత్రము కలవుకదా! కావున నాగౌతమాదిమత ములనెల్ల ఖండించిననేగాని యీయద్వైతము సుస్థిరము కాదు.

సిద్ధాంతి:—అగునుగాక. "వ్యాసతాత్పర్య మద్వైత మగునా? లేక మఱియొక్కటి యగునా?" యని విచారించుటకు మాత్రమే నేను ప్రయత్నించితినిగాని పరమతఖండనపూర్వకముగా దానిని సంస్థాపించుటకు బ్రయత్నింపలేదు. ఆకార్యమునుకూడ నేనే చేయవలయునని నిర్బంధము కూడా లేదు. దానిని కేవలాద్వైతమతప్రవర్తకులును తచ్ఛిష్యులును చేయవచ్చును కదా! మఱియు నీవ్యాసమతము పరవాదములకు నిలచిన నిలువనిమ్ము లేకున్న లేకపోనిమ్ము ఆవిషయము వేఱు. అది యద్వైత మగునా కాదా యనునంతవఱకే కదా మనకు విచారము. కావున మా సిద్ధాంతము పైనీయాక్షేపము రానేరదు.

మఱియు భాష్యమునందును వివరణమునందును భామతియందును పంచదశియందును మఱియు నద్వైతగ్రంథములయం దన్నిటను సాంఖ్యాది మతములు శ్రుతియుక్త్యనుభవములతో ఖండింపఁబడియే యున్నవి. అద్వైతశ్రుత్యాదు లెట్లున్నవో ద్వైతశ్రుత్యాదులుకూడా నట్లే యుండ కేవలాద్వైతమును మాత్రమె స్థాపించుటయు భేదమును నిరాకరించు టయు నెట్లు సంభవించె ననియెదవేమొ వినుము.

192. "ద్వితీయాద్వై భయం జంతో ర్భవ తీత్యాహ హి శ్రుతిః,
కో మోహః క స్తథా శోక ఏకత్వ మనుపశ్యతః.

---

192. (723-పేజీ 133-పేరా చూ.) జంతోః=జీవునకు.

193. ఇతి చాహ హి సా సాధ్వీ శ్రుతి రద్వైత మాస్తికాః,
ఏకత్వ మితి వాక్యార్థో నాపరో మునిసత్తమాః,

194. స్తుతిని న్దే విరుద్ధేతే యది భేదో వివక్షితః" అను మొదలగు సూతసంహితావాక్యములయందు చెప్పఁబడి యున్న విధంబున భేదనిందా పూర్వకముగ నభేదము స్తుతింపఁబడుచుండుటచేతను అభేదశ్రుతులు తాత్పర్యలిఙ్గములచే వినుర్శింపఁబడిన బలవంతము లగుటచేతను భాష్యాది గ్రంథములయం దట్లు కేవలాద్వైతమె సిద్ధాంతము చేయఁబడెను. 195. "స చ నారాయణ స్యాంశో" అని యారంభించి 196. "సూత్రయామాస వేదాన్తవాక్యార్థం శఙ్కరాజ్ఞయా" అనువఱకు పురాణముశ్లోకములచే బ్రహ్మసూత్రములే యుపనిషత్తాత్పర్యముచు చెప్పుటకై ప్రవర్తించినవి యని స్పష్టమగుచుండుటచేతను ఆసూత్రములకు నద్వైతమె తాత్పర్య మని సిద్ధించుటచేతను ఆగ్రంథములయం దట్లు నిర్ణయింపఁబడుటకు వీలు కలిగెను. ఈకారణమువలన నిచ్చలేకున్నను శ్రుతితాత్పర్య మద్వైతమె యని యవశ్యముగ నెవ్వరైన నంగీకరింపవలసినదియె.

పూర్వపక్షి:—ఇదియు యుక్తము కాదు. సర్వజ్ఞులగు కపిలాది మును లనేకు లేకవాక్యముగ ద్వైతసిద్ధాంతమును చేసియుండ నొక్క వ్యాసుఁడు మాత్రమే చెప్పియున్న యద్వైతము నె ట్లంగీకరింపవచ్చును? ఒక్కఁడు చెప్పినదానికంటె పలువురు చెప్పినదియె కదా ప్రమాణము. గ్రుడ్డివారు నూర్వురైనను చూడలేనట్లు భ్రాంతు లెందఱయినను తత్త్వార్థమును నిర్ణయింపలేరు కదా! అప్పు డొక్కనివాక్యమైనను ప్రమాణమె కావలయునుకదా! యనిన నదియు సరిపడదు. ఆకపిలాదులు సర్వజ్ఞులు కదా! కావునఁ గేవలాద్వైతము సమ్మతించుటకు వీలు లేదు.

సిద్ధాంతి:—ఇట్లు చెప్పఁగూడదు. కొన్ని యంశములయందు కొంత పోలిక లుండు ననుట సర్వతంత్రములయందును సాధారణన్యాయము. అద్వైతసిద్ధాంతమునకుఁ గూడ కొన్నికొన్ని యంశములయందు వేద

193. ఓయాస్తికులారా! ఋషిశ్రేష్ఠులార! ఈవిధముగఁ గూడ శ్రుతి యద్వైతమును జెప్పుచున్నది. మహావాక్యార్థ మద్వైతమే కాని రెండవది కాదు.

194. భేదమే వేదాభిప్రాయమగు నేని భేదనిందయు నభేదస్తుతియు నిష్ప్రయోజనము లగును.

195-196. (674-పేజీ 1-2-3-పేరాల చూ.)

బాహ్య మగుబౌద్ధమతముతోఁబోలిక కలదు. ఇట్లే సాంఖ్యకణాదాదులమత ములకుఁ గూడఁ బోలిక కలదుగాని పరిపూర్ణముగ నైక్యము లేదు. కపిల ముని ప్రకృతి జగత్కారణమనిన కణాదముని పరమాణువులు జగత్కా-రణ మనుచున్నాఁడు. ఈవిధముగ నైకమత్యము లేకపోవుటచే వారిమత ములు ప్రమాణములు కానేరవు. పలువురుచెప్పుమాట యంగీకార్య మనిన నామాట యొక్కటిగనే యుండవలయును కదా! ఈవిషయమును గూర్చియే మహాత్ము లిట్లు చెప్పియున్నారు.

197. "కపిలో యది సర్వజ్ఞః కణాదో నేతి కా ప్రమా,
తావుభౌ యది సర్వజ్ఞౌ మతభేదః కథం భవేదితి."

మఱియు,

198. "కణాద స్యాక్షపాదస్య వ్యాసస్య కపిలస్య చ,
పతఞ్జలే ర్జైమినే శ్చ దర్శనాని భవ న్తిషట్."

అని దర్శనము లాఱు కల వనుట ప్రసిద్ధమై యున్నది. వీనిని రచించిన మును లందఱును సర్వజ్ఞులే యైనచో మతవిరోధ ముండుటకు వీలులేదు; వీరు సర్వజ్ఞులు కారనుటకును వీలులేదు. కావున వీ రందఱకు పరమార్థ విషయ మొక్కటి తాత్పర్యభూతమై యున్నది యని యంగీకరించి తీర వలయును. అట్లు లేకున్న నందఱును భ్రాంతులే కావలసివచ్చుటచే నెవ్వరి మతమును ప్రమాణము కాకపోవలసివచ్చును. ఈకారణమువలన మును లకుఁ బరమతాత్పర్య మేదియని విచారింపవలసివచ్చినప్పుడు పైన వర్ణిం చినవిధముగ భేదము శ్రుతితాత్పర్యము కాకపోవుటచేతను శ్రుతివిరుద్ధాంశ మెవ్వరికిని తాత్పర్యముగ నుండుటకు వీలులేకపోవుటచేతను కేవలాద్వైత మె యుందఱకును తాత్పర్యభూతార్థ మని నిర్ణయింపవలసి వచ్చుచున్నది.

భాగవతాదిపురాణముల విచారించిన నీవిషయము తేటపడు చున్నది. భాగవతమున తృతీయస్కంధమున నున్నవి యని పూర్వ ముదహరింపఁబడిన

---

197. కపిలుఁడు సర్వజ్ఞుఁడైన కణాదులు కాఁడనుటకు హేతు వేది కలదు? ఇరువురును సర్వజ్ఞులే యైన మతభేద మేలకలుగును?

198. కణాదులు గౌతముఁడు వ్యాసుఁడు కపిలుఁడు పతంజలి జైమిని అను నాఱుగురును ప్రత్యేకదర్శనముల నొసఁగిరి.

199. "జ్ఞానమాత్రం పరం బ్రహ్మ పరమాత్మేశ్వరః ప్రభుః,
దృశ్యాదిభిః పృథగ్భావైర్భగవానేక ఈయతే.

200. జ్ఞానమేకం పరాచీనైరిన్ద్రియైర్బ్రహ్మ నిర్గుణం,
అవభాత్యర్థరూపేణ భ్రాన్త్యా శబ్దాదిధర్మణా."

అను మొదలగువాక్యములచేఁ గపిలమునికి నద్వైతమె యభిప్రాయమని తేలుచున్నది. శంకరభాష్యమున ద్వితీయాధ్యాయ ప్రథమ పాదమున స్మృత్యధికరణమున 201. "ఋషిం ప్రసూతం కపిలం బ్రహ్మయోనిం" అను శ్రుతిని సమన్వయించునపుడు దేవహూతికుమారుఁ డగుకపిలునకును సాంఖ్యసూత్రకర్త యగుకపిలునకును భేద మున్న నుండవచ్చునని చెప్పఁబడియున్నది. అది యభ్యుచ్ఛ్రయమాత్ర మని యెఱుంగునది. సర్వజ్ఞుఁ డైనను అధికారిభేదము నాశ్రయించి యెట్లయినను సిద్ధాంతము నాచరింప వచ్చును కదా!

మఱియు గౌతమమహామునికిఁ గూడ నద్వైతమె తాత్పర్య మనుటనుగూర్చి బ్రహ్మకైవర్తపురాణమున

202. "నమో జప్యేశ్వరేశాయ స్వాన్యహీనాయ శమ్భవే,
తత్త్వానాం పరతత్త్వాయ స్వయమ్భానాయ హేతవే.

203. చిచ్ఛక్తిర్జడశక్తిశ్చ తత్కార్యాణి చ తద్భిదా,
తత్త్వతో యత్స్వరూపం హి విద్యతే న పృథక్తతః.

204. తస్మై జప్యేశ్వరేశాయ నమోఽద్వైతస్వరూపిణే,
ఉత్తమా మధ్యమా హీనా యే చ జీవాః పృథగ్విధాః.

---

199-200. (731-732-పేజీలు. 182-183-పేరాలు చూ.)

201. (బ్రహ్మసూత్రము. ౨-౧-౧ చూ.)

202. జపింపఁబడఁదగినవారిలో శ్రేష్ఠుఁడును తాను పరుఁడు ననుభేదము లేనివాఁడును తత్త్వములలో బరుండును స్వప్రకాశుఁడును సర్వజగత్కారణభూతుండు నగునీశ్వరునకు నమస్కారము.

203-204. చైతన్యశక్తియుఁజడశక్తియువానికార్యములును అందలిభేదములును పరమార్థస్థితిలో నెవ్వనికి స్వరూపభూతమై యున్నదో యూరక గానవచ్చుటయే గాని యెవ్వనికంటె భిన్నము కాకున్నదో అట్టి యద్వైత స్వరూపునకు నమస్కారము.

205. తత్త్వతో నాతిరిచ్యన్తే యస్మాత్సాంబామ్మహేశ్వరాత్,
తస్మై పఞ్చనదేశాయ నమో వై సర్వసాక్షిణే.
206. యత్సత్తా జగత స్సత్తా యత్సత్తాం న వినా జగత్,
యస్య భాసా జగద్భానం యం వినా న జగత్పృథక్.
207. ఆదిత్యసోమావగ్ని శ్చ యద్భాసా భాన్తి నిత్యశః,
తస్మై జపేశ్వరేశాయ నమోఽద్వైతస్వరూపిణే.
208. యదానన్దోఽఖిలానన్దో విభాతి స్వయమేవ హి,
యశ్శివః పరమానన్దో వర్తతే సర్వజన్తుషు.
209. తస్మై జపేశ్వరేశాయ నమో వై సర్వసాక్షిణే.

అని చెప్పఁబడియున్నది. ఈస్తోత్రవాక్యములచే నిది స్పష్ట మగుచున్నది కదా! ఈగౌతమునకును సూత్రకర్తకును భేదము కల దనుటకుఁ బ్రమాణములు లేవు. అక్షపాదు (అఱకాలియందు కన్నుకలవాఁ) డనుసార్థకనామధేయ మిఱువురకు నుండుటచే వాఁ డొక్కపురుషుఁడే యని సిద్ధాంతముఁ జేయుటకును వీలు కలుగుచున్నది.

ఎట్లే శైవాగమమునందు ఏకాదశరుద్రసంహితలో వ్యాసజైమినీ సంవాదమున

210. అహం హి భవత స్సాక్షా చ్ఛిష్యభూత స్సుశిక్షితః,
తథాపి మేఽపరోక్షన్తు జ్ఞానం నాస్తి మహామునే.

---

205. ఉత్తములు మధ్యములు నధములు నై బహువిధములుగా నున్న జీవులు పరమార్థస్థితిలో సాంబుఁడగు నేమహేశ్వరునికంటె భిన్నులు కారో అట్టి సర్వసాక్షి యగు పంచనదేశ్వరునకు నమస్కారము.

206-207. ఎవ్వనియునికి ప్రపంచముయొక్క యునికియో యెవ్వని యునికి లేకుండ ప్రపంచముండదో యెవ్వనికాంతిచే జగత్తు ప్రకాశించుచున్నదో యెవ్వఁడు ప్రపంచరూపుఁడైయున్నాఁడో సూర్యచంద్రులు నగ్నియు నెవ్వనికాంతివలన ప్రకాశించుచున్నారో అట్టియభేదరూపునకు నమస్కారము.

208-209. యెవ్వని స్వస్వరూపభూతానందము సర్వప్రపంచమునందు ననుభవసిద్ధ మగునానందమో దుఃఖసంబంధములేక స్వయముగనే ప్రకాశించుచున్నదో యేశివుఁడు పరమానందరూపుఁడై సర్వజంతువులయందు నున్నాఁడో అట్టిసర్వసాక్షికి నమస్కారము.

210. ఓవ్యాసమహామునీ! నేను మీకు శిష్యుఁడను. మీరును నన్ను బాగుగనే శిక్షించితిరి. అయినను నాకు అపరోక్షజ్ఞానము లేదు.

211. తస్య మే ముక్త్యుపాయ న్త్వం వద కారుణ్యచేతసా,
ఇతి పృష్టో మునిశ్శ్రీమా న్మహాకారుణికో త్తమః.

212. ఆహూయ జైమినిం మాం చ రహస్యేతదువాచ హ,

వ్యాసః:-సాధు పృష్టం త్వయా వత్స లోకానాం చ హితప్రదమ్.

213. వదామ్యహ ముపాయ న్తే తవాన్యేషాం చ ముక్తిదం,
సాంబమూర్తిప్రసాదేన నాజ్ఞాతం మమ విద్యతే.

214. జ్ఞానాదేవ విముక్తి స్స్యా న్నాన్యథా కర్మకోటిభిః,
జ్ఞానం వేదాన్తజం జ్ఞాన మజ్ఞానం చాన్యదిష్యతే.

215. జీవబ్రహ్మైక్యవిషయం తదపి స్యాన్న చేతరత్,
తచ్చ శమ్భోః ప్రసాదేన గురో శ్చైవ ప్రసాదతః.

216. తథా వేదాన్తవాక్యానాం తాత్పర్యస్య విచారణాత్,
జాయతే తచ్ఛివజ్ఞానం నాన్యథా సత్యమీరితం."

అని యిట్లు చెప్పఁబడియున్నది. ఈవాదము ననుసరించి చూచిన జైమినియభిప్రాయ మద్వైతమే యని తేలుచున్నది. అద్వైతమతోపదేశకుఁ డగుటచే నిచ్చట వర్ణింపఁబడినవ్యాసుఁడు సూత్రకర్తయే యను

---

211-212. కావున నాకు దయతో మోక్షోపాయమును సెలవిండు. అని జైమినిమహామునియు నేను ప్రశ్నింపఁగా దయామయుం డగువ్యాసుఁడు నన్నును జైమినిని కూడ పిలిచి యేకాంతమున నిట్లనియె. ఓబిడ్డలార! మీరు చేసినప్రశ్న మిగుల శ్రేష్ఠమయినది. లోకములకు హితకరమయినది.

213. మీకును లోకమునకును హితకర మగునుపాయమును చెప్పెదను. పరమేశ్వరానుగ్రహమువలన నాకు తెలియని దేదియు లేదు.

214. జ్ఞానమువలనమాత్రమే ముక్తి కలుగునుగాని కోటికర్మలచేతనైనను కలుగదు. వేదాంతమువలన కలిగినజ్ఞానమే జ్ఞానము; తక్కినది యజ్ఞానము.

215. ఆజ్ఞానముఁగూడ జీవబ్రహ్మైక్యవిషయమగునేని యప్పుడే జ్ఞానమనఁబడును గాని తక్కినవిషయములయందు కాదు. ఆజ్ఞానంబును గురుశివానుగ్రహములవలన కలుగును.

216. వేదాంతవాక్యవిచారములవలనను ఆబ్రహ్మజ్ఞానము కలుగును కాని మఱి యొకవిధముగాఁ గలుగదు. ఇది యథార్థము.

టలో సంశయము లేదుకావున జైమినియు నట్టివాఁడే యని యూహింప వలసి యున్నది. ప్రసిద్ధుఁడగువానిని విడిచి యప్రసిద్ధుని కల్పించుట యుక్తము కాదు కదా!

అట్లే స్కాందపురాణమున శేషశివసంవాదమునందు

217. "యథార్థం మత్స్వరూపస్య లోకైరమితతేజసః,
అతిగుహ్యం స్వసంవేద్యం శృణు త్వం వదతో మమ.

218. శివః:-ఏష మాయాసముత్పన్నః ప్రపఞ్చః కర్మణి స్థితః,
నైవ జానాతి మరణం సుఖం దుఃఖం భయం ద్విషమ్.

219. కల్ప్యతే నియతం కర్త్రా మృత్తికాయాం యథాఘటః,
మాయయా మయి కల్ప్యన్తే తథా సర్గాదికాః క్రియాః.

220. సకలం నిష్కళం చేతి మమ రూపద్వయం స్మృతం,
సకలం చక్షుషా గ్రాహ్యం ధేయం చ నియతాత్మభిః.

221. నిష్కళం తు నిరాకారం నిరఞ్జన మనామయం,
న తద్దృశ్యం న చ ధ్యేయం నైవాలోచ్యం నృభిః ఫణిన్.

222. తథాపి తే ప్రపశ్యన్తి యే బుద్ధ్వా మత్పరాయణాః,
నిర్ద్వన్ద్వా నిరహఙ్కారా నిరస్తకలికల్మషాః.

---

217. నేను అపరిమితతేజస్సు కలవాఁడను. నారూపము మిగుల రహస్యమయి నది. స్వయముగ మాత్రమే తెలియఁబడినది. దానియథార్థస్వరూపమును నేనే తెల్పె దను వినుము.

218. ఈప్రపంచము మాయచే జనించి కర్మవశగతమై యున్నది. సుఖదుఃఖ జన్మమరణాదులు తనకు శత్రువులని ఇది యెఱుంగదు.

219. కుమ్మరవానిచే మృత్తికయందు ఘటాదు లెట్లు కల్పింపఁబడునో అట్లే నాయందు సృష్ట్యాదులు భ్రాంతిచేఁ గల్పింపఁబడుచున్నది.

220. సకలనిష్కళములను భేదములచే (ఇవియే సగుణనిర్గుణభేదము) నా రూపము రెండువిధములుగా నున్నది. అందు కంటితో జూడఁబడునదియు మనస్సుతో ధ్యానింపఁబడునదియు సకలరూపమే.

221. ఓశ్రేష్ఠుఁడా! నిష్కళ రూపమునను నాకారము లేదు. అది నిరంజనమయి నది. దానినిఁజూచుటకుఁ గాని యూహించుటకుఁగాని ధ్యానించుటకుఁ గాని వీలులేదు.

222. అయినను నాయందే బుద్ధిగలవారై సుఖదుఃఖముల వదలి యహంకార మును వర్జించి సర్వపాపములఁ బరిత్యజించి యున్నమహాత్ములు నన్ను గాంతురు.

223. ఆశీవిషం ఫణీన్ద్ర! త్వాం జ్వలద్వహ్నివిలోచనం,
సహస్రశిరసం దృష్ట్వా భవే ల్లోకాభయాకులః.

224. అత్రి ర్నామ మహాతేజా స్తథా దివ్య స్తపోధనః,
అనసూయా చ తత్పత్నీ పుత్ర న్త్వా మ్ప్రాప్తు మిచ్ఛయా.

225. కమలాక్షమజం విష్ణుం ధ్యానపూజయతాం చిరం,
ప్రదదౌ త్వాం తయోశ్శేషసోఽపి దేవః కృపానిధిః.

226. తథా జన్మభయాద్బాలో లసత్పఞ్చఫణాన్వితః,
తత్పత్న్యాస్స్నానశుద్ధాయా దృష్టోఽభూ స్త్వర్ఘ్యపాఞ్జలౌ.

227. పుత్రాభిలాషిణ్యథ సా కరస్థ మ్బాలరూపిణం,
విలోక్య సహసా భీతా త్వా మముఞ్చ న్మహీతలే.

228. పతఞ్జలిసమాఖ్యోఽభూ స్తదా తత్పాతనాద్భువి,
అద్య త్వం తాదృశో భూత్వా సహితః ప్రజ్ఞయానయా.

229. నామ్నా పతఞ్జలిః ఖ్యాతో ధ్యాయ న్మాం హృది సన్తతం."

---

223. ఓసర్పరాజా! ప్రజ్వలించుచున్న యగ్నితో సమానమగునాకారము కలిగిన కన్నులతోఁగూడి సహస్రఫణములు కలిగి సర్పాకారమున నున్న నిన్ను చూచి లోకులు భయము నొందుదురు.

224. తేజస్వియగు నత్రిమహామునియు ననసూయాదేవియు నిన్ను పుత్రునిగాఁ బడయవలయు ననుకోర్కెతో

225. కమలాక్షుఁడును జన్మమరణశూన్యుఁడు నగువిష్ణువును చిరకాలము పూజించిరి. శేషుఁడా! ఆహరియు నిన్ను వారికి పుత్రుఁడుగా నొసంగెను.

226. పిదప నీవు జన్మమునకు భయపడి స్వయముగనే బాలరూపమును దాల్చి యైదు పడగలతో నొప్పుచు నా యనసూయాదేవి స్నానముచేసి యర్ఘ్యము నొసంగు నప్పుడు దోయిటియందు గానఁబడితివి.

227. తరువాత నామె పుత్రార్థిని యయ్యు బాలరూపుఁడ వగునిన్ను చూచి మొట్టమొదట భయము నొంది తక్షణమే దోయిటినుండి పాఱవైచెను.

228. ఇట్లు దోయిటినుండి పడవేయఁబడుటచే నీకు పతంజలి యనుపేరు గలిగెను. ఇట్టిరూపమును జెందినపిదప నీకు నన్నుగూర్చి యథార్థజ్ఞానము కలిగెను.

229. నన్ను సర్వకాలములయందును ధ్యానించుచు పతంజలి యని సుప్రసిద్ధుఁడ వైతివి.

అని చెప్పఁబడియున్నది. ఈవాక్యములను విమర్శించిన పతంజలికిఁ గూడఁ గేవలాద్వైతమే తాత్పర్య మని తెలియవచ్చుచున్నది.

ఇట్లు సూత్రకర్తల కనేకుల కద్వైతమె తాత్పర్యార్థమని తేలుటచే కణాదునకుగూడ నిదియె తాత్పర్యమని నిర్ణయింపవలసియున్నది.

కావున కపిలాదుల కందఱకును కేవలాద్వైతమె తాత్పర్యభూతార్థమగుటచే నెవ్వరును భ్రాంతులుకారు.

పూర్వపక్షి:—ఇట్లైన వారలు వ్యాసాభిమత మగునద్వైతము నేల ఖండించరు? వారికిగూడ నదియె సమ్మతము కదా! ఈకారణమువలన నింతశ్రమపడి చేసినసిద్ధాంతమంతయు నిర్మూలమయ్యెను. మఱియు వారు అద్వైతమతవిరుద్ధముగ స్వతంత్రతంత్రముల ప్రవర్తింపఁజేసి రనుట యెట్లు? ఒకమతమును ప్రవర్తింపఁజేసినవారికి మఱియొకమతము తాత్పర్యభూతార్థ మగుననుట హాస్యాస్పదము కదా!

సిద్ధాంతి:—ఇట్లు శంకింప నవసరములేదు. ముఖ్యతాత్పర్య మేదియైనను తాను కారణాంతరముఁ జేయఁబూని సిద్ధాంతమును స్థిరపఱచుటకై సర్వమతములు ఖండింపవచ్చును. తనకు ముఖ్యతాత్పర్యభూతమైన మతమునుగూడ ఖండింపవచ్చును. మహాత్ములచర్య లిట్లు గూడ నున్నవనుటకు దృష్టాంతములు కలవు. రామాయణమున శ్రీరామజాబాలి సంవాదమునందు

230. "అష్టకా పితృదైవత్యమిత్యయం ప్రసృతో జనః,
అన్నస్యోపద్రవం పశ్య మృతో హి కమశిష్యతి.
231. యది భుక్త మిహాన్యేన దేహ మన్యస్య గచ్ఛతి,
దద్యాత్ప్రవసతశ్శ్రాద్ధం న తత్పథ్యశనం భవేత్.

---

230. శ్రాద్ధము నొనరించిన పితృదేవతలకుఁ దృప్తిగలుగునని జనులు ప్రవర్తించుచున్నారుకదా! ఈవిషయమున కొంత యాలోచింపుము. అన్నము వృథాగా వ్యయమగుటయేగాని మృతులు యేమైనను తినుసా?

231. తినునేని యపుడు దూరదేశమున నున్నవానినిగూర్చి కూడ శ్రాద్ధమును పెట్టవచ్చును. అప్పుడు యిచ్చటివారు తినినయన్నము వానిదేహమును చేరవలసివచ్చును. ఇట్లు లేదుకదా! కావున శ్రాద్ధము నిరర్థకము.

232. దానసంవననా హ్యేతే గ్రన్థా మేధావిభిః కృతాః,
యజస్వ దేహి దీక్షస్వ తప స్తప్యస్వ సన్త్యజ.
233. న నాస్తి పర మిత్యేవ కురు బుద్ధిం మహామతే,
ప్రత్యక్షం య త్త దాతిష్ఠ పరోక్షం పృష్ఠతః కురు.
234. సతాం బుద్ధిం పురస్కృత్య సర్వలోకనిదర్శినీం,
రాజ్యం త్వం ప్రతిగృహ్ణీష్వ భరతేన ప్రసాదితః.

రామః:—

235. సత్యఞ్చధర్మఞ్చపరాక్రమఞ్చభూతానుకంపాం ప్రియవాదితాం చ,
స్వజాతిదేవాతిథిపూజనఞ్చ పన్థాన మాహు స్త్రిదివస్య సన్తః.
236. తే నైవమాజ్ఞాయ యథావదర్థమేకోదయం సంప్రతిపద్య విప్రాః,
ధర్మం చర న్తస్సకలం యథావ త్కాఙ్క్షన్తి లోకాగమమ ప్రమత్తాః.
237. నిన్దా మ్యహ ఙ్కర్మ పితుః కృతం తద్యస్త్వామగృహ్ణాద్విషమస్థబుద్ధిం,
బుద్ధ్యానయైవం విధయా చర న్తం సునాస్తికం ధర్మపథా దపేతం.

---

232. పరద్రవ్యముల హరింప నేర్పరులగువారు పరుల వశులఁ జేసికొని వారిచే దానముల నొందుటకై "దేవతలఁ బూజింపుము దానమొసఁగుము యజ్ఞదీక్షలు గైకొనుము ధనీషణాదుల విడువుము" అని బోధించుచు గ్రంథముల రచించిరి కాని మఱేమియుఁ గాదు. అవి యన్నియు నప్రమాణములే.

233. కావున నోరామా! నీవు పరలోకమనునదియే లేదని నిశ్చయించుకొనుము. తండ్రియాజ్ఞను పరిపాలింపక పోవుటవలనఁ బరలోకమునఁ గలుగునన్థ మేదియు లేదు. కావునఁ బ్రత్యక్షమగురాజ్యభోగము నంగీకరింపుము; పరోక్షమగుస్వర్గభోగము నావల నుంపుము.

234. కావున నోరామా ! సర్వలోకసమ్మత మగుపరలోకాభావబుద్ధిని స్థిరముఁ జేసికొని స్వర్గభోగములను విశ్వసింపక పిత్రాజ్ఞాపరిపాలనమును గమనింపక రాజ్యము నంగీకరింపుము. భరతుఁడు బహువిధముల వేఁడుకొనుచున్నాఁడు.

235. రామునివాక్యము :—సత్యము ధర్మము పరాక్రమము భూతదయా ప్రియవాక్యము బ్రాహ్మణదేవాతిథిపూజనము అనువానిని స్వర్గమార్గముగ పెద్దలు చెప్పుదురు.

236. ఇట్లగుటచే బ్రాహ్మణులందఱు నేకవాక్యముగ నీపక్షము నంగీకరించి స్వకులాచారధర్మముల విధ్యుక్తమార్గములో నాచరింపుచు పరులచే నాచరింపఁజేయుచు స్వర్గలోకప్రాప్తినిఁ గోరుచున్నారు.

237. నాస్తికుఁడవును ధర్మమార్గ విరహితుఁడవును పరులకుఁగూడ నాస్తిక మతము నుపదేశించుచు విషమచిత్తుఁడవై యుండువాఁడవు నగునిన్ను పరిగ్రహించినందులకు మాతండ్రినిగూడ నిందింపవలసివచ్చుచున్నది.

238. యథాహి చోర స్స తథా హిబుద్ధ స్తథాగతం నాస్తిక మత్ర విద్ధి,
తస్మాద్ధి యశ్శక్యతమః ప్రజానాం స నాస్తికేనాభిముఖోబుధస్స్యాత్.

239. త్వత్తో జనాః పూర్వతరే వరాశ్చ శుభానికర్మాణి బహూనిచక్రుః,
జిత్వాసదేమంచ పరంచ లోకం తస్మాద్ద్విజాస్స్వస్తిహుతం కృతంచ.

240. ధర్మే రతా స్సత్పురుషై స్సమేతా, స్తేజస్వినో దానగుణప్రధానాః,
అహింసకావీతమలాశ్చలోకేభవన్తి పూజ్యా మునయః ప్రధానాః.

241. ఇతి బ్రువన్తం వచనం సరోషం రామం మహాత్మాన మదీనసత్వం,
ఉవాచ తథ్య మ్పునరాస్తిక ఞ్చ సత్యం వచ స్సానుశయఞ్చ విప్రః.

జాబాలిః—

242. న నాస్తికానాం వచనమ్బ్రవీమ్యహం న నాస్తికోహం నచ నాస్తికిఞ్చన,
సమీక్ష్యకాల మ్పున రాస్తికోభనం భవేయకాలేపునరేవ నాస్తికః.

---

238. దొంగనువలెనే నాస్తికునిఁగూడ రాజు బహిష్కరింపవలయును వీఁడును బౌద్ధునివంటివాఁడే. ఇంతయేల వేదనిష్ఠ లేనివాఁ డని ప్రజలకు నెవ్వనియందు సంశయము కలుగునో వానితో విద్వాంసుఁడు సంబంధపడకూడదు.

239. నీకంటె యొరులును జ్ఞానవంతులు నగువా రనేకులు వివిధకర్మల నాచరించి యిహపరలోకములయందు సిద్ధినొంది యిప్పటికిని నక్షత్రాదిరూపములతోఁ గానవచ్చుచునే యున్నారు. ఈకారణమువలననే విప్రులు యాగాదుల నాచరింతురు.

240. ధర్మాసక్తులును సత్పురుషులతోఁ గూడినవారును తేజోవంతులును దానశీలురును అహింసాపరులును నిర్మలులును అగుమునులే పూజ్యులగుదురుకాని యితరులు కారు.

241. అని యీవిధముగ రోషముతో చెప్పుచున్న రామునిఁజూచి జాబాలి ఆస్తికమతయుక్తముగాను పశ్చాత్తాపసహితముగాను వినయసమన్వితముగాను యథార్థముగాను యిట్లనియె.

242. జాబాలివాక్యము:—ఓరామచంద్రా! నేను నాస్తికుఁడనుగాను. పరలోకాదులు లేక పోలేదు. యిదివఱకు అనేకులు నాస్తికవాదము నవలంబించినప్పుడు వారిని నీవలెనే ఖండించియుంటిని. ఇప్పుడు ధర్మసంకటము కలిగెను కావున మహారాజ్యము అరాజకదశ నొందుచున్నది కావున దానిని నివారించుటకై యిట్లు చెప్పితిని. ధర్మసంకటసమయములందు జనులకు మేలు జేయుటకై సర్వజ్ఞుఁ డగువాఁడు యేమతమునైన నవలంబించి యీ సందర్భమును సరిచేయవలయును కదా!

243. సచాపి కాలోయముపాగతశ్శనైః యథామయా నాస్తికవాగుదీరితా,
నివర్తనార్థం తవ రామ కారణాత్ ప్రసాదనార్థఞ్చమయైతదీరితమ్.

244. క్రుద్ధ మాజ్ఞాయ రామం తు వసిష్ఠః ప్రత్యువాచ హ,
జాబాలిరపి జానీతే లోకస్యాస్య గతాగతిం,
నివర్తయితుకామ స్తు త్వామేతద్వాక్య ముక్తవాన్"

అనియున్నది. వీనిని విమర్శించిన ధర్మమార్గప్రవర్తకుఁడైనను జాబాలి నాస్తికపక్షము నవలంబించి యాధర్మము ననువాదపూర్వకముగ నిరాకరించెననియు దానిపై రామచంద్రునకుఁ గ్రోధము జనింపఁగా నాయన తన యాస్తికత్వమును ప్రకటించుచు "ఓ రామా! నిన్నరణ్యమునుండి మఱలించుటకై యిట్లు చెప్పితినికాని నేను నాస్తికుఁడను కాను" అని యథార్థస్థితిని దెల్పె ననియు వసిష్ఠుఁడును యీవిషయమునె ప్రతిపాదించి క్రోధమును నివారించె ననియుఁ దెలియవచ్చునున్నది కదా! ఇప్పుడు చూడుఁడు. జాబాలి నాస్తికమతస్థాపనమునందును ధర్మమార్గఖండనమునందు నభిప్రాయము లేకున్నను కార్యవశమున నట్లు చేసెను కదా! ఇట్లే కపిలాదులకును భేదస్థాపనమునందుగాని అద్వైతనిరాకరణమునందుకాని తాత్పర్యము లేకపోయినను తత్తదుచితాధికారుల నుద్ధరించుటకై యిట్లు చేసియుండవచ్చును. ఇంతమాత్రమువలన వారియనువాదము మనకేల ప్రమాణము కాదు. అద్వైతము వారి కవశ్యము తెలిసియే యుండవలయును కదా! కావున మాసిద్ధాంతము నిర్మూలము కానేరదు; తత్తదుచితాధికారుల నుద్ధరించుటకై స్వాతంత్రతంత్రముల ప్రవర్తింపఁజేయుటయుఁ గూడ విరుద్ధము కానేరదు.

మఱియు వారిశాస్త్రములు వేదాంతమతావలంబులకుఁ గూడ నవశ్యపఠనీయములు. కేవలాద్వైతజ్ఞానమునకు ననుకూలముగ "పురుషుఁడు అసంగుఁడు నిర్గుణుఁడు" అను మొదలగువిషయములు సాంఖ్యశాస్త్రమున నిరూపింపఁబడియున్నవి. నిదిధ్యాసనసాధనము లగుయమనియమాదులు

---

243. ఇప్పు డట్టిధర్మసంకటకాలము తటస్థించెను. కావున నో రామభద్రా! నిన్ను మఱలించుటకై యట్లుచెప్పితిని.

244. పిదప రామునకు క్రోధము కలుగుట నెఱింగియె వసిష్ఠమహర్షి యిట్లనియె. జాబాలియు లోకగతుల నెఱింగినవాఁడే నిన్ను మఱలించుటకై మాత్రమే ఇట్లు చెప్పెను.

యోగశాస్త్రమున నిరూపింపఁబడి యున్నవి. చిత్తశుద్ధిసాధనము లగు కర్మలు జైమినిశాస్త్రమున విమర్శింపఁబడి యున్నవి. ప్రపంచమునుండి యాత్మను విభాగించుటకు వీలగునట్లు గౌతమకణాదతంత్రములయందు పదార్థవివేచన మాచరింపఁబడి యున్నది. కావున వీనితో జనులకు నుపయోగము కలదు. ఇవియు పరంపరగాఁ బురుషార్థసాధనము లగును. ఈశాస్త్రములను విమర్శించుటచే నాత్మస్వరూపస్వభావముల నెఱింగి యద్వైతజ్ఞాననిష్ఠుఁడై పురుషుఁడు కడతేరును. "ఇట్లైన నీశాస్త్రముల యందు పురుషస్వరూపవివేచనాదులు మాత్రమే చేయఁబడవలసి యుండ జగత్సత్యత్వము మొదలగు నద్వైతవిరుద్ధాంశము లేల నిరూపింపఁబడవలయును?" అనిమొదవేమొ. మొట్టమొదటనే యతిసూక్ష్మమగుపరబ్రహ్మరూపము నెఱుంగలేనివారికొఱకై యట్లు చేయఁబడెను. పరమార్థస్థితిలో ప్రపంచము సత్యము కాకపోయినను అనాద్యవిద్యవలన జీవులకు సత్యముగఁ దోఁచుచుండుటచే మందాధికారులకు దానినే యవలంబించి యుపదేశ మొనర్పఁబడెను. ఇది యావశ్యకకృత్యమే కదా! వేదాంతమతము గ్రహించుసామర్థ్యము కలయధికారులు నిర్వివాదముగ నాభాగములఁ బరిత్యజించి తక్కినభాగమును గ్రహింపవచ్చును. కావున నీసిద్ధాంతము వలన సాంఖ్యాదిశాస్త్రములకు వ్యర్థత్వము రానక్కఱలేదు.

ఇఁక పాంచరాత్రపాశుపతాదుల యభిప్రాయముకూడ నద్వైతమే యని నిర్ణయింపవలయును. వాని నొనర్చినశివవిష్ణ్వాదులకు నద్వైతమే తాత్పర్య మనుట పురాణేతిహాసాదులయందు ప్రసిద్ధ మయ్యే యున్నది. కావున వారితంత్రములు కూడ నట్టివే యైయుండవలయును కదా! ప్రత్యక్షముగఁ గూడ నం దద్వైతము ప్రతిపాదింపఁబడియే యున్నది.

245. "పరక్షేత్రజ్ఞయో రైక్య మాత్మనోః శ్రుతిచోదితమ్" అను పాంచరాత్రాగమవాక్య మీవిషయమున నుదాహరణముగ మున్నే వివరింపఁబడియున్నది. పాశుపతాగమమునఁగూడ నిట్టివాక్యము లనేకములు కలవు. ఆతంత్రములయం దచ్చటచ్చట భేదప్రతిపాదన మున్నను తన్నిర్ధారణమునకై యద్వైతము నిందింపఁబడి కూడా నున్నను యాశాస్త్రమునకు నందుఁ దాత్పర్యము లేదు. అద్వైతజ్ఞానమున

**245. (727-పేజీ 162-పేరా చూ.)**

కుపయుక్తము లగుచు చిత్తశుద్ధికారకము లగుశివవిష్ణ్వాద్యుపాసనల నిరూపించుటకై మాత్రమే యట్లు చెప్పఁబడెను. మందాధికారులు పరమార్థమును గ్రహింపలేక పూర్వస్థితిని విడువలేక నుభయభ్రష్టు లగుదురేమొ యని యాభేదమె పురుషార్థసాధకముగ నుపదేశింపఁబడెను; దానిని నిర్ణయించుటకై యద్వైతవాదము ఖండింపఁబడెను. కావున మాసిద్ధాంతమువలన వీనికిఁ గూడ వ్యర్థత్వము కలుగ నక్కఱలేదు.

ఇంతయేల బౌద్ధార్హత చార్వాకాదివేదబాహ్యతంత్రములకుఁ గూడ నద్వైతమే పరమతాత్పర్యము. ఆతంత్రముల నొనర్చిన బుద్ధ బృహస్పత్యాదులకుఁ గేవలాద్వైతమె సమ్మత మని సూతసంహితాదుల యందు జెప్పఁబడి యుండుటచే వారితంత్రములకుఁ గూడ నదియె పరమ తాత్పర్యమనియె చెప్పవలయునుకదా ! "ప్రపంచము శూన్యము" అను మొదలగు నిరూపణలు "ప్రపంచాభిమానమును విడువవలయును" అని సూచించునవియగుటచే వైరాగ్యమును కలిగింపుచు బ్రహ్మజ్ఞానమునం దుపయోగపడును. "దేహమే యాత్మ" యను మొదలగు విరుద్ధాంశములు గూడ దేహవ్యతిరిక్తాత్మను గ్రహింపలేనివారికి, 246. స్థూలారుంధతీన్యాయమున నాతని క్రమక్రమముగ నుపదేశించుటకు నుపయోగపడును.

"ఈబాహ్యతంత్రములు వైదికగ్రంథములయం దన్నియెడల దూషింపఁబడి యున్నవి కదా !" అనియెదవేమొ సత్యమే. వానియందు సామాన్యముగ దోఁచునభిప్రాయమె సామాన్యముగ వానిపరమాభిప్రాయముగ జనులచేఁ బరిగ్రహింపఁబడును కావున నాయభిప్రాయము ననుసరించి వైదికగ్రంథము లట్లు చెప్పినవి. పైనవివరించినవిధముగ విమర్శించి యోజించినవానికి నవియు నుపాదేయములే. వాఁడు మందాధికారికొఱకై నిరూపింపఁబడినయద్వైతవిరుద్ధాంశములఁ బరిత్యజించి తక్కినభాగము నంగీకరించును కదా! కావున కేవల వ్యాసతంత్రములకే కాక తక్కినవాని కన్నిటికిఁ గూడఁ గేవలాద్వైతమె తాత్పర్య మనుటలో వివాదము లేదు.

ఈవిషయమునుగూర్చి సూతసంహితయందు యజ్ఞవైభవఖండమున నిరువదిరెండవయధ్యాయమున

---

246. (బ్రహ్మసూత్రము ౧-౧-౭-అవతారిక భా.)

247. "అథాత స్సమ్ప్రవక్ష్యామి మార్గప్రామాణ్యనిర్ణయం,
శ్రద్ధయా సహితా యూయం శృణుధ్వం మునిపుఙ్గవాః.

248. వేదాంశ్చ ధర్మశాస్త్రాణి పురాణం భారతం తథా,
వేదాఙ్గాన్యుపవేదాంశ్చ కామికాద్యాగమా నపి.

249. కాపాలం లాకుళం శ్చైవ తయోర్భేదా న్ద్విజర్షభాః,
తథా పాశుపతం సోమం భైరవప్రముఖాగమాన్.

250. తేషామేవోపవేదాంశ్చ శతశోఽథ సహస్రశః,
విష్ణ్వాగమాం స్తథా బ్రాహ్మా న్బుద్ధా నార్హాగమానపి.

251. లోకాయతం తర్కశాస్త్రం బహువిస్తరసంయుతం,
మీమాంసా మతిగమ్భీరాం సాఙ్ఖ్యయోగం తథైవచ.

252. అనేకభేదాన్యన్యాని తథా శాస్త్రాన్తరాణ్యపి,
నిర్మమే శఙ్కర స్సాక్షా త్సర్వజ్ఞ స్సఙ్గ్రహేణ తు.

253. ప్రసాదాదేవ రుద్రస్య బ్రహ్మవిష్ణ్వాదయ స్సురాః,
సిద్ధ విద్యాధరా యక్ష రాక్షసాద్యా స్తథైవ చ.

254. మునయ శ్చ మనుష్యా శ్చ యథాభాగం ద్విజోత్తమాః,
తాన్యేవ విస్తరే ణైవ సఙ్గ్రహేణైవ వా పునః.

---

247. ఇఁకమీఁద నాగమాదిమార్గముల యొక్క ప్రామాణ్యమును నిర్ణయించెదను. మునులారా శ్రద్ధతో వినుఁడు.

248. వేదములు ధర్మశాస్త్రములు పురాణములు భారతము శిక్షాదివేదాంగములు ఆయుర్వేదాద్యుపవేదములు కామికాద్యాగమములు.

249. కాపాలాగమము లాకుళము బహువిధము లగువానిభేదములు అట్లె పాశుపతము సోమము భైరవాద్యాగమములు.

250. వానిలోనిభేదములు విష్ణ్వాగమములు బ్రహ్మాగమములు బుద్ధార్హతాద్యాగమములు.

251. నాస్తికాగమము అతివిస్తృతమగు తర్కశాస్త్రము (వైశేషికనైయ్యాయికశాస్త్రములు) మిగుల గంభీరమగుమీమాంస సాంఖ్యయోగములు.

252. మఱియు ననేకభేదములతోఁ గూడినయన్యశాస్త్రములు వీనినన్నిటిని సర్వజ్ఞుఁడగుశంకరుఁడు సంక్షేపముగ నిర్మించెను.

253-254-255. ఇట్లు మొట్టమొదట పరమేశ్వరుఁడే సర్వము నాచరించినను ఆయన యనుగ్రహమువలన లోకవ్యవహారార్థమై బ్రహ్మవిష్ణ్వాదులును మునులును

255. కుర్వన్తి తాని మానాని కథితాని మనీషిభిః,
అధికారివిభేదేన నైకస్యైవ సదా ద్విజాః.

256. తర్కైరేతేపి మార్గా స్తు న హన్తవ్యా మనీషిభిః,
యథా తోయప్రవాహాణాం సముద్రః పరమావధిః.

257 తథైవ సర్వమార్గాణాం సాక్షా న్నిష్ఠా మహేశ్వరః,
యేన యేన ప్రకారేణ జనై రేభిరుపాసితః.

258. తత్తన్మార్గానుగుణ్యేన సాధకత్వ ముపైతి సః,
తత్ప్రసాదా త్క్రమా న్మార్గా న్విశిష్టా న్నేతి మానవః.

259. తత్ర తత్ర స్థితో దేవః ప్రసాదం కురుతేఽన్య తు,
సోపానక్రమతో దేవో వేదమార్గస్య కారణం.

260. వేదమార్గస్థితో దేవ స్సాక్షా న్ముక్తే స్తు కారణం,
తత్రాపి కర్మభాగస్థో జ్ఞానశ్రద్ధాప్రదో హరః.

---

యక్షరాక్షసమనుష్యాదులును వానిని సంక్షేపముగానైనను విస్తారముగానైన నాచరింతురు. కావున నవియన్నియుఁ బ్రమాణములే. అయినను అధికారిభేదము ననుసరించి మాత్రమె ప్రమాణము లగును కాని పరస్పరవిరుద్ధము లగుటచే నన్నియు నొక్కనికే ప్రమాణములు కానేరవు.

256-257-258. ఈకారణమువలన బుద్ధిమంతుఁడగువాఁడు దేనినికూడ తర్కయుక్తులతో ఖండింపఁ బ్రయత్నింపరాదు. నదీప్రవాహములకు సముద్రమువలె సర్వాగమములకు నాపరమేశ్వరుఁడే యంతము. ఏయేమార్గముచే నాయన యుపాసింపఁబడునో ఆయావిధముగనే ఫలము నొసంగును. ఆయన యనుగ్రహమువలన నుపాసకులు క్రమక్రమముగ తామున్నమార్గమునుండి యంతకంటె శ్రేష్ఠ మగుమార్గము నాశ్రయించుచుందురు.

259. ఏయేమార్గముతో నుపాసకుఁ డుపాసనను గావించునో ఆయామార్గమున నున్నపరమేశ్వరుఁడు వానికి దయఁ జూపును. మార్గములు భిన్నములేకాని యుపాస్యుఁ డగునీశ్వరుఁడు మాత్ర మొక్కఁడేకదా! కావున నీమార్గములు వేదమార్గమునకు సోపానమువంటివి యగును.

260. వేదమార్గభిన్నము లగుమార్గములయందున్న పరమేశ్వరుఁడు వేదమార్గప్రాపకుఁ డగును. వేదమార్గమున నున్నవాఁడు ముక్తిప్రాపకుఁ డగును. అందును కర్మకాండభాగమున నున్నవాఁడు జ్ఞానశ్రద్ధను కలిగించువాఁడుమాత్రమే యగును గాని ప్రత్యక్షముక్తిదాయకుఁడు కానేరఁడు.

261. జ్ఞానభాగస్థిత శ్శమ్భు ర్జ్ఞానద్వారేణ మోక్షదః,
ఏకరూపా పరా ముక్తి స్తత స్తద్విషయా మతిః.

262. ఏకరూపా భవే న్నైవ నానారూపా భవిష్యతి,
వేదాన్త శ్శఙ్కరం సాక్షా న్నిర్విశేషాద్వయాత్మనా.

263. వక్తి మార్గాన్తరా న్నైవ తతో విద్యా తు వేదజా,
అతో మార్గాన్తరా జ్జాతా మతయో మతిమత్తరాః.

264. అవిద్యా నైవ విద్యా స్స్యు రితి సమ్య ఙ్నిరూపణం,
తస్మా న్మార్గాన్తరాణా న్తు ప్రామాణ్యం వేదవిత్తమాః.

265. ముక్తే రన్యత్ర నాత్రైవ క్రమే ణై వాత్మమానతా,
అతో వేదాన్తమార్గస్థో మహాదే వోఽచిరేణ తు.

266. ముక్తిం దదాతి నాన్యత్ర స్థిత స్సోఽపి క్రమేణ తు,
దదాతి పరమాం ముక్తి మి త్యేషా శాశ్వతీ శ్రుతిః.

267. అతో వేదాశ్రయో మర్త్యో నాన్యమార్గం సమాశ్రయేత్,
వేదమార్గైకనిష్ఠానాం న కించి దపి దుర్లభం.

---

261-262-263-264-265-266. జ్ఞానభాగమున నున్నవాఁడు మాత్రము ముక్తిని జ్ఞానమూలమున కలిగించును. ముక్తి యేకవిధ మైనదియే కావున దానినిగూర్చిన బుద్ధియు నేకరూపమైనదిగానే యుండవలయునుగాని బహురూపములతో నుండదు. వేదాంతములు పరమేశ్వరుని నిర్విశేషాదులయరూపముతో నొక్కవిధముగానే చెప్పుచున్నవి. తక్కినమార్గము లట్లుగాక పరస్పరవిరుద్ధముగఁ జెప్పుచున్నవి. కావున నుప నిషత్తులన్నియు నేకవాక్యముగ నుండుటచే వేదాంతార్థమె ముఖ్యమైనది. వేదాంతములవలన కలిగినజ్ఞానమే జ్ఞానము. కావున మునులారా! వేదభిన్నము లగుమార్గముల వలన కలిగినజ్ఞానము లజ్ఞానములే యనుటయె చక్కనినిరూపణము కావున వేదవేత్త లారా వేదభిన్నము లగుమార్గములన్నియుం ముక్తివిషయమునఁ బ్రత్యక్షముగఁ బ్రమాణములు కానేరవు. పరంపరగా మాత్రమే యగును. తక్కినవిషయములయం దన్నను ప్రమాణములె కావున వేదమార్గమున నున్నపరమేశ్వరుఁడు మాత్రమే ప్రత్యక్షముగ మోక్షము నొసంగును. తక్కినమార్గములయం దున్నవాఁ డట్లొసంగలేడు. క్రమంబుగ మాత్ర మొసంగగలడు. ఇదియే శ్రుతి.

267. కావున వేదమార్గమున నున్నవాఁడు మఱియొకమార్గము నాశ్రయింప రాదు. వేదమార్గమున నున్న దుర్లభ మెద్దియు లేదు.

268. అత్రైవ పరమా ముక్తి ర్న చాన్యత్ర తు పుష్కలా,
అతో౽ధికారిభేదేన మార్గో మానం న సంశయః.

269. ఈశ్వరస్య స్వరూపేచ బన్ధహేతౌ తథైవ చ,
జగతః కారణే ముక్తౌ జ్ఞానాదౌ చ తథైవ చ.

270 మార్గాణాం యే విరుద్ధాంశా వేదాన్తేన విచక్షణాః,
తేపి మందమతీనాఞ్చ మహామోహావృతాత్మనామ్.

271. వాఞ్ఛామాత్రానుగత్యేన ప్రవృత్తా న యథార్థతః,
దర్శయిత్వా తృణం మర్త్యో ధావ న్తీం గాం య థాగ్రహేత్.

272. దర్శయిత్వా తథా తేషా మిదం పూర్వం మహేశ్వరః,
పశ్చా త్పాకానుగుణ్యే న దదాతి జ్ఞాన ముత్తమం.

273. తస్మా దుక్తేన మార్గేణ శివేన కథితా అమీ,
మార్గా మానం న చామానం మృషావాదీ కథం శివః.

274 మహాకారుణికో దేవ స్సర్వజ్ఞో నిర్మలః ఖలు,
తథాపి వేదో మార్గాణా ముత్తమ స్సర్వసాధకః.

---

268. పరమానందకర మగుముక్తి యిచ్చుటనే కలదు కాని మఱియొకస్థలమున లేదు. కావున నధికారిభేదము నాశ్రయించియే తక్కినమార్గములు ప్రమాణము లగును కాని మఱియొకవిధముగ గావు.

69-270-271-272. ఈశ్వరస్వరూపమునందును బంధకారణమునందును జగత్కారణమునందును ముక్తియందును జ్ఞానాదులయందును యితరమార్గములలో వేదాంతమునకు విరుద్ధముగ నేయేయంశములు చెప్పఁబడియున్నవో యోజ్ఞానవంతులారా! అవియన్నియు నజ్ఞానవంతు లగుమందబుద్ధులయొక్క యిచ్ఛను మాత్రమె యనుసరించి చెప్పఁబడినవే కాని యథార్థస్థితిని తెల్పుటకై చెప్పఁబడినవి కావు. మనుష్యుఁడు గడ్డినిచూపి పరుగెత్తుచున్నయావును పట్టువిధంబున నీపరమేశ్వరుండును మందబుద్ధి యగువానికి వానియభిమతార్థమునే మొట్టమొదట చూపి పిదప చిత్తము పరిపక్వ మగుకొలది దివ్యజ్ఞానమును క్రమక్రమముగ నొసంగును.

273. కావున పయినవర్ణించినవిధముగ సర్వమార్గములఁ గల్పించినవాఁడు పరమేశ్వరుఁడె యగుటచే నన్నియుఁ బ్రమాణములు. అప్రమాణములు కావు. ఈశ్వరుఁ డసత్య మాడె ననుట యెట్లు?

274. ఆదేవుఁడు దయామయుఁడు సర్వజ్ఞుఁడు నిర్మలుఁడుకదా! యిట్లైనను అన్నిమార్గములకంటె వేదమార్గ ముత్తమము.

275. సర్వ ముక్తం సమాసేన మార్గప్రామాణ్యనిర్ణయం,
ఏవం బుధ్వా శ్రుతౌ శ్రద్ధా ఙ్కురుధ్వం యత్నతో ద్విజాః."

అని చెప్పఁబడియున్నది.

కావున శ్రుతులకును సూత్రములకును స్మృతులకును పురాణములకును ఇతిహాసములకును సమస్తాగమములకును వ్యాసతాత్పర్యభూతార్థ మగు కేవలాద్వైతమె తాత్పర్యభూతార్థమని నిర్ణయింపఁబడెను. కావున నద్వైతమే పరమార్థ మనుట నిర్వివాదముగ సిద్ధించినది.

ఆ. ఇట్లు నిర్ణయించి యెసఁగంగ పర మత
వాదపంజరములఁ బడఁగఁబోక
నిర్మలాద్వితీయనిరుపమానందాత్మఁ
గనుఁడు ముక్తిసుఖము గనుఁడు మనుఁడు.

ఇట్లు వెన్నెలకంటి సుందరరామాభిధానాంధ్రీకృతం బగు వ్యాస తాత్పర్య నిర్ణయోపన్యాసము సమాప్తము.

బ్రహ్మసూత్రార్థచంద్రికయందలి వ్యాసతాత్పర్యనిర్ణయము
సర్వము సమాప్తము.

ఓమ్ తత్సత్.

---

275. ఓమునులారా! ఇప్పుడు మార్గప్రామాణ్యమునుగూర్చి సర్వమును చెప్పితిరి. ఈవిషయము నెఱింగి వేదమునందు శ్రద్ధ నుంపుఁడు.

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1956.